

# అంకితము

నీ వాక పెద్దవెల్లు వయి నీ వెలుఁగారిన నాదు జీవిత
వ్యావృతి యీ కవిత్వ మనునట్టి విచిత్రపుఁనీడ పాఱె నో
దేవి! యరుంధతీప్రముఖ దివ్యమహాఃపరిశీలమూర్తి ఆ
నీ వెలుఁగుల్ పరోక్ష మయి నేఁటికి నీడలు పాఱఁజొచ్చెడుఁ

కృష్ణాజిల్లా పెనమలూరు గ్రామస్థులు
చిగురుపాటి బు[illegible]రామయ్య గారు
[illegible] చంద్రశే[illegible] గారు
[illegible]ంచిన ష[illegible]

# మొదటి అధ్యాయము

"వేయిపడగల పాము విప్పారుకొని వచ్చి
కాటందుకొన్నది కలలోన రాజును"

సుబ్బన్నపేఁట వీథులలో నొక యువతి యిల్లు పాడుచు గంతులు వేయుచు, మొగమున నున్న పెద్దకుంకుమబొట్టు చెమటకు జాఱిపోవుచుండఁగాఁ జేతనున్న వేఁపమండ మాటిమాటికి నూఁగులాడించుచు, జుట్టు విరియఁబోసికొని, పయ్యెద తొలఁగుటకూడ నెఱుఁగని తన్మయత్వముతోఁ గొంతసేపు పరువెత్తుచుఁ, గొంతసేపు తొందరగాఁ దిరుగుచు నుండెను. పది పదునాఱేండ్లు లోఁబడిన బాలురందఱాయమ పోయినంతమేఱ నామెవెంటఁ బరువెత్తుచుండిరి. ఆ వీథిచివర రావిచెట్టుక్రింద సభతీర్చిన కొందఱు పెద్దలు తమలోఁదాము రాచకార్యము లాలోచించుకొనుచు మధ్య నీయమ సంగతియుఁ బ్రస్తావించుచుండిరి.

ఒకరు—మఱల గణాచారి బయలుదేరినదే!

మఱొకరు—గణాచారి లేదు, గిణాచారి లేదు. ఇది యొక యాట. వయసులో నున్న యాఁడది సిగ్గులేక యిట్లూరివెంట గంతులు వేయుటకు తలిదండ్రు లొప్పుకొన్నందుకుఁ జెప్పవలయును.

ఇంకొకరు—ముసలి జమీందారుగారు పోదు రని ఆఱునెలల క్రింద గణాచారి చెప్పెగదా! గణాచారి కాకపోయిన నెట్లు చెప్పఁ గలిగెను?

వేఱొకరు—గ్రుడ్డివానిచేతి తాయి! తగిలినఁ దగులును; తగులదును.

అప్పటికిఁ బదిగడియలు ప్రొద్దెక్కెను. వేసఁగి. ఈదురుగాలి కొట్టుచుండెను. బడి వదలిపెట్టిన పిల్లలు పలకలు, పుస్తకాలు చంకనిడి, నుదురులఁ బోసిన చెమ్మటలు చొక్కాలు పైకిలాగని ముంజేతులతోఁ దుడుచుకొనుచు గుఱ్ఱములు ఖదనుత్రొక్కినట్లు పరువులెత్తుచు గృహాభిముఖులైరి. కడుపునిండ బువ్వతిని పాలేరు

బుడ్డవాండ్రు రావియాకుచుట్టలు కాల్చుచుం బసువులను బొలాలకుం దోలుకొనిపోవుచుండిరి. గొల్లముసలమ్మలు పసువులు పోవుచు వేసిన పేడకళ్ళకై పోరాడుకొనుచుండిరి. బ్రాహ్మణస్త్రీలప్పుడే యిండ్ల లోని పనులు ముగించుకొని, మడిబట్టలుతుకుటకు బుజాలమీఁద వేసికొని చెఱువునకుఁ బోవుచుండిరి. మాలెతలు పొలములమీఁదఁ పని సేయుచున్న భర్తలకుఁ దట్టలలో బువ్వయు నీరును దీసికొనిపోవు చుండిరి. ప్రాతఃకాలము తెలియకుండ మధ్యాహ్న మగుచుండెను. ఆ జాము ప్రొద్దెక్కిన యెండలలోఁ గ్రమక్రమముగా వెచ్చదనములు ముదురుచున్నను, గాలిపొగలింకను గోరువెచ్చనగా నేయుండెను. ఆ గోరువెచ్చదనములకే గణాచారి తాళలేకపోయినది. ఆమె కొంతసేపటికిఁ బోయి రావిచెట్టుక్రింద నున్న పెద్దమనుష్యులవద్దఁ గూర్చుండెను. ఆమె రాకతో వారి ప్రస్తావనయు నాఁగిపోయెను.

* * * *

ఇప్పుడు సుబ్బన్నపేటయున్న ప్రదేశమంతయు మూఁడు వందలయేండ్ల క్రిందట మహారణ్యము. ఆ యరణ్యములో నొక చిన్నపల్లె యుండెడిది. ఆ పల్లెలో నొక పేదకాఁపు కాఁపురముండెడి వాఁడు. అతఁడు అడవిలోని పుల్లల నేఱితెచ్చి, కట్టెలు కొట్టితెచ్చి, యవి దూరపుఁ బట్టణములకుఁ బోయి యమ్ముకొనుచు జీవించును. అతని కొక యావుండెడిది. అది కపిల. ఆ యావుసొగసే సొగసు. అది కుండంత పొదుగుతో, నిగనిగలాడు మేనితో, గుజ్జురూపుతో, విదియనాఁటి చందురుని శృంగములవంటి శృంగములతో, మెడలోని దృష్టిత్రాడుతో నడవులకు మేతకై పోవునప్పుడు గాని, వచ్చునప్పుడు గాని జనములకు దానిమీఁద జూపేజూపు. ఆ కాఁపున కా కపిల వాఁకిటనొదిగియున్న నందినీధేనువు. అతనియిల్లాలు ముద్దుబిడ్డలపాలిఁటి కాణాచి. దాని నతఁడు వేయికన్నులతోఁ గాపాడుకొనును. ప్రొద్దున నా తల్లి కుండెఁడుపాలిచ్చి యడవులకుఁబోవును. రాతిరికి వచ్చి మఱలఁ గుండెఁడు పాలిచ్చును. ఈ పాలతో నతని కాఁపురమునకు వేతేపంటలే అక్కఱలేకపోయినవి. శ్రీ మహాలక్ష్మివలె నావు వచ్చినను, పోయినను గన్న మా కాఁపుకన్నులు చల్లని వెన్నెలలు కాయుచుండెను.

ఇట్లుండ నా యావు ప్రొద్దుగ్రుంకగనే యడవులనుండి మఱలి యింటికివచ్చెను. కాఁపు పెండ్లము వచ్చినయావును కట్టివేసి, దూడను గుంజకు లాగికట్టి తోడుమాలు తెత్తమని యావుపొదుగువంకఁ జూచెను. పదియెకరములు కోసి కుప్పవేసినట్లుండు నావెుపొదుగు నాఁడు చిక్కి పలుచఁబడియుండెను. 'ఏమా యిట్లున్న' దని యను కొనుచు లోనికిఁబోయి తోడుమాలు తెచ్చి దూడను విడిచెను. తల్లి దూడను దగ్గరకు రానీయలేదు. కాఁపుభార్య బంధము వేయఁ బోయెను. వేయనీయ లేదు.

ఆమె బలవంతముగఁ బాలు తీయఁబోయెను. గోవు ఎగచి తన్నెను. "సాధువులలో సాధువు. నన్నుఁ గన్నతల్లి, నా యావు ఈ నాఁడేల తన్నెనా?" యని యామె లోలోన గుమ్మటిల్లిపోయెను. కాఁపు వచ్చెను. ఈ సంగతి కాఁపుతో నామె వెంటనే చెప్పెను. ఆవునకు దృష్టితీసిరి. పులివిస్తరాకులు దిగఁదుడిచి తగులఁబెట్టిరి. ఎట్టనీళ్లు తీసిపోసిరి. ఆవు చేరకట్టనీయలేదు. "ఎవరో గిట్టనివారు అడవిలో పాలు పిండుకొనిపోయి"రని యూహించిరి. గిట్టనివారు లేరు కనుకనా? వారికిని వీరికిని పోరాటము జరిగినది. కాని లాభ మేమి? మఱునాఁడు సాయంతనముకూడ మఱల నిట్లే. ఆవు వచ్చినది. కాఁపు పాలుతీయఁబోయెను. ఆవు తన్నెను. కాఁపునకు బట్టరానంత యాగహము వచ్చెను. ఆవును మళ్ళవేయువానిఁ బిలచి వానిని జావమోఁదెను. వాఁడు "బాబూ! నేను వేయికళ్లతో గాఁచుచునే యుంటిని. కన్ను మొఱఁగించి యావు ఒక అరగంటసే పెచట నున్నదో, అంతేను. ఇంక నే నేపాప మెఱుఁగ"నని వాఁడు మొఱ్ఱపెట్టెను. కాఁపున కేమియుఁ దోఁచినది కాదు; ఆ రోజునను, ఆ మఱునాఁడును పిల్లలు పెరుఁగు లేదని యల్లరిచేసిరి.

ఆవు నాలుఁగురోజులు, అయిదురోజులు పాలీయలేదు. కాఁపు ఆవు నడవికిఁ బోనీయకుండ నింటివద్దనే కట్టివేయుద మనుకొన్నాఁడు. ఒకనాఁడు అడవికి వదలలేదు. ఆవు 'అంబా' యని అడలిపోయెను. దాని యాక్రందనము విని కాఁపు దానిని వదలిపెట్టెను. సాయం వేళకు నా వింటికి వచ్చెను. మఱలఁ దన్నెను. అన్నిప్రాణములు దానిమీఁదనే పెట్టుకొన్న యా కాఁపుసంసారమున కీ సంఘటనము

లతో మతిపోయినది. చివర కొక్కటే యుపాయము మిగిలినది. కాఁపు తన పని మానుకొని యావును తానే పోయి రెండుమూన్నాళ్లు కాచి సంగతియేమో తెలిసికొనవలయును. సరేనని యొకనాఁ డావువెంటఁ బోయెను. ఆవుమీఁదనే కన్నులుపెట్టుకొని యట్లే పగలు పగలెల్ల దానివెంటనేయుండెను. ఇంకఁ బ్రొద్దుగ్రుంకఁబోవు చున్నది. పసువుల నింటికిఁ దోలుకొనిపో వేళయయినది. దూరముగాఁ బోయిన దూడను మళ్ళవేయుటకుఁ గాఁపింత కనుచాటు కావలసి వచ్చెను. ఇంతలో నావు కనుపించలేదు. కాఁపు ఆ చెట్టువెనుకఁ జూచెను; ఈ పొదచాటునఁజూచెను. ఆవు కనిపించలేదు. నిస్పృహుఁ డయిన కాఁపున కొక యరగంట యయినతరువాత దూరమునఁ జెట్లగుంపులోనుండి వచ్చుచున్న యావు కనఁబడెను. అతఁడుపోయి యామెపొదుగు పరీక్షించెను. చీఁకివేసిన మామిడిటెంకవలె నామె పొదుగు చిక్కియుండెను. ఆ చెట్లగుంపులోనికిఁ బోయి యా చుట్టు ప్రక్కల నంతట వెదకెను. కాని యేమియు గోచరించలేదు. ఏమి చేయును? కాళ్ళీడ్చుకొనుచుఁ గాఁపు తిరిగి యావును, దూడను తోలుకొని యింటికి వచ్చెను.

ఆ నాఁడురాత్రి యతనికి నిద్రపట్టినది కాదు. "ఇదియేమో మాయగా నున్నదే! అంతవఱ కట్లేయున్న యా వంతలో నెట్లు తప్పించుకొనిపోయినది! ఎక్కడకు వెళ్ళినది? ఆ చెట్లలోనుండి వచ్చినది. ఆ వెనుక నెవ్వరు లేరే! ఇది యేదో చిత్రముగా నున్నది" అన్నయూహలతోనే యతనికిఁ దెల్లవాఱెను.

మఱునాఁడు మఱల నావువెంటఁ బోయెను. ఆనాఁడు నట్లే యయ్యెను. మూఁడవనాఁడు కాఁపిట్లు కాదనుకొనెను. ప్రమత్తతకుఁ బ్రాణములు వెలకట్టి కనులావుమీఁదనే పెట్టి యట్లే యుండెను. ఏమఱుపాటు లేని కాఁపును తప్పించుకోలేక, కపిల ప్రొద్దు గ్రుంకు వేళ కట్లే బయలుదేఱెను. కాఁపును వెంబడించెను. ఆవు ఆ చెట్ల చాటునకుఁ బోయి యొక పుట్టమీఁద నిలుచుండెను. కాఁపు కొంచెము దగ్గఱలో దానికిఁ గనబడకుండ నొక పొదమాటున నక్కెను. కాని యట జరుగుచున్న సర్వము నతనికిఁ గనుపించుచునే యుండెను.

పుట్టలోనుండి యొక దివ్యసర్పము నెలికి వచ్చి, నోరు తెఱచి, పొదుగువద్ద బడగవిప్పి నిలిచియుండెను. కాఁపునకుఁ గనులు బైరులు క్రమ్మెను. కాఁపు కొంతసేపటికిఁ దమాయించుకొని తలగుడ్డతీసి నేలపైఁబెట్టి మ్రొక్కి యట్లే చూచుచుండెను. ఆవు పొదుగునుండి పాలు ధారగా జాఱుచుండెను. పాము త్రాగుచున్నది కాబోలు! తాను కనులతోఁజూచినది భార్యకుఁ జెప్పవలయునని కాఁపు మనస్సులో ననుకొనెను. కాఁపు మఱలఁ జూచెను. ఒక శిరసుకాదు; ఆ సర్పమునకు రెండు శిరస్సులు. ఈ మహత్తు ఊరందఱికిఁ జెప్పవలయు ననుకొన్నాఁడు కాఁపు. మఱలఁ జూచెనుగదా సర్పమునకు నాలుగుతలలు.

కాఁపునకుఁ దల తిరిగిపోయెను. దిగ్భ్రాంతుఁడై యతఁ డచటనే మూర్ఛఁ బడిపోయెను. కాఁపు కన్ను తెఱచుసరికి యా వతని వద్ద వచ్చి నిలువఁబడెను. ఆతఁడు నెమ్మదిగ లేచి దూడను వెదకుకొని యావువెంట నిఁటికి వచ్చెను. ఆవు నడచినంతసేపు దాని యడుగు లతని ప్రాణములమీఁదఁ బడుచున్నట్లు అతఁ డూహించుచుండెను. ఇంటికిఁ జేరినంతనే యతనిభార్య యేదో విశేషము జరిగినదని యాతని ముఖలక్షణములఁబట్టియే గ్రహించెను. జరిగినదంతయు నతఁడు పూసగ్రుచ్చినట్లు ఆమెకుఁ జెప్పెను. అప్పుడే యీసంగతి నాల్గుమూలలఁ బ్రాకి యానోట నానోట నూర నలుగురికిఁ దెలిసెను. అందఱును వచ్చిరి. ఆవును జూచిరి. ఎవరికి నేమి చేయవలయునో తెలియలేదు.

ఆ రాత్రి యా కాఁపునకుఁ గలలో వేయిశిరసులతో సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కనఁబడి తనకు గుడి కట్టించు మనియుఁ నావు పాలు తాను త్రావిన చోటుననే యది కట్టించవలయు ననియుఁ జెప్పెను. మఱునాఁడు కాఁపు సర్వవృత్తాంతము నూరివారికిఁ జెప్పెను. అందఱును ఆవేశపూరితు లయిరి. కాని యా యూరిలో నున్నవా రందఱును పేదలే. అచ్చట నాలయము కట్టించఁ గల సామర్థ్య మందు నెవ్వరికిని లేదు. ఆకాఁపుమాత్రము తన యాస్తినంతయు నమ్మియైన దేవునకు గుడికట్టింతు ననుకొనెను. కాని యా యాస్తి యెంత? ఒకయావు, ఒక పూరిపాక. ఆవు అదివరకే భగవంతునకుఁ

గ్గా వసమయ్యెను. పూరిపాక కొనువా రెవ్వరు? ఎవరైన గొందురే యనుకొందము. మూఁడు రూకలు వచ్చునేమో! ఈ డబ్బుతో దేవునకు మఱియొక పూరిపాకయయినను రాదు; గతి యేమి?

ఇది యిట్లుండఁగా స్వామిమహత్త్వము కా నాఁటినుండి యూరిలో దాఖలాలు కనఁబడుచుండెను. ఊరి పెద్దకాఁపు కొడుకునకు నొడలంతయుఁ బళ్ళికలు లేచెను. స్వామికి మ్రొక్కుకొనఁగా నవి శాంతించెను. ఒక స్త్రీకి పదియేండ్లనుంచి యున్న చెవిపోటు స్వామికి దీపారాధన చేయించఁగాఁ దగ్గిపోయెను.

ఈ మహత్త్వ నానాఁటఁ జుట్టుపట్ల వ్యాపించి జనము తీర్థప్రజ యయిపోయెను. అచ్చటి కామడదూరమున నున్న యొకపాటిగ్రామమునఁ గొంచె మాస్తిపరుఁడైన యొక బ్రాహ్మణునకు సంతానము లేదు. ఆయన తనకు సంతానము గలిగినచోఁ దాను వచ్చి స్వామి సన్నిధినే యుందుననియు, స్వామి కాలయప్రయత్నములు చేసెదననియు మ్రొక్కుకొనెను. ఆ మఱువత్సరమున నాయనభార్య గర్భవతియై కుమారునిఁ గనెను. అతనికి నాగేశ్వరశాస్త్రియని పేరుపెట్టుకొని యా బ్రాహ్మణుఁడు తన సర్వమైన యాస్తితోఁ దఱలివచ్చి స్వామివద్ద నివాస మేర్పఱచుకొని యప్పటినుండి తదాలయనిర్మాణప్రయత్నముమీఁదనే యుండెను. ఆ బ్రాహ్మణుఁ డధ్యయనము చక్కఁగాఁ జేసినవాఁడు. జ్యోతిషమునందు, వాస్తువునందు నఖండప్రజ్ఞాశాలి. ఈయన యీ ప్రఖ్యాతిని విని యొక నాఁ డీయనను దర్శించుట కొకభాగ్యశాలి వచ్చెను.

ఆభాగ్యశాలికి వయసేఁబదియేండ్లు. పుష్టీలు, మీసములు, వెడల్పయిన దవడయెముకలు, ఎఱ్ఱచారలుగలిగిన విశాలములైన కనులు, ఆజానుబాహువు; దృఢకాయుఁడు, చూచినవారి కతఁడు మహాయోగపురుషునివోలెఁ గన్పించును. ఈ యేఁబదియేఁడులతఁడు సామాన్య సంసారియే కాని యావేళ వచ్చునప్పటికి అతనిజాతకము తిరిగెను. అతఁడు పూర్వ మైదాఱు జతల యెడ్లను బెట్టుకొని కిరాయికిఁ దోలుచు జీవించెడువాఁడు. ఇంగ్లీషువారు టిప్పుసుల్తానుమీఁదికి దండయాత్రకుఁ బోయినప్పుడు వీనియెడ్లనుగూడ బాడుగకుఁ దోలించుకొనిరి. వారు టిప్పును గెలిచి శ్రీరంగపురము దోచుకొ

న్నప్పు డితఁడు తనవంతు దోపిడీకై వారి నడిగె నఁట. వారును కోటలో నొక కొట్టు చూపించి యందులో నేమున్నదో తెలియక యది యితనివంతని చూపించి రఁట. ఆతని యదృష్టము! దానినిండ నవరసు లుండెను. అవి యతఁడు రహస్యముగా నెడ్లమీఁది కెత్తుకొని యింటికిఁ దోలుకొనివచ్చెను. అతని పేరు వీరన్న. ఇప్పు డా ధనముతో నాతఁ డొకకోటకట్టి పెద్ద జమీందారు కావలెననియూ. ఆ కోట యెచ్చటఁ గట్టవలెనో అది యీ బ్రాహ్మణునిఁ గనుఁగొన వలయు నని యీయనవద్దకు వచ్చెను. బ్రాహ్మణునకును వెదకఁ బోయిన తీఁగ కాలికిఁ దగిలిన ట్లయ్యెను. ఆతఁడు లోన సంతోషించెను. పైని దైవమే యతనిని మనవద్దకుఁ దెచ్చెననియు భావించెను.

బ్రాహ్మణుఁడు వీరన్ననాయునితోఁ గోటకట్టుటకు యోగ్యమైన స్థలము తా నున్నదే యనియు, నచ్చటి స్వామి యా స్థలమునకు క్షేత్రపాలకుఁడుగా నది దివ్యస్థలము కాబోవు నన్న దనియు, నట నిర్మించిన పట్టణము సూఁడు నాల్గు వందలయేండ్లవఱకు మహాదశ ననుభవించు ననియుఁ జెప్పి వీరన్న నాయుని దాని కనుమతింపఁజేసెను. నాయుఁడు తనకోటయు, స్వామి యాలయమును నొకే శుభముహూర్తమున నారంభించెను.

ఇంతలో నొక వింత జరిగింది. ఏ యావుపాలు స్వామి త్రావుచుండెనో, యా యావుగల కాఁపున కొక్క-తయేకూఁతురు. ఆమె కప్పటికిఁ బదునాఱు పదునేడేండ్లుండును. వివాహము కాలేదు. అప్పుడప్పుడు స్వామి యామె నావేశించుచుండెను. పిల్ల యదను దప్పుచున్నదని కాఁపు ఆమెకుఁ బెండ్లిప్రయత్నము చేయును. ఆ ప్రస్తావన చేసినపుడెల్ల నామె విఱుచుకొని పడిపోవును. 'తప్పుతప్పు' అని తలిదండ్రులు చెంపలు వేసికొందురు. ఆమె మఱల లేచి కూర్చుండును. అసలు ప్రకృతిలో నున్న సొగసే యిది. ఏదైన నొకవింత జరిగినచో గొంద అవునందురు, కొందఱు కా దందురు. కొందఱునమ్ముదురు, కొందఱు నమ్మరు. అట్లే యీ గణాచారినిగూర్చి కొందఱు పరిహాసము చేయుచు వచ్చిరి. వా రందఱకు నేవో చిన్న చిన్న యాపదలు రా మొదలిడెను. అందుచే విశ్వాసమే ఎక్కు-వగా వ్యాపించెను.

క్రమక్రమముగా నాయూరికి సుబ్బన్నపేఁట యనుపేరు వచ్చెను. అది పెద్దగ్రామమయ్యెను. ఆలయమును, కోటయుఁ బూర్తి యగుటకుఁ బదియేండ్లు పట్టెను. ఆలయముకన్నఁ గోట యందమైనది. కోటకన్న నాలయ మందమైనది. ఎచ్చటెచ్చటివారును వచ్చి దేవుని దర్శించిపోదురు. కోట చూచిపోదురు. కాని జరిగిన దొక్క చిత్రము. జమీందారు కట్టించిన యాలయము సుబ్రహ్మణ్యేశ్వరునిదా, నాగేశ్వరస్వామిదా? బ్రాహ్మణుఁడు సుబ్రహ్మణ్యేశ్వరునకుఁ జిన్న యాలయము గట్టించెను. కాశినుండి గొప్ప మహత్తుకల శివలింగము తెచ్చి నాగేశ్వరస్వామి యన్న పేరుతో దానికిఁ బ్రతిష్ఠ చేసెను. ఈ దేవాలయములో నొకమూల నీ సుబ్రహ్మణ్యస్వామి యాలయ మున్నది.

వీరన్ననాయఁడుగారికిఁ జిన్నప్పటినుండియు విష్ణుభక్తి యెక్కువ. అందుచేత నాయన వేఱే వేణుగోపాలస్వామి యాలయ మొకటి కట్టించెను. రాజు స్వాములకు నిత్య ధూప దీప నైవేద్యములకుఁ, గల్యాణోత్సవములకు, భోగములకుఁ బ్రత్యేకములైన యేర్పాటులు చేసెను. గొప్ప సన్నాయపాటగాండ్రు, మంగలులు వచ్చి మిరాశీలు సంపాదించుకొని యీ గ్రామమున నివసింపఁజొచ్చిరి. దేవదాసీలు వచ్చిరి. వైష్ణవోత్తములు విచ్చేసిరి. శైవు లరుదెంచిరి. అందఱకు రాజు వీళ్ళేర్పఱచెను.

అదివఱకు జిన్నపల్లె యైన యాచోటు నేఁడు దేవతలకు నిలువ నీడ యయ్యెను. భక్తులకుఁ గొంగు బంగార మయ్యెను. ధర్మమునకు నివాసస్థానమయ్యెను. ముక్తికి మార్గమయ్యెను. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి పిలిచినఁబలుకు దైవము. గణాచారి ముఖమున రానున్న యాపదలు చెప్పును. పరిహారము లుపన్యసించును. అవినయములు శిక్షించును. అందుచేత నూరెల్ల స్వామిపేరన్నచో గడగడ. అందుచేత భక్తి ప్రపత్తులును బ్రబలినవి.

వీరన్ననాయనికుమారుఁడు నాగన్ననాయఁడు. తండ్రిచనిపోయి కొడుకు రాజ్యమునకువచ్చెను. ఈదేవాలయాదినిర్మాణహేతువైన యాబ్రాహ్మణుఁడు చనిపోయి, యాయనకుమారుఁడు నాగేశ్వరశాస్త్రి పెత్తనదారయ్యెను. పాఁత గణాచారి గతించి యామె

యన్నకూఁతును మఱల గణాచారియయ్యెను. ఆమెకును మఱల వివాహప్రయత్నములు చేసిరి. చేసినప్పుడెల్ల నామెయు స్మృతితప్పి పడిపోవుచుండెను. అందుచేత నామెయు నవివాహితగా నేయుండెను. ఈ రీతిగా నా కాఁపునింట నొక్కతెయే యాఁడశిసువు కలుగుటయు, నామె సుబ్రహ్మణ్యేశ్వరస్వామి గణాచారియగుటయు నాను నాయిత యయిపోయెను.

వీరన్నాయునివంశమువారు స్వామికిఁబ్రతినిధులు. బ్రాహ్మణ వంశమువారు ప్రచారకులు. కాఁపువంశపు టాఁడుపడుచులు స్వామికి వ్యాఖ్యాతలు. ఈ రీతిగా భూమ్యాకాశములనున్న స్వర్గమర్త్యలోకములమధ్యఁ, బ్రత్యక్షాప్రత్యక్షములమధ్య నొక స్థిరమయిన సంబంధమేర్పడెను.

పైని భగవంతుఁడు, క్రింద రాజును, బ్రాహ్మణుఁడును. ఈ రెండు మహాసంస్థలకు మధ్య గణాచారి త్రెంచరాని లంకె.

ఇది నాల్గు స్తంభములధర్మమంటపము. స్వామి, జమీందారు, బ్రాహ్మణుఁడు, గణాచారి—వీరు నాల్గు స్తంభములు.

ఈ మంటపములో సుబ్బన్నపేట ప్రజలు మహోత్సవములు చేయుచుండిరి. ధర్మార్థకామమోక్షములను నఱఁటిచెట్లుకట్టిన యీ నాల్గు స్తంభములు నిత్యము శుభచిహ్నములై, పచ్చనై, శోభనహేతువులై యుండెను.

ఈ ధర్మమంటపము నిత్యకళ్యాణము, పచ్చతోరణముగా మూఁడువందలయేండ్లు నిరంతరముగా, నవ్యవహితముగా శోభాయమానమై యొప్పెను. ఈ మూఁడువందలయేండ్లలో వేయిపడగలతో భాసించిన నాగేశ్వరస్వామి సుబ్బన్నపేటమీఁద తన సహస్రఫణామండలి ఛత్రముగాఁ జాఁచి యాచల్లని నీడలో నా యూరిప్రజల జోకొట్టెను. వారును ధర్మమోక్షములమధ్య నూఁగుచున్న యర్థకామములను నుయ్యెలలో సుఖనిద్ర గాంచుచుండిరి.

ఇన్నినాళ్ళు స్వామిపడగలు ప్రజలకుఁ జల్లనినీడ నిచ్చుటకు విరిసెను; గాని కాటువేయుటకు విరియలేదు. స్వామి రెండువేల కన్నులు ధర్మముచేత బొండుమల్లెలు విరిసినట్లున్న నాల్గుదిక్కులు

తనివిదీరఁజూచుచుఁ బ్రశాంతజ్యోతిస్సులు విరఁజిమ్మెనుగాని ధర్మ చ్యుతికుపితములై రక్తకాంతులు వెదజల్లలేదు.

సుబ్బన్న పేట కట్టించిన బ్రాహ్మణుఁడే యాయూరు మూఁడు నాల్గువందలయేండ్లుండునని నిర్ణయించెను. అంత జ్యోతిశ్శాస్త్ర పారంగతుఁడు, అంత వాస్తువిజ్ఞాత, అంత సర్వజ్ఞశేఖరుఁడు సుబ్బన్న పేటను నిత్యమైనదానినిగా నేల చేయలేదని యిప్పటి యా యూరి లో నివారి కొందఱ వాదము. కాని యాయన సర్వజ్ఞుఁడేగాని సర్వాధి కారి కాఁడు. వాస్తు విజ్ఞాతయేగాని వాస్తునిర్మాత గాఁడు. శాస్త్ర పారంగతుఁడేగాని శాస్త్రస్రష్ట గాఁడు.

మూఁడునందల యేండ్లయినతరువాత సుబ్బన్న పేట నశించి పోవుటకు బీజనిక్షేపము కలుగుననియు,నాయననిర్దేశించెను. ఆ హేతు వులు పుట్టిన వని నేఁటి గణాచారి సూచించుచుండెను. కాని యూరి లోఁ జాలమంది గణాచారివాక్యములయందనాదరముచూపుచుండిరి.

* * * *

అట్లు ముదురుచున్న యెండలకుఁ దాళలేక గణాచారి పోయి రావిచెట్టుక్రిందఁ గొంత సేపు కూర్చుండి, సన్నని గొంతుకతో 'వేయి పడగలపాము విప్పారుకొనివచ్చి' యని పాడ మొదలిడెను. అందులో నొక యువకుఁడు వద్దని యితరులు కనుసన్నలతో వారించుచున్నను, నామె కెదురుగా నిలుచుండి యిట్లనెను: "ఏమమ్మా! గణాచారి! ఈ పిచ్చిపాట లెందుకు? వేయిపడగలేమిటి, రాజును కలుచుట యేమిటి? అదియును గలలో వచ్చి కలుచినదా? ఈ పాటి కీపాట చాలించి యింటికి నడువుము. నడివయసులో నున్నావు. కులమువారి కపకీర్తి తెచ్చుచుంటివి. పెండ్లియు లేదు, పెటాకులు లేదు. పెండ్లి పేరెత్తి నంతనే 'హుహుహూ' యని పడిపోదువు. అన్నియు వేషములుగా నున్నవి. నీవు నిజముగా గణాచారివే యయినచో నీకుఁగూడ చెమట యేల పోసినది? నీకును నలసట యేల వచ్చినది? నీవు నిజముగా దేవునిదానవే యయినచో, నేడీ నీ మాహాత్మ్యము చూపించుము. నేను ని న్నిట్లు ధిక్కరించుచున్నానుగదా, నన్నేమియుఁ జేయలేవేమి" అని విజృంభించుచుండఁగా నచ్చటనున్న మఱియిద్దఱతనిని బలవంతముగా నటనుండి లాగుకొనిపోయిరి. మఱికొంద "అతని కిది

తగదు. మఱి పిదపకాలము వచ్చినది. అబ్బా! యిది యేమి పగలఁ బడిపోవుట. ఈ కాలపువా రందఱు చెప్పెడివారు లేక చెడిపోవు చున్నా''రని యనిరి. అవునని, కాదని వేవిధము లయిన వాదములు బయలు దేఱినవి.

ఇది జరిగినంత సేపు గణాచారి ఏమియుమాటాడలేదు. ఒకటి రెండుసార్లు తలయెత్తి యాయువకునివంకఁజూచెను. ఒకసారి జనము నంతయుఁ బరిశీలించెను.

జనము క్రమక్రమముగా నెవరిదారిని వారు పోఁజొచ్చిరి. చివరకు గణాచారి యొక్క-తెయే యాచెట్టుక్రింద మిగిలెను. రెండు జాములు కావచ్చినది.

వేసఁగి మండుటెండలు లేఁత రావియాకులమీఁదఁ బడి ధగ ధగలాడి కదలినపుడు తళతళమెఱయు గోదుమవన్నె త్రాఁచుల పడగలవలెఁ బ్రకాశించుచుండెను. రావియాకుల చిన్నిచిన్ని తోఁకలు చాఁచిననాల్క-లవలెఁదోఁచెను. దూరమున నాకాశములోఁ దెల్లని సన్నని మబ్బులు పలుచనై చెరలాడి తెల్లత్రాఁచులు మసకలాడి నట్లు, పడగలు విప్పినట్లు, ఒకదానిపై నొకఁడు దూఁకి కఱచు కొన్నట్లు పరవళ్లు త్రొక్కి-నట్లు నానారీతుల గోచరించెను.

ఎండయేమో కసలెక్కి- మహాభుజంగ మొకఁడు కుపితమై బుస్సు మని పడగవిప్పి తోఁకమీఁద లేచి నిలిచినట్లు దుర్నిరీక్ష్య మయిపోయెను.

అంత గణాచారి లేచి యింటికిఁ బయలుదేఱెను. దీర్ఘములై యర్ధనిమీలితములైన యామెకనులు సగము విరిసిన నల్లత్రాఁచు పడగలవలె, నక్షికోణముల ముడతలువడిన గీఁతలు చాఁచిన నాల్క-ల వలె భయంకరమందహాసము చేసెను. అట్లు పోవుచున్న గణాచారి కెదురుగా నొక మహాపురుషుఁడు వచ్చుచుండెను. అతనిని జూచి నంతనే గణాచారి వికృతహాసముచేసి యతని కెదురుగాఁ బాడుచుఁ బరువెత్తెను.

"వేయిపడగల పాము, విప్పారుకొని వచ్చి
కొటంగుకొన్నది, కలుగోన రాజును."

ఈ పాట పాము బుస్సకొట్టిన ట్లుచ్చరించినది గణాచారి.

# రెండవ అధ్యాయము

ఆ వచ్చుచున్న మహాపురుషుడు దబ్బపండువంటి దేహచ్ఛాయవాఁడు. కోలయు, గుండ్రము కాని ముఖము. ఆజానుబాహువు. నల్లనికురులు, విశాలమైన ఫాలభాగము. వయ సిరువదియేండ్లుండును. అతనిపేరు ధర్మారావు.

ధర్మారావు రామేశ్వరశాస్త్రిగారి కుమారుఁడు. రామేశ్వరశాస్త్రి నాగేశ్వరశాస్త్రి కైదవతరమువాఁడు. కృష్ణమనాయఁడు సుబ్బన్నపేట జమీందారయిన కాలములో రామేశ్వరశాస్త్రి యాయనకు దివానుగా నుండెను. కాని రాజు కీర్తికన్న, దివాను కీర్తియే దిశల కెగఁబ్రాఁకెను. రామేశ్వరశాస్త్రి శ్రుతిస్మృతులు చక్కఁగాఁ జదివినవాఁడు. కొంత కర్మిష్ఠి. యాగములు చేయకపోయినను, వైశ్వదేవము చేసి గృహమున నగ్నిహోత్ర మారనీయని గేస్తు. ఆయన యొకవిచిత్రపురుషుఁడు. ఆయన నాలుగువర్ణములనుండి బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర కన్యలను వివాహమాడి, నలుగురియందును సంతానమును బడసెను. ఇదియుఁగాక రత్నగిరి యను నొక భోగాంగన నుంచుకొనెను. ఆమెయందును సంతానము కలిగెను.

లోకదృష్టిలో నీ వివాహములు, నాయనకాముకతయుఁ బ్రవాదహేతువులైనను రామేశ్వరశాస్త్రిగారి యౌదార్యాదిగుణసముద్రములో నవి మునిఁగిపోయెను. ఆయన నిరతాన్నదాత. శిబి, దధీచి, కర్ణుఁడు, రాయనిబాచఁడు, రామేశ్వరశాస్త్రి – ఇది మహాదాతల సంప్రదాయము. ఆ పరగణాలో రామేశ్వరశాస్త్రి నెఱుఁగనివారు లేరు. ఆయన యౌదార్యము రుచిచూడనివారు లేరు. ఆయన యశస్సు గానముచేయనివారు లేరు.

ఆయన నాగేశ్వరస్వామి యాలయ ధ్వజస్తంభమునకు ప్రాఁత యిత్తడి తొడుగు చెడిపోఁగా, నది తీయించి బంగారపు తొడుగు వేయించెను. వేణుగోపాలస్వామికి బంగారపు మైమఱువు చేయించెను. సత్యభామాదేవికి వేయిరూపాయిల వెలగల మాణిక్యముపొదిగిన

యడ్డబాస చెక్కించెను. నాగేశ్వరస్వామి యాలయములో వీరభద్రు నకు బంగారుమీసములు, కనులు, మధ్యమాణిక్యముపొదిగిన గంధపు గిన్నెలవంటి తిలకమును చేయించెను. వేణుగోపాలస్వామివారిగుడిలో శమీవృక్షమువద్ద శిలావితర్దిక కట్టించెను. ఆలయ సరస్సునకుఁ గ్రొత్త చలువరాతి మెట్లు కట్టించెను రెండాలయములలో నాయన చేయించిన మరమ్మతులకే యాయన కన్న సగమాస్తి వ్యయము య్యెను.

పేదవారలపాలికి రామేశ్వరశాస్త్రి భగవంతుఁడే. వెనుక ద్వాదశవర్ష క్షామము వచ్చినప్పుడు జనులు తినఁ దిండిలేక మల మల మాడిపోయిరి. జమీందారుగారిధాన్య మాఱువందలపుట్లు రెండు పెద్దపాతరలు వేసిరి. దానికిఁ గాపలా యెవరుందురు? గూడె ములు గుంపులుగుంపులుగాఁబోయి దోచుకొని పోవుచుండిరి. రామే శ్వరశాస్త్రిగారి నే పాతరలకుఁ గానలియుంచిరి. ఆయన పెద్ద విలు కాఁడు. విల్లునంబులు దగ్గరపెట్టుకొని యాయన ధాన్యము గావలి కాయుచుండెను. చుట్టున నున్న మైదాఱుగూడెములవారు గుంపు లుగా వచ్చిరి. దూరమున నిలఁబడిరి. దగ్గఱకు రా గుండె లానలేదు. ఏమిచేయుటకును దోఁచినదకాదు. అడుగువేసిరా అంబుపడినదే. చివరకు వారిలోఁ బదిమంది పెద్దవాండ్రు శాస్త్రిగారివద్దకు వచ్చి, "అయ్యా! యీనాఁడు మా ప్రాణములు మీ చేతిలోనున్నవి. అన్నములేక చచ్చిననేమి? మీ యంబులదెబ్బలు తిని చచ్చిన నేమి? మా కెటులును భగవంతుఁడు చావే వ్రాసెను. మాతోఁ బాటు మా యిండ్లదగ్గఱ పిల్లలు, భార్యలుకూడఁ జత్తురు. మీకు దయఁగలిగినచో బ్రతికెదము. లేకపోయినచోఁ జత్తుము" అని దీనా లాపము లు చేసిరి. శాస్త్రిగారిగుండె కరఁగిపోయెను. తాను కదలి యొక పాతర చూఱయిచ్చెను. జనము యథేచ్ఛముగా నొక్కొ క్కఁడ పది పదనొకండు దినముల గ్రాసము నెత్తుకొనిపోయిరి. కాని యా సొమ్ము తనదా? తరువాత జమీందారుగారు శాస్త్రిగారి నడిగిరి. "ఇంచుమించుగా వేయిమందిజనము వచ్చిరి. అడిగిరి. నేను పాతర వదలకపోయినచో వారిలో నెంతమంది చత్తురో! ఆ పాతరక మంతఁయి నాదా, మీదా? అయ్యా! తమ కంతగాఁ గోపమువచ్చి

నచో, నా ధాన్యములవెల నే నిచ్చెదనులెండు" అని శాస్త్రిగారు సమాధానము చెప్పిరి. రాజుగారును మఱి మాటాడలేదు.

శాస్త్రిగారినిగుఱించి యిట్టికథ లెన్నియేనియుఁ గలవు. అందుచేత నా చుట్టుపట్ల రామేశ్వరశాస్త్రిగారి పలుకుబడికిమితిలేదు. ఆయన దొక మహాజాతకము. ఆయన బ్రతికినన్నాళ్ళు కృష్ణమనాయఁడు జమీందారా, రామేశ్వరశాస్త్రి జమీందారా అన్నట్లుండెను.

ఒకసారి జమీందారునకును, రామేశ్వరశాస్త్రికిని మాట మాట పట్టింపు వచ్చెను. అంతే, ఆఱేండ్లు వారిద్దఱు నొకరితో నొకరు మాటాడలేదు. శాస్త్రిగారు కోటగడప త్రొక్కలేదు. ఆఱేండ్లయిన తరువాత జమీందారుగారు వేణుగోపాలస్వామికి మఱల సంప్రోక్షణచేయించవలసివచ్చెను. ఆలయమంతయు మరమ్మతు చేయించి మఱలఁ గ్రొత్తయాలయము కట్టించినట్లే జమీందారు పెద్ద ప్రయత్నము చేసెను. సంప్రోక్షణ చేయవలసినదినము వచ్చినది. నానాజనులు కూడియుండిరి. సాంగాధ్యయనపరులు, శాస్త్రవేత్తలు, గాయకులు, కవులు, వాద్యగాండ్రు, వారాంగనలు, చూడవచ్చిన జనము, సర్వజనులు క్రిక్కిరిసిపోవుచుండిరి. ముహూర్తము సమీపించినది. జమీందారుగారి యనుమతికోసము సంకల్పము చేయుటకుఁ బురోహితుఁ డెదురు చూచుచుండెను. జమీందారుగారి యనుమతి యేమో రాలేదు. వేళ యతిక్రమించుచున్నది. పురోహితుఁడు వేగిరపడుచున్నాడు. కృష్ణమనాయఁడు తలయెత్తఁడు. ఎవరికి నేమియుఁ దోఁచినదికాదు. చివరకు నర్చకుఁడు సాహసించి "అయ్యా! వేళ యగుచున్నది. ప్రారంభించు మందురా" యని యడిగెను. కృష్ణమనాయఁడు తలయెత్తకయే, "ఇక్కడ నెవరి నడిగెదవు? అనుమతి యీయఁదగిన రామేశ్వరశాస్త్రిగారు రాక యింటివద్ద బిగించుకొని కూర్చుండెనామెను. పోయి యాయనను పిలుచుకొనిరం" డనెను. అప్పు డందఱకు నాశ్చర్యమైపోయెను. ఆఱేండ్లనుంచి వారికి వీరికి మాటలు లేవని యందఱకుఁ దెలియును. జనముపోయి రామేశ్వరశాస్త్రిగారిని రమ్మని పిలిచిరి. శాస్త్రిగారు రాలేదు. "పిలుచుటకు మీ రెవరు? పిలువఁ దగినవారు పిలిచినచో వత్తుములే" యని

యాయన చెప్పెను. రాజుగారి కీ వార్త తెలిసిన వెంటనే వారే పోయి పిలచిరి. వారి ప్రేమమార్గములే వేఱు. నాయఁడు పోయి "ఏమయ్యా! బిఱ్ఱబిగిసి కూర్చున్నావు. ఆఱేండ్లు బిఱ్ఱబిగిసినావు. ఇంక నెన్నాళ్ళు బిగిసెదవు! లేచిరా! ఇంక ముహూర్తము దాఁటిపోవు" ననెను. శాస్త్రి ముసిముసినగవులు నవ్వుచు లేచివచ్చెను.

వారి యిద్దఱి చెలిమి యట్టిది. రా జంత యుదారుఁడు. శాస్త్రి యంత గౌరవము కలవాఁడు. ఒక్కొక్కప్పుడు వా రిద్దఱికి శరీరములే రెండా యన్నట్లు నటించెడివారు.

ఆపదలు హరిశ్చంద్రాదులకుఁ దప్పలేదఁట. అంత రామేశ్వరశాస్త్రిగారికిని జివరిదినములు సరిగాఁ గడువలేదు. సామాన్యముగా జీవితము మొదలి దినములలోఁ గష్టబడినను జివరినాళ్ళలో భాగ్యమనుభవించినవారిదే మంచి జాతకము. మొదట నెంతటి శ్రీ యనుభవించినను, చివరిరోజులలో 'లొంగుబాను' పడినవారిది దురదృష్టజాతక మనియే చెప్పవచ్చును. శాస్త్రిగారి నిరంతరవితరణగుణముచే నాయనకుఁ గల యాస్తి మండువేసఁగినాఁటి చెఱువు నీరువలెఁ గ్రమక్రమముగా శుష్కించిపోయెను.

శాస్త్రిగారియింట నెంతమంది భోజనముచేయుచుండెడివారో యెవరికిఁ దెలియదు. ఎవ రెందుకు వచ్చిరో తెలియదు. ఎవరును నడుగరాదు. ఎవరికిఁ గావలసినవీళ్ళు వారికిఁ జరుగుచుండెను. భోజనమేగాక యంగడికిఁ బోయి జనము యథేచ్ఛముగా శాస్త్రిగారిపేర నెవరికిఁ గావలసినవి వారు తీసికొనుచుండిరి. ఈ జాబితాలు చివరకు వేలక్రిందికి దిగెను. ఆదాయముచాలక శాస్త్రిగారు ఋణములుచేసిరి. మఱికొన్నాళ్ళకుఁ గొన్నిభూము లమ్మిరి. చివరకు మిగిలినయాస్తి కన్న ఋణమే యెక్కువైనది. అమ్మఁజూపినను భూము లెవరును గొనరాలేదు. కాని శాస్త్రిగారిఁట నన్నసత్రముమాత్ర మవ్యవహితముగా సాఁగుచుండెను. మఱికొన్నాళ్ళకు నదిసాగుటయు దుర్ఘటమైపోయెను. నెమ్మదిగా జన మెవరిదారిని వారు సర్దుకొనిరి. శాస్త్రిగారికిఁ జేతిలోఁ జిల్లిగవ్వ యాడనిదినములు వచ్చెను. బాకీదారుల యొత్తిడి యెక్కువయ్యెను.

జమీందారుగారొకటి రెండుసారులు సాహాయ్యముచేసిరి. కృష్ణమనాయఁడు వృద్ధుఁ డయ్యెను. ఆయనకుమారుఁడు రంగారావు వ్యవహారము లన్నియుఁ జూచుట మొదలుపెట్టెను. రంగారావు తండ్రివలెఁగాక కొంచెము బిగువుకలవాఁడు. ప్రతిదానికి జమాఖర్చు చూచెడువాఁడు. వ్యవహారము చూచుకొను భారమంతయు వృద్ధుఁడైన కృష్ణమనాయఁడు కుమారునిమీఁదనే వదలిపెట్టెను. రంగారావునకు రామేశ్వరశాస్త్రిగారిమీఁద నంత యభిమానములేదు. అందువలన శాస్త్రిగారికిఁ గోటలోనుండి సాహాయ్యము వచ్చు మార్గము లేకపోయెను.

శాస్త్రిగారిమీఁద వారంట్లు పుట్టెను. పాప మాయన తల దాఁచుకొనుటకు వీలు లేకపోయెను.

సరియైన ధరలు కట్టినచో మిగిలిన యాస్తికిని, ఉన్నయప్పునకును సరిపోవును. కాని కొనఁబోయినఁగొ అవి, అమ్మఁబోయిన నడవిగానున్నది. తెలివి యనిన ఋణదాతలదే తెలివి. మొదట నప్పిచ్చినది యాస్తిని జూచి. చివర కాస్తిని వదలి మనిసిమీఁదఁ బడెదరు. మనిసి యొడలిలోని బొమికలు రత్నములా? అతని నెత్తురు కరఁగించిన బంగారమా? ధన మతనినుండి యెట్లు వచ్చును? అతని వ్యక్తిని బీఁకుకొనితినుట యెందుకో?

రామేశ్వరశాస్త్రి యెవరిని నన్యాయము చేయలేదు. ఆస్తి నపహరించను లేదు. అతని బందుగులు చాలమంది కొంత యాస్తి భార్యపేర వ్రాయుమని చెప్పిరి. ఆయన 'నాలుక కోసినను నట్లు చేయ'ననెను.

ఋణదాతలలో నొకరును శాస్త్రిగారివలన నుపకారము పొందనివారు లేరు. అందఱికన్నఁ బెద్దఋణదాత నాగన్నసెట్టి. వెనుక నొకసారి జమీందారుగారినిగుఱించి నాగన్నసెట్టి తూలనాడెను. కృష్ణమనాయఁడు సెట్టిని ఏదో పనియున్నట్లు కోటలోనికిఁ బిలిపించి కొరడాలతోఁ గొట్టించుటకుఁ దయారుచేసెను. సెట్టి యదృష్టముకొలఁది నావేళకు రామేశ్వరశాస్త్రిగారచటికి వెళ్ళిరి. అది చూచి సెట్టిని వదలించి పంపించి 'రాజు లిట్టిపనులు చేసినచో మర్యాదపోదా?' యని జమీందారును మందలించిరి. ఈ నాగన్న

సెట్టితండ్రి యుత్తరాదివాఁడు. అతనికి స్వదేశమున గ్రాసము గడువక సుబ్బన్నపేఁట వచ్చెను. రామేశ్వరశాస్త్రిగారి తండ్రిగా రతనిని సమాదరించి కొంతధనమిచ్చి యతనిచేత వర్తకముసాఁగింపించెను. అతఁడు క్రమముగా బాగుపడి నేఁటికి లక్షాధికారియై, రామేశ్వరశాస్త్రిగారి కప్పుపెట్టెను. తన తండ్రికి శాస్త్రిగారితండ్రి చేసిన యుపకారముగాని, తన్ను శాస్త్రిగారు రక్షించినదిగాని యీ వేళ కడ్డమురాలేదు. తన సొమ్మంతయు శాస్త్రిగారు తిన్నాఁడని యూరంతయు 'యాగీ' చేయును. శాస్త్రిగారిమీఁద వారంటుపెట్టి యమలుజరుపుటకు నిత్యమును క్రోధదీక్షాపరుఁడై కాచియుండెను.

ఇంకొక యప్పుపెట్టినాయనపేరు శ్రీరాములు. వారు కమ్మవారు. నలుబదియేండ్ల క్రింద శ్రీరాములు తినఁ దిండిలేక స్వదేశము వదలి సుబ్బన్నపేఁట వచ్చి వారివారిదగ్గఱ పాలేరుతనము చేసి బ్రతుకుచుండఁగా రామేశ్వరశాస్త్రిగారు చూచి దయఁదలచి "నాయనా! సాటివారిలో నీవు నీచముగా బ్రతుకుట యెందుకు? నేను పదియెకరముల భూమి నీ కిచ్చెదను. పాలికి చేయుము. దైవము రక్షించినచో నదే నీకు బువ్వపెట్టగలదు" అని దగ్గఱకుఁ దీసి యతనిని బోషించెను. అతఁడును వచ్చిన వేళావిశేషముచేత నానాటికి రెండుపుట్లు, మూఁడుపుట్లు, నాలుగుపుట్లు నిట్లు మిగుల్చుకొని కొంచెము సంసారియై పెండ్లిచేసుకొని యత్తవారిచ్చిన కొద్దిడబ్బు వడ్డీకివేసికొని వచ్చిన భార్య నెయ్యి, పాలు, పెరుగుచేసి యమ్మి కూడఁబెట్టినదియు నదియుఁగలిసి పదివేల సంసారి యయ్యెను. అందులోఁ గొంత శాస్త్రిగారి కప్పుపెట్టెను. ఇప్పుడు శాస్త్రిగారి మీఁదఁ గత్తికట్టినవారిలో నగ్రేసరుఁ డాయన.

అసలా సుబ్బన్నపేఁటలో శాస్త్రిగారి యుప్పుతిననివాఁడు లేఁడు. ఇప్పు డాయనను సాధించవల దనెడువాఁడు లేఁడు.

ఇంతకు నది ప్రాఁతదినములు పోవుచుఁ గ్రొత్తదినములు వచ్చుచున్న సంధివేళ. ప్రాఁతమర్యాదలు పోవుచుండెను. ఇంగ్లీషు చదువు సుబ్బన్నపేఁటలోనికిఁగూడవచ్చెను. దానితో స్వాతంత్ర్యము వ్యక్తిగౌరవము కనంబడుచుండెను. మరియాదలలోఁ బూర్వపుపద్ధతులు పట్టవు. శాస్త్రిగా రచ్చముగాఁ బూర్వయుగము వాఁడు.

శాస్త్రిగారు రాయూరిలో నందఱను పురుషుల'నేమిరా'యనియు, స్త్రీల 'నేమే' యనియుఁ బిలచెడివాఁడు. ఆయన పోరానియిల్లు లేదు. ఆయన యందఱను సమానముగనే ప్రేమించెను. జమీాందారుగారినే ప్రసంగములో 'నీవు'యని అనుచుండును. జమీాందారుగారి పిల్లలను 'ఏమిరా! నాయనా!' యనెడువాఁడు. శాస్త్రిగారి యాస్తి చెడిపోకుండ నున్నన్నినాళ్ళు లీ పిలుపులు బాగుగనే యున్నవి. ఆయన కొంచెము చేవెలితిపడినతోడనే యందఱకు నిది కంటగింపయ్యెను. శాస్త్రిగారి పూర్వపు టౌదార్యముగూడ సుబ్బన్నపేట జనులకు దుర్గుణముగానే భాసించెను.

జమీాందారుగారి కుమారుఁడు రంగారావునకు శాస్త్రిగారి మీాఁదఁ గల కోపమున కిదియొక కారణము: తన్ను 'ఏరా' అనుట యేమని. శాస్త్రిగారి కిది తెలియదు. రామేశ్వరశాస్త్రి గొప్ప స్వతంత్రుఁడు. ఆయనలోనున్న స్వాతంత్ర్యగుణము నేఁటి కందఱకు నహంకారముగాఁ గన్పించెను. కాలవైపరీత్యమనఁగా నిట్టిది. ఏది సదుద్దేశ్యముతోఁ జేసెదవో దానికిఁగూడ విపరీతవ్యాఖ్యానములు చేయఁబడును.

ఇది శాస్త్రిగారియూరిలోని సంపత్తి. ఇంక బంధుత్వములోని సంగతి. రామేశ్వరశాస్త్రి బంధుజ్యేష్ఠుడు. వారి బంధుత్వములో నాయనయంత పండితుఁడుగాని, వ్యవహర్తగాని, ప్రతిష్ఠితుఁడుగాని లేఁడు. ఆయనసొమ్ము తృణమో, ఫణమో తిననివాఁడు లేఁడు. ఆయన కనువిప్పి చూచినచో గడగడలాడనివాఁడు లేఁడు. అయిన వాఁడు, కానివాఁడు, దూరమువాఁడు, దగ్గఱవాఁడని లేకుండ నాకాసిపోకాసి వారందఱు నాయనమీాఁదఁ బడి తినువారే. వారందఱకు నిప్పుడు రామేశ్వరశాస్త్రియనిన నపండితుఁడు. వ్యవహార జ్ఞానము లేనివాఁడు. ముందువెనుక లరయనివాఁడు. ఆయనకు మేనమామకొడుకు లున్నారు. వారందఱు శాస్త్రిగారింటిలోఁ బెరిగినవారే. వారి దీపారాధనలు శాస్త్రిగారు వెలిగించినవే. వారిప్పుడు శాస్త్రిగారియింటికే రారు.

రామేశ్వరశాస్త్రి బావమఱఁది గంగాధర సోమయాజులు. 'సోమయాజులు' యజ్ఞముచేయుటవలన వచ్చిన బిరుదే. గంగన్న

సోమయాజి యనికూడఁ బిలుతురు. గంగన్న పూర్వులందఱు నాహి తాగ్నులు. ఆయనతండ్రి సోమన్నగారు మాత్రమే వైశ్వదేవము మాత్రము చేసినవాఁడు. తత్పూర్వులందఱుఁ బండితులు. ఇష్టి చేసిన వారు. సోమన్నగారి ముత్తాత బ్రహ్మీభూతుఁడుకూడను. కాని సోమన్నగారినాఁటికి వారు దరిద్రులై, తిండికి లేక యిబ్బందిపడవలసి వచ్చెను. సోమన్నగారిది సుబ్బన్నపేఁటకు మూఁడు నాలుఁగుమైళ్ళ దూరములో నున్న రంగాపురము.

ఒకరోజున సోమన్నగారు దూరపుటూరునకు సంభావనకుఁ బోయి ప్రొద్దెక్క సుబ్బన్నపేఁటమీఁదుగా స్వగ్రామమునకుఁ బోవు చుండెను. బ్రాహ్మణునకు క్షుత్తు బాధించుచుండెను. ఇంటికిఁబోయిన తరువాతఁ గూరయు దొరకదేమో యనుకొనుచుఁ బోవుచుండెను. దారిలోఁ బండిన జొన్నచేనుదగ్గఱ మంచెమీఁద రామేశ్వరశాస్త్రి కూర్చుండి వ్రాసికొనుచుండెను. సోమన్న "అబ్బాయీ! మీ చేలో రెండు దోసకాయలు కోసికొందునా?" యని యడిగెను. రామేశ్వర శాస్త్రి "అయ్యా! మీరు పెద్దలు. నేను కోసిపెట్టెదనులెండి" యని మంచె దిగి యాయన మోయలేనన్ని కాయలు కోసి మూటకట్టి యిచ్చెను. సోమన్నకుఁ బట్టరానంత సంతోషమయ్యెను. ఊరడిగి పేరడిగి నారాయణశాస్త్రిగారి కుమారుఁడని తెలిసికొని, యధ్యయనము శాస్త్రము చదివె నని తెలిసి, వ్రాఁతనిదో డతని చక్కని దస్తూరి చూచి సంతసించి స్వగ్రామమునకుఁ బోయెను. పోయి దోసపండ్లమూట దించి దించుచునే భార్యతో "ఏమేవు! అమ్మాయికి సంబంధము కుదుర్చుకొని వచ్చితిని" అనెను. ఆమె తొందరతో "ఎవ" రని యడిగెను. "ఎవ రేమిటి! సుబ్బన్నపేఁట నారాయణశాస్త్రిగారి కుమారుఁడు. పేరు రామే శ్వరశాస్త్రియఁట. పిల్లవాఁడు ముత్యమువలె నున్నాఁడు. చక్కఁగా నధ్యయనము చెప్పుకొన్నాఁడు. కావ్యపరిచయముకూడఁ గలదఁట ఏమి దస్తూరి! అక్షరాలు ముత్యాలకోవవలె వ్రాయును. 'నాయనా! రెండుదోసకాయలు కోసిపెట్టవోయి' యన్నాను. తట్టెఁడుకోసి నా నెత్తిన పెట్టినాఁడు. ఇంతకు మన సావిత్రి యదృష్టము. బంగారపు తండ్రి" యనెను. సోమన్నగారి భార్య పెదవివిఱిచి "బాగున్నది.

వారెక్కడ; మన మెక్కడ? బీదవాండ్రమగు మనపిల్లలను వారు చేసికొందురా? చాలులెండి" యన్నది. "అదేమిమాట! ఎందుకు చేసికోరు? కూటికిఁ దక్కువైనఁ గులమునకుఁ దక్కువా? యన్నారు. పోయి మాపిల్ల నిత్తుమనఁగా వద్దందురా యేమి" యని సోమన్న భోజనముచేసి ప్రొద్దువాటారనిచ్చి, సుబ్బన్నపేఁట పోయి నారాయణశాస్త్రిగారింటికి వెళ్ళెను. అప్పుడు నారాయణశాస్త్రిగారింటివద్ద లేరు. వారి తమ్ముఁడు శంకరయ్యగా రుండెను. సోమన్నగారి రాక చూచి శంకరయ్య, బ్రాహ్మణుఁడు సంచారార్థము వచ్చినాడనుకొని యొకరూపాయి తెచ్చి యీయఁబోగా సోమన్న తనకథ చెప్పెను. శంకరయ్య "అయ్యా! మా అన్నగారూరిలో లేరు. వచ్చినవెంటనే చెప్పి తమకుఁ గబురు పంపించెద" నని యాయనను బంపించి యూరిలో నొక సిద్ధాంతిదగ్గఱకుఁ బోయి లగ్నము పెట్టించెను. ఆ లగ్నము పదిరోజులలోనే కుదిరెను. పెండ్లి కెడములేదని యా మఱునాఁడే పోయి తాళ్ళలోఁ దాటియాకులు కొట్టించి తెప్పించి వాకిటనుంచెను. ఇంటిలో నాఁడువాండ్రందఱితోఁ బెండ్లిపనులు చేయవలసినదని చెప్పెను. మూఁడవనాఁడు నారాయణశాస్త్రిగారు వచ్చి వాకిట నున్న తాటియాకులమోపులు చూచి యింటిలోనివారి నివి యెందుకని యడిగెను. వారును "రంగాపురమునుంచి సోమన్న గారఁట, వచ్చినారు. వారి కుమార్తె పేరు సావిత్రియఁట, మన రామేశానికిత్తుమన్నారఁట. శంకరం లగ్నము కుదిర్చెను. ఇంకఁ బదిరోజు లున్నదఁట" యని చెప్పిరి. ఆయనయు సరే నని పెండ్లికి సిద్ధమాయెను.

రామేశ్వరశాస్త్రిగారివివాహ మిట్లు జరిగెను. ఆ నాఁటివివాహములు, వారి మంచితనము నట్టివి. వారి కార్షేయపౌరుషేయములే కావలెను గాని, ధనము లక్కఱలేదు కాఁబోలు!

ఈ సంబంధమైనతర్వాత సోమన్న సంసారానికి చెడ్డదినములు వెనుకఁబట్టినవి. ఆయనకుమారుఁడు గంగాధరంగారికిఁ గృష్ణమనాయఁడుగారు కొంత యీనా మొసంగిరి. మనుష్యులు సహజముగాఁ బొదుపుగలవారుగానఁ గ్రమముగాఁ బచ్చపడిరి. ఆయన తర్వాత యజ్ఞముగూడఁ జేసెను. దానితో వారిమీఁద నూరిలోఁ

గొంత యభిమాన మేర్పరడెను. కొద్దిగోఁ బాఁకియుఁ, బంటయుఁ గలిగి గంగాధరసోమయాజులుగారు సంసారియయ్యెను.

ఈ పచ్ఛెదనమంతయు రామేశ్వరశాస్త్రిగారి సంబంధము వలనఁ గలిగినదే యయ్యును, గంగాధరముగా రిపుడు రామేశ్వర శాస్త్రిగారివంకనైనను జూడఁడు. తన బావమఱఁది పిల్లలకేమియు లేకుండఁజేసె ననియు, వట్టి యప్రయోజకుఁ డనియు నందఱితోఁ జెప్పును. గంగాధరముగారి పిసినిగొట్టుఁదనమును, రామేశ్వరశాస్త్రి గారి వితరణగుణమును నెఱిఁగిన జనులు మనస్సులలో నతనినిఁ గూర్చి నిందించుకొందురు

చివరకు రామేశ్వరశాస్త్రిగారి కిల్లు గడవని దినములుకూడ వచ్చెను. భార్యను, బిల్లవానిని గంగాధరముగారింటికి తానే తీసి కొనిపోయి యాయన యచటనే యుండవలసివచ్చెను. కాని గంగా ధరముగారును, నాయనభార్యయు వీరి నవరానిమాట లని చాల నీచముగాఁ జూడ మొదలుపెట్టిరి. రామేశ్వరశాస్త్రిగారికిఁ దలకొట్టు కొన్నట్టు లయ్యెను. ఏమి చేయవలయును? కొన్నాళ్ళచ్చటనుండి యాబాధ పడలేక మఱల సుబ్బన్నపేటకే వచ్చిరి.

రామేశ్వరశాస్త్రిగారికిఁ దమ్ము లుండిరి. వారు చనిపోయి వారి పుత్రులు వారివారి సంసారములు వారు చేసికొను చుండుట చేత శాస్త్రిగారికి వారు సాయము చేయలేరు.

శాస్త్రిగారిజీవితకాలమంతయు నాయన కెదురాడని యాయన ధర్మపత్నికిఁగూడ నాయన చివరకు లోఁకువయ్యెను. పిల్లలకు నేమియు లేకుండఁజేసెనని యామెకు దుఃఖముగలిగెను. ఆ దుఃఖ మప్పుడప్పుడు భర్తమీఁదఁ గోపముగాఁ బరిణమించుచుండెను.

ఇంత చెడికూడ శాస్త్రిగారికి వితరణబుద్ధి పోలేదు. అప్పుడు శాస్త్రిగారికిఁ గట్టుకొనుటకు దోవతి యొక్కటేయుండెను. పై నుత్తరీయముకూడలేదు. అంగవస్త్రముకలదు. అవి రెండే యాయ నకుఁగల సర్వవస్త్రములు. అవి ధరించి దూరపుబజారులో నొకాయ నను నాల్గురూపాయ లిచ్చునేమో యడిగి వచ్చుటకు వెళ్ళెను. దారిలో నొక ముసలి బీదమాదిగవాఁడు కనబడి "దొరా! నీరోజు లయిపోయినవి నేను నీయండను ఇంత కూడు గుడ్డ గలిగి బ్రతికితిని.

ఇదిగో యిప్పుడు నాకును చెడ్డరోజులు వచ్చినవి. కట్టుకొనుటకు గుడ్డ లేదు. గోచితోఁ దిరుగుచున్నాను. చెట్టువంటివాఁడవు. నీ విట్లయినావు. కాకులవంటివాండ్రము మే మిట్లు చెల్లాచెదరయినాము" అన్నాడు. శాస్త్రి పైయంగవస్త్రము ధరించి, దోవతి వానికిచ్చి యింటికి వచ్చెను.

ఇల్లు నిప్పచ్చరము నిరామయముగ నున్నది. దారిద్ర్యదేవత సహస్రహస్తములతో దశసహస్రాంగుళులు విచ్చి మీఁదఁబడి పీకినట్లయ్యెను.

శాస్త్రి యది యోర్వలేక తనకన్న దరిద్రుఁడైన నాగేశ్వర స్వామి దర్శనార్థము వెళ్ళెను. స్వామి దర్శనముచేసి, నందీశ్వరుని శృంగముల మధ్యనుండి స్వామిని జూచి, ముఖమంటపమునందు విశ్రమించెను. ఆనాఁడు శుక్ల విదియ. చంద్రున కుదయాస్తమయములు రెండు నొక్కసారియే యయినవి. శాస్త్రి ముఖమంటపము వదలి వచ్చి యావరణము వెలుపలనున్న కళ్యాణమంటపమునందుఁ గూర్చుండెను. కనపడీ కనపడని నూలుపోగువంటి చంద్రునకు నూలు పోగు వేయుదమని చూచెను. పైన బట్టలేదు. కట్టుకొనిన యంగవస్త్రమునఁ బోగు రాలేదు. శాస్త్రి నిర్విణ్ణు డయ్యెను.

ఆ నూలుపోగువంటి చంద్రుఁడు మాయమయ్యెను. ఉండీ లేనట్లుండిన చంద్రుని యా ప్రథమదర్శనమునకే చీఁకటు లేమో తెల్లపోయినట్లు, వెనుక వెనుకకుఁ దగ్గినట్లు, ముగ్ధములై లజ్జావ్యాకులితములైనట్లు తోఁచెను. చీఁకట్లు దళములై, వెలుఁగులకు దూరములై కృశించుచున్న బహిర్జ్యోతిస్సుకల శాస్త్రిగారి కన్నులను జొచ్చి లోఁతులదాఁక వ్యాపించెను.

భగవంతుని కల్యాణమంటపములో శాస్త్రిగారు లయమందెనని యెవరికిని బ్రొద్దుపోయిన తరువాతఁగాని తెలియలేదు. ఆయన మృతితో నాయన గొప్పతనము హఠాత్తుగా నందఱకును మఱల గోచరించెను. ఆ యర్ధరాత్రమున జనులందఱు మండపమునఁ బ్రోగు పడి శాస్త్రిగారికథలే తడవఁజొచ్చిరి. ఆయనవలన నుపకారము పొందినవారందరు కన్నీరు గార్చిరి.

శాస్త్రిగారి భార్యాపుత్రులువచ్చి శవము నింటికిఁ గొని పోయిరి. ఆయనకు బోలెడంత బలగమున్నది. బ్రతికియున్నపుడు, చేవెలితిపడియున్నపుడు వాకిలి తొంగిచూడని వారందఱు నేఁడు బంధువులై కాకులట్లు గుమిగూడిరి. తెల్లవాఱువఱకుఁగొంప యంతయుఁ జుట్టములన్నవారితోఁ గిటకిటలాడిపోయెను.

ఆనాఁడు ధర్మారావు కన్ను తెఱచెను. అతని కప్పటికి పదు నాలేండ్లు. తండ్రి చనిపోవుట తనకు లాభమో, నష్టమో యతనికిఁ దెలియదు. సంస్కారము జరుగవలసియున్నది. కాలు కదిపినచో ధనముతోఁబని. తల్లి యీ సంగతి విచారించకుండ భర్తృశవముపైఁబడి రోదించుచునే యున్నది. వచ్చిన బంధువులు శుష్కప్రియులు, శూన్యహస్తములు నని విచారముఖములు గాక యింకొకభావము లేనివారుగా నుండిరి. పసివాఁడయినను సర్వవిషయములు తెలిసిన ధర్మారావునకు ముందుచూచిన నూయియు, వెనుకఁజూచిన గోయియుఁగా నున్నది.

కొంచెము ప్రొద్దెక్కినది. ఈ నిరాధారస్థితిలో ధర్మారావు నకు బట్టుకొయ్య యొకఁడు దొరకెను.

శాస్త్రిగారి మరణవార్త కృష్ణమనాయనికిఁ దెలిసెను. ఆ ముసలివాఁడు కూర్చున్నవాఁడు కూర్చున్నట్లు క్రుంగిపోయెను. ఒక్క సారిగా నాయనకు శాస్త్రిగారి యుచ్చదినములు, నాయన మహావ్యక్తిత్వము, నతని యౌదార్యము గోచరించెను. జమీందారు బయలుదేఱి శాస్త్రిగారింటికి వచ్చెను. శాస్త్రిగారి శవము చూచినంతనే నాయఁడు మఱి కరఁగిపోయెను. ఆయన ధర్మారావును జాల సమాదరించి, కొంతసేపయినతరువాత కర్మ జరుగుటకుఁ బ్రియత్నములు చేయరేమని బంధువులను మందలించెను. వారును భారము తమమీఁద లేదని తెలిసికొనినంతనే సర్వకార్యములు నిర్వర్తించుటకు ముందంజ వేసిరి.

దారిద్ర్యము శాస్త్రిగారితోనే పోయిన ట్లయ్యెను. దేవిడీలో నుండి బియ్యము, పప్పు, ఉప్పు మొదలుగా సర్వసంభారములు వచ్చెను. నాయఁడు రెండువందల రూపాయలుకూడ పంపించెను.

ధర్మారావు మేనమామయు, మామగారు నయిన గాంగాధరసోమ యాజులుగారు పెత్తనము వహించిరి.

సోమయాజులుగారు ఆత్మగుణములకన్న చత్వారింశత్సం స్కారములకే యెక్కువప్రాధాన్య మిచ్చెడువాఁడు. దయాదాక్షిణ్య ములకు, నాయనకు మిక్కిలి దూరము. కర్మ యథావిధిగ జరుగ వలయు ననుటలో మొదటివాఁడు. అందుచేత సర్వసమృద్ధిగల శాస్త్రిగారియింట సోమయాజులుగారి యాజమాన్యముక్రింద నపర కర్మ సుష్ఠుగా జరిగెను. పదునొకండు, పదిరెండు దినములలో శాస్త్రిగారి కర్మ స్వాయుముగా జరిపించిరి. గోదానము, వృషో త్సర్జనము, షోడశదానములు, బ్రాహ్మణ సంతర్పణము, సంభా వనయు జమీందారుగారి దయవలన లోపములేకుండ జరిగిపోయెను. కడుపునిండఁ దిని గరుత్రేఁచిన బ్రాహ్మణులు "ఆయన కేమి, మహారాజు! చివర రోజులలో నేదో కొంచెము లోపము జరిగెనే కాని, యాయన కేమి ? బ్రతికినపుడు మహారాజే, చచ్చియు మహారాజే"యని దీవించిరి.

ధర్మారావుబంధువు లీ పదుమూఁడు దినములు జమీందారు పంపించిన సంభారములు విచ్చలవిడిగాఁ దిని ఖర్చుపెట్టిరి. తిన్నంత తినిరి. పాఱవేసినంత పాఱవేసిరి. దేనికిఁబడిన దానికి సామగ్రి యథే చ్ఛముగా వాడిరి. కర్మకుఁదెచ్చిన వస్తువులు మిగులరాదనికాబోలు బంధువు లయిన కొందఱు ముసలమ్మలు కొంతసామగ్రి తమయిం టికిఁ జాటుగాఁ బట్టించుకొనిపోయిరి. కర్మలో మునిగియున్న ధర్మా రావుగాని, దుఃఖములో మునిగియున్న యతని తల్లిగాని యీసంగతి గుర్తించలేదు. ధర్మారాయని యప్పగార్లుకూడాఁ దల్లివెంటనే యుండిరి.

పదుమూఁడవనాఁ డెవరిదారిని వారు పోయిరి. సావిత్రమ్మగా రింటిలోఁ జూచుకొనెను. మిగిలిన బియ్యము పదిరోజులకు వచ్చును. నెయ్యి మొదలైన వేమియులేవు. చివరదినములలోఁ గష్టము లను భవించినను శాస్త్రిగారికర్మ సరిగా జరిగిపోయినది. ఆ యదృష్టము గూడ నాయనదే. దురదృష్టవంతులు మిగిలిరి. బంధువు లెవరిదారిని వారు పోయినను ధర్మారావు, నప్పగార్లిద్దఱు, వారిపిల్లలు, బావ

మఱఁదులు వెళ్ళలేదు. వారు తల్లి నోదార్చుటకు నిందే యుండిరి. తండ్రియాస్తి కొడుకునకు సంక్రమించుట న్యాయమేగనుక, యాయన యాస్తి దారిద్ర్యమేగనుక నది ధర్మారావునకు వెంటనే సంక్రమించెను.

ధర్మారావు పడుచున్న యిబ్బందులన్నియుఁ బ్రతినిమేషము సువ్యక్తమగుచున్నను, నతని బావమఱఁదులు గృహమునుండి నిష్క్రమించరు. రోజునోజెల్ల రామేశ్వరశాస్త్రిగా రాస్తిపాడుచేసి రని సణుగుచుందురు. ఆ దోషమంతయు ధర్మారావుదే యన్న ట్లతనిని నిందించుచుందురు. ఇంటఁదమకు సరిగా జరుగుటలేదని కూడఁ దగవులాడుచుందురు.

ధర్మారావు పెద్దక్కగారి పేరు హైమవతి. రెండవయామె పేరు నాంచారమ్మ. పెద్దబావగారిపేరు సూర్యనారాయణ. రెండవ యాయన రాజేశ్వరుఁడు. పెద్దబావగారికి ముగ్గురు కూఁతుండ్రు. రెండవయాయన కొక కుమారుఁడు పెద్దాయన యన్నవస్త్రములకు గలవాఁడు. అందుకని యింటిలో నల్లరియే యాయనది. పైగా నాయన మొనకసురుమనిసి.

ఒకనాఁడు కూరలేదని సూర్యనారాయణగారు 'ఆములు ధూములు' చేయుచుండఁగా ధర్మారావునకుఁ బట్టరానంత కోపము వచ్చి "ఏమిటి? ఎవరి అమ్మమగనిసొమ్మో యిచట నున్నట్లు పగులఁబడి పోయెదరు! తిండిలేక మా నాయనగారు 'నానాయిబ్బందులు' పడుచుండఁగాఁ దిరిగిచూచిన దిక్కులేదు. వీరందరు నిపుడువచ్చి నా నెత్తిన నెక్కిరి. వీరి కెక్కడనుండి తెచ్చి పెట్టవలె"నని రుంజుకొనెను. "తిండిలేని వెధవ కింత యదరుపాటు ఏల" నని యాయన విదలించెను. "ఏ వెధవయు నాకుఁ బెట్టలే"దని ధర్మారా వనెను. దానితో సూర్యనారాయణ నిప్పులు త్రొక్కిన క్రోఁతియయి, నిలువెల్ల మండిపోయి, చచ్చినవారిని బ్రతికియున్నవారిని వందలు తిట్టి యా సాయంతనము పిల్లలతో సుబ్బన్నపేఁట వదలివెళ్ళెను.

తేపు త్రైపక్షికము పెట్టవలయును. అంతవఱకుఁ బినతండ్రి కొడుకుల వద్దను, నచ్చటచ్చట బదులుతెచ్చిన వస్తువులతో నిల్లు గడచెను. తర్వాత దమ్మిడీ పుట్టలేదు. త్రైపక్షిక మెట్లుజరుగునో

ధర్మారావునకుఁ దోఁచినదికాదు. కర్మకుఁ బంపించిన దేమో తప్ప జమీందారుగారు మఱల మాటాడలేదు. ఋణదాతలు తండ్రిని వదలి కొడుకును బట్టిరి.

ధర్మారావు మఱల జమీందారును జూడవలె ననుకొనెను. అతనికిఁ బదుమూఁడేండ్లు వచ్చువఱకు మహారాజువలెఁ బెరిగెను. చిన్నప్పటినుండి తాను ధనవంతుఁడ నను నూహతోనే పెరిగెను. తండ్రి స్వాతంత్ర్యము, గౌరవము, ఉదారత, వితరణము, కోపము, అహంకారము, సర్వగుణములు ధర్మారావులో నచ్చుగ్రుద్దినట్లు ప్రతిబింబించెను. ఒకరిని బోయి నోరువిడిచి యడుగలేఁడు. ఇప్పటి తన యసమర్థత తలఁచుకొని తన్నుఁదానే నిందించుకొనును. ఇంట నవి లే వివి లే వను తల్లిమీఁద నాగ్రహపడును.

చివరకుఁ బ్రాణములు బ్రెంచుకొని యానాఁడు సాయంవేళ జమీందారుగారి దర్శనముచేయుటకు వెళ్ళెను. కోటలోనికిఁ బోయి నంతనే ముందుగల పెద్దహాలులో రంగారావుగారు పెద్దసోఫామీఁదఁ గూర్చుండియుండెను. ఆయన ధర్మారావును జూచినంతనే మొగము గంటుపెట్టుకొని మొగ మతనినుండి వేఱుదిక్కునకుఁ ద్రిప్పెను. ధర్మారావునకుఁ గొరడాతో చఱ్ఱున నంటించినట్లయ్యెను. వెంటనే వెనుకకుఁ దిరిగిపో బుద్ధిపుట్టెను.

కాని యింటికిఁ బోయి యేమిచేయును? ధనవంతులు తమ పిల్లలను జాలచెడ్డగాఁ బెంచెదరు. చిన్నపుడు ధర్మారావు నెవరి నైనను దరిద్రుఁడా యని తిట్టినచో నతఁ డాపూట నన్నమే తినెడి వాఁడుకాఁడు. అంత యాగర్భశ్రీమంతుని బిడ్డ యట్టిమాటపడునా! రామేశ్వరశాస్త్రిగారి కీ మాత్ర మూహ యున్నచో, ధర్మారావున కంత మిథ్యాగౌరవము ప్రబలెడిది కాదు. వారి సంపద చెడకపోయినచో నట్లు పెరుగుటవలన నష్టమును గనంబడెడిదికాదు. కాని యోడలు బండ్లై యసంభవమైనది సంభవమయ్యెను.

ధర్మారా వట్లే యచట నొక రెండుగడియలు నిలువఁబడి యుండెను. అతని నేమిపనిమీఁద వచ్చితి వని యడిగినవారు లేరు. ఇంతలో నతనియదృష్టమువలనఁ గృష్ణమనాయఁడుగా రచటికి కేదో పనిమీఁద వచ్చెను. ధర్మారా వాయన కెదురుగాఁ బోయెను.

నాయఁడు ధర్మారావు నేమిపనిమీఁద వచ్చితి వని ప్రశ్నించెను. ఏమి పనిమీఁద వచ్చెను! జమీందారునకుఁ దెలియదా! ధనవంతు లకుఁ బేదవారిసంగతు లన్నియుఁ దెలియును. కాని తెలియవు. ధర్మారా వేమియు మాటాడలేదు. మఱలఁ గొంత యాఁగి నాయఁడు 'పని యేమిటి' అని యడిగెను. ధర్మారావు సగము చచ్చి 'తేప నాయనగారి మాసికము' అనెను. నాయఁడు గుమాస్తాను బిలచి ధర్మారావునకుఁ బదిరూపాయ లిమ్మని చెప్పి తాను చనెను. రంగా రావుగా రిది యంతయు వినుచునే యూరకుండెను. గుమాస్తా పది రూపాయలు తెచ్చి యీఁబోఁగా రంగారావుగారు "ఏమయ్యా! మాసికానికిఁ బదిరూపాయల ఖర్చన్నదా" యనెను. గుమాస్తా 'అక్కఱలేదండి' యని జవాబుచెప్పెను. ధర్మారావుచేతి లోనికిఁ జివరకు వచ్చినది యాఱురూపాయలు. అవి కూడఁ బుచ్చుకొన కుండఁ బోవలె నని ధర్మారా వనుకొనెను. తానైన మాఁడును. తండ్రిమాసికము చెడిపోవును. కొడుకై పుట్టినందుకుఁ దా నిదా తండ్రికిఁ జేసిన యుపకారము. తన యభిమానము నష్టమైనను తండ్రి కర్మకు లోపము జరుగరాదని యాఱురూపాయలు గ్రహించి గంటకు ముందు వచ్చిన తనలోఁదాను సగమై యింటికి నడచెను.

త్రైపక్షికము గడచినది. మాసికముగడచినది. ఇల్లు గడచుట లేదు. ఋణబాధ యెక్కువైనది. తెగఁబడి యేమి చేయుటకును జిన్నఁదనము. ఒకనాఁడు కూర్చుండి వలపోసివలపోసి ధర్మారావు తన కథయంతయు నొక పెద్ద యుత్తరము వ్రాసి కృష్ణమనాయనికిఁ బంపించెను.

"మహారాజరాజశ్రీ మన్నెసుల్తాన్ సుబ్బన్నపేట పరగణా జమీందారులు, మహాప్రభువులు, కృష్ణమనాయనింగారు జమీం దారుగారి సమ్ముఖమునకు రామేశ్వరశాస్త్రిగారి కుమారుఁడు ధర్మా రావు వ్రాసికొన్న విన్నపములు.

అయ్యా!

మా నాయనగారికిని దమకును గల స్నేహము, ప్రేమయుఁ బ్రత్యక్షముగాఁ గాకపోయినను గథారూపముగనైన నేను వినియుండు టచే మాయందు మీకుఁ బక్షపాతము తప్పక యుండునని తలఁచి

యిది వ్రాయుచుంటిని. మా నాయనగారు మరణించినపుడు తమరు చేసిన సాహాయ్యమును, తమరి యౌదార్యమును నే నెన్నటికిని మఱవఁజాలను. మా నాయనగారి యశస్సుగాని, వారి దివ్యగుణములుగాని నే నిచ్చట వ్రాసి యేమియు లాభములేదు. అది యంతయు గతజలసేతుబంధనము. అట్టివారే వారు చివరదినములలో నెన్నోకష్టములు పడఁగా నేను పడుటలో నాశ్చర్యములేదు. ఆయనచేసిన ఋణములవలన నే నేల బాధపడవలయునో తెలియరాదు. అవును. వారు ధనము సంపాదించిపోయినచో నే నది యనుభవించియుండనా? అట్లే వారి ఋణముల ననుభవించవలయును. కాని నేను చిన్నవాఁడను. వారు నా రనుకొనినమాటలనుండి చూచినను, మాకుఁగల యాస్తికిని, నప్పునకును సరిపోవునట్లు తోఁచుచున్నది. ఋణదాత లొకఁ డేటికిఁదీసిన నొకఁడు కోటికిఁ దీయుచున్నారే కాని న న్నీ ఋణమునుండి బయటఁబడనిచ్చునట్లు లేదు.

ఒకవేళ బయటఁబడినను తరువాత బ్రతుకుతెఱ వేదియుఁ గాన్పించుటలేదు. బ్రతికినన్నాళ్లు మహాసంపద ననుభవించి యీ రోజులలో నిర్దయవిధిచేఁ గష్టజలధి ముంపఁబడిన మజ్జననీదుఃఖము కనులారఁ జూచి భరించుటకు నాది ఱాతిగుండెయేమోమా! ఈ కష్టములకుఁ దుది యెప్పుడో!

ఈ యూరికి మీరును, మేమును బూర్వుల మని చెప్పుదురు. మా పూర్వులే మిమ్ముఁదెచ్చి యిచ్చట నిలిపిరనికూడఁ బలుకుదురు. అదియెంతవఱకు నిజమో తెలియదు. అది నిజమే యయినయెడల మీ వంశమునకును మా వంశమునకును త్రెంచరాని బంధ మొకఁడు కలదు. అందుచేత నయినను మీరు నాయందు దయ చూపించవచ్చును.

నాకుఁ దెలిసినంతవఱకు మా పూర్వులు మిమ్ము యాచించలేదు. ఆ దుర్దశ నాకుఁ బట్టినది. ఇదికూడ మీకు దయాహేతువు కావచ్చునని మనవి.''

ఈ యుత్తరము వ్రాసి కోటలో నొకకాసావాని కిచ్చి పంపించెను. కాని యా నాఁటిరాత్రియంతయు ధర్మారావు చెప్పరానంత చిత్తసంక్షోభము పడెను. ''ఛీ! వారి యంతవారు వారు. మాయంత

వారము మేము. వారికి నే నేల ప్రాధేయపడవలెను? రానున్నకష్టములు రాకమానవు. చచ్చినచో దెజ్జెను. సాటివారికడ నీ నైచ్యమున కేలఁ జొరఁబడవలయు" అని యొకసారి; "కానిరోజులలో గర్వపడరాదు. పడి యెవరిని సాధింతుము? ఒకవేళఁ దిండిలేక చచ్చి యేమి చేయుదుము? శరీర మున్నఁగదా యేదైనను చేయుట" అని యొకసారి; "కృష్ణమనాయనియొద్ద తాను మనవి చేసుకొనుట కిది మొదటి సారియా? మొన్న నాఱురూపాయలు తేలేదా? తండ్రికర్మకు ధన మాయన వద్ద పుచ్చుకొనలేదా" అనియు; "తండ్రికర్మ కాయనయే యిచ్చెను. నేను యాచించలేదు. మాసికమునకు యాచించితినా? లేదు. పోయి యూరకే చెప్పితిని. ఆయనయే యిచ్చెను" అనియుఁ బరిపరివిధముల నాలోచించెను. చివర కెట్లయినను తనయుత్తరము వ్రాయుట చేయరాదనియే నిర్ణయించి, తన యట్టియుత్తరమువలన దన పూర్వుల గౌరవము పోవుననియే నిశ్చయించెను. ఎప్పుడు తెల్లవాఱునా, యెప్పుడుపోయి యా కాసావాని నడిగి యాయుత్తరము తీసికొందునా యని మిగిలినరాత్రి కడపెను. ఆరాత్రియే యతఁ డుత్తరము రాజునకిచ్చునేమో యని దిగులుపడెను.

ఈ యాలోచనాపరంపరలోఁ గోళ్ళు కూసెను. మెడలు నిక్కించి దేహములు దీర్ఘీకరించి, కనులలో ధార్ష్ట్యము గోచరించఁగా గర్వోక్తి వోనిమాంతలు కుక్కుటములు కూసెను. ఎందుకులే యింతగర్వమని తమలోఁదామె యవియు ననుకొన్నట్లు ఱెక్కలు తపతప కొట్టుకొనెను. గర్వము లహంకారములు, సుఖములు దుఃఖములు, సంపదలు లేములు–సర్వమునకు యుగములుగా సాక్షీభూతురాలు సనాతని యుషస్సు ప్రజ్వలించెను.

ధర్మారావు లేచి కాల్యకృత్యములు నిర్వర్తించి యా కాసావాని యింటికిఁబోయి 'యుత్తరమిచ్చితివా' యని యడిగెను. వాఁ డీయలే దనెను. ఒకసారి యిటుతెమ్మని యడిగి పుచ్చుకొని ధర్మారా వది వాఁడు చూచుచుండఁగనే చింపివేసెను. కాసావాఁడు నివ్వెఱపడెను. 'ఏల నట్లు చింపివేసితి' రని యడిగెను. ధర్మారావు 'గోపా! కృష్ణమనాయఁడుగారు చాల యుదారులు. నిజమే. నా పూర్వు లెవరు నాయనను యాచించలేదు. నే నేల యాచించవల

యును?' అనెను. గోపన్న మాటాడలేదు. తిరిగి యింటికిఁబోవు ధర్మారావు తన్నుఁజూచి ప్రతివారు నవ్వుచున్నా రనుకొనెను.

ఆనాఁ డంతయు ధర్మారాయని ప్రవర్తన చిత్రవిచిత్రముగా నుండెను. తనయాపద గట్టెక్కఁబోయినట్లును, దానిని తానే వలదన్నట్లును, దానికిఁ దాను చాల చింతించుచున్నట్లును, కాదు-తాను చేసినది బాగుగానేయున్నదని సమాధానము చెప్పుకొనుచున్నట్లును బరిపరివిధములఁ దనలోఁదాను గుడుసులువడుచున్న యతని నతని తల్లిచూచి కారణము తెలియక గగ్గోలుపడెను.

మఱలఁ బదిరోజులు గడచెను. ఇంటికి వచ్చెను. తల్లి 'నాయనా బియ్యము లేవురా' యనును. దారిద్ర్యదేవత యతని యభిమానమునుజూచి పరిహసించిన ట్లుండును. ఎవరినోపోయి రెండు రూక లప్పడుగును. వారు తేపుమాపని త్రిప్పి చివరకు లేదందురు. దారిద్ర్యదేవత యతనిని జూచి వికృతహాసముచేసిన ట్లుండును. తల్లి యీబాధ పడలేక 'తండ్రీ! పోయి జమీందారుగారి నడుగుము. ఏదైన నిచ్చునేమో' యనును. దారిద్ర్యదేవత పకాలునఁ బగులఁబడి నవ్వును. ధర్మారావునకుఁ దనగుండెలోఁ బెద్ద యేడుపు వినఁబడును. అది యెవరికి వినఁబడలే దని తెలిసికొని సంతోషించును.

గోపన్న కఱువదియేండ్లు. ముప్పదియేండ్లకుఁబూర్వ మొకసారి రాణిగారుస్నానముచేయుచు మెడలోఁ జంద్రహారము స్నానపుగది గోడవంకెకుఁ దగిలించెను. గోపన్న దారినిబోవుచు నాశచేతఁ ద్రొటుపడి యది సంగ్రహించెను. వస్తువు పోయిన దని దాసీవాండ్రను, కాసావాండ్రను విచారించఁగా గోపన్న పట్టుపడెను. కృష్ణమనాయఁడు గోపన్నను కోట వెడలనడచెను. వాఁడు వచ్చి రామేశ్వరశాస్త్రిగారిని ఆశ్రయించఁగా శాస్త్రిగారు వానిని మఱలఁ గోటలోఁ బ్రవేశపెట్టించిరి. వాఁ డప్పటినుండియు శాస్త్రిగారి యెడలఁ గృతజ్ఞత కలిగియుండును. అప్పుడప్పుడు శాస్త్రిగారివద్దకు వెళ్ళి కొన్నికొన్ని మంచిసంగతులు నేర్చుకొని పోవుచుండును. మనిషి సహజముగా మంచివాఁ డగుటచేతఁ గ్రమముగా వానికి భక్తిప్రపత్తులు బలిసినవి. వాఁడు నిత్యము రెండుదేవాలయములకును బోయి భగవద్దర్శనము చేయును. కృష్ణమనాయఁడు పెద్దవాఁడయిన

తరువాత నాయనకు గోపన్నమీఁద ననురాగము మెండయ్యెను. వాఁ డెప్పుడును పురాణకథలు, భక్తిమాటలు చెప్పుచుండును.

ఒకరోజున ముసలిజమీందారు స్నానముచేసిన తరువాత గోపన్న యాయనకుఁ దిలకము దిద్దుచుఁ ధర్మారావుత్తరము దెచ్చుట, మఱునాఁడు వచ్చి తానే యది చింపివేయుట, యేల చింపితి వనఁగా నతఁడు చెప్పిన సమాధానములన్నియు జమీందారుతోఁజెప్పి 'యెంతవారి కెంతయిక్కట్టు వచ్చినది? ఇంగువకట్టిన గుడ్డవాసన యెక్కడికిఁ బోవును? పులికడుపున మేఁక పుట్టునా! వారి వంశములోఁ దక్కువవాఁ డేల పుట్టును?' అని వ్యాఖ్యానము చేసెను.

జమీందారుగారు భోజనము చేయుచుండెను. వడ్డన గోపన్న. ఆ రోజునఁ బదార్థము లన్నియు మిక్కిలి రుచ్యములుగా నుండెను. రాజు ఆప్యాయముగా భోజనముచేయుచుండెను. గోపన్న జమీందారునింగితము గ్రహించి వడ్డించుచు మధ్యమధ్య ధర్మారాయని ప్రస్తావన చేయుచుండెను. "అవును. పాపము. రామేశ్వరశాస్త్రిగారేమి దుర్వ్యయము చేసిరా! అడుగనివానిది పాపము; అట్లిచ్చిరి. ఆయనసొమ్ము తిరువారే ఆయనకుఁ జేఁదైరి. 'త్రాగిన అమ్మే గ్రుద్దుమురా' యన్నట్లున్నది. నాగన్నసెట్టి శాస్త్రిగారిసొమ్మెఱుఁగఁడా! శ్రీరాము లసలే యెఱుఁగడు పాపము. నేఁటి కందఱును మొనగాండ్రయి యాయన సంసారమును కుదుటఁబడనీయుట లేదు."

జమీందారుగారు చేయి కడిగి, తన కట్టుబట్టతోఁ దుడిచి వెనుక వసారాలో గుర్చీమీఁద జమీందారుగారు కూర్చుండఁగా దమలపాకు లందిచ్చుచు గోపన్న మఱల సాఁగించెను: "తమరు ధర్మారావుగారి కేదో దారి చూపించకపోయినచో నా కుఱ్ఱాయన యే మగును? ఆయన చెడిపోవుట మనకు మాత్రము క్షేమమా? మీరు, వారు, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, గణాచారి మీ రందఱు నొకటే నని జనము చెప్పుకొందురు. మీలో మీకుఁ దగాదాలు రారాదు. ఇంటిలోఁ గొందఱకుఁ జెడిపోయినచోఁ దక్కినవారికిఁ బొత్తు కలసియుండునా? వారికి మీరు సాయపడుట భగవంతునకుఁ గూడ నిష్టమైన సంగతి."

జమీందారుగారు తూఁగుటుయ్యెలమీఁదఁ బండుకొనిరి. గోపన్న యూఁచుచుండెను. జమీందారుగారు "గోపా! ధర్మయ్య చాల యందమైనవాఁడు రా!" యనెను. గోపన్న మొదలిడెను. "అంద మేమిటి బాబుగారు! ఆయన మొగము చూచినచో నిత్య మల్లెలు రెక్కవిడిచిన ట్లుండును. నాకుమాత్రము సుబ్రహ్మణ్యేశ్వర స్వామి యీయనఁగా నవతరించె ననిపించును. ఆ బక్కపలుచని మనిషి, నిగనిగలాడు శరీరము, కోసలైన కన్నులు, తెలివి కొట్ట వచ్చిన ట్లుండు మొగము - నంద మనఁగా నాయనదే యందము. ఏ మయిన నేమి? సముద్రా లెండిపోయి చెఱువు లయినట్లు నేఁటికి పరిస్థితి యిట్లు వచ్చినది. ఒకరికిఁబెట్టినవారేగాని లేదన్నవారు కాదు."

అది మాఘమాసము. నాగన్నసెట్టి కుమారుని పెండ్లి తల పెట్టెను. 'సన్యాసివానిపెండ్లికి జుట్టువద్దనుంచి యఱవే' యన్నట్లు నెలజీతమువాఁడును, వర్తకుఁడును సర్వము భూస్వామినుండియే తెచ్చుకోవలెను. పెండ్లిపందిరికి తాటియాకులు, ఊరేగుటకు నేనుఁగు, నింక నెన్నో సెట్టి జమీందారుగారి నడిగి తెచ్చుకోవలసివచ్చెను. దశమినాఁడు పెండ్లి. విదియనాఁడు సెట్టి ప్రభువువద్దకుఁ జనెను. సాయంతనము ప్రొద్దువాటారినవేళ కృష్ణమనాయఁడు లొట్టిపిట్టలను, నేనుఁగులను తనిఖీ చూచుచుండెను. సెట్టి వెళ్ళి నమస్కరించి నాయఁడు త న్నేమి పనిమీఁద వచ్చితి వని యడుగునేమో యని యెదురుచూచుచుండెను. నాయఁడు "సెట్టిగారూ ! చూచితిరా ! ఈ లొట్టిపిట్టలు నా కెన్నాళ్ళు చూచినను వింతగా నుండును. మృగ ములలో నివియు, పురుగులలో గడ్డిపురుగులును విచిత్రమైన సృష్టి. తలకు మొండెమునకు సంబంధములేనట్లు పొడుగైనకాళ్ళు, మొండె మునకుఁ దలకు సంబంధము లేనట్లు పొడుగైన మెడ?

సెట్టి—చిత్తము, చిత్తము.

ప్రభు వే మన్నాఁడో సెట్టికిఁ దెలియలేదు. సెట్టికి నధికమాస ములు, తిరుగువడ్డీలు, తిథిద్వయాలు తెలిసినంత యింక మ రేమియుఁ దెలియవు. నాయని మనస్సులో నున్న సౌకుమార్యము సెట్టికిఁ గొన్ని తరములుగా లేనిది యెచటినుండి వచ్చును ? అందుకని 'చిత్తము'తో సరిపెట్టెను.

నాయఁడు——రామేశ్వరశాస్త్రిగారు నీ కెంత బాకీ అయ్యా!

సెట్టి——పాతికవే లండి.

నాయఁడు——వారి యిల్లు, దొడ్లు వెల యెంతచేయును?

సెట్టి——చిత్తము. చిత్తము.

నాయఁడు——శాస్త్రిగారికి మిగతబాకీ లేమాత్ర ముండును?

సెట్టి——ఇంకొక పాతికవేలయిన నుండునండి.

నాయఁడు——సరేగాని తక్కినవారందరిని జేపు నాదగ్గఱకు తీసికొనిరా! ఏదోవిధముగా తీర్మానము చేయవలె. పాప మాకుఱ్ఱా యన చాల బాధపడుచున్నాఁడు.

సెట్టి——చిత్తము. చిత్తము.

జమీందారుగారు కొంతసేపు గుఱ్ఱాలసాల దగ్గఱకూడ నిలుచుండి యంతఃపురములోనికిఁ బ్రోవఁదీసెను. ఇంక దొర మఱలబయటకురాఁడని సెట్టికిఁ దెలియును. అందుచేతఁ జేతులు నలుపుకొనుచుఁ 'దమతోఁ బనియుండి వచ్చితి'నని మనవిచేసెను. దొర 'జేపు వారిని తీసికొనిరండి. తరువాతఁ బనియేమో చూడవచ్చు' ననెను. సెట్టికి కృష్ణమనాయని తత్త్వము బాగుగాఁ దెలియును. ఆయన పట్టినపట్టు నెగ్గినఁగాని వేఱేపని యాయనచేతఁ జేయించరాదు. తన కుమారుని పెండ్లికి నేనుఁగుమీఁద నూరేగింపు తప్పకుండ జరుగవలెనని యింట నందఱికి బట్టింపుగా నున్నది. ఈ పనిచేయకుండ రాజేట్లును ఏనుఁగు నీయఁడు. పైఁగా బాధపెట్టినందువలన శాస్త్రిగారి యాస్తినుండి ఎక్కువ వచ్చునదియు నేమియు లేదు. అందుచేత నా మఱునాఁడు తక్కిన ఋణదాతల నందఱను గలుపుకొని నాయనివద్దకుఁ జనెను. తక్కినవారును నెక్కువయప్పుపెట్టినసెట్టియే యొప్పుకొనఁగా దమ కేమనియు, జమీందారునకుఁ గోపమురావచ్చుననియు నొప్పుకొనిరి.

నాయఁ డూరికరణమును బిలిపించి శాస్త్రిగారి యాస్తివయన మంతయుఁ గనుఁగొని ఋణదాతల కందఱకు నాస్తిని విభాగించి మూఁడుదినములలో వ్యవహార మంతయు కుదిర్చెను. బాకీక్రింద నాస్తియంతయు సరిపోయెను. కాని జమీందారుగారికి ధర్మారావున కిల్లు మిగుల్చవలెనని యున్నది. అందులో నొక ఋణదాత దానికి నొప్పుకొన్నాఁడు కాదు. జమీందారు దానికే యొప్పుకొనక తప్పి

నది కాదు. కాగితములు వ్రాసి మఱునాఁడు రిజిష్టరు చేయవలసినదిగా నిర్ణయించువఱకును ధర్మారావున కీ సంగతి తెలియదు. నాయఁడత నికి మఱునాఁడు రిజిష్టరు చేయవలెననియుఁ, గచేరీకి ధర్మారావు వెళ్ళవలెననియుఁ గబురంపెను.

ధర్మారావున కీ వార్త యెడారిలోఁ దృషితుఁడైనవానికి నారికేళాంబువులు లభించిన ట్లయ్యెను. ఆరాత్రి తల్లియు, గొడుకును కృష్ణమనాయని పొగడుటతోడనే సరిపోయినది. రాత్రి నిదురించు వేళకు ధర్మారావునకు నిదురపట్టలేదు. మాటిమాటికి మనస్సు జమీందారుగారి యౌదార్యముమీఁదికే పోవును. పోఁగాఁబోఁగా, సూహాసోపానములు కట్టఁగాగట్టఁగా నొకసోపానముమీఁద గోపన్న గోచరించెను. అతనినిజూచినవెంటనే రాజుమీఁదఁగల గౌరవ మంతయుఁ బోయి యతనిమీఁద వ్రాలెను. ధర్మారావు గోపన్న చుట్టును కథయంతయుఁ జక్కఁగా నతికెను. అది సరిపోయినది. గోపన్నయెడల నతనిమనస్సు కృతజ్ఞతామయమైపోయెను. నాల్గు నెలల కా నాఁడు ధర్మారావు సుఖముగా నిద్రించెను. మఱునాఁడు తెల్లవారినది. తెల్లవారకముందే ధర్మారావు గోపన్నయింటికిఁ బోయి యరుగుమీఁద గూర్చుండెను. గోపన్న నిద్రలేచివచ్చి యతనినిఁజూచి "యేమిబాబు! ఇంతపెందలకడ వచ్చితి"వని యడిగెను.

ధర్మారావు "గోపా! నీఋణము నేను తీర్చుకొనలేను. నిజ ముగా నీవు చేసినంతపని నా యుత్తరము చేయలేదు. నీకు నా కృత జ్ఞతఁ దెలుపుటకు వచ్చినా" ననెను. గోపన్న "అయ్యా! మీరు గొప్పయింటి బిడ్డలు. నన్ను గుఱించి యట్లనరాదు. నేను మీ కేమైన నను చేసినను మీనాయనగారు నాకుఁ జేసినదానిలో నిది యేమూల" నని చెప్పెను.

తరువాత నది యిది మాటాడి ధర్మారావు గృహాభిముఖుఁ డయ్యెను. ఆ వేళకు సూర్యోదయ మయ్యెను.

దినలక్ష్మి మొగమున మందహాస మంకురించినట్లు, లేఁత యెండలు జ్యోతీరేఖాలవాభిరామముగ నలికినయింట ముగ్గులు పెట్టి నట్లు, కలంకారియద్దకము చీర కెక్కించిన కరకాయరంగు పిఱిచి నట్లు, హృదయమునఁ దోఁచిన యానందము విచిత్రముగా ముఖరేఖ

లావరించినట్లు, సుబ్బన్నపేట వీధులందు రోదోభాగమున విస్త రిల్లెను. దేవిడీముందర నగారా మ్రోఁతలు చెవులకు మనోహరముగా వినవచ్చెను. కోటలోపలి పెంపుడు నెమిలి పురివిప్పి పిచ్చిది, నగారా మ్రోఁతలు మొయిళ్ళ యేఁతయురుము లనుకొన్నది కాఁబోలు, తాండవించుచున్నది. ద్వారబంధమున కాపుండు పెద్దకాఁపు నీరుకావి ధోవతులు కట్టుకొని మొగమునఁ దిరుమణి తిరుచూర్ణము పెట్టుకొని రాజు ప్రసన్నతవలెఁ దోఁచెను. నాఁటిరాత్రి కృష్ణమనాయనికిఁ గల వచ్చెను. కలలో సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ప్రసన్నదృక్కులతోఁ దన్నుఁజూచుచుఁ దసమంచమువద్ద తోఁకమీఁద నిలఁబడియుండెను. రాజు మెలఁకువవచ్చినతరువాతఁ గలనుగూర్చి విచారించెను.

భగవంతునకుఁ బ్రియమైన పనిచేసినప్పుడు ప్రసన్నాకృతి తోడను, నతని కప్రియమైన పనిచేసినచో బుస్సలు కొట్టుచుఁ, బర వళ్ళు త్రొక్కుచు సుబ్రహ్మణ్యస్వామి కలలోఁ గనఁబడుట వారికి వంశపారంపర్యముగ వచ్చుచున్నదే. కృష్ణమనాయనికీ రీతి ప్రసన్నా కృతితో స్వామి కన్పించుట కిది రెండవసారి. మొదటిసారి యాఱేండ్లు రామేశ్వరశాస్త్రియుఁ దానును మాటాడకుండ చివరకుఁ గలసిన రోజున. నాయఁడును మనసులోఁ జాల సంతసించెను.

మఱునాఁడు సాయంకాలమునఁ గృష్ణమనాయఁడు దేవాలయ ములకు స్వామిదర్శనమునకు వెళ్ళెను. అచ్చట ధర్మారావు కనఁ బడెను. ఇద్దఱును గలసి స్వామిదర్శనముచేసిరి. నాగేశ్వరస్వామి యాలయములోనికి మొదటఁ బోయిరి. ఆలయము ప్రదక్షిణముచేసి గుడిలోనికిఁ బోయి గంటవాయించి నిలఁబడిరి. లింగమూర్తి బంగా రఁపుఁ బాణవట్టములో నర్చనచేసిన మారేడుదళములు మాళిపై మరకతకాంతులు వెదఁజల్లఁగాఁ దనంత ధనవంతుడు లేనట్లు కలకల లాడెను. 'అబ్బో! యీస్వామి కత యెవరికిఁ దెలియదు? నిన్నదాఁక గర్భదరిద్రుఁడు. నేఁడు సుబ్బన్నపేట జమీఁదారుల యాశ్రయ మున, రామేశ్వరశాస్త్రి యిచ్చినయలంకారములతో ముఁగియు చున్నాఁడు గాని.' దేవీదర్శనముకూడఁ జేసినతరువాత నర్చకుఁడు మద్రిపాదములు తెచ్చెను. తెచ్చి మొదట ప్రభువున కీయఁబోయెను. ప్రభువు పుచ్చుకొనక తొలఁగి యర్చకునివంకఁ గొంచెము తీక్ష్ణ

ముగాఁ జూచెను. అర్చకుఁడు వినయముతో ధర్మారావునకు రుద్ర పాదము లిచ్చెను. తరువాతఁ బ్రభువు స్వీకరించెను. శుక్రవారపుఁ గుంకుమపూజ కొద్దిగా జాటి యమ్మవారు మందహాసము చేసినట్లు కనిపించెను. విభూతియు, మారేడుదళమును నందీశ్వరుని శిరస్సున నుంచి, ముఖమంటపమునఁ గొంత విశ్రమించి ధ్వజస్తంభముకడకు వచ్చిరి.

శుక్లాష్టమి వెన్నెల. శివజటాటవీనటన్మందాకినీనవస్మేరవీచీ రామణీయకమువలె, నంబికాప్రసన్నాపాంగరేఖాప్రసారమువోలె, విఘ్ననాయకుని యేకదంతసితచ్ఛటాస్వచ్ఛతంబోలె శైవమాహాత్మ్యమయమై విరిసెను.

ఆ వెన్నెలలో ధ్వజస్తంభమునకున్న బంగారపు తొడుగు దగదగలాడి శివసన్నిధానమునఁ బ్రజ్వలించుచున్న రామేశ్వర శాస్త్రి భక్తివలెఁ గృష్ణమనాయనికి మనస్సులో నాడి పులకెత్తించెను.

తరువాత సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి యాలయమునకుఁ బోయిరి. రాజునకు స్వామి రాత్రికలలోఁగన్పించినటుగా నే తోఁచెను. ఒక ధర్మముమీఁద వేయిసంస్థలు వెలసినట్లు స్వామి యేకశరీరముపై సహస్రశిరస్సులు ప్రకాశించెను. నిర్వీచియైన క్షీరసాగరమున శయనించిన యాదినారాయణుని మోయుచున్నట్లు స్వామి శిరస్సులు నిశ్చలము లయ్యెను, గించిచ్చలితములట్లుగాఁ దన్మయత్వములోని సుఖచాలనము సూచించుచుండెను.

ధర్మము తదాచరణ ప్రచారములు మూఁడును నొకటిగానై యభేదతాదాత్మ్యము పొందునటులు స్వామియుఁ, బ్రభువును, ధర్మారావును నేకదేశగతులై ప్రకాశించిరి. అదియేమో తరములనాఁటి త్రెంచరానిసంబంధము ముగ్వురును మనసా యనుభవించిరి. ఆ నాఁటితో వారి యా సంబంధము క్రొత్తముళ్లువేసికొన్న ట్లయినది.

ప్రతినిమేషము ప్రభువున కీ యనుభూతి కలుగుచునేయున్నది. ఆయన యాత్మలో నొక యనిర్వచనీయమైన విజ్ఞానతరంగ మూఁగులాడుచు నాఁటి సాయంకాలమున నతని కేదో యొక క్రొత్తజన్మ మెత్తినట్లు తోఁచినది. ఆ యనుభూతి యాయన హృదయాంత

రాంతరములఁ జొచ్చి యందుఁ దనకు స్వామికి, ధర్మారావునకు నెడములేని యొకకలయిక భాసించి నిమీలితనేత్రుఁడై యాయన యట్లే నిలఁబడెను.

అచ్చటనుండి వేణుగోపాలస్వామివారియాలయమునకుఁ జనిరి. తొలుతఁబాదప్రక్షాళనమునకై యాలయసరఃప్రదేశమునకుఁబోయిరి. చలువఱాతిమెట్లు దిగుచున్న నాయనికి రామేశ్వరశాస్త్రి యశః ప్రత్యగ్రత మనసులోనికిఁ దఱుముకొనివచ్చెను. ప్రదక్షిణీకరించి ఆలయములోనికిఁబోయి గంట వాయించిరి. ఆ యూరి జమీందారులకు వేణుగోపాలస్వామి యిలవేల్పు. స్వామిమీఁద గొన్ని ప్రత్యేక ప్రార్థనాశ్లోకములు వా రందఱికిని వచ్చును. రా జవి యన్నియు నేకరువు పెట్టెను. స్వామిసన్నిధి నదివఱకు మినుకు మినుకు మను చున్న దీపమును అర్చకుఁడు వత్తిమొగసనఁద్రోసి ప్రజ్వలింపఁజేసెను. స్వామి బంగారపు మైమఱువు ధగధగలాడిపోయెను. ఆహా! రామే శ్వరశాస్త్రి బంగారపు మైమఱువు నాకృతిఁ దాల్చి స్వామిశరీరము నంటియే యుండెను. తానే భగవంతునినుండి వేఱైయున్నది. ధర్మా రావు 'మందం మందం' పఠించెను.

స్వామి విగ్రహము మనిసియంత యెత్తు గలది. నిత్యము నర్చకుఁడు రాయుచున్న నూనెచేతఁ దడిసి మైమఱు వెడమిచ్చిన తావుల స్వామిశరీరము ప్రావృషేణ్యనీలజలదస్నిగ్ధచ్ఛాయాముగ్ధమై క్రొత్తకాటుకకాంతులు విరియఁజల్లుచుండెను. స్వామి ముఖకమల మున నంటించిన రజతమాణిక్యమయమైన యూర్ధ్వపుండ్రములు గోలోకద్వారమువలె స్వామివంక బొమలుముడిచి పరిహాసముగాఁ జూచుచున్న రాధికాదేవి ద్విభ్రూమధ్యగతత్రిరేఖాకృతి భక్తలోక మున ఆహ్లాదిని యయ్యెను. వ్యత్యస్తపాదారవిందుఁడై వేణువు వాయించుచున్నట్లు చేయించిన దామూర్తి. ప్రక్కను సత్యభామా దేవి శృంగారమయమూర్తి కుడిచేత విలాసకమలము ధరించి పొంది కగా స్వామి నత్తుకొనియుండెను.

ధర్మారావు గొంతుక వీణానిక్వణమువంటిది. నిశ యరజాము గడచి వేళ శాంతమై యుండెను.

'మందం మందం మధురనినదైః వేణు మాపూరయంతం'
అతని గొంతుకలోని మధురనినాదములచేతనే స్వామి వేణువు పూరించుచున్నట్లుండెను. ధర్మారావునుండి నిర్గతములైన యా మధురస్వనములు స్వామి వేణువునుండి వినిర్గమించినట్లు నిస్తబ్ధవాయువీచీనిశ్చలడోలాగ్రగతుఁడై సుఖనిద్ర చెందుపసిపాపనిశ్వాసపవనము వలె ననరుమిాయమానచలనములై యుండెను. స్వామి వేణువు పూరించుచుండెను.

'బృందం బృందావనభువి గవాం చారయంతం చరంతం'
వేణుగానప్రవాహమధ్యమునఁ దండ్రి భక్తలోకము నూఁగించుటయే కాదు, తానుకూడ నూఁగిపోవుచుండెను.

"ఛందోభాగే శతమఖమఖధ్వంసినాం దానవానాంహంతారం"
ఓహో! ఏమి వేణునిస్వానములు, వేదశిఖ లూఁదుచున్నవి. వేదమయమైన యా ధ్వని బృందాచతురాశాపరివ్యాప్తిచే గోపికాసతీచతురాశాపరివ్యాప్తిహేతు వయ్యెను.

'తం కథయ రసనే! గోపకన్యాభుజంగం'
ఏమి లీలామానుషవిగ్రహుఁడు! వేదములమధ్య నిప్పుడేకదా శతమఖమఖధ్వంసులైన దానవవధ చేయుచున్నది. అప్పుడే యెప్పుడు వచ్చెను? ఎప్పుడు గోపకన్యావిటమూర్తియయ్యెను? అవు నవును, భుజంగుఁడే! అందుకనియే వేణునిస్వనము లన్న మిషచేత బుస్సలు కొట్టుచున్నాడు. రామేశ్వరశాస్త్రి చేయించిన యడ్డబాస చాటునుండి స్వామిచాపల్యమునకు సత్యభామాదేవి మందహాసములు చేయుచున్నది.

ధ్యానశ్లోకము పూర్తియయినంతనే ధర్మారావున కొడలు తెలిసెను. ప్రభువు తన్ను రెండు చేతులతోఁబట్టుకొని, కన్నులయందు నభూతమైన యొకానొకదీధితి వెలుఁగుచుండఁగా స్వామివంక నట్లే చూచుచుండెను. ధర్మారావు 'బాబుగారూ' యనెను. అతఁడు జమీంందారు నట్లెపుడును బిలువలేదు. జమీంందారు కుఱ్ఱవానిని దగ్గరకు దీసికొని 'బాబూ'యనెను. అర్చకుఁడు శఠగోపమునిచ్చెను. భగవంతుని నాసికాగ్రనిశ్వాసములనుండి యపహరించిన సువాసనలతో నాలయమంతయు గుప్పుమనిపించుచున్న రెండుసంపెంగపూవు

లర్చకుఁడు వారి యిర్వురకుఁ జెరియొకటి నిచ్చెను. అది తమభక్తికి మెచ్చి స్వామియిచ్చిన ప్రసాదమువలె నిర్వురు చూడాలంకారములుగాఁ జేసి బహిరంగణమునకు విచ్చేసిరి. ప్రభువు తన చేతులు ధర్మారావుమీఁదినుంచి తీయనే లేదు. ఇర్వురు విశ్రమించిరి. అర్చకుఁడు పటికబెల్లము ముక్కలు, రెంకుకొబ్బరి ముక్కలు కలిపి ప్రసాదమిచ్చెను. ఇర్వురు నారగించిరి. నాగన్నసెట్టి యింట వివాహము చాలవైభవముతో జరిగెను. పెండ్లి నాలుఁగవ దినమునఁ బెద్దసంగీతసభ జరిగెను. దానికి జమీందారుగారి నాహ్వానించిరి. కృష్ణమనాయఁడు, ధర్మారావును గలిసిపోయిరి. ఇప్పుడు వారిద్దఱు విడిగా నుండుటయే లేదు. సభాంతమున సెట్టి గంధతాంబూలములు తెచ్చి ధర్మారావున కిచ్చి తరువాత జమీందారున కీఁబోయెను. రాజు ఛలోక్తిగా 'నాకు వట్టితాంబూల మెందుకయ్యా!' అనెను. సెట్టి తమరి కేది కావలసిన నదే యిత్తు ననెను. రాజు 'మాటమీఁద నిలచెదవా' యని బిగియలాగెను. ఉత్సాహములో నున్న సెట్టి ముందుకుఁదూఁగెను. నాయఁడు రామేశ్వరశాస్త్రిగారి యిల్లు వదలి పెట్టు మనెను. సెట్టి నివ్వెఱపోయెను. నాయఁడు సెట్టికటపటాయించుట చూచి 'ఎట్లయినను గోమటిబిడ్డ' వనెను. సెట్టికి మఱలఁ బౌరుషము తలచూపి, 'వెనుకకుఁ దీయుట లే' దనెను. నాయఁడు 'ఊరకే యీవలదులే. న్యాయమైన ధర యిచ్చెద' ననెను. బాకీ తీర్చుటలో శాస్త్రిగారి గృహము సెట్టికి వచ్చెను. ధర్మారావును, నతని తల్లియు నింకను నా యింటనే నివసించు చున్నను కొలఁదిదినములలో వదలిపోవలసియున్నది. ధర్మారావున కిప్పటి యీ జమీందారునిమాట లచ్చెరువు తెచ్చెను. ధర్మారావుపేర జమీందారు సెట్టిచేత నిల్లు వ్రాయించి పుచ్చుకొని ఐదువేలరూపాయ లిచ్చెను.

ధర్మారావు స్కూలుఫైనలుపరీక్షకు వెళ్ళి యొకసారి తప్పెను. కుఱ్ఱవాఁడు చాల తెలివిగలవాఁడగుటచేఁ బదునేనేండ్లకే యాఁబవఘారమునకు వచ్చెను. వయసు చాలకపోయినను నుపాధ్యాయ లనుమతి తెప్పించి యతనిని బరీక్షకుఁబంపించిరి. ఇంతలో శాస్త్రిగారివ్యవహారములు చెడెను. ఇంటివద్దనుంచి డబ్బు దసకము సరిగా నందకపోవుటచేతను, శరీరములోఁ గొంచెము జబ్బుచేయుటచేతను ధర్మారావు

పరీక్షలో గెలుపొందలేదు. ఈ సంవత్సరము చదువుటకే వీలులేక పోయెను. మఱల బాఠశాలలు తెఱచినవెంటనే ధర్మారావు చదువం బోయెను. సుబ్బన్నపేటలో వారు వారియింటనే కాపురముచేయు చుండిరి. నెలకుం గావలసినదంతయుం గృష్ణమనాయఁడు పంపించు చుండెను. రోజును నుదయముననే లేచి నాయఁడు ధర్మారావుగారిం టికి వచ్చును. ఇద్దఱును గలసి తోటకుఁబోదురు. తిరిగి భోజనవేళకు వత్తురు. ధర్మారావు భోజనముచేసి కోటకుం బోవును. భారతముగాని, భాగవతముగాని ధర్మారావు చదువును. నాయఁడు శ్రద్ధతో వినును. 'నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు' ఈ పద్యముతోఁ బ్రతిరోజును బ్రార్థన జరుగును. ప్రతిదినమును నాయఁడు 'ఆ పద్యములోని వర్ణన వలె నుండునుగాదా, మనవేణుగోపాలస్వామి' యనును. 'అవును, అవును, అచ్చగా నట్లేయుండును' అని ధర్మారావనును. గోపన్న పగలబడి నవ్వును. నాయఁడు 'ఎందుకు నవ్వెదవు' అనును. గోపన్న మఱీ నవ్వును.

ఇది ప్రతిరోజును జరుగును. రంగారావుగారి కిది తలనొప్పిగా నుండును. ఒక్కొక్కప్పుడు గోపన్న నవ్వునకు రంగారావుగారు కోపించును. 'కాసాముండకొడుకుకుఁ బొగరెక్కువయినదే' యనును. గోపన్న నవ్వుమానును. ధర్మారావు నాయనివంకఁ జూచును. నాయఁడు గోపన్నవంకఁ జూచును. గోపన్న ధర్మారావువంకఁ జూచును. ధర్మారావు చదువుట ప్రారంభించును. రంగారావు వీరి నందఱిని ముసలివారిక్రింద లెక్కకట్టును. పదునాలేండ్ల ధర్మారావును ముసలివాఁడే. పాఠశాలలు తెఱచువఱకు నిట్లు జరిగినది. తెఱచినంతనే నాయఁడు ధర్మారావును బడికిఁ బంపించెను. సుబ్బన్నపేటకు బెజవాడ దగ్గఱయినను ధర్మారావును బందరులోఁ జదివించెను. ఇది వఱకు ధర్మారావు చదివినది బందరులోననే. ధర్మారావు సెలవులకు నింటికి వచ్చును. మఱల బూర్వమునకుంబలెనే ప్రొద్దునఁ దోటలకుం బోవుట; మధ్యాహ్నమునఁ బురాణము; సాయంకాలమున దేవాల యములందు స్వామిదర్శనము. మఱల బాఠశాలలు పెట్టుదురు. ధర్మారావు బందరుపోవును. కృష్ణమనాయఁడు తోటలకు వెళ్ళఁడు.

ఎవరిచేతను బురాణము వినఁడు. సాయంవేళ దేవాలయములకుఁ దరలఁడు.

ఈరీతిగా నాలుగేండ్లు గడచినవి. ధర్మారావు స్కూలుఫైనలు పరీక్షయిచ్చి, యఫ్. ఏ. పరీక్ష యిచ్చి, బి.ఏ. మొదటిసంవత్సరము చదువుచుండెను. ఇంకఁ బాఠశాలలు రెండునెలలకు మూయుదు రనఁగాఁ బత్రికలలో సుబ్బన్నపేఁట జమీందారు కృష్ణమనాయఁడు గారు పరలోకగతులై రని వార్త వచ్చెను. ధర్మారావు నిర్విణ్ణుఁ డయ్యెను. చదువుచున్నపత్రిక వదలిపెట్టి ధర్మారా వేడ్వనారంభించెను. అతని సహాధ్యాయులందఱికిని ధర్మారావునకు, జమీందారునకుఁ గల సంబంధము తెలియును. అందఱు నోదార్చిరి. దొరగారును వచ్చి యాదరించెను.

దానితో ధర్మారావు సుబ్బన్నపేఁటకుఁ బోవలసివచ్చెను. దుఃఖదీనమైన ముఖముతో ధర్మారావు కోటలోనికిఁ బోయెను. అతని నచట నెవరును బలుకరించలేదు. గోపన్నకోస మతఁడు వెదకెను. గోపన్న రాజు చనిపోయినంతనే పిచ్చియెత్తి లేచిపోయెను. శూన్యమైన కోట ధర్మారావు దుఃఖమును ద్విగుణీకరించెను. ధర్మారావు సుబ్రహ్మణ్యేశ్వర స్వామి యాలయమునకుఁ బోయెను. స్వామివిగ్రహము బాధచేతఁ దిరుగుళ్ళుపడుచున్నట్లుండెను ఓయీ! సర్పరాజా! నీ స్థితి యెంతకు వచ్చినది!

వేణుగోపాలుని జూచెను, పులికాపు పెట్టుట కర్చకుఁడు విగ్రహములను నిరలంకారములుగా నుంచెను. ధర్మారావు స్వామినిఁ జూచి యూవురు మనెను.

చివర కింటికిఁ బోయెను. తల్లి గొల్లుమనెను. ధర్మారావు చదు వంతటితో నాఁగిపోయెను. నాయఁడు పరలోకగతుఁడై మూఁడు నెలలు కడచెను. వేసఁగి సర్వథా విజృంభించెను. ఈ మూఁడు నెలలు ధర్మారా వింటివద్దనే యుండెను. మఱలఁ బూర్వపు రోజులు వచ్చెను. కాని ఋణబాధ లేదు. తల దాఁచుకో నిల్లయిన నున్నది.

ఈ ధర్మారావునకు గణాచారి మొనగవచ్చినది.

# మూఁడవ అధ్యాయము

ధర్మారావు నిలచి గణాచారికనులలోఁ జూచెను. గణాచారి నిలఁబడి "ఏ మట్లు చూచెదవు? రాజు చెడిపోయినాఁడు. వేయిశిరసులనాగు రాజును గలలో స్పృశించినది" అనెను.

ధర్మారావు మాటాడకుండ నాలయాభిముఖుఁడై చనెను. గణాచారి యతని ననుసరించెను. గణాచారివచ్చినపుడెల్ల నర్చకుఁడు సుబ్రహ్మణ్యాలయము తలుపు తీయవలెను. గనుకఁ దీసెను. అర్చకుఁడు విభూతి తెచ్చుటకు ముక్కాలిపీటవద్దకుఁ జనెను. ఆ ముక్కాలి పీఁటమీఁద స్వామియంత్ర మున్నది. ఆయంత్రమునకుఁ బూజచేయుదురు. అర్చకుఁడు విభూతి తీయుచుండఁగా ముక్కాలిపీఁట యొరగెను. ధర్మారా 'వ దేల' నని యడిగెను. అర్చకుఁడు "రాత్రి యొక కాలు విఱిగెను. అంటుపెట్టితి" ననెను. విభూతి పుచ్చుకొని యిద్దఱును వెలికివచ్చిరి. ధర్మారావు తనయింటికిఁబోఁబోవుచు గణాచారి వంకకుఁ జూచెను. గణాచారి "సరిపోయినదా! ఒకకోడూడినది. నీవును, నేనును మిగిలియున్నాము" అనెను. ధర్మారావునకుఁ గృష్ణమ్మనాయఁడు కనులలో నాడెను. నాయఁ డమృతమూర్తి యగుటచేత ధర్మారాయని కన్నులు నీళ్ళతో నిండెను.

ధర్మారావు గణాచారిని వదలి యా వీధివెంటఁ బోయెను. తలవంచుకొని యతఁడు పోవుచుండఁగా, "నాయనా! యిట్లు రమ్ము" అన్న పిలుపు వినఁబడెను. అతఁడు తలయెత్తి చూచెను. పిలచినది రంగాజమ్మగారు. ఆమెయే రామేశ్వరశాస్త్రిగారు పెండ్లాడిన క్షత్త్రియస్త్రీ. ధర్మారావు లోనికిఁబోయెను. ఆమె చాపవేసి కుమారుని గూర్చుండు మనెను. రంగాజమ్మకు నలువదియేండ్లుండును. పసుపుపచ్చని మనిసి. ఆకర్ణాంతములైన నేత్రములు. కాని యామెకు వైధవ్యము ప్రాప్తించినతరువాత నామెసౌందర్య మైపోయెను. రాజు పోయి శిథిలమైనరాజధానివలె నామెయందుఁ బూర్వశ్రీచిహ్నములు మాత్రమే యుండెను.

రంగాజమ్మ కొకకుమారుఁ డుండెను. ఆయనపేరు రామచంద్రరాజు. అతని కిప్పుడు ముప్పదియేండ్లవయ సుండును. రామచంద్రిరాజు పదియేండ్లక్రింద నెచటికో లేచిపోయెను. అప్పుడప్పుడు తల్లికి మాత్ర ముత్తరములు వ్రాయుచుండును. రామేశ్వరశాస్త్రి వివాహమాడినపుడే పదియెకరములు రంగాజమ్మపేర వ్రాసెను. ఆమెకుఁగాని, యామె సంతానమునకుఁగాని మిఁగిలినయాస్తితోఁ బని లేదను నియామకముమీఁదనే యీ వివాహము జరిగెను. మిగిలిన వైశ్య, శూద్ర స్త్రీలను నిట్లే వివాహమాడెను. రంగాజమ్మగారు తన పదియెకరములమీఁద వచ్చు పంటతో సుఖముగా జీవించుచుండెను. రామేశ్వరశాస్త్రిగారు కష్టకాలములో నున్నపుడు రంగాజమ్మగారు తన యాస్తికూడ శాస్త్రిగారిదే, వాడుకొమ్మని యెంతచెప్పినను శాస్త్రిగారు వినలేదు. అప్పుడపుడు చాటుగా నామె యుప్పు పప్పు మొదలయిన వస్తువులు సావిత్రిమ్మగారికిఁ బంపించుచునే యుండెను. అది శాస్త్రిగారికిఁగాని, ధర్మారావునకుఁగాని తెలియదు. తెలిసినచో వా రూరకుండ రని సావిత్రమ్మగారికిని దెలియును.

రంగాజమ్మగారు ధర్మారావుతో నదివఱ కెన్నఁడును మాటాడలేదు. కాని తా నన్నచో నాయమకుఁ జాలప్రేమ యున్నదని సావిత్రమ్మగారి ప్రసంగముద్వారా యతనికిఁ దెలియును. నేఁడు హఠాత్తుగా నామె తన్నుఁ బిలచుట కూడ నతని కాశ్చర్యము వేసెను.

ధర్మారావును జూచినంతనే రంగాజమ్మగారికిఁ దనకుమారుని జూచినట్లే యుండెను. తన హృదయములో నున్నప్రేమ యెట్లు వెలిపఱుపవలయునో ఆమెకుఁ దెలియలేదు. అందుచే గదిగుమ్మము నానుకొని నిల్చుండెను. ధర్మారావే మాట్లాడెను: "అన్నగారివద్ద నుండి యేమయిన నుత్తరము వచ్చినదా?" రంగాజమ్మగారు జవాబిచ్చెను: "నాయనా! ఉత్తరమువచ్చి నెలనాళ్ళయినది. తూర్పు దేశములో నిల్లు, స్థలము కొని సంసారము చేయుచున్నాఁడట. అది మారాజు లెక్కవగా నున్నచోటు" అని యేదో చెప్పఁబోయి యాఁగెను.

ధర్మారావు గ్రహించి"వివాహమాడెనా"యని ప్రశ్నించెను.

రంగా—అదేనాయనా! మొదట నెవరును పిల్లనిచ్చుటకు సమ్మతించలేదట. తరువాత నెవరో యొకవృద్ధుడు ధర్మశాస్త్రములు అవియు జదివినవాడు తన మనుమరాలి నిచ్చెనట. కాని పిల్లవాని కిచ్చుటికి రావలయుననియే యున్నది. మఱల సన్ను రమ్మని వ్రాయును.

ధర్మా—మీ రచ్చటికి వెళ్ళిననే బాగుండును.

రంగా—నా కచ్చట నే మున్నది? అత్తవారియిల్లు వదలి పెట్టి యీ పరదేశములకు నే నేలఁ బోవలయును? మీ నాయనగారు చచ్చినచోటనే నేనును జచ్చిపోదును.

ధర్మారావునకు గుండెలో నావేగము తోఁచెను. ఆమె శీల మునకు మనస్సులో నానందపడి తన తండ్రి ధన్యుఁ డనుకొనెను.

రంగా—నాయనా! నేను వానిని రమ్మనియే వ్రాయించితిని. మీ అన్నదమ్ములందఱు నొకచోట నుండవచ్చును. చేదోడువాదోడుగానుందురు? ఆ దూరదేశములో 'మన' యన్నవారు లేక యేమి యిబ్బందులు పడుచుండెనో. అతనికి రావలయు ననియే యున్నది. కాని భార్య యొప్పుకొనునట్లు తోఁచదు.

ధర్మా—ఆయన కేమయినను సంతానమా?

రంగా—ఒక కుమారుఁడు కలిగి పోయినాఁడఁట.

ధర్మారావు మరికొంచెముసేపు కూర్చుండి 'అమ్మా! వచ్చెదను' అని సెలవు తీసికొనెను. దారివెంటఁ బోవుచు నాలోచనా తరంగములపై నూఁగులాడుచుండెను. ఇది యొకవిచిత్రమైన సృష్టి. ప్రేమ విచిత్రమైనది. తా నెవ్వరు? ఆమె యెవ్వరు? వారి యనుబంధమే చమత్కారముగ నున్నది.

అతనియూహ తనతండ్రివివాహములమీఁదికే ప్రాఁకెను.

ఒకప్పుడు రామేశ్వరశాస్త్రి పాతికయేండ్ల వయసప్పుడు తీర్థయాత్రకుఁ బోయెను. అప్పటికి సావిత్రమ్మగారు కాఁపురమునకు రాలేదు. శాస్త్రిగారికి పదునెన్మిదేండ్లప్పుడు సోమన్నగారు తనమూఁడేండ్లకూఁతునిచ్చి పెండ్లిచేసెను. శాస్త్రిగారి కిరువదియేండ్లపుడు తండ్రి చనిపోయెను. చనిపోయిన మఱు సంవత్సరమే రంగాజమ్మగారిని బెండ్లాడెను. రంగాజమ్మతండ్రి సుక్షత్రియులు. వారిది గంజాం

జిల్లా. శాస్త్రిగారు జమీందారుగారి పనిమీఁద నా ప్రాంతము లకుఁ బోయినపుడు రంగాజమ్మగారి తండ్రి రంగరాజుగారికిని, రామేశ్వరశాస్త్రిగారికిని బరిచయము గలిగెను. ఒకరోజునఁ బ్రసంగవశమున నర్జునుఁడు-రాముఁడు-ధనుర్విద్య వీనినిగుఱించి మాటాడుచు రంగరాజుగారు "ఆ విద్యలన్నియుఁ జచ్చిపోయిన" వనెను. రామేశ్వరశాస్త్రి తన కా విద్యలోనున్న శక్తినిగుఱించి ప్రస్తావించెను. రంగరాజుగారికిఁగూడ నందు చాలసామర్థ్యము కలదు. ఇద్దఱు నొకరి నొకరు పరీక్షించుకొనిరి. ఈ పరీక్షలలో రంగాజమ్మగారు రామేశ్వరశాస్త్రిని బ్రేమించి యతనితో లేచివచ్చెను. రంగరాజుగారు మొదటఁ గోపించినను, తరువాత శాస్త్రీయముగా వీరిద్దరు వివాహమాడిరని తెలిసి యూరకుండెను. తరువాత నాలుఁగేండ్లకు శాస్త్రిగారు తీర్థయాత్రకు జనిరి. వెంటనే రంగాజమ్మగారుకూడ వెళ్ళిరి. దారిలో నొకవైశ్యకుటుంబము వారికిఁ గలసెను. వారనాదిలోఁ దెలుఁగువారేనఁట. అప్పుడుమాత్రము మహారాష్ట్రదేశములోఁ గాఁపుర ముండిరి. అదొకయాసతో వారు తెలుఁగు మాటాడుట, తెలుఁగువారన్నచో ప్రాణములు విడుచుట, తామును దెలుఁగువార మని చెప్పుకొని గర్వపడుట-ఈ కారణములవలన వారికి వీరికిఁ బరిచయము గలిగెను. ఆ వైశ్యశిఖామణిపేరు రామకృష్ణారావు. చూచుటకు మహారాష్ట్ర బ్రాహ్మణునివలె నుండెను. ఆయనయు నాయన భార్యయుఁ బదునాలుఁగేండ్ల కుమార్తెయుఁ దీర్థయాత్ర చేయుచుండిరి. ఆ పిల్లకు పెండ్లి కాలేదు.

ప్రతిమజిలీలోను శాస్త్రిగారు వండుటయుఁ, దాను భోజనము చేసి రంగాజమ్మగారికిఁ బెట్టుటయుఁ జూచి రామకృష్ణారావుగారు కొంత సందేహించి చివరకు శాస్త్రిగారిని వారిసంబంధమునుగూర్చి ప్రశ్నించెను. శాస్త్రి యామె తనభార్యయనియుఁ, క్షత్రియయనియుఁ, దాను క్రమముగా బ్రాహ్మణ క్షత్రియ స్త్రీలను చేసికొంటిననియు, వైశ్య శూద్ర స్త్రీలనుగూడఁ జేసికొనవలె నని యున్నదనియుఁ జెప్పెను. రావు మందహాసముచేసి యూరకుండెను.

తీర్థయాత్రను సేవించుచు సేవించుచు వారు నర్మదానదిని జేరఁబోయిరి. స్నానము చేయుచు హైమవతి కాలుజాఱి ప్రవాహ

మునఁ బడెను. రావు మఃఖావేశముచేత "నయ్యా! ఆ పిల్లను బ్రతికించుము. నీ కా పిల్ల నిచ్చి వివాహము చేయుదు" ననెను. శాస్త్రి ప్రవాహమున దూకి కన్యను దెచ్చెను.

రామకృష్ణారావునకుఁ దరువాతఁ బిల్ల నిచ్చుట యన్నంత తేలికగాఁ గన్పించలేదు. హైమవతి చక్కని చుక్క. మహారాష్ట్ర దేశమున నుండుటవలన నంతవయసు వచ్చువఱ కవివాహితగా నుండెనుగాని, తెలుఁగుదేశములోనైనచో నుండదు. ఆమెకు శాస్త్రిని, శాస్త్రిభార్యను జూచినప్పటినుండియు మనస్సులో నొక క్రొత్త పోకడ కలిగెను. శాస్త్రి యాజానుబాహువు. ఎఱ్ఱనివాఁడు. సుందరమైన మొగము. నిత్యవ్యాయామముచేతఁ గండలుదేఱి నిగనిగలాడు శరీరము. అతనిని జూచి యే స్త్రీ మోహించదన్నట్లుండెను. "నిన్ను నేకన్యల కోరరు, కోరదే మును రమాకాంతాలలామంబు" అన్నట్లు రంగాజమ్మగారు ప్రబలసాక్ష్య మిచ్చుచుండెను. పైఁగాఁ దండ్రిగారి వాగ్దానమువలనఁ దా నదివఱకే శాస్త్రిగారి భార్యనైతి ననుకొనెను. కాని తండ్రినుండి వదలించుకొనుట యెట్లు? రంగాజమ్మగారి కప్పటి కిరువదియేండ్లు. ఆమెయు, హైమవతియుఁ గలసి కుట్ర చేసిరి. శాస్త్రిగారికిఁ జెప్పిరి. రంగాజమ్మగారికిఁ గోపమువచ్చునేమో యన్న శాస్త్రిగారికి మబ్బువిచ్చిన ట్లయ్యెను. అయోధ్యలో నొక నాఁడు రామకృష్ణారావుగారు నిద్రలేచి చూచుకొనుసరికి హైమవతి భర్తతోఁ గలసి యిరువదియామడలదూరమునం దున్నది. రావు వ్యవహారము నడపెడివాఁడే. భార్య వారించినది. నిజమే. అతనిభార్య నతఁడు తీసికొని వెళ్ళె నన్నది.

శాస్త్రిగా రింటికి వచ్చి వివాహము చేసికొనెను. తరువాత నాలుగేండ్లకు భార్యాభర్త లిద్దఱు మహారాష్ట్రదేశమునకుఁ బోయి, హైమవతితల్లిదండ్రులను దర్శించివచ్చిరి. రామకృష్ణారావు అల్లునితో సరిగా మాటాడలేదుగాని యత్తగారును, బావమఱఁదులు నాదరించిరి. హైమవతి కిద్దఱు కుమార్తెలు, నొక కుమారుడును కలిగిరి. శాస్త్రిగారు కూఁతుండ్ర కిద్దఱకు మహావైభవముతోఁ బెండ్లి చేసెను. తరువాత వా రిద్దఱును గాపురమునకుఁ బోయిరి. హైమవతి శాస్త్రిగారికి నలుబదియవయేట చనిపోయెను. కుమారుఁడు శ్రీధరము లన

పాల మమ్ముకొని వర్తకముచేయుట కని యే దేశమో పోయెను. రామేశ్వరశాస్త్రిగారు రామచంద్రరాజును గొప్ప ధనుర్విద్యాపారంగతుని, శ్రీధరమును వర్తకసార్వభౌముని జేయవలెనని యూహించెను. కాని వా రిద్దఱును తండ్రికిఁ జెప్పకుండఁగనే దేశాంతరగతులయిరి. తన కుమారుఁడయిన ధర్మారావునకు వేదవిద్య చెప్పించవలయు ననుకొనెను. కాని బావమఱఁదియు, భార్యయుఁ జేసిన పోరాటము వలన నతఁ డాంగిలేయ మభ్యసించెను. ఈ రీతిగా నాయన యీ మూఁడాదర్శములును ఫలమునకు రాకపోయెను. ఊరిలోననే యొక పేదకాఁపునకు మంగ యను కూఁతు రుండెను. మంగ విచిత్రమైన పిల్ల. నల్లనిది. కోలమొగము. ఎన్నఁడును జుట్టు దువ్వుకొనెడిది కాదు. చిన్నప్పటినుండి రామేశ్వరశాస్త్రితోఁ బరిహాసము లాడుచుండెడిది. చిన్నపుడు పరాచికమునకు శాస్త్రి 'మంగా! నిన్ను నేను పెండ్లాడెదను; చూడు' అనెడివాఁడు. మంగ "నన్ను పెండ్లిచేసుకొని యేమి బాగుపడెదవు! నాచేతఁ దన్నులు తినుటకా?" యనెడిది. శాస్త్రి "సరే! తన్నుదువుగానిగా" యనును. మంగ నవ్వును. ఆ పేదకాఁపు కూఁతునకుఁ బెండ్లిచేయలేకపోయెను. ఆతనిభార్య మంగ పసితనములోనే చనిపోయెను. మంగకుఁ బదునెనిమిదేండ్లు వచ్చెను. పెండ్లి కాలేదు. కాఁపు పాపము మనోవ్యాధితోడను, ఉబ్బసము తోను తీసికొని చనిపోయెను. మంగ బ్రతుకు నిరాధారమయ్యెను. వయసులోనివారు మంగను దుశ్శీలనుగాఁ జేయఁ బ్రయత్నించిరి. ఈ తిప్పలుపడలేక మంగ యొకరోజున శాస్త్రివద్దకు వచ్చి "నన్ను బెండ్లి చేసికొందునంటివికదా! చేసికొనుము. నాకుఁ దిండి జరుగుటలేదు. అదిగాక దుర్మార్గులతో బాధపడలేకున్నాను. తెల్లవాఱులు నా యింటిమీఁద గడ్డలు వేయుచున్నారు. నాకు దిక్కులేదు. నన్నుఁ బెండ్లి చేసుకొందువా, పాడయి పొమ్మందువా?" యనెను.

శాస్త్రి మంగను దనయింట నుండిపొమ్మనెను. అప్పటికి సావిత్రమ్మగారు కాపురమునకు వచ్చెను. హైమవతి యామె పెద్ద కూఁతురు, ఏడాదిపిల్ల. ఆమెకు శాస్త్రిగారి యీ పెండ్లిండ్లు నచ్చలేదు. మంగ నింట నిలువనిచ్చినది కాదు. మంగ పడుబాధలు చూడలేక శాస్త్రిగారు వేఱే యామెకు నిల్లువేసి, యన్యాయమేలయని యామె

పదియెకరము లామెకు వ్రాసియిచ్చెను. అప్పటినుండి మంగ సుఖముగా జీవించెను. మంగబలవంతముమీఁద శాస్త్రిగా రామెకుఁ బుస్తె కట్టెను.తరువాత నాలుఁగై దేండ్లకు మంగకడుపున నొకకాయకాచెను. ఆకాయ మగశిశువు! పురిటిలోనే యీ శిశువునుజూచి మంగ మూర్ఛపోయెను. అది ఏమి శిశువు! ఈనకఱ్ఱపుల్లకన్న సన్నము. ఆకుపచ్చని రంగు. జుత్తు బూడిదరంగు. అంకఱు 'నేము పాముపిల్ల పుట్టె' నను కొన్నారు. కాని రెండు కాళ్లు, రెండు చేతులు, మొగము, కన్నులు, నాలుక యిన్నియు నుండఁగాఁ బా మనుకొనుట యెట్లు? సాటికాఁపు పడుచులు చూచి నవ్వుకొనిరి. మఱికొందరు కులాభిమానముగల కాఁపుపడుచులు 'కులముచెడిన దీనికి మంచి పరాభవము జరిగిన' దనుకొన్నారు. మంగ మూర్ఛదేఱి శిశువు నెదుఱొమ్మత్తుకొన్నది. శిశువు కదలాడెను. పాము మెలికలుతిరిగిన ట్లుండెను. మంగ పొత్తిళ్ళలో నదిమిపట్టుకొనెను. శిశు వేడ్చెను, పాముకూసిన ట్లున్నది. మంగ సుబ్రహ్మణ్యేశ్వరుని దలఁచి పాప కాముదను పెట్టెను. జనము విచిత్రముగా గుంపులుగుంపులై వచ్చి శిశువును జూచి పోఁదొడఁగిరి. మఱికొన్నాళ్ళకు మంగ కభిమానమువేసి శిశువుకు దాఁచుకొనుచు వచ్చినది. నెలపుడుడు వెళ్ళినది. శాస్త్రి శిశువును జూచుటకు వెళ్ళెను. శిశు వప్పుడే తండ్రినిగుర్తుపట్టెనేమో, తండ్రిచేతిలోనికిఁ బోవుచునే ఏడుపుమానెను. శాస్త్రి శిశువువంకఁజూచెను. శాస్త్రి తీక్ష్ణాలోచనాపరుఁడయ్యెను. మంగచెక్కిళ్లలమీఁదఁ జేయివైచి "మంగా! నీ వదృష్టవంతురాలవు. సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి నీయందుఁ జాలదయ వచ్చినది. నీయందు ధర్మ మింకను చెడిపోలేదు. ఈ ధర్మమును రక్షించుకొనుము" అనెను. మంగకు శాస్త్రి భగవంతుఁడు. పొరుగమ్మల పెదవివిఱుపులతోఁ దనశిశువుమీఁదఁ గొంత నిరాదరణ యిదివఱకుఁ గలిగినను, మంగ కిపుడు తనశిశువుమీఁదఁగల ప్రేమ యిబ్బడిముబ్బడి యయ్యెను. శిశువున కేడాది యీడు వచ్చెను. ఉన్నచోట నుండఁడు. ప్రాఁకి యెక్కడకుఁ బోవునో తెలియదు. దొడ్డిలోఁ బొట్లపాదులు, బీరపాదులు పెట్టి మంగ యెప్పుడును గాపించును. శిశువుపోయి యీ పాదులలోఁ గూర్చుండును. మంగ కతఁడు కనపడఁడు. పైఁగా పురుగు పుట్ర

యుండు నేమో యని మంగ భయము. ఒకసారి యిట్లే ఒకపొరుగ మ్మతో నన్నది మంగ– "పురుగో పుట్రో తల్లి! ఎప్పుడును పోయి యా పాదులలోఁగాని కూర్చుండఁడు." ఆమె యన్నది: "పురుగో పుట్రోనా అమ్మా! నీ కొడుకే పురుగు, నీకొడుకే పుట్ర." మంగకుఁ గోపమువచ్చినది. కాని కోప మెట్లు చూపించవలయునో యామెకుఁ దెలియదు. శిశువున కైదేండ్లు వచ్చినవి. బిడ్డ యీదురుగాలికొట్టినచో నోరు తెఱచుకొని యా గాలిని బీల్చుకొనును. తల్లికిఁ దెలియకుండఁ బోయి యే చేనిలోనికో చొచ్చును. జొన్నచేలు, పెసరకాడలు, వంగతోఁటలు, నాకుమడులు వీనిలోనికిఁబోయి యామధ్య నెచటనో పండుకొనును. మంగ వెదుకలేక, వెదుకలేక విసివిపోవును. పాప మెక్కడ నని వెదకును? అందఱు నతనిని 'పసిరిక' యని పిలువఁ జొచ్చిరి. పసిరికకుఁ బిట్టలు, పాములు ఎక్కువమిత్రులు. పక్షులు వానిదగ్గఱనే యాడును. వానితో నతఁ డేమో మాటలాడుచున్న ట్లుండును. పాము లతనితో నాడుటయేకాదు, అతనిశరీరమునందు మెలి వేసికొనును. ఆకుమడులలో నతఁడు పండుకొని నిద్రించును. పసిరిక పాము లతనిచుట్టును దిరుగుచుండును. మనుష్యులను జూచినచో నవి పాఱిపోవును. పసిరికకుఁ బదేండ్లు వచ్చినవి. పచ్చనిపాము తోఁక మీఁద నిలుచున్నట్లే యుండు నతఁడు నిలుచున్నపుడు. పెద్దగాలి వేసినచోఁ 'బసిరిక' తూలిపోవును. అతనినవ్వు, అతని మాటలు, అతనినడక – అది యొక చిత్రము. పసిరిక గ్రామములో నున్నపుడు పిల్ల లతనిని విచిత్రముగాఁ జూచుచుందురు. ఊరిలో నందఱకు నతఁ డన్నచోఁ బ్రేమ. అతని నెవరు నేమియు ననరు. అతనిని నవ్వింతురు. కొందఱతనితోఁ బరాచికము లాడుదురు. పసిరిక యెక్కువ మాట్లా డఁడు. ఊరకే ప్రతిదానికిని నవ్వును. ఎక్కువ పొలములలోనే యుండును. ఇంటిదగ్గఱ నరుదు. క్రమముగా మంగకుఁ గొడుకు మీఁద నాదుర్దా తీరెను. "వాఁ డంతే. పైరుపచ్చవాఁడుగా బుట్టెను. వానికిఁ బైరునకు సంబంధము. వాఁడేపైరు, పైరేవాఁడు. వాఁడింటి వద్ద నేల యుండును?" అని యామె నిర్ధారణ చేసికొన్నది. అతఁ డెప్పుడైన నింటికి వచ్చెనా యింత యన్నము పెట్టును. అతని కన్నముకూడ నక్కఱలేదేమో! పొలాలమీఁద నతఁ డేదిపడిన నదే

తినును. అన్నియుఁ బచ్చివస్తువులే తినును. 'పసిరిక' యెవరితోడను ఎక్కువకలియఁడు. ఒక్క ధర్మారావుతోడనే కలియును. ధర్మారావు కనంబడెనా, అతనిని వదలిపెట్టిపోఁడు. ధర్మారావును 'అన్నా' యని పిలుచును. ఆతనికివచ్చిన దా యొక్కటియే మాట. ధర్మారావునకుఁగూడ బసిరికయన్నచోఁ బ్రాణము. ధర్మారావునకు రాజుపోయిననుసరే, విద్యలు నశించిననుసరే పసిరిక యున్నచోఁ జాలును. కనఁబడినచో పసిరిక ధర్మారావును వదలఁడు. ఇద్దఱునుబోయిపొలాల వెంటఁదిరిగితిరిగి పచ్చపైరులో విశ్రమించి ప్రొద్దుగ్రుంకిగాని యింటికిరారు. ధర్మారావున్నచోఁ బసిరిక దగ్గఱకుఁ బక్షులు, సర్పములు రావు. అవియేమో అతనిమీఁదఁ గోపమువచ్చినట్లు చూచుచుఁజూచుచు బోవును. తరువాతరెన్నాళ్ళదాఁక నతనిని సమీపించవు. పసిరిక వానిని గొట్టి తిట్టి మఱల వానితోఁ జెలిమి చేయవలయును.

ధర్మారావు రంగాజమ్మగారి యింటినుండి వచ్చుచు నీ యూహాతరంగములలో నొడలు తెలియక నడచుచుండెను. అప్పటికిఁ బ్రొద్దు తిరిగినది. దూరమునఁ బసిరిక ధర్మారావును జూచెను. పసిరిక 'అన్నా' యని కేకవేసెను. ధర్మారా వతనినిగుఱించియే యూహించుచుండెను. పసిరిక వచ్చి ధర్మారావును కౌగలించుకొనెను. తమలపాకుతీఁగ వచ్చి యవిసెమొక్కమీఁద బ్రాలిన ట్లున్నది. ధర్మారావు "నాయనా! నీకు వేయేండ్లు ఆయుర్దాయ"మనెను. రెండుజాములవుడాకాశమున నెచటినుండి వచ్చినదో, తీతువుపిట్ట కూసెను. ధర్మారావు హృదయములో నేదో కొట్టిన ట్లయ్యెను. పసిరిక ధర్మారావును తన వెంటఁ బొలాలకు రమ్మనెను. ధర్మారావుయొక్క కలుక్కుమన్న గుండె "నాయనా! అన్నము తినలేదు" అని అభ్యంతరపెట్టెను. పసిరిక ధర్మారావును వెనుదిరిగిచూచుచుఁ జూచుచునేపోయెను. ధర్మారావుమరల నడుచుచుండెను. ధర్మారావున కీ యపశకునమువలన మనోవ్యథ కలిగెను. ఆ దెబ్బకూడనాయనమునఁ దగిలెను. అయ్యో! పసిరికకే భంగమా! ధర్మారావుశరీరముకూడ నశించెననుకొన్నాఁడు. ధర్మారావు మఱలనాలోచనానిమగ్నుఁడయ్యెను. దారివెంట నడచుచుండెను. అతను తన్నుఁదా నెఱుఁగఁడు. మఱికొంతదూరము

నడచినతరువాత నెవరో తన్ను వెనుకనుండి తాకిన ట్లయ్యెను. వెను దిరిగి చూచెను. అతనికన్నులలోనికి వెన్నెలలు చిమ్మనగ్రోవితోఁ గొట్టినట్లయ్యెను. అవి నవ్వులు. ఆ నవ్వినది పన్నెండేండ్లపిల్ల. దాని యొడలిపైకిఁ దెలియకుండ మన్మథుఁడు వచ్చుచున్నాఁడు. దాని తెల్లనిపలువరుస సుదర్శనాయుధపు టంచులవలెఁ బదునుపెట్టిన ట్లుండెను. దానిచెవులు శ్రీకారములై పాంచజన్యముల ట్లుండెను. దానికన్నులు కమలములు. దానినాసిక కౌమోదకి. దానిభ్రూ యుగము శార్ఙ్గమ్ముద్వేధా విభక్తమైన ట్లుండెను. దానిమూర్తి వికసం తమై మనోజ్ఞమయ్యెను. దానిపేరు దేవదాసి. అది రామేశ్వర శాస్త్రిగా రుంచుకొన్న భోగాంగన రత్నగిరికూఁతురు. దేవదాసి ధర్మారావును "అన్నా! ఎచ్చటికి?" అనెను. ధర్మారావునకొకసారిగఁ దనతండ్రిమూర్తి గోచరించెను. ఆయన వర్ణాశ్రమ ధర్మములన్నియు ముద్దకట్టినమూర్తి. ఆయన భారతదేశముయొక్క యాత్మ. ఆయన త్రయీవిద్య కొక వ్యాఖ్యానము.

58

# నాల్గవ అధ్యాయము

రంగారావుగారికిఁ బట్టాభిషేకము నిర్ణయింపఁబడెను. పరగణాయేకాక రాజధానియంతయు నుత్సాహముతో నిండిపోయెను. రంగారావుగారికి ముప్పదియైదేండ్లు. ఆయన యింగ్లీషువిద్యలోఁ బట్టభద్రుఁడు, ఆధునికమైన సంస్కారముకలవాఁ డగుటచేత నాయన పరిపాలనము రాజ్యములోఁ జాల మార్పులు కలుగునని, ప్రజాక్షేమము వృద్ధిపొందు నని లోక మనుకొనుచుండెను. పూర్వమార్గములన్నియు మంచివి కావు. పాశ్చాత్యదర్శనములతో సాఁగించిన యే కార్యమైనను నభివృద్ధిసూచక మని సర్వత్ర యభిప్రాయములు గోచరించెను. ముసలిరాజు దేశము ముందునకుఁబోవుచున్నను దాను పూర్వాచారములే పరిగణించెను. అందుచే దేశములో ననేకులైన యువకులకు జీవితములందుఁ దమశక్తులు ప్రకటించుటకు వీలులేక పోయెను. ప్రభువు నూతనసంస్థలను ప్రబలించవలెను యువకులు వానికిఁ దేజస్సు తీసికొనిరావలయును.

కృష్ణమనాయఁడు తనపూర్వులు చన్నమార్గముననేపోయెను. కడచిన పదేండ్లు రంగారావుగారే వ్యవహారములన్నియుఁ జూచుచున్నను నాయనిమాటయే సాఁగెను. ఇపుడు రంగారావుగారు సర్వశక్తిమంతుఁ డగుట దేశము నోఁచుకొన్ననోము ఫలించుట యని యందఱు నభిప్రాయపడిరి.

రంగారావుగారు రాజ్యమునకు వచ్చినంతనే ప్రధానముగాఁ గొన్నిమార్పులు చేసిరి. నాయనికాలములో నేపనియుఁ దొందరగాఁ దేలెడిది కాదు. ఎవరైన జమీందారుగారితోఁ బనియుండి వచ్చెడివారు. వారికి దర్శనమే యయ్యెడిది కాదు. దొరగారితోఁ బనియనుటతోడనే సత్రములో భోజనము. వారు నెలనాళ్ళు, రెండునెలలు పడియుండి ప్రభుదర్శనముచేయుదురు. చేసి యేమి లాభము? ప్రభువు గ్రామమడుగును, పేరడుగును. సత్రములో భోజనము సదుపాయముగా నున్నదా యని పరామర్శించును. వారు 'చిత్త' మందురు. దొర 'యేమి పనిమీఁద వచ్చితి'రని యడుగఁడు. వారు తామే చెప్పుటకుఁ గొంకు

దురు. ఇట్లు మఱల నొకనెల జరిగినతరువాతఁ దెగించి వారు తమ వచ్చినపని చెప్పుదురు. ఉద్యోగముకొఱకు వచ్చెనా? 'సరే పోయి, భార్యను బిల్లలను తీసుకురండి' యనును. అతఁడుపోయి సంసారముఁ దెచ్చును. జీత మింతయని ప్రభువు చెప్పఁడు. వారు నోరువిడచి యడుగలేరు. సర్వపదార్థములు దేవిడీలోనుంచి తెచ్చుకొనుటయుఁ, దినుటయు. ఇంటిలోఁ 'గార్యకరామతులు' వచ్చినచోఁ బ్రభువుతోఁ బోయి చెప్పుకొనుట మాత్రమే. దొర దగ్గరనున్న పెత్తనదారుతో 'ఫలానావారియింట వివాహమఁట. కావలసినవన్నియుఁ బంపిం చుము' అని చెప్పును. ఇట్లు సర్వకార్యములు గడచిపోవును.

దివాను వచ్చి "అయ్యా! శిస్తు వసూలుకాలేదు" అనును.

ప్రభువు—ఏమియు వసూలు కాలేదుటయ్యా!

దివాను—కాదండి, చాల బకాయిపడినది.

ప్రభువు—ఏ మాత్రము?

దివాను—ఈ గ్రామములోఁ బదివేలకు తొమ్మిది వేలయినది. వేయిరూపాయిలు బకాయి. మరియొకచోట నెనిమిది వేలు; ఆరు వేలే జమ- ఇట్లున్నది.

ప్రభువు—ముందు సంవత్సరము వసూలు చేయవచ్చునులే. వాండ్రకు సరిగాఁ బండినదో, లేదో అది కనుగొంటివా? వారును పేదవారు. వారిమీఁదఁబడి పీఁకుకొని తినినచో మనకుమాత్ర మేమి శుభము? పదిమంది తిన్నదే మంచిది. నాలుఁగులక్షలలో రెండు లక్షలు వసూలయినచో మనకుఁ జాలదా? ఏ మందువు?

దివాను మఱలమాటాడఁడు. నాలుఁగయిదేండ్లు బకాయీలు పేరుకొన్నతరువాత నా గ్రామస్థులు వచ్చి జమీందారుగారి దర్శనము చేయుదురు. ప్రభువుతోఁ దమ యిక్కట్టులు చెప్పుకొందురు. నాయఁడు బకాయీలు రద్దుచేసి వచ్చినవారికి సువారములోఁ గడుపు నిండ మేపి సాఁగనంపును.

ఒకసారి జమీందారుగారి మామిడితోఁట విఱుగఁగాచి యుండెను. గ్రామములోనున్న పదిమంది పిల్లలు తోఁటలోఁ జొర బడి పిందెకూడ లేకుండ దులిపివేసిరి. తోటమాలిపోయి, ప్రభువుతోఁ జెప్పి వారుఫలానాఫలానావారిపిల్లలని రూపించెను. ఆ పిల్లలతోఁజాల

నిబ్బందిగానున్నది, వారి నెట్లయినను దండించవలె నని పెత్తన దారులకు, దివానునకుఁగూడఁ బట్టుదలగా నుండెను. దొర వారినిఁ బిలిపించెను. వారు వచ్చిరి. వారి గుండెలలో దడదడగా నుండెను. నాయఁడు వారినిఁ జూచి 'మామిడికాయలు మీలో నెవరు దొంగి లించిరి?' యనెను. దివాను "అందఱురు దొంగిలించిరి. ఒక రేమిటి? అందఱిని శిక్షించవలయును" అనెను. ఏమి శిక్ష యీవలెనని ఙా జడిగెను. కొయ్యబండ వేయవలె నని దివాను చెప్పెను. సరే నని కొయ్యబండఁ దెప్పించిరి.

నాయఁ డనెను, 'ఏమయ్యా! ఉన్న దొక్క కొయ్యబండ. వీరు పదిమంది. ఎవరికి వేయవలెను' అనెను. 'ఒకరి తరువాత నొకరి' కని దివానుగారు చెప్పిరి. ప్రభువు వంటవానిని బిలిచి, యేదో రహస్య ముగాఁజెప్పి 'సరే! వేయుదములే' యని యందఱిని కూర్చుండుఁ డని చెప్పి యేదో వ్యవహారము మాటలాడఁ జొచ్చెను. గంటసేప యినది. పిల్లలు కదలుటకు వీలులేదు. చివరకు వంటవాఁడు లడ్లును, జిలేబియు వేఁడివేఁడివి పెద్దపళ్ళెమునిండఁ జేసి తెచ్చెను. నాయఁడు పళ్ళెము పిల్లలముందు బెట్టించి "ఎవరు ఎక్కువతిందురో వారికిఁ గొయ్యబండ వేయించెదను" అనెను. కట్టువాండ్రు ఆశ్చర్యపడిరి. తరువాత నొకరిమొగమొకరు చూచుచుఁ దినఁగలిగినన్ని తినిరి. పళ్ళెములో నింకసగము మిగిలెను. నాయఁడుచూచి 'ఏమిరా! ఈమాత్రమునకేనా తోఁటలలోఁ జొరఁబడి పండ్లు కోసికొనుట? లెక్క పదిజిలేబులు తినలేరు. ఏమి పిల్లలు! ఛీ! పొండి. ఆ మిగిలినవి కూడఁ దీసికొనిపొండి' యనెను. పిల్లలవికూడఁ దీసికొని యింటికిఁ బరువులెత్తిరి. తోఁటమాలియు, దివానును తెల్లమొగము వేసిరి. దొర 'పోనిండయ్యా! అల్లరి పిల్లలు చేయకపోయినచో నెవ్వరు చేయుదురు? పిల్లలు భగవత్స్వరూపులు. వారి నేమియు ననరాదు' అని దివానును సముదాయించెను.

దొర యొకసారి దేవిడీలోఁ గూర్చుండియుండెను. ఊరిలో జోగీశ్వరవధాను లను నొక బ్రాహ్మణుని భార్యకుఁ బ్రసూతివ్యాధి వచ్చెను. వైద్యుఁడు 'సూతికాభరణము వాడవలయును' అనెను. మంచి సూతికాభరణము జమీందారుగారివద్ద నున్నది. జోగయ్య

గారు రాజదర్శనము చేయవెళ్ళిరి. నాయఁడు జోగయ్యను జూచి మొగ మట్లుత్రిప్పుకొనెను. జమీందారుగారు తనవైపునకుఁ దిరుగుదు రేమోయని జోగయ్యగారు ఎదురుచూచిచూచి యావైపునకుఁ దిరిగివచ్చిరి. నాయఁడు మొగ మీవైపునకుఁ ద్రిప్పెను. జోగయ్య చాలసేపు నిలుచుండి యింటికిఁబోయెను. కొంతసేపటికి నాయఁడు జోగయ్య వెళ్ళిపోయెనని గ్రహించి, సేవకుని బిలిచి 'ఓరీ! ఎందుకో జోగయ్యగారు వచ్చిరి. పోయి కనుగొనిరమ్మ' అనెను. వాఁడును పోయి కనుగొనివచ్చి చెప్పెను. దొర 'అయ్యో! పాపము! మఱి చెప్పకుండ వెళ్ళినా డేమి'యని యొక చిన్న సంచినిండ సూతికాభర ణపుఁగుప్పెలు వేసి పంపించెను. అసలన్ని యెందుకు? జోగయ్య తనపబ్బము గడుపుకొని యా యౌషధమును గాణాచివలె దాఁచు కొన్నాఁడు.

సుబ్బన్నపేఁట జమీందారు లాయుర్వేదౌషధములు నికార సైనవి వండించియుంతురు. అంత ఖరీదులుగల యౌషధము లితరులు వండించలేరు. సంస్థానవైద్యుఁడు పరగణాకంతయు వైద్యుఁడే. సర్వ రోగములకు నాయన చికిత్సచేయును. గొప్ప మందులు కావలసి యున్నచోఁ గోటలోనుండివచ్చును. పేదవారల వ్యాధులకు ధనము పోయకుండఁ బ్రభువులు పాలించుచు వచ్చిరి.

నాయఁ డంతయుదారుఁడు. అంతటిదర్జాగలప్రభువు. జమీం దారుగారి బీళ్ళలోఁబడి దేశముగొడ్లన్నియుఁదినును. బీదవారందఱు పుల్లపుడక లా బీళ్ళలో నేరుకొనిపోయి కూడు వండుకొందురు. జమీందారుగారి చింతలతోఁపులోఁ జింతగాయ విఱుఁగఁగాయును. గ్రామమంతయు యథేచ్ఛముగాఁ గొట్టుకొనిపోయి పచ్చడి పెట్టు కొందురు. పరగణాయంతయు జమీందారుగారి పొరంబోకలలోనున్న చెట్లు చేమలమీఁదఁ జాలవఱకు బ్రదుకును. జమీందారుగారి మిఱప తోఁటలు, వంగతోఁటలు, అఱఁటితోఁటలు గ్రామములో నెవరి యింట నశక్తుఁ డవచ్చినను రక్షించును. జమీందారుగారి తాడిచెట్లు ప్రతివారికిని నారయు, నాకులును తెచ్చియిచ్చును. ఈరీతిగా కృష్ణమ నాయఁడు, నతని పూర్వులును దేశమునకుఁ బ్రభువులై యుండిరి.

సుబ్బన్నపేట జమీందారు వ్యక్తులకే కాదు, సంస్థలకుఁ గూడఁ బెన్నిధులు. సాలున కొకసారి తోలుబొమ్మలవాండ్రు, వీధి నాటకములవాండ్రు, పరగణాలోనున్న ప్రతిగ్రామమున నాడుటకు రాజులు వారికి సాలీయనా నజరానా లిచ్చుచుండిరి. పగటివేషముల వారు, గొఱ్ఱెపొటేళ్ళ నాడించువారు, దొమ్మరవాండ్రు, గారడి వాండ్రు వీరిని వారి ననక యందఱిని ప్రభువులు పోషించుచుండిరి. వారిని జమీందారులనరు. ప్రభువులనియే యెల్లరును వ్యవహరింతురు.

నాయఁడు మిక్కిలి సూక్ష్మబుద్ధి. రసజ్ఞుఁడు. రంగారావుగారికిఁ బుత్రోదయమైనపుడు నాయఁడు పెద్దయుత్సవము చేసెను. గుంటూరు నుండి యెవరో నాటకసమాజమువారు వచ్చి తాము నాటకమాడుదు మని ప్రభువుతో విన్నవించుకొనిరి. అందులో నొకాయన గొప్ప నటకుఁడనియు, స్త్రీపాత్ర ధరించుననియుఁ జూపించిరి. నాయఁడు వానినిజూచి "నీవు స్త్రీపాత్ర ధరింతువా? 'అభిసారికాలక్షణములేమి చెప్పుము'' అనెను. అభిసారికయో, వాసవసజ్జికయో యతని కేమి తెలియును. పాపము మీఁదుగ్రుడ్లు వేసెను. నాయఁడు 'చాల తెలివి గలవారె, ఇంక వెళ్ళుఁడు. నాటకములు వేయుదు మని బయలుదేఱి పాపము భాగవతులవృత్తి చెడగొట్టుచున్నారటయ్యా! మీరందరు బ్రాహ్మణులవలె గన్పించెదరు. చాల బాగున్నది. ఆ బీదముండ కొడుకుల నోటిదగ్గరకూడు చెడగొట్టెదరా? పైన మీ కేమైనను ఆ విద్య వచ్చునా? చచ్చునా! ఇందులో నొక్కనికి డొక్కశుద్ధి యయి నట్లు లేదే! మీలోఁ బురుషవేషము వేయున దెవ్వరు? శృంగార నాయకు లెంతమందియో చెప్పి వారిలక్షణములు చెప్పుఁడు. మీరు నాటకమాడనక్కఱలేదు. మీరు కోరిన దిచ్చి పంపింతు' ననెను. ఒక్కఁడు మాటాడలేదు. ప్రతివాఁడును పప్పుజాఱినట్లు జాఱిరి.

నాయఁడు మంచిబలశాలి. శౌర్యముగలవాఁడు. నాయఁడేమి, యాయన పూర్వులేమి గొప్పవేటగాండ్రు. వేటాడుటకు వారు ప్రత్యేకముగా నడవులు పెంచిరి. నక్కలు, జింకలు, నెలుగుబంట్లు మొదలయిన జంతువులను దెచ్చి యా యడవులలో వదలిపెట్టిరి. నైజామువారియడవులలో వారికి వేటాడుటకు ననుమతికలదు. బాకును, డాలును బుచ్చుకొని పెద్దపులి కెదు రేగిరి. కాని తుపాకితో

వారెప్పుడును గొట్టలేదు. కృష్ణమనాయనితండ్రి హరప్పనాయఁడు 'తుపాకితోఁ బులిని గొట్టుట యేమిరా? అది యాఁడది చేయవలసిన పని' యనెడువాఁడఁట. ఒకసారి యాయన యడవిలోఁ బోవుచుండఁగా మనిషినితినుట కలవాటుపడిన యొకపులి యాయన వెనుకనుండి దూఁకి మెడఁబట్టుకొనెనఁట. రెండుచేతులెత్తి వెనుకనుంచి దానిమెడ నదిమిపట్టి పేచీతో దానినిబట్టి బాకుతోఁ గ్రుమ్మి చంపెనఁట. ఆయనచనిపోవువఱకు నాయనమెడమీఁద దానిగాటులు కనఁబడు చునే యుండెడివని చెప్పుదురు వారు మనుష్యులు సాలప్రాంశులు, మహాభుజులు, వృషస్కంధులు, కవాటవక్షులు.

కృష్ణమనాయనింగారి దగ్గఱ కొకపుడు పొట్టేళ్ళ నాడించు రాజులు వచ్చిరి. అందులో నొకరాజుగారు పొట్టేలును వెనుకకుఁ దోసి దండయిచ్చెను. రాజుదండ వణికిపోయెను. నాయఁడు "దండ కాదయ్యా చేతిని"మ్మనెను. రాజుగా"రయ్యా! చేయిబెణికిన"దనెను. నాయఁడు తానిచ్చెదనని లేచి పొట్టేలును రెచ్చగొట్టి దెబ్బకుఁజేయి పట్టెను. పొట్టేలు రివ్వుమనివచ్చి నాయనిచేతిని దాఁకెను. పొట్టేలు నకుఁ జేతినిచ్చుటలో నొకయొడుపున్నది. ప్రక్కకొరిగి నిలుచుండి, పొట్టేలుతలకు చేయిచ్చి, యెడమచేతితోఁ బొట్టేలునుత్రోసి మెడఁ బట్టుకొన్నచో దెబ్బతగులదు. నాయఁడట్లుగాక మహాద్రివలె స్థిరుడై నిలుచుండెను. రాజు లాశ్చర్యపోయిరి. 'అయ్యా! తమ కనుభవ మున్నది, మాకు లేదు'అనిరి. నాయఁడు వారికి రెండువందలరూపాయ లిచ్చి పంపించెను.

కుస్తీపట్టుట, కత్తిత్రిప్పుట, కఱ్ఱత్రిప్పుట యీ విద్యలయందుఁ బ్రభువు లద్వితీయులు. కృష్ణమనాయఁడు కత్తిసాములో నారితేరిన జోదు. ఒకసారి రెండువందలమందిని కఱ్ఱలతోఁ దనమీఁదికి రమ్మని తాను కత్తియు, డాలునుగొని మొగమోటములేకుండ నెవరైనను సరే తననుగొట్టినచో వేయినూటపదాఱులు బహుమానమిచ్చెదనని సాముచేసెను. గంటసేపు ఒక్కఁడును రాజును దాఁకలేకపోయెను. చివరకు వారందఱకు బహుమానములిచ్చి, "అవునోయీ! యీ విద్య యెందుకుఁ బనికివచ్చును? ఒక్క తుపాకిముందర నిది యెందుకుఁ

బనికిరాదు. ఒకవేళఁ బనికివచ్చినను చేసెడిదేమి" యని యున్నరనెను. దేశమున కింక నే విద్యయు నక్కఱలేదు.

నాయఁడేఁబదివేలుపెట్టి కాశ్మీరమునుండి యొకయేనుఁగును దెచ్చెను. అది తాళవృక్షప్రమాణమున నుండెను. దాని రెండు దంతములును దీర్ఘములై శత్రువుల నందుకొని నలిపివేయుటకుఁ జాఁచిన బాహువులవలె భయంకరములై యుండెను. పదిమంది మావటీండ్రు దానిని గొలుసులతోఁగట్టి బహుప్రయత్నముమీఁద దేవిడీకిఁ దెచ్చిరి. కోటలో నాలుఁగువందలయేండ్లనాఁటి రావిచెట్టు కలదు. తక్కినయేనుఁగుల నటనుండి తొలఁగించి యీ గజరాజునకు నది తావుచేసిరి. దీర్ఘప్రయాణములచేత, నిరంతరబంధనముచేత దానికి స్వాస్థ్యము చెడి యారాత్రి మదించి గొలుసులు త్రెంచుకొని యడవినిఁ బడెను. దాని నెవరును బట్టి తేలేకపోయిరి. నాయఁడు స్వయముగా లక్ష్మణస్వామి యను తన పెద్దయేనుఁగు నెక్కి యడవికిఁ బోయి, యాయేనుఁగున కెదురునడచెను. లక్ష్మణస్వామి బెదరెను. కాని పైని నాయఁ డున్నంతసే పతఁడు చెప్పినట్లు నడువవలసినదే. మదించినయేనుఁగు రివ్వుమని నారసమువలె నాయనివైపు దూసికొని వచ్చెను. నాయఁడు బొంయి మని యొక ధ్వని చేసెను. ఏనుఁగు దగ్గఱకువచ్చి యాఁగెను. కాని తొండమెత్తి లక్ష్మణస్వామితోఁ బోరాటమునకు సిద్ధపడెను. నాయఁడు లక్ష్మణస్వామి దంతముల మీఁదికి దిగి; మదపుటేనుఁగు తొండము చిక్కఁబట్టెను. దాని దంతములు బలముగాఁ జేతులతోఁ గుద్దాలించెను. ఏనుఁగు కెవ్వుమని వెనుదిరిగెను. కాని నాయఁడు దాని వెనుదరిమి మాలిమిచేసి లక్ష్మణస్వామిపైనుండి దాని కుంభస్థలముమీఁదికి దూఁకి యింటికి నడిపించి తెచ్చెను. లక్ష్మణస్వామి వెనుకనే వచ్చెను. ఇనుపమేకులు వేసిన యినుపసిలువ నిరంతరము నెలనాళ్ళు దానిమెడక్రింద వ్రేలాడ వేసిరి. ఎంతమంది మావటీండ్రకు నది లొంగలేదు. నాయఁడు రావలయు, నది మాటవినవలయు. నాయని కివి క్రొత్తవిద్య కాదు, కులక్రమాగతవిద్య.

ఈ ప్రభువులయడవులమీఁద నా ప్రాంతమునందలి జనులందఱు బ్రదుకుదురు. నానాఫలములు కోసికొనిపోదురు. ఎండిన

మోసములన్నియు నఱకుకొనిపోదురు కుందేళ్ళు మొదలయిన చిన్న జంతువులను జంపి యాహారమునకుఁ దెచ్చుకొందురు పసువుల నడవిలో మేపుకొందురు పిల్లయు, మేకయుఁ బ్రొద్దున లేచినది మొదలు సాయంతన మగువఱకు నచటనే యుండును. చెట్లగుంజలు, నాకులు, పుల్లలు వీనితో బ్రదుకుదురు. జమీందారున కీవలసిన సుంకము పైసాలేదు. రాజు పాలమున కధికారియైన రైతువద్దనుండి శిస్తుతప్ప వేఱే చిల్లిగవ్వ ప్రజలనుండి యాహరించఁడు. ఇట్లు మూఁడువందలయేండ్లు జరిగెను.

నాయలువిద్యాపోషకులు. సాంగవేదాధ్యయనపరులకు, జ్యోతిష పండితులకు నగ్రహారము లిచ్చిరి. ఆంధ్రకవులను, సంస్కృత పండితులను బోషించిరి. వారియను జదువను వారెవ్వరికిఁ జేత గాదుగాని యందఱును నిత్యపండితగోష్ఠివలన, బహుపరిచయము వలన సర్వవిషయములు నెఱిఁగియే యుండిరి. ఒకప్పుడు హరప్ప నాయనియొద్దకు నొక భాష్యాంతవైయాకరణులు వచ్చిరి. అప్పుడే యొక తెలుఁగుకవియు వచ్చెను. కవి రాజును బొగడుచుఁ బద్యములు చెప్పెను. అందులో 'సౌదామని' యనుశబ్దము వచ్చెను. పండితుఁడు "అబ్బో" చాల ప్రౌఢప్రయోగము చేయుచున్నాఁడు కవి. 'తేనైకదిక్' అన్న సూత్రముచేత సౌదామనీశబ్దము సిద్ధించుచున్నది. కవి చక్కఁగా వ్యాకరణముకూడ నభ్యసించిన ట్లున్నది" యనెను. కవి కీ గోడేమియుఁ దెలియదు. నాయఁడు నవ్వి "శాస్త్రిలు గారూ! సౌదామని అన్న మెఱపుతీఁగ యని యెవరికిఁ దెలియదు? అది వ్రాయుటకు మీ వ్యాకరణము రానక్కఱలేదు" అనెను. ప్రభువులు చక్కని ప్రపంచజ్ఞానమును, వివేచనాశక్తియును గలవారు.

భట్రాజులు, తెలుఁగులు చక్కఁగాఁ జదివి ధారాళముగాఁ గవిత్వముచెప్పఁగలవారు - కైవారముచేయుటకుఁగాను జమీందారుల చేతఁ బోషింపఁబడుచు వచ్చిరి. భారత భాగవత రామాయణాది సంస్కృతాంధ్రగ్రంథములు, తాటియాకులమీఁద వ్రాసినవి, దేవిడీలో భాండాగారముండెడిది. వ్రాఁతగ్రంథములు తిరిగి వ్రాయుటకు సిద్దఱు వ్రాయసగాండ్రెప్పుడు నుండెడివారు.

దేవిడీముందటిసావడిలోఁ బూర్వకాలపుచిత్రము లమర్పంబడి యుండెను. గోడలయందుఁ గత్తులు, కఠారులు, బాకులు, బల్లెములు, డాలులు మొదలైన యుద్ధమునకు, వేఁటకు నుపయుక్తమయిన యాయుధము లమర్పఁబడియుండెను.

కోటకు సింహద్వార మొకటి, వెనుకద్వార మొకటి యుండెను. కోట యాంగిలేయులకుఁ బూర్తిగా దేశము స్వాధీనము కానపుడు కట్టినది గాన కోటగోడ కొండఱాతితోఁ గట్టఁబడి యొక శకటము సునాయాసముగఁ బోవుటకు వీలయినంత యెడము కలదై కందకమునుగూడ కలిగియుండెను. కందకము పాడువడియున్నది. ఊరున్న వైపులఁ గందకము పూడఁబడియున్నది. కొన్నియెడలఁ గోటగోడ శిథిలమైపోయెను. అది మఱల మరమ్మతుచేయుటకు దొరతనమువారి యనుమతి లేక యట్లే యున్నది.

కోట విశాలమై పదివేలమంది జనులు సుఖముగా నివసించుటకు వీలయినదిగా నుండెను కోటలో నెల్లెడ నున్నతములైన వృక్షములు, దిగుడుబావులు, ఫలవృక్షములు, బహుజాతులు గల తీవలు గలవు. కోటలో దక్షిణదిశయందుఁ బెద్దసావడిలో బోనులలో నమర్పఁబడి పులులు, చిఱుతలు, సివంగులు, కొరనాసిగండ్లు, కోఁతులు మొదలయిన యపూర్వజంతువులును, నానాజాతిపక్షులును పెంచఁబడుచుండెను. వానిని జూచుటకుఁ గ్రొత్తవా రెప్పుడును వచ్చుచునే యుందురు. కోటయే వస్తుప్రదర్శనశాల. కోటయే పుస్తకభాండాగారము. కోటయే విద్యాపోషణసంస్థ. కోటయే తల్లి. కోటయే తండ్రి, కోటయే సర్వముగా నుండెడిది.

ఆస్థానకవులు, పండితులు, వస్తాదులు, సాముచేయువారు, గరిడీలు నేర్పువారు, రాజబంధువులు, బ్రాహ్మణోత్తములు, గాయకులు — వారు వీరననేల యెల్లరకుఁ గోట ముంగిటనున్న పెన్నిధానమై యుండెడిది.

ఈ శోభలోఁ గృష్ణమనాయని చివరిరోజులలోఁ గొంత తగ్గిపోయెను. రామేశ్వరశాస్త్రిగారి తండ్రి నారాయణశాస్త్రిగారివఱకు నీ జమీందారులకు వారే మంత్రులుగా నుండిరి. తరువాత రామేశ్వరశాస్త్రిగారు చాలకాలము మంత్రిత్వముచేసెను. వారు మంత్రు

లుగా నున్నన్ని దినములు సర్వవిషయములందును వారి మాటయే సాగినది. జీతము బత్తెములేని మంత్రులు.

రామేశ్వరశాస్త్రిగారు బహువ్యాపృతుఁడగుటచేతఁ గృష్ణమనాయఁడుగారు చాలభాగము తమపనులు తామే చూచుకొనుచుండెడివారు. చివరిరోజులలో శాస్త్రిగారిపని సన్నపడినతరువాత వారికి,వీరికిఁ జొత్తే కుదురలేదు. కృష్ణమనాయఁడు నెలకు రెండువందలరూపాయలు జీతమిచ్చి హరిహరనాథరావుగారను నొకాయనను దివానుగా వేసెను. హరిహరనాథుఁడు బి. ఏ. ప్యాసయి డిప్యూటీ కలెక్టరు చేయుచు నీ యుద్యోగములోనికి బదిలీ వచ్చెను. జిల్లాకలెక్టరు దివాను తప్పక యుండవలెనని యీయనను నాయనిపైకి జారీ చేసెను. నాయఁడు కాదనలేక యూరకుండెను.

కాని నాయఁడు బ్రతికియున్నన్నినాళ్లు దివానుచేత నేపనియుఁ జేయించలేదు. ఆయన మాట యెప్పుడును వినలేదు. ఆయన తెచ్చిన సిఫార్సులు చేయలేదు. ప్రతిదియు నాయనకు వ్యతిరేకమే చేసెను. దివానని నాయనికిఁ గోపముకూడను. జీతముమాత్ర మూరకే యిచ్చుచుండెను. నాయఁడు వృద్ధుఁడైన పదేండ్లలోఁ గోటలోఁ జాలమార్పులు జరిగెను. వృక్షములు కొన్ని పడిపోయెను. అడవి జంతువులు గొన్ని చనిపోయెను. చివరకుఁ గోట సగమునకు సగమయ్యెను.

ఈ స్థితిలోఁ గోట రంగారావుగారి చేతిలోనికి వచ్చెను. కృష్ణమనాయఁడుగారు పోవునఱకు శిస్తులో లక్షరూపాయలు బకాయి పడియుండెను. రావుగారు దివానును బిలచి బకాయి ప్రతిపైసయు వసూలుచేయవలయునని చెప్పెను. రెండు నెలలలో నొక వేయి జప్తులు జరిగెను. ప్రజలు ఘోషించిపోయిరి. 'రాజు మునుపటివలెఁ గాదు. మంచి నిక్కచ్చి మనిసి' యని ప్రజలందరు చెప్పుకొనిరి.

జమీందారీశిస్తు గవర్నమెంటుశిస్తువలె వసూలుకాఁ జొచ్చెను. రంగారావుగారు హరిహరనాథరావుగారిని దొలఁగించి నాగేశ్వరరావుగారను నొకాయనను దివానుగా నియమించిరి. ఈ నాగేశ్వరరావుగారు కాఁపు; జమీందారుగారికి సహాధ్యాయి. నాగేశ్వరరావుగారికి నెలకు నాలుగువందలరూపాయలు వేతనము.

నాగేశ్వరరావుగారు గుడివాడసీమవాఁడు. సుబ్బన్నపేటలో నాయన యెవరో యెవరు నెఱుఁగరు. ఉద్యోగ మయినతరువాత దివానుగారు బెజవాడవద్ద రైలుదిగి, మోటారుమీఁద సుబ్బన్నపేటకు వచ్చుచుండెను? పేటకు దగ్గరలో జమీందారీ బీడులలో బుల్లలేరుకొనువారినందఱు బట్టి జరిమానాను వేసెను.

ఈ వార్త పరగణాయంతయు వ్యాపించెను. 'క్రొత్తదివానుగారు రాజుగారికన్నఁ జండప్రచండుఁడు. ఒడళ్లు దగ్గరపెట్టుక మనవలె' నని సర్వజనులకుఁ దెలిసిపోయెను. దివానుగారు కోటలోని యుద్యోగుల నందరిని బరిశీలించెను? అనవసరమైనవారి నందఱను దొలఁగించెను. కోటలో నలువదిమంది గుమాస్తాలుండిరి. వారిలోఁ బాతికమంది నుంచి మిగిలినవారిని విడుదలచేసెను. ఇంచుమించుగా నిరువదిమంది కాసావాండ్రనుగూడఁ దొలగించెడివాఁడే కాని, రాణివాసమునుండి యభ్యంతరములు వచ్చెను. అడవిజంతువులు చాల చచ్చిపోయినవి. గనుక నచటనున్న పదిమంది సేవకులలో నిద్దఱిని మాత్రమే యుంచి మిగిలినవారిని బంపివేసెను. ఈరీతిగాఁ బంపివేయఁబడిన చిన్న ఉద్యోగస్థులవలన నెలకుఁ బదునేనువంద లాదా కనబడెను. కోటలోనున్న పాతికమందిగుమాస్తాలును బ్రాహ్మణులే. వారిలోఁ బదునేనుమందిని దొలఁగించి యా యుద్యోగములను బ్రాహ్మణేతరుల కొసంగెను.

బీళ్ళలోనుండి యొకపుల్ల పోకుండ, నడవులనుండి జను లేమియు నెత్తుకొనిపోకుండఁ గట్టుదిట్టములు చేసెను. అడవులమీఁదఁ గొంద ఱుద్యోగస్థుల నియమించి యెవరైన నడవులనుండి యేమైనఁ దీసికొనిపోయిరేని 'పుల్లరి' వసూలుచేయించెను. కృష్ణమనాయఁడు పోయిన మూఁడునెలలలో నెక్కడి కక్కడికి వ్యవహారము శుభ్రమయ్యెను. పాతబాకీలు లక్షరూపాయలు వసూలయ్యెను. ఆ ధనముతోఁ బట్టాభిషేకము జరుగవచ్చును.

పట్టాభిషేకము వచ్చెను. ఇంటివద్ద బ్రయత్నములన్నియు దివానుగారే చేయుచుండిరి. రంగారావుగారు నెలనాళ్ళయినది పోయి చెన్నపురికి. అచ్చట గవర్నరు మొదలయినవారికి నజరానాలు పంపించుచు, వారిదర్శనము చేయుచుండెను. వారును యువకుఁడు,

నూతనాభిప్రాయములుకలవాఁడు నయిన రంగారావుగారి కాలములో రాజ్యము చక్కఁగా వృద్ధికిఁవచ్చు నని యాయనను మెచ్చుకొనిరి. చెన్నపురిలోఁ దక్కినజమీందారు లనేకు లుండిరి. వారందఱితోఁ గలసికొనుట, దేశవిషయములు విచారించుట మొదలగు నున్నతాశయములతో రంగారావుగారు రాజ్యము భవిష్యత్తున వృద్ధిపొందుటకుఁ దగిన మార్గము లప్పుడే యనుసరించ మొదలుపెట్టెను.

రంగారావుగారికిఁ బెదతల్లికుమాళ్ళిద్దరు గలరు. మేనత్త కుమారుఁ డొకఁడు. పెదతల్లికుమాళ్ళు రాధాకృష్ణయ్యగారును, రామేశ్వరముగారును. మేనత్తకుమారుని పేరు సర్వారాయఁడుగారు. వీరి ముగ్గురికిని రంగారావుగారికిని చిన్నప్పటినుండియుఁ జెలిమి. కృష్ణమనాయఁడు బ్రతికియున్నన్నినాళ్ళు వీ రెవరికిని రాజ్యవ్యవహారములలోఁ బ్రాల్గొన వీలు లేకపోయినది. ఇప్పుడు వీరే సర్వాధికారులు. రంగారావుగారు చెన్ననగరములోననే నివాసము. ఇంటివద్ద వ్యవహారములు వీరు మువ్వురు, దివానుగారును చూచునది. సర్వారాయఁడుగారిది పెత్తనము. పట్టాభిషేకమునకుఁ బ్రయత్నములు విశేషముగా సాఁగెను. వచ్చినజనులు నివసించుటకు, భోజనములు చేయుటకుఁ బందిళ్లు వేయించిరి. పదివేలరూపాయలు పెట్టి పంపులు పెట్టించి పట్టాభిషేకనగరమంతయుఁ గుళాయీలు నిర్మించిరి. పదివేలు పెట్టి ఎలక్ట్రిసిటీ ప్లాంటు తెప్పించి యుంచిరి. ఆహ్వానముల కాగితము లచ్చువేయుటకే రెండువేలరూపాయ లయ్యెను. జనము బెజవాడనుంచి సుబ్బన్నపేటకు రానుపోను పది క్రొత్తబస్సులు కొనిరి. వెయ్యి పెల్ పెట్రోలుడబ్బాలు కొని సగము సుబ్బన్నపేటలోను, సగము బెజవాడలోను నిలువఁజేసిరి. దేశములోనున్న పెద్దపెద్ద కవులకందఱకు నాహ్వానములు వెళ్లెను. తక్కినకవు లాహ్వానము లేకనే వత్తురుగదా! దేశములోఁ బేరువడిన నాటకసమాజములచేత నాటకము లాడించుటకూడ కార్యక్రమములో ముద్రింపఁబడెను. తెలుఁగుదేశపుగాయకు లెవరు చెప్పఁదగినవారు లేరు. కనుక అరవదేశపు వారివి నాలుఁగు పెద్ద సంగీతసభ లేర్పాటుచేయఁబడెను. గ్రాండ్ ఇండియన్ సర్కసు వారిచే రెండుప్రదర్శనము లేర్పాటుచేయఁ

బడెను. విజయనగరమునుండి గొప్ప మ్యాజిక్ చేయు ప్రొఫెసరుగారిని బిలిపించిరి.

రంగారావుగారి రెండవమేనత్త నాగమ్మగారు. ఆమె బాల వితంతువు. ఏఁబదియేండ్లది. ఆమె చిన్నప్పటినుండియు సుబ్బన్న పేఁటకోటలోనే పెరిఁగెను. అందే యుండెను. కృష్ణమనాయనిదగ్గఱ నామె మాటయుఁ గొంత సాఁగుచుండెను. ఆమె చిన్నతనమంతయు హరప్పనాయఁడుగారి రోజులలోఁ గడచుటచేత నామెకు నాటకము లన్న వీథినాటకములే నాటకములు; పగటివేషాలవారే విద్యావంతులు; తోలుబొమ్మలే చూడఁదగినవి. ఆమె సర్వారాయఁడుగారి నడిగెను. 'కూచిపూఁడివారిని బిలిపించుచున్నారా' యని. ఆయన నవ్వి 'కూచిపూఁడివారు మోటమ్మా! బెజవాడనుంచి గుంటూరునుంచి గొప్పనటకులు వచ్చుచున్నారు' అనెను. నాగమ్మగారు పెదవి విఱిచెను. ఇతరగ్రామములనుండి పది భోగముమేళములు రప్పింపఁబడెను. ఊరిలో నున్న మేళమును బిలువలేదు. ఊరిలో మేళమునకు రత్నగిరి నాయకురాలు. ఆమెకుఁ గూచిపూఁడివారు విద్యాగురువులు. భామకలాపము చెప్పుటలో, భరతములో, క్షేత్రయ పదములు నధ్యాత్మరామాయణకీర్తనలు పాడి యభినయించుటలో నామె పేరుమ్రోసెను. స్పష్టమైన యుచ్చారణ, భావాభిరామమైన యభినయము రత్నగిరిసొమ్ము. కష్టపడి చెప్పుకొన్నచదువు. "పిలువకపోయిననుసరే వారియుప్పు తిన్నాము గనుక నావేళకు మేళము కట్టుటయే" యని రత్నగిరి నిర్ణయించి తక్కినవారిని సజ్జీకరించెను.

రామేశ్వరశాస్త్రి యుంపుడుకత్తె యయినప్పటినుండి రత్నగిరి మేళములు మానివేసెను. శాస్త్రి యామె నైదేండ్లుమాత్రమే తనయొద్దికలో నుంచుకొనెను. తరువాత నామెను వదలివేసెను. ఆమెయు నాతరువాత వృత్తి పరిత్యజించి, శాస్త్రిగారిచ్చిన యాస్తి మీఁదనే బ్రదుకుచుండెను. రత్నగిరి మేళము కట్టుట దేవదాసి కిష్టములేదు. దేవదాసి పసిపిల్ల. రత్నగిరి దానిమాట త్రోసివేసెను. పట్టాభిషేకము నాలుఁగుదినము లున్నదనఁగాఁ జెన్నపురినుండి రంగారావుగా రరుదెంచిరి.

నాయఁడు చనిపోయినప్పటినుండి లక్ష్మణస్వామి సరిగా రావియాకులు మేయఁడు. నీరు త్రాగఁడు. గడ్డితోఁ జుట్టి నల్లమందిచ్చినచోఁ దొండముసాఁచి గ్రహించఁడు. రావిచెట్టుక్రింద నిలుచుండి తపస్సు చేయును. మావటీఁడు దివానుగారితోఁ జెప్పెను. ఆయన పనితొందరలో వినిపించుకొనలేదు. లక్ష్మణస్వామికి నెఱుఁబదేండ్లు. మిక్కిలి వృద్ధమైనజంతువు అన్నాళ్ళు బ్రదికిన యేనుఁగులేదు. రంగారావుగారు చెన్నపురినుండివత్తు రన్నరోజున లక్ష్మణస్వామి నీరుత్రాగి, మేత తిని, దొడ్డియంతయుఁ బరవళ్ళుత్రొక్కెను. మావటీఁడు స్వామి మార్గము లెఱిఁగినవాఁడు. హౌదా తెచ్చి స్వామిపైఁ బఱచి ప్రభువు వచ్చుమార్గమునఁ గ్రోశముదూరముపోయి యెదురుకాచెను. దివానుగారుగాని, పెత్తనదార్లుగాని యెందుకని యడుగలేదు. మావటీఁడు చెప్పలేదు. దారిలో నొకజా మెదురుచూచినతరువాత దూరమునుండి జమీందారుగారి కా రెదురువచ్చుచుండెను. కారు కూసెను. లక్ష్మణస్వామి దారితొలఁగలేదు. వృద్ధమైన లక్ష్మణస్వామియొడలు ముడుతలుపడెను. కృష్ణమనాయని పట్టపుటేనుఁగు నేఁడు చిక్కి శల్యమయ్యెను. కాని దాని చూపునందు తీవిపోలేదు.

చివరకు జమీందారుగారు మోటారు నాపించిరి. మావటివాని నదలించిరి: వాఁడు 'దొరా! ఏనుఁగు కదులుటలేదు. నాలుఁగు నెలలనుండి మేఁతతినని స్వామి ఈనాఁడు తిన్నాఁడు. దొడ్డియంతయుఁ బరవళ్ళు త్రొక్కినాఁడు. ఈనాఁడు హౌదా మెత్తనిచో స్వామికి బిచ్చియెక్కునని తెలియును. అందుచేత హౌదామెత్తి ప్రభువునకు నెదురుతెచ్చితిని' అనెను. ప్రభువు చిఱ్ఱుబుస్సులాడి కారును తొలఁగించి తోలుకొనిపోయెను.

పగతీరినదన్న పాపఱేఁడు ప్రక్క లొరయుచు నాసారంధ్రము నెక్కి మెదడులోఁ బీఠమువెట్టఁగా శ్రీకాళహస్తీశ్వరుఁడు మల్లికార్జునదేవుని మహాభక్తుఁడు త్రేతాద్వాపరసంధినాఁటి గజరాజు బాధచేఁబెట్టిన ఘీంకారములవంటి హృదయవిదారకమైన ఘీంకృతి వెనుకనుండి పటాపటాలు మని మిన్నులువిఱిగి పగిలి నేలఁబడిన ప్రళయమేఘగర్జానినాదమువలె వినవచ్చెను. వెనుక నద్దములోనుండి రాజు వెనుదిరిగి చూచెను. ఆహారార్థము కశ్యపునిచే ననుమతిఁగొని

వైనతేయునిచే నతిరంహఃస్ఫూర్తిచే నఖాగ్రముల నొడిసిపట్టుకొనఁబడిన గజకచ్ఛపములయందలి గజమువోలె లక్ష్మణస్వామి మహాబాధాసహ్యమైన శరీరమునందు మెలికలుతిరిగిపోవుచుండెను. మావటివాఁడు క్రిందఁబఁడి లేచి సమీపతరుసన్నిధికిఁ బోయెను. మోటారు వాయువేగముతోఁ బోయెను. స్వామి బాటప్రక్కఁ బడి ప్రాణములు వదలెను. రాజుబాటనే కాదుగదా, రాజకీయులబాటకూడ నడ్డగించ నెంచలేదు. పాపము మావటీఁడు ఏఁబదియేండ్ల తన ప్రాణబంధువును విడలేక తన్మృతకళేబరముమీఁదఁబడి ప్రొద్దుక్రుంకువఱకు విలపించెను. ప్రొద్దుక్రుంకినతరువాత హౌదాత్రాళ్ళూడతీసి, యంకుశము చేతఁగొని, పెద్దకుమారునికిఁ దహనసంస్కారముచేసి యింటికిఁ దిరిగివచ్చు దండ్రివలెఁ గోటకుఁ దిరిగివచ్చెను. ఏనుఁగుచావు శుభసూచకముకాదని ముసలమ్మలనిరి. ముసలమ్మలట్లే చత్తురని నూతనులనిరి. మఱునాఁడు హౌదా కోటకుఁ దెప్పించిరి. బాటకు దూరముగా జరీబులో స్వామిని పాఁతిపెట్టించిరి. మావటీఁడా నాఁడే మంచముపట్టెను. ఈ మహోత్సవములో మావటివానిసంగతి యెవరు కనుగొనిరి? వానికి 'విపరీతమైన జ్వరము' వచ్చి, జ్వరములో స్వామి తన్ను తొండముతో లాగుచున్నట్లు, దంతములతోఁబొడుచుచున్నట్లు కలలు కని కని మూఁడవనాఁడు చనిపోయెను.

నాలుఁగవనాఁడు రంగారావుగారికిఁ బట్టాభిషేకముజరిగెను. ముహూర్త ముదయమున. రాజు రాధాకృష్ణయ్యగారును, సర్వారాయఁడుగారును గూర్చుండుమనినఁ గూర్చుండును. లెమ్మనిన లేచును. అంతయు వారిమీఁదుగా జరిగిపోయెను. పట్టాభిషేకవేళ గవులు పద్యములుచదివిరి. కొందఱికిచదువుటకువీలులేకపోయెను. హడావిడిలో భట్రాజులకై వారములు వినిపించనే లేదు. పెద్దపెద్దయుద్యోగస్థులు వచ్చుచుండిరి. వారికి స్వాగతమిచ్చుటకై పెద్దలందఱు నియోజితులైరి.

రంగారావుగారు బంగారపుఁబనిచేసిన దంతపుగద్దెమీఁద నాసీనులయిరి. శిరస్సుమీఁద నాగన్ననాయఁడుగారు చేయించిన కిరీటము ధరించిరి. ఆ కిరీటమున వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ మకరత మాణిక్యములు ఆఱువరుసలుగాఁ బొదిగినారు. అది ధగధగ లాడిపోవుచుండెను. చేతిలోఁ గటారియుండెను. కత్తిపిడి రత్నమయము.

ఒక పొడుగున మాణిక్యములు మూఁడు వరుసలుగాఁ బొదుగఁబడి యుండెను. రాజు మధ్యాహ్నమార్తాండునివలెఁ దేజోదుర్నిరీక్ష్యుఁ డయ్యెను. సభలో సందఱును గలరు. ధర్మారావుమాత్రము లేఁడు. అతనిని బిలిచినవారు లేరు, అతఁడు వచ్చినది లేదు. సుబ్బన్నపేట జమీందారులలో నెవ్వరికిని ధర్మారావువంశీకులు లేకుండఁ బట్టాభిషేకము జరుగలేదు.

సరిగా రాజుశిరస్సున నభిషేకోదకములు పురోహితుఁడు చల్లుచుండెను. సభలో నెవరో 'పాము,పాము' అని గగ్గోలుపడి లేచిరి. సభయంతయుఁ గల్లోలమైపోయెను. పాముకోసము వెదకిరి. ఎచ్చటను గన్పించలేదు. రాజుగారి సింహాసనమువద్దనుండి బయలుదేరిన దని కొందఱును, బయటికి వెళ్ళిపోయినదని కొందఱును ననిరి. చెదరిపోయిన జనులను గూర్చుండఁబెట్టుట దుర్ఘట మైపోయెను. అభిషేకమైనతరువాత బ్రాహ్మణు లాశీర్వాదపుఁబనసలు చదివిరి. అప్పటికే రెండుజాములయినది. కొందఱు పెద్దకవులకును, పెత్తనదారు లెత్తఁగిన కవులకును సమ్మానములు జరిగెను. సభ యాపూటకు చాలించిరి. భోజన మైనతరువాత రంగారావుగారు దంతపుగద్దెమీఁదనే మేడపై సావడిలోఁ గూర్చుండిరి. చుట్టును దివానుగారును, రాధాకృష్ణయ్య రామేశ్వరం సర్వారాయఁడుగార్లును గూర్చుండిరి. రంగారావుగారు 'మధ్య నెవ రది పాముపామని యల్లరిచేసినది' యనెను. రామేశ్వరం గారు చాలసమయస్ఫూర్తి కలవాఁడు. "ధర్మారావు పట్టాభిషేకమునకు వచ్చెనా" యని యడిగెను. 'అతడే ఈ యల్లరి చేసియుండు' నని దివానుగా రనెను. దివానుగా రింతవఱకు ధర్మారావు నెఱుఁగడు. రంగారావుగారికి రామేశ్వరంగారి మాటలయందు విశ్వాసము లేదు. ధర్మారావును జమీందా రెఱుఁగును. అతఁడుగాని పిలువఁబడకుండ రాఁడు. సర్వారాయఁడుగా 'రతఁ డసలు రానే లే' దనెను.

రంగా—అవునులే. అతఁ డెందుకు వచ్చును? మా సొమ్ము చేఁదైనది. అబ్బో! అంత గర్విష్ఠి. అతఁ డేల వచ్చును?

రాధా—ఆయన కాహ్వానము వెళ్ళినదా?

రామే—ఆహ్వాన మెందుకండీ? ఆశ్రయించుకు బ్రదికెడువారి కాహ్వానములు కావలయును కాఁబోలు!

జమీందారుగారి కీమాటలు చక్కఁగా నచ్చెను. ఇదివఱకే ధర్మారావుమీఁద నాయనకుఁ గావలసినంత వైమనస్యము కలదు. ఈ మాటలు బాగుగాఁ బుఱియెక్కించెను. ఇంతలో సర్వారాయఁడుగా రేదో చెప్పవచ్చినట్లు వచ్చి నూనివేసెను. జమీందా 'రేమిటి చెప్పవచ్చితి' వని బలవంతపెట్టెను. సర్వారాయఁడు "గణాచారి యీ మధ్య నొకపాట పాడుచు నూరివెంటఁ దిరిగెను. వేయితలల పాము కలలో రాజును కఱచిన దనుచుఁ బాడెను. నేఁడు మఱలఁ 'బాము పా'మన్నారు. ఈ రెంటి కేమి సంబంధము" అనెను. రంగారావుగారు 'ఆఁ' అని యాశ్చర్యపోయెను. నలుగురు 'నదే'మని ప్రశ్న వేసిరి. జమీందా రిట్లు చెప్పెను "అవును. నాకు సరిగాఁ గల యట్లే వచ్చెను. సుమారు రెండునెల లయినది. ఆ దినముననే ప్రాఁత దివానుగారిని దొలఁగించి నాగేశ్వరరావున కార్డరువ్రాసి టపాలోఁ బంపించితిని. ఆ రాత్రి నిద్రయే పట్టలేదు. నిదురపట్టువఱకుఁ దెల్లవాఱుకడ రెండుగంట లయ్యెను. ఆ నిద్రలోఁ గలవచ్చెను. వేయితలల పాము వచ్చి నా మంచమువద్దఁ దోఁకమీఁద నిలుచుండెను. నేను దానివంకఁ జూచుచు నూరకుంటిని. మా నాయనగారికి, మా పూర్వులకుఁ గలలలో నిట్లు పాము వచ్చుట, దూరముననుండి చూచుట యున్న దని మా వాండ్రు చెప్పెడివారు. కాని నే నది నమ్మలేదు. నాకును నట్లే జరిగెను. ఆ పా మట్లే నిలుచుండి నావంకఁ జూచుచుండెను. దాని కన్నులనుండి, చాఁచిన నాలుకలనుండి విషములు గ్రక్కుచుండెను. నా కెందుచేతనో యీ సర్పమునుజూడఁగా నవ్వు వచ్చినది. నేను పరిహసించుచుంటి నని కోపమువచ్చి న న్నది వేయితలలతో వేయిచోట్ల కాటువేసెను. అబ్బా! నాశరీరమునఁ దాని కాటుతగులని తావే లేదు. నాకు భయమయ్యెను. భయమగుటయు, మెలఁకువ వచ్చుటయు నొక్కసారియే యయినది. కన్ను విప్పుసరికిఁ దెల్లవాఱుచుండెను. మఱల నిద్రయుఁ బట్టినది కాదు. తరువాత నింతవఱకు మఱల నట్టి కలగాని, యేమిగాని రాలేదు."

సర్వా—ఇది చిత్రముగానే యున్నది. ఆ కలమాట గణాచారి కెట్లు తెలిసినది? మీ రెవరితోను జెప్పలేదు కదా!

రంగా—ఎవరితోడను జెప్పలేదు. చెప్పుట కందు నేమున్నది!

సర్వా—ఏమో యున్నట్లే యున్నది. అసలు మీ యారే పాముఁలయినారు, మీ రందఱుఁ బాములవాండ్రు.

జమీందారు మేనత్తకొడుకు వరుస లాడిన ట్లనుకొనెను. దివానుగారు 'పిచ్చినమ్మకములు' అని నవ్వెను.

రంగారావుగారు తలయెత్తెను. జరీమెలిపెట్టి తోరణములుగా వ్రేలాడఁ గట్టఁబడియుండెను. ప్రతితోరణముచివరఁ దెల్లనిపట్టు మల్లెపూచెండులవలెఁ గట్టి ఆ మల్లెచెండులచివర నెఱ్ఱని డాగురేకులతో గులాబిపూవులవలె నదుకఁ బడియుండెను. మేడ పై భాగమంతయు నట్టి తోరణాలే వ్రేలాడుచుండెను. తోరణము లన్నియుఁ బాములై, చెండులన్నియు పడగలై, డాగురేకు లన్నియు నెత్తురుమియుచున్నతలలై మఱలఁ దనకల సాక్షాత్కరించినట్లురంగారావుగారు దిగ్భ్రాంతి పొందెను. కాని యీ ప్రసంగమేమియుఁ జేయలేదు.

ఆ సాయంతనమున పాటకచేరి జరిగెను పాటకుఁడు నాగేశ్వరయ్యరు. మృదంగముభుజంగము. కంజిరా సుబ్రహ్మణ్యపిళ్ళ. ఫిడేలు శేషుఅయ్యరు.జమీందారుగారు సభలోనికి వచ్చి కూర్చుండి కార్యక్రమమువంకఁ జూచెను. అంతయు నేమో సర్పమయముగా నున్నది. రంగారావుగారు పాట వినుచుండెను. నాగేశ్వరయ్యరు రాగాలాపన చేయుచుండెను. జమీందారు రాగము పే రడిగెను. అయ్యరు 'శంకరాభరణ'మని చెప్పెను. జమీందారుగారు దివానును జూచి "ఏమయ్యా! శంకరాభరణ మనఁగాఁ బాముకదా" అనెను. దివాను "అవునుకాఁబోలు" ననెను. జమీందారు నేఁడు సభచేయు వారందఱిపేళ్లు చదువుము. "ప్రతివారిపేరును 'పాము' అన్న యర్థమే యిచ్చుచున్నది" యనెను. దివాను 'మఱి నా పేరో' యనెను. జమీందారు పకాలున నవ్వెను. ఆ నవ్వులోఁ దేజ స్సేమియు లేదు. కాగితపుపూలవలె వాసనలేని నవ్వు. సభ జరుగుచుండఁగనే రంగారావుగారు లేచివెళ్ళిరి. వారివెంట దివాను ప్రభృతులును వెళ్ళిరి. పాటకుఁ డుత్సవము చూడవచ్చినవారికిఁ దనపాట రకరకాలుగాఁ బాడి వినిపించెను. తెలిసినవారు తెలియనివారు సమానముగాఁ దల లూఁచిరి. ద్రావిడులు చాల సంతోషించిరి. నాగేశ్వరయ్యరు పాడి

నంతసేపు చేతులు దోన్నెలవలెఁబెట్టి పాముపడగలవలెఁ ద్రిప్పుచు వచ్చెను. రంగారావుగారి కది మఱియు నసహ్యాము వేసెను.

రాత్రి నాటకమాడిరి. జమీందారుగారుగాని, దివానుగారు గాని, పెత్తనదారులుగాని నాటకమునకుఁ బోలేదు. నటకులలోఁ బెద్దలువచ్చి రాజుగారిని రమ్మని చాలసార్లు కోరిరి. 'రాజుగారికి శిరోభారముగా నున్నది. శ్రమపడిరికదా పగలెల్ల. రాలేరు, వచ్చినను గూర్చుండలే'రని సమాధానముచెప్పి దివానుగారు వారిని బంపించిరి. దివానుగారినయినను రమ్మని వారు ప్రాధేయపడిరి. దివానుగారు కూడఁ దనకు మనస్స్వాస్థ్యము లేదనియు, దెల్లవాఱిన లక్షపనులున్న వనియుఁ జెప్పి పంపించెను. చూడవచ్చినవారి కందఱకు వారు నాటకమాడిరి. ఆ నాటకములోనికిఁ బాము లేనియు రాలేదు. వెనుకఁ గూర్చున్న జనమునకు నేల తేమగా నుండుటచేతఁ గప్పలు వచ్చెను. నాటక ముత్సాహముగా లేదు.

ఇద్దరు పేరుమోసిన కవీశ్వరులు పైన సేలువలు కప్పుకొని, కాగితములకట్టలు పుచ్చుకొని, మఱునాఁ డుదయముననే రాజదర్శనార్థముపోయిరి. రంగారావుగా రపుడే లేచి ముఖమార్జనముచేసిరి. కాఫీ త్రాగుచుండిరి. కృష్ణమనాయఁ డున్నంతవఱకుఁ గోటలోఁ గాఫీప్రసక్తి లేదు. పూర్వపు జమీందారులు ప్రొద్దున నే లేచుటయుఁ, గాల్యకృత్యములుతీర్చిఁ దిరుమణితిరుచూర్ణములుధరించిపనియేదైనను జూచుకొనుటయు. బాగుగాప్రొద్దెక్కినంతవఱకు నేమియుఁ దినరు. అప్పుడు మాత్రము భోజనము చేయుదురు. భోజనాత్పూర్వ మేమియుఁ దినరు. అది యారోగ్యశాస్త్రమునకు విరుద్ధము. రంగారావుగారు చదివెడి రోజులలో నతనికిఁ గాఫీ యలవాటయినది. తండ్రి బ్రదికి యుండఁగా గోటలో దానికి వీలులేకుండెను. పొరుగూరువెళ్ళినప్పుడెల్లఁ గాఫీత్రాగుచునేయుండెను. చెన్నపురిలోనున్న రెండునెలలును గాఫీమీఁదనే బ్రతికినఁడ. కవులువచ్చి రాజుగారిమీఁదఁ బద్యములు చదివిరి. వా రదివఱకు జమీందారుమీఁదఁ జెప్పిన పద్యములు విని పించిరి. వారు కీర్తిమంతులు—పండితులు—వాగ్మిలు. ఇద్దఱికిఁ జెరి మూఁడు వందలును నిచ్చి రాజు వారిని సాగనంపవలసివచ్చెను.

తరువాత వారాంగనానృత్యము. వచ్చిన పదిమేళములుగాక రత్నగిరికూడఁ దనమేళముతోఁ దయారయ్యెను. ఎవరిని బిలిచినది, యెవరిని బిలువనిది రంగారావుగారికిఁ దెలియదు. తక్కిన నలుగురికిఁ దెలియును. రత్నగిరిని దివానుగారు తక్కఁ దక్కినముగ్గురు నెఱుఁగుదురు. రాధాకృష్ణయ్యగారు రత్నగిరి 'నేల వచ్చితివి? నిన్నుఁ బిలువలేదే' యనెను. రత్నగిరి 'ప్రభువులు! ఈ సంస్థానము నాది. నేను రాకుండ నింకొకరికి వచ్చుటకు నధికారమే లేదు. నన్ను పిలచినను పిలువకున్నను నేను రావలసినదే' యనెను. రామేశ్వరము నెమ్మదిగా 'ఈమాత్రము జ్ఞానము నీ కొడుకునకుఁగూడ నుండిన బాగుండును' అనెను. తక్కినవారు నవ్విరి. రత్నగిరి కామాట వినిపించలేదు. 'ప్రభువు లేమో యనుచున్నారు' అని యామె విన నడిగెను. రామేశ్వర "మేమియు లే"దని చెప్పెను. ఆపూఁటను వారాంగనానృత్యములు జరుపఁబడెను సాయంకాలమున మ్యాజిక్కు చేయఁబడును. రాత్రికి సర్కసు.

ఈ ప్రదర్శనములకు వేఱే పందిరివేయించి, చుట్టు నడ్డుకట్టిరి. లోపలఁ గుర్చీలు, బెంచీలు తెప్పించివేసిరి. చూడవచ్చిన యుద్యోగులు, రాజబంధువులు వాని నలంకరింతురు. వెనుకనున్న సామాన్యప్రజ కేమియుఁ గనపడదు. వినపడదు. పందిరి ద్వారమువద్ద రక్షకభటులును, గొందఱు పెత్తనదారులు నిలుచుండి, గౌరవనీయు లని వా రనుకొన్నవారినే లోనికిఁ బోనిత్తురు. పట్టాభిషేకమునకుఁ బరగణాలోనున్న పెద్దరైతులు కొందఱు వచ్చిరి. వారు నీరుకావి ధోవతలు, బొంకుచొక్కాలు, కోరతలపాగలు, పట్టెవర్ధనాలతో జగన్మోహనమూర్తులుగా వచ్చిరి. వచ్చిననాగరకులకు వారి వేషములు పల్లెటూరివిగాఁ గనిపించెను. వారును నగ్రస్థానములే యలంకరించిరి. మ్యాజిక్కు జరిగెను. మధ్యమధ్య ప్రతివారును గరతాళధ్వనులు చేసిరి. ప్రొఫెసరుగారిని స్తుతించిరి. పెద్దరైతులలో నొకాయనపేరు కుటుంబరాయఁడు. ఆయన ప్రదర్శనమంతయుఁ జూచి 'యిదియేమిటయ్యా! నే నేమో ననుకొన్నాను. ఈయన కోటు, సూటు తీసివేసినచో మన యాస్థానమునకు వచ్చు గారడీవాండ్రకన్న నేమి గొప్ప? అసలు వాండ్రు చేసినట్లు ఈయన చేయనే లేఁడు' అనెను. మఱొ

కాయన "అట్లు కాదు. ఇదే బాగున్నది. ఏమియు లేకపోయినచో నంతంత పెద్దలు దాని నేల మెచ్చుకొందురు" అనెను.

సర్కసువారు ప్రత్యేకముగా వేఱే డేరా వేసికొనిరి. పట్టాభిషేకదినములలో నల్లరులు జరుగకుండఁ గాపాడుటకు రక్షకభటులు వచ్చిరి. వారు వచ్చుట దేవిడీలోని పరిచారకులకందఱకుఁ గష్టముగా నుండెను. ఉత్సవసమయములందు జనమును సర్దికూర్చుండఁబెట్టుట వారిపని. అది వారికి గౌరవము. ఇప్పు డీ యెఱ్ఱటోపీలవారు వచ్చి తమకోటలోఁ దనుమీఁదనే యధికారముచేయుట కాసావారికిఁ, దదితరపరిచారకులకు రుచించలేదు. కాని యేమి చేయుదురు? వారికిఁ దమగౌరవముకన్న నా వంశపు జమీందారులమీఁదనే యెక్కువభిమానము. బాబయ్యగారు తమ కేమిచేసినను బాబయ్యగారిని వారేమియు ననరు. బాబయ్యగారిమీఁద మాటపడనీయరు.

రాత్రికి సర్కసాడ మొదలుపెట్టిరి. బ్యాండుమేళము మ్రోయజొచ్చెను. అదివఱకు సుబ్బన్నపేటలో సన్నాయి నెఱుఁగుదురు గాని యీ మేళము నెఱుఁగరు. ఐదుగురును వరుసగాఁ గుర్చీల మీఁదఁ గూర్చుండి, యొకఁడు దీపము వెలుఁగున నొక కాగితము మీఁద నేదో వ్రాయఁబడినదానిని జూచుచుఁ గఱ్ఱతో గాలిలో విసరుట, తక్కినవారు పాడుట సామాన్యప్రజలకుఁ జాల చిత్రముగా నుండెను. జనము వారిచుట్టును మూఁగి చూచుచుండిరి.

డేరా ద్వారమువద్ద రక్షకభటులు కాఁపుండిరి. అందఱిని లోనికిఁ బోనీయలేదు. చుట్టుప్రక్కల యూళ్ళలోనుండి జనము వేలకు వేలు వచ్చిరి. వారందఱు బయటనే యుండి, బ్యాండు చూచుటతోడనేమాత్రము తృప్తిచెందవలసివచ్చెను. జన మొత్తుకొని వచ్చినపుడు రక్షకభటులు లాటీలతో మోఁదుట మొదలుపెట్టిరి. ఈ క్రొత్త యనుభవముచేత జనులు చెల్లాచెదరైరి. పెద్దరైతులందఱు నుద్యోగులతోఁబాటు పోయి కుర్చీ లాక్రమించిరి. తక్కిన జనులు గ్యాలరీ నలంకరించిరి. పరిచారకులును నితరవారును నేలపైఁ గూర్చుండిరి. ప్రదర్శన మారంభించిరి. విద్యాధికు లందఱు ప్రదర్శకులఁ గరతాళధ్వనులచే గౌరవించిరి.

రాత్రి పన్నెండుగంటలకుఁ బ్రదర్శన మైపోయెను. కుటుంబ రాయఁడుగారి కీ ప్రదర్శనము నచ్చలేదు. పులుల నాడించిన వాఁ డన్నచో మఱీకోపము వచ్చెను. వాఁ డేమి హరప్పనాయఁడా? కృష్ణప్పనాయఁడా! వెనుకఁ దుపాకితో నొకమనిసి నిలుచుండఁగాఁ దిండిలేక మలమల మాఁడుచున్నవి, అరణ్యసంచారమే యెఱుఁగనివి, మనుష్యులను జూచుట కలవాటుపడినవి- యీ మృగముల నాడించు టలో నతని కేమియు గొప్పతనముగాని, మెచ్చఁదగినదిగాని యేమియుఁ గనఁబడలేదు. తక్కినవను లసలు నచ్చలేదు. దొమ్మరివాం డ్రింతకన్న బాగుగాఁ జేయుదు రని యూయనయూహ. "రానుపోను ఖర్చులిచ్చి, వేయిరూపాయిలు వీరి మొగమునఁ బోయుటకన్న నిందులో సగ మిచ్చినచో దొమ్మరివాండ్రు వచ్చి యింతకన్న బాగుగా నాడుదురే! వారి కిచ్చినడబ్బు పేదవారైన ననుభవించిన ట్లగును. వీరందఱు పటాటోప మెక్కువచేసి ధనమాకర్షించుటతప్ప మఱేమియు లే"దని కుటుంబరాయఁడుగా రనిరి.

ప్రదర్శన మైపోవుచుఱకును దెబ్బలు తినికూడ జనము డేరా బయటనే నిలచియుండిరి. పల్లెటూరిజనులు ప్రదర్శనము తెల్లవాఱు లుండు ననుకొనిరి. రాత్రి రెండుజాములకే యయిపోయిన దని తెలి యఁగానే "ఇశ్, ఇంతేనా?" యనిరి. అప్పుడు జనము తమపల్లెలకుఁ బోవ బయలుదేఱిరి. సుబ్బన్నపేఁట యూరువెలుపలికిఁ బోవువఱకు దీపాలవెలుతు రంతరించెను. ఆనాఁడు శుక్లషష్ఠి. అపుడే చంద్రా స్తమయమయ్యెను. డేరాలోనికిఁ బ్రదర్శనముచూచుటకు నతనిని గూడ రానీయలేదు కాబోలు, నస్తమించుచున్న యా చంద్రుని మొగముగూడ కంది యెఱ్ఱనై కందగడ్డవలె నయ్యెను. ఎట్లయినను రాజుకదా, తిరస్కారము సహించలేఁడు. సామాన్యజనుల కేమున్నది? వారునవ్వుచుఁ, ద్రుళ్ళుచు స్వగ్రామముల దారిఁ బట్టిరి.

వెనువెంటనే చీఁకట్లు తఱుముకొని వచ్చెను. ఆకాశము నల్లని మహాసముద్రము తరంగములు తరంగములుగా లేచి భూమి యను తీరమునకుఁ గొట్టుకొనునట్లు, రాత్రించరులయిన భూతప్రేతాదినానా పిశాచవికటభ్రూపరివర్తనచ్ఛటాసంతానము దిశ లావరించినట్లు, తిరోహితసూర్యతేజస్కమై కాలము సహజాకృతి పొందినట్లు, దిక్కు

లను నెలుగుబంట్లు స్వశరీరలంబమానబహుదీర్ఘ కేశములతో సంచ రించుచున్నట్లు, అజ్ఞానము వీలుచిక్కి జ్ఞానము నెడ్రత్రోసి మనస్సు లోఁతుల కెల్లఁ బ్రాకినట్లు, కాలసర్పము లొకదాని నొకటి యొఱసి కొనుచు లెక్కలేనన్ని సంచరించుచున్నట్లు చీఁకటులువిజృంభించెను.

మఱునాఁడు బోగముమేళములనే యాడించిరి. రామేశ్వరము గారు వీనికిఁ బెద్ద డబ్బిచ్చి పిలిపించినవారందఱి నట్టిపెట్టి రత్నగిరి మేళమునే యాడించ నారంభించెను. రత్నగిరికి నలుబదియాేండ్లు. వార్ధకము నెమ్మదిగా నామె శరీరముపైకిఁ బ్రాఁకెను. దేహము స్థూలమై పూర్వమువలె నభినయాదులు చేయలేకుండెను. రామేశ్వర ముగా రామెనే గజ్జెకట్టు మనిరి. గజ్జెకట్టి యిరువదియేండ్లయినను రత్నగిరి 'ప్రభువులున్నారు, తనవిద్య మెత్తు' రని యంగీకరించెను. పైని తానే యనాహూతగ మేళమునకు వచ్చెనాయెను. చేయక తప్పినది కాదు.

ప్రార్థనాదికము లయినతరువాత నామె యధ్యాత్మము పాడ నారంభించెను. "అవికాదు, జావళీలు పాడు" మనిరి. ఆమె క్షేత్రయ పదమునొక డందుకొని యభినయము ప్రారంభించెను. ఆమె మొగ మున నంతలోఁ గండరములన్నియు విచిత్రముగాఁ గదలాడి యొక క్రొత్తదనము వచ్చెను.

"అదరెనే మోవి—తనకుఁదానె వదలెనే నీవి—పల్లవి.
మదిలోన వాఁ డేమొ మంత్రించెఁ గాబోలు
సుదతి మువ్వగోపాలు చూచినది మొదలు—అదరెనే"

పల్లవి యందుకొనునప్పటికే యేఁబదియేండ్ల రత్నగిరి పదు నాఱేండ్లకన్యవలె లఘుశరీరయై, నూతనయౌవనావిర్భావవేళ నాయ కుని ప్రథమసందర్శనముపొందిన నాయికవలె ముగ్ధముఖరేఖాంచలయై మాఱిపోయెను. "అదరెనే మోవి" యని మోవియదరినట్లు గదలిం చెను. ఆ కదలిక హఠాత్తుగాఁ దామరరేకుమీఁదఁగాని, గులాబి పూవు మీఁదఁగాని మంచుబిందువు పడినచో నవి యెట్లుకదలునో అట్లు కదలెను. ముఖమంతయు నిశ్చలమై యుండఁగా నధరము నది యెట్లు ఆరీతిఁ గదల్చెనో బ్రహ్మదేవునికెఱుక. ఆ యధర మట్లు కదల్చఁ గలుగుట కెంత పరిశ్రమచేసెనో?

సుందరాతిసుందరముగ నెడమచేతితో నీవిభాగమును బూని నృత్తము చేయుచు, మఱలఁ బల్లవియందుకొనుచు రత్నగిరిబాంగరమువలెఁ గదలిపోయెను.

"మదిలోన వాఁడేమొ మంత్రించెఁ గాబోలు" నని శృంగార రసముయొక్క స్థాయీభావమయిన రతియొక్క దశావస్థలలోఁ బ్రథమావస్థయైన దర్శనము విస్తరింపఁబడిన నేత్రములతో, లజ్జానురాగములు మిళితములైన ముఖభావములతోఁ, గించిదంకురితపులకములైన కపోలములతో ముగ్ధానాయికాలక్షణములు మూర్తములఁ దనకు సరిపోఁగా నామెయున్నపుడు రసప్రపంచములు పులకరించెను. అనుపల్లవి యని, మఱలఁ బల్లవి యన్నపు డామె ప్రకటించిన లయజ్ఞానమునకు నాదమయప్రపంచములు ఛందోగమనముఁ బొందెను.

ఒకసారి 'మువ్వ గోపాలుఁ' డని, యొకసారి 'వేణుగోపాలుఁ' డని రత్నగిరి యాపాదమును రెండుసార్లు చెప్పెను. మువ్వగోపాలుని పదములు సుబ్బన్నపేట వారాంగనలందఱు నట్లే యందురు. జమీందారుల యిలవేల్పైన వేణుగోపాలుని నామమే వారా పదముల తుద నుంచుదురు. కాని యసలు మువ్వగోపాలుని పేరుగూడ నొకసారి యందురు.

"వేణుగోపాలుని చూచునది మొదలు" అని భగవంతుని వేణుగానవైఖరు లనేకవిధముల. వ్యత్యస్తపాదారవిందముగ, ముఖసన్నిహితన్యస్తోభయహస్తాభిరామముల దాపలిభుజమును జెక్కిలించి భ్రూవిక్షేపసహితముగ, మృదువిచలితాంగుళీప్రసారముగ, పర్యాయోన్మీలితనిమీలితపక్ష్మలాభిరామాపాంగరేఖాసుందరముగఁ బ్రదర్శించెను. బృందావనము, గోపికలు, గోవులు, యమున - సర్వము నామె తనూవిన్యాసములందు, రాగమునందు, తాళమునందు, ముఖాంచలములందుఁ బ్రత్యక్షము లయ్యెను. రత్నగిరియొడలు తెలిసిన స్థితిలో లేదు. సభలోనివా రనేకులు వారిదారిని వారు మాటాడుకొనుచుండిరి. కొందఱు రత్నగిరివంకనే చూచుట లేదు. ఎక్కడో వారి నేత్రముల కందమైనచోట వారు చూచుచుండిరి. అభినయించుచు నభినయించుచున్న రత్నగిరిని రామేశ్వరముగారు 'ఆగుము' అని యాదేశించిరి. రత్నగిరి నిపుడు భగవంతుఁ డాఁపలేఁడు. రామేశ్వ

రముగారు 'అవునుగాని, నీకూఁతురు రాలే దేమి' యనెను. రత్నగిరి 'అది రాదు' అనెను.

రామే—ఎందుకు రాదు! భోగముది కాదా?

రత్నగిరి నిరుత్తర యయ్యెను. రామేశ్వరముగారు కాసావాని నొకని బిలిచి, రత్నగిరికూఁతురును బిలచుకొనిరమ్మని పంపెను. "అది రాదు. పంపవల" దని రత్నగిరి చెప్పుచున్నను రామేశ్వరము గారు వానిని బంపించెను. వాఁడు తిరిగివచ్చి "అది రానన్నది" యని చెప్పెను. "ఎందుకు రాదోయి! బలవంతముగ లాగుకొనిరమ్ము" అని యాయన వానిని మఱలఁ బంపించెను. 'పసిపిల్ల, అది యెందుకు' అని రత్నగిరి బ్రతిమాలినట్లు చెప్పెను. రామేశ్వరముగారు వినిపించు కొనలేదు. జమీందారుగారు గాని, దివానుగారు గాని కలిపించుకొన లేదు. కాసావాఁడు పోయి దేవదాసిని రమ్మనెను. ఆమె రా ననెను. 'నిన్ను బలవంతముగా లాగుకొనిరమ్మని చెప్పిరి' అని వాఁ డామె మీఁదికిఁ బోయెను. దేవదాసి భయపడి వాకిలిలోనికిఁ బరుగెత్తు కొనిపోయెను. వాఁడు వెంటఁబడెను. ఆమె పరువెత్తి ధర్మారావు గారింటికిఁ జేరెను. వాఁడును నచ్చటికి వెంబడించెను. గుండెలు పగులఁ బరువెత్తికొని వచ్చిన దేవదాసిని జూచి ధర్మారావు "ఏమే గిరికా! ఇట్లు వచ్చితి"వనెను. అతఁడు దేవదాసిని "గిరికా"యని పిలుచును. గిరిక ధర్మారావువెనుకకుఁబోయి నిలుచుండెను. కాసా వాఁడు ధర్మారావుగారిని జూచి యాఁగెను. ధర్మారా వడుగఁగా వాఁడు జరిగిన కథయంతయుఁ జెప్పెను. ధర్మారావు "వీలులేదుపొ" మ్మని చెప్పెను. వాఁడును చేయునదిలేక వెళ్ళి సభలో నీ కథ యంతయు విన్నవించెను. సభలోఁ గొ్రత్తవా రనేకులు గలరు. పట్టణములనుండి వచ్చిన విద్యాధికులు, నుద్యోగస్థులును, వారంద ఱికి నీ కథయేమో యుత్సాహము కలిగించెను. ప్రతివారును 'ధర్మా రావుగా రెవరు? రాజాగారి యభిమతమునకు వ్యతిరేకముగా నిట్లు చేయుటకు నాయనకు గుండె యె ట్లున్నది' యని తమలోఁ దాము వితర్కించుకొనఁజొచ్చిరి.

రామేశ్వరముగారికిఁ దలకొట్టినట్లయ్యెను. రంగారావుగారి వంకఁ జూచెను, ఆయన పెద్దతల్లికుమారునివంకఁ జూచుట లేదు,

రామేశ్వరముగారికి నేమిచేయవలయునో తెలియలేదు. కాని యెట్లో గౌరవము కాపాడుకోనెంచి, "యేమే రత్నగిరీ, బాగున్నది! మీ దేవదాసిని ధర్మారా వుంచుకొనెనా యేమి? తండ్రికొడుకులిద్దఱు తల్లికూతుండ్రినిద్దఱ నుంచుకొనుట సరే. మీకు వరుసయేమి, వానికి యేమి" యని పెద్దగా నవ్వి యల్లరిచేసెను.

రత్నగిరికిఁ గోపమువచ్చెను. "అయ్యా! మన మెంతవార మయినను మాటలాడుట తెలిసియుండవలయును. ప్రతిదానికి హద్దు కలదు. ధర్మారావుగారును దేవదాసియు నన్నయుఁ జెల్లెలును. మేము కులముతక్కువవార మని నోటికివచ్చినట్లెల్ల మాటాడరాదు. మీరు దమ్మిడీయిత్తురని రాలేదు. రామేశ్వరశాస్త్రిగా రిచ్చిన పది యెకరాలసుక్షేత్ర మున్నది నాకు. నాకుఁ బొట్ట జరుగకపోదు. ఈ గడ్డమీఁదఁ బుట్టితిమి. ఈగడ్డమీఁదఁ బెరిగితిమి. తరతరములనుండి యీ ప్రభువులయుప్పు తిన్నాముగనుక బాబయ్యగారి పట్టాభిషేకము నకు నావిద్య చూపించుటకు వచ్చితినిగాని, తమరిచేత నిట్లు మాటలు పడుటకు రాలేదు. నావిద్య మీకుఁ దెలియలేదు. తుచ్ఛములైన కీర్తనలు నేర్చుకొని, యే కోశమున నభినయమన్నది యెఱుఁగని వయసుకత్తెలు మీకు నచ్చినట్లు నేను నచ్చెదునా! మనదేశమునుండి యీ భరతము నశించి యెన్నాళ్ళయినది? బాబయ్యగారుకూడ వెళ్ళి పొమ్మన్నచో వెళ్ళిపోదును. మాకును గౌరవము కలదు" అని పెద్దగా విదలించెను.

అప్పుడు ప్రభువుగా రేమియు మాటాడలేదు. రామేశ్వరము గా రింత యయినతరువాతఁ దా నూరకుండినచోఁ దమగౌరవభంగ మనుకొని జమీందారుగారు చెప్పినట్లే, 'నిన్నన లెవరు పిలిచిరి? పొ' మ్మని గద్దించిరి. రత్నగిరి ప్రభువువంకఁ జూచెను. ప్రభువు పెద్ద తల్లికొడుకుపక్షమున నభిమానపడి రత్నగిరిని పొమ్మనెను. రత్నగిరి యందఱకు నమస్కారములుచేసి తనమేళముతో సభనుండి నిష్క్రమించెను. పోవుచుండఁగాఁ దొందరలో నామె కాలియందె సీల వద లుగానున్నది కాబోలు, జాఱి క్రిందఁబడెను. ఆమె యందె తీసి కొనుటకైన నాఁగలేదు. ఒకపరిచారకుఁ డది దీసి యామె కీఁ

బోయెను. ఆమె వానితో మాటాడక యందె పుచ్చుకొనకయే చర చర నడచిపోయెను.

తరువాత సభలోఁ గలవరముపుట్టెను. సభికులు తెగ గుసగుస లాడ మొదలుపెట్టిరి. కొందఱు 'భోగముదాని కంతపొగ రేమి? ప్రభువునెదుట యాయనబంధువును బెదతల్లికుమారుని పెత్తనదారు నట్లు విదలించునా? రాజు మంచివాఁడు గనుక సంతలో సరిపోయినది!' అనియు; మఱికొందఱు 'ఎవరి గౌరవమువారిది. భోగమువాండ్రయిన మాత్రమున వారికి వరుసలేదా, వావిలేదా! సభలో నట్లు పరాభ వించినచో నెవ రూరకుందురు?' అనియు; వేఱొకతెగవారు 'ఈ ధర్మారా వెవరయ్యా! ప్రభువునకుఁగూడ నెదురు నడువఁజాలిన వాఁడు! ఆయనను రాజాగారుకూడ నేమియు ననలేదు. ఆయన యంత గొప్పవాఁడు కాఁబోలు' ననియు ననేకవిధముల జన మన్నది యనకుండఁ బెద్దరొదచేసిరి.

ఆ నాఁ డంతటితో సభ ముగించఁబడెను. దొరలందఱు మొగములందు లజ్జాభిమానములు, నసూయాకోపములు కనరాఁగా మౌనముద్ర వహించిరి. రంగారావుగారు మేడమీఁదికిఁ బోయిరి. దివానుగారును, తక్కిన ముప్వురును సమావేశమైరి. జమీందారు గారు రామేశ్వరముగారిమీఁద "నీవు సర్వమును పాడుచేసితివి. ఏమి టీ గోల తెచ్చితివి? ఇవ్వేళ మన కెంత పరువునష్టమైనది! ఆ భోగము దానిని జీల్చినను పాపము లేదు. అది యెన్నెన్నిమాట లన్నది! ఇంతకు దాని దేమి తప్పు? తప్పంతయు నీది. ఛీ! ఛీ! నలుగురిలో నవ్వుబాటుపని. దానిని మన మేమి చేయగలము? ఈ ధర్మారావుతో వచ్చినది! వీని కేమి పని? అది పోయి వీని మఱుగుఁజొచ్చుట యేల? వానిది గుండెయా, చెఱువా? దాని నెట్లు రానీయలేదు? సర్వవిధముల నా కీ నాఁడు తలకొట్టుకొన్న ట్లయినది. రామేశ్వరమా! ఇంతయు నీవు చేసితివి. ఆ పిల్ల నేమయినను నీవు కామించితివా యేమి, కర్మము! నేను నీ వైపు మాట్లాడనా, వారివైపు మాట్లాడనా! నిజమున కిందులో వారి దేమియు తప్పు కనఁబడలేదు. గ్రామములో నున్నవారి మేళమును మీ రెందుకు మాట్లాడలేదు? ఛీ! ఛీ! ఛీ!" అని యొక పెద్దవాన కురిపించింది.

అది యాషాఢశుద్ధ సప్తమి. వర్షాకాలము వచ్చెను. నెలనాళ్ళ నుంచి కొంచెము కొంచెము జల్లులు పడుచున్నను, నానాఁటి సాయంతనము చచ్చిపోయిన లక్ష్మణస్వామిసహస్రాకారములు తాల్చివచ్చిన ట్లాకాశమంతయు నల్లని మేఘముచేతఁ బిహితమై కాఱులుక్రమ్ముకొని వచ్చెను. స్వామి తన తొండములతోఁ మందాకినిని బీల్చి, తపించిపోవుచున్న భూమిని చల్లపఱచుటకుఁ దజ్జలములు ధారారూపమున వదలినట్లు మేఘములు సంతతధారగా వర్షించెను. ఉన్నప్రాణి యున్నచోటునుండి కదలకుండ నష్టదిగ్బంధనముచేసినట్లు వర్షములు విజృంభించెను. నగారాలు, మద్దెలలు, డోళ్లు మొదలయిన సర్వచర్మమయవాద్యములు దమ్ముకొనిపోయెను. వానిధ్వనియంతయు పోయి తననే యాశ్రయించినట్లు వానమ్రోఁతలే యెక్కువయయ్యెను. ఈ చెవినుండి యా చెవికి, యీ పెడనుండి యా పెడకు హోరుమని పిచ్చిగాలి విసరి, పందిళ్ళు, పాకలు సర్వము నేలఁగూలెను. సర్కసుడేరా చిరిగి జీర్ణమై, స్తంభములు, తక్కిన సామాను విఱిగి సర్వము శిథిలమైపోయెను. ఉఱుములు, మెఱుములు భయంకరమై యాకాశమంతయు శబ్దమయము, తేజోమయము, జలమయ మన్నట్లు నీరంధ్రమై దశదిక్కులను గబళించెను. ఉత్సవము లంతతో నాఁగి పోయెను. ఇతరగ్రామజనులు బహుకష్టముమీఁదఁ దమస్థానములు చేరుకొనిరి. ఆ ముసురుముసురు పదిరోజులదాఁక వదలలేదు.

# ఐదవ అధ్యాయము

వానలు సరిగాఁ దెలిపి యీయకమునుపే రంగారావుగారు చెన్నపురి చేరిరి. సుబ్బన్నపేట చెన్నపురివలె సుఖనివాసభూమి కాదు. దొరలు, దొరసానులు, సినిమాలు, టీపార్టీలు, గవర్నరు, మహాధికారులు, తారురోడ్లు, సముద్రతీర విహారములు, చల్లని గాలులు-చెన్నపురి యన్నఁ జెన్నపురియే! రంగారావుగారిని తన వానిని జేసికొనెను. పల్లెయయిన పేట యేడ్చి యేమి లాభము?

అచ్చటికిఁబోయిన పదిరోజులలో రాజధానిలోని సమస్తోద్యోగులకు, దొరలయినవారికిఁ దమపట్టాభిషేకసందర్భమున గొప్పవిందు జరిపిరి. విందయిన మఱునాఁడు 'డాంజజీసు' హోటలు వారికి, 'స్పెన్సరు' కంపెనీవారికిని నేఁబదివేల రూపాయలు బిల్లులక్రింద రంగారావుగారు చెల్లించిరి. ఇదిగాక గవర్నరుగారికిని, వారిపత్నికిని నిద్దఱకు చెరియొక లక్షరూపాయల వెలగల రత్నహారములు కానుకగా నిచ్చిరి.

చివఱకు లెక్కచూచునప్పటికిఁ బట్టాభిషేకమున కాఱు లక్షలును, చెన్నపురిలోని మూఁడులక్షలును తొమ్మిదిలక్షలు వ్యయమయ్యెను. ఇందులో బ్రాంతబాకీలు వసూలయినవి లక్షపోగా నెనిమిదిలక్షలు వ్యయము కనఁబడెను. హరప్పనాయఁడు చనిపోవునప్పటికిఁ గోటలోఁ బదిలక్షలు నిలవయుండెను. కృష్ణమనాయఁడుగారు వాని నిరువదిలక్షలు చేసిరి. వారు యథేచ్ఛముగా ఖర్చుపెట్టిరి. పరగణా సొమ్మంతయుఁ బ్రజలే తినిరి. అంత ధన మెట్లు కూడఁబెట్టిరో తెలియలేదు. వారు నిలువఁజేసియుంచిన యిరువదిలక్షలలో రంగారావుగారప్పుడే యెనిమిది లక్షలు వ్యయపఱచిరి. రాజ్యమునకు వచ్చి యాఱునెలలు కాలేదు.

యథార్థమైనదేమో తెలియదు కాని, టవానుగారును పెత్తనదారులును తలాయొక యేఁబదివేల నీ దెబ్బలో మూటకట్టిరని వదంతి బయలుదేఱెను. మొత్తముమీఁద దుబారాఖర్చు మిక్కిలిగా జరిగెను. పదార్థములు సర్వము నెక్కడివక్కడ మాయమయ్యెను.

పండిళ్ళకుఁ, బాకలకు వేసిన గుంజలదగ్గఱనుండి యదృశ్యమై పోయెను. వానలు వెలిసినతరువాత దివానుగారుకూడఁ జెన్నపురి కేఁగిరి. రాధాకృష్ణయ్య, సర్వారాయఁడుగార్లు తమ స్వగ్రామము లకుఁ బోయిరి. కోటలో రామేశ్వరముగా రొకరు. వారు వారి పనులేవో చూచుకొన మొదలిడిరి, కావున మిగిలిన పదార్థములు, సామానులు నేమయినవో వాని యజ చూచువారు లేకపోయిరి.

వానలు వెలిసి, కోటకుఁ దామే సర్వాధికారులయిన తరువాత రామేశ్వరముగారు ప్రాఁతపగలు తీర్చుకొనవలయు నని గాఢముగా వాంఛించిరి. తన కిపు డిద్దఱు శత్రువులు-రత్నగిరి, ధర్మారావు. వీరిని సాధించుటకుఁ బ్రయత్నములు సాఁగించిరి. భోగముదాని కేమి, అది వంటయింటి కుందేలు! ధర్మారావుపని పట్టవలెను. ధర్మారావును బిలిపించి, కోటలోనే యొక తడి పట్టవలెనని యూహించి, యొకసేవకుని బిలిచి ధర్మారావును దాను బిలుచు చుంటిని రమ్మని కబురంపెను. ధర్మారావు 'ఇతఁ డెవరో యీ నన్నుఁ బిలుచుటకు? నేను రా నన్నా నని చెప్పుము' అని కబు రంపెను. రామేశ్వరమునకు నాభిదగ్గఱ నొక కోపిధవీచిక బయలు దేఱి గుండెలో నొకతాఁపు తాచి మొగమున కెగదన్ని భ్రూయుగ మధ్య ప్రదేశము కన్నులతోఁ గలసినచోట నల్లనై నెత్తురు గూడు కట్టెను. ధర్మారావుగారి పూర్వులసంగతి, వారి కూరిలో నున్న గౌరవప్రపత్తులు రామేశ్వరముగారికి సమగ్రముగాఁ దెలియును. పోయి వారి యింటివద్దనే ధర్మారావు నేదైన చేసినచో నల్లరియగును. గ్రామస్థులందఱును ధర్మారావు పక్షమునే యవలంబింతురు. అందు చేతఁ గోపముపట్టలేక తనకుఁ దోఁచినన్ని యబద్ధములు కల్పించి ధర్మారావునుగూర్చి చెన్నపురిలో నున్న రంగారావుగారికిఁ గొండె ములు పెద్దయుత్తరము వ్రాసి పంపించెను. కొంతకోపము తగ్గినది.

రామేశ్వరము కాసావాని నొకని బిలిచి మఱునాఁడు రత్నగిరి నెట్లయినను పరాభవించవలెనని చెప్పెను. కాసావాఁడు 'చిత్తము' అని యూసాయంతనము పోయి యీ సంగతి రత్నగిరితోఁ జెప్పెను. దాసీవాండ్రును, భోగమువాండ్రును నా గ్రామములో నొకటి. రత్న గిరికిఁ దమ్ముఁ డొక డుండెను. వాని పేరు కబీరు. కబీరు మహా బల

శాలి. పచ్చిపోకిరీ. బండిమీఁద రెండుపుట్లువేసి రోజాఅడ్డకు భుజము మోపి సునాయాసముగ లేవనెత్తగలఁడు. కత్తిసాము,కఱ్ఱసాములలో నద్వితీయుఁడు. వాని వయస్సు నలుఁబదియేండ్లుండును. రంగారావు గారి చిన్నతనములో వాఁడు కృష్ణమనాయనివద్ద నీ విద్య నేర్చుకొని రంగారావుగారికిఁగూడఁ జెప్పచుండెను. కాని రంగారావుగారి కది యంటలేదు. కబీరు రంగారావును సరిగా నేర్చుకొనలే దని కొన్ని సార్లు తాడించెను. రంగారావుగారు తండ్రితోఁ జెప్పిరి. కృష్ణమ నాయఁడు పూర్వపుభావములు కలవాఁడు. 'దొరకొడుకైనను తొడ పాశములుపెట్టి బుగ్గలునలుపక బుద్ధిరాదు' అని చెప్పి, 'అవును. నేర్చుకొనవలెను. కత్తిపట్టలేకపోయిన దొర యేమిటి' యనెను. అప్పటినుండి కబీ రన్న రంగారావుగారికిఁ గోపము—'వెధవ! జమీందారుబిడ్డను తన్నుఁ గొట్టునా' యని. కాసావాండ్రకుఁ, దక్కిన యలుపపుమనుష్యులకుఁ గబీ రన్నచో నెక్కువ యభి మానము. వారందఱును వాఁ డెంత చెప్పిన నంత. వారిలో వారి కెక్కువ చెలిమి. వాని యప్పగారిని గుఱించి రామేశ్వరముగా రిట్లు చెప్పఁగా వానిమిత్రుఁ డోర్చునా? ఓర్చకపోయి దానితోనే చెప్పి వచ్చెను.

కృష్ణమనాయఁడుగారిభార్య రుక్మిణమ్మారావుగారు. ఆబిడ యఱువదియేండ్ల వృద్ధురాలు. రత్నగిరి యా సాయంవేళ నామె దర్శనమునకుఁ బోయి, పట్టాభిషేకవేళ జరిగిన వ్యవహారమంతయుఁ జెప్పి, రామేశ్వరముగారు తన కేదో యపకారముచేయుచున్నాఁ డనియు, నా కాసావాఁడు తన కట్లు చెప్పెననియు విన్నవించెను. పెద్దరాణి యీకథ పట్టాభిషేకమునాఁడే కొద్దికొద్దిగా వినెను. ఇప్పుడు సమగ్రముగాఁ దెలిసికొని, యా కాసావానిని బిలిపించి, 'రామేశ్వర ముగా రట్లన్నది నిజమేనా' యని యడిగెను. వాఁడు 'అమ్మగారూ! నిజమేనండి. నాతోనే చెప్పెను' అనెను. రుక్మిణమ్మారావుగారు రత్నగిరిని బంపించి, రామేశ్వరమును బిలిచి తలవాఁచునట్లు చీవాట్లు పెట్టెను. చివరకు 'మా యక్కగారి కడుపున నీ వెట్లు పుట్టితివిరా" యనెను. రామేశ్వరముగారు తలవంచుకొని, యా కాసావానిమీఁద గూడఁ గారములు, మిరియములు నూరఁజొచ్చెను. కాని కోప

మంతయు డొక్కలో నుంచుకొని, తరువాతఁ బైకిఁ జక్కఁగనే మెలఁగఁజొచ్చెను.

నాయఁడు చనిపోయినప్పటినుండియు రుక్మిణమ్మారావుగారు తమ గదిలోనే యుండెను. గది వదలి బయటకు రాలేదు. ముసలి తనమున విధి తన కీ వ్రాఁత వ్రాసెనేమోయని యామె దిగులుపడెను. "దొరగారికన్న నేను ముందు పోయియుండరాదా? పుంస్త్రీ చావు కెంతనోచుకొనవలయును" అని యామె ప్రక్కనున్న దాసీలతో ననుచుండును.

ఆమె ప్రతియేకాదశియు, ద్వాదశియు వేణుగోపాలస్వామివారి యాలయమునకుఁబోయి, యా రెండుదినము లేకభుక్త ముండి చాల నియమములు పాటించును. నాయఁడు పోయిన యా యాఱు నెలలు ఆమె స్వామిదర్శనమే చేయలేదు. రామేశ్వరముగారిని గోపఁబడిన రోజు శ్రావణశుద్ధదశమి. ఆనాఁడు రాత్రి రుక్మిణమ్మారావుగారి కలలో స్వామి కనఁబడెను.

యాదవులు ధరించు కోరతలపాగ, శిరోవేష్టనము, మెడలో తులసిమాల, సూర్యహారములు, చంద్రహారములు, భుజములందు బాహుపురులు, బొడ్డున చింతామణి, పీతాంబరము కుచ్చెలలు దిగ జార్చి నీలమండలమీఁదికి వ్రేలాడునట్లు ధరించెను. జరీపనిచేసిన యెఱ్ఱని కాశ్మీరరత్నసేలువ బుజములమీఁదఁ గప్పుకొనెను. హస్తములయందుఁ గంకణములు, సింహతలాటపుమురుగులు. బదివ్రేళ్ళకు వజ్రవైడూర్యములు పొదిగిన యుంగరములు. మెలికలు తిరుగుచున్న దండలయందు బాజుబొందులు, దక్షిణపాదమున నష్టాపదమయమైన గండపెండారము. కుడిచేతి వ్రేళ్ళసందున మరకతమయమైన వేణువు. పెదవులమీఁదఁ జిఱునవ్వు, కనులలో భక్తజనరక్షాశీలమైన ప్రసన్నత, మొగమునఁ దీర్చిదిద్దిన పంగనామములతో వయసులోనున్న కృష్ణమ నాయనివలె స్వామి రాణిగారికి స్వప్నమునందు సాక్షాత్కరించెను. ఎంత యోగాభ్యాసమునను స్వామిసంపూర్ణమూర్తి సాక్షాత్కరించదు. ఏ యంగమునందును బుద్ధి నిలువదు. ఒకవేళ నిలచెనా, అంతలో మఱలఁ జెదిరిపోవును. రుక్మిణమ్మారావుగారి పూర్వపుణ్యమెంతయో! ఆమె యింద్రియముల నెంత యదుపులోఁ బెట్టెనో! ఆ

తపోమహిమ యెట్టిదో? లీలాశుకుని కైన ప్రత్యక్షముకన్న స్వామి రాణిగారికి నెక్కువమనోహరాకారమును గనఁబఱచెను. అందులోఁ దాను కృష్ణమనాయనివోలె వచ్చి రుక్మిణమ్మారావుగారి పాతి వ్రత్యము భగవంతునియందు ఫలించె నన్నట్లు న్యాఖ్యానము చేసెను.

వచ్చినస్వామి పెదవుల మృదువుగాఁ గదల్చి యేమో యనెను. రాణికి వినఁబడలేదు. కాని పెదవులకదలికనుబట్టి "త్రే పేకాదశి" యన్నట్లు తోఁచెను. రాణిగుండె యొక్కసారి పశ్చాత్తాపానందదుఃఖావేశముచేత నుబికిపోయెను. అంతలో నామెకు మెలఁకువయు వచ్చెను. తెల్లవాఱుచున్నది. సౌఖశాయనికములు సాయంప్రాతికములైన వాద్యములు మ్రోయుచుండెను. సన్నాయి శ్రవణసుఖోపేతముగాఁ బ్రొత్తర్మందానిలవీచికాగ్రములపై నూఁగిన మధుర నినాదములచే రాణిమనస్సు నానందనిమగ్నము చేసెను.

"హేరామ! హేకృష్ణ! ఇహ సముత్తిష్ఠ!
హేరామ! హేకృష్ణ! హేజగత్త్రయగురో!
హే పుండరీకాక్ష రక్ష నిజపక్షం—హేరామ."

ఈ కృష్ణలీలాతరంగమును మంగలి రంగనాయకులు-ద్రావిడ దేశమునఁగూడఁ బేరుమ్రోగినవాఁడు - సన్నాయిమీఁద ననుచుండెను. ఆ సావేరి నిశ్చలములై, నిశ్శబ్దములైన వాయుతరంగములపై ననుకూలవాయువువేళ నదీతరంగములపైఁ జిన్నితెప్పలు జల్లునఁబాఁకినట్లు ప్రాకిపోవుచుండెను. రంగనాయకులు కాలమును రాగముతోఁగలిపి నృత్యము చేయించెను. రుక్మిణమ్మారావుగారికి సావేరి, మలయమారుతము, చక్రవాకము నీ రాగములమీఁద నెక్కువయిష్టము. భగవంతుఁడు మేల్కనియే యున్నాఁడు, ఇంకను మేల్కొలుపుట యేలనని యామె యూహించెను.

ఆమె యంతట లేచి, శిరస్స్నానముచేసి నాఁ డేకాదశి నుపవాసముండెను. ఆనాఁడు భాగవతము వినవలెనని ననిపించినది. ధర్మారావు నామె యెఱుఁగును. అతనికిఁ గబు రంపించెను. ధర్మారావునకు వెళ్ళుటయో, మానుటయో తెలియలేదు. కోటలో నంతయుఁ దనకు వ్యతిరేకము. అయినను రామేశ్వరము తప్ప మఱి యెవ్వరును లేరు. అతఁడే యేదైన నత్యాచారము చేయునేమో యని

పించెను. వాఁడేమి చేయఁగలడని నిర్ధారణచేసి కోటలోనికి బయలు దేరెను. దారిలో నతనికిఁ గబీరు కనఁబడెను. కబీరతనితో నెన్నఁడును మాటాడఁడు. ధర్మారా వెప్పుడు కనఁబడినను నతఁడు తల వంచుకొనిపోవును. నేఁడేలొకో 'బాబుగా రెక్కడికిఁ బోవుచున్నా' రని యడిగెను. ధర్మారా వచ్చెరువుపడి 'కోటలోని' కని చెప్పెను. కబీరు "కోటలోనికా! కోటలోనికా!" యని రెండుసార్లని "నేను గూడ వచ్చెదను. పదండి" అని వెంటనడిచెను. ఇద్దఱును గోట వద్దకుఁ బోయిరి. ధర్మారావుగారిని రాణిగారు కబురంపినదని తక్కిన వా రెవ్వరికిఁ దెలియదుగాన నందఱు నతనిని విచిత్రముగాఁ జూచిరి.

అంతఃపురమునందు రామేశ్వరముగారు కనఁబడిరి. వెంట నున్న కబీరునుజూచి యేమియు ననలేదు. ధర్మారావు వచ్చితి నని రాణిగారికి కబురంపఁగా, నామె లోనికిరమ్మని కబురంపెను. కబీరు తా నచ్చట దిగఁబడిపోయెను. ధర్మారావు లోనికిఁ బోయెను. కోటకుఁ బ్రబలశత్రువని యనుకొన్న ధర్మారావు రాణిచేతఁ బిలి పించఁబడుటకు రామేశ్వరముగారిహృదయ ముడికిపోయెను. ఆ యుడుకుపట్టలేక యానాఁడు మఱొక చాడీలయుత్తరము చెన్నపురికిఁ బంపించెను.

వచ్చిన ధర్మారావు నాదరించి, రాణి యతని నాసనమునఁ గూర్చుండఁ జేసి, "బాబూ! నేఁ డేకాదశి. నీవు భారతభాగవత ములు చక్కఁగాఁ జదివెదవు. ఏమైనా వినిపింతువేమోయని పిలి పించితిని" అనెను. రాణి భాగవతము తెప్పించి సిద్ధముగానే యుంచెను. ధర్మారావు 'నల్లనివాఁడుతోఁ' బ్రార్థనఁ జేసెను. వెంటనే యతనికిఁ గృష్ణమనాయఁడు, గోపన్నయు జ్ఞాపకమునకు వచ్చిరి. వెంటనే యతనికిఁ గన్నీళ్లు గిఱ్ఱునఁదిరిగెను. రాణి 'ఎందుకు నాయనా! కన్నీరుపెట్టుకొందువు' అని యడిగెను. "ఏమియు లేదు" అని చెప్పి ధర్మారావు చదువనారంభించెను. తీయఁగనే రుక్మిణీకళ్యాణము వచ్చెను. "కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచున్, ......అవి వినంగాఁ గ్రొత్తలౌచుండు" రాణిగారు చిన్నపుడు రుక్మిణీకళ్యాణము చదువుకొనిరి. ఆమె కా పద్యములన్నియు నోటికి వచ్చును. "అవి వినంగాఁ గ్రొత్తలౌచుండు" ననఁగనే, రాణి "నాయనా! పోతన్న

గారు ఏమన్నారయ్యా! నిజముగా నెప్పటికప్పుడు విష్ణుకథలు క్రొత్తలుగానే కనబడునుసుమా! అరువది యేండ్లనుండి వినుచుంటిని. ఆ పద్య మిప్పటికి నాకుఁ గ్రొత్తగానే యున్నది" అనెను. ధర్మారావు "ముక్తవైకల్యం డెవ్వఁడు తృప్తుఁడా"నెను. రాణి ధర్మారావువివేకమునకు సంతోషించెను.

"ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులుసోఁక దేహతాపమ్ములుతీఱిపోవు"

ఈ పద్యము చదువుచు ధర్మారావు గద్గదకంఠుఁడై యొక యుద్వేగమును బొందెను. అతని నేత్రములు బాష్పపూరితము లయ్యెను. తద్భక్తిభావాకృష్టయై రాణియును బాష్పపూరితలోచన యయ్యెను. పురాణమైపోయినతరువాత మఱికొంతసేపు భగవత్ప్ర సంగముచేసి, రాణి "బాబూ! చదువు మానితివేమి" అని యడిగెను. ధర్మారావు మాఱుపలుకలేదు. రాణి గ్రహించెను. ఆ సాయంవేళ నద్దాలబండిమీఁద రాణి దేవాలయమునకుఁ బోయెను. దేవాలయాంత ర్భాగమునుండి పురుషులందఱు వెడలిపోయిరి. దేవాలయము వెనుక నున్న యొక పురుషుని నర్చకులు చూడలేదు. అందుచే నతఁ డందే యుండెను. వెనుక నిర్వురు దాసీలు రాఁగా రాణి ప్రదక్షిణము చేయుచుండెను. వెనుకవచ్చుచున్న దాసీల యందెలు మ్రోగు చుండెను. నాయఁడు చనిపోయినతరువాత రుక్మిణమ్మారావుగారి పాదములందు నూపురసౌభాగ్యము తక్కిన సౌభాగ్యములతోఁబాటు లుప్తమయ్యెను. రాణికి దేవాలయము వెనుకనున్న సరసోపానముల మీఁద నొక పురుషుఁడు, నొక స్త్రీయుఁ గనిపించిరి. పురుషుని రాణి ధర్మారావుగా గుర్తుపట్టి,యామెమనస్సు కలుక్కుమన్నది. దాసీలను వెనుకనే నిలువుఁడని, తా నొక్కతెయే నెమ్మదిగాఁ జప్పుడు గాకుండఁబోయి యా ప్రక్కనున్న సంపెఁగ మొక్క చాటుగా నిలు చుండెను. ప్రక్కనున్నపిల్ల యెవరో రాణిగారికిఁ దెలియదు.

పురు—భక్తి వేఱు, జ్ఞానము వేఱు. జ్ఞాన మందఱికిని గలుగదు. భక్తి సులభమైన మార్గము.

స్త్రీ—శివుఁడు సేవనీయుఁడా, విష్ణువు సేవనీయుఁడా?

రాణి యీ మాటలు విన్నంతనే కొంత శాంతించినది. ధర్మారావునుగూర్చి యామె భావము కొంత మాఱినది. కాని యసలు తత్త్వము తెలియలేదు. ఆ పిల్ల యెవరు?

పురు—అది లీలాశుకులు పాడిరి. 'సంసారే కిం సారం? కంసారే శ్చరణ కమల పరిభజనం, జ్యోతిః కి మంధకారే? య దంధకారే రనుస్మరణమ్.' భక్తియోగులకుఁ కృష్ణస్వామి సులభుఁడు. జ్ఞానయోగులకు శివుఁడు సేవనీయుఁడు.

స్త్రీ—సేవనీయుఁ డందు వేమి? సులభుఁడు కాఁడా!

పురు—తల్లీ! జ్ఞానయోగము సులభము కాదు.

రాణిగారి కా పిల్ల వివేచనాశక్తి కబ్బురమైనది. ధర్మారావు 'తల్లీ' యని పిలచుటతో వారిద్దఱిసంబంధము తెలిసినది కాదు. ధర్మారావునకుఁ జెల్లెండ్రు లేరు. తండ్రి చేసుకొన్న యితర వివాహములకును నా వయసులోనున్న పిల్లలు లేరు. ఈమె యెవరు? రత్నగిరికూఁతురా! అయినచో నది వారాంగన. వారాంగన యన్న రాణిగారికిఁ గల దురభిప్రాయమునకు వీరి సంబంధమునకు నామె మనసులో లగించలేదు.

స్త్రీ—భక్తి యనఁగా నేమి, జ్ఞాన మనఁగా నేమి?

పురు—సర్వము బ్రహ్మము. బ్రహ్మ మనఁగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో బ్రహ్మ కాదు. ఈ త్రిమూర్తులకు నతీతమైన యొక శక్తి. అది నిర్గుణము. సచ్చిదానంద స్వరూపము. అది నీకుఁ దెలియదు. దానిసంగతి తరువాతఁ జెప్పెదను. ఇంద్రియములు, వాని విషయములు, తద్గుణములు సర్వము నబద్ధము. అబద్ధ మన్న జ్ఞానము బహుజన్మపరిపాకముచేత సహజమైనచో నతఁడు జ్ఞానియై, సంసారబంధమునుండి విముక్తుఁ డగును. ఈ సంగతి నేనును మఱికొంత చదివి తెలిసికొనవలయును. భక్తి యన్నఁ బోతన్నగారు చెప్పిరిగదా: 'తనుహృద్భాషలసఖ్యమున్' అని. ఆ పద్యము నీకు వచ్చునుగదా? ఏదీ, చదువుము.

దేవదాసి యా పద్యమును జదివెను. ధర్మారావు 'తాత్పర్యము చెప్పు' మనెను. ఆమె చెప్పెను.

పురు—ప్రహ్లాదుని భక్తి యెఱుఁగుదువుగదా? అట్టి భక్తి పురుషులకుఁ దగినది. స్త్రీలకు గోపికలభక్తివంటి దాచరణీయము.

దేవదాసి సరస్సులోనున్న స్వచ్ఛమైన నీటివంకఁ జూచెను. అప్పటికి సూర్యాస్తమయమై యెంతోసేపు కాలేదు. ప్రక్కనున్న పొన్నచెట్టు నీటిలోఁ బ్రతిఫలించెను.

దేవ—అన్నా! భగవంతుఁడు గోపికల వస్త్రము లెత్తుకొని పోయి యే పొన్నచెట్టో యెక్కెను. నా చీరకూడ నెత్తుకొనిపోఁడు కదా! అయినను నేను గొల్లకులములోఁ బుట్టలేదుకదా!

ధర్మా—గోపిక లనఁగా భగవంతునియందు బద్ధానురాగ లయిన స్త్రీ మూర్తు లనికాని, గొల్లవా రని కాదు. నీవుగూడ గోపికవే. "అదె నందనందను డంతర్హితుం డయ్యెఁ బాటలీతరులార పట్టరమ్మ" అన్నంత యెడలు తెలియనితనము వచ్చుటయే గోపికా లక్షణము.

దేవ—ఆ పద్యము గోపికాగీతలలోనిది కాదా?

రాణి యానందము పట్టలేకపోయినది. పిల్ల చూచినచోఁ బన్నెండు పదుమూఁడేండ్లకన్న నెక్కువ లేవు. రత్నపుమొలకలాగున్నది. నెమ్మదిగా వారిదగ్గరకు వెళ్ళెను. కాలియలుకుడుతగిలి ధర్మారావు తిరిగిచూచెను. రాణిగారు కనఁబడినంతనే లేచి నిలుచుండెను. దేవదాసి యేమో ఆలోచించుచుండెను. ధర్మారావు 'గిరికా' యనెను. ఆమె తలయెత్తిచూచి, యెవరో తెలియక ధర్మారావు లేచి నిలుచుండెనుగనుక తానుగూడ నిలుచుండెను.

ధర్మా—వీరు రాణిగారు, పెద్దరాణీగారు.

రాణి—ఈ పిల్ల యెవరు?

ధర్మారావు మాటాడలేదు.

దేవ—రత్నగిరి మా అమ్మండి!

రాణి—మీ రిద్దరేదో మాట్లాడుచున్నారు. మాట్లాడుఁడు.

ఇద్దరును సిగ్గుపడిరి. అది పసియెదలుపడు సిగ్గు.

రాణి—మీ రేవో సత్ప్రసంగము చేయుచున్నారు. మీరు కానింపు. నేను దైవదర్శనము చేసెదను.

వారు 'మేముకూడ వత్తు' మని యామెవెంట నడచిరి. రాణి వెంటనే దేవదాసి నడచెను. ధర్మారావు కొంచె మెడముగా వచ్చుచుండెను. ఎందుకో జననాంతరసౌహృదము కాంబోలు, రాణి యన్నచో దేవదాసికి భయముకలుగలేదు. చనవుకూడ నామె యవయవచాలనమున గోచరించెను. మొదట ధర్మారావు, నతని వెంట వారిర్వురు నాలయాంతర్భాగమునకుఁ బోయిరి. ధర్మారా వెప్పుడును దేవతాదర్శనమువేళఁ బ్రార్థనాశ్లోకములు పఠించును. నాఁడు రాణి యున్న దని చదువలేదు. అర్చకుఁడు ధర్మారావును జూచి భయపడెను. పురుషుల నందఱను బయటకుఁ బంపించినాఁడు. ఇతఁ డెక్కడనుండి వచ్చెను? కాని యతని యునికి రాణిగారు పాటించినట్లు కనఁబడలేదు. కాన నతఁడును గుండె నిలువఁ ద్రొక్కుకొనెను. విష్ణుపాదములు స్వీకరించిరి అర్చకుఁ డిచ్చిన మందార పుష్పములు తీసికొనిరి. రాణి బయలుదేఱెను. దేవదాసి కదలలేదు. రాణి 'ఏమి, రా వేమి?' యనెను.

దేవ——కృష్ణదేవునకు రుక్మిణియందుకన్న సత్యభామయందే యెక్కువ ప్రేమ. స్వామి భామనే తనవద్ద నుంచుకొనెను.

రాణి ప్రాణములం దుస్సు రనెను.

ధర్మా——సత్యభామయందుకన్న గోపికలయందు స్వామి ప్రేమ చెప్పుటకే వీలులేదు.

దేవ——అవు నవును. భ్రమరగీత లందుకనియే కదా?

రాణి మనసా యీలోకమున లేదు. దేవాలయమునుండి వెలికి వచ్చిరి. స్వామిప్రసాదము గొని, కొంచెము విశ్రమించినతరువాత దాసీవాండ్రతోఁ గలిసికొని రాణి వెడలఁబోయెను. ధర్మారావు సెలవుతీసికొనెను. దేవదాసి రాణివంక నమాయకపుకన్నులతోఁ జూచెను. రాణి చిన్నగా నవ్వెను. అన్నాసెల్లెం డ్రిద్దఱుఁ గలసి యింటిదారిపట్టిరి. గిరిక నింటికాఁక దిగఁబెట్టి ధర్మారావు వెనుదిరిగెను. గిరిక యతనిని లోనికి రమ్మనును. అతఁ డెన్నఁడును బోఁడు. ఇంటికిఁ బోయినంతనే తల్లి చింతపండుపచ్చడితో నన్నము పెట్టెను. ఇదివఱకే చుట్టుపట్ల నేతియప్పాలు బోలెఁ డున్నవి. ఈ పూఁట నెవ్వరు నిచ్చిరి కాదు. ధర్మారా వట్లే నాల్గుమెతుకులు గతికి,

చల్లపోయు మనెను. తల్లి మఱికొంచెము కలుపుకొనుమనెను. ధర్మారావుకు నేయిలేక సయించలేదు. తల్లి చల్లపోసెను. ధర్మారావు తినుచుండెను.

తల్లి—నాయనా! నేఁడు రంగాపురమునుండి మనిసివచ్చెను. పిల్ల పెద్దమనిసియై సంవత్సరము కావచ్చుచుండెను కార్యమునకు లగ్నము పెట్టించి, కబురంపించుమని మామయ్య చెప్పినాఁడట.

ధర్మారావు తలవంచుకొని తినుచు 'బాగున్నది. లంకణాలలో మనుగుడుపు ఇదే కాబోలును' అనెను.

తల్లి—సరే తండ్రీ! అందుకని మానివేయుదుమా? అప్పులో సప్పు. ఎట్లాగో చేసికొనవలయునుగాని, యదనుతప్పినపిల్ల నట్లుంచి, నచో నీలాపనిందలు పుట్టునుగదా!

ధర్మారావు మాటాడక భోజనముచేసి లేచిపోయెను. సావడిలో మంచమువేసికొని పండుకొనెను. ధర్మారావుతాత సోమన్నగారు తనకుమూనకుఁ బెండ్లికాదేమో యని మొదట దిగులుపడుచుండెను. రామేశ్వరశాస్త్రిగారు దేశములన్నియుఁ దిరిగి పలనాఁటిసీమనుండి యొక సంబంధము తెచ్చి యెట్లయిన నేమి పెండ్లిచేసెను. తరువాత చాలనాళ్ళదాఁక సంతానము కలిగినదికాదు. దానికొఱకు కొడుకుకన్నఁ దండ్రియే యెక్కువతపించెను. గంగాధరముగారి భార్యపేరు నాగమ్మ. ఆమె నాయకురాలంతది. మనిసి మోటు. ఆజానుబాహువయినమనిసి. నల్లని దేహచ్ఛాయ. నాగరకత యన్నది లేదు. నుయ్యిగింజ బయటకుఁ బోనీదు. ఆమె కాఁపురమునకు వచ్చినతరువాతఁ బదియేండ్లకు నొక యాఁడశిశువు కలిగెను. సోమన్నగారు మగశిశువు కానందుకుఁ జాలదుఃఖించెను. ఆ శిశువునకు మూఁడేండ్లు వచ్చెను. తరువాత మఱల నింకొక యాఁడశిశువు కలిగెను. సోమన్న యీసారియైన మగశిశువు గలుగలేదనుదుఃఖముచేతఁ బుట్టిన పసిపిల్లలను వాకిటఁ గూర్చుండి తెగఁదిట్టిపోసెనఁట. సోమన్న మిక్కిలి వృద్ధుఁడయ్యెను. పెద్దపిల్లకు నాలుఁగేండ్లువెళ్ళి యయిదవయేడువచ్చినంతనే ధర్మారావునకు జేసికొమ్మని రామేశ్వశాస్త్రిగారిప్రాణములు తీసెను. 'నేను ముసలివాఁడనయినాను. మనుమఁడు కలుగుటయు వానినిజూచి శాంతముగాఁ జచ్చిపోవుటయు దేవుఁడు నా మొగమున

వ్రాయలేదు సరే. ఈపిల్లకైనను ముడిపెట్టి చూచి చచ్చిపోవలెనని యున్న'దని రాపాడెను. 'నీ కొడుకున కెక్కడో గొప్ప సంబంధము చేయవలయునని యున్నది కాంబోలు. నీకువలెనే లక్షాధికారిని దెచ్చి నను గలిసిన సంబంధమువంటిది యెప్పుడును కాదు' అని సాధించెను. 'ముసలి ముండకొడుకుమీఁద నామీఁద నీకు దయలేనందుకుఁ జెప్పవలయును. ఏమో నీకును గంగాయికిని భేదములేదనుకొన్నాను. ఇఁక నీయిష్టము' అని బ్రతిమాలెను. ఇంట సావిత్రమ్మగారుకూడ బలవంతపెట్టిరి. చివరకు రామేశ్వరశాస్త్రిగారు ఒప్పుకొని పదునొకండు సంవత్సరముల వయసుగలిగిన ధర్మారావునకు నైదేండ్ల యరుంధతికిని వివాహముచేసిరి. పెండ్లి యఖండముగా జరిగెను. కృష్ణమనాయఁడు స్వయముగా రంగాపురముపోయి వధూవరులకు వేయిరూపాయలు కట్నము చదివించిరి. శాస్త్రిగారు పెండ్లికి నయిదాఱువేల రూపాయలు వ్యయముచేసిరి బ్రాహ్మణసంభావన యమోఘముగా జరిగెను. అధ్యయనము పూర్తిగాఁ జేసినవారికి నవరసులిచ్చెను. రూపాయ చచ్చునంభావన. పెండ్లిపీఁటలమీఁద నరుంధతి కూర్చుండలేకపోయినది. అర్భనాకారపుపిల్ల. చూచుటకు మూఁడేండ్ల పాపవలె నుండెను. ఎట్టు తేలువలె నెక్కడఁ గూర్చుండఁబెట్టిన నక్కడే యత్తుకొనిపోయెను. మధుపర్కములు మోయలేక పిల్ల యేడువఁగాఁ బీటలమీఁదఁ గూర్చున్నంతసేపే యవి కట్టి తరువాతఁ దీసివేసిరి. చాలసారులు పెండ్లికూఁతురు లేకుండఁగనే హోమములు నవియు జరిపిరి. ఒకరోజున సాయంహోమవేళ నరుంధతి 'బావా! నిద్దర వత్తోంది' యనెను. ధర్మారావు తనతొడమీఁదఁ బరుండఁబెట్టుకొనెను. పిల్ల నిదురపోయెను. పసివాఁడైన ధర్మారావునకు నావులింతలు వచ్చుచుండెను. ఇంతలో నమ్మలక్క లరుంధతి ధర్మారావు తొడమీఁద నిద్రించుట చూచి యెంతయిన ముచ్చటపడిరి. సోమన్నకుఁ దాను తరించినట్లే యుండెను. తరువాత రెండుమూఁడేండ్లకే రామేశ్వరశాస్త్రివ్యవహారము వ్యవహారములదాఁక వచ్చెను. పిల్లకు శ్రావణపట్టీలు పంపించలేదని, నడవడులు సరిగా జరుగలేదని నాగమ్మ సాధింపులు, దెప్పులు పడలేక సావిత్రమ్మగారి యెముకలు చిట్టెము కట్టినవి. దానికితోఁడు గంగాధరముగారుకూడ నగ్నికి సమిధయయి

నాఁడు. కాని, యొకప్పుడు బావమఱఁది పక్షముగాని, యక్కగారి పక్షముగాని యవలంబించలేదు. అరుంధతి వ్యక్తురాలయిన తరువాత బంతికి మంచిచీర పంపించలేదని యదియొక 'యాగి.' మొత్తము మీఁద మేనమామకు ధర్మారావునకుఁ బనుటలేదు. వియ్యపురాండ్రకుఁ బచ్చిగడ్డివేసిన భగ్గుమనును. అంత యిబ్బందులు పడుచున్నను మేనమామ ధర్మారావున కొకదమ్మిడి పంపించిన పాపానఁ బోలేదు. ఒక బస్తాబియ్యము తోలిన కలుపానఁ బట్టలేదు. ఇప్పుడు కార్యము చేసినచోఁ గావలసిన సంబార మెక్కడనుండి వచ్చును? మేనమామ చిల్లిగవ్వ రానియ్యఁడు.

ధర్మారావు సావడిలోఁ బండుకొని యింటివంకఁ జూచెను. దేవిడీయంత కొంప! ఇంటఁ దానును, దన తల్లియుఁ, దన భార్య కూడ వచ్చినచో నింటిలో ముగ్గు రుందురు. తల్లింతబావురుమనదు. అరుంధతిని జూచి తా నప్పుడే నాలుఁగేండ్లయినది. తనతండ్రి పోయినపుడు వారందఱు సుబ్బన్నపేట వచ్చిరి. అప్పటికిఁ బదేండ్లపిల్ల. అటు నిటు గిలకవలెఁ దిరుగుచుండెను. మగనికి సిగ్గుపడెను. అతఁడును పితృదుఃఖము, దారిద్ర్యబాధలలో నామెనంతగాఁబరిశీలించలేదు. అప్పటికిఁ దానుకూడఁ బసివాఁడే. ఇప్పటివఱకు మఱల నరుంధతి కనిపించలేదు. ఇప్పు డెట్లున్నదో? బక్కపలుచని యెఱ్ఱని మొగమున సౌందర్యము తాండవించుచున్న యరుంధతి యిప్పు డెంత బాగుండునో! మఱునిముసములో నరుంధతి, యొయ్యారముల ప్రోవు, పాతివ్రత్యమునకుఁ బెన్నిధి, మందహాసముల పేటిక తనవద్ద నున్నట్లు తా నామెఁ గౌఁగిట బూనినట్లు, నామె వచ్చినంతనే తనయిల్లు లక్ష్మితోఁ గలకలలాడినట్లు, ధర్మారావు భావసోపానముల కట్టెను. కార్యముచేసినచో డబ్బు కావలయును. అది యెచ్చటినుండి వచ్చును? ఏ మార్గము తోఁచలేదు. ఒక యుపాయ మున్నది. అది యిదివఱకే నాలుఁగైదుసారులు తన మనసులోనికి వచ్చినను ధర్మారావు దానిని మనసులోనికి రాకుండఁ బరిహరించును. ఆ యూహ యిది — తనయిల్లు తాకట్టు పెట్టినచో నప్పు పుట్టవచ్చునని. ఆ పని కృష్ణమనాయని దయను తిరస్కరించినట్లగునని యతఁడు చాల బాధపడెను. "గొడ్డువచ్చినవేళ కొమ్మ

వచ్చినవేళ" యన్నారు. తన భార్యవచ్చినవేళావిశేషముచేతఁ దాను బాగుపడునెమో! ఒక వందరూపాయ లింటిమీఁదఁ దెచ్చినచో నది క్రమముగాఁ దీర్చవచ్చును. సంకల్ప వికల్పములమధ్య గతాగతకారి యయిన యతని మనస్సు చివరకు గృహముమీఁద డబ్బు తెచ్చుటకే నిశ్చయపడెను. మనసులో భావజుఁడు పొడసూపిన యతనికి నిద్రపట్టినది కాదు. కోడికూసిన వేళ నిద్రపట్టువఱ కరుంధతీ పరిష్వంగములు మనసా సహస్రిమయినవి. నిద్ర పట్టినది. అతఁడు ప్రొద్దెక్కి లేచెను. తెల్లవాఱుటతో నతని మనసు మఱల మాఱెను. ఇల్లు తాకట్టుపెట్ట మనసొప్పలేదు. ఆ మహారాజుభార్య తన్నంత గౌరవించెను. ఆయన యాత్మ తన్ననుసరించుచునేయుండెను. ఆయన యెడల ద్రోహముచేయుటయా? రెండు మూనాళ్ళయినతరువాత నూరిలో నొకసిద్ధాంతిదగ్గఱకు యాదాలాపముగఁ బోయి తన కార్యమునకు లగ్నము పెట్టుమనెను. ఆయనయుఁ బదిరోజులలో లగ్నము కుదిర్చెను. మాఘమువఱకు నాఁగినను బాగుండెడిది. లగ్నము శ్రావణశుద్ధ దశమియయ్యెను. ఇంటికివచ్చి తల్లితో లగ్నముపెట్టించితి నని చెప్పి "అమ్మా! మాఘమాసముదాఁక నాఁగరాదా?" యనెను. తల్లి నవ్వి యప్పటి కూరకుండి సాయంతనమున రంగాపురమునకుఁ గబురంపెను. మఱునాఁడు కబురుపంపించితి నని ధర్మారావుతోఁ జెప్పెను. ధర్మారా వాశ్చర్యపడి "వద్దంటిని గదా" యనెను. "నీ వెప్పుడు వద్దన్నావు" అని తల్లి యనెను. మఱల మాఘముదాఁక నాఁగుమని ధర్మారావు కబురంపెనా, మామగారు మండిపోవును. ధర్మారావు మౌనము వహించెను. ఆనాఁడుసాయంతనము ధర్మారావు నాగన్నసెట్టి యింటికిఁబోయెను. సెట్టికుమారుఁడు వెంకటరత్నము పెద్దవాఁడై వ్యవహారములు తానే చూచుచుండెను. పల్లెయుఁగాక బస్తీయుఁగాకనున్న సుబ్బన్నపేటలో వారు వర్తకమంతయు గుత్తగొనిరి. ధర్మారావుగారు వెళ్ళునప్పటికిఁ దండ్రికొడుకులిద్దఱు బయట దుకాణములోననే యుండిరి. ధర్మారావునుజూచి వారిద్దఱిలో నొకరును మాటాడలేదు. కృష్ణమనాయఁడు బ్రదికియున్న చివరి నాలుఁగేండ్లును నాగన్నసెట్టి ధర్మారావునకు వంగివంగి నమస్కారములు చేయుచుండెను. తరువాత రాజాశ్రయముపోయినంతనే

ధర్మారావునెడల నతనికిఁ దృణీకారభావమే వృద్ధిపొందెను. తన రాక పరిగణింపకపోయినను కార్యావసరముకొలఁది ధర్మారావు పోయి యచటఁ గూర్చుండి "సెట్టిగారూ! మీతోఁ బనియుండివచ్చితి" ననెను. సెట్టి యేదోపని చూచుకొనుచు నామాటయే వినిపించనట్లు నటించి మఱికొంచెముసేపటికి "ఏమి పని" యనెను. ధర్మారావు ఒక వందరూపాయలు కావలయును, అప్పిప్పించెదరా" యనెను.

సెట్టి—మీ అప్పుతోనే సగము చెడినాము. సగానికి సగము వచ్చినది. అయినను మీ కేమి యున్న దని చూచి యిమ్మందువు?

ధర్మా— అయిదువేల రూపాయల వెలచేయు నిల్లున్నది కదయ్యా!

సెట్టి కాశపుట్టెను. పదివేల రూపాయల ఖరీదుచేయు నిల్లు నాయఁడు సరియైన ధరయని యయిదువేలకే కాఁజేసెను. ఇప్పుడు మఱల నా గృహము తనవంకఁ జూచుచున్న ట్లున్నదయ్యెను. ఇంత యూహ మనసులోదాఁచి 'అయినను మావద్ద నిపుడు ధనములేదు. వందరూపాయల కిల్లు తాకట్టుపెట్టెదవా'. అనెను.

ధర్మారావు కోమటిజిత్తులకు నోడలుమండిపోయి, 'తాకట్టు పెట్టెదనని నే నంటినా' యని మనసులో ననుకొని, ఆమాట బయటి కన్నచో నీ కొంచెము పొసఁగుట యెక్కడ చెడిపోవునో యనుకొని మౌనము వహించెను. కొంతసేపాగి సెట్టి 'రేపు ప్రొద్దున రండి' యనెను. ఇల్లుతాకట్టుతో 'నీవు' పోయి 'రండి' యను గౌరవపదము వచ్చినదని గ్రహించి, డబ్బువచ్చినట్లే ధర్మారావు తలఁచి 'రేపు ప్రొద్దుననా' యని, సెట్టి 'ఊఁ' యనఁగా నింటికిఁ జనెను. మఱునాఁ డుదయమునఁ జనెను. సెట్టి యింటివద్ద లేఁడు. వెంకటరత్నము 'మా బాబు ఎక్కడికో వెళ్ళెను. అయినను ప్రస్తుతము దొరకదు' అనెను. ఆ మాట తండ్రిచేతనే యనిపించుకొనవలయునని ధర్మారా వచటనే యొకటి రెండుగడియలు కూర్చుండి సెట్టి యెంతకు రాలేదని వెడలి పోయెను.

సాయంవేళ రంగాజమ్మగారు సావిత్రమ్మగారిని జూడఁబోయెను. సావిత్రమ్మగారికి మొదటిరోజులలో రంగాజమ్మగా రనినచోఁ బడెడిది కాదు. ఆమె లేచివచ్చెననియుఁ, బాంసుల యనియు నామె

యనుచుండెను. అట్లున్నపుడెల్ల శాస్త్రిగా రామెను శిక్షించుచు వచ్చిరి. తరువాత సంసారము చిక్కి రంగాజమ్మగారు చిన్నచిన్న విషయములలో సాయపడుచువచ్చినప్పటినుండియు నామెకు రంగాజమ్మగారిమీఁద నానుకూల్యముతోఁచెను. ఇప్పుడు సవతులిద్దఱుకలసినపుడెల్ల పిచ్చపాటి మాట్లాడుకొనుచుందురు. ఇప్పుడు సావిత్రమ్మగారు పరులతో రంగాజమ్మగారినిగూర్చి మాటాడవలసివచ్చినచో 'మాయింటి పెద్దకోడలు' అనియు, 'మా రంగాజమ్మ' యనియుఁజెప్పును. ఈ వేళ సావిత్రమ్మగారు రంగాజమ్మగారితో ధర్మారావు కార్యమనియు, లగ్నము పదిరోజులున్నదనియుఁ గుట్టువానికి డబ్బందలేదనియు, సెట్టివద్ద కేమో వెళ్ళెను ఏమయినదో యనియు ననెను. రంగాజమ్మగారు మాటాడ కూరకుండెను. ప్రొద్దు క్రుంకవచ్చిన వేళకు రంగాజమ్మగారు వెడలిపోయెను. సరాసరి సెట్టియింటికి నడచి సెట్టిని బిలచెను. సెట్టి 'అమ్మా! యింత ప్రొద్దుక్రుంకి వచ్చితి రేమి' యని యడిగెను. అసలు రంగాజమ్మగా రన్నచో నూరిలో నందఱకు గౌరవము. అందులోఁ బదియెకరముల యాసామి. రంగాజమ్మగారు సెట్టితో 'ధర్మారావు మీ వద్దకు డబ్బుకోసము వచ్చెనఁటకదా' అనెను. 'అవును.' 'ఎంత యడిగెను?' 'వందరూపాయులు.' 'ఆ డబ్బు క్రొత్తధాన్యము వచ్చినతరువాత నే నిచ్చెదను. కావలసినచో నోటు వ్రాసియిచ్చెదను. తెల్లవారిద్దున నాయనకు డబ్బు ఇప్పించండి.' సెట్టి 'చిత్తము, చిత్తము' అనెను. రంగాజమ్మగారు వెళ్ళిపోయెను. మఱునాఁడు ధర్మారావు మఱల సెట్టియింటికిఁ బోయెను. తండ్రికొడుకులిద్దరు నతనిని చాలగౌరవముచేసి కూర్చుండఁబెట్టిరి. ధర్మారావున కీ మార్పులో నర్థము తెలియలేదు. ఇంటిమీఁద నాశపుట్టినదనిమాత్రము తలఁచెను. సెట్టి కొడుకుతో 'ఒరేయి! ముందు శాస్త్రులుగారిపని చూడరా' యనెను. నోటదివఱకే వ్రాయించియుంచిరి. బిళ్ళకూడ నంటించిరి. ధర్మారావును దస్కతుచేయుమనిరి. అతఁడు చేసెను. వెంకటరత్నము బిళ్ళ యణా మినహాయించి, తొంబదితొమ్మిది రూపాయల పదునేనణాలు చేతిలోఁ బెట్టెను. ధర్మారావు 'మఱి తాకట్టు బదులు చేయుత్తరమైనను దీసికొ'మ్మనెను. సెట్టి 'చిత్తము. చిత్తము అక్కఱలేదండి. శాస్త్రిగారికుమారులు–తమరు

మాటతభావతుమనుష్యులా'యనెను. ధర్మారావునకుఁ బ్రతిపదమున నాశ్చర్యమే తోఁచెను. ఇది యేదో సెట్టిగొప్ప యెత్తేయెత్తెను. ఏమిటో తెలియలేదు. ఇంటికి వచ్చినతోడనే ధర్మారావు పదిరూపాయలు కర్చుపెట్టి యుప్పులు, పప్పులు, నేయియుఁ దెచ్చెను. తల్లి యీ పదిదినములు కొడుకునకుఁ జక్కని పోషణచేసెను. ఈ పది నాళ్ళలో ధర్మారావు చెక్కిళ్ళు కొంచెము బయటికి వచ్చెను. తేపు కార్యమనఁగా ధర్మారావు వీధిలోనికిఁ బోయెను. అయూరనున్న ముసలికమ్మవారికి, ముసలికాఁపులకు, ముసలి రెడ్లకు ధర్మారావన్నచోఁ జాల నాదరము, శాస్త్రిసంతాన మని. ఒక ముసలిరెడ్డి పదునేనెకరముల యాసామి, తొంబది యేండ్లవాఁడు ధర్మారావును జూచి 'మనుమఁడు కార్యానికిఁ దయారవుచున్నాఁడే' యనెను. ధర్మారావు కొంచెము సిగ్గుపడెను. ఆ కాలపు ముసలివాండ్ర పరాచిక మొక చిత్రము. మోటుగాఁ గూడ నుండును. ఆ ముసలి యిట్లనెను: 'ఈ కాలపువారికి ఒడలిలో సత్తువయేది? తినను లేరు; అటిగించుకొనను లేరు. నేను నా చిన్నప్పుడు మణుఁగుమణుఁగు బెల్లపచ్చు లెత్తుకపోయి ఒక్కసారిగాఁ దినెడివాఁడను. ఊఁచబియ్యము రెండు శేర్లు, మూఁడు శేర్లు ఒకబుగ్గకు వచ్చెడివికావు. నాఁగలి దున్నుట మొదలు పెట్టినచోఁ బ్రొద్దున మొదలు సాయంకాలము వఱకుఁ గాడిదించకుండ దున్నెడివాఁడను. ఈ వైపునుండి యావైపుకు గుండేరు అలాకగా దూఁకెడివాఁడను.' ఇట్లతఁడనుచుండఁగాఁ గబీ రాత్రోవ నేఁగుచుండెను. ముసలి 'ఇదిగో చూడు. వీఁడు పెద్దవస్తాదుకదా! నా చేతికిఁ జేయి యిమ్మను'మని చేయి చాఁచెను. ఇదివఱకు నాలుగైదుసార్లు కబీ రా ముసలివానికిఁ జేయియిచ్చుట, గిలగిలలాడుట మైనది. అందుచేతఁ గబీరునవ్వుచు దూరదూరముగఁ బోయెను. ముసలి "అదిగో! నలుబదియేండ్ల పడుచువాఁడు. నేను తొంబదియేండ్ల తొక్కును. చూచితివా" యనెను. ధర్మారావు "తాతా! మీకాలపు పుష్టి మా కెక్కడనుండి వచ్చును? జొన్నన్నము, మొక్కజొన్నన్నము, రాగులు తిన్నవారు మీరు. వరిబియ్యము తినెడివారము మేము. అసలు మేము మీయీడు వచ్చుదాఁక బ్రదుకుదుమా"యనెను ధర్మారావచటనుండి సెట్టిదుకాణము

నకు వెడలి, మఱునాటికిఁ గావలసిన గుడ్డలు, వక్కలు, లవంగాలు, చిల్లరయన్నియుఁ దీసికొనెను. ఇంటిలోనికి మఱికొంతసామాను కూడఁ దెచ్చెను. సావిత్రమ్మగారు 'ఆదివారమునాఁ డందలము,సోమవారమునాఁడు జోలె' మనిసి. ఈ పదినాళ్ళలో ధర్మారావు తెచ్చిన వన్నియుఁ గర్చుపెట్టెను. ధర్మారావు కొందఱు బంధుగులను రమ్మని యుత్తరములు వ్రాసెను. వారును వత్తురు. కనుక నింటిలోనికి మూఁడువీసెలనేయి. తక్కినసామగ్రియుఁ గొనెను. అంతయుఁ గలిపి సెట్టి కఱువదిరూపాయీ లయ్యెను. ఇంకఁ జేతిలో నిరువదితొమ్మిది రూక లుండెను. పదునాలుగురూపాయలు పెట్టి యొక నరసను కొనెను. ఇంకఁ బదునేనురూకలు. రెండురూపాయల చిల్లర. రంగాపురము దగ్గఱనే గనుక మఱునాఁడే పోవుటకు నిశ్చయించిరి. ఆరాత్రికి ధర్మారావు అక్కలు, బావలు, పిల్లలు నందఱుకూడ వత్తురు. బంధుత్వములో నంతియ. వట్టియపుడు తలలు బ్రద్దలు కొట్టుకొనినను నక్కఱవేళఁ జక్కఁగాఁ గలసివత్తురు.

ప్రొద్దుక్రుంకవచ్చినది. అస్తమయవేళనైన సూర్యదేవు నంతటివాని రాగము వదలలేదు. పక్షులు శ్రేణులు కట్టి నభోంతరాళమున బరువు లెత్తెను. వాకిటనున్న యశ్వత్థాగ్రభాగము పశ్చిమాచలము వెనుక కొదిగిన సూర్యుని జరఠాతపముచే నదియు రాగమే ప్రకటించెను. దేవదాసి ధర్మారావును జూడవచ్చెను. ఆమెను దూరమునుండి చూచియే ధర్మారావు పైయుత్తరీయమును వేసికొని వచ్చెను. ఇద్దఱును దేవాలయమువైపు నడచిరి. దారిలో ధర్మారావును మంగ చూచెను. ప్రక్కనున్న సాలె రామితో "చూచితివా మా బాబును! దొర' యనెను. మంగ తనవంకనే చూచుచున్నదని ధర్మారావునకు తెలియును. కాని యామె యతనితో నెప్పుడును మాటాడలేదు. ఇద్దఱును శివసన్నిధికి నడచిరి. అన్న లోనికిఁబోయెను. చెల్లెలు ముఖమంటపముననే నిలచెను. స్వామి ధర్మారావు బుజము మీఁదినుండి దేవదాసివంకఁ జూచెను. తనకన్న గృష్ణుఁడే యదృష్టవంతుఁ డనుకొనెను.

ధర్మారావు సగము విరాగి కాని,యతనికి వైరాగ్యమెంతయో లాలసత యంతె. స్వామివద్దనున్న పార్వతీదేవిని జూచి 'యీ

సంసారము భగవంతునికే తప్పలేదు, నాకా?' యనుకొనెను. అర్చకుడు రుద్రపాదములు తీయుటలోఁ బళ్ళెము మ్రోఁగెను. ధర్మారావు తన యూహకు భృంగిరిటుఁడు నవ్వెనేమో యని తిరిగిచూచెను. తరువాత వేణుగోపాలునిదర్శనము చేసిరి. ఆలయమునం దున్నంత సేపు స్వామి దేవదాసివంకనే చూచుచున్నట్లుండెను. స్వామికిఁ దనయందు దృష్టియే లేదు. కొద్దిగాఁ జీఁకటిపడినది. ఇద్దఱు నింటికి మఱలిరి. గిరిక నింటిదాఁక తెచ్చి ధర్మారావు వెనుదిరిగెను. గిరిక 'అన్నా' యని పిలచెను. ధర్మారావు వెనుకకుఁ దిరిగెను. గిరిక 'రేపు నీ కార్యమఁటకదా! వదినె వచ్చిన తరువాత మాతో మాట్లాడవు కాఁబోలు' ననెను. ధర్మారావు 'పిచ్చిపిల్లవు' అనెను. గిరిక చేతి యుంగరముతీసి 'యిది వదినెగారికి నే నిచ్చితినని యిమ్ము' అని యిచ్చెను.

# ఆఱవ అధ్యాయము

మఱునాఁడు ప్రొద్దున రంగాజమ్మగారిపాలముచేయుచున్న కాపు కట్టిన సవారిబండి యెక్కి, ధర్మారావు తల్లితో నక్కగార్లతో రంగాపురము చేరెను. బావమఱఁదులు తానును నడచిపోయిరి. పెత్తనమంతయుఁ బెద్దబావగారు సూర్యనారాయణగారు చేసిరి. ధర్మారావు డబ్బుమిగిలినది అతనిచేతిలోఁబెట్టి నడుపు మనెను. మధ్యాహ్నపుఁబీఁటలమీఁదఁగూర్చుండువఱకు రెండుజాములయ్యెను. గంగాధర సోమయాజులుగారి జ్ఞాతు లాయూర నుండిరి. వారిలో వారికిఁ బడదు. పిలుపులో సాగలాగించుకొనుటలతోఁ బ్రొద్దెక్కెను. చివరకు నెట్లో పొసఁగెను. మధ్యాహ్నపుఁజీర పదునేను రూకలు పెట్టికొన్నది. కాని యా చీర నాగమ్మగారికి నచ్చలేదు. ధర్మారావునకుఁ బెట్టిన బట్టలు నాల్గురూపాయలుచేయవు. 'మాపిల్ల యొకనాఁ డెఱిఁగినదా? ఒక పట్టుచీరయయినను తే గతిలేదు. ఇంతకును వలదన్నకొలఁది అప్పకొడుకని యిచ్చి దాని గొంతుకపిసికి'అని నాగమ్మ తనదుష్టతనము వెడలఁగ్రక్కెను. సావిత్రమ్మగా రూరకొనలేదు. "మాకు గతిలేక మీపిల్లను చేసికొనలేదు. కావలెనని మీ రేడ్చిననే చేసికొన్నాము. బంగారమువంటి చీర తెచ్చినను తృప్తిలేదు. సుబ్బన్నపేఁటలో నందఱుచూచి చీర బాగున్నదమ్మాఅన్నారు." పొగ రాఁజిరాఁజి మండినది. సోమయజులుగారు నటునిటు చెప్పక యూరకుండిరి. సావిత్రమ్మ చివరకుఁ గొడుకును బిలచి 'రారా! నాయనా! పోదము. కార్యము నక్కఱలేదు. గీర్యము నక్కఱలేదు. ఈ వెధవమాట లెవరు పడెదరు?' అని కుమారుని బ్రయాణసన్నాహము చేసెను వారు వీరు కలిపించుకొని "అట్లు పోయినచో బాగుండునా? మీలో మీరు కావలసినవారు" అని సర్ది చెప్పి ప్రయాణ మాఁపించిరి. సూర్యనారాయణగారు నాగమ్మగారి దేమియుఁ దప్పు లేదనియుఁ, దన యత్తగారిదే తప్పనియు వాదించిరి. దానితో ధర్మారావునకుఁ గష్టమువేసెను. 'అవునయ్యా! పదియెకరము లున్నవారి యెడలఁ దప్పు లుండునా?' యనెను. ఎట్లయిననేమి ప్రొద్దుక్రుంకినది.

జాముప్రొద్దుపోవువరకు ముహూర్తము సమీపించిన దని పీఁటల మీఁద గూర్చుండఁబెట్టిరి. పగలు జరిగిన పోరాటముతో నందఱకు నెవరికిఁ గావలసినవి వారికయ్యెను. సద్దుమణఁగి, యుండిరి. పానుపు మీఁద భార్యాభర్తలను గూర్చుండఁబెట్టి ముత్తైదువలు పాటలు పాడిరి. ఆ పాటలకు, నా హాస్యములకు, నా పరాచికములకు, నా నవ్వులకు మితి లేకపోయెను. రాతిరి రెండుజాములైనది. గదిలో నుండి ముత్తైదువులు కదలరు. తములపాకులు చుట్టి ధర్మారావు చేతఁ గొఱికించి, యరుంధతిని గొఱుకు మనిరి. ఆమె కొఱుకలేదు. 'పెంకెతనముపనికిరా' దనివారువీరుకోపపడిరి. అరుంధతియేడ్వనారంభించెను. బంతులాడించిరి. అరుంధతి సరిగాఁ గాసులపేరు మఱల ధర్మారావుచేతిలోకి విసరలేదు. ఎంతచెప్పినను వినలేదు. గంధము పూయించిరి. ధర్మారావామెచేతులకు మెడకు గంధముపూసెను. ఆమె మొగము త్రిప్పుకొనెను. ఎవరు నరుంధతిచేత ధర్మారావునకు గంధమే పూయించలేకపోయిరి. నాగమ్మగారు మధ్యాహ్నము పోట్లాడియుండుటచే నామె యాచాలునకే రాలేదు. సావిత్రమ్మగారు వచ్చియుఁ బ్రయోజనము లేదు. అందులో నొక ముత్తైదువ 'ఆ!ఇవ్వేళ నీ పెండ్లికూఁతురు పెండ్లికొడుకునెముకలు కొఱికినదే ?' అనెను. చివరకు మగవారు కోపపడి స్త్రీలందఱను బయటకుఁబంపించు వఱకు రెండుజాములు దాఁటెను. అరుంధతి పానుపుపైని ప్రవర్తనతో ధర్మారావునకు సగ ముత్సాహము చచ్చిపోయెను. తలుపు వేసినంతనే యరుంధతిపోయి తలుపుదగ్గఱ నిలుచుండెను. ధర్మారావు కొంతసేపుండి రమ్మని పిలచెను. రాలేదు. మఱికొంత సేపటికిఁ దానేపోయి యామెచెక్క పట్టుకొనెను. ఆమె విదల్చుకొని యేడ్వనారంభించెను. ఇట్లు గడియ రెండు గడియలు ప్రయత్నించి ధర్మారావు మఱలఁబోయి తాను శయనించెను. కానినిద్దురపట్టలేదు.

అరుంధతికి వివాహమయినతరువాత రెండవయేటనే శాస్త్రిగారిపని సన్నవడినది. అప్పటినుండియు వారికిని వీరికిని, నష్టమచంద్రుఁడు నైధనతారగా నుండెను. పిల్లకు బుద్ధి తెలిసినప్పటినుండియు నామె తనభర్తనుగూర్చిన మంచిమాట తనయింట వినలేదు. తన యత్తగారి గూర్చియు,(చనిపోయిన తరువాతఁగూడ) మామగారిని గూర్చియు,

భర్తనుగూర్చియు నిందావాక్యములే యామె వినెను. పసిపిల్లలకుఁ తమ తలిదండ్రులయందే సహజాభిమానమగుటవలన వారి కిష్టములేని వారు తన కిష్టములేనివారుగా నయ్యెను. అందుతోఁ దన కేమియు యత్తవారు పెట్టలేదని నిశ్చయము తల్లి యామె చెవిలో నూరిపోసెను. శాస్త్రిగారు పెండ్లివేళఁ బసిపిల్లయగుటచేఁ గోడలికి నగ లేమియుఁ జేయించలేదు. నగలక్రింద వేయిరూపాయ లిచ్చెను. ఆ డబ్బు సోమయాజులుగారు వడ్డికిఁ ద్రిప్పుచుండెను. దానితోఁ బొలముకొన వలెనని యాయన యూహ. కూఁతునకు నగలేమియుఁ జేయించ లేదు. అరుంధతి కీ సంగతియే తెలియదు. తన యొడల నగలు లేక పోవుటయే తెలియును. అత్తవారు తన కేమియుఁ బెట్టలే దన్నఁ బెట్టనే లేదనుకొన్నది. దీని కంతయు ఋజువుగా నత్తవారి లేమి యందఱు కును దెలిసినదే అంతటితో నయిపోలేదు 'ధర్మారావు నిష్ప్రయోజకుఁ డనియు దౌర్భాగ్యుఁ డనియు' నామె తండ్రియు; నిరుగమ్మలతో మాట్లాడుచు "మా కున్నాఁడుగా వరహాలరాశి మాయల్లుఁడు, మా యమ్మాయియదృష్టముకొలఁది దొరికినాఁడు" అని తల్లియు సర్వథా యామెకు నా భర్తయం దనిష్టమే పెంపొందించిరి. ఈరీతిగా నామె మనస్సు ధర్మారావునెడలఁ గలుషితమైపోయినది. రాత్రి మూఁడుజాము లయ్యెను. ధర్మారావు మఱలఁ జని, యామెను చేతులలోఁబూని బ్రతిమాలెను: "ఈ రోజు వచ్చునని పదిరోజులనుండి యెదురుచూచు చుంటిని. నా ధర్మపత్ని, నా యిల్లాలు, నా భాగ్యదేవతవునైన నీవు వచ్చినచో నా యింట మఱల లక్ష్మి తాండవించునని యనుకొంటిని. నే నన్నచో నీ కంత కోపమెందుకు? నే నేమి తప్పుచేసితిని?" మఱికొంతసేపు కోపపడెను: "నా మాట వినకపోతివా, ఱేపే నేను మాయూరు పోయెదను. నిన్ను వదలిపెట్టెదను. లోకములో మగనిని వదలినవారు లేరా! వారి కేమి? అపనిందకాక మఱేమియు లేదు. ఈ బుద్ధులు నీకే పుట్టినవా? ఎవరైన నేర్పిరా? నా యదృష్టముకొలఁది దొరికితివి!" కొంతసేపు విసుగుపడెను: "ఇంతకు నా యదృష్ట మిట్టిది. రత్నాలరాశివంటిదానవు. నీవు నాదానవనుకొన్నాను. ఏమ్మచు నేఱువాక సాఁగినఁ గాడిమోకులు దొంగ లెత్తుకొనిపోయినారఁట. అట్లున్నది నా స్థితి." కొంతసేపు బెదరించెను:

"నా చేతిలో దెబ్బలు తినెదవు. నే నసలు చెడ్డవాఁడను. నాకుఁ గోపమువచ్చినదా నా యొడలే నాకుఁ దెలియదు. ఇంతకు మంచిగా నామాట వినుము. లేకపోయినఁ జెడిపోయెదవు. జాగ్రత్త" కొంతసే పామెను తిరస్కరించెను: "మీతల్లిదండ్రులబుద్ధు లెచటికిఁబోవును. మా నాయనగారు వీరిని బాగుచేసినందుకు వీరు మామీఁద నేఁడు కక్షలు కట్టిరి. బిచ్చమెత్తుకొనుచున్న వీరితో మా తాతగారు సంబంధముచేసి వీరిని పైకిఁ దెచ్చినందుకు వీరు మాకు నేఁడు మేకులయినారు. నీవు వారికడుపునఁ బుట్టలేదా? అవు చేనిలో మేసిన దూడ గట్టున మేయునా?" ఈ మాటల కరుంధతికిఁ గోపమువచ్చెను. కాని చాల క్రొత్తవిషయములుగా నుండెను. తన తల్లిదండ్రులు బాగు పడినది తన మామగారివలనా? ధర్మారావు మఱల నారంభించెను: "మా యమ్మతండ్రి సోమన్నగారు బ్రతిమాలి పసిపిల్లవయిన నిన్ను నాకుఁ గట్టఁబెట్టిరి. లేకపోయిన నా కెక్కడయిన మంచిసంబంధము వచ్చెడిది. నాకుఁ గష్టములు వచ్చిన నాదుకొనువారేమో, యింకె వరైననైనచో! ఇప్పుడు సర్వథా చెడినాము. ఏది యెట్లయినను సరే యనుకొన్నచో మొదటికే మోసము వచ్చినది. నేను కొఱికిన తమలపాకు నీవు కొఱుకరాదేమి? పూలచెండు నాచేతికి విసరరాదేమి? గంధము పూయరాదేమి? నేను నీకుఁ జేసినవేకదా యవి? సామాన్యమైన మర్యాద యెఱిఁగినను చేసిన మర్యాద మఱల చేయుదురు. మర్యాద యెచటినుండి వచ్చును ? రక్తమునం దుండవలయును. పలనాఁటిమోటుమనుసులకు, సంభావనలకుఁ దిరుగువారికి గౌరవము తెలియునా!" అరుంధతి కొక సంగతి తెలిసినది–ఆ యూరి కీ యూ రెంతయో యీ యూరి కా యూ రంత యని. కాని రోషముగల పిల్ల యగుటచే దల్లిదండ్రులనుగూర్చిన యీ ప్రసంగ మామెకు రుచించలేదు. కోపము వచ్చినది. ధర్మారావు మఱల ననెను: "నే నిట్లనుచున్నానని నీకుఁ గోపముకాఁబోలు? ఇన్నాళ్ళుగా నీ భర్త నైన నన్ను నీ యెదుట నీ తలిదండ్రు లెన్నో యనియుందురు. వారి మీఁదఁ గోపములేదుగాని నామీఁద నీ రెండుమాట లన్నందుకే యింతా! స్త్రీకి భర్త శాశ్వతమా, తలిదండ్రులు శాశ్వతమా? నీ జీవితము నాజీవితము ముడిపడి సుఖదుఃఖములు మనయిద్దఱికి,

నొకటిగాని నీ తల్లికిఁగాని, నీ తండ్రికిఁగాని యేమియు సంబంధము లేదే? లోకములో నెవరైనను శాశ్వతముగాఁ బుట్టినింటనుండెడివారు కలరా? చూడుము.” మఱల బ్రతిమాలెను: “అన్ని పాపములు నీమీఁదఁ బెట్టుకొన్న నన్ను మన్నించవా? సరే! నేను బ్రతికి యెందుకు? తండ్రియా! ఆస్తియంతయు పాడుచేసెను. నా యందభిమానము గల రాజా? చనిపోయెను. ఏ భార్యవచ్చి నా యింటఁ గలకలలాడి నన్ను స్వర్గవీథులలోఁ దిప్పు నను కొంటినో ఆమె యిట్లు యినది. ఛీ! నేను బ్రతికియెందుకు?” తన భర్తకుఁ దనమీఁద నింత ప్రేమయుండఁగా నతఁడు చెడ్డవాఁడని చెప్పిరేమో! కాని పెంకెతనము సడలలేదు. ధర్మారావు ‘ఇంక రాకతప్పదు. రా! సరే. ఊరక వచ్చి మంచముమీఁదఁ బండుకొనుము’ అని చేయిపట్టుకొని లాగెను. అరుంధతి చేయి లాగుకొనెను. లాగుకొనుటలోఁ గ్రిందఁబడెను. ఆమె లేవలేదు ధర్మారావు లేవఁదీయలేదు. అతఁడుపోయి పండుకొనెను. తెల్లవాఱవచ్చినట్లున్నది. అతఁ డేదోయాలోచించుచుండఁగ నేనిదుర పట్టెను. అరుంధతి యట్లే నేలఁ బరుండి, కునుకుపట్టినదో లేదో తెల్లవాఱుచుండఁగాఁ దల్లి తలుపుతట్టినది. లేచి తలుపుతీసిపోయెను.

మఱునాఁడు మధ్యాహ్న మూరిలోఁ బొరిగింటికి వచ్చిన యెవరో ముసలమ్మ వీరింటికి వచ్చెను. సోమిదేవమ్మగారు తనకూఁతున కత్తవారేమియుఁ బెట్టలేదనియు నట్లనియు నిట్లనియు లక్ష చెప్పి, నిన్న పెట్టినచీరఁ జూపి, ఆమె ‘బాగున్నదమ్మా’ యనఁగా ‘నేమిబాగమ్మా ఆఱురూపాయలఁట’ అని, ‘రాత్రి కొంగునఁగూడ నేమియుఁ గట్టించుటకు మా యాఁడబిడ్డకుఁ జేతులు రాలే’ దనిజెప్పి, ‘నా కెందుకమ్మా! వారును వారు నొకటే నేనే పరాయిదానను నిన్న చీర బాగులేదని యేమో సామాన్యముగా నన్నందుకు మీఁదఁబడి కఱచినది’ అని తన యౌదార్యము, వియ్యపురాలి ఱాగతనము నుపన్యసించెను. కొంగు కేమియుఁ గట్టలేదన్నకబురు సావిత్రమ్మగారివద్దకు వచ్చెను. ఆమె కుమారుని నడిగెను. అతఁడు “కట్టితిని. జాఱిపోయె నేమో, లేకపోయినచో వారు కాజేసి బొంకుచున్నారేమో” యని తన కోపము ప్రకటించెను. తల్లి నిజమే యనుకొనెను. కొంగుకు నవరసు కట్టితి మని వీరును, కట్టలేదని వారును మఱల ‘నవధ’ బయలుదే

తెను. కాని మిక్కిలిగాఁ బ్రజ్వలించక కొద్దిలోనే తేలిపోయెను. సూర్యనారాయణగారు ధర్మారావుతో "ఏమిరా! నిజముగాఁ గట్టితివా?" యనెను. ధర్మారావు "నిజమే" యని మఱల నా యబద్ధమే గట్టిగాఁ జెప్పెను. ధర్మారా వబద్ధమాడఁడని సూర్యనారాయణగారి నమ్మకము. అందుచే నాయనయు నత్తగారివైపే వాదించెను. సూర్యనారాయణగారు కలిపించుకొన్నతరువాత నాగమ్మ సోమిదేవమ్మగారు వెనుకకుఁ దగ్గి "ఏమో నాయనా! కావచ్చును జాటిపోయినదేమో" యని యిల్లంతయు వెదకెను. ఆ రాత్రి మఱల బానుపు వేసిరి. ముత్తైదువలు వచ్చిరి. పాటలు పాడిరి. కాసులపేరు తీసి బంతులాడ మనిరి. ధర్మారావు మొగము గంటుపెట్టుకొని కూర్చుండెను. ఇద్దఱిలో నెవరును విసరరు. గంధము పూయుమనిరి. ధర్మారావు మౌనమే వహించెను. అరుంధతిమాత్రము చివరకు మగని చేతులకు గంధము పూసినట్లే పూసెను. తమలపాకులు భర్తకొఱకనే లేదు. ఎవరి వేడుక వారిది. ముత్తైదువలుమాత్రము వారి నవ్వులు, వారి పాటలు వారు కానిచ్చిరి. కొంతసేపటి కెవరిదారిని వారు పోయిరి. ధర్మారావు ప్రక్కమీఁద నొదిఁగి పరుండెను. అరుంధతి మఱలఁ దలుపుదగ్గఱ చేరెను. ధర్మారావు నిద్రపోయెను. అరుంధతి యట్లే నిలుచుండి నిలుచుండి, కొంతసేపు దుఃఖించి యోదార్చువారు లేక బ్రతిమాలువారు లేక తలుపే తీసికొని బయటకుఁబోవుదమని పోఁబోయెను. బయట గొళ్ళెము వేసియుండెను. అనఁగాఁ దనకుఁ దగిన స్థానము లోన నున్నది కాని బయట లేదనికాఁబోలు. క్రిందఁ బండుకొనవలయునని యూహించెను. ఒకసారి ధర్మారావునకు మెలఁకువ వచ్చి చూచెను. అరుంధతి యట్లే నిలుచుండెను. మఱల నతనికి నిద్రపట్టెను. కొంత ప్రొద్దువేళ కరుంధతిపోయి, యతనిశరీరము తాఁకకుండ నొడ్డిగిలి యా సెజ్జమీఁదనే పరున్నది కాఁబోలు. తెల్లవాఱువేళ ధర్మారావునకు మెఁలకువవచ్చి చూడఁగా నామె యందున్నది. అతనియెదలో మఱలఁ గామముత్రేకెత్తెను కాని బహు ప్రయత్నముమీఁద దానిని జయించి యటు తిరిగి పండుకొనెను. ఎంతసేపటికి నిద్ర పట్టలేదు. తెల్లవాఱి వచ్చినది కాఁబోలు! తల్లివచ్చి తలుపుతట్టఁగా నరుంధతి మేల్కొని తలుపుతీసి వెడలిపోయెను. ధర్మారావునకుఁ దరు

వాత నిదురపట్టెను. ఆనాఁడెల్ల నరుంధతి యుత్సాహముగ లేదు. తల్లి గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను. ఆమె యేమియు బదులుచెప్పలేదు. తండ్రికి జ్ఞాతులై వరుసకుఁ దనకుఁ బినతండ్రులైనవారిభార్యలువచ్చి "ఏమమ్మా అట్లున్నావు? అతఁడు నిన్నేమైనఁ గోపపడెనా? కొట్టెనా? పలుకరించలేదా?" యని ప్రశ్నించిరి. మాఱుమాటలేదు. "అమ్మా! మగవాం డొకవేళఁ గోపపడినను మనమే సర్దుకొనిపోవలయును. భర్త తనమాట వినునట్లు భార్యయే చేయవలయును. అతఁడు నిన్నుఁ గోపించినచో నతని బ్రతిమాలుము. పలుకరించనిచో నీవే పలుకరించుము. అమ్మా! అన్నియు మగనితగువాతనే కదా" అని వారు చెప్పిరి. సావిత్రమ్మగారు దానినిపోవుచు "అట్లా చెప్పండి. అమ్మా! తల్లి చెప్పకపోయినను మీరైనను చెప్పవచ్చును. పిల్ల లేమున్నది? పెద్దవాండ్రేది చెప్పిన నదియే నిజమనుకొందురు. మగనిమీఁదఁ దల్లిదండ్రు లేమికొండెములు చెప్పిరో? యిది వాఁడు చెప్పినమాట వినెనోవినలేదో? లేకపోయిన వాని కేలఁ గోపమువచ్చును? మాతండ్రి గంగిగోవువంటి బిడ్డ" యనెను. అరుంధతికి వా రనిన ప్రతిమాటయుఁ గ్రొత్తగానే తోఁచెను. ప్రతిపలుకులో నేదియో క్రొత్తభావమే స్ఫురించెను. ఆయూరిలో బ్రాహ్మణులలో ధనవంతుఁ డొకఁడున్నాఁడు. ఆయన చిన్నపుడు వలఁచి యొక చదువుకొన్న కన్యను బెండ్లాడెను. ఆమె మహాసౌందర్యవతి వయసు నలుఁబదియేండ్లుండును. ఆ భార్యాభర్తలు సీతారాము లని చెప్పుకొందురు. ఆమె కామశాస్త్రముకూడఁ జదివినదని చెప్పుకొందురు. ఆమెపేరు రాజ్యలక్ష్మమ్మగారు. పెండ్లికూఁతున కా నాఁడు జడవేయుట కామెను బిలిచిరి. అది యానందనామ సంవత్సరము. అప్పటికి ధనవంతులు స్త్రీలు కాని పురుషులుకాని ధనవ్యవహారములలో నెట్లున్నను సామాన్య సాంసారిక విషయములందు బిగింపులు పోవుటయు, లేని గొప్పతనములు నటించుటయు నంతగా లేవు. అందుచే రాజ్యలక్ష్మమ్మగారు పెండ్లికూఁతునకు జడవేయుటకు వచ్చిరి. మొగలిపూలు తెచ్చిరి. ఆమె తాను జడవేయునపు డెవరు నుండరాదని యందఱిని బంపివేసెను. ఆమె బయట నెంత గంభీరురాలో యేకాంతమున నంత సరసురాలు, చిక్కులి మాటకారి, ఆమె 'పిల్లా! జడవేయు మందునా'

యనెను. అరుంధతి బదులుపలుకలేదు. 'అంత సిగ్గెందుకే! నేనును కాసేపు మగఁడనే యనుకొనుము. నన్నును నీ వేమిచేసినను చేయ వచ్చును' అన్న దామె. అరుంధతి కనులెత్తి యామెవంకఁజూచి తెప్పవాల్చెను. రాజ్యలక్ష్మమ్మ 'ఓసి పిచ్చిపిల్లా! మగఁడేమున్నదే? నీ వెట్లుచెప్పిన నట్లు వినెడువాఁడు. చెప్పెడినేర్పులోనున్నది కాని. రా, జడవేయుదును' అని యామె తలదువ్వి పాయలు తీసెను. జడ వేయుచు 'అరుంధతీ! జడ యెందుకే? జడతో మగని నేమి చేసెదవు' అనెను. అరుంధతికిఁ దెలియలేదు. రాజ్యలక్ష్మమ్మగారు పిల్ల గడ్డము పూని మొగము వెనుకకుఁ ద్రిప్పి, చెక్కిలిపై నూనెచేతితోఁ గొట్టెను. చికిలినవ్వు నవ్వెను. అరుంధతి కేదో విచిత్రము, నపూర్వ మైన యనుభూతి కలిగెనుగాని మనస్సునకు స్పష్టపడలేదు. 'జడతో మగని నేమి చేయుదురు' అని యడుగవలెనన్న సిగ్గడుగనీయలేదు. రాజ్యలక్ష్మమ్మగారు చివర కుప్పెలుముడివేయుచు 'పిల్లా! ఈకుప్పెలు ప్రాఁతవిలా గున్నవి. పట్టు మొద్దుబాఱినది. దీనితో నతనిని గొట్టె దవుసుమా! ఎట్టిని కుర్రవానియొడలు కందిపోవును' అనెను. అరుం ధతికిఁ బకాలున నవ్వువచ్చినది. రాజ్యలక్ష్మమ్మగారు 'అమ్మో! ఆరితేఱినదానవే! ఏమో యనుకొన్నాను' అని వీపుమీఁదఁ జిన్నగాఁ జఱచెను. ఒక్క జడవేయుటయు, నీ నాలుఁగుమాటలు మాట్లాడు టయుఁ గాదు. ఏమి చేసెనో తెలియదు లేఁచునప్పటి కరుంధతి యొడలు పులకలతో నిండియుండెను. ఆమె యొడలెల్ల సిగ్గుముసుఁ గావరించెను.

అర్ధకముచేయువారు మొదలఁదీసికొనువేళఁ జించి కుప్పగావేసి నట్టివి, అంతరించిన ఢక్కా మస్లినుతానులు సహస్రములుగాఁ బెరిగి నట్లు కొంచెము ప్రొద్దుపోవువఱకు ద్వాదశీజ్యోత్స్నా తరంగము లుబుకుకొని వచ్చెను. సన్నని, తెల్లని వలిపపుచీర కట్టుకొని, తెల్లని మొగిలిపూవులు జడలో వెన్నెలకులేని తావులు సమకూర్చుచుం డఁగా శ్వేతద్వీపమునుండివచ్చిన యచ్చరవలె నరుంధతి దొడ్డిలో నా వెన్నెలలో చంద్రికాదేవతవోలెఁ దిరుగుచుండెను. ధర్మారావు పని యేదోకలిగి బయటకుఁబోవుట తటస్థించి యామెవంకఁ జూచెను. అతనికిఁ దల తిరిగిపోయెను. తనకొఱకే నింపఁబడిన దా నవ్యహేమ

మధుకలశము. కాని తన్ముఖస్పర్శ నతనియధరబింబ మెఱుఁగదు. ఆ రాత్రి మఱల బానుపు వేసిరి. ఆనాఁడు రాజ్యలక్ష్మమ్మగారుకూడ వచ్చిరి. ధర్మారా వామె నెఱుఁగఁడు. ఆమె యతని నెఱుఁగును. మఱలఁ బాటలు పాడిరి. పూలచెండ్లాడించు మనిరి. స్త్రీలందరు 'ఎందుకమ్మా! ఆ సొబగు రెండురాత్రు లయినది' అని ముగించిరి. రాజ్యలక్ష్మమ్మగారు పిల్లకు జడవేయునపుడు చెండొకఁడు కుట్టెను. అది తనవద్దనేయుంచుకొని యపుడు తెచ్చెను. ఆమె యా చెండు తీసి యరుంధతిచేతిలో నుంచి, 'ముందు నీవు వేయుముతల్లీ!'యనెను. ధర్మారావు చేయిపట్టలేదు. ఆమె 'చేయి పట్టవయ్యా!' యనెను. రాణివంటి యామెమొగము, ఆకర్ణాంతములైన యామెనేత్రములు, వివేకము త్తరముకొనివచ్చు నామె మొగము, నధికారము మార్దవము కలిసిన యామె గొంతుక- వీని కాఁగలేక ధర్మారావు చేయిపట్టెను. అరుంధతి చెండువిసరెను. సరిగా భర్తచేతిలోఁ బడెను. అతఁ డామె విసరు నని యనుకొనలేదు. దిఁగ్భ్రాంతుఁడై పోయి యచేతనుఁ డయ్యెను. నలుగురు 'అయ్యో! మఱలఁ వేయఁ డేమి! నేఁ డీయన బిగింపా' యనిరి. ఆ మాటలకు నొడలు తెలిసి మఱల విసరెను. చెండ్లాట చక్కఁగా సాఁగెను. గంధము పూయించిరి. అరుంధతి మగనిమెడకు రాయఁబోయి మూతికి రాచెనేమో తెలియదు. నలుగురమ్మలు 'ఇది మొన్న నే చేసిన నెంతబాగుండెడిదే' యనిరి. స్త్రీ లెవరిదారినివారుపోవువేళ నందరు రాజ్యలక్ష్మమ్మగారిని 'ఈ వేళ నీమాహాత్మ్యమమ్మా! నీ వేదో గారడీచేసితి' వనిరి. మఱల నరుంధతి ద్వారమువద్ద నిలుచుండెను. ధర్మారావు చూచెను. ఆ నిలుచుండుటకూడఁ దనవంకకు నడచుచున్నట్లే యుండెను. ధర్మారాయనిహృదయములో సముద్రమథనవేళ క్షీరసాగరగర్భగతతరంగములనుండి చంద్రుఁ డావిర్భవించినట్లు ఒక మహానందరేఖ పొడచూపెను. అతఁడామెవంకనే చూచుచుండెను. ఆమె తలయెత్తి యతనిని జూచెను. వ్యాకరణదోషము లెఱుఁగని యా కన్నులలోనిభాష యేమో యపండితులగు వా రిద్దఱకుఁ జక్కఁగానర్థమైఁ బతి చేతులు చాఁచి నెమ్మదిగ నెదురునడచుట, భార్య వేగముగా నాకౌఁగింటఁ జేరుట జరిగెను. ప్రశ్నోత్తరములు, రహస్యములు, చెవులలో నేదో

యూఁదుకొనుటలు, 'పిచ్చి, పాటి', దెప్పుకొనుటలు, మెచ్చుకొనుటలు, 'నీవే నా' కనుటలు వాగ్విషయమైనదంతయు వారే గుత్త కొన్నట్లయ్యెను. మాటాడుచు మాటాడుచు ధర్మారావు 'అదిగో! కోడికూసినది' అనెను. అరుంధతి నవ్వెను. ధర్మారావు మధురాధరము తన యెలనాగకన్నులమీఁద, ముంగురులమీఁద, నధరముమీఁద, పెదమీఁదఁ, బాదములమీఁద, చుబుకముమీఁద, మెడమీఁదఁ దాండవించెను. అరుంధతికిఁ దనయెదఁగల సౌత్రుబావులన్నిటికి ధర్మారావు తనస్పర్శతో సేతాము లెత్తిన ట్లయ్యెను. 'రాత్రి రేవ.వ్యరంసీత్' తెల్లవాఱి యిర్వురు విడివడినతరువాత ధర్మారావొక్కటియడుగుట మఱచితి ననుకొనెను-ఆ యాజ్ఞాపించినయామెయెవ్వరో, ఆ మంత్ర గర్తె! అరుంధతి యొకటిచేయుట మఱచితి ననుకొన్నది - జడతో భర్తను దాఁకనైన లేదే! అంతలో నామె సిగ్గుపడినది.

ఆ ప్రొద్దున వీధిలో ధర్మారావుతోఁగలసి ఎఫ్. ఏ. చదువు కొన్నవాఁడు ఒకఁడు హఠాత్తుగాఁ గనఁబడి ధర్మారావును జూచి చూచుటతోడనే 'ఏమోయి! ఈ యూరా యేమి మీది? అదేమోయి యీలాగు నున్నావు? ఈ కోస్తాకోస్తా గెలిచిన ట్లున్నావు' అనెను. ఆ నాఁడు సాయంకాలము బయలుదేఱి సుబ్బన్నపేఁట పోయిరి. పెండ్లి కూఁతును జూచుట కిరుగమ్మలు. పొరుగమ్మలు వచ్చిరి. రంగా జమ్మగారు వచ్చి, కోడలి నొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని 'అమ్మా! నీ వెంత యందగత్తెవయినను మా అబ్బాయితోఁ బోలవు. మా తండ్రి రతనాలమొలక కాదూ. అంద మెందుకు మా బాబుబుద్ధి చూడవలె. ధర్మమే అతఁడు. అతని చెట్టఁబట్టి యదృష్టవంతురాల వయినావు' అనెను. అరుంధతి 'యిదా రహస్యము! ఎవరివారికి వారు మంచివారు' అనుకొన్నది. ఎన్నఁడును రాని మంగ వచ్చి చూచెను. 'రావే చెల్లెలా! రా!' అని సావిత్రమ్మగారు కోడలిని జూపించెను. మంగ చూచి సంతోషించి 'ఏమైనను మా బాబుకుఁ దగినపిల్ల కాదమ్మా! అయినను ఫరవాలేదు. పెద్దకనులు, కనుముక్కుతీరు. నింటికిఁదగిన కోడలే' అన్నది. అని, మఱల 'అయినను నాకన్నఁ జెడిపోయిన దఁటలే' అనెను. రత్నగిరి వచ్చి చూచెను. 'అమ్మా! అరుంధతి యను పేరు పెట్టుకొన్నందుకు బాబయ్యకుఁ బేరు తేవలెను.

నీకు మీ తండ్రిగారు రత్నమువంటిపేరు పెట్టినందులకు దానికిఁ దగినట్లు నడచుకోవలయును' అనెను. మఱల 'బాబయ్యగారు దేవతాపురుషుఁడు. ఆ బాబున కొకజోలియు, నొకసొంటియు నక్కఱలేదు. తనదారిని దాను పోవును. తనదారిని దాను వచ్చును. మఱి యాయన పేరు నిలుపవలెను' అన్నది. అచ్చట నెవరువచ్చినను తనభర్తను మెచ్చుకొనుటే. ఆ యూరికి నీ యూరికి నింతభేదమా? తనపుట్టినింటికి నత్తింటికి నింతదూరమా? అరుంధతి ప్రొద్దువంకఁజూచెను. క్రుంకవచ్చుచున్నది. రెండుపక్షులు కలసి యాకాశమున గూఁటికిఁ బరువెత్తుచున్నవి. భార్యాభర్తలు జేయిజాముపేళకు మఱలఁ గలసికొనిరి. అరుంధతి శిశువువలె మగని యెదురొమ్ము నత్తుకొనెను. ధర్మారావునకుఁ దనప్రేమమంతయుఁ దన పెదవియందు, హస్తములయందే నిలచినట్లు తోఁచెను. ఆనాఁడు తనయింట ముక్కోటిదేవతలువచ్చి నిలచినట్లు తోఁచిన దాయనకు. అవిరళితకపోలోరువక్షస్కులయిన వారక్రమముగాను, క్రమముగాను నిలచినదానిమీఁద నిలువక జల్పించ నారంభించిరి.

ధర్మా—నీ కొకరహస్యము చెప్పుదునా? ఆ నాఁడు నీ కొంగునకు నేను ఏమియుఁ గట్టలేదు. అబద్ధమే చెప్పితిని.

అరుం—ధర్మమూర్తులే మీరఁట. అబద్ధము, ధర్మము నొకటియేకాఁబోలు! అసలు మీ రేది చేసినను నదియే ధర్మము!

అని సిగ్గుపడి మగనిమెడక్రిందఁ దలఁ జేర్చెను. ధర్మారావంతలో నామెను నవ్వించెను. ఆమె చేతులతో నతనిని దూరము త్రోసెను.

అరుం—ఆ రహస్య మేమిటో చెప్పుఁడు.

ధర్మా విదిగో యని నవర సామె కొంగున మూటఁగట్టెను. అరుంధతి యా మూట విప్పి, నవరసు తీసి, భర్తకుచ్చెలకొంగు లాఁగి యందు మఱలమూటఁగట్టెను. అతఁడు మఱల నూడఁదీయుచు నామెకు లజ్జాపులకమందహాసోదయహేతువులైన పలుకులతోఁ 'గాదు తీసుకొ'మ్మని బ్రతిమాలెను. ఆమె 'నే నేమి చేయుదును దానితో' ననఁగాఁ 'జేగోడీలు కొనుక్కొను' మనియెను.

అరుం—అవును. దీనితో నంతే. ఒక గాజులజతగూడా రాదుగా.

ధర్మా—అవి మీ నాన్న చేయించలేదుగా మఱి.

అరుం—పుట్టింటివారు సొమ్ము పెట్టుదురా? వారికి మగపిల్లవాఁ డున్నాఁడు. పెళ్ళికావలసినపిల్ల యింకొకతె యున్నది.

ధర్మా—వారి సొమ్మెవరు పెట్టుమన్నారు?

అరుం—ఎక్కడనైన దొంగిలించుకొని రమ్మన్నారా?

ధర్మా— నే ననలే దామాట. ఇతరుల సొమ్ము దొంగిలించ వద్దన్నాను.

ఆమె కర్థము తెలియలేదు. లేచి చీర సర్దుకొని పన్నీరు, గంధము, వక్కలాకు లుంచిన బల్లవద్దకుఁబోయి నిలుచుండి తమలపాకులతోఁ జిలుకలు చుట్టుచుండెను. 'పతి కొంచెము మంచితీర్థ మి' మ్మనెను. ఆమె యీయలేదు. 'కొంచెము నీరు తెచ్చినచో నరిగిపోవు. పుక్కిలించి యుమియవలయు' ననెను. అరుంధతి కదలలేదు. అతఁడే లేచిపోయి వెండిగిన్నెలోనున్న పన్నీరు నోటిలోఁ బోసికొనెను. అరుంధతి 'అది పన్నీరు' అనెను. అతఁడు భార్యమీఁద నవియెల్ల నుమిసి నవ్వమొదలుపెట్టెను. ఆమె చీరకొంగుతో ముగము చేతులు తుడుచుకొని, 'యిట్లయినచో నేను మాయూరు వెడలిపోయెద' ననెను.

ధర్మా— మీ దే యూరు?

అరుం—(రంగాపుర మనవచ్చి) సుబ్బన్నపేఁట.

ధర్మా—సుబ్బన్నపేఁటలో మీయిల్లెక్కడ; రావిచెట్టు ముందరా?

అరుంధతికిఁ గోపమువచ్చెను, నవ్వును వచ్చెను. ధర్మారావామెను దగ్గఱకుఁదీసి 'నీ పెండ్లినాఁడు మా నాయనగారు నగలకు వేయిరూపాయ లిచ్చెను. నీ వప్పటికి లింగి వాయెను. వ్రేలెఁ డంత లేవు. నీ కే నగలును చేయించుటకు వీలులేకపోయినది. అవి మీ నాన్న వడ్డికిఁ ద్రిప్పుచున్నాఁడు. ఇంటిలో నెప్పుడు నీ మాటయు ననుకొనలేదా? నే నడిగినచో నామీఁదఁబడి కఱచును. ఈసారి నీవు

పోయినపుడు మీనాన్న నడిగి నగలు చేయించుకొనుము' అని దేవ దాసి యిచ్చిన యుంగర మామెచేతికిఁ బెట్టెను.

అరుం—ఇది మీరు చేయించితిరా?

ధర్మా—కాదు, నాచెల్లెలు నీ కిమ్మని యిచ్చినది.

అరుం—మీ చెల్లె లెవరు?

ధర్మా—ఇందాక రత్నగిరి యనునామె నిన్నుఁ జూచుటకు వచ్చినదే, ఆమెసూఁతురు.

అరుం—వాండ్రు భోగమువాండ్రుకదా?

ధర్మా—అవును.

అరుం—ఈ యుంగరము నా కక్కఱలేదు, భోగముదాని చేతిది నేను పెట్టుకొందునా?

అని తీసి భర్త కీయఁబోయి యతఁడు పుచ్చుకొనకుండుటచే బల్లమీఁద నుంచెను. ధర్మారావు తానే యా యుంగరముతీసికొని తనకొనవ్రేల నుంచుకొని పోయి పన్నుండెను. అరుంధతి కొంతసేప టికిఁబోయి భర్తకుఁ గోపమువచ్చినదని తెలిసికొని యతనియొడిలోఁ గూర్చుండి 'మఱల మొదలా' యనెను. అతనికిఁ గోపములో నవ్వు రాలేదు. 'అంతకోప మెందుకు? అయిన నిటు తెండు' అని యుంగర మతని చేతినుండి తీయఁబోయి యతఁడు పెనఁగులాడఁగా బలవంత ముగాఁదీసి తనచేత నుంచుకొనెను. అప్పటికిని ధర్మారావు బిగువు సడలలేదు.

అరుం—ఇంకను గోప మెందుకు? అవును. పాటయాపిన తరు వాతఁగూడ శ్రుతి మఱికొంచెము సేపటిదాఁక నుండునుగదా? అందు కనియే కాఁబోలు! అవునుకాదూ!

అని ఆమె భర్తకపోలముపైఁ గపోలము చేర్చెను. ధర్మా రావుమనస్సు వర్షానదివలె నుద్వేగమును, శరత్కాల నదివోలెఁ గలకతేరుటను బొందెను. ఇంకఁ బ్రవహించెను.

ధర్మా—నీవు సంగీతము నేర్చుకొంటివా?

అరుం—నాకు రాదు. రాజ్యలక్ష్మమ్మగారు పాడుచుండఁగా నెప్పుడును వినుచుందును. ఆమె చక్కఁగాఁ బాడును.

ధర్మా—ఆమె యెవరు?

అరుం—ఎవరా? చేసినమే లంతలోనే మఱచిపోవలెనా?

ధర్మారా 'వింతమాటకారితన మెచ్చట నేర్చితివే' యనుట లోనే అరుంధతిచెంప ఛటీలుమనెను. అరుంధతికి దెబ్బ చుఱుకుగాఁ దగిలి, కపోల మెఱ్ఱపడెను. ధర్మారావు వెంటనే కౌఁగిలించుకొని 'పొరపాటునఁ బెద్దదెబ్బ తగిలినది. అయినను ఆటలలో దెబ్బ అరటి పండు. మంత్రము పెట్టనా' యని యూఁది, చేతితో నిమిరి 'కంది కుంకమరాచిన ట్లున్నదిసుమా' యని చమత్కరించెను. ఆమెయు మూతివిఱిచి మఱల నతనికౌఁగిటికే చేరెను. కొంతసేపటికి మఱల నిద్దఱును శయ్యాగతులైరి.

అరుం—అయిన భోగమువాండ్రు మంచివారేనా యేమి?

ధర్మా—భోగమువాండ్రు వేఱు; వారాంగనలు వేఱు. భోగమువాండ్రు భగవంతుని సన్నిధానమున నృత్యగానములుచే యుట కేర్పడినవారు. వారాంగనలు వారిలోఁ గులము చెడినవారు. భగవంతునకు దేవాలయములో నుత్సవములు చేయుటయు, రాజో పచారములు నెఱపుటయు భోగ మందురు. 'స్వామికి నేఁడు భోగము జరిగినది' యనుట వినలేదా? అందుకని వారికి 'భోగాంగన'లని పేరు వచ్చెను. భాషలో ననేకశబ్దములవలె నిదియు దురర్థమును గాలము ననుసరించి యిచ్చుచుండెను. ప్రపంచమునఁ గామక్రోధాదులుబలిసి దేవునికై ప్రత్యేకింపఁబడిన యీ స్త్రీలు దుర్వృత్తిలోనికి దిగిరి. ధనవంతులు వారిని దించిరి. వారు సుఖముగా జీవించుట కేర్పడిన భూములను భోగము లనియే యందురు. వారు నిత్యము భగత్సేవ చేయవలసినదే కాని ఇంకొకదుర్వృత్తియందుఁ దిరుగరాదు.

అరుం—పెండ్లిచేసికొనకుండ వారి కెట్లు జరుగును?

ధర్మా—నిన్న రాజ్యలక్ష్మీదేవిగారు జడవేయుట తటస్థించ నిచోఁ దమ కెట్లు జరిగెడిది?

అరుంధతి సిగ్గుపడెను.

ధర్మా—దేశమున నందఱకు వివాహము లగుచున్నవా? మనదేశము గనుక స్త్రీలకు సరే! పురుషులకు వివాహముకానివారు వేయిమంది యుందురు. వారిగతి యేమి? బాల్యముననే భర్తచనిపో వును. ఆ స్త్రీగతి యేమి? తెలిసినచోఁ దనిజీవితమును భగవంతుని

కల్పించుటయం దున్నంత తృప్తి దుఃఖభూయిష్ఠమయిన యీ సం సారములో లేదు. నా కిరువదియేండ్లు వచ్చినవి. నాకు బుద్ధి తెలిసి నప్పటినుండియు నేను సుఖ మన్నది యెఱుఁగను. సుఖపడిన దింత వఱకు రెండు రాత్రులు. రెండు చేతిలోనికి వచ్చి చెడిపోయినవి. భగవంతుఁడు మన సుఖమును దుష్టప్రభువు తనసేవకుని వేతనము వలె నెక్కడి కక్కడనే విఱుఁగఁ గోయును. అరుంధతికి ధర్మారా వుంలో నొకక్రొత్తఛాయ గోచరించినది. అతనిలో నేదో యగ్ని యున్నది. ఆతఁడు మాటాడుచుండఁగా నామె యతనివంకఁ జూడ లేకపోయెను. ఇంతకుముందే యామె యతని కెంతో సన్నిహితు రాలై యింతలో నతనికిఁ దనకుఁ నెంతోదూర మున్నట్లు తలంచెను. తనచేయి మాటాడుచున్న యతనిబుజముమీఁద వేయవలయు నను కొన్నది కాని, యట్లు చేయుట కామెకు గుండె యాన లేదు.

అరుం—ఆమె పే రేమి?

ధర్మా—అందఱును 'దేవదాసి' యందురు. నేనుమాత్రము 'గిరిక' యని పిలుతును.

అరుం—ఆమె మన యింటికి వచ్చునా?

ధర్మా—సామాన్యముగాఁ బ్రతిదినమునను వచ్చుచుండును. ఈ నాఁ డేల రాలేదో తెలియదు. ఆమెకు నీమీఁదఁ జాల నభిమా నము.

అరుం—ఆమె మఱి వృత్తిచేయునా? పెండ్లి చేసికొనునా?

ధర్మా—ఆమెనుగూర్చి యట్లన రాదు. పాపము ఆమె వేణు గోపాలస్వామివారియందుఁ దనసర్వస్వ మర్పింపఁబోవుచున్నది. భగవంతుఁడుఁ డామెను స్వీకరించినాఁడు. పడిపోయిన వారికులము నుద్ధరించుట కామె యవతారమెత్తిన మూర్తి. అప్పటికిఁ గోడికూసి నది. వా రా ప్రసంగమును మానిరి. మఱునాఁడు రంగాజమ్మగారు పదిరూపాయలు పెట్టి చీరయొకటికొని పసుపు కుంకుమలు, పటిక బెల్లము, కొబ్బరిచిప్పలు తెచ్చి యరుంధతికిఁ గానుకయిచ్చెను. సావిత్రమ్మగారు వలద నెను. ఆమెకోపపడి 'అట్లనరాదు, నాముచ్చట కొలఁది నేను పిల్ల కేదో తెచ్చియిచ్చినపుడు మీరు వలదనరాదు' అని యరుంధతి కా చీర చదివించి "అమ్మా! కట్టుకొనుము. చూచి

పోయెదను" అని యామెచేతఁ గట్టించెను. అది నల్లని యుప్పాడ జరీచీర, ఎట్టిని యరుంధతి బక్కపలుచనిదగుటచేత నా సొగసైన చీరలో మిన్నులఁ బ్రకాశించెను. నేఁడు తెల్లవాఱువఱకు నీ చీర విప్ప రాదు సుమా! ఆ చీరలో నీవు చాల నందముగ నున్నావు. నలిగి పోవు నని చూడకుము" అన్న దామె. ఆనాఁ డంతయు నెండ ఫెళ్లునఁ గాచెను. చీర ఫెళ ఫెళ మనెను. రంగాజమ్మగారికి వయసుమిగినను నామె సుగంధద్రవ్యము లుపయోగించును. ఆ యుపయోగించుట యామెకు ప్రకృతిసహజమైనగుణమే కాని వేఱుకాదు. ఆమె తనవద్ద నున్న యుత్తమజాతి మృగమదమును. చిన్నడబ్బీలోఁ బెట్టి పంపించెను. అరుంధతి దానిని చేతిని రాచుకొని చీరకుఁ బులిమెను. చీర గుప్పుకొని సువాసనలు చిమ్మెను. ఆవాసన లరుంధతి పోయినంత మేఱ బ్రవహించుటచేత నామెయే కస్తూరిలేడి కాఁబోలు ననిపించినది. సాయంవేళఁ జూడవచ్చిన యొకకమ్మవారిముసలమ్మ 'తల్లీ! చీర బాగున్నది. చిన్నపుడు రంగాజమ్మ యిట్లే యుండెడిది' అనెను. అంతలో నెఱ్ఱయెండలు వచ్చెను. కాలపురుషుఁ డన్న భార్గవరాముఁడు సూర్యబింబ మన్న పరశువుతో శత్రుసంహారముచేసి, పశ్చిమదిశ యను తటాకము నిర్మించి, యందుఁ దనపరశువును పరిత్యజించి పోఁగా నా తటాకముకాంతులు దేశమంతయుఁ గ్రమ్ముకొన్న ట్లుండెను. పొలమున మేయఁబోయిన పసువులఁ దోలుకొని కాఁపుకఱ్ఱవాండ్రు తిరిగి వచ్చుచుండఁగాఁ బదిరోజు లెండలు కాచి యెండిన సుబ్బన్న పేఁట వీథులలో నలిగిన దుమ్ము పసువుల కాలిగిట్టల చీలికల నడుమనుండి యవి నడచుచుండఁగాఁ బొగవలె వచ్చుచుండెను. పసువులు తల లాడించుకొనుచు నొకవిధమైన వేగముతో నదొక శోభగా నడచు చుండెను. ఇంటివద్ద లేఁగలున్నయావులు గృహముదగ్గఱకు వచ్చిన కొలఁది తొందరగా నడచుచు 'నంభా' యని యఱచుచుండెను. పోరంబోకలలో గుండేఱుగట్టునఁ జనికినది మొదలు దట్టముగా మొలచి మోకాటియెత్తున నున్న గడ్డి సమృద్ధిగా మేసి కడుపు లుబ్బి ప్రొద్దు జాఱినవేళ చెట్లక్రింద నిలఁబడి నెమరువేసినతరువాత నవక్షీరములు పొదుగుల కెక్కి చన్నులు బిగిసి పొదుగులు గర్భగతక్షీరధారా స్వచ్ఛతచేత గోదుమవన్నెలెక్కఁగాఁ గుండోధ్నులయిన యాఁవుల్లులు

వెనుకకాళ్ళు ముందుకాళ్ళతో సమానవేగమునఁ దీయలేక కన్నులయందు లేఁగలఁ జూడవలెనన్న గోరికయే తక్క వేఱొకటి లేకుండఁగాఁ జిఱుపరువు లెత్తెను. నూతనాంకురితయౌవనులకు పసికాముకులకు లోనున్న ప్రేమ యను మహాజలపాతములో నున్న నీరు లోకానుభవ మను చెఱువు కట్టుకొని, యందునుండి బోదెలు త్రవ్వుకొని సావకాశముగా ననుభవించలేక యొడలినిండఁ బట్టుకొని యుక్కిరిబిక్కిరిగాఁ గ్రమ్ముకొనియున్నట్లు ఎఱ్ఱయెండలు క్రమక్రమముగా నల్లవడి లేఁతచీఁకటులు కాఁజొచ్చెను. అంతలో నొక్కకళ మిగుల్చుకొన్న చంద్రుఁడు చీఁకటుల 'నుఫ్' అని యూఁదినట్లు పురిటిలోనే సంకుకొట్టిన పసిపిల్లవలె నంధకారము పుట్టుమనే చచ్చిపోయెను. వచ్చినవెన్నెలలు వర్షాంతముల మొంకునీటిచేతఁ, బాలాలపచ్ఛదనముచేత, వానకురిసిన త్రొక్కుడులచేతఁ, బసువులకాళ్ళగిట్టలు గుర్తులు చెడనంతమాత్రమే కాసిన యెండవలన నల్లనైన డొంకలచేత, పూవులన్నియు నపహరించుకొనిపోఁబడి నాలుకలు చాఁచినట్లున్న మొగిలిపొదలచేత, నరుంధతి ధరించిన నీలమసృణచ్ఛాయారమ్యమైన చీరచేతను జీఁకటులకు లొంగిపోయినట్లే యయ్యెను. రాత్రియై మఱల భార్యాభర్తలకుఁ గలసికొనువేళ యయి యింటిలోఁ జివరకు సద్దుచున్న పాత్రసామగ్రిమ్రోఁతలే మన్మథునిజ్యాటంకారమువలె ధ్వనించెను. ఆ నాఁడు పవలెల్ల నరుంధతి కనఁబడలేదు. రాతిరి కీ నల్లనిచీరతో శాంబరీవిద్యవలెఁ దోచినంతనే ముగ్ధుఁడైన ధర్మారావు కనులతో నూరకే చూచుచుఁ బంకుకొనెను. అరుంధతి చిలుకలు చుట్టుచుండెను. క్రొత్తకస్తూరివాసన తరఁగలు తరఁగలుగా గదియెల్లఁ దారాడి, వెలుఁగుచున్న యగురువత్తులను వట్టి నిర్గంధధూమముగాఁ జేసి, కడచినరాత్రిదైన తమశయ్యాగతమైన పరిభోగసూచకమైన స్వకీయప్రేమభావనిర్గతమో యన్నట్టిదైన పరిమళమునుగూడ జయించి, ధర్మారావునాసారంధ్రము నంటఁబొడిచెను. ఉన్మాదినియైన యాచిక్కనితావికి ధర్మారావు దక్షిణానిలప్రచారమువలన సన్నసన్న పొరలుపొరలుగా వచ్చిన పటీరతరువాసనలు తగిలి, నిద్రామాంద్యమునుండి చుట్టలుచుట్టుకొన్న యొడలు దీర్ఘీకరించి, తత్పటీరవృక్షాభిముఖముగాఁ బ్రాఁచులు మందమందముగఁ జనుచున్నట్లుగా

నరుంధతివంకకు నడచెను. దగ్గఱకువచ్చిన పతికి నరుంధతి పోకచెక్క నోటి కందించెను. అతఁడు వ్రేలుకూడఁ గొఱికెను.

అరుం—వ్రేలుకొఱికిన నొప్పిపెట్టదా?

ధర్మా—నేనా కొఱికినది? ఆ చిలుకలు కొఱికెను కాఁబోలు!

అరుంధతి మఱిఁక చిలుకలుచుట్టి, తనవ్రేళ్ళతని నోటికందకుండ నందిచ్చుచుండెను. అతఁడును బల్లనానుకొని నములుచుండెను.

ధర్మా—ఈ చీర యెచ్చటిది? ఈ కస్తూరి యెచ్చటిది?

అరుం—రంగాజమ్మగారఁట, ఆమె యిచ్చినది. నా రెవరు?

ధర్మా—క్షత్రియులు.

అరుం—ఆమెకు మీరన్నచో నెంతయపేక్ష యనుకొన్నారు? మీరఁట ధర్మమూర్తు లఁట; దేవతాస్వరూపు లఁట!

ధర్మా—తల్లికి బిడ్డలమీఁదఁ బ్రేమయుండదా మఱి?

అరుం—ఆమె మీకు తల్లియా? ఆమె యీ యూరిరాణియా యేమి !

ధర్మా—కాదు, కాదు. ఆమెనుగూడ మా నాయనగారు వివాహమాడిరి.

అరుంధతి పకాలున నవ్వెను. 'ఎందుకు నవ్వెదవు' అని ధర్మారా వడిగెను. అరుంధతి 'మామగారు' అని తరువాతఁ జెప్పఁట నాఁపెను. ధర్మారావు ఆమె యూహ గ్రహించి తనతండ్రియెడల నామెకుఁగలిగిన తేలికభావమునకుఁగోపించి 'మాతండ్రి యే మనుకొంటివి? ఆయన లోకసామాన్యుఁడుగాఁడు. ఆయనగొప్పతనము దౌర్భాగ్యుల కెట్లు తెలియును!' అని నములుచున్న తాంబూల మమిసి పోయి పరుండెను. పసిపిల్లయైన యరుంధతి కీ గోల తెలిసినది కాదు. 'ఈయనకు ప్రతిచిన్నవిషయమునకుఁ గోపమువచ్చును. నిన్న దేవదాసి నేమో యన్నందుకు - నేఁడు తండ్రి నేమియు ననలేదు, అందుకు - నింత కోపమైనచో బ్రతుకుట యెట్లు?' ఆమె యచటనే నిలుచుండి యాలోచించ నారంభించెను. తనభర్త యొకచిత్రమైన మనిసి. అతఁడు చాలప్రేమకలవాఁడే. కాని ప్రేమ నంతలో జంపును గూడ. చాల మృదువయినవాఁడు. మఱల నంత కఠినుఁడు. ఆయనతోఁ బ్రీతివిషయమునఁ బరిహాసములు పనికిరావు. తండ్రి, దైవము వారిసంబంధము

నివన్నియు నతనికి బవిత్రములు. వానినిగూర్చి పెదవి కదల్చరాదు. ప్రతిమాటలోనను, ప్రతిపనిలోనను హృదయగాఢత యుండవలయునుగాని తేలికతనము గూడదు. ఆయనకుఁ దానే స్వర్గము. అంత స్వర్గమును గాలిబోటనవ్రేలితో విదలించఁగలఁడు. అతనికిఁ దాను లొంగవలయునే కాని, యితఁడు తన్నుఁ బ్రసన్నను చేసికొనుటకు వ్రేలయినఁ గదల్పఁడు. ఈ విషయములలోఁ దప్ప శృంగారవిషయమునఁ దానే యధికారిణి! అచటఁ దనయధికారము సాఁగుట కెన్నెన్ని రాజ్యములైన జయించునన్న ట్లున్నది. ఇంకఁ జిలుకలు చుట్టుట కాఁకులు లేవు. చుట్టినచిలుకలు ఏమియుఁదోఁచక గంధములో ముంచెను. మఱలఁ గొంగుతో నవి యద్ది బల్లమీఁద నుంచెను. తరువాత నక్కలుతీసి గంధములో ముంచుట, పైఁటతో నద్దుట, బల్లపై నుంచుటయుఁ జేయుచుండెను.

అరుంధతి యాదాలాపముగఁ దల యెత్తెను. తలుపుదగ్గఱ నొకపాము తిరుగుచుండెను. ఆమెకు గుండె చెదరిపోయెను. ఒక్కగంతులో భర్తవద్దకుఁ బోయి యతనితో నెమ్మదిగా "పాము, పాము" అని చెప్పెను. అతఁడు లేచి కూర్చుండి చూచెను. సహస్రఫణామండితుఁడు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి గోచరించెను. ధర్మారావు దిగి నమస్కరించెను. అరుంధతిని నమస్కరింపు మనెను. ఆమెయు భయపడుచు నమస్కరించెను. ధర్మారావు స్వామిని మనసా ధ్యానించెను. "వేయిపడగలతో నేలఁదాల్చినవాఁడు, రెండు పడగలతో దంపతులఁ బాలించువాఁడు, ఒక్కపడగవిప్పి పైరుపచ్చకు గొడుగు పట్టినవాఁడు, త్రిమూర్త్యాకృతి, శూలము నాలుకయందు శంఖచక్రములు ఫణాగ్రములయందుఁ దాల్చినదేవుఁడు, ధర్మమయతనువు, కరుణాతరంగితాంతరంగుఁడై తన్నుఁగూడఁ దనపితరులనువలెనే సంప్రదాయమునకుఁ దూరము కాకుండఁ గాపాడువాఁడు నాకుఁ బ్రసన్నుఁడగుఁగాక! నన్ను సర్వథా రక్షించుఁగాక! స్వామి" యదృశ్యుఁడయ్యెను. అరుంధతి పతిని రెండుచేతులతో నదిమి కౌఁగిలించుకొనెను. ధర్మారావు 'భయమెందుకు? అది పాముకాదు. పామైనచో వేయితల లుండునా?' అనెను.

అరుం—వేయితల లెక్కడ? రెండు తలలేకదా?

ధర్మా—అవు నవును, పామునకు రెండుతల లుండునా? ఉన్నను నవి మనయిండ్లకు వచ్చునా? మనకుఁ గనఁబడునా?

అరుం—మఱి యీ వచ్చిన దెవరు?

ధర్మా—మా యిలువేల్పు. ఈ గ్రామమునకుఁ బ్రభువు. మా కులమున కాశ్రయము. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి.

అరుం—అందుకనియే మనము నమస్కరించుటతోడనే మఱలఁ గనిపించకుండ దయతలఁచి వెళ్ళినాఁడు.

ధర్మా—ఆ ప్రభువు దీనదయాపరుఁడు. ఒక కాలు విఱిగి కూఁడ నింకను నన్నే పట్టుకు వ్రేలాడుచున్నాఁడు.

అరుంధతి భర్తనడకఁ జూచెను. అతనికిఁ గన్నులలో నీళ్ళు నిలచెను. స్వామి కనఁబడిన స్థలమునందే బద్ధలక్ష్యుఁడై యావేశించిన వానివలెఁ జూచుచుండెను. ఆమెకు భీతికలిగెను. పసిపిల్ల యగుటచేత నావ్వరు మనెను. ధర్మారా వేకాగ్రతనుండి వెలికివచ్చి భార్య నోదార్చుకొనెను. ధైర్యము చెప్పెను. బుజ్జగించెను.

అరుం—మీకు స్వామి యెప్పుడును గనిపించుచుండునా?

ధర్మా—ఎప్పుడు నా కిదివఱకుఁ గనిపించలేదు. ఇదే మొదటి సారి కనఁబడుట. ఆయన నామనులోనే యుండెను. వేఱే కనిపించుట యెందులకు! నాకుఁ గనిపించవలసిన యవసర మిదివఱకు రాలేదు.

అరుం—ఇప్పు డా యవసర మేమి వచ్చినది?

ధర్మా—నీవు మా నాయనగారినిగూర్చి యట్లనుకొటవలన. మా నాయనగారు స్వామి కపరాంశము. నీవు నాభార్యవై, ఆయన యింటికోడలవై య ట్లనరాదు. తండ్రిమనసులో చాలనొచ్చుకొన్నాఁడు కాఁబోలు! నీకుఁ దనతత్త్వము చెప్పుటకు వచ్చినాఁడు. ఇప్పుడైన తెలిసినదా? మా నాయనగారి నేమియు ననరాదు. ఆయన యొక మహాపురుషుఁడు. ఆయన గర్భమున నే నుదయించుటయే నా యదృష్టము. నీయదృష్టమువలననే నీ వా స్వామిపాల్యవర్గములోఁ బడినావు.

అరుం—మా నాన్నయు, నమ్మయు మామగారి నప్పుడప్పుడేమైన ననుచుందురు. వారి కెప్పుడును గనఁబడ లేదేమి?

ధర్మా—మనపిల్లవాండ్రు తప్పుచేసిననే మనము కోపపడె దము. కొట్టి బుద్ధిచెప్పెదము. ఎదుటివారిపిల్లలుతప్పుచేసినచో మనము కొట్టుదుమా? కొట్టినచో వారితలిదండ్రులతోఁ దగాదాకాదా? మన పిల్లలబుద్ధి మనము చూచుకొందుము.

అరుం—నన్నుఁగూడ స్వామి తన పిల్లలలోఁ జేర్చుకొన్నారా?

ధర్మా—అవును. నీవు నాభార్యవైనప్పుడే అట్లు జరిగినది.

అరుం—ఇందాక నెవరో ముసలమ్మ నే నీ చీర కట్టుకొన్నచోఁ జిన్నప్పటి రంగాజమ్మగారివలె నున్నా నన్నది.

ధర్మా—అట్లనా? అయినచో నాయనగారు మా తల్లిని ప్రేమామూర్తిని జ్ఞాపకముచేసికొనుటకు వచ్చెదరుగాఁబోలు. మఱలఁ గనులార నా యాకృతిఁ దిలకించ నేతెంచెనుగాఁబోలు.

అరుంధతి పసియెద. యీ సంవిధానభార మోర్వలేక పతిపరిష్వంగముననే నిద్రించెను. అతఁ డామెను నెమ్మదిగా శయ్యపైఁ జేర్చి పవిత్రము, స్పృహనీయము, హస్తగతమునైన యామెసౌందర్యమును గనులతోఁ జూరాడియాడి అట్లే తానును నిద్రించెను. మఱునాఁడు పూర్ణిమ. పట్టపగలే వెన్నెలలు కాసినట్లే తెల్లమబ్బులు క్రమ్మి, సూర్యమండలము పిహితమై తపింపఁజేయనివి, ప్రసన్నతానిధానములైనవి యెండలు కాచెను. శ్రావణశుద్ధపూర్ణిమయగుటచేతఁ బవిత్రదిన మని రుక్మిణమ్మారావుగారు స్నానముచేసి జాము జామున్నర యైనతరువాత వేణుగోపాలస్వామివారి దర్శనమునకు బయలుదేరెను. అదివఱకే యర్చకులకుఁ గబురంపఁబడుటచేత వారును స్వామి కలంకారములుచేసి కనిపెట్టుకొనియుండిరి. రాణిగారాలయమునకుఁ బ్రదక్షిణము చేయుచుండెను. దేవదాసి తనకన్న ముందుఁ దిరుగుచుండెను. రాణిగారు తన్నామె చూడవలెనని ప్రక్కనున్నదాసీలతో నేదో మాటాడెను. దేవదాసి తిరిగిచూడలేదు. అదివఱకే దేవదాసి యొక్కప్రదక్షిణము పూర్తిచేయుటచేత నామె వెనుదిరిగియైన చూడకుండుటచేతఁ దానే ముందు ముఖమండపమునందు నిలిచి మొగిరి గంటమ్రోయించి లోనికిఁ బోఁబోయెను. అర్చకుఁడు 'రాణిగారు వచ్చుచున్నారు ఆఁగవే' యనెను. లోన నేదో

పడిన చప్పుడై, పోయిచూడఁగా స్వామిశిరస్సు నెమలిపింఛములోఁ బొదవినమాణిక్యము క్రిందఁ బడియుండెను. అర్చకుఁ డటు నిలు దానిని బరీక్షించెను. దానియబ్బపుణ్యమా యని పగులలేదు. దాని యబ్బయయిన సముద్రునిపుణ్యముబాగున్నది. లేకున్న నతని కింకొక మాణిక్యము నష్టము. అర్చకుఁడు తనలోఁ దాను సంతోషించెను. దేవదాసి 'ఏమిటి స్వామీ?' యని యడిగెను. అర్చకుఁడు మణి బాగుగానున్నదన్న సంతోషముతో 'ఏమియు లేదమ్మా! స్వామిచూడామణి క్రిందఁబడెను.. పగిలె ననుకొన్నాను. పగులలేదు. ఇట్లు రా, చూడవుగాని, చూడామణి బలిపీఠమును దాటించరాదు' అనెను. దేవదాసిపోయెను. చూచెను. ఆమాణిక్యము సముద్రుఁడు స్వామికిఁ గూఁతు నిచ్చుచు నామెగుండెలోని ప్రేమయంతయుఁగూడఁ బిండి యాకారముగా నాయనకుఁ గానుకగా నిచ్చిన ట్లున్నది. ఆహా! మాణిక్యము చేతులలో గ్రహించి తనయెదకు హత్తుకొన్న నెంత బాగుండును! అర్చకుఁడు తా నడిగిన నిచ్చునా? ఈయఁడు. తనకా భాగ్య మెక్కడిది? ఇంతలో రాణిగా రాలయములోనికి వచ్చెను. దేవదాసి యామెను జూడలేదు. ఏమో యూహించుచుండెను. స్వామినే చూచుచుండెను. స్వామికిని తనకును మధ్య నింకేమియు నామెకు గోచరించుటలేదు. ఆహా! ఆ మణి దెంతభాగ్యము! దానిని భగవంతుడు శిరస్సున ధరించెనే! అది యెన్నినోములు నోఁచినదో? దేవదాసి బలిపీఠమువద్ద నున్నది. రాణి వెనుక నున్నది. అర్చకుఁడు మాణిక్యమును మఱల నమర్చి నెమ్మదిగా 'రాణిగారు వచ్చిరి, వెనుకకుఁ బద' యనెను. దేవదాసి రాణిగారిని జూచి యేలనో సిగ్గుపడెను. రాణిగా రామెను జూచి మందహాసము చేసెను. కాని యామె సిగ్గుపడుట యెందులకో తెలియదు. రాణి యామెదగ్గరగా నిలుచుండెను. చెంగు తాకుచుండెను.

రాణి—మరచిపోయితిని నీ పేరేమిటి?

దేవ—దేవదాసి, కాని అన్న 'గిరిక' యనును.

రాణి—నేనును గిరికయే యందును.

దేవదాసికి "చిత్తము" అనవలయు నని తెలియదు.

దర్శనమైనతరువాత నిర్వురును బయటికివచ్చిరి. రాణి యెఱ్ఱని జరీచీరఁదాల్చి తలముడివేసికొనియుండెను. మొగమున బొట్టులేదు. మెడలో రత్నహారములు రెండుండెను. దేవదాసి తెల్లని చీరకట్టుకొన్నది. చీర దానియాడుపకుఁ బెద్దదగుటచేత నామె యందులో మునిఁగిపోయినది! తడితల యారఁబెట్టుటకుఁగూడ చివర గొనలు ముడివేసెను. మెడలో నాను, కాసులపేరు కలవు. మొగమున నెఱ్ఱనికుంకుమబొట్టుండెను. ముఖమంటపమునందు దనకెదురుగా గంట వాయించుటకు నిలుచున్న వారిద్దఱవంక స్వామి చూచెను. దేవదాసి సిగ్గుపడెను. రాణిగారికన్నఁ దానే యందముగా నుండెను కాఁబోలు! తెల్లచీర కట్టుకొనిన బాగుండు నని ధర్మారావు చాలసారు లనెను. స్వామికిఁగూడ నదియే యిష్టమా ? స్వామికిఁ బాలసముద్రము జ్ఞాపకమువచ్చుఁ గాబోలు. పాలసముద్ర మెంత యుండునో? తనచీరయంతయేనా ? ఈ పోలిక యేమిటి? స్వామికిఁ గోపము వచ్చునో! రాణిగారు 'గిరికా' యన్నది. గిరిక యులికిపడ్డది. రాణి 'ఏమిటి అట్లు ఉలికిపడ్డావు? ఊరకే యింత దాఁకటిదుండి సిగ్గుపడుచున్నావు' అనెను. దేవదాసి తనలో నేదో చదువుకొనుచున్నది. రాణి 'పైకిఁ జదువు'మనెను. గిరిక పైకనెను. 'నీ చరణపద్మము చన్నులమీఁద మోపి' మఱల సిగ్గుపడెను. గిరికకన్నులలో నీళ్ళు నిలచెను. 'బాధ హరింపు వరింపు మాధవా!' రాణి తనజన్మ తాను నిందించుకొనెను. దేవదాసిని గాఁగిలించుకొని ముద్దుపెట్టుకొనెను. దూరముననుండి చూచుచున్న దాసీలకు, నర్చకునకు విడ్డూరమయిపోయెను ఇద్దఱును గలసి కూర్చుండిరి.

రాణి—నీకు భాగవత మెవరు చెప్పిరి?

దేవ—మా అన్న చెప్పినాఁడు. ఆయన సెలవుల కిక్కడికి వచ్చినపుడెల్ల రోజును రాత్రులందుఁ బోయి నేను చదువుకొనెడుదానను. ఆపద్యములన్నియుఁ గంఠతః రాకపోయినచోఁ గొట్టెడివాఁడు. మా బాబుగారు నన్ను మా యన్న కొట్టినపుడెల్లఁ గోపపడుచుండెడివారు. బాబుగారుపోయినతరువాత నాపద్యములన్నింటికి నర్థము చెప్పినాఁడు మాయన్న. మా యన్న యర్థము చెప్పుట యనఁగా నేమనఁ?

అట్లాగున భగవంతునియెదుటఁ గూర్చున్నట్లే. మాయన్న భగవంతుని మీఁదఁ గొన్నిపద్యములు వ్రాసెను. అవి యెంత బాగున్నవి!

రాణి—ఆయన కవీశ్వరులా? ఎవరికిఁ దెలియదే!

దేవ—ఆయన యెవరికిని జూపించఁడు. చూపించఁదగినవేళ యెప్పుడో వచ్చునఁట. అప్పుడుగాని బయటపెట్టఁడట.

రాణి—ఆయన నేఁడు దేవాలయమునకు రాలేదేమి?

దేవ—మా వదినగారు వచ్చినారు. ఆయనను జూచి నే నింత వఱకు కాఱురోజు లయినది. ఆయినా శ్రీ యినది కార్యమై.

రాణి—నీ వెందుకుఁ బోయి చూడలేదు?

దేవ—మా అమ్మ పోయిచూచినది. నేనుపోయి యాయనకు గనఁబడినచో నావెంట దేవాలయమునకు వచ్చును. మా అమ్మ అన్నది 'నీవు పోయి వదినెగారు పుట్టినింటికిఁ బోవుదాఁక నన్న గారిని జూడకుము. ఆయన నీతో సోదె పెట్టుకొని కూర్చుండును. ఆ వచ్చిన క్రొత్తకోడలుగారే మనుకొందురో' అని.

రాణి—మఱి ఆయనయే నిన్నుఁ జూచుటకు రాఁడా?

దేవ—రాఁడు. నేనే ఆయనను జూడఁబోవలయును. తరువాత నన్ను వదలి నిముస ముండఁడు. చివరకు రాత్రియైనతరువాత నన్ను మా యింటిదాకఁ బంపించి తిరిగిపోవును. ఇంటిలోనికి రాఁడు.

రాణి—మీ అమ్మ లోపలకు రమ్మని పిలువదా?

దేవ—మాయమ్మ అన్నతో మాటాడదుగా! అసలు దానికి అన్న అన్నచో నొకవిధమయిన భయము- గౌరవము- ప్రేమ- ఏమిటో చెప్పలేము. ఆయనతో మాటాడదు. ఆయన కన్నెత్తి మా అమ్మవంకఁ జూడఁడు. ఎవరివంకను జూడఁడు.

రాణి—శాస్త్రిగారు రాస్తి యంతయుఁ బాడుచేసిరికదా! ఇప్పుడు వారికి జీవనాధార మేమున్నది? కష్టములు పడుచున్నారా?

దేవదాసి యూరకుండెను. అప్పటికి రెండుజాము లయ్యెను. క్రమ్మిన మబ్బులు కొంచెముతొలఁగి యెండ జలపాతమువలెఁ జను దెంచెను. గరుడపక్షి వ్రాలుటచేత నాగేశ్వరస్వామియాలయధ్వజాగ్ర భాగమున గంటలుమ్రోగెను. రాణి తలయెత్తి చూచెను. దూరమున

నా బంగరుగంట లెండలో ధగధగ మెఱసెను. సూదులవలెఁ గన్నులలోఁ బొడిచెను.

రాణి—గిరికా? నీ కా కర్ణామృతము వచ్చునా? 'కింకిణికిణికిణి రభసైః' అని మొదలుపెట్టెనే, అది.

దేవ—నాకు మా అన్న కర్ణామృతము చెప్పలేదు. నేను చెప్పు మని యడుగఁగా 'నది నీ కక్కఱలేదులే' యన్నాఁడు.

అప్పటికి భోజనమునకు వేళతప్పి గిరిక మొగము నకనకలాడుచున్నది. అప్పు డామె మఱియందకత్తెగాఁ గనిపించెను.

రాణి—నీ కాఁకలియగుచున్న ట్లున్నది. పోదమా?

అని లేచెను. ఇద్దఱును విడివడిపోయిరి.

ఆ నాఁడు పొద్దు కొంచెము దిగజాఱి రుక్మిణమ్మారావుగారి యద్దాలబండి ధర్మారావుగారియింటికి వచ్చెను. తనవాకిటనాఁగిన బండి యెందుకు వచ్చెనో యని సావిత్రమ్మగారు తొందరగాఁబోయి వాకిట నిలచెను. రాణి బండి దిగి లోనికి వచ్చుచుండెను. తా నెఱిఁగియున్నంతవఱకు రాణిగా రెపుడును తనయింటికి రాలేదు. నేఁ డింత యకారణహఠాద్దయ యేల వచ్చెనో సావిత్రమ్మగారికిఁ దెలియలేదు! ఆమెకుఁ గూర్చుండుటకుఁ బ్రాఁతరత్నకంబళము పైనుండితీసి పఱచిరి. అది శాస్త్రిగారు మంచిరోజులనాఁటి చిలుకు. రాణి యాసీన యయ్యెను. సావిత్రమ్మగారు 'మామీఁద నమ్మగారికి దయకలిగిన దేలకో! మే మింత నోఁచుకొన్నామా! తమరు వచ్చిన మా యింట మరియాదచేయుటకుఁగూడ నేమియు లేదే' యనెను.

రాణి—మీఁకోడలుఁగారిని జూచుటకు వచ్చితిని.

అభ్యంగముచేసి, తల్లివి రెండుమూఁడు నగలు పెట్టుకొని, నలిగి మఱి సొగసుగానున్న రంగాజమ్మగారిచ్చినచీర కట్టుకొని, కనులకుఁగాటుక మొగమునఁ జుక్కమీఁద నద్దిన కుంకుమతో బాలవలె నరుంధతి చనుదెంచెను. రాణి యామెను జూచి యామె సౌందర్యమున కచ్చెరువుపడెను. ఈమె యే జమీందారులింట నైన నున్నచో నెంతయైశ్వర్యవంతురా లయ్యెడిదో! ఈ లక్ష్మీదేవి యీ యింటికి శాస్త్రిగారిలక్ష్మి తొలఁగిపోయినతరువాత వచ్చెనదేమో! ఆ సౌందర్య మొక విలక్షణమైనది. పొంగి పఱదలుకట్టి, మేనఁ

దాల్చిన నగలు చీరయనునొడ్డులు చాలక వానిని త్రోసి పొంత పొలాలపైకి దూకి వానిని ముంచుట లేదు. అంత సౌందర్యవాహి నియుఁ గూలంకషమయ్యు కూలచ్ఛేదహేతువుగాక, మహావిస్తారత యందే యొకవినయ మవలంబించి గట్టు లొదిగి ప్రవహించుచున్నది. అరుంధతి వచ్చి కూర్చున్నది. రాణి 'నీ పే రేమమ్మా' యనెను. అరుంధతి చెప్పెను.

రాణి—మీ యాయన పే రేమిటి?

అరుంధతి సిగ్గుపడెను.

రాణి—అంతటి వివేకము గల పురుషునకు భార్యవైతివి. అదృష్టవంతురాలవు! ఆయన యెట్లుచెప్పిన నట్లు వినవలయునుసుమా! లేకపోయినఁ జెడిపోయెదవు. విన్నచోఁ జెప్పవలయునా? గిరిక చూడుము. మహాభక్తురా లయినది. ఆమెముందుఁ బూర్వభక్తులు చాలరేమో యనిపించుచున్నది. గిరిక, యేమి గిరిక!

సాని—గిరిక యెవరండీ?

రాణి—రత్నగిరి కూఁతురు.

అరుంధతికి మొన్న తనభర్త చెప్పినదానికి, నీమె నేఁ డన్న దానికి సరిపోయినది. కాని దేవదాసి యంత భక్తురాలా! ఆమెను జూడవలయును. ఆమె బాగుపడుటకుఁ దనభర్త కేమి సంబంధము?

రాణి—తులసితోఁటలోఁ గఁజాయిమొక్క పుట్టదు. కాని నీ కొకమాట చెప్పెదను. ధర్మారావు బంగారపుఁదండ్రి. ఆయన నీవు నోఁచుకొన్ననోము పంట. నీ వరుంధతి, వాయన వసిష్ఠులుగా మెలఁగవలయును. అపుడు గిరికకన్న నీవే యదృష్టవంతురాలవు కావచ్చును.

రాణి తనమెడలో నున్న చంద్రహారము తీసి చేతిలోఁ బుచ్చు కొని యుండెను. మఱల నేమో మాటాడుచుండెను. ఎచ్చటి నుండియో ధర్మారా వింతలో నింటికి వచ్చి, రాణిని జూచి యాశ్చర్యపడి 'అమ్మా! నేఁడు మీరు మాయింటికి వచ్చితిరి. భాగీ రథి పిచ్చుకగూఁటిమీఁదికిఁ బ్రవహించెను. బాబుగారు పోయినతరు వాత మా కీ యదృష్టము గలుగుట కిదే మొదటిసారి. అమ్మా! నా పేదయింటికి వచ్చితిరి. మీకుఁ గూర్చుండుటకుఁ దగినపీఠమైన

నుంచలేము. క్షమించవలయును' అని యందే నిలఁబడెను. యరుంధతియు లేచి నిలుచుండెను. రాణి యిద్దఱను గూర్చుండఁబెట్టెను.

రాణి—మీ యిల్లాలిని జూచిపోవుటకు వచ్చితిని. గిరిక చెప్పినది.

ధర్మా—గిరిక మూఁడ్నాళ్ళనుండి యిచ్చటికి వచ్చుటలేదు.

రాణి—వచ్చుటలేదనియామెయే చెప్పినది. క్రొత్తలో మీ దంపతులసుఖమును దాను చెఱచుట కిష్టములేక వచ్చుట లేదఁట.

ధర్మా—(నవ్వుచు) తమదంపతులసుఖము క్రొత్తలో నేను చెఱుపుదునని వచ్చుటలేదు కాఁబోలు! అది వట్టిదొంగ.

రాణి—దేవదాసికిఁ బెండ్లి యయినదా? అవును. వారిలోఁ గొందఱు పెండ్లిండ్లు చేసికొనుచుండిరి. నాకుఁ జెప్పలేదే!

ధర్మా—అదికాదు. అదికాదు.

ధర్మారా వచటినుండి లేచి 'అమ్మా! ఇప్పుడే వచ్చెదను' అని గదిలోనికిఁ బోయెను. అరుంధతియు లేచి మగఁడు చనినవైపు చూచెను. మగఁడు రమ్మని చేసన్నఁ బిలచెను. ధర్మారా వామెతో 'నాలుఁగు పువ్వులును, ఫలములును రాణిగారి' కిమ్మని చెప్పి తాను లోనికిఁబోయెను. అరుంధతి మందారమును, చేమంతులు, మొగలి రేకులు కలిపి, చక్రకేళీలు గెలలో మిగిలినవి పది తీసికొనిపోయి రాణిగారిముందర నుంచెను. రాణినవ్వి తనచేతిలోనిహారము నరుంధతి కీఁబోయెను. అరుంధతి గ్రహించుటకు సంశయించెను. రాణి 'ఫరవా లేదమ్మా! నా యానందముకొఱఁది నే నొసఁగుచుంటిని. తీసికొమ్ము' అనెను. అరుంధతి సిగ్గుపడుచున్నదిగాని చేసాఁచలేదు. రాణి 'ఓహో! భర్తగారియనుమతి కావలయును గాఁబోలు.' బాబూ! అని రాణి ధర్మారావును బిలచెను. ధర్మారావు వచ్చెను. 'బాబూ! నీ భార్య నేనీ కానుక యిచ్చుచుండఁగాఁ బుచ్చుకొనుటలేదు. నేను నీ భార్య కీయఁదగనా? నీభార్య నావద్దనుండి పుచ్చుకొనఁదగదా? చెప్పుము' అనెను. ఆ భార్యాభర్తలచూపు లెవరికిఁ దెలియకుండ, గలసికొని మాటాడినవి. అరుంధతి చేసాచెను. రాణి 'నేను నీ కీయ నమ్మా! మా బాబుతీసికొని నీమెడలో వేయవలయును' అని ధర్మారావుచేతి కా హార మిచ్చెను. అతఁడునుతీసికొని సిగ్గుపడెను.

రాణి—నేనును మీ యమ్మవంటిదాననే. నీ మీ యమ్మగార్ల మధ్య సృష్టికర్త యున్నాఁడు. నీ నా మధ్య వేణుగోపాలస్వామి యున్నాఁడు. నేనును నీ తల్లి వంటిదానను. పెద్దవాండ్రము చూచి సంతోషింతుము. అంతియే; మే మిం కేమి చేయగలము?

ధర్మారావు చంద్రహారమువంకఁ జూచెను. దాని కయిదు పేఁటలున్నవి. వెల యయిదునూటయేఁబదులు చేయవచ్చును. క్రొత్తఁగా మెఱుఁగుపెట్టినట్లున్నది. అతని వ్రేళ్ళు వణఁకినవి.

సావిత్రి—నాయనా! పిల్ల మెడలో వేయుము. ఆమెకు చూడవలెనని యున్నది. ధర్మారావు హారమును భార్యమెడ నలంకరించెను. ఇద్దఱును సిగ్గులే సిగ్గులు; చిఱునవ్వులే చిఱునవ్వులు!

రాణి—బాబూ! పాఠశాలలు తెఱచి యెన్నాళ్ళయినది?

ధర్మా—(ఆలోచనతో) నెల నెలాపదిరోజులయినది.

రాణి—మూఁడురాత్రులనిద్దుర లిచటఁగూడ నయినవికదా! రెండు మూఁడు రోజులలో బయలుదేరిపోయి కళాశాలలోఁ బ్రవేశించుము. ప్రవేశించుట కెంత డబ్బు కావలసి యుండును?

ధర్మారావు దిగ్భ్రాంతుఁడై పోయెను. ఈ యకాలసంపద్వర్షము కురియునని యతనికిఁ దోఁచలేదు. అతఁడు మౌనము వహించెను.

రాణి—వంద రూపాయలు కావలయునా?

ధర్మా—అక్కఱలేదండి. ఏబదిరూపాయలు చాలును,

రాణి—వందరూపాయలు రేపు పంపించెదను. మంచిరోజు చూచి బయలుదేఱిపొమ్ము, బి. ఏ. పరీక్ష యయినతరువాత చూచుకొనవచ్చును. నీవు స్వామిమీఁదఁ బద్యములు వ్రాసితివఁటే! గిరిక చెప్పినది. అవి తరువాతఁ జూపింతువు కానిలే.

ధర్మారావున కాశ్చర్యముమీఁద నాశ్చర్యము. తరువాతఁ గొంతసేపటికి రాణిగారు వెడలిపోయిరి. చంద్రోదయ మగుచున్నది.

రాత్రికి గాలిలేక బిగించినది. గదిలో నుండలేక దొడ్డిలో మంచమువేసికొని నూతనదంపతులు శయనించిరి. తెగయుక్కపోసి యరుంధతి పైఁటకొంగుకూడఁ దీసివేసెను. ధర్మారావు పయ్యెద యుండనీయలేదు. భార్య పైఁటవేసికొనుట, భర్త తీసివేయుట పదిసారులయినతరువాత నామె యట్లే యుంచినది. వంపుతిరిగిన చక్కని మెడ

మీఁదఁ జంద్రహారము నదీసైకతములఁ గోడెత్రాఁచువలె నందములు చిమ్మినది. పూర్ణ చంద్రునిపదునాఱుకళలుచిమ్మినవెన్నెలలు హారము బిళ్ళలమీఁద బడి చింది కాంతులు ధర్మారావుకనులలోఁ గొట్టెను. ధర్మారా వా కాంతులను చేతులతో మఱియుఁ జిమ్మఁగొట్టెను. అరుంధతి యతనిజేతులు పట్టుకొనెను. అతఁడు వంగి హారమును ముద్దుపెట్టుకొనెను. హారవ్యాజమున నతఁడు తనయెడఁద సర్వస్వముఁ జూఱగొనుచుండెను. అరుంధతి హృదయగ్రంధి యామె యెఱుఁగకుండ సంపూర్ణముగా శిథిలమై పైని వెన్నెలలుకాయుచందికనివలె సర్వకళాశ్రుతిఁ బొందెను. పోసిన చెమ్మట విసరుటకు నరుంధతిచీర చాలలేదు. ఆమెకుఁ జేతులు నొప్పిపెట్టెనవి. ధర్మారావు సంవాహనముచేసెను. ఆమె పరిహరించెను. ధర్మారావు మంచముదిగి యరుంధతివంకఁ జూచుచుండెను.

అరుం——ఏమిటి అట్లు చూచెదరు?

ధర్మా——పైని నా చంద్రుడు; క్రింద నీ చంద్రుఁడు. ఇద్దఱును పదాఱుకళలు నిండినవారే. వానికి మచ్చయున్నది, వీనికి లేదు. నీవు కళంకరహితవు, సర్వకళాశోభితవు. పున్నమనాఁటి చందమామవు.

ఒక చిన్నగాలి కెరట సన్నఁగాఁ దారాడెను.

అరుం——దేవదాసికిఁ బెండ్లి యయినదా? ఆ రహస్యమేమిటి?

ధర్మారా వేమో రహస్యముగ నామెచెవిలోఁ జెప్పెను. ఆమె వెంటనే లేచి, చీరధరించి, పాదప్రక్షాళనముచేసి. కనులు తుడుచుకొని, స్వామి యాలయాభిముఖముగఁ దిరిగి నమస్కారముచేసెను. ఇక్కడఁగూడ మూఁడు రాత్రులగుటచేత మఱునాఁడే తనతండ్రి తన్నుఁ దీసికొనిపోవును. దేవదాసిని జూచుట యెట్లు? తనభర్తను వదలిపోవుట యెట్లు? ప్రాణములు నిల్చుట యెట్లు?

అరుం——మీరు మఱలఁ జదువులకుఁ బోయెదరా?

ధర్మా——నాలుఁగయిదు రోజులలోఁ బోయెదను.

అరుం——నన్నుఁ దీసికొని పోరా?

ధర్మా——లేవఁదీసికొనియా?

అరుం—ఇంచుమించుగా నల్లే యయినదికదా! విచార మెందుకు? ఏ యూరిలోఁ జదివెదరు? బి. ఏ. సగ మిదివఱకే చదివి రఁటకదా మీరు?

ధర్మా—ఆ సగమును మఱలఁ జదువవలయును. బందరైనచో నెఱిఁగియున్నచోటు. గుంటూరు దగ్గఱ యని చూచుచున్నాను.

అరుం—నన్ను వదలిపోయినచో నే నొప్పుకొనను.

ధర్మా—ఒప్పుకొనక యేమిచేసెదవు? గొంతుకమీఁద నెక్కి త్రొక్కెదవా? శిరస్సున నెక్కి నృత్యము చేయుదువా?

అరుంధతి పోయి యతనిమెడఁ గౌఁగిలించుకొని మొగములో మొగ ముంచెను. తన్నిశ్వాసపరిమళతరంగము చెక్కిలిపై నాడెను. చేమంతికా కేతకీ కస్తూరీ ప్రియాశరీర పరిమళములు, సన్నని గాలులు, పండువెన్నెలలు ముప్పేఁటలు వడెను.

# ఏడవ అధ్యాయము

ధర్మారావు గుంటూరులోఁ జదువుచుండెను. హాస్టలులో భోజనము గుంటూరువెళ్ళినప్పటినుండియు ధర్మారావు తెలుఁగులు చదువనారంభించెను. కళాశాలలో సంస్కృతశాఖఁ దీసికొనెను. అదివఱ కతనికి భాగవతముమీఁదఁ బ్రీతి. ఇప్పుడు భారతము చదువ మొదలు పెట్టెను. ఒకనాఁడు రాత్రి భోజనముచేసి పండుకొని, లాంతరు తలగడవద్దనుంచి, యరణ్యపర్వములోఁ జివర సావిత్ర్యుపాఖ్యానము చదువుచుండెను. చదివినకొలందియు నతని కెఱ్ఱాప్రగ్గడ పోకడ క్రొత్తరుచులు చవిచూపెను. పోతన్నగారి మార్గము వేఱు, నిది వేఱు. పోతన్నగారు కథచెప్పుతీరు వేఱు. చంద్రవంశపురాజుల యితిహాసములోఁ దారాశశాంకులకథ, పురూరవశ్చక్రవర్తికథ యివి చదివినకొలంది నతని కానందముగా నుండెడిది. 'ఒక వేయితలలతో నుండు జగన్నాథుబొడ్డుతమ్మిని బ్రహ్మ పుట్టె మొదల' నని యారంభించిన హస్త మమృతమయ మనిపించెను. కథలో నొకచోటినుండి యొకచోటికి దూకుఁట, చమత్కారములతోడ మాటలాడించుట, బ్రహ్మ యన్న మాటలు, బుధుఁ డన్నవి, పురూరవసుని యూర్వశీ సంవరణము, వారి కేళి, ఆమె నింద, అతని విరహము పూర్వము ధర్మారావునకు సారస్వత శిరోరత్నము లనిపించెను. ఇప్పుడు కాక పోలేదు. ఇది యొక క్రొత్తగా నున్నది. కథ దాటించుట·లేదు. నెమ్మదిగా నన్నివిషయములను పరుసగాఁ ద్రిప్పుటయే. చెప్పుటలో గుదించి చెప్పుట. ఈ సమాసములకూర్పు వేఱు. ఈయన యేఱు కొను శబ్దములే వేఱు. ఎక్కడివో సన్ననిమాట లేటి కూర్చినట్లున్నది. చివరకుఁ బోనుపోను సావిత్రీ యమధర్మరాజుల సంభాషణము రమ్యాతిరమ్యముగ నుండెను. ఆమె పొగడ్తలు విచిత్రముగ నుండెను. 'యముఁ డండ్రు నిన్ను నార్యులు, యమింతు భూతములఁ గాన నట్లగుటఁ దగుఁ, శమనుండ వైతి కల్మషశమనంబుఁ జేసి నీవు జలజాప్తసుతా' వేదబుక్కువలె నున్నది యీ పద్యభావము. నామరూపాదులన్నియుఁ గ్రియాజన్యములు. అందులో సర్వదేవతలకును వారి వారి క్రియాహేతువులై యీ మహాత్ముల

యధికారములు, నామములు గలిగెను. ఇది పూర్వఋషులు దర్శించిరి. అవి గుంఫించిరి. మఱల నీ నాఁడు సావిత్రి యా తత్త్వ మెఱిఁగిన దయ్యెను. సృష్టిరహస్యమంతయు బీజరూపముగ నామెమనస్సునందు నిలచెను. ధర్మారా వేల సంతోషించకుండును? క్రమక్రమముగా నామెమీఁద ధర్మరాజున కెట్లు ప్రేమ పుట్టినదో, అది యెట్లు వ్యక్తపఱచెనో, ఆమె భగవంతుఁడైన యతఁ డిచ్చిన చన వెంత సొగసుగా నుపయోగించుకొనెనో, ఒకసారికన్న నొకసారి యామె మాటాడిన మాటలలో నవి యెంత కనఁబడెనో చదివినకొలఁదియు నతని వివశుని జేసెను. ఇట్టిరచన యతఁ డదివఱకుఁ జూడలేదు. ఆహా! కవిత యనఁగ నొకపద్యము వ్రాయుట కో లేదు. ప్రతిపద్యము నంత సొగసుగా వ్రాసి కావ్యమునంతయు నొక విచిత్ర సూత్ర వ్యాప్తిగాఁ, దత్సూత్ర మనేక పుష్పశోభితము చేయుటయుఁ గావ్యము నిట్టిదని నిర్ణయించలేక మనసులో నుయ్యెల లూఁగుచుండెను. క్రొత్తఁగా నతని మనోభావము విస్తరించుచుండెను ఆ విస్తరింపు నతఁ డొదిఁగించుకొనలేక త్రిప్పలు పడుచుండెను. కాలము కడచినఁగాని యా భావము లతనిహృదయములో స్థిరపడి గొదుఁగవు. ఆ కళాశాలలో నొక యుపాధ్యాయుఁ డుండెను. ఆయన రంగువేసిన యడ్డనిలువుచారలుగలగుడ్డతలపాఁగచుట్టి, యొక నల్లని కోటు తొడిగి వచ్చుచుండెను. మనిసి పొడుగుగానుండును. పిల్ల లతనిని 'పాములవాఁ'డని వేళాకోళము చేయుచుందురు ఒకనాఁడు తరఁగతిలోఁ గూర్చుండఁగా నొకకుఱ్ఱవాఁ డల్లరిచేసెను. ఆయన 'బుడబుక్కలవానివలె నేమిటి యాయల్లరి' యనెను. వాఁడు 'మఱి పాములవాండ్లకు బుడబుక్కలవారికి సరిపోయినది' యనెను. ఆయనకుఁ గోపమువచ్చి 'యీ క్లాసంతయు ఫూల్సు, గాడిదలు, బుద్ధిలేనివారు' అని విజృంభించెను. దానితోఁ దక్కినవారందఱు నెదురుతిరిగిరి. వారందఱు నాయన క్లాసునకుఁ బోరాదని కట్టుకట్టిరి. ఇది బి. ఏ. మొదటితరఁగతిలో జరిగెను. ఆ కాలేజీలో బి. ఏ. నపుడు క్రొత్తగాఁ బెట్టిరి. కట్టుకట్టినను గొందఱు క్రైస్తవ విద్యార్థులును, కొంద ఱుపకారవేతనము గ్రహించుచున్నవారును కళాశాలకు రానే వచ్చిరి. ఆ యుపాధ్యాయుఁ డధ్యక్షునితో ఫిర్యాదుచేయఁగా

నాయన రానివారందఱకు శిక్షవిధించెను. వారు తక్కిన క్లాసులకుఁ గూడఁ బోకుండఁ గట్టుకట్టిరి. అట్లు మూఁడుదివసములు కడచెను. ప్రిన్సుపాలు వీరిని మఱియు శిక్షించు మార్గములు తక్కిన యుపాధ్యాయులతోఁగలసి యాలోచించుచుండెను. విద్యార్థులకు ముందు మార్గ మేమియుఁ దోచలేదు. ధర్మారావునకు కిందులో నెక్కువ జోక్యము లేకపోయినను దక్కినవారితో సతఁడుకూడఁ బాఠశాల మానెను. తాను రాణిగారిధనముతోఁ జదువుచు వాఁడె యను మతిలేకుండ మానవచ్చునా యని ధర్మారావు విచారించుకొనెను. మాననిచోఁ దోడివా రతనిని బిఱికివాఁడని, ద్రోహి యని యెత్తి పొడుతురు. తక్కిన విద్యార్థులవైపునుండి చూచినచో మానకుండుట శోచనీయము. కళాశాలాశిక్షాపద్ధతినుండి చూచినచో మానుట మంచిది కాదు. 'కళాశాలావిద్యార్థులు పెద్దమనుష్యులు. వారి నేమియు ననరా' దని యధికారులు సూత్రించినదేకదా! ఆ సూత్రములు పదిచోట్ల పదిరకములుగా నున్న వేల? ఈ పాఠశాలలో శిక్షాపద్ధతి యన్న పేరే చిత్రము. దానియర్థ మిదమిత్థమని నిర్ణయించరాకున్నది. అది యధికారులనుబట్టి మాఱుచుండును. ఒకచోట నూపిరిపీల్చుట తప్పు. ఒకచోట నేదియు తప్పుకాదు. విద్యార్థుల బ్రదుకు లుపన్యాసకులచేతులలో నున్నవి. ఆ మఱునాఁడు బాఠశాలకుఁ బోవుట మానిరి. ఇంతలోఁ గళాశాలాధ్యక్షుఁడు మాట్లాడుటకు రమ్మని జట్టునాయకులకుఁ గబురంపెను. వారు వెళ్ళిరి. రెండునాళ్ళు రాయబారములు జరిగినవి. సంధి కుదిరినది. యథాప్రకారముగ గదులు నిండినవి. ధర్మారావున కీ చదువులు, నీ నాటకములును పరిహాసాస్పదములుగ నుండును. కాని జీవనోపాధి కీ రోజులలో వేరొకమార్గము తోఁచలేదు. చదువుచుండెను.

మఱునాఁడు ప్రభావతీప్రద్యుమ్నము తెచ్చెను. ఆ రాత్రి యది పఠించెను. అదివఱకుఁ గళాపూర్ణోదయ మన్నఁ జెప్పరానంత గౌరవ ముండెడిది. ప్రభావతి చదివిన తరువాతఁ గళాపూర్ణోదయము మీఁదఁ జాలగౌరవము తగ్గెను. కల్పన కళాపూర్ణునికథలోనిదే చాల కష్టమైనది. కాని శయ్యయుఁ, బద్యరచనానైపుణియు, శబ్దముఁ దేఱుకొనుశక్తియు, బలుకుబడియుఁ బ్రభావతిలోఁ బరమోత్కృష్ట

దశయందు దున్నవి. పూర్ణమునఁ బద్యములు ధారాశుద్ధిగా నడచును. ధారాశుద్ధి కళాప్రాథమికులయిన కవులయందు గోచరించును. కవి శయ్య పరిపక్వమైనకొలఁది పద్యమందుఁ గుదింపు హెచ్చును. పెద్ద భావము కొద్దిమాటలలోఁ జెప్పుటకుఁ బ్రయత్నించును. శక్తిమంతములయిన మాట లేఱుకొనును. ఉపశ్రుతి విశ్లేషించుట, కథ దాని మీఁద నిర్మించుట, శుచిముఖిసృష్టియు నద్భుతరామణీయకముగా నున్నవి. శుచిముఖిమాటనేర్పు ప్రౌఢమైనది. 'సవతిపోరు ఘటించుట కంఠుర్పాణం బిది,' 'ఓహోహో! మా బంధువ్యూహం బంతయు వచ్చియున్నట్లయ్యెను,' 'ఆమైఁ గొంతమే ల్నారాయణ నీమనసు కంటె.' ఇట్టి ముద్దారుపలుకుబడులన్నియు శుచిముఖిపలుకుబడినుండు దివిటీముందు దీపము లట్లయ్యెను. ప్రభావతీప్రద్యుమ్నుల ప్రణయ కోపము, గోత్రస్ఖలనము, ప్రియ్యమ్నుని రసజ్ఞత ధర్మారావునకు రస మును పుక్కిలింతలకుఁ దెచ్చెను. అట్టిభాగములు నేఁటి కసభ్యము లుగా నగుచున్నవి. గాఢమైనశీలము చచ్చినకొలఁది ప్రాణములు ప్రతిసంగతిలో లోఁతులు నాంఛించవు. పైపై మెఱుఁగులతోఁ దృప్తిచెందును. అదియే నాగరకత యని విఱ్ఱవీఁగును. అతని మన స్సులోఁ ప్రభావతికి నాంధ్రసారస్వతమునఁ బట్టాభిషేకమయినది. నాల్గునాళ్ళు ప్రభావతి యతని వెన్నాడెను.

ఆశీర్వాద మను క్రైస్తవవిద్యార్థి తనసహపాఠి "షేక్స్పియరు కన్న సృష్టిలో గొప్పవాఁ డుండఁడు" అని యొకనాఁడు వాదించెను. ధర్మారావు పింగళివారితరఫున వాదించెను. అతఁ డొప్పుకొనలేదు.

ధర్మా—సృష్టిలో లేఁ డేమిటి? సృష్టిలో నీ కే మూలఁ దెలి యును? కాళిదాసుకన్నఁ గవిలేఁ డని మీ పాశ్చాత్యులు నొప్పి కొనినదే. అంతసులువుగా సృష్టిలో లేఁడని, ప్రపంచములో లేఁడని యనుట యింగ్లీషుతో వచ్చినగోల. పత్రికలలోఁ జూడలేదా? ఎవరో పెద్ద యీఁతగానిని, వస్తాదును, కవిని తీసుకొని వారు పాశ్చాత్యదేశ ములలోఁ బెద్దవారయిరా? ప్రపంచమంతలో వీరే యనునది. యూరపే కాక ప్రపంచమున్నది. అచ్చట నే విద్యలోనైన నధికాధికులు కలరు. యూరపే ప్రపంచము కాదు అట్లనుట విశాలభావము లేకపోవుట యేమో యనిపించుచున్నది. తరువాత నీ యిష్టము.

అతఁడు "మన మిద్దఱు మీ విషయమునఁ గలియము. అసలు ప్రధానాంశమందే మనయిద్దఱకుఁ గలియదే" దని వెడలిపోయెను. ఇట్టి మఱికొన్ని ప్రసంగములచేత ధర్మారావునకుఁ బూర్వాచార పరాయణుఁ డనియుఁ, దర్కమునకు నిలువఁడనియు సాటివారలలోఁ బేరువచ్చెను. అతఁ డేమి చేయును? ఒక పాఠ్యగ్రంథములోఁ బాశ్చాత్యనాగరికతనుగూర్చి వివేకానందస్వామియో యెవరో వ్యతిరేకముగ వ్రాసిన దున్నది. అది బోధించువేళఁ గ్రైస్తవవిద్యార్థు లందఱకుఁ గోపమువచ్చి యా పుస్తకము చించి కాళ్ళతో మట్టించిరి. అది హైందవులకుఁ గోపహేతు వయ్యెను. వారికి వీరికి బెడిసిపోయి యధికారులవఱకుఁ బోయెను. హైందవవిద్యార్థులు మఱలఁ గట్టుగట్టిరి. అధ్యక్షుఁడు వారినందఱను శిక్షించెను. వారందఱు వచ్చి ధర్మారావును సలహా యడిగిరి. ధర్మారా విట్లు చెప్పెను: "మనము వారికళాశాలలోఁ జదువుకొనుచున్నాము. కాన వారియిష్ట ప్రకారమే నడవవలయును. జరిమానా లిచ్చి రేపటినుండి కళాశాలకు నడువుఁడు. చదువు మానరుకదా మఱి?"

ఒకడు—ఏమండీ! వారు ప్రతిదినము మనమతమునుగూర్చి నిందించుటలేదా? మన యాచారములు బాగుండుటలేదని వారు మాత్రము వాదించుటలేదా?

ధర్మా—ఇక్కడ నెవరి నడిగెదవు? మనయాచారములు చెడ్డవని మనవారే నిందించుచుండఁగా, మన మందఱము వారినే ప్రతివిషయమున ననుకరించుచుండఁగా వారియాచారములే గొప్పవని ఋజువగుచున్నది. అయినను నీ చేతిలో నధికారమున్నచో నీమాట సాఁగును. అధికారము వారిచేత నుంచి నీవు వృథా వాగ్వ్యయము చేసినచో నేమి లాభము? నీ కుద్యోగము కావలసినన్నాళ్ళు వారి ననుసరింపనే వలయును. ఆలోచించుము. ఎదిరించి నీ వేమైనను జేయఁగలవా? కలిగినచో రేపు వారు నీమాటయే విందురు. మీరందఱు రేపటి నుండి చదువు మానెదరా? అప్పుడు వారు నీదగ్గఱకు వచ్చి బ్రతిమాలుదురు. చెప్పుఁడు.

ఎవరును మాటాడలేదు. 'అవును. ఆయువుపట్టుచూచి నొక్కుచున్నా'రని తలఁచి యెవరిదారిని వారు పోయిరి. ఒకనాఁడు ప్రొద్దు

ననే లేచి ధర్మారావు స్నానముచేసి, యుదికినదుస్తులు తాల్చి, జేబులో నొకరూపాయ వేసికొని రైలుస్టేషనకు వెళ్ళెను. అచ్చట నొక పొట్టివాఁడు, నల్లనివాఁడు, బక్కపలుచనివాఁడు, వివేకవంతమైనమొగముగలవాఁడు అతనికై యెదురుచూచుచుండెను. అతఁడు "రైలువచ్చినది, టిక్కెట్టు నేను కొన్నాను, రా పోద" మనఁగా నిద్దఱును రైలెక్కిరి. రైలు ఫిరంగిపురమువద్ద దిగి కొండవీడుఖిల్లాకు మార్గమడిగి యా దారి పట్టిరి. అంతవఱకు ధర్మారావు మాటాడలేదు. పైరుగాలితగిలినంతనే యతనియాత్మ సహజప్రకృతి నవలంబించెను. అతఁడు పసివానివలెఁ జేనిగట్లవెంటఁ బరువెత్తుటయు, నే మొక్క కనఁబడిన నామొక్క కోయుటయు, మన్ను యథేచ్ఛముగాఁ దీసికొని చేతులలో నుంచుకొని పాఱవేయుటయుఁ జేయుచుండెను. అమితోత్సాహమున నుండెను. దారివెంటఁ బద్యములు పాడుచుండెను. జాముప్రొద్దెక్కెను.

రాఘవరావు---ఒయ్యోయి ధర్మా! మన కివ్వేళ కూటిప్రాప్తి లేదు.

ధర్మా---ఈ పల్లెలో సెనగపప్పు, బెల్లము కొనుము. తించుఁ బోదము. కొండమీఁదఁ జెఱువున్నదన్నారుకదా!

రాఘు---మనవాండ్రిద్దఱుకూడ నుండినచో నెంతబాగుండెడిది? వారు లేకపోవుటవల్ల సగము సరదా చచ్చిపోయినది.

చిన్నప్పుడు ధర్మారావు, రాఘవరావు, కిరీటిరావు, సూర్యపతియును గలసి బందరులోఁ జదువుకొనిరి. సూర్యపతి ధనవంతుల యింటిబిడ్డ. వారు కమ్మవారు. కిరీటి రెడ్డి, వారిది పేదసంసారము. కాని యతఁడు చాల తెలివికలవాఁడు. కిరీటి బందరులో బి. ఏ. చదువుచుండెను. రాఘవరావును బందరులోనే చదువుచు ధర్మారా విచట నున్నాఁడని డిసెంబరు సెలవులయినతరువాత గుంటూరు వచ్చెను. వీరు నలుగురు బందరులో నున్నప్పు డల్లరియేకాని చదువన్నది చేయలేదు. గొడుగుపేటలో నొకమేడ యద్దెకుఁ దీసికొని దానిలో బస. ప్రొద్దుననే లేచి నిక్కినీలిగి నలుగురును గలసి సుబ్బన్నబ్యామ చెఱువువద్దకుఁబోయి కాల్యకృత్యములు తీర్చుదురు. మొగము కడిగికడిగి గంట. ఇందులో నొకని మొగముపుల్ల యొకఁ

జొగురఁగొట్టును. ఒకరినొకరు తఱుముకొందురు. పరాచికములాడుకొందురు. రెండుపక్షములై చీలిపోదురు. పక్షములుపడెనా మధ్యాహ్నముదాఁక సంతే. అంతయు నవ్వులలోనే. ఈ నవ్వులలోనే పోరాటము. "అబ్బాయి, మనమిద్దఱము నొకటి. వారితో మాటాడరాదు" అని చీలఁదీసికొనుటలు, నడచుటలు. రోడ్డుకు వారొకప్రక్క, వీరొకప్రక్క; ఒకరివంక నొకరు చూడనురాదు చూచినచో "నావంకనెందుకుఁ జూచితివి" అని తగాదా. "నేను నీవంకఁ జూడలేదు. ఆ చెట్టువంకఁ జూచితిని" జవాబు. జాముప్రొద్దెక్కినతరువాతఁ జెఱువులో స్నానము. ఒకరితో నొకరు జల్లుపోరాటలు. తక్కినస్నానము చేయువారితో వీరు పోరాటలు; వారందఱు వీండ్ర నెఱుఁగుదురు. వారిదారిని వారు తొలగిపోదురు. అందఱు చమత్కారముగానే మాట్లాడుదురు. ఇతరు లెవరైనఁ గోపపడినచో వీరు నవ్వుచునే వారిని పరాచికము లెక్కువయాడుదురు. అది యట్లు సాగిపోవలసినదే. చివరకుఁ గలువపువ్వు లొకటియో రెండో లాగి, యొడళ్ళు తుడుచుకొని, తడిగుడ్డలే పిండి కట్టుకొని యింటిత్రోవ పట్టుదురు. ధర్మారావు కొంచెము మడి. కిరీటి ధర్మారావు నేమియు ననఁడు. సూర్యపతి "నేను మడి. నన్ను ముట్టుకొనవ"ద్దనును. రాఘవరావు వచ్చి తాఁకును. సూర్యపతి "నీవు బ్రాహ్మణుఁడవేగా" యనును.

కిరీటి—ధర్మారావు కాదా?

రాఘు—అయినచో సూర్యమును ముట్టుకో మనుము.

ధర్మా—నోరు మూయుమురా.

సూర్యపతి "నాకు మడిపోయినదిలే" యని ధర్మారావును తాఁకును. ధర్మారావునరేనని పెదవులాడించుట మానివేసి సూర్యపతి బుజాన చేయివేయఁబోవును. ఇంక ముగ్గురును మడియే. ధర్మారావు వారిని దాకరాదు; తాఁకినచో జిల్లాయీలు పెట్టుకొందురు. ఒక్కొక్కప్పుడు కిరీటి మడికట్టును. రాఘవరావు మడికట్టినచోఁ దక్కిన ముగ్గురును దాఁకుదురు. అతఁడు "నామడి అసలు చెడదుగా! నా జిల్లాయిలు దేవుని కిచ్చివేసితి" ననును.

సూర్యపతిఖర్చుతోఁ గొట్టునిండఁ దలనూనెలు, కత్తరులు, నగరువత్తులు నుండును. నలుగురు దొరలు నూనెలు రాచి జుత్తులు

దువ్వెదురు. కాపింగు లేనిది ధర్మారావున కొక్కనికే. నలుగురు నుదికిన దుస్తులు వేసెదరు. బట్టలన్నియు సూర్యపతివే. రెండు పెద్ద ట్రింకులనిండ సూర్యపతివస్త్రము లుండెడివి. కలకత్తాపంచెలు నలువది సిల్కుచొక్కాలు ముప్పది. బనియనులు ఏబది. పట్టుత్తరీయాలు, ఖండువాలు, అత్తాగోడళ్ళంచువి నలుబది. ఈరీతిగా నెలకుఁ జాకలివానికి నాలుగురూపాయలిచ్చి యుదికింతురు. ఇందులో నెవని కిష్టమువచ్చినది వాఁడు కట్టుకొనెడిదే. తరువాత నత్తరులురాచి ఫూటకూళ్ళింటికిఁ బ్రయాణము. ప్రయాణము కాకముందు ఆ రోజునకుఁ గావలసిన పుస్తకములు సర్దుకొందురు. సూర్యపతికి వెదుకుచున్న పుస్తకము దొరకదు.

సూర్య—రాఘవా! నా పుస్తకము తీసినావా?

రాఘు—ఏమి పుస్తకము? నీతలకాయ! స్కూలుకుఁ బుస్తకమెందుకోయి! మహాచదివిచచ్చెడివానికివలె. ఒకనోటుబుక్కు పుచ్చుకొని బయలుదేఱు. చాలులే, అది మన చదువుకి.

పూటకూళ్ళబస బుట్టయ్యపేఁటలో. రాఘవరావు బసలోఁ జిన్నప్పటినుండియు నుండెను. 'ఏమమ్మోవు! వేళ యయినది. అన్నముపెట్టుము' అని రాఘవరావు తొందరచేయును. 'చదివినావులే అయ్యా! చదివిన నిన్నిసార్లు తప్పుట యెందుకు' అని యామె యనును. "ఓసీ! నీ దుంపతెగ. నా సొమ్ము తిని నాకే యెదురుతిరుగుచున్నావు" అని రాఘవరావు. ఆమె "చూడు అయ్యా! చూడు! ఈయనసొమ్ము నేను తిన్నానఁట. నా కింతవఱకు నేనుబది రూపాయిలు ఈయవలె. దమ్మిడీ యీయఁడు నాయనా! చంపుకొని తినును" అనును.

రాఘు—నీకు నే నేమిటి? ఏనుబదిరూపాయలా! ఏదీ, నోటు చూపించు. అబ్బో! నీవా! ఎనబదిగవ్వలు బాకీ యుంచుదువా? 'పట్టి పిసినిగొట్టుముండ యెవ్వరురా' అని యడుగు. లక్ష్మిందేవి యందురు. నీ మొగానికి నేనుబది రూపాయలే!

లక్ష్మిం—ఇదిగో అబ్బాయి! "ముండా" అనకు.

రాఘు—ముండవుకావా? అయిన నీ కుంకుమ పెట్టుకో.

అని కుంకుమభరణి తెచ్చి యామె మొగమున మెత్తును. ఆమె మొగము తుడుచుకొని, "నీవు నా బసలోనుంచి లేచిపో! గోల" యనును. "బస నాది. నీవు పో" అని రాఘవరా వనును. తక్కిన ముగ్గురు పకాలున నవ్వుదురు. ఈ సంఘటనలు రోజున కొకటి వారిద్దరిమధ్య. భోజనము చేయుచుందురు లక్ష్మీదేవి నేయి వడ్డించుచుండును. రాఘవరావు 'ఇంకఁ గొంచెము వేయుము' అనును. ఆమె వేయదు. రాఘవరావు 'వేయుదువా, వేయవా?' అని యామెచేయి పట్టుకొని నేయి బోర్లించుకొనును. ఆమె 'నా సొమ్మంతయు పాడు చేయుచున్నాఁ'డని గోలపెట్టును. రాఘవరావు 'మొదటనే న్యాయముగా వేసినచో నీ కంత నష్టము లేదుకదా! నీ రోగము కుదిరినదా? ఇంక నెపుడయిన నడిగినచో వేయకుండ నుండుము' అని భోజనము చేయును.

భోజన మయినతరువాతఁ బాఠశాలలలోనికిఁ బోదురు. సూర్యపతియు, రాఘవరావును స్కూలుఫైనలు చదువుచుండిరి. కిరీటియు, ధర్మారావును ఎఫ్. ఏ. చదువుచుండిరి. మొదటి పీరియ డయినంతనే సూర్యపతివచ్చి మేడమీఁది ధర్మారావును రమ్మని చేయి విసరును. అతఁడు నెమ్మదిగా లేచివచ్చును. కిరీటి యతని ననుసరించును. రాఘవరా వెదురుచూచుచుండును. నలుగురు గలసి తక్కినరోజంతయు నెగఁగొట్టి గొడుగుపేటకు బయలుదేఱుదురు. దారిలో నొకరి నొకరు వెక్కిరించుకొనుట, యెవరినో ఆడిపోసికొనుటయుఁ దప్ప వేఱే పని లేదు.

కిరీటి——ప్రతిరోజును ఈ యెగఁగొట్టుట యేమిటి?

సూర్య——అబ్బో! మహా చదివినావు లేవోయి!

రాఘు——చదువ కేమి, చదువ కేమి? ఆయన చదివిన చదువేగా మా బఱ్ఱెదూడకు వచ్చినది.

ధర్మా——మీ బఱ్ఱెదూడకుఁ బాగుగా చదువువచ్చునా?

రాఘు——ఆయన కెంతవచ్చునో అంతవచ్చును.

వారిలో నెవరును స్కూలెగఁగొట్టెదమని యనరాదు. అన్నచోఁ దక్కిన ముగ్గురుఁ గలసి వానిభరతము పట్టిరే.

గదికిం బోయి చొక్కా లూడందీసి పఱుపులు పఱచి శయనింతురు. ఇందులో నెవరు నిద్రపోరాదు. పోవుట కెవరైనం బ్రయత్నించినచోం దక్కిన ముగ్గురును వానిని బోనీయరు ఆ పోనీయక పోవుటలో మూండువరుస లున్నవి. మొదటివరుస యిది—అతనిని వందసార్లు పలుకరించుట. అతనిని గదపుచు వందసార్లు 'సూర్యం, సూర్యం, సూర్యం, సూర్యం, సూర్యం, సూర్యం' అనుటయే— దీని కంతులేదు. దీనితో వాండు నిద్ర మానును. మానండు? తక్కిన ముగ్గురుకలసి వానిని వెక్కిరించుట. వాండు దేనికో సమాధానము చెప్పును. 'మేలుకొనియే యున్నావు. నిద్రపోయినా ననుకొన్నామే' యని వానిని లేపి కూర్చుండంబెట్టుట – ఇది రెండవవరుస. మూండవ వరుస – దిండ్లు చేంబుచ్చుకొని మోదుట. అంతటితో వానికిం గోపమువచ్చి మఱల దిండుతోం గొట్టును. అంతట మఱలం బార్టీలు పడి దిండ్లతో యుద్ధముచేయుదురు. కొట్టినవానినే కొట్టవలెనని లేదు. ఊరకున్న వానినిగూడం గొట్టవచ్చును. చివర కీ దిండ్లు విసరుకొనుట వీథిలోనికిం గూడం బోవును. ఇంతలో మూండుగంట లగును.

నలుగురును దుస్తులువేసికొని బయలుదేఱి, కాఫీహోటలులో నల్లరిచేయుచునే యింత తిని చివరిపీరియడునకుం గాలేజీకి మఱల దయారు. కిరీటియు, ధర్మారావును తెలుంగు సంస్కృతము లాజిక్కు గ్రూపువారు. శాస్త్రిలుగారు తెమ్మనుచున్నారని తెచ్చి హాజరు పట్టీలో హాజరువేసికొని తిరిగివత్తురు. సూర్యపతి ధనవంతుండగుట, ప్రధానోపాధ్యాయుం డెఱిగినవాండుగాన నతనికిం దగాదాలేదు. అతని ద్వారా రాఘవరావునకు లేదు. ఇద్దఱును మొగముచూపించివత్తురు.

అటునిటు తిరిగి మఱల హోటలునకుం జేరుకుని భోజనముచేసి గదికింబోయి దీపము వెలిగించి చదువ నారంభింతురు. రాఘవరావు తన లాంతరార్పి తాను పండుకొని "ఏమిటోయి, వెధవచదువులు! ఈ మొగాలు ప్యాసయి చచ్చినట్లే" అనును.

సూర్య—నోరు మూయవోయి, తాండెడ్డకోంతి వనమెల్ల చెఱిచినదంట.

రాఘవ—ధర్మారావు! నీవు రావోయి చదువుమానివేసి. వారిద్దఱు మొద్దులులే. చదువుకోనీ.

ధర్మారావు చదువుమాని వచ్చెను. ఇద్దఱుఁ బండుకొని వారికిఁ దోఁచకుండఁగా బిగ్గరగా మాటలాడుదురు. అక్కడినుంచి తగాదా. పుస్తకములతో దిండ్లతో యుద్ధము. మానివేసి నలుగురు వరుసగాఁ బండుకొని ముచ్చటలాడుదురు. ఒకరిదగ్గఱ నొకరు పండుకొనవలయు నని తనపఱుపు వానిదగ్గఱగా వేయును. ఇంకొకఁడు వారి యిద్దరిమధ్య వచ్చి పడుకొనును. ఇంకొకఁడు వారి యిద్దఱిమధ్యకు వచ్చును. ఇట్లొకరిమీఁద నొకరు పడిపోదురు. చివరకుఁ గాదని దూరదూరముగఁ బండుకొందురు. వారు ముఖ్యముగాఁ జెప్పుకొను నవి దయ్యాలకథలు, పాములకథలు, దొంగలకథలు, పెద్దపులుల కథలు. రాతిరి కొంతదూరమైనతరువాత నందఱు నలసిరా, నిద్ర పోదురు. ఒక్కఁడే నిద్రపోవలె ననుకొనెనా, వరుస లున్నవిగా, అవి జరుగును. ఆ వరుసలు జరిగినతరువాత నలుగురు లేచి గదికిఁ దాళము పెట్టి కాలేజీదాఁకా పోయి తిరిగివత్తురు. పని యేమియు లేదు. తెల్లవాఱుకడ నిదురపోదురు. మఱునాఁ డెనిమిదింటికి లేతురు. ఇది వారి దినచర్య.

ఒకానొకనాఁడు నాటకమునకుఁ బోవలె ననిపించును. అందఱి దగ్గఱ డబ్బుచు లెక్కచూడఁగా నొక రూపాయి తక్కువగును.

సూర్య—మానివేయుదములే.

కిరీ—నీవు ముసుఁగుపెట్టుకొని పండుకో. మేము పోదుము.

సూర్య—నేనును వత్తును. ఎక్కడనైన నప్పు తెచ్చెదము.

ధర్మా—ఇం కెవ రున్నారు ? రాఘవరావు పెంపుడు తల్లి యున్నదిగా?

రాఘు—ఛీ! వెధవముండ, నాకుఁ బెంపుడుతల్లి యేమిటి ? పూఁటకూళ్ళది!

కిరీ—దాని సొమ్ము తినవచ్చుఁగాని, అది పెంపుడుతల్లి యనరా దేమి?

నలుగురు గలసి లక్ష్మీదేవియింటికిఁ బోయి తలుపు తట్టుదురు. ఆమె తలుపుతీసి వీరినిజూచి 'ఎందుకు నాయనా? అర్ధరాత్రివేళ వచ్చినారు? నా దగ్గఱ డబ్బులేదు బాబూ!' అనును.

రాఘు—ఒక్కరూపాయే నమ్మా!

లక్ష్మి—రూపాయి కాదుకదా, దమ్మిడీకూడా లేదు.

రాఘు—రూపాయకే చచ్చిపోదువా? గుటుక్కు మందువా? నీకు తేపటికిఁ గట్టెలు చేరవేయవలసిన దేనా?

లక్ష్మి—నీవు లక్షతిట్టు, వెయ్యితిట్టు. నాదగ్గఱ పైసాలేదు.

రాఘు—ఇపుడు నీ తలకాయ బ్రద్దలుకొట్టి యా చేతుల గాజు లెత్తుకపోయిన నేమి చేసెదవు? డబ్బునిలువచేసి యేమి కొందువు? ఎలుకలు, పందికొక్కులు తినుటకా? ఇత్తువా, యీయవా? చెప్పు. నాటకానికి వేళయగుచున్నది.

కిరీ—ఇంటిలో వెదకి రావోయి!

లక్ష్మి—ఇంటిలో నెక్కడనున్నది? నాకొంగుననే యున్నది.

రాఘవరా వూడఁదీయఁబోయెను. ఆమె యూడఁదీయ నీయదు.

రాఘు—ధర్మారావూ! నేను దీనిచేతులు పట్టుకొందునుగాని, నీ వూడదీయవోయి!

చివర కెట్లయిననేమి రాఘవరా వూడఁదీసి డబ్బుతీసికొనును. అందులో రూపాయి అణా యుండును.

రాఘు—ఇదిగో! నీఅణా నా కెందుకు? వెధవఅణా తీసికో!

లక్ష్మి—ఈ అణాతో నేమి చేసికోను?

రాఘు—బుఱ్ఱ గొఱిగించుకో.

లక్ష్మి—తేపటికి నెయ్యి లేదు, ఏమి వేసికొని తినెదవు? గడ్డి తిందువా? నేయి లేకపోయిన మఱల ముద్ద యెత్తవు.

రాఘు—అక్కడికి రోజును నేయివేసి చచ్చుచున్నట్లు!

ఒకొక్కప్పుడు గృహములోనికిఁబోయి యా గూఁడు లీ గూఁడులు వెదకి డబ్బు తెచ్చును. నాటకమునకుఁ బోదురు. అక్కడను సరిగఁ గూర్చుండరు. సూర్యపతి వారందఱను తిలుమును. ఇట్లు సంవత్సరమున్నర జరిగెను. మొదటియేఁడే కనుక నెట్లో దాఁటిరి. సెలవు లయినతరువాత మఱల జదువులకు వచ్చిరి. సగము సంవత్సరము కడచినది. సూర్యపతితండ్రి పోవుటచేత నతఁడు చదువుమానెను. చివరి మూఁడునెలలు తక్కినవారు ముగ్గురే యయిరి. ఒకకళ తక్కువయినను ఆ మూఁడునెలలు నట్లే జరిగెను. కిరీటి పరీక్ష తప్పెను.

రాఘవరా వాయేఁడు స్కూలుఫైనలు పరీక్షయయ్యెను. సెలవు లిచ్చినతరువాత రాఘవరా వింటికిఁ బోవుచుండెను. లక్ష్మిందేవితోఁ జెప్పి 'ఇంక రా నమ్మోవ్' అనెను.

లక్ష్మిం—నా డబ్బుమాట యేమి చెప్పినావు ?

రాఘు—నీడబ్బా! డబ్బేమిటి? నేను నీకు దమ్మిడీయయిన నీయనక్కఱలేదు. సాక్ష్యమేమయినఁ గావలసినచోఁ గిరీటిని చెప్పెదను. అతఁడు పెద్దమనిసికదా !

లక్ష్మిం—పిల్లికి నెలుక సాక్ష్యమన్నట్లున్నది.

రాఘు—ఏమమ్మోయ్, ఒడలుదగ్గఱపెట్టుకొని మాట్లాడుము. నోటికివచ్చిన ట్లెల్ల ప్రేలుచున్నావే, పెద్దమనిసిని. రేపు ఎఫ్. ఎ. ప్యాసుకాఁబోవుచున్నవానిని బట్టుకొని యెలుక యందువా?

లక్ష్మిం—సరేకాని, ఏమిటో చెప్పు. రైలుఖర్చుకు డబ్బులు లేవా? ఎంతకావలె? పదిఅణాలుకాదూ?

రాఘు—రూపాయి చాలు. వట్టిచేతులతోఁ బోనా?

ఆమె రూపాయి యిచ్చెను. లక్ష్మిందేవికి నేఁబదియేండ్లుండును. తలవెండ్రుకల విధవరాలు. రాఘురావుమీఁద నామె కెందుకో అంత యపేక్ష యుండెడిది. రాఘవరావు ఎఫ్. ఎ. మొదటియేఁడే బందరులోఁ దప్పి మఱలఁ జదువుచుఁ జిన్నతనములో గుంటూరునకు వచ్చెను. వచ్చి నెలయయినది. హాస్టలులో నతనికి సీటు లేకపోయెను. ఊరిలో గదిపుచ్చుకొనియుండెను. అతనికి సూర్యపతి చాల సహాయపడుచుండెను. ధర్మారావు రాఘవరావులు నేఁడు కొండ వీటికిఁ బోవుచుఁ దమమిత్రులలేమికిఁ జాలవిచారపడుచు సెనగపప్పు, బెల్లము కొని బయలుదేఱిరి. రాఘవరావు తనయుత్తరీయమున మూటగట్టుకొనెను. ధర్మారావు తనకుఁ గొంచె మిమ్మనెను.

రాఘు—కొండమీఁదనే తినవలయును, ఇక్కడ నీకు గింజ యీయను.

ధర్మా—ఏమిచ్చినావు. తన్ని లాగుకొందును.

రాఘు—తిరిగి వెళ్ళులోపుగా నాచేత నీవు తన్నులు తినకున్న చాలును.

ధర్మారావు, రాఘవరావు లిద్దఱు జంటకవులు. వారిద్దఱిలోను రాఘవరావుపోకడ చాల మెత్తనిది. రాఘవరావు నియోగి. వారిది గుడివాడవద్ద నొకయూరు. ఇద్దఱును మూఁడు నాలుఁగ్రైదాఱు ఫారములు కలసి చదువుకొనిరి. ఇద్దఱకును జాలస్నేహ మున్నది. కలసి యేనోపద్యములు వ్రాసెడువారు. ధర్మారావునకు రాఘవరావుకవిత్వమున్నచో నెంతో యిష్టము. ఒకనాఁడు రాఘవరావు తండ్రి బందరునవచ్చి ధర్మారావును జూచి 'మీ దేయూరు నాయనా' యనెను. ధర్మారావు 'సుబ్బన్నపేట' యనెను. 'ఎవరి అబ్బాయివి?' అనఁగా 'రామేశ్వరశాస్త్రిగారి అబ్బాయిని' అనెను. రాఘవరావు తండ్రిపేరు వేంకటాచలపతి. ఆయన ధర్మారావును కౌఁగిలించుకొని 'రామేశ్వరశాస్త్రిగారి కుమారుఁడవా? నాయనా! మీ నాన్నయు, నేను ప్రాణస్నేహితులము. మీ నాయన యొక్కడ తండ్రీ, నిరతాన్నదాత! మహాపురుషుఁడు!!' అని మెచ్చుకొనెను. అప్పటినుండి ధర్మారావు రాఘవరావుల స్నేహము మఱియు వృద్ధి పొందెను. ఆ నలుగురి స్నేహములోఁ బొరపే లేదు. అందులో వీరి యెడల నసలులేదు. ఏయిద్దఱి మధ్యను లేదు వారునలుగురు నాలుఁగు దిక్కుల చివరల నుండినను, వారిహృదయములు కలసియే యుండును. ఇద్దఱును గలసి కొండ యెక్కిరి. ఎక్కుచు ధర్మారావు 'సూర్యపతివచ్చినచో నుసురుంపతెగును. ఈ కొండ యెక్కులోపుగా వందనాళ్లు కూర్చుండు మనెడివాఁడు. రాలేనో బ్రతికినాము' అనెను.

రాఘ—పొన్నకాయవలె గుఱ్ఱపుబండిలోఁగూర్చుండుమన్నఁ గూర్చుండును. కొంచెము దూరము నడచినచో నాయాసము. సుతిమెత్తని ప్రాణము. పాపము! లేతవంకాయ.

ఇద్దఱును నవ్వుకొనిరి. 'ఉత్తరము వ్రాసినచో వచ్చెడివాఁడే సుమా' యనుకొనిరి. 'ఈసారి శని, ఆదివారములలో బెజవాడ పోదము. అతనిని జూచివత్తము' అనుకొనిరి. మాఘమాసమువచ్చి యెండలు మండిపోవుచుండెను. కొండమీఁదఁ బచ్చని మూకంతయుఁ మాఁడిపోఁజొచ్చెను. వారు కొండ పడమటినుండి యెక్కి పడమటి ద్వారము దాఁటి పెద్ద మైదానములోనికిఁ బోయిరి. ఇద్దఱిమేనులు గగురుపొడిచెను. 'ఇచ్చట మనపూర్వపురెడ్లు గుఱ్ఱాలుదూఁకించిరో,

ఏనుఁగుల నెక్కెనో? మన మయోగ్యుల మిచటఁ దిరుగుచుంటి'మను కొనిరి. 'కిరీటిరావునైనఁ దెచ్చితిమి కాము. అతఁ డెంతపొంగిపోయెడి వాఁడో' యనుకొనిరి. తారాబురుజు పోయి చూచిరి. మిరియాల తఖతు దర్శించిరి. నేతికొట్టు చూచిరి. అచట గుఱ్ఱాలు నిలచెడిచోట గుఱ్ఱపుడెక్కల గుర్తులు నిరీక్షించిరి. వారిహృదయము పూర్వచరిత్రకథా స్మృతిచేత వివశాంగులై ప్రతినెత్రునాళమున వేఁడినెత్తురులలో నడచిరి. ఒక పూర్వసౌభాగ్యము తెలుపు ప్రదేశము చూచినా, యిద్దఱు నొకరివంక నొకరు చూచుకొందురు. ఇంక మాటాడనక్కఱలేదు. ఇద్దఱును బరస్పర మర్థము చేసికొందురు. వారియాత్మలు కవితా విషయమున, రసజ్ఞతావిషయమున సంతసన్నిహితములై యుండెను. వా రిద్దఱుగాని యొకఁడే. మధ్యాహ్నము దాఁటి వెనుకళ్ళచెఱువు వద్దకుఁ బోయి సెనగపప్పుతిని నీరుత్రాగి గట్టునఁ ద్రేచిరి. అచ్చటఁ గొంతసేపు విశ్రమించిరి. ఆ దుర్గనిర్మాణకౌశల మాశ్చర్యముగ నున్నది. కోట కట్టుట కెట్టి చక్కనిస్థలము కనిపెట్టిరి! చక్కని జల సమృద్ధిగలచోటు, లక్షలాదిగ జనము నివసించదగినచోటు, కొండ లకుఁ గొండలకుఁ గలిసికట్టిన గోడచేత ననిర్భేద్యమైనచోటు – ఆ రెడ్లు, వారిపరాక్రమము, వారి యౌదార్యము, వారు పోషించిన కవులు – వారిహృదయము లానందభరితములయ్యెను. ప్రొద్దుక్రుంకు వేళకుఁ దూర్పుద్వారమున దిగి కత్తులబావి చూచిరి. ఆ ఘోర వృత్తాంతమువిని తిరిగి వచ్చిరి. అచ్చటఁ బెద్దఱాతిబండయుండెను. దానితో రెడ్లు క్రీడించిరని చెప్పిరి. అది యిప్పుడు మువ్వురు గలిసి కాని యెత్తలేరు. ఆ బండతో వారు బంతులాడిరా? వారి బలపరా క్రమము లెట్టివో!

రాఘు—'సార్వభౌముని భుజాస్తంభమెక్కెనుగదా నగరి వాకిటనుండు నల్లగుండు.' ఇదే అది యేమో!

ధర్మా—కావచ్చును. అది యొక పుణ్యసమయము. మన మప్పుడైన బ్రతికియున్నాము కాదు.

రాఘు—ఉన్నచో నేమి బ్రదుకు? కాఫీహోటలులా? ఇంగ్లీషు చదువులా! నీవు బి. ఏ. చదువుదువా? ఏ బుడిచెంబో పుచ్చుకొని సంభావన కేఁగెడువాఁడవు, వెధవ వైదికివి!

ధర్మా—నీవు మంత్రిగా నుండెడివాఁడవు. స్నేహితుఁడను వచ్చి యడిగినచో నన్నుఁ గొంచె మాదరించెడువాఁడవు కాదా ?

రాఘు—అప్పు డసలు నీమొగమే నే నెఱుఁగను.

ఇద్దఱును గలసి రైలుస్టేషనువైపు నడచిరి. అచ్చటికి స్టేషను దూరమగుటవలనను, చీఁకటి పడుటవలనను వేగముగ నడచుచుండిరి. దారిలోఁ గొండవీటిరెడ్లు నప్పటి శోభయు, వాని ప్రస్తావనయే జరుగుచుండెను. సగముదూరము నడచిరి.

రాఘు—వారు కవిత్వ మెంత పోషించిరి! కవిసార్వభౌముఁ డయిన శ్రీనాథుని వారు పోషించుటయే, వారు సారస్వతమునకు మఱవరాని మహోపకారముచేయుట.

ధర్మా—ఎఱ్ఱాప్రగ్గడనుమాత్రము పోషించలేదా?

రాఘు—తెలుఁగులోఁ దక్కినయందఱుకవులును శ్రీనాథుని తరువాతివారే. శ్రీనాథునకుఁ బోలికయే లేదు.

ధర్మా—అ దేమిమాట? ఎఱ్ఱాప్రగ్గడ శిల్పము? ఆయన భారతారణ్యపర్వశేషము పూరించెనన్న సామాన్యమా? సావిత్ర్యు పాఖ్యానము, యక్షప్రశ్నలు న న్నెవఁడు వ్రాయఁగలఁడు? తరువాత పింగళి సూరన. ఆయన ప్రభావతి-ఓహోహో; ఏమి రచన! ఆయ నతోఁ బోల్పఁదగినవారు మనభాషలో నొకరోయిద్దఱో? అంతియ.

రాఘు—శ్రీనాథునితో నెవ్వరును బోలలేరు. తిక్కనవంతయు నట్టె పెట్టుము. సీసపద్యము నాయన యెంత బాగుచేసెను?

ధర్మా—సీసపద్య మతనిమూలముననే అసలు పాడయినది.

రాఘవరావు ముందునడచుచున్నవాఁ డాఁగి 'ఛీ! నోరు మూయుము' అనెను. ధర్మారావు 'వాగక నడువుము. శ్రీనాథుఁడు లేకపోయినచో సీస మంతదౌర్భాగ్యదశకు రానే రాదు' అనెను. రాఘవరావునకుఁ గోపము మితిమీఱిపోయెను. లాగి ధర్మారావును చెంపకాయకొట్టెను. దెబ్బ చుఱ్ఱునఁ దగిలెను. ఎఱ్ఱని యతనికపోలము నెత్తురులు క్రమ్మెను. ధర్మారావు 'అబ్బా' యని చేతితోఁ జెక్కిలి యదుముకొని కోపముతో రాఘవరావువంకఁ జూచెను. రాఘవరావు మొగములోఁ గత్తివేసిన నెత్తురుచుక్క లేదు. మొగము వివర్ణమై పోయెను. ధర్మారా వాలోచించెను. అతనిని మఱలఁ గొట్టవలయు

నన్నంత వచ్చినది. కాని యాఁగెను. ధర్మారావు దారి తొలఁగి ముందుకువచ్చి నడువసాగెను. రాఘవరా వనుసరించెను. ఒకరితో నొకరు మాటాడుటలేదు. నడచుచుండిరి. రాఘవరావు మంత్రమువలె నతని ననుసరించెనేకాని యతనిమేనిలోఁ బ్రాణములు లేవు. ఆహా! కొంతదూరము పోయినతరువాత నతని కాలోచనాపరంపర పుట్టెను. ధర్మారా వెంత మంచివాఁడు! అతఁడే తిరిగి కొట్టినచోఁ దా నేమగును? ధర్మారావును, దానును సమవయస్కులయ్యును ధర్మారావునెడల నితరులకున్న మర్యాదనుబట్టి యతఁడే గౌరవనీయుఁడు. తనమిత్రులలో ధర్మారా వట్లుండునుగాని పరుల కతని జూచినచో భయము వేయును. అతఁ డంత తేజశ్శాలి. అంత గంభీరుఁడు. అతఁడన్నచోఁ దన కెంత గౌరవము? చివరి కిదా తానుచేసిన పని? ధర్మారావు చాలబుద్ధిమంతుఁడు. శ్రీనాథునిసీసమునుగూర్చి యట్లన్నచో నతఁ డేల యనెనో! అతనివలెఁ దా నాలోచించలేఁ డాయెను. ఛీ! ఛీ! తనకన్న ధూర్తుఁ డుండఁడు. రేపు కిరీటిసూర్యపతులతో నేమని చెప్పవలయును? తనతండ్రి కిది తెలిసినచోఁ దన్ను బ్రదుకనిచ్చునా? అతనికన్న దా నేమి తెలివికలవాఁడు? ధర్మారావు ప్రతితరగతియుఁ గ్రమముగాఁ బరీక్షయిచ్చుచుండఁగాఁ, దాను ప్రతిదియుఁ దప్పుటయే నాయెను. ఒక యరమైలుదూరము నడచిరి. బాగుగాఁ జీఁకటిపడినది. రై లందునో, అందదో యని ధర్మారావు తొందరగా నడచుచుండెను. రాఘవరా వతనితో నడువలేక మధ్యమధ్యఁ జిన్నపరువులెత్తుచుండెను. దారి యది యవునో కాదో! రాఘవరావు పరుగెత్తి ధర్మారావుకన్న ముందు నడవఁజొచ్చెను. కాని ధర్మారావు నాలుఁగైదుసారు లతనిమడమలు త్రొక్కవలసి వచ్చెను. రాఘవరావు 'మడమలు త్రొక్కెద వేమి' యనెను. ధర్మారావునకుఁ గోపము తగ్గలేదు. ధర్మారావు ముందు నడచెను. రాఘవరావు మఱల ముందుకుఁ బరుగెత్తి 'నాకు భయము వేయుచున్నది. నీతో నేను నడువలేకున్నాను' అనెను. ధర్మారావు కోపముతో ముందు నడవఁబోయెను. రాఘవరావునకు దుఃఖము తఱుముకొనివచ్చెను. అతని దుఃఖ మాఁగక బిగ్గరగా నేడ్చి ధర్మారావును గాఁగిలించుకొనెను. ధర్మారా వేమి చేయును? నిలువెల్ల నీరయ్యెను. అట్లే నిలఁబడి

పోయెను. అట్లు పదినిముసము లున్న తరువాత నిద్దఱకు నుద్వేగము తగ్గెను. ఎవ్వరును మాటాడలేదు. చీకటిలో నొకరిమొగ మొకరు చూచుకొనిరి. ఏమియుఁ గనిపించలేదు. కాని స్పర్శచేతనే ధర్మారావుకోపము పోయిన దని రాఘవుఁడు గ్రహించెను. రాఘవుని పశ్చాత్తాపము ప్రమాణము దాఁటిన దని ధర్మారావు గ్రహించెను. తన యుత్తరీయముతో రాఘవరావు కనులు తుడిచి ధర్మారా వతనిని ముందు నడవమనెను. కాని రాఘవరావు కొంతదూర మతని ప్రక్కగాఁ గౌఁగిలించుకొనియే నడచి తరువాత నట్లు నడచుట కష్టమయి ముందునడచెను. స్టేషను దగ్గఱకు వెళ్ళునప్పటికి రైలు దాటి పోయెను. దగ్గఱలో సత్ర మున్న దని తెలిసికొని యటకుఁ జనిరి. అచట సత్రములో నొక ముసలిది డబ్బుతీసికొని యన్నము పెట్టును. కాని మనుష్యులు వచ్చినతరువాత వారు కావలయునన్నచో వంట మొదలుపెట్టును. వీ రిద్దఱు ప్రొద్దుటినుండి తిండిలేక మలమల మాఁడుచు నామె యప్పుడు వంట మొదలుపెట్టెద ననఁగా మనసులో సగము చచ్చిరి. వంటయై భోజనమగువఱకు రాత్రి రెండుజాములయినది. సత్రములో బయటఁ బండుకొనిరి. ప్రక్కలు లేవు. ఉత్తరీయములే కొంతసేపు పఱుపులు, కొంతసేపు దుప్పటులుగాఁ దెల్లవాఱినది. హృదయమును నిద్రకుదుటపఱచునట్లు మఱొకఁడు చేయలేదు. రాత్రియంతయు వారు సరిగా మాటాడనే లేదు. తెల్లవాఱుసరికి నిద్దఱకు యథాపూర్వముగఁ బ్రసంగము సాఁగెను.

రాఘు—ధర్మన్నా! లేవోయి. ఈపూఁటఁగూడ రైలు చెడఁగొట్టెదవా?

ధర్మ—నిన్న నేనేచెడఁగొట్టినది! వెధవ తెలివిపోవుచున్నావు!

రాఘు—'నోటికి సరిగా రానీ. మఱలఁ జెంపకాయలుతినెదవు. అప్పుడే మఱచిపోయియున్నావా! నిన్నప్రొద్దునఁ గొంత మెక్కుచు నన్నానుకదా, తిరిగి వెళ్ళులోపుగా నాచేత నీవు తన్నులుతినకున్న నంతేచాలు నని. అది నిజమా, అబద్ధమా?' అని లేవకున్న ధర్మారావుమీఁదఁబడి ప్రేమ వెడలఁగ్రక్కుచుఁ గౌగిలించుకొని యొక్కటే నవ్వెను. ధర్మారావు 'మీఁదనుంచి లే' అనెను. రాఘవరావు లేవకుండ 'ఇంకను గోపము పోలేదా? కొట్టు మయిన' నని ధర్మారావుచేయి

తనచెంపమీఁదఁ బెట్టుకొనెను. ధర్మారావతనిచేయి నొక్కెను. రాఘవరావు గిలగిలలాడి వదలించుకొని 'అబ్బా! అక్కడికిఁ గసితీఱినది కావలయును' అని సర్దుకొనెను. తరువాత రైలుకుఁబోయి యింటికిఁ జేరిరి. అది యాదివారము. ధర్మారావు పాండురంగమాహాత్మ్యము తెచ్చి చదువుచుండెను. ఆ వార మెల్ల నదియే చదివెను. తనకుఁ గష్టమై క్రింద లఘువ్యాఖ్య చూచినప్పుడెల్లఁ దన కెచట సంశయమో వ్యాఖ్యాకారునకుఁగూడ నచటనే సంశయము. పుస్తకము పూర్తియయ్యెను. ఈసారితో ధర్మారావు తనకవితాభిప్రాయములన్నియు మార్చుకొనెను. ఇది యేమి గ్రంథము! తెలుఁగువాఙ్మయమున నా గ్రంథమునకున్న మర్యాదయు, గౌరవమును ధర్మారావు మొగమున వచ్చి కొట్టెను. ఇదివఱకు ధర్మారావు కవిత్వ మనఁగా మెత్తని మాటలు తెచ్చి పొదుఁగుటయనుకొనెను. ఒత్తుఅక్షరములు లేక అదొక విధమైన ప్రవాహముగాఁ బోవునవి, లోకమున మనము బహుశః ఉపయోగించునవి, ఒయ్యారమైన యర్థము కలవి శబ్దములే కవితకు బనికిఁ బచ్చును. తక్కినవి చెవి కింపు గావు. పద్యమును సాఫీగా నడువనీయవు. పద్యము తేలికగా నుండవలయును. ధారాళముగఁ బోవలయును. యతిప్రాసములు వానియంతట నవి యతికినట్లే యుండవలయును. ఈ పూర్వభావ మిదివఱకే కొంత మాఱినది. ఇప్పుడు పూర్తిగా మాఱిపోయెను. ప్రతిశబ్దమునందును సొగ సున్నది. కవి చూడఁగలిగియుండవలయును. ఇతరులకుఁ బాండురంగనికి లక్ష వ్యత్యాసము కన్పడెను. అతనిభావములే వేఱు. ఆయన చెప్పెడి వైఖరియే వేఱు. ప్రతిపద్యము జాత్యశ్వము ఖదనువోయినట్లే యుండును. ధర్మారావునకుఁ దక్కినవైఖరి పేలవ మనిపించెను. కవిత్వ మనినచోఁ బాండురంగనిదే కవిత్వము. పింగళి సూరన్న గారును మహానుభావుఁడే. కాని తెనాలికవికూర్పు బ్రహ్మభేద్యము. అతని కతఁడే సాటి. మఱలఁ జూడఁగా నెవరిత్రోవ వారిదే. అన్నింటిలోనను మాధుర్యము కలదు. జిహ్వకు రుచి వేయిరీతులు. మరగఁ గాఁచిన పాలరుచి వేఱు; పంచదార కలిపిన పాలరుచి వేఱు. తేనెపాకమురుచి వేఱు; తేనెరుచి వేఱు. చెఱుకుపాకమురుచి వేఱు. అందులో మఱల పలురకములు. షరబత్తురుచి వేఱు. ఇం దేది కాదం

దుము? కాని స్వచ్ఛమైన క్షీరము, మధువు, చెఱుకుపానకము తక్కిన వానికన్న శ్రేష్ఠములు. మధువు దోసెఁ డెవరైనఁ ద్రాఁగఁగలరా? అడవిలోనున్న కోయవాండ్రు త్రావుదురు. ఇప్పపూవు తిని తేనె త్రాఁగువారిరుచి యెట్టిదో? మనకైనచో నాలుగుబొట్టులు త్రాగువఱకే మొగము మొత్తును. అసలురుచి యట్లేయుండవలయునేమో? అచ్ఛముగాఁ బాలుత్రాఁగలేక మనము పంచదారకలుపుకొందుము. మనరుచి చెడిపోయినది. ఉప్పు కారములు తిని జిహ్వచెడి యచ్ఛమైన క్షీరములు, తేనె వీనియందు వైరస్యము పుట్టినది ఇది యొక వ్యాధియేమో? అడవిలోనివారికి సహజరుచి పోలేదు. వారికి వెగటులేదు. అప్పుడే కొండకొమ్మునుండి పట్టుదులిపి తెచ్చిన పచ్చి తేనవలె నున్నది తెనాలికవి గ్రంథము. ఇంకను గొన్నిపురుగులు గూడ బ్రతికియే యున్నవి. ఆ దశావతారవర్ణన మేమిటి? అందులోఁ గుర్మావతార వర్ణనము! కవిత హృదయమునకుఁ దాఁకవలయును గాని, మనస్సునకు దాఁకరా దందురు. మనస్సుద్వారా కాక యింద్రియవిషయములకు హృదయప్రవేశ మెట్లుకలుగును? 'అన్యదాలోచనామృతం' అన్నవారుకూడ మనసా చర్వితమైనకొలఁది నానందము కలుగునదియే కవిత్వ మనిరి. అట్లు వినినవెంటనే తెలియవలయునేని, చూచినంతనే కనుల కింపయిన వస్తువువలెఁ గవిత్వమును శీఘ్రపరిత్యాజ్యద్రవ్యగణములోననే చేరును. ఆలోచించినకొలఁది రమ్యముగా నుండవలయును. అనఁగా నాలోచించినకొలఁది నందు విశేషముగాఁ దెలిసికొనవలసిన యంశము లుండవలయు నన్నమాట. అర్థము శాఖోపశాఖలుగా నుండి, తదనుగుణమైన శబ్దప్రయోగము, తద్ద్వ
త్పరస్పరసంబంధము, చివరకు సర్వమును గలసి రసమునందుఁ
ంచుట-యింత జరగవలయును. రసమునందుఁ బర్యవసించుట
? రసజ్ఞుఁడైనవానికి. ప్రతివిషయము నెవఁడు హృదయము
చెచ్చుకొనఁగలుగునో వాఁడు రసజ్ఞుఁడు. ప్రతివాఁడు నట్లు
ఁడు. ప్రతివిషయమునం దంతశక్తి లేదు. భగవంతుఁ డెంత
లోఁతైన విషయము. ఆ లోఁతు మహాపరిపక్వదశయందున్న
సిమనస్సునకే దెలియుచున్నది. భాగవతములోని పద్యము
ఁ దానే చెప్పినది. ఆమె వాని యర్థములు హృదయము

దాఁక నెక్కెఁగినది. అందుకనియే వానియందు లీన మగుచున్నది. ఏ సంగతియైన నంతదాఁక తెలిసినచే తెలిసినట్లు. తనకు భాగవతము లోని పద్యములయందలి భాగవతార్థముకన్న సారస్వతార్థమే యెక్కువ తెలిసినది. అందువలన నచటి నుడికారపుసొంపు, అక్షరములకూడిక, పద్యమునడక వీనిని జూచి తాను సంతోషించుచు న్నాఁడు. తెలియుటలో నున్న తరతమభావము లనంతములై యిద మిత్థమని నిర్ణయించరాకపోయినది. ఒకనికిఁ దెలిసిన దింకొకనికిఁ దెలియదు. అందుచే జగత్తు బహుసహస్రధా విభక్తమై పోయినది. పాపము! వారొకరి నొకరు తెలిసికొనవలయు ననియుఁ బ్రయత్నింతురు. సర్వసృష్టి నావరించిన మాయ యనెడు నహంకారము వివేకమును జేరకట్టనీయదు; ఎదుటవాని యూహ యూహించనీయదు. ఈ యూహాపరంపరవేళ రాఘవరావు వచ్చెను. ఇద్దఱుఁ గలసి వాహ్యాళి బయలుదేఱిరి. సాయంకాలమయినను వేఁడి తగ్గలేదు. కలసి నల్లచెఱువునకుఁ బోయి, యచటఁ గూర్చుండిరి.

రాఘ—మొన్న శ్రీనాథుఁడు సీసపద్యము పాడుచేసె నంటివే! ఆ సంగతి కొంచెము చెప్పుము. 'వినఁ గుతూహల మయ్యెడిన్.'

ధర్మా—నీతో నా సంగతి యింక మాటాడనుపో.

రాఘ—మఱలఁ గొట్టరులే, ఇది ఫిరంగిపురము కాదుగా.

ధర్మా—నీ మొగము పోదూ.

అని యూరకుండెను. రాఘవరావుబ్రతిమాలెను. ధర్మారావు మెత్తఁబడలేదు.

రాఘ—శ్రీనాథునకుఁ దెలియని దేమిటి? నీకుఁదెలిసిన దేమిటి?

ధర్మా—అంతే. నీకును శ్రీనాథునకును దెలియును.

రాఘ—సూర్యపతి తేపు మనల నిద్దఱను రమ్మని కబురు పంపించెను.

ధర్మా—ఎందుకు? ఊరువెంటఁ దిరుగుటకుఁ గాఁబోలు!

రాఘ—తేపు శకుంతలనాటక మఁట. మనము ముగ్గురము కలసిగాని యీ నాటకము చూడరాదఁట. ఇదివరకే నాలుఁగుసార్లు కబురులు పంపించఁగా మనము పోలేదు. నీ విచటనుండి కదలలేదు,

నేను బందరునుండి పోలేదు. ఈసారి తప్పక రమ్మనియు, రాక పోయిన నింక మనతో మాట్లాడననియుఁ గబురంపెను.

ధర్మా—నాకీ నాటకములు చూచినచో నొడలు మండి పోవును. ఈ పిచ్చివానికిఁ బ్రతివాఁడును నటకుఁడే. మనముకూడ నతఁడు మెచ్చుకొన్నవానిని మెచ్చుకొనకపోయినచో మన ప్రాణములు తీయును. లక్ష చెప్పి యొప్పించినఁగాని నిదురపోనీయఁడుగా.

రాఘు—రేపు పోవుదమా మఱి? రేపు శనివారము.

ధర్మా—రేపు ప్రొద్దుననే పోదము.

మఱునాఁడు నలుగురు స్నేహితులును గలసిరి. దినము చాల భాగము యథాపూర్వముగానే సాగెను. కృష్ణాస్నానము చేసిరి. సూర్యపతి మేడమీఁదఁ బఱువులుపఱచినమంచములమీఁద శయనించిరి. ఎవ్వరును విద్దురపోలేదు. రాత్రికి నాటకము చూడవలయును. పగలు కొంచెము నిదురపోద మని యొకరు. సరేనని మఱియొకరు. కాని నిద్రపోవువేళకు నలుగురు నల్లరియే చేయుదురు. రెండు గంటలైనది ఖర్జూరాయితోనలు, కమలాఫలముతోనలు, చక్రకేళిముక్కలతో నిండిన పళ్ళెములు మేడమీఁదికి వచ్చినవి. అవి ఫలహారములు చేసి, నిమ్మకాయ పిండిన పలుచని మజ్జిగ దాహము త్రావి, మఱలఁ గొంచెము సేపు మాటాడి షికారు బయలుదేఱిరి. హాలు వద్దకుఁ బోయి టిక్కెట్లు కొనిరి. రాత్రికిఁ బెందలకడ భోజనములు కానిచ్చి నాటకము వేళకు హాలులోఁ బోయి కూర్చుండిరి. మధ్య సూర్యపతి. అతనికి రెండువైపుల ధర్మారావు, రాఘవరావులు. ధర్మారావు ప్రక్కన కిరీటి. హాలు క్రొత్త తెరలతోఁ, జెమికీపనిచేసిన ప్రక్క తెరలతో విద్యుద్దీపముల వెలుఁగునఁ గనులకు మిఱుమిట్లు కొలుపుచుండెను. సూర్యపతి హాలును దెగమెచ్చుకొనుచుండెను. 'లక్షరూపాయలు వ్యయముచేసి యీ హాలు కట్టించిరి. ఏమి తెరలు, ఏమి తెరలు!' అని.

ధర్మా—నోరు మూసికొనుము. ఏమిటి, దుర్వ్యయముగా నున్నది!

సూర్య—నీవు ప్రతిదానిని విమర్శించుటయే తప్ప మెచ్చుకొనవయ్యా?

ధర్మా—సరేకాని, ఆ తెరమీఁద బొమ్మ యెవరిది?

సూర్య—ఎవరో దొరసానిది. గ్రీసుదేశపుదేవత యఁట.

ధర్మా—ఇచ్చట నాడునాటకములు మనసంప్రదాయముతోఁ గూడినవికదా! మననాటకము లాయెను. సరస్వతీదేవిదో, లక్ష్మీదేవిదో వేయరాదా? కట్టించినవారి కీ వ్యామోహ మెందుకు? గ్రీసు దేశపువిద్యాధిదేవతలు మననాటకములు, చిత్రకళలను పాలించవల యును గాఁబోలు. ఇంక నట్లే జరుగునులే.

సూర్యపతికి దోషము తెలిసెను. ఇన్నాళ్ళ మెచ్చుదల యొక్క నిముసములో నదృశ్య మయ్యెను. 'అవునయ్యా! వారికిఁ దోఁచదు. నీవు పోయి వారితోఁ జెప్పరాదూ' అనెను. 'మూర్ఖులకుఁ జెప్పుటకు మూర్ఖులే కావలయును. నీవు వెళ్ళుము' అని రాఘరావనెను. ముగ్గురు నవ్విరి. అంతలో హార్మనీ మ్రోఁగుట, తెరయెత్తుటయు జరిగెను.

సూర్య—అదుగోనయ్యా! దుష్యంతుఁడు వచ్చుచున్నాఁడు. చూడుము, చూడుము. ఆహాహా! ఏమి పాడునయ్యా! జనము దిగ్భ్రాంత మయిపోవును.

దుష్యంతుఁడు వచ్చెను. జనులు కరతాళధ్వనులుచేసి మెచ్చుకొనిరి. ఆయన రంగమునుండియే శరీరోర్ధ్వకాయము వంచి దొరవలె గౌరవము ప్రకటించెను. తరువాత 'గ్రీవాభంగాభిరామం' పాడెను. మఱలఁ దెలుఁగుపద్యము పాడెను. అట్టలతోఁగట్టిన రథము, గుఱ్ఱములు, దానివెనుక దుష్యంత పాత్రధారి. పద్యము లతఁ డందఱకు వినఁబడుటకు రంగముముందునకు వచ్చి చదువును. దుష్యంతుని యందు శరీరలాఘవముగాని ముఖవిన్యాసముగాని యేమియు లేదు. మృగయానుగుణమైన దుస్తులు లేవు. అంత వెలగలదుస్తు లెందుకు? తరువాత శకుంతల గనఁబడినపుడు అసంస్కృతమైనబుద్ధిగలవాఁడు నీచనాయికాదర్శనమునఁ దొంగితొంగి చూచినట్లు, కన్నుకొట్టినట్లు నటింప నారంభించెను. సభికులు దానిని మెచ్చిమెచ్చి కరతాళములు మ్రోగించుచు వచ్చిరి.

సూర్యపతి 'యెట్లున్న'దని తఱచితఱచి ధర్మారావు నడిగెను. శంఖములోఁబోసినఁగాని తీర్థము కాదన్నట్లు ధర్మారావు మెచ్చి

నఁగాని యతనికిఁ దృష్టిలేదు. ధర్మారావు 'కానీ! చెప్పెదను' అనెను. ద్వితీయాంకము ప్రారంభించెను. నాయకుఁడు, నర్మసఖుఁడు ప్రవేశించిరి. వెనుక తెరమీఁద యూరవుఁగాని పల్లెటూరుచర్చి చిత్రింపఁబడియుండెను. ధర్మారావు 'చూడవయ్యా! ఆ వెనుక తెర. అదిగో మునిపల్లె. అదే కణ్వమహామునియాశ్రమము' అనెను. నలుగురు పకాలున నవ్విరి. చుట్టుననున్నవారికి వీరు మొదటినుండియు నల్లరియే చేయుచున్నట్లు తోఁచెను. కాని చాలమంది సూర్యపతి ధనవంతుఁడని యెఱుఁగుదురు. కొందఱు ధర్మారావు కవీశ్వరుఁడని, బుద్ధిమంతుఁడని యెఱుఁగుదురు. అందుచే దాఁటిపోయినది. దుష్యంత పాత్రధారి వెకలినవ్వులు, తననాయికనుగూర్చి చెప్పుచు దురర్థము దుర్భావము స్ఫురించునట్లు కనుగీటుటలు, శరీరమువంచుటలు చూచినకొలఁది ధర్మారావునకు మనస్సు కలఁతపొందెను. చివరకు నాయకుఁడు 'చరణమున గ్రుచ్చుకొనెఁ గుశాంకుర మటంచు' నని చదివి తనకు దర్భ కాలిలో గ్రుచ్చుకొన్నట్లు కుంటుట మొదలు పెట్టెను. నాయిక తిరిగిచూచినట్లు తిరిగిచూచెను. పైనున్న పెద్ద ముఖమల్లు అంగీ ప్రక్కనున్న పూలమొక్కపై నైచి యట్లు నాయిక చేసినదని తా నభినయించెను. ధర్మారావు ఛీ! ఛీ! యని బిగ్గరగా ననెను. అది యెంతో యభినయ మనుకొన్న చుట్టుప్రక్కలవారంద అతనివంకనే చూచిరి.

సూర్య—అంత బాగున్నచో నట్లందు వేమి?

ధర్మా—మీరందఱు తెలివిమాలినవారైన నది బాగుండదా?

సూర్య—మఱి దోష మేమిటో చెప్పుము.

ధర్మా—ఇప్పుడు చెప్పునది కాదు, మన మింటికిఁబోయిన తరువాతఁ జెప్పెదను. ఇది చెప్పవలయునన్నఁ జాలసేపు పట్టును.

తరువాత ధర్మారావు వెడలిపోయి హాలుబయటఁ దిరుగుచుండెను.

సూర్య—రాఘవరావు! నీకును బాగుండలేదుటోయి?

రాఘ—నేను ధర్మారావు చూచినట్లు చూడను. నేను వీనిని గుఱించి విచారించను. నాకు బాగులేదు, ఓగులేదు.

రాత్రి యింటికిఁ దిరిగిపోవుచు సూర్యపతి సగముఁచచ్చిన యుత్సాహముతో ధర్మారావువద్దకుఁ బోయి 'ఏమయ్యా! ఏమియు బాగుగాలేదా' యనెను.

ధర్మా—బా గేమిటి? వాండ్రు విచారించినవారు కాదాయెను. తెలిసినవారు కాదాయెను. పెద్దల నడిగి తెలిసికొనినవారు కాదాయెను. చూడు! అభినయము నృత్యము, నృత్తము, నాట్యము నని మూఁడురకములు. శబ్దముయొక్క యర్థమునభినయించుట నృత్యము. ఇది వీధినాటకమువారు చేయుదురు. గానములేకుండఁ జేయునట్టి నృత్యము నృత్తము. ఇది వారాంగన లప్పుడపుడు చేయునది. నాట్యమనఁగాఁ బద్యభావము నభినయించునది. ఈ నాటకములలోఁ జేయఁదగినది యది. ఆ పద్యము చదువుచు దానిభావము సామాజికుల కర్థమగునట్లు నటించవలయును. ఇప్పు డొక పద్య మున్నది. అది శకుంతలయొక్క యొక శృంగారభావవిశేషలీలను జెప్పుచున్నది. ఆ లీల వలన దుష్యంతుఁ డామెకు దనయందుఁ బ్రేమయున్న దని యనుకొనెను. ఆ శకుంతలచేసిన తిరిగిచూచుట సామాజికులు వెనుకటి యంకమునఁ జూచిన దే. నర్మసఖునితో నది నచ్చఁజెప్పుటకు దుష్యంతుని నేత్రములయందు నతనికి విశ్వాసముపుట్టించఁగలట్టి తీక్ష్ణదృష్టి ప్రేమజ్యోతి వెలుఁగవలయునుగాని, దానివలె నాడినచో నది కలుగునా? అదియుఁగాక వేఁటకువచ్చిన దుష్యంతునకు గాడిద మోయునంత యాబరు వెందుకు? వేఁటకు వెళ్ళునపుడు పైని మైసూరు మహారాజుగారివలె పెద్ద ప్రేలాడుకోటు వేసికొందురా యేమి? అభినయము నాల్గువిధములు. అందులో మొదటి దాహార్యకము. ఆహార్యక మనఁగా బాత్ర కనుగుణమైన వేషమును ధరించుట. దుష్యంతుఁ డెట్టివాఁడు అని విచారణచేయుము. రాజర్షి, నిత్యాగ్నిహోత్రి. ధర్మమైన యూహతప్ప నతనికి వేఱే యూహయే రాదు. మహాయోధుఁడు. ఇంద్రునకు రాక్షసులజయించువేళ నుపయోగపడినవాఁడు. అట్టిక్షత్రియమూర్తి యెట్లుండునో మన మూహించనే లేము. దుష్కాల మా రోజులకు మనకు నంతరితమై మన కా పూర్వరాజర్షులమూర్తి గోచరింపించుట లేదు. శిల్పమునం దాకృతి నిర్మాణమునకు రెం డాధారములు. ఒకటిసంప్రదాయము; అది లేనప్పు

దూహ. సంప్రదాయము చచ్చిపోయినది. ఊహచేత దుష్యంతుని వేషమును భావించుము. మహాభాగుడు గాన నిత్యవ్యాయామముచేత గట్టిపడినయొడలుగలవాడు. అది యే పాత్రధారికిని లేదు. నిత్యాగ్నిహోత్రి, ధర్మిగనుక మొగమున బ్రహ్మవర్చస్సు తాండవించును. చెవులకు గుండలము లుండవచ్చును. కర్మిష్ఠి కనుక నుత్తరీయము లేకుండ నుండడు. నున రాజవేషధారులందఱు నుత్తరీయముప్రసక్తియే చేయరు. వారికి రాజవేషమనగా నేటిమహారాజుల బొమ్మలవలెనుండుటయే యని. మనపాఠశాలలో నింగ్లీషు నాటకములు సాంవత్సరికోత్సవములకు బ్రదర్శింతురు. అపుడు వేషములు యూరపు దుస్తులు ధరించుటకు, వారికివలెనే యుండుటకు నెంత ప్రయత్నింతురు? కళాశాలలో విద్యార్థులా నాటకములు వేయుట కంత శ్రద్ధవహించినపుడు కళాసంస్థలయిన యీ సమాజములవారి కా మాత్రముశ్రద్ధ లేనందు కనుకొనవలయును. ఎంతవఱకు వెలగల దుస్తులు, రంగురంగుల తెరలు, సామాన్యజనులహృదయాకర్షకములయిన నీచభావప్రకటనలు—వీనితోడనే కాలక్షేపము జరుగుచున్నది గాని కళాసరస్వతిని జక్కగా నుపాసించవలయునన్న భావము లేదు. లోకము సర్వము నష్టే యున్నది.

సూర్య—నీవు చదువుకొని వీనిని గుఱించి యాలోచించినావు గావున నీకు వీనినిండ దప్పులు కనబడుచున్నవి. తక్కినవారి కానందముగానే యున్నదికదా!

ధర్మా—నీవు మనిసివై పుట్టితివిగాన మనస్సున నాలోచన చేసి నీతియు ననీతియు, ధర్మము నధర్మము వివేచనచేసి ధర్మాచరణము చేయుచున్నావు. మనస్సులేని పశ్వాదులు చేయుట లేదు. వాని కా స్థితి సుఖముగానే యున్న దందువా?

అందఱు నింటికిబోయి నిద్రించిరి. మఱునాడు ప్రొద్దెక్కి లేచిరి. సూర్యపతికి నాటకముమీదనున్న వ్యామోహము నశించినది. ఆ నాడంతయు బెజవాడలోననే కడపిరి. ధర్మారావునకు గొండ యెక్కుటయే పని. కొండ యెక్కుదమని తక్కినవారి ప్రాణములు తీయును. వారు నతనిపోరుపడలేక పోదురు. మఱునాడు రాఘవరావు ధర్మారావులు గుంటూరికిని, కిరీటి బందరునకును వెళ్ళిరి. ఇంతలో

వేసఁగిసెలవులు వచ్చెను. తేపు సుబ్బన్నపేఁటకుఁ బోవును. ఆ రాత్రి మనస్సంతయు నరుంధతివైపునకే మఱలినది. ఆ కార్యమయిన యీఱురాత్రులే, మఱల నామెను జూడలేదు. ఆమెనుజూచి యేడు నెలలయినది. రాణిగారు ప్రతినెలయు నేఁబదిరూపాయలు పంపించు చుండెను. తల్లికిఁ బది పంపించి, తాను నలుఁబదిరూపాయలతోఁ గడుపుకొనుచుండెను. సెలవులకుఁగూడ నింటికిఁ బోలేదు. ఏ ధ్యాస పడినదదే రమ్మని తల్లి పదియుత్తరములు వ్రాయించెను. ఇతఁడు సమాధానముకూడ వ్రాయలేదు. పిల్లను తీసికొనిపోయి, గుంటూరులోఁ గాఁపురము పెట్టుమని తల్లి వ్రాయించెను. అతఁడు దేనికిని బతిలేదు. మఱల నరుంధతి వచ్చును. ఈ యేడునెలలలో నామె మాఱియుండును. మునుపటికన్న నెదిగియుండును. నాల్గురాత్రుల యా దివ్యసౌఖ్య మతనియాత్మలో నిశ్చలమై పాఁతుకొనిపోయి తుపానులకుఁగూడఁ గదలని దీపస్తంభమువలె జీవితయాత్రలో నొక పెద్దగుర్తుగా నుండెను. ఎప్పుడు సుబ్బన్నపేఁట పోవుట, యెప్పుడామెను గలిసికొనుట. ఆమె తనమధ్య నేలదూరమేకాని యింకొకటను లేదు. తనకో త్రెక్కులు లేవు, తెల్లవాఱినఁగాని రైలులేదు. తెల్లవాఱి నాలుగుగంటలకు రైలు. మొన్న బెజవాడపోయినపు డట్లింటికైన వెళ్ళివచ్చినాఁడు కాదు. బెజవాడలో మోటారెక్కెను. తనతోబాటు ముప్పదియేండ్ల రాజుగా రొకరు, భార్యయు, నొక కుమారుఁడును మోటారులోఁ గూర్చుండిరి. ధర్మారావు వారిని జూచెనుగాని యరుంధతిలగ్నబుద్ధియై వారినిగూర్చి విచారించలేదు. కొంతదూరముపోయినతరువాత రాజుగారు ధర్మారావును 'మీ దేమూరండి' యని పలుకరించెను. ధర్మారావు 'సుబ్బన్నపేఁట' యనెను. ఆయన 'సుబ్బన్నపేఁటా' యని, 'ధర్మారావు నెఱుఁగుదురా' యనెను. ధర్మారా వాశ్చర్యపోయెను. తన నాయన యెఱుఁగఁడు, తన్నుగూర్చి యట్లు మాటాడు నేమి? ధర్మారావు 'మీ రాయన నెఱుఁగుదురా' యనెను. ఆయన 'ఎఱుఁగుదును, అతఁడు మా తమ్ముఁడేనండి. కాని నే నతని జాలచిన్నపుడు చూచితిని. ఇప్పుడు గుర్తుపట్టలే నేమో' యనెను. ధర్మారావునకుఁ దెలిసినది. ధర్మారావు నవ్వెను. రామచంద్రిరాజు గ్రహించెను. 'నీవేనా

ధర్మారావువు. నేను గుర్తుపట్టలేకపోతినిసుమా! నీ వింతవాఁడవు. నేను నిన్నెత్తుకొని తిరిగెడివాఁడను. 'అన్నా! అన్నా' యని నీవు నావెంటనే పడి తిరిగెడివాఁడవు. నీవు పెద్దవాఁడవయినావని యమ్మగారు వ్రాయుచునే యున్నది. కాని యిట్లుందువని యనుకొనలేదు సుమా!' యని రాజతనిని కౌఁగిలించుకొని, 'అన్నా! నిన్నెన్నాళ్ళకుఁ జూచితిని! నాయనగారి మృతివేళకు రాలేకపోయితిని. కర్మ నేను విడిగాఁ జేసినాను. ధర్మశాస్త్రము మెవరును జెప్పలేదు. తరువాత నేనే స్మృతులు చదివితిని. నాయనగారి యాబ్దికము పదిరోజులున్నది కదా' యనెను. ధర్మారావునకు విచిత్రమయ్యెను. తలవనితలంపుగా నతని గలసికొనుట - యితఁడు తన్ను మఱచిపోకపోవుటయే కాదు. తన తండ్రిమీఁద నంత యనురాగము, నంత కర్మయందలి విశ్వాసము కలిగియుండుట-యివి చూచి ధర్మారావున కానందమయ్యెను. రామచంద్రరాజతని దనభార్యకుఁ జూపించెను. కుమారుఁ డేడాది వాఁడు. ధర్మారావు కుమారుని నెత్తుకొనెను. పసిపిల్లవాఁడు క్రొత్త లేకుండఁ బినతండ్రివద్దకుఁ బోయెను. రామచంద్రరాజు 'వానికిని దెలియును, నీవు బాబాయి వని. దూరాన నుండిన నేమి? నెత్తురులో నున్నది' అని, 'మొదట నొకపిల్లవాఁడు పుట్టి పోయినాఁడు' అని విచారించెను.

ధర్మారా 'వింత యకస్మాత్తుగా నేల వచ్చుచుండిరి' యని యడిగెను.

రామ—అమ్మగారికిఁ జాల జబ్బుగా నున్న దఁట!

ధర్మా—ఎవరికి? రంగాజమ్మగారికా? పెద్దజబ్బే? ఏమి జబ్బు? నాకు ఉత్తరమైనను వ్రాయలేదే?

రంగారావు గొంతుకలో గద్గదిక చూచి రామచంద్రరాజు తనతల్లియెడల నాతనికిఁగల గౌరవమును, ప్రేమయుఁ దెలిసికొనెను!

రామ—నాకును దెలియదు. మొన్న నుత్తరము వచ్చిన వెంటనే యాలస్యముచేయక బయలుదేఱి వచ్చితిని. ఎట్లున్నదో?

మోటారు చాల నెమ్మదిగా నడచిన ట్లుండెను. ఇంటికిఁ బోయినతరువాత నిద్దఱును రంగాజమ్మగారియింటికే పోయిరి. ఆమె మంచమునందే యుండెను. ప్రక్కను సావిత్రమ్మగారు కూర్చుండి

యున్నది. సావిత్రమ్మగారే వండిపెట్టుట. మంగ వచ్చి పరిచర్యచేయు చున్నది. అందఱు నొక్కసారి హఠాత్తుగాఁ గలసికొనిరి. వారి యానందమునకు మితిలేకపోయెను. శ్రీధర మొక్కఁడే లేనిది. సావిత్రమ్మగారు రామచంద్రరాజును జూచి 'నాయనా! ఎన్నాళ్ళకు వచ్చితివి! ఇప్పటికయినను వచ్చితివి. ఆమె యదృష్టము. ఇంక నెట్లయినను ఫరవాలేదు' అనెను. రంగాజమ్మగారు కొడుకును, గోడలిని, మనుమని జూచి కన్నులలోనికి నీరు తెచ్చుకొని 'నాయనా! నామీఁద దయయున్నది గనుక వచ్చితివి. నీచేతిమీఁదుగాఁ బోవలెనని తపించిపోయినాను' అని మనుమని ప్రక్కలో నుంచుకొని ముద్దాడెను. రంగాజమ్మగారు కోడలికిఁ జిన్నత్తగార్ల నిద్దఱను జూపించెను. ఆమెయు, వారును నేదియో మాటాడుకొనిరి. సావిత్రమ్మగారును, ధర్మారావును స్వగృహమునకుఁ జనిరి. రంగాజమ్మగారు మంగతోఁ 'జెల్లెలా, నీ ఋణము తీర్చుకోలేనమ్మా! ఇంక నీవు పొమ్మ. నాకోడలు వచ్చినదికదా! ఇంక నామె చేయును లెమ్మ' అని ఆమెను బంపించెను. మంగ మనుమనిముద్దాడి యింటికిఁ బోయెను. రామచంద్రిరాజు తల్లిదగ్గఱఁ గూర్చుండి యామెకుఁ బాదసంవాహన చేయుచుండెను. తల్లికొడుకులకిద్దఱకు నెదలనిండ ప్రేమ పొంగారుచుండెను. కన్నులలో నీరు తాండవించుచుండెను. తల్లి కుమారునియొడలు నిమురుచుండెను. ధర్మారావు భోజనము చేయుచు నత్తవారిప్రసంగము తెచ్చెను. తల్లి తాను నాలుఁగైదు సార్లు కబుర్లు పంపించినను వారు పిల్లను బంపించలేదనియు, పిల్లను గాఁపురమునకుఁ బంపించుఁడనిన ప్రత్యుత్తరముకూడఁ జెప్పరనియుఁ జెప్పెను. ధర్మారావు లేచినతరువాత రామచంద్రరాజును జూడఁబోయెను. ఇద్దఱును బ్రొద్దువాటారువఱకును సర్వవిషయములును మాటాడిరి. సుబ్బన్నపేఁటనుగూర్చి సగము వర్తమానము రామచంద్రరాజునకుఁ దెలిసెను. అపుడు ధర్మారావు పనియున్నదని యెచ్చటికో పోయెను. అతఁడు రంగాపురమునకుఁ ద్రోవతీసెను. అత్తవారింటికిఁబోవుసరికి నరుంధతి వాకిలికసవూడ్చుచు మగనిని జూచి లోనికిఁ బోయెను. అతఁ డనుసరించెను.

ధర్మా—ఇంట నెవ్వరును లేరా?

అరుం—'లేరు. ఎచ్చటికో పోయిరి. మాచెల్లెలున్నది' అని కాళ్ళుకడుగుకొనుటకు నీరు తెచ్చియిచ్చెను.

ధర్మారావు పోయి భార్యవద్ద నిలుచుండి యామెచేయి చేతిలోఁ బూనెను. అరుంధతి యేడ్చుచుండెను. అతఁడామె శిరస్సు నెదమీఁద హత్తుకొని 'ఎందుకు ఎందుకు' అనెను. అరుంధతి 'అమ్మ వచ్చునేమో' యనెను. అతఁడు 'రాదులే' యనిచెప్పి, యామెను గాటముగాఁ గౌఁగిటఁబట్టి వదలినాఁడు కాదు. ఆమె కుక్కిరిబిక్కిరైనది.

అరుం—నన్ను దీసికొని వెళ్ళుటకు వచ్చినారా?

ధర్మా—మీవాండ్రు పంపింతురా? మా అమ్మ యెన్ని కబురులు పంపించినను జవాబయినను నిచ్చిరి కాఁదట.

అరుం—వారు పంపించున దేమిటి? మానాన్న యూరిలో లేఁడు. అమ్మ వచ్చును. మీ రామెతోఁ జెప్పుఁడు. కలసిపోదము.

ధర్మారావున కేమియుఁ దోచినదికాదు. ఈ సన్నివేశమేమిటి? లోకమునకు విడ్డూరముగ నుండునేమో! అది తరువాతమాట. ఇద్దఱుకలసి సుబ్బన్నపేటకు నడచిపోయినచో నెట్లుండునో? ప్రొద్దుక్రుంకవచ్చినది. నాగమ్మగారు వచ్చెను. అల్లుఁడు 'భార్యను తీసికొని పోవుటకు వచ్చితి' ననెను. ఆమె కర్థముకాలేదు. ధర్మారావు భార్యను లేచి రమ్మనెను. ఆమె వచ్చెను. ఇద్దఱును గలసి సుబ్బన్నపేటత్రోవఁ బట్టిరి. నాగమ్మ దిగ్భ్రాంతురాలయ్యెను. మరొకసందర్భములో నైనచో నామె యఱచి యూరిలోనివారందఱను బిలిచి పెద్దరభసచేసి యుండును. ఇప్పుడామె కేమిచేయుటకుఁ దోచలేదు. అతఁడట్లు వచ్చుట యేమి? ఆ యడుగుట యేమి? ఆ రమ్మనుట యేమి? ఆ వెళ్ళుట యేమి?

చీఁకటులు సన్నఁగాఁ బ్రవేశించెను. దూరపుమనుష్యు లెవరును గన్పించుట లేదు. సుబ్బన్నపేట పరుగుదూర మున్నది. దాఁడొంక. భార్యాభర్త లిద్దఱును గౌఁగిలించుకొనియే నడచుచుండిరి. అరుంధతియడుగులు నేలమీఁద నానుటయే లేదు. ధర్మారావామెను సగము మోయుచునే యుండెను! ఇద్దఱిలో నెవరును మాటాడుట లేదు. అరుంధతి కేవియు బహిర్విషయజ్ఞానము లేదు. మధ్యమధ్యఁ

బతి తనయధరము నధరముతోఁదాఁకుటమాత్రము తెలియుచున్నది. దారి కిరుప్రక్కలఁ గీచురాళ్ళు కూయుచున్నవి. ఒకరిద్దఱు బాటసారు లెవరో దూరపుటూళ్ళవారు వారినిబరకాయించి చూచిపోవుచు వచ్చిరి. చీఁకటి తమాలతరుకిసాలయమును నూరిదిక్కులకుఁ బట్టు వేసినట్లు చిక్కనై విజృంభించెను. తానుచేసినపని ముందువెనుకలు ధర్మారావు విచారించలేదు. అతనికి రెండే కనఁబడుచున్నవి. ఒకటి ప్రక్కనున్న ప్రియురాలు, రెండు దారి. ఊరకే నడచుచుండెను. అరుంధతివక్షస్స్థలము తనపార్శ్వమునానుకొనెను. ఆమె నిశ్వాసములు తనచెక్కిలిపైని, మెడమీఁదను, బుజముమీఁదను బడుచుండెను. ఆమెచేతులు తనమెడచుట్టు బిగింపఁబడి యుండెను. తనచేతు లామె శరీరమెల్లయెడల నుండెను. నడచుచున్నను దారి దీర్ఘమయ్యెను. ఒకపాము దారి కడ్డముగాఁ బోయెను. అతఁ డాగి దానిని బోనిచ్చి మరల నడచెను. అరుంధతి కా సంగతియే తెలియదు. ధర్మారావు కొడలు తెలియుటలేదు. అదియేమిస్థితిలో నుండెనో యతని కేమియు దెలియలేదు. అది స్తంభమా? కాదే! నడచుచుండెను. దారియన్న జ్ఞాన ముండెను. రోమాంచమా? అదియుఁ గాదు. అప్పు డతఁడున్న స్థితి కలంకారశాస్త్రములోఁ బేరులేదు. ఇంక నరుంధతి మగనిచంకనే యుండెను. అతఁడు నడచుచుండెను. సుబ్బన్నపేఁట దగ్గఱకువచ్చెను. సహజముగా జంతువులకుఁ దమనెలవులందుఁ గల జ్ఞానముతోఁ గనులుమూసికొనిపోయినట్లు ధర్మారావు పోవుచుండెను. ఊరిబయట నెవరో కనఁబడిరి. వా రతనిని బలుకరించలేదు. అతఁ డిల్లు సమీపించెను. వారిద్దఱకు నొడళ్ళు తెలియుటలేదు. అతఁడు లోనికిఁబోయెను. సావిత్రమ్మగారు కొడుకుకోండ్రనిద్దఱ నాస్థితిలోఁజూచి నిలువునఁ గొయ్యబొమ్మ యయ్యెను. తెఱచిననోరు తెఱచినట్లే యుంచి 'హా!' యనెను. ధర్మారావు సావిడిదాఁటి పడమటింటిలోనికిఁ బోఁబోవుచుండెను. అతనితలకు ద్వారబంధము తగిలెను. దెబ్బతగిలి యొడలు తెలిసెను. ఎదురుగాఁ దల్లి నిలుచుండెను. అరుంధతి కన్నులుమూసికొని తనబుజాలమీఁద నుండెను. ధర్మారావు "అమ్మా! కొంచెము నీరు తెమ్మ" అని తొందరపడెను. చల్లని నీ రరుంధతిమొగమునఁ జిలుకఁగా నామెకు స్మృతివచ్చి మగనినివదలి యత్తగారిని జూచి

కొంత తెల్లపోయెను. కొంత సిగ్గుపడెను. మఱల మగనినే హత్తుకొనెను. తల్లి గాబరాపడి "యేమి నాయనా" యనెను. ధర్మారావు "ఏమియు లేదు. నీవు వంట చేయుము" అనెను. ఆమె "వంటయైనది. నీకోస మెదురుచూచుచున్నాను. పిల్ల సొమ్మసిలిన ట్లున్నది. కొంచెము మరుగుచారు తీసెద" నని లోనికిఁబోయెను. ధర్మారావరుంధతిని గదిలోనికిఁ గొనిపోయెను. అచ్చట నెనిమిది నెలలక్రిందఁ దనకార్యమునాఁ డెట్లున్నదో యట్లే యున్నది. తనతల్లి గదియంతయునూడ్చి దులిపి బాగుచేసెను కాఁబోలు. అరుంధతిని బ్రక్కమీఁదఁ బఱుండఁబెట్టి తాను ప్రక్కను గూర్చుండి, యామె యెదురఱొమ్ముమీఁద నానుకొని "ఏమి అట్లుంటివి? మాటాడవా? ఇంటికివచ్చినాము. నీ కొడలు తెలిసినదా?" యని చెవిలోనూఁదెను. ఆమెకొంతసేపటికి 'తెలిసినది' యనెను. అతఁడు పన్నీరుబుడ్డి చూడఁగా నందులో నింకను బన్నీ రున్నది. అది యామె ముగమునఁ జిలుకరించెను. ఆమె వణఁకి లేచి కూర్చుండెను. కన్నులు తుడుచుకొని పతిమెడ మఱలఁ బట్టుకొని యేడ్వనారంభించెను. ధర్మారావు మఱల నోదార్చెను. 'నే నిదిగో! నీ వద్దనేయున్నానుగదా! భయ మెందులకు? ఇంటికి వచ్చినాము. అమ్మ చారు పెట్టుచున్నది. దారిప్రయాణమునకు బడలిపోయితివి. అందుకనియే చాలదూరము నేనే యెత్తుకొని నడచితిని. ఎందు కేడ్చెదవు? నే నిన్నాళ్ళు నిన్నుఁజూడ రాలేదనియా? తప్పు చేసితిని. అరుంధతీ! నీ విటువంటిదాన వని తెలియలేను. లోకసామాన్యముగా నిన్ను గుఱించి యూహించితిని. క్షమించుము' అని, మంటిచే బురదయయిన యామెపాదములు చేతులలోఁబూని శిరసున నుంచుకొనెను. ఆమె కాళులు లాగుకొని యతనిమెడమీఁదఁ బడి వెక్కి వెక్కి మఱల నేడ్వనారంభించెను. అతనికిఁ గారణము తెలియలేదు. అతఁడు మఱలమఱల నామె చుబుకము, చెక్కిలి, నేత్రములు, ఫాలము, బుజములు, వక్షస్సు, నడుము, చేతులు ముద్దుపెట్టుకొనుటయే. ఆమె నోదార్చుట యెట్లో తెలియక యూరకే యుద్వేగముపొందుచుండెను. ఇద్దఱి నంటగట్టఁబడి గాలికి నటునిటు నూఁగిపోవు రెండుతీఁగెలవలెఁ గదలిపోయిరి.

కొంతసేపటికి ధర్మారావునెదలో 'దాను దూరముగా నుండు టొక్కటియే యింతదుఃఖమునకు హేతువు కానేరదు. వేఱే యేదియో హేతు వుండవలె'నని తోఁచినది. 'అది యొక్కసారిగాఁ దెలియ రాదు. క్రమముగాఁ దెలియవలె'నని, 'నాయనా! ఎందుకోయి అంత దుఃఖించెదవు? ఏదో కారణ మున్నదని నాకుఁ దెలియును. గుండె చిక్కఁబట్టుకొనుము. నేను బ్రదికియున్నంతవఱకు నీమీఁద నీఁగ వ్రాలనీయను. చీ! వా రేమి చేయఁగలరు?' అని పునఃపునఃకృత గాఢాలింగనములచేత నామె దేహమును నలిపివేసెను. బిగిసియున్న యామెనరము లా సంవాహనముచేత సడలి, యామెకు గుండెలోని భయము తగ్గి బాధకు 'అబ్బా!' యని కౌఁగిలి వారించి దూర ముగాఁ గూర్చుండెను. ఇంతలోఁ దల్లి భోజనమునకు లెమ్మ నెను. ధర్మారావు భార్యను దొడ్డిలోనికిఁ దీసికొనిపోయెను. ఇద్దఱును వేఁడినీళ్ళ స్నానముచేసిరి. ఇద్దఱు నొక్కసారియే భోజనముచేసిరి. మఱల నిద్దఱును గదిలోనికిఁ బోయి పన్నుండిరి. ధర్మారావు భార్యను మఱలఁ బ్రశ్నించెను. ఆమె చెప్పుటకుఁ గొంకుచున్నట్లుతోఁచెను. అతఁడు 'భయము లేదులే. నేను వారి నేమియు నసను. నిన్నేమియుఁ గోపించను. చెప్పుము' అని వేవిధముల నోదార్చినతరువాత నామె యిట్లు చెప్పెను: 'ఆ నాఁడు నే నిచ్చటినుండి వెళ్ళినంతనే మీా రేమిపెట్టిరి, యేమి చేసి రని యడిగిరి. నేను రాణిగారిచ్చిన చంద్రహారము మీారు చేయించితి రని చూపినాను. వారు నమ్మలేదు. రంగాజమ్మగారిచీర చూపించినాను. వారు మి మ్మూరక వెక్కిరించ మొదలుపెట్టిరి.'

ధర్మా — వా రనఁగా నెవరు? మీానాయనయు, నమ్మయునా?

అరుం — కాదు. మాపినతల్లి, మేనమామకుమారుఁడు, మా అమ్మ. వీరుముగ్గురును మీాకుఁ దినఁదిండిలేదఁట. మీారు నిష్ప్రయోజకులఁట. వెలివారఁట. నానాదుష్టవాక్యము లనిరి. నాకుఁ గోపము వచ్చి నేను వారిని మఱలఁ దిట్టితిని. దానితో వారు 'అబ్బో! నాలుఁగురోజులు సంసారము చేసినందులకే మమ్ము బ్రదుకనిచ్చుచున్నావు కాదు. కాఁపురమునకు వెళ్ళినతరువాత వారిమీాఁద నీఁగ వ్రాలనీయవు కాఁబోలు' ననియు, "అప్పుడే మే మంతచే దయితి

మఱే? చిల్లిగవ్వపెట్టనిమగనిమీఁదనే యింత ప్రేమయయినచోఁ జిన్న
ప్పటినుండి పెంచి పెద్దచేసిన మామీఁద నెంత యుండవలయు"
ననియు దెప్ప నారంభించిరి. నేను 'చిల్లిగవ్వపెట్టకపోవుట యేమి?
పెండ్లినాఁడు మా మామగారు నా నగలక్రింద వేయిరూపాయ
లిచ్చిరఁటకదా! ఆ మాట మీరు నాతో నొకసారియైనఁ జెప్పక
యపహరింపఁజూచుచున్నారా' యంటిని. మా అమ్మ 'వేయిరూపా
యలే? ఆ మొగాలకుఁదోడు వేయిరూపాయలే! ఎక్కడనుంచి తెచ్చి
యిచ్చినారే? 'మింగ మెతుకు లేదు, మీసాలకు సంపెంగనూనె'
యఁట. నీ కేదో మందు పెట్టినారే! లేకపోయిన నాల్గురోజులలో నింత
వారిపక్షమవలంబింతువా?' యని నన్నును, మిమ్మును రాల్చిపో
సెను. తరువాత నింతలో వారు మువ్వురునుగలిసి యేదో గుసగుస
లాడుకొనుచుండుటయు నేనుపోయినంతనే మానివేయుటయు నిట్లు
జరుగుచువచ్చెను. నన్ను నానాబాధలు పెట్టుచుండిరి. ఒకనాఁడు
మా నాన్నను నగలమాట యడిగితిని ఆయన యేమియు మాటాడ
లేదు. నాకుఁ గోపమువచ్చి 'ఏమయ్యా! నా సొమ్ము తినదలఁచు
కొన్నావా యేమి? ఇన్నాళ్ళుగా నాకు నాడబ్బున్నదనియైనఁ దెలి
నిచ్చితివి గాదు' అనినిందించితిని. ఆయన కోపపడి 'నే నెఱుఁగనుపో,
మీ యమ్మ నడుగు' మనెను. నా కేమిచేయుటకును దోఁచినది
కాదు. నా కేడుపు వచ్చినది. న న్నోదార్చినవా రెవరును గనిపించ
లేదు. చివరకు నేనే యేడుపుమాని యన్నమునకుఁ బోయితిని.
అన్నము సరిగాఁ బెట్టలేదు. నేయి విదల్చుట, చేసికొన్నకూరలు
వేయకుండుట-యట్లు మొదలుపెట్టిరి. మీకుఁ గబురంపవలె నను
కొంటిని. ఎవరిద్వారా చేయను? ఒకనాఁడు స్నానముచేయుచుఁ జంద్ర
హారముతీసి గదిలోనుంచితిని. స్నానముచేసి వచ్చునప్పటికి హారము
కనిపించలేదు. ఎవరి నడిగినను 'మాకుఁ దెలియ దన్నచో మాకుఁ
దెలియ' దన్నారు. రాత్రికి మా తండ్రిరాఁగా నాయనతోఁ జెప్పితిని.
ఆయన 'యెవరు తీసి' రని యడిగెను. అందఱు 'మాకుఁ దెలియ
దన్న మాకుఁ దెలియ' దనిరి. ఆయన యేమో వస్తువే పోనట్లూర
కుండెను. ఆ వెనుక మా చెల్లెలిజడకుప్పె లెవరో యెత్తుకొనిపోయిరి.
అవి నాల్గురూపాయల ఖరీదుచేయవు. దానికై యిల్లంతయు నాఁ

గోలు, బాలగోలు నయినది. వేయిరూపాయల ఈ సొమ్ము పోయినచో నెవరికిని బోయినట్లే లేదే యని నాకు విచారమువేసెను. క్రమముగా నా యింట నేను నిరాధార నయినట్లు తోఁచినది. ఒకరోజున మా మేనమామకుమారుఁడు...... అరుంధతి పెదవికొఱుకుకొని చెప్పుట మానెను. ధర్మారావు "చెప్పుము, చెప్పుము; నే నేదో అటువంటిదికూడ జరిగెనని యనుమానపడుచున్నానులే; దాఁచుట యెందుకు?" అని యుద్ఘాటన చేసెను.

అరుం—నాతో మోటసరాగమాడెను. నాకును వానికిని బడుటలేదు. అందులో 'గోరుచుట్టుపై రోఁకటిపోఁ టన్న' ట్టిది వచ్చెను.

ధర్మారావు— 'ఏమిచేసినాడో చెప్పుము' అని బలవంత పెట్టెను. ఆమె యేమో చెప్పుటయు. ధర్మారా వుగ్రుఁ డగుటయు సంభవించెను.

అరుం—అతనిని గరిటెకాడ పెట్టి పొడిచితిని. అది డొక్కలోఁ గ్రుచ్చుకొని గాయమయ్యెను. ఆ నాఁడు న న్నిల్లంతయు రాల్చి పోసిరి. తల్లియే విరోధముకాఁగా నింకఁ జెప్పునది యేమి? నాపని యీయింట నీచమైపోయినది. నే నిచ్చటికి రా నెన్నిసారు లూహించినను తీసికొనివచ్చువారు లేకపోయిరి. పైఁగా మీ రీ యూరిలో లేరాయెను. నాకొకటి తోఁచినది - పెట్టెలన్నియు వెదకి చంద్రహార మెచ్చటనున్నదో కనుగొనవలయునని. ఒకరోజున నందఱును నిద్రపోవుచుండఁగా వారియందఱిపెట్టెలు వెదకితిని. మా పినతల్లి పెట్టెయడుగున నున్నది. అది తీసికొని పెట్టె సరిగా సర్దితిని. చంద్రహార మేమి చేయవలయునో తోఁచినది కాదు. నాదగ్గఱనున్న వారు మఱల నెట్లును గాఁజేయక మానరు. ఏమిచేయవలయునా యని యూహించి, యొకపొట్లముకట్టి, మా నాయన యగ్నిహోత్రము చేయు బూడిదరాశిక్రింద నుంచితిని. మఱునాఁడు లేచి యది రహస్యముగాఁ దీసి, రాజ్యలక్ష్మమ్మగారింటికిఁ బోయి యీ సంగతులన్నియుఁ జెప్పి యది యామెవద్ద దాఁచనుంచితిని. మా మేనమామకు నాస్తి యేమియు లేదు. పలనాఁటి పురోహితుఁడు. కొన్నాళ్ళు పోయి నరసారావుపేటలోఁ బూఁటకూళ్ళు పెట్టెనఁట. తరువాత

నచ్చుట గిట్టక మఱల నిల్లు చేరెను. మాయింటనున్న సర్వము మాయమ్మ యమ్మ పుట్టినింటికిఁ జేర్చుచున్నది. ఊరిలోనున్న శూద్రస్త్రీలకు నింటిలోనికిఁ దెచ్చిన పెసలు, కందులు, బియ్యము సగానికి సగము తక్కువధరల కమ్మి మేనల్లుని కిచ్చి పంపించును. ఈ రీతిగాఁ గొంప గుల్లచేయుచున్నది. తరువాతఁ జంద్రహారము పోయిన దని వారు తెలిసికొని నన్నడిగిరి. 'ఏమమ్మా! చంద్రహారము నాదాయెను. మీరు తీయలేదనిరి కదా! అది మీ దగ్గఱనుంచి యెట్లు పోయినది?' అని నే ననఁగా మాయమ్మ 'ఎంత ఱాఁగవే! ఎంతకొంపలు ముంచుదానవే' యని నన్ను మీఁదఁబడి కొట్టినది. ఆమె యేమి? ముగ్గురును మీఁదఁబడి కొట్టిరి. మా నాన్న చూచుచు నూరకొన్నాఁడుగాని పెదవివిప్పలేదు. నేను రాజ్యలక్ష్మమ్మగారింటికిఁ బోయి రెన్నాళ్లు గడపి మఱల నింటికి వచ్చితిని. నగలడబ్బు వారిచ్చునట్లు లేదు.

ధర్మారావున కరుంధతి సగముచెప్పి మానివేసినట్లున్నది.

ధర్మా—అదేమి యట్లు మానివేసితివి? కథయంతయుఁగాలేదే?

అరుఁ—ఏమియు లేదు. వారు నాకు విషముపెట్టి చంపవలయునని యూహచేయుచున్నారఁట.

ధర్మా—మీ యమ్మకూడ నందులో నున్నదా?

అరుం—అమ్మ లేదు. మా మేనమామకొడుకును మాపినతల్లి పంపించినదఁట, విషము తెమ్మని. నాకు మాయూరిలో మంగలి రత్తి చెప్పినది. దానిమగఁ డూరిలో వైద్యముచేయుచుండును. దానిదగ్గఱకు వెళ్ళి యడిగినాఁడట.

ధర్మా—మీపినతల్లియు, మేనమామకొడుకును నిపు డెచట నున్నారు?

అరుం—వారియూరు పోయిరి. ఇంక నాలుఁగైదు రోజులలో వత్తురు.

ధర్మా—వచ్చి నీవు కనఁబడక యేడ్చెదరు కాఁబోలును. నీకు విషముపెట్టి యేమి తీసికొందు మని? నీవద్ద నే మున్నది?

అరుం—నన్ను బెదరించి హారము తీసికొందుమని కాఁబోలు!

ధర్మా—అది కాదు. నా కిప్పు డంతయు దెలిసినది. నీకుఁ బెట్టుదమనుకొనినది విషము కాదు, మందు. అది నీవు వారి మాట వినుటకుఁ బెట్టు మందు. ఇటువంటి మందులు, మ్రాఁకులు కల వందురు. ఎటులయిన నేమి? ఇంక నీ వచ్చటికిఁ బోవునదియు లేదు, వారు నీకు మందు పెట్టునదియు లేదు. ఎందుకుఁగాదుఁగాని, నాకు లోకమున నిట్టి తలిదండ్రు లున్నందు కాశ్చర్యముగా నున్నది. రాక్షసులనిన నెచ్చటనో యుందురా? వీరే రాక్షసులు. మనుష్యుల లోననే రక్షోగుణములు కలిగినవారే రాక్షసులు? ఆహా! ఏమి తలి దండ్రులు! తలిదండ్రు లిట్లుచేసిరని చెప్పిన నమ్మునట్లైన వీలులే కుండ నున్నది. సరేకాని చంద్రహారము రాజ్యలక్ష్మమ్మగారివద్దనే యున్నదా, యింతవఱకు? మఱలఁ దెచ్చితినా?

అరుం—ఆమెయొద్దనే యున్నది. మీరు తేపు పోయి తేవచ్చును.

మన్మథుఁడు, పూవింటిజోదు గదివాల్గుమూలలఁ బరవళ్ళు త్రొక్కెను. ఏ నాఁడో శివుఁడు తపస్సుచేయువేళ నా యాశ్రమమున నొదిఁగి ప్రత్యాలీఢపాదుఁడై అసిపదితజ్యావల్లిఁ గర్ణగతముఁ జేసిన వాఁడు నేఁటికి విచ్చలవిడిగా సంచరించఁజొచ్చెను. హృదయము లొక్కటైన సతీపతులే యుండవలయును. గాని వారికిఁ గష్టకథ లభ్యంతరములు లేవు. వారి శృంగారరసమునకు కష్టములుకూడ నుద్దీపనవిభావములే యగును. ఎనిమిదినెలల ప్రణయగాథ మఱలఁ ద్రవ్వి పోసికొనిరి. వారిద్దఱకు నిన్ననే కలసికొన్నట్లున్నది. ఇంతటి దీర్ఘ ప్రవాసము నప్రవాసత నందెను. సంయోగసౌఖ్యము చిత్రమైనది. తత్పూర్వకష్టము లన్నింటికి నది చికిత్సాలేపము. ఒక్కవ్యక్తికేమిటి? ఒకజాతి పదివేలేండ్లు పారతంత్ర్యబాధ ననుభవించవచ్చును. మఱల శత్రుజయము ఘటిల్లిననాఁడు దానికి వేయేండ్లకష్టములు తృణప్రాయములై పోవును. లోక మాదరించుటయు నంతియే ఆ నిన్నటి దినమువఱకు నప్రయోజకమైన యాజాతి స్వర్గస్థానమున నుంచి ప్రపంచకమంతయుఁ బూజించును. ఇది వ్యక్తియందును సరిపోవును. లక్షణ శాస్త్రములు మనస్సును సరిగా రూపించలేవు. ధర్మారావున కానాఁ డరుంధతి వట్టిస్త్రీవలె గోచరించలేదు. పూర్వజన్మమునఁ దాను

జేసినసుకృతము మనోజ్ఞాకృతిఁ దాల్చి పంటచేనివలె తనవైపున కొరిగెను. వేలయేండ్లు తపస్సు చేసినది భగీరథుఁడు—మందాకినివచ్చి తాండవించినది తనశిరస్సున—శివునకీ యదృష్టము హఠాత్సంభవము. అదృష్టము త్రోసికొనివచ్చుమార్గములే యట్లుండెను. ధర్మారావునకుఁ దన కరుంధతీప్రాప్తి యట్లు తోఁచినది. ఉన్నట్లుగానుండి యతఁడు రెండుచేతులతో నరుంధతిని లేవనెత్తి తలమీఁదఁబెట్టుకొనెను. ఆమె పకాలున నవ్వినది. ధర్మారావుగంగానదితనవీచీహస్తములతోఁ గొట్టుకొని ధ్వనిచేసిన ట్లున్న దనుకొనెను.

అరుం—ఇంత ప్రేమకలవారు సంవత్సరము విడిచి యెట్లుండిరి?

ధర్మారా 'వి ట్లుంటి' నని కన్నులు మూసికొనెను. ప్రతి నిమేషము వారియాత్మలలో దేవతలు తాండవించిరి. వేదబుక్కులు వారి క్రీడలలో నర్థవంతము లయ్యెను. కులదేవతలు వారిలీలాపాంగములయందు భావ్యాశలు త్రివ్వుకొనిరి. పితృదేవతలకు వారిశృంగారలీలలందుఁ దర్పణము లందినవి. ధర్మారావున కామె తనువే, తద్విలాసమే, తన్నైగనిగ్యమే, తదంచలరేఖామార్దవమే చక్షుర్విషయము. ఆమె పేదమాటలు, పిన్ననవ్వులు శ్రోత్రవిషయము. తదధరము, తదురఃప్రసారితాగ్రము చుంబనవిషయము. లిప్తలు, నిమేషములు, గడియలు, యామములు మృగయుబాణపాతభయత్రస్యద్ధావదటవీమృగములవడువున నూడనిబాడెను. ఎదుగుచున్న సస్యమున కాకాశ మెడమిచ్చినట్లు పతిచేతి కామె సన్ననినడు మెడమిచ్చెను. ప్రవహించుచున్న నదీజలమయయాకృతికి సైకతము సిక్తమై, యావరించిన జలమూర్తిగతప్రాణికోటి పరితృప్తిపొందినట్లే యావరింపఁబడి తాను గూడ తృప్తియే పొందును. సృష్టి విచిత్రమైనది. ఆక్రమణలో నెంత తృప్తియున్నదో యొదుఁగుటలో నంత తృప్తియున్నది. ఒకటి పురుషుఁడు; ఒకటి ప్రకృతి. జ్యోత్స్నాంధకారములవలె, సూర్యచంద్రులవలె, భూమ్యాకాశములవలె నొకదాని కొకటి పరిపోషకము. రెండు నొకటే. దాని రెండుసగములు ఒకటే. దాని రెండు సగములన్న జ్ఞానము దీపించినచోటు తదైక్యభావపరిస్ఫుటసూచకమై బ్రహ్మానందము తాండవించినచోటు. ఈ మహాభావముచేతఁ బ్రకా

శింపలేని తారాశశాంకవిజయము, బిల్హణీయము మొదలయిన మహా కథలు పచ్చిబూతులై యీ నాఁటికి హేయము లగును. వీని యన్నింటికి శిరోరత్నము రాధాకృష్ణసంయోగము. ప్రతినీచసంయోగమున నీ తత్త్వ మున్నదని మిథ్యాయోగులు వాదించవచ్చును. అట్లు వాదించుట చెఱువునకు సముద్రమునకు భేదములేదని వాదించుట. అనంతగ్రీష్మములు కెండనిది, నానామహాజంతునివాసభూమియైనది, నానాద్రవ్యగుణమయమైనది యనంతజలమూర్తికే సాగరత్వసిద్ధి. కించిదూనములకు గావచ్చును. అందుకనియే యరుంధతీధర్మారావులసంయోగము బ్రహ్మానందసబ్రహ్మచారి యయ్యెను.

యుగయుగమ్ములు సృష్టిలీలావిలాసమున నలసి ప్రళయవేళ క్షీరపాథోధివీచీమధ్య శేషతల్పమున మాయాసహితుఁడయిన నారాయణుఁడు శయనించినట్లు ధర్మారా వరుంధతిని బాదములతోఁ, చేతులతోఁ, దనసర్వశరీరముతోఁ గప్పి తెల్లని యా పానుపుపై సుఖనిద్ర పొందెను. చల్లనివాయువులు వీచెను. మల్లికాప్రసూనకింజల్కసితగరున్మూర్తులు, మధుకరకుమారులు, ద్రాక్షాప్రతతిఃపతితహిమానీబిందుపరిషిక్తదేహులు బొంగురుపోయిన గొంతులతో సోమెక్కి కదలనే లేకపోయెను. తెల్లవాఱెను. తెల్లవాఱుచున్నదనఁగా వృక్షాగ్రములనుండి లోకముకన్న ముందుగాఁ బ్రత్యూషరథము కదలికలు చూచిన ద్విజకులము కూసెను. పైడిగంటలు తపతపమని ఱెక్కలు కొట్టి కిచకిచమని కూసి జంటలై కదలి సౌఖశాయనికు లయ్యెను. తూర్పుకొండ నునుపైన చఱియలమీఁదఁ గాలిగిట్టలుజాఱి సూర్యహయములు పరువెత్తలేనిచో ననూరుఁడు కొరడాచివళ్ళు ప్రోఁగించి యదలించి తోలెనుగాఁబోలు, వానిమొట్టలఁగట్టిననురుసుల ట్లుషఃకాంతి యుండలుండలుగాఁ దూర్పుసీమ చిందిపోయెను. జంటగా వెడలివచ్చిన కొడుకుకోడండ్రను సావిత్రమ్మగారు చూచి తనకబ్బినభాగ్యము రామేశ్వరశాస్త్రిగారికి తే దనుకొన్నది. ఎంత యైశ్వర్య మనుభవించి యేమి? ఎంతకీర్తి పొందియేమి? ఎంత భోగశాలియైయేమి? అట్టి కొడుకుకోడండ్రఁ గనులారఁజూచినదే జన్మము! కొంచెము పొద్దెక్కినతరువాత రామచంద్రరాజు తమ్మునికై వచ్చెను. ధర్మారావు వీధిలోనికి రాజుతోఁ గలసిపోయెను. ఊరిలో నందఱు

రామచంద్రరాజును గ్రొత్తగాఁ జూచిరి. కొందఱు వయసుమీఱిన వా రాయన నెఱుఁగుదురు. రామచంద్రరాజు తన కిఱువదియేండ్లప్పుడు తుని పాఱిపోయెను. తునిదగ్గఱ నొకపల్లెటూరిలో నొక ధనవంతుఁడయిన రాజుగా రాయనను జూచి యతని తెలివితేటలు గ్రహించి యతనిని దనవద్ద నుంచుకొనెను. ఆయూరిలో నితఁ డన్న నందఱికిని బ్రేమగా నుండెడిది. రామచంద్రరాజు తండ్రివద్దఁ గొంత ధనుర్విద్య నేర్చినవాఁడు. కఱ్ఱసాము, కత్తిసాముకూడఁ గొంత నేర్చెను. కాని యా విద్య లతనికిఁ బూర్తిగా నంటలేదు ఇంతలో నతనికిఁ దన వర్ణస్థు లున్నచోటున నైనచోఁ దనకుఁ బైకివచ్చుటకు వీలుండునని తోఁచి యచటికిఁ బోయెను. వారును నతనిధనుర్విద్యాదులకు మెచ్చుకొని గౌరవించిరి. అతనితో భోజనము కలసిచేయుదురు. అతనిని సర్వవ్యవహారములందును స్వవర్ణస్థునివలెనే చూతురు. కాని యెవరును పిల్లనీయరు. అతనికి సుబ్బన్నపేటలో నాస్తియున్నదనియుఁ దెలియును. ఇట్టిస్థితిలో నొక వృద్ధక్షత్రియుఁడు సంస్కృతము, ధర్మశాస్త్రములు చదివినవాఁడు తనకుమారులిద్దఱును జనిపోఁగాఁ బెద్దవాని కూఁతురు పదునేనేండ్లపిల్లకుఁ బేదతనముచే సంబంధము కుదురక బాధపడుచు నితనిని జేరఁదీసి పిల్లనిచ్చి పెండ్లిచేసెను. పెండ్లియయిననాఁటినుండియు రామచంద్రరాజున కైశ్వర్యమెత్తుకొనెను. ఆమె పేరు రథంతరి. అతనికి భార్యవలన నొక చిన్నయిల్లు వచ్చెను. తరువాత రామచంద్రరాజు ధాన్యవర్తకము సాఁగించెను. మొదటి యేఁడాదిలో నతనికి నాల్గువేలు లాభించెను. ధాన్య మా వెనుకటి యేఁటఁ బుట్టి ముప్పదిరూపాయ లమ్మి మఱుసంవత్సరమే యెనుఁబది యమ్మెను! ఆ మఱుసంవత్సరము పసుపు నిలువచేసెను. దాని మీఁద రెండువేలు లాభము తీసెను. తరువాత వడ్డీలకుఁ దనడబ్బు నొసఁగి యది పెంచెను. ఇదిగాక వ్రాయను, జదువను నేర్చినవాఁడగుటచే నా యూరిలో వ్యవహారములన్నియు నితఁడే చేయుచుండెను. అట్లు మఱికొంత సంపాదించెను. తనకు మొదటఁ బిల్ల నీయనన్న వారిమీఁదఁ గోపముగలిగి వారిని సాధించవలయు నని పుట్టెను. తన భార్యతాతగారినద్ద స్మృతులన్నియుఁ జదువుచు, వానిద్వారా కొంత సంస్కృతభాషాపరిచయమును, గావ్యపరిచయమును గలిగించు

కొనెను. ఇంతలో ముసలిరాజుగారు చనిపోఁగాఁ దానే సర్వాధికారియై, పండక ముసలిరాజుగారు వదలిన భూములు తాను సేవ్యము చేసెను. ఒకనికిఁ దన్ని యింకొకనికిఁ జేపి పాలిచ్చిన బఱ్ఱెవలె నా భూమి యితనిసేవ్యముక్రింద సమృద్ధిగా ఫలించెను. వందయెకరముల మెట్ట యీరీతిగాఁ బదునుకువచ్చి జొన్న, మొక్కజొన్నయుఁ గలిపి యూ యేఁ డెనుఁబదిపుట్లు పండించెను. రామచంద్రరాజు పొలము త్రొక్కినఁజాలును. అది కామధేనువువలె నడిగినదెల్ల నిచ్చుచుండెను. ఆఱేండ్లలో రాజు డెబ్బది యెనుబదివేల యాసామి యయ్యెను. అతఁ డచట ధనవంతుఁడై నప్పటినుండియు సుబ్బన్నపేఁటకు వచ్చి తల్లిని, బంధువులను జూడవలెనను కోర్కె యతనిలోఁ జెలరేఁగెను. కాని తండ్రి చనిపోయినాఁ డన్నతరువాత నుత్సాహము కొంత తగ్గెను. తాను ప్రయోజకుఁడైతి నని తండ్రిచేత ననిపించుకొనవలయు నని యతఁడు తలఁచెను. ఆ కోర్కె సాఁగలేదు. రామచంద్రరాజు ఒకసారి గంజాంజిల్లాపోయి యక్కడఁ దన తల్లితరపు వారినందఱను జూచివచ్చెను. వారును నితఁడు ధనవంతుఁ డని తెలిసి మఱల క్షత్రియసంప్రదాయములో నున్నాఁడనియుఁ దమవారందఱు నతనిని గౌరవించుచున్నా రనియు నితనిని గౌరవించిరి. రంగాజమ్మగారి యన్నదమ్ము లందఱును జనిపోయిరి. వారి పుత్రు లున్నారు. ఆమె పినతండ్రి కుమారు లున్నారు. వారందఱును రామచంద్రరాజుతోఁ గలసిమెలసి బంధువులవలెఁ దిరిగినారు. రామచంద్రరాజు ధనవంతుఁడని తెలిసినంతనే సుబ్బన్నపేఁటప్రజ యతనిని జాలగౌరవించెను. అందఱును 'ఓహో! రాజుగారు దయచేయుఁడు. మఱల రామేశ్వరశాస్త్రిగారికిఁ బేరుతెచ్చితి' రని యాయనను బొగడిరి. 'శాస్త్రిగారి కేమి! చివరిరోజులలోఁ గొంచెము చెడిపోయెనుగాని, మహారాజు. దాని కేమి, చంద్రునంతవానికి మచ్చపోలేదు' అనిరి. అన్నదమ్ము లిద్దఱయన్యోన్యమును జూచి ధర్మారావును జనులు మఱియు గౌరవించిరి. అతని కేమి? లక్షాధికారి యన్నగార ఱును గలసి రంగాజమ్మగారివద్దకుఁ బోయిరి. ఆమెకు నిః నెక్కువచేసెను. శ్లేష్మము గుండెల కెగఁదన్ని యూమె చుండెను. జ్వరము తగ్గలేదు. ధారక మంతగా లేదు.

రామ—ఈమెకు మంచివైద్యము చేయించవలయును. ఎట్లు?

ధర్మా—ఆస్థానవైద్యులు రెండేండ్లయిపది పోయి. ఆయన ఘనవైద్యులు. ఆయన బ్రతికియుండఁగా నీ చుట్టుపట్లజనులకు వెదకు కొన నక్కఱలేకుండ నుండెడిది. ఇప్పుడు దిక్కులేదు. మంచిమందులే లేవు. ఉన్నను నవి కోటలో నెక్కడనుండెనో యెవరికిని దెలియదు. సరియైనవైద్యము కావలయునన్నచో నింగ్లీషువైద్యము చేయించ వలయును. దానికి బెజవాడ తీసికొనిపోవలయును.

రంగా—నేను బెజవాడకు రాను, గిజవాడకు రాను. నన్నిచ టనే తగులఁబెట్టవలయును. మీరు నన్ను బెజవాడకుఁ గొనిపోదురు. నే నచట గుటుక్కుమన్నచో నన్నక్కడఁ దగులవేయుటకా? నా శవము సుబ్బన్నపేటలోనే తగులఁబడవలయును. అయినను నాకు వైద్య మెందుకు?

ధర్మా—అ దేమి మాట? చూచుచుఁ జూచుచుఁ బ్రాణ ములు తీసికొందుమా? ప్రాణము లున్నంతవఱకుఁ జికిత్సచేయవలసి నదే. అట్లు చేయనిచో నాత్మహత్య క్రిందకు వచ్చును.

రామ—నీవు బి ఏ. మొదటియేఁడు పరీక్ష నిచ్చితివా?

ధర్మా—అవును. ఇప్పు డా ప్రసక్తి యేమి?

రామ—చక్కఁగా మాటాడితివి. ఎట్లయినను చదువుకొన్న దారి వేఱు.

ధర్మా—ఇంగ్లీషు చదువుకొనుటవలనఁ గాదు, నే నిట్లు మాటాడునది.

రామ—సరేకాని, బెజవాడనుండి డాక్టరును బిలిపించినచో?

రంగా—బాబూ! అది యనవసరపు ఖర్చు. మొన్న చంద్రా రెడ్డిభార్యకు జబ్బుచేసినపుడు చూచినాను. అదేమి యూస, అ దేమి డబ్బు? ఆయనకు నెలకు వేయిరూపాయలజీత మంట. సొంతమోటారు మీఁద వచ్చినాఁడు, వెళ్ళినాఁడు. ఆ డాక్టరు వచ్చి యేదో మం దిచ్చినాఁడు, నాలుఁగువందలు పుచ్చుకొన్నాఁడట. ఈలాగయినచో మన మందఱము దివాలాలు తీయవలసినదే.

ధర్మా—అవును. ఈ వ్యవహార మింతే రంగా—అయినఁ గావచ్చును. కాని నా భర్త యిచ్చిన ప్రతిసెంటుభూమియు నా

కుమారుఁ డనుభవించవలయునే కాని నే నందులో నేమియు ఖర్చు పెట్టను. నేను చచ్చిపోయినను సరే. రామ—ఏమిటమ్మా యీ పిచ్చి! ధనము ప్రాణాపద కడ్డువచ్చుటకుఁగాకపోయినచో దేనికి? పాతర వేసిన చివరి కెవరి కగును? రంగా—అందుకని సముద్రములోఁ బోయుదుమా? రామ—వైద్యునకిచ్చుట సముద్రములోఁ బోయుటా? రంగా—ఆ వైద్యునకు వేయిరూపాయలు జీతమాయెను. సాలునకుఁ బన్నెండువేలు. నా ఆస్తిమీఁద సాలునకు వెయ్యిరాదు. ఇప్పటి ధరలలో నెనిమిదివందలు వచ్చుచున్నది. శిస్తులు, ఖర్చులుపోను నాలుగువందలే మిగులును. అందులోఁ దిండి కెంత? వైద్యాని కెంత! వైద్యుని మూలచ్ఛేదము చేసికొందువా? సాలున కంత యాదాయమువచ్చువానికి మనము మనభుక్తికైన పాల మమ్మ యిచ్చుటలో నా కర్థము కనిపించుటలేదు. తీసికొనుట కాయనకుమాత్రము మన సెట్లొప్పుచున్నదో? ధర్మా—అమ్మా! వారు నీయంతగా విచారించరుకదా!

ధర్మారావు 'వమ్మా' యని పిలుచుటతో రంగాజమ్మగారికి నానందమయ్యెను. ఇంతవఱకుఁ దనతో సరిగమాటాడనైన మాటాడనివాఁడు తన్నిప్పు'డమ్మా' యని పిలచునంత ప్రేమ యేల కలిగెనో? రామచంద్రరా జూరకుండెను. భోజనమువేళ యయినదని ధర్మారా వింటికిఁ బోయెను. రంగరాజమ్మగారి వివేకమున కతఁడు నివ్వెఱపోయెను. ఏమియుఁ జదువుకోని యామె కంత యర్థశాస్త్ర పరిజ్ఞాన మెట్లున్నది? పాఠశాలలలోని యర్థశాస్త్రములో నీ సంగతులే యుండవు కాఁబోలు. అతఁడు రెట్టింపుడుత్సాహముతో నింటికి గాలితెరలమీఁద నూఁగుచుబోయెను. మేనత్త వలదన్న కొలఁదియు నరుంధతి మడికట్టుకొని వంటచేసెను. ధర్మారావు పోయినవెంటనే నీళ్ళుతోడి, సున్నిపిండి యుంచి, స్నానము చేయుటకు రమ్మనెను. అతనికి నీ ళ్ళందించెను. వీఁపుతోమెను. వీఁపుతోమువేళ ధర్మారావు ప్రక్కలకుఁ జేతులతో నామెచేతులు నొక్కి పట్టుకొనెను. ఆమె నవ్వెను. చేతికి నీళ్ళందించువేళ, తుడుచుకొనుటకుఁ దువాలు నిచ్చువేళ, మడిబట్ట యందించువేళ, హస్తాగ్రస్పర్శము పతి చేయక మానఁడు; ఆమె సిగ్గుపడకమానదు. అతఁ డూరక నవ్వించకమానఁడు.

ఆమె కిలకిలలాడకమానదు. సావిత్రమ్మగారి మొగములోఁ గన్నులు, ముక్కు, నోరు సర్వము పోయినవి ఆనందమే యున్నది. భోజనము చేయువేళ సావిత్రమ్మగారు పోయి వీథియరుగుమీఁదఁ గూర్చున్నది. అరుంధతి విస్తరి వేసినది. ధర్మారావు పీఁటమీఁదఁగూర్చుండి విస్తరి వేయుటకువచ్చినయామెను తనవద్దఁ బీఁటమీఁదఁ గూర్చుండఁ బెట్టెను. ఆమె 'అయ్యో! అన్నము వడ్డించవలదా?'యనెను. 'ఇదిగో అన్నము తినుచున్నాను' అని యతఁ డామె నొడలెల్లఁ గొటికెను. అరుంధతి చక్కిలిగింతలకుఁ బకపకాలున నవ్వెను. చక్రమువలె నతని చేతిలోఁ దిరిగిపోవును. చివరకు వదలించుకొని దూరమునుండి యామె విస్తరిమీఁద నీళ్ళు చల్లి యభిఘరించెను. ధర్మారావు 'అంతదూరాన నిలుచున్న నేను దగ్గఱకు రాలేనా?' అనెను. అరుంధతి 'అవును. ఎనిమిదినెలలయినఁ బట్టదా అని దిలాసా' అనెను. ధర్మారావు అప్పు డంతే. ఇప్పుడు - అని లేచి యామెచుబుకము బూని 'అంతకోప మెందుకు? నీవు పుట్టినింట సుఖపడుచున్నా వను కొన్నానుగాని కష్టపడుచుంటి వని తెలిసినచోఁ గన్నుమూసి గన్నుఁ దెఱచువఱకు నీదగ్గఱ నుండెడివాఁడనుగానా! ఎనిమిది నెలలు కాదు, ఎనిమిది లిప్తలింక నీవియోగము సహించఁజాలను' అని మఱలఁ బీటమీఁదఁ గూర్చుండెను. ఆమె యన్నము వడ్డించెను. పప్పు, పొట్లకాయకూర, యొక పచ్చడి-ఇవి పదార్థములు. సావిత్రమ్మగారు జాగ్రత్తగా నీళ్ళుపోసి దొడ్డిలోఁ బొట్ల బీరపాదులు వేసఁగిలోఁ గూడఁ గాయించుచుండెను.

ధర్మా——ఈపచ్చడి యేమిటి? అరుం——తెలుసుకొండు. ధర్మా——నాకుఁ దెలియదబ్బా! నాకుఁ దెలిసిన దొక్కటియే. మఱియేమియుఁ దెలియవు. అరుం——ఆ తెలిసిన దేమిటి? ధర్మా——చెప్పుదునా? మా యూరికి దగ్గఱగా రంగాపురమని యున్నది. ఆ యూరిలో నొకపిల్ల యున్నది. దాని పే రేమిటో మఱచిపోయినాను. ఆపిల్ల మగనితో లేచిపోయినదఁట. ఇది నాకుఁ దెలిసినసంగతి. ఆపిల్ల పేరు నీకుఁ దెలియునా? అరుం——తెలియును! ఆ పిల్ల పేరా? ధర్మారావు.

ఇద్దఱును నవ్వినవ్వి యాయాసమువచ్చువఱకు నవ్విరి. ఇంతలోఁ దల్లి వాఁకిటనుండి వచ్చెను. ధర్మారావు ఏమియు నెఱుఁగ

నట్లు ఆమెతో నిందాఁకటి నుండియు మాట్లాడ నేలే దన్నట్లు 'అమ్మా మజ్జిగ' యనెను. ఆబిడ 'నాయనా! మడిగట్టుకొన్నది నేనా' యనెను. ధర్మారావు 'అయినచోఁ బోయుము' అనెను. అరుంధతి మజ్జిగ పోయుచుండెను. ధర్మారావు ఆమెమీఁదఁ జేతిలోని చల్ల చిలుకరించెను. అది ఆమెమీఁదఁబడి యొడలెల్ల నెంగిలియయ్యెను. ఇంతలో సావిత్రమ్మగారు దొడ్డిలోనికిఁ జనెను.

అరుం—ఇంక నేను మఱల స్నానముచేయవలెను. ఆ రోజున నెంగిలి పన్నీరు; ఈరోజున నెంగిలిచల్ల. ధర్మా—నీయొడలంతా యెంగిలయినది, అసలు. అరుంధతి కొడలెల్ల నెంగిలయినట్లు లేదు; అమృతమయమై నట్లున్నది.

అరుం—నేను స్నానము చేయను. ఇట్లే యుందును. ధర్మా—అనఁగా నెప్పుడును పుంస్త్రీగానే యుందువా? అరుం—అవును. ఇద్దఱునొకరివంక నొకరు చూచుకొంచునే యుండిరి. ధర్మారావు చివరరెండుముద్ద లున్నవి. అవితినుట మెఱుఁగఁడు. అరుంధతి చల్లతప్పెల క్రిందనుంచుట యెఱుఁగదు. ఇద్దఱు నేదో పరస్పరాక్షికోణముల గూఢార్థములు చదువుకొనుచున్నారు. ధర్మారావు కనులలో నీరు నిలచెను. అతఁడు చేయికడుగుకొని గదిలోనికిఁ బోయెను. అరుంధతి చేతులు, కాళ్ళు, మొగము కడుగుకొని తానుగూడ గది లోనికిఁ బోయెను. ధర్మా—పోయి భోజనముచేయుము. ఇప్పుడెందుకు వచ్చితివి? అరుం—మీకుఁ దాంబూల మిచ్చిపోయెదను. ధర్మా—తములపాకు లెక్కడివి? అరుం—ఇందాఁక నమ్మవచ్చినవి. ధర్మా—అరుంధతివెంటనే యవికూడ నూరిలోనికివచ్చినవికాబోలు!

అరుంధతిమొగమునందు మధురలజ్జ విచిత్రముగాఁ గనఁబడును. ఆ రేఖ కొన్నిజన్మములుగా నభ్యసించిన యొకయభినయ విశేషమువలె నామెమొగముమీఁది కంతలో వచ్చును. వచ్చి నంతనే యా ముఖము మేఘముచాటున నస్తమించు సూర్యరోచిస్సు లెగఁదన్ని పశ్చిమాశకుఁ బైభాగమునఁగల తెల్లమొగిలుచివళ్లు బంగారపుజరీవలె ధగధగమెఱసిపోవువేళ నా మొగిలి కడ్డముగా జెగ్గురుపక్షి తనతెల్లనిఱెక్కతో గీఁచినట్లు మెఱసిపోవును. ధర్మారావు మొదటి యాఱునాళ్ళలో దానిని లీలఁగాఁ జూచెను. రాత్రి రహః

మధురదుఃఖకథనగాథలో నట్టిది జరుగనే లేదు. ఇపు డా రేఖ యరుంధతీలీలాముగ్ధ త్రపామధురవదనసరోజముపైని కట్లు వచ్చి యట్లు పోయెను. ధర్మారావు నిలుచున్నవాఁడు నిలుచున్నట్లు ముగ్ధుడై పోయెను. పతిపొందిన తన్మయత్వమున కేమి హేతువో సతికిఁ దెలియదు. తాను తనభర్తకు సంతప్రేమాస్పదురా లగుట యామె ప్రాణమార్గములో నమృతపరివాహములు సుళ్లుతిరుగుచుండెను. ఆమెకుఁ బోయి భర్తను తానుగాఁ గౌఁగిలించుకొనవలయు నని పించును. కాని స్త్రీసహజమైన లజ్జ యడ్డమువచ్చుచున్నది. ధర్మా—నే నిపుడు తాంబూలము వేసికొనను. నీవుకూడ భోజనము చేసి రమ్ము. ఇద్దఱము కలసి యపుడు వేసికొందము. అరుం—నాకు రోజును సాయంకాలపుఁబ్రొద్దుతిరిగినతరువాతఁగాని తిండి యలవాటు లేదు, మా నాయన యిష్టిపూర్తిఅయినతర్వాత. ధర్మా—ఇఁక నా యలవాటు మాఱిపోవునుగదా! దానికి నేఁడే మొదలు. పోయి రమ్ము. అరుం—అంతవఱకుఁ దాంబూలము లేకుండ నుందురా? ధర్మా—ఇంతకాలము నీవు లేకుండ లేనా?

ఆమెపోయి భోజనముచేసి వచ్చెను. తమలపాకులకు సున్నము రాచుచుండెను. ధర్మారావు సున్నముతీసి యామె బుగ్గకు రాచెను. ఆమె తుడుచుకొనలేదు. ధర్మారావు 'తుడుచుకొన వేమి?' అనెను. అరుం—నా కేమియు నవసరము లేదు. నా మొగము నా కెట్లున్నను సరే.

ధర్మా—నాకు సంతే. అరుం—నిజముగానా? ధర్మా—నిజముగానే.

ధర్మారావు తమ్మ నమలి యరుంధతి కందీయఁబోయెను. అరుంధతి గ్రహించలేదు. అరుం—నా కీ యెంగిలి వద్దు. ధర్మా—వద్దని నిన్నసాయంకాలము చెప్పవలసినది. ఇప్పుడు నే నొప్పుకోను. అరుఁ—ఒప్పుకొనక యేమి చేసెదరు? గోడమీఁద నొకపటము చూపి, ధర్మారావు 'అది' అనెను. అరుంధతి మొగముమీఁదికి మఱల మధురలజ్జారేఖ వచ్చెను. ధర్మారా వా రేఖను దిగ్భ్రాంతుఁడై చూచెను. అరుంధతి మఱలఁ గలవరపడెను.

ధర్మా—హేమరేఖా! అది, అది.

ప్రొద్దు వాటారెను. దేవదాసి వచ్చెను. సావడిలోనుండి 'అన్నా' యన్న పిలుపు వినఁబడెను. ధర్మారా వుత్తరీయమును వేసికొని బయలుదేఱెను. అరుంధతి యింతటినుండువఱకుఁ దానే గాక ప్రపంచము లేదన్నట్లున్న పతి యింతలో నిట్లు లేచిపోవుచున్నందుల కచ్చెరువుపడి 'ఎవ రామె?' యన్నది.

ధర్మా—గిరిక.

అరుంధతికి జ్ఞాపకము వచ్చెను. తనయుంగరమువంకఁ జూచుకొనెను. ఉంగరములోనిది నీలపుఱాయి. భార్యాభర్తలిరువురును బయటికి వచ్చిరి. దేవదాసి యరుంధతి నదే చూచుట.

దేవ—వదినెగారికి నమస్కారము.

అరుంధతి కేమియుఁ దోఁచలేదు. తా నెక్కడ? ఆమె యెక్కడ? ఆ నమస్కారమునకుఁ దాను తగుదునా యనుకొన్నది. అనుకొని యుంగరమువంకఁ జూచెను. ఉంగరము తమాలవృక్షచ్ఛాయవలె, యమునాతరంగమువలెఁ గపిల శరీరకాంతివలె. యశోదాశిశువువలె నల్లనికాంతులు వెదజల్లుచుండెను. అరుంధతి గదిలోనికిఁ బోయి రెండుతాంబూలములు తెచ్చి దేవదాసి చేతిలో నుంచెను. దేవదాసి చూచుకొన్నది. రెం డెందు కనలేదు. మఱల గుప్పిలిమూసెను. అన్నాచెల్లెండ్రిద్దఱును నడచిపోయిరి. అరుంధతి వారివంకకే చూచెను. ఇద్దఱునుబోయి తండ్రికట్టించిన చలువఱాతి మెట్లపైఁ గూర్చుండిరి. గిరిక పాదములు నీళ్ళలోఁ బడునట్లు గూర్చుండెను.

ధర్మా—నాకొఱకు నీవు నిన్నఁగూడ వచ్చితివా? గిరిక—రాలేదు. నీవు రంగాపురము వెళ్ళితివిగా! ధర్మా—అది నీ కెవరు చెప్పిరి? గిరిక—నీవు వెళ్లుచుండఁగా నేను చూచితిని. ఇక్కడనుండి చూడుము. రంగాపురము త్రోవ కనఁబడుటలేదా? దూరాన నిన్ను జూచి గ్రహించితిని. ధర్మా—ఈ యెనిమిది నెలలు నేమి చేయుచున్నావు? గిరిక—చదువు లేదు, సంధ్య లేదు. నీవు నీదారి చూచుకొనుచున్నావుగాని, నాదారి చూచిపెట్టుటలేదుకదా! ధర్మా—నాదారి తేలిక, నీదారి కష్టము. నీదారి నీవే యెక్కువ చూచుకొనవలయును. ఆ దారి మా కనుభవములో లేనిది. గిరిక—అది యేమి,

అట్లందువు? నీ వున్నావని నేను ధైర్యముపడుచుండగా నీ వట్లన్న నే నేమి కావలయును? అన్నా! నీవు చెప్పినట్లుగా రోజును రాత్రి నిద్రపోవువఱకును ప్రాణాయామము చేయుచు స్వామినే ధ్యానించుచుం బడుకొందును. స్వామిమూర్తి నాకు ముందు నిలువదు. రెండు మూఁడుసార్లు నిలచినది. కాని అంతలో మాయమైనది. అన్నా! గుడిలో ప్రభువునకెదురుగ నిల్చున్నపు డున్నంతసుఖము నా కింటివద్దఁ గలుగుట లేదు. ధర్మా—తల్లీ! ఇది యెనిమిది నెలలలోనే సిద్ధించెడివిద్య యయినచో ఋషులకు యుగములు పట్టుటేల? నీవు నన్ను మఱచిపోవలయును. నేను లేను. నీ వేమిచేయుదువు? చేసినదే చేసి, చేసినదే చేసి నీప్రాణము విసుగవలయును. అప్పు డతని ప్రాణములు విసుగును అప్పటిదుగాని యా దొంగగుండె కరఁగదు. ప్రాణములు వేధించుటలో నతఁడే మొనగాఁడు. గిరిక—బావగారి నెన్నయిన ననుము. ఆయన పడవలసినవాఁడును, నీ వనవలసినవాఁడవును. ధర్మా—గిరికా! ఈ సరాగముల కేమి; యీ నవ్వుల కేమి? ఆయన యెంతదూరము వచ్చినాఁడు? మఱల స్వప్నమేమయిన వచ్చెనా? గిరిక—నీవు వెళ్ళినతరువాత నెలనాళ్ళక్రిందట వచ్చినది. ధర్మా—అందులో నేమి జరిగినది? గిరిక—స్వామి వేణు వూఁదుచున్నాఁడు. గోవులన్నియు మెడలెత్తుకొని యాయనవంకఁ జూచుచున్నవి. దూరమున యమునానది ప్రవహించుచున్నది. తమాలవృక్షములు గాలి కూఁగుచున్నవి. స్వామి నల్లని దేహకాంతులు నామీఁదికి వచ్చినది. నే నా నీడలలో, నక్కినక్కి స్వామిదగ్గఱకుఁ బోయితిని. అదివఱకు నన్నుఁ గనినంతనే యాయన పాఱిపోయినారుకదా! అందుచేత నాయనకుఁ గనఁబడకుండ నేను సమీపించితిని. వెనుకనుండి వెళ్ళుటచేత నే నాయనకుఁ గనఁబడలేదు. దగ్గరకుఁబోయి వ్రేలాడుచున్న ప్రభువు నుత్తరీయమును దాఁకితిని. ఇంతలో నాకు మహానందమయినది. నాగుండె కొట్టుకొన్నది. నా దేహములోనున్న రక్తమంతయు వేగాతివేగముగఁ బ్రవహించెను. అంతలో మెలఁకువ వచ్చినది. లేచి చూచితిని. స్వామి లేఁడు; ఏమి లేదు. ఇంతనే పేడ్చితిని. మఱల నిదుర రాలేదు. ధర్మా—ఓపికపట్టుము. ఇంక నాలస్యముపట్టును. అది యేండ్లు కావచ్చును. ఇదివఱకుఁజెప్పినదే మార్గము.

స్వామి నీతో మాట్లాడవలయును. అది కలలలోనను గాను: నీవు మెలఁకువతో నుండగనే వచ్చి నీతోఁ బ్రసంగించవలయును.

గిరిక దిగాలఁబడి పోయెను. ఆమె యేడ్చుచుండెను. ధర్మారావామెవంకనే చూచెను. ఆమె తాను కూర్చున్న జాతిమీఁదఁ బడి "అన్నా! నాథుఁ డెప్పటికయిన నన్నల్లు మన్నించునా? నే నెన్ని రాత్రులు నిద్రించలేదో! ఆయనకైనఁ దెలియునా? నేను పడుచున్న కష్టములు చాలవు కాఁబోలును. ఏకాదశులు, ద్వాదశులు ఒక్క-పూటయే తినుచున్నాను. అష్టమి నవములు ఒక్క-పూటయే. ఇంక నా రోజులలో నన్నమే మానివేసెదను. అన్నా! ఇంకను నేమి చేయవలెనో చెప్పుము. ఒక్క-సారిగా మెడ నరకుకొనుమందునా? అది సులభముగాఁ జేసెదను. స్వామికి దయలేని యీ మొండి బ్రదుకు బ్రదికి యెందుకు? ఇందాక వదినెగారిని జూచితిని. ఆమెకు నీవు ప్రత్యక్షముగా నున్నావు. ఈర్ష్య కాదుసుమా! నా కట్లు లేదా యెను. పతిదయ చూచు టెప్పుడో తెలియలేదు.

ధర్మా—ఇంక నెన్ని క్షేత్రయపదములు నేర్చుకొంటివి? గిరిక-మా అమ్మకు వచ్చినవన్నియు నేర్పినది. ధర్మా—నీ కా చిన్న పుస్తక మిచ్చితిని, అందు నాయికలు, వారి స్వభావములు, వారి లక్షణములు నున్నవని. అవి చదివితివా? గిరిక—చదివితిని గాని సరిగాఁ దెలియలేదు. రేపు రాత్రికి వత్తునా? చెప్పుదువుగాని. నీకు వీలుండదా? ధర్మా—ప్రతిరోజున నొకగంట చదువుదము. రేపటి నుండి రమ్ము. ఈ మూఁడునెలలు నే నిందే యుండెదను. నీకు వచ్చినపదాలలోఁగూడ నాయికావిభాగము చెప్పెదను. ఈ మూఁడు నెలలగువఱకు నీవు చదువఁదగినది యేమియు నుండరాదు. గిరిక—ఇంక లెక్క- పదిరోజులలో స్వామి నాతోఁ గనీసము కలలోనైనను సరే, మాటాడెనా మాటాడెను; లేదా యేరాత్రివేళనో వచ్చి యీ చెఱువులోఁ బడెదను. నాతో స్వామికిఁ దెప్పయుత్సవము జరుగును. చివరకు నే నంతేలే.

గిరిక యూరక యేడ్వ నారంభించెను. ధర్మారావు 'ఆలయములోనికిఁ బోయి కనుగొందము రా' అని ఆమెను లేవఁదీసి యాలయములోనికిఁ బోయిరి. పోయినది మొదలు గిరికకు స్మృతిలేదు,

ధర్మారావు తన్మయుఁడై పోయెను. ఆలయముబయటి కిర్వురును గల సియే వచ్చిరి. ఇంటికిఁ బోఁబోవుచుండిరి. గిరిక 'అడుగ లేదేమి?' అనెను. ధర్మారావు 'మఱచిపోయితి' ననెను. రాత్రి ప్రొద్దుపోయినది. గిరిక నింటివద్ద దిగవిడిచి ధర్మారా వింటికి వచ్చెను, అరుంధతి వీథి గుమ్మమునొద్ద నిలుచుండి యెదురుచూచుచుండెను. అతఁ డామెను చేతులలో నెత్తుకొని లోనికిఁ దీసికొనిపోయెను. చీఁకటులు దట్టమై క్రమ్ముకొనెను.

మఱునాఁడు రంగాజమ్మగారి కెక్కువచేసెను. తెల్లవారులు నిదురపట్టలేదు. జ్వరము జాఱుటగూడ లేదు. ఊరిలోని మంగలియు నర్చకులిద్దఱును వచ్చి చూచిరి. ఏవో మందులు నడుపుచుండిరి. ఒక వారము గడచినఁగాని రోగస్వభావము చెప్పలేమనిరి. రామచంద్ర రాజుగారు రంగాజమ్మగారికిఁ దెలియకుండఁ బోయి పెద్దడాక్టరును దీసికొనివచ్చెను. ఆయన చూచి కొన్ని మందులపేర్లు చెప్పి యవి కొనితెమ్మని చెప్పి తా నేదో యింజక్షనిచ్చివెళ్ళెను. తరువాతఁ బ్రతిగంటకు జ్వరము చూచుట, వ్రాసియుంచుట. గంటగంటకు మందిచ్చుట—యొక మనిషి ప్రత్యేకముగా నామెయొద్ద నుండవలసి వచ్చెను. నీళ్ళుకలిపిన యే మందయినను తాఁగనని రంగాజమ్మగారు పట్టుపట్టెను. అందుచేఁ బొడులు, బిళ్ళలే యిచ్చుచుండిరి. ఆ మఱు నాఁడు మధ్యాహ్నమున ధర్మారావును, రామచంద్రరాజును రంగా జమ్మగారిమంచమువద్ద గూర్చుండిరి.

రంగా—నాయనా! ఈ డాక్టరేమిటి ? అంత పెద్దవాఁడు లాగు తొడుగు నేమిటి? మనిసి అసహ్యముగా లేఁడా ? రామ— అమ్మా! నీవు మాటాడలేని స్థితిలో నున్నావు. డాక్టరు మాటాడ వద్దని చెప్పినాఁడు, మాటాడకుండఁ బండుకొనుము. రంగా—ఆ నోటిలో సిగరెట్టుతో నావద్దకు వచ్చినాఁడు. మీరు దానిని పాఱ వేయుమనియైనఁ జెప్పినారు కాదు. రామ—వారు గొప్పవారు. అంతే. దొరలవలె నుందురు. రంగా—నే నేమి దొరలమొగ మెఱుఁ గనా? కృష్ణమనాయఁడుగా రెప్పుడయిన నిట్టి యసభ్యంశపుఁబనులు చేసిరా? వారికన్న వీరు గొప్పవారా? ఆయన యెంత భక్తిగలవారు!

ధర్మారావున కామె ప్రతిమాటయు నెంతో యర్థవంతముగాఁ

గనఁబడెను. అతిహేయమైన ధూమపానము గౌరవనీయమైపోయెను. గొప్పదొరలవలెఁగా మహాగుణసంపన్నులన్న యర్థముపోయి పెద్ద జీతగాండ్రన్న యర్థమువచ్చెను.

రంగా—ఆయన నాడియే చూడఁడేమి? అది యెట్లున్నది, ఇది యెట్లున్నది యని యడిగినచో రోగ మెట్లు తెలియును? నాడి పరిశీలించి, తత్త్వము తెలిసికొని తత్త్వానుగుణముగా మందు నడప వలయునుగాని యిట్లు పైచిహ్నములు చూచి నడిపినచో నేఁటికిఁ దీసిన గోటికిఁ దీయునేమోకదా! రామ—అమ్మా! వీరి వైద్యమే వేఱు. వీరికి సర్వమును నాడి చూడకుండఁగనే తెలియును.

రంగాజమ్మగారు 'కాఁబోలు'నని యూరకున్నది. అదియుఁగాక తరువాత మాటాడలేకపోయినది. రామచంద్రరాజు తనకుమారునకు రామేశ్వరశాస్త్రిరాజని పేరుపెట్టెను. ఆ పిల్లవాఁడు నాయనమ్మ మంచమువద్దకు వచ్చెను. అతనికి 'అత్త, అమ్మ, నాన్న' అన్న మూఁడుమాటలు వచ్చెను. సుబ్బన్నపేఁట వచ్చినతరువాత 'మామ్మ' అన్నమాటకూడ వచ్చినది. రంగాజమ్మగారికి మనుమనిచేత నీ మాట లభింపించుటయే పనియైనది. ఆమె మనుమనితోఁ 'మామ్మ' యనఁబోయి యాయాసముచేత మానివేసెను. పిల్లవానిని దగ్గరకుఁ దీసికొనెను.

ఆనాఁడు సాయంకాలము ధర్మారావు రంగాజమ్మగారియింటి వద్ద నుండఁగా దేవదాసి యతనిని జూడఁబోయెను. ధర్మారావు రామచంద్రరాజుతో మాటాడుచు మాటాడుచు హఠాత్తుగా లేచి పోయి యామెతోఁ గలసి దేవాలయమునకుఁ బోయెను. రామచంద్రరా జాశ్చర్యపోయెను. రంగాజమ్మగారు దేవదాసిని జూచెను. ఆమె కుమారునితో 'ఆశ్చర్యపోయెద వెందులకు? ఆ పిల్ల యెవ రనుకొన్నావు? మీ నాయనగా రుంచుకొన్నారే, రత్నగిరి, యెఱుఁగుదువా? ఆమె కూతురు' అనెను. రాజు ధర్మారా వట్లు లేచిపోయె నేమి? యనెను. రంగాజమ్మగారు 'వారిద్దఱిది యొక చిత్రము. అది యెవరికిని దెలియుట లేదు. ఇద్దఱును నన్నయుఁ జెల్లెలును. వెనుక నిప్పటిజమీందారుగారి పట్టాభిషేకమున నొకచిత్రము జరిగినది. వారు నృత్యముచేయుటకు దేవదాసిని రమ్మన్నారు. ఆమెపేరు దేవ

దాసిలే. ఆమె రా నన్నది. వారు బలవంతముగఁ దీసికొనిపోఁ బ్రియ త్నము చేసిరి. ధర్మారావు ప్రాణములుపోయినను అట్లు జరుగ దని ప్రతిఘటించెను. వా రూరకున్నారు, అనెను.

రామ—ధర్మారావు చాల మంచివాఁడే, దేవదాసి యెట్టిది?

రంగా—నేను దేవదాసిని జాలసార్లు పలుకరించి చూచితిని. ఆమెకు భాగవతమంతయుఁ గంఠతః వచ్చును. మాట్లాడుచు మాట్లా డుచుఁ దనయొడలు తానే యెఱుఁగదు. ధర్మారావును గూర్చి మాట్లాడుచు 'నన్న' యనును. ఆమె చాల భక్తురాలు. నా యుద్దేశ మేమనఁగాఁ గొలఁదిదినములలో నామెగోపాల—

రంగాజమ్మగా రింక మాట్లాడలేపోయెను. అంతవఱకే యాయాసపడుచు మాట్లాడఁగలిగెను. ఆ రాత్రి ప్రొద్దుపోయి గిరికను వెంటఁబెట్టుకొని ధర్మారా వింటికిఁ బోవుచున్నవేళ రామచంద్ర రాజు కనిపించెను. ధర్మారా వాఁగి 'అన్నా! ఈమె యెవ్వరో? అమ్మగారు చెప్పినదికదా! యీామెపేరు గిరిక' అనెను. దేవదాసి నిలుచుండెను.

ధర్మా—గిరికా! యీాయన రంగాజమ్మగారి కుమారుఁడు. మన యందఱిలోఁ బెద్దవాఁడు. రామచంద్రిరాజుగారు.

గిరిక రాజును జూచెను. రాజు—"దేవదాసి యఁటకదా!" యనెను. గిరిక—అన్న నన్ను గిరికయే యనును. రామ—అన్న కాదు. అన్నలు నన్ను గిరికయే యందు రనుము.

గిరికయు, ధర్మారావును నవ్విరి. తరువాత వా రిద్దఱును గలిసి వెళ్ళిరి. నాఁటిరాత్రి రామచంద్రరాజు రథంతరితో 'రథంతరీ! ఒక మాట! ఈ యూరిలో మా నాయనగా రుంచుకొన్నయామెకూఁతురు దేవదాసి యను పిల్ల కలదు. తే పామె యిచ్చటికి వచ్చును. నీవు మన మిచ్చట నున్న ప్రతిదినమును ఆమెకు వచ్చినపుడెల్ల నేదో పువ్వులు, ఫలహారము నొసంగవలయును. చాల భక్తితో సేవలయును' అని చెప్పెను.

ఆ మఱువాఁడు రామేశ్వరశాస్త్రిగారి యాబ్దికము. ధర్మా రావు రంగాపురముపోయి బ్రాహ్మణులను గుదిర్చివెచ్చెను. రాజ్య

లక్ష్మమ్మగారి యింటికిఁ బోయెను. ఆమె యితనినిజూచి చాప తెచ్చి వేసెను.

ధర్మా—మీ చేతికి అరుంధతి చంద్రహార మిచ్చినదఁట! మఱలఁ దీసికొని రమ్మన్నది. రాజ్య—ఆమె యిప్పుడు మీచేతఁ బనులు చేయించుచుఁగూడ నుండెనా యేమి? ఎంత గడుసుపిల్ల!

ధర్మారావు నవ్వెను.

రాజ్య—'నాయనా! నీ యత్తగారును, మామగారును రాక్షసులు. దానిని బహుకష్టములు పెట్టిరి. నీవు మంచిపని చేసితివి. పిల్ల సుఖపడుచుండఁగా, మీ యిద్దఱును కాపురము చేయుచుండఁగా నే నొకసారి వచ్చి చూడవలయునని యున్నది' అని తెచ్చి చంద్రహార మిచ్చెను. అతఁ డది మెడలోఁ వేసికొనెను.

రాజ్య—మెడదగ్గఱ నతు కూడిపోయెరు. నేను మఱలఁ గమసాలితో జెప్పి యతికించితిని. ఆమెతోఁ జెప్పుము.

ధర్మారావు వెళ్ళుటకు లేచెను. ఆమె యాఁగు మని దొడ్డిలోనికిఁబోయి నాలుఁగుపొట్లకాయలు కోసి తెచ్చియిచ్చెను. అతఁడు 'మా దొడ్డిలో నున్నవండీ' యనినను, కాదని బలవంతముచేసి పంపించెను. ఇంటికిఁ బోయినతరువాత రామచంద్రరాజు తనకుఁ గూడ బ్రాహ్మణులను బిలుచుకొనివచ్చితివా యనెను. ధర్మారావు "నీ వామశ్రాద్ధమేకదా చేయునది. ఊరిలోఁ బురోహితు డున్నాఁ" డనెను. రాజు—ఛీఛీ! నేను వానికిఁ బెట్టుదునా? 'న భోజయేత్ స్తేన తక్లీబపతితనాస్తికతద్వృత్తి వీరహాగ్రేదిధిషూపతి ధిధిషుస్త్రీ గ్రామయాజకాజాపాలోతత్స్వపృష్టాగ్నిమద్యపకుచరకూటసాక్షిప్రాతిహారికాన్' అన్నాడు. గ్రామయాజకునకు నేను పెట్టను. నీవు రంగాపురము వెడలితివికదా, నాకొఱకుఁగూడా బ్రాహ్మణులను బిలచుకొని వత్తువనుకొన్నాను.

ధర్మా—ఇంటికి వెళ్ళి వచ్చెదను. అయినచో మఱలఁ బోదము.

రాజు—నేను వెళ్ళివత్తునులే, నీవుకూడ నెందుకు?

రాజు వెళ్ళెను. బ్రాహ్మణులను దెచ్చెను. ధర్మారావు భోక్తలను స్నానము చేయుఁడని, తాను స్నానముచేసి సంధ్యావంద

నాదికములుచేసి కూర్చుండెను. బ్రాహ్మణులు వచ్చిరి. ఇన్నాళ్ళకుఁ బితృయజ్ఞమువేళ భార్య యగ్ని తెచ్చుట సంభవించినందులకు ధర్మారావు సంతోషించెను. ఇచ్చట నర్చన యయినతరువాతఁ గబురు తెలిసికొని రామచంద్రరాజు తాను బ్రాహ్మణుల నర్చించెను. రాజుగారు బ్రాహ్మణులకిద్దఱకును జెరి రెండురూపాయ లిచ్చెను. ఆనాఁడు సాయంకాలము రంగాపురములో రామచంద్రరాజుగారి పేరు మ్రోఁగిపోయెను. ఇంటిలో నానాఁడు క్షీరాన్నము, గారెలు జేసిరి. రంగాజమ్మగారు వలదన్నకొలఁదియు గోడ లామెకుఁ గొంచెము రెండును రుచిచూపించెను. ధర్మారావు నింటిలోనుండి పితృశేషము తీసికొనిపోయి రాజగారియింటిలో నందఱును తినిరి. రంగాజమ్మగారు పితృశేషమని మఱల క్షీరాన్నమును, సగము గారెయును దినిరి. ఆనాఁ డేమో యామెకు బహుసంతోషమయ్యెను. రత్నగిరియుఁ బ్రతియాబ్దికమునాఁడును బ్రాహ్మణుని బిలిచి బియ్యము, పప్పు కూరయు నిచ్చును. ఆనాఁడు రత్నగిరియు, దేవదాసియు ధర్మారావుగారియింటిలో భోజనములయిన వని తెలిసికొని భోజనము చేయుదురు. అందుచే భోజనము లగువఱకుఁ బొద్దుక్రుంకును. ఆనాఁడు దేవదాసి దేవాలయమునకుఁ బోదు. అందుచే నా నాఁ డామె యింటికి రాలేదు.

పసిరిక ప్రతియాబ్దికమురోజున నెటనుండివచ్చునో ధర్మారావు నింటికి సాయంకాల మగువరికి వచ్చును. సావిత్రిమ్మగా రాతని కొక్కగారె యిచ్చును. అది యతఁడు కూర్చుండి తిని యింకొక టడిగి తీసికొనిపోయి తల్లి కిచ్చును. ఆ నాఁడు పసిరిక ప్రొద్దుక్రుంకు వేళకు వచ్చెను. ధర్మారావును, రామచంద్రరాజును వీథియరుగు మీఁదఁ గూర్చుండిరి. పసిరిక క్రొత్తవానిని జూచి ధర్మారావుతో మాటాడక యింటిలోనికిఁ బోయెను. అరుంధతి వాకిట నిలుచుండి యతనినిజూచి భయపడి లోనికిఁ బరువెత్తి యత్తగారితో 'అత్తయ్యా! అది యేమిటి! అది యేమిటి' యనెను. పసిరికపాము గాలి కూఁగు లాడుచు వచ్చుచున్నట్లుండెను. సావిత్రమ్మగా రతనిని జూచి నవ్వి 'భయములేదు. అతఁడు మంగకొడుకు. నీ కొకమఱఁది' యనెను. అరుంధతి యతనినే పరిశీలించి చూచుచుండెను. రామచంద్రరాజు

పసిరిక యింటిలోనికిఁ బోవుట చూచెను. మొదట నాశ్చర్యపడెను. కాని వెంటనే జ్ఞాపకము వచ్చెను. రామచంద్రరాజు తుని లేచిపోవు నాఁటికి నయిదాఱేండ్ల వాఁడు. పసిరిక పొడుగెదిగెనే కాని యేమియు మాఱుప్లేదు. గారె తిని పసిరిక వచ్చి ధర్మారావునకుఁ జూచిపోవు చుండెను. ధర్మారావు ఈలవేసెను. ధర్మారా వతనిని బిలుచునది యట్లు. పసిరిక వెనుకకుఁ దిరిగిచూచి పోఁబోవుచుండెను. ధర్మారావు మఱల నీలవేసి రమ్మనెను. రామచంద్రరాజుపోయి పట్టుకు రమ్మనెను. ధర్మారావు 'అందఁడు. అతనితో నెవరును పరుగెత్త లేరు. పైని బక్షులను జూచుచుఁ బరువెత్తును' అనెను. పసిరిక వచ్చెను. ధర్మారావు 'ఈయన నెఱుఁగుదువా?' యనెను. పసిరిక 'యెఱుఁగ' నని తల యూఁచెను. 'రంగాజమ్మగారి కుమారుఁడు. మన కిద్దఱకు నన్నగారు' అని సంజ్ఞ చేసి చెప్పెను. పసిరిక కనులు పెద్దవి చేసి 'ఉక్'అని యూఁదెను. అది తెలిసిన దన్నమాట. 'అన్న' యనెను. ధర్మారావు తలయూఁచెను. పసిరిక యొక్క పనువు తీసెను.

అన్నదమ్ములిద్దఱును గూర్చుండి రాత్రి ప్రొద్దుపోవువఱకును దండ్రి గాథలే చెప్పుకొనిరి. తండ్రి యనిన ధర్మారావున కెంత గౌరవమో రామచంద్రరాజున కంత గౌరవము. అట్లే రాత్రి ప్రొద్దుపోవు వఱకుఁ గూర్చుండిరి. కబీరు దేవదాసిని వెంటఁబెట్టుకొని వచ్చెను. ధర్మారావు "అన్నా! చెల్లెలికిఁ జదువు చెప్పవలయును. ఇఁకఁ బోదము" అనెను. రామచంద్రరాజు గిరికచేయి పట్టుకొని 'అమ్మా' యనెను. గిరిక 'అన్నా' యనెను.

అరుంధతియు, గిరికయు సహపాఠిను లయిరి. కాని అరుంధతి గిరిక ననుసరించలేకుండెను. ఆ నాఁడు వాసకసజ్జికాలక్షణములు చెప్పెను. చదువుచున్న గ్రంథము భానుమిశ్రుని రసమంజరి ఆ లక్షణములు చెప్పుచుండఁగా గిరిక కనుదోయి విప్పారి దివ్యజ్యోతిస్సులు వెలుఁగుచుండెను. అరుంధతి ఆమెవంకనే చూచుచుండెను.

రాత్రి రెండుజాము లయినది. గిరిక "స్వామి యింక నెపుడు వచ్చును?" అనెను. ఆమె తన్మయత్వమును జూచి ధర్మారావు పుస్తకము కట్టిపెట్టి, కొన్ని ప్రార్థనాశ్లోకములు చదివి యుపసంహరించెను. ఇంక గిరికను దీసికొని పొమ్మని ధర్మారావు కబీరుతోఁ జెప్పఁగా

నతఁడు తన్మయురాలి నామె నానుకొని నెమ్మదిగా నడిపించుచుఁ గొనిపోయెను. అరుంధతి యామెను వీథిగుమ్మముదాఁక ననుసరించి యామె కనిపించినంతమేఱ యట్లే నిలుచుండి యందే నిశ్చలయై గుమ్మము నానుకొని కదలలేదు. ధర్మారా వరుంధతి యెంతసేపటి వఱకును రాకుండుట చూచి తానేపోయి యామె నట్టిస్థితిలోఁజూచి నవ్వుకొని యామెను పిలుచుకొని యింటిలోనికిఁ దెచ్చెను. అది పితృదినము. ఇద్దఱును జెరియొకచోటఁ బండుకొనిరి. ధర్మారావు చాప వేసికొని బయట నిద్రించెను. అరుంధతికి నిద్రపట్టలేదు. రాత్రి మూఁడుజాము లయ్యెను. 'గోపాలా జిరకర్దమే విహరసే విప్రాధ్వరే లజ్జసే' కర్మలుచేసిచేసి యొడలెల్ల చెమటపట్టినవారివంక గోపాల దేవుఁడు తొంగిచూచుట లేదు. ఈ భోగమువారిపిల్ల మనస్సులో వచ్చి నిలుచుండెను. ఆహా! ఏమి యదృష్టము! అరుంధతికి గిరిక భగవంతునికొర కెదురుచూచుచు మేలుకొనియేయున్నట్లు తోఁచెను. భర్తను మేల్కొలిపి 'గిరిక యేమి చేయుచున్నదో చూచివత్తమా?' యనెను. అతఁడు 'మన మిప్పుడు పోయి తలుపు తట్టరాదు. ఆమె నిజముగా స్వామియే వచ్చె ననుకొనును. ఆ ప్రతీక్ష ప్రతీక్షయట్లే యుండవలెను గాని, యవాంతరములు కలిగినచో నామెగుండె చెదరిపోవచ్చును' అనెను.

అరుం—గిరిక యదృష్టవంతురాలు. జన్మమనఁగా నామెదే జన్మము.

ధర్మా—నీవుమాత్రము తక్కువదానవా? ఆమెయట్టిస్థితిలో నున్నదని యూహించుటకే నీ విట్టిస్థితిలో నున్నావే! అరుం—నా మనస్సు మీమీఁదనే యున్నది. మిమ్మును వదలిపోవుట లేదు. ధర్మా—అందుకు విచారముగా నున్నదా? అరుం—ఈ రాత్రి మిమ్ముఁ దాఁకరాదు. ఆ మా టన్నందుకు—

ధర్మారావునకు మఱల నిద్దురపట్టెను. అరుంధతి తనపతి గిరిక నట్లు భగవంతునకు నైవేద్య మిచ్చెనని తలఁచి యతనిని జూచిచూచి యాశ్చర్యపోయెను. అది యేమి శక్తి!

మఱునాఁటికి రంగాజమ్మగారికిఁ బ్రాణముమీఁదికి వచ్చెను. అమ్మలక్కలందఱును బ్రోవయిరి. 'అయ్యో! అంతజబ్బుగానున్న

యావిడకు గారెలు పెట్టుకొందురా? అదే కొంపకుఁ దెచ్చినది, యనిరి. ఏమయిననేమి? ఎగశ్వాసపుట్టెను. మాట పలుకు లేదు. డాక్టరు వచ్చెను. పరీక్షించెను. మఱల నింజక్షను లిచ్చెను. తేపు వచ్చెద నని వెడలిపోయెను. రామచంద్రరాజుగారు నూఁడువందల రూపాయ లిచ్చెను. మూఁడురూపాయలవలె నాయన జేబులో వేసికొనెను. కారు మఱి నిలువలేదు. ఎగిరిపోయెను. రోగి పొద్దుక్రుంకు వేళకు మాటాడ మొదలుపెట్టెను. గుణము తిరిగిన దనుకొన్నారు. పది నిమిషములు సరిగానే మాట్లాడెను. తరువాత చేతు లూరకే కదపుట, ఏదో పట్టుకొనుచున్నట్లు చేతులు త్రిప్పుట, ఎవ్వరును లేనిచోట నెవరో యున్నట్లు చూచుట, పలుకరించుట యివి ప్రారంభించెను.

సంధి పుట్టిన దనిరి. ఏదైన మంచి తెలుఁగుమందులు పోయవలయునుగాని, యిఁక నింగ్లీషుమందులు పనిచేయ వనిరి. సావిత్రమ్మగారు చేతులు, కాళ్ళు చూచెను. కొద్దిగాఁ జలువలు క్రిమ్మినట్ల య్యెను. మంచి సింహప్రతిపాలనము దొరికినచో బాగుండును. వెంటనే శరీరము మఱల నష్టమునకుఁ దిరుగుననెను. అర్చకుఁడు వచ్చి కుప్పె లటుఁగదీసి పోసెను. పోసినమందు సెలవుల వెంటనే తిరిగి వచ్చెను. చూపులోఁగూడ వికార మేర్పడెను. రాత్రి ప్రొద్దుపోయెను. చీఁకటులొత్తుడు గ్రమ్ముకొనెను. రామేశ్వరశాస్త్రి నిద్రపోయినవాఁడు మేల్కని పోరుపెట్టెను. రథంతరి పసివాని నూరడించుచుండెను. ధర్మారావు, నరుంధతియు, సావిత్రమ్మగారు, మంగయు, రత్నగిరియు నందఱు నింటినిండ నుండిరి.

రంగాజమ్మగారు లేచికూర్చుండఁబోయెను. కుమారుఁడానుకొని కూర్చుండఁబెట్టెను. అందఱును వలదనిరి. అంతలో నామెకుఁ దెలివి వచ్చెను. సంధిపోయినది. చక్కఁగా నున్నది. ఎవరికి నేమియుఁ దెలిసినది కాదు. అంతవ్యాధిలో నిట్లు లేచి కూర్చుండి సరిగ మాటాడుచున్నందుల కందఱకు నాశ్చర్యమయ్యెను.

రంగాజమ్మగారు తనకుఁగట్టినగుడ్డ తీసివేయు మనెను. తీసివేసిరి. పెట్టెలో మంచిచీర యున్నది. అది తెచ్చి కట్టుమనెను. ఆ చీర వెలగలది. చాల పురాతనపుచీర. ఆ చీర రామేశ్వరశాస్త్రి

గారున్నపు డామె కట్టుకొనుచుండెను. ఆ చీరకట్టినపుడెల్ల శాస్త్రి గారు 'రంగాజమ్మగారు చాల నందముగా నున్న'దని యనెడివారు. ఆ చీర యిప్పుడు కట్టుమనఁగా నందఱును తటాపటాయించిరి. రామచంద్రరాజుగారు 'ఆచీర మిగిలి మన కేమి చేయును? ఆమె చివరి కోర్కి యది కావలసినను. కట్టు'మనిరి. 'చివరికోర్కి యేమిటి? మఱల బ్రదుకును' అని యొకరనిరి. చీర కట్టిరి. పెట్టెలోఁ గస్తూరి తీసి చీరకు పట్టించు మనెను. పట్టించిరి. ఒడలెల్ల సుగంధద్రవ్యములు రాయించుకొనెను. ప్రక్కఁదీయించి యుదికిన వస్త్రములు పఱపించెను. అందఱకు నచ్చినవుగా నుండెను. అంతయు నైన తరువాత దాను పరుండి, యందఱను దూరముగాఁ బొమ్మని యొక్కనవ్వు నవ్వెను. ఆ నవ్వులో నేమో మృత్యుదేవత తాండవించెను. ఆనవ్వు వినినంతనే యందఱకు నది యొకరీతిసంధి యని తెలిసెను.

మఱల నామెకు సంధి యథాప్రకార మయ్యెను. గదియంతయు సువాసనాభరితమై పోయెను. ఎవ్వరికిని జావు మంచముదగ్గఱ నున్నట్లు లేదు. ధర్మారావు పెట్టె తీయుచుండగా నం దగరువత్తులు చూచెను. అవి తీసికొని వెలిగించెను. రాత్రి రెండుజాములయ్యెను. కోటలో నౌబత్తులు వాయించుచుండిరి. చల్లనిగాలులు తిరిగి; యింటిలోనికి రివ్వుమని పోసికొనెను. అందఱకుఁ బ్రాణములు పోయి యనిపించెను.

రంగాజమ్మగారు వణఁకెడు కంఠస్వరముతో 'చూచితివా?' యనెను. కుమారుఁడు వద్ద కేఁగి 'యేమిటి?' యని ప్రశ్నించెను. తల్లి పిచ్చిచూపుతో 'చూచితివా?' యని మఱల ననెను. కొడుకు 'ఏమిటి చూడవలయును? అక్కడ నే మున్నది?' యనెను. ఆమె పిచ్చినవ్వు నవ్వి మఱల చీర సవరించుకొనెను. కోడలువచ్చి దగ్గఱఁ గూర్చుండి బిగ్గఱగా 'ఏమిటి చూచు చుందురు?' అనెను. అత్తగారు 'వారు—వారు వచ్చినారు' అనెను. రామచంద్రరాజు తల్లిదగ్గఱకుఁ బోయి 'అమ్మా! వచ్చినది యెవరు?' అనెను. ఆమె మఱలఁ బిచ్చిగా నవ్వెను. అంతలో లేచి కూర్చుండఁబోయెను. కుమారుఁడు పోయి లేవఁదీయబోయెను. ఆమె 'కూర్చుండుమనుము. కూర్చుండఁబెట్టుము' అనెను. కుమారుఁడు 'ఎవరిని' యని ప్రశ్నించెను. ఆమె మఱలనవ్వి

ప్రక్కపైఁ బరుండెను. కుమారుఁ దొడ్డిగిలి దూరముగాఁ బోయెను. ఆమె యంతలో మఱల లేవఁబోయెను. మఱలఁ గొడుకు పోయి పట్టుకొనెను. ఆమె 'అరుగో వచ్చిరి. వచ్చిరి' అని నవ్వెను. కుమారుఁడు 'అమ్మా! ఎవరమ్మా వచ్చినది? అని యడిగెను. ఆమె యతనిని నిదానించి చూచి'ఊఁ, ఎవరా? వారు, మీ నాయనగారు, అరుగో' యని నిలువలేక మంచముపై శయనించెను.

రామచంద్రరాజునకుఁ దనకు జ్ఞానమువచ్చినప్పటినుండియుఁ దనతల్లిదండ్రు లన్న నొక విచిత్రభావ ముండెడిది. వా రిద్దఱును రతీమన్మథు లనియు, శృంగారరసాధిదేవత లనియుఁ, బ్రేమ యనిన నట్లుండవలయు ననియు నూహించెడివాఁడు. చిన్నపుడు తా ననిన దనదండ్రి ప్రాణములువదలెడివాఁడు 'రామచంద్రా' యని తన్నుఁ బిలిచెడివాఁడు. 'క్షత్రియప్రభుత్వము లోకమునుండి పోయినది. మఱల మావానికి ధనుర్విద్య నేర్పి, యథర్వవేదము చెప్పించి, బ్రహ్మాద్యస్త్రముల ప్రయోగోపసంహారములు చెప్పి పెద్దధానుష్కుని జేయవలయును. మఱలఁ గృతయుగధర్మములు నడిపించవలయు' నని యుబలాటపడెడివాఁడు. తండ్రితొడమీఁదఁ గూర్చుండి తాను పురాణకథలన్నియు నాయన చెప్పఁగా విని తానుగూడ క్షత్రియుఁడే కనుక నట్టి సాహసకార్యములు తనకుఁగూడ సాధ్యములే యని తలఁచెడివాఁడు. వయసువచ్చినతరువాతఁ దన తల్లి యనేకములయినసార్లు తాను తనభర్తను బెండ్లిచేసికొన్నవిధము రకరకములుగాఁ గల్పించి కథలుగాఁ జెప్పెడిది. రామచంద్రరాజు తన తల్లిదండ్రులిద్దఱును ఉదయనవాసవదత్తలవలె లోకారాధనీయదాంపత్యశోభితు లని నిరంతరము వారిని దనమనస్సులో నారాధించెడివాఁడు. తాను గృహమునుండి లేచిపోయినదిగూడ దేశమును జయించి రాజ్యము నేలవలయు నన్న యూహతోనే. కాని యిల్లు వదలిపోయినతరువాతఁ దనయూహలోని యర్థము తెలిసినది: నేటి ప్రపంచమునకుఁ, దనకుఁ, దనతండ్రిచెప్పిన పురాణకాలపుకథలకును నేమియు సంబంధములేదు. క్రమముగా నాయనకు లోకమనఁగా నిపు డెట్లున్నదో తెలిసెను. కాని మనసులోమాత్రము తలిదండ్రుల యందుఁ దనకుఁగల భావమునకుఁ జెఱుపులేదు. అతని మనస్సులోఁ

దనతల్లిని తనతండ్రి వివాహముచేసికొనుట హరధనుర్భంగముచేసి రామచంద్రుఁడు సీతను జేపట్టినంత మహోత్కృష్టకార్యముగా నుండెను. ఆ వివాహముయొక్క ప్రత్యగ్రత యతనిమనస్సునుండి యెన్నడును బోలేదు. తనతల్లి యాయనదృష్టిలో సీతాదేవికిఁ దీసి పోలేదు. ఇప్పుడు తనతల్లిమరణవేళ నీస్థితియందున్నప్పు డతని కుద్వేగము హృదయమునఁదోచి మాతాపితలయందుఁ దనకుఁగల సర్వభావములు నొక్కసారిగా నతనిహృదయకవాటమును భేదించెను. ఓహో! ఆమె మరణవేళ నామెకుఁ దనతండ్రియే గోచరించెను. నిత్యవధువువలె నామెమరణశయ్యపై సుగంధద్రవ్యపరిశోభితయై తనతండ్రి కిష్టమైన చీరదాల్చి యున్నదనుట యాయనహృదయమునకు మధుర భావపరంపరామిలనము కలిగెను. అతఁ డొక యనిర్వాచ్యమైన పవిత్ర భావజగత్తున నూఁగులాడుచుండెను. రంగాజమ్మగారు పతిని గౌఁగిలించుకొన్నట్లు చేతులుచాఁచి, మఱల నెదపైఁజేర్చి చిఱునవ్వు పెదవిమీఁదఁ దాండవింపఁగా గనులు మూసెను. మరణలక్షణములు దెలిసిన యొక ముసలమ్మ 'అయ్యో! క్రిందికి దింపుడు, దింపుడు' అనెను. దింపుటకు రామచంద్రరాజుపోగా ధర్మారావుకూడ వెళ్లెను. రాజు 'నీవు వల' దనెను. ధర్మారావు కాదని యిద్దఱును రంగాజమ్మగారిని దించి క్రిందఁబెట్టిరి. రాజుగారు తులసినీళ్ళుపోసెను. రంగాజమ్మగారు గుటకవేసెను. 'నారాయణ' స్మరణ యామెచెవిలోఁ గుమారుఁడు సంతతముగా నుత్క్రమణవేళ దాటిపోవువఱకును జేసెను.
ఇంటిలో నామెకొరకు బిగ్గరగా నేడ్చువా రెవరును లేరైరి. ఆమె యాత్మ శాంతముగాఁ దరువాత నేమైనను సరే. ఆమె యేనాఁడు తనతండ్రియిల్లు వదిలివచ్చెనో నాటినుండియు పతిని దైవముగాఁ గొలిచినది. పతికిఁ జెడ్డదినములలోఁగూడ నతనినే యారాధించినది. కొడుకు పరదేశములకేగినను మగనియొద్దనే యున్నది. భర్తచనిపోయిన తరువాతఁగూడ నాయననే మనస్సునందుఁ గట్టివేసినది, చివరకు మరణవేళ సంధిచే నపస్మారమైనవేళ నామెమనస్సులో రామేశ్వరశాస్త్రియేనిలచెను. నాభిగతయజ్ఞోపవీతి; గాఢవక్షస్కుఁడు మందహాసపరిలిప్తాధరుఁడు, ధనుష్పాణి - సీతాదేవియు నామెయు నొకరీతి మూర్తినే ధ్యానించిరి,

ధర్మారావు రంగాజమ్మగారిని దించి బయటకు వచ్చెను. నాఁడు కృష్ణాష్టమి. చంద్రోదయ మగుచుండెను. సగము మొరిక పోయిన చంద్రుఁడు సగమువాఁడబడిన పుసుగుబిళ్ళవలె నుదయించుచుండెను. రంగాజమ్మ, రామేశ్వరశాస్త్రిగారలు సహస్రధా యుపయోగించిన యీ భోగద్రవ్యము మఱల వారిసమాగమమువేళ రాకుండ లేకపోయెను. చీఁకటులును వెన్నెలలును సగమవి సగమివి సమపాళముగా నుండి గోరువెచ్చనినీటివలె సేవనీయము లయ్యెను. ఒకానొకచావు చావువలె నేయుండదు. ఆ యిల్లునిశ్శబ్దముగానున్నను ఆయింట మరణము జరిగినట్లు లేదు.

రామచంద్రరాజుగారు కూర్చుండి కూర్చుండి పకాలున నవ్వెను. రథంతరి 'ఎందుకు నవ్వెదరు?' అనెను. రాజు 'మా నాయనను బెండ్లియాడుటచేత నీమె యదృష్టవంతురాలా? మాతల్లిని పెండ్లియాడుటచేత నాయన యదృష్టవంతుఁడా' యనెను. అరుంధతిని ధర్మారావును గృహమునకుఁ బొమ్మని సావిత్రమ్మగారు పంపించెను. ధర్మారావు పో నసఁగా రామచంద్రరాజు పంపించెను. ఇద్దఱు నింటికిఁబోయి స్నానముచేసిరి. ధర్మారావు విడిగాఁ బరుండెను. అరుంధతి 'ఏమి! తాఁకరాదా?' యనఁగా 'ధర్మశాస్త్రము కనుగొనవలయును. నాకు మైలయేమో' యనెను. 'తల సరిగాఁదుడుచుకొనుము. జేపటికి జలుబుచేసి జబ్బుచేయునేమో? అర్ధరాత్రివేళ స్నానము' అని పతి చెప్పఁగా నరుంధతి చీరయంతయుఁ బెట్టి యరగంటసేపు దీర్ఘశిరోజములు తుడుచుకొనెను.

తెల్లవాఱువఱకు రంగాజమ్మగారి మృతి యూరంతయుఁ బొక్కెను. జనము తీర్థప్రజ యయిరి. 'ఆహా! అమె చచ్చిపోయినట్లే లేదు. చావులోఁగూడ చిఱునవ్వు నవ్వుచునే చచ్చెను. ఏమిబ్రదుకు బ్రదికినది! రాజాబ్రదుకు! మహారాణివలె చచ్చిన' దనిరి. అందఱును జూచుటకు వచ్చినట్లే నాగన్నసెట్టియు వచ్చి విచారించి పోవుచు పోవుచు, ధర్మారావుతో 'బాబూ! ఒకమాట!' యనెను. ధర్మారావు వెళ్ళగా 'మాయింటిదాఁక నొకసారి వత్తువా?' యని తీసికొనిపోయి నోటుమీఁద వసూలువేసియిచ్చెను. ధర్మారా 'విది యేమి' టనెను. సెట్టి 'అయ్యా! నీసొమ్ము నాకెందుకు? చచ్చి స్వర్గానికి

వెళ్ళినది రంగాజమ్మగారు. ఈ నోటుబాకీ నా కిచ్చి యాఱునెల లయినది. ఆ నాఁడు సాయంకాల మావిడయే వచ్చి యప్పు వంద రూపాయలు మీ కిమ్మనియుఁ దాను దీర్చెదననియుఁ జెప్పఁగా నిచ్చితిమి. ఇదిగో నీనోటు' అని తెలియఁజెప్పెను. ధర్మారావునకు దుఃఖ మాకంఠముగ నయ్యెను. తలచింపిన కాగితము జేబులోఁబెట్టు కొని, యుబుకుచున్న దుఃఖము నదిమి పైకిరానీయక మఱల నచ్చ టికే పోయెను. రంగాపురమునుండి ధర్మశాస్త్రవేత్త యొక శాస్త్రి గారు చనుదెంచి దహనసంస్కారములు జరిపించెను. అచ్చముగా గంధపుచెక్కలమీఁదనే దహనమయ్యెను. దహనవేళ నూరు రూపా యల గోవును గొని రాజు దానమిచ్చెను. దహనమున కయిదువందలు వ్యయమయ్యెను. అపరకర్మ విరివిగాఁజేయునన్న ట్లున్నది. నాల్గు వైపుల బ్రాహ్మణులకును వార్తలు పోయెను. ఆ కబురు గాలియే యూఁదెను.

చివరిరోజుల కర్మలు వైభవముగా జరిగెను. రామచంద్రరాజు పదివేలు వెచ్చించెను. గోదాన మన్నచోటనెల్లఁ బ్రత్యక్షగోదానమే కాని ప్రత్యామ్నాయము లేదు. తెచ్చిన చెంబులు పీఁటలవద్దనుండి విరివిగానే జరిపెను. రాజుగారు సంస్కృతభాషాపరిచయము, స్మృతి జ్ఞానముకలవాఁ డగుటచేతఁ గర్మలో లోపము జరుగనీయలేదు. ధర్మారావుగారి యక్కలు, బావలును వచ్చిరి. హైమవతీ సూర్య నారాయణలు రామచంద్రరాజును బాగుగా నెఱుఁగుదురు. వారు రాజును పరామర్శచేసిరి. రాజుగారు రెండుహరికథలు చెప్పించెను. వీథినాటక మాడించెను. జనము 'జమీందారుగారిపట్టాభిషేకముకన్న రంగాజమ్మగారి మృతియే దివ్యముగా నున్న' దనిరి.

కర్మయయిన చివరిరోజున రామచంద్రరాజుగారును, ధర్మా రావును గూర్చుండిరి. రాజు ఇన్నా ళ్ళుత్సాహముగా నవ్వుచుఁ బ్రేలుచు నున్నవాఁడు కర్మయంతయు నయినతరువాత ధర్మారావును గాఁగిలించుకొని యేడ్వ నారంభించెను. ధర్మారా వతని నోదా ర్చెను. రాజు 'నాయనా! ఈ సంవిధానము చిత్రముగా లేదా? ఎక్కడి గంజాంజిల్లా. ఎక్కడి సుబ్బన్న పేఁట? నాయనగా రక్కడికిఁ బోవుట యేమి? ఈమె యాయనను బ్రేమించుట యేమిటి? నేను కలు

గుట యేమిటి? భిన్నవర్ణములవారము మనమిద్దఱము నన్నదమ్ముల మేమిటి? ఇంతదూరము వచ్చి, నాతల్లి వర్ణముచెడకుండ నిట్లు రక్షింపఁబడుట యేమిటి? ఆ యమ యా శీలము, ఆ దివ్యమైన మరణము, ఆ పాతివ్రత్యము చూడుము - అవతారచరిత్రమువలె నున్నదికాదా?' యని దీర్ఘనిశ్వాసము వదలెను. అది రాత్రివేళ. శుక్లపక్షము మొదటిరోజులు. పంచమియో, షష్ఠియో. ధర్మారావాకాశమువంకఁ జూచెను. చంద్రాస్తమయ మగుచుండెను. అస్తమించుచున్న చంద్రునిపై నల్లనిమేఘ మావరించియుండెను. పశ్చిమదిక్కున నల్లనిమేఘము లెడమెడముగాఁ బదిపదునొకండు నిశ్చలములై యుండెను. అస్తమించుచున్న చన్ద్రుంకాంతిచేత నామేఘముల నడిమిభాగమెల్ల దీప్తమై యా మేఘము లున్నతావు నల్లనై యాటువేళ నుప్పుకాలువ సముద్రముతోఁ గలసినచోటు చిన్నిచిన్ని పడెలుగా నల్లని మట్టిదిబ్బలుగా నున్నట్లు పశ్చిమదిక్కంతయుఁ బ్రకాశించెను. అదొక మధురమై వెన్నెలయుఁగాని చీకటియుఁగాని యొకకాల మంతరించుచున్నట్లు తోఁచెను. పిదప వాతఁ జీకట్లు పులుముకొనెను. లోకమున రసజ్ఞత నిశ్శేషముగా నంతరించెనా యన్నట్లు పశ్చిమమున మిగిలిన వెలుఁగురేకలుకూడ మాయమయ్యెను.

ఆరాత్రి ప్రొద్దుపోయి యింటికివచ్చిన ధర్మారావు నరుంధతి సాదించెను: 'మే మిద్దఱము నింట బిక్కుబిక్కు మనుచుఁ గూర్చుండవలయును. మీరు పొద్దుపోవువఱకును షికారులుకొట్టివత్తురు. వదినెలు, అన్నలును ప్రొద్దున వెళ్ళిపోయినప్పటినుండియు నిల్లు బావురు మనుచున్నది' యని. ధర్మారావు 'ఇది క్రొత్త సంగతియే. ఈ పోరిదివఱకెఱుఁగను. నీవు సుఖమొక్కటియే తెచ్చితి వనుకొన్నాను. కొంతగ్రంథము చంకనుబెట్టుకొని వచ్చితివి' అని యెత్తిపొడిచెను. ధర్మారావునకు రంగాజమ్మగారిస్మృతి యొకచిత్రమైన యనుభూతిని దెచ్చెను. రామచంద్రిరా జన్నమాట అతనిమనస్సులో సుడులు తిరుగుచుండెను. రంగాజమ్మగారు తనకార్యమున కంత సాయముచేయుట, యామెకుఁ దనయందంత ప్రేమ-తా నామెకుఁ జేసిన దేమియు లేదు. హృదయానుభూతియే చిత్రమైనది. అది యేమో యెట్లో అనుభవించును. ఒకొక్కక యల్పానుభూతి ఇద

మిథ్యమని నిర్ణయించుటకు వచ్చును. ఒక్కొక్క మహానుభూతి మనో వీథికి నందకయే యిందియములకు వచ్చును. సన్నిహితమై సువ్య క్తముకాక హృదయమునందే యేదో తెలియరాని చక్కిలిగింతపెట్టి నయట్లుండును. అది హృదయమునందే సన్నని తరంగముగ లేచి యింద్రియములదాఁకవచ్చి, వెనుకకుఁ బోవుచున్న సముద్రపు కెరటమువచ్చి యొడ్డునందుఁ దాకియుఁ బిల్లకాలువలోనికి రానీయక నీ రుపసంహరించుకొన్నట్లు తదనుభూతరంగము నింద్రియకుల్యల కెక్కనీయక దానిచివళ్ళుమాత్రమే తాఁకి మఱల నాతరఁగఁ దన యందే లయింపఁజేయును. అట్టి యొకయనుభూతిని ధర్మారావు పొందుచుండెను.

అరుంధతీధర్మారావు లేకశయ్యాగతులై యుండిరి.

అరుం—ఏమో యాలోచించుచున్నట్లున్నది. ధర్మా—రంగాజమ్మగారిని గుఱించి. అరుం—ఏ మని? ధర్మా—మన కార్య మునకు నేనీ యూరిలో నున్న నాగన్నసెట్టి నప్పడిగితిని. అతఁ డీయ నని మఱునాఁ డిచ్చెను. నా కప్పుడే యాశ్చర్యమయినది. ఆ డబ్బు రంగాజమ్మగా రిప్పించినదట! సెట్టి బాకీవసూలువేసి నోటు నాకుఁ దిరిగి మొన్న నిచ్చివేసెను. ఇదే గుప్తదాన మందురు. ఇట్టి గుప్తదానములుచేసినవారు మహాలోకము లేవో పొందుదురఁట. ఆ లోకముల సౌభాగ్యము చెప్పలేము. అరుం——మీరందఱును నాకుఁ జూడఁగాఁజూడఁగా మనుష్యులవలెఁ దోఁచుట లేదు. రంగాజమ్మగారు మఱీను. ఆమె యెవరో అప్సరఃస్త్రీ. లేకపోయిన నా యత్తరు లేమిటి? ఆ కస్తూరివాసన లేమిటి? ఆ వెలగల చీర లేమిటి? బ్రదికి నన్నాళ్ళు నా భోగ మేమిటి? చనిపోవుచుఁ గూడ నట్లే! ఏదో శాపము పొంది యీ భూలోకమునకు వచ్చినది. మఱలఁ దనదారి నామె పోయినది. ఆమె స్వర్గమే చేరియుండును.

ధర్మారా వరుంధతిని తనివిదీర ముద్దాడెను. అది యేమో చిత్రభావము. తన యానాటి ప్రియాసమాగమము రంగాజమ్మగారి కాత్మతర్పణముచేయుటగా నతఁ డనుకొనెను.

రామచంద్రరాజు సుబ్బన్నపేఁటలో నుండిపోవుటకే స్థిరపఱచెను. తుని వైపునకుఁ బనియున్నపుడు పోవచ్చును; రావచ్చును.

వలయునేని నచట రెండు మూఁడునెల లుండి వ్యవసాయముచూచు కొని పంటలయినతరువాత రావచ్చును. కాని యసలు నివాసము సుబ్బన్నపేటయే చేసెను. ఇదివఱకు నిచటికి వచ్చుటకు రథంతరి యడ్డంకిగా నుండెడిది. ఇప్పు డామెయే సుబ్బన్నపేట వదలి వెడలు నట్లు లేదు. ఆమెకు నిచ్చటి బంధువులమీఁద మమకార మెక్కువయినది. మంగ యొక్క తె చిత్రమైన మనిషి. ఆమె రథంతరితోఁ జమత్కారముగ మాట్లాడును. తోడికోడ లరుంధతి రతనాలసొమ్ము. ఆమె తన్నుఁ జూచినపుడెల్లఁ బ్రాణము నిచ్చుచుండెను. ఆఁడుబిడ్డ గిరిక. ఆ పెండ్లికూఁతు రొక ముద్దరాలు. దానితో మాటలాడుటతో రథంతరికి భోజనమైన నక్కఱలేకుండెను. రామేశ్వరశాస్త్రిరాజు మంగనుగాని, యరుంధతినిగాని. దేవదాసినిగాని వదలియుండఁడు. వారిమీఁదికి దూకును. వారిదగ్గఱనుండి తల్లిదగ్గఱకైన రాఁడు. సావిత్రమ్మగారిదగ్గర మఱీ చనవు. ఆయమ మనుమని ముద్దాడియాడి యింటికిబోయి స్నానముచేయును. రోజున కొకసారియైనచంక నెత్తనే వలయును. అరుంధతీ గిరికా రథంతరుల సమాగమములు విచిత్ర సన్నివేశములు కాఁజొచ్చెను. ప్రొద్దువాటారును. దేవదాసి రామచంద్రరాజుగారియింటికిఁ బోవును. అరుంధతికూడ పోవును. దేవదాసి 'వదినెగారూ! జడవేయుదురా?' యనును. 'నాకు మీయిద్దరిలో నెవరు వేసినను సరే' యను నామె. రథంతరి 'పిల్లా! నీకు జడవేసిన నేమి యిచ్చెదవు?' యనును. అరుంధతి 'ఏ మిచ్చును? ఒక ము ద్దిచ్చును' అనును. రథంతరి 'దీని ముద్దులు నాకు వలదమ్మా! మన మేమి గొల్లవాండ్రమా? గోడివాండ్రమా?' యనును. గిరిక మొగముముడుచు కొనును. అరుం—రావే పిల్లా! నేను వేసెదను. అ దేమి నీ ముద్దు మొన్న వెన్నవాసన వేసినది? రథం—అరుంధతీ! ఇది బాగులేదు. నిన్నా పిల్లను ముద్దుపెట్టుకొమ్మన్న దెవరు? నీవు దానితప్పులు వెదకుట యెందుకు? దాని ముద్దు వెన్నవాసనయో, మీగడ వాసనయో? వెన్న తిని యెవఁడు దానిని ముద్దాడెనో మన కేమి తెలియును? అరుం—ఎక్కడనైన తాంబూలము వేసికొనిననోట ముద్దాడుదురు. మా మఱఁదలుపిల్ల నట్లు గాదమ్మా! ఇది వేఱు.

గిరికకుఁ గోపమువచ్చి లేచిపోవును. రథంతరి యామెను బోకుండఁబట్టుకొని చెంపపైఁ జిటికెవేసి 'ముత్తాని కాఁడుబిడ్డతనము పోనిచ్చితివి కావు. నిన్ను మే మేమైన నన్నామా? ఎవరైన మాత్రము నాలుఁగుమాట లనకుండ జడవేసెదరా? ఎక్కడికిఁ బోదువే; రేపల్లెపోదువా, బెజవాడ పోదువా? ఉన్నయూరిలో నుండ రాదా? ఇచ్చటమాత్రము గొల్లకొంపలు లేవా?' యనును. అక్కా చెల్లెండ్రిద్దఱును విఱుఁగఁబడి నవ్వుదురు. గిరిక తప్పించుకొని పోఁబోవును. రథంతరి 'ఒసేస్ దీని నిట్లు కాదే! ఆత్రాఁడుతెచ్చి యీ స్తంభమునకుఁ గట్టివేయుము. ఆ దశ దీనికిఁగూడ జరుగవలయును. రా' యనును. అరుం—పోదులే వమ్మా! పసిపిల్ల నెంత యారడి పెట్టెదవు. రావమ్మా! గిరి కా! నేను జడ వేసెదను. నాజడ నీకు బాగుందునా?' తరువాత గిరిక మాట్లాడదు. అరుంధతియో, రథంతరియో చివరకు జడ వేయుదురు. వేసినంత సేపును బరాచకములే యాడెదరు. అరుంధతి యొకనాఁడు జడ వేయుచుఁ దనకు రాజ్యలక్ష్మమ్మగారు నేర్పిన విద్య మఱఁదలిమీఁదఁ బ్రయోగించెను. అరుంధతి యన్నది కదా: 'పిల్లా! జాగ్రత్త! నీ వసలు పేఁపబెత్తమువంటిదానవు. నీ జడ కూడ బెత్తమువలెనున్నది ఒడలు తెలియక స్వామిని దీనితో మోఁదెదవు సుమా?' అని. ఆ మాటయన్నంత నే గిరిక తలఁచుకొని, తలఁచుకొని యేడ్వ నారంభించెను. అక్కా చెల్లెండ్రిద్దఱును భయపడి యామెను బుజ్జగించి యోదార్చి 'ఎందుకే యేడ్చెదవు?' అని బతిమాలి యడిగిరి. గిరిక చివరకు 'స్వామి యొకనాఁడైనను నాకు దర్శనమీయ లేదు. మీ రేమో నన్ను యెత్తిపొడవకుండ నొకమాటయు ననరు. నా కీ యప్రతిష్ఠ యెందుకు?' అని పరిదేవనము చేసెను. ఇద్దఱు పెదవులు కొరుకుకొని యూరకుండిరి.

దేవదాసి యంతకుఁ బదినాళ్ళకుముందునుండి తీవ్రముగా నుపవాసాదులు ప్రారంభించెను. ఉపవాసమున్నన్నాళ్ళు పగలెల్ల భజనలే చేయును. ఈ భజనలతో రత్నగిరియిల్లు వైకుంఠమైపోయెను. ఎవ్వరును నామె నెంతబలవంతము చేసినను నన్నము తినిపించ లేదు. తినిపించఁగలవాఁ డొక్కఁడే. అతఁడు ధర్మారావు. 'అతఁడు తిను

మని చెప్పెను. అతనికి ననుమానమే; తనమాటయు నా విషయమున సాగునో, సాగదో యని.

నిజమునకు వెనుక గుప్పుటములాగుండు దేవదాసి నెల కెని మిదిదాఁక నెగఁబ్రాఁకిన యీ యుపవాసములతోఁ జిక్కి సగ మయ్యెను. ఆమెయొడ లుష్ణమెక్కి శైత్యోపచారము లెక్కువ వాంఛించుచుండెను. కాని, యామెమొగము రోజురోజుకు వేసఁగి నదివోలె యొకశోభ పెంచుకొనెను.

ఆ నాఁ డేకాదశి. దేవదాసియు, నరుంధతీ రథంతరులును గలసి దేవాలయమునకుఁ బోయిరి. రుక్మిణమ్మారావుగారుకూడ వచ్చిరి. ఆమె యరుంధతి నెఱుఁగును. రథంతరి నెవ రని యడిగెను. 'రంగాజమ్మగారి కోడ' లని యరుంధతి చెప్పెను. దేవదాసి యెప్పు డుపవాసము లున్నదినములలో నాలయములో నెవరితోడను మాటా డదు. ఆమె శరీరమునందు సంపూర్ణయావనోదయమైనది. తెల్లనిచీరె దాల్చి జుట్టుదూముడివేసి యుపవాసములచేత సన్ననైన శరీరము నందు గఠినములైనయురోజములు మఱియు విస్పష్టముగా నెదురు బొమ్మబికినట్లు చిక్కియున్న నడుమునూలమున మఱియు శోభ తేగా నర్ధనిమీలితనేత్రములతో దేవదాసి రాణివంక చూడనట్లేచూచెను. రుక్మిణమ్మారావుగారు మనసులోఁ 'కృష్ణా! కృష్ణ' యనుకొనెను. అరుంధతీరథంతరులుకూడ నుడికట్టుకొని యామెకిరువైపుల నడచు చుండిరి. రాణి వారి వెనుకనే పోవుచుండెను.

అందఱు నాలయములోనికిఁ బోయిరి. ఈ రోజులలో వేణు గోపాలస్వామి గుడి ప్రత్యేకముగా దేవదాసికొఱకే తెఱువఁబడు చుండెను. అర్చకుఁడు స్వామిచూడామణి క్రిందఁబడినప్పటినుండియు మఱికొన్నిసంఘటనలచేత దేవదాసిమహత్తు తెలిసికొని యామె వచ్చినదనఁగానే ద్వారబంధము తీయును. ఆమె 'నమ్మా' యని పిలుచును. యనసులో నతనికిఁగూడ నొకవిధమైన మార్పు కలిగెను. ఆలయములో నున్నంతవఱకు నతఁడు రాణిగారికన్నను దేవదాసినే యెక్కువ గౌరవించును.

అందఱు నాలయాంతర్భాగమునకుఁ జేరినంతనే దేవదాసి చేతులు మొగిడ్చి నమస్కరించి స్వామిపాదములవంకఁ జూచి, 'ఈ

చరణమ్ములే యిందునిభానన! సనకాదిమునియోగసరణి నొప్పు, ఈ పాదములె యెలనాగ! శ్రుతివధూసీమంతవీథులఁ జెన్నుమిగులు' అని చదువుచుఁ బాష్పలోచనయై యూరక వెక్కి వెక్కి యేడ్వఁదొడఁగెను. తోడికోడండ్రిద్దఱును వివర్ణవదనలై యామెను జెరియొక వైపుననుండి పడకుండఁజూచుచుండిరి. రాణి నిశ్చేష్టురాలై పోయెను. ఆలయములోనున్న సామి తొందరపడుచున్నట్లు తోఁచెను. క్రిందఁబడినను పట్టుకొనువా రున్నారుకదా యని స్వామి ధైర్యమందెను. కాని లేకపోయిన నేమి నిలువఁగలఁడు? ఆయనకుఁ గా ళ్ళాడుటలేదు!

దేవదాసి మఱల నాఁగి "కిటియై కౌఁగిటఁ జేర్చెను, వటుఁడై వర్ధిల్లి కొలిచె, వడిఁ గృష్ణుండై యిటఁ బదచిహ్నము లిడెఁ, గ్రిందటి భామున నేమి నోఁచితివమ్మ ధరిత్రీ!' యని నేలపై కొఱిగెను. ఇద్దఱును బట్టుకొని యామెను నెమ్మదిగా బలిపీఠముండుచోటఁ బరుండఁబెట్టిరి. దేవదాసికిఁ జాలసేపటివఱకును స్మృతిరాలేదు. కొంతసేపటికామె కనులు తెఱవఁగా వారిద్దఱు నామెను లేవఁదీసి నిలుచుండఁబెట్టిరి. అర్చకుఁడు శఠగోపమిచ్చెను. అందఱును దీసికొనిరి. అందఱు నాలయమునుండి వెలికివచ్చిరి. అర్చకుఁ డిచ్చిన ప్రసాదము స్వీకరించి యందఱును గృహాభిముఖులైరి.

రాణి—అమ్మా! సెలవు. గిరికను జాగ్రత్తగాఁ దీసికొనిపోవుఁడు. పూర్వజన్మసుకృత మొక్కొక్కరికి యొక్కొక్కరీతి. ఆమెకు మీ రిట్లు తోడునీడ లగు సుకృతము మీఁది.

మఱునాఁడు రాణిగారు ధర్మారావును జూచిపొమ్మని కబురంపెను. ధర్మారావు కోటలోనికిఁ బోయెను. రాణిగారు ధర్మారావునకు డబ్బిచ్చి చదివించుచున్న దని యిప్పు డందఱకుఁ దెలియును. కనుక నతఁడు కోటలోనికిఁ బోవుట యెవరికిని వింతగా లేదు. ఈ సంగతి రామేశ్వరంగారు మొదలయినవారికిని దెలియును. జమీందారుగారే తెలిసి యూరకుండిరి. అందుచేత నిఁగిలినవారు నూరకుండిరి.

ధర్మారావు రాణిగారిని జూచినంతనే యామె లేచి నిలుచుండెను. ధర్మారావు కొంచెము కలఁతపడి 'అమ్మా! అది యేమిటి?

నాకు మీ యీ గౌరవ మేమిటి? నేను మీ బిడ్డఁడను. మీ రిట్లు చేయరాదు' అనెను.

రాణి—బాబూ! నేను నీ బిడ్డను. నీవు గిరికను రక్షించినట్లు నన్నుఁగూడ రక్షింపవలయును. ధర్మా—తల్లీ! అది నాచేతిలో నున్నదా? నాచేతిలో నున్నచో నన్ను నేను రక్షించుకోలేనా? ఎవరిపూర్వజన్మసంస్కార మెట్టిదో వారి కట్టిమార్గమున నడచును. గిరికను నేను చేసినదేమియు లేదు. ఆమె దేవదాసీత్వభావమంతయి గూడుకట్టిన మూర్తి. వందలయేండ్లుగా మనదేశమున నున్న యీ సంస్థ నశించిపోవు నీ వాళ్ళలో నామె యొక్కసారిగాఁ దనమాహాత్మ్య మంతయుఁ జూపుటకు వెలసిన మూర్తి. తల్లీ! ప్రాఁతదంతయుఁ బోవుచున్నది. క్రొత్తదంతయు వచ్చుచున్నది. రంగాజమ్మగారిని జూడుఁడు. ఆమె పూర్వపుభావోన్మాదము, పాతివ్రత్యము వర్ణస్వచ్ఛతకుఁ జిహ్నమైనమూర్తి. అవియన్నియు నామెతో నంతరించినవి. కృష్ణమనాయఁడుగారు పూర్వరాజచిహ్నము. ఆయనతో నది పోయినది. దేవదాసితో దేవదాసీత్వమే నశించిపోవును. మీతో మా రాజ్ఞీత్వము నశించును. తెలుఁగుసంప్రదాయ మెఱిఁగిన రాణి మీతోనే యాఖరు. నేను మీ యందఱును నశించిపోవుచుండఁగాఁ జూచుటకుమాత్రము పుట్టినమూర్తిని. నేనును నీ కాలమునకుఁ దగిన వాఁడను గాను. ఇవియన్నియుఁ జచ్చిపోవుచున్న యొకజాతి చివరి మెఱుపులు.

# ఎనిమిదవ అధ్యాయము

ఆషాఢశుద్ధపాడ్యమినాఁడు ధర్మారావు రాత్రిపదిగంటలవేళఁ గూర్చుండి యేదో వ్రాసికొనుచుండఁగాఁ గనులు మిఱుమిట్లుకొనెను. తలయెత్తి పడమటిదిక్కుఁ జూచెను. తనకన్నులలో నాడిన క్రొక్కారు మెఱుఁగుపోయి దూరమున నుత్తరముల్లో దట్టముగాఁ గ్రమ్మిన మబ్బువెనుకఁ జీల్చుకొని యంతవిస్పష్టముగాఁ గన్పించలేని వర్షాలక్ష్మి కన్నుఁదెఱచి మఱల మూసినట్లు కొంచెముతెల్లనై మఱలఁ ముసుఁగు పడెను. తూర్పుదక్షిణములనెల్ల నాకాశము నిర్మేఘముగ నుండి తారకలు ప్రకాశించుచుండెను.

మఱలఁ బాఠశాలలు తెఱచిరి. భార్యతోఁ దల్లితో ధర్మారావు గుంటూరు చేరెను. రథంతరి తోడికోడలిని, నత్తగారిని దిగవిడచిపొమ్మనెను గాని, యరుంధతి యేకాంతమున మగనివెంటనే పోవుటకుఁ బోరాడెను. దేవదాసిని ధర్మారావు రథంతరి కప్పఁజెప్పెను.

క్రొత్తభార్యతో సంసారము. ధర్మారావునకు రాణిగారు పంపించు నేఁబది రూకలు జీతములుకట్టుటకు, నింటియద్దెకు, సంసారము సాగించుటకుఁ జాలినది కాదు. అవి బియ్యపుకంట్రోలుదినములు. రూపాయిబియ్యము దొరకునప్పటికిఁ దలప్రాణము తోఁకకు వచ్చుచుండెను. అమెరికానుండి కిరసనాయిలు వచ్చుటలేదు. పదిరూపాయలింటియద్దె. ధర్మారావునకుఁ గాళ్ళుచేతులాడలేదు. ఇన్ఫ్లూయంజా జ్వరములు దేశములో కప్పుడే క్రొత్తఁగా దిగుమతియయినవి. ధర్మారావునకా జ్వరమువచ్చి వారమురోజులు మంచమున నుండెను. ఇంతలో నా యూరఁ గలరా పెల్లురేఁగెను. జనము రోజునకు నలుఁబది యేఁబదిగా మరణించుచుండిరి. పాఠశాలలు నెలరోజులుమూసిరి. మొదటినెలలో రాణిగారినుండి దెచ్చిన డబ్బంతయు సంసారము మొదలుపెట్టుటకు, జీతముకట్టి పాఠశాలలోఁ జేరుటకు నైనది. తరువాత నామె పంపించిన డబ్బు డాక్టరుబిల్లులకు, నింటియద్దెకుఁ, బాలకుఁ, బండ్లకు నైనది. సెలవులీయఁగా నింటికిఁబోవుటకు వీలులేక

పోయినది. ఊరిబయటఁ బాకలువేసి పురపాలకసంఘమువా రందు లోనికిఁ బొమ్మని జనుల నొత్తిడిచేయు నారంభించిరి. అదివఱ కెట్లున్నను బాకలలోనికిఁ జేరినతరువాతఁ బయటపడుట వట్టిది. ప్రతి చిన్నసంగతికిఁ జంద్రహారము 'నన్నమ్మను, నన్నమ్మను' అని హెచ్చరించును. చచ్చిన కృష్ణమూర్తి యుడుకు, బ్రదికి దూరము నున్న రుక్మిణమ్మారావుగారును దీనముగాఁ జూతురు. ధర్మారావు ప్రాణములు మెలికలు తిరుగును.

పురపాలకాధ్యక్షునకు ధర్మారావునకు వెుగ మెఱుక. ధర్మారావు కవియని యాయన యెఱుఁగును. దానితో నీబెడఁద యట్లట్లు తొలిగిపోయినది. ఇంతలో నీ మహావ్యాధియుఁ బురమునందలి దుర్వాసనయుఁ జాలవన్నట్లు వానలు లంకించుకొన్నవి. మనిసి బయటకుఁ బోవుటకు వీలులేనట్లు వీథు లన్నియు జలమయ మయ్యెను. సందులన్నియు బురదలయ్యెను.

ఒకనెలనాళ్ళు చాలగడ్డుగాఁ గడచెను. మఱలఁ బాఠశాలలు తెరచిరి. కలరాయును వెనుకఁబట్టెను. వర్షములు కొంచెముతగ్గెను. సుబ్బన్నపేటనుండి డబ్బు రాలేదు. జ్వరముపడినతరువాత ధర్మారావు మఱల సరిగాఁ గోలుకోలేదు. ఊరిలో నన్నిచోడల నప్పులు. కంట్రోలు, కిరసనాయిలు కఱవు రోజురోజును మితిమీఱిపోవు చుండెను.

దారిద్ర్యమంతయు మఱల ధర్మారావు నాశ్రయించెను. ఆహా! అదృష్టమన్న నతనిదే యదృష్టము! పదునూఁడేండ్లు రాకముందు, అతనికి బుద్ధి తెలియకముందు సుఖమేమిపడెనో తరువాత నిప్పటి కిర్వదినాలుఁగేండ్లు వచ్చెను. సుఖ మన్నది యెఱుఁగఁడు. అరుంధతి తోడఁ గొన్నిరాత్రులుమాత్రము స్వర్గసుఖము చూచుకొనెనుగాని సంసారములోనికిఁ దిగినతరువాత నామెను సుఖపెట్టలేదు, తాను సుఖపడలేదు. ఇంతకును ధనప్రాప్తిలేదు. 'ధనమూల మిదం జగత్' అన్న లోకోక్తి బహుప్రయోగముచేతఁ దాఁజెప్పునర్థమునుగూడ విస్పష్టముగాఁ జెప్పలేక తత్ప్రయోగము జరిగినట్లు జరగనట్లును గాక యుండెను. లోకమునందలిశబ్దప్రయోగ మే కాదు, మహాకఠినములైన యాపదలు నంతియు. మొదట మనము వానినిజూచినప్పు డున్నంత

మనఃకష్టము తరువాత నుండదు. ప్రతిరోజును గనులార ననుభవించ రానిదుఃఖము లనుభవించుచున్న పేదవారిని భిక్షుకులను జూచుచునే యున్నాము. వారినిగురించి మనమూహించుటగూడ మానివేసితిమి. మానిసిహృదయమునకుఁగూడ సర్వవేళల బాధననుభవించు శక్తి లేదు. దుఃఖముకూడ నావేశముగా వచ్చును. మఱల నదే తగ్గిపోవును.

ఒకఁడు దారిద్ర్య మనుభవించుచుండును. వానితో మనకుఁ ప్రథమసమావేశవేళ 'నయ్యో పాపము' అని జాలిపడెదము. ప్రతిదిన మతని గలిసికొనుటయే, యతని దీనకథలు వినుటయే, క్రమముగా నది యలవాటైపోవును. మహావ్యాధిచే బాధపడువానిని జూచి యూరకున్నట్లే, దరిద్రుని గాంచియు నూరకుందుము. ఊరకుండక చేయునదియు నేమియులేదు. ఒకానొకధనవంతుఁడు పేదగుండె వాఁడు దరిద్రున కొకనికి సాయపడును. తక్కినవారందఱు నేమి కావలయును? ఎంతమంది కని సాయపడును? దారిద్ర్యముకూడఁ బూర్వజన్మకృతకర్మఫలము. అనుభవించ నే వలయును. అనుభూతిచేఁ గాని కర్మ నశించదు. ఏనాఁడో యెవనికో పెట్టలేదు, ఈనాఁడు దొరకలేదు– ఇది తత్త్వము. ఒక బ్రాహ్మణుఁ డొకనాఁడు పంచాదిలోఁ గూర్చుండి భోజనముచేయుటకు విస్తరాకు లంటఁబొడుచుకొనుచుండఁగా నిం కొకబ్రాహ్మణుఁ డుపాదానమునకు వచ్చెనఁట. గృహస్థు 'మూఁడుజన్మలదరిద్రుఁడు వచ్చెను, కొంచెము ముష్టి వేయవే' యనెనఁట! ఆ యుపాదానమునకు వచ్చినవానికిఁ గోపము వచ్చి గృహస్థును గోపించెను. గృహస్థు 'అవునయ్యా! పూర్వజన్మములో నీకు లేదు; ఎవరికిఁ బెట్టలేదు. అందుచే నీజన్మలో దరిద్రుఁడవైతివి. ఈ జన్మలో దరిద్రుఁడ వెవరికిఁ బెట్టలేవు. ముందు జన్మలో నిందుచేత దరిద్రుఁడవు. మూఁడు జన్మలయందు దరిద్రుఁడ వగుదా, కాదా?' యనెనఁట. కావున నెప్పటికైన నెవనికైనఁ బెట్టనే వలయును. పెట్టనిరోజులలో రానే రాదు. ఉన్నంతలోఁ దనకన్న లేనివాని కిచ్చుచుండనే వలయును.

ధర్మారావున కింత కష్టముగా నుండెడిది కాదు. బిచ్చములో బిచ్చ మన్నట్లతఁడు తనకన్నఁ బేదవారి నేఱి వారికి దానములు చేయుచుండును. తనయింట నిద్దరు పేదబాలురకు వారము లిచ్చెను.

ఒక స్కూలుఫైనల్ విద్యార్థి మఱి నిఱుపేద-యతనికి నెలకుఁ బది రూపాయలుగాఁ గడచిన యేఁడాదియంతయు నిచ్చెను. అతఁడు పరీక్షతప్పి మఱలఁ జదువుటకు రాఁగా వానికి జీతముకట్టెను. ఇది యొకహేతువై యతని కిబ్బందియయ్యెను. మఱల రెండు నెలలు గడచెను. రాణిగారు డబ్బుపంపించలేదు. పాఠశాలలోఁ జీతములు పెరుఁగుచుండెను. వారు పేరుతీసివేసెద మనుచుండిరి. నిఱుపేద విద్యార్థి యింటిచుట్టు తిరుగుచుండెను.

ఒకనాఁడు ప్రొద్దునలేచెను. తల్లి 'యింటిలో బియ్యములే'వని చెప్పెను. అతఁడుపోయి యేమిత్రుఁడయిన రెండురూక లప్పిచ్చునేమో యని తిరిగి తిరిగి యింటికి వచ్చెను. తల్లి యతఁడు బియ్యము తెచ్చునని కూర్చుండి కూర్చుండి, వట్టిచేతులతో నింటికివచ్చిన యతనిని జూచి, యుస్సు రని కొంగుపుచ్చుకొని పొరుగిళ్ళ కప్పునకుఁ బోయెను. ఇదివఱకే యందఱకు నప్పులు. ఎవ్వరు నిచ్చిరి కాదు. చివర కూరకే యింటికి వచ్చెను. ఏమి చేయవలయునో దోఁచలేదు. ధర్మారావు బియ్యపుకొట్లవద్దకుఁ బోయి యప్పడిగెను. ఇదివఱకు వారికిని నప్పు లున్నవి. చివరి కొకఁడు వందదెప్పులు దెప్పి యొక రూపాయబియ్యము కొలిచెను. అవి యింటికి వచ్చువఱకు రెండు జాము లయ్యెను. 'ఈ లోపుగా వంటచేయుము. నేను పాఠశాలకు వెళ్ళెద' నని తల్లితోఁజెప్పి యతఁడు నకనకలాడుమొగముతో బడికిఁ బోయెను. జీతములు ప్రాంతబాకీలున్నవారి పేరులు హాజరుపట్టీలోఁ గొట్టివేసి వారందఱ నింటికి బంపించిరి. ధర్మారావు పోయినకాళ్ళతోనే యింటికిఁ దిరిగివచ్చెను. తల్లి యన్నము వండెను. అన్నములోనికిఁ బదార్థములేవియు లేవు. ఆమె చింతపండు పచ్చడిమాత్రము చేసెను. ధర్మారావు భోజనమునుముందుఁ గూర్చుండెను. చేతిమీఁదికి నేతిబొట్టు లేదు. ఆ యొక్కపచ్చడితోఁ దినలేకపోయెను. అతనికిఁ గన్నులవెంట నీరువచ్చెను. రెండునెలలనుండి బాకీయయినను దాని యమ్మకడుపు చల్లగా మజ్జిగపోయునది మజ్జిగపోయుచునే యుండెను. అతఁడు చల్లపోసికొని లేచెను. ఆఁకలి తీఱలేదు. తల్లియు భార్యయు నట్లే భుజించి లేచిరి.

తల్లి కొక్కుడే ధోవతి, భార్య కొక్కుడే చీర. అరుంధతిచీర యెండవేసికొని దుప్పటిచుట్టుకొని చీర యెండువఱకు గూర్చుండెను. ధర్మారావు పోయి చూచెను అతనికి దుఃఖము పొంగిపొరలివచ్చెను. అరుంధతి చూచి 'బాగున్నది. నాచీరలన్నియు రంగాపురములో నున్నవి. మీరు పోయి తీసికొని వచ్చితిరి కా దామెను. ఇదికూడ దారిద్ర్యములోనే లెక్కయా! చాలు లెండు' అని యోదార్చెను. అతఁడు పోయి గదిలోఁ బండుకొనెను. వారు కాఁపురమున్నవారి దొడ్డిలో బాదముచెట్టున్నది. సావిత్రమ్మగారి యాఁకులు వాసములోఁ గొట్టి యవి విస్తరికుట్టును. ఆ యింటియజమాని పరమలోభి. అతఁ డామెతో నాఁకులు కొట్టినందుకుఁ బోట్లాడును. ఈ పోట్లాట యొకటి ధర్మారావు మంచముమీఁదఁ బరుండఁగా వినవచ్చెను. అయ్యో! అన్నివిధముల నతనికి దుఃఖమే పొడసూపుచుండెను.

అరుంధతి భోజనముచేసి గదిలోనికి వచ్చెను. ఆమెవంకఁ జూచుటకుఁగూడ మనసొల్లక ధర్మారావు వైపు మొగమిడి పండుకొనెను. అరుంధతి యీమూఁడునెలలుగాఁ దిండి సరిలేక కృశించిపోయెను. ఆమె యెఱ్ఱని శరీరము కప్పువేసిపోయెను. ఆమె దేహమున లావణ్యముపోయెను. చిక్కి సగమునకు సగమైపోయెను. కాని మొగమున సౌందర్యము లేశమును దగ్గలేదు. ఆమె పతి తనవైపు చూచుటకుఁగూడ శంకించుచుండె నని తెలిసికొని పోయి యతని బార్శ్వశాయినియై కౌఁగిలించుకొని 'ఇ దేమి! సంపదలు మనము గొనితెచ్చితిమా! ఇందు మీదోస మేమి కలదు? నాయందు మీ రేమో యపచారము చేసినట్లు మొగ మావలకుఁ ద్రిప్పుట నాకు రుచిగాలేదు. నాకన్న మీరే యా గర్భశ్రీమంతులు. మీ కన్న నేను సుకుమారురాలను గాదు. కష్టముల కేమి? అవి మీరు చెప్పినట్లు హరిశ్చంద్రాదులకుఁ దప్పలేదు. నామాట విన్నారా! ఇదిగో నవ్వుఁడు. నా వైపునకుఁ దిరుగుఁడు. నవ్వకున్న నామీఁద నొట్టు' అని యతనిని బలవంతముగాఁ దనవైపునకుఁ ద్రిప్పుకొన యతనికిఁ జక్కిలిగింత పెట్టి గడియంతయు నవ్వులారఁబోయించెను. దానితో ధర్మారావు నానాఁటిమనోదైన్యము మాయమయ్యెను.

ప్రతిదినము రెండుపూటలకుఁ బ్రొద్దుననే యొక్కసారియే యన్నమువండుదురు. వంటచెఱకు కాదా చేయుటకు నిది యొక మార్గము. కిరసనాయిలు దొరకక సూర్యాస్తమయము కాకముందే భోజనముచేసి శయనింతురు. సావిత్రమ్మగారు పిండిచేసికొనలేక ప్రతి దిన మేకభుక్తముండి యట్లే నిద్రించును. ప్రొద్దుక్రుంకినంతనే చీఁకటింటిలో నేమి తోఁచును? రాత్రి పొద్దుపోవువఱకు దొడ్డిలోఁ గూర్చుండి కాలయాపన చేయుదురు. ధర్మారావు పురాణకథలు, పిట్టకథలు చెప్పి కాలక్షేపము జరుపును. సావిత్రమ్మగారు తన చిన్ననాఁటికథలు తనసంసారముచేయునాఁటి రామేశ్వరశాస్త్రిగారి విచిత్ర వృత్తాంతములు—నివి చెప్పును. అరుంధతి యెప్పుడును శ్రోతయే. వాన యుండెనా, మొద్దుముప్పులు లున్నవి: అవి యన్నికథలు తామే చెప్పును.

కడుపులోఁ దగినంత యాధారములేక నిద్ర వెంటనే రాదు. వచ్చెనా, యొకటియే నిద్ర! ధర్మారావునకు మఱునాఁటిసంగతి యేమి యని మనసులో మథన ప్రారంభించెను. అరుంధతి యతని ప్రక్క సుఖముగా నతనిదుఃఖము పంచుకొని దానివలె నిద్రించెను.

మఱునాఁటికి రోజుగడచు తెఱవు కన్పించలేదు. బియ్యము మఱల నాలుఁగురోజులకు వచ్చును. తక్కినసంబారము లెక్కడ? అప్పు లఱువది యెనుబది రూకలదాఁక పెరిఁగియుండెను. అవి తీర్చుట యెట్లు? ఇంకఁ దనకు గుంటూరులోనుండు ప్రసక్తియే లేదు. సుబ్బన్నపేటకుఁ బోవుదమా? పోదమన్నను దారిఖర్చు లేదు. రాణిగారు డబ్బేల పంపించరు? పోయి కనుఁగొనివత్తమన్న జేతఁ గాసులేదు. నాలుఁగురూపాయలు చేబదులుకొఱకు మార్గమైనఁ గనిపించలేదు. ఊహాసోపానములమీఁద, నతనిచేయి చంద్రహారముమీఁదఁ బడెను. ఇది చిత్రముగా నున్నది.

పరమదరిద్రు నింటఁ బూర్వు లిచ్చిన పూజామాణిక్యమున్నది. అది దేవతాప్రసాదము. దాని నమ్మినచో దారిద్ర్యము పటాపంచ లగును. కాని పూర్వులశాపమున్నది? అది పూజించఁ దగినదే కాని యమ్ముకొని తినరాదు. అమ్మినచోఁ బూర్వుల కందఱకు నరకలోకప్రాప్తి. చంద్రహార మిట్టివస్తువుగాఁ గన్పించెను.

దారిద్ర్య మున్న న్నిదినములు తనచేయి చంద్రహారమును దగులరాదని ధర్మారావు నిర్ణయించెను. కాశికిఁబోయి ప్రియమైన వస్తువు పరిత్యజించివచ్చిన ట్లతనికిఁ బ్రియావక్షస్స్పర్శయే దీనితోఁ బరిత్యాజ్యమైనది. ఆ సంగతి యతనికి మరునిముసముననేగాని విస్పష్టముగఁ దెలియలేదు. సగము నిద్రలో నరుంధతి పతివైపు మఱలి, యతనిచేతులు తనయెదుఱొమ్ముపైకిఁ దీసికొనఁబోయెను. ధర్మారావు తద్గతచంద్రహారస్పర్శభీతిఁ జేతులు వెనుకకులాగికొనెను. అరుంధతికి వెంటనే మెలఁకువ వచ్చెను. పతి మేల్కనియే యున్నాఁడు. తన చేతులు వెనుకకు లాగుకొనుట బుద్ధిపూర్వకముగ నాచరించినపనియే. తా నేమి తప్పు చేసెను? సహవాసము చాల చెడ్డది. ధనముతోఁ గాని, ధనవంతులతోఁగాని చెలిమి పాఁపచెలిమి. అది ధన మున్నంత వఱకే యుండును. ధనము తా నున్నచోట స్నేహమును జేరనీయదు. ధనమున క దేమి రోగమో? స్నేహము, మార్దవము, దయ మొదలయిన సర్వదేవతాగుణములను తనవి కా వనును. అరుంధతీదేవి యంతర్హృదయముతో నేమియు సంబంధములేని యీ చంద్రహారము తనస్థితిదోషముచేతనే యామెకు విరోధియయ్యెను. ఈ బంగారము హేయము.

అరుంధతి దీనములైనకనులతో భర్తముఖమువంకఁ జూచెను. ఆతఁ డామెచెక్కిళ్ళు రెండుచేతులతోఁ జాచి, యాచేతులు ముద్దిడుకొనెను. ఆమె యతనిని కౌఁగిలించుకొనఁబోయెను. అతఁడు దూరముగాఁ బోయెను. అరుంధతి కర్థము కాలేదు.

ధర్మా—'ప్రియా! ఏటి కంత గగ్గోలు పడెదవు? ఆ చంద్రహారమును నేను స్పృశించను. దానికిని నాకును సంబంధ మేమి? హేయమైనధనమును నేను స్పృశించను. అందులో నది నాది కాదు. తద్గతలోభమును నాకుఁ బోలేదు. ఇంద్రియములను దడవినంతసేపు నింద్రియములు చేయు దురాకర్షణకు మనమనస్సులు లొంగుచునే యుండును. వానిని జయించవలయునన్న వాని ప్రసక్తియే యుంట గాదు. అట్లే యీ చంద్రహారమును గూడఁ దాఁకరాదు. అది నా యొడలికిఁ దగిలినంతసేపు నాకు దాని మీఁద వ్యామోహము తీఱునట్లు లేదు. అది నాకుఁ బరిగ్రాహ్యము కాదు. కానపుడు నేను దానిని

స్పృశించను. ఇది నీమీఁదఁ గోపము కాదు' అని యామె చెక్కిలి మఱల స్పృశించెను. అరుంధతి యాలోచనలో దిగెను. తనకు భూషణమైనది దూషణమైనది.

అను—'ఇనుముతోఁగూడిన యగ్నికి సమ్మెటపె ట్టన్నట్లు చంద్రహారము ధరించినంతమాత్రమున నా కీ యనాదర మేల? నిజమునకు నా కిది యలంకారముగాఁగూడ లేదు. చేతులకు నేమియు లేవు; నడుమునకు లేదు; చెవులకు లేదు; పాదములకు నాపకడియములుమాత్రి మున్నవి. మెడలో నిది యలంకార ముండియు నిరలంకారముగనే యున్నది. దీనియునికి నా కిన్నాళ్ళుగా సుఖదాయిని గానే యున్నది. ఈ నాఁటి కిది దానిసహజగుణము సంపూర్ణముగా బయటపెట్టినది. చెడ్డవారితోఁ జెలిమి యెన్నటికైన చెఱుపు తేక మానదు. అయినను నెయి యని త్రాగుటకును, నూనె యని తలకుఁ బోసికొనుటకునుగాని యీ చంద్రహారము మనయింట నెందులకు? అరువు తెచ్చుకున్న నగవలె నిది హృదయబాధాహేతువే యగుచున్నది. దీనిని మఱల రాణిగారికిఁ బంపించివేయుదుము. గాడిదకు హౌదా యెత్తినట్లు నా కిది తగినట్లు లేదు.'

అని యామె చంద్రహారమును దీసి గదిలో నేలమీఁద విసరివేసి పతిని కౌఁగిలించుకొనెను. పుణ్యదంపతులు వారిద్దఱు తన్ను నిరాకరించినందులకు ధనలక్ష్మి దుఃఖపడి మూల్గినట్లు చంద్రహారము నేలమీఁద జల్లున జాఱి ధ్వనిచేసెను. అట్లు చంద్రహారము నేలపై విసరివేయుచున్నపుడు ధర్మారావునకు వస్తువట్లు పాఱవేయుట మనస్సునకుఁ గష్టమే యనిపించెనుగాని ప్రియావక్షస్స్పర్శసుఖములో నా యూహ యెగిరిపోయెను. ప్రేమ చాల చిత్రమైనది. దాని కన్న మక్కువలేదు; నీళు లక్కఱలేదు. ఎడారిలోఁ దిండిలేక యొంటరిగాఁ జచ్చుచున్న రెండుపక్షులుకూడఁ గ్రిమక్రమముగా మేనులయందు శక్తి క్షీణించుచుఁ జావు నిశ్చయమైనవేళయందు నేత్రములలోఁ బ్రేమతోనే చచ్చును. ఆ రాత్రి ధర్మారావున కరుంధతి లనతో లేచివచ్చిన రాత్రిటికన్నఁగూడ నెక్కువప్రియురా లయ్యెను. అంత ప్రేమ యతనిది. పూర్వ మెఱిఁగియున్న యరుంధతియు నానాఁడతఁడు తనకుఁ దనసర్వస్వ మిచ్చిన ట్లూహించుకొనెను.

అరుంధతీ ధర్మారావులు ప్రొద్దెక్కిగాని లేవరు. సావిత్రమ్మగారు తెల్లవారకముందే నిద్ర మేల్కొనును. దంపతులకు గదిలో గడియ వేసికొను నలవాటు లేదు. ప్రతిదినము వారిద్దఱు నొకరి కౌఁగిళ్ళలో నొక రుండఁగానే యామె గదిలోనికిఁ బోయి గది యూడ్చి తనకు గదిలో నేమైనఁ గావలసియున్నచోఁ దెచ్చుకొనును.

ఆనాఁడు గదియూడ్చుచుండఁగా నామెకంటికి మెఱసి, యామె మొదటఁ బామేమో యనుకొని, యాఁగి నెమ్మదిగాఁజూచి చంద్రహార మని గ్రహించి 'ఇదేమో! ఇటు పారవేసి' రని తీసి మఱలఁ గోడలిమెడలో నమర్చి తనపని తాను చూచుకొనఁబోయెను. నెమ్మదిగా తెల్లవారి వెలుతురు గదిలోనికి వచ్చెను. ధర్మారావు కనులు తెఱచిచూచెను. అరుంధతిమెడలోఁ జంద్రహారము మెఱయుచుండెను. తనను నిదురపోనిచ్చి మఱల నామె యా నగ తెచ్చి ధరించినది. ధనవాంఛ ఎంత చెడ్డది! నిద్రలో నది తనకుఁ దగిలెనేమో? ధర్మారావు ప్రక్కమీఁదినుండి లేచిపోయెను.

అరుంధతికి మెలఁకువ వచ్చెను. తనమెడలో నేమో బరువుగా నుండెను. ఏమిటా యని చూచుకొన్నది. మెడలో హార మున్నది. తనపతి తెచ్చి యా హారము తనమెడలో వేసెను గాఁబోలు! యా హారము నేల ముట్టుకొనెను? ఏమో! తనమెడ బోసిగా నున్నదని చేసియుండవచ్చును. ఆమె లేచి పని చూచుకొనఁబోయెను.

ధర్మారావునకు భార్యమీఁదఁ గోపమువచ్చెను. ఇంటిలో నున్న నామెతో మాటాడవలసివచ్చు నని యారోజంతయు నా స్నేహితునియింట, నా స్నేహితునియింటఁ గడపెను.. భోజనమునకు మాత్రము వచ్చెను. ఆ మెతుకులే తినెను. ఇంటనున్న రెండుగడియ లరుంధతిని బల్కరించలేదు. ఆమె తాను గదిలో నుండఁగా దాకినంత దగ్గరగా వచ్చెను. తాను దూరముగాఁ బోయెను. భోజనముచేసి తనదారిని దాను బోయినభర్త యేదో పనిచూచుకొనఁ బోయె ననుకొనెనుగాని, తన్నుఁ బరిహరించుటకు వెళ్ళినాఁ డని యనుకొనలేదు. రోజు గడచెను. ధర్మారావునకు సుబ్బన్నపేట పోయిరావలెనని పుట్టెను. పోవుటకు రెండురూపాయలు కావలయును. ఎవ రిచ్చెదరు? కొందఱి నడిగి లేదనిపించుకొనెను. కొంద

అనుజూచి యడుగుటకు మొగముచెల్లక మానివేసెను. పొద్దుక్రుంకు వఱ కడిగినను నడుగకున్నను మిగిలిన దొక్కఁడు. అతని నడుగుటా? యడుగ కుండుటా యని పట్టినది. అడిగినచో నతనివద్దఱ నున్నచోఁ దప్పకుండ నిచ్చును. అడుగుట నీచ మేమో? తనస్థితి కతని నడుగ రాదేమో? నీచత యెచ్చట! గుణహీనులయిన ధనవంతులకన్న గుణవంతులయిన పేదవారే యధికులు. వారే గౌరవనీయులు. ధర్మా రావతనితో నెప్పుడును మాటాడనైన లేదు. అతఁడే ధర్మారావునకు రెండుమూఁడుసార్లు నమస్కరించెను. ధర్మారా వన్నచో నతనికిఁ జాలగౌరవము. ఇంకొకమార్గము లేదు. ధర్మారావు చివర కతని నడుగుటకే నిశ్చయపఱచెను. ధర్మారా వతనికొట్టుదాఁక రెండుమా ఱులు పోయి మఱల వెనుదిరిగివచ్చెను. 'ఛీ! అతని నడుగుట యేమి? అసమానునియొద్దఁ దన కీ దైన్య మెందుకు? ధర్మారావు మఱలఁ బోయెను. నాయరు తన దుకాణముమీఁదఁ గూర్చుండెను. ధర్మా రావునుజూచి యతఁడు మందహాసము చేసెను. ధర్మారా వెపుడును తన దుకాణముదగ్గఱకు రాఁడు. నేల వచ్చెనో?

నాయరునకు ముప్పదియైదేండ్లుండును. అతఁడు మలయాళి. అతనిది గుంటూరులోఁ దమలపాకులకిల్లీ దుకాణము. సోడాలుకూడ నమ్ముచుండును. నాయరు మొగ మెప్పుడును మందహాససుందరము. ఎప్పుడును ప్రసన్నతా రోచిస్సులే యతనిమొగమునఁ దాండవిం చును. అతనికన్నులు నవ్వుచునే యుండును. అతఁడు విచారముఖ ముతో నున్నపు డతని నెవరును జూడలేదు.

నాయరు ప్రతిదినము ప్రొద్దుననే లేచును. హరినామస్మరణ చేయును. తరువాత స్నానముచేసి విభూతిఁదాల్చి కాఫీహోటలునకుఁ బోయి యొకగిన్నెఁడు కాఫీత్రావి తన దుకాణమువద్దకు వచ్చును. ప్రతిదిన మొక వృద్ధబ్రాహ్మణుఁ డెనిమిది గంటల కతనిదుకాణము నకు వచ్చును. ఆయనచేతిలో నొక కాని యిచ్చికాని యమ్మకము చేయఁడు. పన్నెండుగంటలకూరిచివరనున్న తనయద్దెయింటికిఁబోయి వండుకొని తిని కొంతవిశ్రమించి మఱల దుకాణమునకు వచ్చును.

అతని దుకాణమునందే విద్యార్థులందఱుఁ దమలపాకులకిల్లీలు సోడాలుకొందురు. అతనివద్ద కాతాపుస్తక మున్నది. ఎవఁడుకొనునో

వాఁడే యందులో వ్రాసికొనును. అతఁ డొకప్పుడుగాని 'యీ పద్దు వ్రాయుఁడు. ఇది మఱచిపోయినారు' అనఁడు. చాలమంది విద్యార్థులు పద్దులు వ్రాయరు. డబ్బెగఁగొట్టుదురు కూడను. అతఁ డెవరి నేమియు ననఁడు. కొందఱు డబ్బు తెచ్చియిత్తురు. అతఁడు పుచ్చుకొనును. కొందఱు పదిరూపాయలదాఁక నప్పుచేసి, తరువాత నతని దుకాణమువద్దకే రారు. అది వారిభయమే కాని యతఁడు వారిని డబ్బడుఁగఁడు.

ఇదికాక విద్యార్థు లతనివద్ద చేబదుళ్ళు తీసికొనుటయు, నిచ్చుటయుఁగూడ కలదు. ఎవరైన నతనిని 'ఏమోయి! ఇట్లందఱు డబ్బెగఁబెట్టినచో నీ కెట్లు సాగు' నని యడిగినచో 'నా దొకపొట్ట. నాకు నెల కయిదురూపాయలు చాలునండి. ప్రొద్దున నింతయన్నము తిందును. రాత్రి కొక గోధుమరొట్టె. ప్రొద్దున కొక గిన్నెఁడు కాఫీ. నాకుఁ జాలదా!' యనును. చాలమంది యతనిని పిచ్చియుండకొడు కనుకొందురు; మఱికొందఱు సత్పురుషుఁ డనుకొందురు.

ఒకసారి యొకకవి యతని కిరువదిరూపాయలదాక నీవలసివచ్చెను. అతఁడు సగముడబ్బు సిగరెట్లకే యీయవలయును. ఇంతలో నతఁడు మతాంతరవివాహము చేసికొనెను. కులము బ్రాహ్మణుఁడు. అతనిభార్య యాధునికురాలు. అతనిజీతము తినుటకుఁ జాలలేదు సరిగదా యతని ప్రాణములుకూడఁ జాలలేదు. నాయరు నెవరో యడిగిరి: 'ఏమయ్యా! ఆయన డబ్బిచ్చెనా'యని. నాయరు 'బాబూ! ఆయనయే పేదవాఁడు. ఆ వచ్చినభార్య యతనిని దిని వేయుచున్నది. పాప మాయన యే మిచ్చునులెండి! ఆయన కొకకొడుకు పుట్టిన నాడబ్బిచ్చినంత సంతోషించెద' అని యనెను.

నాయరు ప్రతిదినము సాయంకాలమైనంతనే యాంజనేయస్వామిగుడికిఁ బోవును. ఈ లోఁపుగా దుకాణముమీఁద నెవరుపడిన వారే కూర్చుందురు. కూర్చున్నవాని 'నిజాయితీ' మీఁదనే దుకాణము సాగును. అతఁడు వచ్చి యచటఁగూర్చున్నవానిని యజపజ యడుగఁడు. 'ఇట్లయినచో బేర మెట్లు సాగును' అని నీ వనుదువు. 'ఎవరి పాపము వారిది. నా కేమి? నేను ఇతరులసొమ్ము తినుట లేదు కదా! నాకుఁ బాపము లేదు'అనును. చిల్లర యెచ్చటను దొరకదు.

నాయరుదుకాణముమీఁదఁ దప్పకుండ దొరకును. క్రొత్తయూరి వారు వత్తురు. ఏదో కొందురు. వారివద్దఁ జిల్లర యుండదు. నాయరు వద్దను దొరకదు. నాయరు "స్వామీ! వద్దు లెండి. ఆ డబ్బు నాకు ప్రాప్తిలేదు పొండి" యని నమస్కరించును. వా రాశ్చర్యపోయి మార్చి వారే తెచ్చి యిత్తురు. అతఁడు కొన్ని బాకీలు మఱచి పోవును. కొంద ఱవి తెచ్చియిత్తురు. వారు 'నాయరూ! నీకు నే నెంత యీయవలయును' అందురు. 'నాకు జ్ఞాపకము లేదు. బాబూ! మీ దయ వచ్చినంత యిండు.' వారు సరిగా నీవలసినంత యిత్తురు. వారు కొంత తగ్గించి యిత్తురు. వారు మఱికొంత యెక్కువే యిత్తురు. వారిలో నెవ రెవరో భగవంతునికే తెలియును. నాయరు రాత్రి పదియయినతరువాత దుకాణ మూంచుఁడు. అతనియింటికిఁ బోవును. కొంద రతనిని యోగాభ్యాసి యందురు. కొందఱు రాత్రి రెండుగంటలవఱకు నేదోజపము చేసికొను నందురు. నిజ మెవరికిఁ దెలియదు. మనిషిమాత్రము వస్తాదువలె నుండును. అతనికిఁ బడిసె ముపట్టినదికూడ నెవరు నెఱుఁగరు. ఎవరైన 'నాయరూ! పెండ్లి చేసికొనరాదా' యందురు. అతఁడు 'అమ్మో! నాకు భయమండి. 'సంసారం సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత! జాగ్రత!' అన్నారు. హాయిగా బ్రదుకుచున్నాను. నా కాగోల యెందుకు స్వామి? అప్పటి నుంచి దురాశపుట్టును. దొంగవేషా లెక్కువగును. ఇప్పుడు రూపా యికిఁ బావలాలాభము చాలును. అప్పుడు రూపాయికి రూపాయి లాభము కావలెనండి' అనును. నాయరు బీడీ కాల్చఁడు. సోడా త్రాఁగఁడు. తమలపాకులు వేయఁడు. ఎంత చలివేసినను చొక్కా తొడుగఁడు.

ప్రతిదినము రాత్రి యెనిమిదిగంటల కతని దుకాణమువద్దకు నిద్దఱు ముసలివాండ్రు వత్తురు. వారు గొల్లవాఁ డొకఁడు; కాఁ పొకఁడు. గొల్లతఁడు వయసులోఁ బోలీసుపని చేసెను. అతనికిఁ బది రూపాయలు పింఛను వచ్చును. కాఁపునకుఁ బనిలేదు. అతనియన్న గారు రంగములో నేదో రెండువందల జీతము తెచ్చెడివాఁడఁట. అక్కఁ డితనికి నెలకుఁ బదిరూపాయలు పంపించెడివాఁడు. అ ట్లతని జీవితములో నిరువదియేండ్లుజరిగెను. ఆ యన్న చనిపోయి యీకాఁపు

బ్రతుకు బయటపడెను. ఇప్పు డెట్లు బ్రదుకుచున్నాఁడో యెవరికిఁ దెలియదు.

ఈ యిద్దఱు వచ్చి నాయరుతో వేదాంతము వేయుదురు. నాయ రిద్దఱికి జుట్టలిచ్చును. వారు కాల్చుచు వేదాంతము మాట్లా డుదురు. అయిపోయినతరువాత వా రిద్దఱికిఁ జెరియొక సోడాయు నిచ్చును. వారు పుక్కిలించియుమిసి మిగిలినది త్రావుదురు. త్రాగిన తరువాత 'సోడా ఫుల్లగా నున్నదయ్యా' అని యొకఁడు, 'ఇవ్వేళ నిన్నటివలె లేదు' అని యొకఁడు నాయరునౌదార్యమును వారిమార్గ ములో వారు భూషింతురు. తరువాత వక్కపొడి యింత నములుదురు. ఇంతలో వేదాంతము చివరకు వచ్చును. ఇద్దఱును 'రాం రాం' చెప్పి వెడలిపోదురు. ఎవరో యొకరు నాయరుతో వారినిగూర్చి వెక్కి రింతురు. నాయరు "అయ్యా! అట్లు మన మనరాదు. ఎవ్వరిలో నే మున్నదో! త్యాగరాజుగారు ఏమన్నారు? 'ఎందఱో మహానుభావు లందఱికిని వందనములు' అని అనలేదా ?" యనును. నాయరు తెలుఁగుదేశములోఁ బదిపదునేండ్లనుండి యున్నను నతఁడు తెలుఁ గదొకయాసగా మాట్లాడును. ఒత్తులు కలచోఁట దేల్చియు, 'చ'లు 'స'లుగాను, దీర్ఘములు కొన్ని హ్రస్వములుగాను పలుకును. అందఱు నతని బలుకుబడికి నవ్వుదురు. అట్లయ్యు నతఁడు మాటాడుచుండఁగా నందఱు కాకర్షకముగానుండును. ఆ యాకర్షణశక్తి యతనివ్యక్తియం దున్నదిగాని మాటాడుటలో లేదని కొందఱు.

ఎవరైనఁ జనిపోయి వాహకులులేనిచో నాయరు సిద్ధము. అట్లు మోసిననాఁడెల్ల నాయ రుపవాసముండి రాత్రి నక్షత్రదర్శన మైనతరువాత భోజనముచేయును. 'నీ కెందుకు వచ్చినది నాయరూ! వారితిప్పలు వారు పడరా' యనుము. 'తప్పు తప్పు. అయ్యా! అట్లు మోయుట పుణ్యము. మనము నెప్పుడో చచ్చెడిదే. నే నున్నాను. చూడుబాబూ! రేపు చచ్చిపోయెదను. నీవంటిబాబు, నీవంటిబాబు తీసికొనిపోయి తగులవేయవలసినదేకదా? నే నిప్పు డిట్లుచేసినచో నా కప్పు డెవరో దొరకుదురు. లేకపోయినచోఁ గుక్కలు నక్కలు పీఁకు కొని తినవలసినదేగా' యని సమాధానము చెప్పును.

ఊరిలోఁ గలరా చెలరేగినపుడు ప్రతిజనుఁడు శవములకు దూర దూరముగాఁ బరువెత్తినపుడు నాయుడు సహస్రధా యుపయోగ పడెను. చివర కతని కొక రావుబహాదరయినను రాలేదు. స్కూలు పిల్లలకుఁ గొందఱ కతఁడు జీతములు కట్టునని చెప్పుదురు. ఎంత వఱకు నిజమో యెవ రెఱుఁగుదురు?

ధర్మారావు పోయి యేమడుగవలయు ననుకొన్నది యీ మనిసిని. 'యాచ్ఞా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా' ధర్మారావు నాయుడు సద్గుణునిక్రిందనే లెక్కపెట్టెను. కాని రెండేండ్లనుండి నాయుడు ధర్మారావుసొమ్ము దమ్మిడీ తినలేదు. అతనివద్ద తమలపాకు కిల్లీ కొనలేదు. అతనితో నెన్నఁడును మాటాడలేదు. ఏమని పోయి యడుగును ?

ధర్మారావు పోయి దుకాణమువద్ద నిలుచుండెను. ఏమని యడుగవలయునో తెలియలేదు. ఎవరో వచ్చుచుఁ బోవుచుండిరి. వారందఱున్నపు డడుగుట కతని కిష్టము లేదు. చివర కెవ్వరు లేకుండఁ బోయిరి. అడుగుట కదే వేళ. నాయ డతనివంకఁ జూచి 'ఏమి కావలయు బాబూ!' యనెను. ధర్మారావు నాలుకకు మాట రాలేదు. 'ఏమియు నక్కఱలేదు' అని ధర్మారావు వెడలిపోయెను.

ప్రొద్దుక్రుంక వచ్చుచున్నది. తల్లి 'నాయనా! నీవు, నరుంధతియు నన్నము పెట్టుకొని తినుఁడు. నేను దేవాలయమునకుఁ బోయి వత్తును' అని యేఁగెను. ధర్మారావు 'నా కన్న మక్కఱలే' దని పోఁబోయెను. అత్తగా రదివఱకే గడప దాఁటిపోయెను. ధర్మారా వడుగు ముందు వేయఁబోవుచుండెను. వెనుకనుండి యతని నెవరో యింటిలోనికి లాగి తలుపువేసిరి. ఇంటిలోనున్నది యొక్క యరుంధతియే. అరుంధతికిఁ బతికోపము తెలిసినది. అతనికోపమున కొకటే గుర్తు. అతఁ డిల్లుపట్టకుండఁ దిరుగుటయే. కోపములేనపు డరుంధతి యన్నము, అరుంధతి నీరు, అరుంధతి నిద్ర. ఈ మనిసి యరుంధతి మీఁదఁ గోపము వచ్చినగాని యూరు పట్టఁడు. ఇంటిలోనికి లాగి యరుంధతి 'ఎందుకయ్యా కోపము' అనెను. ధర్మారావునకు నవ్వు వచ్చి 'అయ్యా, ఏమిటి?' అనెను.

అరుం—ఈ చిట్టిచిట్టికోపా లేమిటి? నేను రంగాపురము పోయె దను. మన కెవ్వరికి నక్కలేని చంద్రహారము కావలసివా రక్కడ నున్నారు. ఇచ్చి వచ్చెదను. ధర్మా—అక్కఱలేకపోవుట యేమిటి? రాత్రి నన్ను నిద్రపోనిచ్చి తెచ్చి మెడలో వేసికొంటివి కదా? అరుం—అబద్ధము లాడకుడు. ఆడపిల్లలు పుట్టెదరు. ధర్మారావు నవ్వి యరుంధతిని జెంపమీదఁ గొట్టెను. అరుం—మీరు కదా, తెచ్చి నా మెడలో వేసినది? ధర్మా—ఛీ ఛీ! నేను మఱల దానితో నవస రము లేదనువఱకు నా నగ తాఁకనని ప్రతిజ్ఞ చేసితిని. మఱల ముట్టు కొందునా? అరుం—భగవత్సాక్షిగా నీ హారము నా మెడలోనికి మఱల నెట్లు వచ్చినదో నాకుఁ దెలియదు. మీరు వేసితి రనియే పొద్దుటినుండియు మెడలో నుంచుకొంటిని. ఇదిగో తీసివేయుచు న్నాను అని తీసి పెట్టెలోఁ బెట్టెను.

దంపతు లిద్దఱు సంధిపత్రములు వ్రాసికొనిరి. రాజ్యముల మధ్య సంధిషరతులు చెడినంతతొందరగా నమాయకులయిన యీ దంపతులమధ్యఁ జెడవు. ధర్మారావున కా సందేహము లేదు. కాని హార మామెమెడలోని కెట్లు వచ్చెను?

సావిత్రమ్మగారు నేయి యెక్కడనో యప్పు తెచ్చెను. ప్రక్క వారి దొడ్డిలోఁ బొట్లకాయలు కాచి, వారు రెండిచ్చిపోయిరి. అవి కూర వండెను. పొద్దుటి యన్నమే భార్యాభర్త లిద్దఱు కూర్చుండి వడ్డించుకొనిరి. వీధితలుపు వేసిరి.

అరుం—నేను మీ నోటిలో నన్నము పెట్టునట్లు, మీరు తినునట్లు, వ్రేలుమాత్రము కొఱుకరాదు. ధర్మా—నీవు నా ప్రాణ ములుమాత్రము కొఱుకరాదు. అరుం—మీరు కవులు కాదు, మీది యదొకకత్తు.

అరుంధతి ముద్ద ధర్మారావునోటి కందిచ్చెను. ఆతనికన్ను దేవ దాసి యిచ్చిన యుంగరముపైఁ బడెను. ఆ పడుట అరుంధతి తెలిసి కొనెను. ఆమె వెంటనే యుంగరముతీసి 'అన్నట్లుగా మఱచిపోయి తిమి. ఈ యుంగరమమ్మి పదిరూపాయలు తేరాదా' యనెను. ధర్మారావు 'నేను దానివంక నందుకుఁ జూడలేదు. నాచూపు దాని మీఁద యాదృచ్ఛికముగాఁ బడినది. దుర్మార్గురాలా! ఆ నా చూపు

నకు దురర్థము చేసితివి. ఒకవేళ నమ్మినచో హారమైన నమ్మవచ్చుఁ గాని యుంగరము తాఁకనే రాదు' అనెను. ఇద్దఱియూహ లొక్కసారిగా దేవదాసిమీఁదికి జనెను.

సంపద్దారిద్ర్యములు సుఖదుఃఖములు, సంయోగవియోగములన్నియు దాఁటి వాయుపథమునఁ బోవు మహాజ్యోతిస్సువలె దేవదాసి వారికిఁ దోఁచెను.తరువాత నిద్దఱును మాటాడకుండ భోజనము చేసిరి. ఇంతలోఁ దల్లి వచ్చెను.

రాత్రి జాము ప్రొద్దుపోయెను. ధర్మారావున కింకను నిదుర పట్టలేదు. ఎవరోవచ్చి తలుపుతట్టిరి. ధర్మారావు పోయి తలుపు తీసెను. వచ్చినది నాయుడు. 'బాబుగారూ! మీ యిల్లు కనుగొని నాను. ఆ నల్లని యాయన మీతో దిరుగుచుండును. ఆయన చెప్పి నాఁడు. ఇందాఁక మీరు నా దుకాణమున కెందుకు వచ్చినారు?' అని యతఁ డడిగెను. ధర్మారావున కచ్చెరు వయ్యెను. అతఁడు 'ఊరకే వచ్చితిని' యనెను. 'కాదు బాబూ! ఏమైనా డబ్బు కావలసియా' యని యతఁడు తరిమెను. 'ఊ' యని ధర్మారావు నోటినుండి యతనికిఁ దెలియకుండఁగనే వచ్చెను. నాయ రుత్తరీయము కొంగు నుండి యూడఁదీసి రెండురూపాయలు ధర్మారావున కిచ్చి 'బాబూ! ఇవిగో రెండురూపాయలు. ఇవ్వేళఁ బెట్టెలో చివరకివియే యున్నవి. చాలునా' యనెను. ధర్మారావునకు "చాలునా" యన్నమాట నిందించుటయో, పొగడుటయో, యాదరించుటయో, తిరస్కరించుటయో తెలియలేదు. జేపు ప్రయాణము స్థిరమైనది. లక్షాధికారుల బిడ్డ, భగవంతునికి బావమఱఁది, జమీందారుల కాదరణీయుఁడు, మహామేధావి-యంతటి ధర్మారావును నాయరుముందు వినయముచే గుదించుకొనిపోయిన యొకరేణు వైపోయెను. ఇచ్చుట, పుచ్చుకొనుట—ఒకటి యుచ్చైశ్శ్రవము; రెండవది చెవులు వ్రేలాడుచున్న గాడిద. అడుగవలసి వచ్చువఱకు, చేసాఁచవలసి వచ్చువఱకు జగత్ప్రభువు వామనుఁడై పోయెను. పరిదీనమూర్తియో, విషాదమూర్తియో, యానందమూర్తియో యరుంధతికౌఁగిటనున్న ధర్మారావు మసకలాడుచున్న పామువలె నయ్యెను. పరమశిశువువలె నరుంధతిడొక్కలోఁ గొంతసేపు చేరును. హృషీకేశునివలె నామె ప్రాణము లొకసారి

యాకర్షించును. విస్తరించిన గరుత్మంతుని ఱెక్కలవలె నొక్కసారి యామె శరీరమంతయుఁ దనలో నిముడ్చుకొనును.

అరుంధతికి ధర్మారావుశృంగార మొక్కొక్కనాఁ డొక్కొక్క రీతిగాఁ దోఁచును. అతఁ డేదో యొకమహారసమూర్తి. అవ్యక్తములై యతనియందు దాఁగియున్న నూత్న వినూత్నభావములు వేలకొలంది బహిర్గతము లగుచుండెను.

ఒక విషాదభావము వచ్చి యతనిబుద్ధి కృశించిపోవలయును. ఆ విషాదరేఖ పోయి మఱల సహజవిస్మృతి వచ్చినపుడు మఱొక క్రొత్తవికాసము కలుగును. ఈ వికాసములన్నియుఁ దాండవించు చోటు అరుంధతి.

సావిత్రమ్మగారు వచ్చి 'రాత్రి చంద్రహారము నేలమీఁద నున్న దేమే?' యనెను. గాఢపరిష్వంగమున నున్న సతీపతులు లేచి నిలుచుండిరి. ఆమె 'నేను తెల్లవాఱువేళ నూడ్వఁబోయితిని. నేల మీఁద బడియున్నది. నేనుతీసి నీమెడలో మఱల వేసితిని. జాగ్రత్త! అదికూడ బోయెనా, చెప్పితివా మనదశ' యనెను. అరుంధతి వెనుకనుండి చీకటిలో ధర్మారావును స్పృశించెను. అది తనమీఁద యపనిందపోయినందుకు సంతోషము. అతఁ డామెను జేయ్యిపట్టుకొని లాగెను. తల్లి 'మఱల హార మేమి చేసితివి?' యనెను. అరుంధతి 'పెట్టెలోఁ బెట్టితిని' అనెను. సావిత్రమ్మగారు 'మంచిపని చేసితివి! దొంగవానికిఁ జేతి కిచ్చినట్లు' యని తనమెడలో వేసికొనిపోయి పండుకొనెను. తల్లి పోయి తలుపు వేసికొనెను. ధర్మారా వరుంధతిని గరుడి త్రాఁచుపాము నోడిసిపట్టినట్లు పట్టెను. ఆమె కిలారుమని నవ్వెను.

మఱునాఁడు ధర్మారావు బెజవాడపోయి సూర్యపతిని గలసికొనెను. సూర్యపతి యీ వృత్తాంతమంతయు విని 'సుబ్బన్నపేట పోయి రా' యనెను. ధర్మారావు సుబ్బన్నపేట పోయెను.

ధర్మారావు సుబ్బన్నపేట వర్తమానములు తెలిసికొనెను. రాణిగారికి మూఁడునెలలనుండియు జబ్బుగానుండెను. ప్రాణముమీఁదికి వచ్చినదని రంగరావుగారికి మూఁడుసారులు తంతినిచ్చిరి. మూఁడుసారు లాయన చెన్నపురినుండి వచ్చి రెండుమూఁడుదినము లుండి వెడలిపోయెను. రాధాకృష్ణయ్యగారు, రామేశ్వరముగారు,

సర్వారాయఁడుగారు ముర్వురును సుబ్బన్నపేటలో మకాముగా నుండిరి. ఆ దివానుగారు మదరాసు సుబ్బన్నపేఁటలమధ్యఁ దిరుగు చుండెను. నెలకు నాలుఁగుపందలు దివానుగారికి రైలుఖర్చుల క్రింద వ్యయమగు చుండెను. రాణిగారికి వైద్యము చేయించుటకుఁ జెన్న పురికిఁ దీసికొనిపోవలయు ననిరి. రాణిగారు పోలేదు. చెన్నపురినుండి ఘనవైద్యులు వచ్చి చికిత్సచేయుచుండిరి. ఒక్కొక్కప్పుడు వచ్చి నప్పుడెల్ల పదివేలు, పదునేను వేలు నగుచుండెను.

రంగారావు సంవత్సరాంతమున నాదాయము వ్యయము లెక్క చూచెనఁట. శిస్తులు మునుపటికన్న నెక్కువగా వసూ లగుచుండెను. రైతు జమీందారున కీ వలసినది రూపాయ మిగులలేదు. అడవుల మీఁద సాలుకుఁ బదివేలు ఆదాయము వచ్చుచుండెను. లక్షరూపా యలకు జమాఖర్చులు తేలవు. రంగారావు చివరకు గుమాస్తాలనంద అను దొలఁగించి మఱల బ్రాహ్మణులనే గుమాస్తాలుగా నియమిం చెను. ఒక్క లెక్క సరిగాలేదు. 'పెద్దపెద్ద యుద్యోగములకేతప్ప మనవాండ్రు గుమాస్తాలపనికిఁ బనికిరా'రని దివానుగారు నొప్పుకొని రఁట. కోటలో నాలుగువేళల నౌబత్తు లక్కఱలేదని రంగారావుగారు వారిని దీసివేసిరి. కోటలో నొక్క యేనుఁగుగాని, గుఱ్ఱముగాని మిగులలేదు. పాతమోటారులు విఱిగిపోయినవి కోటలోనాలుఁగైదు పడియుండెను. సుబ్బన్నపేఁట యూనియన్ చేసిరి. చంద్రారెడ్డి యూనియన్ చైరుమను.

ఆ యూరిలోఁ గృష్ణమనాయఁ డుండగనే సెకండరీస్కూలు పెట్టవలెనని యూహించిరి. కృష్ణమనాయఁడు 'ఈ యింగ్లీషుచదువు నా యూరిలో నెందుకయ్యా! ఇంకఁ బిలఁచిన పలుకు దిక్కయిన లేకుండ చేయుటకా' యని దానిని రానీయలేదు. ఇపుడు సెకండరీ స్కూలు పెట్టిరి. దానికి మాస్టరులు, వారును వచ్చి యూరు క్రొత్త గానుండెను. 'సెలవులలో నేమియు ననుకొనలేదు. అప్పుడే యిన్ని మార్పు లెట్లు జరిగెనా' యని ధర్మారా వాశ్చర్యపోయెను.'రాజు తలఁచిన దెబ్బలకుఁ గొదువయా?'

ధర్మారావు రాణిగారిని బోయి చూత మనుకొనెను. మూర్గ మేమియుఁ దోఁచినదికాదు. ఆమె యేస్థితిలో నున్నదో తెలియలేదు.

కోటలోనికిఁ బోయిన నేమగునో! అయినను సాహసించి పోవుదమా యని యూహించెను. సరేనని బయలుదేరెను. సింహద్వారమువద్దకుఁ బోయెను. అచట రామేశ్వరముగా రుండిరి. 'లోపలికిఁ బోవునది యెవరు?' అని యాయన గద్దించెను. ధర్మారావు మాటాడకుండఁ బోవుచుండెను. రామేశ్వరముగారికిఁ తరువాత నేమిచేయవలయునో తెలియక యూరకుండిరి. ధర్మారావు సౌధమువద్దకుఁ బోయెను. ఒక కాసావానిని బిలిచి 'తాను వచ్చితినని రాణిగారితోఁ జెప్పు'మనెను. వాఁడు నటునిటుచూచి 'అయ్యా! రాణిగారు మాటయుఁబలుకును లేదు!' అనెను. ఇంతలో సర్వారాయఁడుగా రచటికివచ్చి ధర్మారావు వంకనయినను జూడక కాసావానితో 'నేమిటిరా' యనెను. కాసా వాఁడు 'అమ్మగారిదర్శనమునకు వచ్చినారు' అనెను. సర్వారా యఁడుగారు 'అమ్మగారిసొమ్ము నింకఁ దినుటకు వీలులేదని చెప్పు' మని తాను లోనికిఁ బోయిరి. ధర్మారావు సమాధానముమాత్ర మెవ రితోఁ జెప్పను! అతఁడు వంచినతలతో వచ్చినదారినే మఱలఁ బట్టెను.

కోటబైటకు వచ్చి వెనుతిరిగి చూచెను. నౌబత్తులుమ్రోఁగు బురు జొకపెడ విఱిగిపోయెను. అదేనా కృష్ణమనాయని సౌధము?

ఊరిలో నిరుకక్షులు: చైరుమన్ పక్షమువారు, తదితరులు. చైరుమన్ పక్షమువారు జమీందారుగారి యాశ్రితులు. తదితరులు తదితరులు. రెండుపక్షము లెందుకుఁ బడినవో తెలియలేదు. ఎందుకు బడిన వని ధర్మారా వెవరినో యడిగెను. 'చైరుమన్ అతడే యేల కావలె? ఇంకొకఁ డేల కాకూడదు' నని సమాధానము. ఒకఁడు 'అసలు యూనియను ఎందుకు' అనెను. ఇంకొకడు 'జమీందారుగా రూరకే యిదొకటి కలిపించిరి' అనెను.

ధర్మారావు బయలుదేఱి కోటచుట్టు నొకసారి తిరిగివచ్చెను. ఊరును, ఆలయములును గోటకు తూర్పుదక్షిణములం దుండెను. పశ్చిమోత్తరములయందు నేమియు లేదు. తోఁటలు, దొడ్లు, పొల ములు. కోటయుత్తర భాగమెల్లఁ బడిపోయెను. ఆ వైపుననున్న కోట గోడరాళ్ళు చాలమంది యెత్తుకొనిపోయిరి. పశ్చిమదిశనున్న కోట గోడ యచ్చటచ్చట శిథిలమై యుండెను. కోటకు సింహద్వారము

తూర్పుదెస. దక్షిణదిశయం దొక చిన్న ద్వార మున్నది. ఊరంతయు నెక్కువభాగము తూర్పుదిశయందే యున్నది. దేవాలయాదు లీశాన్యభాగమం దున్నవి. ఆలయములకుఁ దూర్పునందుఁ బెద్దచెఱువు కలదు. ధర్మారావు తూర్పుదెసనున్న సింహద్వారమువద్ద బయలు దేఱెను. సింహద్వారమునకుఁ బూర్వ మినుపబొడుపులతోడి పెద్ద కొయ్యతలు పుండెడిది. అది కృష్ణమనాయఁడు తెచ్చిన పెద్దకాశ్మీరపు ఏనుఁగు రాత్రిపూఁటఁ ద్రెంచుకొని యడవిని బడినపుడు పగులగొట్టెను. అదే యతుకుఁబెట్టి తరువాతఁగూడ నుండెను. కొన్నాళ్ళు రాత్రులందుఁ దలుపులే వేయలేదు. పట్టాభిషేకమయిన తరువాత రంగారావుగా రా తలుపు తీసివేసి పెద్ద యినుపతలుపు చేయించెను. తాతా అయిరన్ వర్క్సులోనుండి వేయిరూపాయల కొక యినుపతలుపు తెప్పించి యమర్పించెను. అవి యొక్కటే బల్ల గాదు. ఇనుపకమ్మీలలో నడ్డముగా, నిలువుగా నమర్చఁబడినది. దానితోఁ గోటకుఁ గోటయాకృతిపోయి యొక పెద్ద ధనవంతుని యింటియాకారము పడినది. దక్షిణదిక్కునందు గోడదాఁక పోయెను. ఆ వైపునఁ గోడలో రావిమొక్కలు మఱ్ఱిమొక్కలు మొలచి యుండెను. దాసీలు, చాకలులు, మంగలులు నందఱు నావైపున వాసము చేయుచుండిరి. ధర్మారావు కడచి పశ్చిమదిక్కునకుఁ జనెను. గోడ చక్కగా శిథిలమైయుండెను. అతఁ డొక ఱాతిమీఁదఁ గూర్చుండెను. దూరమున శిథిలమైనగోడలో నొకచోట రెండుపిట్టలు గూఁడుకట్టుకొని నివసించుచుండెను. అందులో నొకపిట్ట మేఁతకై యెగిరిపోయెను. రెండవది గూఁటియందే యుండెను. ఒక కాలసర్పము నెమ్మదిగాఁ బ్రాకుచుఁ నా గూఁటివద్దకుఁ బోవుచుండెను. ధర్మారావు దానిని తోలుద మనుకొన్నాఁడు. ఆతనికి భయమయినది. తా నొంటరిగ నున్నాఁడు. సర్పము తిరిగివచ్చి తన్నుఁ గాటువేసినచో? అతఁడు ప్రాణములు గుప్పిటలో నుంచుకొని యట్లే చూచుచుండెను. పాము నెమ్మదిగాఁ బోయి ప్రమత్తురాలై యున్న యా యాఁడుపిట్టను నోటఁ గఱచుకొనెను. పిట్ట యీ రీతి హఠాత్సంభవమునకు వెఱగుపొందెనో యేమో కూయనైనలేదు. సర్పము నోటికమరినముద్దవలెఁ గుటుకు మనకుండ నాహారమయ్యెను? పాము తిరిగి తనదారిని దాఁ బోయెను.

ధర్మారావు తన కచ్చోట నెందుకని యామెడకు దూరదూరముగఁ దొలఁగిపోయెను. పశ్చిమదిశ చివరిదాఁక నడచి చనెను. అచ్చట గోడ మఱి శిథిలమై యానవాలయిన బట్టరాకుండ నుండెను. ఉత్తర దిశయంతయుఁ బడిపోయినగోడ నానుకొనియే మాగాని యుండెను. అందుచే నతఁడు వెనుదిరిగి వచ్చినదారినే యూరిలోనికిఁ బోయెను.

రామచంద్రరాజును జూడక, దేవదాసిని జూడక మఱల మోటారునెక్కి రాత్రికి బెజవాడ చేరెను. సూర్యపతి నిద్రపోవు చుండెను. ఎవరో తలుపుతీసిరి. పోయి యతిథులు నిద్రించు మేడ మీఁదిగదిలో ముసుఁగుపెట్టుకొని యాలోచించినంతసే పాలోచించి తరువాత నిద్రపోయెను.

సూర్యపతి ప్రక్కలోఁ గూర్చుండి 'లేవయ్యా! ఇంక నిద్రలే' అని చక్కిలిగింతలు పెట్టుచుండఁగా నిద్ర మేల్కొని 'అబ్బా! రాత్రి నిద్రలేదు. ఇంకఁ గొంచెము నిద్రపోనిమ్మ' అని బతిమాలియు నతఁడు చేసినయల్లరికి విధిలేక లేచికూర్చున్న ధర్మారావును సూర్యపతి 'అప్పుడే తిరిగివచ్చినావేమి'యని ప్రశ్నించెను. ధర్మా—రాణిగారికి మూఁడునెలలనుండి జబ్బఁట. నే నామెను దర్శనమయిన చేయుటకు వీలులేకపోయినది. రాక్షసులు స్వర్గము నావరించిరనఁగా మును పేమిటో తెలిసినది కాదు. సూర్య—ఇంక జరుగవలసిన పని యేమిటి? ధర్మా—నీవు నా కొక యిరువది రూపాయ లీవలయును. నేనుపోయి గుంటూరులో నున్న చిన్న యప్పులు వదలించుకొని మా యమ్మను, నా భార్యను దీసికొని సుబ్బన్నపేఁటకు మఱలఁ జేరెదను. ఇల్లున్నదికదా నాయని పుణ్యమున! సూర్య—మఱి చదువేమి చేసెదవు? ధర్మా—చదువా? అది రాణిగారితోనే పోయినది. సూర్య—గుంటూరులో నప్పులన్నియు నేమాత్రమున్నవి? ధర్మా—నీవు తీర్చెదవా? ఎనుఁబదిరూపాయ లున్నవి? జీతము నలుఁబది కట్టవలయును, మఱలఁ బాఠశాలలోఁ జేరినచో. సూర్య—సరేకాని, నేఁడు పెద్ద సంగీతసభ. ఎవరో మహారాష్ట్రులు. రాత్రి సంగీతము విని, గుంటూరు రేపు వెళ్ళెదవుగాని. ధర్మా—ఊరకే వెళ్ళి చేయునది యేమియు లేదు. నీ విర్వదిరూపాయ లిచ్చినచో వెళ్ళెదను. మఱల దీర్చెదనులే.

సూర్యపతి ధర్మారావును బుగ్గమీఁద ఛటీలునఁ జఱచెను. ధర్మారావునకు మంచిదెబ్బ తగిలెను. సూర్యపతి నవ్వుచు, 'మఱల నిచ్చెదవా? ముందర నీ దెబ్బ యిమ్ము' అనెను. ధర్మారావు మంచి బాహుకబలము కలవాఁడు. నవ్వులాడుచు నాడెడు దెబ్బలాటలో నెప్పుడును ధర్మారావే గెలుచును. కాని వారిలో వారు మఱలఁ గొట్టుకొనుటలు లేవు.

సూర్య—ఆరోజున రాఘవరావుచేత దెబ్బతిన్నావు. నేఁడు నాచేత దెబ్బతిన్నావు. నీ కర్మము దెబ్బల వ్రాఁతయే! ధర్మా—ఛీ! దుర్మార్గుఁడా! నోరుమూయుము. ఎంతదెబ్బ కొట్టినావు, ప్రొద్దుననే? మళ్ళీ చెయ్యిపట్టుకొన్న నేడ్చెదవు! సూర్య—లేకపోయిన మఱల నిచ్చునఁట! ఇంక నెపుడు ననవుకద? ధర్మా—సరే! అయిన ఊర కనే యిమ్ము. నాసామ్మే మయినఁ బోయినదా? ఏడ్చిపోదు వసి మఱల నిత్తు నన్నాను.

తరువాత నిద్దఱును గృహస్నానము చేసిరి. రాత్రికి సంగీత సభకుఁ బోయిరి. ఒకకుఱ్ఱవాఁడు – పదియేండ్లవాఁడు బహుయంత్ర ములమీఁద గానముచేసెను. అందఱును మెచ్చుకొనిరి. కొందఱు "వానితండ్రి కొన్నికీర్తనలు మాత్రమే యా యంత్రములమీఁద వాయించుట నేర్పెను. కుఱ్ఱవాఁడు వా రన్నట్లుగాఁ బెద్దసంగీత జ్ఞానము కలవాఁడు కా"దనిరి. కాని మెత్తనిమనస్సులుకల స్నేహితు లిద్దఱికి వాఁడనిన నెంతో మెచ్చుదల యయ్యెను. ఆ కుఱ్ఱఁవాఁడు సాగరసంగీత మని యొక బూరగుండ నొక మధురధ్వని చేసెను. ఆ ధ్వని సుమనోహరమై తన్నిశాసముయప్రశాంతశ్రుతితో మేళ వముపొంది సభ్యులనందఱను సమ్మోహితులను జేసెను. మిత్రులిద్ద ఱకు నొడళ్ళు తెలియనే లేదు. తరువాత నతని యక్కగారు వచ్చి సంగీతము పాడెను. మహారాష్ట్రస్త్రీల సౌందర్యమంతయు నా బాలిక యందే గోచరించెను. కొంచెము వెడల్పయిన దవడలు, విశాల ఫాలము, ఫాలమునఁ బెద్దదియుఁ జిన్నదియుఁగాని కుంకుమబొట్టు, చొళ్ళెముగాఁ జుట్టిన శిరోజములు, ముంగురులు మెట్లుమెట్లుగా నమర్చి యచటనుండి తీసిన ప్రక్కపాపట, తెల్లని చీర, మహారా ష్ట్రులు కట్టినట్లు గోచిపోసి గోచి, జీరాడఁ గిట్టినకట్టు మోహినీదేవత

వలె నామె రంగమున కవతరించి సన్ననై హృదయకుహరమునఁ బ్రేమభావమువలెఁ జొరబారిన కంఠస్వరముతో హంసధ్వనిరాగమును గొంచె మాలాపించి 'రఘునాయకా! నీపాదయుగము' అన్న త్యాగరాజకృతి నందుకొని యామె చేసిన గానమునకు సభ్యులందఱును సమ్మోహితులైరి ఆ నాఁడు సభకు రెండువేలరూపాయలు వసూలయ్యెను.

ధర్మారావు సూర్యపతు లిద్దఱు నింటికి బయలుదేఱిరి. అది మొదలు రాత్రి నిద్రపోవువఱకు నా యువతీగానప్రశంసయేతక్క వీ రింకొకటి చేయలేదు. అతఁ డహాహా! ఇతఁ డాహాహా!

ధర్మా—రెండు గంటలయినది. పోయి పండుకొనుము. సూర్య—నే నివ్వేళ నిచ్చటనే పండుకొందును. ధర్మా—ఇవ్వేళ నేకాదశియా! అన్నట్లుగా నా గాయకిమీఁది మనస్సుతో నింటిలోఁ బోయిపరుండిమాత్ర మేమి లాభములే? సూర్య—నీవో, భీష్మాచార్యులు దిగి వచ్చినాఁడురా, అబ్బా! ధర్మా—కాదు కాని, ఏమి మాధుర్యమోయి! ఆమె యప్సరసకాని మనుష్యస్త్రీ కాదు. ఏమి పెదవులోయి అవి! సూర్య—అంతటితోనాఁగు, తేపు గుంటూరులో నింకొకమోస్తరు పెదవు లున్నవి. చెడిపోయెదవు. ధర్మా—మాట మాట బదులుతీర్చుదాక ప్రాణ మొప్పదు. రాత్రియు నిద్రలేదు. పండుకొందము పట్టు. సూర్య—ఎప్పుడును నిద్రయేమయ్యా నీకు? కుంభకర్ణుఁడవు మఱల నీ యుగములోఁ బుట్టినావు. సరేకాని, సంగీతము పాడుచుండఁగా మన కెందు కంత యానందము? పాడెడివారు సంగతులు వేయుచుండఁగా నవి మనకును వచ్చినట్లే యుండును. మఱల నది చేతఁగాదు. నా కిది యెప్పుడును చిత్రముగానుండును. ధర్మా—నాకు నిద్రవచ్చుచున్నది. నిద్రపోనీ! సూర్య—ఇవి యేమిటో యెందుకో చెప్పి నిద్రపో! లేకపోయిన నివ్వేళ నిద్రపోయి నావే! న న్నెఱుఁగుదువుగా! ధర్మా—గోల నీతోను. లోకమంతయు నైదుభూతములు. అయిదు తద్గుణమును. ఐదింద్రియములు. ఆ యయిదు భూతగుణములు నీ యింద్రియములకు విషయములు. ప్రపంచమంతయు నీ యింద్రియ తద్విషయములలో నిమిడియున్నది. ప్రతిమనిసియుఁ బంచభూతములయుఁ దద్గుణములయుఁ బ్రతిబింబించు

స్థలము. అనఁగా నితనియందు సూక్ష్మరూపమున నవియున్నియు నున్న వన్నమాట. కాని మానిసియజ్ఞానముచేత నావరింపఁబడినవాఁడై యీసర్వము తానే నని తెలిసికోనలేఁడు. చాయగా నీ సంగతి యత నికిఁ దెలియును. దానినే తెలిసీతెలియనిస్థితి యందును. ఈ తెలియక పోవుటలోఁ దెలియుటయుఁ గలదు. మనిసి సామాన్యముగఁ బ్రపం చమునందున్న సర్వభోగపదార్థములు వాంఛించును. అంతయు ననుభ వించగలశక్తి యతనియం దున్నది. కనుకనే యట్లు వాంఛించును. కాని యాశక్తిని విజృంభింపఁజేయవలయును అచ్చటనే పూర్వజన్మ కృతకర్మ మడ్డువచ్చును. అట్లే ప్రతిక్యక్తియందును సృష్టిలోనున్న సర్వశబ్దము బీజరూపమున సన్నిహితమై యుండును. తచ్ఛబ్దానుభవ మతనికి సూక్ష్మశరీరికిఁ గలదు. కాని స్థూలశరీరికి లేదు. సంగీతము వినుచుండు తన్మయత్వస్థితిలో మనమందఱ మా సూక్ష్మశరీరికి దగ్గ ఱగానుండి యతఁ డెఱిఁగిన సర్వశబ్దానుభవము పొందుచుందుము. ఆనంద మా సూక్ష్మశరీరి లక్షణములలో నొకటి. ఈ దేహమున కానందము లేదు. దేహగతాత్మకును లేదు. తదతీతమైన యాత్మకుఁ గలదు. తదతీతాత్మకు సన్నిహితముగా నుండుటయే కళ లానందించు నపుడు మన ముండునట్టి స్థితి. కళలు దైవికములని చెప్పుటకూడ నిందు కనియే. తెలిసినదా? నాకుఁ గన్నులు మూసికొని వచ్చు చున్నవి. నే నింక నాఁగలే నబ్బా! నాకు మఱల జబ్బుకూడ జేయును.''

మఱునాఁ డిద్దఱును బ్రొద్దెక్కిలేచిరి. కృష్ణాస్నానముచేసిరి. సూర్యపతి నాఁడుకూడ నుండు మనెను. ధర్మారావు 'ఇంటిదగ్గఱఁ దినుటకుఁగూడ నేమియు లేదు. నేను లేకున్నచో మాఅమ్మ మఱియు దిగులుపడును. పోవలయు ననెను.'

ఆ మధ్యాహ్నము సూర్యపతి వందరూపాయలు తెచ్చి ధర్మా రావు కిచ్చి 'ముందర జీతముకట్టి చిన్నయప్పులు తీర్చుము. మఱల నెలనాఁటికిఁ దక్కిన దిచ్చెదను' అనెను. ధర్మారా వాశ్చర్యపోయి మఱలఁ జదువు మందువా' యనెను. సూర్యపతి 'ఊ' యని వెక్కి రించెను. ధర్మారావు 'ఇదికాక నాల్గువందలకుఁ దక్కువకాదు. తెలి యునా' యనెను.

సూర్య—పోవయ్యా! పిచ్చి బ్రాహ్మణుఁడా! ధర్మా—నేను పిచ్చి బ్రాహ్మణుఁడను గాను! నీవు పిచ్చి కమ్మవాఁడవు!

ధర్మారావు తిరిగి గుంటూరు వచ్చెను. వచ్చుచునే నాయుని దుకాణమునకుఁ బోయెను. అతని దుకాణము మూసియున్నది. వచ్చుటతోడనే యతనిడ బ్బతని కిచ్చి వేయవలయునని తహతహపడు చున్న ధర్మారావున కొడలంతయుఁ జెమ్మటలు పొక్కినట్లయ్యెను. నాయు రిల్లు తెలిసికొని యచటికిఁ బోవలయు నని ప్రక్కనున్న దుకాణ దారు నతని యి ల్లడిగెను. అతఁడు 'అయ్యా, నాయుడు గ్రామములో లేడండి. రామేశ్వరయాత్రకుఁ బోయెను' అని చెప్పెను. ధర్మారావు ప్రాణము నీరసించిపోయెను.

'మఱల నెన్నాళ్ళలో వచ్చును?' 'అతనిచేతికి రెండువందల రూపాయలు వచ్చెను. అవి ఖర్చుపడువఱకుఁ దీర్థయాత్రను సేవించి తరువాత వచ్చునండి. ఎప్పుడువచ్చునో తెలియదు ఎప్పు డతని చేతిలో రెండువందలు మిగులునో అప్పుడెల్ల నిదే పని. సుమారు రెండునెలలో రావచ్చును.'

ధర్మారా వింటికిఁ బోయెను. అచ్చట రాఘవరావు కూర్చుండి యుండెను. ఇద్దఱును గలసి సందర్భములన్నియుఁ బ్రసంగించుకొనిరి. ఇదివఱకే సూర్యపతి రాఘవరావునకు సాహాయ్యము చేయుచుండెను. మఱల నిప్పుడు ధర్మారావునకుఁగూడఁ జేయుట. తామిద్దఱునుగలిసి తనమిత్రుని మంచితనమును జూఱగొనుట యేవిధా నని విచారిం చిరి. కాని యేమి చేయుదురు? గత్యంతరము తోఁచ లేదు.

ధర్మారావు మఱలఁ గొంచెము వెసులుబాటుచిక్కి తనబుద్ధి చదువుమీఁద మఱల్చెను. ఆనాఁడుసాయంతన 'మాముక్తమాల్యద' తెచ్చి యది చదువుట ప్రారంభించెను.

అరుంధతి కాఁపురమునకు వచ్చినతరువాత ధర్మారా వేమియుఁ జదువలేదు. అతనికాలము సంసారపు చిక్కులతోడను, నరుంధతీప్రణయకథలతోడనే కడచినది. ధర్మారావు ప్రతిదినము రాత్రులందు భోజనముచేసి తలవైపున బ్రక్కవద్ద దీపముపెట్టి చదు వుట కారంభించును. ఆ చదువుట చదువుట తెల్లవాఱి కోడికూయు వఱకు నట్లే చదువును ఈరీతిగా నతఁ డింగ్లీషునవలలు, తెలుఁగు

నవలలు తెగఁజదివెను. చిన్నప్పుడు తెలుఁగునవలలే యెక్కువగాఁ జదివెడివాఁడు. కాని దినములు గడచినకొలఁది యాపుస్తకములన్నియు నెందుకుఁగొఱగానివని యతనికిఁదెలిసెను. వంగభాషనుండియు మహారాష్ట్రభాషనుండియు సహస్రములు ననువదింపఁబడిన యీ నవలలు క్రమక్రమముగా నతనికి దుష్టములై తనమాతృభాషామూర్తికి శ్లీపద వ్యాధిని గలిపించినట్లే తోఁచెను. అతనిబుద్ధి సరిగా వికసించని యారోజులలో నవి చదివెను గాని యిపు డతనికి వాని పేరు చెప్పిననే యొడలు మండుచుండెను.

తరువాత నతఁ డింగ్లీషునవలలు చదువ నారంభించెను. తెనుఁగువానికన్న నవి చాల బాగున్నవని యతఁ డూహించెను. స్కాటు, డిక్కెన్సు, థాకరీ వీరి నవలలు కొన్ని పాఠ్యగ్రంథములుగాఁ జదివి వారి తక్కిన నవలలుకూడఁ దెచ్చి చదివి వారే పరమోత్తము లని యూహించుచుండెను.

ఆ మధ్యమధ్యఁ దెలుఁగు ప్రబంధములు చదువుచుండెను. అతనికిఁ దెలుఁగుప్రబంధములయం దున్నరుచి తక్కిన వేనిమీఁదను గుదురలేదు. ఇంగ్లీషుచదివినను నా గ్రంథములలోని భావములే యతనికిఁ దెలియుచుండెను. కాని యా భాషలోని మార్దవము, తేజస్సు, ఓజస్సు, ప్రసాదము మొదలయిన కావ్యగుణము లతనికిఁ దెలియుటయే లేదు. షెల్లీ, కీట్సు మొదలయినవారి కవిత్వము చదువును. కాని వారి శయ్యాపాకాదు లెట్టివో బుద్ధి కందుటలేదు. శ్రీనాథుఁడు పెద్దన - వీరి శయ్యల సామ్యము మఱల నందులోని వైలక్షణ్యము, ప్రభావతి భారతము వీనిలోని సామ్యవైలక్షణ్యము, నిట్లే తక్కిన తెలుఁగుకవుల సర్వప్రబంధములయందలి శయ్యారీతులలోని భేదములు సూక్ష్మతరముగా నతనిహృదయమున కచ్చుగుద్దినట్లు తోఁచుచుండెను గాని, యీ యింగ్లీషు కవులరచనలలోని శయ్యారీతులభేదము లతనిహృదయ మందుకొనలేకుండెను.

అతని కింకొక యూహ—తత్తద్భాషలయందలి యా యా వైచిత్ర్యములసమగ్రత యర్థమగుటకు నా దేశమునందు జన్మించి యాభాష చిన్నప్పటినుండి మాటాడినఁగాని తెలియదని. ఒకజాతి గుణములు మతాభిప్రాయములు తజ్జాతిరక్తమునం దెట్లుండునో ఆ

జాతి మాట్లాడుభాషలోని సమగ్రమైన రసభావాదు లర్థముచేసికొనుటకుఁగూడ శరీరములోని తద్రక్తమువలననే సంభవించునని. అతిపరిచయమువలన జరుగదా యనిన నాపరిచయము సమగ్రతపొందదు. ఎచ్చటనో లోపము గోచరించుచునే యుండును.

అతనిమిత్రులు చాలమంది యాంధ్రసారస్వత మాంగ్లసారస్వతము ముందు చాలదని యతనితో వాదింతురు. అతని కా యభిప్రాయము నచ్చదు. తెలుఁగులో నున్న సొగసు యితరభాషలలో నుండదని యతఁడు వాదించును. ఇంగ్లీషుచదువుకొనువారికిఁ దెలుఁగుపరిచయమే తక్కువ. పాశ్యగ్రంథములే ముక్కుకొసను బెట్టుకొని పరీక్షార్థము చదువుదురు. వారు తెలియని తెలుఁగువాఙ్మయవిమర్శ యేల చేయవలయు ననియు నతనికిఁ గోపము:

ధర్మారావు తెల్లవాఁడులు చదువుట యరుంధతి యెఱుఁగదు! ఎఱిఁగినది తనతోఁ దెల్లవాఁడులు మాటాడుట.

ఈనాఁడు ధర్మారా 'వాముక్త'ను దెచ్చి యింటిలోఁగాని తనసెజ్జయందుఁగాని యరుంధతియే లేనట్లు దీపమమర్చి పండుకొని పుస్తకముతీసి చదువ నారంభిచెను. అరుంధతి భోజనముచేసివచ్చి యతనివద్దఁ బరుండెను. అతఁడు తనను బలకరించునని యెదురుచూచెను. అతఁడు పుస్తకమువంకనే చూచుచుండెను. ఆమె కీ క్రొత్త యనుభవములేదు. చేతిలోనుండి పుస్తకము లాగికొనెను. లాగికొని యతనివంకఁ జూచెను. అప్పు డరుంధతి కొకసంగతి తెలిసెను. ఆసంగతి యామె పూర్వ మెఱుఁగదు. పూర్వ మామెయెఱిఁగిన సంగతి తా నాతనిహృదయముపై సర్వాధికారిణి నని. ఇదివఱ కతనికిఁగోపము వచ్చుట, వచ్చిన కోపమును దాను ఛలోక్తిగా వారించుట జరుగుచునేయుండెను. తన యొక నవ్వు, ఒకవిలాసము. ఒకకుపితభ్రుకుటియు నతనికోపమును విఱుచుచుండెను. కాని యిప్పటి యతనిముఖమును జూచినంతనే యామె కదలాడిపోయి, యా ముఖవైఖరి తన కపరిచిత మగుటచే నేమిచేయుటకుఁ దోఁచక పొత్తము మఱల నతనిచేతిలో నుంచెను. అతఁడు మఱలఁ జదువుచుండెను. అరుంధతి ప్రక్కకొదిగి తాను బ్రదికియున్నట్లే లేకుండఁ దనశరీర మతనియొడలికిఁ దాఁకకుండ నెడముగాఁ బండుకొని యేమో యూహించుచుండెను. తానే

యతనిమనస్సునకు, హృదయమునకు రాణి యనుకొన్నది. ఈమె యెవరు? దీనికిఁ బతిక్రియ కానరాకున్నది. ఈ క్రొత్తసవతియందుఁ గోపించవలయునో, ప్రసన్నతఁ దాల్చవలయునో తెలియుటలేదు. బహుశః ఈమె తాను రాకముందే తనభర్తను వశముచేసికొన్నది కావలయును. అందుకనియే యాతని కామెమీఁద సంక్రేమ ఆ సవతిముందుఁ దాను లొంగిపోయెను. ఈర్ష్యాదుఃఖకోపములనుగూడ రానీయకుండఁ దనపతిని వశ్యునిజేసికొన్న యా సవతి నూహించుచునే యామె నిదురవోయెను. ధర్మారావు చదువుచుండెను.

ఈ సృష్టి తక్కినసృష్టికన్న భిన్నముగా నుండెను. రామకృష్ణుని మార్గము వేఱు, ఈయనమార్గము వేఱు. కథ నడుపుచోటిపదజాలము వేఱు వర్ణనలునడుపుచోటి పదజాలము వేఱు. పదజాలమేకాదు — వాక్యవిన్యాసము, అన్వయము, శబ్దములకూర్పు, కుదింపు-సర్వము భిన్నములుగా నుండెను. వర్ణనలు ఏమి వర్ణనలు! విల్లిపుత్తూరులోని యిండ్లు, ముంగిళ్ళు, దిగుడుబావులు, దేవాలయము, రథములు, అచటిజనులు తద్వర్ణనమునందలి సూక్ష్మవిషయములు చూచిచూచి ధర్మారా వింతకన్న సమగ్రమైనశిల్పము తెలుఁగులో లేదని నిర్ణయించెను.

ప్రక్కనున్న వారింటిలో గడియారము గంటలుకొట్టుచుండెను. ధర్మారావు చెవియిచ్చి వినెను. మూఁడు కొట్టెను. 'అబ్బో! చాల సేపయిన' దని పుస్తకము మూసెను. దీపము తగ్గించి పాత్రము దూరమునం దుంచి చూచెను. అరుంధతి తనకు దూరముగాఁ బండుకొని నిద్రించుచున్నది. అప్పు డతని కామె తనచేతిలోనిపాత్రము తీసికొనుట, తాను తిరస్కరించుటయు మనస్సునకుఁ దెలిసెను. ఆమె వచ్చిన యీ యేడెనిమిది నెలలుగా నామెను దా నట్లని యెఱుఁగఁడు. తా నే మన్నాఁడు? అతనిమనస్సున కేమో యన్నట్లే యున్నది.

అరుంధతి నిన్నఁ దాను తెచ్చిన తెల్లనిచీరఁ దాల్చినది. కనులకుఁ గాటుక పెట్టినది. మెడలోఁ జంద్రహారము తాల్చినది. వ్రేలియందుంగర మున్నది. మొగమునఁ గుంకుమబొట్టు మెఱయుచున్నది: అతఁ డామెను దగ్గఱకుఁ దీసికొనెను. అంతలో నామెకు మెలఁకువ

వచ్చెను. పతి తన్ను దగ్గఱకు లాగుకొనుచుండెను. ఆమె లాగఁబడెను. ఆ లాగఁబడుటలోఁ బరిచితి యపరిచితి, సన్నిహితత్వము, దూరత్వము,అంగీకారము ననంగీకారము, కోపముప్రసన్నత మొదలగు పరస్పర వ్యతిరేకభావనలు విచిత్రముగా గోచరించెను. పతికౌఁగిటఁ జేరినతరువాత నాయకునొకయనుమానము తగిలినది. తానుపొరపాటు పడెను. ఆ సవతికన్నఁ దనభర్తకుఁ దానే యెక్కువప్రేయసియేమో!

ధర్మారావాముక్తమాల్యద చాలరోజులు చదివెను. ఆ గ్రంథమువంటి గ్రంథము మఱలఁ దెలుఁగులో లేదు. ఏభాషలోనను లేకపోవచ్చును. అది పెద్దనగారే వ్రాసిరేని యాయన కాంధ్రకవితా పితామహబిరుదము బిరుదమే కాదు. కాని యెంతసేపటికి నతనికిఁ గృష్ణరాయలే యది వ్రాసె నని. పెళ్లికి రెండాత్మ లున్న వన్నారఁట. ఆముక్తమాల్యదకర్త కా లెక్కను పదియాత్మ లున్నవేమో? ధర్మారావునకు సహజముగాఁ బూర్వాంధ్రరాజులన్నను, ప్రస్తుతాంధ్రదేశపుజమీందారులన్నను గౌరవము మెండు. అతని కాముక్త కృష్ణరాయలు వ్రాసెనన్నదానిలో నున్నయాహ్లాదము పెద్దనగారు వ్రాసిరనుటలోఁ గన్పించలేదు. ఆముక్తమాల్యదలో నున్నన్నిభిన్న శయ్యలు వ్రాయఁగలఁడేని పెద్దన్నగారు మనుచరిత్రలో నేల వ్రాయలేదు? ఆ గ్రంథమున నీ ఛాయలేని గోచరించలేదు. 'కాదు. మనుచరిత్రము బాల్యమున వ్రాసి, యాముక్త ప్రౌఢవయస్సులో నిర్మించె' నందమా? రెండును నిద్దఱు ప్రత్యేకవ్యక్తులు ప్రౌఢవయస్సులందుఁ బొందఁదగిన రెండుమహోత్కృష్టమైన కవితాపద్ధతులు గాని వేఱు గాదు. కావ్యమునందుఁ గవి మూఁడుకథలు వ్రాసెను. మూఁటియందు మూఁడు భిన్నశయ్య లున్నవి: విష్ణుగుప్తుని కథలో మాధుర్యము కలదు. కేశిధ్వజ ఖాండిక్యుల కథయందు భారతరచనాపద్ధతి తిక్కన్నగారు కథ నడిపించుతీవి యున్నది. మాలదాసరికథలో శ్రీకృష్ణదేవరాయలే యున్నారు దానికి సాటువ తెలుఁగులో మఱొకచోట లేనేలేదు. ప్రౌఢిమలో దానినిమించి తెలుఁగుభాష పోదగినంతశక్తి యాభాషకే లేదు. అది గౌరీశంకరశృంగమువంటిది. [illegible] కథలనడుమ నున్న దీర్ఘములైన ఋతువర్ణనములచేతఁ గథారచనా శిల్పమునకుఁ గొఱఁత వాటిల్లె నను దోషమును ధర్మారావు

పూర్వము విన్నదానినిగూర్చి విచారించెదరు. మఱల విచారించుట యేల? చదువుచున్నపుడు తన దీర్ఘవర్ణనలు విసుఁగు కలిగించెనా!

ఒక మహాకావ్యమును విమర్శించుట యెట్లు? అది చదివిన తరువాత నందుఁగల భిన్నవిషయములు పరస్పరము లగించినవా, లేవా యని విచారించుట సరియైన విమర్శగా నతనికిఁ దోఁచలేదు. కావ్యమును జదివినతరువాత విమర్శించుట కాదు. చదువుచుండఁగనే విమర్శించుట. చదువుచుండఁగనే యానందము కలుగును. చదివిన తరువాతఁ గలుగునది తదానందస్మృతి, తదానంద పరామర్శ. ఆ పరామర్శచేయుటలోఁ గావ్యముచదువువేళ మనముపొందిన యానందమునే విచారించక తత్కావ్యగతభిన్నవిషయములనుగూడ మనస్సుతో విచారించి యానందమునకు భిన్నమైన యొకసంగతిని జర్చింతుము. 'ఆముక్తము' చదువువేళ నే కథనుగాని యీ వర్ణన లడ్డు తగిలి సాగనీయన ట్లతనికిఁ దోఁచలేదు. ఆ తోఁచకపోవుటయే తత్కావ్యగతశిల్పపరమోత్కృష్టతా ప్రమాణము.

అదియుఁగాక పురాణము, కావ్యము, ప్రబంధము – వీనికిఁగల భేదములు చూడవలయును. ఒకఁడు చెప్పఁగా మనము వినుకథలో మధ్యఁ గథావిచ్ఛేదక విషయములు కలిగించినంత మనోవ్యథ, మనముచదువుగ్రంథమందుఁ గలిగెనేని కలిగించవు. ప్రబంధము వర్ణనాప్రధానమైనది. కావునఁ బ్రబంధమున కా విమర్శసూత్రమే పట్టదు. వీధినాటకము వేఱు, రూపకాభినయము వేఱు. వీధినాటకము భావాశ్రయమైనది, రూపకము రసాశ్రయమైనది. రెండును రెండు భిన్న సంస్థలు. ఇతరకావ్యమును జూచినట్లు ప్రబంధమును జూడనే రాదు.

ఒక మహారచనయందుఁ బ్రధానవస్తువుతోఁ దదంగవిషయములు చక్కఁగా నతుకుట శిల్పమే. అదేపని పెట్టుకొని యంగవిషయములు స్వల్పపరిమాణము కలవిగాఁ జేసి మహావిషయముతోఁ బొందుపఱచుట యొక విలక్షణమైన సృష్టి కావచ్చును. కాని యదే సృష్టికాదు. అంగమైన వస్తువును విస్తరింపించి దానియందును బ్రత్యేకానందము కలుగునట్లు సృష్టించుట యింకొకరీతిశిల్పము. మహామేధావి యింతమాత్రముచేతఁ బ్రధానకథ యందుకోలేకపోఁడు. ఒకా

నొకని మొగమందు సునిశితములై తేజస్వంతములయిన నేత్రము లుండును. అవి తమ దీధితిచేత నితరముఖావయవములను దిరస్కరించును. వానిసొగసు వానిది: వానిచేతనే మొగముకూడఁ బ్రజ్వలించును? 'ఎబ్బె! ఇవి ప్రధానమైన ముఖమున కొదిఁగిలేవు!' అని వాని నెవరు తిరస్కరించరు. పైఁగా 'వాని మొగములో నున్న సొగసంతయు వానికన్నులలో నున్నదిరా' యని మెత్తురు. అట్లే కృష్ణరాయల గొప్పతనమంతయు నాయనవర్ణనలలో నున్నది. అవి తీసివేసినచో నాయుక్తమాల్యదయే లేదు. అప్పు డా గ్రంథముయొక్క ప్రత్యేకతయే పోయినది.

ఆ మఱునాఁడు రాఘవరావు వచ్చి, సూర్యపతి యుత్తరము వ్రాసెననియు, బెజవాడ తా మిద్దఱును గలసిపోవలయుననియుఁ జెప్పెను. నాఁడు శనివారమగుటచే నిద్దఱును బెజవాడకుఁ జనిరి. బందరునుండి కిరీటిరావును వచ్చెను. నలుగురుమిత్రులు సమావేశమయిరి. మఱలఁ బూర్వపుదినచర్య జరిగెను. ఆరాత్రి మఱల మహారాష్ట్రుల సంగీతసభ. అందఱు పోవలె ననిరి. అన లందుకనియే సూర్యపతి కబురంపినది.

ఆ సాయంకాలమున నలువురు కృష్ణయొడ్డునకు వాహ్యాళికిఁ జనిరి. అచ్చట గిరీటియెఱిఁగిన యొకయువకుఁ డుండెను. కిరీటి యతనిని తన తక్కిన ముగ్గురు స్నేహితులకుఁ బరిచితుని గావించుచు నిట్లు చెప్పెను.

కిరీ—వీరిపేరు రాధాపతిగారు. వీరు బి. ఏ. పరీక్ష యిచ్చినారు. వీరు కవులు. హిందీ వంగభాషలుకూడఁ జదివిరి.

నూతనపరిచితులందఱు నొకరి నొకరు గౌరవించుకొనిరి. ప్రొద్దుగ్రుంకు వేళకు వీరు నలువురింటికి వచ్చిరి.

ధర్మా—కిరీటీ! రాధాపతి చాల నవనాగరికునివలెనున్నాఁడే?

కిరీ—అవును! అతఁడు మన దేశాచారములన్నియు నభివృద్ధి భంగకరములనియు, మనసారస్వతముకూడ నితరదేశసారస్వతములతోఁ దులదూఁగదనియు నభిప్రాయము కలవాఁడు. అందుకనియే యాయన వంగభాషనుండి కొన్ని గ్రంథములు తెలుఁగుచేసినాఁడు. వాఙ్మయము నుగూర్చి మంచివిమర్శ తెలిసినవాఁడు. సంస్కృతము నుజదివెనఁట.

ధర్మా—మనిసికొంచెము వేషభాషలలో నూతనుఁడు. కిరీ—బాహిరసౌందర్యము హృదయసౌందర్యమునకుఁ జిహ్న మని యతని యూహ. ప్రాపింగు చెఱుగనీయఁడు. కట్టినబట్ట మాయనీయఁడు. ఎప్పుడును బూవువలె నుండుటకే ప్రయత్నించును. మనిసికూడ నందమైనవాఁడుకదా! ధర్మా—ఏమైన నాస్తికలవాఁడా? కిరీ—సాలుకు మూఁడు నాలుఁగువేలు వచ్చును. ధర్మా—అట్లుచెప్పుము. అందుకనియే యాడినయాట సాఁగుచున్నది. ఏదియో వచ్చెడు వీలున్నఁగదా, యుష్షరి.

సంగీతసభనుండి తిరిగివచ్చునపుడు మఱల రాధాపతి కనఁబడెను. కిరీటి పలుకరించెను. 'సంగీత మెట్లున్న' దనెను. రాధా—ఆహాహా! ఆ అమ్మాయి గొంతు యేమి గొంతుక! ఆమె యప్సరసవలె నున్నది. ఆమెసౌందర్యము నాహృదయము నాహరించినది. ఆపిల్ల పే రేమో?

కిరీటి ముందు నడచెను. రాధాపతి వెనుక వెనుకదా రాడెను. కిరీటి 'రారా' అని యడిగెను. రాధాపతి 'యాపిల్ల తండ్రిని గలసికొని మాటాడి వచ్చెద'ననెను. ధర్మారావునకుఁగూడ నా గాయకులతోఁ బ్రసంగించవలె నని యున్నది. అందుచే నతఁడుకూడ 'సరే. పోయి మాట్లాడుద' మనెను. అందఱును గలసి లోనికిఁబోయి యాపిల్లతండ్రిని జూచి యొకరొకరు తమ్ముఁ దామే యాయనతోఁ దెలుపుకొనిరి. ఆయన 'అయ్యా! ఇప్పుడు కొంచెము పని యొత్తిడిగా నున్నది. తమరు రేపు మధ్యాహ్నము మాబసకు వచ్చినచో మాటాడుద' మనెను.

మఱునాఁడు మధ్యాహ్నము వీరందఱు వారిబసకుఁ బోయిరి. మహారాష్ట్రగాయకునిపేరు కేల్కారు. ఆయన వీరిని గౌరవించి తీసికొనిపోయి కూర్చుండఁబెట్టి తన గానకళా విశేషములను వారికిఁ దెలిపెను. వారిలో నెవ్వరు సంగీతశాస్త్రపరిచయములేనివారు. అతఁడు చెప్పినప్రతిదానికిఁ దలయూచిరి. కేల్కారు ప్రాఁతపుస్తక మొకఁడుదీసి దానియందుంచిన కొన్ని మామిడాఁకులు వడిలిపోయినవి చూపించి, యందు సన్ననివి పుటియు సన్ననివి యంబున యానెలు ప్రదర్శించి 'ఈ ఆఁకంతయు నీనెలతోనే చేయఁబడినది. ఈ యానెలు

మఱియు మఱియు సన్నమై మనయక్షి రూపించలేనంత సన్నదనము కలచోట్ల మనకుఁ బత్రమన్నట్లున్నది. కాని నిజమున కిందు నీనెలు కానిది లేదు. చూడుఁడు. ఒక్క యీనెనుండి యీ పత్రమంతయు నైనట్లు పత్రమునం దున్న యీనెలే శాఖయందు నున్నవి. వృక్ష మంతయు నీ యీనెలే యన్నమాట. సృష్టియంతయు నింతియ. ఒకటేగుణము బహువ్యాప్తి చెంది యయినది. సంగీతము చూడుఁడు. ఒక్కటేశబ్దము బహువిధా విస్తృతమైనట్లు గోచరించును. నిజమైన శిల్పి యీ పరమరహస్యమును గుర్తించి ప్రధానమైన శబ్దమునకుఁ దద్వికారమునకుఁ గల పరస్పరసంబంధమును గుర్తించి గానముచేయ వలయును. ఏదో కొంచెము చెప్పుకొని ప్రతివాఁడును నేఁడు గాయకుఁ డగుచున్నాఁడు' అని ఏకధాటిగా నుపన్యసించెను. అందఱు నతఁడు గొప్పగాయకుఁ డని నిర్ణయించిరి. రాధాపతి కాయన మఱియు నచ్చెను.

ఇంతలో నాయనకూఁతురు వచ్చెను. రాధాపతి 'యామెచేత నేమైన పాడించెదరా' యని తండ్రికి మనవిచేసెను. ఆయన 'మఱల తేపురాత్రికి సభ. తమరు దయచేయుఁడు' అని యీ మాటలోని గడుసుదనము మొగమునందుఁగనరాకుండ, మాటలయందుఁ దోఁచకుండఁ జెప్పెను.

రాధా—ఆమె పే రేమండి?—సమాధానము లేదు.

తిరిగి యింటికిఁబోవుచు ధర్మారావు కిరీటితో 'ఏమోయి! మీమిత్రుఁడు కొంచెము ప్రణయివలె నున్నాఁ డేమి? అతఁడు కూర్చున్నంతసేపు నామెవచ్చినవంక, పోయినవంకనే చూచుచుండెను. ఆమెతండ్రి యేమయిన ననుకొనునేమో యని యయిన లేదు. చాలా చమత్కారిగా నున్నాఁడు!' అనెను.

కిరీ—వారి దొక ప్రేమతత్త్వము. ఆ మనుష్యులే యంత. వారొక కొందఱు మిత్రబృందము కలరు. వారు బెల్జియము, స్విడ్జర్లండు, రష్యా యీ దేశపుకవుల గ్రంథములు చదువుచు వారిధర్మములకుఁ దత్శాస్త్రములకుఁ ప్రాధాన్యమిచ్చుచుందురు. వారికిఁ బ్రేమ సర్వోత్తమము. ప్రేమతత్త్వమునందుఁ బ్రపంచమంతయు నెందుకుఁ గాదందురు. దానికోసమై సర్వమును బరిత్యజింతు మందురు.

ఆ రాత్రి నలువురు పండుకొనిరి. సూర్యపతి, రాఘవరావులు నిద్రిపోయిరి. కిరీటి యేదో చెప్పుచుండెను.

ధర్మా—నీ వీ రెండువాళ్ళనుండియుఁ జూచుచున్నాను. ఏదోమోస్తరుగా నున్నావు. రాధాపతి యన్నచో నాతనితత్త్వ మన్నచోఁ జాల నాదర యున్నట్లు చెప్పుచుంటివి. కథ యేమిటి? కిరీ—ఏ మున్నది? ఏమియు లేదు. ధర్మా—కాదులే, చెప్పు, నీవు కూడ నెవరినో ప్రేమించిన ట్లున్నది. నేనును విని సంతోషించెదను.

కిరీటి కొంతసేపు మౌనమువహించి 'ధర్మన్నా' అనెను. ధర్మారావు కిరీటి యీ పిలుపు విని యంతకుముందు పరిహాసముగాఁ బోయిన తనమనస్సు త్రిప్పుకొని కిరీటియెడఁద తా ననుకొన్నదాని కన్న నిగూఢతరమైన యేదోభావముచేతఁ దపించుచునట్లు గ్రహించి, యతని దీర్ఘనిశ్వాసముచేత నతని యా భావముత్సృణీకరించరాదనియుఁ దెలిసికొని యిట్లనెను: 'కిరీటీ! ఏమో చెప్పుము. నీ ప్రకృతి నే నెఱుఁగుదును. ప్రతి చిన్నసంగతియు నీకు హృదయదఘ్నముగానే యుండును. ఎవరిని ప్రేమించితివి? నీ రహస్యము నేను దాఁచఁగల్గుదునుకదా!'

కిరీ—అన్నా! నిన్నుఁగాక మఱి యెవరిని విశ్వసింతును! రాఘవరావుతోఁజెప్పినచో నతఁడు మూర్ఖుఁడు. పరిహాసమే చేయును. సూర్యపతి యతనితో జట్టుకట్టును. మా మేనమామ యున్నాఁడు. ఆయన డిప్యూటీకలెక్టరు. మాకును వారికిని రాకపోకలు లేవు. మేము బీదవార మని వారు మాయింటికేరారు. ఆయన మొన్న సెలవులలోఁ దనకుమారుని పెండ్లిచేసెను. మమ్ముఁబిలచెను. మేము వెళ్ళితిమి. మా నాయనగారు రాలేదు. నేనును, మాయమ్మగారును బోయితిమి. ధర్మా—వారు సరిగా మి మ్మాదరించలేదు కాఁబోలు! కిరీ—అవును. మామామ యేదో ముభావముగా నున్నాఁడు. తక్కినవారికి మే మసలు వెళ్ళినట్లే లేదు. కాని యంతదూరముపోయి యేమని తిరిగివత్తుము? అచ్చటనే యూరకున్నాళ్ళున్నాము. ఒకరోజునమధ్యాహ్నము... ధర్మా—మధ్యాహ్నము ఏమి జరిగినది? చెప్పుము. కిరీ—వారియింటిలో వెనుకభాగమం దొకగది యున్నది. నే నచటికి దేనికో పోయితిని. అచ్చట నెవ్వరును లేరు. లోనికిఁ బోవువఱకు

మామామకూఁతు రచట నొక మంచముమీఁద నిద్రించుచున్నది. అదివఱకు నే నామె నెప్పుడును జూడలేదు. ఆ వెనుకటిరోజుననే చూచితిని. చిన్నప్పు డెప్పుడో యొకసారి చూచితిని. అది మఱలఁ జూచుట. చిన్నప్పుడు మామామయుద్యోగములోనున్నప్పుడు నా కాపిల్ల నిత్తు మని మాయత్తయు, మామయు ననుచుండెడివారు. నా చిన్నతనమంతయు నా కా భావమే వృద్ధిపొందెను. మా పని చెడిపోయినతరువాత వారు మామాటయే తలఁచలేదు. కాని యా పిల్లకుఁగూడ నా మీఁదనే ప్రేమయున్న దని నే నెఱుఁగుదును. ఆమె పెద్దమనిసియయి రెండేండ్లయినది. అప్పటివఱకు 'నేను బావనే పెండ్లియాడెద' ననుచుండెడిదఁట. అన్నపుడెల్ల వాండ్రఅమ్మ కోపపడు చుండెడిదఁట. ధర్మా—గదిలో నామెయున్నది. తరువాత నే మయినది? కిరీ—ఆమె నదివఱకు నేను పరకాయించి చూడలేదు. ఆమెను జూచినంతనే నేను దిగ్భ్రాంతుఁడ నైపోతిని. చిన్నపు డెఱుఁగుదును. సన్ననిపిల్ల, ఎఱ్ఱనిది, అంతమాత్రమే. అన్నా! ఆ నిద్రాసౌందర్యము నాయెడందలోఁతులుదాఁక నాఁటికొన్నది. సన్నని యెఱ్ఱని గాఁగరా ధరించి, యాపైని తెల్లని వలిపఁపుఁబైఁట వేసెను. నిద్రలో నా పయ్యెద కొంతతొలఁగి యామెవక్షోభాగము కూడఁ గొంత కానవచ్చుచుండెను. ఆమె శిరోజములు - తలంటు కున్నది కాఁబోలు-ముడువలేదు. గాజువారి పొడిపొడిగా నుదురుపై నూఁగుచుండెను. నమ్ముము, నమ్మకుము. నే నొక దేవతామూర్తి యెదుట నున్నట్లయినది. ఆమె సర్వమునాపసినాఁటనుండినాదియన్న భావముతోనే పెరిఁగితిని. అప్పు డామె నాయెదుటనుండి నేను తక్కిన ప్రపంచమంతయు విస్మరించి, యామె నా యధీనురాలే యని తలఁచి తిని. ఆమెసౌందర్యజ్యోతిస్సులు గదియంతయు నావరించి వచ్చి నా కను లంటఁబొడిచెను. నా మనస్సులోనికిఁ జొచ్చెను. నాహృదయ మెల్ల నావరించెను. నాయొడలు నాకుఁదెలియలేదు. ఆమెవంక నట్లే చూచుచు నిలుచుంటినికాఁబోలు. ధర్మా—ఆమెకు మెలఁకువయయి నను రాలేదా? కిరీ—ఇంతలో నామెతల్లి యచటికి వచ్చెను. వచ్చి నన్నుఁజూచి, నిదురించుచున్నయామెను జూచి మొగము చిట్లించు కొని, యామెను బోయి నిద్రలేపెను. శశి నిద్రలేచినది. నన్నుఁ

జూచినది. మొదట నావంకఁ జూచినచూపు నేను మఱువఁజాలను. అలభ్యమైనది లభ్యమైనట్లు, ఇంకఁజూడ ననుకొన్నదానిని జూచి నట్లు, తనకు దక్కదన్నది దక్కినట్లు మహానందరేఖ విరిసిన యా చూపు నాహృదయములో నప్పు డెంత చల్లఁదనము సమకూర్చెనో యది తలఁచుకొన్నకొలఁది నిప్పు డంత వెచ్చఁదనము సమకూర్చు చున్నది. అంతలో మఱల నామెకుఁ దనమానభావనము, తల్లి దగ్గఱనుండుటయుఁ దోఁచినది కాఁబోలు. వెంటనే యెచ్చటనుంచి వచ్చెనో చెప్పరానంత సిగ్గు వచ్చినది. ఇది చెప్పుట కింతసేపు పట్టి నది కాని జరుగుటకుఁ గన్నుమూసి కన్నుతెఱచునంతసేపయినఁ బట్ట లేదు. వెంటనే యామెతల్లి యామెను దిట్టి 'నీకు సిగ్గులేదు. మగవాం డ్రున్నచోట నొడలు తెలియక యెట్లు నిదురపోవుచుంటివి?' యని యేవో మఱికొన్ని యసభ్యపుమాటలు కూసి యామెను జేఁబూని లాగుకొనిపోయెను. ఆ సమయమున నన్నుఁగూడ నేవో మాట లన్నట్లే జ్ఞాపకము. కాని నాకు సరిగా వినిపించలేదు. నేను నిలు చున్నవాఁడను నిలుచున్నట్లు నీరసించిపోయితిని. ఆహా! అప్పటి నాస్థితి యేమని చెప్పుదును? మునిమాపున సన్నని వెన్నెలవెలుఁగు రేకలు దిశలెల్లనలమి సుంతప్రొద్దుపోయినంత యొత్తిగిలిన శుక్లపక్షపు రాత్రివోలె నాలో నేనే గాఢాంధకారము నలముకొంటిని. కొంత సేపటికి నాకు స్మృతివచ్చినది. చూచితినిగదా, నాకన్నులవెంట నీరు జాఱెనుకాఁబోలు, నా చెక్కిళ్ళన్నియుఁ దడిసియున్నవి. గుండెలోనుండి యెంతకో యుబికియుబికి దుఃఖము వచ్చుచుండెను. కనులు నెమ్మదిగాఁ దుడుచుకొని యుబికివచ్చు దుఃఖమును బ్రయ త్నముతోఁ గంఠమందుఁ గుదించిపట్టుకొని గదివెలుపలికి వచ్చితిని. నామనసులో నేమో మెఱుపుమెఱసి మఱల, జీఁకట్లావరించిన ట్లయ్యెను. ధర్మా—ఆ పిల్లపేరు శశియా? కిరీ—శశిరేఖ. ధర్మా— తరువాత నేమయినది? నిన్ను వా రేమియు ననలేదు కా! కిరీ—తరు వాత రెన్నాళ్ళుంటిమి. ఆమె యెప్పుడును మాఅమ్మనే యంటి పెట్టుకొని తిరిగినదఁట. ఆ తిరుగుట యామెతల్లికిఁ గంటకింపుగానే యున్నదఁట. కాని యేమి చేయఁగలము? ధర్మా—మీ అమ్మగా రామెతో నేమియు మాటాడలేదా? కిరీ—మాటాడినది. ఆ మఱి

నాఁడు సాయంవేళ మా అమ్మయు, శశియు నిద్దతె యుండిరఁట. అమ్మ 'శశీ! చిన్నపుడు బావనే పెండ్లాడెద ననెడిదానవు. ఇప్పుడు మఱెవరినో పెండ్లాడెదవుకాఁబోలు. అన్న నిన్ను వాని కిపు డీయఁడుకదా' యన్నది. శశి 'అత్తా! నేను నా గొంతులోఁ బ్రాణ ముండఁగా నింకొకని బెండ్లాడను. నాకు వీరు సంబంధములు కుదుర్చు చునే యుండిరి. నే నొప్పుకొనుట లేదు. అందుచేత నా కింటిలో సుఖము లేదు. పోరులేకుండ నాకు నిముసము గడచుటలేదు. బలవంత ముగామాత్రము వీరు నాకుఁ బెండ్లిచేయలేరు. నేను బావనే పెండ్లి యాడెదను' అని చెప్పినదఁట. మాఅమ్మ శశిచుంచు దువ్వి ముద్దా డితి నని చెప్పినది. మేము తిరిగి వచ్చితిమి. అన్నా! అప్పటినుండి నాశరీర మిచ్చట, నాయాత్మ నాప్రియురాలివద్ద నున్నది. ఏమి చేయుటకును దోఁచుటలేదు. మామామ నా కెట్లును శశినిచ్చుట కంగీకరించఁడు. మాఅమ్మ బంధువులద్వారా మామామకుఁ గబు రంపినది. 'చిన్నప్పటినుండి యనుకొన్నమాఁట. పేదవారమైనను బంధువులము కాకపోము. పిల్లవాఁడు బి. ఏ. చదువుచున్నాఁడు' అని బంధువులచేతఁ జెప్పించినది. ఆయన మామాట వినలేదఁట. ఆయన రాక్షసుఁడు. ధర్మా— మఱల నాపిల్ల కబు రేమైనఁ దెలిసినదా?
కిరీ— తెలియుట కేమున్నది? ఆమె యింటిలోఁ బెద్దపట్టు పట్టినదఁట. తల్లిదండ్రులు లేవో సంబంధములు చెప్పెదరు. ఆమె నిరాకరించును. వా రామెను దూషింతురు. ఆమె యేడ్చును. వారు దండింతురు. ఆమె భోజనము చేయదు. ఈ రీతిగా జరుగుచున్నదఁట.

సూర్యపతికి మెలఁకువవచ్చి 'ఏమిటి మాటాడుచున్నారు? నిన్నను నిద్రలేదు. పండుకొనుఁడు' అని మఱల నిదురఁబోయెను. వారికిని నిద్రవచ్చెను. అప్పటికే రెండుగంటలయ్యెను.

మఱునాఁడు రాధాపతి వీధిలోఁ గనఁబడెను. కిరీటి 'మీరాబస యెచ్చటనండి' యనెను. రాధాపతి 'నిన్నటినుండి మహారాష్ట్రుల వద్దనే. నాసామానులు కొనిపోయి వారివద్దనే యుంచితిని' అని, అచ్చటినుండి యింగ్లీషులో 'నే నామెను ప్రేమించుచున్నాను. హృదయపూర్వకముగాఁ బ్రేమించుచున్నాను. నే నామెను వదలి యుండ లేను. నేను వారితోఁ బడి పోయెదను. బిజిలీకిఁ బెండ్లి

కాలేదు. మన తెలుఁగువారికిని మహారాష్ట్రులకును సంబంధము లున్నవి. నాయీస్త్రీయంతయు నా పిల్లపేర వ్రాసెదను. వారు నా కా పిల్ల నిచ్చెదరేమో కనుగొందును. నే నామెను ప్రేమించుచున్నాను. హృదయపూర్వకముగాఁ బ్రేమించుచున్నాను. నే నామెను వదలి యుండలేను. ఆమెతండ్రి యొప్పుకొనఁ డందురా! ఇప్పుడు వారితోఁ గలసియుండుట కనుమతించెను కదా! ఆయనకు నాయూహ యర్థమై యుండె ననుకొందును. నే నామెను ప్రేమించుచున్నాను. హృదయ పూర్వకముగాఁ బ్రేమించుచున్నాను. నే నామెను వదలియుండలేను' అని యొకధోరణి కురిపించెను. రాత్రికి ధర్మారావు సూర్యపతితోఁ గిరీటికథ చెప్పెను.

సూర్య—అతనిమామ పిల్ల నేలయిాయఁడు? ధర్మా—ఇతఁడు పేదవాఁడు కనుక. సూర్య—ఆయన కేమి యుద్యోగము? డిప్యూటి కలెక్టరా? ధర్మా—అవునట. సూర్య—అవునవును. డిప్యూటీకలెక్టరు లకు డబ్బున కేమికొఱఁత? పేదవారు తిండిలేక చచ్చుచున్నారు. ఈ శవముమీఁదకూడు వీరికెట్లు రుచించునో? ఇది యింతే నయ్యా! పేదవారినెత్తురు త్రావి ధనవంతుఁడు ధనవంతుఁడు కావలె. ఎవని నెత్తురు త్రావి తాను బలిసెనో ఆపేదవానిశిరసుననే యెక్కి తాను సవారిచేయవలె, మఱల. ఇదే చిత్రము!

# తొమ్మిదవ అధ్యాయము

ధర్మారావు పరీక్షలై వేసంగిసెలవుల కింటికి వచ్చెను. వచ్చిన నాలుగవనాఁడు గణాచారి మఱల బయలుదేఱెను. గణాచారి యేవో విశేషము లున్నఁగాని బయలుదేఱదు. ఆమె యెప్పుడు నింటివద్దనే యుండును. ప్రతిదినము ప్రాతఃకాలమున లేచి, కాలకృత్యములు దీర్చుకొని, స్నానముచేసి, యుదికిన తెల్లని చీరఁ దాల్చి, భోజన మగువఱకు నేమో జపముచేసికొనుచుండును. భోజనమైన తరువాత రాటనముమీఁద దారముతీయును. ఇంటిలో నేవైనఁ బనులు చేయును సాయంవేళకు దేవాలయమునకుఁ బోవును. అచ్చట సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కెదురుగ నిలుచుండి కనులుమూసికొని ధ్యానించును. రాత్రి ప్రొద్దుపోయి యింటికి వచ్చును. రాత్రులందు భోజనము చేయదు. ఇది యామె నిత్యచర్య. ఆమె స్వప్నములు గనుచుండును. స్వప్నములో నామెకు రాఁబోవు వర్తమానములు తెలియును. ఆ మఱునాఁడు ప్రొద్దున స్నానముచేసి, భగవద్ధ్యానముచేసి బయలుదేఱును. గ్రామమున కంతకుఁ దగిలివచ్చు వార్తయైనచో వేఁపమండ పుచ్చుకొని తలవిరియఁబోసికొని తిరుగును; ఒక వ్యక్తికి సంబంధించినదైనచో జుట్టు ముడివేసికొని రావిమండ పుచ్చుకొని బయలుదేఱును. శుభమైనచో నెఱ్ఱనిచీర కట్టుకొని మామిడిమండ పుచ్చుకొని బయలుదేఱును; అశుభమైనచోఁ దెల్లని చీరనే తాల్చును.

ఆరోజునఁ దెల్లనిచీరఁ దాల్చి, రావిమండ పుచ్చుకొని జుట్టు ముడివేసికొని మొగమునఁ గుంకుమబొట్టు దాల్చి బయలుదేఱెను. ఆమె బయలుదేరిన దనినంతనే పదిపదునాఱేండ్లు లోఁబడిన బాలకు లందఱు నామె ననుసరింతురు. ఆమె యట్లు పోయిపోయి కోటముందర నిలుచుండెను. ఆమె యట్లువచ్చి యే యింటిముందు నిలుచుండునో యా యింటియిల్లాలు పోయి 'యేమి తల్లీ!' యని యడుగును. ఆమె 'యిట్లు జరుగు'నని చెప్పును. చెప్పినతరువాత నామండ యచటనే వదలి యింటికిఁబోయి స్నానముచేసి, మఱల జపము చేసికొనును. ఇది యాచారము.

అట్లు గణాచారిపోయి కోటముందు నిలుచుండఁగా 'ఏమమ్మా, సమాచార మేమి' యని యడిగినవారు లేరు. ఆమె యట్లే నిలఁబడి యుండెను. లోపలినుండి యొకసారి రామేశ్వరరావుగారు వచ్చి 'యీ పిచ్చిముండ వచ్చిన దెందుల' కని, మఱల లోనికిఁ బోయెను. పరిచారకు లెవరును మాటాడలేదు.

రుక్మిణమ్మారావుగారికి జబ్బుచేసినదిమొదలు పెత్తనదారులు ముగ్గురును కోటలోననే యుండిరి. రంగారావుగారు చెన్ననగరమునందే నివసించుచుండెను. దివాను చెన్నపురి సుబ్బన్నపేటలమధ్యఁ దిరుగుచుండెను. వ్యయము యథాప్రకారముగ నగుచుండెను. రుక్మిణమ్మారావుగారు మాటపలుకు లేదు. పదినెలలక్రిందట ధర్మారావు పోయి చూచినప్పు డెట్లుండెనో యిప్పుడు నట్లే యుండెను. ఈ దీర్ఘవ్యాధిచేత నందఱును విసిగిపోయిరి. కాసావాండ్రు పరిచర్య చేయుచుందురు. తక్కినవాండ్రామెవద్దకుఁ బోవుటఁగూడ మానివేసిరి. నూటికిఁ గోటికిఁ బోదురు. ఆమె తెలివిలేని, గుర్తుపట్టలేని కనులతో ఱెప్పవేయకుండఁ జూచును. పరిచారకులే యామెను లేవఁదీసి కూర్చుండఁబెట్టి, పక్కదులిపి మఱలవేసి మఱొకక్రొత్తచీరఁ గట్టి పరుండఁబెట్టవలయును.

రంగారావుగారి భార్య సరోజనీదేవి. ఆమె గోదావరిజిల్లాలోని యొక జమీందారుని కూఁతురు. ఆ జమీందారులు వంగసంప్రదాయములు బలిపించుకొనినవారు. సనాతనమతమునందు నిరాదరులు. సరోజినీదేవిగారు కాఁపురమునకు వచ్చినతరువాత నామెపుట్టినింట మఱియు విడ్డూరములు జరిగెను. అంతమార్పు జరిగియు సరోజినీదేవిగారి తల్లిమాత్రము వంగసంప్రదాయము లంటక, మతాంతర బుద్ధి ప్రబలించుకొనక స్వచ్ఛముగా నున్నది. ఆమెకుమార్తెయైన సరోజినీదేవియుఁ దల్లిగుణములే పెంచుకొన్నది. ఈమె కాఁపురమునకు వచ్చిననాఁటనుండియు భర్తయొక్కమార్గముల నంగీకరించలేదు. మొదటిరోజులలో నేమియు మాటాడెడిది కాదు. అసలు జమీందారుల యిండ్లలో భార్యాభర్తలకు సన్నిహితత్వ ముండదు. అంతఃపురములోనికిఁ బోవలయునన్నచో దాసిహండ్రద్వారా కబురుచేసిగాని పోరాదు. భార్యాభర్తలకుఁ బరస్పరగౌరవము చేసికొనుటతోనే

సరిపోవును. మధ్య 'నీవు' ఉపయోగించరాదు. ఏకొంచెము మాట మాటవచ్చినను వారికి వీరికిఁ బొసఁగదు. అట్టి సందర్భములో సామాన్యసంసారములోవలె భార్యచెప్పుట, భర్తవినుట మొదలైనవి జరుగవు. ఎవరిమార్గము వారిది. సరోజినీదేవికి రంగారావుగారు చెన్న నగరములో నుండుట కిష్టము కలుగలేదు. కాని చాలదినములు భర్తతో నచ్చటనే యుండెను. అత్తగారికి జబ్బుచేసినతరువాత సరోజినీదేవి సుబ్బన్నపేట వదలిపోలేదు. అందుచేతఁ గుమారుఁడైన హరప్పనాయఁడు తల్లివద్దనే యుండెను. రంగారావుగారును దివాను గారును జెన్ననగరములో నుందురు. చిన్న హరప్పనాయని కిప్పుడు పదియేండ్లు. ఆయనతరువాత మఱల సంతానము లేదు. సరోజినీదేవి పూర్వసాంప్రదాయముల కనువైన మనిసి. సుబ్బన్నపేట వచ్చిన తరువాత పూర్వ మత్తగారెట్లు జరిపెడిదో యట్లు జరుప నారంభించెను. ప్రాతఃకాలముననే నిద్ర లేచును. స్నానముచేసి పరిశుభ్రమైన వస్త్రములు ధరించును. ఇంటిలోనున్న కృష్ణవిగ్రహమునకుఁ బూజ గావించును. చెన్నపురిలో నున్నప్పుడు త్రాగుచున్న కాఫీ మానివేసి పదునొకండు గంటలవఱకు నేమియు భుజించదు. ఏకాదశి లుపవాస ముండును. ఆ నాఁడు సాయంకాలమున వేణుగోపాలస్వామిదర్శన మునకుఁ బోవును. మఱునాఁడు ప్రొద్దున బ్రాహ్మణునిబిలిచి స్వయం పాకమిచ్చి, యాయన భోజనముచేసెనని వార్త తెలిసికొని భుజించును. ఈ వర్తమానము సూచనగా రంగారావుగారికిఁ దెలియును. కాని యాయన జోక్యము కలిగించుకొనలేదు. భార్యాభర్తలమార్గములు రెండును నంతకంతకు దూరమై పోవుచుండెను. ఆయన పూర్తిగా హిందూమతమునందు విశ్వాసముపోయినవాఁ డయ్యెను. చాతుర్వర్ణ్యమునకు వ్యతిరేకి. ఏకాదశులు, ఉపవాసములు మొదలైనవి వ్యర్థాభిప్రాయములు.

ఆ నాఁడు గణాచారి కోటముందు నిలుచుండెను. నిలుచున్న దని సరోజినీదేవికిఁ దెలియలేదు. పదిగంటలవేళ పోయి యెవరో యామెతోఁ జెప్పిరి. ఆమె గణాచారిని లోనికిఁ దీసికొని రమ్మని కబురంపెను. ఒకదాసి వచ్చి 'యమ్మగారు పిలుచుచున్నది' యని గణాచారితోఁ జెప్పెను. గణాచారి నిలుచున్నది నిలుచున్నట్లు కంపించి

పోయి బిగ్గఱగా నేడ్వ నారంభించెను. ఎవరికి నర్థముకాలేదు. గణాచారి కావేశము హెచ్చెను. ఆమె గంతులువేయుచు 'నయ్యో! రాణి చచ్చిపోవును, చచ్చిపోవును' అని యఱచి చేతిలోనున్న రావిమండ సగము తుంచి యచ్చటఁ బాఱవైచి తక్కిన సగము చేతఁబుచ్చుకొని తాను బరుగెత్తెను. ఆ పరుగెత్తుట పరుగెత్తుట వేణుగోపాలస్వామియాలయములోనికిఁ బరుగెత్తెను. వేణుగోపాలస్వామియాలయములోనికి మూఁడునందలయోఁడ్లుగా సుబ్రహ్మణ్యస్వామి గణాచారి పోలేదు. గణాచారి యచ్చటికిఁ బోయిన దనఁగా జను లందఱును నివ్వెఱపోయిరి. విశ్వసించినవారు భయపడిరి. తక్కినవారు 'చూచితిరా! గణాచారి వేణుగోపాలస్వామిగుడిలోనికిఁ బో దందురు. మఱి యెట్లు వెడలినది? దుర్మార్గు లన్నియుఁ గల్పించి లేనిపోనిసిద్ధాంతము లేర్పఱింతురు' అని వాదించిరి.

గణాచారి మిగిలినరావిమండ ముఖమంటపమునందు స్వామి కెదురుగా గంటక్రిందఁ బడవేసి, తనదారిని దాను బోయెను. సుబ్బన్నపేఁట మైదేండ్లక్రిందటికన్నఁ బెద్దయూ రయ్యెను. అయిదేండ్ల క్రింద నది పల్లెటూరు. రంగారావుగారి పట్టాభిషేకమునాఁటినుండి గ్రామము వృద్ధిఁబొందెను. కోమటూరులు నమువువారు, ఆ పనివాండ్రు చాలమంది యూరిలోఁ జేరిరి. స్కూలుపెట్టినంత నే యుపాధ్యాయులు, వారిసంసారములు చేరెను. కొందరు మిషనరీలు కొన్నిస్థలములు కొని యిండ్లుకట్టించి గూడెమువారందఱిని మతములోఁ గలుపుకొని యచట నివాసము లేర్పఱచుకొనిరి. ఊరు చిన్నపట్టణమంత యైనది. క్రొత్తఁగా వచ్చిన జనమునకు గణాచారివ్యవహారము తెలియదు. ఊరెల్ల గగ్గోలుపడుచుండఁగా నీ యూరికథ కొంతకొంత తక్కిన వారికిని దెలిసెను.

గణాచారి రాణి చచ్చిపోవు నని చెప్పిపోఁగా దాసీవాండ్రును, బరిచారకులును బోయి కోటలోఁ జెప్పిరి. దానివలన నెవ్వరును విచారించలేదు. రాధాకృష్ణయ్యగా రనుకొనిరి: 'సంవత్సరమునుండి మంచమునఁబడి తీసుకొనుచున్నది. పోయిననే బాగుగనుండును'అని. సామాన్యు లనుకొనునట్లు జమీందారులయిండ్లలో ననుకొనరు. పైకి మాత్రము 'అయ్యో! పెదతల్లిగారు చనిపోదురా?' యని రాధా

కృష్ణయ్యగారు విచారమే ప్రకటించిరి. రామేశ్వరముగారు 'పిచ్చి ముండ! అది చెప్పుట, మీరందఱును నమ్ముట? చాల బాగున్నది. సంవత్సరమునుండి తీసుకొనుచున్న పెద్దమ్మగారు చచ్చిపోవు నని గొప్పజోస్యముచెప్పినది. ఆ ముండకుఁ దలపోయినదో, వీరికిఁ దల పోయినదో తెలియులేదు' అని పరిహసించెను. గణాచారి యింటికిఁ బోవుచుండఁగా దారిలోఁ బసిరిక కనఁబడెను. పసిరిక గణాచారి కెప్పుడును నెదురు రాఁడు. గణాచారి కనఁబడినంతనే పసిరిక పాఱి పోవును. ఇంతవఱకు వా రెప్పుడు నెదురుబడలేదు. దూరముగా గణా చారిని జూచును. పసిరిక పాఱిపోవును. గణాచారి యెప్పుడును బయ టికేరాదు. ఇట్టి సంఘటనలు జరిగినపుడే వచ్చును. అవి సకృత్తుగా జరుగును. ఈ నాఁడు గణాచారి బహుసమీపములోఁ బసిరికకుఁ గనఁ బడెను. బసిరిక నిలువెల్ల వణఁకిపోయెను. గణాచారి యతనివంకఁ జూచెను. కాని వెంటనే తనదృష్టిమఱల్చుకొని తొందరగా నడచి పోయెను. పసిరిక పెద్దయూపిరి తీసికొనెను. ఈ సంయోగము ధర్మా రావు దూరమునుండి చూచుచుండెను. ధర్మారావు పసిరికదగ్గఱకు వచ్చువఱకు గణాచారి చాలదూరము పోయెను. పసిరిక తలయెత్తి ధర్మారావును జూచి 'అన్నా' యని కౌఁగలించుకొనెను. ధర్మారావు 'నాయనా! అప్పుడే భయములేదు. గణాచారి చాలదూరముపోయి నది. నాకును గొంచెము ధైర్యము కలిగినది' అనెను.

గణాచారికథయంతయు ధర్మారావు గ్రామములో వినెను. అతఁడు చాల విచారించెను. రంగారా వెంత దుర్మార్గుఁడైనను నత నికి రావలసిన యాపద కాదనుకొనెను. పసిరిక ధర్మారావును గౌఁగి లించుకొని వదలలేదు. అతనిచేతులు వదలించుకొనుటకు ధర్మారావు ప్రయత్నించెను. మునుపు సన్నని దారములవలెనుండెడి యతనిచేతులు కొంచెము బలిసినట్లుతోఁచెను. దొంద మెక్కుచున్నాఁడా యనిపిం చెను. ఇద్దఱును నిలుచున్నది కోటకును దేవాలయమునకును మధ్య స్థానము. ఊరికి నుత్తరదిక్కంతయు నచట నిండ్లులేకపోవుటవలన బయలుగాఁ గనిపించుచుండెను. ధర్మారా వటు చూచెను. మాగాని యెత్తుకొని యూరి నానుకొని యుండెను. నిఱుటిదాఁక నవన్నియు మెట్టచేలు.

ధర్మారావు పసిరికనుబోయి చేలలో నాడుకొనుమనెను. పసిరిక యర్థములేనికన్నులతో ధర్మారావువంకఁ జూచెను. అతఁడు ఉత్సర్జనితమైన వృషభమువలె మెట్టచేలలోఁ బూర్వము నాలుఁగు దిక్కుల యథేచ్ఛముగ సంచరించెడివాఁడు. ఇప్పుడు మాగాని బలిసి మెచటికిని గదలుటకు వీలులేకుండెను. కాని తూరుపువైపున పూర్తిగా మాగానికాలేదు. పడమటనున్న కాలువనీరు తూర్పు మెట్టపొలాల కెక్కుట లేదు. తూర్పునుండి మఱొకకాలువ తెప్పించ వలయు నని జమీందారుగారిప్రయత్నము. ధర్మారావు పసిరికను దూర్పునకుఁ బొమ్మని, తాను తనగృహాభిముఖుఁ డయ్యెను.

ఆ మఱునాఁడు రంగారావుగారు చెన్ననగరమునుండి వచ్చిరి. ఆనాఁడు శుక్లాష్టమి. వెన్నెలలు విరియఁ గాయుచుండెను. రాత్రి అరజాముప్రొద్దుపోవువఱకును గాలి చల్లఁబడలేదు. మాగాని కోసిన పొలములన్నియు నెఱియలుపడి వెచ్చని యావిరి వదలుచుండెను. ఊరి తూరుపువైపుననున్న మెట్టమీఁద పైరుపచ్చ లీ వెచ్చదనమును దగ్గించలేకుండెను. రంగారావుగారు మేఁడపై భాగమునఁ గూర్చుండి సరోజినీదేవిగారినిగూర్చి యాలోచించెను. ఆమెకుఁ దనకు నేమో దూరదూర మగుచున్నట్లు తోఁచెను. తన కామెమీఁద పూర్వమున్నంతప్రేమ లేదేమో? ఆమె నూతనాభిప్రాయముల కనుగుణముగా నుండవలయునని యతని యుద్దేశ్యము. ఆమె పూర్వాచారపరాయణురాలు. ఒకసారి చెన్నపురిలో గవర్నరుగారికి టీపార్టీ యిచ్చినపుడు రంగారావుగారు తనభార్యనుగూడ రమ్మనెను. ఆమె రాలేదు. గవర్నరుగా రడిగెను. ఆయనభార్య ప్రశ్నించెను. 'మీ దేశమున నింతే. స్త్రీలకు స్వాతంత్ర్య మీయరు. మేము నూతనాభిప్రాయములు కలవార మందుము. మీ భార్యలకుమాత్రము ఘోషా వదలలేదు' అని గవర్నరుభార్య మెత్తిపొడిచెను. ఆ నాఁడు రంగారావుగారు భార్యతో నిదియంతయుఁ జెప్పిరి. ఆమె 'తాఁజెడ్డకోతి వనమెల్లఁ జెఱచిన' దని యన్నది. రంగారావుగారికిఁ జాలకోపము వచ్చెను. అదివఱకు వారిద్దఱమధ్యనున్న యెడము నీ సందర్భము మఱింత యెడముజేసెను. తరువాత భార్యాభర్తలిద్దఱును సరిగా మాటాడనే లేదు. సుబ్బన్నపేట వచ్చినతరువాత రాణిగారు తన

త్రోవ తానే తప్ప రంగారావుగారు వచ్చినను పోయినను విచారణయే చేయుటలేదు. రంగారావుగా రా రాత్రి కూర్చుండికూర్చుండి, పరిచారికునిబిలిచి రాణిగారికిఁ గబురంపించెను. సరోజినీదేవి 'రావచ్చు' నని యనుజ్ఞయిచ్చెను. రంగారావుగారు వెళ్ళిరి. గదిలో దీపము వెలుగుచుండెను. రాణి మొగమునఁ బెద్దకుంకుమబొట్టు పెట్టి, మెఱుఁగు జరీచీరఁ దాల్చి సోఫాలోఁ గూర్చుండియుండెను. రంగారావుగారు లోనికిఁ బోవుటతోడనే యామె లేచి నిలుచుండెను. అదివఱ కట్లు లేదు. రావుగా 'రది యేమి' టనెను. ఆమె 'యేది' యనెను. రావుగారు 'నేను వచ్చినచో నీవు నిలుచుండవలయునా?' అనెను ఆమె 'సతికిఁ బతి దైవము. వేణుగోపాలస్వామికిని, నాభర్తకును భేదము లేదు' అన్నది. రంగారావు పరిహాసముగా నవ్వెను. ప్రక్కనున్న బల్లమీఁద రంగారావుగారిఛాయాపటము దంతపుఁగ్రైవారమునం దిఱుడ్చఁబడి యుండెను. దానిపైనఁ బూవులు పూజచేయఁబడియుండెను. రంగారా వది చూచెను. అందు సరోజినీదేవిని జూచి 'ఇది మీరేనా చేసినది' యనెను. దేవి 'అట్లనరాదు. మీరు నన్నింక 'నీవు అనియే యనవలెను' అనెను. రంగారావునకు మనసులోఁ దనజమీందారీఛాయామంతయు పోయినట్లు తోఁచెను. అతఁ డేదో యాలోచనచేసి, మఱల తిరిగి వెళ్ళిపోయెను. వెడలిపోవుచుండఁగా సరోజిని యతని యుత్తరీయము పట్టుకొని లాగెను. అతని కదియుఁ గ్రొత్తగాఁ దోఁచి విదలించుకొని పోయెను. మఱునాఁడు రంగారావు చెన్నపురిఁ జేరెను. దశమినాఁ డుదయమున స్నానముచేసి సరోజిని పూవులుకోసి భర్తఛాయాపటమును బూజచేయుటకుఁ బోయెను. ఛాయాపట మచ్చట లేదు. దాసీవాండ్రను బిలిచి ప్రశ్నించెను. వారు మాకుఁ దెలియ దనిరి. ఒకదానిని కోపపడఁగా 'బాబయ్యగారు తెచ్చిపెట్టు మనిరి. నేను కొనిపోయి యిచ్చితిని. వారు దానిని చెన్నపురి తీసుకొనిపోయి' రని చెప్పెను. ఒకానొకదుఃఖవీచిక దేవినాభిలోనుండి రెండుప్రక్కలకు మోచేతులలోఁ బొడిచినట్లు పొడిచి, హృదయమున కెగఁదట్టి, కంఠమున ధ్వనియున్నచో గాద్గద్యమునకు సన్నిహితస్థితి తెచ్చి, ప్రయత్నముచేత నణఁచఁబడుటచే ముఖమునందు రక్తఛాయ లుబికి, కన్నులలో నెత్తురు లుమిసెను. దానివెంటఁ

గోపము తఱుముకొని వచ్చెను. నేత్రపద్మములు నిమీలనముచేసి యామె వచ్చిన కోపమును గొంతుకలోనుండి క్రిందికిఁ ద్రొక్కెను. అరగడియయైనతరువాత నామెయొక్కతెయె గదిలోఁ గూర్చుండి పరిచారకలనందఱను బంపివేసెను. తనమీఁద పిడుగువచ్చిపడునను కొన్న యీ దాసి రాణిగారి యీ నిగ్రహము చూచి బేజారై పోయెను.

రాణి యానాఁడు భోజనముచేయలేదు. భోజనము పెట్టెలోఁ బెట్టి యన్న మామెగదిలోనికిఁ దెచ్చి దాసీజనం బెదురుచూచిరి. ఆమె రాలేదు. పోయి మనవి చేయుట కెవ్వరికిని ధైర్యము చాల లేదు. రెండుజాములకల్ల భోజనముచేయు రాణి ప్రొద్దుక్రుంకినకూడ భోజనము చేయలేదు. ఆమె కిష్టురాలైన ఒక దాసి యున్నది. అది పోయి బతిమాలెను. అది పుట్టినింటినుండి వచ్చినదాసి. రాణి చివరకు పాలు త్రాగుట కంగీకరించెను. దాసి పరమాన్నముచేసి యిచ్చెను. రాణి కోపగించెను. కాని దాసీయొత్తిడి కారగించెను. మఱునాఁ డెంత బలవంతముచేసినను నేకాదశి యగుటవలన రాణి యుపవాసమే యనెను. రోజురోజెల్ల నెండలు తీక్ష్ణముగాఁ గాసి పోసెను. నాగేశ్వరస్వామిఫాలనేత్రమునుండి నిప్పుక లుమిసెనో యన నెండలు వాయువీచికలమధ్య నెఱ్ఱనై తరఁగలుతరఁగలుగా కనులు మిఱుమిట్లు గొలిపెను. ఎండలోఁ దిరిగిన పక్షి శవము మాత్రమే మిగిలెను. అంభా యని యడలినగొడ్డునకు బయటికివచ్చి కాఁపు నీరు పెట్టలేదు. ఇంతకుముం దాకుపచ్చన, మఱి యింతలో నెండి వఱ్ఱై పోయినది; ప్రతి పచ్చియాకును. గజములోఁతు త్రవ్విన జలలుపుట్టు సుబ్బన్నపేఁటబావులు దాహమెత్తిన శేషుఁడు వేయినోళ్ళతో భూమిలోనున్న యంతర్జలప్రవాహముల నాకర్షించినట్లు నీరు లోఁతుకు పీఁకుకొనిపోయెను. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ద్విసహస్రనేత్రముల నెత్తురు లుమిసి, ద్విసహస్రజిహ్వలనుండి రక్తములు ప్రవహింపించి నట్లు తెల్లనియెండలు పోయి యెఱ్ఱనియెండ లయ్యెను. పచ్చని యాకన్నది లేకుండుటచేత చూచినంతమేఱ తగులఁబడిపోయెను. రెండుజాములు దాఁటి ప్రొద్దు వాటారెను. వాటారిన ప్రొద్దుతో నెండ యెఱ్ఱనితనములు తగ్గనేకాని వెచ్చదనములు హెచ్చనే

హెచ్చెను. శోషపడిన ప్రాణము చెవులు రింగుమన్నట్లు హోరుగాలి యీ చెవినుండి యీచెవి కూఁదిపోసెను. మనిసి కదలలేదు. పిట్ట యాడలేదు.

ప్రొద్దు క్రుంకవచ్చెను. కొద్దిగాఁ జల్లఁబడినట్లే తోఁచెను. రాణిగారు అద్దాలబండి నెక్కి దేవాలయమునకుఁ బోయెను. దేవాలయమునందుండి పురుషులందఱును బంపివేయబడిరి. రాణి దిగి చెఱువులోఁ బాదప్రక్షాళనము చేసికొనుటకుఁ బోయెను. అచట ముగ్గురుస్త్రీ లుండిరి. రాణి యందులో నొకర్తుక నెఱుఁగును. ఎఱుఁగును గాని యామె యెవ్వరో యెఱుఁగదు. ప్రతి యేకాదశినాఁడు దేవాలయములో నామెను జూచుచుండెను. తక్కిన యిద్దఱును జూడలేదు. రాణిగారు వచ్చునపుడు దేవాలయాంతర్భాగమున నర్చకులు పురుషులనే కాదు, స్త్రీలను నుండనీయరు. కాని దేవదాసిని బొమ్మనను. దేవదాసి రాణి దేవాలయమున నున్నంతసేపును ముఖమండపమునందుఁ గూర్చుండును. ఆమె యొడలు తెలియనిస్థితిలో నుండి యేదో యాలోచించుచున్న ట్లుండును. రాణి యామెతో నెన్నఁడును మాటాడలేదు. రాణి కామె యెవరోకూడఁ దెలియలేదు. నేఁడు ముగ్గురు స్త్రీ లామెకుఁ గనఁబడినంతనే యామెలో నున్న ఛమీాందారీతనము బయటికి వచ్చెను. ప్రక్కనున్న దాసితో 'వీ రెవరు? వీరిని బయటి కేల పంపించలేదు?' అనెను.

దాసి వారిని బిలిచి బయటికిఁబొమ్మని చెప్పఁబోవుచుండెను. రాణి యే మనుకొన్నదో - వలదని వారించి, వారివద్దకుఁ బోయెను. దేవదాసికాక తక్కినయిద్దఱును నరుంధతీ రథంతరులు. వారు ముగ్వురు నేదో ప్రసంగించుకొనుచుండిరి.

రథం — చెల్లెలా! అరుంధతి! ఊరిలో నీవు సంవత్సరము లేవు. గిరిక నీమీాఁద బెంగపెట్టుకొన్నది. అరుం—బెంగ నామీాఁద నెందుకమ్మా? గుడిలో స్వామి యున్నాఁడు. స్వామితరువాత స్వామి చెల్లెలు సుభద్రయంతదానవు నీవున్నావు. స్వామి యప్రత్యక్షమైన భర్త; నీవు ప్రత్యక్షభర్తవు. మఱిదివంటిదానను నే నుండి యేమి, ఉండకేమి? దేవ—వదినా! నిజము చెప్పితివి. నా కీమెయు నాయనయు నొక్కటిగానే యుండిరి. నీవు వెళ్ళినతరువాత పెద్దవదినగారు

నావంకనైనఁ జూడలేదు. ప్రభు వంతకుముందే చూడలేదు. అన్న లేఁడు. స్వామికి నామీఁద దయ తప్పినది. ఉపవాసములచేత నా యొడలు కృశించుచున్నదిగాని, స్వామి కాలిగోరు నా యెదలోఁ దాఁకలేదు. అన్న మూఁన్నాళ్ళనుండి నన్ను పరిహరించుచున్నాఁడు. ఆయనకు నామీఁద దయపోయినది. ఆయన చెప్పిన పనులే చేయుచుంటిని. స్వామికి దయవచ్చినట్లు లేదు.

ఇంతలో రాణి దగ్గఱకు వచ్చెను. ఆమె దేవదాసి యనిన మాటలన్నియు విన్నది. ఆమె కేమియు నర్థము కాలేదు. వారు ముగ్గురును రాణివంకఁ జూచిరి; ప్రక్కనున్న దాసివలన నెవరును జెప్పకయ యామె రాణియని తెలిసినది. రాణినిశ్చలముగా దేవదాసి వంకఁజూచెను. ఆమె సిగ్గుచేత తాఁబేలువలెఁ దనలోఁదానుకుదించుకొనెను. రాణి తక్కిన యిర్వురను జూచి 'ఈమె యెవరు?' అని యడిగెను. రథంతరి 'ఈమె గోపిక' యన్నది. దేవదాసి నిలువెల్ల వణఁకి, మెట్లపైఁ గాలుజాఱి నీటిలోఁ బడెను. అరుంధతి యామెను బట్టుకొని బయటికి లాగి, తడిసిన గాగరాయంచులు పిండెను. రాణి నివ్వెఱపోయెను. రాణి 'యీమె యెవ్వ' రనెను. 'ధర్మారావుభార్య' యని రథంతరి చెప్పెను. ధర్మారావుపేరు రాణి రెండుమూఁడుసార్లు విన్నది. తనమామగారికిఁ బురాణముచెప్పుట, కొన్నాళ్ళత్తగారికి గూడఁ జెప్పుట యామె యెఱుఁగును. గోపిక యెవరో తెలియలేదు. 'గోపిక యనఁగా నేమి?' యని మఱలఁ బ్రశ్నించెను. దేవదాసి మొగము దీనముగాఁబెట్టి, రథంతరిని గౌఁగిలించుకొని, 'యేమున్నది? ఏమి లేదు, ఏమీ లేదు' అనెను. రాణికేదోసందేహము కలిగెను. ఆ సందేహముకూడ నిదమిత్థమని నిరూపింప రాకుండెను. 'గోపిక యనఁగా నేమమ్మా?' యని మఱల రాణి ప్రశ్నించెను. దేవదాసి రథంతరినోటపైఁ జేయివైచి 'ఏమున్నది, ఏమున్నది? ఏమిలేదు, ఏమీలేదు' అని యేడ్వ నారంభించెను. ఈ దుఃఖముచూచి రాణి చలితయై పాదప్రక్షాళనముచేసి దేవాలయములోనికిఁ బోవుచుండెను. వెంటనే వీరుముగ్గురును వెళ్ళిరి. వెళ్ళుట దేవదాసి కిష్టములేదు కాని వెళ్ళెను. నలుగురును భగవంతుని యెదుట నిలుచుండిరి. రాణి వేణు

గోపాలస్వామివంక నిశ్చలముగాఁ జూచుచుండెను. రాణికిఁ దన సంసారమంతయు స్మృతికి వచ్చెను. రంగారావుగారి ప్రస్తుతస్థితికిని, ప్రస్తుతభావములకును దాను భార్యగానుండుట తగనట్లు తోఁచెను. ఉన్న దున్నట్లు హేతువే లేకుండ 'ప్రభూ! నన్ను నీలోఁ గలుపుకొనుము నేను బ్రదికి యేమియు లాభములేదు' అని మనసులో ననుకొనెను. స్వామి కనులు విప్పి రాణివంకఁ జూచెను. రాణికి భగవంతుని యొక్క నేత్రము దేదీప్యమానమై ప్రకాశించుచు, మఱియొకఁడు చీఁకట్లు చిమ్మినట్లు తోఁచెను, దేవదాసి భగవంతునిపాదములవంక నే చూచుచుండెను. పాదములకు బంగారుతొడుగుండెను. నఖప్రదేశములయం దింద్రనీలమణులు పొదిగిరి. తన్నఖకాంతులు భగవత్ప్రపాదముపైఁ గన్నులువిచ్చిన తారకలవలె నీలరోచిస్సులు ప్రసరించుచుండెను. అరమోడ్చినకనులతో దేవదాసి యాకాంతులను ఱెప్పల క్రిందినుండి లాగి తనలోనాళమునకును ప్రసరింపఁజేసికొనెను. అర్చకుఁడు శఠకోపము తెచ్చెను. ముందు దేవదాసి కిచ్చెను. రాణికిఁ దెలియలేదు. మఱియొకప్పుడైనచో రాణికిఁ గోపమువచ్చియుండు నేమో? వధ్యస్థానమునకుఁ గొనిపోఁబడుచున్న గొఱ్ఱెపిల్లవలె రాణి కనులయందు దైన్యమే ప్రకటించెను. స్వామి నిత్యసన్నిధానవర్తి యర్చకునకు స్వామియాగ్రహానుగ్రహములు తెలియును. ప్రభువున కెవ్వ రెక్కువదగ్గఱవారో యర్చకునకుఁ దెలిసినంత తన కేమి తెలియును? రాణి దేవదాసివంకఁ జూచెను. దేవదాసికంఠము శంఖమువలె, నడుము చక్రమువలె, కనులు పద్మములవలెఁ బ్రకాశించెను. రాణి కనులుమూసికొనెను. దేవదాసివద్ద స్వామివచ్చి నిలుచుండెను. ప్రభు వామెశిరస్సుపై చేయివైచెను. దేవదాసి యాతనిపాదములు తాఁకెను. రాణి కనులు దెఱచి 'అన్నట్లుగా నీమె గోపికకాదూ!' అనెను. తోడికోడండ్రిద్దఱును మఱదలి నానుకొని నిలుచుండిరి. మఱునిముసమున వారిద్దఱిచేతులలో దేవదాసి ప్రేలాడుచుండెను.

అందఱును గలిసి సుఖమండపమునకు వచ్చిరి. రాణి యెండిన యాకుమీఁద దేనిమీఁదనో కాలువేసెను. ఆమె కాలిలో నేదో పుడక గ్రుచ్చుకొనెను. ఆమె 'ఉబ్బా' యని తొలఁగి పరిశీలించి చూచెను. అది యెండిపోయిన రావిమండ. రాణి యాఁగుటయుఁ, బరి

శీలించుటయుఁ జూచిన యర్చకుఁడు దగ్గరకు వచ్చి యా రావిమండనుజూచి కదలాడిపోయెను. అర్చకునకు మనస్సులో నేదో తళుక్కు మనెను. ఆ భావను వచ్చినందుకుఁ దనలోఁ దానే నిందించుకొనెను. అరుంధతి రావిమండఁ జూచినంతనే 'అమ్మా! దైవము' అని కూలఁ బడెను. తక్కినవారి కేమియుఁ దెలియలేదు. రాణి 'యేమటమ్మా' యని ప్రశ్నించెను. అరుంధతి రాణిగారిచేతిలోని రావిమండను తీసి చూచెను. అది సగము త్రుంచిన ట్లుండెను.

ఎవరిదారిని వారు పోయిరి. ఎవ్వరును లేనిది యా నాఁ డేలకో యద్దాలబండి తూర్పుగుమ్మము వెంటఁ బోయినది. కోట వీథి గుమ్మము తలుపుమూసియుండెను. ఇరుపక్కలువారలు బిగించిరి. బండి తోలువాఁడు తలుపుతీయుట కెవరినో పిలుచుచుండెను. రాణిగారి బండి కోటముందు దాఁగుటచేత పిల్లలందఱును చుట్టును మూఁగిరి. రాణి తలుపుతీసిచూచెను. ఒకపిల్లవాఁడు దేనినో పుచ్చుకొని బండిని గొట్టుచుండెను. తలుపు తెఱచుటతో రాణి కది తాఁకెను. రాణి యది తీసికొనెను. అది యెండిన రావిమండ. రాణి పరధ్యానముగా నుండి గుడిలోని రావిమండ వెంటనే తెచ్చెను. దానిని, దీనిని గలిపి చూచెను. రెండు నొక్కటే మండ.

ఆ రాత్రి రాణి దాసి నడిగెను: 'ఏమే! ఆ రోజున గణాచారి యేమి చెప్పినది?' దాసి 'అమ్మా! రాణిగారు చనిపోవు నన్నది' యని చెప్పెను. సరోజినీదేవికి రెన్నాళ్ళుగాఁ దిండిలేక కనులు గుంటలు పట్టెను. ఒడలెల్లయుఁ దపించిపోవుచుండెను. మనిసి వడలిపోయిన రావియాకువలె నయ్యెను.

రాణి యారాత్రి నిద్దురపట్టక యర్ధరాత్రివేళ స్నానముచేసెను. ప్రౌఢచమరీవాలసదృశమైన యామె శిరోజభార మెండలేదు. ఇష్టురాలైన దాసి పొడిబట్ట తలవెంట్రుకలకుదుళ్ళలోదాక పోనిచ్చి తుడిచెను. అగురుసాంబ్రాణి పొగఁబట్టెను. కొన లొడిలో వేసికొని రెండుచేతులతో బట్టనడుమ వడిపెట్టెను. బలవంతముమీఁద రాణి మఱల పాలు ద్రావెను. తెల్లవారువఱకు రాణికి జలుబుచేసి జ్వరము వచ్చెను. దాసి వలదనెను. ఆమె మఱల స్నానము చేసెను. బ్రాహ్మణుని బిలిచి యాయనకు స్వయంపాక మిచ్చెను. దాసి యాయనతో

'అయ్యా! రెండురోజులనుండి యమ్మగారికి భోజనము లేదు. ఒక గంటలో మీరు భోజనముచేసి కబురంపించవలెను' అని చెప్పెను. గంటలో బ్రాహ్మణుడు భోజనము చేసె నని కబురు వచ్చెను. రాణి భోజనముచేసెను ఆమెకు దలనొప్పి యెక్కువ యయ్యెను. దాసి 'యమ్మా! వైద్యుల దెప్పింతునా?' యనెను. రాణి 'యెవరితోఁ జెప్పి?' యనెను. దాసి తటపటాయించి 'సర్వా.........'యనెను. రాణి 'ఛీ' యని దానిలో నదిమెను. రాణి మొగమునఁ గొంచెము కోపము గూడఁ గనఁబడెను.

తరువాత మూఁడునాళ్ళకు రంగారావుగారు వచ్చిరి. ఈ మూఁడురోజులును రాణికి జ్వరమే కాచినది. ఆనాఁడు రాత్రి రంగా రావుగారిని రమ్మని రాణి కబురంపించెను. అట్టి దదివఱ కెన్నఁడును జరుగలేదు. రంగారావుగారు "సరే వత్తునని" కబురంపించి యి ట్లూహించెను: "ఈమె నన్ను దైవముగా నారాధించుచున్నది. ఈ దేశమున నిది యొకపిచ్చి. దంపతులు లోకమునఁ బరస్పరసుఖము కోస మేర్పడుదురు. మనుష్యుని దైవముగా భావించుటయే దోషము. భార్యాభర్తలిద్దఱును గలిసి లౌకికమైన సుఖమును బొందవచ్చును గాని, యొకరి నొకరు దైవముగా నారాధించి యేమి లాభమో దెలి యుట లేదు. ఇట్టి ప్రాఁతయభిప్రాయములు నాగేశ్వరరావునకు గిట్టవు. నాగేశ్వరరావో మహామేధావి. మతములన్నియుఁ జదివి, యందులోని నిగ్గు తెలిసికొన్నవాఁడు. భార్య భర్తను దైవముగా నారాధించునేని భర్త వాంఛించుచున్న శారీరకసుఖమే యతనికి లభించదు. గుడిలోని ఱాతివిగ్రహమునకును బూజించువానికిని నెంత సంబంధమో భార్యకు భర్తకు నంతియే సంబంధము. నాగేశ్వరరావు చెప్పినట్లు దేశములోని సర్వసంస్థలు స్వాతంత్ర్యభావవిరహితములై పోయెను. ప్రధానమైన దాంపత్యమే యిట్లుండగాఁ దక్కినవానివిష యము చెప్పవలెనా?'

పొద్దుపోయినది. రంగారావు వెళ్ళలేదు. మఱునాఁడు పొద్దున దాసివచ్చి "అమ్మగారికి జబ్బుగానున్నది. మిమ్ము రమ్మను చున్నా"రని చెప్పెను. అతఁ డారోజంతయు వెళ్ళలేదు మఱునాఁడు పొద్దున మఱల దాసి వచ్చి "మీరు మఱలఁ జెన్నపురికిఁ బోకముం

దమ్మగారు వచ్చి యొకసారి చూచిపొమ్మన్నా" రని చెప్పెను. ఆ సాయంకాలమే రంగారావుగారు చెన్నపురి వెళ్ళిరి.

కోటలో రామేశ్వరముగారి భార్య యున్నది. ఆమెపోయి రాణిని జూచెను. రాణి ప్రతిదినము పొద్దుననే లేచును. కంఠస్నానము చేయును. ఓపికలేక మంచములోననే పరుండి, భగవద్ధ్యానము చేయుచుండును. పండ్రెండు గంటలకుఁగాని భోజనము చేయదు. చేసినను సరిగా సయించుటలేదు. రాత్రులందు పాలు త్రాగుచుండెను. రామేశ్వరముగారి భార్య పరామర్శించి పోయెను. రాణి శుష్కించిపోయెను. దాసి తల్లడిల్లిపోయెను.

ఆనాఁడు పూర్ణిమ. వెన్నెలలు పాలిపోయినరోగి దేహచ్ఛాయవలెఁ దెల్లనై, యుష్ణరోగిశరీరమువలె వేసఁగికాఁకలకు వెచ్చనై తెల తెల్లపోయెను. కోటలోఁ బూర్వమువలె నానావృక్షములు లేవు. చాలచెట్లు పడిపోయి కోటయంతయు బంజరుబయ లయ్యెను. కృష్ణమనాయనిదినములలోఁ బచ్చనిపోఁకచెట్లు, తమలపాకు తీఁగలు, ద్రాక్షవల్లులు, మామిడి, బత్తాయి, పనస మొదలగు ఫలవృక్షములు నిత్యము నీటిచేతఁ దడుపఁబడి పచ్చనై కోటలోని కెండను జేరఁ గట్టనిచ్చెడివి కావు. ఇప్పుడో వేసఁగివెన్నెలకే దిక్కులేదు.

మఱునాఁడు రాణి హరప్పనాయని బిలిపించెను. పదియేండ్లకుఱ్ఱవాఁడు. దొరవలె వేషమువేసి, దొరటోపీ పెట్టి తీసుకరాఁబడెను. రాణి కతని జూచినంతనే యసహ్యమయ్యెను. తనమామగారితండ్రి హరప్పనాయనిచిత్రము పెద్దగదిలో నున్నది. బొందు చొక్కా, కంగులుదీర్చికట్టిన పంచె, మెడలో రత్నహారములు, చేతులకు సింహతలాటపు మురుగులు, దండలయందు బాహుపురులు, శిరసున కుడివైపున కొరగిన వంకర పాగా, పైనఁ గలికితురాయి, కాలికి గండపెండారము, ప్రక్కఁ ద్రేలాడుచున్న కత్తి, బొడ్డున చిన్ని బాకు — హరప్పనాయఁడు శౌర్యమెల్ల గూడుకట్టినమూర్తివలెఁ గన్పించెను. కొడుకైన హరప్పనాయని జూచెను. లాగు, చొక్కా, కోటు, బూడ్సు, దొరటోపీ. ఆమె మనస్సులో—నొకశతాబ్దియాచివర నా హరప్పనాయఁడు—నీ చివర నీ హరప్పనాయఁడు—తలక్రిందులైనట్లు తోఁచెను. తల్లి కుమారుని దగ్గఱకుఁదీసికొన్నది. దొరటోపి తీసి

వేసినది. జరీసన్నని పట్టుత్తరీయమును దెమ్మన్నది. కోటలో వెతకినను నట్టిది కన్పించలేదు. జవాహిరీల గదిలో నుండవచ్చును. అచ్చటనే రాజుల పట్టాభిషేకద్రవ్యాదు లుంచఁబడును. కిరీటము, రత్నహారములు, పూర్వపుఁజొక్కాలు, రాజులు ధరించు సెల్లాలు. ఇవన్నియు ప్రాఁతవడ్డ జవాహిరీక్రింద నుత్సవములప్పుడు, పట్టాభిషేకములప్పుడు ధరించనైనవిగా దాఁచబడియుండును. ఆకొట్టుతాళపుఁజెవి పెద్దకాసావానిదగ్గఱ నుండును. అతనిపేరు వెంకటాద్రి. వెంకటాద్రికై కబురంపెను. వెంకటాద్రి రాజుగారియనుమతిలేక యవి తీయుటకు వీలులేదని మనవిచేసెను. రాణి యేఁబదిరూపాయ లిచ్చి యట్టి యుత్తరీయమును బజారునుండి కొనితెమ్మని పంపించెను. ఒక్క యరగంటలో నవి వచ్చెను. రాణి పరిచారికలందఱను బంపించి కుమారుని నొద్దఁ గూర్చుండఁబెట్టుకొని, లేనియోపిక తెచ్చుకొని లేచి కూర్చుండి, కొడుకునకుఁ దలపాగఁ జుట్టెను. ఎన్నఁడు నే పని చేయనిది-యామెకు చేతులు నొప్పివెట్టెను. తల్లి 'నాయనా! చదువుకొనవా?' యని యడిగెను. హరప్పనాయఁడు 'చదువు వలదు, షికారుపోయెద' ననెను. తల్లి 'కాదు నాయనా! చదువుకోవలయును. ఈ యూరిలో ధర్మారావని యున్నాఁడట, నీ వెఱుఁగుదువా?' అనెను. కుఱ్ఱవాఁడు 'ఎఱుఁగ' ననెను. రాణి 'బాబూ! ఆయన చాల మంచివాఁడు. మన దేవుఁడు వేణుగోపాలస్వామి. వేణుగోపాలస్వామికిని ధర్మారావునకును జుట్టఱిక మున్నది. నీ వాయనదగ్గఱఁ జదువుకొనవలయును. ఆయన నిన్ను భక్తికలవానినిగాఁ జేయును. మీ తాతగా రాయనవద్ద చదువుకొనిరి' అనెను. హరప్పనాయనికిఁ తాతగా రన్నచో నెందులకో ప్రేమ. ఐదేండ్లప్పుడు తాతగారి యొడిలోఁ గూర్చుండెడివాఁడు. ప్రక్కను బరిచారకులు లేనప్పుడు కృష్ణమనాయఁడు మనుమని దలమీఁది కెక్కించుకొనెడివాఁడు. మనుమఁడు తాతమీసాలు గుంజెడివాఁడు. తాత వేఁటాడిన పులులు, సివంగులు, కత్తులు, కటారులు మనుమనికిఁ బ్రదర్శించెడివాఁడు. తాతమనుమలమధ్య నొక విచిత్రమైన యనురాగ ముండెడిది. పసితనమైనను హరప్పనాయనికిఁ దాతగారి చెయువులు గాటముగా మనమున నాటుకొని, తత్స్మృతి పోలేదు. అందుచేత నతనికిఁ దాతగా

రన్నచో నభిమాన మెక్కువ. అతఁడు 'అట్లనా! తాత చదువు కొనెనా? అయినచో ధర్మారావువద్ద నేనును జదువుకొందు' ననెను.

మఱునాఁడు రంగారావుగారు మఱల చెన్నపురినుండి వచ్చిరి. రాణి మఱలఁ గబురంపెను. రంగారావు వెళ్ళలేదు. తదియ, చవితి, పంచమి. ఈ మూఁడురోజులును రంగారావుగారు సుబ్బన్నపేఁటలో నుండెను. పంచమినాఁడు సాయంకాలమున దాసిపోయి రాజుతోఁ జెప్పెను: 'రాణి రమ్మనె'నని. రాత్రి జాము జామున్నర పొద్దు పోయెను. రంగారావు పోవుదమా, వలదా యని విచారించెను! 'జబ్బుగా ఉన్నదఁట. ఏమిజబ్బో! ఎక్కువచేసినదని వర్తమానము లేదే! నెమ్మదించియే యుండును.' మఱల మనమతము, మనసంఘము, ఇతరుల మతములు, ఇతరుల సంఘములు – దీనినిగూర్చి విచారణ ప్రారంభమయ్యెను. రంగారావునకు నిదురపట్టలేదు. అప్పుడే చంద్రోదయమగుచుండెను. ఐదురోజు లైదురెండ్లు పదికళలు వదలిపెట్టిన చంద్రుఁడు పంచప్రాణములు వదలివచ్చిన జీవచ్ఛమువలె సువిస్పష్టముగాఁ గనపడుచున్న తఱఁగినకళలతో బియ్యావు దారపు రంగుతో నప్పుడే యుదయించుచుండెను. రంగారావేమనుకొనెనో రాణియింటికి నడచెను. భర్త వచ్చుట చూచి రాణి లేచి నిలువఁబడెను. నిలుచుండఁబోయి పడఁబోగా దాసి పట్టుకొనెను. రంగారావు భార్యను బరిశీలించి చూచెను. ఆమె యొడలిలోఁ బ్రాణము లేదు. పదిరోజులలోఁ జిక్కి బొమికల ప్రోవై మంచమున కంటుకొని యుండెను. మొగమునందు సౌందర్యము కొట్టవచ్చుచుండెను. ఆమె యంతసౌందర్యవతి యని రంగారావుగా రెప్పుడు ననుకొనలేదు. అతఁడు ముగ్ధుఁడై పోయెను. దగ్గఱ కూర్చుండి యామెశరీరమును స్పృశించి పరామర్శించెను. సరోజనీదేవి యొకసారి కనులరమోడ్చి నిట్టూర్పు విడచెను. రంగారావు 'బాధగా నుండెనా?' యనెను. ఆమె 'లే' దనెను. రంగారావు దీర్ఘ నిశ్వాసము వదలెను. మఱునాఁ డాయన చెన్నపురి కేగెను. ఆనాఁడంతయు రాణికి స్మృతిలేదు. దాసీవాండ్రు త్రొక్కుటఁబడిరి. 'వచ్చినవాఁ డాయెను, ప్రభువు మందిప్పించకయే పోయె నేమి?' వారి కేమియుఁ దోఁచినది కాదు.

దశమినాఁడు సాయంకాలమున హరప్పనాయఁడు తన్నుఁ బెంచుచున్న కాసావానిని జూఁచి 'ధర్మారా వెవరురా?' యని యడిగెను. వాఁడు 'ఎందుకు బాబయ్యగారూ?' అని ప్రశ్నించెను. కుఱ్ఱవాఁడు మఱల మాటాడలేదు. నల్లని మేఘమొకఁడు విస్తరించి సంధ్యారాగము నాక్రమించుచుండెను. అంత వేసఁగిలో నా మొగిలెక్కడిదో! గాలి ఫెడీలు మని ప్రాగ్దిక్సతీకపోలమునఁ జపేటము నమర్చెను. ఆ మొగిలు చిదురుపలై మఱల సంధ్యారాగ మంకురించెను.

మఱునాఁ డేకాదశి. రాణి భోజనము చేయలేదు. దాసి బతిమాలెను. లాభము లేకపోయెను. సాయంవేళఁ గొడుకును వెంటఁ బెట్టుకొని రాణి దేవాలయమునకు బయలుదేఱెను. రాణి నిలుచుండలేదు. కూర్చుండ లేదు. మఱియిద్దఱు దాసీలు వెంట వెళ్ళిరి. వారు ముప్పురును రాణిని బట్టుకొని దేవాలయములోనికిఁ గొనిపోయిరి. ఆలయములో గిరికారుంధతీరథంతరులు కనిపించిరి. రాణికి జ్వరము చేతఁ గన్నులు తిరిగిపోవుచుండెను. ఆమె దేవదాసివంకఁ జూచెను. వీరుముప్పురును దాళప్రమాణవ్యక్తులవలె గోచరించిరి. ప్రక్కనున్న దాసీలవంక నామె చూడనే లేదు. రాణి యేమో యూహించెను. అరుంధతీ రథంతరులచేత సేవింపఁబడుచున్న గిరిక వాణీపార్వతుల చేతఁ గొలువఁబడుచున్న లక్ష్మీదేవివలెఁ గనఁబడెను. రాణి చేయెత్తి గిరికకు నమస్కరించెను. అందఱు నాశ్చర్యపోయిరి. స్మృతిలేని రాణిని మఱల బండిలోఁ గూర్చుండఁబెట్టి కోటలోనికిఁ దీసికొనిపోయిరి. రాణికి సంధించినది. కోటలో నున్న స్త్రీలందఱును బోరుగైరి. ఎవ్వరు నేమియుఁ జేయలేరు. ఊరిలోని డాక్టరును బిలుచుటకుఁ బోయిరి. అతఁ డేదో పొరుగూరుపోయెను. రాతిరి మూఁడుజాము లయ్యెను.

కోటలో నందఱును మేల్కనియే యుండిరి. చెన్నపురికిఁ దంతి పోయెను. రాణి 'అడుగో! గోపాలస్వామి!.... రావిమండ....గణాచారి...హరప్ప...' ఈమాటలు మధ్యమధ్య నుచ్చరించుచుండును. ఒకసారి ప్రక్కనున్న దాసిని జూచి 'చెన్నపురినుండి వచ్చెనా !' యనెను. నిద్రపోవుచున్న పసివానిని లేపి తెచ్చిరి. అతఁడు నిద్రకళతోఁ దల్లిదగ్గఱఁ బరుండెను. తల్లి కాసంగతి తెలియదు. దాసీవాండ్రు పిల్లవానిని లేవఁదీసి తీసికొనిపోయిరి.

అంతలోఁ జంద్రోదయము కాఁజొచ్చెను. చెఱిగిపోయిన కుంకుమబొట్టువలె నెఱ్ఱని సగమైన యతఁడు తూర్పునం దంకురించి కోటపడమటివైపుననున్న తాటిచెట్లతలలలోఁ బలుచని నెత్తురులు పోసెను. ఆ సమయమున గణాచారి నిదురమేల్కని, యన్నగారిని బిలిచి 'రాణి పోయినది. చందార్రెడ్డిని, రామచంద్రరాజును కోటలోనికిఁ దీసికొనిపో' అని చెప్పెను. అందఱును గోటలోనికిఁ గలసి పోవుచుండిరి. ధర్మారావుగారియింటి ముందుగాఁ బోవుచుండిరి. ధర్మారావు వరుగుమీఁదఁ గూర్చుండెను. గణాచారియన్న ధర్మారావును బలుకరించెను. ధర్మారావు 'కోటలోనికా పోవుచున్నా?' రనెను. వారు మువ్వురు నాశ్చర్యపడిరి. మువ్వురును గోటలోనికిఁ బోయినతరువాత రాధాకృష్ణయ్య, రామేశ్వరము, సర్వారాయఁడు గార్లు వారిని బరామర్శించిరి. 'రాణిగారి కెట్లున్న' దని వా రడిగిరి. అంతలో నొకదాసివచ్చి 'అయ్యా! రాణి యన్నది లేకుండబోయెను' అని చెప్పెను. రాధాకృష్ణయ్య 'యేమి టేమిటి' అని యడిగెను. 'అయ్యా! పెద్దరాణియుఁ, జిన్నరాణియు నిద్దఱును జనిపోయి' రని చెప్పెను. అందఱును దిగ్భ్రాంతులైరి. దాసి యన్నది - 'చిన్నమ్మగారు 'వేణుగోపాలస్వామి యడుగో! నాకోసము వచ్చె' నని లేచి నిలుచుండి విఱుచుకొని మఱలఁ బడిపోయెను. తరువాత నామెను జూచినంతనే యామెలోఁ బ్రాణములు లేవు.' ఇంతలోఁ బెద్దరాణిగారి దగ్గఱనున్న దాసి వచ్చి 'పెద్దరాణిగారు చనిపోయినది. ఇన్నాళ్ళకుఁ గన్ను తెఱవని మాటాడని యామె యింకొకనిముసమునకు జచ్చిపోవు ననఁగాఁ గన్ను తెఱచి 'నా తపస్సు ఫలించినది. సంవత్సరముచేసిన తపస్సునకు స్వామి సంతోషించినాఁ డనుగో! అనుగో!' నని లేచి నిలుచుండి, విఱుచుకొని పడిపోయెను. మఱలఁ జూచితిని గదా ప్రాణము లే' దని చెప్పెను.

చంద్రుఁడు బారపైకెక్కెను. పగిలిపోయిన గాజుముక్కవలె సగమువిఱిగికూడ తళతళ మానలేదు. మహాసాగరతరంగపరిధూతమై, ప్రత్యక్షమైన తీరమున నెండినముత్యపుచిప్పగుల్లవలెఁ దూర్పు సముద్రతీరమైన ప్రాగాకాశమున నతఁడును వెల్లకిలఁబడెను. మొఱిక ముసివలె నుండెను

ఆ మఱునాఁడు రంగారావుగారు చెన్నపురినుండి విచ్చేసిరి. ఆయనకుఁ దనభార్య మృతిహేతువు తెలియలేదు. దహనసంస్కారము లైనతరువాత నాయన మఱలఁ జెన్నపురి పట్టెను. కర్మ పదునేను రోజులు చేయవలయు నని బ్రాహ్మణులు చెప్పిరి. తల్లికిఁగాని, భార్యకుఁగాని యాయన కర్మచేయుట కిచ్ఛగించలేదు. ఇందులో నే మున్నదని యాయన నిరాకరించెను. పైఁగా నిదియంతయు 'బ్రాహ్మణుల కుత్సితవృత్తి' యని నిందించెను. చెన్నపురిలో నాయన నల్లని కోటువేసికొని తిరుగుచుండఁగా సుబ్బన్నపేఁటవా రెవరో చూచిరి. దుఃఖమునకది చిహ్న మఁట.

తల్లి చనిపోయినతర్వాత హరప్పనాయని మదరాసునకుఁ దీసికొనిపోదమా వలదా యని రంగారావు విచారించెను. పిల్లవానికిఁ జిన్నప్పటినుండియుఁ దండ్రివద్దఁ జనువులేదు; పెంచిన దాసివద్దను, తల్లివద్దనే చన వెక్కువ. అందుచేత పెంచినదాసికి, మఱి యిద్దఱు కాసావాండ్రకు నతనిపోషణభార మప్పగించి, రంగారావు చెన్నపురి పోయెను. హరప్పనాయని ప్రతిదినము సాయంకాలమున మోటారుపై షికారు తీసుకొనిపొమ్మనియు నాజ్ఞ యిచ్చెను. తల్లి చనిపోయినమూఁడవనాఁడు పిల్లవాఁడు తల్లినిగూర్చి యడిగెను. నాయనగారును అమ్మగారును జెన్నపురి కేఁగిరి. మఱలఁ బదిరోజులలో వత్తురని దాసి మఱపించెను.

ఒకనాఁడు సాయంకాలమున హరప్పనాయని మోటారుమీఁద నెక్కించుకొని రంగన్నయుఁ, బుల్లమయు వాహ్యాళి తీసికొని పోయిరి. బెజవాడ పోయిరి. బెజవాడపోవుమార్గమునఁ బేఁటకు మైలు దూరమున నొకవంతెన యుండెను. ఆ వంతెనవద్దఁ గారాపి పిల్లవానిని దింపి యాడుకొనుమనిరి. కొంతసేపటికి ధర్మారా వొక్కఁడు వాహ్యాళి వచ్చుచుండెను. పిల్లవాఁడు మోటారునకు వెనుకభాగమున రంగన్నకుఁ గనఁబడకుండ నొక చెట్టుకొమ్మ నేలకుఁ దాఁకుచుండఁగా నది పట్టుకొని వచుచుండెను. ధర్మారావు చూచి కుఱ్ఱజమీందారును దెలిసికొనెను. చాల దగ్గఱకు వచ్చినతరువాత ధర్మారావు నిలఁబడి యతనివంకఁ జూచుచుండెను. ధర్మారావు తనవంకఁ జూచుచుండుట హరప్పనాయనిలోని జమీందారునెత్తుటికి గిట్టలేదు. కుఱ్ఱవాఁడు

'ఎవరు నీ' వని గద్దించెను. ధర్మారావు బదులుచెప్పక తనదారిని బోవుచుండెను. కేక విని రంగన్న వెనుకకుఁజూచి, సంగతి గ్రహించెను. కుఱ్ఱవాఁడు రంగన్నతో "ఎవరతఁడు?" అనెను. రంగన్న "ధర్మారావుగారాయనే" అనెను. కుఱ్ఱవాఁ "డాయనను బిలువు" మనెను. రంగన్న పిలిచెను. ధర్మారావు వచ్చెను. హార—తమ పేరు ధర్మారావుగారా అండీ? ధర్మా—చిత్తము. హార—తమరు నాకుఁ జదువు చెప్పెదరా? మా యమ్మగారు నన్నుఁ దమవద్దఁ జదువు కొమ్మన్నది. ఆమె చెన్నపురి కేఁగినది. నేను మీదగ్గఱ చదువు కొనుచుండఁగా నామె వచ్చి చూచి సంతోషించఁగలదు.

సేవకులు కుఱ్ఱవానికిఁ దల్లిస్మృతి తెలియనీయులే దని ధర్మారావునకుఁ దెలిసెను. కాని తాను చదువుచెప్పుట యెట్లు తటస్థించును? తా నన్నచోఁ గోటకో నేఁటికిని గిట్టదాయెను. పోవుచుఁబోవుచు కుఱ్ఱవానిమనస్సులో రాణి యీ బీజ మేల వేసిపోయెను?

ధర్మా—చిత్తము. అట్లే చెప్పెదను. హార—ఎప్పటినుండి మొదలు పెట్టెదరు? ధర్మా—రేపటినుండి.

ఈ మాట ధర్మారావు తప్పించుకొనుట కనెను. తరువాత సెలవు తీసుకొని వెడలిపోయెను. కుఱ్ఱవాఁడు తెల్లవాఱులు రంగన్నను వేధించెను–చదువుకొనుటకే మేమి కావలయు నని. పలకయు, బలపమును, పేర్ల పుస్తకమును గొనుదాఁక హారప్పనాయఁడు రంగన్నను వేధించెను. వాఁ డవి తెచ్చిన తరువాత నాయఁడు కూర్చుండెను. భోజనమునకు రమ్మనిరి. 'ధర్మారావుగారు వచ్చును. చదువు కొన్నతరువాత భోజనము చేసెద' నని కుఱ్ఱవాఁడు చెప్పెను. ఎంత చెప్పినను భోజనమునకు రాలేదు. రంగన్నపోయి యీ సంగతి పెత్తనదారులకు మనవిచేసెను. వారు వచ్చి బతిమాలిరి. హారప్ప వినలేదు. చివరకు వారును ధర్మారావును బిలుచుకొని రమ్మనిరి. ధర్మారావు వచ్చెను. ఆశ్చర్యముతోఁ జదువు చెప్పెను. వెడలిపోవుచుండగా హారప్ప 'మఱల నెప్పుడు వత్తు?' రనెను. ధర్మారావు మాటాడలేదు. 'రేపు రండి. మా తాతగారికిఁ జెప్పినట్లే నాకును జెప్పవలయును' అని కుఱ్ఱవాఁ డనెను. ధర్మారావు వెడలిపోయెను. మఱునాఁడును గుఱ్ఱవానిపట్టుదలమీఁద ధర్మారావు కోటకుఁ బోవలసివచ్చెను

రామేశ్వరముగా రీ సంగతి చెన్నపురి కుత్తరము వ్రాసిరి. రంగారావు గారు 'సరే. కుఱ్ఱవాఁడు సంతోషముగా నుండుట కావలసినది. అతని యిష్టము వచ్చినట్లు చేయవలసినది' అని జవాబు వ్రాసెను. రామేశ్వరము నిస్సహాయుఁ డయ్యెను.

ఈ రీతిగా ధర్మారావునకుఁ గోటకు మఱల సంబంధ మేర్పడెను. అతని రాకకు సంతసించువా రెవ్వరును లేరు. హరప్పనాయఁడు పసివాఁడు. సంతోషమో కాదో తెలియదు. ప్రతిదినమున నెనిమిదిగంట లగువేళకుఁ బొత్తములు పుచ్చుకొని కూర్చుండును. ధర్మారావుపోయి పదిగంటలదాఁక నేదిమో చెప్పును. పిల్లవాఁడు చక్కఁగాఁ జదువుకొనును. చెప్పినసంగతి మఱవఁడు. రాతిరిపూట 'చదువుకొనెదను, దీపము తె'మ్మని కొంతసేపు పుస్తకమువంకఁ జూచును. 'నాకు పదేండ్లు వచ్చినవి! బాబయ్యగారు నా కేల చదువు చెప్పించలేదు?' అని రంగన్నను ప్రశ్న వేయును.

ఒకరోజున ధర్మారావు పాఠముచెప్పుటకు వచ్చెన్ హరప్ప 'అయ్యా! మీకు నెల కెంతజీతము కావల యు'ననియడిగెను. ధర్మారా 'వేమియు వల'దనెను. హరప్ప 'యట్లుకాదు. మాయమ్మగారు చెన్నపురినుండివచ్చినతరువాతఁనిర్ణయించెద'ననెను.ధర్మారావుకనులవెంట నీరు గిఱ్ఱునఁదిరిగెను.కుఱ్ఱవాఁడు చూచిపోవునేమోయని యుత్తరీయముతోఁదుడుచుకొని మఱల తేపువచ్చెద'నని సెలవుతీసికొనిపోయెను.

ఒకనాఁడు రంగారావుగారు చెన్నపురిలో గవర్నరుతో మాటాడుచుఁ దనభార్యమృతియుఁ, దన కొక కుఱ్ఱవాఁ డుండుటయుఁ జెప్పెను. గవర్నరుగారు విచారించి సానుభూతిఁ జూపి కుఱ్ఱవానికి ట్యూటరు నొకని నేర్పఱుపుమని బోధించెను. రంగారావు 'ధర్మారావని బి. ఏ. చదివినయతఁ డొకఁ డుండెను. ప్రస్తుత మతనియొద్దఁ జదువుచున్నాఁ' డని చెప్పెను. గవర్నరుగారు 'తెలుఁగతనిచేతఁ జెప్పించవచ్చును. ప్రవర్తన బాగుపడుటకును, బ్రిటిషు రాజ్యపౌరుఁడు కాఁదగుటకును శిక్షపడయుటకు దొర నొకని నియమించుట మంచి' దని, 'ఈట్సన్' అను నొకయాంగ్లేయుని నెలకు పన్నెండువందల రూపాయలజీతముమీఁద నియమించు'మని చెప్పెను. ఈట్సన్ కొలఁదిదినములలో సుబ్బన్నపేటఁ జేరెను. ఊరిచివరనున్న మిషన

కీలబంగాళాలో నివాసమేర్పఱచుకొని హరప్పనాయని మోటారు
మీఁద దనయింటికే తెప్పించుకొని యక్కడ నతనికి శిక్ష గఱపు
చుండెను. ఈట్సన్ సాయంకాలములయందుఁ గుబ్జవానిని వెంటఁదీసి
కొని పోవును.

ఒకనాఁడు ధర్మారావు పాఠముచెప్పుచుండఁగా హరిశ్చం
ద్రుఁడు చాల సత్పురుషుఁ డని వచ్చెను. హరప్పనాయఁడు 'ఏసు
క్రీస్తుకన్న మంచివాఁడా?' యని ప్రశ్న వేసెను. ధర్మారావు 'హరి
శ్చంద్రుఁ డున్నప్పుడు క్రీస్తు లేనేలేఁడు. ఇద్దఱు నొకప్పు డున్నఁ
గదా యెవరికన్న నెవరు మంచివారో చెప్పుట! ఆయన బ్రతికిన
కాలము వేఱు, ఈయన బ్రతికినకాలము వేఱు' అని చమత్కరించెను.
కుబ్జవానికీ సంగతి తెలియలేదు.

మఱునాఁడు హరప్పనాయనితో ఈట్సను ఏసుక్రీస్తునుగూర్చి
మఱలఁజెప్పెను. నాయఁడు 'మా హరిశ్చంద్రుఁ డున్నాఁడు. ఆయనఁ
గూడ మీ క్రీస్తంత గొప్పవాఁడఁట' అని చెప్పెను. ఈట్సను 'హరి
శ్చంద్రుఁడు కాఁడు; మఱి యెవ్వరును గారు. క్రీస్తంత గొప్పవాఁడు
క్రీస్తే' యని బోధించెను. మఱునాఁడు ధర్మారావు పాఠము చెప్పు
టకు రాఁగా హరప్ప 'క్రీస్తంత గొప్పవాఁడు మఱెవ్వరును లేఁట
గదండీ' యని ప్రశ్న వేసెను. ధర్మారావు 'నేను చెప్పునది తెలుఁగు;
దొరగారు చెప్పునది ఇంగ్లీషు. తెలుగులో హరిశ్చంద్రుఁడు, రాముఁడు,
కృష్ణుఁడు వీరుగొప్ప. ఇంగ్లీషులో ఏసుక్రీస్తు మొదలయినవారు గొప్ప.
మీరు నేనుచెప్పిన చదువు పోవువారితోఁ జెప్పరాదు. వారు చెప్పినది
నాతోఁ జెప్పవద్దు. ఏ చదువు కా చదువుగా, విడిగాఁ జదువుకొన
వలయు' నని చెప్పెను. హరప్పయు నంగీకరించెను.

వైశాఖమాసము వచ్చెను. రంగారావుగారు ఇంగ్లండుపోయి
రని వార్త వచ్చెను. భార్యావియోగముసహింపలేక పరదేశమున
దుఃఖ మపనయించుకొనుటకుఁ బోయి రని సుబ్బన్న పేట జను లను
కొనిరి.

వైశాఖపూర్ణిమనాఁడు వెన్నెలలు విరియఁగాసెను. తీక్ష్ణ
సూర్యునిపేర సుదర్శనాయుధము వేయియంచులతోఁ బరిభ్రమిం
చఁగా, దానినుండి వినిర్గతములైన కాంతులు చంద్రబింబమిషచేత

నాల్గుదెసల నావరించినట్లు, భక్తులయెడఁ బ్రసన్నుఁడై శ్రీవేణు గోపాలస్వామి మందహాసదీధితులు గాలిపొరలపై నుయ్యేల లూఁగి నట్లు వెన్నెలలు విరిసెను. చిక్కిపోయిన శరీరముపైఁ దెల్లనిచీరఁగట్టి, యాకర్ణాంతములైన నేత్రాంచలములఁ బచ్చకప్పురపుఁ గాటుక సలఁది పాపటలోవఱకు సింధూరపుఁదిలకం బమర్చి, యల్పాభరణ ములచేతఁ దనూవల్లి యక్కడక్కడఁ బూచిన వెన్నెలతీఁగవలెఁ బ్రకాశించఁగా నల్లనిత్రైక తెల్లనిచీరతో సొగసునకు మచ్చరించఁగా దేవదాసి దేవాలయోన్ముఖయై నడచెను. దారిలో నానాఁడు రామే శ్వరముగా రామె కెదురుపడెను. ఇద్దఱును గలసినచోట మాటవినఁ బడునంతదూరమున మనుజు లెవరును లేరు. రామేశ్వరము నెమ్మ దిగా 'పిల్లా! ఎచ్చటికే పోవుచున్నా?' వనెను. దేవదాసియెడఁదలో శూలము దిగఁబొడిచిన ట్లయ్యెను. తనకుఁ బదునేనేఁడులు వచ్చినవి. అంతమాట సుబ్బన్నపేఁటలోఁ దనచెవిని బడలేదు. ఆమె కనులు విప్పి రామేశ్వరమువంకఁ జూచెను. రెండు సుదర్శనచక్రములు గిరగిర త్రిప్పిన ట్లయ్యెను. రామేశ్వరమునకు రెండుతామరపూవులు వికసించిన ట్లుండెను. త్రాఁచు గాలికి దూసికొన్నట్లు దేవదాసి బిరబిరనడచెను. రామేశ్వరమునకుఁ దెల్లని మన్మథపతాక రివ్వునవిసిరినట్లు తోఁచెను. ధర్మారావు దూరమునుండి వా రిద్దఱు సమీపగతు లగుట, దూసిన బాణమువలె దేవదాసి నడచుట చూచెను. అతనిగుం డెలో నెత్తురులు గూడుకట్టెను. రామేశ్వరమునుండి దేవదాసి యెంతవేగముగ దూరముగఁ బోయెనో ధర్మారా వంతవేగముగ దేవదాసిసమీపముగఁ బోయెను. ధర్మారా వేమి టని యడిగెను. గిరిక 'యన్నా! నైవేద్యమిడినవస్తువు ముట్టుకొనఁగూడ దని శునకమున కేమి తెలియును?' అనెను. ధర్మారావు మాఱు పలుకక యధోముఖుఁడై యింటికిఁబోయి స్నానముచేసి యేదో జపించుచుండెను. దేవదాసి స్వామిగుడిలోనికిఁ బోయెను. కాని యామెయొడలంతయుఁ దేళ్ళు, జెఱ్ఱులు ప్రాకిన ట్లుండెను. ఆ శరీర ముతో దేవునియెదుటికిఁ బోవుటకుఁ బ్రాణమొప్పలేదు. మరలఁ దిరిగి యింటికిఁబోయెను. ఎంతయో శ్రద్ధగా నిలువుటద్దమున కెదురుగా నిలుచుండి తీర్చికట్టిన చీర, తీర్చిదిద్దిన తిలకము, తీర్చి పెట్టుకొన్న

కాటుక యొక్క డొక్కుడు తీసివేయుచుండెను. శ్వాసప్రష్టమైన పురోడాశము యాజ్ఞికుడు పరిహరించినట్లు, పరాభిలషితమైన భార్యమనస్సును వివేకియైన పురుషుడు పరిత్యజించినట్లు తనయలంకారములను దేవదాసి పరిహరించెను. పోయి స్నానమాడి మెట్టుమీదికి దొడిగి, నల్లనిచీరం దాల్చి, మొగమున కుంకుమబొట్టు పెట్టుకొని మఱల స్వామి సన్నిధానమునకు బయలుదేఱెను. ధర్మారావు వాకిలివద్దకు వచ్చెను. అరుంధతియు గిరికయు బయలుదేఱి యాలయమునకుం బోయిరి. అరుంధతి 'యేమమ్మా! ఇంతపొద్దుపోయినకి బయలుదేఱితివి?' యనెను. గిరిక కన్నులవెంట నీరు పెట్టుకొనెను? వెన్నెల లామె కన్నీటిపైబడి ధగధగ మెఱసెను. అరుంధతి కామె కనుగొలుకులు కొలకులై నీరు తోచెను. ఆమె స్వామి పరిత్యక్తముగా లేదని గిరిక దుఃఖించుచున్నదనుకొనెను. 'అమ్మా! ఏల యేడ్చెదవు? ప్రభువునందు నీ కెంత యనురాగమో, నీయం దాయనకు నంతియే యనురాగము. ఆయన వచ్చి నిన్నుం గౌగిలించుకొనలే దందువుగాని, నీవుపోయి యాయన నెప్పుడైనం గౌగిలించుకొంటివా?అది చెప్పుము' అనెను. గిరిక మనసులో ననుకొన్నది: 'అవునవును, నేను స్వామి నెప్పుడును గౌగిలించుకొనలేదు. అట్లు చేసినచో నర్చకుం డూరకుండండేమో! ఆలయములో స్వామికి నాకు నేమి సంబంధము? ఆయన మాయింటికివచ్చినంగదా నావాం డగుట. ఈనాడు స్వామికి మఱింతదగ్గఱకుం బోయెదను స్వామివద్దకుం బోవుదమన్ననే నా యొడలు పులకరించుచున్నదే! నే నాయన కెంతదగ్గఱకుం బోగలను? ఇన్నాళ్ళుగా శ్రమపడి యింతదగ్గఱకైనం బోలేకున్నాను. మఱి యాయనను గౌగిలించుకొనుట యెప్పుడు? ఆయనయే నే నగుట యెప్పుడు? ఏమి చేయుదును?' ఇర్వురును దేవాలయమునకుం జేరిరి దేవదాసి ప్రభువున కెదురుగా నిలుచుండలేకపోయెను. స్వామికొఱకుం దా నెంతో సొగసుచేసుకొని వచ్చినది. ఇప్పు డీ వేషము ప్రాణనాథునకు నచ్చునో, నచ్చదో! అరుంధతి యన్నది: 'నీవుకూడ స్వామివలె నల్లగా నుండవలె ననియా నల్లచీర దాల్చితివి?' గిరిక మనసులో సంతోషించెను. దుష్టుంయపకారముకూడ భగవద్విషయమున నుపకారముగనే పరిణమించును. వాం డేమో కీడు చేసెను.

తన కదిమేలే యయ్యెను. స్వామికూడ మేలుగానే భావించెనేమో! ఆయనకనులయందు ప్రేమారుణిమమే కాని కోపారుణిమను తోచ లేదు. అయినను నా పరమసాత్త్వికున కిది పట్టినదా? కాలయవనుడు వెంటదఱిమినఁ బాఱిపోయిన రాచకొడుకు, ఒడలి నెత్తురు చీము లేనివాఁడు తనను రామేశ్వర మేమిచేసిన నింతియే కాఁబోలును! స్వామి కీ సంగతియే తెలియదా? సర్వజ్ఞుఁ డీ మాత్రము తెలిసికొన లేఁడా? తనమీఁద ప్రభువునకు నిజముగా నభిమానమున్నదా? తా నింత పట్టుకొని దేవులాడుటయే కాని, ప్రభువున కేమి? పదియాఱు వేలలో నిది యొకతె. దేవదాసి కన్నులలో నీరు నిలచెను.

ఆషాఢశుద్ధ పాడ్యమినాఁడు తూర్పులో చిన్న మేఘముతోఁచి వామనమూర్తి పాదత్రయముచే మూఁడులోకము లావరించినట్లు విజృంభించి ప్రాగీశాన్యాగ్నేయభాగములను జిక్కని కాటుకపూసిన ట్లలమెను. భగవంతుఁడు పాంచజన్యము పూరించిన ట్లుఱిమెను. నందకము దూసినట్లు మెఱసెను. దేవదాసి బలాకాపక్షివలె నాలయ మునకుఁ బోయెను. ఆ నాఁటికి రామేశ్వరముచేసిన ద్రోహము దేవ దాసిమనస్సునందు విఱిగిపోయెను. స్వామి యానాఁడు దేవదాసిని జూచి విహసించెను. దేవదాసి సిగ్గులో దాఁగుకొనెను. మహానంద పరవశయై యింటికిఁ దిరిగివచ్చుచున్న దేవదాసిని మేఘుఁడు పై నుండి క్రిందికి నీటిలో ముంచియెత్తెను.

రంగారావుగారు ఇంగ్లాండునుండి తిరిగివచ్చిరి. ఆయన యొక యూంగిలేయకన్యను వెంటఁగొని వచ్చెను. ఆమెను బెండ్లిచేసికొనుట కుద్దేశించెను. అందుకై యామె తనమతమును వదలి హిందూమత ములోఁ జేరెను. ఇద్దఱును వచ్చి కోటలో నివాసముండిరి. కాసా వాండ్రకుఁ బరిచారకులకు నేమిచేయుటకును దోఁచలేదు. వారు చీర లెవరికి సింగారించెదరు? ఒడళ్ళు తోమి యెవరికి నీళ్ళుపోసెదరు? ఎవరి కాళ్ళు కడిగెదరు? సేవామూర్తులైన వారిశరీరములకు విని యోగ మేమిటి? నిరుపయోగులైనవారందఱును కోటనుండి తొలఁ గింపఁబడినచోఁ దరములుగా వచ్చుచున్న వారిజీవనాధారముమాట యేమి? ఈ క్రొత్తరాణి తనపనులు సర్వము తానే చేసికొనును. టీ తానే కాఁచుకొనును. ఆమెకు లడ్డువు లక్కఱలేదు. జిలేబి లక్కఱ

లేదు. పూర్వపు రాణులవద్దవలె నీ రీమె కుపకరించఁబోయినచో నామె తెల్లమొగము వేసికొని చూచును. ఏదోవిచిత్రముగా నవ్వును. ఆ పల్లెటూరివాండ్ర కామె నవ్వు మానుషముగా లేదు. ఆ దేశములలోను నున్నతకుటుంబములయందు మహాసౌందర్యవతు లుందురు. కాని యిచటినుండిపోయినవారికి వారు లభించరు. ఈ క్రొత్తరాణిగా రా దేశమున నెట్టిదో తెలియదు.

ఇచట నాల్గురోజు లుండి దంపతులిద్దఱును జెన్నపురి పోయిరి. ఆమె 'సుసానీ' అన్న తన పేరు మార్చుకొని 'శశిని' యని పెట్టుకొనెను. వివాహమైన తరువాత వా రిద్దరును మఱల నొకసారి సుబ్బన్నపేట వచ్చిరి. కోట యంతయు నీ విచిత్రసంఘటనకుఁ దెల్లపోయిరి. ఊరంతయు వెలవెలపోయెను. ఆలయములో స్వామి మాత్రమ్ము కారునలు పెక్కెను. స్వామి యనుకొనెను: తన ధర్మకర్త తెల్లనివాఁడు, తాను నల్లవాఁడు. అతఁడు లౌకికుఁడు, తాను వైదికుఁడు. ఆతఁడు నాగరకుఁడు, తాను పల్లెటూరివాఁడు. అతఁడు శ్వేతద్వీపవాసి, తానును శ్వేతద్వీపవాసియే. కాని యీ నల్లనివాఁడు శ్వేతద్వీపవాసి యని యెవరు నమ్ముదురు?' ఎంత విచారించి నను స్వామికొమ్మె పడిపోయినది రాణి యన్న శబ్దము లేకుండఁ దనకడుపునఁ బెట్టుకొన్నాఁడు, వేణుగోపాలస్వామి. ఇప్పు డీమె నేమి చేయఁగలఁడు? ఆమె పెట్టు పంగనామము లిదివఱకే మొగమున నున్నవి.

ఒకనాఁడు శశిని హరప్పనాయనికిఁ గనపడెను. నాయఁడు తెల్లపోయెను. రంగన్న 'వారే మీయమ్మగార'నెను. నాయఁడు చేతిలోనున్న కఱ్ఱపెట్టి రంగనిమొగముపై విసరెను. రంగన్న కనులకు దెబ్బతగిలి యవి మూఁతపడెను. 'కన్నులు కనఁబడుట లేదు. నీకు!' అన్నాడు హరప్ప. శశిని వచ్చినది! రంగారావునకు భార్యయే భార్యయా! కోటకు రాణియా? హరప్పకుఁ దల్లియా? స్వామి కేకాదశు లుండునా?

# పదియవ అధ్యాయము

శశని యొకనాఁ డొంటరిగానడచి షికారుపోయి పొలాల
మీఁద రాత్రిరి వెన్నెలలోఁ గొంతసేపు విశ్రమించెను. పొలా
లన్నియు దుక్కిదున్నిరి. కొన్ని చేలకు నీరుపెట్టి ముంజేత నూడ్చిరి.
చేలకు నీరెక్కినంతనే యెచ్చటనుండి వచ్చెనో కుళీరములు, భేక
ములు, కాళ్ళజెఱ్ఱులు నేలయీనిన ట్లయ్యెను అను రాణి యగుట
వలనఁ బరిచారకు లామె ననుసరించఁబోదురు. ఆమె వలదని నివా
రించుచు. ప్రొద్దుపోయి యామె తిరిగి వచ్చువేళకు వీధులలో
యూనియను దీపములు సరిగా వెలుగుటలేదు. విద్యుద్దీపములు లేక
పోవుట యామెకుఁ గంటగింపయ్యెను. పొలములమీఁదఁ జీకటిలో
నడచినను, నూరిలోనికి వచ్చునపుడు దీపము లేకపోవుట కష్ట
మయ్యెను

మఱునాఁడు చెన్నపురినుండి రంగారావుగారు వచ్చిరి ఆ
సాయంకాలముననే సుబ్బన్నపేటలోఁ బురపాలకసంఘ మేర్పాట్లు
చేయుటకుఁ బ్రయత్నములు సాగెను. గ్రామము గూడెము, మిషన
రీలపేట, ఆలయములపేట, దేవదాసీలపేట, బ్రాహ్మణవీధి,
మిగిలిన భాగములుగా విభజింపఁబడెను ఒక్కొక్క భాగమునుంచి సభ
కొక యభ్యర్థి నియమింపఁబడెను. చంద్రారెడ్డిని సభాధిపతిగ
రాచరికమువారు పేర్కొనిరి. రామేశ్వరముగారు, ముగ్గురు మిషన
రీలు, గూడెముతరపుననలుగురు ప్రైమరీపాసైన పంచములు సభలో
రాచరికమువారితరపున సభ్యులుగాఁ జేయఁబడిరి. ఎన్నికలు ప్రారంభ
మయ్యెను. సుబ్బన్నపేట ప్రజలకు దీనివిషయములోఁ గ్రొత్త
యుత్సాహము ప్రబలెను. ఇదివరలకు బ్రిటిషుప్రభుత్వమున్నను
వారెఱిఁగినరాజు జమీందారే. ఇప్పుడు ప్రభుత్వముతోడనే
ప్రత్యక్ష సంబంధము కలిగిన ట్లయ్యెను. తమ జమీందారుకూడా
లోఁబడిన యొక పెద్ద అధికారి, వ్యక్తివలెఁగాక సంస్థవలె గోచరింప
నారంభించెను. ఈ యెన్నికలతోఁ బూర్వపుఠీవిపోయిన కోటకు
ఠీవిపోయినట్లే కన్పించలేదు. దానికసలు ఠీవి యున్నట్లే కన్పించ

లేదు. జమీందారు ప్రభువువలెగాక పెద్ద రయితువలె భాసించెను. ప్రతివ్యక్తియు స్వతంత్రుఁడును, హక్కుదారుఁడునుగాఁ గనఁబడెను. జనము సంతోషించిరి తమకుఁ దామె పాలకుల మనుకొనిరి. తమ మేలుకీళ్ళకుఁ దామె కర్తల మనుకొనిరి. రాచరికమువారై నఁ ద మ్మ న్యాయము చేయలేరనుకొనిరి. తమ మంచిచెడ్డలు తమఅభ్యర్థులు సభాముఖమున వాదింతురు. ఇంక నేది కావలసిన నది యటుచేతి లోని వైకుంఠ మన్న ట్లుండెను.

క్రొత్తసభ్యులకు నాకాశమునుండి యూడిపడినట్లు క్రొత్త పదవులు వచ్చెను. చదువులేక, ధనములేక యిట్టిపదవులు ప్రాప్తించి నంతనే వారును సంతసించిరి.

ఒకనాఁడు గణాచారి ప్రొద్దుననే లేచి స్నానముచేసి యేదో ధ్యాననిమగ్నయై నాలుఁగువేఁపమండలుపుచ్చుకొని బయలుదేఱెను. పిల్లలామెవెంటఁ బడిరి. ఆమె యూరినాల్గువైపుల సంచరించెను. కోటముం దొకసారి నిలుచుండి యొక వేఁపమండ యచట వదలెను. పురపాలకసంఘమునకు జమీందారుగారి యొకమేడ యూరిబయట నున్నది యుపయోగపడుచుండెను. అక్కడ నొక మండ వదలెను. పురపాలకసంఘమునకు జమీందారుగారు నలువది యెకరముల మాగాని యిచ్చిరి. అది మెఱకచేసి యందులో మేఁడ కట్టుదురు. అందు సభ యుండును. ఆ స్థలమువద్దకుఁబోయి యింకొక మండ వదలెను. చంద్రారెడ్డియింటిముందు నాలుగవమండ వదలెను. గణాచారి పిచ్చిదని గ్రామములో చెప్పుకొనుట యారంభమై పదేండ్లయినది. రోజుగడచినకొలఁదియు నామె పిచ్చిదన్న విశ్వాసమే బహుళమయ్యెను. ఈ గణాచారి నేఁటిచేఁత యీ యభిప్రాయమును వృద్ధిపఱచెను. కొందఱు దీనిని లెక్కయే చేయలేదు.

ఒకనాఁడు సభ జరుగుచుండెను. పదునేనుగురు సభ్యులును సమావేశమైరి. సభకొఱకు నూత్నసౌధమును నిర్మించుటకు రెండు లక్షలు వసూలుకావలయు ననియు, నా ధనము గ్రామముమీఁదఁ బన్నులద్వారా వసూలుచేయవలయు ననియు రాచరికపు సభ్యుఁ డొకఁడు తీర్మానము తెచ్చెను. గ్రామములోనిసభ్యులు దీనికిఁ బ్రతిగా నిలుచుండిరి. అంతధనము సుబ్బన్నపేఁట యెంతపెరిఁగినను వసూ

లగుట కష్టమని వారియూహ. ఆ ధనము కొంత జమీందారుగారును, గొంత రాచరికమువారును విరాళముగా నొసఁగినచో బాగుండునని వా రూహించిరి. సభలో వాదోపవాదములు జరిగెను. ఎంతకును దెగక చివరకు ఓటింగునకుఁ బెట్టిరి. రాచరికపుఁ బక్షమే గెలిచెను. తరువాత ధనమువసూలుచేయుట యెట్లని ప్రశ్నవచ్చెను. సుబ్బన్న పేఁటలో నింటింటికి నెక్కువబరవు వేయవలయును. నెలజీతముల వారినుండి రూపాయ కణాచొప్పున వసూలుచేసి సాలున కెనిమిది వేలు వసూలుచేయవలయును. ముప్పది సంవత్సరములలోఁ గావలసినడబ్బు వడ్డీతోసహా సమకూఱును ప్రస్తుత మీ డబ్బు రాచరికమువారివద్దనుండి యప్పుదెచ్చి సౌధనిర్మాణము, తక్కినపనులు నారంభింపవలయును. తీర్మానము లన్నియు నగువఱకు సరిగా నా నాఁడు పగలుపన్నెండుగంట లయ్యెను. ఎండ మిటమిటలాడిపోయెను. ఎండలు వీథుల వెంట నెండమావులవలె, డోరియాగుడ్డవలెఁ దెల్లని గీఁతలు గీసినట్లు ప్రసరించెను. సభ్యులందఱు సౌధమువదలి బయటికి వచ్చిరి. ఆ వేళకుఁ బసిరిక యొడలెల్ల వానలేక ముదిరి యెఱుపునకుఁ బెరిగిన లేఁతజొన్నాకులు చేతిలోఁ బుచ్చుకొని వారిముందరగాఁ బోవుచుండెను. వారందఱు నొక్కసారిగా సౌధమునుండి బయటకి వచ్చుటచేత వారినిజూచి భయపడెనో యేమో— వెనుకమరిసిని జూచుచు భయపడి పాఱిపోవు పామువలెఁ బ్రిందఁబడుచు లేచుచు, నడ్డదిడ్డముగాఁ దిరుగుచు, మెలికలుపడుచుఁ, దలయెత్తి మాటిమాటికిని జూచుచుఁ బరువెత్తనారంభించెను. వారు నీ వికృతస్వరూపుని జూచుచునే నిలఁబడిరి. అందులో నొకదొర యితనిని దీసికొనిపోయి లండనులో వస్తుప్రదర్శనశాలలో నుంచిన లోకోపకారము జేసినట్లగునని యూహించెను. సృష్టిలోఁ గల సర్వవిచిత్రవస్తువులును జూడఁదగిన మహాస్థల మదియేగదా! ఆ దొరపేరు గార్డినరు. ఆతఁడిదివఱకే పసిరికను నాలుఁగైదుసార్లుచూచి యీ యూహపడెను. కాని యతని వర్తమానమేమియు దెలిసికొనలేదు. అతఁడు గాలిగాఁ దిరుగువాఁడైనచో నే యిబ్బందియు లేదు. తల్లిదండ్రులు గలిగి, యతఁ డొకరియొద్దికలోనివాఁడైనచో వారికిఁ గొంత ధన మీయవలసియుండును. ఇచ్చినను నష్టములేదు. దానికి వందరెట్లిచ్చి

లండనులోని వస్తుప్రదర్శనశాలవారు కొందురు. పుణ్యము, పురుషార్థము రెండును సమకూరును.

ముప్పదియేండ్లవఱకు నూరిమీఁదఁబడిన శిస్తువిషయము గ్రామములో వ్యాపించెను. రయితుల కందఱకుఁ గష్టమనిపించెను. తద్దినము కొనితెచ్చుకొన్న ట్లయినది. మేలని పురపాలకసంఘము తెచ్చుకొంటిమి. ప్రథమముననే ముప్పదియేండ్లవఱకుఁ బాలనులు బోగుబందా కౌలు కిచ్చుకొన్న ట్లయినది. ఆ యూరిలోనున్న యుద్యోగస్థులలోఁ బెద్దజీతము ముప్పది. నేటినుండి ప్రతివారికిని జేతిలోఁ బడునది యిరువదియెనిమిది. ఇదికాక జీవనపుఁబన్ను, మఱికొన్ని చిల్లరపన్నులు - మిగులునది పాతికరూపాయలు. కఱవులో నధికమాస మన్నట్లు పదిరూపాయల జీతమువారికిఁ, బన్నెండురూపాయలజీతమువారికి నీ పన్ను మఱియు బాధాకరమైనది. పూర్వము కృష్ణమనాయనివద్దఁ బదిరూపాయలజీతగానికి దారిద్ర్య మనిపించ లేదు. గ్రామ మందఱును నాయనిసొమ్మే తినిరి. నాయనిశ్రీ తఱుఁగువోలేదు. నేఁడు జమీందారుసొమ్ము దమ్మిడీ యెవరికిని ముట్టుటలేదు. అందఱును దరిద్రులవలె నుండిరి. జమీందారుశ్రీ తఱుఁగువోవుచుండెను. కలిగిన మే లొకటి. పూర్వము గ్రామములోని ప్రతిచీమయు జమీందారు నాశ్రయించియుండెను. ఇప్పుడు ప్రతిచీమయు స్వతంత్రము, వ్యక్తివికాసము, జాతివికాసమునకు హేతు వనుట నిర్వివాదాంశముగదా!

సుబ్బన్నపేఁటకు దక్షిణమున గుండేఱు ప్రవహించుచున్నది. దానివెడల్పు రెండుగజములకు మించి యుండదు. దానికి గట్లు లేవు. అది యెప్పుడును తొడలలోతుకన్న నెక్కువ యుండదు. అది నిజాము రాష్ట్రములో నెచటనో పుట్టినదఁట. దాని పుట్టుక యెవ్వరు నెఱుఁగరు. ఎక్కడనో కొన్ని రేవులలోఁదప్ప నే అంతయు దొంగయూబి. లోతుఁ దక్కువైనను నందుచేత దానిని దాఁటుటకు ప్రజలు భయపడుచునే యుందురు. పదియేండ్ల కొకసారి, యైదేండ్లకొకసారి- యెప్పుడో తెలియదు, దానియిష్టము వచ్చినప్పు డడఁపొంగి వఱదలు కట్టును. దాని మూలముగా సుబ్బన్నపేటనుండి బెజవాడకుఁ బోవుటయే కష్టము. కృష్ణమనాయఁడు దానికి వంతెన కట్టించెను. ఈయేఱు

సుబ్బన్నపేటకు మైలుదూరమున నున్నది. ఏటిపఱదలువచ్చినా నీయూరికి నాల్గువైపుల తవాయించును. చుట్టునున్న పొలములన్నియు నాయేఁడు నిర్ధూమధామము. కాని పూర్వము నేలయంతయు మెట్ట పొలాలైనప్పు పఱదలు దేశమునకు లాభకారులే యయ్యెను. ఒక యేఁడాది గుండేఱు వచ్చి, యాయేఁడునకు సస్యమంతయుఁ బాడు సేసినను, నొండుమట్టి యడుగెత్తునఁ బేర్చిపోవును. తరువాత పదేండ్ల దాఁకనో, యాతేండ్లదాఁకనో మఱల పఱదలు వచ్చువఱకు నా నేల పండినదే పంట. మిరప, జొన్న, మొక్కజొన్న, రాగులు, తవిదలు, పొగాకు, పసుపు, నీలి - సస్యమునకు బదులు ధనమే పండును. గుండేఱు కోపమువచ్చినప్పుడు కొట్టినను దరువాత నెత్తికొని చన్నిచ్చి సముదాయించిన తల్లివలె నా చుట్టుపట్ల జనమునకుఁ బ్రాణదాత్రి, యన్నదాత్రియు నయ్యెను. మాగాని కడచిన పదేండ్లుగా నాచుట్టుపట్లఁ గ్రమక్రమముగా వృద్ధిపొందెను. పదేండ్లయినది గుండేఱుపాడిచి. క్రొత్తపంటల కలవాటుపడిన క్రొత్తప్రజలకు గుండేటిపోడుపు తెలియదు. సుబ్బన్నపేటచుట్టుపట్ల నెండలు మాఁడి పోవుచుండెను. ఒకనాఁడు తెల్లవాఱువఱకు గుండేఱు పుట్టినచోట నెంతవర్షించెనో తెలియదు. గుండేఱు పఱదలమీఁద నుండెను. నేఁడు తీయును, రేపు తీయు నన్న ప్రవాహము నేఁట రేపట నిబ్బడి ముబ్బడిగాఁబొంగి, యుబికి పొలాలమీఁదఁ బరువెత్తెను మొదట నొడ్డున నున్న పైరును బుక్కిటఁబట్టెను. కొంతపైరునకుఁ దలమునక, కొంతపైరునకు నడుముదాఁక, మఱికొంతకు మూలస్పర్శ. ఇది మొదటినాటికథ. రెండవనాఁడు దక్షిణపుఁబొలమంతయు పైరే కనఁబడలేదు. గుంపులు గుంపులై కొంగలు జలోపరిభాగమునఁ జాళ్ళు కట్టి పరువులెత్తెను. దుబ్బులెడిగి పోరంబోక లున్న చోటఁ జుట్టుపట్ల నీరు లోఁతైనను నచ్చటమాత్రమునీ రందుచుండుటచేతఁ గృష్ణాజినము పరచినట్లు బకధ్యానము సాఁగెను. చేఁపలు మాటిమాటికిని దలలెత్తి నీలు వీఁత నీఁదబోయినట్లు తికమకలుపడెను. నీరు సుబ్బన్నపేటచుట్టుపట్లనున్న పేదకొంపలను ముట్టడివేసెను. వారు వాకిళ్ళల ముందు మట్టితోఁ గట్టలు వేసికొని, తెల్లవాఱులు దీపము లుపెట్టుకొని, గట్లు తెగిపోకుండఁ జూచుకొనుచుండిరి. పేటకుఁ బడమటివైపునఁ

ప్రవహించు కాలువకు నేటిసర్దు పొడిచి, పశ్చిమోత్తరదిక్కులందును వఱద విజృంభించెను వంతెన విఱిగిపోయెను. బెజవాడ సుబ్బన్న పేఁటలమధ్య రహదారిలేదు. అంతకు మూఁడునాళ్ళకుఁ బూర్వము రంగారావుగారును, శశినియు పేఁటకు వచ్చిరి. వారీ యేటివఱదల మూలమునఁ జెన్నపురికి సాఁగిపో వీలులేకుండెను. మోటారు నడువదు.

శశిని పూర్వపురాణులవలె పేఁటసంప్రదాయములకొఱకైనను చీరగట్టవలెనని, ఘోషాసాఁగించవలె నని రంగారావుగారి హృదయ గుహాకుహరములోని మనస్సునాఁకరాని యొక యూహాంకురము. దాని నాయనమనస్సెప్పుడును బరామర్శించలేదు. స్పష్టమనస్కమే కాని దానికి స్పష్టవాక్త్వ మెక్కడిది? శశిని కట్టి భావస్థితినిగూర్చి కూడ సందేహము లేదు. ఆమె యొకస్వతంత్రదేశమునఁ బుట్టినది. అచ్చటి మరియాదలకు, నలవాటులకుఁ బరదేశములవారు వచ్చి భిన్నముగా నడచినచో నామె మనస్సు చాల బాధపడియుండును. కాని తన యీ భిన్నప్రవర్తన యిచ్చటి దేశప్రజలకు బాధ కలిగించునని యామె కూహయే కలుగలేదు. కలుగవలసిన యవసరము లేదు. ఈ దేశప్రజలు వచ్చునకష్టములు దైవికములని వాని నోర్పుతో సహింతురు. తమ కిష్టములేమినిసూచించరు. ఒకవిషయమున, నొక కార్యాచరణమునఁ దమకిష్టములేమిని ప్రతిఘటించి తెలుపుట శశిని పుట్టినదేశమునఁ బ్రధానధర్మము. తత్ప్రకృతులకుఁ బ్రతిఘటించక పోవుట యంగీకారముక్రిందనే లెక్క.

వఱద మూఁడవనాఁడు శశిని ప్రాతఃకాలమున లేచి, దక్షిణపు దిక్కుగాఁబోయి, యందొకంతమట్టుకు జలములోఁ దిగెను. ఒక పంచముని యింటివెనుకఁ బొంచి తుపాకితో నొక కొంగను చంపెను. ఇద్దఱు మాలకుఱ్ఱవాండ్రు పోయి చచ్చిన కొంగను దెచ్చిరి. తుపాకి మ్రోఁత విని తుంగలమీఁద, కాడిగట్టుల, నీరులోఁతు లేనియెడలఁ గూర్చున్న జలపక్షులన్నియు బెదరుకన్నులతో, నిక్కించినమెడలతో, ఱెక్కలు నీటిలోఁ గొట్టుకొని, ముందునకుఁ దూలిపోవుచు నెగిరి, వఱద లోఁతైనయెడలకుఁ బరువెత్తి యచ్చట నిలుచుటకు నీడలేక, మఱల నొకయరగడియలోఁ దిగివచ్చి యథాస్థానమునందే కూర్చుండెను. ఆ కొంగలు తమలోఁ దాము లెక్కచూచుకొనలేదు.

చచ్చినకొంగ జముకు రాలేదు. నీటిమీఁద నందందు కొజపూలు తెల్లనై పైకిఁ గనఁబడుచుండెను. కొందఱు మాలెత లాపూవులను గోసి తెల్లని రేకలు త్రుంచి, వానిని గొలుసులుగా నమర్చి కొప్పులో నుండి చెవులవఱకు శిరోలంకారములుగా నమర్చికొనిరి. ఆ యల్లికకు నా యలంకారప్రియత్వమునకు శశిని చాల ముచ్చటపడెను. అనాగరకులైన యీ పల్లెజనులకు నింతరసజ్ఞత్వ మెచ్చటిదో! వారి మనస్సులు సహజముగా మెత్తనివి కావలయును. కాని వారి నల్లని దేహచ్ఛాయలు వారి బుద్ధిలో మార్పు తేలేదు. ఆమె పడమటి దిక్కుగా నడచెను. ఆ వైపునఁ గొన్నిపొలములు మునిఁగిపోలేదు. ఎరువుతోలిన కొన్నిచోట్ల పైరుదుబ్బుకట్టి కొద్దిగా వచ్చిననీటిని పరిహాసించుచుండెను. కలువుతీయని యా పొలములో నమ్మపూలు పైని దేలియాడుచుండెను. ఆ యూదారంగుపూలనుజూచి, యది పూవో కాయయో శశినికిఁ దెలియలేదు. ఆమె యొక పూవువద్దకుఁ బోయి మాలపిల్లల 'నదియేమి' టని యడిగెను. ఇచటనున్న యీ రెండునెలలలో నామె తెలుఁగులోఁ బది పదునొకండు మాటలు నేర్చినది. ఆ పిల్ల లవి నమ్మపూవు లని చెప్పి, 'వానికింద దుంప లుండును. అవి యుడుకఁబెట్టితినినచో రుచిగానుండు' నని చెప్పి, నీటిలోఁదిగి యొకదోసెడుదుంపలు తెచ్చి యామె కిచ్చిరి. శశినిరాక గూడెములకు, విషనరీపేటకు మహోదశపట్టినట్లున్నది. వా రందఱును మనసా యూరికన్నఁ గోటకు దగ్గఱవారైరి. అందుచే శశిని యన్న వారియందఱకును బ్రాణమైపోయెను. ఆమె చంపిన కొంగను గోటకుఁ దెచ్చెద నని యొకమాలపిల్లవాఁడు వెంట రాఁగా నామె వానిని వారించి, చేతిరుమాలులో నమ్మదుంపలు కట్టుకొని, తుపాకి చంకను బెట్టుకొని, కొంగ నెడమచేతఁ బుచ్చుకొని, వస్త్రముల న్నియు నొండుమట్టి కొట్టుకొని యామెకోటకు నడచివచ్చెను. ఏ ఆఫ్రికాదేశముననో, యూరిపియనులతుపాకిమ్రోఁత శబ్దించని యాకాశము కల యే దక్షిణపుఅమెరికామహారణ్యములమధ్యనో నూత్న జాతులు, నూత్నాచారములు కనుఁగొనుటకుఁ బోయిన సాహసుల గుంపులో నొకర్తుకవోలె నావేశమున నున్న తన్నుఁ దా నామె యూహించుకొనెను. జనులందఱు నామెవంక నివ్వెఱపోయి చూచిరి.

స్వతంత్రభావసంస్కృతులు కాని కొందఱు కామెయెడల జుగుప్స కలిగెను. అనూహమానమతులు, సమాయకులు నగువారికి నామె వేసము రమణీయముగ, నూత్న భావాభిరామముగ, స్వతంత్రతా చిహ్నముగ గోచరించెను. ఆమె కోటకు వచ్చెను.

స్నానముచేసి, మంచిదుస్తులు ధరించి జమీందారుతోఁ గలసికొనెను. అతఁ డామెను గౌరవించి యేవో మాట్లాడి చివరకు 'నీ విట్లు తిరిగినచో నీ యూరు బాగుండదు. చెన్నపురిలో మనము యథేష్టముగ నుండవచ్చును. మఱియొకచోట నుండవచ్చును. కాని యిచ్చట బాగుండదు' అని చెప్పెను. శశిని కొంతసేపు వాదించి, 'సరే! నీ కిష్టము లేనిచోఁ జేయనులే' యని వాగ్దానమొసఁగెను.

భోజనమునకుఁ గూర్చుండిరి. దాసీవాండ్రు కొంగను వండలేదు. ఆమె 'కొంగమాంస మేది' యని యడిగెను. 'అది పొలముకొంగ. కొక్కెరాయి. దానిని నీచజాతులు తిందురుగాని రాజులు తిన' రని చెప్పిరి. ఆమె మఱియొకప్పుడైనచో నవ్వెడిదే. ఇంతకుముందే రంగారావు కొంత యీ విషయను ప్రస్తావన చేయుట వలన నూరకున్నది. మఱల నమ్మదుంపలకొఱ కడిగెను. దానికి సమాధానము రాలేదు. పరిచారకు లదే సమాధానము మఱలఁ జెప్పుటకు జంకి యూరకుండిరి.

వఱద నాల్గురోజులకుఁ దీసెను. ఏఱుమాత్రము విజృంభించియే ప్రవహించుచుండెను. తరువాత వారమురోజుల కేఱు తనపరిమాణమును దాను పొందెను. రంగారావుగారికిఁ బేటలో నన్నాళ్ళు కదలకుండుట సుఖహేతువుగా లేదు. శశిని ప్రతిదినమునను మేఁడపై భాగమునందే పోయి కూర్చుండి జలావృతమైన ధారుణీశోభఁ దిలకించుచుండెను. ఏఱుతీసినను దారియంతయు బురదయయ్యెను. జాతిబాటపై నడుగెత్తున నొండు పేరుకొని రోడ్డుకొఱకు దారి త్రవ్వవలసియుండెను. ఆరోడ్డు జమీందారుగారిదే. దానిని మఱల బాగుచేయుటకుఁ బ్రయత్నము లారంభింపఁబడెను.

ధర్మారావు ప్రతిదినమును హరప్పనాయనికిఁ జదువుచెప్పుటకుఁ గోటలోనికి వచ్చుచుండెను, పోవుచుండెను. ఒక్కనాఁడైన నతనికి రంగారావునకును సమావేశము జరగలేదు. సెప్టెంబరు మొదటి

తారీఖున ఈట్సనుగారు మోటారుమీఁద వచ్చి, రంగారావుగారిని గలసికొని రెండు నెలల జీతము రెండువేలనాలుగువందలు పుచ్చుకొనిరి. ఆయన హరప్పను బలుకరించి, హస్తస్పర్శచేసి సెలవు తీసికొనెను. హరప్పనాయనికి ధర్మారావుజీతము జ్ఞాపకము వచ్చెను. నాయనగారితోఁ జెప్పవలయు ననుకొన్నాఁడు. ఇప్పుడే - వేఁడిలో వేఁడి-ధర్మారావుగారికిఁగూడ నతని రెండువేలనాలుగువందలు నతని కిచ్చినచో బాగుండు ననుకొన్నాఁడు. కాని తండ్రివద్ద కొడుకునకు మిక్కిలి పరిచయము లేదు. ఒకవేళ పోయి కలసికొందమన్నను, శశిని యాతనికి నిత్యసమీపవర్తిని. శశిని యన్నచో హరప్పనాయనికిఁ జాల విచిత్రముగా నుండును. అతని యా భావము జుగుప్సయో, యీర్ష్యయో, భయమో, ప్రేమమో, యేదియుఁగాదో యేమియుఁ దెలియదు. గణాచారి జూచి పసిరికవలె, శశినిని జూచి హరప్ప పాఱి పోవును. కాని పసిరికయందు గణాచారియూహ యెట్టిదో, హరప్ప యందు శశిని యూహ యట్టి దవునో, కాదో!

హరప్ప బక్కపలుచనివాఁడు, అబ్బనాకారి పదియేండ్ల వాఁడు నెనిమిదేండ్లవానివలె నుండును. తండ్రి కాఫీలు పోసి పెంచెను. ఇతరదేశములనుండివచ్చుడబ్బాపాలతోఁ బెంచెను. కృష్ణమనాయఁడు చనిపోయినప్పటినుండియుఁ బిల్లవానిని మోటారుమీఁదనే త్రిప్పిరి. ఆ వంశమున నాయలందఱు నాఱేండ్లనాఁటికే గుఱ్ఱపుస్వారి చేసిరి. గుజ్జయిన గుఱ్ఱ మొకఁ డున్నది. దానిమీఁద రంగా రావుగారే యాఱేండ్లనాఁడు స్వారిచేసెను. ఆ స్వారీ హరప్ప యెఱుఁగఁడు. హరప్ప సహజముగా నుద్విగ్నమైన ప్రకృతి గలవాఁడు. మనోలక్షణము లన్నియు తాతగారివి. ఆయన రసజ్ఞత, యాయన యుదారత యాయన వివేచనాశక్తి కుఱ్ఱవానియం దుండెను. ఆయనశరీరపుష్టి లేదు. ఏదో బలహీనపుగాలి మనదేశముమీఁదికి విసరెను! ఆజానుబాహువులై, విశాలవక్షులై, యేనుఁగుతొండము పూని విఱువఁగలజాతికి గుజ్జులై, బక్కపలుచనై తెల్లవాఱి లేచినంతనే యేదియో యాహారము లేక పోయినచోఁ దపతపలాడిపోవు జనులు పుట్టిరి. హరప్ప మనోవైశాల్యమునకుఁ దగినంత శరీరదార్ఢ్యము లేక, మనశ్శరీరముల మధ్య విసంధి కలిగెను. మనస్సు సముద్రమువలె విస్తారమైనది. శరీరము

కాలువవలె గట్టు లదుముకొన్నది. అంతనీరు పడఁబోసికొని యీ కాలువ గట్టులు పొర్లి పోవును. తెపకలు కొట్టుకొని యొడ్లు కోసికొని పోవును. హరప్ప శరీరమంతయు వణఁకిపోవును. చూచినవారు 'పిల్లవాఁడు బలహీనుఁ' డందురు. అది మనస్సు మహాబలవంత మగుటచేత వచ్చిన దోసము. ఈ రహస్య మెవ్వరికిని దెలియదు.

మఱునాఁడు రంగారావుగారు మేడపై సావడిలో నొంటరిగాఁ దిరుగుచుండిరి. శశిని సౌధాగ్రభాగమునుండి కట్టఁబడుచున్న వంతెన వద్ద జనులు గుంపులు గుంపులు కూడియుండుట, వారు చీమల బారులవలెఁ గనఁబడుట, వారియంతయు నొండు ద్రవ్వఁబడి ప్రక్కను బోయుటచేత పాడుపడినపొలములు తుంగ పెఱిఁగి పచ్చనై యీ బాట తీసినపటవలె సుమనోహరముగా నుండుట-ఈశోభ నామె తిలకించుచుండెను. అందుచేం రంగారావున కేకాంతము లభించెను. అది మధ్యాహ్నము. హరప్ప తండ్రి యొంటరిగా నుండెనని రంగన్నద్వారా తెలిసికొని, తండ్రికిఁ గబురంపించి తాను దర్శనముచేయఁబోయెను. రంగారావుగారు కుమారుని ప్రక్కనున్న సోఫామీఁదఁ గూర్చుండ నియమించి 'బాగుగాఁ జదువుకొనుచున్నారా?' యని యడిగిరి. వారు 'చిత్త' మనిరి. 'ఏమిపనిమీఁద వచ్చితి?' రని తండ్రి ప్రశ్నించెను. కుమారుఁడు మాటాడలేదు. చెప్పుద మనుకొనిన యాయన నోటికి మాట రాలేదు. మఱలఁ గొంచెమునే పుండి తండ్రి 'ధర్మారావు వచ్చుచున్నాఁడా' యని యడిగెను. హరప్ప మనస్సు 'ధర్మారావుగా' రనినయందుకు రేఖామాత్రము కదలెను అతఁడు 'చిత్త' మని మఱికొంతసేపాగి, 'వారి జీ......' యని యూఁగెను. రంగారావుగారు కొంతసే పూరకుండి 'జీత మేమి కావలయును?' ననిరి. హరప్పనాయని కీ ప్రశ్న యర్థము కాలేదు. మఱల రంగారావుగారు 'నెలకు బదునేనురూకలు చాలునా?' యనిరి. వంగి కూర్చున్న హరప్ప శరీరోర్ధ్వభాగమును దీర్ఘీకరించి, మొగమెత్తి, యెత్తిన మొగమంతయు లజ్జ, కోపము, విస్మయము నై పోయెను. ఎక్కువభాగమం దర్థముకాక పోవుటయే తోఁచెను. తండ్రి కొడుకువంకనే చూచుటలేదు. సమయమైనతరువాత హరప్ప యథాస్థితికి వచ్చెను. తండ్రి హరిప్పవంక నప్పుడు చూచెను. 'సరే.

రెండు నెలలకుఁ గలసి ముప్పదియు నిమ్మని ఖజానాదారునకుఁ గబురంపించు' మని రంగారావుగారు చెప్పి, తాము సౌధోపరిభాగమునకుఁ బోయిరి. హరప్ప కూర్చున్నవాఁడల్ల క్రుంగిపోయి కనుఁగొలుకులను వచ్చిన నీరు నెమరుకణతలవెనుకదాఁక నలిమి, యెద పగిలిపోవునేమో యని గుండెపైఁ జేయూఁచి పట్టుకొని తలవంచి కూర్చుండెను. భావనకన్న శూన్యతయే యతనిమనస్సునఁ దాండవించెను. పసిగుండె యోర్చుకొనలేకపోయెను. ఒక గడియలో హరప్ప నిదురపోవుచుండెను. ఎవరును నిద్ర మేల్కొలుపలేదు. సాయంకాల మగుసరికిఁ దనంత తానే లేచి నెమ్మదిగా మెట్లు దిగి వచ్చి తనగదిలోఁ దాను గూర్చుండెను.

ధర్మారావునకును, హరప్పనాయునికిని మిక్కిలి పరిచయమేర్పడెను. చదువు చెప్పుటకే కాక యూరకయు నిదివఱకే ధర్మారావు రెండు మూఁడుసార్లు వచ్చెను. ఈ నాఁడు సాయంకాలమున మఱల వచ్చెను. హరప్పమనస్సు గుండెలు పొంగి పొలములన్నియు తుడిచివేసినతరువాత బీడుపడ్డ మాగాని యెట్లుండెనో యట్లుండెను. ధర్మారావు రాక మఱల నెచ్చటినుండియో తెచ్చిన నారూడ్చినట్లు అకాలపుఁబసిమి కనిపించెను. ధర్మారావు వచ్చినంతనే హరప్ప లేచి నిలుచుండును. ధర్మారావు కూర్చున్నతరువాత హరప్ప వచ్చినచో ధర్మారావును లేచి నిలుచుండును. పదియేండ్ల పసివాఁడు, తల్లి చనిపోయినవాఁడు, తండ్రి కంత సమాదరణీయుఁడు కానివాఁడు హరప్ప నెట్లు చూచినను జూడవచ్చును. కాని ధర్మారావునకు హరప్ప వీరన్ననాయఁడు, నాగన్ననాయఁడు, హరిహరనాయఁడు, గోపాలస్వామినాయఁడు, హరప్పనాయఁడు, కృష్ణమనాయఁడు వీరి రక్తబిందువులు నివసించు తేజోలేశముగనే కన్పించును. ఉప్పెనినఁ గొట్టుకొనిపోవుచంత యీ బలశాలి శత్రుశిరఃకలితకోటీరమణులు కత్తిపదునుతో రాచిన జోదుల బిడ్డగా భాసించును. ఈ పరిత్యక్తజీవి పరిదీనముఖుఁడయ్యును బూర్వాంధ్రదేశపరిపాలనాపిశునరావర్చస్విగా గోచరించును. అతఁడతనిని జూచినపుడు సుమంత్రునకు రామచంద్రుఁడు కనిపించినట్లే యుండును. హరప్పకు ధర్మారావును జూచినప్పుడెల్ల నానందముగా నుండును. ఆ యానంద మెట్టిదో

యతఁడు విమర్శించుకొనలేదు. విమర్శించుకొనుటకుఁ బరిచయము చాలదు. ఆయువు చాలదు. కాలము గడువవలయును.

కొంతసేపు కూర్చున్నతరువాత ననలేక ననలేక 'తమకు జీత మెంత కావలయు?' నని హరప్ప యడిగెను. ధర్మారావు తన కేమియు నక్కఱలేదని, తనవంశమునకు వారివంశమునకుఁ గల సంబంధము కథగా హరప్పతోఁ జెప్పెను. హరప్ప మనస్సులో ధర్మారావు చెప్పిన కథయంతయు స్వర్గకథవలెఁ దోఁచెను. ధర్మారావు చివరకు 'మీరు వేణుగోపాలస్వామికి ధర్మకర్తలు. మీ రా ధర్మకర్తలుగ నుండినచో నా కది యిచ్చినట్లే. నేను బి. ఎ. పరీక్ష యిచ్చితిని. ఎచ్చటనైన నలువది రూపాయల జీతము తెచ్చుకొనగలను' అనియెను. హరప్ప 'యింతేనా' యనెను. రోజంతయు జెప్పిన నెలకు నలువది రూపాయలేనా? నాకు మా దొరగారు రోజునకు గంటమైన జెప్పఁడు. చాలభాగము నా కావస్తువులు నీ వస్తువులు చూపించుటతోడనే కడపును. ఆయనకు నెలకుఁ బన్నెండువందల రూపాయల జీతమిచ్చుచున్నాముకదా? రోజెల్లఁ జెప్పినందుకు మీ కంతమైన నీయరా?' యనెను. ధర్మారావు నవ్వి 'తమకుఁ జిన్నతనము. పెద్దమైనతరువాతఁ దెలియు' ననెను.

తరువాత మరల ధర్మారావుజీతమును గుఱించి ప్రస్తావన రాలేదు. హరప్ప యతనితో సంభాషణమాత్రమే చేయును. ధర్మారావు బలవంతముగాఁ జదువు చెప్పును. హరప్ప నానాఁటికిఁ బరమకుశాగ్రబుద్ధివలెఁ గన్పించెను. తరువాత నెలనాళ్ళకు ఈట్సను దొరగారు హరప్పను వట్టి మందమతి యనుకొనెను. ధర్మారావు హరప్పను గొప్పమేధావి యనుకొనెను. హరప్ప దొరను జీతగాఁ డనుకొనెను, ఉపాధ్యాయుఁ డనుకొనెను; ధర్మారావును మిత్రుఁ డనుకొనెను, మహోదారుఁ డనుకొనెను.

వంతెన మఱలఁ గట్టబడి శశిని రంగారావులు చెన్నపురికిఁ జేరిరి. గుడివాడసీమనుండి క్రొత్తనారు తెచ్చి, బీడువడ్డ పొలాలు మఱల దమ్ముచేసి యూడ్చిరి. ఆ పైరును మూర్ఖుఁడైన ధనవంతుఁడు పెండ్లిపీఁటలమీఁదవలె వెలతెలఁబోయెను-అది పండిననాఁడు; గల్లా కుంచాలతోఁ గొలిచిననాఁడు!

పురపాలకసంఘసభ మాటల సమావేశమయ్యెను. రయితుల పక్షపు సభ్యుఁడు 'పైరంతయు యథాయథ లయ్యెను. ఈసంవత్సరమున మట్టి పోఁగుచేసికొనవలసినదే! ఈ యేఁటిపన్నుగూడ ముందు నాఁటికే వసూలు చేయవలయు' నని తీర్మానము పెట్టెను. రాచరికపు సభ్యులు కాదని వాదించిరి. 'మొదటి యేఁటనే వాయిదా తీర్చక పోయినచో రాచరికమువారికి మనమీఁద విశ్వాసము కుదురదు. ఎట్లోయట్లిచ్చియే తీరవలె' ననిరి. కాని వోటుకుఁ బెట్టఁగాఁ బ్రజా పక్షమే గెలిచెను. గ్రామమంతయు సంతోషించెను.

చంద్రారెడ్డికి సభాధ్యక్షుఁడుగాఁ దా ననుకొనినంత స్వతంత్రతఁ గాదని తెలిసెను. ఏల యనఁగా నొక మినహరీసభ్యుఁడు తాను ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా వాదించినను వోటు మాత్రము ప్రజానుకూలముగానే యిత్తుననియు, చంద్రారెడ్డిగారిని గూడ నట్లే యిమ్మనియుఁ జెప్పెను. చంద్రారెడ్డి 'నాకు నీ హితము చెప్పుట యెందుకు? నే నెట్లును ప్రజ కనుకూలముగానే యిత్తు' ననెను. మినహరీ 'మిమ్ము రాచరికమువా రేర్పాటు చేసిరి. మీరు వారియందే గౌరవము చూపవలయును. వారు చెప్పినట్లే నడువవలయు' ననుట ధ్రువపడెను.

పసిరికకుఁ బదునాల్గేండ్లు. అతఁ డదివఱ కెన్నడును జిల్లున చీది యెఱుఁగఁడు. వఱద వచ్చిననాఁ డతనికి జ్వరమువచ్చెను. మంగ డాక్టరును దీసికొనివచ్చెను. డాక్టరు చేయిచూచి, సీసా యొకటి పుచ్చుకొని యాసుపత్రికి రమ్మని మంగతోఁ జెప్పి తాను బోయెను. మంగ వెళ్ళి మందు తెచ్చెను. పసిరికను త్రాగు మనెను. పసిరిక మందు పాఱఁబోసి చిఱ్ఱుబుస్సులాడెను. కొడుకు పుట్టినప్పటినుండి పాముభయ మెఱుఁగనిమంగ కదిమొదలు పసిరికజ్వరము తగ్గువరకు పామన్నచో భయముపుట్టెను. మందు లేకుండనే పదిరోజులలో జ్వరము తగ్గెను. తగ్గెనుగాని పసిరిక బలిసెను జ్వరమువచ్చిన చిక్కిపోవును. పసిరిక బలిసెను. అతనికిఁ బూర్వము శరీరరేఖలు కనఁబడెడివి కావు. అవురుగడ్డికాఁడ నడచుచున్నట్లుండెడివాఁడు. ఇప్పు డతఁడు నడచు వేళ పచ్చివాసము నడచుచున్నట్లుండెను. బలమో, దొందమో! మనిసి నిలచి నడచుచుండెను.

ధర్మారావు కోటకు వచ్చెను. హరప్పయు, నతడును గలసి సాయంవాహ్యాళికిఁ బోయిరి. తక్కిన రాజబంధువుల కిది యిష్టము లేదు. కాసావాంద్రకు నిష్టము లేదు. కాని శశిరాక మొక్క నెల్ల రకును నాచారములయందు సడలుట కొద్దిగా కలవాటయ్యెను. అందుచే వారి సాయంవాహ్యాళి యెవరిమనస్సునుండియు బయటకు రాలేదు.

హర—మన స్వామిని నే నెప్పుడును జూడలేదు. ఆయన యెట్లుండును? కాదు, కాదు - చూచితిని. మాయమ్మగారి వెంట నొకసారిపోయి చూచితిని. మా తాతగారివలె నుండును.

ధర్మా—పూర్వము స్వామికిఁ బ్రతిసంవత్సరమును గల్యాణములు జరిగెడివి. కృష్ణమనాయఁడుగారు బ్రతికియుండఁగా చివరి నాలుగేండ్లు కల్యాణములు చేయలేదు. ఐదవయేఁట వారు చేయించవలయు ననుకొనిరి. వైశాఖమాసములోఁ గల్యాణము. వారు మాఘమాసములోనే పోయిరి.

హర—నేను పెద్దవాఁడనై నతరువాత మరలఁ జేయించెదను.

ధర్మారావునకు హరప్పను ముద్దాడవలె ననిపించినది. ఆతని యొడలిలో రాచనెత్తు రున్నది. అతనిని దాను స్పృశించరాదుకనుక మనసులోనే ముద్దాడెను.

ధర్మా—నేను నాలుఁగైదురోజు లూరిలో నుండను. కృష్ణా పుష్కరములు వచ్చినవి. బెజవాడకుఁ బోయి పుష్కరములు పెట్టుకొని రావలయును. సెలవిప్పించవలయును. హర—పుష్కరములు పెట్టు టనఁగా నేమి? ధర్మా—బృహస్పతి పన్నెండు సంవత్సరముల కొకసారిగా నొకానొక నదీజలమును సమాకర్షించును. తత్సంయోగముచేత నా నదీజలమునం దితరసమయములందు లేనిశక్తి లుద్భవిల్లును. సర్వదేవత లా జలమున సన్నిహితులై యుందురు. ఆ సమయమునఁ బితృదేవతలకుఁ దర్పణాదికములు వదలినచో నదియెక్కువ ఫలమునిచ్చును మానాయనగారు చనిపోయిరి గనుక, నే నాయనకుఁ బుష్కరములు పెట్టవలయును. హర—మా యమ్మగారు చనిపోయిరి గదా! నేనును బెట్టవలయునా? అయినచో నేనుకూడ వత్తును. ధర్మా—మీ నాయనగారు కర్మలమీద నమ్మకములేనివారు. మీ

రట్లు చేసినచో వారికిఁ గోపమువచ్చునేమో! పైఁగా నేను మీచేత నా యిష్టమువచ్చినట్లు చేయించుచుంటి నని యనుకొనవచ్చును. అదియుఁగాక రాణిగార్లకు మాసికములే లేవు. పదునేనురోజుల కర్మయే జరుగలేదు. శాస్త్రప్రకార మైనచోఁ దమ కాశౌచమే వదలలేదు. మీ రీసమయమునఁ బుష్కరములు పెట్టరాదు. హర—అయినచో నే నిప్పు డేమి చేయవలయును? ధర్మా—ముందు కర్మ చేయవలయును. చనిపోయినవారు ప్రేతము లగుదురు. అనఁగా నది యొక యాకారము. మనకుఁ గనఁబడరు. వారు నల్లని గుజ్జురూపులై యీ శరీరములలో నుండలేక చాల బాధపడుచుఁ బుత్రులు తిలోదకములు వదలి తమ కా రూపము తీసివేయుదు రని యెదురుచూచుచుందురు. మనము కర్మచేయనిచోఁ బ్రేతత్వవిముక్తి లేక వారు గాలిలో భూతములై యల్లాడుచుందురు. హర—నన్ను మాదొరగారేదియో యడిగిరి. ఇంత విస్పష్టముగాఁ గాకపోయినను జచ్చిపోయిన వానినిగుఱించి యాయనతో నే నేదో చెప్పితిని. మే మీరీతిగా నమ్మెదమంటిని. ఆయన 'యివన్నియు పిచ్చియూహలు. బ్రాహ్మణులు ధనము దీసికొనుట కివి యేర్పఱచిరి. చచ్చినవారు ప్రేతములై యుందు రని మన కెట్లు తెలియును?' అని యన్నారు. అవును, చచ్చినవా రిట్లుందురని మన మెట్లు చెప్పగలము? ఉందురో, లేరో! ధర్మా—బాబుగారూ! అట్లుగాదు. అట్లయినఁ బ్రతిమతములోను ప్రత్యక్షము కానివి చాల నుండును. అప్పు డేమతములోనను దేనిని నమ్మ నక్కఱలేదు. ఒకఁ డొకదానిని విశ్వసించినచో మఱొకఁ డింకొకదానిని విశ్వసించును. చనిపోయిన జీవాత్మల నన్నిటిని యేసుక్రీస్తు ఎప్పుడో భవిష్యత్కాలమున మఱల లేవఁదీయునని క్రైస్తవులు విశ్వసింతురు. అట్లే మఱెన్నియో విషయములను విశ్వసింతురు. మన పూర్వర్షులు చెప్పినవానిని మనము విశ్వసింతుము.

మఱునాఁడు ధర్మారావు బెజవాడ పోయెను. పుష్కరములు పెట్టెను. పెట్టిన మఱునాఁడు సూర్యపతియు, ధర్మారావును గలసి యూరివెంటఁ దిరుగుచుండఁగా సూర్యపతి యెఱిఁగిన యొక పెద్ద మనిసి కనఁబడెను. ఆయనపేరు పశుపతి. పశుపతికి సూర్యపతి ధర్మారావును జూపించి 'యీయనేనండి ధర్మారా' వని చెప్పెను. పశుపతి

నమస్కారముచేసి 'అయ్యా! తమ పేరు వినుటయేకాని, చూచినది లేదు. మీ కవిత్వము పత్రికలలోఁ జూచుచునే యున్నాను. మీ రచన నాకుఁ జాల బాగుండు' ననెను.

రాత్రిపదునొకటిరు ముప్పురును గలసియే తిరిగిరి. పశుపతి, ధర్మారావు లిద్దరును నేదో ఫలహారముచేసి యారాత్రికి భోజనము మానివేసిరి. ముగ్గురును సూర్యపతి మేడమీఁద శయనించిరి. నాటక ప్రదర్శనములు, కవిత్వము-కాలమంతయు వీని విమర్శతోనే సరిపోయి నది. రాత్రి నిద్రపోవువేళకుఁ బశుపతి ధర్మారావుతో 'నీ వింక నిద్రపొమ్ము. నాకు నిద్ర వచ్చుచున్న' దనెను. అని వెంటనే 'క్షమించవలెను, క్షమించవలెను నోరు జాతి 'నీ' వని వచ్చినది.' అని యనఁగా ధర్మారావు 'కాదు, కాదు. మన మిద్దఱము నింక నీ వనియే యనుకొనవలయు' అని, మిగిలిన నాలుఁగు మాటలును తాను 'నీ' వనుచునే యాడెను. ఇద్దఱును నిద్రించిరి. మఱునాఁడు మేల్కనిరి. ధర్మారావు నొడిలో పశుపతి కూర్చుండి 'యింక నిద్రలే' యనుచుండఁగా ధర్మారావునకు మెలఁకువ వచ్చి మేల్కొలుపుచున్నది సూర్యపతి యనుకొనెను. కన్నులు తెఱచి పశుపతిని జూచి కౌఁగిలించుకొనెను. పశుపతి కిరువదిరెండేండ్ల వయస్సు. ధర్మారావున కిఱువదినాలుగేండ్లు. వారి యా తొలి కౌఁగిలింత పురానుభూతమై, పాతికయేండ్ల వ్యవధి కలిగిన దానివలె పునఃప్రాప్తిలో వ్యవధిగతమహాశాపరిపూర్తికృతసౌఖ్య మంతయు సాంద్రముగా గోచరించినది. కౌఁగిలివదలి యా బాల్య మిత్రులవలె వా రొకరివంక నొకరు చూచుకొనిరి. మఱునిముసము నుండి వారి పరస్పరప్రవర్తనములోఁ గ్రొత్తఁదనముగాని, తద్గత భావముగాని, తత్స్మృతిగాని లేకుండఁబోయెను. ఆ సాయంకాల మునఁ బశుపతి ధర్మారావును దమయూరు రమ్మని యడిగెను. అతఁ డంగీకరించెను.

ముగ్గురును గలసి తాడేపల్లిగూడెము దగ్గఱ రైలుదిగి మోటారుమీఁద 'ఉండి' పోయిరి. 'ఉండి' చేరినంతనే ధర్మారావు 'నీ ఉండిలోనా యుండి, నా కిన్నాళ్ళనుండి కనిపించితివి కా'దనెను. ఇద్దఱును జేతులుపుచ్చుకొని నడచుచుండిరి. పశుపతి ధర్మారావు

చేయి స్నేహసూచకముగా నలిపెను. పశుపతి ధనవంతుఁడు. స్కూలుఫైనలుప్యాసై యూరకేయుండెను. అతనికి సాలునకు నాలుగువేలు వచ్చును. వారియిల్లు రాజభవంతి. వారి పూర్వులు కొద్దిలో జమీందారులు. అది క్షత్రియుల దేశము. అచ్చటనున్న పశుపతి పూర్వులుగూడ నగ్రహారీకులగుటచే రాజులవలెనే యుండిరి. వారియింటిలో రాచమర్యాదలన్నియు సాఁగుచుండెను. సూర్యపతి ధర్మారావు లిద్దఱును బశుపతియింటిలో సొంతయింటిలోకన్న నెక్కువగా నుండిరి. వారచట మూఁడురోజులుండిరి. ధర్మారావు తనపద్యములన్నియు వినిపించెను. పశుపతి ప్రీతిదానికిని సంతోషించెను. ఒకనాఁడు రాత్రి ధర్మారావు భాగవతములోని ప్రహ్లాద చరిత్ర చదివెను. పశుపతి 'ఆహా! యెంతచక్కగాఁ జదివెదవు! తెలుఁగుపద్యము నీవలెఁ జదువువాఁడు దేశములో లేఁడు' అనిమెచ్చుకొనెను. పశుపతి యాడిన ప్రతిమాటయు ధర్మారావు హృదయమునకు సంతోసమే కల్పించుచుండెను. ధర్మారావుచేసిన ప్రతిపనియుఁ బశుపతికి మెచ్చుఁదలనే కల్గించెను.

ఆ మూఁడురోజులలో నొకనాఁడు ధర్మారావు నూతిదగ్గర స్నానము చేయుచుండెను. స్నానములగదిలోఁ బెద్ద రాతితొట్టి నిండఁ జన్నీళ్ళు తోడియున్నవి. ప్రక్కనే పెద్దకాఁగుతో వేడి నీళ్ళు కాఁగుచున్నవి. సబ్బులు, సీకాయ, సున్నిపిండి ప్రక్కబల్ల మీఁదఁ గలవు. దణ్ణెముమీఁద తువాలులు, ధోవతులు నుదికినవి వ్రేలాడుచుండెను. ధర్మారా వేదియోయూహించుచు వేన్నీళ్ళను చన్నీళ్ళను నన్నియుఁ బోసుకొనెను. మడికట్టుకొని పశుపతి యితఁడు వచ్చునని యెదురుచూచుచుండెను. ఇతఁ డేమో రాలేదు. వాకిట నొకగదిలో సూర్యపతి కన్నము వడ్డించిరి. అతఁడు భోజనము చేయుచుండెను. వంటయింటికిని, స్నానాల గదికిని గొంచెము దూరము. ధర్మారావును పిలిచి రమ్మని పశుపతి చెప్పెను. అందరును మడికట్టుకొనిరి. అందుచే పశుపతిభార్య పోవలసివచ్చెను. ఆమె పే రనసూయ. ఆమె స్నానాలగదివద్దకుఁ బోయి చూచెను. ధర్మారావు నీళ్ళయిపోయి చేతిలోఁ జెంబుపుచ్చుకొని గోడవంకఁ జూచుచు నూరకే కూర్చుండెను. అనసూయ క్రొత్తవాఁడగుటచేత

మాటాడుటకుఁ గొంకి, యతనికిఁ గనుపడునట్లు ముందుగాఁబోయెను. ఆమె తారాడుట తా నాలస్యముచేయుటచేఁ బిలుచుటకు వచ్చుటగా గ్రహించి ధర్మారావు 'అమ్మా! వచ్చుచున్నా' ననెను. అతని సౌమ్యమైన వాక్కునకును, బలికినరీతికిని నామెకు ధైర్యము కలిగి, 'మీ కోసమెదురుచూచుచున్నారు' అనెను. ధర్మారావు నవ్వుచు 'మీయాయన కాఁకలి యెక్కు వమ్మా!' యనెను అనసూయ నవ్వెను.

ఆ నాఁడు సాయంకాలము ముగ్గురును షికారుపోయిరి. పశుపతి సూర్యపతులు కాలువవెంటఁ బైదాఁక పోయిరి. ధర్మారావు కొంచెము సుస్తీగానుండి కూర్చుండలేక, వారివెంటఁ బోక, పండుకొందమని యింటికి వచ్చెను. ఇంటివద్ద నెవ్వరును బరిచారకులు లేరు. పశువులను గట్టివేయుటకుఁ గొందఱు, పాలను దీయుటకుఁ గొందఱు పోయిరి. ప్రక్కలు వేయు చాకలి లాంతరులతోఁ జమురు పోయుచుండెను. సావడిలో నుయ్యేలబల్లమీఁద ధర్మారావునుండెను. తలక్రింద దిండులేక యతనికి పండుకొనుట సుఖమనిపించలేదు. అనసూయ యప్పు డచ్చటికి వచ్చెను. ఆమె యతనిని జూచి లోనికిఁ బోఁబోయెను. ధర్మారావు 'అమ్మా! దిండొకటి తెప్పించి యిత్తువా!' యనెను. అనసూయ తానే తెచ్చియిచ్చెను. దిండుపుచ్చుకొనుచు శిరోబాధచేత ధర్మారావు 'అబ్బా' యనెను. అనసూయ 'అన్నా! తలనొప్పియా' యనెను. ధర్మారావు 'అవునమ్మా' యనెను. మూఁడవ రోజున ధర్మారావు వెడలిపోవుచు నింటిలోనికిఁ బోయి యనసూయతో 'తల్లీ! వచ్చెద' నని చెప్పెను. ఆమె 'వదినెగారి నడిగినానని చెప్పవలయును. మీ రిద్దఱును మా యింటి కెప్పుడైన రావలయును' అన్నది. పశుపతి ప్రక్కనే నిలుచుండెను. అతఁడు 'అవును, మీరిద్దఱును రావలయును. ఎప్పుడు వచ్చెదవు, చెప్పుము' అని బలవంతపెట్టెను. ధర్మారావు 'వచ్చెదములే' యని యెలయించఁ జూచెను. కాని పశుపతి బలవంతపెట్టెను. అనసూయ గర్భిణి ఆమె కాఱవనెల. ఆమె కది తొలిచూలు. ధర్మారావు 'నీకు కొడుకుపుట్టినతరువాత వచ్చెద' మనెను. పశుపతి 'కాదోయి! నాకు కూఁతురే పుట్టును.ఎవరో జ్యోతిష్కుఁడు చెప్పినాఁ'

డనెను. అనసూయ నిలువెల్ల సిగ్గయిపోయెను. పశుపతి 'యది యింక నాలుగు నెలలమాట. ఈలోపుగనే రావలయు' ననెను. సిగ్గుపడిన యనసూయనుండి బలవంతము రాలేదు. స్నేహితు లిద్దఱును నవ్వుచు బయటికి వచ్చిరి. ముగ్గురును మోటారువద్దకు నడచి పోయిరి. కొంచెముసేపటికి మోటారురాఁగా సూర్యపతి ధర్మారావు లిద్దఱును మోటా రెక్కిరి. పశుపతి దిగఁబడెను. మూన్నాళ్ళనుండి యనుభవించిన యొక యవ్యవహితమైన, యనిర్వచనీయమైన యానందరేఖ యెడమిచ్చిన ట్లయ్యెను.

పశుపతి రాత్రి యింటికిఁబోయి, స్నానముచేసి పరుండెను. అనసూయవద్దకు వచ్చెను. పశుపతి 'ధర్మారావు నీతోఁ జెప్పుటకు వచ్చెనే, మీరిద్ద ఱెప్పుడు మాట్లాడితి' రనెను. అనసూయ 'నిన్న భోజనమువేళకు నెంతసేపటికి రాలే దని నే నతనిని బిలుచుటకుఁ బోయితిని. అప్పు డొకసారి; నిన్నఁ దలనొప్పితో నుండి మీకన్న ముందు వచ్చెను. అప్పు డొకసారి' అనెను.

పశు—అతఁ డెంత మంచివాఁడు! ఇన్నాళ్ళుగా నే నతని నెఱుఁగకపోవుటయే చాల చిత్రముగా నున్నది. అతఁడు నా కేల కనఁబడలేదో యింతవఱకు? అతఁడు కవిత్వ మెంత సొగసుగా వ్రాయు ననుకొన్నావు? అతఁడు పద్యము చదువుట మొన్న వింటివి కదా!

అన—వీని యన్నిటికన్న నతనిమంచితనమే నా కాశ్చర్యముగా నున్నది.

సూర్యపతి ధర్మారావులు బెజవాడ స్టేషనులో దిగిరి. రాతిరి రెండు జాము లయ్యెను. స్నేహితు లిద్దఱును బుష్కరములు పెట్టుటచే మీసములు గొరిగించుకొనిరి. ధర్మారావునకు క్రాపింగే లేదు. సూర్యపతి క్రాపింగు తీయించెను. ఇద్దఱును జేటయొక జత బట్టలతో ఉండికిఁ బోయిరి. రోజువారీచాకలి యొుండుకాలువలో నుదికిన వారిబట్టలు నీరుకావి యెక్కెను. చొక్కాలు ముడుతలు వడి యుండెను. కాలువలో నుదుకుటలో నిస్త్రీబిగువు పోయెను. ఉండి నుండి తాడేపల్లిగూడెమువఱకును మోటారులో వచ్చుటచేత మూఁడురోజులు సరిగా నిద్రలేకపోవుటచేత నిరువురి మొగములును

వాడియుండెను. టిక్కెట్లిచ్చుచోటికి వచ్చునటుకుఁ బుష్కరములు పెట్టివచ్చిన కొందఱుభక్తులమధ్య వీరిర్వురును జేరిరి. వీరిని పల్లెటూరివారనుకొని టిక్కెట్టుకలెక్టరు టిక్కెట్టులటు నిటు త్రిప్పి 'యీ టిక్కెట్టుమీఁద నేఁటితారీఖు లేదు మీరచట నిలువుండుఁ' డనెను. ధర్మారావునకుఁ గోపము వచ్చెను కాని యేమిచేయును? నిలుచుండనే వలయును. అందరును వెళ్ళిపోయినతరువాత టిక్కెట్టుకలెక్టరు వీరి నిర్వురిని తనగదిలోనికిఁ దీసికొనిపోయి రాజమహేంద్రవరమునుండి రెట్టింపుచార్జి చేసెను. ఇద్దఱును బోయి స్టేషనుమాస్టరుతో ఫిర్యాదుచేసిరి: 'తమ టిక్కెట్లు మంచివే. టిక్కెట్టుకలెక్టరే దుర్మార్గము చేసె' నని చెప్పిరి. స్టేషనుమాస్టరు వీరిమాటలు నమ్మలేదు. ధర్మారావు సూర్యపతితో 'నిదియంతయు నొక దొంగలముఠా. వీరిలో వీరికి భాగములు కలవు కాఁబోలు! మనమాట యేల నమ్ము' ననెను. మాస్టరునకుఁ గోపము వచ్చెను. తరువాత పోట్లాడుకొనిరి. 'మావద్ద డబ్బులేదు. మీ రేమి చేసికను సరే' యని ధర్మారావు మొండికెత్తెను. చాలసేపటికి ధర్మారావు బి. ఏ. పరీక్ష మైనవాఁడనియు, సూర్యపతి ధనవంతుఁడనియు మాటలసందర్భమునఁ దెలిసికొని వారిని వదలిరి. ధర్మారావు 'బాటసారుల నిట్లు బాధపెట్టుట న్యాయముకా' దనియుఁ, 'బ్రజల సొమ్ముతో బ్రతుకుచుఁ బ్రజల నిట్లు బాధపెట్టుట యీ దేశమునందు నీ కాలమునందే సరిపోయిన' దనియుఁ, 'బెద్దపెద్దస్టేషనులలో నీ టిక్కెట్టుకలెక్టర్లు చేయునాగడములకు మితిలే' దనియు నోటికివచ్చినట్లెల్ల విదలించెను. ఇదియంతయు వారిమీఁద దున్నపోతుమీఁద వానకురిసిన ట్లయ్యెను. మనిసి నోరుకలవాఁడు, చదువుకొన్నవాఁడు, పైకి ఫిర్యాదుచేయగలవాఁడని తెలిసినంతనే దురధికారుల పెంకెతనము సడలును. తక్కిన వారిని వారు పెట్టుబాధలకు మితిలేదు. బాటసారులు సరిగాఁబోవుటకు వీలులేకుండ దారియంతయు వంకర టింకరులుగా నినుపకమ్ములు పాతి జానపదులకు గందరగోళముగాఁ జేసిరి. ప్రతిచోటును రక్షకభటులు జులుముచేయుటలోఁ దక్కువతిన్నవాఁ డెవడును లేఁడు. తరువాత నిర్వురునుగలిసి వంతెన దాఁటిరి. గుఱ్ఱపుబండ్లు నిలుచుచోటికిఁబోవుటకుముందు మఱల నినుపకటకటాలు దాఁటవలసి

వచ్చెను. అచటఁ బ్రత్యేకముగా వేసిన యొకపాకలో ముప్వురు మనుష్యులు నిలుచుండిరి. అందులో నొకఁడు 'ఏమ్, ఇటురా' యని ధర్మారావును బిలిచెను. అతఁడు 'వీనితో నే' మని పోవుచుండెను. కటకటాలత్రోవదగ్గఱనున్న రక్షకభటుఁడు 'వెళ్ళ వేమి' యని యదలించెను ఇద్దఱకును నిదురవచ్చుచున్నది. ప్రకృతి సహజముగా సాత్త్వికము. అందుచేత 'నీ దౌర్భాగ్యులతో నే' మని యా మొదటివాఁడు పిలిచినచోటికి వెళ్ళెను. సూర్యపతి యనుసరించెను. అక్కడ నొక బల్లమీఁద నొక పుస్తక ముండెను. కలరాటీకాలుపొడుచు సాధనములమర్చఁబడి యుండెను. పిలిచినవాఁడు వా రిద్వురను జూచి 'టీకాలు వేయించుకొని పొండు' అనెను. ధర్మారావు 'పుష్కరములన్నియు నయిపోయినతరువాత నిప్పు డేమి టీకాలు? ఈ టీకాలు వేయించుకొనినందువలన జ్వరమువచ్చి నేను బాధపడవలయునా? అసలు నాకు వ్యాధివచ్చినను రాకపోయినను నీ టీకాలు వేసుకొనుటమూలమున వచ్చినచోఁ దప్పక రావచ్చును. నేను వేసికొన' ననెను. ప్రక్కనున్న యింకొకఁ డేదో పత్రిక చదువుచు 'వేసుకొని తీరవలయు' ననెను. ధర్మారావు తీక్ష్ణముగా వానివంకఁ జూచెను. వాఁడు తలయే యెత్తలేదు. మొదటివాఁడు ధర్మారావుతీక్ష్ణదృష్టి, వాఙ్నిశ్చలత్వము జూచి మెత్తబడి 'అయ్యా! కాదు, వేసికొనుఁ' డని బతిమాలినట్లనెను. ధర్మారావు 'దారిఁబోవు బాటసారుల నిట్లిబ్బందిపెట్టుట యోగ్యముగా లేదు. ఆహా! దైవ మెంత వక్రించెనో కాని, యీ దేశమునఁ బ్రతిపదమ్మునసుఖయాత్రయే దుర్ఘటమ్మగా నున్నది'యనెను. అతఁడు 'చిత్తము. పొండు పొం'డని పంపించెను. కటకటాలు దాఁటి పోవువేళకు రక్షకభటుఁడు 'ఏయూరు నీది? ఎవరు నీ' వనెను. ధర్మారావు 'ఒడలు దగ్గఱఁబెట్టుకొని మాటలాడుము' అనెను. వాఁడు 'బాబయ్యా! చిత్తము, చిత్త' మనెను. ఇంటికిఁబోయి పండుకొనువఱకు మూఁడుగంటలయ్యెను.

మఱునాఁడు ధర్మారావు సుబ్బన్నపేఁట చేరెను. ఇంటిలో మఱలఁ బూర్వపురీతియే కనఁబడెను. ఇల్లు జరుగుట యిబ్బందిగాఁ దోఁచెను. ఇంతవఱకు సూర్యపతి యిచ్చిన ధనముతోనే సంసారము సాఁగించెను. హరప్పనాయనికిఁ జదువుచెప్పినందువలన నేమైన వచ్చు

నేమో యని యూశపడెను. కాని సమయమున కౌదార్య మడ్డువచ్చి యటనుండి పదిపదిహేనురూకలైన వచ్చుఫీలు చెడిపోయెను. సుబ్బన్నపేట పూర్వమువలెఁ గాదు. బస్తీకళ పడినంతనే ప్రతి వస్తువు ప్రియమైపోయెను. మును పదునేనురూకలతో సాగవలసిన సంసారమున కిప్పుడు పాతికరూపాయలు కావలసివచ్చుచుండెను. బియ్యము బస్తా యిరువదిరూపాయ లమ్ముచుండెను. రోజు గడుచుట దుర్లభ మగుచుండెను. ప్రాఁతబండారములో మిగిలినపదిరూపాయలు పుష్కరమున కప్పఁజెప్పివచ్చెను. ఇట్లు పపూట కాపూట చేతప్పుల మీఁదఁ గడచుచుండెను. మార్గ మేదియుఁ దోఁచినది కాదు. ఆరోజు ప్రొద్దుగ్రుంకెను.

మఱునాఁడు జాముప్రొద్దెక్కి హరప్పనాయనివద్దకుఁ బోయెను. నాయఁడు తనగదిలోఁ గూర్చుండెను! ఉప్పు, పప్పు, బెల్లము, బియ్యము, తక్కినసామగ్రియుఁ బెద్దపళ్ళెకలలోఁ బెట్టబడి నాయని సమీపమున నుండెను. ధర్మారావు పోయినంతనే హరప్ప లేచి నిలుచుండి 'యెప్పుడు దయచేసితి' రనెను. ధర్మారావు 'నిన్న' నని చెప్పి, యీ సామాగ్రియంతయు దేని కని యడిగెను. హరప్ప సమాధానము చెప్పలేదు. ఇరువురు నేవో మాటాడుచుండిరి. ఇంతలో నిద్దఱుబ్రాహ్మణులు వచ్చిరి. హరప్ప 'అయ్యా! నేఁ డేకాదశి. మా యమ్మగా రేకాదశినాఁడేకదా పోయినది. నేఁడు మాసికమగుటవలన బ్రాహ్మణుల కీ సంభారము లిప్పించెదను. తమవద్ద సెలవు తీసికొందు' ననెను. ధర్మారావు నిర్వ్యాజబోయి నిష్క్రమించెను. హరప్ప గదిలో బ్రాహ్మణులు మంత్రములుచదివి మాసికము పెట్టించిరి. స్వయంపాకములు, సంభావనయుఁ గొనిపోయిరి. కోటలోనికి బ్రాహ్మణులు వచ్చుట, హరప్పనాయనిగదిలోనికిఁ బోవుట రాధాకృష్ణయ్యగారు చూచిరి. రంగన్న నడిగి వ్యవహారము తెలిసికొని, తనపినతల్లిమనుమఁడైన నీ మాత్రము బుద్ధిమంతుఁడైనాఁ డని సంతోషించెను. రంగారావుగారి నైష్కర్మ్యసిద్ధితత్త్వము తక్కినవారికి నచ్చలేదు. కాని జమీందారున కెదురాడలేక యందఱు నతనినే యనుసరించిరి. హరప్ప మాసికములు పెట్టుచున్నాఁ డన్న కబురు కోటలో నానోట నానోట పాక్కి రంగారావుగారిచెవిని బడెను. ఆయనయు నిది

ధర్మారావు చదువుచెప్పుటచే వచ్చిన ఫలిత మని గ్రహించెను. కాని యేమియు ననలేదు.

ఆనాఁడు సాయంకాలము హరప్ప, ధర్మారావులు కలసి వాహ్యాళిపోయిరి. క్రొత్తగాఁ గట్టిన వంతెనపైఁ గూర్చుండిరి. హరప్ప యనెను: 'నేను మాతల్లికర్మ చేయలేదు సరికదా, యీ యేడెనిమిది నెలలనుండి మాసికమైనఁ బెట్టలేదు. మీదయవలన నీ నాఁడు మాసికము పెట్టితిని. కర్మచేయకుండ మాసికము పెట్టరాదేమో? అయినను నే నసమర్థుఁడను గనుకఁ జేతనైన పని చేసితిని. పెద్దనైన తరువాత కర్మ చేసెదను.'

ధర్మా—పెద్దయినతరువాత నెన్ని చేసెదరు? అటు దేవుని కళ్యాణము చేయవలయును. ఇటు తల్లిగారికి, నాయనమ్మగారికిఁ గర్మలు చేయవలయును. పేదవారిని బోషించవలయును. రాజ్య మేలుకొనవలయును. చెడిపోయినది ప్రతిదినము బాగుచేసికొనవలయును. ఎంత కష్టము! హర—మీ రుద్యోగము కుదుర్చుకొందు నంటిరిగదా! ఎప్పుడు? ధర్మా—ఎచ్చటనో కుదుర్చుకొనవలయును. ఇంటిలోఁ జాలబాధగా నున్నది. ఏపూఁట కాఁపూట యిక్కట్టుగానే యున్నది. ఇద్దఱును రాత్రి పొద్దుపోవువఱకు మాటలాడి కూర్చుండి యింటికి బయలుదేఱిరి. రంగన్న యద్దాలబండితో నెదురు వచ్చెను. ఇరువురును దానిలో నెక్కిపోయిరి. ధర్మారావు కోటవద్ద దిగి తనయింటిదారి పట్టెను.

హరప్ప మఱునాఁ డుదయమునఁ దండ్రిని జూడఁబోయెను. తండ్రి చెన్నపురినుండి వచ్చి మూనాళ్లయినది. శశిని రాలేదు; ఆయన యొక్కఁడే వచ్చెను. వచ్చినకుమారుని దండ్రిపరామర్శించి వార్త లేమి టని యడిగెను. హరప్ప 'దివాణములోనుండి ధర్మారావు గారియింటికిఁ గావలసిన సంబారము లేనెల కానెల పంపించుచుండవలె' నని మనవిచేసెను. తండ్రి యూరకొనెను. హరప్ప తనగదికి వచ్చెను. ఆనాఁడు ధర్మారావు కోటకు రాలేదు. మఱునాఁ డుదయమున వచ్చెను.

ధర్మా—తమరికిఁ జదువు చెప్పినందుకు నే నేమియుఁ బుచ్చుకొన నని చెప్పితినిగదా! మఱల మీ రిది యేమిటి? హర—ఏ

మున్నది? ఇందు విశేష మేమియును లేదు. ఇది మీ కొక యిచ్చుట కాదు. నేను బ్రదికియున్నంతవఱకు మీకు నాకు నిది త్రెంచరాని బంధము. మీరు కాదనరాదు.

ధర్మారావు హరప్పమాటలు వినినపుడెల్ల నాశ్చర్యపోవును. కుఱ్ఱవానికిఁ బదునొకండవయేఁడు వచ్చినది. లోకజ్ఞునివలె, హృదయ కష్టము లెఱిఁగిన జీవివలె, సమార్ద్రచిత్తునివలె మాటాడును. అహో! సంస్కారబలము!

ధర్మా—మనయూరిలోఁ గాలేజి బెట్టెదరఁట. నాకు అందులో నేదైన నుద్యోగము దొరకినచో బాగుండును.

హర—అది యీ సంవత్సరము జరుగదు. ముందునాఁటికి గదా! దివానుగారికిని మీకును బరిచయము కలదా?

ధర్మారావు మాటాడలేదు. రంగారావుగారు చెన్నపురిలో నుండగానే కళాశాలయూహ తోఁచినది దానికి నాగేశ్వరరావుగారి ప్రోద్బలము. నాగేశ్వరరావుగారు మొదట ఎల్. టి. చదివి, తప్పి, తరువాత బి. యల్. ప్యాసైరి. ఆయన విద్యార్థిదశలో బహుమేధావి, మెట్రిక్యులేషను, ఎఫ్. ఏ., బి. ఏ. లు మూఁడును దరగతులలోఁ బరీక్ష నిచ్చెను. మెకాలే, కార్లైలు, షేక్సుపియరు, మిల్టను లాయ నకుఁ గంఠపాఠము. ఇంగ్లీషుభాష యమోఘముగా వ్రాయును. విద్యార్థిదశలో రంగారావుగారి కందుచేతనే నాగేశ్వరరావుగారి మీఁద సదభిప్రాయ మేర్పడినది. అందులో స్వకులుఁడు. నాగేశ్వర రావుగారినిగుఱించి చాలమంది మిథ్యావాదము లాడెదరు. ఆయన తల్లి నెవరో వెలమదొర యుంచుకొనెననియు, నీయన కలిగెననియు ననుకొందురు. విద్యాధిక్యముచే నాగేశ్వరరా వెట్టి లోపములనైనఁ నణఁచివేయగలఁడు. అతఁడు చిన్నప్పటినుండియు దయార్ద్రహృద యుఁడు. కాని దయయంతయుఁ దనకు నచ్చినవారియెడలనే చూపించును. అతని విశాలహృదయమున నది యొక్కటే లోపము. అతనికిఁ జిన్నప్పటినుండియుఁ దాను పెద్దవాఁడైనతరువాత గాలేజి యొకటి స్థాపించి, యది తాను నడుపవలయు నని యొక గొప్పవాంఛ. ఇంగ్లీషుభాషలో మహాకవు లున్నారు. వారి సారస్వత మంతయు

స్వతంత్రవాయు పరిపూరితము. తత్సారస్వతనిష్ణాతులకు స్వేచ్ఛాభావము లుగ్గుతోఁ బెట్టినపాలు. ఉన్న కళాశాలలలో నింగ్లీషుపరీక్షలకొఱకు, నుద్యోగములకొఱకుఁ జదువుచుండిరి గాని తద్గతమహార్థము లలవఱచుకొని యధీతి బోధాచరణ ప్రచారములచేతఁ, దామాదర్శకపురుషులై దేశమున సంస్కారము తెచ్చి ప్రాఁతవడి త్రుప్పుపట్టి పాతికములైన యీ హిందూమతసంప్రదాయములను నిర్మూలనముచేసి దేశము నభివృద్ధికిఁదెచ్చు నుద్దేశముతోఁ జదువుట లేదు. తాను పెద్దవాఁడైనతరువాత నట్లుచేయవలయు ననియనుకొనెను. సిద్ధసంకల్పుఁడుగనుక నను కొన్నట్లే కలసివచ్చెను. వచ్చిన క్రొత్తలోనే యీ మార్గ మవలంబించిన బాగుగా నుండదు. జమీందారు సర్వథా తనమాటయొద్దికలోనివాఁడు. విశాలమైన బుద్ధికలవాఁడు. ఏకజాతి ప్రవృద్ధి వాంఛించువాఁడు గాక, బహుజాతులమధ్య సామరస్య ముండవలయునన్నయూహ కలవాఁడు. దాని కుదాహరణముగా శశినినే పెండ్లాడెను. అట్టిరాజు తన కండగా నుండఁగా దా నిప్పుడు కళాశాల స్థాపించుట దుర్ఘటమైనపని కాదు. సుబ్బన్నపేఁటలో బురపాలకసంఘ మేర్పడనే యేర్పడినది. అందుఁ గళాశాలనుగూడ స్థాపించినచో నూరు సర్వవిధముల నాంధ్రదేశమున ప్రధాననగరములలో నొకటి యగును. కాని సుబ్బన్నపేఁటకు రైలు లేకపోయినచో విద్యార్థు లెక్కరు. ఆ ప్రయత్నముచేయుట కొంచెము కష్టమైనపని. ప్రయాణీకుల యొత్తిడిగలిగి తగినంత లాభమువచ్చు నని తెలిసినఁగాని కంపెనీవారు రైలు వేయరు. కాలేజి పెట్టినచో లాభమున కేమియు లోపముండదు. రైలుపడుటకును గాలేజిపెట్టుటకును దగిన యేర్పాటులన్నియు నాగేశ్వరరావుగారు చేసిరి. కాలేజికి రంగారావుగారు లక్షరూపాయలు విరాళమొసఁగి ప్రస్తుతము పురపాలసంఘ సభయున్న తమసౌధమును గళాశాలయుంచుట కిచ్చివేసిరి. అధ్యక్షునికొఱకుఁ దక్కిన యుపన్యాసకులకొఱకు నర్జీలుపెట్టుకొనుఁ డని పత్రికలలోఁ బ్రకటనలు చేసిరి.

క్రిస్టమసుపండుగలు వచ్చెను. గ్రామములోని క్రైస్తవులు మిషనరీలు పెద్ద యుత్సవము చేసిరి.

మార్గశీర్ష కృష్ణైకాదశి వచ్చెను. పెత్తనదారులు ముగ్గురును, దివానుగారును, శశినియు, రంగారావుగారు నందరును సుబ్బన్న పేటలోనే యుండిరి. ఉత్తరధ్రువ ప్రాంతమునం దున్నట్లు, ఆకాశ ముగం దమర్చిన యగోచరమైన యొక కేళకుళినుండి సన్నని నీటి తుంపురలు జలజల రాలినట్లు, శరదాతపములకు శ్రమపడిన గోదాంత రాళ మను పురుషునిశరీరమంతయు ముత్తెములవంటి చెమట పోసి నట్లు, చంద్రమండలార్గతసుధావలయికంబులలోని సుళ్ళు తిరిగి పురుగుతొలిచిన దూలమునుండి పొడివలె, నిఖిలదేవతాపరిభుక్త శేషామృతబిందుసంతానములు నెమ్మదినెమ్మదిగా జాఱినట్లు, మార్గ శీర్ష మాసాధిదేవత తెల్లనిపట్టువలిపము మేలిముసుగు దాల్చినట్లు, శక్తియుడిగిన వర్షామేఘపటలి ధారాపాతముగా భూమిని దడుపఁగల సామర్థ్యము పోయి చిలుపచిలుపగాఁ బుప్పొడివోని గాలిదుమారము వోని యల్పజలరేణువులను వదలినట్లు సన్ననిమంచు కురిసెను. మంగదొడ్డిలో గుమ్మడిపాదు పూచి, లోన బంగారుమలాముచేసిన భోజనపాత్రలవలె గుమ్మడిపూలు తత్కాలశోభయంతయుఁ దామె యాహరించెను. గుమ్మడిపూఁదేనె కొసరికొసరి తుమ్మెదలు విజృంభించి మకరఝుంకారపరిలీయమానపాత్రిత్రమందానిలతరంగమర్మర ములై పరవళ్ళుత్రొక్కెను. గణాచారి యన్నగారి దొడ్డిలోఁ బొళ బంతిపూలు, ముద్దబంతిపూలు, తెక్కబంతిపూలు వరుసలువరుస లుగాఁ బూఁచెను. ఆ వాసన గుమ్ముమని కొట్టి గూడెములోఁ బెండ్లిండ్లైనట్లుండెను. రత్నగిరిదొడ్డిలోఁ జంద్రకాంతములు సీతా రత్నములు చెలువు గులికెను. భగవంతుని కాదొడ్డి బృందావ నాధిక మనోజ్ఞమై, నాసాగ్రము లంటఁబొడిచి ఘ్రాణేంద్రియ ప్రవృత్తివల్ల నాఁచికొన సుమనోభిరామముగఁ దోఁచెను. గోపాల స్వామిగుడిలో వేళపాళయెఱుంగని సంపెగ పూవుపూచి యాకు చాటున నెచ్చటనో పూజార్థ మరిగిన యర్చకుని మిక్కిలియల యించెను. మిక్కిలి మంచుపట్టిన పైరు నామువేసిపోవునేమో యని జనులు భయపడిరి.

శశినికి మాత్ర మీ హేమంతబుతువు మనః ప్రలోభనకారి యయ్యెను. గగనమున శశికిఁ దేజః ప్రతారణకారి యయ్యెను. హరప్పనాయనికి మార్గశీర్ష కృష్ణైకాదశి పరిదేవనకారి యయ్యెను. ఆ నాఁ డుదయమున మఱల బ్రాహ్మణులు వచ్చిరి. మఱల మంత్రములు చదువఁబడుచుండెను. అవి నాగేశ్వరరావుగారి శ్రవోగోచరము లయ్యెను. అసంపిహితోర్ధ్వకాయులు, అప్రవర్ధమానకేశభారులు, వస్త్రాంచలాపరిక్షిప్తజంఘులు, ఆపాదూపాదులు, విభూతిరేఖావిభూషిత వక్షోహస్తులు, కక్షగతదర్భాంకురులు, శ్రవశ్శష్కులికాపరిలంబమానకుండలులు బ్రాహ్మణులు శశిని కక్షిగోచరులైరి. దివా నే మనుకొనెనో, దొరసాని యే మనుకొనెనో! ఆనాఁడు సాయంకాలమున హరప్ప ధర్మారావులు కలసి కోటవదలి పోవుచుండిరి. రాజు, దొరసాని, దివానులు పోవుచున్న యా యిద్దఱి వంకఁ జూచుచుండిరి. దివాను నేత్రములయందు సునిశితత్వము, నా యిద్దఱిలో నొకనియందుఁ బరాఙ్ముఖత్వము గోచరించెను. దొరసాని నేత్రములయందుఁ బరిహాసము, నిరాదరణ కనఁబడెను. రాజు నేత్రములయందు శూన్యభావమే గోచరించెను. తచ్ఛూన్యతలోఁ గొంచెము జాలియున్న దేమో తెలియరాదు.

మఱునాఁడు తెల్లవాఱినది. హిందువులుఁకల వీధులన్నియు సంక్రాంతిముగ్గులతో నిండిపోయెను. పురపాలకసంఘము లేనప్పుడు గ్రామబహిఃప్రదేశమంతయు మెరక యైనప్పుడు సుబ్బన్నపేట వీధులన్నియుఁ బరిశుభ్రముగా నుండెడివి. మెట్టనేల యగుట నీ రెచ్చటి దచ్చట నింకిపోవుచుండెను. వర్షపు నీరంతయుఁ బొలాల మీఁదికే పోవుచుండెను. వీధియంతయు సమానమై నిమ్నోన్నతములు లేక, నీరు వాకిళులముందు నిలిచెడిది కాదు. పురపాలకులు ప్రతివీధివెంటఁ గంకరపోయించిరి. వీధిమధ్య మెరకతేలెను. ఇండ్లముందరనుండి కాలువలు తీయించిరి. నీరంతయు నా కాలువలలోననే మిగిలియుండెను. ఊరిలో నందందు కాఫీహోటళ్ళు బయలుదేఱెను. పూటకూళ్ళ బస లేర్పడెను. అచ్చటి దుర్వాసన చెప్పుటకు వీలులేదు. వాకిళులయందు ముగ్గులు సరిగాఁ బెట్టుటకు లేక

పోయినను, వధువు లక్ష్మీ ముగ్గులు తీర్చిరి. బాలిక లక్ష్మీ గొబ్బిళులు పెట్టిరి. మంగ పొరిగింటయాఁడపిల్ల నొకదానిని బెంచుచుండెను. పసిరిక యింట నుండును, ఉండఁడు. రామేశ్వరశాస్త్రిగారు చని పోయినతరువాత నెనిమిదేండ్లొంటరితన మనుభవించి, యేఁబది యవపడిలోఁ బడి, తోడులేక యింట బ్రదుకలే నను కొన్నది. ఆ పిల్ల పేరు కాచి. కామాక్షి యన్నమాట కిది వికృతి. కాచి యా నాఁడు ప్రొద్దున లేచి, పొరుగింటనుండి యావుపేఁడ తెచ్చి, గొబ్బిళ్ళు జేసి, తల్లిగొబ్బెమ్మను నడుమనుంచి, పిల్లగొబ్బెమ్మలఁ జుట్టునుంచి, యటునిటు ముగ్గుచారలు వేసి, కుంకుమయుఁ బసుపు నద్ది, తల్లి గొబ్బెమ్మకు గుమ్మడిపూవు పిల్లగొబ్బెమలకు సొరపూవులు నలంక రించి, యక్షతలు పూలు చేబూని, 'సుబ్బిగొబ్బెమ్మా! చేమంతి పువ్వంటీ చెల్లెల్నివ్వావే, తామరపువ్వంటీ తమ్ముణ్ణివ్వావే' యని తిరుగుచుండెను. ధర్మారావునకుఁ గాచియన్నచోఁ జాలప్రేమ. అతనికిఁ జెల్లెండ్రిద్దఱు: దేవదాసియుఁ గాచియు. దేవదాసితో ధర్మారావు పరాచికములే యాడఁడు. అందుచేత నతనిచెల్లెలు ముద్దం తయు కాచిమీఁదకు వచ్చెను. ధర్మారావు వచ్చినంత నే 'అబ్బాయి! నా గొబ్బిళ్ళు త్రొక్కకు' అని కాచి చేతులు అడ్డము పెట్టినది. ధర్మారావు 'నా కదేపనియా!' యని దూరముగా నిలుచుండెను. కాచి మఱల 'సుబ్బిగొబ్బెమ్మా' యని పాడుచు 'మొగలీపువ్వంటీ మొగుణ్ణివ్వావే' యన్నది. ధర్మారావు 'ఒసేవు పిచ్చిదానా, మగఁడు మొగలిపువ్వువలె నున్నచో ముండ్లతో గీరును. అప్పుడు నీ సంసార మేడ్చినట్లే యుండు' ననెను. కాచి 'పో నీకెందుకు' అని, 'మల్లీపు వ్వంటీ మఱఁది నివ్వావే' యని పాడెను. ధర్మారావు 'ఏమిపాట, నీ మొగముపాట. చీచీ' అనెను. కాచి యేడ్చెను. మంగ వచ్చి సముదాయించెను. ధర్మారావు తనదారిని దాను పోయెను. పొలము లకుఁ దోలుకొనిపోవుచున్న గొడ్డువచ్చి గొబ్బిళులన్నియుఁ దొ్రక్కి పోయెను. కాచి మిగిలినగొబ్బిళ్ళే గోడకుఁ గొట్టుకొనెను. ఎండలు కాఁచి గాలివీచి గొడ్లుతాఁచి వీధిలోనిముగ్గులన్నియుఁ జెఱిగిపోయెను. ఆ సాయంకాలమున దేవదాసియు, ధర్మారావును గలిసికొని గోపాల స్వామిగుడిలోనికిఁ బోయిరి. గుడిముందు స్వామియాఁబోతు పండు

కొనియుండెను. అది చిక్కనగనై యుండెను. "దేవబ్రాహ్మణ క్షేత్రాన్ విహాయ యథేచ్ఛంవిహార"యని తనకుఁజెప్పిన బ్రాహ్మణహిత మాఁబోతుదెస నహితమయ్యెను. ఆయన తిరుగుటకుఁ బ్రాగ్దక్షిణపశ్చిమోత్తరములు వీలీయలేదు. ఎచ్చటికిఁబోయినను గాఁపులు కఱ్ఱలతోఁ దఱిమికొట్టిరి. మాగాణిదిక్కునకే పోరాకుండెను. మెట్టవైపున కపుడపుడు పోయినను కాఁపులు కఱ్ఱలతోఁ దఱిమిరి. ఈరీతిగా జిక్కియున్న యాయన స్వామి కెదురుగాఁ బరుండి తనదుఃఖముచే నెమరువేయుచుండెను. అన్నాసెల్లెండ్రిద్దఱు దేవాలయములోనికిఁ బోయిరి. సాంవత్సరికకల్యాణములకుఁగాని, నిత్యభోగములకుఁగాని మొగమువాఁచిన సత్యభామాహృదయేశుఁడు గోపికాధవుఁడు పేదచీరఁదాల్చి ప్రక్కనున్న సత్యభామవంకకేనా కరాగ్రము ప్రసారించలేదు; ఎదురుగా నున్న గిటికమీఁద దయావృష్టి కురిపించలేదు. స్వామి యీదుస్థితిఁ జూచి, యిద్దఱును గన్నీరు గార్చిరి.

# పదునొకండవ అధ్యాయము

అప్పటికి మహాత్ముఁడైన గాంధి సహాయనిరాకరణోద్యమ మారంభించి రెండేండ్లైనది. జనులు గాంధి దేవుఁడై యవతరించె నన్నారు. ఆయనయే కృష్ణుఁడు, రాటము వేణువు, తన్మధురధ్వని వంశీనినాదము, భారతదేశము బృందావనము, ప్రజలు గోపికలై యాయనచెప్పినట్లే కోట్లకుఁగోట్లు జనులు గుమిగూడి యవలంబించఁ జొచ్చిరి. దేశమున యుద్ధముకానియుద్ధ మొకఁడు ప్రారంభమయ్యెను. ఈ మహాచలనముచూచి ఖండఖండాంతరవాసు లాశ్చర్యపోయిరి. దేశమునం దింగ్లీషు చదువన్నను, పాశ్చాత్యసంప్రదాయానుసరణ మన్నను నిరాదరణ కలిగెను. ఇంగ్లీషుచదువు భారతీయులను వ్యామోహితులఁ జేసి పారతంత్ర్యశృంఖలానిబద్ధులను జేసి. దాస్యభావ పూరితులను జేయుచున్నదని యతివాదులు విశ్వసింపఁజొచ్చిరి. రంగాపురములోఁ గేశవ రావను నొక ముప్పదియేండ్ల యువకుఁడు ఎమ్. ఏ., బి. యల్. ప్యాసై చెన్నసగరములో న్యాయవాద వృత్తియం దుండెను. ఈయన రాజ్యలక్ష్మమ్మగారి కుమారుఁడు. గాంధిగారియుద్యమము బయలుదేఱినంతనే యాయన తనన్యాయ వాదవృత్తిఁ బరిత్యజించి యుద్యమములోఁ జొరఁబాఱెను. 'ఇంగ్లీషు చదువు చెప్పఁబడుచున్న కళాశాలలయందుఁ బిల్లలు చదువరా' దని వాదించిన దేశభక్తులతోఁ 'జదువు లేక పిల్లలు చెడిపోరా' యని తండ్రులు వాదించిరి. ప్రతిచోటను జాతీయకళాశాలలు స్థాపించి యింగ్లీషుచదువు మానివేసిన విద్యార్థులకుఁ దోడ్తో విద్యాభ్యాసమునకుఁగూడ వీలుకలిగించుటకు దేశమున నసేకులు ప్రయత్నించిరి. కేశవరావుగారు సుబ్బన్నపేటలో జాతీయ కళాశాల పెట్టెను. అచట రాటము వడకుట, హిందీ, తెలుగు, సంస్కృతములు నేర్పుదురు. కేశవరావు చెన్నపురిలోఁ బ్రశస్తి పొందినన్యాయవాది యగుటచేత దేశమున నాయన కెక్కువ పలుకుబడి గలదు. జమీందారులవద్దను, ధనాధికులవద్దనుఁ బోయి భూరివిరాళములు తెచ్చెను. రెండేండ్లలో సుబ్బన్నపేట జాతీయ

కళాశాల నిలుకడగల సంస్థయయ్యెను. చంద్రారెడ్డి యేఁబదియెకర ముల మెట్టభూమి కళాశాల కిచ్చివేసెను. అచటనే తదాలయనిర్మాణములు జరిగెను. కేశవరావు సుమారు రఱువదివేల రూపాయలు వసూలుచేసి, కళాశాలకు మూలనిధిగా బ్యాంకులో వేసెను. ఏఁబది ఎకరముల పొల మున్నది. సాలున కైదువేలు వడ్డీవచ్చును. కళాశాల యవ్యవహితముగా సాగనారంభించెను. దేశమునందుఁ గళలు, విద్యలు నశించిపోవుచున్నవనియు, వాని నన్నిటిని సముద్ధరించుట జాతీయవిద్యాశాలలవిధి యనియుఁ గేశవరావు తలఁచెను. అందుచే నా కళాశాలలో దేశీయవ్యాయామము నేర్పఁబడుచుండెను. సంగీతము చెప్పుట కొక గాయకుఁ డేర్పఱుపఁబడెను. ఒక వంగదేశ చిత్ర కారుని బిలిపించి ప్రాచ్యశిల్పశాఖ స్థాపించి తదధికారిగా నాయ నను నియమించెను. ప్రతిసంవత్సరమును దసరాపండుగలలోఁ గళాశాలలో మహోత్సవములు జరుగును. పెద్దపెద్ద వస్తాదులను బిలిపించి, కుస్తీలుపట్టించి గెలిచినవారికి నూటపదార్లు బహుమాన మిత్తురు. పెద్దగాయకులను బిలిపించి సభలుచేసి సమ్మానింతురు. కవులను బిలిపించి గారవింతురు. కళాశాలయాదర్శములు చూచి నచో గృష్ణమనాయఁడు బ్రతికివచ్చె ననిపించెను. కృష్ణమనాయని స్మృతికలిగిన జనులందరును గేశవరావును దైవముగాఁ బూజింపఁ జొచ్చిరి: ధర్మారావునకుఁ గేశవరా వన్నచో వేయితలల యాది శేషుఁడు మఱల నవతరించినట్లే యుండెను. రెండుసంవత్సరముల నుండియు ధర్మారావునకుఁ దనచదువు మాని యీ కళాశాలలోఁ జేరుదమని తలంపు. కాని కళాశాలలో నుపాధ్యాయులకు జీతములు లేవు. అందరు నూరకే పని చేయుచుండిరి. ధర్మారావునకు సంసార భారము శిరస్సున నుండుటచేతఁ జదివి సంపాదించవలసిన యవసర మున్నది. అభిమానమంతయుఁ గేశరావుగారిమీఁద నున్నను ధర్మారావు తనదారియే తాను ద్రొక్కెను. అదియుఁగాక ప్రథ ములో జాతీయకళాశాలమీఁద నెక్కువమోజు లేదు. ఉద్యమము వృద్ధినొందినకొలఁది కళాశాలపై నభిమానము వృద్ధికాఁజొచ్చెను. ఇంగ్లీషుకళాశాల సుబ్బన్నపేటలో నుండుట తదభివృద్ధికిఁ గొంత యాటంకము జరిగెను. సుబ్బన్నపేటప్రజలకుఁ గోటమీఁద

నున్నంతయాదరము, గౌరవము మఱెంకదేనిమీఁదను లేదు. రంగారావుగారు సువిస్పష్టముగాఁ దత్కళాశాలస్థితికిఁ బ్రతిఘటించినవారు. నాగేశ్వరరావుగారు దానికి వ్యతిరేకులు. ఈ సందర్భములచేతఁ గళాశాలకు సుబ్బన్నపేటలోఁ బ్రఖ్యాతి లేకపోయెను. చంద్రారెడ్డి యేఁబదియెకరము లిచ్చెనేగాని పురపాలకసంఘము, రాజరికమున కనుకూలమైన మార్గములందే యెక్కువ యిచ్చకలవాఁడు. రెంకమూఁడేం డ్లెదురుగాలికి నిలఁబడినతరువాత కేశవరావునకుఁ గాలునిలువఁద్రొక్కుకొన వీలైనది.

ప్రతిసంవత్సరమును గడచినమూఁడేండ్లు దసరాపండుగలకుఁ గళాశాలోత్సవములు జరిగెను. ఆయేఁడు ధనలోపముచేత నుత్సవములు వాయిదాపడెను. కేశవరావుగారు చెన్నపురికిఁ బోయి మూఁడువేలును, బొంబాయికిఁబోయి యైదువేలును విరాళములు తెచ్చెను. పండుగ పదిరోజులున్నదనఁగా నింటికి వచ్చెను. తలవని తలంపుగాఁ గళాశాలోత్సవములు సంక్రాంతిపండుగ కని నిర్ణయింపఁబడెను. పత్రికలనిండ నాహ్వానములు ప్రచురింపఁబడెను. బందరునుండి జంగము కోటయ్యగారిని, హరి నాగభూషణంగారిని, విజయనగరమునుండి ద్వారం వెంకటస్వామినాయుఁడుగారిని, పిఠాపురమునుండి సంగమేశ్వరశాస్త్రిగారిని సంగీతసభలకుఁ బిలిచిరి. కేశవరావుగారి కాంధ్రగాయకులనే పోషించవలయునని యభిప్రాయము. ఆంధ్రులను వదలిపెట్టి ద్రావిడగాయకులను బోషించువారిని, మెచ్చుకొనువారిని జూచినచో నాయన కొండలుమంట. 'అవునయ్యా! ద్రావిడు లెక్కువ సంగీతపాటకు లేమో నాకుఁ దెలియదు. కాని వారు త్యాగయ్యగారికృతులను బాడునప్పుడు వారి కర్థము తెలియదు. నాకు బాగుండదు. అవును; కాదు. నేను తెలుఁగువాఁడను. నాకుఁ దెలుఁగువారిమీద నభిమానము. ఇదిగో మీ వంగీయులున్నారుకదా! వారికిఁ బ్రాంతీయాభిమాన మెంత! దానికి వారు పెట్టినది పేరు. ఇప్పుడు గాంధిగారియుద్యమము మూలమున ప్రాంతీయాభిమానములు చాల చచ్చినమాట నిజమే. అది రాజకీయ విషయములయందుఁ; గళావిషయములందు గాదు. నా కాంధ్రుల గానమే యిష్టము' అని యాయన వాదించెను.

దేశమునందు సుప్రసిద్ధులైన కవులను సమాహ్వానించిరి. కుస్తీలకు రాఁదలఁచుకొన్న వస్తాదులు ప్రవేశముగా రుసుము పది రూపాయలు చెల్లించవలయును. నాల్గురోజులలో నలువదిమంది వస్తాదులు వచ్చిరి. కూచిపూఁడివారిచేత ప్రహ్లాదనాటక మాడించుఁబడుట కేర్పాటుచేసిరి. కాకినాడనుండి ముప్పిడి జగ్గరాజుగారు వచ్చి దమయంతివేషము ధరించునట్లు, పలనాటిలో నెవరో బ్రాహ్మణులు తోలుబొమ్మలు కట్టెదరఁట— వారికొఱకుఁ గేశవరావు మనిసిని బంపించెను. కడచిన రెండేండ్లుగాఁ గళాశాలడబ్బు రుచి మఱిగినవాండ్రు చుట్టుప్రక్కలనున్న పగటివేషాలవారు, గొత్తి పాళెళ్ళవాళ్ళు, ఎలుగుఁగొడ్ల నాడించువారు, దొమ్మరవాండ్రు గారడివాండ్రు, పాములవాండ్రు సుబ్బన్నపేటచుట్టు మూఁగిరి. పండుగలనాటికిఁ బైరంతయుఁ గోసివేసిరి. పైరు కోయకముందుఁ దొరాలుత్రొక్కి చల్లిన జనము తలలు బైటఁబెట్టెను. గుండేటి వఱదకుఁ దుడుచుకొనిపోయినచేలలో మఱల నాటిన ముదురు పైరు నాటక యీచుకొనిపోయెను. పొలములన్నియు సరిగా నెండలేదు. ఈ వచ్చిన బిచ్చగాండ్రందరును తడిపొలాలమీఁదనే గుడిసెలు వేసికొనిరి. ఎంతమంది బిచ్చగాండ్రు! వేసఁగిలో నెఱియలువడ్డ పొలాలలో నడుగున నెచ్చటనో దాఁగియుండి వానచినుకు పడినంతనే బొణుగురు బొణుగురని కూయు కప్పలు లక్షోపలక్షలై వెలికుఱికినట్లు, తమ్మాదరించు ప్రభువు దొరికినంతనే వారందరును నేల యీనినట్లు వచ్చిరి. ఆహా! ఆశ్రయమిచ్చినవాఁడు దొరకినచో నాశ్రితులు పదివేలమంది యుందురు. ఆశ్రయ మిచ్చువాఁడు లేనిచో వారందరును మండువేసఁగియందు గాకులవోలె మలమల మాడి చత్తురు.

భోగిపండుగనాఁ డుత్సవములు ప్రారంభమయ్యెను. కూచిపూఁడివారు వచ్చి పగటివేషములు వేసిరి. మొదటనే యర్ధనారీశ్వర వేషమును సంతరించి గ్రామమంతయుఁ దిరిగిరి. జాతీయకళాశాల యూరికిఁ దూర్పుల మెట్టచేలలో నున్నది. ఊరునకుఁ బడమర కోట యున్నది. వేషము కోటనైరృతిమూలయందు బయలుదేఱి దక్షిణపు గోడవెంటనే వచ్చి స్వామియాలయమునందు నిలుచుండి తన

విద్య ప్రదర్శించుచుండెను. జనము వారిచుట్టును మూఁగిపోయిరి. అర్ధనారీశ్వరుని వేషము వేసినయాయన మొగమునకు సగమునందు సన్నని తెర వేసెను. అది కుడివైపునకుఁ దీయును- గిరిజాకృతి, శిరసునఁ జంద్రవంక, గౌరీకల్యాణపుబొట్టు, ముక్కర, మహాదేవుని భార్యవలె నొంటికన్నులో జ్యోతిస్సులు వెలుఁగుచుండెను. అర్ధనిమీలితనేత్రము గౌరీకటాక్షామృతమునే ప్రసరింపఁజేసెను. తక్కినశరీరమంతయు స్త్రీదేహమువలెనే భాసించెను. పార్వతీవైభవప్రస్తావనా కీర్తనలు పాడి మఱల తెర నెడమవైపునకు లాగును. అంతలో విచిత్రమై మహాదేవాకృతి గోచరించును. జటాజూటమునందుఁ జంద్రరేఖ, ఫాలభాగమున గంధాక్షతలు. విప్పారిన నేత్రమునందు సర్వజగన్నాథత్వమును. చాల ప్రాంశువైన మనిషి. అతఁడు నవ్వును; వెండికొండ తెల్లనికాంతులు చిమ్ములు. అంతఁలో కుపితభ్రువు చూపించును; ఫాలమునందు సిందూరముతోఁ జేసిన మూఁడవకంటినుండి నిప్పులు గ్రక్కుచున్నట్లే కనిపించును. ఇంతకుముందు గిరిజార్ధముఖము ప్రదర్శించినవేళ చీర తాల్చినట్లు, రైక తాల్చినట్లున్న యతనిశరీరము పురుషార్ధముఖము ప్రదర్శించినంతనే యది యేమిచిత్రమో శివుడు ధోవతికట్టినట్లు, పై నుత్తరీయము తాల్చినట్లే కనిపించెను. అట్లు వేషము వేయుట యెట్టి విద్యయో? అతనిని జూచి నాగేశ్వరస్వామి తనప్రతిబింబ మనుకొనెనేమో! దేవాలయములు దాఁటి, బ్రాహ్మణవీధి దాఁటి యూరిచివర కళాశాలవద్దకుఁ బోయెను. కేశవరావుగారు కనిపించెను. పగటివేషగాండ్రిద్దఱును నమస్కరించిరి. కేశవరావు దేశీయవిద్యలకు గొప్ప వ్యాఖ్యాత. వీరన్న యాడినంతసేపు, కేశవరా వేదో వ్యాఖ్యానమే చేయుచుండెను. 'అదిగోనయ్యా! చదువు. అర్ధనారీశ్వరునివైభవము, కైలాసముసొగసు, ప్రమథులలో భేదములు, వారిపేరులు, అనేకములైన గౌరీదేవతలవైభవవిస్తారతలు, మహాభక్తులైన శైవుల కథాసంవిధానములు. సప్తమాతృకలచరిత్రలు, త్రిపురాసురసంహారములు, బాణాసురునికథ-ఒకటి యననేల, శైవాగమములన్నియు నతనిజిహ్వాగ్రముననే యున్నవి. చూడవయ్యా! చూడుము! ఇంగ్లీషుచదువులు వచ్చి యీ మహాసంస్థను బాడుచేసినవి. పాశ్చాత్యనాగరకత వచ్చి ఈ పేదవారి నోళ్ళమీఁదఁ

గొట్టినది. పిడికెడుబిచ్చముతోఁ దృప్తిపడి తీరికూర్చున్న వేళలందు సునాయాసముగ సుఖతరముగ విద్యలు దేశమునందు వ్యాపింపఁజేయుచుండెడి యిట్టి మహాసంస్థ లెన్ని నాశనము పొందినవి? వీరినందఱను పూర్వము మహారాజులు, ధనవంతులు నాదరించిరి. నేఁటి కివి కూటికి మాలిన విద్యలైనవి. అసలు వీనికి విద్యాత్వమే పోయినది.

ఆనాఁడు సాయంకాలమునఁ గొందఱు చిన్నవస్తాదులకుఁ గుస్తీలు జరిగెను. ఒక మరకకుఱ్ఱవాఁడును, నొకకాఁపును కుస్తీ పట్టిరి. కాఁపుకుఱ్ఱవాఁడు సన్నగానుండి మిక్కిలిచుఱుకై యుండెను. మహమ్మదీయుఁడు కొంచెము బలసి కన్నులందు గ్రూరత్వమున్నట్లు కనఁబడెను. కాఁపుకుఱ్ఱవాఁడు ఏలూరు తములపాకుల వీరవెంకయ్య గారి తాలింఖానాలో మనిసి. ఆయన వస్తాదులలో మరియాద నెఱిఁగినవారు. కృష్ణాజిల్లాలో నాయనకీర్తియుఁ జక్కఁగా వ్యాపించియుండెను వారి తాలింఖానాలోనికుఱ్ఱవాండ్రు రౌడీలవలెఁగాక పెద్దమనిసితరహాలు తెలిసినవారు. పేచీలు తెలిసికొని సులువుగాఁ జుఱుకుగాఁ బోట్లాడెదరు ఇద్దఱును జేయిచేయిఁకలుపనే లేదు. కాఁపుకుఱ్ఱవాఁడు 'దస్తీ' తో నెదుటవానిని బీటీమున్న చేసెను. అందఱకు నాశ్చర్యమైనది. చేయిచేయి కలుపుటలోననే బొటనవ్రేలితోఁ గలిపి చేతినిబట్టుకొని, యెడమవైపునకు చేయివిఱిచి కన్నుమూసి కన్ను తెఱచినంతలో వేగముగా లాగివేసెను. దానితో నెదుటమనిసి యెడమపార్శ్వమును దలయును దూలిపోయి క్రిందఁబడిపోవును. అది వేగముగా లాగుటలోనున్న యొడుపు. మంచిచుఱుకైనవాఁడుగాని యట్లు చేయలేఁడు తరువాత మఱియిద్దఱు కుస్తీపట్టిరి. వారికుస్తీ యెంతసేపటికిని దెగలేదు. అది లాలోచీ యని విడఁబఱచి పంపిరి.

రాత్రికిఁ బ్రహ్లాదనాటక మాడఁబడెను. కూచిపూఁడివారు పూర్వము ప్రహ్లాదనాటకమును మూఁడురాత్రు లాడెడివారు. జనుల కోపికతగ్గి యది క్రమముగా రెండురాత్రులకే యాడఁబడుచుండెను. వ్యవధి లేకపోవుటచేత రెండురాత్రులకథయుఁ గలిపి యొక్కరాత్రియే యాడు మనిరి.

ధర్మారావునకుఁ గేశవరావు వచ్చుచోఁ జాలగౌరవము. కేశవరావు ధర్మారావు నతనివివాహమునాటినుండి కొద్దిగా నెఱుఁగును.

కడచిన రెండేండ్లనుండి బాగుగ నెఱుఁగుదు. రాజ్యలక్ష్మమ్మగారికి నరుంధతిమీఁది ప్రేమవలన, ధర్మారావునకు రాజ్యలక్ష్మమ్మగారి యెడల గౌరవమువలన ధర్మారావు, కేశవరావుల పరస్పర గౌరవ మచ్చముగా మనస్సంబంధియే కాక కించిద్హృదయసంబంధికూడ నయ్యెను. ఈ యుత్సవములు చూచుటకు రంగాపురమునుండి రాజ్యలక్ష్మమ్మగారు వచ్చి ధర్మారావుగారియింటనే యుండెను. అరుంధతి విచిత్రమైన వ్యక్తి. ఆమె లోకములో నెవరిని గౌరవించదు అట్లని యవినయవతి కాదు. మనసులో నామె కెవరిమీఁద మహాభిప్రాయ ముండదు. పైకి మర్యాదోల్లంఘనము చేయదు. ఆమె లోకములో గౌరవించు స్త్రీవ్యక్తి రాజ్యలక్ష్మమ్మగా రొక్కతెయే: తనకుఁ దన భర్తకుఁ బొసఁగించిన దామె యనియో, రాజ్యలక్ష్మమ్మగారిముఖము నందలి తేజస్సు చూచియో తెలియదు. ఆమెకు వేఁడినీళ్ళు కాఁచి యిచ్చును. ఆమెవచ్చె నని ప్రతిపూటయు రెండుమూఁడు కూరలు వండును. ఆమె నే పనియు ముట్టుకోనీయదు రాజ్యలక్ష్మమ్మగా రిప్పటికి వృద్ధురాలై దగ్గఱ దగ్గఱ నేఁబదియేండ్ల వయసుకలది యయ్యెను. ఆమెశిరోజములు సగమునకుసగము నరసెను. ఆమె యొడలు దొందముపాటి మునుపటివలె రమణీయముగా లేదు. అరుంధతీధర్మారావుల కామె పరమేశ్వరివలెఁ గనఁబడును. ఈ దంపతులకుఁ దనయందుఁగల గౌరవ మామెకును దెలియును. రాజ్యలక్ష్మమ్మగారికిఁ గూచిపూఁడిభాగవతు లన్నచోఁ బ్రాణము. ప్రహ్లాద నాటక మొక్కరాత్రియే యాడుదు రనఁగా నామె చీచీ యన్నది. కొడుకు కనఁబడునేమో రెండురాత్రు లాడించు మని చెప్పెద మనుకొన్నది. బహువ్యాపృతుఁడై నకొడుకు కనుపించలేదు. సావిత్రిమ్మగారు, అరుంధతీరథంతరులు, రాజ్యలక్ష్మమ్మగారు కలసి నాటకమునకుఁ బోయిరి. దేవదాసియు రత్నగిరియు వచ్చి దూరముగా నిలుచుండిరి. రథంతరిపోయి గిరికను దెచ్చి తమవద్దఁ గూర్చుండఁబెట్టుకొనెను.

ధర్మారావు హరప్పనాయనితో నాటకమునకుఁ గలసివచ్చెను. హరప్పనాయఁడీ నాటకమునకు వచ్చుటకుఁ దండ్రిగారివద్ద ననుజ్ఞ మిక్కిలి బలవంతముగాఁ దెచ్చుకొనెను. ధర్మారావునందు రంగా

రావుగారి కీ విషయమున వైమనస్యము కలిగెను. కాని తల్లి లేని నాయఁడు ధర్మారావు నంటిపెట్టుకొని తిరుగుచుండెను. వారి నిద్దఱను విడఁదీయుట జమీందారుని కంటుచే నిష్టములేదు. కోటలోనుండి నాటకమునుజూచుట కేఁగిన దొక్క హరప్పయే. సభ్యులందఱికన్న ముందు పెద్దతివాచీవేసి, దానిపైని పఱుపువేసి, బాలీ సమర్చిరి. దానిపై హరప్పనాయఁడు కూర్చుండెను. ధర్మారావు ప్రక్కనే కూర్చుండెను. నాటక మారంభించువఱకు జామున్నరప్రొద్దుపోయి నది. ఇంతసేపును హంగు జరుగుచుండెను. తొందరగా మొదలుపెట్ట వలయు నని కేశవరావుగా రెన్నిసార్లు చెప్పినను వారివేళకే వారు ప్రారంభించిరి. చోపుదారి వచ్చి హిరణ్యకశిపుమహారాజుగారిరాకను దెలిపెను. తెర యడ్డము పట్టిరి. వెనుక హిరణ్యకశిపుఁడు వచ్చి యుండెను. తాళము, మద్దెలలు, కాలిగజ్జెలమోఁత, ఘళఘళారావము చేత రాక్షసుఁ డవతరించినట్లే యుండెను. రెండుకాగడాలు దగ్గఱ పెట్టి గుగ్గిలముచల్లి కలిగిన తళతళలోఁ దెరతీసిరి. వెనుక నున్న రాజు కిరీటము, భుజకీర్తులు - వీనియందుగల తళుకురేకులు ధగధగలాడి పోయెను. తండ్రిపట్టాభిషేకవేళయందు హరప్ప కాఁతేం డ్లయినను నాటకాదులు సరిగాఁ జూడలేదు ఆయన యింతవఱకును వీధినాట కమే యెఱుఁగఁడు. హరప్ప కీ నాటకమహోత్సవము మనోభిరామ ముగ నుండెను. హిరణ్యకశిపుఁడు తపస్సునకుఁబోవుచు గర్భవతియైన లీలావతి నింటివద్ద నుంచిపోయెను. ఆమెగర్భస్థశిశువు తన కపకారి కాఁగలఁ డని యింద్రుఁ డామెను గొంచుఁబోవుచుండ నారదు లవత రించిరి. నాటకు లప్పు డేదో యొకకీర్తన పాడిరి. ఆరాగము, ఆతాళము ఆ లయచేత నాకాశమునుండి దేవర్షి భూమికవతరించినట్లే తోఁచెను. ధర్మారావున కాశ్చర్యమయ్యెను. కంపెనీలవారు వేయు నాటకముల యం దట్టిభావము కలుగుటకే వీలులేదు. వారు భావానుగుణమైన రాగముగాని, రాగానుగుణమైన లయగాని పాటించిన కీర్తనలే యెఱుఁగరు. బొంబాయినుండి దిగుమతియైన పారశీమెట్లు, చేతఁ గాని తెలుఁగుకవులచేత రచింపఁబడిన కీర్తనలు, గాయకుని కంఠ ధ్వని మ్రింగివేయు హార్మనీ, తబలాధ్వనులతో నపరిపక్వమనస్కులు, అనాగరకహృదయులునయిన యవివేకసామాజికులఁ గొల్లగొట్టుటయే

మెఱుఁగుదురుగాని విద్యలోని సిగూఢతత్వమే మెఱుఁగరు. వేషము వేయుట యెట్లో, యే భావమునం దే రాగమున్నదో, యే తాళమునం దే భావము పుట్టించవచ్చునో, భిన్న తాళగతులవలన భిన్న భావము లెట్లుదయించునో యీ రహస్యములు సంప్రదాయవేత్తలైన కూచిపూడివారికే తెలియును. ఈ కింనటకులు వారివద్ద నీ విద్యలు నేర్చుకొననైన నేర్చుకొనరు నాటకము కొంతదూరము నడచినది. రెండురాత్రుల కథ యొకరాత్రియే జరుపవలసివచ్చుటచేత కథ తొందరగాజరుగుచుండెను ప్రహ్లాదుఁడు తండ్రిమాట వినలేదు. హిరణ్యకశిపుఁడు పుత్రునిమీఁదఁ గోపగించుచుండెను. లీలావతి కొడుకును జేరఁదీసి 'వలదురా యన్న, తండ్రితో వైరమువలదురా యన్న! నిన్నుఁ జంపుదు రనఁగ వింటిని, కన్నకడుపు లోర్చురా, వలదురా యన్న' యని బోధించెను. హరప్పనాయఁడు తత్కీర్తనలోని భావము తనహృదయాంతరాళమున నెక్కడఁదగిలెనో పరిదీనవదనుఁ డయ్యెను. ధర్మారావతనిని సమాదరించెను. లోకోక్తి నట్లు చక్కఁగా సంగ్రహించి భావానుగుణమైన రాగములోఁ బొదిగి మానవహృదయమునందలి మూలభావములను బెల్లగించు శిల్పమే శిల్పము. అందుకనియే నాటక మన్నచో రచయితయైనకవి తెలుఁగుదేశము పలుకుబడియంతయు దోచుకొన్నవాఁడై యుండవలయును. నటకుఁడు గాంధర్వము, భరతము సార మెఱింగినవాఁడు కావలయును. తక్కిన నాటకములు దేశమునకు వేరుపుర్వువంటివి. హరప్ప సృష్టియంతయుఁ గదలిపోయెను.

ప్రహ్లాదుని గఱపించుటకుఁ బాములతో రమ్మని పాములవానికొఱకు హేమకశిపుఁడు కబురంపించెను. వాఁడు వచ్చెను. వచ్చుచునే వాఁడు పదివేల సర్పముల పేరులు, వాని యాకృతివిశేషములు వాని విషములలో నున్న భేదములు, వానికిఁ బ్రతిక్రియలైన మందులు రెండుగడియలసే పుపన్యసించెను. వాని వేషముగట్టుట గొప్ప చిత్రముగా నున్నది. రాజపోషణలో నుండి రాజువద్దనుండి బహుబహుమానములు పుచ్చుకొన్నవాఁ డది విద్యగా, నది పరిశోధనగాఁ దన పూర్వు లార్జించిన బహుసర్పగతజ్ఞానము తననూత్నపరిశోధనతోఁ గలిపి యొకపెద్దసంస్థగానున్న పురుషునివలె నుండెను.

కనుబొమ్మలు, కన్నులక్రింద కండరములు రెండును దగ్గఱకుఁదీసి కనులుమూసికొనిపోవునట్లు నవ్వును; వాని యెదలోని క్రౌర్యమంతయు గోచరించును. సెలవు లెడమునకు లాగి వికృతహాసముచేయును; వాని యెడదలోని యనాగరకతయంతయు వెలికివచ్చును. ఎఱ్ఱనిచుక్కలు కలిగిననల్లనిగుడ్డ, బుట్టంతతలపాగ చుట్టి వెనుక నడుగుపొడుగున జాఱ విడిచి, కొస మలఁచి పాగాలో దోపి, వేయిరకముల పూసలు మెడ యందు చేతులందు ధరించి యాఱుబుట్టలనిండ పాములఁ దెచ్చెను. ఉత్సవములకు వచ్చిన వాములవాండ్రీ పాములవానివేషమును జూచి భయపడిరి. అందులో నొకఁడు చాలసమీపమునకు వచ్చి దిగాలఁబడి చూచుచు నిలుచుండెను. కేశవరావు 'ఏరా! నీ విట్లుంటివా?' యని యడిగెను. వాఁడు 'హిరణ్యకశిపుమహారాజుగారు వానికి డబ్బిచ్చి పోషణ చేయుచున్నాఁడు. అందుచేత వాఁ డట్లుండెను. నాకును ధన మిచ్చి యాదరించెడుదొర యున్నచో నట్లే యుందు' ననెను. కేశవ రావు మొగమున నొక విషాదపుఱేవి యుదయించెను. బ్రాహ్మ ణుఁడు పాములను దీసి యాడించెను. ఆడించుచు సభకు నమస్కా రముచేసి 'బాబూ! ఎవరైన మంత్రగాండ్రున్నచోఁ గట్లు విప్ప కుఁడు. విప్పినచో మఱల నే నేదైనఁ జేయవలసివచ్చు' ననియెను. కూచిపూఁడివారు గొప్పమంత్రశాస్త్రజ్ఞులు. వారు నాటక మాడఁ బోవునపుడే యష్టదిగ్బంధనము చేయుదురఁట. ఆమవిద్య కసూయ పడినవారు చిలిపిప్రయోగములుచేసి పూర్వము వారి నలయించఁగా, వారు ప్రయోగములకు మాఱుప్రయోగములుచేయుట నేర్చుకొని యుందురు. వలసినచో వారు మోడికూడఁ గట్టఁగలరు. ధర్మారావు పాములవానివేషమునకుఁ దత్ప్రదర్శితవిద్యావిశేషమునకును ముగ్ధుఁడై పోయెను. ఆఫ్రికాదేశమునందును, తదితరదేశములయందునుగల సర్ప జాతులను గుఱించి వ్రాసి, వాని చిత్రములతోఁ బ్రకటింపఁబడిన యింగ్లీషుపుస్తకము లతఁడు చూచెను. ఆ పుస్తకము లెవరో కొద్ది మంది చదువుదురు. నాటకరూపమున బోధింపఁబడుచున్న యీ మహా విషయము దానికన్న నెంత యుత్తమమైనది! ఈ విద్య ధూపదీప నైవేద్యములు లేక నవసిపోయినది.

కథ యెంతతతెమిసినను కాలము చాలలేదు. తూర్పు రేకలు తోంచినవి. నృసింహావతారము రా వేళయైనది. నరసింహమూర్తి వేషము వేయునతఁడు నృసింహమంత్రోపాసకుఁడు. అతఁడు రెన్నాళ్ళనుండి భోజనముచేయఁడు. ఈ రెండుదినములు మంత్రము జపించుచునే యుండును. రంగమునకు వెనుక భూమియందున్న బల్లపై నాయనకు వేషమువేసి, తలకు సింగపుదలవంటి యొకగూఁడమర్చి కుర్చీలోఁ గూర్చుండఁబెట్టిరి. రెన్నాళ్ళనుండి తిండిలేక యతని మేనెల్ల నకనకలాడుచుండెను. అతనిచేతులకుఁ గొలుసులుకట్టి వెనుకకు బిగించి ముగ్గురు పట్టుకొనిరి. నృసింహావతారోదయమైనంతనే హిరణ్యకశిపువేషధారి పిల్లివలె నైపోయెను. ఇతఁడు విజృంభించెనా యా మహోపాసకునియుగ్రత విజృంభించును. కిరీటము, భుజకీర్తులిది వఱకే తీసివేసి పరిదీనమూర్తియై నాటకములో అకుమాత్రము హరి లేఁడని ప్రహ్లాదుని కెదురుకీర్తనలు పాడుచు నృత్యము చేయుచుండెను. తెరతీసినంతనే పదికొబ్బరికాయలు కొట్టిరి. రెన్నాళ్ళనుండి తిండిలేని ముసలిసింహము హుమ్మని గర్జించినది. సభయంతయు భయగ్రస్తమైపోయెను. ఇంతవఱకును దన్మయత్వములోనున్న గిరిక లేచినిలుచుండి చేతులుజోడించి తూలిపోవుచుండెను. అరుంధతీ రథంతరులు పట్టుకొని కూర్చుండఁబెట్టిరి. నృసింహమూర్తి హిరణ్యకశిపునిమీఁదికి దూఁకవచ్చెను. సమీపముదాక రానిచ్చి హంగుదారులతనిని వెనుకకు లాగిరి. అంతలోఁ దెరదించిరి. హారతులిచ్చి స్వామియుగ్రత నుపశమించిరి. వెనుక నొకసారి తండ్రికొడుకులు నృసింహ హిరణ్యకశిపు వేషములను దాల్చిరఁట. నృసింహమూర్తి కినుపగోళ్ళు పెట్టిరఁట. ఉపవాస మున్నయుగ్రతలో, మంత్రపునశ్చరణచేయు నావేశములోఁ దండ్రి యొడలు తెలియక హిరణ్యకశిపు వేషమువేసిన తనకుమారుని నిజముగానే చీల్చెనఁట. నాఁటినుండియుఁ గూచిపూఁడివారినాటకములలో నృసింహహిరణ్యకశిపులకు సన్నిహితత్వము కలిగించరు. ఒకాయన యన్నాఁడు: 'వేషము వేయువాఁడుపవాస ముండుట యెందుకు? మంత్రపునశ్చరణచేయుట యెందులకు? ఆలంకారికులు నుపాత్రధారికి వేషముతోఁ దాదాత్మ్య ముండరాదని చెప్పుదురు' అని. కాని కూచిపూఁడివారు తక్కినవేషములయం

దంతే. నృసింహావతారవిషయముననే వారి కనుశ్రుతముగా నీ యాచారము వచ్చుచున్నది. వారి భావములో నాటకమన్నచో సర్వదేవతానివాసభూమియైన శిల్పమని. నాటకము వారికులవృత్తి. భరతమునకు వారు పుట్టినిండ్లు భక్తిప్రపత్తులకు వారు నిధానములు. లోకమునందు రసముతోఁబాటు దైవభక్తిగూడ వారు వెదజల్లిరి.

కూచిపూఁడివారు నాటకమైనంతనే పొద్దుననే బయలుదేఱి వేషములతోడనే యూరిలో ధనవంతులకడకు యాచనకుఁ బోవుదురు. పూర్వ మిది యాచారము. దేశము నవనాగరికత తెచ్చుకొన్నకొలఁది వారును దానిని మానివేసిరి. కాని యీనాఁడు ప్రొద్దుననే 'రాత్రి యువరాజుగారు నాటకము చూడవచ్చిరి కదా' యన్న యాశచేత వేష మూడఁదీయని లీలావతి ప్రహ్లాదులతో హంగుతోఁ గోటలోనికిఁ బోయిరి. దివానుగారు వీరిరాకచూచి వారిని వారించఁ బోయిరి. హరప్పనాయఁడు దాను కప్పుకొనుచున్న పట్టుసేలువ తెచ్చి వారిమీఁద విసరెను. దివాను దిగ్భ్రాంతుఁడై పోయెను. వారు శారదరామాయణములోని రెండుచరణము లనిరి. నృత్యము కిలకిల లాడెను. తాళము కంగుకంగుమనెను. హరహరనాయనిదగ్గఱనుండి స్తోత్రపాఠములు వసంతర్తువునందు కోకిలాలాపమువలె సుమధుర దీర్ఘము లయ్యెను. హరప్పనాయనిగుండెలో నానందము పోటువేళ నదికి సముద్ర మెదురుపొడిచినట్లు పొంగెను. ఒక సంప్రదాయము చచ్చిపోవుచుఁ జావులోఁగూడ దానిలక్ష్యమే యైన మహౌదార్య శ్రీనే ప్రకటించెను. మఱియొక సంప్రదాయము తాను నూత్నాభ్యుదయము పొందుచు నభ్యుదయములోఁగూడ దానిలక్షణమైన వెలతెల పోవుటయే ప్రకటించెను. వేసఁగినాఁటి యస్తమయముకూడఁ దేజోవంతమే. దుర్దినములలోని యుదయముకూడ మేఘాచ్ఛాదితమే.

తరువాత వారు ధర్మారావుగారి యింటికిఁ బోయిరి. రామేశ్వరశాస్త్రిగారికీర్తిపాఁతర లానాఁడు త్రవ్వఁబడెను. ఝిల్లీభోగాలు, రాజనాలు, పాలాట్రిగడములు ఘట్లకుఁబుట్లు వెలికివచ్చెను. ధర్మారావుచేతిలో దమ్మిడీలేదు, తండ్రికీర్తిదశదిశాపరిపూజిత మయ్యెను. ధర్మారా వింటిలో వెదకెను. ఈ దగినంత వెలగల వస్తువేదియుఁ గనపించలేదు. అరుంధతి వెలగలచీర యొక్కటియే యున్నది. అది

పదిరూపాయలఖరీదు. కొని యేఁడాదియైనది. అరుంధతి యొకసారియో, రెండుసార్లో కట్టుకొన్నది. సహాయనిరాకరణోద్యమము వచ్చినతరువాత నామె యాచీర కట్టుకొనలేదు. ధర్మారావది తెచ్చి యిచ్చెను. క్రొత్తచీర చూచి భాగవతులు పరితుష్టినొందిరి. శారద రామాయణములోని మఱి రెండు చరణములు గలగలలాడెను. మేళమునకు నధ్యక్షుఁడైన వేంకటనారాయణగారెగిరి గంతువేసి మడమలతోఁ బిఱుందును గొట్టెను. ధర్మారావువద్దకు వచ్చి 'నాయనా! మీ నాయనగారు శిబి, దధీచి. నీవుమాత్రము తక్కువా? బంగారు తండ్రి' యని చిబుకమును రెండువ్రేళ్ళతోఁ బూని ముందునకు లాగెను. ముసలిబ్రాహ్మణుని యీ ముద్దునకు ధర్మారావు సిగ్గుపడెను.

ఊరిలో సగము నిద్రమేల్కొనుటకుఁ బొద్దు వాటారినది. అప్పుడు పెద్దకుస్తీ. ఒకవైపున ఇసాకు, మఱొకవైపు పూజారి. ఇసాకు పేరు మోసినవాఁడు, మహమ్మదీయుఁడు. మనిషి పెద్దపులివలె నుండును. పూజారి పొట్టివాఁడు, పోఁతబోసిన యినుపవిగ్రహము. అరగంటసేపు పోరాడిరి. పూజారి ఇసాకుచుట్టును గిరికీలుకొట్టును. చేతికిఁ జేయి యందిచ్చును. మఱల విదల్చి దూరముపోవును. నాలుగుసార్లిట్లుచేసి యైదవసారి మెడమీఁద చేయివేయును. తలకుఁ దలానించి యిసాకు గుండెమీఁద చేయివైచి యతనిని దూరమునకుఁ ద్రోసి, మఱలఁ దారు వెనుకకుఁ బోవును. ఇసాకునకుఁ గోపము వచ్చెను. 'అరే సువర్, మై బైఠ్ తాహుఁ, తు ఆవో' అని కూర్చుండెను. వచ్చి పూజారిని బట్టుకొమ్మనును. పూజారి 'ఉఠో రే ఉఠో' అని తిరస్కరించును. ప్రేక్షకుల ప్రాణములు విసిగినవి. పూజారి 'చేతనైనచో నీవే వచ్చి పట్టుకో' మ్మనును. కలియఁబడినచో గొప్ప వస్తాదుగనుక ఇసాకు కొట్టునేమో తెలియదు. శరీరబలమునందుఁ బూజారి తక్కువవాఁడు కాఁడు. కావున నతని నే పేచీకిని లోనుగాఁ దీయలేకపోయెను. పొద్దుగ్రుంకినతరువాత గెలిచినవారి కీయఁదగిన నూటపదార్లు కేశవరావుగారు చెఱియేఁబదియెనిమిదియు నిచ్చిరి. రాతిరికి జగ్గరాజుగారు దయమయంతివేషము వేసిరి. అప్పటికే ఆయన పెద్దవాఁ డయ్యెను. నలువదియేండ్లుదాఁటిన యాయనవేషము కొంచెము స్థూలకాయుఁడగుటచేత మాదిరినట్లుండెను. అతని యొద్దిక,

నిలుచుండుట వినయము నౌచిత్యమునే క్రమ్మరించెను. రసదృష్టి లేక రంగముమీఁదఁ బరవళ్ళుత్రొక్కు రాలుఁగాయవలెఁగాక యతని యాంగికము భావమున కొదిగియుండెను. పంచనళీభ్రాంతి భారతిచేతఁ బరిహరింపఁబడినంతనే యతని మొగమున నొకవిచిత్రాభినయము కనఁబడెను. అభినయ మనునది దివ్యమైన గుణము. రంగారోహణముచేయు ప్రతివానికి నది చేతకాదు. కోపమో, ప్రసన్నతయో, యానందమో, యీర్ష్యయో యేదో యొకభావమునే విస్పష్టముగా మొగమునందుఁ గనఁబరచుటయే దుర్ఘటమైనకార్యము. రెండు మూఁడుభాగములు సమ్మిశ్రితములుచేసి యొకసారిగా వానిని గనఁబరుచుట దేవతాసాధ్యమైనవిషయము. 'భారతి తనయందుఁ బ్రసన్నురాలైన' దన్న యానందము, 'నలుఁడు తెలియఁబడెను. అతనిని వరించవచ్చు'నని యుద్వేగము, నూత్నవధూసహజమైన లజ్జ, దేవతలు తన్నంత గాసివెట్టిరన్న మచ్చరము మొగమునం దొక్కసారి విజృంభించి తఱిమెను. ధర్మారావునాత్మ జగ్గరాజశిల్పమునకు విధేయమైపోయెను. వెంకటనారాయణగారు ధర్మారావుప్రక్కనే కూర్చుండిరి. ధర్మారా వతనివంకఁ జూచెను. 'అవును, బాబూ! చెప్పుకొన్నవిద్య కాదు. ఆ మహాపురుషున కది పూర్వజన్మమునుండి వచ్చినది. భరతాచార్యులుగూడ సరిగా నట్లే చెప్పెను' అని వేంకటనారాయణగా రనిరి. జగ్గరాజుగారు కూడుకట్టిన శోకరసమయ్యెను చివరకు ద్వితీయ స్వయంవరము చాటఁబంచినతరువాత బాహుకుఁడైన నలుని గుర్తించి దమయంతి యతనితోఁ బ్రసంగించుచుండెను. నలుఁడు 'ద్వితీయస్వయంవరమునకుఁ జాటఁబంచితివికదా! నీయిష్టమువచ్చిన వానిని వరించుము. వికృతుని న న్నేల' యనిన, జగ్గరాజు సగమైపోయి, మొగమున విషాదరేఖ సహస్రధా విజృంభించఁగా నెడమచేయి కుడిమోచేతిక్రిందఁ బెట్టి, తలవంచి, కుడి యఱచేతితో శిరోగ్రభాగమును దాడించుకొనెను. శోకరసము పరమావధిని బొందెను. కేశవరావుగారు జగ్గరాజునకు 'నటకావతంసుఁ' డని బిరుదొసంగిరి.

మూఁడురోజులు గారడీవాండ్రు, తక్కినవారు తమవిద్యలను ప్రదర్శించుచునే యుండిరి. పాములవాండ్రు మోళీకట్టిరి. దొమ్మర

వాండ్రు గడ సేసిరి. తాడియెత్తున రెండుమూఁడువాసము లొక దానిపై నొకఁ డంటఁగట్టినగడచివరకుఁబోయి నిలుచుండి, యా గడచివర పళ్ళెముంచి దానిపై దొమ్మరవాఁ డెక్కి యాడెను. మిషనరీ లీ విద్య నదివఱకుఁ జూచియెఱుఁగరు. వారు దిగ్భ్రాంతులై పోయిరి. వాట్సను అను నొక దొర యుండెను. అతనికి హిందువుల యాచారములమీఁద జాల ప్రీతి. అతఁ డనెను: "ఇట్టి మహావిద్యలు దేశమునం దుండఁగా మీరు చంపుకొని మా పాశ్చాత్య పద్ధతులవెంటఁ బడుచున్నారు" అని. గేశవరావుగా రనెను: 'పొరుగింటి పుల్లకూర రుచి దొడ్డిలోఁ గాచిన కాకరకాయ చేదు'

కళాశాలోత్సవము లయ్యెను. వేయిమంది పేదబిచ్చగాండ్రు సంతోషించిరి. తెచ్చిన యెనిమిదివేలరూపాయలును గేశవరావుగారు విరఁజిమ్మిరి అవి డబ్బులేని రోజులు పుట్టియెనుఁబది తొంబది యమ్ముచుండెను. ధనవంతులకుఁ గనులు కనవచ్చుట లేదు. పేదవాండ్రకు వరిగింజ కనవచ్చుట లేదు. తాను పండినచోట ధాన్యలక్ష్మి జనులెల్లరను గాదిచ్చి, రైళ్ళమీఁదఁబడి మఱి యెవరికో యాఁకలి తీర్చుటకుఁ బరువెత్తుచుండెను. వేసవికాలపు టెండలు క్రమక్రమముగా ముదిరెను. ఫాల్గుణము చివరకు వచ్చెను. సంవత్సరాదిపండుగ నాలుఁగైదురోజు లున్నది. క్రొత్త సంవత్సరము వచ్చును. జనులు యదృష్టములు మాఱిపోవు ననుకొనిరి. కేశవరావుగారికి జబ్బుచేసెను. కళాశాలలో నీ సంవత్సరములోఁ జాల మార్పులు జరిగెను. తాను నిత్యము కాదు. కళాశాల తనయొక్కని మీఁదఁ గాకుండ పదిమందిసంఘముమీఁద నడిపించినచో బాగుండు నని, యప్పుడు కళాశాలలోనున్న యుపాధ్యాయులందఱిని నధికృత సంఘ మని పేరుపెట్టి యేర్పాటుచేసెను. వీరికిఁ బైని పాలనాసంఘ మొకటి యేర్పఱచెను. పాలనాసంఘములో సభ్యు లైదుగురు. జమీందారుగారు, చంద్రారెడ్డి, రామచంద్రరాజు, కేశవరావుగారు, అధికృతసంఘమువారి ప్రతినిధి యొకఁడు. పాలనాసంఘములో నెప్పుడు నైదుగు రుండవలయును. సర్వాధికారములును పాలనా సంఘమువారివి. రేపు సంవత్సరాది యనఁగా వ్యాధి యనునది లేకుండ హృదయకోశము భిన్నమై గేశవరావుగారు చనిపోయిరి.

అతనిచనిపోవుట దేశమునకుఁ జెడ్డరోజు లని పెద్దలందరును భావించిరి. వారమురోజుల వఱకును దేశములో దుఃఖము తగ్గలేదు. మొదలునఱికిన వృక్షమువోలె చేతి కెదిగిన కొడుకు, కీర్తిమంతుడు చనిపోవుటవలనఁ దలిదండ్రు లిద్దరును గూలిపోయిరి. రాజ్యలక్ష్మమ్మగారి దుఃఖమునకు మితిలేదు. నాలుఁగవనాడు అరుంధతీధర్మారావులు పోయి యామెను జూచివచ్చిరి. కర్మలు రంగాపురము లోనే జరుపఁబడెను. అతనితోఁ గళాశాలపనియైన దనియే జనులందరును భావించిరి. తగినవాఁడు పోయినతరువాత నే సంస్థయు నంతే. ఆయన చనిపోయిన నెలరోజులలోనే కళాశాలలో నంతః కలహములు బయలుదేఱెను కళాశాలకు సాలునకుఁ బదివేలు కావలసియుండును. నిలువయున్న డబ్బుమీఁద నాలుగువేల పైచిల్లర వచ్చును. తక్కిన యైదున్నర వేలును వచ్చుమార్గము పోయినది. దేశముమీఁదికిఁ బోఁగలవాఁ డెవ్వఁడు? తేఁగలవాఁ డెవ్వఁడు? మహావ్యక్తియైన కేశవరావునకుఁ గళాశాలార్థము యాచనచేయుటభూషణముగా నుండెను. తక్కినవాఁడెవఁడుపోయినను దేశములో లెక్కపెట్టువాఁడెవ్వఁడు? క్రమముగాఁ గళాశాల పెండికిఁదగినరొట్టెయన్నట్లు వచ్చెడు నాల్గువేలలో సరిపోవునట్లు తగ్గించఁబడెను. శిల్పశాఖతగ్గించవలె ననుకొనిరి. కాని యది కేశవరావుగారికిఁ బ్రియతమాతిప్రియతమము. అందుచేత నది తీసివేయరాదనిరి. ఏ భాగము తగ్గించవలయునో తెలియలేదు.

మొదటి రెండేండ్లును సామాన్యవిద్యాశాఖలోని యుపాధ్యాయులు జీతములు పుచ్చుకొనకపోయినను గడచినయేఁడు జీతములు పుచ్చుకొనిరి. కేశవరావు పినతల్లి కుమారుఁడు నారాయణరావను నాతఁడు కళాశాలకుఁ బ్రధానోపాధ్యాయుఁడుగా నుండెను. ఆయన కడచినయేఁడు నెల కేఁబదిరూపాయలుగా జీతముతీసికొనెను. ఇప్పుడు తనకు వందరూపాయలైనఁగాని చాల దనెను. సంస్కృతము చెప్పుటకు బి. ఏ. సంస్కృతముతో ప్యాసైన యొక వైష్ణవుఁడు కలఁడు. ఆయనపేరు శఠగోపాచారి. కడచినయేఁ డాయనగూడ నేఁబదిరూపాయల జీతము తీసికొనెను. తెలుఁగు చెప్పుటకు రామశాస్త్రి యని యొక పండితుఁడు. అతనికి ముప్పదిరూపాయల జీతము. పసిపిల్లలకుఁ

బాతముచెప్పుటకు సూర్యనారాయణ యని యొకఁడు. అతనికిఁ బాతికరూపాయలు జీతము. ఇద్దఱు గుమస్తాలు. ఇద్దఱు బంట్రౌతులు. సంగీతోపాధ్యాయుఁడు. ప్రతిశాఖయందును ముప్పది నలువదిమంది విద్యార్థులున్నారు. మొత్తము విద్యార్థులు మూఁడువందలగుంది. ఎవరివద్దను జీతములు పుచ్చుకొనరు. బీదవిద్యార్థులకు వసతిగృహములో నూరకే భోజనములు పెట్టుచుండిరి. దీనికంతయుఁ గేశవరావుగారు ద్రవ్యము దేశములోఁ ద్రవ్వి తెచ్చెను. పెద్దగుమస్తాపేరు సంగయ్య. సంగయ్యయు, నారాయణరావును జిన్నప్పుడు కలసి చదువుకొనిరి. అందుచేత వారిద్దఱకు నన్యోన్యము. చంద్రారెడ్డి సమర్థుఁడు. కాని బహువ్యాపృతుఁ డగుటచేఁ గళాశాలకుఁ దన శ్రద్ధయంతయు ధారపోయలేకపోయెను. చైత్రమాస మారంభమైన వెంటనే వేసఁగి వచ్చిన దనుకొనుచుండఁగా మూఁడునాళ్ళు బ్రహ్మాండమైన ముసురు పట్టెను. వర్షములు ధారగాఁ గుమ్మరించెను. ఊరుచుట్టుపట్ల జలమయమై గుండేఱు పొఱలసాఁగెను. దేశమంతయుఁ గురిసిన యీ వర్షముచేత నకాలమున నేళ్లుపొంగి రైళ్ళునడచుటకూడ లేదని పత్రికావార్తలు వచ్చెను. మూఁడవరోజున రెండుజాములవేళ వర్షము విజృంభించెను. నెమ్మదిగ గాలి సాఁగెను. సాఁగినగాలి క్రమక్రమముగా వృద్ధిపొంది ఝంఝామారుత మయ్యెను. అది సాఁగిసాఁగి ప్రళయమారుతమయ్యెను. మహావాయువు వేగపరిఘూర్ణమానవీచికా పరంపరలతో సుడులుతిరిగి మదపుటేనుఁగువలె వృక్షశాఖాగ్రముల హోరుమని తాఁకును. ఫెళఫెళామని శాఖలు విఱుచుకొనిపడును. మహావేగపరాక్రాంతగృధ్రరాజువలె గ్రామములమీఁదనుండి దూసికొనిపోవును. ఇండ్లపైకప్పులు లేచిపోయి యూళ్ళన్నియు దివాంధముల నివాసభూములవలె శిథిలత వెళ్ళఁబెట్టును. ఆకాశమునుండి క్రిందికిదూఁకు జలపాతమువలె రంయుమని వచ్చి జలప్రవాహముల నణఁచును. ప్రవాహములు ఘూర్ణిల్లిపోవును. హోరుమని గాలి కత్తి విసిరినట్లు బయలిపొలాలమీఁద రివ్వుమని లాఁగుకొనును. చలిచేత భూదేవియొడలెల్ల ముడుచుకొని రోమాంచముకలిగినట్లు పచ్చని యాకెల్ల నలిగిపోయి మఱల నిలువఁద్రొక్కుకొనును. రోదోంతరాళమంతయు మంచులుపట్టినట్లు, ఎడారులలో నిసుకగాలులు వీచినట్లు

దద్దరిల్లిపోయెను. వందయేండ్లనాఁటి మహావృక్షములుకూడ కూఁకటి వ్రేళ్ళతోఁబెల్లగింపఁబడెను. సౌధములు నిర్మూలములయ్యెను. పట్టాలు తొలఁగి రైలుపెట్టెలు పడిపోయెను. కలకత్తానుండికాని చెన్నపురి నుండి కాని మెయిలులే రాలేదు. ఏ దేశములో నే ఘోరము జరిగెనో తెలియలేదు. అఱువదియేండ్లక్రిందటవచ్చిన యుప్పెనవలె నుప్పెన వచ్చి తీరదేశము సముద్రముచేతఁ బరిలీఢమైన దని జనులు చెప్పుకొనఁ జొచ్చిరి. పేదవారిగుడిసెలన్నియుఁ బడిపోయెను. మట్టిగోడలు కూలిపోయెను. కట్టుకొనుటకుఁ బొడిగుడ్డలేక, తలదాఁచుకొనుటకుఁ జెట్టుక్రిందికిఁ బోద మనిన నదివిఱిగిపడి చచ్చిపోదుమేమో యను భయముతో నా మహావాయువులో నొకచోటునుండి మఱొక చోటికిఁ బోవుటకైనఁ గాళ్ళు నిలువక పేదజను లల్లాడిపోయిరి. పక్షులు, జంతువులు, పసిపిల్లలు మరణించిరి. ఆ పగలెల్ల నీ వాయువు వీచెను. రాత్రియంతయు విసరెను. మహాసౌధములలోఁ బ్రభువులు లోలిమ్లీరగ్గులు ముసుఁగులుపెట్టుకొని మెత్తనిపఱుపులమీఁదఁ దలుపులుబిగించుకొని సుఖముగా నిద్రించుచుండిరి కాఁబోలు! పేదలుహూహూ యని వడఁకుచుఁ బడిపోయినగోడలమధ్య దాఁగుకొనిరి. తాటియాకులు నెత్తిన నైచుకొని ముడుచుకొని బురదలోఁ గూర్చుండిరి. చూరువంగిన యే గోడవద్దనో పసిపిల్లలను గోడవైపునుంచి తాము రెండవవైపునబండుకొన్న పేదతల్లులవీపులమీఁద శిశిరవాయువులు నిర్దయముగావీచి తద్భాగములకుఁ జైతన్యములేకుండఁ జేసెను. చలి చర్మదఘ్నమై, రక్తదఘ్నమై, యస్థిదఘ్నమై పేదలను మిక్కిలి బాధపెట్టెను. అది ప్రాణదఘ్నమై చాలమంది చచ్చిరి. మఱునాఁడు తెల్లవాఱువఱకు గాలితగ్గెను. సూత్నపతిశిరహితమువలె, నిఱువది యొక్కసార్లు భార్గవునిచే నిక్షత్త్రరాజన్యమైన యార్యావర్తమువలెఁ, బరశురామప్రీతిమైన గ్రామములమీఁద వానగురిసినట్లు గ్రామ మెచ్చటఁజూచినను విశ్లథమైయుండెను. కళాశాలలో వేసిన పాకలు, పందిళ్లు, కట్టినసావడులు కూలిపోయెను. నారాయణరావుగారవి యన్నియు మఱల వేయించిరి. అన్నియు మరమ్మతులు జరిగెను. ఆషాఢమాసమునాఁటికి దేశమునఁ గళాశాలలతోఁబాటు జాతీయకళాశాలయుఁ దెఱువఁబడెను. ఇంగ్లీషుపాఠశాలలోఁ జదువ

రాదని ప్రచారకులు నిర్బంధింపఁజొచ్చిరి. అందుచేతఁ గళాశాల కెక్కువమంది విద్యార్థులు వత్తురేమో యని యాశపుట్టెను. కేశవ రావుగారు చనిపోవుటచేతఁ గళాశాలపనియైన దని చాలమందికిఁ దెలిసి విద్యార్థులెవరును రాలేదు. సుబ్బన్నపేటలో జమీం దారుగారి కాలేజి తెరువఁబడెను. ఊరిలో నున్న హైస్కూలు లోనివిద్యార్థులందఱు నందులోఁ బోయిచేరిరి. అచ్చటనున్న హైస్కూ లును రాజాగారిదే. ఉపకారవేతనములు జమీందారుగారు కొన్ని యేర్పఱచెను. వాని కాశపడి కొందఱువిద్యార్థులు వచ్చిరి. బెజ వాడనుండి సుబ్బన్నపేటకు రైలుమార్గము వేయబడెను. రైలు రాజాగారి సొంతఖర్చుమీఁద వేసికొనిరి. ఎం. ఎస్. ఎం. వారు వీరి కా పనియంతయుఁ జేసిపెట్టినందులకు రెండులక్షలు తీసికొనిరి. రైలు పెట్టెలు, సామానులు మొదలైన వన్నియు వీరే కొనిరి. లాభనష్టము లన్నియు జమీందారువే. క్రొత్తగా రైలుపడుటచేత కాలేజీకి జనము వచ్చిరి. ఈ యుబ్బులో జాతీయకళాశాల పండుకొనెను. పాలనా సంఘములోఁ గేశవరావుగారిబదులు నాగేశ్వరరావుగారిని వేయు టకై చంద్రారెడ్డిగా రూహించిరి. రామచంద్రరాజుగా రిష్టపడలేదు. అధికృతసంఘప్రతినిధి శఠగోపాచారి యిష్టపడెను. శఠగోపాచారి యెయెండ కా గొడుగుపట్టువాఁడు. అతఁడు సంస్కృతముతో బి.ఏ. ప్యాసైనను, జాతీయవిద్యావాదియైనను నింగ్లీషునందే యభిమానము కలవాఁడు. పాశ్చాత్యులు పదార్థవిజ్ఞానశాస్త్రమున మహాప్రతిభులైరి. వారిజ్ఞానమంతయు నింగ్లీషుభాషలో నున్నది. ఇంగ్లీషుభాష చదవ కుండ మనకు సాఁగ దని వాదించును. పాలనాసంఘములో జమీం దారుగారు సభ్యుఁడేకాని యాయన యే సమావేశమునకు వచ్చిన పాపానఁ బోలేదు. అందుచేత నింకొక క్రొత్తసభ్యునిగూడ వేసికొను టకును, జమీందారుగారిని పోషకులుగా నుంచుటకును శఠగోపా చారి, చంద్రారెడ్డులు నిర్ణయించి యొక ప్రణాళిక వ్రాసి, దానిని రిజిష్టరుచేయించి, రాజుగారు పోషకుడు, రాధాకృష్ణయ్యగారు, చంద్రారెడ్డి, రామచంద్రరావు, నాగేశ్వరరావుగారు, అధికృతసంఘ ప్రతినిధి - ఇది పాలనాసంఘము. కళాశాలలో సంగీతము, వడ్రంగము, కలంకారీ, నేత - ఈ శాఖలు తీసివేయఁబడెను. నారాయణరావుగారికి

డెబ్బదిరూపాయలజీతముచేసిరి. పసిపిల్లలు గ్రామములోనున్న ప్రైమరీ స్కూలులో జదువుకొందురని సూర్యనారాయణను తగ్గించిరి. ఇవి చేసిన క్రొత్తమార్పులు.

చైత్రమాసములో వీచిన గాలులకుఁ బడిపోయిన పాకలు కట్టించుటకు మూఁడువేలరూపాయల ఖర్చు చూపించిరి. సాలునకు వచ్చు నాదాయము తక్కిన యన్నిశాఖలును తీసివేసినను నీ సంవత్సరము చాలునటు లేదు. ప్రతియేఁట దసరాపండుగలకు దేశములో జాతీయభిక్షకుఁ బోవుటకుఁ గేశవరావుగా రేర్పాటుచేసిరి. దసరా భిక్షులమీఁద వచ్చు నాదాయముతో నీసంవత్సరము గడుపవలయును. దసరాకొఱ కెదురుచూచుచుండిరి.

రామశాస్త్రిగారిది గోదావరి జిల్లా. ఆయన తెలుఁగులోఁ జక్కని సాహిత్యము కలవాఁడు. వారిపూర్వులు పెద్దాపురమునాఁటి నుండి పండితులే. వారి వంశమున కావైపునఁ జాలపే రున్నది. ఆ రాజ్యము చ్యుతియై తుని, పిఠాపురము, లక్ష్మీనరసాపురము మొదలగు చిన్న రాజ్యములు వృద్ధినొందినను రామశాస్త్రిగారి వంశమర్యాద మార్పులుపొందలేదు. పెద్దాపురము శాఖయైన తుని మహారాజు దద్వంశ్యుఁడైన రామశాస్త్రిగారిని గౌరవించనెంచి యాయనను బిలిపించుకొనెను. రామశాస్త్రి వదలలేకవదలలేక జాతీయకళాశాలను వదలిపోయెను. రామశాస్త్రికి బదు లెవరిని వేయుట యని ప్రశ్నరాఁగా రామచంద్రరాజు ధర్మారావు పేరెత్తెను. చంద్రారెడ్డికి ధర్మారావన్నచోఁ దగనియభిమానము. రాధాకృష్ణయ్యగారికి మాధ్యస్థము. నాగేశ్వరరావు మౌన మవలంబించెను. శఠగోపాచారికి యథార్థస్వరూపము తెలియదుకాని కోటలోనికి వచ్చుట, పోవుటచేత ధర్మారావున కచ్చట పలుకుబడియున్న దనుకొని యతఁడు నంగీకరించెను. ధర్మారావు జాతీయకళాశాలలో ముప్పదిరూపాయలమీఁద తెలుఁగు పండితుఁడుగా నేర్పాటయ్యెను. ధర్మారావున కింగ్లీషుపాఠశాలలలో కన్న నిచటఁ బనిచేయుటయే యెక్కువ రుచించెను. అతఁ డింగ్లీషు చదివినను, చదువుచున్నప్పుడుకూడ దానిపై నతనికి ద్వేషమే. బ్రదుకవలయునుకనుక, నేఁటికాలపుఁ బ్రదుకు కింగ్లీషుచదువువలన జెల్లుఁ గనుక నది చదివెను. హరిప్పనాయనిపుణ్యమా యని కోటలో

నుండి సర్వసంభారములును ముంగిటికి వచ్చుచుండెను. తాను నెల కొక్క ముప్పదిరూకలు తెచ్చెనా చిన్నచిన్న యప్పులు తీర్చివేసి సుఖముగా బ్రదుకవచ్చు ననుకొనెను. ధర్మారావు ప్రవేశించినతరు వాత నెలగడచెను.

అది సెప్టెంబరుమాసము. గడచిన యేఁడాది లెక్కలు సరి చూచుటకు నాడిటరు వచ్చెను. పురపాలకసంఘము లెక్కలు సరి చూడఁబడెను. కళాశాల పాలనాసంఘము రిజిష్టరుచేయఁబడుటచే జాతీయకళాశాలలెక్కలుగూడ నతనికే యీయఁబడెను. ఆడిటరు లెక్కలన్నియు సరిచూచి నాల్గవరోజున లెక్కలు సరిగాలేవనియు, ధనము చాలభాగ మన్యాక్రాంతము చేయఁబడెననియుఁ జంద్రా రెడ్డితోఁ జెప్పెను. చంద్రారెడ్డి పాలనసంఘాధ్యక్షుఁడు. చంద్రా రెడ్డి విచారించలేదు. దసరాలు సమీపించెను.

దసరాచందాలకు ధర్మారావు గుంటూరుజిల్లాకుఁ బోయెను. రాఘవరావు నరసరావుపేట కాపురస్థుడు. ధర్మారా వచటకిఁ బోయెను. రాఘవరావు చదువు మానివేసి రెండేండ్లనుండి సహాయ నిరాకరణోద్యమములో నుండెను. మనిసి గొప్పవివేకశాలి యగుట చేత నా చుట్టుపట్లనున్న జాతీయనాయకులలో నితఁడు నొక్కఁడుగాఁ బరిగిణింపఁబడుచుండెను. అదివరకే యతనికిఁ గారాగృహప్రాప్తి జరుగవలసిదేగాని రాఘవరావుతండ్రి యధికారులతోఁ బలుకుబడి కల వాఁడగుటచేత నట్టి దింకను జరుగలేదు. రాఘవరావు తీక్ష్ణ వాది. ఉపన్యాసములలో రాచరికమువారిమీఁద నిప్పులు గురిపిం చును. అన్నియు సమోజై యున్నవి. రాఘవరావు తాఖీ దెప్పుడు పడిన నప్పుడే వచ్చునని యెదురుచూచు చుండెను. అతనిభార్య క్రొత్తగాఁ గాఁపురమునకు వచ్చెను. ధర్మారావు 'నీకుఁ గార్యమైన సంగతియే నాకుఁ దెలియనీయలేదే' యనెను. రాఘవరావు తన కార్యపుసంగతు లన్నియు మిత్రునితోఁ జెప్పెను: 'మా నాయనగారు చనిపోయి యాఱునెలలైనది. నాకు మా యాస్తి యైన మేమియుఁ దెలియదు. ఆస్తియంతయు నాయనే చూచుచుండెను. నే నుద్య మములోఁ దిరుగుచున్నాను. మా యత్తవారిది బాపట్ల. నీ వెఱుఁ గుదువుగదా! పిల్ల వ్యక్తురాలై యేఁడాది కావచ్చినదని వారు

తొందరపెట్టిరి. నే నుద్యమములోఁ దిరుగుచున్నందుకు మామామ గారికిఁ గోపము. కాని పిల్లను దనయింటిలో నుంచుకొనఁడుగదా! నే నుద్యమ మేదో తేలినఁగాని కార్యముచేసుకొన నన్నాను. గాంధి గారు స్వరాజ్యము సంవత్సరములో వచ్చునని చెప్పిరి. దేశములో నాయన యేమో మాంత్రికుఁ డని, మన ప్రయత్నములు లేకుండనే స్వరాజ్యము తెచ్చి మనచేతులలోఁ బెట్టునని యనుకొనిరి. ఆయన చెప్పిన కార్యక్రమము సరిగా దేశమంతయు నాచరించిన వచ్చునని యాయన యుద్దేశ్యము. దేశమంతయు నట్లనుకొనలేదు. ఇంగ్లీషు విద్యాశాలలయందు మానినవాఁ డెవ్వఁడును లేఁడు. మానినవాఁడు తిండిలేక చెడుచున్నాఁడు. న్యాయస్థానములు యథాప్రకారముగా సాఁగుచున్నవి. స్వరాజ్య మెట్లు వచ్చును? దేశమందఱు స్వలాభ పరాయణులైనతరువాత దేశమునకు విముక్తి యెచ్చటిది? గాంధి గారు పెట్టిన గడువైనంతనే దేశమున నందరకును విరక్తి జనించెను. విముఖులందఱును 'తెచ్చినారయ్యా స్వరాజ్య' మని యెగతాళి చేయుచున్నారు. నేనును గార్యముచేసికొనుట కనుమతించవలసి వచ్చినది. కార్యమునకుఁ దరలి వెళ్ళితిమి. మామామగారు పీఁటల మీఁద నాకు విలాయితీగుడ్డలు పెట్టెను. నే నవి కట్టుకొనలేదు. బంధువులలోఁ గలవరము బయలుదేఱెను. చివరకుఁ జేయునదిలేక యప్పుడు బజారునకుఁబోయి ఖద్దరుబట్టలు తెచ్చిరి. మామామగారు గ్రామ కరణము. అందుచేత నాయన కుద్యోగము పోవునేమోయని భయము. కృష్ణాజిల్లాలోఁ గైకలూరుతాలూకాకరణములందఱును రాజీనామా లిచ్చిరి. అట్లుండవలయును దేశభక్తియున్నచో. నాభార్యకుఁ బీటల మీఁదికి మేము ఖద్దరుచీరలు కొనిపోతిమి. వా రాచీర లట్టిపెట్టి యేవో విదేశిచీరలు కట్టించిరి. రాత్రి గదిలోనికి నాభార్య విదేశి చీరతోనే వచ్చెను. నే నామెతో మాట్లాడలేదు. తెల్లవాఱులు నంతే. రెండవరోజున ఖద్దరుచీరగట్టి పంపించిరి. దానితో మామ గారికి నా పెంకితనమంతయుఁ దెలిసినది. మేము కొంచెము పేదవా రముగదా! అందుచేత నన్ను లొంగఁదీయవలయు నని మామామ గారి యూహ. కాని యది యేదియు సాఁగలేదు. మాకు నాలుఁగెక రముల పొల మున్నది. అది మెట్ట. పండినప్పుడు పండును. లేదా

పండదు. మాయన్న కోటలో గుమాస్తా. ఆయన కిరువదిరూపాయ లిత్తురు. నేను సంపాదించినఁగాని సాఁగదు. మాతల్లి బ్రదికియున్నది గావున నెట్లో సాఁగుచున్నది. లేనిచో నాభార్య యేమి కావల యునో ! తెలియదు" అని తనకథయంతయుఁ జెప్పెను. ధర్మారావు నకు, రాఘవరావునకుఁ బ్రాణస్నేహ మని యింటిలోనివారందఱ కును దెలియును. ధర్మారావు వారియింటనే యొకనాఁ డుండి మఱు నాఁడు గుంటూరునకుఁ బోయి, యచ్చటఁగూడ వసూళ్ళు జరిపెను. ప్రతివారును 'సుబ్బన్నపేఁట జాతీయకళాశాలయంతయు మార్చిరఁట గదా! మునుపున్న శాఖలన్నియుఁ దీసివేసి రఁట. ఇంకను చందా లెందుకయ్యా! దొంగదోపిడిగా నున్నదే వ్యవహారము' అనిరి. కొందఱు చందా లిచ్చిరి.

ధర్మారావు మఱునాఁడు బాపట్లకుఁ బోయెను. బాపట్లలోఁ గిరీటి మేనమామ డిప్యూటీ కలెక్టరు. ధర్మారావునకుఁ గిరీటిప్రియు రాలిని జూత మనిపించినది. ఒకరోజున సాయంకాలమున వెళ్లెను. వాకిట నొక పదునాల్గేండ్ల బాలిక, యెఱ్ఱనిది, బక్కపలుచనిది, విషాదభావాచ్ఛాదితముఖమండల యొకకన్య గోచరించెను. అతఁ డామెయే శశిరేఖ యనుకొనెను. ఏల యనఁగా 'వసనే పరిధూసరే వసానా నియమక్షామముఖీ ధృతైకవేణీ, అపినిష్కరుణస్య శుద్ధశీలా మమదీర్ఘం విరహవ్రతం బిభర్తి' అని కిరీటి యనుకోదగినంత విరహి ణిగా గోచరించినది. ధర్మారావు తనలో మిత్రుని జన్మసార్థకతను గూర్చి మిక్కిలియు సంతోషించెను. ఏకాదశినాఁటికి మఱల సుబ్బన్నపేఁట చేరుకొనెను. ద్వాదశినాఁటికిఁ గళాశాలకుఁ దదితరు లెవ్వరును రాలేదు. ఒక్క తానే కనఁబడెను. తరువాత నైదురోజుల వఱకు నితరోపాధ్యాయులు రాకపోవుటచేత ధర్మారావు నిర్వ్యాపారుఁడుగా నుండెను.

కోటలో ధర్మారావునెడల యత్యుత్కృష్టసౌమనస్య మేర్పడెను. చంద్రారెడ్డికి, రాధాకృష్ణయ్యగారికిఁ జక్కనిస్నేహ ముండెను. చంద్రారెడ్డి ధర్మారావునుగూర్చి యెపుడు ప్రసంగించినను సగౌరవ ముగాఁ బ్రసంగించుటవలనను, గడచిన పదేండ్లుగా నతని సౌజన్యము ధర్మపక్షపాతము నిర్భయత్వము నెఱిఁగి యుండుటచేతను, ధర్మా

రావు మంచికవి యని వారువీరు చెప్పుకొనుచుండుటచేతను రాధాకృష్ణయ్య కతనిమీఁద గౌరవమే యేర్పడెను. రామేశ్వరముగారికి మనసులో ధర్మారావునెడ విరోధభావమే యుండెను. కాని యన్నగారి భావమున కెదురు చెప్పలేదు. సర్వారాయఁ డెప్పుడో కాని సుబ్బన్నపేటకే రాఁడు. దివానుగారు ధర్మారావు ప్రస్తావనయే చేయఁడు.

ప్రహ్లాదనాటకమునకు హరప్పనాయని దీసికొనిపోయిన తరువాత ధర్మారావును మఱలఁ గోటలోనికి రానీయకుండుటకుఁ బ్రయత్నములు జరిగెను. ఈసారి ధర్మారావు వచ్చినప్పుడు లోనికిరానీయవలదని కోటద్వారపాలకులకు రంగారావుగారు చెప్పెను. తరువాత నాలుఁగురోజులవఱకు ధర్మారావు కోటకే రాలేదు. అయిదవనాఁడు హరప్పనాయఁడే ధర్మారావునింటికిఁ బోయి తీసికొనివచ్చెను. నాయనితోఁ గలసివచ్చు ధర్మారావును వలదనవలెనో, యూరకొనవలెనో ద్వారపాలకునకుఁ దెలియలేదు. లోని కేల రానిచ్చితి వని మఱుఁనాఁడు ప్రశ్నించిన రంగారావుగారికి వాఁడదే సమాధానము చెప్పెను. తనకొడుకే ధర్మారావునింటికిఁ బోయెను. అది జమీందారులకు లాయకీ కాదు. కొడుకును గోపించవలె ననుకొన్నాఁడు. రంగారావుగారు రెండవయంతస్థున సావడిలో గూర్చుండెను. కోట ముందుభాగమంతయుఁ గనఁబడుచుండెను. దూరమునుండి దివానుగారును, శశియుఁ గలసివచ్చుచుండిరి. రంగారావుగారి కొకచిత్రమైన యూహ తోఁచెను. హరప్పనాయఁడు ధర్మారావునింటికిఁ బోవుట లాయకీ కాదు. తనభార్య దివానుతోఁగలసి నడచివచ్చుట లాయకీయేనా? ఆ మఱునాఁటినుండి ధర్మారావు కోటలోనికివచ్చుట కెవ్వరు నడ్డంకి కలిగించలేదు.

ఈట్సును హరప్పకు సంవత్సరమున్నర చదువుచెప్పిన తరువాత నతని కొకసంగతి తెలిసెను. హరప్ప తనవద్ద నింగ్లీషుమాటల కర్థముమాత్రమే నేర్చుకొనుచుండెను. ఆ భాషలో మాటాడుటకు సామర్థ్యముమాత్రమే గడించుచుండెను. హరప్ప యిప్పటికిఁ దప్పులతో నింగ్లీషుమాటాడఁగలఁడు. ఒక్కొక్కచోటఁ గావలసినమాట వారకిక తెలుఁగుమాటనే యుపయోగించును. అచ్చటఁ గావలసిన

యింగ్లీషుమాట ఈట్సను చెప్పును. ఆమాటను వెంటనే హరప్ప తనపుస్తకములో వ్రాసికొనును. తరువాత నెన్నిసార్లు చూచినను నొక్కసారి విన్నమాట మఱచిపోయినట్లు కనిపించదు. ఈట్సు నెన్ని సారులు క్రీస్తుమతమునుగుఱించి ప్రస్తావించినను హరప్ప బదులు చెప్పఁడు. కాదనఁడవుననఁడు. అతని మొగమున నేభావము నుండదు.

హరప్పమొగమున సహజముగ విషాదరేఖ యొకఁ డుండును. అది యిప్పుడు రెట్టింపుగాఁ గనిపించఁజొచ్చెను. ఒకనాఁటి సాయంకాలమున ధర్మారా వడిగెను. 'అయ్యా! తమరు మఱి దిగులుగా నుండుచుండిరి. కారణ మేమి?'

హరప్ప — మాయమ్మగారికి, నాయనమ్మగారికిఁ గర్మలు సరిగాఁ జరుగలేదు. వారికిఁ బ్రేతత్వవిముక్తి లేదు. నాకు నాశౌచ నివృత్తి కలుగలేదు. ఈ యాశౌచముతో మావంశముఖ్యదైవమైన వేణుగోపాలస్వామివారిని దర్శించుటకైన వీలులేకున్నది. మాతండ్రితో నీ విషయము మాటలాడుదమన్న నాకు భయముగా నున్నది. వారివద్ద నాకుఁ జనవు తక్కువ. ఈహృదయభారము తగ్గుటెప్పుడో!

హరప్పమనసులోని దెప్పుడును జెప్పఁడు. ఆ గుణ మతని నెత్తురులో నున్నది. ఇతరులయెడ మహాగంభీరుఁడైన యా కుఱ్ఱవాఁడు ధర్మారావునెడల స్నిగ్ధుఁడై తనకీవియే మఱచిపోవును. కుఱ్ఱవానికిఁ బదుమూఁడేండ్లు లేవు. దివానుగాని రాధాకృష్ణయ్యగాని యతనియెదుట నేమియు ననరు. హరప్ప బక్కపలుచనివాఁడై జలహీనుఁడైనను నాయనమొగమున రాజవర్చస్సు కొట్టవచ్చుచుండును. ఆవర్చస్సుముందరఁ జాలమంది నిలువలేరు. హరప్ప రోజునకుఁ బది మాటలకన్న నెక్కువమాటాడఁడు. అందులోసగము ధర్మారావుతో, సగమింగ్లీషు నేర్చుకొనునప్పుడు. కాసావాండ్రతో నొక్కపలుకును లేదు. కావలసినదానిని గన్నుతోనే కనఁబఱచును. అక్కఱలేని దానిని మొగముతోనే చెప్పును. పదుమూఁడేండ్లకుఱ్ఱవానికిఁ బరిచారకులందఱును గడగడలాడుదురు. కృష్ణమనాయనిముందుఁగూడనట్లు లేదు. కృష్ణమనాయని తండ్రియైన హరప్పనాయని జూచినచో జనులందఱు నట్లు గడగడలాడెడివారఁట. ముత్తాత యవతరించెనని ముసలిదాసీజనుం డనిరి. తల్లిపోకముందు హరప్ప యింతలేదు. పోయి

ననాఁటనుండి రోజురోజున కాయనలోఁ బ్రభులక్షణములు ప్రబలు చుండెను. రంగారావుగారితోనే ప్రతివాఁడును బోయి మనవి చెప్పు కొనుటకు వెనుతీయుఁడు. ఏ మనవియైనను శశినితో నిక్కలి తేలికగాఁ జెప్పుకొనవచ్చును. ఆమెకుఁ జక్కఁగాఁ దెలుఁగువచ్చును. ఆమె యెంతచెప్పిన రంగారా వంత. పరిచారకు లేదైన మనవిచేసిరేని వారి పనిచేయుటయే శశికిష్టము. మొదటఁ గొత్తరాణి యెట్లున్నను తరు వాత తరువాత పరిచారకులకందఱకు నామె యన్నచోఁ బ్రేమయే బలిసెను. ఆమెకుఁ దాము చేయవలసినపని లేదు. తమ కేది కావల సిన నామె చేసిపెట్టును. సేవకులంద ఱామెను దొరసాని యందురు. రాణిగా రనరు, అమ్మగా రనరు. ఆమెమూలమున రంగారావుగారు జమీందారుగా గనిపించుట మానివేసెను. రంగారావుగారి ప్రస్తా వనయే పరిచారకు లెవ్వరును జేయరు. ఎప్పుడైనను బాబయ్యగారు, దొరగా రన్నమాటలు పరిచారకులనోట వచ్చినచో హరప్పనాయఁ డని యర్థము.

హరప్పకుఁ దెలుఁగు వ్రాయను, జదువను వచ్చును. ధర్మా రావు సుమతీశతకము కృష్ణశతకము, రుక్మిణీకళ్యాణము, గజేంద్ర మోక్షము నన్నియుఁ జదివి వినిపించి, వినిపించుచు మాటల కర్థములు చెప్పెను. హరప్ప చదువను, వ్రాయను నేర్చుకొనుట వేఱు, విషయ మెఱింగికొనుట వేఱుగా నేర్చుకొనెను. ధర్మారావు వీలుకుదిరినప్పు డెల్ల పురాణగాథలు చెప్పెను; మతవిషయములు చెప్పెను. హరప్ప చదివినది తక్కువ; తెలిసికొన్నది యెక్కువ. సంవత్సరమున్నర ధర్మారాయనిస్నేహ మెఱిఁగిన హరప్పకు హృదయమును బిండు చున్న విషయములు రెండు: ఒకటి తల్లికిఁ గర్మచేయవలయునని; రెండు గోపాలస్వామికిఁ గల్యాణములు చేయించవలయు నని.

వారమురోజు లైన తరువాత జాతీయకళాశాలోపాధ్యాయు లందఱు వచ్చిరి. సెలవు లేకాదశితోనే మైపోయెను? అందఱును బున్నమదాఁటిన తరువాత వచ్చిరి. ఇన్నాళ్ళు సెలవు లెవరిచ్చిరో తెలియదు. ధర్మారావునకు వారిప్రవర్తన చూచినచో 'స్వయం రాజా స్వయం మంత్రీ' గా నున్నది.

# పంద్రెండవ అధ్యాయము

పురపాలకసంఘసౌధనిర్మాణము పూర్తియయ్యెను. కోటకు దేవాలయములకు మధ్యనున్న వీధి కెదురుగా నుత్తరపుదిక్కున నున్న పొలాలలో నిర్మింపఁబడిన యీ సౌధము గ్రామమునంతయుఁ జూచున ట్లుండెను. గడచినసంవత్సర మెనిమిదివేలును రాచరికము వారికిఁ జెల్లించలేదుగనుక నీ యేఁడు రెండెనిమిదులు పదునాఱువే లొక్కసారిగాఁ జెల్లించవలయు నని చంద్రారెడ్డిగారికి లేఖవచ్చెను. వ్యవహారములకన్న సౌధప్రవేశోత్సవము ముందుగా విచారించవలసి వచ్చెను. ఆ యుత్సవపువేళ ఖర్చునకుఁగాను నాలుగువేలు నిలువ యుంచఁబడెను. ఆ యుత్సవపువేళ గవర్నరుగారు వచ్చి సౌధమును దెఱుతురు. సుబ్బన్నపేట రైలుస్టేషను గుండేటికి దగ్గఱగా నుండెను. క్రమముగా నూరు గుండేటికిదగ్గఱగా వ్యాపించుచుండెను. గుండేఱు వఱదలువచ్చినచో నిరుడు పొలాలన్నియుఁ బోయినవి. మఱలఁ బదేండ్లకు వఱదలు వచ్చెనా, కొన్ని యిండ్లు చుట్టబెట్టుకొని పోవునేమో?

రైలుస్టేషనునుండి యెఱ్ఱకాగితముల తోరణాలు, గొలుసులు నూత్నసౌధమువఱకును వ్రేలాడఁదీయఁబడియుండెను. రక్షకభటులు ప్రతిగజ మెడమెడమున కాపలా నిలుచుండిరి. కాలేజీ, హైస్కూలు, కోట, పోలీసుస్టేషను, పురపాలకసంఘసౌధము నన్నిచోట్ల స్వాగతములు వ్రాసి ద్వారములయందుఁ గాగితములతో నార్చులు కట్టఁబడెను. బెజవాడనుండి యాహ్వానములమీఁదఁ బెద్దయుద్యోగస్థులందఱును వచ్చిరి. జిల్లాబోర్డుసంఘసభ్యులు, తాలూకాబోర్డు సభ్యులు విచ్చేసిరి. పెద్దయుత్సవము జరిగెను. రెండు బ్యాండుమేళాలు కుదర్పఁబడెను. గవర్నరుగారు విచ్చేసిరి. వారికి స్వాగతపత్రము చదువఁబడెను. వారు నూత్నసౌధమును దెఱచిరి. ఆ సమయమున నొకయుపన్యాసము గావించిరి: రాజధానిలో నెచ్చటను బురపాలకసంఘమున కంత సౌధము లేదనియుఁ, గార్పొరేషనుకుఁ దగినంత సౌధమనియు, సుబ్బన్నపేట మహానగరము కాగలందుల కిది

సూచకమనియు ననిరి. అందఱు సుబ్బన్నపేట మహానగరమైనట్లే కరతాళధ్వనులు చేసిరి. పేట నాల్గువైపులఁ బదిమైళ్ళు పెరుఁగును. రాజధాని యగును. ఆంధ్రులకుఁ బ్రత్యేకరాష్ట్రమువచ్చినప్పుడు సుబ్బన్నపేటలో నాంధ్రదేశపుగవర్నరు నివాస ముండు ననెను. సభ్యులందఱును గరతాళధ్వనులచేత నిర్ఝ్నపగిలించిరి. భవిష్యత్తులో సుబ్బన్నపేటలో ట్రాములు తిరుగును, సోల్జర్లు తిరుగుదురు. ఎల్ఫిన్స్టనువారిసినిమాలు పదిబలును. మ్యూజియము లుండును. ఆంధ్రదేశమునఁ బ్రధానవగరమగు నని చమత్కృతిగా నుపన్యసించెను. సభ్యులందఱు నన్నియు నైనట్లే సంతసించిరి. జమీందారుగారిసాహాయ్యమువలన నగరములోఁ గళాశాల యేర్పడినట్లే వారే సుబ్బన్నపేటను సర్వవిధముల మహానగరముచేయుటకు హేతుభూతులు కాఁగలరని ప్రసంగించెను. చేతులతో బల్లలమీఁదఁగొట్టినమ్రోఁతకు క్రొత్తబల్లలు పూసినవార్నీసు కొంతచెఱుపుకొన్నవి. సభ యగువఱకుఁ బ్రొద్దునఁదొమ్మిదిన్నర యయ్యెను. చంద్రారెడ్డిగారును, రంగారావుగారును జెటిమొకవైపున నడువఁగా గవర్నరుగారును, శశినియుఁ గలసి పురపాలకసంఘములోనుండి బయటికి వచ్చుచుండిరి.

గణాచారి తల ముడివేసికొని, మొగమునఁ బెద్ద కుంకుమ బొట్టు పెట్టుకొని, పసపుపచ్చరంగుచీరఁ గట్టుకొని యెఱ్ఱనిరైకఁ దాల్చి, నిరాభరణసుందరమైన శరీరముతో, దేవతామహిమ ప్రకాశించు ముఖరేఖలతో, ననార్తవము, నమానుషభోగ్యమైన యౌవనముతో, మహాశిల్పి చెక్కిన పార్వతీవిగ్రహమువోని కఠినవక్షముతో, సన్ననినడుము మందహాససుందరవదనారవిందముతోఁ, జిక్కనిచేతులు కదలించినపుడు దండములవలె నుండుటతో నడచిన నడక రాజహంసీవిలాససుందరమంథరయానసాదృశ్యములు తలుముకొనుటతో వారి కడ్డముగావచ్చి వేఁపమండ సౌధద్వారమున కెదురుగావదలి, యెంత నిశ్చలముగావచ్చెనో యంతమందియున్నను నంతే నిశ్చలముగా వెనుకకుఁ దిరిగిపోయెను. రక్షకభటుల కాజ్ఞ యేమనగా నెవ్వరిని గవర్నరుగారి త్రోవయందు రానీయవలదని. గణాచారి యెట్లు వచ్చినదో యెవరు జూడలేదు. ఆమెను జూచి చంద్రారెడ్డి కలఁతవడెను. జమీందారు భ్రూయుగము మెలిపెట్టెను.

గవర్నరుగా రామె యునికిని గమనించలేదు. ఆయన శశినితో నేదియో మాటాడుచుండెను. గణాచారి వచ్చుటయు, మఱల వెళ్ళుటయు రెండు నిమేషములలో జరిగెను. చంద్రారెడ్డి రెండడుగులు ముందువేసి, వేఁపమండ కాలితోఁ ద్రోసివేసెను. అతనికిఁ గాలిలో నేదియో గ్రుచ్చుకొనెను. ఏమి గ్రుచ్చుకొన్నదో విచారించుటకు వేళ కాదు.

గవర్నరుగారు సుబ్బన్నపేట కదివఱకెన్నఁడును రాలేదు. కోటయంతయుఁ దిరిగి చూచిరి. శశి వచ్చినతరువాతఁ గోటలోఁ జాలమార్పులు జరిగెను. అన్నియు యూరపుదేశస్థులమనస్సునకు నచ్చినట్లుండెను. గవర్నరుగారు చాల సంతోషించెను. హరప్పనాయని కుమారరాజుని చూపించిరి. హరప్ప సన్ననిదోవతి కట్టి గులాబిరంగు గల పట్టుజరీ యుత్తరీయము వెనుకకొంగు విడిచి తలపాగా చుట్టెను. చేతులయందు జరీపనిచేసినకోటు తొడిగెను. మెడలో రతనాలహార మొకటి వేసికొనెను. ఈ దుస్తులు హరప్ప తనకుఁ దా నిర్ణయించుకొనినవే. హరప్పనుజూచి గవర్నరు చాల సంతోషించెను. ఊట్సనుదొరతో 'నీకు మంచి చుఱుకైన విద్యార్థి దొరకె' నని ప్రశంసించెను. గవర్నరుగారికి వంగి సలాముచేయవలయు నని హరప్పకుఁ దండ్రి చెప్పెను. హరప్ప సలాముమాత్రమే చేసెను. హరప్ప యెట్లుచేసినను గవర్నరుగారి కతని జూచినచో నానందమేయైనది.

గవర్నరుగారు కళాశాలకుఁ బోయెను. ఎఫ్. ఏ. రెండవసంవత్సరముగూడ జరుగుచుండెను. 'ముందునాఁటికి బి. ఏ. క్లాసుగూడఁ బెట్టెదము' అని నాగేశ్వరరావుగారు చెప్పిరి. గవర్నరుగారు ప్రశంశించిరి. విద్యార్థులకు హితముచెప్పిరి.

గవర్నరుగారు వెళ్ళిపోయినతరువాత మఱునాఁడు చంద్రారెడ్డికిఁ గాలిలోఁ గ్రుచ్చుకొన్న దేదో మోపుచేసెను. వైద్యులను బిలిపించి చూపెను. వారి కేమియుఁ దెలిసినది కాదు. ఎవరినో పిలిచి మంత్రములు వేయించెను. తగ్గినది కాదు. మూన్నాళ్ళు మంచము నుండి లేవలేదు.

చంద్రారెడ్డి కాలితోఁ ద్రోసిన వేఁపమండ నాలుగురోజుల నుండి యెండి యున్న పురపాలకసంఘసౌధబహిర్ద్వారసమీపమున

గోడ కానుకొనియుండెను. అయిదవనాఁడు పొద్దున చంద్రారెడ్డికి మఱియు బఱువుచేసెను. గణాచారి తెల్లనికోకఁదాల్చి, సన్ననిబొట్టు పెట్టి, పయ్యెదకొంగు నడుమునకుబిగించి, యింటినుండి కోటముందుగా నడచివచ్చి యెండినవేఁపమండ తీసికొని మఱొకరావిమండతోఁ గలిపి కట్టి తెచ్చి చంద్రారెడ్డివాఁకిట నుంచెను. చంద్రారెడ్డికి మనసులో గణాచారి యన్న భయమును, కోపమునుగా నున్నది. అతఁడా యూరివాఁడే. ఆ యూరి సంప్రదాయములు తెలియును. విశ్వాసము లేకపోలేదు. తిరస్కృతి హృదయములో లేదు. పైఁకి సాటివారితో వాక్కునందుమాత్రమే తిరస్కృతి ప్రదర్శించును. తనవాకిలిదాఁక వచ్చి, గణాచారి వెళ్ళుచున్న దని యెవరో చెప్పఁగా నామెను లోనికి రమ్మని కబురంపించెను గణాచారి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి గుడిలోపల యెఱుఁగును. తతయన్నగారి యింటిలోపల యెఱుఁగును. తక్కిన గ్రామములోని యింటిగడపలేగాని, గడపలోపల నేమున్నదో యెఱుఁగదు. ఆమె యెవ్వరియింటికిఁ బోదు. ఎవ్వరు నామెను రమ్మనరు. ఆమె చంద్రారెడ్డియింటిలోనికిఁ బోక యింటికే పోయెను. గణాచారి యనవసరముగ నన్నతోఁగాని, వదినెగారితోఁగాని మాటాడదు. వారామె నొక్క చెదరుమాట యనరు. ఆమె యెప్పుడో, యెందుకో మాటాడును. ఆ యింటిలో నామె మాట్లాడినట్లే జరుగవలయును. ఆమెయొడలు దాఁచుకొనదు. వదినెగారితోఁ బాటుగా నింటిలో పనియంతయుఁ దానుచేయును. రాటముమీఁద దారముతీసి తన కూడుగుడ్డలకుఁ దాను సంపాదించును. అన్నగారి కిద్దఱుకొడుకు లున్నారు. వారిపోషణ తానే చేయును. అన్నగారి పేరు రంగయ్య. వదినగారిపేరు రంగమ్మ. గణాచారికి గణాచారి యనియే పేరు. మొదటి గణాచారి పేరు నాగమ్మ. అప్పటినుండి యిప్పటి వరకు మఱల గణాచారికిఁ బేరులేదు. ప్రతిగణాచారిని దండ్రి మాత్రము నాగమ్మ యని పిలుచును. వారి వంశములోఁ బ్రతివారికిని బ్రథమసంతానము స్త్రీ, తక్కినవారు పురుషులు. పెద్ద గణాచారి చచ్చిపోవువఱకు నీ పిల్లపేరు నాగమ్మ. తరువాత నీమె గణాచారి. రంగయ్యకుమాత్రము ప్రథమసంతానము స్త్రీ సంతానము కాదు. మఱి యింతవరకు నతనికి స్త్రీ సంతానములేదు. ఇదిచూచి

కొందరు సంప్రదాయమును నిరసించిరి. కొంద ఱీమెయే చివరి గణాచారి యనిరి. కొంద ఱీమెతో సుబ్బన్నపేట నశించుపోవునని రి. పదిమంది పదిరీతుల నాడిరి.

ఆ నాఁడు సాయంకాలము చంద్రారెడ్డికిఁ గాలు తేలిక యిచ్చెను. అతనికి భయమును దగ్గెను. మఱునాఁడు సాయంకాలము పొలమునకుఁ బోయెను. జాతీయ కళాలవెనుక, కళాశాల కిచ్చినది గాక మొనుఁబది యెకరముల మెట్ట యాయనకుఁ గలదు. మెట్టలో జొన్న, మొక్కజొన్న పెరిఁగియుండెను. కొంతమేఱ కంది వేసెను. మఱికొంత మిరప వేసెను. మిరపచేను సన్నని తెల్లని పూలతో నిండి యుండెను. పసపాకు పొట్లములవలె విచ్చియుండెను. మొక్కజొన్న పసపుపొట్టలమీఁద నుండెను. జొన్న ప్రతిదినమును గోసి పశువులకు వేయుచుండుటవలన సగముకోయఁబడి తక్కిన సగము గాలికి వెనుకకు వ్రాలి జుట్టుగదువ్వుకొన్న ట్లుండెను. రెడ్డి పైరు నాలుగువైపులఁ దిరిగి మిరప పసపు చేల మధ్యగట్టున నడచుచుండెను. ఎడమవైపున మొరపతోఁటలో నేదో గలగలలాడెను. రెడ్డి పరిశీలించి చూచెను. ఏమియును లేదు. రెడ్డి నాలుఁగడుగులు వేసెను. కుడివైపున బసపుతోఁటలో నేదో ప్రాకినట్లయ్యెను. రెడ్డి నిలిచి చూచెను. ఏమియును లేదు. రెడ్డి మఱల రెండడుగులు వేసెను. ఏదో తనవెంట వచ్చుచున్నట్లు తోఁచెను. తాను నడచినచోఁ గలగలలాడును. నిలుచున్నచోఁ జప్పుడు లేదు. రెడ్డి మఱల నడచెను. చప్పుడు పోయినది. రెడ్డి వందగజములు నడచెను. ఎడమవైపునఁగాని, కుడివైపునఁగాని గలగల వినిపించలేదు. రెడ్డి యేదో యూహించ మొదలు పెట్టెను. 'గణాచారి వేఁపమండతో రావిమండ కలిపి నావాకిలియందు వదలెను. నాకు నెమ్మదించెను. మాపూర్వులెల్ల నీ యూరికిఁ బెత్తనదారులు. నేను పురపాలక సంఘాధ్యక్షుడను... ఈపదవి నే ననుకొన్నంత స్వతంత్రము కాదు... రెండులక్షలు పెట్టి యింత పెద్ద సౌధనిర్మాణ మెందుకు? ఇట్టి సంఘము లేక పేటలో మూఁడువందలయేండ్లు జరిగిన నష్టమేమి?... పూర్వము పేటలో స్వామికి నుత్సవములు జరిగెడివి. ఇప్పుడు మానివేసిరి... జమీందారుగారు ఇంగ్లీషుస్త్రీని వివాహము చేసికొనిరి. పూర్వపు

రాణుల తరహా వేఱు... దేశము వృద్ధిపొందుచున్నది. కేశవరావు గారిది వృద్ధి కా దనెడువాఁడు... ప్రతివారికి నుద్యోగాభిలాష, ధనాభిలాష, యధికారాభిలాష వృద్ధిపొందుచున్నవి. నాకే చూడ రాదా? పురపాలక సంఘాధ్యక్షపదవి నేను వదలిపెట్టలేను... నా కుమారుడు క్రొత్తమేడలు వేయించును. తోటలు వేయించును. రెండువేల యకరముల భూమి కొనును. మావంటి ధనవంతు లుండరు. జిల్లాయంతయు మేము చెప్పినట్లు విను. తరువాత నేమి జరుగును? తరువాత నతనికిఁ గుమారుఁడు పుట్టును. అతఁడు పెద్ద వాఁడై గొప్పయుద్యోగము చేయును. అతఁడును సంపాదించును... నే నెంతసేపు తలంచినను ధనము నధికారమును గూర్చియే తలంచు చుంటిని. దైవమును గూర్చియే విచారించను... తెలుఁగుచదువుల నిండ భక్తియు, దేవుఁడు నుందురు. ఇంగ్లీషు చదువులో నది లేదేమో... తెలుఁగు చదువులలో నాల్గువర్ణములు, వారిధర్మములు తెలుపఁబడును. ఇంగ్లీషుచదువులో సర్వమానవులు నొకటే అందు చేత దయ మొదలగువిశాలగుణములే యందు బోధింపబడుచున్నవి. మనదేశపుచదువులలో దయలేదా?... మునుపు పదేండ్లక్రింద నింత యూరే లేదు. ఇంత మాగాని లేదు. ఇంత నాగరకత లేదు. పేద వారు నింతమంది లేరేమో... ఇన్నిపన్నులు లేవు. ఇన్ని సుఖములు లేవేమో!'

నడచుచున్న రెడ్డికి మఱల గలగల వినఁబడెను. రెడ్డి నిలుచుండెను. నిలుచున్నరెడ్డితో నీసారి చప్పుడాగలేదు. తనదారి కడ్డముగా నేదో వెళ్ళినట్లు తోఁచెను. రెడ్డి నిదానించి చూచెను. పాము తనదారి కడ్డముగాఁ బోవుచున్నది. తల కనబడలేదు. తోఁక మాత్రము దారి కడ్డముగా నున్నది. రెడ్డియొకడుగు వెనుకకువేసెను. పసపుచేనిలోనుండి పాము మెడవంచి త్రోవలోనికిఁ దిరిగెను. రెడ్డి కొకతల కనఁబడెను. రెడ్డిచేతిలోఁ గఱ్ఱలేదు. అటునిటుచూచెను. కనుచూపుమేఱలో మనిసి కనఁబడలేదు. పాఱిపోవుటకు బుద్ధి పుట్టలేదు. కాళ్ళు వడఁకుచుండెను. కన్నులు నిర్నిమేషముగఁ జేసి రెడ్డి కదలుచున్న పామువంకనే నిదానించి చూచెను. పాము నల్లగా నుండెను. తల యొకటి రెండు, మూఁడు, నాలుఁగుగా గోచరించెను.

నాల్గుతలలపామును జూచినంతనే రెడ్డి దానిని దివ్యసర్పమనుకొనెను. అనుకొన్నవాఁడు తలగుడ్డదీసి నమస్కరించ నూహించ లేదు. అట్లే దిగ్భ్రాంతుడై చూచుచుండెను. సర్పము తోఁకమీఁద లేచి నిలుచుండెను. అటు పసపు, ఇటు మెరపమొక్కలు గజమెత్తునఁ బెరిగి యుండెను. సర్పరాజుకూడా నంతియయెత్తున లేచెను. రెడ్డి కనులు నూసుకొని మఱలఁ దెఱచి సర్పమును బరిశీలించెను. స్వామి నాల్గు తలలును జిఱుకఁ బొడిచిన ట్లుండెను. నాల్గు నోళ్ళనుండి జిహ్వలో, నెత్తురుచారికలో! పాముకదా చంపవలయు నని యూహ రెడ్డికి వచ్చెను. దివ్యసర్పముకదా, మనము చంపఁగలుగుదుమా యని యూహించెను. అసలీ పాముచేతఁ గఱవఁబడకుండ బయటపడినప్పుడుగదా యన్న యూహయు వచ్చెను. అప్పుడే నిలుచుండి రెండుమూఁడునిముసము లయ్యెను. ముందుకు సాఁగిపోవుదమా? సర్ప మెదురుగా నిలుచున్నది. వెనుకకుఁ దిరిగిపోదమా? వెంటఁబడి కఱచునేమో! కొంతసేఁపైనతరువాత రెడ్డి కొకయూహ తోఁచినది. వెనుక వెనుకగా జరిగిపోవలయు నని. కాని యొడలంతయు వణఁకి పోవుచుండెను. అయినను బ్రియత్నించి వెనుక కడుగులు వేసెను. నాలుఁగడుగులు వేసినతరువాతఁ దనతో సర్పముకూడ ముందునకు సాఁగుచున్న ట్లూహించెను. చంద్రారెడ్డికి గుండెలో ధైర్య మాఁగ లేదు. బిగ్గరగాఁ గేకవేయుటకు నోట మాటరాలేదు. రెడ్డి నిలుచున్న వాఁడు నిలుచున్నట్లే స్తంభీభూతుఁ డయ్యెను. ఇంతలో దూరమున నుండి యెవరిదోమాట వినఁబడెను. సర్పరాజు నాల్గువ్రేళ్లు దగ్గఱకుఁ బెట్టినట్లు తలలునాల్గును ముడుచుకొని పడగవోలెఁబట్టుకొని, తలవంచి పసపుతోఁటలోనుండి మిరపతోఁటలోనికిఁ బోయెను. రెడ్డి చూచు చుండెను. కాని కదలలేఁడు. దూరమునుండి వచ్చినమనిసి రెడ్డిని బలుకరించెను. రెడ్డికి మాట రాలేదు. అరగంటసేపటికి మాట్లాడి యెందుకో చెప్పకుఁడ నతనిని వెంటఁబెట్టుకొని మిరపతోఁటయం తయుఁ దిరిగెను. ఎంత వెదకినను జిన్నపురుగుకూడఁ గన్పించలేదు. చిక్కనది, పచ్చనిది, కల్యాణహేతువు, వెడల్పైన యాకులు కలది, అప్పుడే తడిపినది, పసపుతోఁట వదలి – సర్పరాజు ఎడమొడముగా నున్నది, దుమ్ముకొట్టుకున్నది, శోభనహేతువు కానిది, దున్నిన

చాళ్ళలో నెండినది, తేలికగాఁ దా నెచ్చటికిఁబోయెనో తెలియఁ జేయునది, నోరు మండించునదైన యీ మిరపతోఁటలోనికిఁ బోయె నేమో! మాట పలుకు లేకుండ రెడ్డి యింటికిఁ బోయెను. ఆనాఁడు భోజనము లేకుండఁ 'దన్నెవరుపు నిద్ర మేల్కొలుపవల'దని చెప్పి పోయి పండుకొనెను. ప్రాణము లే మూలకుఁ బోయెనో?

రామేశ్వరముగారికి ధర్మారా వన్నచో నెందుకో భయమైనది. తన ప్రతియూహకును ధర్మారావు పరిపంథిగాఁ దోఁచెను. ధర్మారావు పసివాఁడుగానున్నపుడే తా నతని నేమియుఁ జేయలేకపోయెను. ఆతఁడు బి.ఏ.పరీక్ష యిచ్చి, జీత మెంతైననేమి — యొకకళాశాలలో నుపాధ్యాయుఁడై, కవియని పేరువడిసినవాఁడు-తన కితఁడు సాధ్యుఁడు కాఁడు. అయిదేండ్లనుండి తనమనస్సులోనున్న యూహకు ధర్మారా వడ్డు వచ్చుచుండును. ఆతఁ డేమి యడ్డు వచ్చెను? అతనినిజూచి తానే భయపడుచుండెను. రామేశ్వరమునకు భయమువదలి వ్యవహారింత మని యున్నది. కాని యా యూహవచ్చినపుడెల్ల భయమే యావరించుచున్నది. ఇంతలో వర్షర్తువు వచ్చెను. మందారతరువులు పూచి మేఘాచ్ఛాదితా కాలమున నవ్యక్తసంధ్యారాగచ్ఛటలకు బదులు రక్తిమలుకల్పించెను. దుర్దినముల గృహాంతరదీపికలు సూర్యకిరణములబదులు ప్రజ్వలించెను. మధ్యాహ్నమువఱకు వర్షము కురిసి వెలిసెను. వీథులన్నియు జలమయములై పంకసమ్మర్దితములయ్యెను. కోటముందు రోడ్డుమాత్రము పొడిగానుండెను. దేవదాసి తలదువ్వుకొని, చొళ్ళెముచుట్టి, మూఁడుమందారపూవులు తలలోఁ దుఱిమి, ఫాలమున విభూతిపైఁ గుంకుమతోడి యెఱ్ఱనినిలువుబొట్టు పెట్టుకొని కనుఱెప్పలయందు సన్నని రేకగాఁ గాటుక నలఁది, కొలుకులయందు గండోరిపరిభాగమువఱకును సన్నని కాటుక రేక గీసి, దక్షిణకపోలమున నీనకఱ్ఱపుల్లతో సన్నని కాటుకబొట్టు శృంగారభూమిగా నద్ది, తాంబూలరక్తచ్ఛాయ లధరాధరపరివ్యాప్తములై తొంగలించఁగాఁ దెల్లనిపట్టుచీరఁ దాల్చి, నడుమునకు బంగారు మొలనూలు నల్లనిరైకపైఁ గట్టకాసులదండ విచిత్రప్రభాభాసమానమై యొసంగ స్వామిసన్నిధికి బయలుదేరెను. గిరిక దాసివంకఁ జూచెను. తదపాంగరేఖాపటలియే సితాసితకాంతులు ప్రబలించుకొని మేఘములఁ దటిల్ల

తలు పెనగొనినట్లు వర్ణాశోభకు బౌనఃపున్యములు ఘటించెను. ఆమె వక్షోమండలము నల్లనిరైకచేఁ గప్పఁబడి బంగారపుఁగాసుల పేరుచే నలంకరింపఁబడియుండుటచేత సౌదామనీసహితనీలస్నిగ్ధమేఘ పరిచ్ఛన్నగిరిశృంగద్వయోపరి భాగమువలెఁగొట్టవచ్చెను. ఆమె తాల్చిన తెల్లనిచీర వర్షర్తువు నముకుకొనివచ్చినశరత్కాలమువలె తెల్లు తెల్లదనములు, ఆతపనావళ్యములు వెల్లివిరిసెను. ఆమె నడచినది. మేఘములకు ముందుపోయినయింద్రురథమువలె మంజీరధ్వని నినాదముతోఁ జేలాంచలపతాకలతో నామెయింద్రునిరథమేయనిపించెను. పారాణిచేత ద్విపార్శ్వములయందు మధురారుణచ్ఛవు లీనుచున్న యామెపాదపద్మములు నడుచుచున్నట్లు లేవు. సిద్ధిలేపముపూయఁబడుటచేత నామె నప్రయత్నముగాఁ దీసికొనిపోవుచున్న ట్లుండెను. దేవదాసి కోటమలుపు తిరిగెను. కోటముందునుండి దేవాలయమునకుఁ బోవలయును. దూరమునుండి రామేశ్వర మామెను జూచెను. చూచినచూపు త్రిప్పకయచూచిన రాసరిబయలు దేరియెదురుగావచ్చుచుండెను. దేవదాసి యతనివంకజూచుటయేలేదు. ఈమెదుర్గప్రాకారమునకు సగము నడచెను. అతఁడు సగము వచ్చెను. దేవదాసి తలయెత్తి యెవ్వరిని జూడదు. ఆమె యెవరో పురుషు లెదురుగా వచ్చుచున్నారని తొలఁగఁబోయెను. రామేశ్వరము వెనుకముందులు పరిశీలించెను. అటునిటు కొంతదూరమువఱకు నెవరును లేరు. దేవదాసికి వచ్చినపురుషుఁడే మఱల నడ్డమువచ్చుచున్నట్లు తోఁచెను. ఆమె తలయెత్తి యతని జూచి, తన్నిదివఱకే యవమానించిన యతనియెదుట నుండుటచే భయపడి, మఱల స్వామి నెదలోనికిఁ దెచ్చుకొని నిలఁబడెను. రామేశ్వరము 'పిల్లా! నీకుఁ బదునేడేండ్లు వచ్చినవి. కన్నెఱికమెవరుపెట్టిరి?' అని యడిగెను. గిరికనమస్కారము చేసి, కనులుమూసుకొని 'శ్రీ వేణుగోపాలస్వామివారు' అని ప్రత్యుత్తర మిచ్చెను. రామేశ్వరము పకపకాలుమని నవ్వెను. ఆకాశమావరించియున్న మహానీల మేఘమునుండి పటపటాలు మని పగిలి దిగ్దిగంతములు దద్దరిల్లిపోవునట్లు మహాశనిపాతముజరిగెను. రామేశ్వరము కంగారుపడి పరవళ్లు త్రొక్కెను. గిరిక నిశ్చలయై తనదారిని దాను పోవుచుండెను. గిరిక కోటముందునుండి యడ్డముతిరిగి దేవా

లయములవంకకుఁ జనుచుండెను. శ్రీవేణుగోపాలస్వామియాలయము ముందు నిలుచుండెను. హరప్ప కాలినడకతో జాతీయకళాశాలకుఁ బోయి, ధర్మారావుతో మాట్లాడి తిరిగి మఱల నడచివచ్చుచుండెను. వెనుకబరిచారకుఁ డొకఁడు నడచివచ్చుచుండెను. గిరికయెందుకు నిలుచున్నదో తెలియదు. ఇంతలో హరప్ప సమీపించెను. హరప్పకుఁ బదునూఁడేండ్లు. పూర్వమీకన్నఁ గొంచె మొడలుచేసెను. మనిసియందుఁ బురుషాకృతి యేర్పడుచుండెను. అతనిదృష్టి దేవదాసి మీఁదఁ బడెను. హరప్ప యెన్నఁడు కోటవదలి యెఱుఁగఁడు. దేవదాసి నెప్పుడును జూడలేదు. దేవదాసి సంపూర్ణయౌవనవతియై యుండెను. ఆమె మహారాణివలె భ్రూనేత్రగోళములయందు తీవియు, మూఁపులయందు నిక్కును, శరీరమునందుఁ దగినంత స్థౌల్యమును, నడుపులయం దైశ్వర్యమును గలిగి నేత్రములు కలిగినందుకుఁ జూడఁదగిన వ్యక్తిగా నుండెను. ఆమె మొగమునఁబెట్టిన నిలువు బొట్టునెవ్వణ్ణవియని చెప్పెను. యాదృచ్ఛికముగా నామె హరప్పవంకఁ జూచెను. ఇద్దఱికన్నులు గలసెను. హరప్పకు దేవదాసికి నమస్కరించవలెనని తోఁచెను. ఆమెకన్నులలో భగవంతుఁ డాడుచుండెను. దేవదాసి హరప్పను గుర్తించెను. ఆయన జమీందారుగారికుమారుఁడు కావలయును. స్వామి కుత్సవములు మానివేసిరి. ఈయనయైనఁ బెద్దవాఁడైనతరువాతఁ జేయునేమో! గిరిక యాలయములోనికిఁ బోయెను. హరప్ప కోటవైపునకు నడిచిపోయెను.

ఆ సాయంకాలమున మఱల మేఘములు పట్టలేదు. అంత పిడుగుపడినట్లుఱిమిన మేఘము దక్షిణదిగాయాతతీవ్రమారుతతరంగములచేత ఛిద్రుపదులుఛిద్రులై పోయెను. పోయి పశ్చిమసంధ్యనావరించెను. అచ్చట మఱలఁ జెదరిపోయిన సైన్యమునుగూర్చుకొన్నరాజువలెఁ బుంజీభవించి నల్లనై వెనుదిరిగిన పశ్చిమదిక్కాంతా శిరోజభారమువలె, నొరిగిన యంజనాచలమువలె ధగద్ధగన్నీలరోచిః ప్రసారమున రాఁబోవురాత్రికిఁ బూర్వాకేశమట్లు విజృంభించెను.

మఱల దసరాపండుగలు వచ్చెను. జాతీయకళాశాలోపాధ్యాయులు మఱలఁజందావసూళ్ళకుఁ బోయిరి. అందఱును సెలవులైన తరువాత వారమురోజులదాఁక తిరిగి రాలేదు. అధికృతసంఘసమా

వేళ మయ్యెను. వ్యయము పూర్వమువలెనే యుండెను. ధర్మారావభ్యంతరపెట్టెను. తక్కినవారికిఁ గోపమువచ్చెను. ఆయిగురిలో ధర్మారావు తనవోటు వ్యతిరేకముగ నమోజుచేసెను. శఠగోపాచారికి, నారాయణరావుకు ధర్మారావుమీఁద పట్టరానంతకోపము వచ్చెను.

పాలనాసంఘములో నీవిషయము చర్చనీయాంశ మయ్యెను. నాగేశ్వరరావుగారు ధనవిషయమునఁ జాలనీతిశాలి—అనినచో జమీందారుగారిధనము నపహరించఁడని కాదు. అపహరించుటలో మార్గమున్నది. తాను జెన్నపురికి రైలులో రెండవతరఁగతిలోఁ బ్రయాణము చేయును. మొదటితరగతికి రెట్టింపు వసూలుచేయును. తాను గవర్నమెంటులో నేదైన మహోద్యోగములోనున్నచోఁ దన కట్లే గదా గిట్టవలయును. పెద్దలెవరికి నిట్టిడబ్బు రాబడి యన్యాయముగాఁ గనిపించకపోవుట యెవరికివారికిఁ బ్రత్యక్షవేద్యమే. కాని నిజముగా నన్యాయముగా ధనమునపహరించుట యాయన యొప్పుకొనఁడు. అదియుఁగాక, లోకమంతయు నితరులవిషయమున న్యాయ మాచరించవలయునని చూచునుగదా! నాగేశ్వరరావు గొప్ప నీతిశాలి యని పేర్వడసినవాఁడు. అందుచేత నీ విషయములో న్యాయమే చేయవలయు ననెను. నెలకు వేయిరూపాయలు జీతము తెచ్చువాఁడు మొదటితరఁగతికి రెట్టింపు రైలుచార్జివసూలుచేయవచ్చును. అది యతనిపదవికిఁ దగినపని. అట్లిచ్చుటకు రాచరికమువారే నిర్ణయించిరి. అది పుచ్చుకొనుటలో దోషము లేదు. తక్కువ జీతమువాఁడు మూఁడవతరగతిలోనే ప్రయాణముచేయవలయును. అంతియే తీసికొనవలయును. ఆసారి దసరావసూళ్ళకుఁ బోయినవారి ప్రయాణఖర్చులలో సగమునకుసగము విఱుగఁగోయఁబడెను. పాలనాసంఘమువా రట్లే చేసిరి. ఈ సందర్భములో నాగేశ్వరరావు, రాధాకృష్ణయ్య, చంద్రారెడ్డిగార్లకు ధర్మారావునెడల చాల నాదరమును, దక్కిన యుపాధ్యాయులకు నితఁడన్న మంటయు బయలుదేఱెను. ఒకనాఁడు ధర్మారావు తరగతిలోఁ గూర్చుండి పాఠముచెప్పుచుండెను. బాలురకు హృదయాకర్షకముగా నుండవలయునని పద్యములు సంగీతముతో బిగ్గరగాఁ బాడుచుండెను. నారాయణరావుగారు వచ్చి 'మీరట్లు సంగీతములుతీసినచో వీలులేదు. తక్కినపాఠములు సాఁగవల

యుండా, వలదా' యని మందలించెను. సరే యని ధర్మారా వూరకుం
డెను. మఱియొకనాఁడు ధర్మారావు కళాశాలకాలస్యముగా వెళ్ళెను.
ఆరోజు ధర్మారావును గైరుహాజరుగాగుర్తుపెట్టి యాపూఁటకు జీత
ములో విఱుగఁగోయించెను. హృదయములలో నొకరియం దొకరికిఁ
దీక్ష్ణక్రోధములు బలిసెను. ధర్మారావు నారాయణరావుతో నొకనాఁ
డిట్లనెను: 'నే నాలస్యముగా వచ్చితి నని యా పూఁటంతయు జీతము
విఱుగఁగోయించితిరిగదా! శఠగోపాచారిగారు కళాశాల కాలస్యము
లేకుండ వచ్చిన దెప్పుడు? ప్రతిరోజును మొదటిగంటయైనతరువాత
వచ్చును. ఒకగంట గుమాస్తాలగదిలోఁ గూర్చుండి యధికారము
చలాయించును. మూఁడవగంట కాళ్ళు బల్లమీఁద జాఁపి పిల్లలతోఁ
గబుర్లుమాత్రమే చెప్పును. పదిగంటలకుఁ గాల్యకృత్యములునిర్వర్తిం
చుటకుఁ బోవును. మధ్యాహ్నముసైత మాలస్యముగానే వచ్చును.
ఆయనచదువుచెప్పిన దెప్పుడు? తమకుఁ గోపమురాకున్నచో నొకటి
మనవిచేసెదను. ఆచార్యులుగారు చదువువచ్చి పిల్లలకుఁ జెప్పఁడు.
వారికివచ్చినది రాదన్నమాట యట్లుంచి మీరుమాత్రము శ్రద్ధగాఁ
జెప్పెదరు. నే నొకపూఁట రానందుకు జీతము విఱుగఁగోయుట
న్యాయమేయైనయెడల శఠగోపాచారిగారికి నసలు జీతమే యీయ
రాదు.' నారాయణరావుగారికనులలో ధర్మారా విట్లనుచుండఁగాఁ
బ్రసన్నత తాండవించెను. అతఁడు నెమ్మదిగా 'శఠగోపాచారియారీతిఁ
టుండఁడే? నాకుఁ దెలియదు' అనెను. ధర్మారావు కీకుత్సితము చూచినం
తనే యెడల మండెను. అతఁ డన్యాయము నెదుట, మోసము నెదుట,
కృత్రిమము నెదుట నిలువలేఁడు. అతని మంచితనమంతయుఁ దద్దుష్ట
గుణసంఘర్షణసమయమునఁ బ్రకాశించునై యతఁడు క్రోధమూర్తియగును.
అట్లు కోపమును బ్రకటించుట లౌక్యము కాదు. అతఁడు హృదయ
ములో లౌక్యుఁడు కాఁడు. అతఁడు ప్రకృతిచేత నిష్కల్మషుఁడు. మన
స్సులో నెంతయున్న నంతయు బయటఁబెట్టును. అది లోకమునకుఁ
గిట్టదు. అతఁడు విద్యార్థిదశలో నున్నన్నినాళ్ళు వాని యీ గుణము
తెచ్చిన కష్టములేదు. కాని యుద్యోగములోఁ జేరినంతనే యీ గుణ
మొకనాఁటికిఁ బ్రకృతివక్రమార్గమున నడచు లోకమున కనుకూలించు
నని కనిపించలేదు. ప్రతివాఁడును స్వలాభపరాయణుఁడే. చివరకు

న్యాయమైన మార్గమునఁ బోవువానిది తప్పగుచున్నది. దేశము మీఁద నొక యాదర్శము నుద్ధరించుటకై ప్రోఁగుచేసి తెచ్చినధనము అది న్యాయముగా వ్యయపెట్టవలయుననుట తప్పయ్యెను. మొగము నెదుట తీక్ష్ణముగాఁ బ్రసంగించుచున్నను నాయనకుఁ గోపమేరాదఁట. లోకమునందు సచ్ఛీలుఁ డనఁగా నిట్లుండవలయును గాఁబోలు! ఇది యంతయు లౌక్యమో!

ధర్మారావు వన్నగారితో నీ సంగతియంతయుఁ బ్రస్తావించెను. అతఁడు 'నే నేమిచేసినను బాగుండదు? నీవుపోయి చంద్రారెడ్డితోఁ జెప్పు' మనెను. ధర్మారావు చంద్రారెడ్డితోఁ జెప్పెను. అతఁడు 'అవును, మీకుఁ దెలియదు. లోకమార్గ మంతే. నే నెవరితోఁ జెప్పుదును? నేను, మీ యన్నగారు సిద్ధము. తక్కిన ముగ్గురు నొకటి. రాధాకృష్ణయ్యగారు మనవైపుచేరినచోఁ గళాశాల బాగుపడు ప్రయత్నములు కొన్ని చేయవచ్చును' అనెను. ధర్మారావు కళాశాలను గుఱించి దీర్ఘముగా యోజించ నారంభించెను.

మఱల సంవత్సరము తిరిగివచ్చెను. పురపాలకసంఘము నెన్నికలు జరిగెను. ఎన్నికలు వ్యాధివంటివి. ఒకఁడేవ్యాధివచ్చి మఱొకని కే చికిత్స చేయించిరో, రెండవవాఁడు వానిని విచారించి యదే చికిత్స చేయించుకొనును. బెజవాడ, గుంటూరు మొదలైన పట్టణముల నీ యెన్నికలసందర్భములన్నియుఁ జంద్రారెడ్డిప్రభృతు లెఱుంగుదురు. చంద్రారెడ్డికిఁ బ్రత్యర్థిగా రామేశ్వరము నిలువఁబడెను. ఎన్నికలు పదిరోజు లున్నవనఁగానే ప్రతియింటికినిబోయి ముప్వురును బీదవిద్యార్థులు వారములు చెప్పుకొనునట్లు చెప్పుకొనివచ్చిరి. ఎన్నికలు నాల్గురోజు లున్న వనఁగా రెడ్డియు, రామేశ్వరముగారును మోటారులమీఁదఁ దిరిగినవారు తిరిగినట్లే యుండిరి. జమీందారుగారికి రామేశ్వరముగారు గెలువవలయునని యున్నది. గ్రామములోఁ బురపాలకసంఘముతో మార్పువచ్చినది. కోటకు మును పున్న గౌరవము లేదు. జనులందఱును దాము పూర్వము జమీందారునకు నాశ్రితుల మనుకొనుచుండిరి. పురపాలకసంఘము వచ్చినంతనే జనులు స్వతంత్రుల మైతి మనుకొని చంద్రారెడ్డినే యెక్కువ గౌరవించుచుండిరి. అందుచేతఁ దనపెదతల్లికొడుకే తదధ్యక్షుఁడైనచో జమీం

దారీగౌరవము మఱికొంత నిలుచును. అందుచేత నెట్లయినను రామే శ్వరమును గెలిపించ వలయునని యొకనాఁడు రాత్రి పేటపేటకు స్వయముగాఁబోయి ప్రతియింటను జెప్పివచ్చెను. జమీందారు తమయిండ్లకిట్లువచ్చుట ప్రజలందఱకు నేదో పెద్దగౌరవముజరిగిన ట్లుండి రామేశ్వరమునెడల సదభిప్రాయము చాలమందికి లేకపోయి నను నతనికే నిచ్చుటకు నిశ్చయించిరి. చంద్రారెడ్డి చూచెను. తనకుఁ బరాజయము నిశ్చయమున్నట్లు తోఁచెను. గొంగళిలోఁదినుచు వెండ్రుకలు లెక్కపెట్టుకొనుట యేల యన్నట్లు ఎన్నికల కెక్కనే రాదు. ఎక్కినతరువాత జయమునకుఁ గావలసిన సర్వప్రయత్నము లను జేయనేవలయును. వెనుక తీయరాదు చంద్రారెడ్డి చక్కని మేధావి. ఓటునకు నెన్నిరూపాయలయినను వెచ్చింప నిశ్చయించెను. కూలి నాలి చేసుకొని బ్రదుకువారికిఁ గొంతసహాయము చేసినట్లు నగును. అధ్యక్షతయన్న మృగతృష్ణికాప్రవాహమునకై పరుగెత్తు చున్నరెడ్డికి సదసత్తులు, లాభనష్టములు తెలియలేదు. అట్లే యని పదివేల రూపాయలు క్రుమ్మరించెను. నాల్గవనాఁడు చంద్రారెడ్డియే యెన్నుకొనఁ బడెను. రామేశ్వరము తన కది పరాభవముగాఁ దలంచి, రెడ్డి తనకు విరోధిగా భావించి యతనితో మాటాడుట మానివేసెను. మఱల గొన్నాళ్ళలో నధ్యక్షుని యెన్నికలు జరిగెను. చంద్రారెడ్డి మఱలఁ బదివేలు క్రుమ్మరించెను.

క్రిస్టమసు పండుగలు వచ్చెను. శశిని రంగారావులు చెన్న పురి చేరిరి. చెన్నపురిలో నీ జమీందారుకొన్న పెద్దసౌధము నాను కొని వందయెకరముల స్థలము నెరాబా యమ్మకమునకు రాఁగాఁ గడచినయేఁడు రంగారావుగారు దానిని లక్షరూపాయలిచ్చి కొనెను. చాల చవుకగా వచ్చినది. ఆ స్థలములో సావడులు వేయించి గుఱ్ఱ ములను బెంచుచుండెను. గుఱ్ఱములు రాజఠీవి నెఱపుటకుఁ గాదు; గిండీపందెములకొఱకు. గుఱ్ఱములమీఁద లక్షరూపాయలు వ్యయము చేసెను. అరేబియానుండి యేఁబదివేల కైదుగుఱ్ఱములను గొని, నాలుగువేలు బజనా యిచ్చి తెప్పించెను. అవి చెన్నపురి హార్బరు లోనికి వచ్చెను. ఆ సంగతి రాచరికమువారికిఁ దెలిసెను, వారు దానిని నిషేధించిరి. రంగారావుగారు తనబజానా వదలుకొని గుఱ్ఱ

ములను సొంతఖర్చులమీఁద అరేబియా చేర్చవలసివచ్చెను. గిండీ పందెములకుఁ బది యింగ్లీషుగుఱ్ఱములను గొని సాఁగించెను. సాఁకు వాఁడు నొక యాంగ్లేయుఁడు. అతనికిఁ బందెములు నాలుగునెల లున్నవనఁగా నాలుగునెలలు నాల్గురెండువేలుజీత మిచ్చి యుంచు కొనవలెను. మొదటి సంవత్సరము రంగారావుగారికి గిండీపందెము లలో రెండులక్షలు లాభము వచ్చెను. ఆయన చాల సంతోషించెను.

శశివి క్రమక్రమముగా సుబ్బన్నపేటలో నుండుటకే యిచ్చ గించెను. ఆమెకు రంగారా వన్నచో బహిఃప్రాణముగ నుండెను. మొదట నతనిబెండ్లియాడునపుడు ధనముకొఱకే బెండ్లియాడెను. హిందూదేశముపోయి చూడవచ్చునుగదా యని పెండ్లియాడెను. తన తలిదండ్రులు పేదవారు. వారికిఁ దనభారము తగ్గును. వారికిఁ దృణమో, పణమో పంపించుచుండనచ్చునని పెండ్లియాడెను. రంగారావుగారు లండనులోఁ బెద్దహోటలులో విడిసెను. సుసానీ పరువుగల యింటఁ బుట్టినది. లండను కొకపౌనుదూరములో నున్న యొకపల్లెటూరిలో నామెతలిదండ్రు లుండిరి. వారు పూర్వము తమకుఁగల కొద్దిపొలములో బంగాళాదుంపలు ఓట్సుధాన్యమును బండించుకొని యమ్మి జీవించుచుండిరి. సుసానీకి అన్నగారలిద్ద ఱున్నారు. వారిద్దఱు నాక్సుఫర్డులోఁ జదువుటకు వారికున్నయాస్తి కొంచెము నైపోయినది. అన్నలు విద్యాధికులై వారి బ్రతుకులు వారు బ్రతుకుచుండిరి. తలిదండ్రులు వృద్ధులై, సుసాని వారికిఁ బోషణఁ చేయవలసివచ్చెను. వారికి మిగిలిన దొకయిల్లు. నొక యావును. ఆ యావుపా లమ్మి యెట్లోయొకట్లు బ్రతుకుచుండుఁ డని, తాను లండనుకుఁ బోయి యార్జించి తెత్తు నని బయలుదేఱెను. లండ నన్నచో నామె స్వర్గమనుకొన్నది. లండనులో నడిగినమాత్రనే ప్రతి వారు వారమునకు నూరుపౌండ్లు జీతమిత్తు రనుకొన్నది. పొరుగువారి వద్ద నాలుగుపౌం డ్లప్పుతీసి, రెండున్నర పౌంకులు ఖర్చుపెట్టుకొని లండను చేరెను. స్టేషనులోదిగి యెచ్చటికిఁబోవలెనో తెలియలేదు. ప్రొద్దుగ్రుంకువఱకు టాౘీములమీఁద నాఁకలికి మిగిలిన యరపౌండును ఖర్చయ్యెను. రాత్రికి నిద్దుర యెచ్చటఁ బోవలయునో తెలియలేదు. ఒక పెద్దసౌధము జూచి యది యేమి టని రోడ్డుప్రక్క నిలుచున్న

రక్షకభటు నడిగెను. అతఁడు పైనుండి క్రింది కామెను బరిశీలించి చూచి యది పెద్దహోట లని చెప్పెను. ఆమె యటు పోవుచుండెను. అప్పటికిఁ గొంచెము ప్రొద్దుపోయి నగరముచివరిభాగమున నున్న యాస్థలమున జనుల రాకపోకలు తగ్గెను. అందుచే రక్షకభటునకుఁ దనవీథియం దెక్కువశ్రద్ధ యక్కరలేకపోయెను. అతఁ డామె పల్లె టూరిదిగాఁ గనిపించుటచేత వెనుకకుఁబిలిచి నేత్రములతో 'నీవు పల్లె టూరిపిల్లవా' యనెను. సుసానీ మంచిసుకుమారమైన హృదయము గల స్త్రీ. ఆమె యతని పలుకరించినరీతికి దేహచాలనమునఁ దిరస్క రణ కనఁబరచి హోటలులోనికిఁ బోయెను. ఒకగది తీసుకొని భోజ నముచేసి యామె రాత్రియంతయు నచట నిద్రించెను. భోజనమునకు, నిద్రకు' మఱునాఁడుదయమున చేసిన భోజనమునకునైన ఖర్చుకాఁగా నామెచేతిలోఁ గొన్ని పెన్నీలుమాత్రమే మిగిలెను. ఆమె హోటలధి కారిని గలసికొని 'నే నీయూరు ధనము సంపాదించుటకు వచ్చితిని. నా కేమైననుద్యోగము సంపాదించిపెట్టగలవా' యనియడిగెను. అతఁడు బుజము లెగురవేసి, వెడల్పెక్కువయుఁ బొడుగుతక్కువయు నైన మొగమునం దరగజము వెడల్పున్ననోరు నవ్వినట్లు రెండుపెదవులు దగ్గ ఱకునొక్క గజముపొడుగున దీర్ఘీకరించి తలయెత్తిచూచెను. ప్రక్క నెవరో యిద్దఱుయువకులు నిలచి యామెవంకఁ జూచుచుండిరి. ఆమె హోటలధికారిమాటాడకపోవుటచేత నెడలిపోఁబోవుచుండెను. అతఁడు కుడిచేతితర్జనితో రమ్మని బిలిచి, దూరముగానొకగది చూపించి యచ్చ టకిఁబొమ్మని తలయూఁచెను. ఆమె వెనుకముందాడి యతఁడుచూపించిన గదివద్దకుఁబోయి తలుపుతట్టెను. 'లోనికి రా' యని స్త్రీ కంఠధ్వని యొకటి వినిపించెను. ఆమె లోనికిఁ బోయెను. ఒకనలుఁబదియైదేండ్ల స్త్రీ ఒడలంతయు నెఱ్ఱగానున్నది. మొగమునం దున్నత జాతిసంభవ లక్షణములు లేవు. చంకలవఱకు బనియనొకటి తొడిగెను. జుట్టు కత్తిరించి యుండెను. ఒక నిలువుటద్దములోఁ జూచి జుట్టుదువ్వు కొనుచుండెను. సుసానీని జూచినంతనే 'యనుంగుఁబిల్లా! ఏమి కావ లయు'నని యడిగెను. ఆమె 'యీ యూర ధనము సంపాదించుటకు వచ్చితిని. ఏదైన నుద్యోగము వాంఛించుచున్నాను హోటలధికారి మిమ్మును జూపించె' ననెను. ఆమె మొగముపొడుగుచేసి, కనుఱెప్పలు

పైకెత్తి, నోరు గుండముగాఁబెట్టి 'హూ'యని కీచుగొంతుతోఁ బెద్ద కూఁతకూసి, మాటల నేదో దురర్థమువచ్చునట్లు కన్ను గిలిపెను. సుసానీప్రాణము నీరసించిపోయెను. ఆమె పరిదీనయై 'నే నందుకు రాలే' దనెను. వృద్ధురా లిట్టిసమాధాన మెన్నఁడును వినలేదు. ఆ సమాధానముతో నంత పరిదీనముఖ మెన్నఁడును గనలేదు. అందుచే నామెహృదయములోఁ గలఁగిపోయెను. కనుబొమలు వంచి, తెప్పల క్రిందుగా నామెవంకఁ జూచుచు వృద్ధురా 'లేమి కావలె' నన్నది. 'మర్యాదగా సంపాదించవలయు' నన్నది సుసానీ. వృద్ధురాలి యన్నగా రొకఁడు ఐలింగ్టనులో పెద్దహోటలు నడుపుచుండెను. అతనిహోటలులో నానాదేశములనుండి ధనవంతులు వచ్చి దిగుచుందురు. మంచిశీలముకలిగినపరిచారిక యొక్క ర్తతనికిఁ గావలయు నట లండనులోనున్న కన్య లొకరో జుందురు. రెండవరో జుడా యించుదురు. వారికి మనస్సు నిలుకడ లేదు. ఆ వృద్ధురా లుత్తరము వ్రాసి, తనయన్నగారికిఁ జూపించు మని సుసానీని బంపించెను. ఐలింగ్టనుపోవుట కెంత యగునని సుసాని ప్రశ్నించెను. వృద్ధురాలు రెండుపెన్నీ లగునని చెప్పెను. సుసానీదగ్గర డబ్బు చాలును. ఆమె పోయి హోటలుదారు కాయుత్తరము చూపఁగా నతఁడు వారమునకు పౌండుచొప్పునజీతమిచ్చెద నుందువా' యనెను. సుసానీ కేమియుఁ దోఁచలేదు. తా నింతదూరము వచ్చినది నెలకు నాలుఁగుపౌండ్లు సంపాదించుటకా? నాలుఁగుపౌండు లప్పుతెచ్చెనే? రాత్రి యించుమించుగా నొక పౌండు ఖర్చయ్యెను. తా నొకరాత్రి ఖర్చుచేసినంత యొక వారమునకు సంపాదించునా? సుసాని దిగాలఁబడి చూచెను. యజమాని 'యే మట్లు చూచెద' వనెను. సుసానీ 'నేను నాలుఁగు పౌండ్లప్పుతెచ్చితిని. రెండున్నర పౌండ్లు రైలుచార్జి యయ్యెను. మిగిలినపౌను రాతిరి మీ చెల్లెలున్నహోటలులో ఖర్చైనది. నేను నెలకు నాల్గుపౌనులు సంపాదించినచో నాయప్పెప్పుడు దీరును? నాతలిదండ్రుల కేమి పంపింతును? నే నేమి తిందును?' అనెను. యజమాని 'యంత పేదదానవు రాత్రి హోటలులో నేల దిగితివి? పదిపెన్నీల కెవ్వరైన భోజనము పెట్టియుందురే' యనెను. ఆమె 'నాకుఁ దెలియ' దనెను. యజమాని 'నీకు నాల్గుపౌండ్లెక్కు వన్నమాట.

లండనులో సామాన్యముగా రెండుపౌనులే యిచ్చెదరు. నీవు పల్లెటూరిపిల్లవు. అమాయకురాలవు. దుశ్శీలవలె లేవు. అందుచే నింత యిత్తు నంటిని. భోజనమునకు నీకు ఖర్చుండదు. నీ యిష్టమైనచో నుండుము. లేనిచో లే' దనెను. సుసానీ విచారించి చేయునదిలేక యొప్పుకొనెను.

సుసానీ ప్రవేశించినమఱునాఁడే రంగారావు లండనుపోయి, యా హోటలునందే దిగెను. ఆమె ప్రత్యేకముగా నతనిపరిచర్యకొఱకే నియమింపఁబడెను. ఆయన తన కట్లొకపరిచారిక నిచ్చినచో వారమున కొకపౌం డెక్కువ యిచ్చెద ననెను. సుసానీమీఁద నకారణదయ గలిగిన యా హోటలుయజమాని యందులో సగము సుసానికే యిత్తునని చెప్పెను. నూతనాతిథి హిందూదేశస్థుఁడనియు, జమీందా రనియుఁ దెలిసినంతనే సుసానీమనస్సులో నొకచిత్రమైన మార్పుజరిగెను. హిందూదేశములో నడచుచున్నప్పుడుగూడ వీధులలోఁ గాళ్ళకు నవరసులు, రత్నములు తగులు నని యామె వినెను. అచ్చటిరాజులు, జమీందారులు మేఁడలు బంగారముతోఁ గట్టెదరని వినెను. అట్టిధనవంతులలో నొకనికిఁ దాను దైవికముగాఁ బరిచారికగా నేర్పడుట తనభావిభాగ్యోదయసూచక మనుకొనెను. చాలమంది హిందువులు ఇంగ్లాండు వచ్చి యింగ్లీషుకన్యలను వివాహమాడిరని, తన్మూలమున నా కన్యలు ధనవంతులై రని యామె పూర్వము వినియుండెను. మఱునాఁడు పొద్దున సుసానీ రంగారావు గదిలోనికిఁ బోయెను. రంగారా వామెను జూచెను. ఓడలోఁగాని రైలులోఁగాని తానుజూచిన యూరపియనుస్త్రీలవలెఁ గాఁక సుసానీ భిన్నముగాఁ గనఁబడెను. ఆమె ధరించిన యుడుపులు, ఆమె ముఖలక్షణములు, నామెవినయము కొంత హైందవత్వమును ధ్వనించెను. సుసాని యధునాతననాగరకత సంపూర్ణముగా వికసించని ఇంగ్లీషుపల్లెటూరిపిల్ల. ఈ నాగరకత విజృంభించకమునుపాంగి లేయ స్త్రీలును గొంతవఱకు భారతదేశపుస్త్రీలవలెనే ముగ్ధలు, వినయవతులు కాఁబోలు! రంగారావు జేన్ ఆస్టెను వ్రాసిన 'పెర్సుయేషను' అన్న నవల చదివెను. అందులోని కథానాయికకు భారతదేశములోని యొకమహాకావ్యనాయికకుఁ దత్వములో నేమి భేద మున్నది? రంగారావునకు సుసానీని

యెడల సమాదరణ గలిగెను. నాలుగైదురోజులు సుసాని రంగారావు మాటాడలేదు. అయిదవనాఁడు సుసానీ 'టీ' కలుపుచుండెను. రంగారావు 'రోజును టీలో పాలువేయుట లేదు. మేము పాలు లేకుండఁ ద్రాగలే' మనెను. సుసానీ 'పంచదారకూడ నెక్కువయే కావలయు' ననెను. అని, పరిచారికాయుక్తా్యోల్లంఘనము జరిగిన దేమో యని సిగ్గుపడెను. రంగారా వా మాటకు నొచ్చుకొనక యొకవిలాసాపాంగము సుసానీమీఁదఁ బ్రసరింపఁజేసెను సుసానీ నిలువెల్ల సిగ్గయ్యెను. వారమురోజులు గడచుసరికి వా రిరువురు పరిహాసములాడుకొనుట, చమత్కారముగాఁ బ్రసంగించుట యారంభించిరి. ఆమె పరిచారికగానేయున్నది. దైవికముగా నొకనాఁడు గదిలో బయటకు వచ్చుచున్న సుసానీయు, లోనికిఁబోవుచున్న రంగారావు గారును బరిష్వంగమునకుఁ దగినంతసమీపమునకు వచ్చిరి. సుసానీ వెనుకకుఁ దగ్గెను. రంగారావు లోనికిఁబోయి తలుపు దగ్గఱగా వేసెను. సుసానీమొగములో గాంభీర్యరేఖ తటుముకొనివచ్చి రంగారావునకు దిగ్భ్రాంతి కల్పించెను. ఆమెదారి నామె పోయెను. మఱునాఁడు సుసానీ మఱల టీ కలుపుచుండెను. రంగారావు 'అది నాకు వల' దనెను. సుసానీ 'ఎందుచేత' ననెను. రంగారావు మొగము వంచెను. సుసానీ ప్రక్కగా నతనివంకఁ జూచెను ఇద్దఱికనులును గలసినవి సుసానీమందహాసము చేసెను. అతఁడును మందహాసము చేసెను. ఆనాఁడు సాయంకాలమున సుసానీ ప్రక్కదులిసివేయు చుండఁగా రంగారావు 'ఈ దేశమునుండి నే నొకస్త్రీని భార్యగా నా దేశమునకుఁ దీసికొనిపోయెదను' అనెను. సుసానీ తలయెత్తి రంగారావువంకఁజూచెను. ఇద్దఱు నొకరివంకనొకరు గంభీరముగఁ జూచుకొనిరి. చూచుచుఁజూచుచు సుసానీ పకాలు మని నవ్వెను. రంగారావును బకాలు మని నవ్వెను. ఆ మఱునాఁడు రాత్రికి వందపౌండులు సుసానీతల్లిదండ్రులకు తంతిద్వారా పంపించెను. ఎవరి మతమువారు నిలుపుకొనునట్లు పరస్పర మంగీకరించి, సివిలుమ్యారేజి చేసికొనుటకు నిశ్చయించిరి. తనవెంట హిందూదేశమునకు వచ్చి యచటనుండినసే తాను వివాహమున కంగీకరింతునని రంగారావు గారు పట్టుపట్టుటచే సుసానీ యంగీకరించెను. వచ్చిన రెండువారముల

లోనే నూత్నపరిచారిక తన్ను వదలిపోవుచున్నందులకు హోటలు యజమాని విచారపడెనుగాని, పేదపిల్లకు సుసానీ కదృష్టముపట్టిన దని సంతోషించెను. సుసానీ యొకవారము లండనులోనుండి, తరు వాతఁ దన గ్రామమునుపోయి, తల్లిదండ్రులకు వర్తమానముచెప్పి యొప్పించి ప్రతియేడాదియు సాలునకు మూఁడువందలపౌండ్లు వా రిద్దఱికిఁ బంపింతునని చెప్పి మఱికొంతధనమిచ్చి, మఱల మూఁడేం డ్లకుఁ దల్లిదండ్రులను దర్శించుటకు వత్తునని వాగ్దానముచేసి, రెండు వారములలో వచ్చి రంగారావును గలసికొనెను. ఇద్దఱును హిందూ దేశమునకుఁ గదలివచ్చిరి. వచ్చినతోడనే రంగారావుగారికిఁ జెన్న నగరములో యూరపియనుసంఘమునందు గౌరవము హెచ్చయ్యెను. పెద్దపెద్దయధికారులందఱు సుసానీద్వారా రంగారావునందు గౌర వముకలవారైరి. సుసానీకిఁ బల్లెటూరునందున్నంత ప్రేమ పట్టణము లం దుండదు. పెద్దపెద్ద యధికారులందఱును సుసానీతో వచ్చి మాటాడుదురు. ఆమెకు వారందఱు నెప్పుడు వదలిపోవుదురా యని యుండును. ఆమె సహజముగా నేకాంత మభిలషించును. సుబ్బన్న పేటలోఁ దానును, తనభర్తయు. చెన్నపురిలో నిత్యమతిథులరాకచే, టీపార్టీలచే శాంతి యనునది యుండదు. సుబ్బన్నపేటలోఁ గోటలోఁ దానే దొరసాని. రంగారావును, దానే—పరిచారకులుగూడ రారు. సౌధాగ్రభాగమున నెక్కి యూరు నాల్గువైపులఁ జూచును. ఈ దేశము నందలి సూర్యోదయములు, సూర్యాస్తమయములు నామె కమితా నందకరములుగా నుండెను. సుసానీ చిత్రకారిణి. ఆమె గీచిన చిత్రము లన్నింటిలో సూర్యచంద్రోదయాస్తమయములే యెక్కువ. ఆమె పియానోమీఁదఁ గొంతరమ్యముగానే వాయించఁగలదు కోటలో పియానో కొనిపెట్టిరు. దానిమీఁదఁ దానే వాయించుకొనును; తానే సంతోషించుకొనును. చెన్నపురిపోవుటయందలి యాకర్షణ యిది యొక్కటియే యామెకు. టీపార్టీలలోఁ దాను వాయించినప్పుడెల్ల జెన్నపురిలోని దొరలందఱు మెచ్చిరి. ఆ మెచ్చుదల యామెహృద యమున కాహ్లాదకారిగా నుండెను. చెన్నపురిలో నామెహృదయా హ్లాదహేతు విది యొక్కటియే. సుబ్బన్నపేటలో నామె కానంద కారణములు చాల నున్నవి. ఏకాంతము, దొరసానితనము, తన

భర్తయుఁ దాను స్వేచ్ఛగా నుండఁగలుగుట, బహుజనులచేత గొలువు, సౌభాగ్యభాగము సుబ్బన్న పేఁట యామెహృదయాదర్శమును ఫలింపఁజేసినది.

ఆమె సర్వకాలములయందు రంగారావుతోఁ గలసియుండుటయే వాంఛించును. అతఁ డామెకుఁ బ్రాణములకన్నఁ బ్రాణమైనాఁడు. తాను దారిద్ర్యమహాసాగరమునఁ గొట్టుకొనిపోవుచుండఁగా నుద్ధరించి శ్రీగిరి నెక్కించినవాఁడతఁడు. ఆమె కృతజ్ఞతామయమూర్తి.

రంగారావు నాదర్శములన్నియు సుసానీలో ఫలించెను. ఆమె హిందూదేశమునందలి భార్యలవలె సేవకురాలు, భర్తను దైవముగాఁ గొలుచునదియుఁ గాదు. ఇతరదేశములయందలి కొందఱు భార్యలవలె భర్తకు భర్తయుఁ గాదు. యురపియనుసంఘమునందుఁ గూడ నామె ప్రవర్తన హైందవుఁడైన తన కసూయాజనకముగా నుండదు. తన్నామె మిక్కిలి ప్రేమించును. తనదేశాచారములకు విరుద్ధముగ నున్నను రంగారా వామె నొకపని చేయవద్దనునా, ఆమె చేయదు. వఱదలువచ్చినపు డామెపోయి పిట్టనుగొట్టి దెచ్చినపుడు తనమర్యాద కది భంగకరమని రంగారావు వారించెను. ఆమె యంతే. మఱల సుబ్బన్నపేఁటలోఁ దా నట్లు చేయలేదు. అతఁడును నామెయిష్టప్రకారమే నడచును. సుసానీ రాకముందు నిత్యము చెన్నపురి వదలనివాఁడు సుసానీవచ్చినతరువాత సుబ్బన్నపేఁటలోనే యెక్కువకాలము నివసించుట యామెమూలముననే.

ఈ దేశమువచ్చినతరువాత నామెకుఁ జాలసంగతులు తెలిసినవి. రంగారావు రాజ్యమునకు నధికారియైన కుమారుఁ డున్నాఁడు. అతఁడు విచిత్రమైన పురుషుఁడు. సుబ్బన్నపేటమంటిగడ్డలోఁ బుట్టినవాఁడు. తనభర్త తనవ్యవహారములు తాను చూచుకొనక దివానునకును బంధువులకును వదలిపెట్టును. చెన్నపురిలో నధికారులపారిపకముకొఱకుఁ జాలధనము వ్యయపఱచును. గిండీపందెములు నేత్రానందకరముగానున్నను ధనవ్యయ మామెకుఁ గిట్టలేదు. అందుచేత నామె యెంతసేపటికి సుబ్బన్నపేఁటలో నుండుటకే వాంఛించెను. పందెములైన మఱునాఁడే యిర్వురును సుబ్బన్నపేఁటకు వచ్చిరి. కోటలోఁ గాలుపెట్టినప్రతిసారియుఁ జెన్నపురినుండివచ్చిన మొదటి

రోజున నామెవలన రంగారావు మహానంద మనుభవించుచుండెను. రంగారావుతో నామె గిండీపందెములు వలదని చెప్పెను. అతఁడు రెండులక్షలలాభము చూపించి, యామెవాక్యమునకుఁ బ్రతివాక్యము చెప్పెను. పేటకు వచ్చినంతనే యామె ప్రాతఃకాలమునఁ జిత్రములు వేయును. పన్నెండుగంటలకు భోజనముచేసి, కొంతసేపు విశ్రమించి, కొంతసేపు పియానో వాయించి, సాయంవేళ షికారుపోయి, రాత్రి యగుసరికి మరల నింటికి వచ్చును. ఆమె హరప్ప నెప్పుడును గలసి కొనుటకుఁ బ్రయత్నించదు. అతనిని దూరముగాఁ జూచి తాను దూరముగాఁ బోవును. హరప్పప్రస్తావన యెన్నఁడును జేయదు.

సుసానీకిఁ బల్లెటూరిజీవనమునందే యెక్కువయభిమానమైనను పాశ్చాత్య నాగరికతయం దభిలాష మెండు. దుస్తులు వేసికొను టందో మత సంఘ విషయములందోఁ బాశ్చాత్యపద్ధతులే నాగరక పద్ధతు లని యామె యభిప్రాయము. హరప్పయందలి వై ముఖ్యమునకు హరప్పపోవు తెలుఁగుపోకడలే సగము కారణము. సంక్రాంతిపండుగ వచ్చెను. ఊరిలో సంస్థలలెక్కల తనిఖీలు మరల జరిగెను. జాతీయకళాశాలలెక్కలు మరల దోషసహితములుగానే యుండెను. ఏదో పాక చెడిపోయినదని మరమ్మతు చేయింతురు. మఱొకచోటఁ జేయించినచో నూటయేఁబదిరూపాయ లగును. దానికే కళాశాలలో నైదువందలగును. వాసములు వంచ బజారులో నాలుఁగురూకల కిత్తురు. పదునారురూకల కని వ్రాసియుండును. కొన్ని కొన్ని చోట్ల జమకు, ఖర్చులకు లగించదు. చిల్లరఖర్చు నూఱురూపాయ లని యుండును. చిల్లరఖ ర్చేమిటి, నూఱురూపాయ లేమి టని యడుగగా సంగయ్య 'యేదో యైనదండీ. ఇప్పుడు జ్ఞాప కమా' యనును. ఆడిటరు విడిచీటు లున్నచోఁ జూపించు మనును. అతఁడు 'ఇప్పుడు కనఁబడున టండీ, ఎక్కడ పోయినవో' యనును.

క్రొత్త యధ్యక్షుని దెచ్చినఁగాని యీ వ్యవహారము కుదుటఁ బడ దని చంద్రారెడ్డి విచారించెను. రామచంద్రిరాజు తనపక్షము. రాధాకృష్ణయ్యను గూడఁ గలుపుకొనవలయునని యూహించెను. ఎన్నికలలో రామేశ్వరమునకుఁ దాను బ్రత్యర్థినని రాధాకృష్ణయ్య తనయందు విముఖుఁడేమో యని తలఁచెను. ఒకనాఁడు రాధా

కృష్ణయ్యతోఁ జంద్రారెడ్డి 'జాతీయకళాశాలావ్యవహారము బాగుగా లేదు' అనెను. రాధాకృష్ణయ్య 'అవునండీ! కళాశాలలో ధర్మారావు గారిని బాధపెట్టుచున్నారఁట' యనును. రాధాకృష్ణయ్యగారిసౌముఖ్యము తెలిసికొని చంద్రారెడ్డి పాలనాసంఘములోఁ గ్రొత్తవానిని దెచ్చుటకుఁ దీర్మానము గెలిపించవచ్చు నని యూహించెను.

మార్చిలో పాలనాసంఘసమావేశము జరిగెను. చంద్రారెడ్డి ప్రస్తుతము చెప్పఁబడుచున్న యింగ్లీషుకన్న నెక్కువయింగ్లీషు పిల్లలకుఁ గావలయుననియుఁ, జరిత్ర యార్థికశాస్త్రము రాజకీయము చక్కఁగాఁ జెప్పినఁగాని కళాశాలలోనివిద్యార్థులు సరియైనలాభము పొందలేరనియు, నందుచేఁ జరిత్రతో ఎమ్. ఎ. ప్యాసైన నొకనూతనోపాధ్యాయుని దీసికొని రావలయుననియు, నట్టివాఁడు వందరూపాయలైన నీయనిచో రాఁడనియుఁ, గళాశాలలోనున్న యుపాధ్యాయులందఱికన్న నెక్కువజీత మిచ్చుచు నధ్యక్షపదవి యీయకున్న శోభలేదనియుఁ జెప్పి తీర్మానముపెట్టి మఱుసంవత్సరమున కట్టివానిని దెచ్చునట్లు తీర్మానముచేసి పాలనాసంఘసభలో గెలిపించెను. దీనికి వ్యతిరేక మొక్క శఠగోపాచారియే. అతఁ డొక్కఁడు కాదన్నను దక్కినవువ్వురు నవు ననిరి. నాగేశ్వరరావుగారు సమావేశమునకు రాలేదు. ఈ వార్త విని నారాయణరావుగారు మహోగ్రుఁడై పోయెను. ఆయనయుగ్రత పైకి రాదు. గుండెలోననే యుండును. 'రానీయండి, కళాశాల బాగుపడవలసినదే. ఏదైనను బాగుపడుట మంచిదేకదా!' అనెను. అందఱు నది సాధుత్వమే యనుకొనిరి. ధర్మారా వితఁ డేదో కుతంత్రములకెత్తుచున్నాఁ డని యూహించెను.

ఆ వేసఁగిలోఁ దాలూకాబోర్డు నధ్యక్షపదవి కెన్నికలు జరిగెను. రామేశ్వరముగా రొక యభ్యర్థి. అతనికి దమ్మిడీ వ్యయము లేదు. వ్యయమంతయు జమీందారుగారు పెట్టుకొనును. గెలుపోటములే తనవి. లాభము తనది; నష్టమువచ్చెనా జమీందారుగారిది. నెలనాళ్ళు తాలూకాయంతయు, న్యూయార్కులో నాకాశమున వాయువిమానములు తిరిగినట్లు సుబ్బన్నపేటతాలూకాలో భూమిమీఁద మోటారులు తిరిగెను. పేటలోఁ దాలూకాఫీసు కట్టి, రిజిష్ట్రారు ఆఫీసు పెట్టి నాలుగేండ్లయ్యెను. మ్యాజిస్ట్రేటు, తహసీల్దారు,

సబ్ ఇన్‌స్పెక్టరు, సబ్ రిజిస్ట్రారు, రాజాగారి కళాశాలాధ్యక్షుఁడు, హైస్కూలు హెడ్మాస్టరు, చంద్రారెడ్డి -వీరంద ఉన్నతోద్యోగులు. పేట గణాచారి 'వేయిపడగలపాము' పాడినప్పటిది కాదు; నాల్గు పడగలపాము చంద్రారెడ్డిని మెట్టచేలో నిలువవేసినప్పటిది.

మోటారులు తాలూకాయంతయుఁ గుక్కలవలెఁ దిరిగెను. నెలనాళ్ళయినతర్వాత రామేశ్వరముగా రెన్నికలలో గెలుపొందెను. ఆయన గౌరవార్థము చంద్రారెడ్డిగారు టీపార్టీ చేసెను. రామేశ్వరమునకుఁ జంద్రారెడ్డియం దున్న వైషమ్యము నాఁటితోఁ బోయెను. చంద్రారెడ్డి వేసినయెత్తు రామేశ్వరమున కందలేదు. గ్రామస్థు లతనికి స్వాగతపత్ర మిచ్చిరి.

'మీరు విద్యావంతులు. మీ విద్యాఫలము తాలూకా ప్రజ లనుభవించి సుఖింతురుగాక'యని పత్రములో నొకవాక్యము—రామేశ్వరముగారు పైరిమరీయైనను బరీక్ష యీయలేదు.

'మీరు ప్రభువులు, మీ చల్లనిపాలనములో ప్రజలు సుఖింతు రని మే మాశించుచున్నాము' అని మఱియొక వాక్యము—రామేశ్వరముగా రొక సామాన్యమైన రయితుబిడ్డ· రంగారావుగారి పెదతల్లి కుమారుఁ డగుటచేనైనచోఁ బ్రభువు కావలయును. అది యిప్పటి ప్రభుత్వమేమో!

'తమరు రూపజితమన్మథులు. మహాపరాక్రమశాలులు' అని రెండు వాక్యములు—ఇది కావ్యధోరణి.

ఇట్టి వినతిపత్రములకు, స్వాగతపత్రములకు దేశమున బాలకవు లుందురు. వారిని బోయి యే పెత్తదారుఁడో మిక్కిలివినయముతో వ్రాయించి తెచ్చును. అవి చదువుదురు. ఆ వ్రాసినతనికి వ్రాయించు కొన్నవారు స్తోత్రముతప్ప మఱొక్కఁడు చేయఁగూడ దని తెలిపి యట్లే వ్రాయించుకొని వత్తురు. తహసీల్దారులు, కలెక్టరులు, మునసబులు, ఇన్స్పెక్టరులు బదలీచేయఁబడి పోవువారు పోదురు; వచ్చువారు వత్తురు. అజాగళస్తనప్రతిమానగౌరవప్రపత్తిగలిగిన పద్యరత్నములు, వాక్యవిన్యాసములు తెలుఁగులోఁ బరిచయముకలిగినకుఱ్ఱవాండ్రప్రాణములుతీయఁబడి వ్రాయించఁబడి, వారికి గౌరవము సేయుసభలోఁ జదువఁబడును. ఆ పద్యములు చదువుచుండఁగా నందు

నొక్కమాటకైన నర్థము తెలియని సభాసదులు రేఁగుచెట్టు క్రింద గ్రుడ్డివానివలెఁ దల లాడింతురు. చదివినవాఁడు సంగీతముతోఁ జదివెనా కరతాళధ్వనులు చేతురు. చదివినవాఁడు తప్పులు లేకుండ నెన్నఁడును జదువఁడు. బద్యములు వ్రాయించి తెచ్చినవారు పద్యము లర్థమగున ట్లెవరు చదువుదురా యని విచారించరు ఎవఁడో సంగీతము పాడు ననుకొన్నవానిని దెచ్చి వానిచేత నిట్టిపద్యములు చదివింతురు. వినతిపత్రములు చదివింతురు. ఈ పత్రములో నీ బద్యములోఁ బ్రతి కఠోరుఁడును మృదువు; ప్రతిరావణాసురుఁడును రాముఁడు; హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుఁడు. దుఃఖమైన జనము సుఖి.

ఒకయి ల్లద్దెకుఁబుచ్చుకొని యందుఁ దాలూకాబోర్డుఆఫీసు పెట్టిరి. వేఱే దానికి సౌధనిర్మాణముచేయవలయునని ప్రయత్నమును సాఁగుచుండెను. రామేశ్వరముగారు తదధ్యక్షపదవి సంపాదించుటకుఁ బాతికవేలు ఖర్చుపెట్టిరి. అది మఱల సంపాదించుట యెట్లా యని విచారించ నారంభించెను. మొదటపాతిక వేలూరకే యిత్తునన్న జమీందారుగారు గెలిచినతరువాత తనడబ్బు తన కిమ్మనెను. ఇది సుసానీచేసినపని యని రామేశ్వరముగారి యూహ.

పట్టాభిషేకమునకుఁ దెచ్చిన ఎలెక్ట్రిసిటీప్లాంటు ఎండ కెండి, వానకుఁ దడిసి కోటశిథిలభాగమునం దొకచిన్నయింటిలో నుండెను. పోయినదంతయుఁబోఁగా నందులోఁ గొంత పనికివచ్చునని యూహతోఁచినది. సినీమాపెట్టినచో ధనము కొంత రావచ్చును. దీనిమూలమునఁ బెట్టుబడిలోఁ గొంత తగ్గవచ్చును. రామేశ్వరముగారు చెన్నపురిచుట్టును దిరిగి సినీమా పెట్టుటకుఁ గావలసినప్రయత్నములన్నియుఁ జేసెను. ఊరికి దక్షిణమున రేకులతోఁ బెద్దహాలు వేయించెను. మూఁడు నెలలలో సినీమాకుఁ దగినప్రయత్నములన్నియు జరిగెను. పురపాలకసంఘమువారియనుజ్ఞ వచ్చినఁగాని సినీమాలాడుటకు వీలులేదు.

వేసఁగికాలము విజృంభించి యెండలు కాసెను. పొలాలు నెఱియలుపడి ప్రొద్దుక్రుంకువేళకు వెచ్చనిపొగ లెగయసాఁగెను. ఊరిలో నున్న పచ్చనిమొక్కలుగాక యూరుచుట్టుపట్ల నెచ్చటను బచ్చని మొక్క లేదు. పూర్వ మంతయు బీళ్ళయిన యా నేల నేఁడు మాగానిగ ట్లయ్యెను. నేల యెండి తెల్లపడెను.

ఒకనాఁడు ప్రొద్దున గణాచారి మేల్కాఁని, స్నానముచేసి, ధ్యానించుకొని, వేఁపమండలు రావిమండలు కలిపి నాలుగుపుచ్చుకొని బయలుదేఱెను. పిల్ల లామెవెంట బయలుదేఱిరి. ఆమెచుట్టును మూఁగినపిల్లలసంఖ్యతగ్గిపోయెను. గణాచారి నల్లనిచీరఁ దాల్చెను. మొగమున బొట్టులేదు. విభూతి ధరించెను. ఈ యమంగళాకృతితో బయలుదేఱి తాలూకాబోర్డుఆఫీసుముం దొకరావిమండయు, వేఁపమండయు వదలిపెట్టెను. ఆవేళకు రామేశ్వరము లోనుండి బయటికి వచ్చుచుండెను. ఆమెనుజూచి యతఁడు తిట్టనారంభించెను. ఆమె క్రిందవదలిన వేఁపమండమీఁద కాలువేసి రాచెను. రామేశ్వరము గణాచారిని గొట్టఁబోయెను. ఆమె వేఁపమండ చేతితో రెండుగాఁ జీల్చఁబోయెను. అతఁ డామెను గొట్టలేదు. ఆమె మండ చీల్చలేదు. ఆమె బయలుదేఱి క్రొత్తగా గట్టిన సినిమాహాలువద్దకు నడచెను. మిగిలిన రావిమండయు, వేఁపమండయు నచ్చట వదలిపెట్టి యామె యెన్నఁడులేనిది సుబ్రహ్మణ్యేశ్వరస్వామియాలయములోనికి వెళ్ళెను. మండ వదలినరోజున గణాచారి యాలయములోనికిఁ బోదు. ఆ నాఁ డేల వెళ్ళెనో?

ఆలయములోని సుబ్రహ్మణ్యేశ్వరస్వామివిగ్రహము విగ్రహము కాదు; ఒక పెద్ద ఱాతిమీఁదఁ బాముపలెఁ జెక్కఁబడియున్నది. ఆ ఱాయి నిలువఁబెట్టఁబడియున్నది. మూఁడువందలయేండ్లు వాడుటచేత కాఁబోలు చెక్కినపాఁపతేఁడు చెఱిగిపోవుచున్నట్లుండెను. గణాచారి స్వామికెదురుగా నిలుచుండెను. స్వామి రెండు పడగలతోమాత్రమే దేవాలయమున నున్నట్లు తోఁచెను. తొమ్మిది వందల తొంబదియెనిమిది పడగలు గ్రామముమీఁదికిఁ బోయెను. గాఁబోలు. స్వామిపడగలన్నింటిని కుదించుకొని తచ్ఛాయలే దేశము మీఁద పాఱనిచ్చెను. కాని తద్విషజ్వాలలు ప్రసరించలేదు. గణాచారిదృష్టికి స్వామితలలన్నియు విడివిడిగా దేశముమీఁదఁ బ్రాఁకిపోయిన విషజ్వాల లుమియుచున్న ట్లుండెను. మిగిలినవి రెండే శిరస్సులు.

గణాచారి బయలుదేఱి మఱల నింటికిఁ బోవుచుండెను. దారిలో నొకమలుపు తిరిగి వచ్చిన పసిరికయు, నామెయు మిక్కిలి

దగ్గఱగా వచ్చిరి. పసిరిక స్థూలశరీరియై యుండెను. సన్నని త్రాఁచు వలె నుండు పసిరిక జెట్టిగొడ్డువలెఁ గదలలేకపోయెను. అతని కాళ్ళు చేతులు సామాన్యముగ మనుష్యున కున్నట్లే యుండెను. మనిసిమొడలిలో నాకుపచ్చఁదనము తగ్గిన ట్లుండెను. అతని కన్నులు పూర్వము సూక్ష్మములై సునిశితములై యుండెను. ఇప్పుడు వానియందు నిశితత్వ మంతగాఁ గనిపించలేదు. పూర్వ మతనివి పాముచెవులు; ఇప్పుడతనికిఁ జాలదూరమునుండి మాట వినిపించదు. వేసఁగి యైపోయి నారుమడులు వేసినప్పుడే యతఁడు పోయి వానియందు గూర్చుండును. ఎక్కువపాములు వచ్చుట యతనిచుట్టుచేరుట యిప్పుడు లేదు. గ్రామమునకుఁ దూర్పుననున్న మెట్టచేలుకూడ దూరమునుండి పల్లమగుచు వచ్చుచుండెను ఆ వచ్చుట పసిరికను బొలాలమీఁదినుండి గ్రామములోనికి గదిమిన ట్లుండెను. అతఁడు చాలభాగ మిప్పుడు గ్రామములోనే నివసించుచుండును. భోజనము చేయుట, దొడ్డిలోఁ బాదులున్నచో నవియన్నియు గూఁడుగా నమర్చి యందుఁగూర్చుండుట, యింటిలో గదిలో దాఁగుకొనియుండుట యతనికిఁ గాల మీరీతిఁ గడచుచున్నది. ఎప్పుడో పిచ్చిపుట్టి మెట్టచేలమీఁదికిఁ బరువెత్తును. అచట గిరగిర తిరుగును. జేనెఁడెత్తెదిగిన జొన్నచేలమీఁదఁ బడి పొరలాడును. పసపుతోఁటలలో దూరి పండుకొనును. మిరపతోఁటలమధ్యఁ గూర్చుండి పచ్చిమిరపకాయ లెన్నియైనఁ గోసికొని తినును. పొగాకుతోఁటలనడుమ పండుకొని రెండుజాముల వేళ సూర్యునివంక నిశ్చలముగాఁ జూచుచుండును. సాయంకాలముల సంధ్యారాగములు వచ్చును. ఆ యెఱ్ఱనికాంతు లతనిమీఁదఁ బడి, యతఁడు పండిన పచ్చిమిరపతోఁటవలె నుండును. ప్రొద్దుపోయి చీఁకటిలో నింటికి వచ్చును – ఇది యతని పూర్వపు నిత్యచర్య. ఇప్పుడది నెలకొకసారి, పక్షమున కొకసారి. చేలు పచ్చగానుండెనా వారమున కొకసారి. జాతీయకళాశాలవెనుక చేలలో త్రాఁచుపాములు తిరుగుచుండును. అవి జనులకందఱకుఁ గనఁబడుచుండును. పసిరిక వానిని ద్రొక్కను. అవి బుస్సుమని లేచి పక్కవాటుగా గాలిని కసిగాట్లు కొఱుకును. పూర్వ మతఁడు త్రొక్కిన త్రాఁచు గాలినైనఁ గఱవలేదు.

గణాచారిని జూచినంతనే పసిరిక పరువెత్తుద మనుకొనెను. పరువెత్తెను. ఉత్తమజాత్యశ్వముకన్న వేగముగాఁ బరుగెత్తెనేమో! కాని గాలివలెఁ బరుగెత్తెనా? లేడివలెఁ బరుగెత్తెనా? మావిజాఱని దూడవలె, గిట్టగిల్లని దూడవలెఁ దొ్రటువడుచుఁ బరువెత్తెను. గాలి తరఁగమీఁద తేలిపోలేదు; నేలమీఁద దాట్లువేసికొనిపోయెను. గణాచారి పోవుచున్న పసిరికవంక నిదానించి చూచెను. అ ట్లెప్పుడును జూడదు.

గణాచారి బయలుదేఱెను. ధర్మారావు వేసఁగిసెలవు లగుట చేత, పనిలేకపోవుటచేత, గ్రామమంతయుఁ దనమీఁద బరువుగా నుండుటచేత, గాలిపీల్చుకొనుటకు వాయవ్యదిశగాఁ బొలాలమీఁదకుఁ జాలదూరము పోయి తిరిగి వచ్చుచుండెను. గణాచారి యతనిని జూచెను. వందగజములు యెడముండి యొకరినొకరు చూచుకొనుచు గ్రుక్కవములవలెఁ దమసంయోగములచేతఁగాని హవిస్సు హోమము జరుగదన్న ట్లిద్దఱును నెమ్మదినెమ్మదిగా దగ్గఱదగ్గఱకు వచ్చిరి. ఇరువురు ఒకరినొకరు సమీపించుట కోట కాగ్నేయదిగ్భాగమున నైనది; ఇద్దఱు నొకరినొకరు నిలుచుండి కన్నులలోఁ గన్నులుంచి చూచుకొనిరి. ధర్మారావునకుఁ గన్నులవెంట నీళ్ళు గిఱ్ఱునఁ దిరిగెను. అతఁడు గ్రుడ్లనీరు గ్రుడ్లఁ గ్రుక్కుకొనెను. అంతలో గణాచారికన్నులయందు నీళ్లు నిలచెను. ఆమె కన్నులనీరు తర్జనితోఁ దీసి నేలమీఁద విసరెను. కాసావాంద్రపేఁటచివర నేదో యిల్లంటుకొని మండిపోవుచుండెను. జనులెల్లరు గుమిగూడి యచటికి బరువెత్తిరి. ఒక్కనిమేషములో నగ్ని చల్లార్పఁబడెను. 'ని ప్పెట్లంటుకొనె' నన్నారు. ఒకపేదకలాలీదొడ్డిలోఁ బొలదాలి రాఁజేసినది. దాని పైని జూరుమీఁద నొకగుడ్డ యెండవేసినది. గుడ్డ యెండి నిప్పంటుకొని జ్వాలలు చూరుకంటెను. ధర్మారా వింటికిఁ బోయెను. అరుంధతి 'నాలుగేండ్లయినది, రంగాపురముపోయి నాచీర లున్నపెట్టె దీసికొనిరారా' యనెను. ధర్మారావు నివ్వెఱవోయి 'యిది యెన్నఁటి మాట? నాఁలుగేండ్లనుండి లేనిమాట యీ నాఁడేలవచ్చినది? ఆ చీర లింక నున్నవా?' యనెను.

మధ్యాహ్నము రెండుజాము లయ్యెను. ధర్మారావు గగనము వంకఁ జూచెను. ఆకాశమున నెండలో నేవో తెల్లనిపురుగులవలెఁ దిరుగుచుండెను. మెతుకున్న యన్నము దించి, పదునువచ్చుటకుఁ బళ్లెముమీఁద నిప్పులు వేసినట్లు ఎండపైనిగాలి నేలను పదునుచేయుచున్నదా యన్నట్లుండెను. దంచిన బియ్య, ముత్తమజాతివడ్ల బియ్యము వండినచో మెతుకుండదు. మరబియ్యము నార్చుటకు రావు. అత్తెసరుకు రావు. పచనమునకు రావు. ఆరోగ్యమునకు రావు. కూఁడేండ్లుగా మరబియ్యము దినుచుండిరి. అరుంధతికి మర బియ్యము పడలేదు. ఆమె క్రమముగా శుష్కించిపోవుచుండెను. ఆమె శరీరమున నుష్ణత విజృంభించెను. ఎచ్చటికైనను దీసికొనిపోయి యామెకు మందిప్పించవలయునని ధర్మారావు కూహ. పూర్వము సుబ్బన్నపేటలోఁ బుట్టుటయే, యందు నివసించుటయే చరకాచార్యునియౌషధాలయములో నున్నట్లుండెను. నేఁడు విచిత్రమై సర్వము విపరీతమై యనారోగ్యము సర్వథాబలిసి యూరు బలిసినది. జనులు చిక్కిరి. ఉద్యోగములు ప్రబలినవి; పంటలు తగ్గినవి. ఉద్యోగ గర్వము విజృంభించెను; వినయము తుడిచిపెట్టుకొనిపోయినది.

అరుంధతి వంటఁ జేసినది. ఎంతసేపటికిని ధర్మారావు భోజనమునకు రాలేదు. అరుంధతి రమ్మని నాలుగుసారులు పిలిచినది. ధర్మారావు పరధ్యానముగాఁ గూర్చున్నాఁడు. అరుంధతి 'నా కాఁకలి మండిపోవుచున్నది. మీరు రారాయె' ననెను. ధర్మారావు 'అవును. మండిపోవుచున్నది. ఆర్పివేయుటకు జ్వాలలు కనిపించుటలేదు. కనిపించి యొకచోటనున్న జ్వాలయైనచో నార్పవచ్చును. నిరూపించరాక సర్వత్ర దహించుచున్న జ్వాల నార్పుట యెట్లు? అదిగో జ్వాల యన్నఁ గనఁబడనిదానిని జూడలేనిజనము కన్నులుగల యంధులై యది జ్వాల యేమిటి? రోదోంతరాళమునఁ బూసిన కాశ్మీరార్ద్రావలేపన మని, వాయువీచికలలోఁ దారాడుచున్న యరుణనీరేజకింజల్కరేణునిశ్రేణి యని చెప్పెదరు అదిగో యొడలు దహించుటలేదా యనుము. చల్లఁదనమెఱుఁగనివీరికి శిఖిశిఖాదాహమే చల్లగానున్నట్లనిపించుచున్నది. అహో! భాగధేయము! నన్నన్నమునకు లెమ్మందువా? అన్నములోని కేమి చేసితివి? పచ్చడియా, కూరయా? అన్నములోఁ బలుకు లేదుగదా!' అని పలికి, పోయి, స్నానముచేసిమడికట్టుకొనెను

# పదుమూఁడవ అధ్యాయము

క్రొత్తసంవత్సరముతో జాతీయకళాశాలకుఁ గ్రొత్తయధ్యక్షుఁడు వచ్చెను. ఆయనపేరు శివరావు. ఆయన స్వగ్రామము నెల్లూరు. ఆయనతండ్రి నెల్లూరిలోఁ బూర్వము న్యాయవాదిగా నుండి కొంత మరియాదయుఁ, గొంతధనము నార్జించెను. సహాయ నిరాకరణోద్యమము ప్రారంభించినప్పుడు శివరావు వెంకటగిరిరాజా వారి కాలేజీలోఁ జరిత్రోపన్యాసకుఁడుగా నుండి రెండువందలరూపాయలజీతము తెచ్చుచు నాయుద్యోగము పరిత్యజించి యుద్యమములోఁ బ్రవేశించెను. సంవత్సరమున్నర కారాగృహమునందుండి మఱల బయటికి వచ్చెను వచ్చి యేడాదియైనది. నిరాకరణోద్యమమున జీవనోపాధులు వదలుకొన్నవారికి దేశమునఁ జాలకష్టముగానుండెను. నిరాధారులై వారల్లాడుచుండిరి. ఉద్యమమువలన నావగింజలో నఱభాగమైనను లాభము కలుగలేదు. దేశములో నపరిమితమైన ప్రబోధము కలిగినది. అది యొక్కటియే లాభము.

శివరావు బక్కపలుచనిమనిసి. పొడుగైనమనిసి. ఎఱ్ఱని మనిసి. అతఁడు క్రాపింగుపెంచి మీసములు, గడ్డములు తీసివేయును. మనిసి చాల సుందరుఁడు. పొందూరుబట్టలుగాని కట్టఁడు. పేటంచు జరీఖద్దరుత్తరీయములనుగాని పైనివేయఁడు. ఎప్పుడును మల్లెపూవు వలెఁ నుండును. అతని తలిదండ్రులు చనిపోయిరి. అతనికి సంతానము లేదు. ఒక్క భార్యయుఁ దాను నిద్దఱు. జాతీయకళాశాలలో నాయన కొఱ కొకప్రత్యేకపర్ణశాల నిర్మించిరి. దాని కాఱువందలైనది. ఆయన దానికి పదిరూపాయ లద్దె యిచ్చును. శివరావుగారు వచ్చి కళాశాలలోఁ బ్రవేశించెను. చంద్రారెడ్డిగారు కళాశాలాధికారమంతయు శివరావుగారి కిమ్మని నారాయణరావుగారికిఁ గాగితము వ్రాసి పంపించెను. వారము రోజులైనది. నారాయణరావుగా రీయలేదు. వచ్చిన శివరా వింటికడ భోజనము సేయును. కళాశాలావిశాలభూములలో సంచరించును. రోజున కొకసారి వచ్చి నారాయణరావుగారిని కాగితము లొప్పఁజెప్పు మనును. ఆయన 'నేఁడుకాదు, ఱే'

పని జరుపును. శివరావు పోయి చంద్రారెడ్డితో మనవిచేయును. చంద్రారెడ్డి పండ్లు కొఱుకును.

వారమురోజు లైనతరువాత చంద్రారెడ్డి మఱలఁ గాగితము వ్రాసెను. నారాయణరావు 'పాలనాసంఘము మఱల సమావేశమై యధికారము శివరావుగారికి నొసంగవలయు నని తీర్మానించిన కాని తా నట్లు చేయ' నని చెప్పెను. చంద్రారెడ్డికిఁ బట్టరానంతకోపము వచ్చెను. కాని యేమిచేయవలయునో తెలియలేదు. 'సరే, సంఘ సమావేశము చేయింతు' ననెను.

శివరావు వచ్చినప్పటినుండియు ధర్మారావునకు, శివరావునకు మైత్రియయ్యెను. శివరావూరకేయుండుట యేల యని ప్రతి దినము కళాశాలకుఁ బోయి కొందఱుపిల్లలను గూర్చుకొని తాను చదువుచెప్పెను. నారాయణరావు పిల్లల నెవ్వరి నాయనయొద్దకుఁ బోనీయలేదు. నెల్లూరికళాశాలలో నున్నపుడు శివరావు మంచియుపన్యాసకుఁడుగాఁ గీర్తిపొందెను. ఉద్యమములోఁ జదువుమానివేసిన కొందఱువిద్యార్థు లతనికీర్తిమెఱిఁగినవారు జాతీయకళాశాలలోఁ జదువుటకు వచ్చిరి. వారు చరిత్రము, రాజకీయము, ఆర్థికశాస్త్రము చదువు విద్యార్థులుగాఁ జేరిరి. వారు శివరావువద్ద చదువుకొందురు. దినములోఁ గొంతభాగము ధర్మారావునొద్ద తెలుఁగభ్యసింతురు. శివరావు వచ్చినంతనే చరిత్రగ్రంథములు నాలుఁగువందలరూపాయల కార్డరిచ్చెను. పదిరోజులలో నవివచ్చి రైలుస్టేషనులో బంగీలు పడియుండెను. పాలనాసంఘసమావేశము జరుగవలయును. ఆ ధనము మంజూరు కావలయును.

సంఘసమావేశమునకై మూఁడుసారులు చంద్రారెడ్డి ప్రయత్నించెను. రాధాకృష్ణయ్యగారును, నాగేశ్వరరావుగారును రారు. శఠగోపాచారి పోఁడు. చంద్రారెడ్డియు రామచంద్రరాజును వత్తురు. 'కోరము' చాలలేదని సమావేశము జరుగదు. మూఁడునెలలు గడచెను.

సమావేశమైనతరువాత ధనముమంజూరుచేయించి యీవచ్చు నని శివరావు నెల్లూరులోఁ దనపొలమునమ్మినడబ్బు బ్యాంకులో నుండఁగా నది తెప్పించి పుస్తకములు తీసికొని, మఱి వందరూకలతో

బీరువాలుకొని, కళాశాలలోఁ బుస్తకభాండాగార మేర్పఱచెను. చంద్రారెడ్డి 'సమావేశముజరిగినతరువాత నీ ధనమంతయు నిప్పింతు' ననెను. మఱల రెండునెలలు కడచెను. కేశవరావునకీ నైదునెలలకు జీతమురాలేదు. శివరావు నెల్లూరునుండి తెచ్చి తినుచుండెను. నారాయణరావు కోటలోనికి రాకపోకలు ప్రబలించెను. చంద్రారెడ్డిమీఁద, రామచంద్రరాజుమీఁద, ధర్మారావుమీఁద, శివరావుమీఁద లేనిపోని కొండెములు రాధాకృష్ణయ్యతోను, నాగేశ్వరరావుతోను జెప్పెను. వారు చెవియొగ్గి వినిరి. క్రొత్తయధ్యక్షుడు కావలెనని తీర్మానించిన వారిలో రాధాకృష్ణయ్యగారుగూడ నున్నను దరువాత నాయన తిరిగి పోయెను. ఎప్పుడు సమావేశము జరిపినను నారాయణరావు పుడకలు వేయును. రాధాకృష్ణయ్య సమావేశమునకు రాఁడు.

ఒకనాఁడు చంద్రారెడ్డి స్వయముగాఁ గళాశాలకు వచ్చెను. రెడ్డి వచ్చి కాగితములన్నియు నదలించి బెదరించి నారాయణ రావువద్దనుండి తీసికొని శివరావున కిచ్చి శివరావు నధికారిగా నియమించి సంగయ్యను శివరావు చెప్పినట్లు చేయకపోయినచో నుద్యోగమునుండి తొలఁగించెద నని బెదరించి, నైదునెలలజీతము చరిత్ర గ్రంథములు బీరువాలుకొనుటకైన నైదువందలు-వేయిరూపాయలు బ్యాంకునుండి తెప్పించి శివరావున కిచ్చి తనదారిని బోయెను. ఈ పని రెండురోజులు జరిగెను. ఆనాఁటినుండి శివరావు కళాశాలాధి కారి యయ్యెను. అధికారము మఱల సంపాదించవలెనని నారాయణరా వెంత ప్రయత్నించినను సాఁగలేదు. కళాశాలలోఁ జదువు సంధ్యలు లేవు. రెండుపక్షము లేర్పడెను. ధర్మారావు, శివరావు లొకటి; తక్కినవా రందఱు నొకటి.

రాజాగారికళాశాలలో బి.ఏ రెండవసంవత్సరముకూడఁ బెట్టిరి. కళాశాల యమోఘముగా సాఁగుచుండెను. కళాశాలాప్రథమాధ్యక్షుఁడు రామారావుగా రనునొకయాంధ్రుఁడు. కాలేజీలో బి. ఏ. పెట్టినతరువాత నాయనను దొలఁగించి యొకయూరపియను నధికారిగా వేయవలయునని నాగేశ్వరరావుగా రూహించిరి. 'తగిన యాంధ్రులు లేనియెడ యిట్లు చేయుట' యని కృష్ణాంధ్రపత్రికలు వ్రాసెను. ఈ సంవత్సరాదినే రామారావుగారిని దొలగించి ఈట్సనుదొరను గాలేజీ

ప్రిన్సిపాలుగా వేసిరి. హరప్ప ఈట్సనుదొరవద్ద చదువుట మాని వేసెను. హరప్పకుఁ బదునేనవయేఁడు వచ్చెను. అతనికి నాంగిలేయమునం దే గ్రంథమైనను జదివి యర్థముచేసికొనునంత భాష వచ్చెను. శివరావునకు, హరప్పకు స్నేహము ధర్మారావుద్వారా జరిగెను. హరప్ప జాతీయకళాశాలకుఁబోయి శివరావువద్దఁ జరిత్రయు, నార్థికశాస్త్రము చదువుచుండెను. ఈట్సనుదొరకు హరప్ప ట్యూటరుగా ముట్టుచున్న పన్నెండువందలు కాలేజీప్రిన్సిపాలుగా ముట్టుచుండెను. ఈ నాలుగేండ్లలో నే కళాశాలకొక సంప్రదాయ మేర్పడెను. అచ్చట నింగ్లీషు నూరిపోసెదరు. విద్యార్థులకు స్వాతంత్ర్యము లేదు. ఉపన్యాసకులును స్వాతంత్ర్య మవలంబించరాదు. ఉపన్యాసకులు విద్యార్థులతోఁ గలసిమెలసి యుండరాదు ఒక యుపన్యాసకుఁడు విద్యార్థులతోఁ జనవుగానున్నాఁ డని యాయనను దొలఁగించిరి. కొద్దిలోఁ గళాశాలాపాలకవర్గము బ్రిటిషురాచరికమువలెఁ దయారయ్యెను. ఉపన్యాసకు లేమేమి చెప్పుకొను చుండిరో యని వారిమీఁద కొందఱు విద్యార్థులను గూఢచారులుగా నియమించిరి. పాఠములు చెప్పునప్పుడు ప్రతియుపన్యాసకుఁడు నేమేమి చెప్పెనో యదియంతయుఁ బ్రిన్సిపాలుద్వారా నాగేశ్వరరావునకు, జమీందారునకుఁ దెలియుచుండెను. ఉపన్యాసకులకుఁ గాలేజీలోఁ బనిచేయుట కష్టమైపోయెను. క్షుధార్తు లేమి చేయుదురు? ప్రత్యక్షముగా 'నిన్నుఁ దీసివేసితి' మని చెప్పవలసిన నంటిపెట్టుకొనియే యుండుచుండిరి. కాలేజీలో నాగేశ్వరరావు తన నూత్నమతమును వెదచల్లుచుండెను. తన్మతకర్త యొక వంగదేశీయుఁడు. ఆయన పేరు శ్రీ కేషబ్జీ. కేషబ్జీ చైతన్యునియవతారమఁట. అది నూతనమతము కాదు; బ్రహ్మసమాజము కాదు; హరనాథబాబామతము కాదు; చైతన్యునియవతార మనుటయేకాని కేషబ్జీమతానుయాయులు కృష్ణభగవాను నారాధించరు; చైతన్యుని మతము స్వీకరించరు. వారికిఁ గేషబ్జీ పరమాత్మ. ఆయనహస్తములు శంఖచక్రగదాచిహ్నకలితములు. వారు కర్మము నంగీకరించరు. నీతికిఁ బ్రధానమిచ్చెదరు. స్త్రీపురుషులకు సృష్టిలో సమానములైన హక్కు లున్నవి. విగ్రహారాధనకు మహమ్మదీయులకన్న, క్రైస్తవులకన్న నెక్కువ విరోధులు. ప్రార్థనలతోఁగూడ భగవంతుఁడు

దయామయుఁ డనరు; 'కేవల్జీ దయామయుఁ' డందురు. అది యొక మతము. కళాశాలలోని యుపాధ్యాయులందఱు నా మతమునుగూర్చి యేమియు ననరాదు. ఒకసారి సంస్కృతపండితుఁడు 'ఏమిటోయి, యీ కుక్కగొడుగు మతములు! ఈ మతమువచేత నాగేశ్వరరావు జమీందారు నాడించుచున్నాఁ' డనెను. గూఢచారుని తంతిలేని వార్త నాగేశ్వరరావుచెవిలో ఖంగుమని మ్రోఁగెను. ఆ సంస్కృత పండితుఁడు మహాసాహిత్యవేత్త. తర్కవ్యాకరణములలో సమగ్రుఁడు. సంవత్సరము కాకముందే యాయనకు 'యత్తే యజ్ఞము' చెప్పిరి. ఆయనబదులు విద్వాన్ పరీక్ష నిచ్చిన యొకయాచార్యులను దెచ్చిరి. ఆయన యాశ్రయించుటలో నాటితేటినవాఁడు. ఆయన వచ్చిన మొదటిదినముననే విద్యార్థు లాయనకు 'బూడిదగుమ్మడికాయ'యని పేరుపెట్టిరి. అతఁడు వట్టి యలౌకికుఁడు. ఒకరోజున క్లాసులో నొక విద్యార్థి లేచి 'ఆచార్యులుగారూ! బూడిదగుమ్మడికాయ దేనికి పనికివచ్చునండీ' యనెను. ఆచార్యునకుఁ దెలియును, త న్ననుచు న్నాఁ డని. లేచి యడిగినవాఁడు గడుసుకుఱ్ఱవాఁడు. అందుచేత నతఁడు 'బూడిదగుమ్మడికాయమాత్రము చెడిపోయిన దనుకొన్నా వేమోయీ! దానిరుచి వడియాలలోఁ దెలియవలయు'ననెను. తక్కిన పిల్ల లందఱును వడియాలు, వడియా లని కేకవేసిరి. ఆనాటినుండి యతనికి వడియ మనియు, గుమ్మడికాయ యనియు రెండును బేర్లే యయ్యెను.

ఆ కళాశాలలో స్త్రీవిద్యార్థులుకూడఁ గలరు. విద్యార్థినులకు, మఱికొందఱు విద్యార్థులకు స్నేహము కలదు. అది యెట్టిస్నేహమో విచారించకయే స్నేహితులన్నవిద్యార్థులనెల్ల జరిమానాలువేసియుఁ, గొందఱిని గళాశాలనుండి వెడలనడఁచియు నధికారులు కఠినముగాఁ బ్రవర్తించిరి. సుబ్బన్నపేట కాలేజీ సర్వవిధముల యమలోకమువలె నున్న దని విద్యార్థులు చెప్పుకొనఁజొచ్చిరి.

చంద్రారెడ్డి గడచినసంవత్సరమే రాచరికమువారికిఁ బుర పాలకసంఘమువా రీయవలసిన యప్పులోఁ బ్రతిసంవత్సరము చెల్లింప వలసినది సరిగాఁ జెల్లించలేదు. తాము గవర్నరుగారిని బిలుచుకొని వచ్చి పెద్దగౌరవముచేసినందుకుఁ దమయందు వారికిఁ గొంత యభి

మాన ముండకపోవునా యని యూహించెను. ఆహార మాహారమే, వ్యవహారము వ్యవహారమే యన్నట్లు రాజ్యకార్య వ్యవహారముల యందు మొగమోటములు చెల్లలేదు. పురపాలక సంఘమువారు ప్రతి సంవత్సరము నప్పులుచేయవలసివచ్చుచుండెను. వాఁకిఁ జేయూఁడలేదు.

రామేశ్వరముగారి సినీమా నడుపుటకు ననుజ్ఞకొఱకు దర ఖాస్తువచ్చెను. పురపాలకసంఘసభ్యులసమావేశ మయ్యెను. గార్డినరు దొర యనుకూలముగ వాదించెను. కబీరు లేచి చెప్పెను: 'రాచరి కమువారికి మనము చెల్లించవలసినది చెల్లించలేకున్నాము. పట్టణ మంతయు దరిద్రులై యుండిరి. ధరలన్నియు నెక్కువయ్యెను. పట్టణ ములో ధనము లేదు. సినిమా పెట్టినచో జనులు వ్యామోహితులై, యింటిలో భార్యాబిడ్డ లేడ్చుచుండఁగాఁ దక్కినజాతివారలు కల్లు దుకాణములకు బరువెత్తినట్లే ప్రతిరోజును సినిమాకు బయలుదేఱె దరు. రోజున కెంతచెడినను రెండువందలరూపాయలైనను సినిమాకుఁ జెల్లుబడియైనచో నెల కాఱువేలరూపాయలు వసూలగును. ఈసొమ్ము పట్టణముమీఁదనుండిపోయి జనులు దరిద్రు లగుదురు. ఇదివఱకే ధనవంతులైనవారు మఱికొంత ధన మార్జింతురు. పనియుఁబాటయు లేనివారికి జీతములు వచ్చును. హాలులో నధికారముచేయుటకుఁ గొందఱు పోకిరీలు తయారవుదురు. సినిమాచూడుట కనుజ్ఞ యిచ్చి నచో నెల కాఱువేలుచొప్పున సాలునకు డెబ్బదియెనుబదివేలకు గ్రామము దరిద్రము కావలసివచ్చును. పట్టణమంతయు గలిసి పుర పాలకసంఘమునకుఁ జెల్లించుపన్ను లంత లేవు. ఆలోచించి చేయ వలయు' నని కబీరు కూర్చుండెను.

అతనియుపన్యాసము నచ్చినవాఁ డొక్కఁడే. అతఁడు చంద్రా రెడ్డి. చంద్రారెడ్డి రామేశ్వరమున కెదురుగాఁ జేయుటకు ముందు నకుఁ దూఁగక విషయము వోటునకుఁ బెట్టెను. కబీరు పక్షమునకు రెండేవోట్లు వచ్చినవి కబీరుదొకటి, రామచంద్రరాజు దొకటి. మఱునాఁడే సినిమా ప్రారంభింపఁబడెను. ఆ నాఁడు రామేశ్వరము గారు గ్రామమునకంతకు లంకాదహనమన్న ఫిలిముచెప్పించి యూరకే ప్రదర్శించిరి. జనము గుంపులుగుంపులై వచ్చి చూచిరి. అందఱు నానందించిరి. రామేశ్వరముగారు హాలులోఁ బెద్ద టీపార్టీ చేసిరి.

తహసీల్దారు మొదలైన పెద్దయుద్యోగస్థులందఱును వచ్చి టీపార్టీలో నారగించి, సినిమాచూచి పోయిరి. నాలుఁగునెలలు గడచువఱకు రామేశ్వరముగారికిఁ బెట్టుబడియంతయు వచ్చెను. కబీరు వేసిన లెక్కలు తప్పు. రోజునకు రెండాట లాడెదరు. రెండు నాల్గువంద లెనిమిదివందలు వచ్చును. మొదటినెల యిరువదివేలు, తక్కిన మూఁడునెలలు పన్నెండు, పదునాఱువేల మధ్యయు వచ్చెను.

రామేశ్వరముగారి కిదికాక తాలూకాబోర్డుప్రసిడెంటుగాఁ బ్రయాణపుఖర్చులు వచ్చుచుండెను. ఆయన నెలకు ముప్పదిరోజులు బోర్డుపాఠశాలల తనిఖియే చేయుచుండెను. నెల కాఱువందలు, ఏడు వందలు బిల్లు చేయుచుండును. తక్కినసభ్యులకు దానిలో మోసము తెలిసియు వారు పైకి మాట్లాడరు.

అతఁడు బోర్డులోని యుపాధ్యాయులను బీడించుకొని తినఁ జొచ్చెను. తాను వచ్చిన లేచి నిలుచుండలేదని, తనకు నమస్కారముచేయలేదని వారికి జరిమానాలు వేయును; సస్పెండుచేయును. ఒక యుపాధ్యాయుఁడు 'పేనుకుపెత్తనమిచ్చినఁ దెల్లవాఱులు తెగఁ గుట్టినట్లు బాగుగా నున్నది' అనెనఁట. అతఁ డుద్యోగమునుండి తొలఁగించఁబడెను. రామేశ్వరమునధికారగర్వము మితిమీఱిపోయెను. పదునాఱు పదునెన్మిది రూకలు జీతము తెచ్చుకొను నుపాధ్యాయులందఱు నతనిదయాప్రసాదముకొఱకు తహతహలాడిపోయిరి. గుంటూరులో నొకభీమాకంపెనీ పెయేజం టొకఁ డుండెను. అతఁడును ధర్మారావును సహపాఠకులు. అతఁడు సెకండుఫారము మూఁడుసంవత్సరములు, థర్డుఫారము మూఁడుసంవత్సరములు, ఫోర్తుఫారము నాల్గు సంవత్సరములు తప్పి, తనకుఁ జదువుకుఁ బ్రబలవిరోధమని దెలిసికొని భీమాకంపెనీయేజంటుగాఁ జేరెను. వాఁడు నాలుఁగైదేండ్లలో పదిలక్షలరూపాయలకు భీమాలు చేయించి కంపెనీవారిచేతఁ జాల ప్రశంసపొంది వారివద్దనుండి నెలకు మూఁడువందలరూపాయలజీతము పుచ్చుకొనుచుండెను. వానిపేరు నిరంజనరావు. అతఁడు వచ్చి రామేశ్వరముగారి నాశ్రయించెను. తాలూకాబోర్డులో నున్న యందఱుపాధ్యాయులచేతను వేయివేయిరూపాయలచొప్పున భీమాచేయించి నచో రామేశ్వరముగారికి వేయిరూపాయల బహుమాన మిచ్చెద

ననెను. ప్రెసిడెంటుగారు డబ్బు చేతిలో వేసికొని యుపాధ్యాయులను బలవంతపెట్టి భీమాచేయించ నారంభించెను. తాలూకాలో నొకరిద్దఱుపాధ్యాయులు రామేశ్వరముగారిమీఁదఁ గలెక్టరు కర్జీ పెట్టిరి. కలెక్టరుగారు జిల్లాబోర్డుప్రెసిడెంటును విచారించిరి. వారికిని రామేశ్వరముగారికిని జెలిమియగుటచేత వారు కలెక్టరుగారితో సర్ది చెప్పిరి. అర్జీపెట్టిన యిద్దఱుపాధ్యాయులకు నుద్యోగభ్రంశము వెంటనే ప్రాప్తించెను.

రామేశ్వరముగారు సినిమాతోఁబాటు నాటకములకంపెనీ గూడ నొకటి పెట్టినచో లాభదాయకముగా నుండునని యూహించిరి. హాలు కట్టనక్కఱలేదు. నటకులను దీసికొనివచ్చుటతప్ప వేఱె వ్యయము లేదు. బోర్డుఉపాధ్యాయులలోఁ గొందఱు చక్కఁగా సంగీతము పాడఁగలరు వారిచేత వేషములు వేయించవచ్చును. వారికేమియు నీయనక్కఱ లేదు. పెద్దవేషములకుమాత్రమే తేవలెను.

జాతీయకళాశాలలో నుపాధ్యాయులెంత వికృతప్రకృతులో విద్యార్థులు నంత వికృతప్రకృతులు. చదు నక్కఱ లేనివాఁడు, తిండి లేక కాలముగడుపుకొనవలఁచినవాఁడు, తలిదండ్రుల నెదిరించివచ్చిన వాఁడు, అగమ్మకాకి, దేశదిమ్మరి వీ రెక్కువమంది విద్యార్థులు. శివరావు దివ్యజ్ఞానసమాజమువాఁడు. ఆయన అనిబిసెంటమ్మగారి శిష్యుఁడు. శిష్యత్వ మేకలవ్యసంప్రదాయము. లెడ్‌బీటరు, బిసెంటమ్మ, కృష్ణాజీ ప్రభృతులన్నచో నతని ప్రకృతిలో నావేశతరంగములు లేచుచుండెను. శివరా వెప్పుడును ధర్మారావుతో దివ్యజ్ఞానసభావర్తమానములే చెప్పును. ధర్మారావున కిష్టముగా నుండదు. కాని వృథాగా మిత్రునిమనసు కష్టపెట్టుట యెందు కని యూరకుండును.

శివరావునకు మనసులోఁ గొన్నియాదర్శములు కలవు. వానిని జాతీయకళాశాలలో ఫలమునకు: దేవలెనని యాయన యుద్దేశ్యము, అతని చుట్టునున్న విద్యార్థులను ప్రతిదినము తనవలెనే ప్రార్థనలు మొదలైనవి చేయునట్లు చేసెను. అందులోఁ బ్రధానులు నలుగురు: ఒకఁడు బలరామయ్య, ఒకఁడు నరేంద్రరావు, ఒకఁడు సీతాపతి, ఒకఁడు కృష్ణరావు. బలరామయ్య గోదావరిజిల్లావాఁడు. కాకినాడలో ఎఫ్. ఎ. చదివి, యుద్యమములో మానివేసి, జాతీయకళాశాలకు

వచ్చినవాఁడు. అతఁడు కొంచె మాస్తిపరుఁడు. ప్రతివానితో వినయముగా మాట్లాడును. నరేంద్రరావు ఎఱ్ఱని బక్కపలుచని మనిసి. అతఁడఖవవాఁడు. కాని తెలుఁగుదేశములోఁ జాలకాల ముండుటచేతఁ దెలుఁగునందే వాని కెక్కువ యభిమానము. వానికిఁ దలిదండ్రులు లేరు. పేరు తెలుఁగుపేరు పెట్టుకొనెను. అతని యన్నగారు భుజంగయ్యారు. విశాఖపట్టణములో ఓవరుసీయరు. సీతాపతి బెజవాడవాఁడు. ధనవంతులబిడ్డ. సాధువైన మనిసి. అతనికి శివరా వన్నను ధర్మారా వన్నను సమానమైన ప్రేమ. కృష్ణరావు కృష్ణాజిల్లావాఁడు. అతఁడు శాంతినికేతనమునకుఁ బోయి గొన్నాళ్ళుండివచ్చెను.

శరదృతువు వచ్చెను. నిర్మేఘమైనయాకాశమునుండి సూర్యుఁడెండలు కురిపించెను. చంద్రుఁడు వెన్నెలలను గురిపించెను. తెల్లపూవులు వికాసించెను. గుండేటినీరు వట్టిపోయెను. ఊరిపడమటనున్న కాలువలో నీరు నలుపువిఱిగెను. తెల్లనిమేఘములు దూదిపింజలవలె గాలి యుప్పనియూఁదఁగాఁ గొట్టుకొనిపోవుచుండెను. వరిచేలన్నియుఁ గంకులమీఁద నుండెను. బోదెలలో రెండువైపులఁ బేరియున్నయొండు పైని దేరి తెల్లని సన్నని నీటిజాలులు ప్రవహించుచుండెను. కాఁడి గట్టులవేసినమినుపకాఁడ బలిసి పెరిఁగి మనుసుల నడువనిచ్చుటలేదు. వెన్నెలలు కాసెను. మెట్టచేలమీఁద దూరపుఁజీఁకటులతోఁ గలసి నువ్వులు, బియ్యము కలిపిపోసిన ట్లుండెను. కళాశాలలోపలియావరణములో వెన్నెలలు పిండియారఁబోసిన ట్లుండెను. పట్టణములో నిండ్ల చాటునఁబడి యూ తెల్లని వెన్నెలలే కొంచెమునల్లనై యున్నట్లు తోఁచెను. ఒకనాఁటిరాత్రి ధర్మారావు నిదురపోవుచుండఁగా జలరామయ్యయు, శివరావును, సీతాపతియు ముగ్గురు వచ్చి ధర్మారావును లేపిరి. 'ఇంతరాత్రి వేళ నేల వచ్చితి'రని ధర్మారా వడిగెను. వారు 'పనియున్నది. నేఁ డొక మహావిషయము జరిగినది. మీ కది చెప్పవచ్చితిమి. కళాశాలలోఁ జెప్పెదము. పోవుదము రండి'యనిరి. ధర్మారా వరుంధతిని దలుపువేసికొమ్మని తానువారి వెంటఁబోయెను. కళాశాలలోఁ గ్రీడార్థముంచఁబడిన విశాలసుప్రదేశమున నందఱును గూర్చుండిరి. సుందరుఁడై, యెఱ్ఱనై, బక్కపలుచనై యున్న శివరావు వెన్నెలలో మొగలిపూవువలెఁ దళతళలాడెను. ధర్మారావుగాక

తక్కిన ముగ్గురు నతనివంక భగవంతునివలెఁ జూచుచుండిరి. ధర్మారావు 'విశేషమేమి చెప్పుఁ' డనెను. వారిలో వారు నీవు చెప్పుమన్న నీవు చెప్పు మనుకొనిరి. తక్కిన ముగ్గురును శివరావునే చెప్పుమనిరి. శివరావు మాటలాడునప్పుడుకూడ నొకవిధమైన తన్మయత్వము నటించును. కన్నులెత్తి యెప్పుడు నేదో యూర్ధ్వగతవిషయములనే విచారించుచున్నట్లుండును. మొగమునందు మందహాసము రాసి యుండు. అతఁడు 'సరే, నేనే చెప్పెద' నని, ధర్మారావు నొక కృష్ణకర్ణామృతములోని శ్లోకమును జదువుమనెను. ధర్మారావు—

"అపి జనుషి పరస్మిన్నాత్తపుణ్యో భవేయం
తటభువి యమునాయా స్తాదృశో వంశనాళః
అనుభవతి య ఏష శ్రీమదాభీరసూనో
రధరమణిసమీపన్యాసధన్యా మవస్థామ్."

అని బేగడ రాగముమీఁద నాలపించెను.

ధర్మారావునకు నిద్దురమత్తు సరిగా వదలలేదు. కొంత విశ్రమించుటచేత నతనికంఠము చక్కఁగా జీర సాఁగెను. శరజ్జ్యోత్స్నాతరంగనిశ్శ్రేణిపై నతనికంఠస్వరము తద్గతభావము స్వర్గవీథీవిహారము సల్ప నెక్కుచున్నట్లు గాలిలో సుమధురమై వినిపించెను. తక్కిన నలువురును నతనికంఠమాధుర్యమునకు, భావానుగుణరాగాలాపనకు, నర్థద్యోతకమైన చదువుఫణితికి నానందించిరి. శివరావునకు సంస్కృతమురాకపోయినను గర్ణామృతము తెలుఁగుతాత్పర్యముతోఁ జదివెను. కర్ణామృతములోని యే శ్లోకమైనను నతనికిఁ బరిచితమే. ఈ శ్లోకము వినినంతనే యతఁడు ధర్మారావుతొ 'ఆహా! మీరు మహాభక్తులు. మీగానమాధుర్యముచేత నాకర్షింపఁబడి భగవంతుఁడు మీసమీపముననే యున్నాఁడు' అని యుద్విగ్నమూర్తియయ్యెను. ధర్మారావు 'విశేష మేమో చెప్పుఁ' డనెను. శివరావు విద్యార్థులు ముగ్గురివంకఁ జూచెను. వారు 'మేము వెళ్ళెదము. మీరు చెప్పుఁ'డని యచటినుండి లేచిపోయిరి.

శివరా వారంభించెను: "నేను నాల్గురోజులనుండి మనస్సులో గొప్ప పరివర్తనము పొందుచున్నాను. మీరుకూడ నా యుద్వేగము గుర్తుపట్టియే యుందురు. నాకుఁ జాలదినములనుండి 'మన మేల కృష్ణ

నిలో లీనము కాఁగూడదఁ' దని యుండెడిది. తత్ప్రయత్నము లెప్పుడును జేయుచునే యుంటిని. పొడుము, చుట్ట, బీడి, సిగరెట్టు మొదలైనవి నాజన్మలో నేను త్రాఁగలేదు. అతిపవిత్రమైన జీవితము గడపితిని" అని శరీరోర్ధ్వభాగము దీర్ఘీకరించి, మొగమునందుఁ దీక్ష్ణతఁ దెచ్చుకొని కన్ను విస్తరించి చూచెను. వెన్నెలలు కొంచెము నల్లఁబడెను. చంద్రుఁడు పశ్చిమదిశయందు జాఱిపోవుచుండెను. శివరావు మఱల నారంభించెను: "సృష్టిలో నున్న జీవాత్మలన్నియు నొక్కటియేకదా! ఈ మాయ తెలిసికొనినచో జీవాత్మ పరమాత్మ యగునని యద్వైతులు చెప్పుదురు. భక్తిచేత భగవంతుని మనము ధ్యానించితిమేని నదిగూడఁ బరమాత్మతోఁ గలియుటయే. రెండును రెండు బిన్నమార్గములు. నేను ప్రతియుదయమున లేచి శ్రీకృష్ణదేవుని ధ్యానించుచుందును. రాత్రులందు ధ్యానింతును. ఇది కడచిన పది పదునేనేండ్లనుండి చేయుచుంటిని. భగవంతుఁడు వచ్చి నాలో నుండుటకు నా శరీర మను దేవాలయమును శుభ్రపఱచి యుంచితిని." శివరా విదియంతయు నింగ్లీషుభాషలోఁ జెప్పుచుండెను. ఆ నాఁడు శుక్లదశమి. రాత్రిసుమారు రెండుగంటలు కావచ్చెను. చంద్రుఁడు పశ్చిమదిక్కున దిగెను. దిగినకొలఁది జందురుఁ డెఱ్ఱనగుచుండెను. వెన్నెలలు బియ్యపుగింజలరంగునకుఁ దిరిగెను. శివరావు మఱల నారంభించెను: "నాల్గునాళ్ళనుండి నేను తిరుగుళ్ళు పడిపోయితిని. భగవంతుఁడు నాకుఁ గనిపించకపోయినచో నే నాత్మహత్యచేసి కొందు ననకొంటిని. నేను కూర్చుండి తెల్లవాఱులును దీర్ఘముగా విచారించుచుంటిని. మూఁడురోజులక్రింద రాత్రి నేను కూర్చుండి ధ్యానించుచుండఁగా నాకంటిముందఱ మహాజ్యోతి కన్పించెను. ఆ జ్యోతివెలుఁగు భరించలేక నేను కన్ను తెఱచితిని. మూఁడు రాత్రులు వరుసగా నట్లేయయ్యెను. నేఁటిరాత్రి మఱలధ్యానమునకుఁ గూర్చుండఁగా నాలో నాకే యొకయూహ వచ్చెను–భగవంతుని ధ్యానించుట యెందులకు? అతఁడు మనకుఁ బ్రసన్నుఁడగుట యెందులకు? మహాతపస్సుచేసినచో మనమే భగవంతులము కావచ్చు నని. నేఁటిరాత్రి భోజనముసేయకుండ నట్లే కూర్చుంటిని. నాభార్య తాను వండుకొని తిని నిదురపోయెను. నేను మనసా కృష్ణుఁడ నైనట్లే

యూహించ మొదలుపెట్టితిని. ఒక్క గంటలో మనసా దశావతారము లెత్తితిని. చివరకుఁ గృష్ణావతారము వచ్చినది. ఈ సంగతులన్నియు నా యనుభవములోనికి వచ్చెను. కా దనుటకు వీలు లేదు. ధర్మారావుగారూ! మనకు మంచిరోజులు వచ్చినవి. క్రమముగా దేవుఁడు ప్రసన్నుఁ డైనతరువాత లోప మేమున్నది? సర్వార్థములును జేతిలో సమకూరినట్లే. కూర్చుండి యాలోచించుచుండఁగా నేను కామక్రోధాదులనన్నిటిని జయించినట్లే తోఁచినది. బుద్ధదేవుడు పొందిన పరీక్షవంటి పరీక్ష నేను పొందినట్లు తోఁచినది. ఏదో యొక నల్లనిభూతము నన్ను లొంగఁదీయవలె నని ప్రయత్నించినది. నేను దానికి లొంగలేదు. సైతాను క్రీస్తుమహాత్ముని కాశపెట్టినట్లు నాకుఁ గూడ నాశగొలిపెను—'నీవు మహానుభావుఁడవే యైనచో జాతీయ కళాశాలయంతయు విచ్ఛిన్నదశలో నున్నది, యొక్కసారి బాగు చేయరాదా' యని—కొండకొమ్మునకుఁ బోయి క్రిందికి దూఁకుమని సైతాను క్రీస్తుకు బోధించినట్లే. నేను ప్రేమచేత సర్వప్రపంచము నావరించితిని. నాకు శారీరకములైన మహాత్ములతో నేమిపని ? కృష్ణుఁడు, బుద్ధుఁడు, క్రీస్తు మువ్వురునుగలసి నాలోవచ్చి నివసించునట్లె నూహించితిని. ఇప్పుడు నాకు విరోధులు లేరు. నారాయణరావుగారినిగూడ నేను విచారములేకుండ, మనస్సులో నేదియు మార్పు లేకుండఁ గౌఁగిలించుకొనఁగలను. ఇట్టి యుత్తమానుభవమును నాలో నే నిముడ్చుకొనలేకపోయి నరేంద్రరావు, బలరామయ్య, సీతాపతులతోఁ జెప్పితిని. వారు మూఁడుదినములనుండి నేను పొందుచున్న హృదయవేదన యెఱుఁగుదురు. నే నెప్పటికప్పుడు వారితో నా యనుభవరహస్యమును జెప్పుచునే యుంటిని. నాకు దివ్యజ్ఞాన సభవారి గ్రంథములు చదివినప్పటినుండియు నేదో నా మనస్సులో నిట్టిప్రత్యక్షము నాకు జరుగునని మనసునకుఁ దోఁచుచునే యుండెను. కాలము పరిపక్వమైనది. మహావతార మొకఁడు కలుగునని బిసెంటు, లెడ్‌బీటరులు చెప్పుచునే యుండిరి. వారు పరమాత్మ జిడ్డు కృష్ణమూర్తిగారిలోని కవతరించు నని యనుకొనుచుండిరి'' అని శివరావు నవ్వి, మఱల ''నది నాలో నవతరించినది. నేను పొందిన హృదయశిక్ష కృష్ణమూర్తి పొందలేదు. కృష్ణమూర్తి మెత్తనిపఱుపులపై

నెదిగెను. బాల్యమునుండి బిసెంటమ్మ యతనికి సుఖములే సమ కూర్చెను. నేను బాల్యమునందేమో, బుద్ధియెఱిఁగిననాఁటనుండి కష్టములే యనుభవించితిని. నాకు బుద్ధి తెలిసినప్పుడే మా నాయన గారు చనిపోయిరి. అప్పటినుండి నేను పడ్డకష్టములకు మితిలేదు. నా యనుభవము చాల విశాలమైనది. నేను ఖైదులోఁగూడ నుండి వచ్చితిని కృష్ణమూర్తికీ యనుభవ మేది? నే నిప్పుడు పొందిన యనుభవము నా యవతారములోఁ బ్రథమదశ. నాకు 'సర్వజనులయందు వసించుజీవాత్మ నేనే యన్న స్మృతి మాత్రమే యిపుడు కల్గినది." శివరావు కనుబొమలు పైకెత్తి మొగమునందు గంభీరభావమును దెచ్చుకొని, 'ధర్మారావుగారూ! ఈ యవతారమును జాలగొప్పది బుద్ధుఁడును, క్రీస్తును ఖడ్గవాదులు కాదు. వారు హృదయరాజ్యాధిపతులు. నేను కృష్ణుని శక్తిగూడ సన్నిహితత్వముపొందినవాఁడనగుటచేత ఖడ్గవాదిని గూడను. నా యధికారము హృదయముమీఁదనే లేదు. శరీరముమీఁదఁగూడఁ గలదు' అని యాకాశమువంకఁ జూచెను. చంద్రుఁడ స్తమించు చుండెను. ఎఱ్ఱనై యర్ధాధికచంద్రబింబము వృక్షములచాటునఁ గ్రుంకఁబోవుసమయమున పక్షులు కూయ నారంభించెను. శోకాధి దేవత యరుణమూర్తియై పక్షికూజితము లను మార్గములచేత దుఃఖ పడుచున్నట్లుండెను శోకాధిదేవత యమంగళమైన తన మొగమును లోకమునకుఁ జూపించు నిచ్ఛలేక వృక్షశాఖ లన్న చేతులతోఁ దన మొగము కప్పుకొనిన ట్లుండెను. శివరా వనెను: 'అదిగో చూచితిరా! నే నవతరించినంతనే ప్రాఁతవడిన సంస్థలకు, జీర్ణములైన శక్తులకు నస్తమయ మారంభించినది' యని యొకవికృతహాసముచేసెను. ఆ హాసము నం దున్న తత గోచరించెను. శివరావు 'నేను వెళ్ళెదను. నాకుఁ గలిగిన యీ మహానుభవమును బలరామయ్య మొదలగు వారు గ్గురను విశ్వసించిరి. వారిని బిలిచి కనుగొనుఁ' డని తాను దూర మునకుఁబోయి బలరామయ్యను బంపించెను. ఒకరివెంటనొకరు ముప్వు రును వచ్చి తాము శివరావుగారి యవతారమును నమ్మితి మని చెప్పిరి. 'నాల్గునాళ్ళనుండి శివరావుగా రేమియావేశములోనుండిరి! ఏమి యావేశములోనుండిరి! వారిలోఁ బదునాలుఁగులోకములు గిర

సిక తిరిగిపోయెను. నా రెప్పటియనుభవము నప్పుడే మాకుఁ జెప్పు చుంటిని. మనకళాశాలకు, హిందూదేశమునకు, సకలజగత్తునకుఁ గల్యాణము సమకూరుదినములు సమీపించినవి' యని వారు చెప్పిరి. ధర్మారావున కేమియుఁ దోఁచినది కాదు. చమత్కారమున కని రనుకొనునా? అట్లు లేదు. దివ్యజ్ఞానసభపిచ్చి శివరావునకు మిక్కిలి కలదు. తద్విషయములన్నియు నతఁడు పవిత్రముగా నెంచును. వానితో నతఁడు పరిహాసములాడఁడు. శివరావునకుఁ బిచ్చియెక్కెననుకొనునా? తక్కినమాటలన్నియుఁ జక్కఁగా మాటాడుచుండెను. శివరావు మోసముచేయుచుండె ననుకొనునా? ధర్మారావునకుఁ దెలిసినంత వఱకు శివరావు చాలసాధువైనమనిసి ఎదుటివారిని మోసముచేయు వాఁడు కాఁడు. అంతఃకరణప్రవృత్తిప్రమాణముగ నడచుకొను వాఁడు. బుద్ధిపూర్వకముగ నిట్టి వంచననాటక మాడఁడు.

ధర్మారావు స్వగృహమునకుఁబోయి మఱలఁ బరుండెను. తెల్లవాఱుటకుఁ బ్రొద్దెంతయో లేదు. ప్రక్కను వచ్చి పండుకొన్న భర్తకదలికలచేత నరుంధతికి మెలఁకువ వచ్చెను. ఆమె 'యిప్పుడే వచ్చితిరా?' యని యడిగెను. ధర్మారావు 'అవు' ననెను. అరుంధతి 'ఏదో రాచకార్యముచేసివచ్చినట్లున్నదే. జాతీయకళాశాలలోని మీ యుద్యోగమునకుఁ బవళ్ళు రాత్రులు లోకశే కొలువై పోయినది. వసిష్ఠుల కరుంధతికాని, మీ కరుంధతి యెందులకు? ఇంటిలో నా కొక్కతెకు భయమువేయదా?' యనెను. సావిత్రమ్మగారు లేచి సందెకస వూడ్వ నారంభించెను అరుంధతి లేచి తానుకూడ పోఁబో యెను? ధర్మారా వామెను బట్టుకొని 'నీ యుద్దేశ్యము నే నెచ్చటికిఁ బోతినని' యని యడిగెను. ఆమె 'మీ రెచ్చటికిఁ బోయిన నా కేమి? నాకు నిద్రపట్టదా?' యనెను. ధర్మారావు 'భయమంటివిగదా' యనెను. అరుంధతి 'యసలు మీ రన్ననే భయ' మనెను. ధర్మారావు 'నేను బూచివాఁడనా?' యనెను. అరుంధతి 'మీ రందఱు నవతారపురు షులు. నాకు భయముకాదా?' యనెను. ధర్మారావు తెల్లపోయి చూచెను. అరుంధతి మొగములో ధర్మారా వనుకొన్నవిజ్ఞాన చ్ఛాయ గోచరించలేదు. ఆమె గిరికావృత్తాంతమును దడవుచుం డెను. ధర్మారావునకు శివరావువృత్తాంత మనిపించెను. ధర్మారావు

తెల్లబోవుట చూచి, యరుంధతి 'ఏకోకథ యున్నది. ఎందు కట్లు దిగాలుపడి చూచెద?' రనెను. ధర్మారావు 'నేనే యవతారము?' అరుంధతి 'కనఁబడుచునే యున్నదిగదా, ధర్మావతారము' అనెను. మగనిపేరు చెప్పినందుకు సిగ్గుపడి యామె భర్తృపరిష్వంగమున నొదిఁగెను. ధర్మారా వామెను ముహుర్ముహుశ్చుంబనము గావించి 'నే నింత కామప్రవృత్తిని, ధర్మావతారము నేమిటి' యనెను. అరుంధతి 'కామము ధర్మములో భాగమే' యనెను.

రామేశ్వరముగారు పాఠశాలల తనిఖీలకుఁ దిరుగుచుండెను. రంగాపురములో నొక యుపాధ్యాయుఁ డుండెను. అతఁడు బోర్డు పాఠశాలాధ్యక్షుఁడు. ఆయన యే యెండ కా గొడుగుపట్టు మనిసి. తాలూకాలోని యితరోపాధ్యాయులందఱును రామేశ్వరముగారి యధికారాతపమున మలమలమాఁడిపోవుచుండఁగా నతఁడుమాత్రము తదధికారజ్యోత్స్నలోఁ జకోరమువలె నానంద మనుభవించుచుండెను. అతనిపేరు జోస్యులు. ఆయన సుబ్బన్నపేటకుఁ జాఁదూరమున నున్న యూరిలోఁ బూర్వ ముండెడివాఁడు. అతఁడు పేటకుదగ్గరగా నుండవలయు నని రామేశ్వరముగా రతనిని రంగాపురము తెచ్చిరి. జోస్యులు 'రామేశ్వరము సాక్షాన్మాంధాతృచక్రవర్తి యవతరించె' ననును. ధర్మమంతయు రామేశ్వరముగారే. రామేశ్వరము దయాపయోధి. ఆశ్రితపక్షపాతి. రూపజిత మన్మథుఁడు. రామేశ్వరమునకుఁ దాలూకాలోనున్న ఉపాధ్యాయులందఱికన్న జోస్యులు పరమవివేకి. పిల్లలకుఁ జదువుచెప్పుటయనునది జోస్యులే యెఱుఁగును.

ప్రెసిడెంటుగారు రంగాపురము మకాము వేసిరి. పూర్వము రామేశ్వరముగారి నెప్పుడును జోస్యులు భోజనమునకుఁ బిలువలేదు. తనకు వేతనాభివృద్ధి నిచ్చి సర్వవిషయములయందును దనసలహా తీసికొనుచుఁ దన్ను దగ్గఱకు బిలిపించుకొన్న తాలూకాపతియందుఁ దన గౌరవము ప్రకటించుటకు రామేశ్వరమును భోజనమునకుఁ బిలిచెను. రామేశ్వరముగారు సరే యనిరి. జోస్యులు భార్యయుఁ, దాను నిద్దఱే. రాజ్యలక్ష్మమ్మగారియింటిలో నొకభాగమందు నివసించుచుండిరి. కుమారుఁడు చనిపోయినతరువాత రాజ్యలక్ష్మిగారు దుఃఖించిదుఃఖించి మంచముపట్టెను. ఏదో దీర్ఘవ్యాధి యామెకు సంక్రమించి, యామె

చిక్కి శల్యమై యూర్వశివలె స్వసౌందర్య ప్రవాహ సమాక్రాంత స్వర్గశోచిస్కయైన యీమె నేఁడు నిరంతబాధాపరిభూతతేజస్కయై బల్లివలె మంచము నంటుకొని యుండెను. ఆమెకుఁ గేశవరావుగా రొక్కఁడే కొడుకు. ఆ కొడు కెదిగియెదిగి మహావృక్షమువలె నాకాశమునంటి పెనుగాలికిఁ గూకటివేళ్ళతోఁ బెల్లగించుకొని పడిపోయెను. కేశవరావుగారికి సంతానము లేదు. అతనిభార్య పుట్టినింటికిఁ బోయెను. రాజ్యలక్ష్మిగారిభర్త ప్రొద్దున నింత వండును. తాను తిని భార్యకుఁ బెట్టును. భోజనమైనతరువాతఁ బోయి 'గ్రామ చావడి'లో గూర్చుండి చీట్లపేక యాడుచుండును. భార్యకు మందు లిప్పించియిప్పించి యతని ప్రాణము విసిగెను. అంత కుమారుఁడు పోఁగా, భార్య యిట్లుండఁగా నితఁ డిట్లు చీట్లపేకయాడుచు గాలము గడుపుట లోకమునకు విడ్డూరముగా నున్నది. ఆ వృద్ధునిమనస్సులో నగ్నిపర్వతము లున్నవి. లోపలఁ దిరుగుళ్ళు తిరుగుచు మన్ను లోహములు కలసి మహాగ్నిచేతఁ గరగి మహావేగముగ గర్భగోళమున ఘోరాకృతిఁ దాల్చియున్న యగ్నిపర్వతము పటాలు మని పగిలి, తన్నిస్సృతి కాకముందు సామాన్యపర్వతమువలెనే కనిపించును. ఆ వృద్ధుఁడు నట్లే. అతనిముందు కేశరావు పేరు చెప్పము. 'ఆ దౌర్భాగ్యునిపేరు, ఆ యల్పాయుష్కునిపేరు నాముందు తేకుము, తేకుము. నాచెవిని వేయకుము, వేయకు' మని యా ముసలవాఁడు దూరదూరముగాఁ బోవును. పోయినతరువాత నెవ్వరును లేని యే చెట్టుక్రిందనో కూర్చుండి, యే పొలముగట్టుననో కూలఁబడి త్రవ్వుకొని త్రవ్వుకొని దుఃఖించును. ఎన్నివందలసారులో యాత్మహత్య చేసికొనవలె ననుకొన్నాఁడు. తాను చనిపోయినచో రాజ్యలక్ష్మమ్మకుఁ జేయు దిక్కు లేదు. ఆయూర్వశి తన్నొకనాఁడు పురూరవశ్చక్రవర్తిని జేసి తనకు యయాతిమహారాజును సమర్పించినది. ఆ యయాతి తన దారిని దాను పోయెను. ఈ యూర్వశి మఱల నారాయణాంక భాగమున లీన మగుదాఁక నామెను బరిత్యజించుట కతని కిష్టము లేదు. శిథిలమైన రాజధానివలె నున్న రాజ్యలక్ష్మమ్మ కెదురుగా సర్వకాలము కూర్చుండ లేకపోయి 'గ్రామచావడి'లో నుండెను. దొడ్డిలో వేఱేపాక యున్నది. రాజ్యలక్ష్మమ్మగా రొక కుక్కిమంచములోఁ

బవలెల్ల నా పాకలోఁ బండుకొనియుండును. గృహమంతయు జోస్యులు మగఁడుపెండ్లమిద్దఱే వాడుకొనుచుండిరి. అదివఱకు బడి యుదయ మేడు గంటలనుండి పదిగంటలవఱకును, సాయంకాలము రెండునుండి యైదున్నరవఱకు నుండెడిది. రామేశ్వరముగారు ప్రాతఃకాలము మార్చి పదినుండి యొంటిగంటవఱకుఁ జేసిరి. అందుచేత జోస్యులు భోజనముచేసి బడికిఁ బోయినతరువాత సాయంకాల మగువఱకును జోస్యులభార్య మంగమ్మ యింట నొక్కతియే యుండును. అప్పుడప్పుడు పోయి రాజ్యలక్ష్మమ్మగారితో మాట్లాడినను, దక్కిన కాలమంతయు బిక్కుబిక్కు మనుచు నొంటరిగ నింటనే యుండును. జోస్యులభార్య పురోహితులయింటిపిల్ల. ఆమెకు నాగరకలక్షణములు తెలియవు. ఎక్కువ లజ్జపడుట, పురుషులతో మాటాడకుండుట, మాటిమాటికిఁ బయ్యెదపట్టుకొనుట, విలాసముగ లజ్జ నభినయించుట యీ మార్గములు తెలియని పల్లెటూరిది. బుద్ధికన్న, వివేకముకన్న ధనమునందే యెక్కువ యభిమానము కలది. మనిసిమెట్టనిది. మొగమునందు సౌందర్యము లేకపోయినను పెద్దకన్నులు చూచిన వారి కందకత్తె యనిపించును. జోస్యులు నల్లనివాఁడు మశూచకము పదియేండ్లక్రింద విచ్చఁబోసి మొగమంతయు బాడెలు బాడెలయ్యెను. మనిసి వికారముగ నుండును. ఊహాలయం దెంతవక్రత యున్నదో మనిషియాకృతియందు నంత వక్రత. వారికి వారికిని గలసిన సంబంధము. జోస్యులతండ్రియుఁ బురోహితుఁడే. జోస్యులు థర్డుఫారముదాఁక చదివి, ట్రెయినింగై యుపాధ్యాయుఁడుగా వచ్చెను. మంగమ్మ యొంటిమీఁద నగలు లేవు. అందుచేత నామెకు భర్తను జూచినచో నిరాదరణ. జోస్యు లానాఁడు రామేశ్వరముగారు వచ్చునని పచ్చిమిరపకాయలు, సల్లమువేయించి గారెలు వండించెను. సగ్గుబియ్యపుఁ బరమాన్నము చేయించెను. అందులో గుంకుమపూవు జీడిపప్పువేయించెను. కొబ్బరికోరి పోయించెను. బంగాళాదుంపలు మసాళాపెట్టి కూర. రంగాపురములోఁ గమ్మనితోడుపెట్టి పెరుఁగు దొరకును.

జోస్యులు ప్రధానోపాధ్యాయుఁడు గనుక గంట యాలస్యముగా వత్తునని తోడియొజ్జతోఁ జెప్పి, రామేశ్వరముగారికి మర్యాద

చేయుట కాలస్యముచేసెను. రామేశ్వరముగారు బ్రాహ్మణగృహ భోజన మదివఱకుఁ జేయలేదు. అందులో జోస్యులు దగ్గఱఁ గూర్చుండి పదార్థములన్నియు జాగ్రత్తగాఁ జేయించెను. ముందర రామేశ్వరముగారికే వడ్డించిరి. రామేశ్వరముగారికి భోజన మమృతాయమానముగా నున్నది. అతఁడు విస్తరిలో పదార్థములవంకఁ జూచును. మంగమ్మవంకఁ జూచును. మంగమ్మవంకఁ జూచుచుండెనని జోస్యులకుఁ దెలియును. కాని యతఁ డధికారి. ఏ మనఁగలఁడు? ఐనను నూరకే చూడరాదా? భోజనము చేసినంతసేపును రామేశ్వరముగారు పదార్థములు మెచ్చుకొనుచునే యుండెను. మంగమ్మ యెదుట జోస్యులతో 'మీభార్య వంట చాలబాగుగాఁ జేయునండీ' యనెను. జోస్యులు పదార్థములరుచికిఁ దాను హేతువని చెప్పుకొనలేదు. మంగమ్మ సంతోషపడెను. రామేశ్వరమునకు విస్తరిలోఁదినుట యలవాటులేక భోజనమగువఱకు విస్తరియంతయుఁ బాడైపోయెను. గారె లేమి, పరమాన్న మేమి, కూర లేమి, పెరుఁ గేమి యొకదానికన్న నొకఁడు రుచ్యముగానుండెను. మంగమ్మ తలుపుచాటున నిలుచుండి యేమి కావలయునో యని యెదురుచూచుచుండెను రామేశ్వర మామెవంకఁ జూచియే తనకుఁ గావలసినది చెప్పెను.

భోజనమైపోయినతరువాత ముందుగదిలోఁ బ్రక్క వేయించెను. దానిమీఁద రామేశ్వరముగారిని విశ్రమించుఁ డని చెప్పి, జోస్యులాదరాబాదరా రెండుమెతుకులు గతికి బడికిఁబోయెను. మంగమ్మ భోజనము చేసెను. ఎప్పుడైనను దమయింట గారెలుచేసికొనినను క్షీరాన్నముచేసికొనినను నిట్లుండదు. ఆమెయు సుఖముగా భుజించెను. భుజించి, గొల్లదానిచేత రామేశ్వరముగారు తిన్న విస్తరి తీయించి, తాను వెనుకగదిలో మంచముమీఁదఁ బరుండెను. రామేశ్వరముగారు పరున్న గదికిని, దాను పరున్నగదికిని గోడ యడ్డము. తలుపు వేసియున్నది.

పగలు రెండుజాము లైనది. ప్రక్కగదిలో రామేశ్వరము నిద్రమేల్కొన్నట్లు ధ్వనిచేసి, 'మంచితీర్థము కొంచె మిప్పింతురా' యనెను. మంగమ్మ లోనికిఁ బోయి కంచుచెంబుతో నీరు తెచ్చి తలుపుతీసి వాకిటిలో చెంబుంచి తా నొడ్డిగిలి నిలుచుండెను. రామే

శ్వరముగారు చెంబుతీసికొనుచు నామెవంకఁ జూచెను. ఆమె తలుపు చాటునకుఁ బోయెను. రామేశ్వర మా నీటితోఁ జేతులు ముఖమును గడిగికొని 'యింకఁ గొంచెమునీరు తెచ్చిపెట్టు' మనెను. ఆమె తీసికొనివచ్చెను. రామేశ్వరముగారు చెంబుపట్టెను. ఆమె చెంబులో నీరు వడ్డించెను. ఆయన మంగమ్మచేయి పట్టుకొనెను. మంగమ్మ బెదరిపోయెను. చెంబచ్చట వదలిపెట్టి లోనికిఁ బరువెత్తెను. రామేశ్వరము పదిరూపాయలనోటుతీసి, యామె నిలుచున్నచోటికి విసరెను. ఆమె యా నోటు పరిశీలించి చూచి కొంచెముసేపాఁగి యానోటు మఱల రామేశ్వర మున్నగదిలో గుమ్మమువద్దనుంచి తాను తలుపు వేసికొనెను. రామేశ్వరమునకు భయమయ్యెను. జోస్యులతో నామె చెప్పునేమో? అయినను జోస్యులు తన్నేమి చేయఁగలఁడు? అయినను రామేశ్వరముహృదయములో దడ తగ్గలేదు. ఆయన బడికిఁబోయి పరీక్షచేసి యంతయు బాగున్నదని వ్రాసెను.. పిల్లవాఁడొకఁడు వ్యాసము వ్రాయుచు 'స్నానము' అని వ్రాసెను. రామేశ్వరముగారు దానిని గొట్టివేసి 'స్త్రాన' మని దిద్దిరి. ఆయన వెడలిపోయినతరువాత నలుగురుపాధ్యాయులు నవ్వుకొనిరి. వెళ్ళిపోవుచు జోస్యులుగారి యాతిథ్యమును బునఃపునః ప్రశంసచేసిరి. జోస్యులును దనకు గొప్ప యాశ్రయము దొరికినదని సంతోషించెను.

ధర్మారావు ప్రతిదినము కళాశాలకుఁ బోవుచు. శివరావు తన యవతార కథాప్రస్తావనలతో నతనిని ముంచియెత్తును. రోజురోజునకా యవతారప్రసంగము వృద్ధినొందుచున్నట్లేకాని తఱుగుచున్నట్లు లేదు. ఈ యవతారకథ యీ యైదుగురి మధ్యనేకాని యాఱవ వానికిఁ దెలియదు. ఒకనాఁడు ప్రొద్దున ధర్మారావు కళాశాలకుఁ బోయెను. శివరావు 'ధర్మారావుగారూ! ఇంకొక నూత్నవిషయము జరిగినది. మీ కది చెప్పవలయును. మీరు కళాశాల వదలిపెట్టిన తరువాత నింటికిఁ బోవలదు. మాయింటికిఁ బోదము' అని చెప్పెను. ధర్మారా వంగీకరించెను. పదునొకండుగంటలకు భోజనమైనది. మఱల రెండుగంటలవఱకుఁ గళాశాల లేదు. శివరావు రహస్యముగా ధర్మారావుతోఁ జెప్ప నారంభించెను. "నేఁటి తెల్లవాఱుజామున యథాప్రకారముగా లేచి, మే మందరమును భజనచేయుచుంటిమి. పాటలు

పాడుచు పాడుచునే నరేంద్రుఁడు మూర్ఛపోయెను. అతనిని మేము దూరముగాఁ దీసికొనిపోయి మొగముమీఁద నీళ్లుచల్లి మూర్ఛ తేర్చితిని. అతఁడు కన్నులు తెఱచి దివ్యజ్యోతిస్సులు వెలుఁగు నేత్రపద్మములతో నావంకఁ జూచెను. నే నాకన్నులలో రాధికను గుర్తుపట్టితిని. 'నీవు రాధవా' యంటిని. నరేంద్రుఁడు చేతులు చాఁచి 'హా! వాసుదేవా!' యనెను. ఇద్దఱమును మఱునిముసమున నొకరి గాఢాలింగనమునం దున్నాము'' శివరావు గన్నులు పైకెత్తి తల యాడించుచు 'నా కొఱకు రాధ మనుష్య జన్మ మెత్తినది. నరేంద్రుని జూచినప్పటినుండియు నా కనుమానమే. అతని మొగములోఁ జూడుఁడు. స్వర్ణసౌందర్య మున్నది' అనెను. అంతలోఁ గళాశాల యావులు నాలుఁగు పర్ణశాల ముందు నిలఁబడి యున్నవి. నరేంద్రుఁడు శివరావునింటికి వచ్చుచు నా యావులమధ్య నిలుచుండెను. శివరా 'నటు జూడుఁడు, అటుచూడుఁ' డనెను. ధర్మారావు చూచెను. శివరావు 'చూచితిరా, చూచితిరా గోలోకమువదలి నన్నుఁ బొందవచ్చిన రాధికను గోవులు సేవించుచున్నవి. నాది సంపూర్ణావతార మని నేను చెప్పలేదా? ప్రతిచిన్నవిషయమునందు నవతారసాదృశ్యము నాకుఁ గనిపించుచునేయున్న' దనెను. ధర్మారావు శివరావుపురాణకథావిజ్ఞానమునకు సంతోషించెను. పదిమందికిఁ బదిరకాల వెఱ్ఱులు; తనకు దానితో జోక్యములేదని శివరావు చెప్పిన ప్రతిదానికి నతఁ డూకొట్టును.

ఈ నాటకములో బలరామయ్య యభిమన్యుఁడు; సీతాపతి ప్రద్యుమ్నుఁడు; ధర్మారావు బలరాముఁడు. కథ పెరిగిపోవుచున్నది.

మఱునాఁడు కిరీటిపశుపతులు ధర్మారావును జూచిపోవుటకు వచ్చిరి. పశుపతి ధర్మారావుతో 'సత్యహరిశ్చంద్రుఁడ వనఁగా నీవు. భార్యతోఁ గలసి మూఁడునెలలు తిరుగకముందు మా యింటికి వచ్చితివి. అనసూయకు నీమీఁద వచ్చినంతకోపము మఱియెవ్వరి మీఁదను రాలేదు. మాయమ్మాయి పుట్టుకలకు వత్తునంటివి. ఎన్ని యుత్తరములు వ్రాసినను రావు. ఆ నాఁడు కనుపించుటయేకనిపించుట' యని సాదించెను. ధర్మారావు 'మాఅమ్మాయి కిప్పు డెన్ని యేండ్లు?' అనెను. కిరీటి 'మొన్నియేం డ్లేమిటి! మగఁడు కావలయు

నను చున్నది' అనెను. పశుపతి నవ్వి 'నాలుగేండ్లు. కిరీటికి మాను పిల్ల నిచ్చునా! కిరీటి కిచ్చి పెండ్లిచేసెద' ననెను. కిరీటి 'అరుంధతి పేరు పెట్టి నా కేల యిత్తువు? ఇద్దఱును గలసియే యుందురు. ధర్మారావున కి'మ్మనెను. ధర్మారావు 'మా ఆవిడ మొన్న కృష్ణావతారము చూచుటకుఁ బోయినప్పుడే యనుమానపడినది. నా కెందు కీ గోల?' యనెను. కిరీటి 'కృష్ణావతార మేమిటి?' యనెను. ధర్మారావు కథ యంతయుఁ జెప్పెను. సాయంకాలమున ముగ్గురును గలసి కళాశాలకుఁ బోయిరి. ధర్మారావునకుఁ గిరీటి పశుపతులకు గాటపుఁజెలిమి యగుట వారితో శివరావునకుఁ గూడ చెలిమి కలిగెను. కిరీటి శివరావు నదివఱకే యెఱుఁగును. ఇద్దఱును నెల్లూరివాసులే. కిరీటి సహజముగ ముగ్ధుఁడు; మెత్తని మనసుకలవాఁడు. ధర్మారావువలె దురుసుగా మాటాడఁడు. కిరీటి మొగము చూచినంతనే యతఁడు మంచివాఁ డనిపించును. అతనియాకృతికిఁ ద్రత్వేమకథ మెఱుఁగు తెచ్చును. శివరావు కిరీటి యన్నచోఁ బ్రాణములు వదలెను.

వా రిద్దఱును బేఁటలో మూఁడురోజు లుండిరి. శివరావు విడివిడిగాఁ బిలచి యిద్దరికిఁ దనయవతారకథ చెప్పెను. వారిరువురు నూరకుండిరి. తరువాత ధర్మారావును, వారును కూడఁబలుకుకొనిరి. 'ఈయన కీ పిచ్చి పట్టినది. వదలుటయెట్లు?' మూఁడవనాఁడు సాయంకాలము పశుపతి శివరావులిద్దఱును దివ్యజ్ఞానసభావిషయములు ప్రస్తావించుకొనుచుండిరి. పశుపతి కే మతమునందును నిశ్చయబుద్ధి లేదు. అతఁడు నూత్నవిషయములను దెలిసికొనుటకే యాతురపడుచుండును.

కిరీటి ధర్మారావులు కలసి కళాశాలవెనుకనున్న మెట్టచేలలోకిని వాహ్యాళిపోయిరి. చంద్రారెడ్డి యీయేఁడు పసపుతోఁట, మిరపతోఁటయు వేయలేదు. అదివఱకుఁ బ్రతిసంవత్సరము నారెండు పంటలు నతఁడు పండించెడివాఁడు. 'ఏమండీ; రెడ్డిగారూ! ఈయేఁడు పసపుతోఁట వేయ లేదేమి? మిరపనారు పోయ లేదేమి?' యని యెవ్వరైన నడుగుదురు. 'అబ్బా? వానినిండ పాములండీ! వానితోఁ బడలేక యవి తీసివేసితిని' అని జవాబుచెప్పును. మెట్టయంతయుఁ గందిచేలే యెక్కువవేసెను. పసపుతోఁటలైనచోఁ

గన్నుల కానందముగానుండి మాటిమాటికిని నీరుపెట్టుటచేత నేల తడిసి కాలిక్రింద మెత్తఁగా నుండెడిది. ఇప్పుడు చేలుచూచుటకుఁ బచ్చఁగాలేవు. కాలిక్రింద నేల గట్టిగా నున్నది. స్నేహితు లిర్వురును బోయి యొకచోటఁ గూర్చుండిరి

కిరీటి—జైలులోనుండి సూర్యపతి మఱి యింకెన్నాళ్ళకు వచ్చును?

ధర్మా—రాఘవరావు నతఁడు నొకసారియే వెళ్ళిరి. ఇక నైదాఱునెలలో రావచ్చును. కడలూరి జైలులో నున్నారఁట. సూర్యపతి యుత్తరము వ్రాసెను. మొదట నెలనాళ్ళు రాజమహేంద్రవరములో నున్నారఁట. ఆ నెలనాళ్లు తిండిసయించక చాల నిబ్బంది పడిరఁట. అన్నములో మేకులు రాళ్లు, వీనితోఁ దినలేక పోయిరట! ఇతర దేశములలోఁ గారాగృహములు బహుసుఖముగ నుండునఁట. మనదేశములో నిట్లున్నవి. అగర్భశ్రీమంతుఁడు సూర్యపతి, అబ్బనాకారుఁడు రాఘవరావు - ఇద్దఱకును వచ్చిన దీ దురవస్థ. తరువాత బళ్లారి తీసికొనిపోయిరి. అచ్చట కారాగృహాధికారి చాలమంచివాఁడఁట. చాల బాగుగనే యున్నదని తెలిసినది. సూర్యపతి మొదటి మూఁడు నెలలైన తరువాత బి క్లాసులోఁ జేర్చఁబడెను. ఇప్పుడు బాగుగనే యున్నదఁట.

కిరీ—మొన్న బెజవాడలో సూర్యపతికూఁతుండ్రను జూచి వచ్చితిని. ధర్మా—పిల్లలు సుఖముగా నున్నారా?

కిరీటి—'సుఖముగా నున్న' రనెను. ధర్మారావు—'నీ ప్రేమ కథ యెంతదూరమువచ్చినది!" ప్రేమకథ యనినంతనే కిరీటి మొగము వ్రేలవేసెను. 'అన్నా' మామామ యిదివఱకే నాకు కూఁతు నీయననెను. నేను నాలుఁగేండ్లనుండి యుద్యమములోఁ జదువుమానినతరువాతఁ 'దినుటకుఁ దిండిలేదు. వానికిఁ బిల్ల నెవ రిత్తు' రని యన్నాఁడట. పిల్లమాట యెట్లున్నను స్వరాజ్యమువచ్చునని చదువు మానితిని. వచ్చు ననుకొన్న స్వరాజ్యము రాలేదు. రాదనుకొన్న శశి మఱీ రానట్లున్నది. శశిరేఖ నిద్రాహారములు మానినదఁట. ధర్మా—మూఁడేండ్లక్రింద నేనామెను మీమామ బాపట్లలో నుండగాఁ జూచితిని. నేనామె నదివఱ కెఱుఁగకపోయినను జూచి గుర్తుపట్టి

తిని. నాయనా! నీకై యామె ధృతవ్రతగాఁ గనుపడినది.

కిరీటి ధర్మారావుపై నొఱగెను. ధర్మారావతనిని రెండుచేతులతోఁ గౌఁగిలించి యాదరించెను. ఆ కౌఁగిలింతతోఁ గిరీటి విరహబాధసగ ముపశమిల్లిన ట్లుండెను.

ధర్మా—ఈ త్రిప్ప లేమిటి? నీ మేనమామకూఁతు రాయెను; ఆమెను లేవదీసికొని రారాదా? నీమీఁద నేమి వ్యవహారము జరుపఁగలఁడు? అంతగా నైనచో నామె నీతరఫుననే యున్నది! కిరీ—"ఇప్పుడు మామామ గుంటూరిలో నున్నాఁడు. వారు అరండేలుపేటలో శివాలయమువద్దఁ గాఁపురమున్నారు. నేను శశిని జూచుట కాఱునెలలక్రిందట పోయితిని. మేము వారింటికిఁ బోము. వీధివెంటఁ బోయినచో నామె కన్పించునేమో యని చూచితిని. మఱి యితరులు కన్పించరా దామెమాత్రమే కన్పించవలయు. అందుచేతఁ బొద్దుక్రుంకి పోవుచుంటిని. మూఁడవనాఁడుసాయంకాలము శశి కనఁబడెను. నన్ను దూరమునఁ జూచి గుర్తుపట్టెను. మేమిరువురము నొకరినొకరు చూచుకొనుచు నట్లే నిలుచఁబడియుంటిమి. ఇంతలోఁ దల్లి లోపలనుండి యామెను బిలిచెను. ఆమె లోనికిఁబోయెను. నేను మఱునాఁడు ప్రక్క శివాలయములోఁగూర్చుండి యామె కన్పించునేమో యని యెదురుచూచుచుంటిని. ఇంతలో నచటి కొక ముసలియవ్వ వచ్చెను. ఆమె పూజారి. ఆమె నన్నుఁజూచి 'నాయనా! ఇచ్చటఁ గూర్చుంటివేమి' యనెను. ఆమెను జూచినంతనే నాకుఁ బరమసాధువువలెఁ దోఁచెను పిచ్చివానివలె నాకథయంతయు నామెకుఁ జెప్పితిని. ఆమె చాల జాలిపడినది. ఆమె 'నేను వారి యింటికి వచ్చుచుఁ బోవుచుందును. నీ వేమైనఁ గబురుచెప్పినచోఁ బోయి చెప్పెదను' అనెను. నే నొక యుత్తరము వ్రాసి యామెచేతి కిచ్చితిని. శశి మఱల నొకయుత్తరము వ్రాసి నాకుఁ బంపెను. ఇదిగో యుత్తరము' అని కిరీటి లోపలిచొక్కాజేబులో దాఁచియున్న యుత్తరమును ధర్మారావుచేతి కిచ్చెను. అప్పటికే ప్రొద్దు గ్రుంకినది. అక్షరములు కన్పించలేదు. కిరీటిజేబులో నిప్పుపెట్టె తీసి యొక్కొక్కపుల్లయే వెలిగించుటయు, ధర్మారావు వెలుఁగున్నంతలో నాలుఁగైదుమాటలు చదివి యాఁగుటయుఁగా నుత్తరము పూర్తియగు

వఱకు నిప్పుపెట్టెలో మిగిలిన పుల్లలును బూర్తియయ్యెను. ఉత్తర మిట్లుండెను: "బావా! నీయుత్తరము వచ్చినది. నేను కారాగృహములో నున్నాను. ఇచ్చటనుండి యేమివ్రాసిన నేమి లాభము ? మానాయన నా కెవరినో సంబంధము కుదిర్చెను. అతఁడు బి. ఏ. బి. ఎల్. ప్యాసాయెనఁట. చాల ధనవంతుఁడఁట. నన్నుఁ బెండ్లి చేసి కొమ్మని రాచి అంపమునఁ బెట్టుచున్నారు. ఈ బాధపడలేక నేను నల్లమందు తిని, నూనెఁ ద్రావి చచ్చిపోవుద మనుకొన్నాను. నాయీ ప్రయత్నము మానాయన గ్రహించి నన్నప్పటినుండి కాపలాకాయుచున్నారు. నేను విడిగాఁ గూర్చుండి నాఘోష నే నాలోచించుకొనుటకును వీలులేదు. నా హృదయములో నున్న నిన్ను నన్నుఁ జంపియు లాగికొనలేరుకదా!—నీ దుఃఖదాసి—శశి."

ఈ యుత్తరముచదివి ధర్మారావు కన్నులవెంట నీరువచ్చెను. కిరీటి వెక్కివెక్కి యేడ్వనారంభించెను. ధర్మారావు తన యుత్తరీయపుఁగొంగుతోఁ గిరీటికన్నులు తుడిచి యోదార్చి, 'తరువాత నేమి జరిగె' నని యడిగెను.

కిరీ—పూజారి ముసలమ్మ 'నాయనా! నీభార్య ప్రతిశుక్రవారము నమ్మవారిపూజ చేయును' అన్నది. నేను 'అవ్వా! నీ భార్య యనుచుంటివి. నీవు చేసినచో నగు' నంటిని. 'నే నేమి చేయఁగల' నన్నది యామె. నేను 'ఱేపు సాయంకాలమునకు మీ యింటికిఁ దీసికొనిరమ్ము. నే నామెతో మీయింటిలో మాటాడి యామె యొప్పుకొనెనేని రైలుకుఁ దీసికొనిపోయెదను. పెండ్లియాడినతరువాత మా మామకు జాబు వ్రాసెదను. ఏమిచేయఁగలడో చూతును' అంటిని. అవ్వ 'బాబూ! నాకుత్తుకమీఁదికి రాదా?' యనెను. నేను 'నీయిష్టము. ఈమేలుచేసినచో చేసిపెట్టుము. గౌరీదేవివలె నున్నావు. నాశశిప్రతి శుక్రవారము గౌరీపూజచేయునంటివి. నీ వీ సాహాయ్యము చేసినచో గౌరియేనీవై వచ్చిపూజాఫలితమిచ్చిన దనుకొందు'నంటిని. అవ్వకొంత విచారించి 'సరేలే తండ్రీ! ముసలిదానను నన్ను వా రేమియైనను జేసి మాత్రమేమిచేయుదురు? మీయిద్దఱకుఁ బెండ్లిచేసిన ఫలమైనదక్కును. సరే, ఱేపుసాయంకాలమున నీ విచ్చటికి రావలసిన'దనిచెప్పెను. నేను మఱునాఁడు పోయితిని.పోవువరకు అవ్వనన్నుఁజూచి దీనమైన మొగము

తో 'నాయనా? నీ విచ్చటికి వచ్చుటయు, నేను నీతోమాట్లాడుటయు నిదియంతయు మీయత్తగారు చూచుచునే యున్నదఁట. ఉత్తరము నీకుఁ దెచ్చియిచ్చితి నన్న విషయము తెలియలేదు. బ్రతికిపోయితిని. నేఁడు ప్రొద్దున వారియింటికిఁ బోయినంతనే వారునలువురు నన్ను దూయబట్టిరి. మీ బావమఱది నన్నుఁ గొట్టనే వచ్చెను. చావుతప్పి కన్నులొట్టవోయి బయటఁ బడితిని. ఏమి చేయుమందు' వనెను. నే నేమి చేయగలను? ప్రాణములన్నియు నవ్వ కొప్పగించి "ఇదిగో ప్రాణము లిచ్చుటనే పెట్టిపోయినాఁ" డని శశికిఁ జూపించు చుండు మన్నట్లు కట్టెవలె నేను బయటికి వచ్చితిని. మఱల నింటికిఁ బోయి తిని. నా యీస్థితి మాయమ్మ బాగుగా గ్రహించినది. ఆమె గుంటూరుపోయి కటాపెటిగా మామను 'బిల్లనిత్తువా, యీయవా' యని యడిగివత్తునని బయలు దేఱెను. ఆమె వెళ్ళఁగా వారెవరును గౌరవించలేదఁట. ఆమె యేమైనను సరేనని నాల్గురోజు లుండి, మా మామను గదలించి, వెంటఁబడి తఱిమి సాధించె నఁట: 'చిన్నప్పుడు కిరీటికి శశిరేఖ నిత్తు నంటివి. అభము శుభము నెఱుఁగని యీపిల్లలిద్దఱు నిజమే యనుకొనిరి. పిల్ల పెద్దమనిషియై యైదేండ్లయినది. నాబిడ్డ యీ పెండ్లి కాకపోయినచో బ్రదుకునట్లు లేదు. నీ వన్నవై నాకుఁ గడుపుదుఃఖము తెచ్చిపెట్టవలయునా?' యన్నదఁట. ధర్మారావు 'కంసునివలెనా' యనెను. కిరీటి మందహాసముచేసి, మఱల నారంభించెను: "మామామ నాల్గురోజులైనతరువాత మా యమ్మతో 'నీ కొడుకు గాంధిగారియుద్యమములోఁ జేరి చదువు గూడ మానివేసెనామెను. నీకొడుకును జేసికొని మాఅమ్మాయి ఏమిసుఖపడును? బి. ఏ. యయినను ప్యాసైనాఁడు గనుకనా!' అన్నాడఁట. మాయమ్మ 'వానిని మఱల బి. ఏ. చదివింతును. వాఁడింకొక్క యేఁడే చదువవలయును. వాఁడు బి. ఏ. పరీక్ష ప్యాసైనచో నీవు కూఁతురు నిత్తువుకదా' యని, సరేననిపించి వచ్చినది. ఇది రెండునెలలక్రింద వార్త. ఉద్యమములో నే నుండి యెక్కువ చేయునదియు లేదు. నే నుద్యమములోఁ జేరినందుకు మావాండ్ర కందఱకుఁ గోపముగా నున్నది. నేను శశిని బరిత్యజించలేను. మఱలఁ జదువుద మనుకొంటిని. చదువు మందువా?"

ధర్మా—నాకుఁజూచినకొలది దేశమందఱు నుద్యమములోఁ జేరినచో స్వరాజ్యము తేపేవచ్చును. కాని యెవరికివారు స్వార్థపరాయణులై యున్నారు. అట్టిసమయములో మఱియు నిబ్బందులలోనున్న వారు తమజీవితమార్గములను జెడఁగొట్టుకొని సంకటపడినందువలన నాకు లాభము కల్పించలేను. రాఘవరావువంటి మహోద్రిక్తహృదయులు నీవు నేను చెప్పినచో నాఁగరు. మొన్న గాంధిగా రన్నట్లు 'వారు నిత్యము బాధపడుటకే జన్మించిరి.' బాధపడుటలోని తత్వము వారిముక్కలలోని యూపిరివంటిది. నీవు ముందునాఁటికిఁ జదివినచో వచ్చి సుబ్బన్నపేటలో జదువుము. కిరీ—ఇక్కడనే చదివెదను. అన్నా! నిన్ను వదలిపెట్టి నే నుండలేను. నీవద్దనే యుండెదను. ఇక్కడనే చదివెదను.

అప్పటికిఁ బొద్దుపోయినది. ఇద్దఱును గలసి కళాశాలలోనికి వచ్చిరి. అందఱు శివరావునింట భోజనముచేసిరి. కిరీటికిఁ బశుపతికిఁ గళాశాలవిద్యార్థులతో నీ మూఁడురోజులలోఁ బరిచయముకలిగెను. సీతాపతి యందఱిలోఁ గుఱ్ఱవాఁడు. అతనికిఁ గిరీటి యన్నచో మిక్కిలిప్రేమ కలిగెను. ఈ మూఁడునాళ్ళలోనే కిరీటిచేతులు పుచ్చుకొని వేళ్లాడును. కిరీటిబుజముమీఁదఁ జేతులువైచి నడచును. కిరీటికిని సీతాపతి యన్న ప్రేమకలిగెను. మఱునాఁడు కిరీటిపశుపతులు సుబ్బన్నపేటనుండి వెడలిరి.

మఱునాఁడు శివరావు ధర్మారావును గలసికొని 'చూచితిరా! కిరీటియే యర్జునుఁడు, పశుపతియే శివుఁడు. కైలాసమునం దున్న నా మిత్రుఁడు మఱల నాకొఱకై యవతరించెను. పశుపతియు నేనును నిన్న సాయంకాలము చాలసేపు ప్రసంగించితిమి. పశుపతి నేనుచెప్పినదంతయు నమ్మెను. నీవే శివుఁడవని చెప్పితిని. అతఁ డొప్పుకొనెను. నాకుఁ గ్రమక్రియముగాఁ జూచినచో నీ సంగతి బిసెంటమ్మకును, లెడ్బీటరుకును వ్రాయవలయును. వారిచేత నొప్పించవలయును. నేను వారి నెవ్వరి నెఱుఁగను. ఎవరైన నెఱిఁగియున్నవారిచేత వ్రాయించవలయును. ఈ యూరిలో నున్న తహసీల్దారు రంగయ్యగారు దివ్యజ్ఞానసమాజ సభ్యుఁడు. ఆయనతో జేపు కలసికొని మాటలాడుదము' అనెను.

రంగయ్యగా రేఁబదినాలుఁగేడుల వయసుకలవాఁడు. ఇంకొక సంవత్సరములో నుద్యోగము మానివేసి పింఛను పుచ్చుకొనును. చాల సాధువైనమనిసి. దివ్యజ్ఞానసభకుఁ జెందినవాఁడైనను సనాతన మతమునందు నిరాదరణకాని, కర్మములు మానివేయుటగాని చేయ లేదు. అన్నిమతములకు నదొకరీతిగా ముడిపెట్టుట, అన్నిమతము లందును యాథార్థ్యమున్నదనుట, ఎచ్చటమంచియున్నదో యచ్చట గ్రహించవలయు ననుట, దేనియందును నిశ్చయజ్ఞానము లేక 'ఇతో భ్రష్టస్తతో భ్రష్ట'యగుట బ్రతుకుతెరువునకు ముఖ్యధర్మము. ఈకాల మున నది యవశ్యాచరణీయము. సామాన్యముగ నున్నతోద్యోగులు, ఉద్యోగరీత్యా యభివృద్ధికి రానిచ్చగించినవారు చెప్పెడి సిద్ధాంతము లివి. రంగయ్యగారీ సిద్ధాంతవాది. శివరావు ధర్మారావులు కలసిపోయి, శివరావు రంగయ్యగారితోఁ దనయాధ్యాత్మికానుభవము చెప్పి తానే ఆల్సియాను అనియు, జిడ్డు కృష్ణమూర్తిగారు కాదనియు, నీ విష యము చెన్నపురికి వ్రాయవలయు ననియుఁ గోరెను. రంగయ్యగారు 'నిజమే కావచ్చు' నని చెన్నపురికి వ్రాసిరి. మూఁడు రోజులలోఁ జెన్నపురినుండి ప్రత్యుత్తరము వచ్చెను. లెడ్బీటరుదొర ఆస్ట్రేలియా లో నుండెనఁట. ఆయనకుఁ జెన్నపురిదివ్యజ్ఞానసభవారీవర్తమానము తెలియజేయుదురఁట. లెడ్బీటరు సమాధిగతుఁడై వారిభాషలో 'యాస్టరల్ ప్లేను' లోనికిఁ బోయి, ఆల్సియాను కృష్ణమూర్తియో, శివరావో తెలిసికొని యప్పుడీ విషయము తెలియఁజేయుదు మని వ్రాసిరి. లెడ్బీటరునుండి యుత్తరము వచ్చువఱకు శివరావుగారి యవతారము నిలువలో నుంచఁబడెను.

మఱలఁ గ్రిస్టమస్ పండుగలు వచ్చెను. శశినీ రంగారావులు చెన్నపురి కేఁగిరి. మఱలఁ గ్రొత్తగుఱ్ఱములు కొనుట, మఱలఁ వానిని బోషించుట జరిగెను. ఆ సంవత్సరము గిండీపందెములవలన దేశమునకుఁ జాలనష్టముగా నున్నదని చెన్నపురిపత్రిక లన్నియు ఘోషించెను. ఘోషించినందువలన నేమో పందెము లాటయేఁట వఱియు విరివిగా జరిగెను. రంగారావుగారిగుఱ్ఱము లన్నియు నోడి పోయెను. లాభము గూబలలోనికిఁ దూసినట్లు నిరుటి రెండులక్షలు నేఁడు పోయెను. శశిని తలిదండ్రులకు మూఁడువందలపౌండ్లు పంపించ

వలసివచ్చెను. రంగారావుగారిచేతిలో ధనము లేకపోయెను. కృష్ణమ నాయఁడు ఖజానాలో నిలువయుంచిపోయిన యిరువదిలక్షలలోఁ బన్నెండులక్షలు పట్టాభిషేకమునకే యయ్యెను. కాలేజీ కిచ్చినది, యిగ్లండు వెళ్ళి ఖర్చుపెట్టినది, యీ పదేండ్లుగా నాగేశ్వరరావుగారి కేమి తదితరులకేమి జీతము లిచ్చినది, ప్రతిసంవత్సరము వచ్చుచున్న యాదాయము చాలక ఖజానాలో మిగిలిన యెనిమిదిలక్షలును వ్యయమయ్యెను. నిరుడు రెండులక్షలు లాభము వచ్చె నన్నచో నీయేఁడదిపోయెను. శశిని తలిదండ్రులకుఁ బంపించుటకు నైదువేలరూపాయలు లేక రంగారావుగా రిబ్బందిపడవలసివచ్చెను. ఆ యేఁడు దివానుగారిద్వారా యొకమార్వాడీదగ్గఱనుండి లక్షరూపాయ లప్పు చేసిరి. శశిని డబ్బుపంపించెను. ఇంగ్లాండునుండి యుత్తరమువచ్చెను. మూఁడేండ్లకే యామె తిరిగి వత్తు నన్నది. నాలుగేండ్లు కావచ్చినది- ఆమెతండ్రికి జబ్బుగానున్నదఁట. ఒకసారి తప్పక రమ్మని. శశిని భర్తతో 'నిద్దఱము పోయివత్త' మన్నది. రంగారావు కాదనలేదు; అవుననియు ననలేదు. ప్రస్తమసు నష్టమైపోయెను.

రామేశ్వరముగారు నెలనాళ్ళయినతరువాత మఱల రంగాపురము పోయిరి. మంగమ్మ జోస్యులతోఁ జెప్పియుండెనేమో! తాను వెళ్ళినచో నతఁ డేమనునో? సందిగ్ధమనస్కుఁ డై పోయిన రామేశ్వరమునకు సూక్ష్మపరీక్ష చేసినంతసేపు జోస్యులప్రవర్తననుబట్టి యతనిభార్య యతనితో నా ప్రసంగమే చేయలేదని ధైర్యము కలిగెను. అయినను గదలించి చూతమని 'జోస్యులుగారూ! ఆరోజున మీ యింటిలోని భోజనము స్వర్గతుల్యముగా నున్నదండీ' యని మాటలలో మాటగా ననెను. జోస్యులు మఱల 'మీరు మాయింటికి దయచేయ వలయు' ననెను. రామేశ్వరము 'నాలుఁగు మైళ్ళలో నుబ్బన్నపేఁట పెట్టుకొని యెందుకండి? ఆ రోజున నన్నచోఁ బ్రొద్దు ననే వచ్చితి గనుక నట్లు జరిగినది' అనెను. జోస్యులు 'అట్లుకాదు. మీరు మఱల మా యింటికి భోజనమునకు రావలయు'నని బలవంతము చేసెను. రామేశ్వర 'మీసారి వచ్చినప్పుడు లెండి' యని యాప్రసంగ ముపసంహరించెను. ఆనాఁడు జోస్యు లింటికిఁబోయి మంగమ్మతో 'ప్రసిడెంటుగారు మఱల మనయింటికి భోజనమునకు వత్తురు.

రెండుమూఁడురోజులలో మఱల వత్తురు. అప్పుడు వంట యానాఁడు కూడఁ జక్కఁగాఁ జేయవలెనుసుమా' యనెను. మంగమ్మ 'జమీందారుగారి కాయన యేమగును?' అని అడిగెను. జోస్యులు 'సాక్షాత్తు పెదతల్లి కుమారుఁడు' అనెను. మంగమ్మ 'ఆయన చాల ధనవంతుఁడా' అనెను. జోస్యులు 'సుబ్బన్న పేఁటలో సినీమా యున్నది. దాని మీఁద నెలకు నాలుఁగైదువేలు వచ్చును. ప్రసిడెంటుగా ప్రయాణపుఖర్చులే సాలున కొకటి రెండువేలు వచ్చును. ఆయన కేమి? జమీందారుతెరువాత జమీందారంతవాఁడు. జమీందారుగా రీయన యెంత చెప్పిన నంత యఁట' అనెను.

మఱల వారము రోజులలో రామేశ్వరముగారు వచ్చిరి. జోస్యులు భోజనమునకుఁ బిలచి మఱల నంత ప్రయత్నము చేసెను. వెనుకటిసారివలె రామేశ్వరము వడ్డించుచున్నంతసేపు మంగమ్మవంకఁ జూడలేదు. జోస్యుల కది మనస్సున కాహ్లాదకారిగా నుండెను. అతని హృదయకుహరములో రామేశ్వరమునుగూర్చి సందేహ మేదైన నున్నచో నది యానాఁటితోఁ బోయెను. జోస్యులు భోజనముచేసి పాఠశాలకు నడచెను. పన్నెండుగంటలైనది. మంగమ్మ మునుపటి వలెనే ప్రక్కగదిలో శయనించెను; రామేశ్వరము నిద్రలేచినట్లు నటించి మంచితీర్థ మడిగెను. ఆమె తెచ్చి మునుపటివలెనే వాకిటిలో నుంచెను. అతఁడు మొగము చేతులుకడుగుకొని, మఱల నీళ్లు తెమ్మని తానుపండుకొన్న మంచముమీఁదగూర్చుండెను. అతఁడు చెంబువట్టెను. నీరుపోయుటకు మంగమ్మ గదిలోనికిఁ బోవలయును. ఆమె మంచమువద్దకుఁ నడచి, చెంబులో నీరు పోసెను. రామేశ్వరము చెంబు వదలిపెట్టి, యామెచేయిపట్టుకొనెను. ఆమె వదలించుకొనుటకుఁ బ్రయత్నించెను. అతడు వదలలేదు. ఎడమచేతితో జేబులోనుండి తీసి రెండు పది రూపాయలనోట్లామెచేతి కందించెను. ఆమె యెడమచేతితోఁ బుచ్చుకొనెను. జోస్యు లొంటిగంటన్నఱ కింటికి వచ్చెను. దొడ్డిలో రాజ్యలక్ష్మమ్మగారితో మాట్లాడుచున్న మంగమ్మతోఁ 'ప్రెసిడెంటుగారికి ఫలహార మేమియుఁ జేయవా?' యనెను. మంగమ్మ 'యిందాఁకటి గారె లున్నవిగదా?' యనెను. జోస్యులు 'కాఫీ కావలయును' అనెను.

జోస్యులు తనకు కాఫీ త్రాగు నలవాటు లేకపోయినను సుబ్బన్న పేటనుండి పోల్సన్సు కాఫీ డబ్బా యొకటి తెచ్చి యింట నుంచెను. ఆ కాఫీపొడి ప్రాఁతది. కాఫీ జోస్యులకు బాగుండలేదు. రామేశ్వరము బాగుండలే దని యనలేదు. ఆ నాఁడు సాయంకాలము ప్రొద్దు క్రుంకి రామేశ్వరము సుబ్బన్నపేట వచ్చుచుండెను. అతఁడు గణాచారి యింటిముందుగా రావలసియుండెను. గణాచారి వారి యింటివాకిట నిలుచున్నది. రామేశ్వరమును దూరమునుండి చూచి యామె లోనికిఁబోయెను. రామేశ్వరమువచ్చి వీథిగుమ్మమున కెదురుగా నిలుచుండెను. గణాచారి యాతనియూహలు చదివెను. ఆమె లోనికిఁబోయి పసపు తెచ్చి వాకిటలోనికి వచ్చెను రామేశ్వరము కదలలేదు. రామేశ్వరము చూచుచుండఁగా పసపు చేతిలోఁబోసి కొని గణాచారి నలిపెను. పసపురంగుపోయి దుమ్మువలె నయ్యెను. ఆమన్ను రామేశ్వరము కన్నులలో దులిపెను. ఆతఁడు కన్నులు మిఱుమిఱులాడి తనదారిని దాఁబోయెను. గణాచారిబోయి స్నానము చేసెను.

ఆనాఁడు ప్రొద్దుక్రుంకెను. యుగయుగమ్ములనుండి క్రుంకిన యాప్రొద్దు తా నేమి క్రుంకినట్లు! ప్రాతఃకాలములో సాయంవేళ యున్నది. ఉదయములో న స్తమయ మున్నది. అస్తమయములో నుదయ మున్నది. ఉదయాస్తమయములు రెండును ద్వంద్వము. సుఖదుఃఖములవంటిదే. పుణ్యము పాపము ద్వంద్వము. ఆ యస్తమయమును దాత్కాలికమే నిత్యమైనది కాదు. అది శోచనీయము.

రెండు వారములు గడచెను. లెడ్‌బీటరువద్దనుండి యుత్తరము వచ్చెను ఆయన సమాధిలోనికి వెళ్ళి యాధ్యాత్మికలోకమునంతయు వెదకివెదకి చూచెనఁట. అచ్చట శివరావుపొడయైనను గానరాలేదఁట. ధర్మారావు మఱునాఁడు పాఠశాలకుఁ బోఁగా దీనవదనుఁడై శివరావు లేఖసంగతి ప్రస్తావించెను. ధర్మారావు 'మీకు మహానుభూతి కలుగుట యేమి? వాఁ డెవఁడో కాదనుట యేమి? మీ రవతరించి రని మీకు విశ్వాసమున్నచో నవతారముగాఁ బ్రకటించుకొని మహాకార్యములు చేయవలసినదే' యనెను. శివరావు 'అట్లు గాదు. అతఁ డొప్పుకొన్నచో లోకముగూడ నొప్పుకొనును. ఇప్పుడు వ్యవ

హారము చెడిపోయినది' అనెను. ధర్మా—లోక మనఁగా నైదుఖండములయం దున్న దివ్యజ్ఞానసభవా రని యర్థము. లోకమునందుఁ గ్రైస్తవులసంఖ్య యెక్కువ. వా రొప్పుకొనినచో దేవుఁడగుటకు నెక్కువ వీలున్నది. తక్కినవా రెవ రొప్పుకొనియు లాభములేదు. శివ—అవును. ఇతఁడు కాదన్నచో నేను గాకపోదునా? మీ రన్నట్లు నా కింత యనుభూతి వృథాగా నేల కలుగును?

అప్పటినుండి శివరావు తనయవతారము పరిపక్వమగుటకు మార్గము లూహించ నారంభించెను. ఒకనాఁడు శివరా విట్లు చెప్పెను. 'ఇది పందొమ్మిదివందల యిరువదినాలగవ సంవత్సరము. ముప్పదినాల్గునాఁటికి నేను సంపూర్ణావతారము నగుదును. ఈలోపుగా సంస్కృతము, లాటిను గ్రీకు, ఫ్రెంచిభాషలు నేర్చుకొందును. సర్వదేశరాజకీయ వ్యవహారములు చదువుదును. ఈలోపుగా తుపాకి నుపయోగించుట, కత్తిసాముజేయుట మొదలైనవన్నియు నేర్తును. ఈ లోపుగనే నే నేదో మహారాజు నాస్థానములో మంత్రిని గావలయును. లేనిచోఁ గొన్ని జరుగవలసిన ప్రయత్నములు జరుగవు. అప్పటికి మనదేశమునకు స్వరాజ్యము వచ్చును. భారతదేశప్రజాస్వామికమునకు నేను ప్రెసిడెంటు నగుదును. నానారాజ్యసమితికి నధిపతి విల్సను కాదు, శివరావు. ముప్పదిమూఁడుకోట్ల జనసంఖ్యగల భారతదేశమును జూచి లోకమెల్ల గడగడలాడిపోవును నేను మీతోఁజెప్పితినిగదా-నేను కార్యవాదినే కాదు, ఖడ్గవాదినిగూడ నని. గాంధిగారివలె నేను హృదయ పరివర్తనముచేసి నానాజాతులమధ్య మైత్రిభావము కుదుర్చుటకుఁ బ్రయత్నింతు నని కాదు. వలసినచో ఖడ్గము గూడ నుపయోగించెదను. శివరావు రెండుచేతులును బైకెత్తి, మొగమదియొకవిధముగాఁ బెట్టి 'అప్పుడు నేను తెల్లని గుఱ్ఱమెక్కి, ఖడ్గము చేతిలోఁబూనితిరుగుచుందును. అదియేకల్క్యవతారము.హుం' అనెను. ధర్మారావునకే మనుటకును దోఁచలేదు. అతఁ డిదియంతయు బయటపెట్టినా కళాశాల పాడైపోవును. కళాశాలలోఁ దా మిద్దఱును గలసి యొకపక్షముగా నున్నారు. ఇప్పుడు శివరావుకథ యిట్టిదని తెలిసినచో నతనిని శత్రువులు సహాయ మగుటవలనఁ గళాశాలనుండి పంపించివేయుటకుఁ బ్రయత్నించి కృతార్థు లగుదురు శివరావు మత

విషయకోన్మాదము కళాశాలావ్యవహారములందు లేదు. అందుచేత నెవరికిని గలిగిన యుపద్రవము లేదు. ధర్మారావునకు శివరావుమైత్రి పరిత్యజించఁదగినంత దోషము కనిపించలేదు. ధర్మారావు శివరావు చెప్పుమాటలు కావని నిరాకరించి యుండవచ్చును. ఆ విషయము నందలి శివరావుతీవ్రత, ధర్మారావవిశ్వాసము ప్రకటించినను వారి గాఢచెలిమి భంగమగునేమో యన్నంతగా నున్నది. ధర్మారావు పర ప్రయోజనార్థియై యీ విషయమున శివరావును కాదనలేదు.

నెల తిరుగకయుండే జోస్యులకు సుబ్బన్నపేటకుఁ బదిలీ వచ్చెను. 'ప్రెసిడెంటుగారియనుగ్రహములోఁ బడినాఁడు. అతనికేమి? మహారాజు' అని యితరోపాధ్యాయు లనిరి. మఱికొందఱు 'గారెలలోఁ, బరమాన్నములోఁబెట్టినభోజన మూరకేపోవునా?' యనిరి. జోస్యులు సుబ్బన్నపేట వచ్చిన తరువాత రామేశ్వర మాతనికి రెండుట్యూషనులు కుదిర్చెను రెండుచోట్లరెండయిదులు పదిరూపాయలును, జీతము పాతికయు, ముప్పదియైదురూక లాదాయము కనఁబడుచుండెను. జోస్యులసంసారము మునుపటికన్న బాగుగా జరుగుచుండెను.

ట్యూషనులలోఁ బ్రొద్దున నొకటి, సాయంకాలమున నొకటి. జోస్యులు ప్రొద్దున మొదలు సాయంకాలమువఱకు నింటివద్దనే యుండఁడు. భోజనమునకుమాత్రము వచ్చును. శనివారము నాది వారముమాత్ర మింటివద్ద నుండుట. ఒకనాఁడు మంగమ్మచేతి నొక యుంగరము కనిపించెను. జోస్యు 'లా యుంగర మెచ్చటి'దనెను. ఆమె 'దొరకె' ననెను. అతఁ 'డంత మంచియుంగరము పాఱవేసి కొనువా రెవరు? పైఁగా నుంగరము క్రొత్తదివలె నున్నదే'యనెను. కొంత తర్జుమా యయినతరువాత నా ప్రస్తావన యాఁగిపోయెను.

మఱొకనాఁడు మంగమ్మ వంటచేయుచున్నది. జోస్యులు తన యుత్తరీయ మొకటి కనిపించలేదని యిల్లంతయు వెదకెను? 'నీ పెట్టెలో నున్నదా?' యని మంగమ్మ నడిగెను. ఆమె 'నాపెట్టెలో నేల యుండును?' అన్నది. 'ఒకవేళఁ బడినదేమో? తాళపుఁజెవి యిటు తే. చూచెద'నని యతఁ డనఁగా నామె 'నా పెట్టెలో లేదు.' అని యుద్వేగముతో ననెను. 'నీ పెట్టెలో నున్న బంగారమేమియు

నా కక్కఱలేదులే. నాయుత్తరీయముమాత్రమే నాకుఁగావలయును.' అని జోస్యులు తాళపుఁజెవికొఱకు వెదకెను. మంగమ్మ నిత్యమును దాళముజెవి తనకొంగుననే కట్టుకొనును. ఆ నాఁడుమాత్రము స్నానముచేయుచుఁ గొంగునందుండి విప్పి గోడనున్న వంకెకుఁ దగిలించెను. ఆనాఁడు శుక్రవారము. జోస్యులకు బడియున్నది. అందుచే నామె యశ్రద్ధవహించెను. అతఁడు తొందరగావచ్చి తొందరగా భోజనముచేసిపోవును. పాఠశాలయున్న నాళ్లలో నెక్కువశ్రద్ధగా నుండుట యలవాటులేదు.

ఆమె వలదన్నకొలఁది జోస్యులు పెట్టెతీసి చూచెను. పెట్టెలో నాలుగైదు మంచిచీరలు, పట్టుజరీచీర, కొరనాటిచీరయుఁగనిపించెను. అత్తరుసీసాలు అగురువత్తులు పెట్టెయంతయుఁ బెళపెళగా నుండెను. ఒకచీర మడతలోనుండి యేఁబదిరూపాయలు జాఱి క్రిందఁబడెను. జోస్యుల కర్థము కాలేదు. మంగమ్మ పడమటింటిగుమ్మములో నిలుచుండి యొడలిలోఁ బ్రాణములులేనట్లు శూన్యదృక్కులతోఁ జూచుచుండెను. జోస్యులు 'ఇవియన్నియు నెచ్చటివి?' యనెను. ఆమె 'నావే' అనెను. జోస్యులు 'నీవేనా? సంపాదించితివా?' అనెను. ఆమె 'మాయమ్మ కొని పంపించినది' అనెను. జోస్యులు 'నా కెప్పుడును జెప్పినావు కాదు' అనెను. జోస్యు లామె 'నవి యన్నియు నెచటి నుండి వచ్చినవో చెప్పు' మని నిర్బంధించెను. ఆమె యదే సమాధానము చెప్పెను. అతఁ డామె ననేక దుర్భాషలాడి చివరకుఁ గోపముపట్టలేక యామెను దండించెను. ఆమె యేడ్చుచుండెను. జోస్యు లానాఁడు భోజనముచేయకయే పాఠశాల కేఁగెను. తక్కిన యుపాధ్యాయు లతనివాలకము చూచి, యింటివద్ద నేదో రగడ జరిగిన దని గ్రహించి, తమలోఁ దాము నవ్వుకొనిరి. జోస్యు లది కనిపెట్టెను. వారందఱు తన్నుఁజూచి యట్లు నవ్వుకొనుట యెందులకో తెలియలేదు.

అతఁడు పాఠశాల యగువఱకు ముండ్లమీఁద నున్నట్లుండి యొంటిగంటన్నఱ కింటికిఁ బోయెను. జీవున కాఁకలియగుచున్నది. అన్నముపెట్టినచోఁ దిందుమని పోయెను. మంగమ్మ చెఱఁగుపఱచుకొని పండుకొని నిద్రించుచుండెను. పడమటింటిలోనికిఁ బోయి

చూచెను. కడిగినబియ్యము కడిగిన ట్లున్నవి. ప్రొయ్యిలోఁ గట్టెలు మండిమండి కొంతదూరము కాలి యారిపోయియుండెను. అతని కన్నులు పెట్టెమీఁదఁ బడెను. పెట్టెలోఁజీరలు లేవు. అతఁ డామెను లేపి 'చీర లేమైనవి?' యనెను. 'అవి యెవనికో బీదవాని కిచ్చి వేసి తిని' అన్న దామె. 'డబ్బుకూడ నిచ్చితివా' అనెను 'ఆ' అని మంగమ్మ బదులు చెప్పెను. 'ఎవ రా బీదవాఁడు?' అని జోస్యులు ప్రశ్నించెను. మంగమ్మ 'ఎవరో దారివెంటఁ బోవుచుండఁగాఁ బిలచి యిచ్చితిని' అనెను. జోస్యు లాఁకలిమీఁదనుండి మఱీ కోపగించు కొని మంగమ్మ నదేపనిగాఁ దాడించెను. ఆమె యిల్లెగిరిపోయిన ట్లేడ్చెను. ఇరుగుపొరుగువారు వచ్చి కొందఱు 'కొట్టవ' ద్దనిరి. కొందఱు 'త ప్పేమి చేసిన'దనిరి. అందఱును నన్నుఁగాంచి చాటుగా నవ్వుచున్నట్లే తోఁచినది, జోస్యులయాత్మ సందేహావస్థలోఁ బడినది. తా నేమి పాపము చేసెనో తెలియదు.

ట్యూషను చెప్పి ప్రొద్దుగ్రుంకి యింటికి వచ్చుచుండెను. ఎదురుగా రామేశ్వరముగారు పోవుచుండిరి. జోస్యు లాయనకు నమస్కారముచేసెను. ఆయన యేటికో జోస్యులనుజూచి వెలతెలబోయెను. జోస్యులు 'అయ్యా! ప్రయాణముమీఁదఁ బోవుచున్న ట్లున్నది. ఎచ్చటికి దయచేయుచున్నారు' అనెను. అతఁడు 'బెజవాడనుండి, రైలందునా' యనెను. జోస్యులు 'చిత్తము. ఇంకను వేళయున్నది' అనెను. జోస్యు లింటికి వచ్చెను. మంగమ్మ వంటచేసి, తానువడ్డించుకొని తిని పండుకొనెను. అతఁ డిల్లు నాల్గుమూలలు చూచెను. ఆఁకలి యయి, స్నానముచేసి యన్నముపెట్టుకొని తినెను. ఆ దినమెల్ల నతఁ డూహాపరంపరచే నుయ్యేలలూఁగుచుండెను. 'అవియెల్ల నిజముగా వాండ్రతల్లి పంపించెనేమో? ఆమె యన్నిచీర లెట్లు కొనెను? ఎప్పుడు పంపించెను? అంత డబ్బెక్కడనుంచి తెచ్చెను. కాఁపురమునకుఁ బంపించునపుడే నల్లఘాసలతోఁ బంపింపనవారు నేఁ డీమె మొగాన నిన్ని పాఱవేయవచ్చిరా? మధ్యాహ్నము మఱల నేను పోవువేళకే యవియెల్ల బీదవారి కిచ్చెనా? ఆ బీదవా రెవరు? ఇది నిజముగా నా పరువు తీసియే యుండును. అందుకనియే బస్తీలలోఁ గాపురముజేయరాదు. ఈ యూరిలో ధనవంతు లెంద ఱుండిరి? కాలేజీ

విద్యార్థు లెంద ఱుండిరి? అధికారు లెంద ఱుండిరి? సంగతియంతయు విచారించినచో నతఁ డెవఁడో ధనవంతుఁడుగాని మఱియొకఁడుగాదు. కాకపోయినచో నంతధనమా? అటువంటి చీరలా? అత్తరులా! అవి తా నెప్పుడు వాడునో? కొన్నాళ్ళనుండి యీామె రంగురంగుగా నుండుచున్నది. నే నేమో సంతోషించితిని. ఆ శృంగారమంతయు నాకొఱకుఁ గాదు. ఆహా! జన్మ మనఁగా నావంటివానిది! నేను చని పోయిన నెంత బాగుగానుండును! నాకుఁదల్లిలేదు. తండ్రిలేఁడు. ఉన్న యక్కగారును, జెల్లెలును వారిదారిని వారు సుఖముగాఁ గాఁపురము చేయుచున్నారు. భగవంతుఁడు రక్షించి నా కింతవఱకుఁ బిల్లలు కలుగలేదు. అది గ్రుడ్డిలో మెల్ల. ఈమె నేమి చేయవలయును? అయినను నేను నల్లఁగా నుందును. మొగమంతయు మశూచికపు మచ్చలే. ఆమె యందకత్తె ఆమెకు నామీఁదఁ బ్రేమ యెట్లుం డును? ఇంక వికృతాకారులు పెండ్లి యే యాడరాదు కాబోలు! అందమైన పురుషుల కందమైన స్త్రీలే దొఱకుదురా? అది యెన్నఁ డును జరగదు. అట్లయినచోఁ దల్లిదండ్రులు తమపిల్లలకు ధనవంతుల సంబంధ మేల వెదుకుదురు? అది! కారణము తెలిసినది. స్త్రీలు ధన వంతుని వాంఛించుదురు. నేను నిరుపేదను. ఆమె కాఁపురమునకు వచ్చి మూఁడేండ్లయినను నే నొక్క నగయయినను జేయించలేక పోయితిని. అది నాయందామెకు నిరాదరణహేతువు: నాసంపాదన తిండికి, నింటియద్దెకు, నధికారులను మేపుటకే చాలలేదాయెను, ఈమె నేమిచేయుదురు? చంపుదునా? చంపినచో నది యొకపెద్దయల్లరి. కేసు, వ్యవహారము. నా పరిశీలన తప్పుదేమో? ఈమెను పుట్టినింటికిఁ బంపివేసెదను. వారు మఱికొన్నాళ్ళుండి మఱలఁ బంపరా? అప్పటి మాట చూచుకొందము. ప్రస్తుత మీ పీడ వదలుగదా! ఆ పురుషుఁ డెవఁడై యుండును? కామేశ్వరము కాదుకదా! అతఁడు రంగా పురములో నున్నపుడు మాయింటికి రెండుసార్లు భోజనమునకు వచ్చెను. అపుడు నేను పాఠశాలకుఁ బోయి యాయనను, మర్యాద కొఱ కింటివద్ద విశ్రమింపుఁ డంటిని. అవునవును. 'ఆయన ధన వంతుఁడా' యని యీామె ప్రశ్నించెను. అపుడు వారిద్దఱమధ్య నాకు ననుమానమైనఁ దగులలేదే? వా రనుమానము కలుగున ట్లేల

ప్రవర్తింతురు? ఇంతకు వారి దేమిత ప్పున్నది? ఇద్దఱి నింటిలో వదలి వెళ్ళిన నాది తప్పుకాని. అయినను రామేశ్వరముగా రంత మిత్రద్రోహియా? నే నాయనకు మిత్రుఁడనా? సేవకుఁడను. ఇందాక రైలునకుఁ బోవుచు నేను పలుకరించఁగా నాయన వెలతెలబోయెను. ఎందుకు? ఆహా! నాప్రాణములలో నీ యమదండఘాతను తెచ్చిన దతఁడేనా. అబ్బో! అతడు నా కాశ్రయమిచ్చి నన్ను రక్షించుచుండె ననుకొంటినే! ఈ దయకంతయు మూలకారణ మిదా? ఏమో! ఆయన యగునో కాదో? కాకపోయిన నంత ధనవంతుఁ డెవఁడు? ధనమున కేమి? జారుఁడు దొంగిలించికూడా ధనము తేవచ్చును. ఉత్తరులాదిగాఁజూచిన నతఁడు నిర్భయుఁడుగాఁ దోఁచుచున్నది. నాపై నధికారికిఁ గాకపోయిన నంతనిర్భయత యెట్లు కలుగును? ఈమొకనూత్రి మివియున్నయుఁ బెట్టిలో నుంచుకొని నిర్భయముగా నుండునంత గుండెనిలుకడ యెచటినుండి వచ్చును? తెలిసినను ఫరవాలే దన్న ధైర్య మీ కథవెనుక గోచరించుచున్నది. అసలు నా కీ కథ సూచనగాఁ దెలిసి నేనే యూరకున్నట్లుగాఁగూడ వారు భ్రాంతిపడిరేమో? ఈసంగతి నాకుమాత్రముదక్క తక్కిన వారికందఱకుఁ దెలిసినట్లే యున్నది. పాఠశాలలో నుపాధ్యాయులెందఱునన్నుఁజూచి తమలోఁదాము నవ్వుకొనుచుండిరి. ఇరుగుపొరుగువా రందఱును గుసగుసలు నవ్వులాటలుగా మాట్లాడిరి. నాకు ట్యూషనులుగూడఁ గుదిర్చిన దిందుకనియా?

ఆ రాత్రి రెండుమూఁడుసార్లుపోయి చెఱువులోఁబడి చత్తునని జోస్యులు లేచెను. కొంతదూరము పోయి మఱలఁ దిరిగివచ్చి పండుకొనెను. ఆహా! ప్రాణము లెంతతీపి? అసలుప్రాణములే తీపి. సంవత్సరములతరబడి మహావ్యాధి పీడితుఁడై యేరోజునకారోజు ప్రొద్దుకుంకుటయుఁ, దెల్లవాఱుటయుఁ గష్టమైనవాఁడు చచ్చిపోవుట కిచ్చగింపఁడు. తినుటకుఁ దిండిలేక, బిచ్చపుబ్రదుకై యడుగడుగునకుఁ బరాభవధూషితమైన తన నిర్లజ్జాకాష్టమును నిత్యదరిద్రుఁడు త్యజించుటకు నంగీకరించఁడు. త్రిపదమునందుఁ బొనరించుచున్న మహాపాపములచే దగ్ధదేహుఁడై దగ్ధపరహృదయుఁడైన మహారాక్షసుఁడు తన కీ ఫలితముగా మహానరకమో, ఘోరమృత్యువో ప్రాప్తించునని

తెలిసియు నా పాపములను దాను పొనర్చుకుండ నుండలేదు, గనుకఁ దాను చనిపోవుదమని యనుకొనియుఁ జావలేదు. దురధికారులు, కుత్సితులు పన్నిన మాయాజాగురలోఁ దగుల్కొని యొకజీవి తన జీవితశక్తియంతయు వృథాయయి ప్రబలశత్రువులు పైకి రానీయని తనజీవిత మంతమొందించుకొన నూహించఁడు. సుఖమన్నది యెఱుగనివాఁడు, నిర్ధనుఁడు, కుష్ఠవ్యాధిగతుఁడు చివరకు వాఁడయినను శరీరత్యాగమున కనుమతించఁడు. ఎవ్వతె తనయెడ ననురాగవతి యయిఁ తనయెడఁ బాతివ్రత్యము కలదగుటచేతఁ దనజీవితములోఁ ప్రధానమైనశాంతిసముకూరునో ఆభార్య తన్ను ద్రోహముచేసినదని తెలిసియుఁ, దనజీవిత మింకహాస్యభాజనము దుఃఖభాజనము నని తెలిసియు నా పురుషుఁడును ప్రాణములు త్యజించలేదు. ఇంతయేల? శతాబ్దములతరబడి యొకజాతి పరశృంఖలములఁ గాళ్ళకుఁదగుల్చుకొని సిగ్గులేక స్వతంత్రజాతి పోయినపోకడలు పోవుట కభినయించునుగాని తన్నుఁదాఁ జంపుకొనదు. మృతియనునది జంతుసహజము. సర్వజంతువులామృతినుండి దూరముగాఁ బాఱిపోఁ బ్రయత్నింతురు? మృత్యువు చాలవిచిత్రమైనది. తా నొక జంతువును గ్రహించ నూహించనపుడు దాని నెంతదూరమైనను తనయొద్దనుండి పాఱిపోనిచ్చును. ఆ జంతువు తాను మృత్యువునుండి యప్పుడు తప్పించుకొనె ననుకొనునేకాని మృత్యు వసలు తన్నపుడు పట్టుకొననేరాలేదని యెఱుంగదు.

జోస్యులు వీధియరుగుమీఁద బండుకొనెను. మఱల నూహాపరంపరలో లేచి చనిపోద మని వీధిలోనికిఁ బోయెను. ఒక రెండు కుక్కలతని ముందుగా నిలుచుండి తలలెత్తి యేడ్వనారంభించెను. అతని గుండెలోనుండి దుఃఖము పొంగిపొరలెను. ఏడ్చుచునే పోయి మఱల నరుగుమీఁదనే పండుకొనెను. ఆకాశమునఁ బరుగెత్తుచు నొక తీతువు కూసికూసి ప్రక్కనున్న రావిచెట్టుపైఁగూర్చుండి మఱలఁ గూయసాగెను. జోస్యులకుఁ జిన్నతనములోఁ దీతువుకూయుచుండగా నతనితల్లి తిట్టుచుండుట తెలియును. అట్లు కూసినయెడల నెవరయినను జచ్చిపోవుదురని యామె చెప్పుచుండెడిది. ఇప్పు డెవరు చచ్చిపోదురు? తానా? తాను మూఁడుసారులు చావవలెనని పోయి మఱల వచ్చి పండుకొనెనే? తనభార్యయా? ఆమెను దాను చంపఁదగినంత

శక్తి లేదే! ఆమె తానే పోయి మరణించునేమో? ఆమె యేల మరణించును! త్రాగలేనిపిల్లి బోరగిలఁదోసికొన్నదని యామె యెందుకుఁ జనిపోవును! సుఖపడలేకనా ?

ఇంతలోఁ గోళ్ళుకూసెను: ఓహోయి! జనులు ప్రమత్తులై యున్నారు. దొంగలో! దొరలో! దొరలును దొంగలే. వారు మీ ధనములను, మీ జాతిని నిలువనిచ్చునట్లు లేదు. అధికారులట్లు వచ్చి మీగృహములను నాశనము చేయుచున్నారు. మీ వంశ క్షయము చేయుచున్నారు. అని కుక్కుటములు కూసినట్లుండెను. గుండెయంతయు నుడికిపోయి జోస్యులవదన మెండిపోయెను. జనము నెమ్మది నెమ్మదిగా మేల్కొనుచుండిరి. జోస్యులు లేచి గ్రామదక్షిణ మార్గమునఁబడి నడచుచుండెను ఊరిబయటికిఁ బోయినతరువాత సూర్యోదయ మగుచుండెను. ఎఱ్ఱని యూ సూర్యబింబము ఎవఁడో దుఃఖజీవి తనభార్య కలుషవర్తనముచే గుండెకాలి పండి యెఱ్ఱనై యగ్నిజ్వాలవలెఁ గాఁగాఁ దానది భరింపలేక రొమ్ముచీల్చి గుండెను విసరిపుచ్చుకొని తూర్పుదిక్కున బాఱవేసెనా యన్నట్లుండెను.

# పదునాల్గవ అధ్యాయము

వసంతకాలము వచ్చెను. మధుమాసకోకిల మాకందతరుశాఖాగ్ర జాతకుసుమమేఖల ధరించి కుహూకుహూ యని నిక్కపోయెను. దేవదాసిబంగారపుటొడ్డాణపుగజ్జెలు గల్లుగల్లు రన మందయానము నెఱపెను. చూతవృక్షముల ఫలములు చెట్లనే బంగారపువన్నె తిరిగి ప్రేక్షకులకుఁ దమ మాధుర్యమును తినఁబడకుండఁగనే మనస్సులోఁ దెలియఁజేసెను. దేవదాసి యురోమండలము ప్రౌఢమై కఠినమైన భగవంతునిమనోవాంఛల నిక్కపొడిపించెను. పవలెల్ల బంగరు నెండలు కాచెను. దేవదాసికనులలో వాంఛాలవేపత్ర్పచలిత మందకటాక్షవాహిని తరఁగలుతరఁగలుగా నూఁగెను. మధువాని తుమ్మెదలు వనమెల్ల నున్మాదగీతములు పాడెను; భక్తిమధువాని దేవదాసి గోపీకోన్మత్తగీతలు పఠించెను. చివురాకు లల్లలాడెను; గిరిక కెంగేలు కపోతాదిహస్తము లభినయించెను. నదులు శుష్కించిపోయెను; గిరికనడుము మిగుల సన్న నయ్యెను. నదులయొడ్డుల నిసుకతిన్నెలు విస్తరించెను. ఆమె పిఱుందులు ఘనము లయ్యెను. మాధవుడు మహానందమేదురహృదయజలజాతుఁడై నట్లు గిరికానవశోభ విజృంభించెను. గిరిక యభినయము నేర్చుకొనుచుండెను. స్వామిని సురకేళికి రమ్మని పిలుచుచు, నెడమచేయి నడుమునందాన్చి కుడిచేతి నాల్గువ్రేళ్ళను సాఁచి బొటనవ్రేలు నాభిస్థానమందుఁ జేర్చి త్రిభంగిగా నిలుచుండి, మెడ కుడినుండి యెడమకుఁ గదలించుచు కంటిచూపు ఘనవిశాల వక్షోభాగమునకుఁ బ్రసరింపించుచుండఁగా శరత్కాల సూర్యుఁడు ప్రాక్పశ్చిమ మధ్యాచలభాగపునఃపునర్గచ్ఛద్బింబుని బోలెఁ బ్రకాశించెను. మల్లికాకుసుమములు విడిపోయి రేకులు వెనుకకు వంగి తొడిమకుఁ దాఁకు నన్నట్లుగా జాతి పొట్లపూవులువోలెఁ గనిపించి మధురమధుర వాసనా తరంగమాలాపునఃపునరాహూయమాన మధువ్రతప్రౌఢకుమారసాకూతదృశ్యమానస్వసౌందర్యములై సొగసెల్ల దమసొమ్మె యన్నట్లు, నాయాతపతిదర్శనమత్కంఠావేగస్విన్నమూర్తులైనట్లు, మృదులహిమానీబిందుసంతానసంసిక్తపత్రములై

సాత్త్వికలజ్జాస్వేదమూర్తులైన ముగ్ధానాయికలవలెఁ గ్రొత్తపెండ్లి కూఁతుండ్రవలెఁ గులుకసాఁగెను. వసంతకాలమెల్లయు గిరికతో సామ్యమునకై ముందునకుఁ దూఁగెను వేణుగోపాలమూర్తి, బృందావనవిహారి, వంశీనినాదమధురితప్రవాళాధరజగన్మోహనాకృతి,తమాలపల్లవ శిఖాపందీప్త తనూచ్ఛాయాలోభనీయమూర్తి వచ్చివచ్చి మా పేఁటకు వచ్చెనేమి ? మా కులము తన్ను మఱచిపోయి కులటలై యున్నాళ్ళయినది? గిరికమీఁద మనసుపడినస్వామికి భారతదేశపురాతనదేవాలయములఁ దనవసతి స్మృతికిఁ దగినట్లున్నది.

వైశాఖ పూర్ణిమ. వసంతర్తువు గ్రీష్మర్తువులోవలె తీక్ష్ణసూర్యాతపములచేత నేలను మండించును. గ్రీష్మర్తువులో వర్షములు కురియును. ఈ ఋతుసంకరము కాలానుగుణ్యమో, జ్యోతిషవిద్వాంసుల లెక్క తప్పో?

ఆ నాఁడు సాయంకాలము గిరిక స్వామియాలయమునకుఁ బోవుటకు బయలుదేఱినది. రత్నగిరి పొడుగైన మల్లెపూవులజడ వేసి చుట్ట చుట్టినది. చుట్టినజడఁ కుబుసపుపై పొరయూడిపోయి లోని తెల్లనిపొర మిగిలిన పాముచుట్ట చుట్టుకొన్నట్లుండెను. గిరిక నడచి యరుంధతికడకుఁ బోయెను. అరుంధతి జడచుట్టఁ జూచి 'ఏమమ్మా! జడ చాలనందముగా వేసితివే' యనెను. గిరిక 'బాగుగా నున్నదా' అనెను అరుంధతి "నల్లత్రాఁచు చుట్టచుట్టుకొనిపండుకొన్నట్లున్నది" అనెను. గిరిక 'కాళియాహివలె నున్నదా?' అనెను. అరుంధతి "స్వామి విషమూర్తియైన నీతనూశృంగారసరసిలో దుమికి యా కాళియాహిని మర్దించుచులే" యనెను. గిరిక 'యేమి వదినెగారవమ్మా! అనెను. అరుంధతి 'విష మనఁగా, నీ రని యర్థము.' గిరిక 'అవును. ధర్మన్న చెట్టపట్టి యంతమాత్రము తెలియుదా?' అరుంధతి 'వేణుగోపాలదేవుఁడును మీఁయన్నగారికన్నఁ జెడిపోయినాఁడు. నీకున్నంత గడుసుదనము నా కెక్కడనుండి వచ్చును?' ఇంతలో రథంతరి వచ్చెను. అరుంధతి 'అక్కా! నీకు వేయేండ్లు! మఱఁదలిని జూచితివా?' రథంతరి 'ఆ, ఆ- చూచితిని ఈచీర యెచ్చటిదమ్మా నీకు? చుక్కలుచుక్కలుగా నుండి పొడలపామువలె నున్నది. ఇప్పుడు నీవెట్లున్నావో చెప్పుదునా? కాళియమర్దనచేసినస్వామిని ప్రార్థించుచున్న

యతనిభార్యవలె నున్నావు. పతిప్రసాదముకొఱకు వారు స్వామిని బ్రార్థించిరి. అన్నట్లుగా నీవును స్వామిని పతిప్రసాద మిమ్మనియే కదా యడుగుచుండుట?' గిరిక 'నే నేమోకాని మీరిద్దఱుమాత్రము నేఁడు శ్లేషమిష చేత రెండునాల్కలుగలపాఁపడుచులవలె నున్నారు.' అరుంధతీరథంతరు లిద్దఱును నొకరివంకనొకరు చూచుకొని, రథంతరి 'చూచితివా? మఱఁదలు మునుపటివలెఁ గాదు. కొంచెము గడుసెక్కినది. గడుసులలో గడుసు. గోపన్న చేయి తగిలినతరువాత మనపిల్ల మనది కాదు.' గిరిక మొగమునందు దీనురా లయ్యెను. రథంతరి దగ్గఱకుఁబోయి యామెను గౌఁగిలించుకొని 'భలో క్తిగా నీవు నంటివి. మేము నంటిమి. కోప మెందుకమ్మా' యనెను. అరుంధతి అది కోపముకాదమ్మా! నీచేత బతిమాలించుకొనుటకే యట్లు చేసిన' దనెను. గిరిక యరుంధతివంక మొగలిముల్లువలెఁ జూచెను. అరుంధతి 'నే నేమి రాతివిగ్రహమునా, నీ చూపులకు బెదరిపోవుటకు? పోయి గుడిలోనున్నాఁడా పిచ్చివాని నాడించుము. నీ చూపుల కతఁడు బెదురునేమో! నేను కా' దనెను. రథంతరి నవ్వెను. అరుంధతి నవ్వెను గిరిక నవ్వెను. ముప్పురును దేవాలయములోనికిఁ బోయిరి. సరోజలమునఁ బాదప్రక్షాళనముచేసి, ప్రదక్షిణీకరించి, స్వామిసన్నిధి కేఁగిరి. గిరిక కపోతముద్ర వేసెను; వేసి -

'దేవ కురు శిక్షాం దేహి పతిభిక్షాం,
దీనపరిపాలనాయ స్వీకురు దీక్షాం'

అని ముఖారిరాగముమీఁద నాగపత్ని కా తరంగమును బాడెను.

'జాతికులశరణ మశేషజంతుతరణం
జాతం భవతా కృత మీ త్యాగమవిదితం ॥ దేవ॥

అని దేవదాసి తన కులమాలిన్యమును గడిగివేసినట్లు గానము చేసెను.

'సర్వజంతు సమతా, సాధు! తవ విదితా
సర్వబుద్ధిషు ప్రహితా సాచ వేదవిహితా' దేవ॥

అని పాడి తా నెంత నీచజాతిసముత్పన్నయైనను భగవంతుఁడు సర్వజంతుసముఁడగుటచేత నది వేదవిహితముకూడ నగుటవలనఁ దన

యందు దయఁ జూపించవచ్చునన్నట్లు దీనదృష్టియై భగవంతుని ప్రార్థించెను. ఆమె నిస్తబ్ధయై నిలుచుండెను. అరుంధతీరథంతరులు గిరికతోఁ గలసి యాలయమునకువచ్చి చాలదినములైనది. అదివఱకు గిరిక దేవాలయమునఁ బాటలుపాడుటయు నభినయముచేయుటయు లేదు. వా రప్పు డప్పుడు నృత్యసమయములయందు హస్తాభినయములు చూచిరి. కాని గిరికయభినయ మంతసుమనోహరముగానున్నది వారు చూడలేదు. కపోతముద్రయందు బొట్టనవ్రేలును, చివరి వ్రేలును వదలిపెట్టి, తక్కినమూఁడువ్రేళ్లు దగ్గఱగా నొక్కి, చివరి వ్రేళ్ళు దూరముగాఁదీసి, చేతులు దొన్నెలవలె నమర్చి, బొట్టన వ్రేళ్ళు దగ్గఱకులాగినమూఁడువ్రేళ్ళ మొదట నమర్చి, హస్తములను బార్శ్వసంగ్రహముచేయుటవలన నామెచేయి నొక్కుఁబడ్డ యెఱ్ఱ తామరపూవు వికసించిన ట్లుండెను. వదలిన చివరివ్రేళ్ళు రెండును గలసి యడుగుననున్న పచ్చరేకొకఁడు జాఱినట్లు కనిపించెను. ఆ చేతులు ముద్దుతనమేమని చెప్పవలయును.' చివురుజొంపమువలెఁ, బవడములకుప్పవలె, బంగారుగిన్నెవలెఁ జేయిచూచినకొలంది హృదయాభిరామ మయ్యెను. గిరిక చేతులే చిన్నవి. వ్రేళులు పొడుగై పోనుపోను చివరకు సన్ననై యుండును. అసలే యెఱ్ఱనైన చేతులకు నామె కుంకుమ మలందును. వెంపటి వేంకటనారాయణగారు భామ వేషమువేసినప్పుడు చేతులకుఁ గుంకుమ మలఁదుకొందు రఁట ఆయన యది రత్నగిరికి నేర్పెను. రత్నగిరి కూతునకుఁ దెల్పెను. దేవదాసి యొడలంతయుఁ బునుఁగుజవ్వాది వాసనలకుప్ప. ఆమె నడచుచున్నప్పుడు కస్తూరిమృగము నడచుచున్నట్లే; నడకమాత్రము రాయంచ నడచినట్లు.

ఇంతలో ధర్మారావు దేవాలయములోనికి వచ్చెను. అరుంధతీరథంతరు లొడ్డుకొనిరి. అతఁడు 'గిరిక యేమి చేయుచున్నది?' అన్నాఁ డరుంధతిని జూచి. అరుంధతి గొందిగి సిగ్గుపడి 'పతిప్రసాద మడుగుచున్న' దనెను. గిరిక యర్ధనిమీలితనేత్రయై స్వామివిగ్రహమువంకనే చూచుచుండెను. అర్చకుఁడు శఠగోపమిచ్చి ప్రసాదమిచ్చెను. అందఱును ముఖమంటపమునందు వచ్చి కూర్చుండిరి. కొంతసేపు కూర్చుండి తోడికోడండ్రిద్దఱును వెడలిపోయిరి. అన్నా

సెల్లెండ్రు పోయి సరస్సోపానములమీఁద నాసీనులైరి. వెన్నెలలు వచ్చెను. పవలెల్ల నెండగాసిన వెచ్చఁదనము భూదేవి బయటి కూఁది వేయుచున్న దన్నట్లు వెచ్చనగాలులు వీవఁసాఁగెను. ధర్మారావు తనయుత్తరీయమును సరస్సులోఁ దడిపి పిండి యాకొనలచేత మొగము చేతు లద్దుకొనుచుండెను. దేవదాసి తన చేతులు సరస్సులోఁ గడిగెను. చేతు లుంచినమేఱ జల మెట్టుఁ బడెను. వెన్నెలలో నామెట్టుని జలము హరినీలకాంతివలెఁ దోఁచెను. ధర్మారావు 'గిరికా! ఎన్నాళ్లైనది! మన మిద్దఱమును దేవాలయములోనికి వచ్చి.' గిరిక మాటాడలేదు. ధర్మారావు 'కోపము వచ్చినదా?' గిరిక – 'నీకు నామీఁదకన్న చిన్న జమీందారుమీఁద నెక్కువప్రేమ. నాకుఁ జదువు చెప్పుటకు నీకు వీలు చిక్కలేదు గాని హరప్పనాయనికిఁ జెప్పుటకు వీలు చిక్కినది.' ధర్మారావు 'తల్లీ! నీకు నే నేమి చెప్పవలయును? అభినయ మేమో నీకు మీయమ్మగారే చెప్పుచున్నది. అన్ని చదువులకును బర్యవసానమైనచదువు నీకు పుట్టుకతోనే వచ్చినది. హరప్పనాయనికిఁ జదువు చెప్పుచున్నది నీ కోసమే కదా!' గిరిక 'నా కోసమేమిటి? ధర్మారావు 'నీ కోస మనఁగా దేవునికోసము. దేవునికిఁ గల్యాణము కోసము.' గిరిక సిగ్గుపడెను. ధర్మారావు తనలో 'అది యీమెకుఁ గల్యాణమా?' యనుకొనెను. చంద్రు డాకాశమున సాఁగి వెన్నెలలు మఱియుఁ దెల్లనయ్యెను. ధర్మారావు 'నీ చదువెంతవఱకు వచ్చినది?' గిరిక—'లీలాతరంగిణి యంతయుఁ జెప్పుకొంటిని. గీతగోవిందము పఠించుచుంటిని. అభినయము చాలదూరమైనది. హస్తముద్రలన్నియుఁ బట్టఁగలను. నాయికాభేదములన్నియు తత్తన్నియత సాత్త్విక వ్యభిచారి భావములు సమగ్రముగాఁ దెలిసికొంటిని. వానినన్నిటిని సుష్ఠుగా నభినయించఁగలను. ధర్మారావు 'అన్నిహస్తముద్రలకుఁ దల్లి యేది? గిరిక 'పతాక.' ధర్మారావు 'పతాకను సరిగా విన్యాసముచేయుము. తక్కినహస్తములు నీచేతిలో నున్నట్లే. చిన్నప్పుడు నాయనగా రనుచుండెడివారు. పతాకము సరిగాఁబట్టగల వారాంగనయే నాకుఁ గన్పించలేదని. అందులో నేదియో దోష ముండునఁట అసలు సరిగా పతాకపట్టినచోఁ దన్ముద్రికుఁ దగిన హస్తమున్నఁగాని యా ముద్ర చక్కఁగా రాదఁట.

పద్మినీజాతి స్త్రీ యైనచో నామె యా ముద్ర పట్టినచో నది యందముగా నుండు నట. అప్పటి రామణీయకము మఱియొకప్పుడు లేదఁట కూచిపూఁడివారిచేత నేను చాలసార్లు పతాక పట్టించితిని. నాకది నచ్చలేదు.' గిరిక 'యిదిగో నేను పట్టెదను చూడు'మని యామె పతాకముద్ర పట్టెను. ధర్మారావున కది ఱెక్కలుచాచిన గరుత్మత్కిశోరమువలె నుండెను. అతఁ డాశ్చర్యపడెను. అతఁ డనుకొనెను: మాగిరిక పద్మినీజాతి స్త్రీ కాఁబోలు' నని. అతఁడు పైకనెను. 'తల్లీ! విద్య పూర్వజన్మసంస్కారాత్తము. చెప్పినమాత్రము వచ్చునా? గురువు విద్యను ప్రాజ్ఞునియం దెట్లో జడునియందట్లే చల్లును ఒకనికి శక్తి నియ్యఁడు. మఱొకని శక్తి యపహరించఁడు. వీఁడు పండితుఁడగుచున్నాఁడు. వాఁడు మూఢుఁ డగుచున్నాఁడు. మెఱుఁగుపెట్టిన లోహము ప్రతిబింబము నిచ్చుచున్నది. మట్టికుండలోఁ బ్రతిబింబము కన్పించదు. గిరిక సన్నని రేఖవలె లజ్జాభావమున గనఁబడెను. ధర్మారావు 'అఱువది యేను హస్తముద్రలను జక్కఁగా బట్టఁగలవన్న మాఁట.' గిరిక 'అన్నా! ఈ ముద్రలు విద్యాస్వరూప మన్నమాట నిజమే. ఇవి యెందు కేర్పఱచిరో నాకుఁ దెలియలేదు.' ధర్మారావు గిరిక ప్రశ్న కానందించెను. అతఁడు సమాధానము చెప్పెను: 'మనోభావములను బహువిధములుగాఁ దెలియఁజేయవచ్చును. ప్రధానమైనది భాష; అట్లే ముఖావయవములు, శరీరవిన్యాసము, కరచరణములు-వీనితోఁగూడ భావప్రకటన చేయవచ్చును. ఈ భావప్రకటనయంతయు దోషసహితమై యుండును. మాటాడుచుండఁగా మనము రెండురకముల దోషము చేసెదము. ఒకటి యనౌచిత్యము, రెండవ భ్రంశము. అపభ్రంశము లేకుండ వాక్కును శాసించునది వ్యాకరణశాస్త్రము. అనుచితము లేకుండ శాసించునది యలంకారశాస్త్రము. అట్లే భరతశాస్త్రము చరణాద్యవయవవిన్యాసమును శాసించును. ముద్రలు హస్తాభినయమును శాసించును. అనఁగా ముద్రలు దోషరహితమైన కరకృతభావప్రకటన మన్నమాట.' గిరిక 'ఈ హస్తములకు వినియోగము నృత్యమునందే కాని నాట్యమునందు లేదఁట కదా!' ధర్మారావు నృత్యమునం దున్నంత నాట్యమునందు లేని మాట నిజమే. కాని వీని నెఱుఁగనివారు పూర్తిగా నాట్యమునందు

సమగ్రులు కారు. కొన్నికొన్నిచోట్ల నాట్యమందుకోలేని చోట్లు కలవు. అచ్చట భరతశాస్త్రజ్ఞానములేనిచో సాగదు. ముద్రారాక్షసములో 'పసాదారోహణం కృత్వా' యని యుండును. 'ప్రవేశ యభినీయ' అని మఱియొకచోట నుండును. విక్రమోర్వశీయమున నొక యంకమంతయు భరతశాస్త్రముమీఁదనే యాధారపడి యున్నది. సంస్కృతనాటకము లన్నింటిలో నెచ్చటనోయొకచోట భరతశాస్త్ర ప్రసంగము లేకపోలేదు. మాళవికాగ్నిమిత్రమున నాట్యపరీక్షయే కలదు. ఇప్పటినటకు లేమి చేయఁగలుగుదురు? దుష్యంతునిముందు పార్శీడాన్సులు చేయుదురు. అయినను మనకు నాట్యముతో నేమి పని?' గిరిక 'ఏల లేదు.' ధర్మారావు 'నే ననుచున్నది నేఁటి నాటకములతో నేమి పని' యని. గిరిక యాకాశమువంకఁ జూచెను. చంద్రుఁడు ముత్యములు చేటలోఁబోసి చెఱుఁగుచుండెను. లేఁతగాలికి బుప్పొళ్ళుతూలివచ్చి చెఱుఁగుచున్న ముత్యములచుట్టునున్న మాలిన్యము మీఁదఁబడుచున్న ట్లుండెను. ఇర్వురును గలసి బయలుదేఱిరి. గిరిక నింటివద్ద దిగఁబెట్టి ధర్మారావు వెనుకకుఁ దిరిగెను. గిరిక 'అన్నా! లోనికి రాఁగూడదా?' ధర్మారావు 'తల్లీ! నా కంతశక్తి లేదు.' గిరిక 'నీవే విద్యాగురువవు.' ధర్మారావు 'శ్రీ శంకరభగవత్పాదులకు గోవింద భగవత్పాదులు గురువులు. ఇరువురిలో నెవరు గొప్పవారు?' గిరిక 'గురువే' ధర్మారావు 'లోకదృష్టికి.' గిరిక లోనికిఁబోయెను. ధర్మారా వింటికి వచ్చెను. ఒడలంతయు నుక్కబోసిన ట్లున్నది. స్నానము చేయుదు ననెను. అరుంధతి యున్నది; 'ఒడలు తడిగుడ్డతోఁ దుడుచుకొనుఁడు. స్నానము సేయరాదు.' ధర్మారావు తడిగుడ్డతో నొడలు తుడుచుకొనెను. రాత్రి యారుబయట సతీపతులు శయనించిరి. సావిత్రమ్మగారు దొడ్డిలోఁ బండుకొనెను. ధర్మారావు 'స్నాన మేల చేయరా దంటివి?' అరుంధతి 'గిరిక పవిత్ర శరీరవాయువులు మీమీఁదఁ బ్రసరించినవి. అందు కని వల దంటిని.' ధర్మారా వరుంధతిని గాఢపరిష్వంగ మాచరించెను? అరుంధతి 'మీకు వేణుగోపాలస్వామిమీఁద నెక్కువయభిమానమా? నాగేశ్వరస్వామివారిమీఁదనా?' ధర్మారావు 'నాకు సుబ్రహ్మణ్యేశ్వరస్వామిమీఁద నభిమానము.' అరుంధతి 'ఆయనకు వేయిపడగ

లున్న వనియా?' ధర్మారావు 'అన్నియుఁ బోయినవి. మిగిలినవి రెండేపడగలు.' అరుంధతి 'అవఁగా?' ధర్మారావు 'నీ వొకపడగ, నే నొకపడగ. నీవైన పడగ చూచితివా అరుణారుణ కపోలమై, అరుణాధరమై, తాంబూలారుణితజిహ్వమై, యకారణకోపరాగ వత్సహజారుణ నేత్రాపాంగమై, కుంకుమతిలకపరివ్యాప్తరక్తచ్ఛాయమై సుతిమెత్తని దగుటవలన సర్వావయవములును బరిష్వంగమాత్రముచేత నలిగి యెఱ్ఱనగుటవలన రాగచ్ఛటాశరీరాంచలమై యెంతమనోహరముగ నున్నది! ఏ దేండ్లైనది, ఈ మాణిక్యరాశి నావైపున కొఱఁగి; నాతనువు పులకించినది. నాయాత్మలోఁ గామధేనువుపయోధారలు పితికినది. మఱింకెన్నాళ్ళు నా కీతృప్తి! స్వామి రెండుపడగలైనను జిరస్థాయిగా నుండునేని నా కంతియే చాలును. వేయిపడగలు రూపముచేత నశించినను బరిశోధనచేసినప్పుడైనఁ దెలియక మానవు. స్వామి నాల్గుపడగలు నిలచియే యుండెను. అవి కట్టెల వలెనై నిశ్చలములై పనిచేయుచున్నవి. స్వామి యొక్కపడగతో నుండఁడు. నాకు దానియందుఁగూడ విశ్వాసము పోవుచున్నది. రెండుపడగలతో నున్న స్వామిమాత్రమే మిగులునట్లు తోఁచెడివి. నీవైనపడగయొక్క మనోహరత్వము మానదు.' వాకిటిముందు మేయుచున్న యావు కసిక్కున తుమ్మెను. ధర్మారావు 'ఆహా! ఇది యైన నిల్చుననుకొనుచుంటినే. ఇది యేమి యపశకునము? అట్లయినచో నేను బ్రతికి యెందులకు? ప్రక్కనున్న రావిచెట్టు మీఁద పైఁడిగంట దంపతులు గలసి కిలకిలా రావములు చేసెను. ధర్మారావు 'మఱల నీ శుభశకున మేమి? ఈపడగ నశించిపోయి మఱల నుజ్జీవము పొందునా? నశించిపోవుట యేమిటి?' ధర్మారా వరుంధతివంకఁ జూచెను. ఆమెకు నిద్రవచ్చుచున్నదికాఁబోలు! కనులు మూఁతపడెను. అతఁ డామె కపోలస్పర్శ గావించెను. చల్లనిగాలి తిరిగినది కాఁబోలు! కపోలములు చేతికిఁ జల్లఁగాఁ దాఁకెను. అతఁడు తనశిరస్సు నామెహృదయముమీఁదఁ జేర్చెను. విగతకంచుకమైన యామె వక్షఃస్థలస్పర్శచేత నతనికపోలము లుత్పులకము లయ్యెను. రేనడుజాము గడచెను. ఆకాశమధ్యగతుఁడైన చంద్రభగవానునినుండి తెల్లనిదారములు జలకోలాటమాడుట కేర్ప

ఉపఁబడి వెంకిబిళ్ళ సందునుండి స్త్రీలు పుచ్చుకొనుజడపాయలవలె వ్రేలాడసాఁగెను. ఒక మహారత్నమునుండి కాంతులు దశదిశావ్యాప్తములైనట్లు చంద్రునినుండి వెన్నెలలు వెలికి రాసాఁగెను. వాయువీథుల సందుసందులఁదూఱి, వెచ్చనిగాలిని జల్లవఱచి మలయపర్వతాగతసమీరకుమారునకుఁ దెల్లనివలిపుటుత్తరీయము కప్పినట్లు వెన్నెలలసొగసు ముడుతలువడెను.

మఱునాఁడు ధర్మారావు ప్రొద్దుననే లేచి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి యాలయమునకుఁ బోయెను. అచట గణాచారి యుండెను. గణాచారి ధర్మారావును జూచి 'మిగిలిన వెన్ని?' యనెను. ధర్మారావు 'కనఁబడుచునే యున్నవికదా, రెం' డనెను. గణాచారి 'యందులో నొకటి మాసిపోయినది. దానికి మఱల నాకృతి తేవలయును.' ధర్మారావు తనలో 'నిదియా యా యర్థ' మనుకొనెను. అతని గర్భగోళమునుండి యొకవిషాదతరంగము లేచి నాభివద్ద సూది పొడిచినట్లు పొడిచి, హృదయముదాఁక పొడిచి, హృదయ మావరించి, దాని కచేతనత్వ మాపాదించి గొంతుకవఱకు నెగఁదట్టెను. మహానుభావుఁడైన ధర్మారా వా దుఃఖవీచికను శివుఁడు హాలాహలమునువలె కంఠగోళమున గదించెను. అదియు నటు నిటు పోలేక యందే తిరుగుళ్ళు వడుచుండెను. గణాచారి చూచినది. 'ఇంక పది యేండ్లమాట' యన్నది. ఇరువురును స్వామివంకఁ జూచిరి; అనంతుడీ యాకారమేలఁ దాల్చవలె? ఇట్లు బాధాకుటిలత లేల పొందవలె? మాయ భగవంతునకు లీల కావచ్చును. మాయాసంపిహితులైన తమకుఁ బ్రాణములమీఁద కూర్చున్నది. పిల్లికిఁ జెలగాటము నెలుకకుఁ బ్రాణసంకటమన్నట్లున్నది. గణాచారి ధర్మారావులు కలసి దారివెంటఁ బోవుచుండిరి. ఒక పంచముఁ డెదురుగా వచ్చుచుండెను. గణాచారి తొలఁగిపోఁబోయినది. అతఁడు మఱియు సమీపమునకు రాఁబోయెను. ధర్మారావు వానితో 'ఒక్క పది యేండ్లాగుము. అప్పుడు గణాచారియే యుండదు. అప్పుడు మనమందరమును గలసి దేవాలయములోనికే పోదము. స్వామి కప్పుడు గణాచారి ప్రసక్తి యుండదు. మూలమైన బీజాక్షరపీఠమున శక్తియప్పటికి సమూలముగా నశించును. నేను నీవాఁడను. పద' మనెను. అతఁనికి తెలియ

లేదు. ధర్మారావువంక వెఱ్ఱిమొఱ్ఱిగాఁ జూచుచు నతఁడు దూరదూరముగాఁ బోయెను. మఱల గణాచారి ధర్మారావులు కలసి పోఁజొచ్చిరి. దూరమున బసిరిక కనిపించి తొందరతొందరగా నడచిపోయెను. గణాచారి 'గ్రామములో మెట్టపొలము మిగిలినట్లు లేదు. ఊరంతయు పల్లమైనది.' ధర్మారావు 'ప్రాగ్దిగ్భాగమునఁ గొంతయున్నది. గణాచారి 'అవునతఁ డాదిక్కున నుండియేకదా వచ్చుచున్నాఁడు;' ఇద్దఱు మఱికొంతదూరము నడచిపోయిరి. దారిలో శివరావు కనఁబడెను. గణాచారి వెంటవచ్చుచున్న ధర్మారావును జూచి యతఁడు కలవరపడెను. శివరావుమనసులో 'నీ నాగరకుఁ డేమి? ఈ జానపదురా లేమి? ఈ ప్రపంచకవేత్త యేమి? మూఢవిశ్వాసము గల యీ గణాచారి యేమి? నవనాగరకతలక్షణములు గల యీ పురుషుఁ డేమి? ఆటవికురాలివంటి యీ స్త్రీ యేమి' యనుకొనెను. ధర్మారా వూహించెను: 'గణాచారి దేవతాస్వరూపురాలు. నేను మనుష్యుఁడను. ఆయమ లింగభేదజ్ఞానమున కతీతురాలు. నేను పురుషుఁడను. ఆమె ప్రకృతి కచ్చమైనబిడ్డ. నేను వికారమూర్తిని.' ఇరువురును గలసి మఱికొంతదూరము పోయిరి. దేవదాసి యెదురుగ వచ్చుచుండెను. దేవదాసి గణాచారికి నమస్కరించెను. గణాచారి కన్నులరమూసి, నోరు కుదించి, పరిహాసపు సమాదరణపు వికృతపు చేఁతనవ్వునవ్వి తలయూడించెను. దేవదాసి సిగ్గుపడెను. ధర్మారావు 'అమ్మా యెచ్చటికి?' గిరిక 'అచ్చటికే.' ధర్మారావు 'ఎండ యెక్కినది భోజనముచేసితివా?' గణాచారి 'అచ్చటఁ బాలు పెరుఁగు దొరకవా?' గణాచారి పరియాచకమాడుట కిది మొదలు. ధర్మారావామెను నివ్వెఱవోయి చూచెను. పూర్వము గణాచారి బ్రహ్మమయమూర్తివలె నుండెడిది. ఇప్పు డామె త్రిగుణములు విభాగించుకొన్న మూర్తివలె నుండెను. ఆమెయెడమకన్ను కొంచెము నీలిమవర్ణమును పొందెను. మూఁడవగుణమే వృద్ధిపొందున ట్లున్నది. ఈ పరమసాత్త్వికమూర్తికి వికృతి యేల ధర్మారావు? మఱలఁజూచెను. ఆమెయంతస్సు వినిర్మలమై రాజహంసవలెఁ బ్రకాశించుచుండెను. ఓహో! ఇవి బహిశ్చిహ్నములుమాత్రమే! మఱలనిరువురునుగలసి నడచుచుండిరి. హరప్ప దక్షిణదిక్కునకు వాహ్యాళిపోయి నడచివచ్చుచుం

డెను. యువరాజునకుఁ బనునాలేండ్లు వచ్చినవి. ఆయనబుగ్గలు పూడియున్నవి. శరీరచ్ఛాయపండినగేదంగిరేకునుబరాచికము సేయుచున్నది. కట్టినపంచె ముఖములుచెప్పుమీఁద జరీయంచులతో నృత్యము సేయుచున్నది. ఆయన ధర్మారావును జూచి వినయముచేత నమస్కరించినట్లు తలయు, మూఁపులును వంచెను. ధర్మారావు వెనుకముందులు చూచెను. ఎవ్వరును లేరు. ధర్మారావు 'ప్రభువుగారూ! ప్రొద్దెక్కి వచ్చుచున్నారే' యనెను. హారప్ప 'ఆమెతో నేనెన్నడును మాటాడలేదు. ఆమెకు నానమస్కారములు చెప్పుఁడు.' గణాచారి విన్నది. ఆమె మొగము పరిదీనాకృతిఁ దాల్చినది హృదయములో నానందరేఖ యాడుచున్నది. హారప్ప దుర్గాభిముఖుఁడై పోయెను. ఇరువురును మఱలఁ గలసిపోవుచుండిరి. రామేశ్వర మెదురుగా వచ్చుచుండెను. మారీచసముద్రాంతఃపతనవేళ శ్రీరామమూర్తిధనుస్సు బిట్టుగా నుభయకోటిపరామర్శ మగునట్లుగా సమాకర్షింపఁబడినట్లు గణాచారి భ్రూయుగము భయదకుటిలవర్తనవికృతమై దానితొలఁగి యామె యొకసందునఁబడి పోవుచుండెను. ధర్మారావు రామేశ్వరమును నిలుచుండి చూచుచుండెను. రామేశ్వరము జరుగుచున్నదంతయుఁ జూచుచునే యుండెను. అతఁడు తన్నుగాదన్నట్లుప్రక్కగా నడచిపోయెను. అతఁడు పోయినంతమేఱ ధర్మారావు చూచెను. ధర్మారావనుకొనెను: 'నడచినంతమేఱ చూచితిని. ఇట్లు పోయినాఁడని చూచుటయేకాని, యతని నాఁపగలిగితినా? నన్నతఁడును జూచుచునే లెక్కలేకుండఁబోయెను. ఇప్పు డతఁడెక్కడ, నేనెక్కడ! గణాచారి కతఁ డెంతదూరముగా నున్నాఁడో, నేనంత దగ్గఱగా నున్నాను. నేను గణాచారికి దగ్గఱనుండి యేమి లాభము? గణాచారి శక్తి యేమో యుడిగిపోయినది.' ధర్మారావొక్కఁడు నెండలో నిలుచుంటినని తెలిసికొనెను. ఎండ శిరోభాగమున మలమలమాడ్చెను. కాలము వసంతము. ఆతపములకుఁ దైక్ష్ణ్యము గ్రైష్మ్యము. ధర్మారావు తిరిగి గృహమునకుఁ బోయెను. సావిత్రమ్మగారికిఁ దలనొప్పిగా నుండి పండుకొన్నది. అరుంధతి వంటచేసినది. భర్త ప్రొద్దునే బయలుదేఱిపోయినాఁడు. ఇంతవఱకు రాలేదు. వంటయేమో చేసి తాను కూర్చున్నది. భర్త యెచ్చటికిఁ బోయియుండును? రంగా

పురము వెళ్ళెనా? రంగాపురములో నెవ్వ రున్నారు? తనపెట్టె తీసికొని వచ్చుటకు వెళ్ళెనేమో? ఆ పెట్టెలో రంగాజమ్మగారు పెట్టిన చీర యున్నది. ఆ చీర తాల్చవలయు నని తన కెంత యున్నది.! మఱల నటువంటి చీర దొరకదా? అయినను దా నిప్పుడు ఖద్దరే ధరించుచుండిరిగదా! ఉప్పాడచీర నిప్పుడు కొనుమన్నచో ధర్మారావు కొనఁడే. విదేశపుచీరమీఁద తన కంత ప్రేమ యెందులకు? అది విదేశపుచీర కాదు. రంగాజమ్మగారు పెట్టినచీర యది. ఆ చీర యిన్నాళ్లు పెట్టెలో చిమ్మటలు కొట్టక, పాడైపోక యున్నదా? ఆహా, యేమి తల్లిదండ్రులు! తన్నుఁ జూచుటకైన రాలేదే! తన తమ్ముఁ డెట్లున్నాఁడో! అతని కిప్పుడు పదునూఁడు పదునాలుఁ గేండ్లుండును. అన్నిటికన్న చిత్రము రెండుకోసులదూరములోనుండి యొక రొక రెప్పుడును గనిపించనైనఁ గనిపించకపోవుట. కుమారుఁడుపోయినతరువాత రాజ్యలక్ష్మమ్మగారు మంచము పట్టినదఁట. ఆమె కెట్లున్నదో? తనకుఁ దనభర్తకు మహానురాగము కలిగించినవి రెండు: ఒకటి రాజ్యలక్ష్మమ్మగారు, రెండు రంగాజమ్మగారు పెట్టిన చీర. ఆమె యేమో మంచానఁబడినది. చీర చిమ్మటలపాలఁ బడి యుండవచ్చును. ఆహా! తనప్రేమ యింకెన్నాళ్ళు నిలుచునో? రాజ్యలక్ష్మమ్మగారు చనిపోవునో? పోయినతర్వాతఁ దనప్రేమ యింకను నిలుచునా? నిలువక యేమి యగును? తాను పోయి పుట్టినింట నుండునా? ఆ యూహలో నరుంధతికి నవ్వు వచ్చినది. నవ్వు వచ్చినంతలో ధర్మారావు వచ్చెను. అతఁడు 'గుడ్డిదానా! రేఁగుచెట్టు లేకుండ నవ్వెదవే'యనెను. అరుంధతి 'లేకయేమి! మీరున్నారుకదా' యనెను. ధర్మారావు 'నీలో నీ వేమో యనుకొని నవ్వుకొనుచుంటివి. నేను లేనప్పుడును నీకుఁ జక్కఁగాఁ గాలముగడుచునుగదా! నన్నెప్పుడు నింటివద్ద నుండుమని పోరుపెట్టెద వెందుకు?' అరుంధతి 'రంగాపురముబోయి పెట్టె యెప్పుడు తెత్తురు!' ధర్మా 'ఇదియొక క్రొత్తపల్లవి మొదలుపెట్టితివి.' అరుంధతి 'ఆయూరు మనమిద్దఱముకలసి పోదము.' ధర్మారావు 'ఇది బాగుగా నున్నది, నేను దొంగతనముగా నాభార్యను దెచ్చుకొంటిని. నిన్ను వెంటబెట్టుకొని నే నచ్చటికిఁబోయినచో దొంగ

సొమ్ముతోసహా దొరికినాఁ డని వారు నామీఁద నభియోగముచేసి నచో నే నేమి జేయుదును?' అరుంధతి 'పరాచికములకుఁ గాదు. మూఁడేండ్ల నుండి రాజ్యలక్ష్మమ్మగారిని జూచివత్తమని యనుకొనుట, చూచి రాలేకపోవుట. అన్నిరోజులు నట్లే గడచుచున్నవి.' ధర్మారావు 'ఒకసంగతి జరిగినది. రాజ్యలక్ష్మమ్మగారియింటిలో జోస్యు లని యొకబోర్డుస్కూలుమాస్టరు కాఁపుర ముండెను. రామేశ్వర మున్నాఁడే, యెఱుగుదువా?' అరుంధతి 'అవునవును, శిశుపాలుఁడా?' ధర్మారావు 'అవు నతఁడే! ఆయన తాలూకాబోర్డు ప్రెసిడెంటు. ఆ జోస్యులభార్యకుఁ బ్రెసిడెంటుగారికి దుర్వృత్తి గలిగెనఁట. జోస్యుల నీ యూరు బదిలీచేసి శిశుపాలుఁడు తనదుర్వ్యవసాయమును సాగించుచుండఁగాఁ బాపము జోస్యుల కది తెలిసి దుఃఖించి శత్రువు నేమైనఁ జేయ సామర్థ్యముచాలక భార్యను బుట్టినింటికిఁ బంపివేసెనఁట. ఇంకొక పదిరోజులలో సెలవులై పోవును. జోస్యులు మఱల వచ్చును. రామేశ్వరము జోస్యు లత్తవారింటికిఁ బోయిఁ దనయల్లుని నభివృద్ధిలోనికి తెచ్చినవాఁడుగా వారిచేత గౌరవింపబడి, వారికీ సంగతి తెలియదుగనుక యేదో కొంచెము కోపము వచ్చి భార్యను దండించెనేకాని వేఱుకాదనియు, మఱలఁ బాఠశాలలు తెరచినవెంటనే మీ కెందుకు, పిల్లను దీసికొనివచ్చి దిగఁబెట్టి మీదారిని మీరు వచ్చివేయుఁడు. తక్కినవ్యవహారము నేను చేయుదుగదా యనియుఁ జెప్పివచ్చెనఁట. వీరి దుర్మార్గత యెట్లు పర్యవసించునో తెలియదు.' అరుంధతి 'అయ్యో! పాపము! ఇచ్చటికి వచ్చినతరువాత వారిసంసారము మఱియెంత గగ్గోలుచేయునో! మీరైనను బోయి యామె తలిదండ్రులతో నీ సమాచారముచెప్పి వా రిచ్చటికిఁ బంపించకుండఁ జేయరాదా?' ధర్మారావు 'ఇది బాగుగా నున్నది. నా కిదియే పనియా!' అరుంధతి 'మీ రంత నిర్దయు లేమి?' ధర్మారావు 'దయయు నిర్దయయు నెవరికి? ఇది కష్టమిది సుఖ మనుకొన్నవారికి. నా కేమి నిర్దయ?' అరుంధతి మీ కేమియు సుఖ మక్కఱలేదు, పాపము!' ధర్మారావు 'అక్కఱలేక కాదు. తద్గతభావమునందు పరినిష్ఠ లేదు.' ధర్మారావు స్నానము చేసి భోజనము చేయుచుండెను. అరుంధతి 'నాపెట్టె నెప్పుడు తెచ్చె

దరు?' ధర్మారావు 'నీ వా ప్రశ్న వేసినప్పుడెల్ల నాకు విసుగుగా నున్నది. దానిలో వజ్రము లున్నవా, వైడూర్యము లున్నవా? నీ వెప్పుడైనసరే! ఇదిమొదలొక్క యేడాదివఱకుఁ బెట్టెసంగతి ప్రస్తావించకుండ నుంటివా! యప్పుడు తెచ్చెదను.' అరుంధతి 'నే నెప్పుడును పెట్టెవిషయమే మాటాడుచుందును.' ధర్మారావు 'అట్లయినచో నీకు వేయేండ్లాయుస్సు.' అరుంధతి 'ఏమి టాలెక్క.' ధర్మారావు పరిహాసముగా 'నీ వడుగుచుందువు. నేను తేను. ఏ సంవత్సరము గాదు. ఏ సంవత్సరము గాకుండ మన మెట్లు చనిపోదుము? ఏదో యొకసంవత్సరములోఁగదా మనము చనిపోదుము. నీ వెప్పుడు నడుగుచున్నచో నది యే సంవత్సరమును గాదు. అప్పుడు నీ వమర్త్యురాల వగుదువు' అరుంధతి నవ్వుచు 'పిల్లల కిట్టిచదువా చెప్పునది! వారందఱకుఁ దర్కశాస్త్రము వచ్చినట్లే; బాగుపడినట్టే.'

నాఁడు ప్రొద్దువాటారువేళ దేవదాసి వచ్చెను. అది కృష్ణపాడ్యమి. ఆమె నల్లనియంచుగల తెల్లనిచీర కట్టినది. అది ఖద్దరుచీర. అరుంధతి చూచి 'యది మీబృందావనములో నేసిన చీరయా'? అవ్వ నచ్చట రాటములు మూలఁబడలేదుకాదూ?' యనెను. గిరిక 'కృష్ణునకు—.' అరుంధతి 'ఆపేరు చెప్పుచునే యింత సిగ్గెందులకు?' గిరిక 'ఇందులో సిగ్గేమున్నది? భగవంతునిపే రెవరైనను జెప్పవచ్చును.' అరుంధతి 'అబ్బో! గడుసుదనము' గిరిక 'ఆయన పుట్టిన తరువాతఁ బండ్రెండేండ్లకుఁగాని తల్లిదండ్రులకు బాధలు వదలలేదు. బృందావనములో నాయనపుట్టిననాఁడేమొదలు బాధలు లేకుండుటకు.' అరుంధతి 'దేవకీదేవికన్న గోపికలే పుణ్యాత్ములు.' సావిత్రమ్మగారిమాటలు వినుచున్నది. ఆమె 'దేవకీదేవియే పుణ్యాత్మురాలు. అంతకన్నఁ బుణ్యాత్మురాలు యశోదమ్మ. ఈ తల్లి కొడుకును మోసినబాధయే యెఱుఁగును. ఆ తల్లి ఈ యీబాధ యెఱుఁగక చన్నిచ్చిన సుఖమే యెఱుఁగును.' ధర్మారావు 'అవునుగాని, యాలయములోనికి గిరికవెంట నీవా, నేనా.' అరుంధతి 'నన్నుజూచినచో స్వామి సిగ్గుపడును. గిరికతో సరిగా నుండఁడు. చెల్లెలిసమక్షమున నెవరైన భార్యతోఁ జనవుగానుందురా?' ధర్మారావు మఱి నేనైనచో సిగ్గులేదా యేమి, యాయనకు?' అరుంధతి 'అది మీకుమీకుఁ దెలియ

వలయును.' గిరికాధర్మారావులు దేవాలయాభిముఖముగఁ బోయిరి. ధర్మారావుగారియింటినుండి కోటరోడ్డునఁ బోకుండ స్వామియాలయమునకుఁ బోవుమార్గ మున్నది. ధర్మారావు దారి కోటరోడ్డునకుఁ దీసెను. ధర్మారావు ముందునడచినంతనే గిరిక తనలోఁ దాను జొచ్చెను. ఆమె పాదములే నడచుచున్నవి; 'స్వామికిఁ గల్యాణ మెప్పుడో? అంతవఱకు నే నిట్లే కన్యగా నుండవలయునా? రంగారావుగారు స్వామికిఁ గల్యాణములు చేయుటలేదు. ఆయన మనమతములోననే లేఁడు. ప్రభువునకుఁ గల్యాణమెప్పుడో! ఆ కల్యాణము నాఁడు నే నెట్లుందునో? నేను రాధను, గోపికను, రుక్మిణిని, సత్యభామను. స్వామికిఁ గల్యాణోత్సవమే జరుగవలయునుగాని యాయనకు నే నేమి కాదు. ఆయన కాలిదుమ్మ నగుదును. ఆ స్వామి హస్తాంగుళులు వేణువును మోసిమోసి యలసియున్నవేమో? నే నా వేణువును దీసికొని యాయనవ్రేళ్ళకు విశ్రాంతి కలిగించెదను. స్వామి కల్యాణమునాఁడు ఆలయములోనుండి కళ్యాణమంటపమువఱకుఁ గదలివచ్చునా? ఆ యెఱ్ఱనితామరపూలవంటి పాదములు కందునేమో? కందినచోఁ బాదములే యెఱ్ఱనివి గనుక కందినట్లు తెలియదు. ఏమి సేయవలయును? తెలిసికొనుట యెట్లు?' గిరిక యాఁగి నిలుచుండెను. ధర్మారావు వెనుకనే గిరిక వచ్చుచున్నట్లు తోఁచక వెనుదిరిగిచూచి కొంతదూరమున నిలిచియున్న యామెవద్దకుఁ బోయి:'ఎట్లు తెలియునో నేను చెప్పెదను రమ్మ' అనెను. గిరిక దిగ్భ్రాంతయై చూచెను. మఱల దారివెంట సాఁగిపోవుచుండిరి. గిరిక మఱల తనలోఁదాను జొచ్చెను."దీని కొక యుపాయ మున్నది నేను తెల్లని చీరకట్టుకొనిపోయి స్వామియడుగుంచినచోటనెల్ల వేతును. సన్నని తెల్లని వలిపపుచీరమీఁద స్వామిపాదకాంతులు వ్యాపించును. ఆ వ్యాపించినకాంతులచిక్కఁదనము పలుచఁదనముల చేతఁ బాదములు కందినవో కందలేదో తెలిసికొనవచ్చును. స్వామి యడుగు వేసినచోట నెల్లఁ బుణ్యురాలైన భూమి యుండును. గని; దౌర్భాగ్యురాలైన నా హస్తము లుండరాదా? స్వామిహస్తములు నా చేతులలోఁ దాల్చి, కల్యాణ మండపమునకుఁ దీసికొనిపోయి కూర్చుండఁబెట్టుకొందును. లజ్జలో

నన్ను నేననుకొని స్వామిమొగమువంక నేను చూడలేకపోయెదను. నా హస్తములు తనచరణపద్మములకుఁ దాఁకి స్వామి కపోలములు పులకరించునో! అతని నేత్రములయందుఁ బ్రేమామృతము వెల్లివిరియునో! పాడుసిగ్గు నన్ను చూడనీయదు కాఁబోలు! ఆయన సుప్రసన్నమందహాససుందరవదనారవిందము కనులారఁజూచు భాగ్యము నాకు లేదు కాఁబోలు. లేదే కావలయును. నేను పుట్టిన దెక్కడ! పెరిగిన దెక్కడ? వాంఛించుచున్న దెక్కడ? నా జన్మము కలుషితమైనదా? నన్ను స్వామి యంగీకరించఁడా? ఏల యంగీకరించఁడు? నా తల్లి పవిత్రమైన విద్య చదువుకొన్నది. కులవృత్తి జేసినది. ఆ కులవృత్తిచేఁగూడఁ దక్కినవారివలెఁగాక మహాగౌరవముతో మెలఁగినది. నా తండ్రి మహానుభావుఁడు. వేదవేదాంగములు చదివినవాఁడు. ఆయనయున్న గౌరవము చెప్పరానంత. మఱల నంతగౌరవముకలవాఁడు సుబ్బన్నపేటలో నెవఁడు పుట్టును? నా జన్మ మేమంత చెడ్డది, స్వామి నన్నుఁ దిరస్కరించుటకు? నా తండ్రి సత్రాజిత్తుకన్న జెడిపోలేదే! అతనికి స్వామిమీఁద నొకప్పుడుగాకపోయిన నొకప్పుడైన నవిశ్వాస మున్నది. నాయన్న రుక్మికన్నఁ జెడిపోలేదే! రుక్మి నాస్తికుఁడు. శిశుపాలునకు స్నేహితుఁడు. మా యన్నకు శిశుపాలునకు నేమి సంబంధము? శిశుపాలుఁడు, శిశుపాలుఁడు; పిడుగుపడి చావనైన చావలేదు సాత్త్వికగుణరాశియైన స్వామికిఁ దమోగుణరాశిని నే నెట్లు పనికివత్తును? నా మనస్సు తమోదూషితమై ప్రభుసాయుజ్యము చేరలేకున్నది. ఏమి చేయుదును." గిరిక కన్నులవెంట నీరు కారుచుండెను. ఇద్దఱును దేవాలయములకుఁ బోవుటకుఁ దిరుగవలసిన వీథిదాఁక వచ్చిరి. అది దాఁటి కొంతదూరముపోయినఁగాని గోటుమ్మను లేదు. ధర్మారా వచట నిలఁబడెను. గిరిక తానును నిలఁబడెను. ధర్మారా వచట నైదు నిముసములదాఁక నిలుచుండెను. గిరికయు నిలుచుండెను. ధర్మారా వెవరికొఱకో యెదురుచూచుచుండెను.

సుబ్బన్నపేట పట్టణమై సర్వవిధముల బస్తీకళలు పెంచుకొన్నను పేటనుగూర్చిన పురాతనకథలు సర్వజనములకుఁ దెలియుచునే వచ్చెను. అచట నివాసమున్న మిషనరీలకుఁగూడ దేవాల

యను, కోట, గణాచారి - యీ సందర్భములన్నియుఁ దెలియును. వారు విశ్వసింతురు, విశ్వసించరు. అది వేఱుమాట. సామాన్యముగ నందఱకును దేవదాసి ధర్మారావులసంబంధము తెలియును. అందఱకును దేవదాసికథ తెలియును. ఆమె దారివెంటఁ బోవుచుండినా యొక్కఁడును దలయెత్తి చూడఁడు. ఆ పట్టణములో విమర్శింపఁబడనివ్యక్తులు రెండు: ఒకర్తుక దేవదాసి, మఱియొర్తుక గణాచారి. క్రొత్తక్రొత్త యుద్యోగస్థులు వచ్చుచుందురు. కాలేజీకిఁ గ్రొత్తగ్రొత్త విద్యార్థులు వచ్చుచుందురు. వచ్చిన క్రొత్తవారు దేవదాసినిగూర్చి యేదైనపొల్లుమాట యనినచోఁ బ్రాఁతవా రామె కథ వారికిఁ జెప్పి మఱల నట్లనకుండఁ జేయుదురు. కొందరు 'ఛీ! పో! ఇట్టి కట్టుకథలు ముసలమ్మలదగ్గఱ చెప్పుము. ఈ కాలములో నట్టి వచ్చట నుండును?' నందురు. కొందఱు తుండు తుపాకి యెగురఁ గొట్టి యస లిట్టివిషయములసంభవమునుగూర్చియే నిరాకరింతురు. వారువా రెట్లన నేమి? తక్కినవారు దేవదాసిని గౌరవింతురు ధర్మారావును దేవదాసియు వీథిలోఁ గలసి యట్లు నిలుచుండఁగా నందఱును దూరదూరముగాఁ బోయిరి. కొందఱు తేఱిపాఱఁజూచుచుఁ బోయిరి. సజ్జీకృతమై యొకచోట నిలువలేని యుత్తమజాత్యశ్వము వలె గిరిక నిలుచున్నచోట నిలువలేకుండెను. ఆమెపాదములు దేవాలయములవైపునకుఁ దిరిగియే యుండెను. నిలుచున్న కొంతసేపటికి హరప్పనాయఁడు కోటద్వారమునుండి వచ్చుచుండెను. అచ్చటికిఁ గోటద్వారము వందగజములదూర ముండును. హరప్ప సన్ననిపొందూరుబట్టలు కట్టును. అవి స్వదేశమో, విదేశమో తెలియనివారికిఁ దెలియదు. రంగారావును నాగేశ్వరరావును నవి విదేశవస్త్రములనియే యనుకొందురు. ఆయన తలగుడ్డలేక యెన్నఁడును బయటికి రాఁడు. తెల్లజరీ పట్టుత్తరీయముతప్ప నెన్నడును మఱొక్కటి తలగుడ్డ చుట్టఁడు. పంచయే కట్టును. షరాయి తొడుగఁడు ఏరంగు చొక్కా తొడిగినను పైని రతనాలహారము తాల్చకుండ నుండఁడు. ధర్మారావు కంటికి హరప్పనాయఁడు బాలసూర్యుఁ డుదయించినట్లే యుండును. కృష్ణమనాయని సవయస్కునిగాఁ దనతండ్రియే యెఱుఁగును. కృష్ణమనాయని దనకన్న వృద్ధుఁడుగా, హరప్పనాయని దనకన్న బాలుఁడుగా

ధర్మారా వెఱుఁగును. అతనికి సవయస్కుఁడైన నాయఁడు లేఁడు. అతని ప్రభువు బాలుఁడో, వృద్ధుఁడో హరప్పనాయఁడు దగ్గఱకు వచ్చెను. దేవదాసి కనులుమూసికొని నిలుచుండెను. హరప్పకు పదునాల్గేండ్లు. పదునాఱేండ్లకే యతనిమొగమున లోకజ్ఞుఁడైనవానిముఖలక్షణములు కనఁబడుచుండెను. అతఁడు సర్వదా నడచునేకాని గుఱ్ఱము నెక్కఁడు. మోటా రతనికిఁ బడదు. రెండు మూఁడుసారులు మోటారెక్కి, యొకసారి తలతిరిగి పడిపోవుట, యొకసారి డోకుకొనుట తటస్థించెను. అతఁడు మోటారును జూచి ధర్మారావుతో నొకసారి యనెను: ఇది యేమి జంతువు. తలయుఁ దోఁకయు లేనిది. ఏనుఁగువలె నున్న దనుకొందుమా, మనము దీనికడుపులోఁ గూర్చుండవలయును. ఏనుఁగునకు వెన్నుపైని గూర్చుందుము. ఏనుఁగుఘీంకారము భయమో శ్రవణసుఖమో కల్పించును. వీనికూఁత చెవులకుఁ గఠోర మనిపించును.' హరప్ప ధర్మారావుతో రహస్యముగా 'ఈమె యేనా దేవదాసి. ఈమెను కొన్నాళ్ళక్రిందట స్వామివారియాలయము ముందు చూచితిని. ఆమెయు నన్నుఁ జూచినది. నే నామెకు నమస్కరించవలయునా?' యనెను. ధర్మారావు—'వీధిలో నెవరైనఁ జూతురు, మీరట్లు చేయరాదు.' హరప్ప 'ఎవరు లేనప్పుడు చేయవచ్చునా?' ధర్మారావు 'మీరు జమీందారులు. ప్రభువులు ఎవరికిని నమస్కారము చేయరాదు. అందఱును మీకే చేయవలయును.' హరప్ప 'ప్రతిరోజును మీకు నేను నమస్కరించుటలేదా?' ధర్మారావు నవ్వి 'నేను నమస్కరించుచుంటిని. మీరు నమస్కరించుచుంటి రని యనుకొనుచుంటిని.' హరప్ప 'యవు నవు నని తెల్లపోయెను.' హరప్ప 'దేవదాసికి నేను నిజముగా నమస్కరించెదను.' ధర్మారావు "నిజముగా నిప్పుడు కాదు." హరప్ప 'నే నామెతో మాట్లాడవచ్చునా?' "ఇప్పు డామె యేదో యూహించుచున్నది." ఇప్పుడు పలకరించినఁ బలుకదు" అని ధర్మారా వనెను. హరప్ప "ఈరాత్రి నాకు నిదుర పట్టదు." ధర్మారావు 'మీతల్లిగారితోఁ బాటీమెయు నొకతియ?' హరప్ప నివ్వెఱపోయి చూచి 'మీ రెవరు!'

దేవదాసి హరప్పవంకఁ జూచెను. హరప్ప దేవదాసివంకఁ జూచెను. వయస్సుచేత దేవదాసి పెద్దది. హరప్ప చిన్నవాఁడు,

హరప్ప బ్రహ్మచారి. హరప్ప యవివాహితుఁడు. హరప్పలో స్త్రీ పురుషజ్ఞాన మింకను వృద్ధికాలేదు. వట్టి పసివాడు. అట్లుచూచిన హరప్ప మనసులోఁ జిత్రముగా నెదిగిపోయి ప్రకృతిసహజముకాని యొకయూహ యూహించెను. 'దేవదాసి తనకూఁతురువలె నున్న' దని. ప్రభుదృష్టిలోఁ బ్రసన్నత, సమాదరణము దేవదాసి చదివెను. ఆమె యేమనుకొన్నదో మొగమున నానందమును మందహాసమును గనఁబఱచినది. మఱునిముసములో ధర్మారావు ముందు నడచుచుండెను. దేవదాసి వెనుక నడచుచుండెను. హరప్ప యా వెనుక నడచుచుండెను. అన్నగారును దండియు వెంటనిడుకొని యత్తింటికిఁ దీసికొనిపోవుచున్నపిల్లవలె దేవదాసి మహానందపరీవృత యయ్యెను. ఆలయద్వారమువరకుఁ బోయిరి. హరప్ప యచట నాఁగెను. వారిద్దఱును హరప్పవంక వెనుదిరిగి చూచి లోనికిఁబోయిరి. హరప్ప కన్నుమూసి కన్ను తెఱచినంతసేపు తా నచట నిలుచుండి నెమ్మదిగా వెనకకువచ్చెను; దారివెంట నందఱు నాయనివంకఁ జూచిరి. నాయఁడు నేలవంకఁ జూచుచుండెను నాయనినేత్రములు పరాఙ్ముఖములై యున్నను వెనుకకుఁదిరిగి దేవాలయములోఁ జూచుచుండెను నాయఁడు కోటగోనికి నెమ్మదిగానడచి చనెను. అతఁడు తనగదికి ముందున్న మల్లెపందిరిక్రిందఁ జూచెను. అచ్చటినీడలలోఁ జీకటులు పెనగొనుట తెలిసికొని పొద్దుగ్రుంకె నని భావించెను. హరప్ప యేనుఁగులసాలవద్దకు వెళ్ళెను అచట నొక్క యేనుఁ గున్నది. దానిని జూచెను. రంగన్నవచ్చి 'బాబయ్యగారూ! ఈ యేనుఁగుపేరు హనుమంతు. మనకోటలోఁబూర్వము లక్ష్మణస్వామి యని యొక యేనుఁ గుండెడిది. పెదబాబయ్యగారికి పట్టాభిషేక మైననాఁడే యది చనిపోయినది. అది మీ తాతగా రెక్కెడిది' అని చెప్పెను. హరప్ప దేనికిని సమాధానము చెప్పఁడు. ఊఁ అనఁడు. ఇది యేమియు ననకుండఁగనే రంగన్నకు హరప్ప ప్రశ్న వేసెనో, ఊఁ అనెనో తెల్లియును. రంగన్న మఱియుఁ జెప్పనారంభించెను: 'లక్ష్మణస్వామిని నేను బాగుగా నెఱుఁగుదును. పట్టాభిషేకమునాఁడు తన్నెక్కి బాబయ్యగా రూరేఁగవలయునని లక్ష్మణస్వామియూహ. స్వామి ముసలిదై యొడలంతయు గొలుకొట్టుచుండెను, బాబయ్యగా రదు

చేత వద్దన్నారు. స్వామికిఁ గోపమువచ్చి చనిపోయి నారఁట.' హరప్ప యొకచూపుచూచెను. రంగన్న 'అవును బాబూ! స్వామి గాంధిగారి వంటి వాఁడు. తరువాత బాటయ్యగారు మఱియేనుఁగునుగాని, గుఱ్ఱముగాని యెక్కలేదు, మోటారే యెక్కిరి' హరప్ప యటనుండి నడువసాగెను. రంగన్న వెంటనే నడచుచుండెను. ఒకపాఁత గోడ పడి రాళ్ళన్నియు గుట్టగాఁ బడియుండెను. ఆ వెనుకఁ గోట గోడ చెడిపోలేదు. ఈ రెండుగోడలకును మధ్య విశాలమైన ప్రదేశము కలదు. అది దక్షిణమునుండి యుత్తరమునకును వ్యాపించి సరిగాఁ గోటయంతపొడుగు నున్నది. ఒక్క యరమైలునకుఁ దక్కువుండదు. ఆ స్థలమంతయుఁ బూర్వము రాజకుమారులు గుఱ్ఱముల స్వారీ నేర్చుకొనుటకును, నేనుఁగుల నడిపించుట నేర్చుకొనుటకును, సాముగరిడీలు నేర్చుకొనుటకును నియమింపఁబడినస్థలము. ఇప్పుడదియంతయుఁ గ్రూరసర్పములకు నివాసమై యున్నది. హరప్ప దాని వంకఁ జూచెను. రంగన్న 'బాబుగారూ! ఇప్పుడు మన మక్కడకుఁ బోలేము. దానినిండ వేయిపాము లున్నవి.' హరప్ప వెనుదిరిగి మఱల తనగదిదగ్గఱకు వచ్చెను. గదిలో భోజన మచ్చటఁ బడియుండెను. హరప్ప మాంసమును భుజించఁడు. శాకాహారమే చేయును. ఏకాదశినాఁ డుల్లిపాయనుకూడ ముట్టఁడు. ఏకాదశులయం దేకభుక్తమొందును. ఎందు కని యెవ్వరడుగరు. అతఁడు చెప్పఁడు. ధర్మారావెప్పుడో రుక్మిణమ్మారావుగా రేకాదశి యుండెడి దని చెప్పెను. ఆనాఁ డామె యేకభుక్త మని చెప్పెను. హరప్పమనసులోఁ దన నాయనమ్మకును దల్లికిని భేదము లేదు. ఆమె యట్లుచేసినచోఁ దన తల్లియు నట్లు చేసెడి దేయని యతని నమ్మకము. అతఁడు భోజనము చేసి మల్లెపందిరివద్దఁ గొంతసేపు పచారుచేయును. చేసినతరువాత దీపమువద్దఁ గూర్చుండి చదువును. చదువు గ్రంథములలో ప్రధానమైనవి భాగవతము. భారతము, కృష్ణకర్ణామృతము, ఆంధ్రనాయక శతకము, ఇంగ్లీషు నవలలు. ధర్మారావును సంస్కృతము చెప్పమని హరప్ప చాలసారు లడిగెను. ధర్మారావు ప్రారంభించెను. రాత్రి జాము జామున్నర ప్రొద్దు పోవువఱకును హరప్ప చదువుకొనుచుండును. తరువాత శయనించును. నిద్ర పట్టదు! ఊహించును! "మా

యన్నగా రెట్లుండెడిదో? చిన్నతనములో నామె నేమి చూచితినో నాకు జ్ఞాపకము లేదు. ఆమె శచీదేవివలె నుండియుండును. ఆమెకు నామీఁదఁ జాలా ప్రేమ కాఁబోలు! చనిపోవునప్పుడు నన్ను దగ్గఱకుఁ దీసికొని నాకుఁ దెల్లనిపట్టుజరీయుత్తరీయము తలకుఁ జుట్టించినదఁట. నే నామె చెప్పినట్లే చేయుచున్నాను. నాయనమ్మయు మా యమ్మయు నొక్కసారియే చనిపోవు టేల? మా కోటవెనుక నున్న విహారస్థలము మఱల బాగుచేయించెదను. గుఱ్ఱములను స్వారీ చేయుట, ఏనుఁగులను నడపుట నేర్చుకొందును. కత్తిసాము, కఱ్ఱసాము నేర్చుకొనవలయును. లేకపోయిన రాజులు శత్రువుల నెట్లు పరిమార్తురు? మాయమ్మగారు మహాపతివ్రత. ఆమెవంటిది చనిపోయినతరువాత మా నాయనగారు మఱలఁ బెండ్లిచేసికొని రేలనో! పెండ్లి యేల చేసికొనెను? ఎవరినో తెచ్చి యుంచుకొనెను. అది పెండ్లి యె ట్లగును?"

ఇంతలో నొకగాలివచ్చి ప్రక్కనున్న పోఁకచెట్టును గదలించెను. "మాకోటలోఁ జెట్లన్నియు నెక్కడివక్కడ విఱిగిపోయెనవి. రంగన్న చెప్పినాఁడు, కోటయంతయు నందనోద్యానమువలె నుండెడిదఁట. నేను పెద్దయైనతరువాత మఱలఁ గోటయంతయు వృక్షములు పెంచెదను. గాలి పొన్నాకులలో దూఱి మృదువుగా జాఱును. పోఁక మొవ్వులలో దూఁకి మర్మరధ్వనులు చేయును. ఫలవృక్షాదుల మీఁదికి బరువులెత్తును. అరఁటియాకులమీఁదఁ బరువులెత్తి వానిని జించివేయును. మల్లెపందిరిమీఁదినుండి నాగదిలోనికి వచ్చును. నేను ముసుఁగుపెట్టుకొన్న దుప్పటిలోనికిఁ దూఱవలె నని గాలి ప్రయత్నించును. నేను దూఱనీయను. అది గిలగిల లాడినతరువాత నేను దుప్పటి తీసివేయుదును. ఇద్దఱమును పకాలుమని నవ్వి స్నేహితులవలెఁ గౌఁగిలించుకొందుము. మాయమ్మగారు కోటలోఁ దిరుగుచున్నప్పుడు లక్ష్మీదేవి వైకుంఠములోఁ దిరుగుచున్నట్లుండియుండవలయును. ఆమెయొంటినిండ రతనములు మాణిక్యములు ధరించి తెల్లనిపట్టుజరీచీర తాల్చి మొగమునఁ గుంకుమ తిలకముగా ధరించి పునుగు జవ్వాజికస్తూరివాసన లామె నెలచినచోటున నెల్ల వాసనా ప్రవాహములు కట్టగా నామె యెట్లుండి యుండును? జగన్మోహ

న్యవతారమువలె నుండియుండును. ఆ మహాపతివ్రత, సర్వపుణ్య క్షేత్రములవలెఁ బవిత్రాకృతియై యుండవలయును.

"విశాలా కల్యాణీ స్ఫుటరుచి రయోధ్యా కువలయైః
కృపాధారా ధారా కి మపి మధురా భోగవతికా,
అవంతీ దృష్టి స్తే బహునగరనిస్తారవిజయా"

యన్నట్లు మాతల్లి మహారాణియై తనపాలించినరాష్ట్రముమీఁదఁ బఱపిన దృష్టి యిట్లుండును. మేము వేణుగోపాలస్వామికి ధర్మకర్తలము. నాగేశ్వరస్వామికి ధర్మకర్తలము, ఈ దేవతలందఱును మా చేతఁ బ్రతిష్ఠింపఁబడిరి. ఎప్పుడో యేనాఁటి మాపూర్వులదయవలననో వీరందఱు నిచటఁ దలఁదాఁచుకొనిరి. నేఁడు ఛీ! మీదారిని మీరు పొండనఁగా వా రెచ్చటికిఁ బోదురు? ఆశ్రయించిన కొంప వదలిపెట్టిపోవుట యంత తేలికా? మీరు బొబ్బిలి వదలిపొండనుట చేతఁగదా రావువారు కత్తులమీఁదఁ బడి చచ్చిరి! తనస్వదేశము వదలి యెవఁడు పోవును? దేవతలుమాత్ర మేమి పోదురు? వారికి ధూప దీప నైవేద్యములకు లేక. కల్యాణములకు లేక నవసిపోవుచున్నారు. మాయమ్మ బ్రదికియున్నచో మా నాయనగా రిట్లుండరు; ఆమెయేకాదశులుండి ప్రతియేకాదశినాఁడును స్వామిదర్శనము చేసి యుపవాస ముండెడిదఁట ఆమె కంత యిష్టమైన భగవంతుని నింత తిరస్కరించియుండునా మా తండ్రి? చేసియుండఁడు. ఈ నాగేశ్వరరావుగా రొకరు. వీరికి విగ్రహారాధన గిట్టదఁట. వీరు కేషబ్జీని ధ్యానింతురు. విగ్రహ మనఁగా రాతితోఁ జేసిననే విగ్రహమా? కరచరణాద్యవయవములు గల మూర్తిని మనసా కల్పించుకొనిన నది విగ్రహము కాదా? విగ్రహములందు భగవద్భావమయినను గలదు. అతఁడు మనుష్యుఁడు కాఁడన్న ప్రత్యయమయినను గలదు. కేషబ్జీ మనుష్యుఁడు కాఁడనుట యెట్లు? దివ్యమైశక్తులు గలపురుషుఁడు కావచ్చును. విగ్రహారాధనలోఁ దప్పేమి? దున్నపోతీనె ననఁగా దూడను గట్టివేయుమన్న ట్లైవఁడో వికృతిబుద్ధి కాదన్నాఁడు? తక్కిన వారందఱును కాదుకాదని గంతులువేయుటదక్క మఱియొకఁడు కనిపించలేదు. విగ్రహారాధన మంచియో చెడ్డయో ధర్మారావుగారు వాదింతురు. ఎవరితో వాదించవలయును? ఎదుటికి

వచ్చినిలఁబడెడువాఁడే లేఁడుకదా! ఏదైన నన్నుచోఁ బరమదముల యందు ద్వేషముకలిగించుట యన్న సూత్రము పట్టించి, శిక్షించు టకుఁ బ్రయత్నింతురు, హిందూమతము నెన్ని తిట్టినను తప్పులేదు. ఇతరమతములు వచ్చి మామతమును కుద్దాలించినచోఁ దప్పులేదు. మా వేణుగోపాలస్వామి పిడికెఁడుబిచ్చముదొరకని దేవుఁడైనాఁడు. నాగేశ్వరస్వామియే నయము; అలవాటుపడిన బిచ్చగాఁడు. తా దూఱ కంతలేదు, మెడ కొకడోలన్న ట్లీయనకు గతిలేదు. దేవదాసి నొక తెను దెచ్చుకొన్నాడు. వీరియిద్దఱికిని భుక్తిగడుచుటయెట్లు? ఈ స్వామికిఁ గల్యాణములు జరుగుటయెట్లు? ఒక్కసారి భగవంతున కుత్సవములుచేసినతరువాత నేను చనిపోయినను ఫరవాలేదు.' అంతలోఁ గోళ్లుకూసినవి, భగవంతుని కల్యాణసమయమున విచిత్ర ఫణితిగల మంగళహారతి పాడినట్లు కోళ్ళు క్రొత్తస్వరమువేసి కొక్కొరోకోయనెను. తూర్పునందు వాడిపోవుచున్న వెన్నెలలు వాఁడి యెక్కుచున్న యుషఃకిరణములు దుఃఖములో నానందము కలిగినట్లు కలసిమెలసి యుండెను. కోళ్ళు మేలుకొండోయి జనులని కూసెను. హరప్ప నిదురపోయెను. తక్కినవా రెవరును నిదురలేవ లేదు. తెల్లవారుజాము కోడికూఁత వినఁబడి పాతికయేండ్లైనది. అదియు శాస్త్రగతవిషయమువలెనే విశ్వసించెడువారికే విశ్వసనీయమైన విషయ మైపోయినది. సర్వజనులకుఁ బనిజేసుకొను దివావేళ పది గంటలకు, ఎనిమిదిగంటలకు లేచినఁజాలును. ఈ పిచ్చికోడి తెల్ల వాఱినతరువాత నేడుగంటలకుఁ గూయరాదా? ఎవ్వరును వినిపించు కొనని యీ కూఁత తెల్లవాఱుజామున కూయుట నింక నెన్నాళ్ళకు మానివేయునో?

రంగారావుగారును శశియు సౌభాగ్యమున శయనించిరి. శశిని తెల్లనిశరీరము జ్యోత్స్నాధిదేవతవలె నామెను బ్రకాశింపఁ జేసెను. రంగారావునకామెను జూచినప్పుడెల్ల మోహామే యుబుకు చుండెను. రాతిరి పన్నెండుగంటలదాఁక విలాసముగాఁ గాలముగడిపి దోమతెరలలో నిరువురును విడివిడిగా శయనించిరి. శశికి నిదుర పోయెను. రంగారావుగారికి నిదుర పట్టలేదు; పట్టకనుపోలేదు. కన్ను మూఁత పడును. ఏదో కనిపించినట్లగును. మఱల మెలఁకువ వచ్చును.

రాజు కన్ను మూసెను. సరోజినీదేవివచ్చి యతనిపాదములవద్ద నిలు చుండెను. ఆమె మెడలోఁ బాము లున్నవి. కంకణములుగాఁ బాము లున్నవి. చెవులకుఁ కుండలములుగా. జుట్టుబాము లున్నవి. ఒక పెద్దపామును శిరోవేష్టముగాఁ జుట్టుకొన్నది. రాజు కన్ను తెఱచెను. ఎవ్వరును లేరు. దగ్గఱనే వేఱొక మంచముమీఁద శశిని తెల్ల త్రాఁచువలె పండుకొనియుండెను! ఏదోయూహించుచు మఱలఁ గన్నుమూసెను. వేణుగోపాలస్వామి కనఁబడినాఁడు. మొగమునఁ దిరుమణి తిరుచూర్ణము ధరించినాఁడు. కంఠమున హాలాహల మున్నది. మెడలోఁ బాములు హారములుగా వేసికొనెను. హారమైనపాముక్రిందఁ జింతామణి యున్నది. పీతాంబరము ధరించినాఁడు. పీతాంబరము కుచ్చెలలమీఁద నుత్తరీయమువలె నొక సర్పము బిగించినాఁడు. ఇది వేణుగోపాలస్వామి మూర్తియా? హరిహరనాథ మూర్తియా? సగ మీయన, సగ మాయనగ లేఁడే? రాజు మఱల గనులు తెఱచెను. శివజటాభాగమున మందాకినీనది కిలకిలాధ్వనులతో నవ్వునురుసులో, చంద్రకళావినిర్గతమధుర చంద్రికాపూరములో ఆకాశమంతయుఁ దెల్లగానుండెను. ఆకాశములో మేఘములు తెల తెల్లనై పాములవలె వంకరటింకరలుగానుండెను. అవి శివజటాభాగమున నలంకరింపఁబడిన సర్పములుకాఁబోలు! రంగారావు కనుకొనెను. 'నాగేశ్వరరావుచేతను ప్రబోధింపఁబడికూడ నామనస్సు పూర్వవాసన వదలిపెట్టుట లేదు. పదేండ్లుగాఁ బ్రతీపమార్గములనే నడచుచుంటిని. ఈ స్వప్నములు నే నింగ్లాండు పోయినప్పుడును వచ్చెను. చెన్నపురిలో గిండీపందెములలోఁ బాల్గొనినప్పుడును వచ్చెను. సుబ్బన్నపేటకోటలో మేడమీఁదను పండుకొనినప్పుడు వచ్చెను. నాకీ కలలువచ్చి ప్రయోజనములేదు. ఇవి యెందుకు వచ్చెను?' రంగారావు మఱలఁ గనులు మూసెను, మఱలమగతగా నిద్ర వచ్చెను' కేషజ్జి దూరమునందుఁ గూర్చుండియుండెను. ఆయన మెడలో, శిరస్సున, హస్తములయందు, నడుమున సర్పములే పెనగొనియుండెను. కేషజ్జీ గుణాతీతుఁడు. అచ్చమైన బ్రహ్మస్వరూపము. ఈయనకుఁగూడఁ బాములు చుట్టుకొనెనేమో? ఆయనవద్ద నాగేశ్వరరావు నిలచియుండెను. నాగేశ్వరరావును బాములు పేను

చుండెను. అతఁడు బాధచేత గొంకరలు బోవుచుండెను. రంగారావు కనులు తెఱచెను. గాలియాడుట లేదు. దాను పండుకొన్న మేడ పైభాగము పోఁకద్రాక్షలు, మామిడిచెట్లు వీనిశిఖలకన్న నెత్తుగా నుండెను. రాజు చెట్లవంకఁ జూచెను. చెట్లయాకు లాడుచున్నవి. అంతక్రిందుభాగమున గాలియుండి యింత పైభాగమున గాలిలేదా? రాజు మఱలఁ గనులు మూసికొనెను. కుమారుఁడు హరప్ప కనఁబడెను. అతని శరీరమంతయు నచ్చిన చుట్టములవలెఁ బాములు పాఁకుచుండెను. అతఁడు పాములను ముద్దుపెట్టుకొనుచుండెను. పాములతని చొక్కాజేబులలోఁ దలలు దూర్చి మఱల బయటికి వచ్చుచుండెను. మఱలఁ జూచెను. అతఁడు పాములవాఁడై సొఱకాయ బుఱ్ఱతో వానియెదుట నూఁదుచుండెను. రాజు కనులు తెఱచెను. తెల్లవాఱువఱకును నిదుర పట్టలేదు.

# పదునైదవ అధ్యాయము

గ్రీష్మము ప్రళయాకారము తాల్చి మహాతపము లోలుకఁ బోయుచుండెను. సర్వజంతువులు మలమల మాఁడిపోయెను. అబ్బా! యీ గ్రీష్మమునకుఁ దుదిలేదేమో యనుకొనుచుండఁగా నొకనాఁడు హఠాత్తుగ మేఘములు పట్టి కుండపోఁతఁగా గుమ్మరించెను. మఱు నాఁడే చల్లపడెను. కాలముమారుటయే రమ్యముగానున్నది. వెను కటిదినమున గ్రీష్మర్తువు. మఱునాఁడు వర్షర్తువు. సుఖదుఃఖములు నిట్లే. రెండు నెలలు ఘోరముగా నెండలుకాసెను. తుపాకితోఁ గొట్టి నట్లు రోజు తిరుగునప్పటికిఁ జల్లనివానలు కురిసెను. కళాశాలలు మఱలఁ దెఱచిరి. కిరీటి బి. ఏ. రెండవసంవత్సరము చదువుటకు వచ్చెను. శివరావు వేసఁగి సెలవులలోఁ గొన్నాళ్ళు సుబ్బన్న పేఁటలో నున్నను, చివరిరోజులలో దేశసంచారము చేసివచ్చెను. ఆయన తన కెవరో మిత్రు లున్నా రని వారిని జూచుటను పూరీ జగన్నాథము పోయి యచటనుండి రెండు మూఁడుపనితనముగల వస్తువులు తెచ్చెను. అందులో నొకటి తాటియాకులగొడుగు అది చిన్నది. ఒక్క తాటియాకు నిప్పి యంచులు మణచి కుట్టఁబడెను. చూచుటకు రమ్యముగ నున్నది. దానికి వృక్షపత్రములతోఁ జిన్ని చిన్ని బుట్టలు, పళ్ళెములు, విసనకఱ్ఱ లల్లఁబడెను. అవియుఁ దెచ్చెను. కిరీటిని ధర్మారావు తనయింట నుండుమనెను. కిరీటి కాలేజీహాస్టలులో నివసించుచుండెను. కాలేజీ పేఁటకు దక్షిణపుఁ జివర. జాతీయకళాశాల తూర్పుదిక్కు చివర. ధర్మారావుగృహము బ్రాహ్మణవీథియందు - అనఁగా దేవాలయములకుఁ దక్కిన గ్రామమునకును మధ్యభాగమున. ప్రతిదినమును గిరీటి వచ్చి ధర్మారావు నింట నిద్రించును. హాస్టలధికారి రాత్రులందు హాస్టలును వదలిపోరా దని శాసించును. కిరీటి ప్రతిదినమును నిరాకరించును. జాతీయకళా శాల పొద్దుననే యేడుగంటలనుండి పదింటివఱకు. కిరీటిధర్మారావు లిర్వురును ప్రొద్దుననే లేచి స్నానముచేయుదురు. జాతీయకళాశాలకుఁ బోదురు. తొమ్మిదిన్నరకుఁ గిరీటి కాలేజిహాస్టలుకుఁ బోయి భోజ

నముచేసి కళాశాలకుఁ బోవును. అక్కడ మొదటిగంటయేయుండి హాజరువేయించుకొని ధర్మారావింటికి వచ్చును. రెండు గంటల దాఁక కలసియుందురు. అప్పుడప్పుడు శివరావుగూడ వచ్చును. రెండుగంటలకుఁ గిరీటి కాలేజీకిఁ బోవును. ధర్మారావు కళాశాలకుఁ బోవురు. కళాశాల వదలిపెట్టినంతనే ధర్మారావు మఱలఁ గాలేజీకిఁ బ్రయాణము. ఇద్దఱును గలసి పొలాలమీఁదికిఁ బోదురు. గుండేటి వద్దకుఁ బోదురు. మఱలఁ గళాశాల వెనుక మెట్టచేలమీఁదికిఁ బోదురు. హాస్టలునకుఁ బోయి కిరీటి భోజనముచేయువఱకు ధర్మారావు కూర్చుండును. కలసి ధర్మారావునింటికి వత్తురు. అచ్చట రేనడిజా మగువఱకునుఁ గబుర్లు అప్పుడు నిద్ర. ఇది వారి దినచర్య.

ఒకనాఁడు శివరావు ధర్మారావును జూచి "నేను జగన్నాథ మెందుకుఁ బోతినో తెలియునా? అక్కడ నా పూర్వకాలమిత్రుఁ డొక డున్నాఁడు. మే మిద్దఱము చెన్ననగరములో సహాధ్యాయులము. చిన్నప్పు డిద్దఱమును గలసియుండెడివారము. క్లాసులో నందఱికన్న నేను తెలివిగలవాఁడను. అతనికిఁ జిన్నప్పటినుండియుఁ జదువురాదు. ఉపాధ్యాయుఁడు వాని నెప్పుడును బెంచిమీఁద నిలుచుండఁ బెట్టినవాఁడు. తల్లిదండ్రులు నా దగ్గఱకుఁబోయి చదువుకొను మని వానికిఁ జెప్పఁగా నతఁడు నావద్దకు వచ్చెడివాఁడు. వచ్చి యల్లరిచేయుటయే కాని తాను చదివెడివాఁడు కాఁడు, నన్నుఁ జదువనిచ్చెడివాఁడు కాఁడు. పరీక్షలలో సరిగా నా వెనుక బెంచీ మీఁదఁ గూర్చుండును. నే నొక కాగితము వ్రాసినంతనే 'శివా! శివా! ఆ కాగిత మిటు తే' యని వెనుకనుండి పోరును. 'ఒరేయి! నేను వ్రాసినదంతయు నీ వెక్కించినచోఁ బట్టుకొందురు. చివరకుఁ బ్రాణముమీఁదికి వచ్చును' అని నే నందును. అతఁడు 'మేమును నీయంత తెలివికలవారమేనోయి. మార్చి వ్రాసికొనఁగలము. కాగిత మీయరా యనఁగా వెధవసిక్కు పోయెదవేమి!' ప్రతి పరీక్షకు నిదియే గోల; ప్రతిపరీక్షయు వాఁడును బరీక్షయగుచుండెను. నేను నగుచుంటిని. స్కూలుఫైనలులోనికి వచ్చువఱకు పబ్లికుపరీక్షలో నీ యాట సాఁగినదికాదు. అక్కడ తిష్ఠ వేసెను. రెండు మూఁడేండ్లు నెమరువేసి చదు విమడక మానివేసెను. తండ్రి సంపా

దించినాఁడు. గనుక చక్కఁగా సాఁగుచున్నది. నే నతనిని బోయి జూచి వచ్చితిని. పాతికయేండ్ల యీ మధ్య మేము మఱలఁ గలసికొనలేదు. అతఁడు నాయందుఁ బూర్వమువలెనే యుండెను. నేను కనబడినంతనే యతఁడు 'ఒరే, శివా! మన మిద్దఱము నొక యుపాధ్యాయునిమీఁదఁ గోపమువచ్చి యతనిమీఁద నేవో వ్రాసి గోడలకు కాగితము లంటించితిమి. జ్ఞాపకమున్నదా?' యనెను. అతఁడు మా బాల్యక్రీడలు మఱచిపోలేదు. నే నాయూరునకుఁ బోయి మహానందమనుభవించితిని. నా కీ యనుభూతి కలిగినప్పటినుండియు నేను దుఃఖమును వహించలేకున్నాను. దుఃఖము పొందువారివంకనైన జూడలేను. నా కెప్పుడును నానందమే కావలయును. అవును? నేను భగవంతుడనైతినాయెను. భగవంతుఁడు సచ్చిదానందస్వరూపుఁడు.' ధర్మారావు 'ఆ యానంద మిది కాదు. తైత్తిరీయోపనిషత్తుచదివినచోఁ దెలియును' అనెను. శివరావు 'అవును, నే నీపదియేండ్లలోపుగా సర్వమతగ్రంథములు చదువవలయును. ఉపనిషత్తులు, వేదములు, కొరాను, బైబిలు, ధర్మపథము' జెండ్ అవెస్టా సర్వమత గ్రంథములు నవలోడించి యన్నిమతములలోనున్నమంచియుఁ దీసి నా మతముగాఁ నిలఁబెట్టెదను. నేను వరుసగా దశావతారము లెత్తుచున్నాను. ఇప్పుడు వామనావతారమువఱకు వచ్చినది. అదిగో నా తాటియాకులగొడుగుచూచితిరా. అది నా వామనావతారచిహ్నము. నారాయణరావే బలిచక్రవర్తి. జాతీయవిద్య రాక్షసుల వశమైపోయినది. కేశవరావుగారు మహేంద్రుడు. ఆయనవద్దనుండి యీబలి యీస్వర్గమును లాగుకొనెను. నే నీబలి నడఁగఁద్రొక్కి యీరాజ్యము మఱల నింద్రహస్తగతము చేసెదను. జాతీయవిద్యాదర్శనములు నిలఁబెట్టుటయే స్వర్గమును మఱలఁ గేశవరావుగారి కిచ్చినట్లు' అనెను. ధర్మారావు 'లెడ్ బీటరు మీ రవతారము కాదన్నాడుఁ గదా!' లనెను. శివరావు—'లెడ్ బీటరును చెన్నపురినుండి సరిగా నుత్తరము వ్రాసియుండరు. ఆయన యాస్ట్రేలియానుండి యీ సంవత్సరాంతమునకు దిరిగివచ్చును. అప్పు డాయనతో నేను ముఖతః మాట్లాడికాని యేసంగతియుఁ జెప్పలేను. అతనికి వీరు సరిగాఁ దెలియఁజేసియుండరు' అనెను.

ధర్మారావు సాయంకాలము కిరీటినిఁ గలసికొని యిర్వురును గుండేటిపంతెన దగ్గఱకుఁ బోయిరి. నేఁటి సుబ్బన్నపేఁట వంతెన వఱకును వ్యాపించియున్నది. గుండేటివఱదలు మూఁడునాలుగేండ్లైనది వచ్చి. తరువాత నచ్చట గృహనిర్మాణము చేసినవారికి గుండేటి వఱదలుగా వచ్చుననియే తెలియదు. అచ్చట నిండ్లుకట్టిన వారందఱును సినిమాసేవకులు, మోటారునడుపువాండ్రు. బీడీల దుకాణము పెట్టినవాండ్రు, పనియుఁబాటయులేక తిరుగువాండ్రు. వంతెనదాఁటి చాలదూరము పోయినఁగాని పేఁటలో నిప్పుడు నిర్జనముగా నుండదు. పూర్వము వంతెనవద్దనే నిర్జనముగా నుండెడిది. వంతెనదాఁటిన తరువాత నొకమైలుదూరము పోయిరి. అచ్చట నిరువురును రోడ్డుకుడిప్రక్కఁ గూర్చుండిరి. కిరీటి కొంచెముసేపు కూర్చుండి, లేచి, యటునిటు తిరుగుచుండెను. కనఁబడిన పచ్చి యాకును ద్రుంచి నోటిలో వేసికొని రుచి చూచును. మఱికొన్ని మొక్కలు పరిశీలించును. తా నెఱుఁగని క్రొత్తమొక్క కన్పించి నచో 'అన్నా! ఇదియేమి?' టని యడుగును. కొన్నిమొక్కలు చిన్న చిన్ననక్షత్రములవంటిపూలు పూచి చూచుటకు నేత్రానందకరముగ నుండెను. కిరీటి మొక్కమొక్కదగ్గఱఁ గూర్చుండి యచ్చట నుండి కదలఁడు. మఱికొంతసేపటికి లేచి యిద్దఱును గలసి యచ్చట నొకపెద్దకంచెయుండఁగా నాకంచెవెంట నడువఁజొచ్చిరి. కిరీటి యొక చోట వంగి యొకయెముక తీసి చేతఁబుచ్చుకొనెను. 'ఇది యేమి యెముక? ఏ మృగముదో వెన్నెముక. ఇంతపెద్ద వెన్నెముకగల మృగ మేదై యుండును?' అనెను. ధర్మారావు మాటాడలేదు. కిరీటి మఱల 'పూర్వమీస్థలమంతయు నడవులుగా నుండెడి దంటివిగదా? ఈపేఁట పూర్వపుజమీందారులు గొప్పవేఁటకాండ్రని చెప్పితివి. ఇది పెద్దపులిదో. యేదైన మఱొక పెద్ద వన్యమృగముదో!' అనెను. ధర్మారావు 'పెద్దపులి కింతలావు వెన్నెముకపూస యుండదు.' కిరీటి 'అయినచో నేనుఁగు దేమో! ఏనుఁగులను వేఁటాడి చంపరు గదా! ఒకవేళ నేదైన చచ్చిన యేనుఁగును దెచ్చి యిచ్చటఁ బూడ్చిపెట్టిరేమో! కాలక్రమేణ త్వఙ్మాంసమజ్జాస్థులు నేల తినఁగా నీ బొమికలు మిగిలియుండును. నక్కలు వానిని ద్రవ్వియుండును.'

ధర్మారావు పరధ్యానముగా నుండెను. కిరీటి 'ఈయేనుఁగు పట్టపు టేనుఁగు కావలయును. లేకపోయిన నింత శ్రద్ధగాఁ దెచ్చి పాతిపెట్టను.' ధర్మారావు కన్నులలో నీరు తిరిగెను. కిరీటి 'నీ వేల యేడ్చుచున్నా' వని యడిగెను. ధర్మారావు 'చీచీ! నే నేడ్చుట యేమిటి? ఈ తుమ్మపూవులు చూచితివా? ఈవృక్షమున్నిటికన్న నికృష్టమైనది. ఇది కట్టెలకుఁదప్ప మఱి యెందులకును బనికిరాదు. నాఁగటిముంపలు తలుపు చెక్కలుగాఁగూడఁ జేయుదురుగాని వంటచెఱకునకే యెక్కువ వినియోగింతురు అందులో నశుభకార్యముల కీవంటచెఱకు శ్రేష్టమైనది. దీనినిండనున్నముండ్లకుఁదోడు దీనిపూవులను జూచినచో డోకు వచ్చును. పసుపుపచ్చని సన్ననిదారములు చిన్నియుండగాఁ జుట్టిన ట్లుండి యేదో చెడ్డవాసన వేయును? ఈ పూలకుఁదోడు పుప్పొడి. అది వచ్చి నాకన్నులలోఁగొట్టుకొనెను.' కిరీటి 'పుప్పొడి నీ కన్నులలో బడినదన్నందుకు పెద్దకథ చెప్పితివి' యనెను. ఈ లోపుగాఁ గిరీటి యా బొమికె పాఱవేసి దాని ప్రస్తావనయే మఱచిపోయి మాటల నడచుచుండెను. ప్రొద్దుగ్రుంకినది. నాలుఁగైదు రోజులనుండి వర్షములేక నేల కొంచె మెండినది. కాని పచ్చగానే యున్నది. ఇద్దఱు నొకచోటఁ గూర్చుండ మనుకొన్నారు. ఆకాశమున మేఘములు క్రమ్ముకొనియున్నవి. ఉఱుముచున్నవి. కిరీటి 'వానవచ్చునేమో! యింటికిఁ బోదమా? వానకుఁ దడిసిపోదు' మనెను. ధర్మారావు 'వానలోఁ దడియుట మంచిదే. దానినే దివ్యస్నానమందురు. కూర్చుండుము. కాసేపు మాట్లాడుకొని పోదము.' కిరీటి 'చీఁకటి పడుచున్నది.' ధర్మారావు కిరీటి చేయిగుంజి కూర్చుండఁబెట్టెను. ధర్మారావు 'ఇప్పుడు నీ ప్రణయకథ యేమాత్రముదూరము వచ్చినది?' ప్రణయకథ యనిన తోడనే కిరీటి సాయంకాలమునందు వేసఁగినాఁటిశిరీషపత్రమువలె వాడిపోయెను. ధర్మారావు మఱలఁ బ్రశ్నించెను. కిరీటి 'అట్లే యున్నది. నే నీ సంవత్సరము పరీక్ష ప్యాసైనచో మా మామ యంగీకరించవచ్చును. మాతల్లి యున్నది గదా! ఆమె యిప్పుడు నెల కొకసారి మా మామగారింటికిఁ బోయి వచ్చుచుండును. శశితో మాట్లాడుచుండును. శశి ప్రతిశుక్రవారమును దేవీపూజ చేయునఁట.

ఏదో దేవీమంత్ర ముపదేశమై యా మంత్రము జపించుచుండునంట. ఏకాదశి, యమావాస్యల నాఁ డుపవాస ముండును. శనివారము నాఁటిరాత్రి భోజనము చేయదంట. 'ఇన్నివ్రతములు దేనికే' యని యడిగిన 'మాబావను పెండ్లియాడుట' కని చెప్పునంట. అన్నా! నాకుఁ బెండ్లియైనను గాకపోయినను సరే! అట్టి స్త్రీరత్నము నాయం దంత ప్రేమ కలిగియున్న దనుటయే నాజీవితమునకు శిఖరమెత్తినట్లు. తరువాత నే నెన్నిసార్లో యామెకు జాబులు పంపించవలె నని చూచితిని. ఆ జాబులు తీసికొని వెళ్ళువా రెవరును లేకపోయిరి.' ధర్మారావు 'పూజారి ముసలమ్మ లేదా?' కిరీటి 'మామామ యిప్పుడు గుంటూరునుండి బాపట్లకు మార్చఁబడెను.' ధర్మారావు 'జాబులెందుకు? ఒక్కయేడాది యాఁగినచో ముందునాఁటి కీజాబు లన్నియు నామె చెక్కిళ్ళమీఁదనే వ్రాయవచ్చును.' కిరీటి 'అన్నా! పెండ్లి యగు నందువా? నీవు నన్నాశీర్వదించుము.' ధర్మారావు 'అమ్మ మామగారియింటికిఁ బ్రతినెల రాకపోకలు చేయుచునే యుండెనాయెను. వారుమాత్రము బంధుత్వము త్రెంచుకొని యడవుల వెంటఁబడిపోవుదురా యేమి? అందులో నీవు బి. ఏ. ప్యాసవుదువు. మన్మధునివంటివాఁడవు. నీ కిచ్చుకొనక యాపిల్ల నెవరి కిచ్చెదరు? ఒకఁడు జాంబవంతుఁడు. ఒకఁడు నీలుఁడు. మఱియొకఁడు సుషేణుఁడు. ఈ కోఁతిగాండ్రకు, భల్లూకపుగాండ్రకు నిచ్చి-మీ మామ యేమి బుద్ధిపోయినవాఁడా-కూఁతుదుఃఖాశ్రువులు చూచి మురియుటకు? ఆపిల్ల నీదే! కాలవ్యవధి కలదు.' కిరీటి యొకమహర్షి యాశీర్వదించినట్లు సంతోషించెను. ధర్మారావంతటి మహాకవి యనినతరువాత నట్లుఁగాక పోవునా? కవు లమోఘవచస్కులు. వారివాక్కులు జరిగితీరును. అట్లయినచోఁ గిరీటియుఁ గవియే అతఁడు శశిరేఖా ప్రణయగీతము లని తనయనుభవమంతయుఁ దనప్రేమయంతయుఁ గవిత్వరూపమున వ్రాసెను. అతని కవితాపద్ధతి బహురమ్యతరమై యతఁడు పోయిన మార్గమున నతఁడే ప్రభు వన్నట్లు తోఁచును.

ఇరువురును లేచి యూరిలోనికి బయలుదేఱిరి. దూరముగా నెడమ వైపున రైలు వచ్చుచుండెను. కిరీటి 'అప్పుడే యెనిమిదిగంటలైనదే!' ధర్మారావు 'నీవు నీ ప్రణయకథ తేలనిత్తువా? చెప్పినదే

చెప్పి పునరుక్తిదోషము తెత్తువు. ఈ దోషము నీ రచనయందు లేదు. నీవు మాట్లాడుటయం దున్నది. అదియైనను దక్కిన విషయములు మాటాడునప్పు డుండదు.' ఇరువురును గలిసి గ్రామములోనికి బయలుదేఱిరి. కొంచెము తుప్పర పడుచుండెను. కాలేజీవద్దకు వచ్చు వఱకును దుప్పరదుప్పరగానే యున్నది. 'ఇంక వాన కురిసినను ఫరవా లేదు' అని కిరీటి యనెను. ధర్మారావు 'అస లింక కురియానే కురి యదు. మఱల రాతి రెప్పుడైనఁ గురియునేమో కాని.' కిరీటి 'ఒక వేళ నిప్పుడు కురిసినను పంకజమ్మగారియింటికిఁ బోవచ్చును.' ధర్మా రావు 'కాలేజీయే యున్నది కదా!' కిరీటి 'పంకజమ్మగారికూఁతురు శ్యామల చదువుచున్నదా?' ధర్మారావు 'నీవు వారి నెట్లెఱుఁగు దువు?' కిరీటి 'వీరి దసలు నెల్లూరేకదా!' ధర్మారావు 'ఆ! చదువు చునే యున్నది. కళాశాలలోఁ గుమారస్వామి యని యొకపేద బ్రాహ్మణవిద్యార్థి యున్నాఁడు. అతఁడును, శ్యామలయు, బరస్పర ప్రణయలేఖలు వ్రాసికొనిరి. ఈలేఖలు వ్రాసికొనుట సంవత్సరము నుండి జరుగుచున్నదఁట. అది మొన్న బయటికి వచ్చినది. కళాశా లలో నిట్టిపని జరిగినదని కళాశాలమర్యాదకు భంగమగునేమోయని శివరావుగారు పంకజమ్మగారితో మాట్లాడిరి. పంకజమ్మగారు ప్రథమ మునఁ గోపించినను దరువాత శాంతించినట్లే తోఁచినది. ఆమె కూఁతును గోపించి కుమారస్వామిని దమయింటికి రావలదని శాసించి నదఁట. శ్యామల రెండు మూన్నాళ్ళు తల్లి కెదురుతిరిగి యన్నము తినలేదు. అందుచేఁ బంకజమ్మగారు మఱలఁ గుమారస్వామిని రాని చ్చుచుండెను. పంకజమ్మగారికిఁ గుమారస్వామి పేదవాఁడన్న యభ్యంతరమేకాని మఱొక యభ్యంతరములేదు. ఆమెయుఁ గూఁతు నకు బ్రాహ్మణు నెవనినైనను దెచ్చి చేయవలయు ననియే యున్నది. ఇప్పుడు కుమారస్వామి వారియింటికి రాకపోకలు చేయు చుండెను.' కిరీటి 'కుమారస్వామి యనఁగా నాయెట్టని బక్కపలుచని కుఱ్ఱవాఁడేనా? ఆ రోజున నెంకిపాటలు పాడెను.' ధర్మారావు 'అతఁడే.' కిరీటి 'పంకజమ్మగారిని నీ వెఱుఁగుదువా?' ధర్మారావు 'కొద్దిగా నెఱుఁగుదును. ఒకటి రెండుసార్లు కళాశాలకు వచ్చినది. వారి పొలములన్నియు నిందాఁక మనము కూర్చున్నస్థలమునకు బడ

మటగా నుండును. రైలురోడ్డు నానుకొని యుండును. రెండువందల యెకరము లున్నదట. అవియన్నియు నామె భర్త సముద్దారుగా నున్నపుడు లెక్క లడ్డదిడ్డముగా వ్రాసి కృష్ణమనాయని గికురించి నవే: ఆయన యైదాఱేండ్లక్రిందట నా కాగితములు బయటపెట్టి పొలములు స్వాధీనపఱచుకొనుటకు వచ్చినప్పుడు నాగేశ్వరరావుగా రడ్డుతగిలెను. వ్యవహారము హైకోర్టుదాఁక పోయి రెడ్డి పక్షమే యయ్యెను. రామిరెడ్డి మంచి తెలివిగలవాఁడు. కిరీటి 'తెలివికలవాఁడు గనుకనే పంకజమ్మను పెండ్లాడెను. రామిరెడ్డికి మాకు దూరపు చుట్టరికములు కలవు రామిరెడ్డి మొదట నేమియు లేనివాఁడు. తరువాత మా తాతగారే రామిరెడ్డికి సముద్దారీ వేయించిరి. నెల్లూరు వైపున మీాజమీాందారులకు నాలుఁగైదూళ్ళున్నవి. వానిమీాఁద రామిరెడ్డికి సముద్దారీ యిచ్చిరి. ఆయనకప్పుడు నెలకుఁ బదునేను రూపాయల జీతమఁట. ఆయన యప్పుడప్పుడు సుబ్బన్నపేటకు వచ్చుచుండెను. ఎప్పుడో కృష్ణమనాయని బోల్తాకొట్టించి, రాజ్యమునకుఁ దానేదో మేలుచేసినట్లు కనఁబఱచి యీ రెండువందల యెకరములును తనపేర వ్రాయించుకొనెను. ఈ పొలమేమైన మంచి దేనా?' ధర్మారావు 'ముసుపు వట్టిబీడు కాలువనీటితోఁ గ్రమముగాఁ జుట్టుపట్లపొలము పల్లముచేసి సాగుచేయుచుండిరి. రామిరెడ్డి యీ రెండువందల యెకరములను మాగానిచేయవలయు ననియే యిచ్చుటికి వచ్చెను. కాని పాప మాయుర్దాయము లేక చనిపోయెను. ఇప్పుడు పంకజమ్మగారు దాని నంతయు బాగుచేయవలయు ననియే ప్రయత్నములు చేయుచున్నది.' కిరీటి 'వారికి జాల యప్పు లున్నవి. నెల్లూరిలో మఱికొంత యాస్తియున్నది. ఆ యాస్తి పంకజముగారిది. అప్పులు తీరినను మఱికొంతయాస్తి మిగులవచ్చును.' ధర్మారావు 'పంకజమ్మ యన నెవరు?' కిరీటి 'ఈమె తల్లి రోహిణమ్మగారు. తండ్రి కైలాసపతిగారు. కైలాసపతి చిన్నప్పుడే క్రైస్తవులలోఁ గలసెను. వారు పుదూరు ద్రావిడులు.' ధర్మారావు 'అల్లాడికృష్ణస్వామయ్యరుగారు, వేదము వేంకటరాయశాస్త్రిగారు మొదలైనవారు పుదూరు ద్రావిడులేనఁట. ఆ ద్రావిడులందఱును చాలబుద్ధికుశలు లఁటగదా!' కిరీటి "అవు నని చెప్పుమను కైలాసపతి వెంటనే

రోహిణమ్మగారును మతము పుచ్చుకొనెను. వారికిఁ బంకజమ్మగా రొకతియే కూఁతురు. తరువాతఁ గైలాసపతి యేదో మంచియుద్యోగము చేసెను. అందులోఁ గొంతధనము సంపాదించి యది కూఁతురు పేర వ్రాసెను. చివరిదినములలోఁ గైలాసపతికిఁ గ్రైస్తవమతము మీఁద నిరాదరణ కలిగెను. పైకి వారు తమలో భేదములు లేవనియు, సందఱను నొకటియే యనియుఁ జెప్పుదురుగాని లోనఁ జచ్చినన్ని శాఖలు. యూరపియనులకు నొకచర్చి. హిందూదేశస్థులైన క్రైస్తవుల కొకచర్చి. వీరిని దెల్లవారు దగ్గఱకు రానీయరు. వీరు కలసిమెలసి తిరిగినచోఁ దెల్లవారు తమజాతిగౌరవము భ్రంశము నొందు ననుకొందురఁట. కైలాసపతి కిది నచ్చలేదు. పైని దివ్యమైన తన బ్రాహ్మణమతము పోయినదని దుఃఖించ మొదలుపెట్టెను. మఱల బ్రాహ్మణులలోనికి రావలయు నని యాయనయూహ. కాని యట్లు జరుగుటకు వీలులేకపోయెను. అతఁడు గ్రామములోనున్న తమబంధువులవద్దకుఁ బోయి మాటాడుచుండును. అతఁడు మాట్లాడుచు 'మనము మనము బ్రాహ్మణులము. ఈ క్రైస్తవులను నమ్మరాదోయి' యనుచుండెడివాఁడు. 'వా రేఱుదాఁటి తెప్పతగులవేయుదురు. తమపనియైనంతనే మనుజులను దిరస్కరింతురు. వారి కెంతసేపటికిని దమమతములోనికిఁ గ్రొత్తవారిని జేర్చుకొనవలయుననియే తప్ప వారికి సమానగౌరవ మీయవలయునని కాని, యితరమతములలో నున్నవారుకూడ మనుష్యులే యనికాని యుండదు' అనుచుండెడివాఁడు. ఆయనకుఁ గందిపచ్చడి చాల నిష్టము. ఆయన బ్రాహ్మణగృహములకుఁ బోయి 'అమ్మాయీ! కొంచెము కంది పచ్చడి చేసిపెట్టుము. తిని చాలరోజులైనదమ్మా!' యనెడివాఁడట. ఆయనకు విద్యార్థులందఱు కందిపచ్చడి యని పేరు పెట్టిరి. ఆయన బిళ్ళగోచిపెట్టిబట్టలు కట్టెడువాఁడు? శిరమున గోష్పాదమంత జుట్టు. అచ్చముగా వైదికబ్రాహ్మణునివలె నుండెడివాఁడు. పంకజమ్మ వారికి మతములోఁ గలియుకముందే పుట్టెను. అప్పటికీమె యేడాదిపిల్ల. పాపము! వారు మతములోఁ గలసినతరువాత 'అయ్యో! బ్రాహ్మణమైన వంశము కర్మభ్రష్టతలోనికిఁ దెచ్చితిమే' యని దుఃఖించిరి. తమకుఁ గలిగినశిశువులు క్రైస్తవు లైపో

దురు. వారికిఁ బెండ్లి యాడుటకు మతాంతరులైన బ్రాహ్మణులు దొరకరు. తనవంశములో నాంగిరసాది మహర్షుల రక్తముతోఁ గలసి నీచరక్తములు ప్రవహించుట కిష్టములేక యతఁడు నాఁట నుండి సంసారముచేయుట మానివేసెను. ఆ జీవి పాప మెంత దుఃఖించెనో! చివరిరోజులలో నాయన క్రైస్తవమతమును బరిత్యజించి యార్యసమాజములోఁ జేరెను. అది యార్యసమాజమునందు గౌరవ ముండి కాదు. మఱియుఁ గ్రైస్తవము కాకుండ నుండు నని. పంకజమ్మగారికి సంఘసంస్కారవివాహములు చేసికొనుట కిచ్ఛగించు బ్రాహ్మణవరుని దెత్తమని చాలప్రయత్నించెను. అది కుదురలేదు. రామిరెడ్డి మంచిధనాశాపరుఁడు ఎచ్చటనైనను ధనలాభము కలుగుచున్నఁదనగా నేదియైననుజేసెడివాఁడు. కైలాసపతికిఁ బది పదునైదు వేలు ధనము నిలువయున్నది. పదిపదునొకండెకరముల పొల మున్నది. అదియంతయుఁ బంకజమ్మకు వచ్చునని యతనికిఁ దెలియును. వారిపుడు క్రైస్తవులుగూడ గారు. బ్రాహ్మణస్త్రీ సర్వము బాగున్నదని రెడ్డి పాచిక వేసెను. అది పాఱినది. కైలాసపతి కిష్టము లేదు. కాని పంకజమ్మకు రామిరెడ్డికిఁగల సంబంధము గ్రామమంతయుఁ దెలిసిపోయెను. ఆయన యంగీకరించక తప్పకవచ్చెను. వారికిఁ బెండ్లియైనది. కైలాసపతి మరణించెను. రోహిణమ్మగారుకూడ నా మఱుసంవత్సరమే చనిపోయినది తరువాత వారీగ్రామము వచ్చిరి.'' ధర్మారావు 'ఉద్వేగమంతటి దేదియు గాదు. అందులోఁ బై మెఱుపులుకల ప్రతివిషయమునందును నల్పసంస్కారముకల బుద్ధి పరిభ్రాంతి పొందును మన మతమెంత కఠినమతమో కాని, యొకసారి చేసిన తప్పును సర్దుకొన నీయదు.' కిరీటి 'అది సృష్టి ధర్మము. కఠినముగా శాసించు రా జేమిచేయును? ఒక యుద్యోగి యెడల నొక దోషము కలిగెనే నది కారణముగా వానిని మఱల నుద్యోగమునకు రానీయకుండ శిక్షించుటలేదా? ఇదియే మతవిషయమున జరిగెనేని కాఠిన్యమందురు.' ధర్మారావు 'మన మిచ్చట నిలుచుండి యెంతసేపిట్లు మాటాడుట? ఇద్దఱమును మంచి తెలివికల వారము. ఇచట నిలుచుండి మాటాడుచుంటి మని యింతసేపు నీకుఁ దెలియలేదు, నాకును దెలియలేదు. అప్పుడే రాతిరి పదిగంటలైనది

నీవు హోస్టలులోనికిఁ బోయి యన్నము తినిరమ్ము.' కిరీటి 'యింక నా బ్రాహ్మణుఁ డన్నము పెట్టఁడు. అతఁడు తలుపువేసి లేచిపోవును,' ధర్మారావు 'మా యింటికి రాపోదము; అరుంధతి యావకాయ కారమువేసి పెట్టును. తిందువుగాని.'

జోస్యులు మఱల మంగమ్మతోఁ గాఁపురము చేయుచుండెను. లోకులందఱు నతని చీచీ యనిరి. రామేశ్వర మతనిని బెదరించెను. 'నీ వల్లరి చేసితివా, నీ యుద్యోగము తీసివేసెదను. డి. ఇ. ఓ. తోఁ జెప్పి నీవు బ్రదికియుండఁగా మఱల నీ కుద్యోగము కుదురనట్లు చేసెదను. నెలకు నీకుఁ బాఠశాలలో నిచ్చుచున్న జీతముగాక యేఁబది రూక లిచ్చెదను' అని కబురంపెను. జోస్యులు విచారించెను: 'బ్రతికి నంతవఱకు క్షున్నివారణార్థము భోజనము చేయవలయునుగదా! దేశముమీఁద లేచిపోవుద మనిన బిచ్చ మెత్తుకొనుటయే. కాని చనిపోవుదమనిన నాత్మహత్య చేసికొనుటకు మనసొప్పుట లేదు. అయినను శత్రువు బ్రతికియుండఁగా చచ్చి యెవరిని సాధింతును? నాశత్రువు నాకన్నఁ బ్రిబలుఁడు. అతనిని నే నెట్లును సాధించలేను. అయినను బ్రయత్నము చేయుదును' అని రామేశ్వరము పంపించిన రాయబారమున కంగీకరించెను. పూర్వమున్న యింటిలోననే మంగమ్మయు, జోస్యులును గాఁపుర ముండిరి. అతఁడు సిగ్గన్నది వదలిపెట్టిన ట్లుండెను. అందఱు తన్నుజూచి నవ్వుచుండి రని యతనికిఁ దెలియును. అతనికి లెక్కలేదు. అతఁ డెప్పుడును వీధి యరుఁగు మీఁదనే పండుకొనును. ప్రొద్దుననే లేచి స్నానముచేసి, కొంత జపముచేసికొని యన్నము తానే వండుకొని తినును. పాఠశాలకుఁ బోవును. ఏమియుఁ బనిచేయఁడు. అడుగువా రెవ్వరులేరు. సాయంకాల మింటికి వచ్చును. రాత్రులందు భోజనముచేయఁడు. మఱల నరుఁగుమీఁద బండుకొనును. తెల్లవాఱులు నూహలోఁ జిత్రవిచిత్రములైన యుపాయములచేత రామేశ్వరమును శిక్షించును. మంగమ్మను గత్తి కొకకండగాఁగోసి కాకులకు వేయును. ఒకప్పుడు రామేశ్వరమును దా నురిదీయును. ఒకప్పుడు దుర్యోధనునిశిరస్సు భీముఁడు వోలెఁ దాను రామేశ్వరముతల తన్నును. ఒకప్పుడు పాపారాయఁడు విజయరామునివలె రామేశ్వరమునొడలినిండఁ గత్తులతోఁ బొడు

చును. మఱియొకప్పుడు విరాగియై హిమాలయప్రాంతములకుఁ బోయి తపస్సుచేసికొనును. మఱియొకప్పుడు పిచ్చివానివలెఁదిరుగుచుండును. పిల్లలతనిమీఁద ఱాలు రువ్వుచుందురు. తెల్లవాఱ వచ్చును. నిదుర పట్టదు. ప్రొద్దుననే లేచి స్నానముచేయును. ప్రాణము నిస్సార మని పించును. ఒక్కొక్కప్పుడు తోడియుపాధ్యాయులలో నెవరియింటి కైనఁబోయి భోజనముచేయును. ఎవ్వరితోడను మాటాడఁడు. పాఠ శాలలోఁ గుర్చిలోఁ బండుకొని నిదురపోవును. ఒకసారి రామేశ్వరము తనిఖీకి వచ్చినాఁడు. జోస్యులు నిదురపోవుచుండెను. ఎవరో జోస్యు లను నిదుర లేపిరి. జోస్యులు కన్ను తెఱచిచూచెను. రామేశ్వర మెదురుగా నిలుచుండెను. జోస్యులు కన్నుమూసి మఱల నిదురపో నారంభించెను. రామేశ్వర మింటికిఁ బోయి 'నీవు సరిగా పాఠములు చెప్పుటలేదు. నేను వచ్చినప్పుడు కుర్చిలోనుండి లేవనైన లేవక నిదుర పోవుచుంటివి. దీని కేమి సమాధానము చెప్పెద' వని కాగితము పంపించెను. రామేశ్వర మిట్లు చేసెడివాఁడు కాఁడు; ఈ కథ తక్కిన యుపాధ్యాయు లందఱి యెదుట జరిగెను. ఊరకుండినచో బాగుండ దని రామేశ్వర మిట్లు చేసెను. జోస్యులు తా నిట్లు చెప్పిన నట్లు నడచునని, తన ప్రవర్తనకు నతఁ డంగీకరించెనని రామేశ్వరము తలఁచెను. ఇట్లు కాగితము వ్రాయుట జోస్యులను శిక్షించుటకుఁ గాదు. తాను మంగమ్మకుఁ బ్రియుఁ డగుటలో గల శృంగారచేష్టలలో నిదియు నొకటి. దీనికి జోస్యులు మౌనము వహించవలయు నని రామేశ్వరముగారియూహ. ఇందు వలన జోస్యులకు శిక్షయేమియుఁ గలుగదు. కాని యా యుత్తరము చూచినంతనే జోస్యులు మండిపోయెను. అతఁడు మఱలఁ దిరిగి సమా ధానము వ్రాసెను. 'ప్రియమైన రామేశ్వరముగారూ! మీ కాగి తము వచ్చినది. నేను పాఠశాల తెఱచిన రెండునెలలనుండి పనిచేయు టయే లేదు. నిద్దురయేపోవుచుంటిని. నేను సరిగా నాధర్మము నేను చేసినచో నేను పెండ్లియాడిన స్త్రీ మీ కేల యుంపుడుగత్తె కావ లెను? ఇది మీ యాజ్ఞాప్రకారమే చేయుచుంటినికదా! నేను పెండ్లి యాడిన స్త్రీతో మీరు సుఖపడునట్లు, నాకు జీతముపేర నెలకుఁ బాతికరూపాయలును, నామెతోఁ గలసి యొకయింట నున్నందు

కేబదిరూపాయలును నిచ్చునట్లు-ఇది మనమధ్య ఖరారు. మీరు నాకు కాగితములు, గీగితములు పంపించవలదు-ఇట్లుమీసపత్నీకుఁడు జోస్యులు' అని వ్రాసి జోస్యులాయుత్తరమును బంట్రౌతున కిచ్చి తక్కినయుపాధ్యాయులందఱికిని జూపించి తీసికొనిపొమ్మని చెప్పెను. కొందఱుపాధ్యాయు లాయుత్తరమును జూచి జోస్యులు వట్టి నపుంసకుఁ డనిరి. అవివేకి యనిరి. కొందఱు 'చూచితిరా, పాప మా జీవుఁ డెంత దుఃఖించుచున్నాఁడో!' యనిరి. మఱికొందఱు 'కొలఁది దినములలో రామేశ్వరముగారో, జోస్యులో యిద్దఱిలో నెవరో యొకరు చనిపోవుటకే వచ్చిన'దనిరి. రామేశ్వర మీయుత్తరమును జూచుకొనెను. ఈ యుత్తరమును దక్కినయుపాధ్యాయులుకూడఁ జూచిరని తెలిసికొనెను. క్రోధఘూర్ణితతామ్రాక్షుఁ డయ్యెను. జోస్యులునకుఁ దనమీఁద నింతకసియున్నదని యతనికిఁ దెలియలేదు. ఈ వ్యర్థుఁడైన బ్రహ్మగాఁ డేమిచేయు నని యూరకుండెను. చిన్నపాము నైనను పెద్దకఱ్ఱతోఁ గొట్టవలయును. ఊరకుండరా దని మఱల విచారించెను. రెండుమూన్నాళ్లైన తరువాత నొకనాఁడు రాత్రి యరుఁగు మీఁద బండుకొన్నవాఁ డేదో యూహించియూహించి జోస్యులు హఠాత్తుగాలేచి యింటిలోనికిఁ బోయెను. ఈ రెండునెలలు వారున్నభాగమునకు వీధితలుపు మూయఁబడి యుండలేదు. అతఁడు లోనికిఁబోయి చూచెను. మంగమ్మ నిద్రపోవుచుండెను. అతఁడామెను నిద్రనుండి లేపెను. ఆమె లేచి యాశ్చర్యపడి చూచుచుండెను.

జో—''అవునుగాని, నేను వారముపదిరోజులలోఁ జచ్చిపోవుచున్నాను. నీవు దుఃఖపడుదు వని నీతోఁ జెప్పుట లేదు. నీవు చెడిపోయినదాన వెట్లును జెడిపోతివి. నేను చనిపోయినతరువాత బ్రాహ్మణ విధవవై యిట్లు బ్రతుకుట యెందులకు? నీ కొక యుపాయము చెప్పెదను, చేయుము. రామేశ్వరమునకు స్థిరాస్తి వారియూరిలోగాని యిచ్చుట లేదు. వా రన్నదమ్ములు విభాగముకాలేదు. ఆయన నీకు వ్రాసియిచ్చినను జెల్లదు. ఈ సంవత్సరముతో నాయన ప్రెసిడెంటు తనము పోవును. తరువాత నీ కిచ్చెడిదేమిటి, చచ్చెడిదేమిటి? నే నరుఁగుమీఁద పండుకొని యుందును' ఇంత తెలిసినదానికిఁ బగలు మాత్రమే యేమి? రాత్రిగూడ రమ్మను: రెండు సినిమాలకు గలసి

వచ్చిన డబ్బేనాఁటి దా నాఁడు నీచేతిలోఁ బెట్టవలయును. అతనివద్ద నెప్పు డేబాపతు దమ్మిడీవచ్చినను సరి యీ తక్కిన యెనిమిదినెలలును దీసికొనుము. అతఁడు నిన్నే మిక్కిలిగా మఱుగునట్లు కొన్ని యుపాయము నేర్పించెదను. పురుషులను వశముచేసుకొనుట యెట్లో యది విద్యగాఁ జదివిన యొకదాసిది కలదు, కాసాపేటలో. దానితో మాట్లాడివచ్చితిని. అది ఱేపీపాటినుండి యిచ్చటికి వచ్చి నీకన్నియు బోధించును. నీవు రామేశ్వరమును బుక్కాపకీరును జేయవలయును. ఇది నీ మేలుకోసమే చెప్పుచున్నాను నాపగ తీరుటకుఁ గాదు. నాపగ యిట్లు తీరదు.

నేను వదలిపోయెదను. అతఁడును వదలిపోవును. అప్పుడు నీ వెట్లు బ్రతికెదవో యాలోచించుము. నీకుఁ బదునేడేండ్లకన్న నెక్కువ లేవు. నేను చనిపోయినంతనే మీవాండ్రుకాని, మా వాండ్రుకాని వచ్చి కర్మలకు నిన్ను రమ్మందురు, నిన్ను బ్రాహ్మణవిధవను జేయుటకు. దాని కొప్పుకొని బ్రాహ్మణ్యము పాడుచేయకుము. దానికిఁ దగినంతమంది వేఱే యున్నారు. నిన్ను దీసుకొనిపోయి రామేశ్వరము నెచ్చటనైన దాఁచుమనును. ఈయెనిమిదినెలలు నేను చెప్పినట్లు చేసితివా, పదిపండ్రెండువేలు నీవద్దఁ జేరును. ఈ నిర్లజ్జమైన లోకమున నప్పుడు నీ వాడినది యాట, పాడినది పాట. ధనవంతుఁ డగుటచేతనేకదా రామేశ్వరమింతపని చేసినది. వానిని గొఱిగించి నీవు ధనవంతురాల వగుము. సృష్టిలో వీఁడే పురుషుఁడు కాఁడు గదా! నీవు ధనవంతురాలవైనతరువాత నెంతయెంత చేసెదవో నీకే తెలియఁగలదు. రామేశ్వరమువలెఁ బ్రెసిడెంటువే కావచ్చును. నేను చెప్పిన ప్రతిమాటయు మననము చేసికొనుము. పొరపాటు పడకుము. అనాథుఁడు, చేతగానివాఁ డేదో చెప్పె ననుకొనకుము. ఒకవేళ నేను చెప్పిన యీ సంగతులన్నియు రామేశ్వరముతోఁ జెప్పి నాకింకనుబరాభవము సమకూర్చవలయునని తలఁతువేని నీమాట లతనితోఁ బదిరోజులుదాఁటినతరువాతఁ జెప్పుము. అంతవఱకును జెప్పకుము. అతనితోఁ జెప్పను, చెప్పినను పదిరోజులైనతరువాతఁ జెప్పెదనని నా చేతిలోఁ జేయి వేయుము.'' మంగమ్మ పదినిమేషములు విచారించి యతని చేతిలోఁ జేయివైచెను. తదపవిత్రస్పర్శచేత జోస్యులశరీరమంతయు

విషద్రవములో ముంచి మూకులుపెట్టి పొడిచిన ట్లయ్యెను. అతఁడింతసేపు పిచ్చివానివలె మాటాడెను. తిరిగి బయటికిఁ బోయెను. అరుఁగుమీఁదఁ బరుండెను? బరుండుటకు బుద్ధిపుట్టలేదు. 'మంగమ్మ తాను చెప్పినట్లు చేయునా? చేయును, చేయకపోవును. దానివలన దన కేమి లాభము? ఆఁడదానాశ్య. జోస్యులు గ్రామము వెంటఁ దిరుగుటకు బయలుదేఱెను అటు దేవాలయమువైపు పోవుటయా, ఇటు సినీమావైపు పోవుటయా? చివర కటు నిటుగాక పశ్చిమ దిక్కుగా నడచెను. కోటరోడ్డుమీఁదికి వచ్చి వెనుదిరిగి కొంత దూరము నడచి కోటదక్షిణదిక్కుడ్యము వెంటనే పోవుచుండెను. కుడి వైపున సుమారు మైలుపొడుగున కోటగోడ వ్యాపించియుండెను. ఏదో పెద్దదయ్యము తాడిమెత్తున నిలుచుండి తనవెంటనే వచ్చుచున్నట్లుండెను. ఎడమవైపున బోగముపేఁట, కాసాపేఁట యనికూడ నందురు. తెల్లవారుజామున రెండుగంటలు కావచ్చెను. నిజముగా నది నడురాత్రి. ఒకటి రెండు కుక్క లతనిని జూచి మొఱిగెను. మఱి కొంతదూరముపోయినతరువాత నతఁడు దేనిమీఁదనో కాలువేసెను. రెండడుగులు వేసి భయపడెను. అది పామేమో! మఱల రెండడుగులు వేసి తనకు భయ మెందుకో తెలిసినది కా దనుకొనెను. రామేశ్వరము ప్రెసిడెంటైనతరువాత కాసాపేఁటలో చివర మేడ వేసెను. పురపాలకసంఘపు ఎన్నికలలోఁ గబీరు నోడించి కాసాపేఁటతరఫున తాను గెలువవలయు నని యతనికిఁ బెద్దయాశ. అప్పుడు తనజీవితములో నతఁడు గొప్పకార్యము చేసినవాఁ డగును. జోస్యులు వాని యింటిముందుఁ బోయి నిలుచుండెను. అతనిమెదడులో లక్షలు కోట్లు న్యర్బుదములు ప్రయోజనముమాలిన యూహలు షేక్సుపియరు వ్రాసిన డెన్మార్కుయువరాజన్న నాటకము కథానాయకుని బుఱ్ఱలోవలెఁ జెలరేఁగెను. నిరర్థకములైన యా యూహలన్నియు నినుమును త్రుప్పుతిన్నట్లతనిహృదయమును దినుచుండెను. కోటలో నాలుగు గంటలు కొట్టిరి. అతఁ డటుపడి రైలుస్టేషనునకుఁ బోయెను. అచ్చటికి వచ్చునవిగాని, పోవునవిగాని బండ్లు రాత్రిపూఁట లేవు. ఒంటిస్తంభపు మేడవలెనున్న యా స్టేషను పెద్దబంగరుబయలులో దిక్కులేనివానివలె నొంటరిగా నిలుచుండెను. జోస్యులు స్టేషనులోనికిఁ

బోయెను: తలుపులు వేసియున్నవి. ఎవ్వరును లేరు. ఆత్మబంధువు నాదుకొన్నట్లతఁడా స్తంభమునకొరగ నానుకొని కొంతసేపు నిలుచుండెను. ధ్వని కీచురాళ్ల స్వనము. వెలుఁగు మినుకుమినుకు మనుచున్న తారలది. గాలి తన నిశ్శ్వాసమునది. తక్కిన ప్రపంచమంతయు నిశ్చైతన్యమైనట్లుండెను. ఇంతలో దూరమున నుషోరాగముతోఁ చెను. జోస్యులకు వెలుఁగనినఁ గిట్టలేదు. దివాంధమువలెఁ బోయి యే యడవిలోననో దాఁగుకొందమనుకొనిన నతనిమనుష్యావయవములతని కాటంకము కలిగించెను. ప్రాణము లున్న వున్నట్లేలపోరాదో? ఒకవ్యాధి యేల రావలె? ఒకయురి యేల తీయవలె? ఒక రైలుక్రింద నేల పడవలె? ఒక కత్తిదెబ్బయో తుపాకిదెబ్బయో యేల తగులవలె? జోస్యులు శరీరముచేత నుండి లేనట్లుండలేకపోయినను, మనసుచేత మాత్రము లేనట్లే యయ్యెను. ఆ జీవి యున్మత్తునివలె నా చీఁకటిలోఁ బరుగులెత్తెను.

తరువాత నాల్గురోజులవఱకును జోస్యులు కనిపించలేదు. ఐదవనాఁడు సాయంకాలము రామేశ్వరము సినీమాకుఁ బోవుచుండెను. పొద్దుసరిగాఁ గ్రుంకలేదు. చేతిలో నేదియో పుచ్చుకొని యెదురుగా జోస్యులు వచ్చుచుండెను; జోస్యులు పిచ్చివానివలె మలినవసనములు చింపిరిజుట్టుతో నుండెను. రెండునెలలనుండి యొకపూఁటయు, నాల్గురోజులనుండి యసలుతిండియులేక యతఁడు గాలివలెఁ తూఁగిపోవుచుండెను. రామేశ్వరమువెంట ముగ్గురు తాలూకాబోర్డు మెంబరులు వచ్చుచుండిరి. సినీమాహాలులోని రౌడీలు ముగ్గురు వచ్చుచుండిరి. రామేశ్వరము దగ్గఱకు వచ్చినతరువాత జోస్యులు బట్టచాటుననున్న కత్తినెత్తి రామేశ్వరమును బొడవఁబోయెను. ఓపికలేక తూఁలిపోయెను. ముగ్గురురౌడీలు నతనిమీఁదను పడిరి. పెద్దమనుష్యులు వారిని విడఁదీసిరి. రౌడీలు చావమోదుటచేత నసలే యోపికలేని జోస్యులకుఁ బ్రాణముకడఁబట్టెను. రామేశ్వరము భయపడెను. వారును వీరు నీరుఁ దెచ్చి చల్లిరి. గంటసేపటికతఁడు లేచి నెమ్మదిగా నడచిపోవుచుండెను. వానిని జూచి కొందరు బెదరించిరి. కొందఱు నవ్విరి. కొందఱు రాళ్లు విసరిరి. ఒక బలాధికుఁడు తూలిపోవుచుఁ బోవుచున్న యతనికిఁ గాలడ్డముపెట్టెను. జోస్యులు బొక్క

బోర్లగాఁ బడెను. జోస్యులుముక్కు పగిలి నెత్తురు కారుచుండెను. మొగమంతయుఁ జెక్కులూడెను. చీఁకటిలో నెత్తు రెవరికిని గన్పించ లేదు. జోస్యులు లేచిపోవుచుండెను. రాతిరి రెండుజాములవఱకు నతని మనస్సు పాతాళలోకమందును, శరీరము భూలోకమందును దిరుగు చుండెను. రాతిరి రెండు జాములప్పుడు గుండెలేనంతెనదాఁటి చీకఁ టిలోఁ బోవుచున్న యతనినడినెత్తిన నొకదండఘాతము తగిలెను. అతనిప్రాణము లదివఱకే పోయెను. అప్పుడు పోయినది శరీరము గూడను. గాంధాంధతమసము లావరించిన యా మహాకాళరాత్రి యాదెబ్బకుఁ బ్రతిధ్వని కలిగించుటకు నెఱదిక్కాఁబోలు, టప్పు మని సరిగా ధ్వనించకయే భయనిశ్శబ్దరేఖాపరీవృత యయ్యెను.

ఒకనాఁటి సాయంకాలమున ధర్మారావు కాలేజికిఁ బోయెను. కిరీటి పరిదీనవదనుఁడై యుండెను. అతనిమొగము చూచినతోడనే ధర్మారావునకు గుండె గుభేలు మనెను. కిరీటిని దాను దివారాత్ర ములు పోషించుకొనుచుండెను. అతఁడు మల్లెపూవువంటివాఁడు. ఏమాత్రము బెడదగాలి వీచినను తునిఁగిపోవును. ఏమి దుర్వార్త వచ్చెనో? ధర్మారావు సమీపించి కిరీటివంకఁ జూచెను. అతఁడు దుఃఖమునిండిన కనులతో జేబులోనుండి యుత్తర మొకటితీసి ధర్మా రావుపైకిఁ బడవేసెను. ధర్మారా వుత్తరముచూడఁగా 'గిరీటితల్లికిఁ బ్రాణముమీఁదికి వచ్చినది. వెంటనే బయలుదేఱి రావలయు'నని యున్నది. కిరీటిమొగములో నెత్తురుచుక్కలేదు. ధర్మారావు 'నాయనా! భయములేదు! ఏదో కొంచె మెక్కువచేసి యుండును! నిజముగా నుత్తరములో నున్నట్లే యయినచోఁ దంతియే యిచ్చెడి వారు. భయములే'దని చెప్పెను. కిరీటి 'అన్నా! మా యమ్మకే జబ్బుచేసెనా? అని ధర్మారావును గౌఁగిలించుకొని యేడ్చెను. ఆ మాటలోఁ గిరీటిజీవితమంతయు ధ్వనించెను. ధర్మారావు హృద యములో సుడులు తిరిగెను? రైలాఱుగంటలకు. రైలునకుఁ బోవు టకు గంటవేళ యున్నది. కిరీటి రైలెక్కువఱకు భయములేదన్న మాట ధర్మారావు వందసారు లనెను. రైలు బయలుదేఱఁ బోవు చుండెను. —కిరీటి 'అన్నా! మొన్నిసార్లన్ననుభయము లేదనెదవు. అమ్మ బ్రతుకునా? బ్రతుకదా?' ధర్మారావు 'నాయనా! భయము

లేదు, భయము లే'దనెను. ఆ రైలు కదలిపోయెను. ఏమి కదలుట? సుబ్బన్నపేటవఱకు దానికి సామాన్యజనులు లంకణాలబో టని పేరుపెట్టిరి. రోకలిబండవలె నెమ్మదిగా నడచుచు, దూరమునకుఁ దోఁచెను.

ధర్మారా వింటికి వచ్చెను. అరుంధతి వెక్కిరింపుగా 'ఒక్కరే వచ్చిరి. తమ్ముఁ డేడి' యనెను. ధర్మారావు-'కిరీటితల్లికిఁ బ్రాణము మీఁదికి వచ్చినదఁట. అతఁడు నెల్లూరు వెళ్ళెను.' అరుంధతి—'అయ్యో! అయ్యో! తల్లికా? ఇతని పెండ్లి మాటయేమి?' ధర్మా 'అతఁడు నదియే యనుకొనుచున్నాఁడు. కిరీటితల్లి చనిపోయిన తరువాత నతనిమామ మేనల్లునిమీఁద దయకలిగిన పిల్లనిచ్చెను. అరుంధతి—మఱి పదేను లైనతరువాత నాతలిదండ్రులకును, నాకును మఱలఁ బ్రేమ యంకురించును. ధర్మా—'ఇంకఁ బదేడులకా?' అరుంధతి తెల్లపోయిచూచెను. అది శరదృతువు. వెన్నెలలు కాయుచుండెను. కానిబయటఁబండుకొనుటకుచిఱుచలిగానున్నది. అయినను ప్రొద్దుపోవువఱకును జనులు బయటనే పండుకొనుచుండిరి. అరుంధతి ప్రక్క బయటవేయును. రాతిరి పన్నెండుగంటలకు లోనికిఁ బోదురు. ఇంటి ప్రహరీగోడ చాలభాగములయందుఁ బడిపోయెను. మఱలఁ గట్టించుటకు ధర్మారావువద్ద డబ్బులేదు. అందుచే మునుపు కోటవలె నున్నయిల్లు మఱుఁగులేకపోయెను. అరుంధతి—ప్రహరీగోడ బాగుచేయించరాదా? ధర్మా—రాచరికము వా రనుజ్ఞ యీయలేదు. అరుంధతి—మన యింటిమాట. ధర్మా—నే నొకరి యింటిమాట చెప్పలేదు.' ధర్మారావు పుస్తక మేదో చదువుకొనుచుండెను. అరుంధతి-'ఇప్పుడు నేను పలుకరించినచోఁ గోపమువచ్చునుగాఁబోలు?' ధర్మారావు మాటాడలేదు. అరుంధతి-ఏ పుస్తకమైనను నంత బాగుండును కాఁబోలు. ధర్మారావు నవ్వెను. అరుంధతి—అనఁగా నీపుస్తకము బాగుండలే దన్నమాట. ధర్మారావు—'ఇవి యేవో యుపన్యాసములు. ఇవి వ్రాసినాయన ఆంధ్రడికెన్సఁట. నిజమే కాఁబోలు నని తీసితిని. ఆంగ్లేయులలో పిక్‌విక్ పేపర్సు యని యున్నది. అవి చాల రమ్యముగా నుండును. ఈ యుపన్యాసములు వాని ననుసరించి వ్రాయఁబడె నని చెప్పిరి. తీసి చూచితినిగదా, దీనికి దానికి నేమియు

సంబంధములేదు. చెప్పినదే చెప్పి, చెప్పినదేచెప్పి ప్రాణములు తీయుచున్నాఁడు. పలుకుబడిలో నొదుగు ఒక చిన్నవాక్యమును జెప్పి పెద్దయర్థమును స్ఫురింపఁజేయుట మొదలైన మహారచయిత లక్షణములు లేవు. ఒక శయ్యలేదు. వాచ్యత యెక్కువగా నున్నది. శబ్ద ప్రయోగమునందుఁగూడ సొగసు కన్పించుటలేదు.' అరుంధతి— 'మిమ్ము సంతోషపెట్టుట కష్టము.' ధర్మారావు-'మా మేనమామ కూఁతునకుగూడనా?'

ధర్మారావు మఱునాఁడు వంతెనవద్దకు వాహ్యాళిపోయి తిరిగి వచ్చుచుండఁగా దారిలో శ్యామల కనిపించెను. ఆమె 'మాయింటికి దయచేయురా' యనెను. ఆమె యదివఱకే జాలసారు లట్లు పిలుచుటయు ధర్మారావు పోకుంకుటయు జరిగినది. ఆ నాఁడు ధర్మారావు వారియింటికిఁ బోయెను. అతఁడు వెళ్ళినంతనే పంకజమ్మగారును, శ్యామలయు నతని నెంతయు గౌరవించి కూర్చుండఁబెట్టి యేదో ప్రసంగము సాగించిరి. ఇంతలోఁ గుమారస్వామి వచ్చెను. అతఁడు ధర్మారావునకు నమస్కరించి కూర్చుండెను. శ్యామలా కుమారస్వాము లిద్దఱు నొక మంచముమీఁదనే కూర్చుండిరి.

కుమా—మాష్టరుగారూ! మీరు తెలుఁగు బాగుగా చెప్పవలయును. ధర్మా—నీకా? కుమా—'నాకుగాదు' అని నవ్వి, శ్యామలవైపునకుఁ దలయూఁపెను. పంకజమ్మ—'అప్పుడే చూడండి! ఎంతశ్రద్ధ పుట్టినదో!' ధర్మా—'మన్మథుఁడు కడు చెడ్డవాఁడు.'

కుమారస్వామిది చక్కని గొంతుక. అతఁడు కొంచెము సంగీతము పాడెను. శ్యామల వీణ తెచ్చి రెండుకృతులు వాయించెను. కుమారస్వామి—'నాకన్న నెక్కువ సంగీతము తనకు వచ్చునని చూపించుటకు. నే నేమి చెప్పుకొంటినా?' శ్యామల-సిగ్గుతో "అందుకు, కాదండి." ధర్మారావు తిరిగి యింటికిఁ బోయెను: అతఁడు తనలో 'నిదియు బాఁగనే యున్నది. స్త్రీ పురుషదృష్టితోఁ జూచిన తప్పేమియు లేదు. పైఁగా సర్వమును సుమనోహరముగానుండును' అనుకొనెను.

అరుంధతి వడ్డించుచుండెను. ధర్మారావు 'నేను ని న్నేరి చేసికొంటినా? నా చిన్నతనములో నాబుద్ధి నాకుఁ దెలియనప్పుడు

నాతండ్రి నిన్ను నాకంటఁగట్టెను. నేనే కోరికొని చేసికొన్నచో నీకన్న నందకత్తెను, విద్యావతిని జేసికొని యుందును.' అరుంధతి- 'ఆమాటమీఁదనే నిలువఁబడుఁడు! అట్లయినచో గొందఱు పురుషులకుఁ బెండ్లియే కాదు.' ధర్మారావు—'కాకపోయిన నేమి?' అరుంధతి—'మున్న మీరే కదా చెప్పితిరి. జర్మనీలోనా? జనసంఖ్య వృద్ధియగుటకుఁ బ్రతివారును బెండ్లిచేసికొనవలసిన దని శాసించినారని.' ధర్మా-'జనసంఖ్యవృద్ధి యేమి?'అరుంధతి మాటాడలేదు. ధర్మారావు 'కూర కొంచెము వడ్డించు'మనెను. అరుంధతి "చెట్టున నాలుగు కాయ లున్నవి. కోసి వండితిని. అందులో నొకటి పుచ్చిపోయినది. తక్కిన మూఁడు మీ పంటిక్రిందికి రాలేదు." ధర్మారా వొకవిలాసపుఁజూపుఁజూచెను. అరుంధతి యొకచిత్రపుసిగ్గు పడెను ధర్మా—'కూర కొంచెమైనను మిక్కిలి రుచిగా నున్నది.' అరుంధతి—'పరధ్యానముగా నున్నారు కాఁబోలు!' ధర్మారావు- 'నే నెప్పుడు ననుకూలుఁడనే.' అరుంధతి 'స్వామిగాలిమైనఁ దగిలి యుండదా!" ధర్మారావు-'మాస్వామి హైమవతీప్రణయైకజీవి.' అరుం—'పచ్చడి వేయుదునా?' ధర్మా—'వేయుదునా? చేయుదునా?' అరుం—'నేఁడు మంచిగాలి వీచుటలేదు.' ధర్మా—'ఎట్టివానికిని నుద్రేకము కలిగించుసంగతు లుద్రేకమే కలిగించును. నేఁడు నా ప్రకృతి కొంచె ముద్రిక్తమైనది.' అరుంధతి-'అభిలాష వృద్ధిపొందవలయు నని విషయవిమర్శ చేయరాదు.' ధర్మారావు—"అట్లు చెప్పను. నీ కంతప్రియమేని విమర్శచేయను."

నాఁటిరాత్రి పండువెన్నెలలు బొండుమల్లెలలు విరిసినట్లు తెల్లనిమడతలు విప్పినట్లు, ప్రణయజీవితము వికసించినట్లు నాల్గు దిక్కులకుఁ జాల్లుకట్టిప్రవహించెను. ఆ వెన్నెల మన్మథధనుర్జ్యావినిర్గతసితకల్హారగోచివలె మృదుధ్వనియు సుపరిమళమును గల వెలుఁగులు తెచ్చెను. జ్యోత్స్నాదేవి వాయునిహితపరిమళముచే గర్భవతి యయ్యెను.

కిరీటి తిరిగి పదునేనుదినములకు వచ్చెను. మనిసి కృశించి పోయెను. మొగమునఁ దేజస్సు లేదు. ఆనాఁడు సాయంకాలమున నిరువురును గలసి మఱల వంతెన దాఁటిపోయి, పూర్వముకూర్చున్న

చోటనే కూర్చుండెను. ధర్మారావు—"కిరీటీ! చాల చిక్కిపోయి నావు. ఏమిటికథ?" కిరీటి:—"అన్నా? మాయమ్మగారు నేనుపోయి నప్పటికి మరణావస్థలో నున్నది. కడచిన రెండుమూనాళ్ళనుండి యామె కిరీటి, కిరీటి యనుచున్నదఁట. మామామకుఁగూడ నుత్తరము వ్రాయించిరఁట. ఆయన రాలేదు. మాయమ్మకు నేను వెళ్ళునప్పటికి స్మృతిలేదు. నా కామెను జూచినంతనే దుఃఖము పొంగి పొరలి వచ్చినది. నేను దగ్గఱఁగూర్చుండి 'యమ్మా'యని పిలిచితిని. ఆమె యంతస్మృతిలేకపోవుటలోనను నాగొంతుక వినిపించినంతనే కన్ను తెఱచి మాటాడుటకు శక్తిలేక కన్నులనీరుపెట్టుకొని చేయి నామీఁద వైచెను. చిన్నప్పటినుండియు నేనుమాయన్నదమ్ములలో గనిష్ఠుఁడ నగుటచేత మాతల్లి నన్ను మిక్కిలి ప్రేమించుచుండెడిది. అప్పుడు నేను నిత్యవ్యాధులచేత మిక్కిలిబలహీనుఁడనుగా నుండెడి వాఁడను. మా నాయన నన్ను బడికిపొమ్మని వేధించెడివాఁడు. నా కోపిక లేదు. ఆయన నన్నుఁ గొట్టును. మాతల్లి నన్నాదరించును. నాకుఁ బదునాఱేడులు వచ్చువఱకు సరిగాజదువు సాఁగలేదు. తరువాత మాయమ్మను నేను వదలిపెట్టియుండుట చాలకష్టముగా నుండెను. నేను నెల్లూరిలోఁ జదువకుండ బందరులో జదువుటకుఁ గారణము మా నాయనగారు. ఆయన నాయం దెప్పుడును గఠినముగా నుండెడివాఁడు. బందరులో మాకుఁ జుట్టము లున్నారు. వారి యింటఁ దిని చదువుకొమ్మని నన్నచ్చట నుంచెను. వారి యింట నుండుట నాకు దుర్ఘటమైపోయి, నేను పూఁటకూళ్ళయింటిలోఁ జేరితిని. దానికి మాతండ్రి నన్నుఁ దిట్టికొట్టి నాప్రాణములు తీసెను. మాయమ్మ సర్వవిధముల నాకు నాధారమైనది. నాకుఁ బెండ్లికాలేదని మా నాయనకు దిగులులేదు. మా యమ్మయే యారాటపడెడిది. మిగిలినయాస్తిలేదు. చదివిన చదువు లేదు. నాకు వివాహమెట్లగును? అందులో మాతల్లి చనిపోయినతరువాత మామామ నాకుఁ బిల్ల నిచ్చుట కంగీకరించనే యంగీకరించఁడు. మా యమ్మ చనిపోయిన దనినను రానివాఁడు మాతోఁ దానేమిసంబంధము పాటించును? ఆనాఁడు రాత్రి శ్లేష్మము క్రమ్మెను. మాయమ్మ చనిపోయినది. గౌరీదేవి కైలాసమునుండివచ్చినది,తిరిగిపోయినది. దౌర్భాగ్యుడనైన

నాకుఁ దల్లి యెట్లు దక్కును? నేను సర్వథా దరిద్రుఁడ నైతిని. కామధేనువో, కల్పవృక్షమో యనుకొంటిని. అట్టి మాతృవియోగము ననుభవించుచు నేను నష్టుఁడనైతిని. నాకు దిక్కెవరు? ఇంక నాకు నా శశి లభించదు. నా కా యాశలును దెగిపోయినవి. నేను బ్రతికి యెందులకు? ఒక్కనాఁడు సాయంకాలము పినాకినీ నదివద్దకుఁ బోతిని. నది కొంత యిసుకవదలిపెట్టి వేఱొక దూరముగాఁబోయి యుచట శరత్కాలమువలనఁ దెల్లఁబడియుండెను. జలమే యొండు విఱిగెనో, శరదాకాశము నదిలోఁ బ్రతిఫలించెనో, మాతృవిరహితుఁడనైన నన్నుఁ జూచి నది విషాదమూర్తియై తెల్లతెలవోయెనో! నీటిప్రవాహము మునుపటియంత వేగముగా లేక కొంచెము మందగించెను. ప్రవాహమునకుఁ బ్రక్కగా నిసుకలో నొకగుంట యుండి యాగుంటలో నీరు నిలిచెను. ఆ నీరు నిశ్చలముగానున్నది. శూన్యహృదయుఁడనైన నే నా జలసమీపమునఁ గూర్చుండి నీటిలోఁ జూచుచుంటిని. ఒక చిఱుకప్ప నీటిపైకి వచ్చి నన్ను జూచుచున్నది. నే నమ్మయే' దని యడిగితిని. కప్ప నీటిలో మునకవేసెను. నీటిపైని గుండ్రిగా సున్నవలెనొకజలరేఖ యేర్పడెను. ఆహా! యేమి సమాధానముచెప్పినది! అచ్చటినుండి బయలుదేరి యొద్దనున్న దేవాలయములోనికిఁ బోయితిని. సాయంకాలమగుటచేత వైష్ణవులు స్త్రీపురుషులు దేవాలయములోనికిఁ బ్రవాహముగా వచ్చుచుఁ బోవుచుండిరి. తల్లిపోయినవాఁడని న న్నొక్క రాదరించలేదు. సర్వజీవలోకము నాయందంతనిర్దయ యేలయైనదో! అప్పుడే చీకటులు పడుచుండెను. నాకు దుఃఖము తఱుముకొని వచ్చినది. ఇంటికిఁబోయితిని. మాయన్నలు, మా నుప్పగార్లు, మాతండ్రియు నేవోమాటాడుకొనుచునే యుండిరి. వారికి మా యమ్మ చచ్చిపోయినట్లే లేదు కాఁబోలు! నే నెవరు పిలిచిన మాటాడక నిత్య మశ్రుపూరితలోచనుఁడనై యుండుటచూచి వారు కొంచెము భయపడిరి. నా కన్నము సయించలేదు, నన్ను సర్వాథా రక్షించినతల్లిని జితిమీఁదఁబెట్టి కాల్చివచ్చితిని. ఆమె వైతరణి సుఖముగా దాఁటవలయునని గోదానమిచ్చితిమి. ఆగోవు తోఁకపట్టుకొని నేనుగూడ నరకలోకము నకు బోదమనుకొంటిని. కాని యామెపోవుచున్న త్రోవ నాకు విస్పష్ట

ముగా గనిపించలేదు. ఎన్నివిధముల మాతల్లినిఁ గలిసిగొందమన్నను నన్నిమార్గముల నిరాశయు, నిరుత్సాహమునే గోచరించెను. చివరకు నీ వుంటివికదా యని యిచ్చటికి వచ్చితిని. 'అన్నా! మాయమ్మ పోయినది.' అని కిరీటి మొగముపైఁ జేతు లుంచుకొని యేడ్వ నారంభించెను. ధర్మారావు కిరీటిదుఃఖ మపనయింపరా దని తెలిసికొనెను. దుఃఖావేశసమయముల నుచితానుచితములు పాటించరాదు. కిరీటిని వేయికన్నులఁ గాచినగాని యతఁడు బ్రతుకునట్లు తోఁచలేదు. ధర్మారా వతనినిఁ జేరఁదీసి కౌఁగిలించుకొని 'బాబూ! చనపోయిన తల్లిని గొనిరాలేను గాని, మీ మామవద్దకుఁబోయి యీసంబంధము నీకుఁ దప్పకయగునట్లు చేయగలను. శివరావున్నాఁడు. పశుపతి యున్నాఁడు. సూర్యపతి యున్నాఁడు. హరప్పనాయని చేతఁ జెప్పించె దను. ఎంత కలెక్టరైనను మీమామ యిందఱిమాట వినకపోవునా? నీకుఁదప్పకుండ శశిరేఖను సమకూర్చెదము. భయములే' దని వీఁపు దమిడిచెప్పి యోదార్చి వెంటఁదీసికొని గ్రామములోనికి వచ్చెను. అతఁడు భోజనముచేసినంతసేపు హాస్టలులోఁ గూర్చుండి యిద్ద ఱునుగలసి యింటికిఁబోయిరి. కిరీటిలోఁ గ్రమక్రమముగా దుఃఖము నిలువఁద్రొక్కుకొనెను. అతఁడు పూర్వమువలె దేనినిగుఱించియు మాటాడఁడు, నవ్వఁడు. చుట్టునున్న జనులు హాస్యరసములో మునిఁగి పోవనీ, అతని పెదవిమీఁద రేఖామాత్రముగనైనను హాసము గోచ రించదు. అతఁడుసరిగానన్నముతినఁడు.ధర్మారావెంతచెప్పిననులాభము లేకపోయెను. అతఁడు దారివెంటఁబోవుచుండఁగాఁ జూచినప్రతివారును నతఁడుఁ మహాదుఃఖాంబురాశినిమగ్నుఁ డని వెంటనే తెలిసికొనఁ గలరు. కిరీటి ధర్మారావునత్తుకొని పండుకొనును. ఉన్నట్లుండి యూరకే కన్నుల నీరుపెట్టుకొనును. ధర్మారావు కన్నీరుతుడిచి దగ్గఱకు లాగుకొని గట్టిగా కౌఁగలించుకొనును. చెక్కిలిపైఁ జేయి వైచి సమాదరించును. కిరీటి యప్పటికి శాంతించును; అతఁడు కాలే జీకిఁ బోయినట్లే పోవును. వచ్చినట్లే వచ్చును. దివారాత్రములు పుస్తకము నంటఁడు. అతని మనస్సులో, హృదయములో శశిరేఖ యొక్కతియేయున్నది. తదితరసృష్టికి, నతనికి సంబంధమే లేదు. ఇట్లు రెండునెలలు గడచినవి. అంతకంతకు కిరీటిదుఃఖము వర్ధమాన

మగుచుండెను. గాని తగ్గుటలేదు. ధర్మారావున కేమిచేయవల యునో తెలియలేదు. ఒకనాఁడిర్వురును షికారుపోయిరి. తిరిగి వచ్చు నపుడు కిరీటి నడువలేకపోయెను. ధర్మారావు 'ఒంటిలోనోపిక యెచ్చటినుండివచ్చునుక? సరిగాఁనన్న మేతినవాయెను. బొమికలన్నియు బయటఁబడినవి. ఇంతదూరము నడువలేవు' అని యిర్వురును నెమ్మ దిగా నడచివచ్చిరి. హాస్టలులోఁ దక్కినవారందఱును గిరీటి యీ స్థితికి జాల విచారించిరి. ధర్మారావు కళాశాలకుఁ బోవును. కిరీటి వాకిట నిలుచుండును. ధర్మారా వెప్పుడు వచ్చునా యనియే యెదురుచూచుచుండును. కళాశాల వదలిపెట్టినతరువాత నిముసమైన నాఁగక ధర్మారావు వచ్చును. అతనివంకఁ గిరీటి తెప్పవేయక చూచును. రెండునెలలనుండి కిరీటి తెప్పవేయుటయే లేదు. అదే యొక కేరీతిగా కన్నులలో నున్మాదమే గోచరించునట్లు ప్రతివాని వంకను జూచును. కిరీటి యీ ప్రణయకథ విన్న ప్రతివారును నతని యెడ స్నిగ్ధులైరి. ఆహా! ఎంత ప్రేమశాలి? ఇట్టిస్థితిలోనుండుట కెంత గాఢమైన శీలముకలవాఁడు కావలయును? ఇతనిస్థితి చూచినవారం దఱు నతనిమామను దూషించుచుందురు.

శరత్కాలముపోయి హేమంతర్తువు వచ్చెను. సన్ననిమంచు పగలుకూడ ప్రొద్దెక్కువఱకును, సాయంకాలము ప్రొద్దువాటారు చున్నదనఁగా మొదలుపెట్టియును నవ్యాహితముగాఁ గురియుచున్నది. పడమటింటివెనుక నిర్వ్యాయుగగనభాగమునఁ బొగచెట్టు కట్టినట్లు సన్ననిమంచు సల్దిక్కుల నావరించెను. ఆకాశమున నేదో పండికోసిన యమృతపుఁగుప్పనూర్చితూర్పారబట్టినట్లుసన్ననినూఁగువలెఁ దుషా రముఁకురియఁజొచ్చెను? దిక్సతులునలుఁగుసు సన్ననిమేలిముసుంగులు వైచుకొని, యదృశ్యముఖమండలలైన రాజస్త్రీలవలెఁ బ్రకాశించిరి. కాలువలు క్రమముగాఁ గృశించిపోయెను. పచ్చికమీఁద రెండుజాము లప్పుడు నడచినను పాదములు తడియుచుండెను. చేలవెంట నడచుట కష్టముగానుండెను. పెరిగిన వరియాకులన్నియు హిమబిందుసంసిక్త ములై దారివెంటఁబోవువారిని చల్లగాఁ దాకుచుండెను. మంచు బిందువులు తామరాకులమీఁదఁ బ్రబ్బలియాకులమీఁదఁ గురిసి ప్రాతఃకాలముల నెనగగింజలంత యుండి ప్రొద్దెక్కినకొలంది పరి

మాణము తగ్గుచు మినపగింజలై, పెసరగింజలై, నూవుగింజలై, చిట్టచివరకు మణిరాచిన పొడిలోని యణువువలెఁ గనిపించఁజొచ్చెను. శిరస్సున నెండ మలమలమాడ్చును, నడచుచుండఁగాఁ బ్రక్కనున్న చెట్లయాకులు తగిలి బట్టలన్నియుఁ దడసిపోవును. ఒడలు వేడి యనిపించదు. ప్రాణము చల్లఁగా నుండును. తలమాత్రము మాడిపోవును. ఇది హేమంతకాలపుటెండల లక్షణము. రాత్రియంతయు స్వచ్ఛముగానున్నట్లుండును. ప్రొద్దుగ్రుంకినప్పటికి దీపావళియమావాస్యనాఁడు గ్రమ్మిన పొగలవలె నెచ్చటపడిననచ్చట మంచు గుమ్మలుగుమ్మలుగాఁ గనిపించును. తెల్లవాఱును. సూర్యోదయము కనిపించదు. జాముప్రొద్దెక్కినతరువాత నచ్చటదూరమున మేఘములు వెలిగించుచుఁ గనులు మిఱుమిట్లుగొలిపి యంతలో సూర్యబింబము ఫెడేలుమని యెండలు కాయుచు. తక్కినరోజులలో మధ్యాహ్నసూర్యాతప మంత తాపకారి కాదు. ప్రాతఃకాలమునుండిక్రమముగా వెచ్చనగుచున్న సూర్యాతపములతో మనశరీరములను గ్రమముగా వెచ్చనగును. హేమంతమునఁ బ్రొద్దెక్కిన తీక్ష్ణసూర్యుఁ డొక్కసారిగా మహోష్ణములైన తనకిరణములు ప్రసరింపఁజేయునప్పటికిఁ నాఁగ లేకపోదుము. శిశిరర్తువు వచ్చుటయుఁ జలిమంటలు గాచుకొనుటయు న్యాయమే. పల్లెటూరిబసిపిల్లలకు గడ్డిదొరికిన దేచాలు, చలిమంట లారంబించిరి. సుబ్బన్న పేఁట బలసి బస్తీయైనను ననాదులైన కొంపలకుఁ బల్లెటూరిలక్షణములు పోలేదు. పదేఁడులలోనూరు బలిసినది. జనులందఱకుబస్తీలక్షణములుబలియుట కష్టమైనది. మొదట గ్రామవాసులే యమాయకులు. వచ్చినవారందఱు గడుసువారు. గాలిలోఁ బొరలలోఁగూడ మహాశైత్యములు గ్రమ్మకొనికప్పుకొనిన దుప్పటులసందునుండికూడఁ జలి లోనికిఁజొరఁబ్రయత్నించుచుండెను. దుప్పటికప్పుకొని వాకిటిలోనికిఁబోయి మరలిరమ్ము. దుప్పటి యంతయుఁ జల్లబడును. ఒకనాఁడు ప్రొద్దెక్కియు సూర్యుఁడు కనిపించలేదు. దుర్దినమునకు మేఘచ్ఛన్నతయే యన నక్కఱలేదు. హిమచ్ఛన్నతయు ననవచ్చును. ఆనాఁడు కిరీటి 'నేను బడికిఁ బోను. నీవును బోవల' దని ధర్మారావును వారించెను. జాతీయకళాశాలలో నధికార మొకమార్గమున లేదు. అధికృతసంఘహేతువుచే గుమా

స్త్రీలుగూడ నుపాధ్యాయులపై నధికారులుగా నుండిరి. రోజులుగడచిన కొలంది ధర్మారావునకుఁ గళాశాలమీఁద నసహ్యత కలిగెను. అతఁడదివఱ కెన్నఁడును దనవిధినుండి రేఖామాత్రమైనను గదలకున్నను నానాఁడు సెలవైన పెట్టకుండఁ గళాశాల మానివేసెను. ఇరువురును ధర్మారావునింటఁ గూర్చుండిరి. ఎంత సేపు కూర్చున్నను కిరీటి మాటాడునది లేదు. పలుకరించిన నేదో యొకమాటకు సమాధానము చెప్పును, 'అన్నా! మామామ నా కింక పిల్లనీయఁడు శశికి నాకు ఋణానుబంధముతీఱినది' యని కన్నులయందు దైన్య మొలుకఁ బోయును. మఱియొకసారి 'నా కామెను బొందునంతటి యదృష్టము లేదు. నే నేల బ్రతికియుంటిని? మాయమ్మ బదులు నేను చని పోరాదా?' అని కన్నీరుకార్చును. బయట హిమముసాంద్రారణ్యము వలె వ్యాపించెను. కిరీటి 'అన్నా! నాకు ఉక్కపోయుచున్నది' యనెను. ధర్మారా విట్లు చూచెను. అతని యొడలంతయు స్వేద జలమయమయ్యెను. హేమంతఋతు వతని శరీరమునందుగూడ నుదయించినట్లు, వానలో నడచివచ్చినట్లు, అప్పుడే స్నానముచేసి వచ్చినట్లతని యొడలెల్ల సంసిక్తమైపోయెను. ధర్మారావు విసనకఱ్ఱ తీసికొనివచ్చి విసరును. స్వేద ముపశమించెను. ఒకొక్కరోజున నిదుగో మంచువిచ్చిపోవు ననుకొనుచుండఁగా మఱల దట్టముగా మూసికొనివచ్చును. ఆ నాఁడట్లు జరిగెను. జాము ప్రొద్దెక్కి యుండవచ్చును. మంచుతెర విరియ లేదు. అప్పుడు మఱల నొక క్రొత్తమంచుతెర క్రమ్మెను. కిరీటి కూర్చున్నవాఁడు కూర్చున్నట్లు నిశ్చలుఁడై పోయెను. ధర్మారావు 'కిరీటి'యని పిలిచెను. 'నాయనా' యని బుజముపైఁ జేయివేచి కదలించెను. 'బాబూ' యని గడ్డముపుచ్చుకొని కనులలోనికిఁ జూచెను. అతఁడు నిశ్చేతనుఁడై యుండెను. ధర్మారావున 'కేమియుఁ దోఁచినది కాదు; ఏమి సేయ వలయును? అటునిటు పరుగెత్తెను. ఒకనిమేషము దాఁటెను. ధర్మారావునకు భయ మధికమయ్యెను. ఆహా! ఏమి హేమంతము. మహాశైత్యముచేతఁ గిరీటియొడలు గడ్డగట్టించెను. ఈ స్తంభము పోవుటెట్లు? ధర్మారావువాకిటికి రాబోయి కిరీటికిఁ గనుపడునట్లు నిలుచుండి వాకిలివంకఁ జూచుచు 'నదిగో శశిరేఖ వచ్చినదే! ఈమెయే కిరీటి

కొఱకు వచ్చినది. ఆహాహా! పతివ్రతయన్న నిట్లుగదా యుండవల యును! శశిరేఖ వచ్చినది. అరుంధతీ! కాళ్లుకడుగుకొనుటకు నీరు తీసికొని ర'మ్మనెను. కిరీటి కనుదెఱచి యొక్కగంతులో ధర్మారావు వద్దకు వచ్చిపడి 'ఏదీ శశిరేఖ, ఏదీ శశిరేఖ' యనెను. ధర్మారావు కిరీటిని జుఱుమలగులునట్లుగా రెండువ్రేళ్ళతోఁ జెంపమీఁదగొట్టెను. కిరీటి 'అబ్బా'యనుకొనెను. ధర్మారావు నొప్పిపెట్టినదా యని నవ్వెను. కిరీటి గడ్డిపూవుపూచినట్లు నవ్వెను. అనఁగా నది నవ్వే కాదు; నవ్వుయొక్క ఛాయ. అది పూవే కాదు; పువ్వుయొక్క ఛాయ. ధర్మారావు 'ఎన్నాళ్ళకు నవ్వెను'అని మనసులో ననుకొనెను. అంతలోఁ దన సహస్రోష్ణకిరణప్రతాపానలదగ్ధముగఁ జేసి మంచును ధర్మ సుధర్మమునువలె మార్తాండదేవుఁడు నిర్జించి, దానిని బరరాష్ట్రములకుఁ బట్టించెను. ఇంతటిప్రభు వున్నాఁడుగనుక నీమంచు ప్రాబల్య మిప్పటికైనను దీఱినది. అధర్మమే ప్రబలిన పరరాష్ట్రములయందు సర్వకాలసర్వావస్థలయందును మంచే కాఁబోలును. ధర్మమూర్తియైన మార్తాండదేవుఁ డచటఁ దనసహస్రకరములు వ్యాపింపఁజేయుట లేదు. అచ్చటిగాంధాంజనప్రభారాశిహిమపాతము తఱుఁగుటయు లేదు. సూర్యుఁడు క్రొత్తగా పదనుపెట్టిన సుదర్శనాయుధమువలె గిరగిర తిరిగి తళతళ మెఱసెను. ఇద్దఱును భోజనము చేసిరి. కిరీటి భోజనము చేసినంతసేపు ధర్మారావు దగ్గఱనే కూర్చుండెను. అరుంధతి నాలుఁగై దాదరువులు చేసెను. దగ్గఱ గూర్చుండి ధర్మారా 'వది తిను, యిది తిను'మని వేధించెను. కిరీటికి దినక తప్పినదికాదు. చివరకు మెంతిమజ్జిగ పోసెను. పచ్చిమిరప కాయలు, వామును, కొతిమీరయు నలిపి యింగువ తిరుగబోఁత పెట్టుటచేఁ జిక్కని పుల్లనిమజ్జిగ చాల రుచిగానుండెను. కిరీటి 'మెంతిమజ్జిగ చాల రుచిగానున్న'దనెను. ధర్మారావు మనస్సులో 'మజ్జిగగూడ నెండచేసినంత పని చేసె'ననుకొనెను. అతఁడు భోజనము చేసినతరువాత ధర్మా-'నేనుగూడ రెండుమెతుకులుతినివచ్చెదను. ఈలోపుగా నాతోఁ జెప్పకుండ బాపట్ల పోకుము. ఎండ వచ్చినది కదా! స్తంభకారియైన హిమము ప్రొద్దుగ్రుంకినగాని రాదు' అని తాను పోయెను. అతఁడు భోజనముచేసినంతసేపు అరుంధతివచ్చి

రెండుమూడుసారులు చూచిపోవుచునే యుండెను. 'కిరీటి యేదో చదువుకొనుచున్నాఁడు' అని ఆమె ధర్మారావుతోఁ జెప్పెను. ధర్మారావు 'ఆహా! కొంతదారిని బడినాఁడు' అనెను. ధర్మారావు భోజనముచేసి కిరీటిని బోవుదము లెమ్మనెను. కిరీటి మెచ్చటికని యడుగఁడు. అన్న చెప్పినట్లే ఎండకాయుచున్నది. ఇద్దఱు నుత్తరీయములు తలలకుఁ జుట్టి బయలుదేఱిరి. దేవాలయము దాఁటిరి. పురపాలకసంఘసౌధము దాఁటిరి. ఊరెంత పెరిఁగినను దక్షిణమునఁ బశ్చిమమునఁ బెరిఁగెనుగాని యుత్తరమునఁ బెరుఁగలేదు. పొలమంతయు పైరుమీఁద నుండెను. కొంతపైరు పొట్టలమీఁద నుండెను. కాడిగట్లఁబడి పోవుచుండిరి. కొద్దిరూపములో బలిసిన దుబ్బు వేసిన వెడల్పైన వరి యాకుమీఁద సన్నసన్నగా గ్రుడ్డులుపోసినట్టు మంచు నిలచి, వాలుగా దానిమీఁద సూర్యకాంతిపడిఁ మరకతపత్రముపైని వజ్రపు పొడి చల్లిన ట్లుండెను. కిరీటికిఁ బ్రియాకపోలము సిగ్గుచేఁ జెమర్చిన ట్లుండెను. గట్టుమీఁదికి వాలినపైరు కిరీటి కట్టుకొన్నధోవతియంచు లన్నియుఁ దడిపెను. అతని కొడలు చల్లనయ్యెను. దేహమంతయు నుత్పులక మయ్యెను. ఒకగట్టు తడిగా నున్నది. పై రెదిగి రెండు వైపుల గజమె త్తున్నది. కిరిటి యాగట్టుమీఁద గూర్చుండెను. ధర్మారావు 'బట్టమన్నగును. లె' మ్మనెను. నీవుగూడఁ గూర్చుండుమని కిరీటి యతనిని గూర్చుండఁబెట్టెను. ఇద్దఱును బైరులో మునిఁగి పోయిరి. కిరీటి 'ఈ వరిచూచితివా? దుబ్బుకట్టి మంచియేపుమీఁద నెదిగెను. చక్కని మెఱుపుతోలిరి కాఁబోలు! చేను బాగుగాఁ బండినది.' ధర్మారావు 'సరే, యింకఁబోదుములె'మ్మనెను. కిరీటి 'యేమి చెప్పితివి?' ధర్మారావు 'నాయనా! మంచిరోజులు దగ్గఱకు వచ్చినవి. మంచిమెఱుపు తోలితివి. నీభాగ్యపుఁజేనును పండఁగలదు.' కన్నులువిప్పి కిరీటి ధర్మారావును జూచెను. మఱల పొలాలవెంటఁ ఉరిగిరి. ఒక చేనిలోని గలుపు తీయునపుడు మిగిలిపోయిన కాజదుంప ముదురువేళ నాకుఁదొడిగి, తాను గూడ పైరుతో సమానముగా నెదిగి కొసలోఁ బూవువదలెను. రెండు కాడలకు రెండుతెల్లనిపూలు వేసినవి. కిరీటి యది తెత్తు ననెను. తీసికొనివచ్చుటకు చేనిలో దిగి రెండుగజములు పోవలెను. కాళ్ళ

బురద యగును. కడిగికొనుటకు దగ్గఱలో నీ రున్నట్లు లేదు కిరీటి దిగఁబోయెను. పడిపోవునేమో యని ధర్మారావే దిగి యా పూవు కోసి తెచ్చెను. పెద్దకాడతో నా పుష్పము శోభాయమానముగా నుండెను. కిరీటి యది చేఁబూని 'యిందు రెండే పూవు లున్నవి.' ధర్మారావు 'ఒకటి కిరీటి, మఱియొకటి శశిరేఖ.' కిరీటి 'అవు నవును' రెండును దూరదూరముగానే యున్నవి' ధర్మారావు కట్టినబట్టనుండి కద్దరుదారములాగి రెండుపూవులనుగలిపి ముడివేసెను. కృతజ్ఞతామయములైన కిరీటిచూపులు ధర్మారావుమీఁదఁ బ్రసరించెను, వా రచటినుండి తూర్పుగాఁ బోయిరి. ఒక చిన్నబోదెలోఁ బెద్దగుంట తీయఁబడియుండెను. క్రొత్తగాఁజేసిన పొలమగుటచేత నీ రెక్కఁక గూడ వేసిరి కాఁబోలు ఆ గుంటలో నీరు నిలచియుండెను. ధర్మారావు పాదములు కడిగికొని చేతులును కడుగుకొనెను. చేతులు పైయుత్తరీయమునకుఁ దుడిచెను. కిరీటి మాసిపోవు ననెను. ధర్మారావు 'మన దేశమునందు పుట్టిన దేనికిని మాపులేదు. కద్దరుగుడ్డకు మా పేమిటి? అది యెప్పుడును బవిత్రమే. ఎప్పుడును నిర్మలమే. మఱియు దూరము పోయిరి. పోయిపోయి రెండుమూఁడు మైళ్ళుపోయిరి. అచట గుండేఱు వంపు తగిలెను? ఆ యేఱు దూర్పునఁ బ్రవహించుచు, సుబ్బన్నపేటకుఁ దూర్పున మూఁడుమైళ్ళలో వంపు దిరిగి, యొకమైలు లడ్డముగాఁ బ్రవహించి మఱలఁ బశ్చిమమునకుఁ దిరిగెను. గుండేఱులోఁ గిరీటి దిగఁబోయెను. ధర్మారావు 'అయ్యయో? అది ఊబి. అచ్చట దిగకుము. ఈ యేటి కీవైపున నెచ్చటను గాలిమార్గము లేదు. ఒకమైలు లెగువ నున్నది. ఒక మైలు దిగువనున్నది.' కిరీటి 'నేను చేతులు కడుగుకొనవలయును.' ధర్మారావు 'అక్కఱలేదు. కాజ పూవు చేతఁబుచ్చుకొనిన చేయి మన్ను కాలేదు ఇంటికిఁ బోదమా?' కిరీటి 'యిప్పు డెంత వేళయైనది?' ధర్మారావు 'రెండు దాఁటిన దనుకొందును. పోదము రా.' అచటినుండి వారు మెట్టచేలమీఁదికిఁ దిరిగి వచ్చిరి. గుండేఱు పొడిచినంతమేఱ చవు డురికి సాగుచేయ రానిదిగా నుండెను. అచ్చట నే మొక్క వేసినను పండదు. తక్కిన నేల మఱి సారవంతమే. వా రిద్దఱును జాతీయకళాశాలకుఁ బోయిరి. సీతాపతి యెదురుగా వచ్చుచుండెను. అతఁడు వచ్చి కిరీటిని గాఁగి

లించుకొనెను. కిరీటి యతనివీఁపుమీఁద నెమ్మదిగాఁ దట్టుచు "నీ పెండ్లి యెప్పుడు?" సీతాపతి—మీ పెండ్లి యైనతరువాత నాపెండ్లి. ధర్మా—అంతదూర మెందుకురా; నీపెండ్లి నే నిప్పుడు చేయుదునా? సీతాపతి— "ఊఁ చెయ్యండి!" అని దగ్గఱకు వచ్చి, ధర్మారావు చేయి పట్టుకొని వ్రేలాడెను. ధర్మారావు 'వట్టి పిచ్చిసన్యాసివి జాతీయకళాశాలలో విద్యార్థిగా నుండుటకుఁ బనికిరావు' అనెను. కిరీటి మఱల సీతాపతిని దగ్గఱకుఁదీసికొనెను. ఊరంతయు మువ్వురునుగలసి తిరిగితిరిగి యలసటపొందిరి. సీతాపతి 'సినిమాకుఁబోదమా?' యనెను. ధర్మారావు 'వాని కూరకే డబ్బిచ్చుట యెందులకు? దుష్టదత్తమైన ద్రవ్యము పలితమునందుఁగూడ దుష్టమే యైయుండును.' అనెను. సీతాపతి ప్రాణములు తీసెను. ముగ్వురును సినిమాకుఁ బోయిరి. ధర్మారావు వచ్చుట రామేశ్వరము చూచెను. అతఁ డెప్పుడును సినిమాకు రాఁడు. రామేశ్వరము 'ఉండఁగా నుండఁగా నెట్టివానికైనను మనసుతిరుగును.' అనుకొనెను. సినిమా మొదలుపెట్టిరి. ఆ ఫిలుముపేరు 'ప్రళయకాంతి' యఁట. ఎవరో జమీందారు, వానితమ్ముఁడు తమ్ముఁడు జమీందారును జంపెను. జమీందారుకొడుకు లండను పోయెను. పినతండ్రి యతఁడు రాకుండ నడ్డంకులు కలిగించెను. జమీందారుకొడు కొక పాశ్చాత్యస్త్రీని వివాహ మాడెను. ఆమె వచ్చి గవర్నరుజనరలుతోను, గవర్నరుతోను మాట్లాడి తనభర్త రాజ్యమును భర్త కిప్పించెను. ఫిలిముసం దామె చాల తెలివికలదిగాను, జమీందారు కుమారుఁడు వట్టిపెద్దమ్మగాను జూపింపఁబడిరి. ఒక కథపొందిక లేదు, వేషములు ధరించుటలో నౌచిత్యములేదు. ఇద్దఱు మాట్లాడినను, నిద్దఱు కొట్టుకొనినను నడవిజంతువులవలెఁగాని నాగరకత మెచ్చుటకు గోచరించలేదు. బొంబాయినుండి యీ దుర్మార్గపుఫిలిములు దిగుమతియగుచుండెను. ధనాశాపిశాచగ్రస్తులైన బొంబాయిఫిలిము కంపెనీలవారికి బుద్ధికి మొదలు లేదు. తృష్ణకుఁ జివర లేదు. సత్వముచచ్చిన దేశీయప్రజలు ధనమువ్యయముచేసికొనుట నే లెక్క సేయుచున్నారుగాని, జరుగుచున్న యాత్మభ్రంశము తెలిసికొనుటయే లేదు. కాఫీహోటళ్ళు సినిమాలు రెండును సమానప్రతిపత్తి కలవి. ఒకటి శరీరానారోగ్యమునకును,

రెండవది మానసికానారోగ్యమునకును దిగుమతియైన రెండుసంస్థలు స్వదేశపుఫిలిము లనుపేర దుష్టసంస్కారము ప్రబలించఁబడుచుండెను. అమెరికానుండి, ఇంగ్లండునుండి ఫిలుములు వచ్చెను. వానిలోఁ గథాభాగ మెటులున్నను నభియమునం దౌచిత్యము సంపూర్ణముగా నుండును. బొంబాయినుండివచ్చిన ఫిలిములు మూర్ఖులను మఱియు మూర్ఖులనుగాఁజేయుటకుతప్ప మఱియొకందుకు పనికివచ్చుటలేదు. ఈ ఫిలింకంపెనీలలో నిరక్షరకుక్షులు,నసంస్కృతబుద్ధులునుబొంబాయి లోనభినయింతురు.కంపెనీ వారుసామాజికులమనస్సులెట్టులోనాకర్షించి ధనములాగుదుమనివికారాభినయములు,వికారసంవిధానములుకథలలో గల్పింతురు. క్రమముగా నవభ్యస్తవిద్యులైనను గొందఱు జన్మతః నటకులై యుందురు. పురాతనసంస్కారలేశమైన యీ సహజనట లక్షణము దేశము నాల్గుదిక్కులవ్యాపించియున్న యీ సినిమానట కుల ననుకరించుటచేత మొదటికే మోసమగుచుండెను. అభినయము భావోద్రేకమును గుఱించి, హస్తాద్యవయవము లూరకే విసరక, నాగరకుఁడు వాక్కునందునియమము చూపించునట్లునియమవంతమై యుండవలయును. చదువవేసిన నున్నమతియుఁబోయినట్లుబొంబాయి సినిమాకంపెనీలు వెలసినతర్వాత దేశమున నిజమైననాట్యసంపద యన్నది చచ్చినది. ఆంధ్రదేశమునఁ బ్రతిచోటను మహానటకులు పూర్వముండెడివారు. గుంటూరులో హరిప్రసాదరావు, కొంపల్లె హనుమంతరావులు, బందరులో ఇవటూరి నాగభూషణముగారు, ఈమని లక్ష్మణస్వామిగారు, నిట్లే ప్రతిపెద్దపట్టణమునను మహానుభావులైన నటకు లుండెడివారు. ముప్పిడి జగ్గరాజు ముంజులూరి కృష్ణ రావు మొదలైనవా రా ప్రాఁతసంప్రదాయములోని చివరిబెళుకులు. ఇరువదియేండ్లనుండి దేశమున నాట్యము వికారమైపోయెను. వీనికి షేక్సుపియరు నాటకములు చదువుట ముఖ్యకారణమయ్యెను. ఒథెల్లో, లియరు, మాక్బెత్, హామ్లెటు నాటకములయందు సమాదరణ మెక్కువయ్యెను. నాటకరచన యనఁగా నట్లుండవలయుననియు, మానసిక ప్రళయోద్వేగములను జిత్రించుటయే నాటకరచనాశిల్పమనియుఁ, బ్రళయోద్వేగ మభినయించుట ప్రదర్శనశిల్పమనియు నూహలు ప్రబలెను. చిత్రనలీయము కొంతవఱ కామార్గములు ద్రొక్కెను.

అప్పటినుండి యది క్రమక్రమముగా విజృంభించి పఠాణీవేషము నాఁటికి మితిమీఱిపోయెను. ఈనాటకపాత్రములయందును, దదభిమానమునందును వినయము, నౌచిత్యము కృశించిపోయినవి. శాకుంతలములో శకుంతలాపునస్స్మృతి గలిగినతరువాత రాజున కున్మాదప్రాయమైన మానసికస్థితి కలిగెను. దానిప్రకటన మెంతమాత్రము. చివ్రాకును జూచి రాజు 'మునిసుతాప్రణయస్మృతి నడ్డగించిన తమస్సుచేత నామనస్సు విడువబడినది. ప్రేటుకాఁడైన మన్మథునిచేత ధనస్సునందు చూతశర మెక్కించఁబడినది' యనును ఉన్మాదము తావన్మాత్రియే. అది వృద్ధిపొందునేమో యని మాధవ్యుఁడు 'ఆఁగుము, దండకాష్ఠవ్యాధిచేత గందర్పవ్యాధిని నాశనము చేసెద' నని కఱ్ఱతోఁజూతాంకురమును గొట్టఁబోయెను. రాజు విహసించెను. ఉన్మాదమును మహాకవి విజృంభించ నీయలేదు. విక్రమోర్వశీయమునఁ బూరూరవశ్చక్రవర్తి కున్మాదవిజృంభణము జరిగినది. లియరునకు గలిగిన యున్మాదముతో, హామ్లెట్‌కుఁ గలిగిన యున్మాదముతో పురూరవసునియున్మాదము పోల్చిచూచినఁ దెలియఁగలదు. ఉన్మాదములకుఁ గలిగినహేతువులభిన్నత్వమువలన నా యున్మాదములును భిన్నములుగా నున్న వనవచ్చును. పాశ్చాత్త్యులశిల్పము సహారాయెడారిలో నిసికతామయోన్మత్త ప్రళయవాయువులవలె విఱుచుకొని మానుషప్రకృతినున్మాలించుటకుఁబ్రయత్నించును. భారతీయశిల్పము భారతజాతిమతధర్మమువలెనే యింద్రియముల నదుపులోఁబెట్టి, సంఘమర్యాదల ననుసరించి నడువవలె నన్నట్లు భావోద్రేకములను నియమించి, తదంతర్గాఢత్వమును బ్రకటించుచు, బహిరున్మత్తవిస్తృతిని నియమించి చూపును. శిల్పము నిప్పులు త్రొక్కిన కోఁతివంటిది కాదు; మదించిన యేనుఁగువంటిది. ఉన్మాద మెక్కినకొలఁది లీవి యెక్కువ. నిదాన మెక్కువ శక్తియెక్కువ.

తక్కిన యందఱును దన్మయులై చూచుచుండిరి. వీరు ముగ్వురును నసహ్యించుకొని లేచి వచ్చిరి. ఆ నాఁటిరాత్రి ముగ్వురును ధర్మారావునింటనే భోజనముచేసిరి. కిరీటి ప్రస్తుతనాటకములు, నటకులు వీనినిగుఱించి నిందించుట యారంభించెను. ధర్మారావు కిరీటి మన స్సెట్లో యొకట్లు తిరిగిననే చాలునని సంతోషించెను.

మఱల సంక్రాంతిదినములు వచ్చెను. డిసెంబరు సెలవు లిచ్చిరి. సెలవులు నెలనాళ్ళు. కిరీటి నెల్లూరు పోవుదు ననెను. ధర్మారావు వలదనెను. 'కాదన్నా! జాగ్రత్తగా నుండెదను నీ దగ్గఱ నున్నట్లే యుండెదను. మఱల నిరువదిదినములలో వత్తునుగదా!' యని కిరీటి చెప్పెను. ధర్మారావు సరే యనెను. కిరీటి వెళ్ళెను. సెలవుల కెవరిదారినివారు పోయిరి. ధర్మారా వొక్కఁడే మిగిలెను. ధర్మారావునకు రెండు జగత్తులు: ఒక జగత్తులో యాకీభావము; మఱొకజగత్తులో ననియతవాగ్వ్యాపారము. ఒక జగత్తు దివ్యము; ఒకజగత్తు భౌమము. భౌమములో నతిభౌమము ఒకటి పునీతము; ఒకటి యింద్రియపరాభూతము. దివ్యమునుండి భౌమమునకు వచ్చుట యెంతకష్టమో, దీనినుండి దానికిఁ బోవుటయు నంతే కష్టముగా నున్నది. సెలవులువచ్చినచోఁ గణాచారి, దేవదాసి, పసిరిక, అరుంధతి; సెలవులులేనిచోఁ గిరీటి, శివరావు, కళాశాల. గణాచారి పూర్వమెన్నఁడును నిల్లు వదలిపోయెడిది కాదు. పొరుగింటికిఁగూడఁ బోదు. ఇప్పు డామె యిరుగుపొరుగులకుఁ బోయి వచ్చుచుండును. పూర్వ మామె మొగము చూచినచో నల్లని మేఘము లలమిన దిక్కులోఁ జూచినట్లు, లతాగుల్మాదులు చిక్కనై యున్న యడవికోనలోఁ జూచినట్లు, బహుశిలాస్థపుటితనిర్మనుష్యగిరివనభాగములు చూచిన ట్లుండెడిది. ఇప్పు డామె మొగము కొంతవిచిత్రముగా మాఱెను. పరిహాస మనిన యెన్నఁ డెఱుఁగనిది గిరికతో నొకప్పుడైనఁ బరిహాసమాడును. తలఁదువ్వుట యెన్నఁ డెఱుఁగనిది గోళ్ళతోనైనఁ జిక్కుతీసి ముడి వేయును. ఎన్నఁడు నిలు వెడలిపోనిది పొరుగిండ్లకుఁ బోవును. ధర్మారావున కొకరాత్రి యొకకల వచ్చెను. సుబ్బన్నపేఁట యున్నచోటనుండి యెగిరి యాకాశమార్గమునఁ బోవుచుండెను. అందుఁ దానును, గణాచారియుఁ బోవుచుండిరి. దేవాలయములు, పసిరిక, యరుంధతి యందఱును బూర్వము సుబ్బన్నపేఁట యున్నచోటనే యుండిరి. ధర్మారా వన్నాఁడుకదా, "నే నీ యూరి వెంటఁ బోవుచున్నాను. నీవుకూడ వచ్చుచున్నావా?" గణాచారి నవ్వి, సుబ్బన్నపేఁట పూర్వ మున్నయెడఁ జూపించినది. గణాచారి యచ్చట నున్నది. మఱి యీయామె యెవరని ధర్మారావు తనప్రక్కకుఁ జూచెను. ప్రిక్క

నెవ్వరును లేరు. ధర్మారావునకు మెలఁకువ వచ్చెను. ప్రక్కన అరుంధతి నిద్రపోవుచుండెను. ఆమెకనుతెప్పలు పండి యస్పృష్టమైన రంపంగితెక్కవలె వంగియుండెను. తెప్పలచివళ్ళ సన్నని వెంద్రుకలవరుస మొగలియాకుటంచున సన్ననిముండ్లవలె నుండెను. ధర్మారావు తనలో "ఇన్నాళ్లైనది. ఇన్నివందలసార్లు చూచితిని. ఇప్పటికి నీమె ప్రత్యవయవము నేను చూచి తన్మయుండ నగుటయేనా?" యనుకొనెను ఆమె చేయి తనపై నుండెను. నిద్రలోఁగూడ నింత ప్రేమ యెందుకో? ఆ చేయి తాను పుచ్చుకొని తీయఁబోయెను. అర్ధనిద్రలో నుండికూడ నరుంధతి తీయనీయలేదు. జాగ్రదవస్థయందు గాఢమైన విషయగతభావము నిద్రావస్థలోఁగూడ ననుసరించుచుండు నేలనో! తనమన స్సరుంధతియందు లగ్నమైనదా, కాలేదా? అయినచో నింత నిర్దయవిచారణ మేల? కానిచో నీ యనుసరణ మేల? ఒక్కొక్కపుడు తన్నుఁదా విచారించుకొనును. తనకన్న మిథ్యాయోగి లేఁడు. ఒక్కొక్కప్పుడు విచారించుకొనును. తనమార్గము పరిభ్రష్టమైన మిథిల యోగమునే యనుసరించుచున్నది. ధర్మారావు పసిరికనుగుఱించి యాలోచించెను. "పసిరిక మాగాని మీఁద కేల పోఁడు? ఆ రోజులఁ దానును, గిరీటియుఁబోయి వచ్చిరి. నడచుచున్న నందముగానే యున్నదే! కాని యచ్చటను గూర్చుండుటకు వీలులేదు దేవమాతృకలకన్న నదేవమాతృకలకే పూర్వసంస్కృతవాఙ్మయమున మర్యాద యెక్కువ యేలనో? భారవి యదేవమాతృకలను దుర్యోధనుఁడు వృద్ధిఁబొందించెనని చెప్పెను. దుర్యోధనుని నాగరకతయంతయుఁ గృత్రిమముగా నున్నదని యాయన ధ్వనించుచునే యుండెను. మొత్తానికి వరిపైరునందు ధనదేవత తాండవించుచుండెను. దురాశ దానియందుఁ బ్రబలియుండెను. వ్యాధులన్నియు దానియందు సన్నిహితములై యుండెను. నాచిన్ననాఁడు క్షయ యన్నవ్యాధిని నేను విని యెఱుఁగను. ఇప్పు డెచ్చట జూచినను నా వ్యాధియే ప్రబలియుండెను. ఈ డాక్టరులకు క్షయవ్యాధికిఁ బ్రతిచికిత్స తెలియదు. మరబియ్యముతో బ్రాణము పోవుచున్నది. తినుచున్నవారికి నాయుర్దాయము క్షీణించుచున్నది. పేదలకు దంచినకూలిన్నూకలు వచ్చుట లేదు. బస్తావడ్లు నలుఁగురు పేద

వాం(ప్రసదంచెదరు. నలుగురకు నాలోజు తిండికి బియ్యముదొరకును. పెట్టుబడిపెట్టి మిల్లుపెట్టిన సాహుకారి రిట్టి వంద నలుగురినోళ్ళలో దుమ్ముకొట్టి తాను ధనవంతుఁడగుచుండెను. వానికి దిండి చాల కదా? అమితధనాభిలాష! అయ్యో! జనుఁడు ధనముతో నేమి చేయును? దుర్వ్యవసాయములు పెంపొందించుకొనును. నూటిలోఁ దొంబదితొమ్మిదిమందికిఁ దినఁదిండిలేకఁజేసి యొకఁడే ధనమంతయుఁ బ్రోవుచేసి మేడలు కట్టును. మోటారులు కొనును. కుక్కపిల్లలను గొనును. దుష్టవస్తువులను గొనుటకు వినియోగించును. భోగముదాని కిచ్చినడబ్బు మోటారుకొన్నదానికన్నఁ జెడిపోయినదా? ఇది యేదో యొక పేదజీవి బ్రతుకుటకుపయోగపడినది. మోటారుకొన్నడబ్బు! అమెరికాలోని కోటీశ్వరులైన ఫోర్డు రాక్ఫెల్లరును బాగుచేయుచున్నది. ఏమి న్యాయము! ఇంటిలోఁ బండుకొని యనుకొనుచున్నానుగనుక సరిపోయినది. ధర్మారా వరుంధతివంకఁ జూచెను. ఆమె యటునిటు మసలినది. మెలఁకువ వచ్చుచున్నదేమో? మసలుటలో జీవాత్మ జాగ్రదవస్థాంచలంబులకుఁ దగిలి స్మృతిరూపమై యామె పతిదగ్గఱకు మఱింత జరిగి మఱల జీవాత్మ తదంచలములకు దూరముగాఁబోయెను. ధర్మారావుకు మెలఁకువ రాఁబోయెను. మానెను. ఒకపట్టాన మెలఁకువ వచ్చుటయే! చలికాలములో మూసికొన్నదుప్పటి తీయుటకే ప్రాణమొప్పదు. ఆనరించిన యొకవిచిత్ర సంస్కారము తేలికగాఁ దొలఁగిపోదు. దేవదాసి చాలదూరమేగినది. హరప్పనాయని కిపుడు పదునేడు, పదునెన్మిదేండ్లు వచ్చినవి. అతఁడు పెద్దవాఁడైనమాత్రము రంగారావుగా రుండఁగా నతని కధికారమెచ్చటిది? ఒక్కఁడే కొడుకు! స్వతంత్రించిచేసినచో నేమి చేయఁగలఁడు? అందఱును హరప్పనాయకునికి పెండ్లిచేయు మందురు. పెండ్లి యెందుకు? హరప్ప దుర్వ్యయము చేయుఁడుగదా! తండ్రి యెందు కడ్డగించును? దేవదాసి యుగయుగములుగా బ్రదుకుచున్నది. ఈమె యిన్నాళ్లాగవలసినది కాదు. హరప్ప సహజముగా లజ్జాళువు. ఇది యింకెన్నాళ్ళు పట్టునో'' అనుకొనెను.

అరుంధతికి మెలఁకువ వచ్చినది. 'మీకు నిద్రపట్టుట లేదా?' యని యామె మఱల నిద్దురపోయినది ధర్మారావు 'ఈపడగ యింక

బదేండ్లదాఁక నుండునా? అందులో నొకయేఁడాది యప్పుడే యైనది. అసలు పదియేండ్లే యుజ్జాయింపులెక్కయేమో! ఈమె చెక్కిళులు కొద్దిగాఁ జిక్కియున్నవి. రెండుమూఁడునాళ్ళనుండి యన్నము సరిగా సయించుట లేదు. మాయమ్మ యేమిటో యన్నది. అది నిజమేనా?' యనుకొనెను. ధర్మారావు నిముసములో నింకొకరీతిపురుషుఁ డయ్యెను. అతఁ డరుంధతిని—నిద్రపోవుచున్నదానిని—గాఢముగా నెద కత్తుకొనెను. ఆమెకు మెలఁకువ వచ్చెను. మెలఁకువతోడనే యామె యాననమున మందహాసము విరిసెను. ధర్మారావు తనభాగధేయమును దాను మెచ్చుకొనెను. అతఁడు 'నీవు' అని యేదో యనఁబోయి యూఁగెను. ఆమె గ్రహించి, సిగ్గుపడి, నవ్వి, తల యతనివక్షస్సు మీఁద నానెను. ఆరాత్రి కృష్ణపక్షమగుటచే దశమియగుటచేఁ జంద్రోదయము రెండుజాములుదాఁటి యయ్యెను. వారు శయనించిన గదికి ప్రాగ్దిక్కున గవాక్షమున్నది. అప్పటికి లాంతరులో నూనెయై పోయి దీపమాఱిపోయెను. తూర్పున నెఱ్ఱని జంద్రబింబముమాత్రమే కనిపించుచుండెను. ఆ బింబము సగము ముప్పాతికల మధ్యతగ్గి వాడిపోయిన, తునిగిపోయిన యెఱ్ఱతామరపూవువలెఁ గనిపించెను. ఎఱ్ఱ చీకటి యప్పుడే రజస్వలాస్నానముచేసి నిరలంకారయైన స్త్రీవలెఁ గనిపించెను. ఆ యెఱ్ఱచీఁకటి గవాక్షమువద్దకు వచ్చి యూచలగుండ జీర్ణమలిన వసనయైన బిచ్చపుపిల్లవలెఁ దొంగిచూచెను. లోపల దీపమాఱిపోవుటవలనఁ దనకన్న శోభాయమానముగ నున్నది. తాను తొంగిచూచుటయే గదికిఁ గళతెచ్చెను. ఆ గ్రుడ్డివెన్నెలలోఁ బ్రక్కను బరుండిన యరుంధతిమెడలోని చంద్రహార మొక్కటి దక్క మెఱసినది కన్పించలేదు. 'రుక్మిణమ్మారావుగారు స్వర్గవీధి విహారము చేయుచున్నది. ఆమె చనిపోయి యాఱేండ్లయినది. ఈ చంద్రహారమువలె నామె కింకేదియు యశశ్చిహ్నముగా నుండ లేదు. సరోజినీదేవిగారినే మఱచిన లోకము రుక్మిణమ్మారావుగారిని మఱచిన దనుటలో నాశ్చర్యమే మున్నది? ఆమెయాత్మకుఁ దనకృతజ్ఞత యెట్లు చూపించవలయునో తెలియలేదు. అన్నిటికి నొక్కఁడే విధానము. స్వామికల్యాణోత్సవములతో నన్ని కృతజ్ఞతలు వెల్లడించిన ట్లగును. ఎవ్వరిపనులు వారి కగును.' అంతలోఁ గోడికూసి

నది. సంక్రాంతిదినము లగుటవలన సాతానిజియ్యరు వీధివెంటఁ బాడుచుఁ బోవుచుండెను. అతనికంఠము మధురాతిమధురమై భగవంతుని మేల్కొలుపుమన్నట్లుండెను. ఆ గొంతులో నది యేమి చిక్కఁదనము! అతని కెన్ని కీర్తనలు వచ్చును! అన్ని కీర్తనల కన్ని ఫణితు లేమి? ఆ ఫణితు లన్నియుఁ దత్కీర్తనలలోని భావానుగుణముగ నుండు టేమి? ఈ జియ్యరుపాటలు ధర్మారావు పదిపదారేండ్లుగా వినుచుండెను. జియ్యరు వృద్ధుఁ డయ్యెను. ఇంక నెన్నాళ్ళు బ్రతుకును? అస లిదివఱకే చచ్చిపోయెనా? కాని పాపము, త్రోసికొని వచ్చుచున్నాఁడు. జియ్యరుతో సంక్రాంతిశోభ పోవు ననుకొందును. కాచి కొంచెము పెద్దపిల్లయైనది. ఇంక రెండుమూఁడేండ్లలో నది సంసారమునకుఁ బోవును. గొబ్బిళ్ళు పెట్టువా రింక నుండరు. పండుగలుకూడ దేవతలవెంటనే పడి యదృశ్యము లగుచున్నవి.

తూర్పున నుషస్సు దూరమున నావులగుంపు మేయుచున్నట్లు తోఁచెను. చంద్రుఁడు గవాక్షముపైకిఁ బోయి కనిపించుట లేదు. ఉషస్సు కనిపించుచున్నది. ఈ యుషస్సు దేనికి చిహ్నము? నిరంతరమైన కాలమునకుఁ జిహ్నము. ప్రధానకాలమూర్తి కీమె యర్ధదేహము. అల్పవికారములకు నీమె కేమి సంబంధము? కాకులు కూయుచుండెను. వీధివెంట జనులు తిరుగుచుండిరి. అరుంధతి లేచి, పతి నిదురపోవుచుండె ననుకొని, చీర సర్దుకొని, తల గోళ్ళతో దువ్వుకొని నెమ్మదిగా గదినుండి వినిర్గమించెను. పక్షులకలకలారావములు హెచ్చెను, ధర్మారావు వూరకే కనులు తెఱచుకొని పండుకొని యుండెను. సూర్యోదయము కావచ్చుచుండెను. గదియంతయు వెలుతురు వ్యాపించెను. తన కింక నిదుర యేమి పట్టును? ధర్మారావు లేచి పోయి స్నానముచేసెను.

సూర్యుఁడు సహస్రకరములతో భూమిని బొదివి పట్టుకొనెను. ఒకపక్షము గడచినది. కిరీటివద్దనుండి యొకలేఖ వచ్చినది. అందు రెండే ముక్కలు: 'నన్ను చూడవలయు ననినచో వెంటనే రా' అని. ధర్మారావున కేమియుఁ దోఁచినది కాదు. దీని యర్థ మేమి? ఇప్పు డరుంధతిని వదలిపెట్టి పోవుట యెట్లు? అరుంధతిని గాఁపురమునకుఁ

దెచ్చినతరువాత నొకటిరెండుసార్లకన్న నెక్కువ వదలియుండలేదు. ఆమె తాను పశుపతియింటికిఁ బోయినప్పుడే యెక్కువదినము లాలస్యము చేసెనని ధర్మారావును నిందించెను. నిజముగా ధర్మారావరుంధతికిఁ దల్లియుఁ, దండ్రియు, నన్నయుఁ, దమ్ముఁడునుగా నుండెను. ఆమెకుఁ దక్కినబంధువులమీఁద నున్న ప్రేమయంతయుఁ గలసి ధర్మారావుమీఁదనే కలదు. పతిని వదలి నిముసము నుండలేదు. అతఁడు కళాశాలకుఁ బోవును. అతని కొఱ కామె జపము చేయుచు నింటఁ గూర్చుండును. అతఁడు పొద్దుపోయి యింటికి వచ్చును. "ఇవ్వేళ నిల్లు కనఁబడినది. అందుకు సంతోషించవలయు" ననును. "కాదు కాదు, నిన్నుఁ గనిపెట్టుకొని సర్వకాల ముందును" అని ధర్మారావు. "నాకు నేదైన నుద్యోగ మిప్పించుఁడు. మీరు రాలేదన్న దిగులు నాకు నుండదు" అని యరుంధతి. "తొందరపడకు. ఆరోజులును దగ్గఱకు వచ్చుచున్నవి" యని ధర్మారావు. కిరీటి యిట్లు వ్రాయుటకుఁ గారణ మేమో? అర్థము సందిగ్ధముగా నున్నది. అతని కేమైన జబ్బుచేసెనా? ఏమో? ధర్మారావు తహతహ లాడిపోయెను. ఆ నాఁడుసాంవేళ నరుంధతి 'ప్రయాణము కా రేమి?' యనెను. ధర్మారావు 'ఎచ్చటికి?' యనెను. అరుంధతి "యతఁ డెట్లున్నాఁడో! ఆ యుత్తర మర్థమేమిటో? పోయిపసివానిని జూచి రాక? రెండు మూఁడురోజులు నే నుండగలుగుదును లెండి. అత్తయ్య యున్నది. సంవత్సరమునుండి పిల్లవాని గనుల కాచుకొన్నాము. నేఁ డుత్తరమునకుఁగూడ పోరా" యనెను. ధర్మారావు ప్రయాణముకట్టెను. అరుంధతి మడికట్టుకొని వంటచేసెను. రైలు సుబ్బన్నపేఁటలోఁ బ్రొద్దుగ్రుంకి యేడింటికి బయలుదేఱి బెజవాడకుఁ దొమ్మిదిన్నఱకుఁ జేరును. అరుంధతి దొడ్డిలో దొండకాయలు కోసి వేయించెను. పేఁటలోని తక్కినదొడ్లలో కూరగాయ యనునది కాయుట మానివేసినది. రంగాపురము సుబ్బన్నపేఁట కుత్తరమున నాల్గుమైళ్ళలో నున్నది. సుబ్బన్నపేఁట పట్టణమైనప్పటినుండియు రంగాపురములోని బీదవారు బాగుపడిరి. వారు కూరలుకాయింతురు. నేయిమజ్జిగలు చేయుదురు. సుబ్బన్నపేఁట నచ్చి యమ్ముకొందురు. పేఁటలో నున్న బీదవారు సినిమాహాలుచుట్టు తిరుగుచుందురు. కాఫీ

హోటళ్ళచుట్టును దిరుగుచుందురు. జట్టులుకట్టి దెబ్బలాటలకుఁ దిరుగుచుందురు. అప్పుడప్పుడు కూలినాలి సేయుదురు. వారిసంసారము లింటిలో నీఁగలమోఁత, బయట పల్లకీలమోఁత. వారియహంకారములు, వారియాంతర్జీవితములు 'ఇంగ మెతుకు లేదు, మీసాలకు సంపెంగనూనె' యన్నట్లు. గణాచారి దొడ్డిలోఁ రత్నగిరిదొడ్డిలో రామచంద్రరాజుగారిదొడ్డిలో, ధర్మారావుగారిదొడ్డిలో గూరలకు దారిద్ర్యము లేదు.' దొండపాదు పాలీయూనా పొడుగునఁ గాయును. ప్రతిరెండురోజుల కది కూర యిచ్చును. ప్రతినాల్గురోజులకుఁ గాఁకరపాదు కూర యిచ్చును. దొడ్డిలోఁ దోటకూరమడు లెప్పటి కప్పుడు నూతనముగా నుండును. తీఁగబచ్చలి మూఁడేండ్లక్రిందట వేసినపాదు.

ధర్మారావు భోజనముచేసి రైలునకు బయలుదేఱిపోవుచుండెను. అరుంధతి చొక్కాకు గుండీలుపెట్టుచుఁ "గీటి యక్లేల వ్రాసినాడుకు?" అనెను. ధర్మారావు 'తెల్లవాఱునప్పుడుఁ జెప్పెదను' అని బయలుదేఱఁ బోవుచుండెను.

అరుంధతి—మఱల నెన్నాళ్ళలో వచ్చెదరు? ధర్మారావు—రెండుమూఁడునాళ్ళలో వచ్చెదను. ఒకవేళ నాలస్యమగునేమో! అరుంధతి—నాలుఁగైదురోజులలోఁ గళాశాల తెఱుతురుగదా! ధర్మారావు—నీతోఁ జెప్పలేదు. ఇంకఁ గళాశాలకును నాకును సంబంధము లేదు. అరుంధతి—అనఁగా? ధర్మారావు—అనఁగాననఁగా నొకరాజు. రైలునకు వేళ యగుచున్నది. వచ్చినతరువాతఁ జెప్పెదను.

అరుంధతిని రాచుకొని యతఁడు బయటికివచ్చెను. అరుంధతి యతనియుత్తరీయమును లాగినది. అతఁ 'డయ్యో' యని వెనుకకుఁ దిరిగి చూచెను. అరుంధతి 'యెప్పుడు వత్తురు?' అనెను. ధర్మారావు 'వెళ్ళినఁగదా వచ్చుట' అనెను. అరుంధతి యుత్తరీయమును వదలిపెట్టెను.

రాత్రి తొమ్మిదిన్నఱకు ధర్మారావు బెజవాడ స్టేషనులో నుండెను. మెయిలు వచ్చెను. అందఱు నెక్కుచుండిరి. అఱవవాండ్రు, తోళ్ళవర్తకులు, తురకలు ఇంటర్మీడియటుబండ్లలోఁ బనాయించి పండుకొనిరి. బెజవాడలో నెక్కిన వారు వారిపాదములవద్దఁ గూర్చుండవలసివచ్చెను. మూఁడవతరగతిలో మనుష్యు లెక్కుటకు వీలులేదు.

కూర్చుండుటకు వీలులేదు. ధర్మారావొక బండిలోని కెక్కెను. జనము త్రిడి యెక్కువగా నుండెను. ఇతరస్వతంత్ర దేశములలో రైళ్ళిట్లుండవట. జన మెక్కువైరని పెట్టె లెక్కువ వేయరు. ఎంతమంది కూర్చుండుటకు వీలుండునో యన్ని టికెట్లే యమ్మరాదా? జనము ధనము దోచుకొనుటగాఁ గనిపించినది. వారికిఁ గలుగు సదుపాయము లేమియు లేవు. ఇంతలో రెండవతరగతిబండ్ల దగ్గఱ పెద్దగోల యేదియో పుట్టెను. అందఱు నక్కడకుఁ బోయిరి, బెజవాడలోని యొక రెడ్డి ప్లీడరు—గ్రామములోఁ బలుకుబడి కలవాఁడు—శాసన సభలో సభ్యుఁడు—చెన్నపురికిఁ బోవుచు రెండవతరగతి టికెట్టు కొనెను ఒక రెండవతరగతిబండికి లోనఁ దలుపు వేసియున్నది. కిటికీలన్నియు మూసియున్నవి. ఈయన తలుపు తీయు మనెను. లోనున్న యూరపియను దలుపుతీయలేదు. అది పెద్ద 'రభస' యయ్యెను. స్టేషనుమాస్టరు వచ్చికూడఁ దీయించలేకపోయెను. చివరకుఁ బెట్టె బలవంతముగాఁ దెఱచిరి. లోపల నున్నవానిని నిర్బంధించుటకు హైందవులైన పోలీసుఇన్స్పెక్టరులు పనికిరారు. సార్జెంటు కావలెను. బెజవాడలో సార్జెంటు లేఁడు. చెన్నపురికిఁ దంతినిచ్చిరి. మఱునాఁడు చెన్నపురిస్టేషనునకు సార్జెంటు వచ్చి యతనిని నిర్బధింపవలయును. రైలు సాఁగిపోవుచున్నది. ధర్మారావుహూహ సాఁగిపోవుచున్నది? 'హైందవులు యూరపియనును నిర్బంధించుటకుఁ బనికిరారేమి? అవును. వారు శ్వేతద్వీపవాసులు. ఇదే బాగుగా నున్నది."

రైలులోఁ గొంతసేపటికిఁ గూర్చుండుటకు వీలైనది. తాను కూర్చుండి యేమి లాభము? తనబదులు క్రొత్తవాఁడింకొకఁడెక్కి నిలుచుండెను. ధర్మారావు తాను నిలుచుండి యతనిని గూర్చుండు మని యడిగెను. ఆయన 'కాదు, కాదండి. మీ రిప్పుడే కూర్చున్నట్లున్నది. నేను మఱికొంతసేపు నిలుచుండుదును' అనెను. ధర్మారావు మఱలఁ గూర్చుండెను. పెట్టెలోఁ జిత్రముగ నున్నది. ఒకఁడు కలకత్తానుండి వచ్చుచుఁ బ్రక్కపఱచుకొని పండుకొనెను. నిద్రపోవుచుండెను. ఎవ్వరు నతనిని లెమ్మనరు. మఱియొకఁడు పండుకొని నిద్ర నభినయించుచుండెను. నిలుచుండినవా రతనిని లేపరు. బాపట్లలో నొకఁ డెక్కెను. ఒక నిద్రపోవుచున్నవానిని లేపెను.

అతఁడు లేచి కూర్చుండెను. మఱి యిద్దఱు కూర్చుండిరి. ఒంగోలులో మఱియొకఁ డెక్కెను. ఇంకొకపండుకొనినవానిని లె మ్మనెను. అతఁడు లేవ ననెను. ఎక్కినవాఁడు గడుసు. రాద్ధాంతము చేసెను. కేకలు, చేతులు చేతులుకలియుటదాఁక వచ్చెను. అందఱును సర్దిరి. అతఁడు లేచి కూర్చుండెను. మఱల నిద్దఱు కూర్చుండిరి. ఒకఁడు 'కన్నులు కనఁబడుటలేదా? మీఁదఁగూర్చుండు వే'మనెను. ఒకతె 'ఆఁడవారిమీఁద నట్లు పడిపోయెద వేమి? అవతలకూర్చుండలేదా?' యనెను. మూఁతపువాఁ డొకఁ డందుకొని 'సి వాఁడవాండ్ర పెట్టెలోఁ గూర్చుండకపోతివటమ్మా' యనెను. మఱల రైలు పోవుచుండెను. అందఱును గూర్చుండియే నిదురపోవుచుండిరి. చూడఁగాఁజూడఁగా ధర్మారావునకు నిది దేశము తత్త్వజలవద్దనుండి ధనముఁ గైకొని వారికిఁ దగిన జీవితసుఖములు సమకూర్పఁబడుచున్నట్లు తోఁచలేదు. ఇది యేదో రైలింత వేగముగాఁబోఁగల దని ప్రదర్శించి చూపించుట కేర్పడిన యొకగారడీవలెఁ గనిపించినది. అంతకన్న నింకొకరీతిగా నున్నచో బాగుండును. మన మేదో సొంతయుపయోగముకొఱ కొక పని చేసితిమి. ఆ యుపయోగ మెప్పుడో వచ్చును. అంతవఱకా పని యూరకేయుండుట యెందులకు? ఈ లోపుగా దానివలనఁగొంత ధనము వచ్చుటకు వీలుండెనేని రానిమ్ము! ఈ పద్ధతిగా నున్నది. రైలు చీఁకటిలోఁ బడి పోవుచున్నది. బిట్రగుంట దాఁటినది. చిన్న స్టేషనులను లెక్కచేయుటయే లేదు. తెల్లవాఱవచ్చుచున్నది. పినాకిని దాఁటినది. నెల్లూ రాఁగినది. ఇటొకనది; అటొకనది. ఆ నది దాఁటిన బెజవాడ. ఈ నదిదాఁటిన నెల్లూరు. చమత్కారముగానే యున్నది. రైలుదిగిన వెంటనే విద్యుద్దీపములవెలుతురులోఁ దనకుఁ బరిచితమైన యొకమొగము తనకోసము వెదకుచున్నట్లు ధర్మారావు కనిపెట్టెను. ఆ మొగ మెచ్చటనో కనఁబడెను. అతఁడు నవ్వకుండ పరిదీనముఖముతోఁ దనవద్దకు వచ్చి చేతులుపూని 'వచ్చితివా' యనెను. ధర్మారా వింతసేపు దిగ్భ్రాంతుఁడై చూచుచుండెను. 'వచ్చితివా' యనిన కంఠస్వరము వినఁబడినంతనే ధర్మారావున కతఁ డెవరో తెలిసెను. ధర్మారావుమొగములోఁ దేజస్సుపోయెను.

కంఠములో శోకగాద్గదికము తోఁచెను. అతని పెదవులపై నొక్కటియే మాట- 'ఇట్లైతి వేమి?' ఇది.

నెల్లూరు ప్లాటుఫారు మెత్తు. స్టేషను పల్లము. ప్లాటుఫారము నుండి స్టేషనులోనికి దిగుటకు మెట్లున్నవి. ఇద్దఱును గలసి మెట్లు దిగుచుండిరి. కిరీటి దిగలేక పడఁబోయెను. ధర్మారావు పట్టుకొని చేతులమీఁద బండ్లదగ్గఱకుఁ దీసికొనిపోయెను. కిరీటి వచ్చిన బండి మీఁదనే తిరిగిపోవుచుండెను. బండిలోఁ గూర్చుండలేక కిరీటి పండుకొనెను. ధర్మారావు తా నొక్కసారిగా హఠాత్తుగా నొక విశ్వసించరాని లోకమున నున్నట్లు భావించెను. 'జబ్బేమి చేసినది? యిట్లైపోయితి వేమి? మం దేదియుఁ బుచ్చుకొనుటలేదా? మీ నాన్నగారును, అప్పగారును నున్నారా? పదునేనురోజులలో నింత చిక్కిపోవుట యెట్లు? మీ మామవద్దనుండి వార్త లేమైన వచ్చెనా! ఆ పిల్లను నీ కీయ మనిరా యేమి?' ప్రశ్నపరంపర కురిసెను. కిరీటి తనచేయి ధర్మారావుమీఁద వేసెను. 'ఇంటికిఁ బోయినతరువాత చెప్పెదను. బండి కదలించుచున్నది. నా కేమియు నోపిక లేదు' అని కిరీటి సమాధానము చెప్పెను. ఇంటికిఁ బోయిరి. ఇల్లూరికిఁ జివర. రిజిస్ట్రాఫీసువద్ద పెద్దదొడ్డిలో నిల్లున్నది. ఇంటికి దూరముగా నొక పాక యున్నది. ఆ పాకలోఁ దడికె లడ్డము కట్టి రెండు గదులు. ఒక గదిలోఁ దండ్రి; ఒకగదిలోఁ గిరీటి. బండి దిగి కిరీటి నెమ్మదిగా 'మాటాడకుండ లోనికి రమ్ము. నాయన నేను స్టేషనుకు వచ్చితి నని కోపించును' అనెను.

ధర్మారావు—మంచి బుద్ధిమంతుఁడవు! కిరీటి—నీకుఁ ద్రోవ తెలియదాయెను. చీఁకటిలో నీ కెవరు చెప్పెదరు? ధర్మారావు—"మంచి యాలోచనాపరుఁడవు. సరిగాని పద" ఇర్వురును లోనికిఁ బోయి చప్పుడుగాకుండ పండుకొనిరి. ధర్మారావు—కథ యేమిటి? చెప్పవు? నాకు నిద్రపట్టుట లేదు. కిరీటి—నాయన నిద్ర లేచును. కోపించును. నిద్ర పట్టించుకొనుము. తెల్లవాఱినతరువాతఁ జెప్పెదను. ఇంక భయములేదు. భయమంతయు దాఁటిపోయినది. ధర్మా—మీ మామ పిల్లనిచ్చుట కంగీకరించెనా? కిరీటి—ఊఁ! ధర్మా—పెండ్లి యెప్పుడు? గిరీటి—వారమురోజు లున్నది. ధర్మారావు కిరీటిని

గాఁగిలించుకొనెను. కిరీటి ధర్మారావును గాటముగాఁ గవుంగిలించుకొనెను. అతనియొడలిలో శక్తిలేక ధర్మారావున కది గాఢముగా లేదు. తమ్ముని గాటపుఁ గవుంగిలింత ధర్మారా వెఱుఁగును. కాని యిప్పు డది గాఢముగాలేదు. ధర్మారా వనుకొనెను: "ఈ కవుంగిలింతలోని గాటఁపుఁదనములో నా కింక సంబంధము లేదు.

ఈ పాకకు దూరముగా నింకొకపాక యున్నది. అందులోఁ—గిరీటియున్నగారు వకీలు—అతఁడు కచేరి పెట్టుకొనును. పదిగంటల నుండి మఱల సాయంకాలమువఱకు నాపాక ఖాళీగా నుండును. పదిన్నఱకు నన్నదమ్ము లిరువురు నందులోఁ జేరిరి. కిరీటి యొకసంచముపైఁ బరుండెను ధర్మారా వొకకుర్చీలోఁ గూర్చుండెను. కిరీటి చెప్ప నారంభించెను. 'నే నీ యూరు వచ్చిననాఁడే మామామ కొకలేఖ వ్రాసితిని. అందులో మాయమ్మకుఁ దాను వాగ్దానము చేసెననియు, దానిప్రకారము తను నకుమకొనవలయుననియు, మాయమ్మ చనిపోవుటచేత నా వాగ్దానమునకు వ్యాప్తిపోలేదనియు, పిల్ల నిచ్చునదియు లేనిదియు వెంటనే సమాధానము వ్రాయవలయుననియు, నీయకున్నచో నేను చనిపోదుననియు, నీ హత్యాపాతకము దనకుఁ జుట్టుకొనుననియు వ్రాసితిని. దానికాయన సమాధాన మీయ లేదు. ఇచ్చటికి వచ్చినప్పటినుండియు నాకు నిద్రపట్టలేదు. అన్నము సయించలేదు. బాపట్లనుండి మాపినతండ్రి వచ్చెను. ఆయన చెప్పినాఁడు—మామామ యా యుత్తరము చూచుకొని నవ్వినాఁడట. ఆ యుత్తరము బంధువులకుఁ జూపించి, 'యీ పిచ్చివాని కటయ్యా పిల్ల నిచ్చునది? వీనిని జదువు కొమ్మని సుబ్బన్న పేట పంపించుట యెందులకు? విశాఖపట్టణము పిచ్చియాసుపత్రికిఁ బంపించరాదా?' యనెనఁట. నా కా వార్త తెలిసినది. నా కొడలు మండిపోయినది. నేను మఱల నింకొక యుత్తరము వ్రాసితిని. అది కొంచెము తీవ్రముగా వ్రాసితిని: 'నేను పిచ్చివాఁడను గాను, నీకన్నను దెలివి కలవాఁడను. నీవు నెలకు మూఁడువందలు తెచ్చుచున్నావు. గనుక నీవే వివేకవంతుఁడవు కావు. ధనముసంపాదించుట వివేకము కాదు. ఏదో మనము బ్రాహ్మణేతరులము గనుక నెమ్మదిగా నందులోనుండి యందులోనికి మ్యాజిస్ట్రేటును, తహశీల్దారును, నింగ్లీషు హెడ్

క్లార్కును, హుజూరుశిరస్తదారును, డిప్యూటికలెక్టరు నైనది. కాని ప్రత్యేకముగా మనము రాజ్యాంగ వేత్తలమా? మహాకవులమా? మహాశిల్పులమా? మతకర్తలమా? ఏమని? మామా! నే నిట్లన్నానని కోపము తెచ్చుకొనకుము. కోప మనునది తేలికగా వచ్చును. నెమ్మదిగా నీ వొంటరిగా నున్నప్పుడు శాంతముగా నూహించి చూడుము! నే నేమి నిన్న కార్యకరణము చేయుమనుట లేదు. నీకూఁతును దీసికొనిపోయి వట్టి దౌర్భాగ్యునకుఁ గట్టిపెట్టు మనుట లేదు. దైవము రక్షించిన నేను నేదియో సంపాదించఁగలను. నీ వైదాఱు వేలు కట్నమిచ్చి యేఁబదివేల యాస్తికలవాని కిచ్చెదవు. వానికి నీ వన్నచో గౌరవ ముండదు. నీకూఁతురన్నను గౌరవ ముండదు. నేను మేనల్లుఁడను. ఆ యైదువేలు నా కిచ్చినచో నాజీవితములో నేదైన నొక వృత్తిలో నొకమార్గ మేర్పఱచుకొనుటకు వీలగును. నేను ధనమాశించి చెప్పుటలేదు. నాకు నీ దమ్మిడీ యక్కఱలేదు. నాకుఁ గావలసినది శశిరేఖ. దానికి బరునియం దిష్టమున్నచో నేను నిన్నట్లడుగను. ఆమె పరాసక్తహృదయ యైనచో నా ప్రేమజీవితము బ్రహ్మ దుఃఖావసానముగా వ్రాసినాఁ డని యీపాటికే వర్షాకాల పినాకినీ గర్భమున నిమిడియుండును. దానికి నాయం దున్నది. నాకు దానియం దున్నది. ఇది యెన్నిజన్మములనాఁటి దాంపత్యమో! తండ్రివి గనుక నాకూఁతుమీఁద నా కధికారమున్న దని నీ వూహించెదవేమో! ఆ యధికార మెంతవఱ కున్నది? శశికిఁ బదునెనిమిదేండ్లు దాఁటినవి. న్యాయముప్రకారము నీ కామెమీఁద నధికారము లేదు. మే మిద్దఱము విడిగాఁబోయి వివాహముచేసికొనిన నీ వేమియుఁ జేయలేవు. అట్టిపని మనవంశమర్యాదకుఁ దగినది కాదు. కాదుగనుకనే నే నిచ్చట గృశించిపోవుచుంటిని. శశి నీయింటిలో శుష్కించి పోవుచున్నది. ఆలోచించుకొనుము. ఇదే చెప్పుచున్నాను. వారము దినములు తిరుగులోపుగా నీ యుత్తరమునకు సరియైనజవాబు రాదేని నీవు కిరీటిమరణవార్తయే వినెదవు. నీవు కఠోరహృదయుఁడవు. నా మరణవార్త చెప్పి నిన్ను బెదరించుట కాదు. నేను చనిపోవుదుననఁగా నీవుకాని భయపడవు. నే నూరకే జరుగఁబోవుచున్నవిషయము చెప్పితిని. నీజన్మములో నీకు శశిరేఖ సుఖముగాఁ గాపురము

చేయుచున్నదన్న వార్త విని సుఖపడవు. ఎవరికో బలవంతముగాఁ గట్టెదవు. దాని శవము పెండ్లిపీఁటలమీఁదఁ దల్లిచేతులలోననో. గర్భాదానమునాఁటిరాత్రి సూత్రము కట్టినవాని చేతులలోననో కనిపించును. అది నా భార్య. దాని నింకొకని కిచ్చుటకు నీ వెవఁడవు? ఎవరిసొమ్ము వారి కిచ్చుటకు నీ కింతదిగు లెందుకు? చేతిమీఁదుగా వివాహముచేయుము. చేసిన పుణ్యము కట్టుకొనుము. వారమురోజుల వఱకు నీ యుత్తరమునకై యెదురుచూచుచుందును' అని నేను వ్రాసితిని. ఆలేఖ చూచుకొని మామామ కొంత కదలిపోయెనఁట. కాని పిల్లనిచ్చుటకుమాత్ర మంగీకరించ లేదట. తరువాత రెండురోజులు గడచినవి. మూఁడవరోజు గడచినది. నే నీయుత్తరము వ్రాయుటయు నాస్థితియంతయు మాబంధువులందఱికిఁ దెలియును. ఇంక నేను బ్రదుకునది వారమురోజు లని, యాఱురోజు లని, యైదు రోజులని, నాల్గురోజు లని చెప్పుచుంటిని. నాల్గవరోజు సాయంకాలము నే నిప్పుడున్నట్లున్నాను. అయిదవనాఁడు మంచములోనుండి లేవలేకపోతిని. అన్నా! నాసంగతి నాకే విచిత్రముగా నున్నది. వైద్యులు వచ్చి పరిశీలించిరి. వ్యాధి యేమియు లేదనిరి. దేనికిఁ జికిత్సచేయవలయునో తెలియరా దనిరి. నన్నన్నముముందరఁ గూర్చుండఁబెట్టుదురు. నాకు మెతుకు లోనికిఁ బోదు. నే నప్పు డెట్లున్నానో నాకుఁ దెలియదు. అందఱునుమాత్రము నే నూరకే కనుఱెప్పవేయక చూచుచుంటి ననియు, నెవ్వరితోను మాటాడకుంటి ననియుఁ జెప్పుచున్నారు. నా కొక్కటిమాత్రము బాగుగా జ్ఞాపక మున్నది. పదిగంటలకుఁ దపాలాఫీసునుండి యుత్తరములు వచ్చును. పోస్టువాఁడు వచ్చువేళకు నే నుత్తరము వచ్చినదా యని యడుగుదును. ఎవ్వరును సమాధానము చెప్పరు. రాలేదని నాకుఁ దెలియును. ఇంక మూఁడురోజులు. ఇంక రెండు రోజులు. అప్పటికి నాస్థితి యందఱికిని సమగ్రముగాఁ దెలిసినది. అందఱును బడుచున్న తొందరయు, వా రనుకొనుచున్న మాటలును నాకుఁ దెలియును. నేను వారితో మాట్లాడుటకు నాకు నోరు రాదు. నాకు మనస్సులో నేమియును లేదు. ప్రతిరోజును పదిగంటలగుట, తపాలాబంట్రౌతు ఉత్తరమును దెచ్చుట - అదితప్ప నాబుద్ధికింకొకఁడు లేదు. ఆరోజకూడ నైపోయినది. ఇంక నొక్క దిన

మున్నది మాపినతండ్రులు, మానాయన, మాతక్కిన మేనమామలు నందఱు నీయూరనే యుండిరి. ఆ రోజున నేను మంచములో శవమువలె నుంటినంట. శవమువలె నుంటిని. అది నాకును దెలియును. మాటాడలేదు. కన్నులతో మాత్రము చూచుచుంటిని. వైద్యులు వచ్చిరి. చూచిరి. జ్వరము లేదు. నాడి చక్కఁగా నాడుచున్నదంట. పలుకు లేదు. కనులలోఁ దెలివియాడుచున్నదంట. మామామకుఁ దంతియిచ్చిరంట. 'కిరీటి మరణశయ్యమీఁద నున్నాఁడు. సాయంకాలపుబండిలో ర' మ్మని. తంతి యిచ్చినది మా యింకొక మేనమామ. మామామ రాత్రికి వచ్చెను. ఆ స్థితిలో నున్న నన్నుఁ జూచెను. అయోగిరివంటి యాయన కరఁగిపోయెను. నన్నుఁ గన్నులు మూసికొనియున్నవానిని, ఒకవిధముగా స్మృతిలేకయున్నవానినిఁ దట్టి 'కిరీటి! కిరీటి!' యని లేపెనంట. నాకు స్మృతిలేదు. అప్పుడు మాపినతండ్రి యొకయుపాయము చెప్పెనంట—'వాఁడు రేపు మఱల పోస్టువాఁడు వచ్చువేళకుఁ గన్నులు తెఱచి యుత్తర మనును. ఈ లోపుగా నీయుత్తరము వ్రాసియుంచుము. ఆవేళ కది వానిచేతి కిత్తము. వాఁడు బ్రతుకుట కదియొకటియే యాశ' యని. మఱి కొందఱు: 'ఇంత నీరసస్థితిలో నంతటి మంచివార్త యతఁడు విని యానందమును పట్టలేక యేమగునో!' యని చెప్పిరి. మాపినతండ్రి 'వ్రాసెడు నుత్తరములో నతనిమనస్సు చమత్కారముగాఁ, బ్రాణములను జెదరిపోనీయకుండ పట్టుకొనునట్టుగా వ్రాయవలయును; నేనట్లువ్రాయింతు' నని చెప్పి మామామచేత నొకజాబు వ్రాయించెను. మఱునాఁడు తపాలావేళకు నేను కన్ను తెఱచి 'యుత్తర' మంటిని. 'ఇదిగో ఉత్తము వచ్చిన' దని నాకిచ్చిరి. అం దిట్లున్నది. 'కిరీటి! నీవు చాలవిచిత్రమైన మనిసివి. నీవు తెలివితక్కువవాఁడవు కావు. వారమురోజులలోఁ జనిపోదు నని చెప్పిన నీకు నా కూఁతు నిచ్చెద ననుకొనుము. అంత తీవ్రబుద్ధి వామెతో నేమి సంసారము చేసెదవు? నీప్రకృతి యలౌకికముగా నున్నది. నీవు నావద్దకు వచ్చి నాతో మాటాడుము. మాయమ్మాయిని నీకే యిచ్చెదను. కాని నీవు రెండుమూఁడురోజులలో వచ్చి నాతో మాటాడవలయును — ఇట్లు మీ మామ.' నే నా యుత్తరము చదువుకొనినంతనే నాకు

వివేకమేమియును బోలేదు. సర్వమును జక్కగాఁ దెలిసినది. నా యెడలిఁకో నేమియున్యాయని లేదు. వారము రోజులు నిద్రాహార మెఱుఁగని నీరసముమాత్ర మున్నది. నేను లేచి 'నాయనా! నేను బాపట్లకుఁ బోవలయు' నంటిని. మా నాయన 'మామ యేమని వ్రాసెనురా, యుత్తరము' అనెను. నేను 'పిల్ల చచ్చెనట. కాని ముందుపోయి నేను మాటాడవలయునఁట. నేనింక సాహసించ నగుటచేత నాయన కనుమానమఁట' అని చెప్పితిని. మా నాయన 'నేఁటి సాయంకాల మాయన యీయూరు వచ్చునఁట. నీవు వెళ్ళుట యెందుకు? అయిన ప్రొద్దుటిబండికి వచ్చునేమో! కనుగొనివత్తు' నని చెప్పెను. ఎవరినో పంపించి కనుగొనునట్లు నటించి మామయనవచ్చినట్లు నాకుఁ దెలియఁజేసెను. నేను మాపినమామయింటికిఁ బోయితిని. నన్ను మా బావయు మానాయనయుఁ బట్టుకొని తీసికొనిపోయిరి. మామామ కనఁబడెను. ఆయనను జూచినంతనే కారణములేకయే నాకు దుఃఖము పొంగివచ్చి నే నేడ్చితిని. ఆయనయు నను గవుంగిలించుకొని దుఃఖించెను. నలుగురు నాయన నోదార్చిరి ఆయన చివర కిట్లు చెప్పెను: 'ఇక్కడ వీఁ డిట్లున్నాఁడు. అక్కడ శశి యెట్లున్న దని! ఆమె యుపవాసములు, వ్రతములు నెలనాళ్ళ నుండి యేక భుక్తము. వారము రోజులనుండి దానికి స్మృతి లేదు. ఏదో మంత్రము నేర్చుకొన్న దఁట. ఎప్పుడు నా మంత్రమే జపించుచుండును. తన్మంత్రపునశ్చరణలో మన ధ్యాసయే లేదు. ఈ దంపతుల నిద్దఱు విడిగాఁ దీసి నే నేమి బాగుపడుదు?' అని చెప్పి నన్నుఁజూచి 'నాయనా! లగ్నము పెట్టింతునా?' యనెను. మా నాయనకు జ్యోతిషము బాగుగాఁ దెలియును. ఆయనయే ముహూర్తము పెట్టెను. లగ్న మింక నైదుదినములున్నది. ఇది జరిగినది మొన్న. మొన్ననే నీకు జాబు వ్రాసితిని. నీకు నిన్న నందినది. అందిన వెంటనే బయలు దేఱి వచ్చితివి. ఇది నా కథ. నేను మొన్నటికన్న నేఁడు చాల నయము. నేను మొన్నటికన్న బలసితినిసుమా!"

ధర్మారావు మనుష్యలోకములో లేఁడు, రసప్రపంచమున నున్నాఁడు. దశావస్థలు, సాత్త్వికవ్యభిచారభావములు – వానిని గుఱించి యూహించుచున్నాఁడు. "ఓహో! కావ్యజగత్తు కల్పితజగ

త్తముకొంటిని. కావ్యజగత్తే యథార్థమైన జగత్తు. అపరిపక్వమైన మనస్సులు, కృత్రిమప్రకృతులు, సహజమైన మనోభావములను గలిగిన మనమే కల్పితజగత్తు. యథార్థమైన మనోభావములు, నిర్మలమైన హృదయము, మహానాగరికత పొందిన బుద్ధీంద్రియములు కలిగినచోఁ దనసృష్టి, తనరక్తము కల్మషరహితమై, ధర్మగుణభూయిష్ఠములైనచో శీలమునం దంతగాధత్వ ముండును. అంతయేకాగ్రత యుండును. ధర్మార్థకామమోక్షములు వారియందు వ్యభిచరించవు. వారు వానిని జక్కఁగా విభజించి యొకదాని సంశ్లేష యొకదానికిఁ గలుగకుండ వానిని సువ్యక్తముగా నాచరింతురు. పంచీకరణమువలననైన భూతసృష్టికి వా రలంకారభూతులు. వర్ణసంకరములేని రక్తము స్వచ్ఛమైనది వారినాడులలోఁ బ్రవహించుచుండును. ఏవర్ణము వారైన నేమి? తాదృశమహాప్రకృతులకు నమస్కారము"

కిరీటి—అన్నా! యేమి టాలోచించుచున్నావు? ధర్మా—నీ భార్య స్మృతిలో లేదంటకదా! ఆమెను నీవొకసారి చూచిరారాదా? కిరీటి—ఇద్దఱమును పోదమా? ధర్మా—వలదు. లగ్న మిం కెన్నాళ్ళు లున్నది? కిరీటి—నాల్గురోజులు. ధర్మా—ఈ నాల్గురోజులలో నీ వేమైన రెక్కొందువా? కిరీటి—మనసులో శశిరేఖ యున్నది. దగ్గఱ నీ వుంటివి. అన్నము కలిపిపెట్టు నన్నవు నీ వుండఁగా నే నేల బలియను? ధర్మా—వదినె నాకై యెదురుచూచుచుండును. నేనిచటి నుండి కదలిపోవుట పదినాళ్ళకుఁ దక్కువ పట్టునట్లున్నదే! కిరీటి—సుబ్బన్నపేట యిద్దఱము గలసిపోదము. ధర్మా—ఇంక నిన్ను నమ్ముకొన్నచో నేను వెళ్ళినట్లే.

కిరీటి యొయ్యారమైన విలాసమైన పసిసిగ్గువెలిగ్రక్కు చిఱునవ్వు బలహీనమైన మొగమునఁ దాండవింపఁజేసెను. చచ్చిపోవుచున్నతీఁగ కెరువుంచి నీరుపోయఁగా మఱునాఁడు నిలువఁద్రొక్కుకొని, మొండివడిన కొమ్మకణుపులో గనఁబడీకనఁబడనంత సన్నని లేఁత చివురు కనిపించినట్లున్న దా నవ్వు. రెండురోజులలోఁ గిరీటి మఱల మనిసివలెఁ గనఁబడఁజొచ్చెను. శరీరమునందు బలహీనముగా నున్నను కొద్దిగా లేచి తిరుగుటయు, నుత్సాహమును నతనిలోఁ గనఁబడుచుండెను. స్నేహితులందఱకును శుభలేఖలు వ్రాయఁబడినవి.

కిరీటి తాను స్వయముగా వ్రాసెను. పెండ్లి బాపట్లలో. వివాహమునకు బంధుగులకన్న స్నేహితులే యెక్కువమంది వచ్చిరి. కిరీటి ప్రణయకథ స్నేహితులందఱెఱుఁగుదురు. చివరకు వారియిద్దఱకును బునస్సమాగమము కలుగుచున్నదనుటచే సంతోషించనిమిత్రుఁడు లేఁడు, సూర్యపతి, పశుపతి, శివరావు, సీతాపతి-యెల్లరునువచ్చిరి. అందఱును పెండ్లికుమారునకుఁ గానుకలు తెచ్చిరి. ఎవరుతెచ్చిన కానుకయుఁ బెద్దవెలకలది కాదు. అన్నియు నందమైనవి. సూర్యపతి కృష్ణకర్ణామృతము, లీలాతరఙ్గిణి, గీతగోవిందకావ్యము నివి మూఁడును బహుమాన మిచ్చెను. శివరావు మంచిగంధముతోఁ జేసిన ఛాయాపటములచట్టు కొనితెచ్చెను. పశుపతి దంతపుఁబనిచేసిన మంచిగంధపుచందుకాయపెట్టె తెచ్చెను. సీతాపతి పొందూరు జరీ పంచెలును, చీరయు సతీపతులకుఁ గట్నము తెచ్చెను. వివాహ సమయముల స్నేహితులసందడి పేరంటాండ్రసందడికన్న నెక్కువై పోయెను. స్నేహితులలో బాపిరాజుండెను. అతఁడు చిత్రకారుఁడు. పరమసత్పురుషుఁడు. అతఁడు చమత్కారముగాఁ బాటలు పాడును. సతీపతులవరుసలనుబట్టి వరుసపాటలు పాడును. పదునెనిమిదేండ్ల పిల్లకు వివాహమగుట, వివాహములో ననేకసందర్భములు కలుగుట చేతనో యేమో బంధుగు లెక్కువమంది రాలేదు. అందుచేత బంధువులైన పేరఁటాండ్రే యెక్కువమంది లేరు. బాపిరాజు వారందఱును లేనిలోటు తీర్చెను. వివాహము మూఁడునాళ్ళు చేసిరి. మూనాళ్ళును ప్రత్యేకపువిడిదిలో స్నేహితులు పడిన యుత్సాహమునకు మేఱలేదు. కిరీటి తనప్రణయకవిత్వముచేత రసజ్ఞులైన భావకవులందరకు సమాదరణీయుఁ డయ్యెను. అందుచే నందఱును వచ్చిరి. దినములోఁ బదునాఱుగంటలు సంగీతములు, పాటలు, పద్యములు వీనితోడనే సరిపోయెను. సుబ్బారావుగారువచ్చి తనకోకిలకంఠముతో ఎంకిపాటలు మూఁడురోజులును గొట్టిపోసెను. సుబ్బారావుగా రన్న స్నేహితులకందఱకును మహాభిమానము. పశుపతి కాయన యవతారపురుషుఁ డనియే. పెండ్లిజరిగిన మూనాళ్లు నెప్పుడోతప్ప కిరీటి పెండ్లియిల్లు వదలి రా వీలులేకపోయెను. ధర్మారావువిడిదిలోనుండుటకు వీలులేదు! సర్వవేళల కిరీటివద్దనే యుండవలయును. ధర్మారావు

విడిదిలోనికి భోజనమునకుఁ బోవుదురు. భోజనము చేసి వచ్చునంతలో నతని కొఱకు విడిదిలోనికి: బదికబుకులు పోవుదు. కలెక్టరుగారికి బంట్రౌతు లుండిరి. వారికి ధర్మారావుగా రెవరనియు; గలెక్టరుగారియల్లుని కంత స్నేహితుఁడా యనియు నబ్బురముతోఁచు కనులతో ధర్మారావును వచ్చి పిలుతురు! అతఁడు భోజనముచేసి పోవును. కిరీటి చెప్పవలసిన దేమియును లేదు. ధర్మారా వూరకే ప్రక్కను గూర్చుండును. లగ్నసమయమున శశిరేఖను దెచ్చిరి. ఆమె కనులెత్తి యెవరిని జూడలేదు. తెరతీసినతరువాత కిరీటి తనవేయికనులతో నామెను జూచెను. ఆమె కనులెత్తి యతనిని జూడలేదు. ఇద్దఱును తలంబ్రాలు పోసికొనిరి. కిరీటి నాలుగైదుసార్లుమాత్రము పోసెను. పళ్లెములోని తక్కినబియ్యమన్నియు శశిరేఖచేతనే తల్లి పోయించెను. ప్రియురాలి హస్తాంగుళీస్పృష్టములై చల్లనివై తనశిరస్సున జాఱుచున్న తలంబ్రాలు జాఱుటలోని సౌఖ్య మతఁడు నిమీలితనేత్రుఁడై యనుభవించుటయే సరిపోయెను.

మఱునాఁటి సాయంవేళ నూరేగింపు. గుఱ్ఱపుబండిపై నది జరిగెను. కిరీటి బండిలోఁ గూర్చుండెను. శశిరేఖను దల్లియు, నప్పగారును దీసికొనివచ్చిరి. కిరీటి యామె నందిపుచ్చుకొని ప్రక్కను గూర్చుండఁ బెట్టుకొనెను. పేరఁటాండ్రకు, మిత్రులకు నేత్రానందము కలిగెను. నాకబలిసమయమున నీటికడవలో నొక వెండిమట్టెయు, బంగారపుటుంగరమును వేసి సతీపతులను దీయుమనిరి. కిరీటి బుద్ధిపూర్వకముగా మట్టెయే తీసెను. పరిశేషన్యాయముచేత శశిరేఖ కుంగరమే దొరకెను. బాపిరాజు 'ఓయ్యోయి పెండ్లికొడుక! ఉంగరము మా అమ్మాయియే తీసిన' దనెను. కిరీటికి బాపిరాజునకు బావమఱఁదులవరుస. కిరీటి "అవి మీ అమ్మాయి తెలివితేటలు కావు. నేనే యాయుంగరము దానిచేతిలో నుంచితిని" అనెను. అందఱును బకాలున నవ్విరి. కిరీటి సిగ్గుపడెను. శశిరేఖ నవ్వదు. సిగ్గుపడదు. ఎవరివంకను జూడదు. ఆమె మొగమునం దేభావమును గన్పించదు. అసంభవ మనుకొన్న యీ వివాహము జరుగుటచేత నామె దిగ్భ్రాంతురాలైనదని కొందఱు. అనిర్వచనీయమైన యొక మహానందమామె యనుభవించుచున్నది, తదితరజ్ఞాన మామెకు లేదని కొందఱు.

మూఁడవనాఁడు కంకణములు విప్పిరి. ఆ రాత్రికి కార్యము. ఆ నాఁడు ప్రొద్దుగ్రుంకఁ బోవుచున్నది. ధర్మారావును గిరీటియు గ్రామమునకుఁ బ్రాగ్దిక్కునను న్న సరకుతోఁటలకు, మామిడితోఁటలకుఁ బోయిరి. తక్కినమిత్రు లేరితోడను జెప్పకుండ వారట్లుపోవుటచేతఁ దక్కినవారందఱు కొంతసేపు వారిని వెదకి తలాయొక త్రోవ వాహ్యాళి కేఁగిరి. నాల్గుతోఁటలమధ్య చిన్నచిన్నసరకుమొక్కలప్పుడే నాటఁబడిన యొకతోఁటలో వా రిరువురును గూర్చుండిరి.

ధర్మారావు—నాయనా! ని న్నేమని యాశీర్వదింతును? నీ యదృష్టము నాయాశీర్వచనమును దాఁటిపోవుచున్నది. నే నెప్పుడు పోదును; ఎప్పు డరుంధతి కీ సంగతులన్నియుఁ దెలియఁజేయుదు నని నాకుఁ దొందరగా నున్నది. నేను వచ్చి పదినాళ్లయినది. ఇంటికి లేఖయైనను వ్రాయలేదు; నా పోకపోవుటకన్న నీ స్థితి యెట్లున్నదో యని యామె దిగులుపడుచుండు ను.

కిరీటిమనస్సు ధర్మారావుమాటలమీఁద లేదు. ఎప్పుడు పొద్దుగ్రుంకును? ఎప్పుడు రాత్రి పడును? ఎప్పుడు చిరతపఃఫలము వలె చిరకాంక్షితార్థము తనకౌఁగిటనుండును? తా మిద్దఱును గలసికొన్నప్పు డెట్లుండునో! ఒకరికొఱ కొకరు మృత్యుసమీపముదాఁక పోయివచ్చిరి. కలసికొనినపు డిద్దఱును స్వర్గముదాఁక పోదురో! స్వర్గము దాఁటిపోదురో!

కిరీటి "అన్నా! లగ్నమునకుఁ బీఁటలమీఁదఁ గూర్చున్నప్పటినుండి నా యీ శరీరరోమాంచము తగ్గలేదు. ఇది జీవితమంతయు నిట్లే నిలిచిపోవునేమో" యనెను. కిరీటి మాటాడు పద్ధతియుఁ, గూర్చుండుపద్ధతియు నేమియు బాగుగా లేవు. కంఠమునందు గాద్గదికము, శరీరమునందు కంపము, స్వేదము, రోమాంచము. మాటాడుచు మాటాడుచు నేత్రనిమీలనముచేయును. కిరీటి 'యెంతసేపటికిని బ్రొద్దుగ్రుంక దేమి?' యనెను. ధర్మారావు 'నీతొందరయతని కేమి తెలియును?' అనెను. సూర్యుఁడు పారాణిపూసిన నూతన్నవధువుపదసరోజాతము ననుకరించెను. భాగ్యశాలినిదైన యాపాదమునందును శంఖచక్రములున్నవి. అదియు నఖచంద్రులకు దీధితి నిచ్చును. ప్రేయోహృదయసరోజాతమును వికసింపఁ జేయును. తత్పూర్వబింబ నిర్గతసంధ్యారాగ

చ్ఛటలు కించిదరుణములై పసుపుకుంకుమలచే మాగిన మధుపర్కములు కంకణములు విప్పిననాఁడు చాకలి యుదికి యారవేసినట్లుండెను. సరకుతోఁటలు - (వేలెఁడు మొక్కలవి, బారెఁ డెదిగినవి. రెండు నిలువుల యెత్తున పెరిఁగినవి, పెరుఁగుట పూర్తియైనవి - నాల్గువైపుల పచ్చనిమెట్లుకట్టిన ట్లుండెను. సూర్యనికిరణములు పెరిఁగినతోఁటలపై సంచరించుచు నటనుండి కాలుజారి చిన్నతోఁటల మీఁదఁ బడుచుండెను. వ్రేలెఁడెదిగినచెట్లు పసిపిల్లలవలె సూర్యకరస్పర్శకు పిల్లనవ్వులు, పిల్లసిగ్గులు కలియఁబోసికొని సిగ్గుచే నెఱ్ఱపడెను. చూచుచుండఁగనే పెరిఁగిన సరకుజోడెల మధ్యగా దూరమున దృశ్యమానుఁడగుచున్న జరఠసూర్యబింబమూర్తి తేజోవిరహితుఁడై తైక్ష్ణ్యముకూడ మాసినవాఁడై పశ్చిమదిక్సతీసంయోగార్థము కాఁబోలు కాశ్మీరమిశ్రితపటీరచర్చాసుందరమైన దేహముతోఁ దిరోహితుఁడగుచున్నాఁడు ఆకాశమునఁ దిరిగినంతసేపు తేజోదుర్నిరీక్షుఁడై, ప్రతిభాశాలియై, పశ్చిమదిక్సతీసంసర్గవేళ శాంతుఁడై శృంగారరసమూర్తియై చల్లవడెను. అట్లేకదా! యెంత యధికారికైనను పరులమీఁద జూపినంత తైక్ష్ణ్యము గృహమునందుఁ జూపరాదు. తన ప్రతాపముచేఁ, దనకోపముచేఁ, దన యధికారశక్తిచే నితరులభార్యలకు నపకారము జరుగవలయును. తమ యధికారప్రాభవ మెఱుంగనిస్వభార్యలు సుఖముగా మనవలయును. గృహమునందున్న శాంతము, నోరిమి బయటకూడ నుండరాదా? లోకము మేలుకూడ, లోకము సుఖము కూడఁ గొంత పరామర్శించరాదా? మధ్యాహ్నసూర్యుఁడు మండిపోవలయును, సాయంసూర్యుఁడు చల్లఁబడవలయును.

రాతిరి పీఁటలమీఁదనుండి లేచువఱకును మిత్రులు సన్నిహితులే యైయుండిరి. అప్పుడు విడిదికిఁ బోయిరి. రాతిరి రెండుజాములయ్యెను. అందఱును నిద్రించుచుండిరి. కిరీటి వచ్చి ధర్మారావును నిద్రలేపెను. ధర్మారావు లేచి యాశ్చర్యపోయి 'యిదియేమి' టని యడిగెను. ఇరువురును గొంతదూరముపోయి నిర్జనమైన వీథిలోనుండి మాటాడఁదొడంగిరి. కిరీటి "అన్నా! నేఁడు శుక్రవారముకదా!" అనెను. ధర్మారావు 'అవును. అయిన నేమి?' అనెను. కిరీటి "నేను గదిలోనికిఁ బోయి యామెను బిలిచితిని. కొంతసేపు పిలిచి పిలిచి

నేనే యామెవద్దకు బోయితిని. పోయి యామెను బుజ్జగించితిని, లాలించితిని, కోపించితిని? ఆమె యేమియు సమాధానము చెప్పలేదు. నా కేమియు నర్థము కాలేదు. నామీఁద నామె కంత ప్రేమ యుండి చివర కిట్లు నిస్తబ్ధయై, నిరుత్తరయై శిలాకృతిఁ గదలకుండుటయేమో! నే నామెను మఱియు స్పృశించఁబోతిని. ఆమె నివారించినది. దుఃఖించినది. రెండుగంటలు నేను బాధపడి నిస్పృహుఁడగువేళకు నామె 'నీవెవ్వర'వని యడిగెను. నాకు మహాదుఃఖము వచ్చినది. 'ఎవ్వరేమిటి? యెనిమిదేండ్లు నీకై ఘోరతపస్సుచేసిన నిస్పృహుఁడ' నంటిని. 'నీవు భార్య వవుటకు దివారాత్రములు నిద్రాహారములుమానిన నిర్భాగ్యుఁడ'నంటిని. 'నీ మేనత్తకుమారుఁడ' నంటిని. కను తెఱచి చకితయైనది. ఏదో స్మృతికిఁ దెచ్చుకొన్న ట్లభినయించినది. ఆమె చివరకు 'మనమిద్దఱ మిచ్చట నెట్లుంటిమి? ఇది యేయూరు?' అనెను. నేను 'నీ వన్నది నా కర్థముగుట లేదు. ఇది బాపట్లయే, మన మిద్దఱ మిచట నెందుకుంటిమో, మూన్నాళ్ళనుండి నీకుఁ దెలియలేదా' యంటిని. ఆమె వెలతెలబోయి చూచెను తన్నుఁ దాఁ బరిశీలించుకొనెను. గులాబిపూలతో, చేమంతిపూలతో, మొగలిపూలతోఁ బెద్దజడ వేసిరి. ఆమెశరీరమంతయు సువాసనాపరిమంజులమై యుండెను. కట్టినచీర యుల్లిపొరవలె తచ్ఛరీరకాంతిప్రవాహమును వడబోయుచున్న ట్లుండెను. ఆమె తన మూర్తిసంఘటనమంతయుఁ జూచుకొని యాశ్చర్యముపొందిన ట్లయ్యెను. కొంతవడికి నేత్రములు తెఱచి యాలోచించి 'యట్లనా! మనకు వివాహమైనదా? అవును. లీలగా స్మృతి కలుగుచున్నది. నీవు బావవుకదా!' అన్నది. నేను మఱల సమీపగతుఁడనై పరిష్వంగాభిలాష ప్రకటించితిని. ఆమె మఱల వారించినది. ఆమె 'నేఁడు శుక్రవారము. నీవు నన్ను దాఁకరాదు. అయినను నేను పోయి స్నానముచేసివచ్చెద. నిచ్చటనే యుండు' మని తాను గదిలోనుండి వెడలినది. నేను శూన్యహృదయుఁడ నైతిని. నా భాగదేయమంతయు వ్యత్యస్తముగా నున్నట్లు తోఁచుచున్నది. ఇది యేమో, దారిని బడి వచ్చి వచ్చి, మహాసౌధము నారోహించఁబోవుచుంటి ననుకొని, మహారణ్యగతుఁడనై నన్ను నేను జూచుకొని నివ్వెఱవోయిన ట్లయినది. ఏమిచేయుదు'

నని కిరీటి దీర్ఘనిశ్వాసమువదలెను. కన్నులలో బాష్పములునిలిపెను. తూష్ణీంభావము వహించెను. ధర్మారావు దీర్ఘాలోచనాపరుఁడై, "ఆమె దేవీపూజ చేయు నని మన మిదివఱకు వినియుంటిమికదా! ఆమె నీపెండ్లి నిర్ణయించిననాఁ డప్పటికి వారమురోజులనుండి తన స్మృతి తా నెఱుఁగ దని మీ మామ చెప్పెనుగదా! గుంటూరిలో పూజారి ముసలవ్వకూడ నామె దేవ్యుపాసకురా లని బోధించెకదా! నేఁడు శుక్రవారము. దేవి కిష్టమైన దినము. దేవ్యుపాసకుల కీనాఁడు పవిత్రమైనవారము. ఆమెకు నిజముగా నీ పదిరోజులనుండియు స్మృతి లేదేమో? నీయం దామెకు మహాప్రేమ మని విదితమైనవిషయమే కదా! ఆ విషయములో సందేహము లేదు. నీ విప్పు డెంత యానంద సముద్రమున నుంటివో, నీ కొఱ కామెయు నంత యానంద మనుభ వించవలసినదే. దాని కేదియో పెద్దకారణ ముండియుండవలయును. ఆమె యీపాటికి స్నానముచేసి నీకై వచ్చియుండును. నీవుపోయి యామెవచ్చిన తరువాత నే మనునో కనుగొనుము. నీవు వెళ్ళుము" అని కిరీటిని బలవంతముగాఁ బంపించెను. కిరీటి నిస్పృహుఁడై యడు గులు లెక్కబెట్టుకొనుచుఁ బోయెను. ధర్మారావుపోయి మఱలఁ బండుకొనెను. అతనికి నిదురపట్టలేదు. తెల్లవాఱుకడ మూఁడుగంట లకుఁ గిరీటి మఱలవచ్చెను. ఇరువురుకుఁగలసి నిర్జనవీధిలోనిలుచుండిరి. కిరీటి"ఆమెయంతజడయుఁబూలన్నియుఁదీసివేసివిప్పి స్నానముచేసినది. ఒడలంతయు సుగంధద్రవ్యము లలందఁబడియుండుటచేత స్నానము చేసిన యామెయొడలు బహువిధపరిమళప్రవాహమనోహరమయ్యెను. ఆమెయాచీరవదలి యింకొకపట్టుచీరకట్టుకొనివచ్చెను. పట్టురెకతొడి గెను.గదిలోనికివచ్చినది. ఒడలనొక్కనగమైనను లేదు. చిన్నకుంకుమ బొట్టు పెట్టినది. నేను దగ్గఱకుఁబోయి స్పృశించబోయితిని. ఆమె 'తాఁకవలదు. రెండుకొబ్బరికాయలును, హారతికర్పూరమును గావలె' ననెను. నే 'నిప్పు డెచ్చటినుండి వచ్చు' నంటిని. అంద ఱును నిదురపోవుచుండిరి. ఆమెయే పోయి యిల్లంతయు వెదకి యవి తెచ్చెను. తెచ్చి యామె నన్నుఁ దనవెంట రమ్మన్నది. మే మిర్వు రమును వంటయింటినానుకొనియున్న గదిలోనికిఁ బోయితిమి. అచట గోడలో నొక గూఁటిలో దేవీవిగ్రహమున్నది, ఆమె పూజచేసి,

కొబ్బరికాయలుకొట్టి, హారతికర్పూరము వెలిగించి నీరాజనమిచ్చి కొబ్బరిచిప్ప ముక్కలుతీసి నాకు నాలుగు పెట్టెను. ఇద్దఱము మఱల గదిలోనికి వచ్చితిమి. నే నామెను మఱలఁ గవుంగిలించు కొనఁబోతిని. ఆమె 'ఏవు నన్ను నేఁడు తాఁకరాదు. ఈసంగతి యంతయు ఱేపు చెప్పెదను. తల్లిదయ మూవిపడి నాతపస్సు ఫలించి నది' అనెను. 'నాకు దానిమాటలు కొంచెము కొంచెముగా నర్థము కావచ్చెను. నా శరీరమునందుఁ బ్రతిరక్తబిందువులోనను మన్మథుని శరాఘాతమైనది, నేను పురఃస్థితమాణిక్యపేటిని జూచి, యది నాదియని తెలిసి, యది నాకొరకై యెదుటికి వచ్చి నిలుచున్న దనియుఁ దెలిసి తదనుభవమునకు దూరమైతినన్నసంగతి నాకుఁ జాల బాధాహేతు వయ్యెను. నేను బలవంతముగా నామెను గౌఁగిలించు కొని ముద్దాడితిని. ఆమెశిరోజభార మెండలేదు. అదియంతయుఁ దడిగా నున్నది. నేను దాని కేశభారమంతయు నుత్తరీయముతోఁ దుడిచితిని. ఆమె యఱగంటసేపు నా పరిష్వంగముననే యున్నది. నన్ను నివారించలేదు. గంటసేపైనతరువాత నామె యిట్లన్నది: 'ఇద్దఱము వాంఛకులొంగిపోయి దేవియెడ నపచారము చేయుచున్నాము. ఈ యపచార మేమి దుష్ఫలితము నిచ్చునో! నేనును నీవు నాకు లభించితి వన్న యానందమునం నొడలు తెలియక నిన్ను కౌఁగిలి నుండి నిరాకరించలేదు. బావా! ఎనిమిదిసంవత్సరము లోర్చుకొంటివి. ఇంక నొక్కదిన మోర్చుకొనలేవా? నేను త్రిపురసుందరీ మంత్ర ముపదేశమైతిని. మా బావను పెండ్లియాడుకోర్కెతోఁ బదు నేను దినములనుండి జపముసేయుచుంటిని. అది ఫలమునకు వచ్చెను. ఇప్పుడు నేను నిన్నుఁ దాఁకరాదు. నాయందుఁ గామప్రవృత్తి కలుగరాదు. నేను ఱేపంతయు నుపవాసముండి దేవికి శాంతిచేసి జపమును బరిసమాప్తముచేసి యెల్లుండి నీవద్ద నుండెదను. నేఁడు, ఱేపు నాయందు నీవు కామించకుము. నీ వేమాత్రము వాంఛ ప్రకటించినను నేనును లొంగిపోదునేమో! చూచితివా, గంటనుండి నేను నీ కౌఁగిటిలో నున్నాను. ఈ యపచారమునకుఁ దల్లి గోపగించునేమో! దీని కేదైన మఱలఁ బ్రాయశ్చిత్తముచేయవలయునేమో! అబ్బబ్బా! నన్ను వదలుము. నాకు భయము వేయుచున్నది. నేను మహాపచా

రము చేసితిని. ఱేపు ఉపవాస ముండి పూజచేయువఱకును నా మనస్సు మనస్సులో నుండదు. రెండుదినములు నన్నూరకే చూచు చుండవలయును. అట్లుండువని నాకు వాగ్దానము చేయుము' అని శశి నా గడ్డముపుచ్చుకొని బతిమాలెను. నాపాదములపై శిరము మోపి మ్రొక్కెను. ఆమెయొడలంతయు గంపించిపోవుచుండెను. ఆమెకనులవెంట సంతతధారగా నీరు కారుచుండెను. నాయందు మహాగ్ని వ్రేల్చుచున్నది. హోమార్థము సంస్కృతమైన మహాగ్ని యదత్తపురోడాశమై వాంఛాలవేపత్ప్రచలిత జిహ్వాగ్రములు చాచి నది. నేను విధిలేక యామెచెప్పుమాటల కంగీకరించితిని. నేను సరిగా నప్పుడు 'ముహు రంగుళిసంవృతాధరోష్ఠం ప్రతిషేధాక్షరవిక్లబాభి రామమ్, ముఖమంసవివర్తిపక్ష్మలాక్ష్యాః, కథమ ప్యున్నమితం న చుంబితం తు' అన్నట్టి స్థితిలోననే యుంటిని. నే నంగీకరించితిని. ఆమె దూరముగాఁబోయి చీరకొంగు పఱచి నేలఁ బండుకొనబోయి నది. 'కాదు నేను పోవుచున్నాను. నీవు ప్రక్కమీఁదనే పరుండు' మంటిని. ఆమె 'నేను మంచముపైఁ బరుండరాదు. నీవు నన్ను వదలిపెట్టి యెచ్చటికిఁ బోయెదవు? రెన్నాళ్ళు నీవు నన్ను వదలిపెట్టి యుండుట కష్ట మని నాకుఁ దెలియును. నాకుమాత్రము కష్టముకాదా! ఎంతకష్టమైనను నీ రెండుదినము లింతే' యని యామె నేలపైఁ బండు కొన్నది. నే నఱగంటనే యామెవంకఁ జూచుచునే మంచముపైఁ బన్నుంటిని. ఆమె యింతలో నిద్రపోయినదో మఱల స్మృతితప్పి నదో? నేను బయలుదేఱి నీదగ్గఱకు వత్తు ననుకొంటిని. మఱల నామెను స్పృశించవలె ననిపించినది. ఆమె నిద్రాసౌందర్యము నన్ను కామపరిదగ్ధుని జేసినది. ఏడేండ్ల క్రింద మేము వారియింటికి వివాహమునకుఁ బోయినప్పుడు నే నామె నేకాంతముగా నిద్రితురాలిని గదిలోఁ గలిసికొంటి నని చెప్పితినే! ఇంతకుముం దామెను జూచి నప్పుడు నట్లే యున్నది. ఆమె యప్పటి కిప్పటికి నిద్రించుచునే యున్నది. నే నామెను మేల్కొలుపలేకపోతిని. ఆమెను స్పృశించ బోయినంతమేఱపోయి మనస్సులో నివర్తితుఁడైతిని. చివరకు బయలుదేఱి వచ్చితిని'' అనెను. కిరీటి సర్వనాళములలోనిరక్తము కామోన్ముఖమై యానాఁటిరాఁతి పర్యవసానము నిర్ణయించుకొని

యుండి యేతత్ప్రబలావరోధమును దాఁచుకొనలేకయుండెను. అతని యంతర్హృదయములో శశిరేఖ తనదే యని తెలియును. ఆ రెండు రోజు లాఁగుట కతఁడు సమర్థుఁడు గాకయుండెను. ఎంత యుత్తాలమైన ప్రకృతియైనను ఫలమునందుఁ బ్రబలోన్ముఖమైన ప్రవృత్తిని మహావరోధహేతువుచే నియమించుటకు సమర్థుఁడు కాఁడు. దానికి నెంతయో ప్రయత్నము చేయవలయును.

ధర్మారా వతనిని నిబోధించెను: 'ఇటు చూచితివా? ఆమె దేవతావిషయకమైన ప్రతిబంధకము చూపించినది. ఆమె నీయందు నిరాదర కాదు. నిర్ప్రణయ కాదు. ఆమె హృదయమునకు నీవే యధినాథుఁడవు. కాని యామె యీవేళ కధినాథురాలు కాదు, ఈనాఁడైనను నీ వామెను బలవంతముగాఁ గౌఁగిలించియుండవలసినది కాదు."

కిరీటి—నేను బలవంతముగా గౌఁగిలించలేదు. ఆమె యూరకొన్నది.

ధర్మారావు—ఆమెయును దాత్కాలికముగా నీవలనఁ గామోద్రిక్తమైనది. సర్వదేవతా స్వరూపమైన మీ ప్రణయమును దేవతా తిరస్కారము జరుపరాదు. మీ యిద్దఱి ప్రేమజీవితము మహాఫలమేదియో కలిగించవలయును. మహాపురుషుఁడెవఁడో మీసంయోగమువలన జనించవలయును. కాని యీ కించిదపచార మిదివఱకే జరిగినది. కాని మిమ్మిప్పటికిని మించిపోయినది లేదు. ఎల్లుండిరాత్రి వఱకు నీవు నియమముగా నుండవలయును. నీయుద్రేకమంతయు నణఁచుకొనుము. అదియుఁగాక, యామె యత్యంతాభిముఖురాలు కానప్పటి నీయుద్రేకము రమణీయము కాదు; మహానందకారియుఁ గాదు.

కిరీటి—అన్నా! క్రమముగా నదియే తగ్గిపోవుచున్నది. పొంగి రాసి మహానది కెదురుపాడిచి సముద్ర మేమిచేయఁ గలదు? పరస్పర వీచీహస్తములే కలియవు.

తెల్లవాఱినది. మిత్రులందఱును బ్రయాణములైరి. అందఱును వచ్చి కిరీటి కభినందనము లిచ్చిరి. ఆ పిచ్చిపిల్లవాఁడు వెలతెలబోయెను. వారు కిరీటి ముఖలక్షణముల నే భావములు గనిపించునను

కొనిరో యవి కనిపించకపోవుటచేత నలువురు బేలవోయిరి. ధర్మారావు నడిగిరి. అత 'డేమియు లేదు. తరువాతఁ జెప్పెదను లెండి' యనెను. అందఱును రైలునకు నడచిరి. ధర్మారావును వారితోఁ జనెను. వా రతనిని నొక్కి నొక్కి యడిగిరి. ధర్మారావు కథయంతయుఁ జెప్పెను. వారు సముద్రదపరీతహృదయు లైరి. బాపిరాజు 'నేను మూనాళ్ళనుండి చూచుచుంటినిగదా! ఆమెలో నాకుఁ జైతన్యమే కనిపించలేదు. ఇదా హేతువు?' అనెను. పశుపతి 'ఇతని ప్రణయకథ మొదటినుండి చివరివఱకు నాశ్చర్యకథాపరిమిళితముగానే యున్నది' అనెను. శివరావు ఆంగ్లేయములో 'నతఁడు ధన్యుఁడు' అనెను. వారందఱును బాపట్ల వదలి పోయిరి. అదియేమో ధర్మారావు వెళ్ళెదననలేదు. కిరీటి వెళ్ళుమని యెట్లనును?

ఆ దినమంతయు నిద్దఱుస్నేహితులును బరస్పరము సేవించుకొనిరి. సంవత్సరము కిరీటిని సుబ్బన్నపేటయందుఁ గాచుట యొక యెత్తు. నేఁ డొక్కరోజతని బరామర్శించుట యొకయెత్తుగాఁ దోఁచినది. కిరీటికిఁ దలంటిపోసిరి. బంధువులు పరాచికములాడిరి. అతనిని జూచినపుడెల్ల మామ యనురాగమును బ్రకటించెను. ఎక్కిన యెండలతోఁ బాటు కాలమును గడచినది. ఎట్టి దుర్ఘటవేళయందైనను బ్రాతఃకాలము గడచుటలో బాధయుండదు. సాయంకాలము స్వాయముగా మాంద్యముకలిగినవేళ. అప్పుడు కష్టములో నున్న మనుష్యులను బట్టుకొనుట కష్టమగును. స్నేహితులిద్దఱును వాహ్యాళి పోయిరి. ధర్మారావు పద్యములు జదివెను. భారతభాగవతములమీఁద విమర్శ చెప్పెను. సంగీతముపాడెను. ఆధునిక నాగరకత విమర్శించెను. నాటకములు, సినీమాలను బరిహసించెను. అతఁ డా సాయంవేళ చేసినంతయల్లరి యానిజన్మములోఁ జేయలేదు. కిరీటి తన్నుఁ దా మఱచిపోయెను. కిరీటికి ధర్మారావు మహామేధావి. అతఁడు చెప్పిన దతనికి వేదము. సూర్యుఁడ స్తమించినవేళ యాలస్య మనిపించలేదు. రాత్రిరికిఁ బ్రొద్దుపోయి యింటికివచ్చిరి. కిరీటి భోజనము చేసెను. విడిదిలో నొంటరిగా నేల యని ధర్మారావు వారియింటివద్దనే పందిరిలో బండుకొనెను. కిరీటి గదిలోనికిఁ బోయెను. తెల్లవారుచున్నది. ధర్మారావు కనులు దెఱచిచూచెను. కడచిన రాత్రియంతయుఁ,

బవలంతయు నిద్రలేక యతనికి గాఢనిద్ర పట్టెను. మెలఁకువ వచ్చు వఱకుఁ గిరీటి తన ప్రక్కలోఁ బండుకొని యుండెను. ధర్మారా వనిని నిద్రలేపలేదు. రోజెల్ల వెనుకటి దినమువలెనే కడచెను. సాయంకాలమున ధర్మారా వడిగెను: 'రాత్రి నావద్ద వచ్చి పండుకొంటి వేమి?

కిరీటి—ఏమియు లేదు. పండుకొనినతోడనే నాకును నిద్ర పట్టినది. శశివచ్చి నేలపైఁ బండుకొన్నది. నిన్నంతయు నామె యుపవాసమే రాత్రిరిగూడ భోజనము చేయలేదు. పవలెల్లఁబూజలు, పురస్కారములతోనే సరిపోయినది. నాకు రాత్రి రెండుఝాములకు నిద్ర మెలఁకువ వచ్చి చూచితిని. నే నామెగదిలోనికి వచ్చుటయే యెఱుఁగను. మఱల నేనామె విద్రాసౌందర్యమే యెఱుగుదును. అప్పుడు వచ్చి నీవద్దఁ బండుకొంటిని. ధర్మా—నేఁడామె భోజనముచేసినదా? కిరీటి—చేసినది. అన్నా? బయలుదేఱివచ్చుచున్నప్పుడు చూచితిని. ఈ మైదురోజులనుండి విశేషమొకటి జరిగినది. నేను దుస్తులు ధరించి షికారునకు బయలుదేఱి వచ్చుచుంటిని. ఆమెకు, మొగలి, చేమంతి, గులాబి పూలతో జడవేసిరి: మొన్నరాత్రి యెట్లున్నదో సరిగా నట్లున్నది. నన్నుఁ జూచి సిగ్గులబరణి యైపోయినది. ఎన్నఁడులేని యీ సిగ్గెచ్చటనుండి వచ్చినది? ధర్మా—విజయవిలాసము చదివితిని. ఉలూచి కథ చదివితిని. 'ఇంతలో నెచ్చటనుండి వచ్చె దరళేక్షణకున్ నును సిగ్గుదొంతరల్'-నీ కిదే యాశీర్వాదము. నీ తపస్సులన్నియు ఫలించినవి. దేవి నీయెడల బ్రసన్నురాలైనది. తమ్ముఁడా! ఒక్క వాగ్దానము చేయుము. నన్ను మునుపటివలెనే చూచుచుందుము? మఱచిపోకుము'

ధర్మారావు పడిన సందేహములో నర్థము లేదన్నట్లు కిరీటి చూచెను.

ధర్మారావు మఱునాఁడు రైలునకుఁ బోయెను. వెంటనే కిరీటి నడచుచుండెను. నడచినంతమేఱ నేవో రహస్యములు చెప్పుచుండెను.

"అన్నా! ఆమెను నా వక్షస్సుచేత, హస్తముల చేత, పాదములచేత, ముఖముచేతఁ గప్పివేసితిని. ఆమె నాలో నిమిడిపోయినది.

'నేను అమె పొడగరి యనుకొంటిని. మే మిద్దఱమును పండు

కొంటిమా, ఆమెయొక్క కాళ్ళు నా పాదములమీఁద నున్నవి. ఆమె తల నాగడ్డముక్రింద నానుచున్నది. 'ఆమెశిరస్సు, చేతులు, దేహము, పాదములు సర్వమును నేదో పారిజాతప్రసవవాసనలే కుప్పిస్మరించినవి. అట్టి వాసనలు నే నెన్నఁ డెఱుఁగను. అది గులాబివాసన కాదు; చేమంతితావి కాదు; గేదంగిపరిమళము కాదు; అగురు గంధముల పునుఁగుకస్తూరుల తావి కాదు – వీని యన్నిటి సమాహారపరిమళమో, యేమో తెలియదు. ఇదిగో యిప్పుడు నాయొడలంతయు నా వాసన వేయుచున్నది. నేను నిశ్వాసము తీసికొనినంత మేఱ, కదలినంత మేఱ నా ఊపిరితిత్తులయందా వాసనయే ప్రయాణము చేయుచున్నది.

'అన్నా! నాయెదుటనామ్మమీఁద రాతి రామె మొగము ముద్రితమైనది. అచ్చుగ్రుద్దినట్లున్న యామె మొగము రాతిరి దీపము నెలుఁగున సువ్యక్తముగాఁ గనిపించినది. నీకుఁ జూపించవలయు నను కొంటిని. ప్రొద్దుననే మఱచిపోతిని.

అది నన్నడిగినది, మీ స్నేహితుఁ డెవరని? స్నేహితుఁడు కాదు. అన్న యని చెప్పితిని. నీసంగతియంతయుఁ జెప్పితిని. ఆమె యూరకే యాలించినది.''

ధర్మారావు—నీవు మఱల సుబ్బన్నపేట యెప్పుడు వచ్చెదవు? కిరీటి—పదిదినములలో వచ్చెదను. ధర్మారావు—శశిరేఖ రావచ్చునా? కిరీటి—రాతిరి నన్ను నీవు నీవనియే పిలువఁజొచ్చెను. నేను 'నీ వనుట నాకు బాగుగనే యున్నది. మీ రనవలయును. ఎవరైన విన్నచో నేమనుకొందు' రంటిని. దాని కదీ యర్థము కాలేదు. 'సరే నీ వను మనుచున్నావు గనుక నందు' నన్నది.

ధర్మారావు టికెట్టు కొనెను. అతఁడు రైలెక్కఁబోవుచుండెను. కిరీటి 'యొక్కమాట' యని రహస్యముగా నిట్లు చెప్పెను: అన్నా! నాజన్మ కృతార్థమైపోయినది. ఆమె పూర్వరాత్రియంతయు లజ్జారాశి. పరరాత్రియంతయు ప్రేమరాశి. ఆమె చాల చదువు కొన్నది. వాత్స్యాయన కామసూత్రములు పఠించినదఁట. కొక్కోకము చదివినదఁట. ఇవియన్నియు నాకొఱకే చదివినదఁట. నేనే పసివాఁడను.'' ధర్మారావు కిరీటిబుగ్గమీఁద చిటుకవేసెను. రైలు కూసెను. అది వాయువేగమనోవేగములతోఁ బరువెత్తుచుండెను.

ధర్మారావునకుఁ గిరీటిపొందిన స్వర్గసౌఖ్యము మనస్సుతో నందు కొంద మన్న నందలేదు. దిగ్గ్భాంతుఁడై మహాశైలాగ్రవినిస్సృత నిర్ఝరిణీపరివేగవత్ప్రచలిత మనఃప్రవాహము నడ్డు కట్టుకొనలేక యూరకే కనులు మనస్సున కంటించుకొని చూచుచుండెను. ప్రక్క వృక్షములు పరువులెత్తుచుండెను.

సుబ్బన్నపేఁట రక్షకభటాలయమునకు కలకత్తారక్షకభటా లయమునుండి రహస్యమైన యొక తంతివార్త వచ్చినది. ఆ తంతి వార్త యేమో యొకరికిని తెలిసినదికాదు. రక్షకభటులు గుంపులు గూడి తిరుగుచుండిరి. తరువాత నెలనాళ్ళ కొక ప్రొద్దున కాసాపేఁట లోని యొకపురాతనగృహమునకు పోలీసువారు ముట్టడివేసిరి. ఇన్స్పె క్టరు లోనికిఁబోయి తనిఖీచూచెను. లోన నొక పదునాలుగేండ్ల కుఱ్ఱవాఁడును, కరెన్సీనోట్లు తయారుచేయు యంత్రసామగ్రియు, నచ్చులు, రంగులు, కాగితములు దొరకెను. అవియన్నియు స్టేషను నకుఁ దెచ్చిరి. కుఱ్ఱవానిని నిర్బంధించిరి. ఇల్లొక కోమటిది. అతనిని బట్టుకొనఁగా 'బాబూ! నా కేమియుఁ దెలియదు. ఇల్లద్దె కిచ్చితిని' అనెను. 'ఎవరి కిచ్చితి' వనిరి. 'అయ్యా! నేను మనిసినిమాత్రమే యెఱుఁగుదును. అతఁడు సినిమాకంపెనీలో నుండును. వచ్చినచో పోయి చూపించెద' ననెను. అచటికిఁ బోయిరి. నల్లనివాఁడు, బుట్ట క్రాపింగువాఁడు. వ్యాయామము చేతఁ గఠినశరీరము కలవాఁడు. మొగమునిండ మసూచికపుమచ్చలవాఁడు. చలపతి యన్న పేరుకల వాఁడు— కోమటి చూపించినది వానిని. అతఁడు సినిమారౌడీ. వాఁడు హాలులో నిలుచుండి 'సైలెన్స్' అనగానే యందఱును గుక్కినపేనులవలెఁ గూర్చుందురు. ఒకసారి యొక్క పెద్దమనుష్యుఁడు హాలులో సిగరెట్టు త్రాగుచుండెను. అతఁడు పరాయి యూరివాఁడు, చలపతి దూరమునుండి 'సిగరెట్టు పాఱవేయ్' అని తన యధికారమును మాటతో జూపించెను. ఆ క్రొత్తవానికి కథ తెలియదు. అతఁడు పాఱవేయలేదు. మఱు నిముసములో చెంప చెడేలు మనెడు. అందఱును బెద్దలే. మాటాడినవారు లేరు. అభి యోగము తెచ్చుకొనుటకు సాక్ష్యము లేదు. సినిమా హాలులో ప్రభువు రీడిఁగు ప్రభువు కాదు, చలపతి. చలపతిపేరు చెప్పినచో

నూరంతయు గడగడ, చలపతిని బట్టుకొనిరి. పోలీసుస్టేషనులోపల రాడీతనము పనికిరాదు. పదిపోలీసుచేతులు పర్యాయముగ నాడు చుండును. బొమికలసందుసందున ఉబుకని చోట్లలోని మాంసము కమలుచుండును. ప్రతిమాంసపుగండకు హృదయమునకు సంబంధ మాయెను. హృదయము వెలికి వచ్చెను. దానితో రామేశ్వము వెలికి వచ్చెను. ఆ సాయంకాలము రామేశ్వర మరెస్టుచేయఁబడెను. నోట్లకట్టలున్నవారు, ఉన్నవని యనుమాన మున్నవారు, నాయింటి వద్దకు వచ్చుచుఁబోవుచుండు రని తెలియఁబడినవారు నేఁబదిమంది సబ్ జైలులోఁ జేరిరి. అస లచ్చువేయఁగల యజవవాఁడును బట్టు కొనఁబడెను. అతఁడు పూర్వము టంకసాలలో నుండి యుద్యోగము చాలించుకొని దేశముమీఁదికి సంపాదనకు వచ్చినవాఁడు. వాని పేరు ఆరుమ్గము.

ఆచోకీ యెట్లు దొరికినదనఁగా సివిమాకం పెనీలోనున్న యొక పనివాఁడు పదివేలరూపాయలనోట్లు పట్టుకొనిపోయి కలకత్తాలో మార్చఁబోయెను. ఒక వర్తకుఁడు సందేహపడి యతనిని వ్యవ హారము మాటాడుచున్నట్లు కూర్చుండఁబెట్టి పోలీసువారికిఁ దెలియఁ జేసెను. వా రతనిని బట్టుకొని తాడించిరి. వాఁడు సుబ్బన్నపేఁట కబురు బయటపెట్టెను. రామేశ్వరమును, జలపతియుఁ జెఱసాలయం దుంచఁబడుట చాలమందికి భగవంతుఁ డున్నాఁడనిపించినది. జమీఁందారుగారు జామీనుమీఁద రామేశ్వరము వదలిపెట్టఁబడెను. చలపతికి జామీనుదారు లేఁడు. అతనికున్న జామీనుదారేజామీను మీఁద వదలి పెట్టఁబడెనాయెను. బయటికివచ్చిన రామేశ్వరము లక్షవిధములఁ దప్పించుకొనఁజూచెను. మదరాసు పరుగెత్తి పెద్ద న్యాయవాదులను దెచ్చెను. ఊరిలో మ్యాజిస్ట్రేటు వద్దకుఁ బోయి. 'మీరు కేసు కొట్టివేసినచో నిరువది వే లిత్తు'ననెను. వానిదౌష్ట్య మింతయుఁ దెలిసిన మ్యాజిస్ట్రేటు దాని కంగీకరించలేదు. పైఁగా "నాగడపముందర కీసారి వచ్చితివా, నిన్నుఁ దుపాకితోఁ గాల్పిం చెద"ననెను. దశ తిరిగినది. రామేశ్వరము క్రోధమువలన ఫలితము లేకపోయెను. చలపతి రామేశ్వరముగారికి వార్తలు పంపించును. "నన్నుఁగూడ జామీనుమీఁద వదలించుఁడు. నేను మీకుఁ జాల

సహాయముగా నుండు" నని. కాని రామేశ్వరమునకుఁ బూర్వము తనకున్న పలుకుబడియుఁ, దనయధికారమును సర్వము నశించినట్లే తోఁచెను. ఇదివఱకుఁ దా నన్నచో నారులకుఁ బ్రేమయు గౌరవము ననుకొనెను. ఇదియంతయు నటన. అసలురహస్య మిప్పుడు తెలిసెను. తా నన్నచో నందఱికిని ద్వేషము, నగౌరవము. మంగమ్మ మహా పతివ్రత. పతిశరీరైకవ్రత కాదు; పతి నామైకవ్రత. మూఁడక్షరముల నతఁడు చెప్పినట్లే నడచెను.

ఒకనాఁడు రామేశ్వరము మంగమ్మయింటికిఁ బోయెను. ఆ గృహము సినిమా దాఁటినతరువాత రెండుగూఁడువీథులకుఁ బై నున్నది. అచ్చటికి గుండేలు చాలదగ్గఱ. మంగమ్మ మునుపటి మంగమ్మ కాదు. ఏఁడాదిలో నామెలోనున్న వైదికపుఁజాదస్త మంతయుఁ బోయి, పరమలౌకికము, గడేకారితనము, నిర్భయము కావలసిన గుణములన్నియుఁ బట్టువడెను. భర్త స్త్రీకిని ప్రపంచమున కును మధ్యఁ దెరవంటివాఁడు. దెరదీసివేసినచో లోకజ్ఞత, దొడ్డి పెట్టిన వేల్పుగిడ్డి, సర్వము పిదుకును.

రామే-నా కొకనాల్గువందలరూపాయలు కావలయును. మంగ-నాదగ్గఱ నెచ్చట నున్నవి? రామే-ఈ పదిరోజులలో సినిమామీఁద వచ్చిన పన్నెండువందల రూపాయ లేమిచేసితివి? మంగ-అది నా డబ్బా, మీడబ్బా! అది బ్యాంకులో వేసితిని. రామే-బ్యాంకులో నుండి తీసికొనుము. మంగ-ఒకవేళ మీమీఁద నీ కేసువచ్చినయెడల మనడబ్బు ఖర్చుగాకుండ నుండఁగలందులకేగదా, మీరంతయు నాపేర పెట్టితిరి. ఇప్పుడు డబ్బుతీసి వాడినచో నాపేర నెందులకు? మీపేరనే యుంచియుండవచ్చును. రామే—ఆస్తియు, నేనుకట్టించిన మేడయు, సినిమాయును బరాధీనముగాకుండ నీపేర వ్రాసితిని. ధన మున కేమి? ధన మవసరమైనచో నాడుకొనవలయు ననియేకదా! ఇప్పుడు నేను ప్లీడర్ల కీయవలయును. తక్కినఖర్చులున్నవి. నాలుఁగు వందలైనఁగాని తేలదు. మంగ-బ్యాంకు మూసియుందురు. రేపు పదునొకండు గంటలకుఁగదా! రామే-ఇప్పుడు నీ దగ్గఱ నేమియు లేదా? మంగ అణాన్నర యున్నది .రామేశ్వరము వెడలిపోయెను. అతనికి మంగమ్మ మాటాడిన ప్రతిమాటయు నేదో విపరీతముగాఁ

దోఁచెను. అదివఱ కెన్నఁడును తోఁచని యనుమాన మొకటి తోఁచెను; ఛీ! తన్ను నమ్మి తానే సర్వజగత్తుగానున్న మంగమ్మ యట్లు చేయునా? మఱునాఁడు పన్నెండుగంటలకు రామేశ్వరము మంగమ్మయింటికిఁ బోయెను. ఇంటితలుపు తాళమువేసియున్నది. మంగమ్మ బ్యాంకునకుబోయిన దనుకొనెను. ఆమె యెప్పుడునుబోదే! సామాన్యముగఁ దానే యెప్పుడు పోవును. ఒకవేళఁ బోయినదేమో? తానును బ్యాంకువద్దకుఁ బోయెను: అచట నెవరును లేరు. అతఁడు మఱలతిరిగివచ్చి ప్రక్కనున్నవారి నడిగెను, వారు 'ఆమె యేదో చాలతొందరపనిమీఁద బెజవాడ పోయినది. రెండుమూడురోజులలో వచ్చెద నని మీతోఁ జెప్పు, మన్న' దని చెప్పిరి. సినిమాయాడుట లేదు,ఫిలిము లెప్పటివాని కప్పుడు డబ్బియవలయును.అందుచేవచ్చిన ఫిలిములు రైలుస్టేషనులోనే మిగిలియున్నవి. వానిని దీసికొనలేదు. సినిమాయాడినఁగదా డబ్బువచ్చుట? సినిమాయాడుటకుఁ గావలసిన జనులందఱు జైలులోనే యుండిరి. అది మూలఁబడెను. పట్టాభిషేకమునాఁటి ఎలక్ట్రిసిటీప్లాంటు కనులపడ్డప్పటినుండియు రామేశ్వరమునకు సినిమాయూహ పుట్టెను. అయినదాజేంన్లు వట్టియూహయే యైపోయెను. ఆ యూహ యూహించినన్నాళ్ళు సినిమా జరుగలేదు. కొన్నియాశలు ఫలించినట్లే ఫలించి యంతలో నిర్ధూమమునైపోవును.

ఇది మఱీ కొందఱకు.

రామేశ్వరము కేసంతయుఁ జలపతిమీఁదికే త్రిప్పవలయు నని ప్రయత్నము చేయుచుండెను. బయటనున్న రామేశ్వరము తన విముక్తికొఱకుఁ బ్రయత్నించు నని యీ దౌర్భాగ్యుఁ డూహించుచుండెను. పోలీసువాండ్రు దొరకిన ప్రతిపిట్టను లెక్కలు విఱువవలయు నని చూచుచుండిరి. న్యాయవాదులు 'లా పాయంట్లు' వెదకుచుండిరి. పాయంటునకుఁ బదివందలు వారిలెక్క. రామేశ్వరము ప్రెసిడెంటుగాఁ దెగసంపాదించెను. ధనమంతయు నేమికావలె? కేసు పట్టుకొన్నది జనవరి 10-వ తారీఖున. వాయిదా ఫిబ్రవరి 10.

కిరీటి మఱల కాలేజీలోఁ జదువుటకు వచ్చెను. మునుపటి కిరీటికి, నిప్పటి కిరీటికి నేమియు.సంబంధము లేదు. మునుపటివాఁడు నవ్వఁడు. ఇప్పటివాఁడు నవ్వేమి, విఱుగఁబడి నవ్వును. మునుపటి

వాఁడు పరాచికము లాడఁడు. ఇప్పటివాని కదేపని. అతఁడు విషాద మూర్తి; ఇతఁ డానందమూర్తి. 'ఒంటరిగా వచ్చితివి. శశిరేఖను దీసికొనిరాకపోతివా? ఈ మూఁడునెల లిచ్చటనే యుండెడివి. ఇక్కడ నన్నగా రున్నాఁ డని, వాని కొక యి ల్లున్నదని, వదినెగారు నీ భార్యను జూడలేదని నీకు జ్ఞాపక మున్నదా? నే నీ సంగతి బాపట్ల లోనే చెప్పితినిగదా?' అని ధర్మారా వనెను. కిరీటి—అన్నా! నా భార్య నైనంతనే యధికారము నా దనుకొంటివి కాఁబోలు. నేను రమ్మంటిని. 'నా రెవరియింటికో తీసికొనిపోదు నంటు వే' నని మా యత్తమామ లడుపుపెట్టిరి. నేను 'నాతోఁ గలసి కాఁపుర మున్నప్పు డైనఁ దీసికొనిపోఁగలుగుదునుగదా' యంటిని. వా రప్పు డక్కే తీసి కొనిపొమ్మని. కార్యమై నెలనాళ్లుతిరుగనిపిల్లనుబొరుగూరికిఁ బంపించుట న్యాయము కా' దనిరి. ధర్మారావు—కార్యమై నెలనాళ్ళు తిరుగని పిల్ల యేమి? ఇంత యల్లరిలేకుండు నీకార్య మాతేండ్ల కిందనే చేసి నచో నీపాటి కిద్దఱు ముగ్గురు పిల్లలు పుట్టెడివారు. కిరీటి—ఆమాట నీ వన్నచో బాగున్నది. నే ననఁగలనా? ధర్మా—అనలే కేమి? నీ కెట్టిన నత్తవారు. ప్రేమ వారిమీఁద నుండక నామీఁదనా యుండును? కిరీటి—నీవు పరిహాసము లాడ నారంభించితివా, దానికిఁ జివర యుండదు.

ఇరువురును ధర్మారావువింటికిఁ బోయిరి. అరుంధతి కిరీటిని జూచెను. ఆమె యతనితో మాటాడదు. లోనికిఁ బోయెను. ధర్మారా వింటిలోనికిఁ బోయి 'మఱఁది పెండ్లికొడుకై వచ్చెను. ఈ పూఁట నన్నములోని కేమి చేసెదవు' అనెను. అప్పటికి ప్రొద్దుగ్రుంకి శుక్లా ష్టమి యగుటవలన సగము నిండినచంద్రుఁడు గగనమధ్యభాగమునఁ దోఁచుచుండెను.

అరుంధతి—అన్నములోని కేమియు లేదు. ఉన్న దొండ కాయలు పిండెదగ్గఱునుంచి నిన్న దులిపితిని. కాకరపాదు నా కోపిక లేక మంచినీళ్ళుపోయుట లేదు. అది కాచుట లేదు. రెడ్డిదొరలు తీఁగబచ్చలి తిందురా? ధర్మా—ఆ! తిన కేమి? శ్రీకృష్ణరాయల వారు తిందు రనియే చెప్పెను. అరుం—మీ రీ బాదము చెట్టెక్కఁ

గలరా? ధర్మా—ఎక్కి? అరుం—ఎక్కి, యూవాసము పెట్టి యదిగో యాకాశమున నున్న శశిరేఖను గొట్టుము. అది తిరిగి వేయించెదను.

కిరీటిరాకచే మహానందముగున్నఁడైయున్న ధర్మారావున కానందము పట్టరాని దయ్యెను. అతఁడు చావడిలోనికిఁ బరుగెత్తుకొని పోయి 'కిరీటి! మీ వదినె యిట్లనుచున్నదోయి' యని చెప్పెను. ముగ్ధుఁడైన పెండ్లికొడుకు మునిముసినవ్వులు నవ్వెను. ప్రతిదినము శశిరేఖవద్దనుండి జాబు రావలయును. కిరీటి యన్నము తినవలయును. రాకపోవుట యనునది లేదు. ఆ యుత్తరములు చిత్రములుగా నుండును. అందు ధర్మారావు చూడరాని దేదియు నుండదు. కిరీటి చదువుకొని ధర్మారావుచేతి కిచ్చును.

"ముద్దుబావా! నా కీనాఁడు చందమామయుఁ గనపడలేదు, మా బావయుఁ గనపడలేదు. నీవు వెళ్ళి పదిరోజులు కాలేదు. ఎప్పుడు వత్తువు? శశి బావతోఁ గలసియుండుట తపస్సు చేసినన్ని నాళ్ళు పట్ట లేదు. ఏఁడాది తపస్సునకు ఫల మొకరోజో, రెండురోజులో! ఎనిమి దేండ్లు తపస్సు చేసితిని. పదునాలుగురోజులు నీవు నాదగ్గఱ నుంటివో. నీ వెంత ప్రియమైన వస్తువు. ఇట్లు, నీదాసి—శశి."

"బాపట్ల - మాఘ శు ౧౭.

"కిరీటి! నిన్న నుపవాసము. నేఁడు ప్రొద్దుననే భోజనము. పారణచేసిన దినముననే కద మన ప్రథమసమాగమము! ఈ రాత్రి తెల్లవాఱులును నేను కిరీటిజపము చేసెదను. మీ కేమి మహారాజులు, అన్న యున్నాఁడు. మీకు గాలము చక్కఁగాఁ గడచును. కళాశాలలోఁ దోడిమిత్రులు కలరు. నే నీ వెన్నెలలో, నీ వా చీఁకటిలో. ఇట్లు, నీ మేనమామకూఁతురు."

'బాపట్ల-మాఘ శు ౧౯.

నిన్నేమని సంబోధించవలయునో తెలియదు. భార్య పేరుతోఁ బిలువరాదు. నేను మీకు భార్య నైనంతనే మిమ్ము 'బావా' యని పిలువరాదు. 'ప్రాణప్రియా' మొదలయిన నీతిజాతిలేని నవలలలోని నాయికలు వ్రాయునవి. ఏమని పిలువను? ఇదివఱకుఁ గిరీటి యని బావా యని పిలిచితిని. మఱల నట్లే సంబోధించిన సంబోధింతు

నేమో! మొన్న మీయుత్తరములో నే నేనో వ్రాసినవిషయమునకు ధర్మారావు నవ్వినాఁ డని వ్రాసితిని. నా యుత్తరము నాయనకుఁ జూపించుచున్నావా? మంచిభర్తవు. నే నేమో గోప్యముగా బ్రతికి బ్రతికి నాప్రేమమంతయు బాలాత్రిపురసుందరికిఁదక్క మఱెవ్వరికిని దెలియకుండ రక్షించుకొంటిని. నీ వేమో యీ రహస్యమును నలుగురినోళ్ళ కెక్కించుచుము. నాకుఁ గోపము వచ్చుచున్నది. ఈ పూర్ణిమాచంద్రుఁడు నీయంత యందగాఁడు కాదు. నా కితనిని జూచినకొలఁది నొడలు మండిపోవుచున్నది. వీనికి సిగ్గగునట్లు నీ వెప్పుడు వత్తువు?

ఇట్లు,

వెన్నెలదారులలో నీకై చూచుచున్న నీ శశి.''

'నెల్లూరు–మాఘ బ ౧౨

నా ప్రాణమా! ఈ సంబోధన లుత్తరము వ్రాయువలసివచ్చిన నాకుఁ గష్టముగా నున్నవి. అసహ్యముగా నున్నవి ప్రతియుత్తరము మొదట నిట్లే సంబోధించవలయునా? ఇంక నుత్తరము లిట్లు వ్రాయను. మీ యక్కగారు, వదినె నాకొక క్రొత్తనమూనా చెప్పినది. మహారాజశ్రీ ప్రాణనాథులకు–మీపాదదాసి శశి యనేక నమస్కారములు.' పూర్వ ముత్తరము లిట్లు వ్రాసెడివారఁట. ఈ నమూనా మనదేశములోనుండి యేల పోయినది? అట్టి నమూనా యుత్తరమునకుఁ గిరీటమువలె నుండును. 'ప్రియమైన ఫలానా' యని మొదలు పెట్టినచో నుత్తరము బోడిగా నుండదా? నేను నీయనుజ్ఞ లేకుండ నీయూరు వచ్చితిని. నీవు నన్ను క్షమించవా? నీవు వెళ్ళి నాలుగైదు శనియాదివారములు గడచినవి: ఇది మఱునాఁడు వత్తు ననుట కాఁబోలు. నిన్నన్న దోషమేమున్నది? నీకొఱకు నే నంత కష్టపడుట నాదే తప్పు. నేనుమాత్రము పడలేదా యందువు కాఁబోలు. పురుషులకు స్త్రీల కిదే భేదము. పురుషులకు వాంఛితవస్తులాభ మైనతరువాత నది మనదేకదా యన్న యూహతోనే బ్రదుకుదురు. తన్నిత్యానుభవమందు వారికి నిరంతరాభిలాష యుండదు. స్త్రీ లట్లు కాదు. వస్తులాభము కలుగువఱకు పురుషు లంత ప్రయత్నించకపోవచ్చును. వారికి లాలస మెండు. లభించిన యర్థము నెడఁబాసియుండలేరు. నా మన సెప్పుడు తక్కిన స్త్రీలవలెఁ

గాక నీకు దాఁచకుండ చూఁబయిచ్చితిని. చేతిలోఁ జిక్కిన నన్ను నీ యిష్టము, నీటనో పాలనో ముంచుము: రా; తేవు శనివారమునాఁడు రా. నీకొఱకు బాపట్లలో నుందును. రాకపోతివా, మానాయనగారికి మనపెండ్లినాఁడు నీవు వుత్తరము వ్రాసి యైనట్లే నే నగుదును.:

ఇట్లు,

నీకై రోజులు లెక్కపెట్టుకొనుచున్న నీశశి."

శశిరేఖ వ్రాసిన యుత్తరములిట్లుండును. ధర్మారావా యుత్తరములు చూచి యామెకుఁ గిరీటియెడఁగల ప్రేమకు, వారి జగన్మోహనమైన దాంపత్యమునకు, నామె బుద్ధివైశారద్యమునకు మహానంద మనుభవించును. ఒకనాఁడు ధర్మారావు కిరీటితో నిట్లనెను. "తమ్ముఁడా! నీయుత్తరములు, నీప్రేమ, నీభార్య, నీవు నాకుఁ బ్రతిలవమును మహానందహేతువులుగా నున్నారు. నా కీయానందము నీ వామెకొఱకుఁ బడినకష్టము లెఱిఁగియుండుటచేత ద్విగుణీకృతమైనది కావలయును. నాకు నీకథ యంత యానందము కలిగించవచ్చును. ఇతరులకు నాయానందము చూచినవో నొకవిధమైన యున్మాదముగాఁ దోఁచవచ్చును."

రామేశ్వరముకేసు మఱల వాయిదా నాలుగైదురోజు లున్న దనఁగా మంగమ్మ ప్లీడరుపద్దకుఁ బోయెను. రామేశ్వరమునకు శిక్ష పడునా, పడదా యని విచారించెను. "శిక్షపడకుండుటకు బ్రహ్మ దేవుఁడైనను భంగము చేయలేఁడు. సంగతియంతయుఁ జక్కగా ఋజువగును. చలపతికూడ రామేశ్వరమంతవాఁడైనచో కేసు చలపతిమీఁద స్థిరపడెడిది. అప్పుడు తప్పుకొనుటకు వీలుగ నుండెడివి. ఇప్పుడు తప్పుకొను టకు దుర్ఘట"మని న్యాయవాది చెప్పెను. ఆ నాఁడు మధ్యాహ్నము కో-ఆపరేటివు బ్యాంకుకుఁబోయిమంగమ్మ తనకు రావలసినధనమంతయుఁ దీసికొనెను. ఆమె యానాఁడే బెజవాడకుఁ బోయెను. ఆ స్త్రీయంతయు నామెపేర నడివఱకే రిజిష్టరుచేయఁబడియుండెను ధనము పుచ్చుకొని యామె యెచ్చటికిఁ బోయెనో తెలియదు. రామేశ్వరము తరువాత నాల్గురోజులకు సుబ్బన్న పేటకువచ్చి, యామె వస్తువులన్నియుఁ దెలిసికొని లోపలనున్న వన్నియు నపహరించవలెనని యామె యింటితాళము

పగులఁగొట్టి, లోనఁ బ్రవేశించెను. లోననేమియు లేదు. కాగితము లున్న యామె పెట్టెయు, నగలున్న పెట్టెయు, నామెచీరలున్న పెట్టెయు మూఁడును లేవు. పాత్రసామగ్రి పఱపులు మంచము మొదలైన సంసారోపయుక్తములైన వస్తువులన్నియుఁ జెదిరిపోకుండ సురక్షితముగా నున్నవి. అతఁడు సర్వముదొరకునని యనుకొనెను. ఏమియు దొరకలేదు. వాయిదా వచ్చెను. జనమందఱును కోర్టునిండ గుంపు కూడియుండిరి. సాక్ష్యములు విచారించుటకు నీ నెలనాళ్ళు పట్టెను. ఆ నాఁడు రామేశ్వరమును విచారించుట యయ్యెను. రామేశ్వరము చెప్పిన ప్రతిసంగతియు ససందర్భముగా నుండెను. ప్రతిమాటలో నతఁడు తనకట్టుత్రాళ్ళు తానే తెచ్చుకొన్న ట్లుండెను. ఇట్టి దేకేసు వచ్చినను సాక్ష్యములన్నియు విచారించునప్పటికి మూఁడు నాలుఁగు నెలలు పట్టును. కాని రామేశ్వరముయొక్క దుర్జనత్వముచేత మండి పోవుచున్న మాజిస్ట్రేటు తక్కినముద్దాయిలసాక్ష్యములన్నియు నీ నెల నాళ్ళలోనే ముగించెను. ప్రతిపదమున రామేశ్వరమునకుఁ జక్కఁగాఁ దెలిసివచ్చెను. తానుపోయిన యాధ్ధత్యమంతయుఁ దన కింద్రమంది శత్రువులను గడించిపెట్టెనని. అధికారమున్నప్పు డెవ్వనికిని లోకము తన్నుఁగూర్చి యే మనుకొనుచున్నదో పట్టదు. లోకము యొక్క న్యాయము "నవ్వుచు చేసితిమి. ఏడ్చుచు ననుభవించుచుంటిమి" అని యనిపించును. మాజిస్ట్రేటు తక్కినవారందఱిని దొలఁగించి రామేశ్వరమును, చలపతిని సెషన్సుకు కమిట్ చేసెను. ఆ సాయంకాలమే యిద్దఱును బందరు తీసికొనిపోఁబడిరి.

బందరులో రామేశ్వరము చెఱసాలలో నుండఁగా రంగారావుగారు జామీనుపై విడుదలకుఁ జాలప్రయత్నము చేసిరి. జడ్జి యొకదొర. ఇట్టి దొంగనోట్ల కేసులు పది పదునొకం డిదివఱకే యతఁడు విచారించియుండెను. ఇది లోకమునందు చాలఘోరముగా నున్నది. ఇట్టి కేసు వచ్చినప్పుడెల్ల గట్టిగా శిక్షించవలెనని యాయన యూహ. అందులో నేఁబదిమంది ముద్దాయిలలో నలుబది యెన మండుగురు విడుదల. ఇద్దఱు సెషన్సుకు వచ్చుట. జమీందారుగారి యన్నిప్రయత్నములును నిష్ఫలము లయ్యెను. సుసానీ యాంగిలేయ స్త్రీ. ఆమె పోయి చెప్పినచో దొర వినును. సుసానీ తాను చెప్ప

ననెను. ఆమెకుఁ గసాహాంద్రుడద్వారా జోస్యులకథయంతయుఁ దెలియును. ఆమె నిలువెల్ల మండిపోయినది. పైఁగా హిందువులెల్లను మహాకాముకులు, పశువులు, హత్యాకారు లని యామెయభిప్రాయపడెను. సుసానీచేతఁ జెప్పించుటకు వీలులేకపోయెను. అదియుఁగాక, యామె మఱలఁ దనతల్లిదండ్రులను జూచుటకుఁబోవు ప్రయత్నములమీఁద నుండెను. మూఁడేండ్లకు వత్తు నని చెప్పినది. అట్టి మూఁడేండ్లు రెండుగడచినవేమో! అందుచేత నామె యసలే చెప్పుటకు వీలులేకపోయినది.

జిల్లాకోర్టునకుఁ బోయినతరువాత రామేశ్వరమునకుఁ దెలిసెను: ఇది తాతాచార్యులుగారిముద్ర పడిన దని. తప్పించుకొను దారి లేదు. ఆయన తానుచేసిన కార్యములన్నియు నొంటరిగాఁ జెఱసాలలోఁ గూర్చుండి తనలోఁ దాను పునశ్చరణ చేయును. ఒకనాఁడు ప్రొద్దుక్రుంకఁబోవుచున్న దనఁగా నిర్బంధితుల నందఱిని వారివారి గదులలోనికిఁ బంపించి తాళములు వేసిరి. గదికి ఒకవైపున గజము వెడల్పుగలగోడ. అది కొండరాయి. దానిపైని గచ్చు చేసిరి. అందులోనుండి యేమియుఁ గన్పించలేదు. మూఁడువైపుల గోడలు, నాల్గవవైపున సినుపచువ్వల తలుపు. అందునుండి చూచి నచో వెలుఁగుచీఁకట్లు కనిపించవలయును. అచ్చటి వెలుఁగునుబట్టి సూర్యోదయాస్తమయములు లెక్క. సూర్యుఁ డుదయించిన గంట సేపటికిఁగాని యచ్చట సూర్యోదయము కాదు. ఇంక గంట కస్తమించు ననఁగా నక్కడ నస్తమించును. చీఁకటిపడిన తరువాత వెలుఁగుచూచు ప్రాప్తిలేదు. ప్రొద్దుపోయి యంతయు సరిగానున్నదో లేదో యని చూచుట కొక లాంతరు వచ్చును. ఆ లాంతరు వెంట వెలుఁగుకన్న ఘోరముగా దీర్ఘములైన నడచుచున్నకాళుల రెండు పెద్దనీడలు వచ్చును. అవి యంతలో నంతరించిపోవును. తరువాత నేకాకిత్వము, గాఢాంధకారము. రామేశ్వరము తా నూహించసాఁగెను. "మూఁడేండ్లముచ్చట కెంత ఘోరమైనది? మూఁడేండ్లలో నే నెంత సంపాదించితిని? ఒక మేడ కట్టితిని. సినిమాహాలును. స్థలమును సర్వమును జెడి యమ్ముకొనినను బదివేలు వచ్చును. మేడకుఁ బదివేలైనది. పదివేలవఱకు ధనము నిల్వయున్నది. పేద

లయిన గుమస్తాల నోరుకొట్టి యుపాధ్యాయుల నోరుకొట్టి బోర్డుల నుండి ప్రయాణపుబిల్లులఖర్చు వ్రాసి, కంట్రాక్టు నిచ్చిన ప్రతివిషయములోను డబ్బుగుంజి యింత డబ్బు సంపాదించితిని. భార్యలేదు, పిల్లలు లేరు. మంగమ్మ యున్నది. మంగమ్మ కనుపించి నెలనాళ్ళయినది. అది యేమో నా కాప్తురా లని యాస్తియంతయు దాని పేర వ్రాసితిని. దానిభర్త చచ్చినను వానికి నేను క్షౌరము చేయించలేదు. అది నాకు క్షౌరము చేసినది. అది పూర్వ మెంతో యమాయికురాలు. నేఁ డింత గడుసైన దేమి? అసలు దానిలోని తత్వమే యిది. స్త్రీకైనే, లోకజ్ఞానము నార్జించుట కేమి కొదువ! సినిమాలో నున్న వారందఱికిని దాని నుండే యెక్కువయభిమానము. దానిని నే నేకదా చెఱచినది; అది నన్ను మఱలఁ జెఱచినది. న్యాయమైనపనియే జరిగినది. న్యాయమైనపని యేమిటి? నేను చెఱలోనుండి వదలివచ్చినతరువాత దానిప్రాణము తీసెదను. అది నన్నింత మోసముచేయునా? న్యాయవాదుల కిచ్చుటకు నావద్ద దమ్మిడీ లేక పోయెనే. రంగారావుగారి నేమని యనుగుదును? అడిగినమాత్ర మేమి లాభము? అటు దివా నీయనీయఁడు; ఇటు సుసానీ యీయనీయదు. చలపతికి నాతోఁబాటు పదేండ్లు వేసినను వానికిఁ దగినశిక్ష కాదు. వాఁడు నరహంతకుఁడు. జోస్యులను దలమీఁద బాదిచంపినాఁడు. నేను వలదురా యంటిని, వాఁడు వినలేదు. నీవు చేసినది పాపమురా యంటిని. వాఁడు 'అయ్యా! మీరు చేసినదే పాపము. నేను చేసినదే పుణ్యము. మీరు చేసిన పాపమునకు న్యాయస్థానములు, న్యాయపతులు, న్యాయవాదులు మి మ్మేమియుఁ జేయరు. న్యాయశాస్త్రపుఁ జట్టములు మిమ్ము చాలవిధములుగా సంరక్షించును. ఒక మనిసిని బాధపెట్టి, వాఁడు బ్రతుకుట కష్టమైనట్లు మాయోపాయములచేత వానిని బాధించును. వానిమీఁద నభియోగము లేదు. మిక్కిలి కోపమువచ్చి యా యావేశములో వానిని జంపును. న్యాయస్థానములు వారికి ఉరిశిక్ష విధించును. ఇది యేమి న్యాయము బాబూ!" యనెను; వాఁడు చెప్పినదే బాగున్నది. 'ఏమిరా యతని జంపుట యుపకారము చేయుటయా?' యనఁగా, వాఁడు 'దొరలు బాధపడుచున్న గుఱ్ఱములను గుక్కలను జంపెదరఁట. వారు జేసినది

న్యాయమైనచో నేను చేసినదియు న్యాయమే. అతఁడు తనభార్య తన్ను వదలిపోయినదని మహాదుఃఖితుఁడై పిచ్చియెక్కి తిండిలేక తిరుగుచుండెను. అతనికి సుఖమా? పాడా? అతఁడు చచ్చిపోవుటయే మంచిది' యనెను. ఆ నాఁడు మే మందరమును నవ్వితిమి. ఆ నవ్వుట, యాత్రుళ్ళుట నేటికిఁ గట్టికుడిపినది. ఈకోర్టులో నన్నుఁ గూడ వదలిపెట్టుదురేమో! కేసు మఱల విచారించినచో నెట్లు పోయి నెట్లువచ్చునో? నన్ను వదలిపెట్టినచో నీమంగమ్మను మ్యాజిస్ట్రేటును ఇన్స్పెక్టరును నందఱిని గడ్డి గఱిపించరా? నా యెత్తెంత పీ రెంత? న న్నెంత యన్యాయము చేసిరి? అన్నిటికన్న మంగమ్మ చేసినపనియే బాగున్నది. అమాయకురాలు, పల్లెటూరిది ఏదో మగనిచాటునఁ బడి సంసారముచేసికొనుచున్నది. ఇంటిలోఁ దిని యింటివాసములు లెక్కపెట్టినట్లు దానికి ధనాశపెట్టి మహాఘోర కార్యము నాచరించితిని. అస లా చేసినపనికే తూఁపుబండి యెక్కవలసినది. పదినెల లాలస్యమైనది."

మఱునాఁటియుదయమున రామేశ్వరముతో మాట్లాడుట కొక స్త్రీ వచ్చినది. ఆమెను రామేశ్వరము గదిదగ్గఱకుఁ దెచ్చిరి. అతఁడు చువ్వల వెనుకనుండి యామెను జూచినంతనే కోపముతోఁ గూడిన ముఖలక్షణములు ప్రకటించెను. ఆమె యి ట్లనెను. "నేను పల్లెటూరి పిల్లను, నీవేమో ధనవంతుఁడ వనుకొని భ్రష్టురాలనై పోతిని. నన్ను నీవుచేసిన మోసమునకు నీ కీ శిక్ష యైనందుకు నాకుఁ జాలసంతోషముగా నున్నది. నీ వీ నోట్లు సృష్టించుట చేసితివిగాన నాపేర నాస్తి వ్రాసితివి. లేకపోయినచో నే నేమి కావలసినది? ఆస్తి నా యధీనమైన దని నీవు దుఃఖించకుము. ఆ యాస్తితో నీవు చేసినవానికన్న మంచిపనులు చేయుదును. నీవు పదేండ్లో, యాతేండ్లో యైనతరువాత వచ్చినప్పుడు నా మాటలలోని నిజము నీకుఁ దెలియఁగలదు. నా కిపుడు పదునేడేండ్లు. నేను వట్టి పసిపిల్లను. నేను బ్రతికి బట్టకట్టవలసిన దినములు చాల యున్నవి. ఎంత చెడినను నింక నలువది మూఁడేండ్లు బ్రతుకవచ్చును. నేను నీ కపకారము చేసితి ననుకొనుము. నేను చేసినది ప్రత్యపకారము." రామేశ్వరము రక్తా

ష్టుఁడై కన్నులనుండి కోపము లుమిసెను. ఆమె లెక్కలేనట్లు తిరస్కారహాసముచేసి వెడలిపోయెను.

సహాయనిరాకరణోద్యమములో నిర్బంధింపఁబడిన యొకమిత్రుఁడు బందరు సబ్‌జైలులోనుండి, ధర్మారా వతనిని జూడవచ్చెను. మాజిస్ట్రేటుగారి యనుజ్ఞగైకొని ధర్మారావు చెఱసాలలోనికిఁ బ్రవేశమై మిత్రునకై వెదకుచు వచ్చుచుండెను. ఒకగదిలో నతని కొక పరిచితమైనముఖము కనఁబడెను. ధర్మారావు నిలువఁబడిచూచెను. రామేశ్వరము ధర్మారావును జూచెను. ఇద్దఱికన్నులు కలసినవి. ధర్మారావుచూపులో వైమనస్య మగపడెను. రామేశ్వరముచూపులో క్రూరత్వ మగపడెను. ధర్మారావు తనమనస్సులో 'నింక సుమారొక పదేండ్లదాఁక గణాచారి వీఁడు కనఁబడినంతనే వీనినుండి తప్పించుకొనుటకు వీధివెంటఁ బరువెత్త నక్కఱలేదు' అనుకొనెను. రామేశ్వరము మనసులో 'నేను మరల వచ్చినతరువాత పనిపట్టవలసినవారిలో వీఁడొకఁడు' అనుకొనెను. ధర్మారావునడిచిపోయెను.

తరువాత నిరువదిరోజులకు రామేశ్వరము కేసు విచారణచేసి యతని కేడేండ్లును, చలపతి కెనిమిదేండ్లును శిక్ష వేసిరి. ఆ నాఁడు సాయంకాలమున నిద్దఱును దూష్ప్రబండి మెక్కిరి. ధర్మారావు బెజవాడపోవుటకుఁ దానుగూడ రైలెక్కెను. అతఁ డేదో పని యుండి యానాఁ డకస్మాత్తుగా బందరు వచ్చెను. రామేశ్వరము తల బోడి, చేతులకు బేడి. ధర్మారా వనుకొనెను. "వీనిమీఁద పిడుగు పడుట తప్పెను."

484

# పదునాఱవ అధ్యాయము

సంవత్సరము తిరిగి వర్షర్తువు వచ్చినది. కిరీటి పరీక్ష యయ్యెను. సుబ్బన్నపేట వదలివెళ్ళి నాల్గునెల లయ్యెను. మొదటి నెలరోజువిడిచి రోజు ధర్మారావుకు జాబులు వ్రాసెను. అవి యొక్కొక్కటి నాల్గుపుటలు. రెండవనెల మూఁడుపుటలు. నాలుగు రోజుల కొకసారి ఇప్పుడు పదిరోజుల కొకసారి, అదియును కార్డు. కార్డులో సగము.

ధర్మారావున కిది న్యాయముగానే తోఁచెను. కాని వారి యిరువురి యంతరాత్మలలో నొకరికొకరు దూరముగాలేరు. దూర మైనది యుత్తరముల యొత్తిడి. ధర్మారావు పదియుత్తరములు వ్రాసెను. ప్రతియుత్తరములోని చివరివాక్యమిది. 'నీవును శశిరేఖయు నెప్పుడు వత్తురు? కిరీటి 'యిప్పుడు వత్తునిప్పుడు వత్తు'నని వ్రాయును. కిరీటి వర్షర్తువువచ్చినంతనే వత్తు నని వ్రాసెను. వర్షర్తువు వచ్చెను. వచ్చిన వర్షర్తువు దొడ్డిలోని కూరపాదులు పండించెను. అతిథులు వచ్చుచున్నారు. వారికిఁగావలయు నని కాంబోలు దొడ్డిలోని చేమంతి మొక్క పూయించెను. హేమంతములో బూయు శామంతి కాకుసుమములు తొందరపడి వర్షావేళఁ బూచెను. ఆ మొక్కనాటి రెండేండ్లయినది. అది యింతవఱకుఁ బూచినది కాదు. శశిరేఖ వచ్చుచున్నది. ఆమెజడలోనికిఁ బూవులేవీ యన్నట్లు శామంతిక పచ్చపరికిణీకట్టిన పదియేండ్ల కన్నెవలెఁ బూవనయ్యెను. ఇంకఁ బట్ట ణపు గడ్డి చేమంతిపూలు-వాసనలేనివి-తనపైకి దండయాత్ర వచ్చు చున్న వని తెలిసెఁ గాఁబోలు కుసుమించు శక్తియున్న కొంచెము వ్యర్థముగాకుండ చేసికొందును, దీప ముండగనే యిల్లు చక్కఁ బెట్టుకొను మన్నారు, ఇంక రెండుమూఁడేండ్లకు మించి నా ప్రతిభ లేదు. చెన్నపురిపూలు తెలియుకొని వచ్చుచున్న వని యామె తొందరపడి పూచెను. మందారతరువు రేక మందార ముద్దమందార రెండును బూచి శామంతి కామందార పుష్పములు దొడ్డియన్న ముత్తయిదువు దాల్చిన పసపుకుంకుమలవలె, ఖండితానాయిక

యొక్క యీర్ష్యాక్రోధదృగంచలకాంతులవలె వికసిల్లెను. వర్షర్తువు పొలాలనిండ నిండిన నీళ్ళలోఁ గురిసి. పడుచున్నచినుకు పడినచోట నెల్లను పొట్లపూలు పూయించెను. కాఁపుపడుచులు, మాలెతలు పొలాలమీఁద నూడ్చుచుండిరి. రంయుమని దూరమునుండి ధ్వని వచ్చును. రైలేమో యని వెనుదిరిగి చూతురు. హోరు మను గాలితో వాన వచ్చిపడును. చిన్నచిన్న మట్టిబెడ్డలతో విసరి కొట్టినట్లు వర్షపు పెద్దపెద్ద చినుకులు చెంపలకొఱకు చెడీలు మని కొట్టును. 'అబ్బో! నా మగఁడైన నింతదెబ్బ కొట్టలేదే' యని యొకతె యనఁగా, మఱియొకతె 'నిన్ను వానమగఁడు వదలిపెట్టునా. ఇంటిలోని మగఁడు వదలిపెట్టిన' ననును. ఊడ్చుచుఁ గొందఱు తల యెత్తకయే యూడ్చుచుందురు. వర్షము వారివీఁపులమీద స్వారిచేసి పోవును. పొలముగల యజమాని తాటియాకుల గొడుగులోఁ బొలము గట్టునఁ గూర్చుండును. లేదా, నారుకట్టలు దూరదూరాలకు విసరి వేయుచుండును. వరుసనువచ్చి తాటియాకుల గొడుగుమీఁద శ్రీకృష్ణుఁడు కాళియాహి శిరస్సునవలె నృత్యముచేయును. భగవంతుని కాలిగజ్జెలు మ్రోఁగును. ప్రణయినీమధురకోపమువలె రివ్వునవచ్చి రివ్వునపోయిన చిలుపవానలు కాఁపుల వసనములు తడిపొడిగాఁ జేయును. మఱల నెండఁబెట్టును. మఱలఁ దడుపును. మూఁడునెలలు కాచిన యెండలకుఁ జర్మము, మాంసము, మజ్జ, అస్థివఱకునష్టమై నేఁడు వచ్చిన నీలమేఘప్రసవద్వర్షాబిందువులకు శరీరములు చల్లనై ప్రాణములు హాయి యనిపించెను. ఊడుపుకత్తెలు రైలు వచ్చు చుండఁగా నిలుచుందురు. రైలువంకఁ జూతురు. అందులోఁ గొందఱు పిల్లలు రైలులో నున్నవారిని జేతులతోఁ బిలుతురు. పిలుచుచున్న కాఁపుపిల్లలచు గిరీటిచూచి శశిరేఖతోఁ జెప్పెను. 'సుబ్బన్న పేఁట మనలఁ బిలుచుచున్నది చూచితివా' యని. ఆమె నవ్వెను. రైలు దిగినంతనే ధర్మారావును, గిరీటియుఁ గౌఁగిలించుకొనిరి. దూరమున నున్న శశిరేఖ నవ్వెను, ధర్మారావు 'చూచితివటోయి, నీ భార్య నవ్వుచున్నది' అనెను. కిరీటి శశిరేఖను దగ్గఱకుఁబిలిచి ముప్పురు నింటిదారి పట్టిరి. అరుంధతీ శశిరేఖలు వేయియేండ్ల నాఁటి యక్కా సెల్లెంద్రవలెఁ గలిసికొనిరి. ప్రతినిముసము నరుంధతికి శశిరేఖ దేవ

తావతార మనిపించినది. అంతవడిగాఁ బ్రేమించిన యిల్లాలుఅంత చక్కఁగా దేవీప్రసాదము వడసిన భక్తురాలు-శశిరేఖ యన్నచో నరుంధతికి నామె స్త్రీలోకమాళిరత్న మనిపించెను. శశిరేఖసౌంద ర్యము నవమల్లి కాకుసుమసౌభాగ్యప్రతిస్పర్థి. అచ్చరభూలోకమున కవతరించిన ట్లున్నది. రాణివాసములో నున్న యసూర్యంపశ్య శరీర చ్ఛాయ లామెదేహమున మెఱుఁగెక్కెను. అరుంధతియు సౌందర్య వతియే. ఆమెసౌందర్యము వేఱు. ఆమెసౌందర్యము శామంతికా పుష్పమువంటిది. మనిసి యచ్చరవలె నుండదు. భూలోకమందలి యొకసౌందర్యవతివలె నుండును. ఆమెశరీరచ్ఛాయ పచ్చనిబంగా రము. అందు సితచ్ఛాయలు సమ్మిళితము కాలేదు. అరుంధతి ముఖాంచలములఁ డఱుముకొని వచ్చుచున్న ప్రేమ భావము గోచరించదు. పొంగడిఁగిఁ, సహజమయిన వినయముచే నామె మొగము విరియుటకుఁ గొంకుచున్న కింజల్కపిశంగితనవనీరేజపత్రి సదృశమై యుండును. అరుంధతి శశిరేఖ నాదరించి యిరువురు నా కథ లీ కథలు చెప్పుకొనుచుండిరి. అప్పటికిఁ బొద్దు వాటారినది. శశిరేఖాకిరీటులు భోజనము బెజవాడ స్టేషనులోఁ జేసి వచ్చిరి. మధ్యాహ్న మేదో ఫలహారమైనతరువాతఁ గిరీటి ధర్మారావులు జాతీయకళాశాలవైపునకుఁ బోయిరి. రథంతరి వీరు వత్తురని తెలిసి ధర్మారావునింటికి వచ్చెను. వారు ముగ్గురు నొకరితో నొకరు మాటాడుకొనుచుండఁగా శశిరేఖ 'ఎంతమంచివదిన వమ్మా! మీ వంటి మంచివారి నిద్దఱను గలసికొంటి' ననెను.

రథంతరి—అప్పుడే యెక్కడ నైనది! అసలు జూడవలసిన యామెను జూడనే లేదు. శశిరేఖ—ఎవ రామె? రథం—తినఁబో వుచు రుచు లెందులకు? ఆమె యీ పాటికి బయలుదేఱి వచ్చు చుండును. శశి—పెద్దయామెయా? నలుబదియేం డ్లుండునా? రథం—నలుబదియేఁడు లేమి? నాల్గువేలయేఁడ్లు. యుగయుగాలనాఁటి స్త్రీ.

శశిరేఖ పరాచికము లాడుచున్న దని నవ్వెను. అంతలో గిరిక వచ్చెను. గిరిక నల్లనిచీరఁ దాల్చి, తెల్లనిరైక తొడిగి, సర్వా భరణశోభితయై బయలుదేఱెను. వీథియంతయు బురదయై, యామె పాదములకు రాచిన యలక్తకము ప్రక్కలవెంబడి వ్రేళ్ళవద్ద చెఱఁగి

పోయెను. ఆమె ధర్మారావునింటికి పదియడుగులదూరమున నున్న దనఁగా, నొక తొందరకత్తెయైన చిలుపవానజల్లువచ్చి యామె వస్త్రములు తడిపెను. ఆమె తొందరగా నడిచెనుగాని వాన యంతకన్నఁ దొందరగాఁ గురిసెను. తాను వాన నతిక్రమించలేకపోతి ననుటలో నామె నవ్వుచు లోని కరుదెంచి, వచ్చుచునే యరుంధతితో 'వదినెగారూ! యీ వాన మీకన్న గడుసరి. నన్ను నిముసములో నింత చేసినది' యనెను. ఇంతలో నరుంధతీరథంతరులుకాక మఱియొక స్త్రీయుండుటచూచి సిగ్గుపడి ముఖమండలమునం దపరిచితి వెల్లడించెను. రథంతరి 'భయము లేదు. భయము లేదు. ఈమె యింకొక వదినెగారు ర' మ్మనెను. గిరిక 'చీర తడిసినది. ఇంటికిఁ బోయి మఱలఁ బొడిచీర కట్టుకొని వచ్చెద' ననెను. రథంతరి 'మఱలఁ దడువ దని నమ్మక మెక్కడిది? నీవు మఱీ పసిపిల్లవై పోవుచున్నావు! నీయొడలిమీఁదికి వచ్చిన యౌవనమునైన నీ వెఱుఁగవు కాఁబోలు! అంత యవిదితశ్రోణీభర మేలనే?' యనెను. గిరిక కన్నులు విస్తరించి 'అమ్మో! వదినెగారేమో యనుకొంటిని? ఈ సారి నా శ్రోణీభరాలసతకు, వచ్చుచున్న మేఘముయొక్క వేగమునకు సరిచూచుకొందును' అనెను. అరుంధతి 'మఱల నంతదూరము పోవుట యెందులకు? నాది క్రొత్తచీర యొకఁ డున్నది. కట్టుకొందువు కాని' అనెను. శశిరేఖ వారిసంభాషణకు నచ్చెరువుపోయినది: 'వీరు మువ్వురును విచిత్రస్త్రీలు. ఒకరికన్న నొకరు పవిత్రశీలలు. ఒకరికన్న నొకరు వివేకవంతులు. కాని యొక్కరికిని నాంగ్లేయభాషావాసన యున్నట్లు తోఁచలేదు. మాటలలో రసస్ఫురణ చాల నున్నది. ఈ మూఁడవయామె యెవరు? ఆమెకన్నులలో నేదో దివ్యజ్యోతి కనఁబడుచున్నది. ఎఱ్ఱనై విప్పారిన ముఖమండలము, విశాలములయిన నేత్రములు, మిక్కిలి వెడల్పైన ఫాలము, దీర్ఘనాశిక, ఉబికిన గండభాగములు, శరీరమంతయుఁ గఠినమై, మహారోగ్యవతివలె నున్నది. పదునెన్మిదేఁడు లుండవచ్చును. అనాఘ్రాతమైన పుష్పము. అందుకనియే రేకలు బిగిసి చక్కనయై యున్నవి. ఎవ రామె? ఆమె శరీరాంచలములయందు దేవతాత్వము గోచరించుచున్నది. ఆమెనేత్రము లెంతసేపును నూర్ధ్వగతములేకాని, యామె నేలవంకఁ

జూచుటలేదు. ఆమె మాటాడుపద్ధతిలో సహజమైన వినయాకృతి కలదు. ఆమె యెవరై యుండును?" రథంతరి గిరికతో 'కిరీటి నెఱుఁగుదువా?' యనెను. అరుంధతి 'తడిగుడ్డలతో నెంతసే పుండెదవు? చీరకట్టుకొ' మ్మనిన రథంతరి 'నీ చీర యామెకు సరిపోవునే యనుకొందము. రైక సరిపోవలదా?' యనెను. గిరిక రథంతరివంక నొక చూపు చూచెను. అది సునిసితమై రథంతరిహృదయముదాఁక గ్రుచ్చుకొనెను. రథంతరి కనులుమూసికొని నమస్కారముచేసెను. మనసులో ననుకొన్నది: 'స్వామీ! నీయదృష్టము. నాకు దగినంత సేవ నేనును జేయుచున్నాను.' అరుంధతి 'ఏమమ్మా! గిరికా! రథంతరిమీఁద నంత కోప మెందుకు? నీలో నున్న రసాంభోధికి రథంతరి యేతాము లెత్తుచున్నది. నీవు స్వామికి మఱియు మఱియు దగ్గరదాన వగుచున్నావు' అనెను.

శశిరేఖకు వారిమాటలలోని యర్థములు తెలియలేదు. ఆమె వచ్చినప్పటినుండియు నరుంధతీరథంతరు లామెవంకనే చూచుచుండిరి. ఆమెతోనే ప్రసంగించుచుండిరి. ఇంతవఱకుఁ దన్నెంత యాదరించిన వారిరువురు నామె వచ్చినతోడనే తనవంకనైనఁ జూడకుండుటకు శశిరేఖ నివ్వెఱపోయినది. అరుంధతి తనచీరఁ దెచ్చి గిరికచేత బలవంతముగా గట్టించినది. గిరిక వానిని ధరించి 'మఱల నీకీ చీర పనికివచ్చునా?' యనెను. అరుంధతి 'నీవు వయసుచేతఁ బసిదానవు. నేను నీకు నమస్కరించరాదు' అనెను. అరుంధతి కన్న గిరిక కొన్ని నెలలు చిన్నది. బయట వర్షము మఱల విజృంభించినది. ఈసారి చిత్తజల్లులవలెఁ గాక నిలిచి కురియుచున్నది. బయట నొక మహాధ్వని కలుగుచున్నది.

రథంతరి—కిరీటి నెఱుఁగుదువా? గిరిక—ఎఱుఁగను. అరుంధతి—ఎఱుఁగ కేమి? మీ యన్నగారివెంటఁ దిరుగు కుఱ్ఱవాఁడు. నిరు డీ యూరిలో బి. ఏ. చదువుకొనలేదా? గిరిక—అవు. నొకటి రెండుసారులు చూచితిని. అరుంధతి—ఈమె యాయనభార్య. ఈమె పేరు శశిరేఖ.

అరుంధతి యిట్లు చెప్పుచునే యున్నది. గిరిక తనలోఁ దానేదో మాటాడుకొనుచున్నది. రథంతరి 'ఆ' యనుకొనుచున్నది: పైకన

రాదా!' యనెను. గిరిక నవ్వినది. ఆమె నవ్వులో నొక తన్మయరేఖ గోచరించినది. శశిరేఖ చక్కఁగా సంగీతము పాడఁగలదు. 'ఆమె పై కనుఁడు, వింఁడు' మనెను. గిరిక శశిరేఖవంక నిర్జీవలెఁ జూచినది. అరుంధతి 'మాచెవు లేమి పాపము చేసినవా? ఒక్క పుణ్యపుమాట మాచెవిని పడనీయరాదా' యనెను. గిరిక—ఏమో నమ్మా! మీ మాటలు నవ్వులో, నిజములో తెలియదు. ఏ మనుకొనుచున్నాను? ఏమియు ననలేను. రాత్రి యొకసంగతి జ్ఞాపకము వచ్చినది. అది యనుకొనుచున్నాను. అరుంధతి—దేవాలయమునకుఁ బోదమా? రథంతరి—వాన వెలియ లేదు.

శశిరేఖ గిరికవంకఁ జూచినది చూచినట్లే యుండెను. అరుంధతితో 'నీమె యెవరిభార్య' యనెను అరుంధతి నివ్వెఱపోయి శశిరేఖవంకఁ జూచెను. చూచి 'యెవరిభార్య యేమిటి? ఆమె దేవదాసి' యనెను. దేవదాసి యనఁగా తెలుఁగుదేశమున నితరస్థలముల నున్నవారి కేమి తెలియును? సుబ్బన్నపేటలోనివారికే తెలియును. తక్కినది తెలియకపోయినను శశిరేఖ కొకటి తెలిసెను. అది యామె కులము. బయట వాన కొంచెము తగ్గెను. ఆకాశములో మెఱపులు స్వర్గమున జరుగుచున్న దేవదానవయుద్ధసమయముల మెఱపించిన కత్తులవలె నుండెను. ఆకాశమున నుఱుము లొకటి పశ్చిమమున నుఱుమును, దాని కెదురుగా మఱల నుత్తరదిక్కున నుఱుమును. ఆలయములో బ్రాహ్మణులు రెండుబారులుతీర్చి మంత్రపుష్పము చెప్పిన ట్లున్నది. వేదములు వంతులువేసికొని గానముచేసిన ట్లున్నది. నేలనున్న గనులు వర్షమునకుఁ పైమన్ను కొట్టుకొనిపోఁగా నశాణోల్లేఖితములై వెలువడిన మహామరకతములవలె, దారి కిరుప్రక్కలఁ బడియున్న, పాచిపట్టి యాకుపచ్చరంగుల బావురుకప్ప లొకదానికొకఁ డెదురుపడి పనసలు చదువుచున్నట్లు మేఘములుకూడ నొకదాని కొకఁ డెదురుపడి యుఱుమఁజొచ్చెను. అంతవఱకు గిరిక తడిరైకతో నుండెను.

శశిరేఖ—ఆమె యింతవఱకుఁ దడిరైకతోనే యుండెను.
అరుంధతి—నేను వాడని రైక లేదు. పెట్టెలోనున్నవికూడ వాడినవే!
రథంతరి—నేను చెప్పలేదా? నీరైక చిఱిగిపోవుట తప్ప లాభము

లేదు. గిరిక—నారైక యెండినది. రథంతరి—నేను తాంకిచూడనా? అరుంధతి—నీవు స్వామికన్న ధూర్తురాలవు.

వాకిటిలో వాన వెలిసినది. గిరిక 'యాలయమునకు బోద' మనెను. నలువురును బయలుదేఱిరి. వారియింటినుండి యాలయమునకు దగ్గఱత్రోవ యున్నది. ఆ త్రోవ వెంట జన మెక్కువగా నుండదు. నలువురును నాల్గురకములైన స్త్రీలు. నలువురిసౌందర్యములు నాల్గురకములు. గిరికాసౌందర్యము స్వామి సమాదరణముచేత బవిత్రమైనదే కాని, తక్కిన మువ్వురిసౌందర్యము కొఱంతవడినది కాదు. వారు నలువురు నడచుచుండఁగా నాలుఁగుమహానదీప్రవాహములు కదలినట్లు, నాల్గు ప్రభాతరశ్మిజ్యోతిస్సులు వెడలినట్లు, నాలుగు శశికళలు బయలుదేఱినట్లు. వీథియంతయు దగద్ధగితమైన నేల దివ్యమగుటచేత నిర్జనమైనది. శశిరేఖ నడచుచుఁ దప్పుఁ దానెఱుఁగదు. ఆమె గిరికమీఁదఁ బెట్టినకనులు పెట్టినట్లే యున్నవి. మువ్వురునుగలసి ముందునడచుచుండిరి. ఆమె వెనుక నడచుచుండెను. ఆలయములోనికిఁ బోయిరి. సరస్సునఁ బాదప్రక్షాళనము కావించేరి. ప్రదక్షిణము చేసిరి. ఆలయములోనికిఁ జనిరి. పైనాకాశము మద్దెల వాయించినట్లు ఆఁగియాఁగి లో లో మెఱసెను. దేవదాసి యటునిటు చూచెను. శ్రుతిపోయుటకుఁ, దాళము వేయుటకు, మద్దెల వాయించుటకు మువ్వురు వచ్చిరి. శ్రుతిపోయుటకువచ్చినది కబీరు. దేవదాసి కబీరును జూచి నవ్వెను. కబీరు 'నేను పురపాలకసభ్యుఁడైనచోఁ గులవృత్తి చేయరాదా?' యని శ్రుతి సవరించెను. గిరిక తెచ్చిన గజ్జెలు కాళ్ళకుఁ గట్టి పాడ నారంభించెను. ఆలయములో నెవ్వరును లేరు. స్వామి యున్నాఁడు. ముగ్గురువదినె లున్నారు.

సౌరాష్ట్రరాగము – ఆదితాళము—పల్లవి:

"ఇద్దఱివలెనే కూడి యెవ రున్నారు తెల్పరా
ఒద్దికతో మనవలె నున్నారా, మువ్వగోపాలా!
ఇద్దఱివలెనే గూడి యెవ రున్నారు తెల్పరా!
మున్ను నలరాజు నీవే ముదిత దమయంతి నేనే
చెన్నుగ శ్రీకృష్ణుఁడు నీవే శ్రీరుక్మిణీదేవి నేనే ॥ఇద్దఱి॥

అల రఘురాముఁడు నీవే, అయిన సీతాదేవి నేనే
నిత్యము మదనుఁడు నీవే నీకు రతీదేవి నేనే. ॥ఇద్దతి॥"

సంభోగ శృంగారాభినయమునందు గిరిక విచిత్రముగా, నిజముగా స్వామితో ననుభవించిన దానివలెఁ జేసినది. అరుంధతియు, శశిరేఖయు నచ్చెరువందిరి. అనభ్యస్తవిద్యలు, వారిరువురు సరిగా నిట్లే యొకానొకరాత్రివేళ భర్తలతో ననిరి. అది కీర్తన. గిరిక పాడుట. నాయకుడు మువ్వగోపాలుఁడు. ఇద్దతియొడళులు పులకరించినవి. రాతిరికథయిదా! గిరిక యరుంధతికి దగ్గఱగా వచ్చి 'రాతిరి జరిగిన దిదే. దర్శనము మూఁడువిధములు. రాత్రి స్వప్నదర్శనమైనది. నా కిది చిత్రముగా నున్నది. నేను మీతోమాట్లాడుచుందును.మాట్లాడుచున్నట్లునాకుఁదెలియదు' అనెను. మఱల నందుకొని గిరిక "చెన్నుఁగ శ్రీకృష్ణుఁడు నీవే శ్రీ రుక్మిణీదేవి నేనే! ఇద్దరి!" యని పదార్థాభినయము చేయ నారంభించెను. శ్రీకృష్ణుఁడు పూతనచనుబాలు త్రావెను. పూతన చనిపోయెను. స్వామి కాలుసాఁచి శకటాసురుని దన్నెను. వాఁడు విఱిగిపోయెను. బరువైన కుమారుని యశోద తొడలనుండి క్రిందికి దించెను. తృణావర్తుఁ డెత్తుకొనిపోయెను. వానికిభగవంతుఁడు బరువెక్కి వాఁడు ఒక కొండమీఁదఁ గూలెను. వానిశిరస్సు చిదిసెను. స్వామి బృందావీధి వేణువూఁదెను వ్యత్యస్తపాదారవిందుడై భ్రూవిక్షేపముతోడ దాపలిభుజమునఁ జెక్కుగీలించి, మరకతమయ వేణువుపైఁ గోమలహస్తాంగుళీనఖమాణిక్యము లాడించెను. నెమరు వేయుగోవులు నెమరుమాని తలలెత్తిచూచెను. పరిత్యక్తసంసారలై యొకతె నీవిముడి వేయుచు, నొకతె వేయుచున్న రైకముడి వేయుట మఱచి, మఱియొకతె ముడువఁబోవుచున్న తల ముడువక పరుగెత్తుకొనిపోయిరి. స్వామి చిటికెనవ్రేల గోవర్ధనపర్వత మెత్తెను. ఇంద్రుని యాజ్ఞచే బరాక్రమించిన పుష్కలావర్తకమేఘములు సహస్రధా విజృంభించి యేనుఁగు తొండములంత ధారలతో వర్షింపఁ బర్వతాధోభాగమున గోగోపాలకులందఱును సుఖముగా విశ్రమించిరి. తరువాత నింద్రుఁడు వచ్చి నమస్కరించెను. స్వామి తప్పు మన్నించెను. "శ్రీరుక్మిణీదేవి నేనే." సముద్రమథనము జరిగినది. శంఖచక్రాంకిత

నై, తొలుకాఱు మెఱుఁగుకైవడి మేనులోడి, కలువల నీనెడి చూపు
తోడి, చెలువముల మొదలిటెంకి సిరిపుట్టెను. ఆమెయుభయపార్శ్వ
ములఁ దామరతూండ్లు తొండములధరించిన యేనుఁగులచేతఁ బరి
సేవింపఁబడుచుండెను. భూమినుండి మైథిలి యుదయించెను. ఆమె
శ్రీరామచంద్రుని యంకభాగమున మురువు గులుకుచుండెను.
విదర్భలో రుక్మిణీదేవి పుట్టెను. ఆమె యుత్తరము వ్రాసి బ్రాహ్మణుని
బిలిచి స్వామికిఁ గబురుపంపించెను. దుర్గాలయమునకు గౌరీపూజా
ర్థమై చనెను. శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకసన్నద్ధమైన మెఱుపు
వంటి రథమెక్కి మెఱుపుమెఱసినట్లు స్వామినాలుగైదుబాణములతో
సైన్యమునంతయుఁ జీకాకుచేసి రుక్మిణి నెత్తుకొనిపోయెను. “నిత్యము
మదనుఁడు నీవె. నీకు రతీదేవి నేనే-పుష్పబాణుఁడైన మదను నభిన
యించెను. గిరిక ప్రత్యాలీఢపాదయై యల్లెత్రాటిని దృఢముష్టి
ముద్రచే లాగి, వామహస్తమునఁ గనిష్ఠికయు బొట్టనవ్రేలునుసాఁచి
తక్కినమూఁడువ్రేళ్ళు బిగించి; యిక్షుధనుర్హస్తకము బిగించి, వామ
భుజమున వ్రేలాడుచున్న తూణీరమునుండి చేయి యమ్ముతీసినవైఖరి
యాకాశమునఁ జంద్రమండలాకృతిగా లాగి యాకర్ణాంతపరికృష్ట
జ్యావల్లికి సంధించి శరవిమోచనము చేసెను. తచ్ఛరీరలాఘవము
తచ్ఛరాకర్షణవేగము. శరసంధాననైపుణి, తత్సమయకృతభ్రూవల్లీ
వికటవర్తనము, ఏనాఁడో చనిపోయిన ధనుర్విద్యనంతయుఁ బ్రత్య
క్షీకరించెను. గిరికా! నీతో నీవే కాదు. మఱి యెన్నిమహావిషయ
ములసంస్మృతియో నశింపఁబోవుచున్నది. మృదంగనిస్వానముచేతను
గజ్జియలమ్రోఁతచేతను తాళపుసవ్వడిచేతను దేవాలయాంతర్భాగము
సమావృతమైన యంధకారముచేత నుఱుముచున్న మేఘమువలెనే
తోఁచెను. నృత్యరేఖాభిరామమైన దేవదాసి తళుక్కుతళుక్కు మని
మెఱయుచుండెను. పీయూషధారాసదృశ రసవర్షముకురియుచుండెను.
గంటసేపటికి నృత్య మవసానదశ నందినది. అభినయమైపోయినది.
గిరిక రతీదేవివలె శోభ పొందెను. కడచినరాతిరి స్వప్నగతుఁడైన
స్వామితో నేకశయ్యాగతయై స్వామిచేత సర్వతః పరిభుక్తస్వయావ
నమైనవేళ నెట్లు రత్యంతస్వేదమనోహరమూర్తియై తా నుండెనో
యట్లునిలిచెను. అప్పుడు గిరిక.

"వ్యాకోశః కేశపాశ స్తరళిత మలకైః స్వేదమోక్షౌ కపోతా
క్లిష్టా బింబాధరశ్రీః కుచకలశరుచా హారితా హారయష్టిః
కాంచీకాంతి ర్గతాశా స్తనజఘనపదం పాణినాచ్ఛాద్య సద్యః
పశ్యంతీ సత్రపం మాం తదపి విలులితా ముగ్ధకాంతి ర్ధినోతి."

యన్న యర్థమున కుదాహరణముగాఁ గూర్చుండెను. ఆమె యప్పటి విలులిత భావము దీపపువెలుఁగునను౦డి చూచుచున్న స్వామికే తెలియవలెను. హఁగునకై వచ్చినముగ్గురును నృత్యాంతావస్థ తెలిసికొని యాలయగర్భమునుండి వినిర్గమించిరి. నిగిలిన యోదార్పు రథంతరిపాలఁ బడినది. ఆమె సుపీత పీతాంబరునివలె గిరికను దరిసి, జడ ముడివేసెను. ముంగురులు దిద్దెను. కపోలములు చేలాంచలముతోఁ దుడిచెను. చిక్కువడిన హారయష్టి సరిదీసెను. వదినెగార్లిద్దఱును జెఱియొకతెక్కయుఁ బుచ్చుకొని యామెను నిలువఁబెట్టిరి. అర్చకుఁడు విష్ణుపాదము లిచ్చెను. సంపెంగ పూవు దేవదాసికిఁ గానుకయు, బ్రసాదముగా నిచ్చెను. నలువురును ముఖమంటపమునఁ గూర్చుండిరి. శశిరేఖయొడలు శశిరేఖకే తెలియదు. దేవదాసియొడలు దేవదాసికే తెలియదు. శశిరేఖకుఁ దా నొక కల్పితజగత్తున, నమానుషప్రపంచమునఁ దిరుగాడుచున్నట్లు తోఁచెను. ఈ సంవిధానమే చిత్రముగా నున్నది. ధర్మారావునెడల, సుబ్బన్నపేఁటయెడల కిరీటి కంతప్రేమ యెందులకో తా నిప్పుడు తెలిసికొన్నది. తక్కినప్రపంచమంతయు నీరసించిపోయినది. ఇచ్చటమాత్రము రసప్రవాహ మట్టిట్టు మోచి నడచుచున్నది. ఆహా! ఇచ్చట ముగ్ధుఁడుకానివాఁ డెవ్వఁడు? వీరంద ఱేదో పూర్వజన్మపుణ్యావిశేషముచేత నిచట నుదయించిరి. శ్రీకృష్ణదేవుఁడు దేవకీదేవికడుపునఁ బడెను. సర్వదేవతలును మధురలో బృందలో మానుషావతారము లెత్తిరి. అట్లే శ్రీకృష్ణస్వామి సుబ్బన్నపేఁటలో వేణుగోపాలమూర్తి యవతరించెను. ఒకతె రుక్మిణి, ఒకతె సుభద్ర, మఱియొకతె సత్యభామ, ఒకఁడు సాత్యకి. ఒకఁ డర్జునుఁడు. వీ రందఱు నుదయించిరి కాఁబోలు. నిజమయిన భక్తి యెన్నియేని యూహల కెడమిచ్చును. వీరంద అవతారములు కాక పోవచ్చును. ఒకానొకపూర్వజన్మకృతసంస్కారలేశముచేత రసస్వరూ

పము మఱచిపోని సామాన్యజనులే కావచ్చును. ఇంతమంది యొక చోట నుండుటయే యాశ్చర్యము.

ఆ రాత్రి యరుంధతీధర్మారావులు కిరీటిశశిరేఖలను పెండ్లి కొడుకు, పెండ్లికూఁతులుగా నలంకరించి పానుపువేసిరి. రథంతరి, మంగ, రత్నగిరి, మఱియు నిరుగుపొరుగు స్త్రీ లెల్లరును వచ్చిరి. కిరీటి లజ్జాశకలితమందహాసుఁ డయ్యెను. శశిరేఖ లజ్జాసంపిహిత మూర్తి యయ్యెను. అరుంధతీ ధర్మారావుల బలవంత మెక్కు-వయ్యెను. వారు గృహాధికారులు. వారిమాట జవదాఁట వీలులేక పోయెను. పూలచెం డ్లాడించిరి. ముత్తయిదువులు పాటలు పాడిరి. ఆ నాఁ డందఱితోఁబాటు ధర్మారా వొక ముత్తయిదువు. పరాచి కములు కొంతహద్దుమీఱినవి. ఎనిమిదినెలలు కాఁపురముచేసినభార్యా భర్తలపునస్సంధాన మిం కెట్లుండును? ఇదియంతయు నరుంధతి ముచ్చట. ఎవరిదారిన వారు పోవుచు ముత్తైదువలు తాంబూల ములు, రవికగుడ్డలు తీసికొనిపోయిరి. అందఱు పదిమంది. ఆత్మీయులే వచ్చిరి. అందఱును వెడలిపోయిరి. మంగ వెనుక వెనుక తారాడి యరుంధతితో 'అమ్మా! చాల శోభగా నున్నది. చిలుకయు. గోరు వంకయువలె నిద్దఱును బంగారపుమొలకలవలె నున్నారు. వారు రెడ్లా? మీకుఁ దక్కు-నకులములతో సంబంధము నేఁడు వదలునది కాదు. నన్నుఁ బిలిచితి వెందులకు?' అనెను. అరుంధతి మంగచేతిలో తాంబూల మిడెను. మంగ పుచ్చుకొనుటకు వెనుకతీసెను. సావి త్రమ్మగారు 'తీసుకోవే మంగా! నాయింటఁ దాంబూలమైనఁ దీసి కొమ్మ, తక్కు-నవన్నియు మనయిద్దఱ కొకసారియే యాశలు వద లెనుగదా' యనెను. ఆమె పుచ్చుకొనిపోయెను. సావిత్రిమ్మగారు 'మంగ చిన్ననాఁ డెట్లుండెనో నేఁడు నట్లే యుండెను. అప్పుడును బక్కు-పలుచగాఁ జువ్వవలె నుండెడిది. ఇప్పుడు నట్లే. తలవెంట్రుకము నరసినది' అనెను. రత్నగిరి ధర్మారావుతో మాట్లాడఁదలఁచినట్లు పొ ప్రచుఁబోవుచు వెనకాడెను. ధర్మారావు తమూహాయెఱింగి దగ్గ ఱకుఁబోయి 'యేమమ్మా' యనెను. రత్నగిరి యఱువదవపడిలో పడి నది. అయినను సవతికొడుకువద్ద సిగ్గుపడుట మానలేదు. ఆమె 'బాబూ! గిరిక యేమాత్రము దూరము వచ్చినది' యనెను. ధర్మా

రావు 'యేమాత్రము దూరము వచ్చినది. ఏమాత్రదూరము వచ్చిన దేమిటి! నేఁటి సాయంకాలమున దేవాలయములోఁ జూడవలయు నామెను. కడచినఁరాత్రి యామెకు స్వప్నదర్శనమైనది. దర్శనము త్రివిధ మని నీకుఁ దెలియునుగదా! అందుఁ జిత్రదర్శనములో విశే షము లేదు. అదియుఁగూడ రసహేతువేకాని భక్తిపథములఁబోవు నిటువంటినాయికలకుఁ జెప్పఁదగినది కాదు. ఇంక స్వప్నదర్శ నము, సాక్షాద్దర్శనమురెండును భక్తిభావగత లగు నాయికలపాలిటి కల్పవృక్షములు. గిరికను స్వప్నమునందు స్వామి యంగీకరించెను. ఇఁక ప్రతిదినమును గిరికవెంట హంగు పోవుచుండవలయును. బహు తపస్సులు చేసికాని ఋషులకు స్వామి గోచరించలేదు. ఇదియుఁ గళాతపస్సు. ఈ తపస్సునకు ధ్యానము, రాగము, జపము, తాళము, స్నానము, నృత్యము. ఇది నిత్యము సమాచరించవలయును. దేవ దాసి మనలనందఱను బునీతులఁ జేయఁబోవుచున్నది. ఆమెను సర్వథా పరిరక్షించుకొవవలయును. ఆమెనుగూర్చి నీ వంత విచా రించరాదు. ఇంకఁ గొలదినాళ్ళలో గిరిక మఱియు మాఱిపోవును. అప్పుడు తొందరపడరాదు. గిరిక కేమి, బంగారుతల్లి! మాతండ్రి నన్నేమో మహావైదికుని జేయవలె ననుకొనెను. అన్నను రామ చంద్రరాజును గొప్పవిలుకానిని జేసి. యతనికి బ్రహ్మోపదేశముచేసి, యథర్వణవేదము పునరుద్ధరించి బ్రహ్మాస్త్రముమొదలైనవి కల్పిత ములు కావు యథార్థము లని ఋజువుచేయించి, జగత్తు మఱల క్షత్రి యులచే నేలించవలయు ననుకొన్నాఁడు. శ్రీధరముగారు వేమారెడ్డి కవచితిప్పయవలె రాజుగారికికోశాధిగారి యవు ననుకొన్నాఁడు. అన్ని యూహలును సర్వథా సంచ్యుతములై పోయెను. ఆయనయూహలు రెండే—ఒకటి సగము ఫలితమునకు వచ్చినది; మఱియొకటి సంపూర్ణ ఫలితమునకు వచ్చినది. పసిరికమీఁద నాకాశలేదు. గిరిక, గిరికయా? మాతండ్రి సంపూర్ణ మనోరథ మామెయే. గిరికను జూచిన నీ కెట్లుం డునో కాని నాకుమాత్రము దేవతాస్త్రీలను జూచిన ట్లుండును. కబీరు గిరికను నిత్యము నంటిపెట్టుకొని యుండవలయును. కాలము చెడ్డది. విగ్రహనాశకు లున్నారు. వారితో విగ్రహము మన కెందుకు?' అనెను. ధర్మారావుకంఠము గద్గదికతోఁ బొలిచెను. మనిసి సఖసిఖ

పర్యంతయు వణఁకిపోవుచుండెను. రత్నగిరితో నతఁడదివఱ కెన్నఁడును మాటాడలేదు. ఆమెయు నతని నెన్నఁడును బలుకరించలేదు. రత్నగిరి సంతోషమో, ఉత్సాహమో నడచిపోవుచు నొకభావమును ప్రకటించెను. అది సహజమో, భరతశాస్త్రవైశారద్యము వలనఁ గలిగిన ఫలితమో! సంస్కృతమైన తద్భావప్రకటన చీఁకటిని జీల్చివేసెను. తటిల్లతలు సరస్వతిపురువులవలెఁ దలదళ మెఱసెను. మేఘము లుఱిమెను. నెమ్మదిగాఁ జినుక నారంభించెను. చినికి చినికి పెద్దవాన యయ్యెను. దానితో గాలి సాఁగెను. చలి వేసెను. శశిరేఖాకిరీటులయు, నరుంధతీధర్మారావులయు గాఢపరిష్వంగములు పూర్వము సహ్యము, పరమసహ్యము నయ్యెను. దుప్పటి యాపాదమస్తకము లాగి శశిరేఖాకిరీటులు నిద్రించిరి. కఠోరగర్భిణి యరుంధతి దూరముగానే పండుకొనెను. ఆమెకుఁ దొమ్మిదవనెల వచ్చెనేమో! అంతచలిలో నామెకు దుప్పటి యక్కఱలేకపోయెను.

అరుంధతి—నేఁడు మీ రిప్పుడు నెచ్చటికిఁ బోయితిరి? ధర్మా—శివరావుతో మాట్లాడుచుంటిమి. అరుం—నేఁడు మేము నలువురము దేవాలయములోనికిఁ బోతిమి. అచ్చట నేఁడు గిరిక నృత్యముచేసినది. ఆమె యెంత విద్యావంతురాలు! ఆమె మునుపటివలెఁగాదు. నే నెఱుంగుదునుగదా! ఆమె భక్తి వేరుగను, విద్య వేరుగను బూర్వముండెడిది. ఇప్పుడు రెండును గలసిపోయినవి. విద్యాప్రదర్శనవేళ యందే యామెభక్తిభావము విజృంభించుచున్నది. కడచిన రాత్రి యామెకు స్వప్నమున స్వామి సాక్షాత్కరించెనఁట. సాక్షాత్కరించి —అని యరుంధతి సిగ్గుపడెను. ధర్మా—సరియే. తరువాతఁ దెలిసినది. అరుంధతి—అది. గదుసుఁదన మనఁగా! ధర్మా—నేనేమంటిని?

వ్యవహితమైన వారికౌఁగిలిమనసుచేతఁదప్ప శరీరముచేతసుఖాపాదికాలేదు. కిరీటి శశిరేఖలకు మూఁడురాత్రులు కడచినవి. నాల్గవ నాఁడు కిరీటి ప్రయాణమయ్యెను. ధర్మారావు సరేనని యతనిని వెంటఁబెట్టుకొని దేవాలయాభిముఖముఁగా బోయెను.

ధర్మా—నీవు దేవదాసి నెఱుఁగుదువా? కిరీటి—వెనుక నీ వొకసారి చూపించితివి. రాత్రి శశిరేఖ చెప్పినది. ధర్మా—ఏమని? కిరీటి—ఏమని, ఏమిటి? ఆమె మహాభక్తురాలఁట. మహావిద్యావంతు

రాలఁట. ఆమె నంత భక్తురాలిని జేసినది నీవేనఁట. శశిరేఖ ని న్నొకటే మెచ్చుకొనుట!

ధర్మా—శశిరేఖ నిట్లు చేసినది యెవరు? ఇద్దరును దేవాలయ ప్రాంతములకుఁ బోయిరి. ధర్మా—ఇందులో నే దేవాలయ మెవరిదో తెలియునా? కిరీటి—పై శిఖరములే తెలియఁజేయుచున్నవి గదా! ధర్మా—ఎన్ని దేవాలయములు నీకుఁ గనఁబడుచున్నవి? కిరీటి—రెండు. ధర్మా—అచ్చటనున్నవి మూఁడాలయములు. కిరీటి—మూఁడవది యెచ్చట నున్నది? ధర్మా—ఆ శివాలయములో నొకయెడ నున్నది: మన మచ్చటికే పోవుచున్నాము. అది సుబ్రహ్మణ్యేశ్వరస్వామి యాలయము. ఈ యూరునకు సుబ్బన్నపేట యని పే రేలవచ్చెనో నీకుఁ దెలియునా? కిరీటి—ఒకసారి హాస్టలులో విద్యార్థులందఱును చెప్పుకొన్నారు. నీకు, నాకథకు నేదో సంబంధమున్నదనికూడ ననుకొన్నారు. కాని శశిరేఖావిరహవ్యథాకులితహృదయుఁడను నే నప్పుడు విన్నడుగలేదు. ధర్మా—నాకు, నా స్వామికి నేమి సంబంధము? ఆయనదారి యాయనది; నాదారి నాది. నీ కొకఁడు చెప్పవలయును. మన మచ్చటికిఁ బోయినతరువాత స్వామి నీ కెట్లు కనఁబడునో తెలియదు. అనఁగా ఱాతివిగ్రహముగా నే గోచరించునో, నిజమైన పామువలె నే కనఁబడునో! కాని యొక్కఁడు మాత్రము చెప్పఁగలను. ఆయన రెండు శిరసుల నాగు.

ఇరువురు గలసి సుబ్రహ్మణ్యేశ్వరస్వామియాలయాంతర్భాగమునకుఁ బోయిరి. అది ప్రాతఃకాలము. గణాచారి గుడిలోనున్నది.

కిరీటి—ఈమెయేకదా, గణాచారి? ధర్మా—స్వామిని జూడుము. కిరీటి—విగ్రహమంటివి. విగ్రహమే లేదే!

అంతలోఁ గిరీటి సచకితహృదయుఁడై రెండడుగులు వెనుక వేసి నిశ్చలదృష్టితో విగ్రహమున్న వైపునకే చూచుచుండెను. ధర్మారావు నమస్కారము చేసెను. కిరీటియు నతని ననుసరించెను. అర్చకుడు విభూతియిచ్చెను. ఇరువురును దేవాలయము వెలుపలికి వచ్చిరి. వెడలివచ్చుచు ధర్మారావు, గణాచారు లొకరినొకరు చూచుకొనిరి. ఆమె తనవంకఁ జూడకుండఁబోవుచున్న కిరీటివంకకుఁ జేతులెత్తి

యాశీర్వదించెను. కిరీటి, ధర్మారావులు గుడి వెలికి వచ్చిరి. ధర్మారావు కిరీటి 'నేమి కనఁబడిన' దని యడిగెను.

కిరీటి—నాకిటువంటివనిన పూర్వమెప్పుడునునమ్మికలేదు. కాని, యన్నా! విచిత్రముగ నున్నది దేవాలయములో విగ్రహమునకు బదులు నిజముగా సర్పమే యున్న దేమి? అది యెవరినిగఱువదా?" ధర్మా—అస లాయునవి వేయిపడగలు, ఇంక మిగిలినవి రెండు. తక్కిన తొమ్మిదివందల తొంబది యెనిమిది పడగలు, దేశమును సర్వథా యిదివఱకే గ్రసించినవి. కిరీటి—ప్రతియేఁట నిచటికి వచ్చి నేనును శశిరేఖయు స్వామికిఁ గొబ్బరికాయలు కొట్టిపోదుము. నేఁటిసాయంకాలమున నిద్దఱము నిచటికి వత్తుము. నేను త్వవు పోయెదను. ధర్మారా 'వల్లే' యనెను. ఇరువురును గోట కెదురుగాఁ బోయిరి. దూరమునుండి హరప్పనాయుడు వచ్చుచుండెను. కిరీటి—ఈయనయేకదా జమీందారు? నీ వాయనకుఁ గొన్నాళ్ళు చదువు చెప్పితివఁటగదా? ధర్మా—"చదువు చెప్పినది నేను కాదు ఈట్సనుదొర. అతనికి నెలకు పన్నెండు వందల రూపాయల జీతము. మీ కాలేజీ వచ్చినది. ఆ జీతము హరప్పచదువుకొఱ కిచ్చు చుండుట యనునది మానినది." హరప్ప దగ్గఱకువచ్చెను. అతని రాజఠీవి కిరీటివంకఁ జూడనీయలేదు. ధర్మా—ప్రభూ! ఈయనయు, నేనును స్వామి యాలయములోనికిఁ బోతిమి. సుబ్రహ్మణ్యేశ్వరుఁడు రెండుతలలతో నీయనకు ప్రత్యక్షమైనాఁడు. ఈయనపేరు కిరీటి. నాకు స్నేహితుఁడు.

హరప్ప కిరీటివంకఁ జూచి మఱల తనకనులు త్రిప్పుకొనెను. హరప్ప వెనుదిరిగి పోవుచుండెను. వచ్చినవాఁ డొక్కమాటాడ లేదు. పోవుచుఁ బోవుచు ననుకొనెను. "ధర్మారావుగారు చెప్పినది నిజమే. స్వామికిఁ దక్కినతలలన్నియు నశించిపోయినవి. కాదు కాదు నశించిపోవుట కాదు. దేవాలయములోనుండి పోయినవి. కిరీటి యదృష్టవంతుఁడు. నన్ను పెండ్లి చేసికొ మ్మందురు. నే నేల చేసి కొనవలయును? నేను స్వామివేయితలలు చూడవలసినవాఁడనుగాని, రెండుతలలు చూడవలసినవాఁడను గాను. రెండుతలలకు నష్టములేదు. తక్కినతలలు నిలుపవలసినవాఁడను నేను. నే నొక యూరికిఁ బ్రభు

వును; దేశమునకుఁగాదు. పూర్వకాలమున నూరికిని దేశమునకును భేదము లేదు. దేశము నాత్మ పూర్వము గ్రామమునం దుండెడిది. అందుచే నొక గ్రామము ప్రభువు దేశము ప్రభువుగా నైనాఁడు. ఇప్పుడు గ్రామము చెడిపోయినది. ఇచ్చటి శక్తిపోయి దేశమునిూఁద బడి సర్వథా వ్యభిచరించెడు వెలయాలివలె నయ్యెను. నాకు వేయి పడగలు చూచు గీత లేదు. అది మా తాతనాఁటికే పోయినది." వెనుదిరిగిపోవుచున్న హరప్పను గిరీటి, ధర్మారావులుచూచిరి. ఆయన తెల్లనిపట్టుతలపాగపైని వదలినకుచ్చు గాలికికదలాడి జరీయంచువలన రత్నవిభ్రాజితఫణామండలముతోడి; తోఁకపై నిలిచి పడగెత్తుచున్న, ముందుకు దూకుచున్న పామువలెఁ గనిపించెను.

కిరీటి—ఈయన - యెన్నియోసారులు చూచితిని. అదియే తలగుడ్డ, అటువంటిదే యంగీ, అటువంటిదేపంచె ధరించియుండును. నిద్రకూడ వాని తోడనే పోవునా? ధర్మా—అసలు నిద్రపోయినఁ గదా! ఆయనతల్లిగారు చనిపోవువేళ నాయనకీ దుస్తులు నియమించిపోయెనఁట! అందుచేత నాయన సర్వకాలములయందు నట్లే యుండును.

ఆ సాయంవేళ శశిరేఖాకిరీటులు సుబ్రహ్మణ్యేశ్వరాలయమునకుఁ బోయి కొబ్బరికాయలుకొట్టిరి. శశిరేఖయాశ్చర్యపోయెను. ఎచ్చటను స్వామి యింత ప్రత్యక్షముగా నుండడు. ఆమె కిరీటిని 'యీా స్వామి యెవ్వరిని గఱవఁడా?' యని యడిగినది. కిరీటి ధర్మారావు చెప్పినసమాధానము చెప్పెను. అర్చకుఁడు నాలుఁగు కొబ్బరికాయలకును నాల్గుసగము లతఁడు తీసికొని, నాల్గు సగములు వీరిచేతి కిచ్చెను. వారు గృహాభిముఖులైరి.

కిరీటి—వదినెగారైన మనవెంట రాలేదేమి? శశి—ఆవిడకు నొప్పులు వచ్చుచున్నట్లున్నవి. సామాన్యముగా నెలలు నుదిరిన తరువాత స్త్రీలంత యోపికగా నుండలేరు. ఆమె విచిత్రమైనమనిసి? మనమువచ్చిన మొదటిరోజున గిరికతోఁగలసి దేవాలయమునకు వచ్చినది. ఆమె కఠోరగర్భిణివలెనే యుండదు. ఈ మూఁన్నాళ్ళ నుండియు నింటిలో నెంతపని చేసినది?

ఇరువురు నింటికి వచ్చిరి. అరుంధతి లేచి తిరుగుచుండెను. శశిరేఖ 'అక్కా! మెట్లున్న దనెను. అరుంధతి 'బిగ్గరగా మాట్లాడకుము. మగవారికి వినబడును. నీ మగనితో ననలేను కదా!' అనెను.

మఱునాఁడు కిరీటి ప్రయాణమయ్యెను. శశిరేఖ 'గిరికను జూచికొని రా' ననెను. కిరీటియు, ధర్మారావును శశిరేఖయు గిరిక యింటికిఁ బోయిరి. శశిరేఖ యొక్కతెయు లోనికిఁబోయెను. మిత్రులిద్దరును బయట నిలుచుండిరి. శశిరేఖను రత్నగిరి చూచి కూఁతురున్నచోటికిఁ దీసికొనిపోయెను. గిరిక పొద్దునకే స్నానముచేసి, మడి కట్టుకొని; తనగదిలోఁ గూర్చుండి, కనులు మూసికొని ధ్యానించుచుండెను. ఎట్టయెదుటగజమెత్తునున్న వేణుగోపాలస్వామివిగ్రహము-కంచుతోఁ జేసినది - యున్నది. గిరిక బద్ధపద్మాసనస్థయై ప్రాణాయామముపట్టి దృష్టి భ్రూమధ్యమున బిగించియుండెను. శశిరేఖ నివ్వెఱపోయెను. ఆమె రత్నగిరితో నన్నది; ఆమెను నే నిప్పుడేమని పల్కరింతును? నేను చెప్పిపోవుటకువచ్చితినని చెప్పుము. మేమింక నీ గ్రామమునకు వచ్చుచుఁ బోవుచునే యుందుము. ఈస్వామికినిమాకును ద్రెంచరాని బంధమేర్పడినది' అని, గిరికయున్నదిక్కున కొక నమస్కారముచేసి, యామె తాను వెలికివచ్చెను. ముగ్గురును రైలునకుఁ బోయిరి. శశిలేఖాకిరీటులు రైలులోఁ గూర్చుండిరి. శశిరేఖ తన యొడలు తా నెఱుఁగదు. కిరీటిమనసులో రెండుశిరస్సులనాగు మెదలుచుండెను. రైలు కదలిపోయెను. అన్నదమ్ము లొకరినొకరు వాంఛాగాఢమైన కనులతోఁ జూచుకొనిరి. రైలు నెమ్మదిగా నడచినను గొంత సేపటికి వా రొకరొకరికిఁ గన్పించలేదు. రైలుపోయినంత మేఱ ధూమమును పైకిఁజిమ్ముచునే యుండెను. ధర్మారావు తిరిగి యింటికి వచ్చెను. అరుంధతికి మఱల నొప్పులు వచ్చెను. గుంటూరిలోనున్న కుగ్లరుదొరసాని యాసుపత్రికిఁ దీసికొనిపోదు నని ధర్మారా వెన్నిసార్లో చెప్పెను. ఆమె యన్నిసారులు నంగీకరించలేదు. 'అక్కడ బ్రసవసమయమున నిరాభరణలనుగా, నిర్వసనలనుగా నుంచుదు రఁట. తెల్లనిగుడ్డలుమాత్రమే కప్పియుంతు రఁట. తిలకములు లేని మొగాలతో, నాభరణములులేని యొడళ్ళతోఁ, దెల్లనివస్త్రములతో

నమంగళాకృతిఁ దాల్చుట నా కేమికర్మము! నేను పో నన్న దామె. మఱునాఁడు ప్రొద్దున నింటివద్దనే ప్రసవించినది. మగశిశువు కలిగెను. ప్రసవసమయమునఁ జాల బాధపడినది. మంగ మెలఁకువలు తెలిసిన ప్రసవవైద్యురాలు. పూర్వము గ్రామములో నొకచాకలిమంత్రసాని యుండెడిది. ఆమె యీ చేతివిద్యలో నాఱితేరినది. ఆమె చాల యనుభవశాలిని. ఎంత గడ్డుమైన ప్రసవమైనను మెలఁకువతో నామె సాధించెడిది. 'ఫార్సెప్సు' మొదలైన సాధనముల యవసరము లేకుండ నామె యుపాయమువలననే గర్భకోశముయొక్క సర్వాంకషమయిన జ్ఞానము, తదనుకూలహస్తప్రయోగవైశారద్యము – వీనితో నామె లోకమునకు బహూపకారిణిగా నుండెను. అది యొక విద్య. ఆ విద్య చదువుకొనునది కాదు. సంప్రదాయముచేత వచ్చునది. సంప్రదాయమునకు, చదువుకొనుటకును దేశములో మహాయుద్ధము ప్రబలి, ధనదేవత, యధికారదేవత చదువుకొనుటయొక్క పక్షమునఁ జేరి సంప్రదాయము నోడించెను. సంప్రదాయముపొందినయోటమి మఱల దానిని తల యెత్తనీయలేదు. ఈ సంప్రదాయమున కెన్నెన్ని చోటుల నైనను పరాభవమే వాటిల్లెను. చాకలిది నాలుఁగైదు ప్రసవములు సంబాళించుచుండఁగా మంగ చూచి కొంత గ్రహించెను. అప్పటి నుండి యాసుపత్రులకుఁబోనివారు సుబ్బన్నపేటలో మంగసాయ మపేక్షింతురు. ఆమె వచ్చి కోడలికి సహాయపడెను. బాధపడుచున్న వేళ మంగ యన్నది 'నాయనా! పిల్ల యింత బాధపడుచున్నది. గురులింగశాస్త్రిగారు లేకపోయెను. ఆయన మంత్రించి పంచపాత్రెఁడు జల మిచ్చినచో వీసమెత్తు బాధ లేకుండ ప్రసవించి యుండును. ఆయన చనిపోయినతరువాత గ్రామములో దిక్కుపోయినది. కొంచెము విభూతి మంత్రించియిచ్చువాఁడు లేఁడు. గాలికి ధూళికిఁ గానైనవాఁడు లేఁడు. ప్రతివారికి నింగ్లీషు వేదమైనది. అరుంధతికిఁబుట్టినకొడుకు వ్రేలెడంత పొడుగు. వానికన్న నెలుకపిల్ల నయము.' ఇది మంగమాటలు.

చుంచు కూసినట్లు కూసిన వానియేడుపు వాకిటఁ గూర్చున్న ధర్మారావుహృదయనాళములలో నున్న యాకాశమునందు శబ్దించి

నది. సర్వము సుఖావసాన మని తెలిసినతరువాత ధర్మారావు - తోఁచీతోఁచనివాఁడు - పనియు బాటలేక యూరివెంట నడుచు చుండెను. కొంతసేపటి కతఁడు తాను కోటగుమ్మముదాఁటి లోనికిఁ బోవుచుంటి నని తెలిసికొనెను. ఇచ్చటికి వచ్చితి నేమని వెనుదిరుగఁబోయి, హారప్పనాయని జూచిపోదమనుకొని, మఱల వెనుదిరిగి పోయెను. హారప్పనాయఁ డేదో చదువుచుండెను. అతఁడు ధర్మారావును జూచి 'ఇది జార్జి ఇలియట్ వ్రాసిన సైలాస్‌మార్నరు' అనెను. ధర్మారావు వెనుదిరిగిపోయెను. హారప్ప మఱల చదువుచుండెను. ధర్మారావు దేవాలయముముందునకు నడచెను. అప్పటికి జాము పొద్దెక్కినది. దేవదాసి యాలయము ముఖమండపమునందున్నది. తాను పురిటివాఁడు. ధర్మారావు లోనికిఁబోవుటకు వీలు లేదు. ద్వారబంధమునందుఁ గూర్చుండెను. దేవదాసి యతనివంకఁ జూచుచుండెను. ఇంతలో ధర్మారా వెందుకువచ్చినట్లో, యెందుకు పోయినట్లో తెలియక హారప్ప పుస్తకముమూసి యతని ననుసరించెను. అతఁడు వచ్చి యాలయమున కెదురుగా వీథిలో నిలుచుండెను. తలుపులు తీసియున్నవి. ధ్వజస్తంభము ప్రక్కనుండి దేవదాసిశిరము మీఁదుగా హారప్పదృష్టి స్వామిమీఁదఁ బడెను. హారప్పకంటికి మొదట నేదో మెరసినట్లు తోఁచి నిదానించి చూచినతరువాత స్వామిమొగమున నున్న తిలకముగా స్ఫురించెను. హారప్ప యెన్నఁడును మొగమునఁ దిలకము ధరించఁడు; కొందఱు 'తండ్రిమతమే కొడుకునకు, కేశబ్జీమతానుయాయి' యనుకొందురు. వారందఱును దిలకమును ధరించరు. చైతన్యుఁడు తిలకము ధరించెను. తదవతారమైన కేశబ్జీ ఏల ధరించలేదో? హారప్ప స్వామిమొగమున నున్న వెండియూర్ధ్వపుండ్రరేఖలఁ జూచినంతనే భక్తినిమీలితనేత్రుఁడై యిట్లు ధ్యానించెను. 'ప్రభూ! నీయాలయము లోనికి వత్తునని బుద్ధిపుట్టి యేండ్లయినది. నన్ను నీవు లోనికి రానిచ్చుట లేదు. నా మొగమునఁ గూడ దిలక మెప్పుడు పెట్టింతువు? ఎప్పుడు నీ దేవాలయములోనికి రప్పించుకొందువు? నాకు నీ సన్నిధి సేవ యెప్పుడు? పంచమునివలె వీథిలో నుండియే చూచుచుంటిని. సన్నిహితుఁడ నగుస్థితి నాకు లేక పోయెను.' దేవదాసి హారప్పను జూచెను. ఆమె యతని వంకనే చూచు

చుండెను. కూర్చున్నచోటునుండి లేవలేదు. ధర్మారావటు దేవ దాసిని జూచును, ఇటు హరప్పను జూచును. తానును తన కూర్చున్న చోటినుండి లేవలేదు. హరప్ప యట్లే నిలుచుండెను. కదల లేదు. ప్రొద్దుబాగుగ నెక్కినది. అర్చకుఁడు స్వామికి నైవేద్యముపెట్టి, తెర యడ్డము వేసి యిచ్చిన నీరాజనము బయటకుఁ దెచ్చి దేవదాసికిఁ జూపించెను. ఆమె సాష్టాంగపడి నమస్కరించెను. ధర్మారావు మోక రించి నమస్కరించెను. వీథిలో హరప్ప నిలుచుండి చేతులు పైకెత్తి నమస్కరించెను. ఎవరి దారిని వారు పోయిరి. ధర్మారావు మరల గ్రామమువెంటఁ దిరుగుచుండెను నాఁడతని కింటివద్దకుఁ బోయి నచో తిండి యెవరు పెట్టుదురు? సావిత్రమ్మగారు శిశువునకు నీరు పోసి బాలెంతరాలికి నీరుపోసి యప్పుడు మడికట్టుకోవలయును. రథం తరియు మంగయు సాయ మున్నారు. కాని పని తేలదు. ఆనాఁడు కూడు రెండుజాములు దాటినమే. ఈ కారణము ధర్మారావు విచా రించుకొనలేదు. విచారించుకొనకుండఁగనే యతని హృదయమునకుఁ దెలియును. అతఁడు మఱల గ్రామమువెంట దిరుగఁజొచ్చెను. పసిరిక గనఁబడెను. అతనికి ధర్మారావు చాలయేండ్లుగా నొంటరిగా గని పించలేదు. నేఁ డిట్లు కనఁపించినంతనే పసిరికవచ్చి యతనిమీఁద వ్రాలెను. పసిరిక యతనిచేయి పుచ్చుకొని లాగికొనిపోఁదొడఁగెను. ధర్మారావు మారుపలుకకుండ నతని ననుసరించుచుండెను. అంతవఱ కెండలుగాచిన యా పగలు మేఘములు క్రమ్మి యప్పుడు చినుక సాఁగెను. ధర్మారావు తలయెత్తి నాలుఁగుదిక్కులును జూచెను. మేఘములు సాంద్రముగాఁ బట్టినవి. గాలి లేదు. మేఘములు తప్పక కురియును. పసిరిక తలయెత్తదు. నడచుచుండెను. ఇరువురును ప్రాగ్దిశనున్న మెట్టచేలకుఁ బోయిరి. జొన్నచేలు గజమెత్తునఁ బెరిగి యుండెను. దున్నినచాళ్ళలోఁ జిన్నచిన్నగుంట లున్నచోట్ల వాన నీరు నిలిచియుండెను. అది రాత్రిపడిన వాన. చిలుకలు, పాలము పిచ్చుకలు, గోరువంకలు చేలమీఁద నందందు కనఁబడఁజొచ్చెను. ఒకటి రెండు కొంగలు దూరాన పల్లపుఁజేలపై నెగురుచుండెను. పికిలిపిట్ట యొకటి సన్ననియీలాలకొట్టుచు రెక్కలు స్నానముచేసిన బ్రాహ్మణుఁడు పిడిచిన తనయుత్తరీయము చేతులపై వేసికొని యెండఁ

బెట్టుటకుఁ గదలించినట్లు గదలించుచు నాకాశమున రివ్వునఁ బరుగెత్తెను. పసిరిక పిట్టలకై పరువెత్తి వానిని బట్టుకొనును. కొన్ని యెగిరిపోయినను గొన్ని యతనిచేతికిఁ జిక్కును. చిక్కినపిట్ట కీచుమనును. పసిరిక కిలకిలారు మని నవ్వి దానిని వదలిపెట్టును. ఒక పాలముపిచ్చుక పసిరికభుజముపై వ్రాలి ధర్మారావును జూచి 'నీవున్నావా' యన్న ట్లడ్డముగా నెగిరిపోయెను. ఱెక్కలు కదిలించి యావేగముతోఁ గొంతదూరము పోయి, మఱల కదలించి యావేగముతో మఱికొంత దూరముపోయి, యిట్లు పోవుచుండెను. మొదటిసారి కదలించిన వేగము మందగించువఱకు పిచ్చుకవేగము మందగించుటయే కాక యెగిరిన యెత్తుకూడ తగ్గి భూమికి దగ్గఱగా వచ్చును. మఱల ఱెక్కకదల్చునప్పుడు వేగమును వచ్చును. ఎత్తునకుఁ బోవును.

పసిరిక ధర్మారావును జేలచుట్టు త్రిప్పెను. ఆతిథ్యమొసంగుటకు ఊచబియ్యము లేవు. మొక్కజొన్నకండెలు లేవు. అన్నియుఁ జిన్ని మొక్కలే. జొన్నచేలలో వేసిన పెసరకాడఁ దీఁగెలైన సాఁగలేదు. లేఁతజొన్నాకులమీఁద వానచినుకులు నిలిచెను. గట్లవెంట నున్న పచ్చికయంతయుఁ దడిగానుండెను. చినుకుచున్నవాన కొంచెము పెద్ద దాయెను. దూరమున నేదో పరుగెత్తుచున్న ట్లుండెను. పసిరిక చిత్రముగాఁ దలత్రిప్పి యా పరుగెత్తుచున్నదానివంకఁ జూచెను. మఱల ధర్మారావువంకఁ జూచెను. నాగస్వరము పాడుచుండఁగా నాడుచున్న పాముతల చప్పున ప్రక్కకుఁ ద్రిప్పునట్లు పసిరిక తల ద్రిప్పెను. అతఁ డొక్క పరువునఁబోయి యా పరువెత్తుచున్నదానిని బట్టుకొనెను. అది యొక సర్పము. పసిరిక చేయఁబోవుచున్న గడుసుదనము దానికిఁ దెలిసినది. అతఁడు తన్ను ధర్మారావువద్దకుఁ దీసికొనిపోఁబోవుచుండెను. అది పసిరికను వ్రేలిమీఁదఁ గఱచినది. పసిరికకు వ్రేలు నొప్పిపట్టి దానిని క్రిందవదలి, పోవుచున్నదాని తోఁకపైఁ గోపముతోఁ ద్రొక్కెను. అది యతనినిజూచి, నవ్వినట్లు పడగవిప్పి, నేలమీఁద వదలిన గాలిపడగవలె నటునిటు కదలుచుఁ బోయెను. పసిరిక కిలకిలారు మని నవ్వెను. అతఁడు మఱల ధర్మారావువద్దకు వచ్చెను. ధర్మారావు ముక్కుమీఁద వ్రేలుంచెను. పసి

రిక మఱల నవ్వెను. వర్షము పెద్దదికాఁజొచ్చెను. ఆ వానకు వడగండ్లుపడెను. పసిరిక వడగం డ్లేఱి తానుకొన్ని తిని, ధర్మారావునకుఁ గొన్ని యిచ్చెను. ధర్మారావు తా నింకను స్నానమే చేయలేదు వానిని దినలేదు. ఒకపాము వానలోఁ బరువెత్తుచుండెను. వడగండ్లు దానిశిరస్సునఁ దాడించుచుండెను. అది పడగవిప్పి బుస్సు మని లేచి ప్రక్కవాటుగా బొంయి మని వీచుచున్నగాలిని గసిగాట్లు కొఱికి, కట్టను మీఁద పోవుచుండెను. పసిరిక పరువెత్తి, తనచేతులు దానిపడగమీఁద నుంచి, యదిబోయినంతమేఱ వడగండ్లు దానిపడగమీఁద తగులకుండ జేసెను. అట్లు దాని పోయినంతమేఱ నతఁడును బోయెను. ఆపామెంత తొందరగాఁ బరువెత్తెనో యతఁడు నంత తొందరగా బరువెత్తెను. ధర్మారా వనుకొనెను: ఇచ్చటికి లక్షసార్లు మే మొంటరిగా వచ్చెదము. మా కొక్కపామైనను గనఁబడదు. ఒకపిట్టయైనను గనఁబడదు. ఇతనితో వచ్చినప్పు డన్నియుఁ బాములే, అన్నియుఁ బిట్టలే.' వర్షము విజృంభించి కురియసాఁగెను. ధర్మారావు వానలోఁ దడిముద్ద యయ్యెను. పసిరిక గోచిమాత్రము పెట్టును. అతనిమీఁద వాన కురిసినట్లే లేదు.

# పదునేడవ అధ్యాయము

సుబ్బన్నపేట తూర్పుదిక్కంతయుఁ గుండేటికి దక్షిణమున నంతయుఁ దాటితోఁపులు. పూర్వము చుట్టుపట్లనంతయు మాగాని కానప్పుడు గ్రామము నాల్గువైపులఁ దాళవనములే శోభ తెచ్చినవి. ఆ యూరిలోఁ గలాలీ లెక్కువనుంది. వారందఱు తాళ్ళు గీసికొనియే జీవింతురు. గ్రామము పట్టణమైన తరువాత మెట్టలు మాగానులైన తరువాత వారిజీవనాధారము కొంత వెనుకఁబడినది. గ్రామము పట్టణమైనతరువాత వారియిండ్లకుఁ జుట్టుపట్లనున్న నెరా శాస్థలము లన్నియు నివేశనస్థలములై, వారలు తమ కున్న కొంచెము నేలయు నమ్ముకొనిపోవుననే మేలని తోఁచి యట్లుచేసిరి. పోయిన కొలఁది యిండ్లు గుండేటిలోఁ గట్టుకొనవలసివచ్చినది. పల్లెటూరుగా నున్నప్పుడు తాళ్ళు ప్రతివారును గీసెడివారు. అందఱకుఁ దలా యొక కొంచెము గిట్టెడిది. ఇప్పు డా గ్రామము ముప్పదివేల కిజారా పాడుదురు. ఇజారాదారు ముప్పదివేలు చెల్లించి తనకు మఱి యంత లాభము చూచుకొని తాళ్లుగీయువారి కేమి యొసంగఁగలఁడు? వారికి గిట్టుబడి తక్కువ యైపోయెను. జమీందారీతాళ్లు మాగాని చేసిన క్రొత్తలోఁ బొలముకలవారు చాలబోదెలు మొదలైనవి నఱికివేసిరి. అప్పటికిఁ దాళ్ళనుగుఱించి యింత పట్టింపులేదు. ఇప్పుడు తాడి ముట్టుకొనరాదు. పొలముగల కాఁపు 'నా చేనిలోనున్న తాడి నేను గీయనీయ' ననరాదు. తాడి మాగానిమధ్య నుండును. గీయుటకుఁ బైరులోనుండి గవళ్ళవాఁడు పోయినచో దారియేర్పడి పైరునకు నష్టమగును. అప్పటికిని కాఁపు అటకాయించలేఁడు.

ఉన్నతోఁపులన్నియు గుండేటికి దక్షిణమునఁ గనుకఁ గలాలీల యిండ్లన్నియు నావైపుననే యున్నవి. వారిలోఁ జాలమంది గ్రామము వదలి లేచిపోయిరి. మఱికొందఱిపిల్లలు సెకండుఫారము, థర్డుఫారములవఱకుఁ జదివి, కొందఱు ట్రెయినింగుబోర్డుస్కూలుమాస్టరులుగను, కొందఱు గ్రామము వెలిసిన కచేరీలలో కళాశాలలో కో-ఆపరేటివు బ్యాంకులలోఁ బలుచోట్ల బంట్రౌతులుగాఁ జేరిరి.

ఇంతలో సహాయనిరాకరణోద్యమము తనదృష్టి మద్యపాననిషేధము వంకకు మరలించినది. గ్రామములోని కొందఱు యువకులు దొంగతనముగాఁ గల్లువచ్చు తాటిమొవ్వులన్నియుఁ గోసివేసిరి. వారందఱును జెఱసాలలకుఁ బోయిరి. ఇజారాపాడరాదని నిర్బంధించిరి. ఒకటి రెండు సంవత్సరములు కల్లుమీఁదవచ్చు రాఁబడి రాచరికము వారికిఁ జెడిపోయెను. దేశమున సత్యాగ్రహులు విచ్చలవిడిగా నిషేధప్రచారమును గావించుచుండిరి. ఇజారాపాకలవద్దకుఁ బోవుటయు, నచ్చట మద్యపాయులతో వాదోపవాదములు, బతిమాలుటలు, గడ్డములు పాదములు పుచ్చుకొనుటలు, వారిచేత వెచ్చవెచ్చనిసారాయి పుక్కిలించి యుమియించుకొనుటలు, కొన్ని సమయములందు శిరస్సులపై మద్యఘటములు పగిలింపించుకొనుటలు- వీనితో వారు ధర్మవీరులైరి. రాఘవరావు చెఱసాలనుండి విడువఁబడి మద్యపాననిషేధోద్యమములోఁ దిరుగుచుండెను. అతనికి సుబ్బన్నపేట గొప్పచెల్లుబడిగ్రామమని తెలియును. నరసారావుపేటలో నతనికిఁ దానుండుటకు వీలులేకపోయినది. భార్య పుట్టినింటనున్నది. అత్తమామల కల్లునికన్న దౌర్భాగ్యుఁడు లేఁడని యూహ. అతని యన్నగారు తమకున్న నాలుగెకరములపొలముపంటయుఁ జెఱలో నున్నతమ్మునకు దమ్మిడీ యీయకుండ ననుభవించుచుఁ, జెఱవదలి రాఘవరావింటికి రాఁగానే మగఁడు పెండ్లము బిడ్డలును గలసి పది రోజులలో రాఘవరావు నింటినుండి సూటిపోటిమాటలతోఁ దఱిమిరి. రాఘవరావత్తవారియింటికిఁ బోయి వారముదినములుండెను. చెడి యత్తింటికిఁ బోరాదన్నట్లు రాఘవరావున కచటియునికియు నేవగింపు కలిగించెను. భార్యాసంయోగ మొక్కటియే యతని కచటఁ గలిగిన మనశ్శాంతి. పోయి బెజవాడలో సూర్యపతియింటి వద్ద నుండవచ్చును. రాఘవరావు కొంత దేశోద్ధారకమైన కార్యము గూడఁ జేయవలయునని. సుబ్బన్నపేటలో ధర్మారావున్నాఁడు. అది మద్యపానము విరివిగా జరుగుచోటు. అచటికేఁగినచోఁ బ్రచారము చేయవచ్చును. మిత్రునియింట నుండవచ్చును.

రాఘవరావు ధర్మారావునింటనుండుటచేతఁ బోలీసువా రతనిని గూఢచారదృష్టిలోఁ జూచుచుండిరి. ధర్మారావునకు, మద్య

మనమునకు బంధుత్వము ఖద్దరువఱకే. ఊరిలోని యిన్స్పెక్టరు, మ్యాజిస్ట్రేటు, తహసీల్దారులు ధర్మారావు నెఱుఁగుదురు. అతఁడు కవి యనియు, గ్రామములోనిపలుకుబడి యతని కొక విచిత్రమైనది కలదనియు వారికిఁ దెలియును. చంద్రారెడ్డి యతనికి స్నేహితుఁడు. అతఁ డుద్యమములో నెక్కువ జోక్యమునకుఁ బోఁడు. ఎవరో మిత్రుఁడు వచ్చి యతఁడు వానియింట నుండుట—యీ హేతువులచేత ధర్మారావునందు దోషముగాఁ బరిగణింపఁబడలేదు. రాఘవరావు మిత్రునింట భోజనముమాత్రము చేయును. రాత్రులం దెప్పుడో వచ్చి యరుఁగుమీఁదఁ దనకై యేర్పడిన మంచముమీఁదఁ బరుండును. తక్కినయపుడెల్ల గ్రామముమీఁదనే తిరుగుచుండును. పేఁట పట్టణమైనంతనే చాకలులందఱు ప్రతిదినము గుడ్డలుదుకుట మానివేసిరి. ప్రతిదిన ముదికినబట్టలు కట్టుకొనుటకన్న జనులకు ఇస్త్రీచేసినమడతలు కట్టుకొనుట యలవాటైనది. పూర్వదినము ధరించినవస్త్రములే మఱుదినము ధరింతురు. అవియే మాసిపోవువఱకుఁ గట్టుకొందురు. విడిచినగుడ్డ మఱలఁ గట్టుకొనుట పూర్వపురోజులలో నసహ్యముగా నుండెడిది. ఈ రోజులలో నిస్త్రీచేయని బట్ట కట్టుకొనుట యసహ్యము. ధర్మారావు గృహములో మాత్రము పూర్వాచారమేయున్నది. ఇచ్చటికి వచ్చినతరువాత రాఘవరావునకుఁ బ్రాణము సుఖ మనిపించెను. నరసారావుపేఁటనుండి తాడిలోఁతు బావులవద్దనుండి సుబ్బన్నపేఁటకు బారలోఁతు బావులవద్దకు వచ్చెను. తెల్లవారకముందే సుఖముగా స్నానముచేయును. చాకలి యుదికి తెచ్చిన మడతను కట్టుకొనును. పదిగంటలకుఁ జక్కఁగా భోజనము చేయును. ఒకకూర, గేదెపెరుగు ప్రతిదినమును దప్పక యుండును. రాత్రికి సుఖముగా నిద్రించును. రెండేండ్లతఁడు చెరసాలలోఁబడిన కష్టమంతయు సుబ్బన్నపేఁటలో రెండు నెలలలోఁ దీరెను. రాఘవరావు గ్రామము వెంటను బోవును. ప్రతియింటికిఁ బోవును. ఆ యింటిలోని సంగతులు కనుగొని, మద్యపాయు లెవరైనయున్నచో వారికి బోధించును. వీధులలోఁ బెద్దపెద్దసమావేశములుచేసి పోలీసువారిప్రాణములకు, తనప్రాణమునకు నలజడి తెచ్చుకొనఁడు. అడప

తడప ధర్మారావుకూడ నతనివెంటఁ బోవును. ధర్మారావు దృష్టి మాత్రమే; వాగ్మి రాఘవరావు.

కోటయందునుండి రోడ్డు దక్షిణముగా బెజవాడకుఁ బోవును. ఆరోడ్డునకు రెండువైపులను గ్రామ మున్నది. పేదకొంపలన్నియు రెండుపేటలుగ విభజింపఁబడెను. రోడ్డునకుఁ దూర్పునున్నభాగ మొకటి పడమరనున్నభాగ మొకటి. తూర్పుననున్న భాగమంతయు గూడెములు, మిషనరీపేట, కలాలీలయిండ్లు. పడమరనున్న భాగము నందు సినిమాహాలు, దానివెనుక పట్టణము సర్దు, బేదవారలకొంపలు రాఘవరావు పనిచేయునది యచట. ధర్మారావును, రాఘవరావును గలసి యొకనాఁటిసాయంకాలమున నచ్చటికిఁ బోయిరి. అం దొక పూరిపాక యున్నది. లోపల హార్మనీ వాయించుచుండిరి. ఆ యిల్లు చూపించి రాఘవరావు 'ఇది యొక చిత్రమైన సంసార' మనెను. ఇద్దఱును లోనికిఁ బోయిరి. లోన నొక ముసలిది యున్నది. దాని కేబదియేం డ్లుండును. ఎన్నఁడును నూనె రాయనితల, మాసిన చీర, విధవరాలు, చేతికి గాజులుగూడ లేవు. చూచుటకు దయ్యమువలె నున్నది. నలువదియేండ్ల స్త్రీ మఱి యొకతె. ఆమె చేతికి బిళ్లేరు గాజులు. వారమున కొకసారి సంస్కరింపఁబడుచున్న తల. మాసిన చీరయు, రవికయు, ఆమె మఱొకచోటఁ గూర్చున్నది. పదుమూఁడేండ్లమఱొకపిల్ల. ఆమెకు యౌవనోదయమైనది. తెల్లని చీర, నల్లని రవిక, పక్కపాపట సొగసుకై కత్తిరించిన ముంగురులు. కాలికి పట్టా గొలుసులు, చేతుల కొకజత బంగారపుగాజులు. మఱిమూఁడుజతల జరీగాజులు. మొగముచూచినంతనే నవనాగరికతయంతయు నుట్టిపడు చున్నది. ఆమె హార్మనీ వాయించుచున్నది. "పోయెనయ్యో ఆ ప్రీతి నను బాసి, పోవునపుడు, ఆపొలతి వాల్గన్నులచూపులు, చూపులు కావవి మారునితూపులు—పోయె. పోవునప్పుడు ఆపొలతి పడు సంతాపము, సంతాపమూ కాదది నాపాపము—పోయె" ఈ పాట వాయించుచున్నది. ఇరువురును లోనికిఁబోయినంతనే యామె పాటమాని యొకవికృతపులజ్జ ప్రకటించెను. ముసలిది 'అయ్యగారూ! రం డని రాఘవరావును మఱిమర్యాద చేసెను. ఇద్దఱును గూర్చుండిరి.

రాఘవ—రంగయ్య యెట్లుండును? ముసలి—రాతిరి మఱలఁ దాగినాఁడు బాబూ! త్రాగివచ్చినపుడు వానివ్యవహారమంతయు మీకుఁ దెలియునుగదా! దుర్గమ్మను రాతిరి మఱలఁ జావమోదినాఁడు. మొన్న నే నేను ప్లీడరుగారియింటిలోఁ బనిజేయఁగావచ్చిన జీతము రూపాయన్నఱలో పావలా పెట్టి క్రొత్తగాజులు వేయించితిని. ఆగాజులు బ్రద్దలైపోయినవి. పైగా దానిచేతికి గాజులు గుచ్చుకొని గాయమైనది. చూడుము" అని దుర్గచేయి చూపించెను. ఆ నలుబదియేండ్ల స్త్రీ పేరే దుర్గ. ముసలిదానిపేరు మహాలక్ష్మి. దుర్గ మహాలక్ష్మికూతురు, రంగయ్యభార్య. మహాలక్ష్మియు దుర్గయు నూరిలో ధనవంతులయిండ్లలోఁ బనులుచేయుదురు. ప్రొద్దున సాయంకాలమున బనులుచేసి మధ్యాహ్నము పదిగంటలనుండి రెండుగంటలవఱకుఁ బొగాకుఫ్యాక్టరీలోఁ బూఁటకూలి చేయుదురు. సుబ్బన్నపేటకు బది మైళ్ళుదాఁటి యుత్తరమునను, పశ్చిమమునను మెట్టగ్రామములున్నవి. అచ్చటి పొగాకంతయు సుబ్బన్నపేటకెగుమతియగును. నాగన్నసెట్టి కొడుకు వేంకటరత్నము పొగాకుఫ్యాక్టరీ పెట్టెను. నాగన్నసెట్టిచనిపోయి పదేండ్లయ్యెను. రోజుకు పదిమంది కూలివాండ్రు ఫ్యాక్టరీలోఁ బని చేయుదురు. వచ్చిన పొగాకుపెండెలన్నియు స్త్రీలందరు నాల్గువరుసలుగాఁ గూర్చుండి పెద్దాకుకుఁ బెద్దాకు, చిన్నాకుకుఁ జిన్నాకుగాఁ దీయుదురు. ఇట్లైదారు రకములు తీసి దేనికవి పెద్దపెద్ద బేళ్ళుగా యంత్రముతో నదిమెదరు. అది పై కెగుమతి. వేంకటరత్న మీ వర్తకములో లక్షాధికారి యయ్యెను. మునుపటి పచారీకొట్టు బట్టల కొట్టు తీసివేసెను. ఇందులోఁ జాలలాభము. పల్లెటూరినుండి వచ్చిన పొగాకును జాల తక్కువధరలకు [illegible] కొనును. పల్లెటూరున దిక్కులేక యా ధరలకే వాని కిచ్చి పోవును. కూలి [illegible] స్త్రీకి మూఁడణాలు; పురుషునకుఁ పావలా. [illegible] పొగాకు బర్మాకు, సీమాకు, ఈ తరహా దూరస్థానములకు ఎగుమతి యగుచుండెను. పై కెగుమతిచేయు ధరలు [illegible] నాలుగైదురెట్లెక్కువ. పండించిన [illegible] ధరతక్కువ. ఇట్లుండఁగా ధర్మ [illegible], కొట్టుదగ్గర [illegible], [illegible] బోలెడంత [illegible]. దేశములో నారి, పొగాకు, [illegible]

వర్తకపుఁబంటలుబలిసి, వానికే యిచట వర్తకబాహుళ్యము జరుగుచుండెను. గోధుమలు, జొన్నలు, మొక్కజొన్నలు, తదితరధాన్యములు పరదేశములనుండి యిచటికి దిగుమతీ యగుచుండెను. ఇచటఁ బడిన పంటంతయుఁ దిండికిఁగాక పేదవారు వర్తకపుఁ బంటల మీఁదఁ గూలితో బ్రదుకవలసివచ్చుచుండెను. వర్తకపుఁబంటలు పండించి కాఁపు తక్కువవెల కమ్ముకొని యాహారపదార్థములను ప్రియముగా వెలకుఁ దీసికొనవలసినవాఁ డగుచుండెను. ఇందుచే దేశము బీద యయ్యెను.

మహాలక్ష్మియు, దుర్గయుగలసి నెలకు షుమారు పదునూఁడు, పదునాల్గు రూకలు సంపాదింతురు. అందులో, జేఁ జిక్కినపుడు కొంత, బతిమాలి కొంత, బెదరించి కొంత, కొట్టి మఱికొంత, యెప్పు డెట్లు వీలైన నప్పుడట్లు రంగయ్య పీడించుకొని తీసికొనిపోయి త్రాగును. రంగయ్య కొక కుమారుఁడు పదునాలేండ్లవాఁడు. అతఁడు సినిమాహాలుచుట్టు తిరుగుచుండును. సినిమాలోఁ గొన్నాళ్ళ కతనికి నెలకు నాలుగురూక లిచ్చిరి. సినిమా పండుకొన్నది. ఆ రాబడి తగ్గినది. అతని పేరు కోటేశ్వరరావు. అతఁడు బీడీలకు నెలకు రెండు రూపాయలు ఖర్చుపెట్టును. అది యాడవాండ్రసంపాదనలో నుండియే యీయవలయును. కూఁతురు నరసమ్మకు తలనూనెలు, పిన్నులు, ఊఁలు, సబ్బుబిళ్ళలు మొదలైనవి కావలయును. తిండి బజారునుండి నూకలు తెచ్చుకొందురు. ఏ రోజున కారోజు వ్యంజనములకు నంగలార్తురు. అహంకారములు పట్టరానంత. ఇతరులతోఁ గొంచెము పోట్లాటవచ్చినా తండ్రికొడుకులు కఱ్ఱలు పుచ్చుకొని బయలుదేరుదురు. మహాలక్ష్మి రాఘవరావుతో నన్నది. "బాబయ్యా! వాని త్రాగుడును, వీని బీడీలను లేకున్నచో సంసారము సుఖముగా జరుగును. మా నరసమ్మ యున్నది. దాని నెవరికైనను గొప్పవారి కీయవలయు నని యున్నది. పిల్లకు హార్మనీ నేర్పించినాము. నాల్గవక్లాసు వఱకుఁ జదివినది నీవు వచ్చినతరువాత నయము. కొంచె మన్నము తినుచున్నాము. రంగయ్య పదిరోజులక్రింద నొకసారి త్రాగినాఁడు. మఱల రాత్రి త్రాగినాఁడు. నీ వన్నచో నతఁడు వెఱచుచుండెను. నీవు మఱలఁ గనఁబడి యొకసారి చివాట్లు పెట్టిపొమ్ము.' రాఘవ

రావును, ధర్మారావును బయటకు వచ్చిరి. లోపలినుండి మఱల హార్మనీమ్రోత వినవచ్చెను.

ధర్మా—రాఘవా! ఆ కీర్తన వింటివా? రాఘ—విన్నాను. ఈ పనికిమాలిన నాటకసమాజములవారు దేశమంతయు నిట్టి దౌర్భాగ్యపుఁగీర్తనలతో నింపివేసిరి అందులో నొకనీతి లేదు; సంగీతము లేదు; రసజ్ఞత లేదు. బొంబాయి పోయి పారశీమెట్లు నేర్చుకొని వత్తురు. వాని ననుసరించి యెవనిచేతనో తెలుఁగుపాటలు వ్రాయింతురు. హార్మనీ మ్రోఁతయు, తబలా మ్రోఁతయు నీ కీర్తనలకు వన్నెలు తెచ్చును. ఆ కీర్తనలు దేశముమీఁదవ్యాపించును. దేశములోఁ దిండిలేకపోయినను జక్కని రసజ్ఞానమైనను గలిగి, జనులు బాగుపడెదరేమో యనఁగా మనప్రాణములకీ నాటకసమాజములు వెలసినవి. రంగముమీఁద నెంత యపభ్రంశముగాఁ బ్రవర్తించిన నంతజనాకర్షణ జరుగుచున్నది. జనాకర్షణకు రంగముమీఁదియసభ్యవేషములు హేతువు. దానికిది హేతువు ఈరీతిగా నాటకసమాజముల వారు దోఁచుకొనుచుండిరి. దేశములో దమ్మిడీలేదు. ప్రతినాటకమునకు వేయిరూపాయలుచెల్లుబడి. అపూర్వనటసమ్మేళనమైనచో రెండువేలు. సంపాదించిన నటకు లేమైన బాగుపడుచుండిరా యనిన, వారిసంపాదన యంతయు దుర్వ్యయముక్రింద నరిపోవుచున్నది. ఈరీతిగా దేశమువిద్యచేతను ధనముచేతను దరిద్రమగుచున్నది. సినిమాలకుఁగాని, నాటకములకుఁగాని చక్కనిశాసనములు లేవు. ఫిలిములకు 'సెన్సారుషి'ప్పున్నదనఁగా నది దేశమునందు రాజద్రోహ మనఁబడుదానిని లేకుండ జేయుటకే చేయఁబడుచున్నదిగాని దేశీయులకు రసజ్ఞత్వము, కథాచమత్కారము, నౌచిత్యము మొదలైన విషయములను బోధించుటకు సానుకూలపడుటలేదు. దుర్మార్గులైనకవులు నాటకములు వ్రాయుదురు. వారికి రెండుశబ్దములు సరిగా నతుకుట చేతఁగాదు. వారా, నోరుమూసికొని యూరకుండరు. మనమా, శాస్త్రులము కాము. ఈ వఱదమూలముగా నాంధ్రమహాకవుల కవిత్వములన్నియు మూలఁబడినవి. ఏవిధముగాఁ జూచినను దేశ మెంత దుస్థితిలో నున్నది?

తరువాత వారిద్దఱునుగలసి మఱియొకయింటికిఁ బోయిరి. అదియును బూఁటపాకయే. లోనికిఁ బోవువఱకు నిద్దఱుపురుషులు

రెండుపడకకుర్చీలమీఁద గూర్చుండియుండిరి. ఇద్దఱను జూచినచోఁ గ్రొత్తవారైనచో వారిద్దఱు బి. ఏ. పరీక్షలు ఇచ్చిరేమో యను కొనవలెను. ఇరువది యిరువదియైదులోపల వయస్సుండును. ఇద్దఱును బెద్ద క్రాపింగులు, పట్టులాల్చీలు తొడిగిరి. పైన సర్జికోట్లు కట్టినవి మాసిన గ్లాస్గోమల్లులు, పైన వత్తాకోకలంచు జరీయుత్తరీయములు. దుస్తులన్నియు మాసినవే. కోట్లుమాత్ర మెప్పటి కప్పుడే క్రొత్త. గడ్డములు మాయరాదు. ధర్మారావు, రాఘవరావును లోనికి వచ్చుటఁ జూచి వారు లేచి యిద్దఱిని గూర్చుండుఁ డనిరి. అందులో నొకనిని రాఘవరావు "ఏమోయి! నాగభూషణము, నేను చెప్పిన మాటలు నాకే యొప్పఁజెప్పితివివలె నున్నదే! నేను నిన్నుఁ గాలి లోనికిఁ బొమ్మంటినిగదా! నీవు మరల వచ్చి యీగుడిసెలో నేల చేరితివి? ఈ రెండవయాతఁ డెవరు?" అని అడిగెను. రెండవవాఁడు రాఘవరావువంకఁ జుఱచుఱ చూచెను. వాని పేరు రంగ. రంగ యనియే పిలుతురు. పాశ్చాత్యనాగరకతవృద్ధిపొందినతరువాత దేశములోఁ జాలనామములు ప్రాతిపదికములక్రిందనే చేరినవి. అది యాంగ్లేయసంప్రదాయము. ఒకనికి 'కె. యస్. రామ' అని పేరు. మఱియొకనికి 'కృష్ణ' యని పేరు. ప్రాతిపదికములు పేర్లుగాఁ బెట్టుకొనుటలోఁ జాలయర్థ మున్నది. ప్రాతిపదికమునకు వచనవిభక్తులుండవు. వీరికి నట్లే. వీరు వట్టిపూజ్యపాదులు. మఱికొందరు ధనాఢ్యులు, నుద్యోగస్థులు నది యేమో గొప్ప యనియో, యాంగిలేయమునకు సన్నిహితముగా నుండుననియో తమనామములు ప్రాతిపదికములుగా వదలుదురు. తఱచుగా వారి మనస్సులును బూర్వపాశ్చాత్యభావముల యపరిసంస్కృతము, నపరిచ్ఛిన్నము, నవ్యక్తమునైన యొక కలయికచేత 'పంచకోలకషాయము' వలె నుండును. రంగయు, నాగభూషణము ధర్మారావు నెఱుఁగుదురు. ధర్మారావు లేకున్నచో రంగ రాఘవరావును గొట్టెడివాఁడే. అతనిని గొట్టినచో నభియోగముకూడ లేదని వారందఱకుఁ దెలియును. రాఘవరావిట్టి దెబ్బలు చాల పడియున్నాఁడు. రాఘవరావు ధర్మారావుతో జెప్పెను? "ఇదిగో చూడుము, వీరందఱు పాడైపోవుచున్నారు. వీరి నాదరించు జనుఁడు లేఁడు. వీరికిఁ దిండిపెట్టు దాత లేఁడు. వీరికిఁ

దినుటకుఁ దిండిలేదు. వారిని గురించియు, వీరిని గురించియు వీరు భోజనముచేసి యేదో వచ్చినప్పుడు కాఫీహోటలులోఁ దినుచుఁ బట్టణమువెంటఁ దిరుగుదురు. ఏ విధముగానైన ధనము లభించినచోఁ బోయి త్రాగుదురు. ఇట్టివారే చాలమంది యున్నారు. వీరిలో వీరికి గక్షలు. కొట్టుకొనుచుందురు. పోలీసువారు తీసికొనిపోయి వీరిని శిక్షింతురు. వీరు డబ్బెక్కడో తెచ్చుకొని కల్లు త్రాగవలయును. మత్తెక్కి యొడలు తెలియక కొట్టుకొనినచో దానికొఱకు జరిమానా లీయవలయును. ఇట్టిపరిస్థితి కాలనయుఁ బాలనయు లేదు. ఈ నాగభూషణముతండ్రి ముసలివాఁడు. అతని కేఁబదియేఁడు లున్నవి. వీరు కలాలీలు. అతనికిఁ బక్షవాతమువచ్చి పడిపోయినాఁడు. పూర్వము తాళ్ళెక్కిగీసెడువాఁడు. ఇప్పుడితఁడేమైనను సంపాదించి తెచ్చి పెట్టునేమోయని వానియాశ. ఇతఁడు మంచి తెలివిగలవాఁడు. వడ్రంగముపని బాగుగాఁ జేయఁగలవాఁడు. రెండురోజులు బుద్ధి కుదిరి కూర్చుండి యొకపీఁటయో, కుర్చీయో, యేదియో చేయును. అది తీసికొనిపోయి యమ్మును. వచ్చినడబ్బుతో నలువురు స్నేహితులను వెంటవేసికొని కాఫీహోటలునకో. దుకాణమునకో తయారు. ఏదైన నాటకమైనచో నచటికిఁ బోవుట, యల్లరిచేయుట, దెబ్బలాటలు-ఇట్లున్నది వీరి జీవితము. ఆ కొఱకొఱలాడు రంగను జూడుము. అతఁడెవరో నేనెఱుఁగను. కనుగొనుము. పాము బుట్టలో నుండి బయటకు వచ్చును.''

ఇద్దఱును బతిమాలి బతిమాలి రంగనిచేత నతనికథ చెప్పించిరి. అతనిది గుంటూరువద్ద నొక పల్లెటూరు. వాఁడు చిన్నప్పుడు కొద్దిగా రాగచ్ఛాయగా పద్యము చదివెడివాఁడు. ఎవరో నాటక సమాజమువారు వానిని దగ్గఱకుఁదీసి, వానిచేత నంబరు ౧ కృష్ణుడు నంబరు ౧ ప్రహ్లాదుఁడు వేయించిరి. రెండవ నంబరుదాఁక వచ్చెను. వానిపేరు చెప్పినచో డబ్బు కురిసినది. వానికి బీడీలు, సిగరెట్లు మోపైపోయినవి. పదునైదేఁడులు వచ్చునప్పటికిఁ గుఱ్ఱవానికి వారాంగనా గృహములు నివాసభూములయ్యెను. మోటారులు విహారయానము లయ్యెను. వానికీర్తి పదిబస్తీలు పట్టలేదు. అంతలో నొక నెలతిరుగకముందు రంగముమీఁదికి వాఁడవతరించినంతనే నలుగురు

లేవిడీలు కొట్టిరి. ఇంక వాని బుద్ధిబలము మూర్ఖమొక్కఁ డేర్పడెను. తన ప్రతిభ వెలిగినవాళ్ళలోఁ దన్నెఱిఁగిన జనము సంఘమునందుఁ దనతో సమానప్రతిపత్తిగలవారు వారందఱు మిత్రులైరి. వారితోఁ గలసి జూదమాడును. నాటకములకుఁ బోవును. నాటకములమీఁద నతఁ డొక పెద్దవిమర్శకుఁడు: "చా, వాని కేమి సంగీతము వచ్చును? ఛీ. వీఁడేమి నటకుఁడు?" లోకమంతయు వానిముందు పరాభూతమై పోయెను. నాఁడు చెప్పినంత సేపు వానియవివేకమునకుఁ దద్ధృదయగతాహంకారమునకు వానిబేలతనమునకు రాఘవరావు ధర్మారావులు నవ్వుకొనిరి. జాలిపడిరి. రాఘవరావు నాగభూషణముతో 'నీ విట్లు కాదు. వీరి నెఱుఁగుదువా?' యనెను.

నాగ—ఎఱుఁగుదునండి, ధర్మారావుగారు. రాఘవ—ఇంక నీ వే పనులు చేసినను నాయన నడిగి చేయవలయును. ఆ పనులు వీరు చూచుచుండఁగా నమ్మవలయును. వచ్చిన డబ్బాయన చేతి కీయవలయును. అట్లుకాక చేయరాదు. నేఁడు రాత్రికి మీయింటికి మే మిద్దఱము వత్తుము. అచ్చట సర్వమును జెప్పెదము.

అని, రంగతో 'నిన్ను మఱలఁ గలసికొందును' అని చెప్పి యిరువురును వెడలిపోయిరి. అంతలోఁ బ్రొద్దుక్రుంకవచ్చెను. ఇరువురును 'పట్టణములు ప్రబలి యిట్టిదౌర్భాగ్యజీవుల నెంతమందిని దయారుచేసినవి' యని దుఃఖించిరి. అంతలోఁ జీకటులు గ్రమ్మెను. చీఁకటుల కేమి? కడచిన పాతికయేండ్లుగా నొకనాఁ డున్నట్లింకొకనాఁ డుండను. ఒకచోట నున్నట్లింకొకచోట నుండవు. కాళరాత్రికిఁ దోఁబుట్టువులై, యంజనపర్వతములోని పురుగుతొలిచి చిక్కగా రాలిన పొడియై సర్వదిక్కుల నావరించెను.

మఱునాఁడు రాఘవరావు మఱల నరెస్టు చేయఁబడెను. ఈ రెండు నెలలలో నప్పుడప్పుడతఁ డుద్యమప్రచారముచేయుచు నుపన్యాసము లిచ్చెను. ఆ యుపన్యాసములు రాజద్రోహకరములుగా నున్నవి. ఈ వార్త ధర్మారావు బాపట్లకు, నరసారావుపేటకును దెలియఁజేసెను. అరుంధతి తమయింట నున్న యతని కిట్టి యాపద కలిగినందుకు విచారించెను. మనసులోఁ దనకుఁ దానే యోదారెను. వారమురోజులైనతరువాత నొకపెద్దమనిసి ధర్మారావును జూచుటకు

వారియింటికి వచ్చెను. ధర్మారా వతనిని గౌరవించి, 'తమ రే పని మీఁద దయచేసి' రని యడుగఁగా. నాయన కొన్ని కాగితములు చూపించి 'తమరు మంచి కవులఁట. నా కీ కాగితములు తెలుఁగు లోనికిఁ జేసి పెట్టించవలయు'ననెను. ధర్మారావు కాగితములన్నియుఁ జూచెను. ఆ కాగితములన్నియు మితపాన ప్రచారమునకు సంబంధించినవి.

ధర్మా— మీ పే రేమండి? ఆయన— రామకృష్ణయ్య. ధర్మా—తమరి దేయూరు? రామ—గుడివాడ. మేము కమ్మవారము. నా కేఁబదీ యెకరముల పొల మున్నది. పదివేల ఖాయిదా యున్నది. ధర్మా—తమ రీ పని యేల చేయుచున్నారు? రామ—ఇది దొరతనమువారి పని. దొరతనమువారు మద్యపాననిషేధప్రచారముచేయుటకు రెండులక్షలు మంజూరు చేసిరి. అందులో మనకు నలుబదివేల రూపాయలు వచ్చెను. మనజిల్లాకు నన్నీ ప్రచారము కొఱకు నియమించిరి. ధర్మా—తమకు నెల జీత మెంత? రామ—నూటయేఁబది రూపాయలు. ఎచ్చటకు వెళ్ళినను మొదటితరఁగతి రైలుచార్జి. ధర్మా— మీ రీ ప్రచార మెట్లు చేయుచుండిరి? రామ—నాక్రింద నింక నిద్దఱుద్యోగు లున్నారు. వారికిఁ జెఱియేఁబదియు జీతము. వా రూరికిఁబోయి యుపన్యాసము లిచ్చుచుందురు. కల్లుపాకలవద్దకుఁ బోయి కాదు, గ్రామములోనే యిత్తురు. శాంతిభంగకరముగాఁ గాకుండ నుపన్యాసము లిప్పింతుము. ఈ పుస్తకములన్నియుఁ దెలుఁగుచేసి యివి పంచిపెట్టుదుము. అప్పు డుపన్యాసములే యక్కఱలేదు. ఈ పుస్తకము లచ్చువేయుటకు రెండుమూఁడు వేలు వ్యయమగును. ధర్మా—పుస్తకము లెన్నివే లచ్చువేయించెదరు? నాలుఁగైదువేలు వేయించెదము. ధర్మా—ఐదువేలకు రెండు వేలరూపాయ లక్కఱలేదు. రామ—తమరు దీనిని తెలుఁగుచేయించి పెట్టుఁడు. మీరు చాల పండితులఁట. కవులఁట. మీ ప్రఖ్యాతి విని తమదర్శనమునకు వచ్చినాఁడను. ధర్మా—అట్లే చేసెదను. నాటి చేయుటకుఁ గాలముపట్టును గదా? రామ—చిత్తము. ఒకవారము రోజులలో మఱల వచ్చెదను.

ధర్మారావుకు రాఘవరావు రామకృష్ణయ్య ప్రచారకుల లోని తారతమ్యము మనసుకు స్ఫురించెను. రాచరికమువారు చాల దయామయులు. ప్రచారమునకు నలుబదివేలరూక లిచ్చిరి. తెనుఁగు దెలుఁగుజేసిపెట్టినందుకు రామకృష్ణయ్య యేమి యిచ్చునో? రామకృష్ణయ్య 'విగ్రహపుష్టి, వినాయకనష్టి' నెలకు నూటయేఁబది రూకలు జీతము. మొదటితరఁగతిప్రయాణపు ఖర్చులు. రామకృష్ణయ్య యబద్ధము చెప్పునా? నిజమేనా? సగానికి సగమైన నిజమై యుండదా? దొంగలును,దొంగలును గలసి యూళ్ళుపంచుకొనిరఁట.

వారమైనతరువాత రామకృష్ణయ్య మఱల వచ్చెను. ధర్మారావు "ఇంకను జేయలేదండి" యనెను.

రామ—అట్లైనచో నెట్లు? మఱి యీపని తొందరగాఁ గావలయును. మీ రీపని చేసిపెట్టిరనినచో దొరతనమువారికిఁగూడ మీ మీఁద దయగలుగును. ధర్మా—మా బావమఱఁది పోవుచున్నాఁడు. అతని నొక ప్రచారకునిగాఁ దీసికొందురా? రామ—ఇదివఱ కున్న యిద్దఱనే తీసివేయ నెంచుకున్నాము. పుస్తకము లచ్చైనచో నింకఁ బ్రచారకులే యక్కఱలేదు. నేనే పోయి పుస్తకములు పంచిపెట్టెదను. ధర్మా—ఈమాత్రము తెలుఁగుచేయుటకు నే నెందుకు? తమరే చేయవచ్చును. తెలుగుమాత్రము చేయుట యెందులకు? ఈ పుస్తకములే పంచిపెట్టవచ్చును. ఇవి యిదివఱకే యచ్చైయున్నవి కదా!

ఈ మాటలు రామకృష్ణయ్య కర్థమయ్యెను, "చిత్తము, చిత్తము. మీరు చెప్పినమాట బాగుగానున్నది. అట్లే చేయుదు" మని యా పుస్తకములు తీసికొని వెనుకకు మఱలెను.

ఒకనాఁడు ధర్మారావు వాహ్యాళిపోవుచుండఁగా రాధాపతి కనిపించెను. రాధాపతి ధర్మారావును బలుకరించెను. ధర్మారావతనిని జాలసేపటి వఱకు గుర్తింపలేకపోయెను, గుర్తించినంతనే యేమో కాని వింతగా నుండెను.

రాధాపతి ఎత్తుగా నేదో చెప్పుచుండెను. ధర్మారావు స్మృతి తెచ్చుకొని, 'యోహో! మీరా' యని 'యీ యూ రెందుకు వచ్చి'రనెను. రాధాపతి 'యిచట మాకు బంధువు లుండిరి. వారిని జూచిపోవుటకు వచ్చితి' ననెను. ధర్మారావు 'ఎవరా బంధువులు?' అనెను. రాధాపతి 'ఉన్నారు లెండి!' అనెను. ధర్మారావునకు మఱల నడుగవలె

ననిపించలేదు! రాధాపతి యేదో పనియున్నట్లు వెడలిపోయెను.

మఱల నాలుఁగురోజులైనతరువాత రాధాపతి యింకొకసారి కనిపించెను.

ధర్మా—మీ యి ల్లెక్కడనండి? రాధా—సినిమా వెనుక.
ధర్మా—సినిమా వెనుకనా? అచ్చట బ్రాహ్మణు లెవరును లేరే!
రాధా—లేరు. నేనొక్కఁడనే నివసించుచున్నాను. ఆ నాఁటి కిద్దరును విడివడిపోయిరి. మఱల రెండునాళ్ళకుఁ గలసికొనిరి. ధర్మారావు 'మా యింటికి దయసేయుదురా?' యనెను. రాధాపతి 'నాకు గొంచెము పనియున్నది. చేపువత్తు' నని వెడలిపోయెను. రాధాపతి గొప్పకవి యని దేశములోఁ బ్రఖ్యాతి పొందినవాఁడు. అందుచేత గాలేజిలోని విద్యార్థులందఱు నతనిని గౌరవించుచుండిరి. 'మిత్రబృంద' మని యొక కవులసభ పెట్టి, యా సభ రాధాపతి నడపుచుండెను. 'మిత్ర' యను నొకపత్రికను వారు సాఁగించుచుండిరి. రాధాపతి తత్పత్రికా సంపాదకుఁడు. అందుచే నతనిపేరు లోకములో నందఱికిఁ దెలియును. నాలుఁగేండ్లక్రిందట పేటలో నొకచిన్న ముద్రాశాల సేతుపతి యను నొకాయన స్థాపించి యూరిలోనున్న కాలేజి, జాతీయకళాశాల, పురపాలకసంఘము, కో-ఆపరేటివుబ్యాంకు పనులన్నియుఁ దానే చేయుచుఁ గొంతధనము సంపాదించెను. రెండేండ్లు గడచినతరువాత 'తాలూకాపత్రిక' యని యొక పత్రిక పెట్టెను. ముద్రాశాలమీఁదవచ్చిన లాభము పత్రికలో వెనుకకుఁ దీసెను. రెండేండ్లగువఱకు చందాలిచ్చినవా రెవరును గన్పించలేదు. ఊరిలోనున్నపని పూర్వమువలెఁ దనకు వచ్చుటలేదు. అచ్చువేయుట సరిగాలేదని కాలేజివారును, పురపాలక సంఘమును దమ పని బెజవాడలోఁ జేయించుకొనుచుండిరి. సినిమాపడిపోయి యీ పని చెడిపోయెను. సేతుపతి యన్నివిధముల దివాలా తీసెను. ముద్రాశాల యమ్మకమునకుఁ జూపెను. రాధాపతి సహజముగా విద్యావ్యాప్తికలవాఁడు. ఆస్తికలవాఁడు. ఆస్తియంతయుఁ బోయెను. ఇప్పుడు బడుగుదాసరివలెనున్నాఁడు. కాని ముద్రాశాల కొనవలయు నని యాశయున్నది. దాని యెత్తులు వేయుచుండెను. కాని పత్రిక పెట్టవలయునని, 'మిత్ర'సుబ్బన్న పేటనుండి నడుపవలయునని,

ఒకనాఁడు ధర్మారావు రాధాపతి తన యింటికి రమ్మనెను. ధర్మారావు వెళ్ళెను. తీరా పోయి చూచునది కది పూర్వము మంగమ్మ యున్న యిల్లు. ధర్మారావు చకితుఁడై యంతదూరము వచ్చినతరువాత బాగుండ దని లోనికిఁ బోయెను. ఇల్లంతయుఁ బరిశుభ్రముగా నుండెను. ఇంటిలోఁ జినిగిన కాగితపుముక్కయు నెచ్చటను బడిలేదు. రెండువాసనులతోఁ జేసిన యఱలమీఁదఁ బుస్తకములమర్పఁబడియుండెను. సంస్కృతాంధ్రాంగ్లేయహిందీవంగగ్రంథములు విడివిడిగానమర్పఁబడియుండెను: రెండుమూఁడు పడకకుర్చీలు, నాలుగైదురకముల పాదరక్షలు, రోజుచెక్కతోఁ జేయఁబడిన యొక బల్లయు, దానిమీఁద నద్దము, దువ్వెన, తలనూనెసీసా, మంచిగంధపు ఫ్రేములో నమర్చఁబడియుండిన యొక స్త్రీ ఛాయాపటమును గలవు. ఇంటి పరిశుభ్రతకు, వస్తువులన్నియు నొక క్రమముగా నమర్పఁబడి యుండుటకు ధర్మారావు చాల సంతోషించెను. అతఁడొకకుర్చీలోఁ గూర్చుండెను. 'ఆ ఛాయాపట మెవరి' దని ధర్మారా వడుగఁగా రాధాపతి దాని నతనిచేతికిచ్చెను అది మహారాష్ట్రగాయని బిజిలీది. ధర్మారావునకు జ్ఞాపకమువచ్చెను. ధర్మా—మీ రీమెను బెండ్లి యాడుద మనుకొంటిరి. పెండ్లి యాడిరా? రాధాపతి—అదియేమియు లేదు. ఒక యేఁడాది వారివెంటఁ దిరిగివచ్చితిని. వారు మన వాను కొన్నంత సంగీతవిద్వాంసులు కారు. అ దొక దశ. ఆ పిచ్చిలో వారివెంటఁ దిరిగితిని. అపుడు ధనము చాల వ్యయపఱచితినినుమండీ. మనభాష వేఱు; వారిభాష వేఱు. అట్టిదానిని బెండ్లిచేసికొని మన మేమి సుఖపడుదుము? డబ్బుమట్టుకు ఖర్చుపడ్డాను లెండి. అది యొక వేళ. ''తే హి నో దివసా గతాః''

కొంతసేపుండి ధర్మారా వింటికి వచ్చెను. ''తే హి నో దివసా గతాః'' యేమిటి! పరమపవిత్రమైన మాట తెచ్చి, యప్రశస్త సందర్భమున నతికినాఁడు! ఈ కథవెనుక నేదో రహస్య మున్నది. రాధాపతి దాఁచినాఁడు. ఇతఁడు మంగమ్మ యింటిలో నేల యుండెను? మంగమ్మ యితని కేమైనను జుట్టమా? అయినచో సంబంధములోఁ గొంతవఱ కౌచిత్యము లేకపోలేదు."

మఱునాఁడు కుమారస్వామి వచ్చి ధర్మారావును 'దమరు మా యింటికొకసారి రావలయు' ననెను. కుమారస్వామి యిప్పుడు జాతీయకళాశాల వదలి అలీఘరువిశ్వవిద్యాలయములోఁ బ్రవేశపరీక్ష గడచి, సుబ్బన్నపేఁట కాలేజిలో ఎఫ్. ఏ. చదువుచుండెను. శ్యామలయు నట్లే. వారి యిద్దఱి కింకను పెండ్లి కాలేదు. ధర్మారావు 'పని యేమైన నున్నదా'యని యడిగెను. కుమారస్వామి 'యున్నది, దయచేయుఁ' డని తీసికొనిపోయెను. పంకజమ్మయు, శ్యామలయు 'ఏమండీ! ఎప్పుడును మా యింటికే రా' రని ధర్మారావును సంభావించిరి. శ్యామల ధర్మారావువద్దఁ దెలుఁగులు చదువుకొనెను. తెలివిగల పిల్ల యగుటచేత ధర్మారావున కామెమీఁద సుంతయభిమానము కలదు. ఆమెకు నతనియందుఁ జనవుకలదు. పంకజమ్మ యిట్లనెను. "చూచినారా, మీ శిష్యుఁడు పెండ్లి యిప్పుడే చేయుమని పట్టుపట్టుచున్నాఁడు. నిరుడేకదా వీరిద్దఱు ప్రవేశపరీక్ష యైనది. ఈ యేఁడే ఎఫ్. ఏ. లోఁ జేరి. బి. ఏ. పరీక్ష యైనతరువాత వివాహము తామరే చేసికొనవచ్చుఁగదా! ఇంతలో మునిగిపోయిన దేమి? ఇద్దఱును గలిసియే యుండిరాయెను" కుమారస్వామి—అది కాదండీ! నా కెందుకో వివాహము చేసికొనవలయునని యున్నది. నేను చేసికొందును. పంకజమ్మ—దానికిఁ గారణము నాకుఁ దెలియును. ఇంటివద్దఁ దల్లియుఁ దమ్ములు నానాకష్టములు పడుచున్నారు. పెండ్లి యైనచోఁ దనకుఁ గొంత యధికారము కలుగునుకదా! వారి కేదో కొంత పంపించుచుండవచ్చునని. నేనుమాత్ర మప్పుడప్పుడు సాహాయ్యముచేయుటలేదా? నెలనాళ్లైనది. యేఁబదిరూకలు పంపించి. కుమా—ఆ యేఁబదిరూకలు వారి కున్న యప్పులు తీర్చుటకే సరిపోయెను. మఱల నిల్లు గడవవలదా? పంక—నేనుమాత్రము డబ్బు ప్రోఁగుపోసికొని కూర్చున్నానా? కుమార—అదిగో చూడండి! తనకూఁ దనకు జీతము కట్టవలయునన్నచో నిట్లనునా? పంక—నీకు జీతముకట్టుటకుమాత్ర మంటినా? కుమా—అటెంపంతయు నెందుకు? మీరు శ్యామలను నా కిత్తు నన్నారుగదా! ఆ మాటమీఁద నెను కకు బోరుకదా! శ్యామల యెట్లైనను నా భార్యయేకదా! అది యిప్పుడైననేమి, యింక నాలుఁగేండ్ల కైననేమి? పంక—పెండ్లి

మైనచో దాని నగ లమ్ముదమనియా? కుమా—దాని నగలమ్ముదమని గాదు. హరిశ్చంద్రుఁడవలె దానినే యమ్ముదమని.

అందఱును బకపక నవ్విరి. అంతటితో మాటలు నవ్వులలోనికి దిగెను. అసలు పిలిచిన వ్యవహార మట్టులుంచి లోకాభిరామాయణము మొదలుపెట్టిరి. పంక—రాధాపతిగారిని మీరెఱుఁగుదురా? ధర్మా—కొంచెము మెఱుఁగుదురు. శ్యామ—ఆయన యిప్పుడీ యూరనే యున్నారు. ధర్మా—నేను రెండు మూఁడు సారులు చూచితిని. పంక—అయినచో వారికథయంతయు మీకుఁ దెలియునన్నమాటయే. ధర్మా—నాకుఁ దెలియదే! పంక—చాల కథ యున్నది. మొదట మహారాష్ట్రపుఁ బిల్ల; తరువాతనొక లేవఁదీసికొనివచ్చిన యావిడ; ఇప్పుడు మన గ్రామదేవత. ధర్మా—అనఁగా? కుమా—[తెగనవ్వుచు] మంగమ్మండీ, మంగమ్మ, రామేశ్వరి. ధర్మా—కొంచెము వినసొంపుగానే యున్నది. చెప్పండి.” శ్యామల యచటనుండి లేచిపోయెను. కుమారస్వామియుఁ గదలిపోయెను. ధర్మారావునకుఁ బోవలె ననిపించినది. కాని పంకజమ్మ కథయారంభించుటచేత నడ్డపడ నొల్లక, కాదనక కూర్చుండెను.

పంక—“ఏజెనిమిదేండ్ల క్రిందట మనదేశమునకు బొంబాయినుండి యెవరో సంగీతపాటకులు వచ్చిరి. వారిలో నొకపిల్ల యున్నది. ఆమెను రాధాపతిగారు వరించిరి. ఈయన వారివెంటఁబడెను. వారును జాల తెలివికలవారు. ఈరీతిగా నాపిల్ల కొఱకు వచ్చినవారు వారికడ నిదివఱకే ముగ్గురు నలుగురుండిరఁట. ఆమె తండ్రి లౌక్యముగా వీరినందఱిని గౌరవించుచు నొకరితోనొకరు మాటాడకుండఁ జేయుచు వీరందఱిచేతను బనులు చేయించుకొనుచుండునఁట. ఆ అమ్మాయి పేరు బిజిలీ. వీరందఱును భోజనము వారియింటనే. అపుడప్పుడామెతండ్రి వీరివద్ద డబ్బప్పుతీసికొనును. అది మఱల మామగారిని వీ రడుగుటకు నోరాడదు. ఆమెతో వీరెవ్వరును బ్రసంగించుటకే వీలులేదు. తండ్రి వీరితోఁ గలసియేయుండును. సంగీతసభలు జరిపినపుడామె సంగీతముపాడి లోని కవతరించినంతనే వీరందఱామెకు పేక్ హాండు లిచ్చెదరు, సంగీతమును బ్రశంసించి మెచ్చుకొనుచు నుంగరములుకాని, వెలగలచీరలుకాని చదివింతురు, రాధాపతి యా

రీతిగా వారివెంట యేండాది తిరిగెనంట. ఈ యేండాదిలో నతండు వారికి లక్షాధికారివలెఁ గనిపించవలెనని యెంక్కువైనను వ్యయము చేసినాఁడంట. ఎనుబది యెకరముల నిక్షేపమువంటిమాగాణియొక్కడి దక్కడికి తెగనమ్మివేసెను. ఆ యొక్కయేండాదిలోఁ బాతిక వేలు ఖర్చుపెట్టెనంట నాకీ సంగతియంతయుఁదెలియదు ఆయనకునాకును బరిచయముకూడ లేదు. ఆయన స్నేహితుఁడొకఁ డున్నాఁడు-రంగావధాని యని. ఆయనది నెల్లూరు. నేను మొన్న మాపొలముమీఁదిడబ్బు తెచ్చుకొనుటకు నెల్లూరుబోఁగా నిదియంతయు రంగావధాని కథ వలెఁజెప్పెను. ఒకనాఁడు రాధాపతి యీ పిల్లతండ్రిని యడిగెనంట. అతఁడు 'మీ యీ స్థితియప్పులవైనమంతయు నాకు వ్రాసియి' మ్మన్నఁగా నీయన తా నొక జమీందారునని యుఁ దనకుఁ బదియూళ్ళున్నవనియుఁ జెప్పెనంట. ఊళ్ళవైనము వ్రాసియిమ్మనుచు నూజివీఁడు తనదే నని వ్రాసెనంట. ఆమెతండ్రి వాకబుచేయఁగా నూజివీఁడు రాధాపతిదే నని తెలిపెను" అని పంకజమ్మ నవ్వ నారంభించెను. ధర్మారావును నవ్వెను. ధర్మా—తరువాత నేమయ్యెను. పంక—ఏ మైనది? వారివద్ద నొక వస్తా దున్నాఁడంట. వాఁ డొక రోజున కఱ్ఱపుచ్చుకొని రాధాపతివెంటఁబడినాఁడట. ఈయన 'బ్రతుకు జీవుఁడా' యని బయటపడి హైదరాబాదుబండి యెక్కెను. అప్పటికి మూన్నాళ్ళనుండి యితనికిఁ దిండిలేదంట. చేతిలోఁ జిల్లిగవ్వలేదంట. అంత జుట్టు ముడివేయుటకువీలులేనిది మూన్నాళ్ళు దువ్వకపోయిన నెట్లుండునో యూహింపుకొనుడు." పంకజమ్మ పగలఁబడి నవ్వసాఁగెను. ధర్మారావు మొగము చిట్లించుకొనెను. మఱల కథ యారంభింపఁబడెను. "ఆయన యదృష్టమా యని వాడిస్టేషనులో నతని కొకయువతి కనఁబడెను. ఆమె యాంధ్రస్త్రీ. కాశీవిశ్వవిద్యాలయములో నామె యఫ్.ఏ. చదువుచుండెనంట. ఇప్పు డామె ఏలూరులో స్త్రీల కొ్రియినింగు పాఠశాలలో నుపాధ్యాయినిగా నున్నది. ఆమె యితనిని జూచి 'మీ రెవ' రని యడిగెను. అతఁడు తనపేరు చెప్పగానే యామె యితనిపే రిదివఱకే యెఱిఁగియున్నది, గానఁ జాల గౌరవించి, యిద్దఱును బెజవాడకే వచ్చుచుండిరి, గాన కథా ప్రసంగములోనికి దిగిరి. రాధాపతి యెత్తులమారి. గంటసేపటిలో

పద్మావతి యాయనను తానూహకన్న గొప్పవాఁడనుకొనెను. ఆమె కొనితెచ్చుకొన్నఫలములన్నియుఁ బ్రభు వారగించెను. ఒకస్టేషనులో కాఫీ త్రాగెను. ప్రాణములు చేరుకొన్నవి. మఱి రెండుస్టేషనులు గడచులోపల పద్మావతి ప్రాణములకు రాధాపతికన్న రసికుఁడుగాని, ధనవంతుఁడుగాని, కవిగాని, పండితుఁడుగాని, పేరుమోసిన యాంధ్రుఁడుగాని మఱియొకఁడు లేఁడని యనిపించెను. ఆమెకుఁ జదువు మఱి రెండేండ్లు మిగిలెను. ఆమఱి రెండేండ్లు రాధాపతిఖర్చుమీఁదనే చదువు గడచెను. అతఁడు కాశీనగరమునకుఁ బోవుచు వచ్చుచుండెను. ఇద్దఱును రెండవతరఁగతిలోఁగాని ప్రయాణమే లేదఁట. వారు వివాహము జేసికొందు రని లోకమునందు వ్యాపించెను. పద్మావతి చాల చాల చిత్రకత్తె. రెండేండ్లు రాధాపతి చెప్పినట్లెల్ల వినెను. తరువాత నామె ఎల్. టి. కూడఁ బరీక్షయిచ్చెను" అని పంకజమ్మ సిగ్గభినయించ నారంభించెను. ధర్మారావు 'తరువాత నేమైన' దని యడిగెను. "ఆమె గర్భము ధరించెను అప్పటినుండి పద్మావతికి భయమైనదఁట. రాధాపతి 'భయ మెందులకు? మన మిద్దఱము వివాహ మెట్లును జేసికొందుముగదా!అనెను.' పద్మావతి రాధాపతిని వివాహముచేసికొనవలె నని లేదు. కాలక్రమేణ రాధాపతి సర్వవ్యవహారము నామెకుఁ దెలిసెను. అతని కించుమించుగా నప్పటి కేఁబదివేలయ ప్పయ్యెను. క్రొత్తయప్పులు పుట్టుట లేదు. ఇందులోఁ బదునేనువేలు మార్వాడీ యప్పు. అన్నిటికన్న నది ముందఱ న్యాయస్థానమున దాఖ లగునట్లు తోఁచెను. ఇది యాస్తివిషయము. అతఁడు పట్టభద్రుఁడైనను నుద్యోగముచేయుట కభిలషించఁడు. 'మొక్కయై వంగనప్పుడు చెట్టయి వంగునా?' యన్నట్లు వ్యవహార మింతదూరమువచ్చినతరువాత నుద్యోగ మేమిచేయును? రాధాపతి సంస్కృతాంధ్రములు పెద్దదియుచదివినవాఁడుగూడఁగాదని యామెకుఁ దెలిసెను. పాండిత్యమునందు బహిరాడంబర మెక్కువ, లోఁతుతక్కువయు నఁట. అంతేనా? మీకుఁ దెలియును కదా?" అని యామె యనెను. ధర్మారావు "నా కాయనతోఁ బరిచయము చాలకొద్ది. నే నాయనను గలిసికొనుట కిది రెండవసారి. పరిచయ మన్నది యీయూరువచ్చినతరువాతనే జరిగినది. లోకము

పండితుఁ డనియే చెప్పుకొందు" రనెను. ఇంతలో శ్యామల దీపము తెచ్చెను. ధర్మారావు 'ఇంతకు నాసంబంధము చెడిపోయె నన్న మాట' అనెను. పంకజమ్మ "అంతియే కాదండీ! ఆమె చెన్నపురి పోయి యచటఁ బ్రసవించి పిల్ల నెవరికో యిమ్మివచ్చెను. ఆ సంగతి యెవరికిని దెలియదు. ఆమె తరువాత నితఁడు వివాహప్రస్తావన చేసి నప్పుడు 'నే నాజన్మ బ్రహ్మచారిగా నుందును. వివాహమాడ'నని చెప్పెనఁట. ఇతఁడును జాలవిధముల నామెను బెదరించి లొంగ దీయఁజూచెను. కాని యీ కాలమున దక్కువ తిన్నవా రెవరు? చివర కిద్దఱకుఁ బెడిసిపోయెను. ఈయనయాస్తియంతయు ఋణదా తలు వేసికొనిపోయిరి. ఈయనకుఁ గొంచెమో, గొప్పయో మిగిలినదో లేదో!" అనెను. కుమారస్వామిగూడ లోనుండి వచ్చెను. పంకజమ్మ "మీకుఁ బ్రొద్దుపోవుచున్నది. తరువాత మంగమ్మ కథ లెండి, అబ్బాయీ! ధర్మారావుగారికి లాంతరు చూపించుము" అనెను. మువ్వు రును ధర్మారావును సాఁగనంపిరి. ధర్మారావు దారివెంట నొంటరిగాఁ బోవుచుండెను. రాత్రి జాముప్రొద్దు పోయెను. రోడ్డుమీఁద జనము తిరుగుచున్నను సందులన్నియు నిర్జనములుగానున్నవి. అతఁడుపోవుచు 'మాకును నెప్పుడో విద్యుద్దీపములువచ్చును' అనుకొనెను. సావిత్రమ్మ గారు వృద్ధురాలైనది. అరుంధతియే రెండుపూఁటలును వంట. అంత ప్రొద్దుపోవుటకు వీథితలుపు వేయఁబడియుండెను. ధర్మారావు తలుపు తట్టి పిలచెను. పదిపిల్పులదాఁక పిలు పందలేదు. అరుంధతివచ్చి తలుపుదీసి, కనులు నులుముకొనుచు 'ఇంత పెందలకడ వచ్చి రేమి? యనెను. ధర్మారావు బదులుచెప్పక పోయి పాదప్రక్షాళనము చేసి కొని యతీతసంధ్యావందన మారంభించెను. అరుంధతి—"ఇప్పుడు కాదు. కోళ్ళుకూయునపుడు, సంధ్యావందనము చేయవచ్చును." విస్తరి వేయుచు "పిల్లవాఁడు బ్రదుకనిచ్చుటలేదు. ఒక్కటే యేడుపు. నే నిటు వంటచేయుదునా, అటు వానిని సర్దుకొందునా?" అన్నము వడ్డించుచు "నెప్పుడు నిల్లే పట్టరాయెను. ఇటువంటివారు పెండ్లిండ్లు చేసికొనుట యెందులకు? ఇప్పుడు చాలమంది చక్కఁగా నట్లే యుండి రఁట. ఒకయింటికి మేలుచేయుట యెందులకు? దేశమునకే మేలు చేయవచ్చును." నేయి వడ్డించుచు "నే నెంత మొత్తుకొనిన నేమి?

మఱియుమాటయైన లేదు" అనెను. ధర్మారావునకుఁ బొట్ట చెక్కలగు నట్లు నవ్వు వచ్చెను. "ఏమిచేయమందువే! నన్నుఁగూడ సాధింప మందువా? అయినచో నిదిగో! ఎప్పుడు నీ భార్య నన్ను బ్రతుక నీయదమ్మా! వాకిలిమొగము చూడనీయదు. ప్రాణములు వేచుక తినుచున్నది. ఇతరులతో మాటాడనీయదు. నే నెప్పుడు నిల్లువదలి పోరాదు." ధర్మారావు ధోరణి మొదలిపెట్టెను. అరుంధతి పకాలున నవ్వెను. ధర్మారావు నవ్వెను. ధర్మారావు భోజనమైలేచెను. అరుంధతికి నిద్రమత్తు వదలెను. పిల్లవాఁడు లేచి యేడ్వ నారంభించెను.

అరుం—నేను నాలుఁగు మెతుకులు తిందును. పిల్లవానిని దీసి కొనుఁడు. ధర్మా—అమ్మ ఫలాహారము చేయదా? అరుం—నేఁడు శనివారము. ధర్మా—నేను పిల్లవానిని దీసికొనను. ఇందాకటినుంచి నన్నింత సాధించితివి. నేను తీసికోను పో. అరుంధతి విస్తరిలో నన్నము వడ్డించుకొనుచు వడ్డించుట యాఁపి, యతనివంకఁ జూచి "మీరు చాల మంచివారు. కొంచెము పిల్లవానినిసముదాయించుఁడు. ఇంక మి మ్మేమియుఁ ననను. మీరు పెందలకడమాత్ర మింటికి రా వలయును" అనెను. ధర్మారావు "నీవు నాకుఁ జేసినమే లేమో కనిపించలేదు" అని పిల్లవానిని దీసికొనివచ్చెను. వాఁ డేడ్చుచుఁ దల్లి మీఁద కుఱికెను. అరుం—నేను చేసిన మేలు కనిపించలేదా? ధర్మా—కనిపించినది. మఱల నీ వద్దకే వత్తు ననుచున్నది. అరుం—నేను మడి. ధర్మా—నేను ముంగరాలేదు. ధర్మారావు జాతీయ కళాశాలలో నుద్యోగముమానివేసి దగ్గఱదగ్గఱ నేఁడాది కావచ్చినది. ఆ యేఁడాది గడచెను. హేమంత శిశిర వసంత గ్రీష్మములు హిమానీబిందుశైత్యకుసుమోద్ధమతీవ్రాతపము లిచ్చి జలములను, వరికిఁ బొట్ట లిచ్చి, జనుము పెంచి, మాకందతరువులు ఫలింపించి, భూమి మఱల నెండఁగట్టి నెఱియలువాఱఁచేసి, మఱల బీజనిక్షేపమునకుపదను తెచ్చి సంతోషపెట్టెను. మఱల నాషాఢమాసము క్రొక్కాఱు మెఱుఁగులతోఁ, గాటుకకన్నులవంటి మొగిళ్ళతో నాకాశమునుండి భూమి కవతరించెను. భూమి యుచ్ఛిలీంధ్ర యయ్యెను. ఆర్ద్రపురుగులు విరహిణీ హృదయరక్తబిందువులవలె నేలయంతయుఁ బ్రాఁకులాడెను. ప్రాఁతపందిరి స్తంభములకుఁ గాకిబొడ్డు పేసెను.

ధర్మారావు రాజాగారికాలేజీలో నాంధ్రపండితపదవికై యభ్యర్థి యయ్యెను. ఈట్సనుదార ధర్మారావు నెఱుఁగును. ఇర్వురును గలసి మాటాడకపోయినను, హరప్ప కతఁడు తెలుఁగుజెప్పెననుట యతనికిఁ దెలిసినవిషయమే. నాగేశ్వరరావు ధర్మారావునెడల నిష్టములేనివాఁ డనుటయు ఈట్సనునకుఁ దెలియును. ధర్మారావుయొక్క యభ్యర్థనాపత్రము దొరకు చేరినంతనే ధర్మారావతనిని బోయి చూచివచ్చెను. అతనియెడల నీట్సనుభావము లెటులున్నను ధర్మారావాంధ్రమున సమర్థుఁ డని యతఁ డనుకొనుచుండెను. అందుచే ధర్మారావుతో 'మీకుఁ దప్పక యిప్పించెద' నని వాగ్దానము చేసెను. ధర్మారావు కాలేజీలోఁ బ్రయత్నించుచున్నాఁ డని నారాయణరావునకుఁ దెలిసి కళాశాలాధ్యక్షుఁడుగా నతఁడు దొరకొకయుత్తరము వ్రాసెను. "ధర్మారావు తోఁడియుపాధ్యాయులతోఁ బోరాడును. శిష్యపద్ధతికి లొంగఁడు. విద్యార్థులతో నెక్కువచనవుగా నుండును. బిగ్గఱగాఁ బద్యమును చదివి క్లాసులోననే గోలచేయును. కాలేజీ బాగుపడవలయు నన్నచో నట్టివానిని దీసికొనరాదు." ఈ యుత్తరము చూచినంతనే ఈట్సను తనయూహ మరల్చుకొనెను. గుఱ్ఱములఁజూచి గుఱ్ఱముసకిలించు నన్నట్లు భిన్నపాఠశాలాధ్యక్షు లొకరితో నొకరు పరీకు. ఈ కాలమున నిది యొక చిత్రమైనవ్యూహము. అధికారులు దుర్మార్గములు చేయుదురు. క్రిందివారు వానికి పై యనిన పై యనవలయును. ఒకఁడు స్వతంత్రుఁడుండి యన్యాయమున కెదురు తిరిగెనా, వాఁడు పై యధికారుల కెదురుతిరిగినట్లు. ఒకనివద్దనుండి యీ వార్త మఱొకనివద్దకు నడచును? ఎచ్చటికిఁబోయినను తోఁకవలె నీ వార్తరాఁ కఁడు వెన్నబడి వచ్చును. ఆహా! లోకముయొక్క న్యాయము! మనిసి యొకవేళ దోషముచేసినను గాలముువెంట మాఱవచ్చునుగదా! ఒకనాఁడు దుష్టుఁడైన మఱి యెల్లకాలము దుష్టుఁడే కా నక్కఱలేదు. ఈ మానసిక విధానము సమగ్రముగాఁ దెలిసికొని యీ కఠీనాధికారిలోకము సముద్రములోఁబడిచచ్చిన బాగుండునన్నంత కోపము వచ్చినది. విక్టరు యూగోకు. లోకమున జనుల యపరాధములు దోషములు దుష్టులైనయధికారులమూలముననే వృద్ధిపొందుచున్నవి. లోకములో

మొత్తముమీఁద మంచిమార్గమునఁ బెట్టినచో సత్పురుషులు కాని వారు చాల తక్కువ. ఒకకచేరీలో నొకగుమాస్తా యొకతప్పు చేసె ననుకొందము. ఆ పైనిగల యధికారి యాతప్పును సర్ది 'నాయనా! ఇట్లు చేయరాదు' అని దిద్దినచో నా దోష మంతటితోనే యంత రించును. అట్లు నాలుగైదుసారులు దిద్దినతరువాతఁగూడ నాదోషము బుద్ధిపూర్వకముగాఁ జేయఁబడుచున్నదని తెలిసినచో నప్పు డతఁడు శిక్షార్హుఁడు కావచ్చును దురధికారిలో నున్న యహంకారము సహజ క్రౌర్యము నోరిమి కలిగించదు. సూదితీసి దూలమునకుఁ గుచ్చి పరమానందయ్యశిష్యులు పదిమందియుఁ బట్టి యెత్తిరన్నట్లు, ఒక చిన్నదోషము పదిమందియధికారుల పరావాక్యములతో వ్యవహారపుఁ గట్ట పెరిఁగిపోయి, చివరకు వానినెత్తిన విఱచుకొని పడును. ఇది యధికారులప్రతాప భానూదయకథాపరిష్కరణము. ఒకొక్కప్పుడు దోషముకానిదే దోషమగును. వాఁడు నిజముగా తప్పుచేసెనో, చేయ లేదో తన కెందులకు? తా నేమి న్యాయాధికారియా? ఒకనినిగుఱించి యనుమానమున్నచో వాఁడు మాకక్కఱలేదందుము. ఇది యేమి బందియా? ధర్మారావు కాలేజీపండితపదవీ కభ్యర్థియైనట్లు దివాను నకు, రాజునకుఁ దెలిసెను. నారాయణరావు నుత్తరముకూడ వారు చూచిరి. వారికి ధర్మారావునెడలఁగల యభిప్రాయమునకు, లేఖకును సరిపోయెను. దానితో ధర్మారావు కాలేజీవంకకైనఁ దిరిగిచూడ వీలులేకపోయెను. ఒక నెలనాళ్ళు లాశ పెరిఁగెను. వర్షర్తువు చక్కఁగా ముసురుకొనివచ్చునప్పటి కాశ విడిపోయెను. హరప్పఁదయవలన నింటిలోఁ దిండికి వెదకికొన నక్కఱలేకపోయినది. చేతిలోమాత్రము దమ్మిడీ లేదు. 'ఊరు వదలిపోయినగదాఁ జేతిలోఁ బైసకనఁబడ వలయును. నే నూరే వదలిపోను' అన్నట్లున్నది ధర్మారావు వ్యవ హారము. అతఁ డొక్కొక్కసారి మనసులో ననుకొనెను. 'ఎవని బ్రదుకు వాఁడు బ్రదుకవలయును. లోకములోఁ జూడుము. బ్రదుక నేర్చినవా రెంత యనుసరింతురో! భగవంతుఁడే యాశ్రితపక్షపాతి యఁట. తనభక్తులకుఁగాని మోక్షమీయఁడఁట. ఇతరమతములవారు నింతే. పశ్చాత్తప్తుఁడైనచో, విశ్వాసమున్నచో మోక్షము. జను లందఱికిని మోక్ష మేల యీయరాదు? ఆ మోక్ష మంత పీనాసితన

ముగా సాట్లుపరముగా వాడుకొని తుది కెవరికిఁ గట్టిపెట్టును? ఆ తండ్రికిఁ గొడుకన్వర్థమా దేవునిచేత సృష్టింపఁబడినయీమనుష్యులు నింతియే. తమ్మాశ్రయించినవారికే తలకొఱవి పెట్టుదురు. పై యధికారులలోఁ గ్రిందిసేవకులలో నెక్కువ భేదమేమున్నది? వారి కెక్కువ జీతము; వీరికిఁ దక్కువజీతము. వారు యానములమీఁద నడుతురు. వీరు పాదములమీఁద నడుతురు. వారికి పుస్తకజ్ఞానమున్నది; వీరికి లేదు. ఇవియన్నియు నప్రధానవిషయములు. ప్రధానమైనవి కామక్రోధాదులు. మదమాత్సర్యాదులు పై వారికే యెక్కువ. ఏలయనఁగా, నవి ధనాదులవలన సమకూరినశక్తినిబట్టి వృద్ధిపొందును గనుక. ఎక్కువదుష్టుఁడు తక్కువదుష్టునిమీఁదఁ గసినిదీర్చుకొనుట వంటి దీ వ్యవహారము. తక్కువదుష్టునకు నది మంచిగుణమును గాదు; ఎక్కువవానికిఁ బ్రయోజకత్వమును గాదు. వారి భాగధేయములు వారి నట్లట్టుచేసెను.''

రాధాపతి, ధర్మారావులు మనసులు కలియకపోయినను సామాన్యమైన సారస్వతవిషయమును బురస్కరించుకొని స్నేహితులైరి. ఒకరినొకరు గౌరవించుకొందురు. ఒకరియిండ్ల కొకరు పోదురు. సామాన్యముగాఁ గలసి తిరుగుదురు. శివరావు, జాతీయకళాశాలలోని సీతాపతి మొదలగువిద్యార్థులు, ఇటు కిరీటి, నెల్లరును పట్టణము వదలిపెట్టిపోవుటచేత, వేఱే పనిలేకపోవుటచేత నింటిలోఁ జదివినంత సేపు చదువును; అరుంధతితోఁ గడిపినంతసేపు కడపును; ఆలయము వంకకుఁబోవును; హరప్పను గలసికొనును; దేవదాసిని బరామర్శించును. ఇంకను గాలము మిగిలియుండును. ఆ కాలముతో నేమి చేయవలయును? అపుడు రాధాపతివద్దకుఁ బోవును. ఇరువురు నొకరి నొకరు సారస్వతవిషయములలోఁబట్టి చూచుకొందురు. ఒకరిని మించవలయు నని యొకరిప్రయత్నము. రాధాపతికిఁ దనయందుమహాప్రత్యయము – వాఙ్మయ మనినతరువాతఁ దనకుఁ దెలియని విషయము లే దని; ధర్మారావునకు మఱియొక ప్రత్యయము – తాను ప్రతివిషయమును జక్కఁగా నాలోచించితి నని. ఇరువురు నొకనాఁడు కూర్చుండి మాటాడుచుండిరి. రాధాపతి—నాకు గునుగుసీసములు బాగుండవు. అవి వంకరగా నుండును. కవిత్వముపోయిగా, చక్కఁగా

ధారగా నడువవలయును కాని డొంకతిరుగుళ్ళతో రమ్యముగా నుండదు. సీసపద్యమును శ్రీనాథుఁడు హాయిగా నడిపించినాఁడు. శ్రీనాథుఁడు మహాకవి. అతనిని మించినకవి యాంధ్రవాఙ్మయమున లేఁడు. మీ రేమందురు? ధర్మా—నే నేమియు ననను. రాధా—మీయుద్దేశము వేఱుగానున్న ట్లున్న దే? చెప్పుడు, వినెదము. ధర్మా-చెప్పుట కే మున్నది.? మీయుద్దేశము మీఁది. దానికి నా యభిప్రాయ మెందులకు? రాధా—మన మిద్దరము నేమి వాగ్వాదము చేయుచున్నామా? మీ యభిప్రాయమును మీరు చెప్పఁ డంటిని. దానివలన వచ్చు పెద్దనష్ట మేమి యున్నది? ధర్మా—లోకములో విరోధ మనఁగా భిన్నాభిప్రాయమే. రాధా—నావిషయములో నట్లు కాదు. ధర్మా—మొదట ప్రతివారు నట్లే యందురు. ఈర్ష్యాభిమానములు సర్వజంతుసామాన్యములు. వానిని గెలిచినవా రెవ్వరు? రాధా—మన మింత చదువుకొనినతరువాత నామాత్రము లేకపోయినచో నెట్లు? మఱియు నవిద్యావంతులవలె, నవివేకులవలెఁ బోట్లాడుకొందుమా? ధర్మారావు మనసులో ననుకొనెను: 'వారే నయము. వెంటనే తేలిపోవును. వీరు నాగరకులమని, విద్యావంతులమని పేరుపెట్టుకొని, క్రోధములు చక్కగాఁ బెంచుకొని, యొకరి జీవనోపాయము లొకరు, ఒకరి యశఃపథము లొకరు నిర్మూలించుటకుఁ బ్రయత్నించుచుందురు.? రాధా—మీరు మాటాడ కూరకున్నారు. మీ యభిప్రాయమేమో చెప్పినారు కాదు ధర్మా—శ్రీనాథుఁడే మనసీసమును బాడుచేసినది. రాధా—మీయభిప్రాయము చాలవిపరీతముగ నున్న దే? లోకమందఱు ననుకొనునది యొకటి; మీ రనునది యొకటి.

ధర్మారా వొక విషయము చెప్పవలసివచ్చినచో నావేశము పొందిగాని చెప్పలేఁడు. అతని నెఱుఁగనివా రది విన్నచో నతఁడు కోపముగా మాటాడుచుండె ననుకొందురు. కాని యతనిస్వభావమే యది. రాధాపతి యిట్లనుగఁగా ధర్మారా వొక యఱగంటసేపు తన వాదమును నిలబెట్టుచు నుపన్యసించెను.

ధర్మారావు చెప్పినదంతయు విని రాధాపతి యిట్లనెను. "మీ వాదము నాకు రుచించలేదు. పైగా మీ కంతయావేశ మెందు

లకు? నేను సీసపద్యమును గుఱించి యడిగితిని. మీరు దానితోఁ బాటుగా నక్కఱలేని పదివిషయములు చెప్పితిరి.'' ధర్మా—ఒక్కొక్కఁడు మహానదివంటివాఁడు. పొలములు 'నాకు నీరే కావలయును. తక్కన వేమియు నక్కఱలేదనును' నదీనీరముల వెంట ననేకములు కొట్టుకొనివచ్చును. అది నదీవేగలక్షణము. నాకుఁ దక్కిన వక్కఱలేదనఁగా నసలు నీరే యక్కఱలేదని యర్థము.

రాధాపతి మఱల మాటాడలేదు. కొంచెముసేపటివఱ కిద్దఱును మొగములలో వివాదపడినవారివలెనే కన్పించిరి. పదినిమేషములలో మఱలఁ దమాయించుకొనిరి. ఆనాఁటికి ధర్మారావు వెడలెను. రాధాపతి 'ఱేపు దయచేయవలయును. మామిత్రుఁడు రంగావధాని యని వచ్చుచున్నాఁడు. అతనిది నెల్లూరు. కలసి కొంతకాలక్షేపము సేయుదము' అనెను. ఆ నాఁటి సాయంకాలము ధర్మారావు మఱలఁ బంకజమ్మగారియింటికిఁ బోయెను. శ్యామల కొంచెముసేపు వీణ వాయించెను. ధర్మారావు 'మునుపటికన్న బాగున్నది' దని మెచ్చుకొనెను. పంకజమ్మ వచ్చి—'ఏమండోయి! మఱల చాల నాళ్ళకు వచ్చినారు?' ధర్మా—ఈమధ్య నుద్యోగాశలు బలిసినవి. దానితోఁ గాలితిరిప్పటమైనది, పంక—అయినను నీ రోజులలో చదువుకొనినవా రక్కఱలేదు. చదువు చెప్పనక్కఱలేదు. ప్రతి యుద్యోగమునకు సిఫారసులు కావలయును కావలసినది. తెలుఁగుఁ పండితుఁడు ఎవరు బాగుగాఁ జదువుకొన్నారో నిర్ణయించునది తెలుఁగుమొగ మెఱుఁగని పెద్దలు. ధర్మా—ఒకఁడు దొర, ఒకఁడు కార్లైలు కంఠతః అప్పచెప్పఁగలిగినవాఁడు, మఱియొకఁడు కేషబ్జీ మతానుయాయి, రాజు. పంక—అవునండి! మన తెలుఁగునగుబట్టిన దీగతి నక్కినవిషయములను బోధించువారికి నూటయేఁబదులు, రెండువందలు జీతములు. తెలుఁగువద్దకు వచ్చువఱకు ఏఁబదులు, అఱువదులు. ధర్మా—అడిగెడివాఁడు లేకపోయిన సరి. కళాశాలలో నుపన్యాసమునకు నే విషయము బోధించుచున్నవాఁడైనను సరే, యందఱకు సమానముగా నింతకన్నఁ దక్కువ యీయరాదనే విశ్వవిద్యాలయము నిర్ణయించరాదా? తాను చేసిన నిర్ణయము సముల్లం

ఘింపఁబడకుండ చూచుకొనలేదా? ఎవరికిఁబుట్టినబిడ్డరా వెక్కి-వెక్కి-యేడ్చిన దన, యున్నతోద్యోగులందఱకుఁ దమ జీతములు దమకుఁ జక్కఁగా ముట్టినచో నల్పవైతనికు లెట్లుపోయిన నెవరి కేమి? పంక-మున కెందుకు వచ్చినగోల? మీ కా యుద్యోగము వచ్చినది లేదు; నాకు వచ్చునన్న యాశయు లేదు. కుమా—రేపు మంగమ్మవచ్చునఁటండీ! శ్యామల—నెల్లూరునుండి వచ్చుచున్నదఁట. రంగావధాని గారును, నామెయుఁ గలసి వత్తురఁట! పంక—ఈమధ్య నామె పుణ్యక్షేత్రములు సేవించినదఁట. రామేశ్వరము వెళ్ళినదఁట. కుమార—అది యిచ్చటనే వెళ్ళినదిగా! ధర్మా—తల బోడి చేయించినదా? కుమార—ఆమె వద్దకు వచ్చిన వారికేతప్ప యామెకు బోడి లేదండీ. ఆమె నిత్యసువాసిని, సనాతని. ధర్మా—రాధాపతి గారికి, నామెకు నెట్లు కలసినది? పంక—ఆ కథయే నేను నెలనాళ్ళ క్రిందఁ జెప్పరాఁగా మీ రింటికిఁ దొందరపడి పోయితిరి. ధర్మా—నేఁడు చెప్పుడు. వారి కథ 'వినం గౌతూహలం బయ్యెడిన్.' కుమార—ఇదియేమి రుక్మిణీకళ్యాణమా యేమండోయి? పంక—యిచ్చటనుండి మంగమ్మగారు బ్యాంకులోనున్న డబ్బంతయుఁ దీసికొని యొకామెకి బెజవాడ చేరినదఁట. బెజవాడ మిత్రబృందమునకుఁ బీఠము. అచ్చట వీరందఱును గలసి 'యనాథశరణాలయ' మొకఁ డేర్పఱచిరి. అన్నిరకముల స్త్రీలును నచటికిఁ బోవచ్చును. ఏ స్త్రీ యైనను నెట్టియాపదలోనున్నను మిత్రబృందమువారు తమఖర్చుల మీఁద నా స్త్రీ వ్యవహారము చేసిపెట్టుదురు. దానినే 'విడిప్రేమ సంఘ' మందురు. విడిప్రేమ యన 'ఫ్రీ లవ్.' భార్యాభర్తలు గాకుండ విడివిడిగానున్న వారిమధ్య ప్రేమయే ప్రేమ యని వారు వాదింతురు. ఈమె యచ్చటికిఁ బోయినది. రాధాపతిగారు శరణాలయమున కధిపతి. కుమార—ఒకటి, మిత్రబృందమున కధిపతి. రెండు, శరణాలయమున కధిపతి; మూఁడు, మంగాంబాధిపతి. శ్యామల—ఆఁయన నిట్లని తనయుత్తరములకు 'హెడ్డు' కొట్టించెనఁట. పంక—ఆయనను జూచి మంగమ్మ తొలుత నాయేలూరుపంతు లెట్లైనదో యట్లేయైనది ఎంతచెడినను సుబ్బన్నపేట నీళు లొడల బట్టినవిగనుక యాయనమెత్తులలోఁబడ లేదు. తన దగ్గఱనున్న

దమ్మిడీ యాయన చేతి కీయలేదు. రామేశ్వరముగారు చెఱసాలకుఁ బోయినప్పటినుండియు నీమె మిత్రబృందముతో నేకాలక్షేపము చేయుచున్నది. రాధాపతికి నామెకు నిప్పుడు ప్రబలమైత్రి యఁట. ఇచ్చటఁ దనయింటిలో నుండుటకు రాధాపతి కనుజ్ఞ యిచ్చెను. స్త్రీ పురుషులు భార్యాభర్తలవలె నున్నను మిత్రుల మని, స్నేహితుల మని చెప్పుకొనుట యిప్పు డాచారమఁటగదా! వారిద్దఱు నట్టి మిత్రులు.

శే పామె వచ్చును మీ రింకను రాధాపతిగారి యింటికిఁ బోదురా?

ధర్మా—నా కేమి నష్టము? అతనితో మాటాడుటకుఁ బోదును. నామనస్సు నావద్ద నుండఁగా నే నెచ్చట నున్న నేమి?

ధర్మారావు ప్రొద్దుపోయి యింటికిఁబోయెను. అరుంధతి వీధితలుపు వేయలేదు. ఇంటితలుపును వేయలేదు. తలుపులన్నియు దగ్గఱగా వేసియున్నవి. ధర్మారావు లోనికిఁబోయి కాళ్ళుకడుగుకొని వేసినపీటమీఁదఁ గూర్చుండెను. అన్నముతెచ్చి తానే వడ్డించుకొనుచుండెను. ఇల్లు ప్రాఁతదై యెలుకలు బహుధా ఇంటిలోఁ దిరుగుచుండెను. అందుచే నరుంధతి కనులుమూసికొనియే యెలుక లనుకొనియే వానిని దోలుచున్నట్లు ధ్వనిచేసెను. 'ఎలుకలు' ధ్వని కలుగకుండ నన్నము వడ్డించుకొనెను. ధ్వనిలేకుండ నేతిగిన్నె దగ్గఱ పెట్టుకొనెను. మజ్జిగ తప్పెలదగ్గఱ పెట్టుకొనెను. అన్నమంతయుఁ జప్పుడు గాకుండఁ దినెను విస్తరియంతయు మెతుకులేకుండఁ దక్కఁగా దుడిచెను. లేచిపోయి సవ్వడి గాకుండఁ దలుపుతీసి చేయికడుగుకొని వచ్చి గదిలో రామేశ్వరశాస్త్రివద్దఁ బండుకొనెను. శాస్త్రికి రెండేండ్లు వచ్చినవో, వెళ్ళినవో! అతఁడు నాన్న, అమ్మ, అత్త, మామ్మ మొదలైన కొన్నిశబ్దములు వాచకపుస్తకములకు సిద్ధము చేసి యట్టెపెట్టెను. ఏపుస్తక ప్రకటనకర్తలైనను వెలయిచ్చి కొందురేమో యని యెదురు చూచుచుండెను. వారు 'నీవు డి.ఇ.ఒ. కాని, ఎల్. టి. గాని కాదు. అప్పుడు నీమాటలు వెలకుఁ దీసి కొందు' మనుచుండిరి. తండ్రిదగ్గఱ పండుకొనినంతనే కుఱ్ఱవాఁడు మెలఁకువ వచ్చి యేడ్వనారంభించెను. తండ్రి జోకొట్టి నిదురబోయెను. అరుంధతి పిల్లవానియేడుపునకు లేచి మఱల నతఁడు నిదురపోవుటచేత గదిలోనికి వెళ్ళి పిల్లవానిని జూడకయే భర్త యింకను

రాలేదని మఱల నిరూపించఁబోయి, నిద్రపట్టక లేచి కూర్చుండెను. కూర్చుండి పైకి వినఁబడునట్లు తనలోఁ దా నారంభించెను: 'అబ్బా! ఇట్లు కాదు. రేపటినుండి వచ్చినను సరే, రాకపోయినను సరే నేనే ముందు తిని కూర్చుందును. ఉద్యోగముపోయినతరువాత నాలస్యము మఱీ యెక్కువగుచున్నది. ఆఁడవాండ్రు చచ్చిరో, బ్రదికిరో విచారణ లేదు. అస లివ్వేళ వచ్చునో, రాఁడో! అత్తయ్యను లేపి, మే మిర్వురము కానిత్తును' అని పోయి యత్త గారిని లేపెను. ఆమె లేచి 'కొంచెము వేన్నీళ్ళు పెట్టితివా' యని యడిగెను. అరుంధతి 'పెట్టితిని. చల్లారి పోయియుండును. ఎక్కడి కేదరి. సంజవేళ ననఁగ వంటచేసితిని. ఇప్పటికి దిక్కు, దివాను లేదాయెను. ఈ యవేళభోజనములతో నా కేదో పెద్దవ్యాధిపుట్టి నేను బ్రతుకను లెండు. అదియును దగ్గఱకు వచ్చినట్లే యున్నది' అనెను. గదిలో వినుచున్న ధర్మారావునకుఁ దనచమత్కారములోని సగమునరదా చచ్చినది. అరుంధతి 'మఱల నిప్పు రాఁజేయు నందురా?' అనెను. సావిత్రిమ్మ—అబ్బాయి భోజనము చేసెనా? అరుం—ఇంతవఱకు వేంచేయలేదు. సావి—వాఁడు రాకుండనే మనము తినుట? అరుం—వా రింక రారు. వచ్చినచో నిదివఱకే వచ్చి యుండవలయును. ఊరిలో నెందఱమంది బంధువులు! ఎక్కడ భోజనము చేసి పండుకొనిరో. వంటపిలుపులు పిలువఁగా సావిత్రమ్మగారు లేచి చన్నీళ్లే పోసికొని వేఱవిస్తరి వేసికొని కూర్చుండెను. సంక్రాంతి పోయి నెలనాళ్ళయినది. చలి మిక్కిలిగా చేయుచున్నది. ఊహుహూ యని వణఁకుచు సావిత్రమ్మగారు ఫలాహారము చేసెను. అరుంధతి తాను వడ్డించుకొనుచు "నన్నము గిన్నెకు సగమైనది. పిల్లియేమైనఁ దినిపోయెనా యేమి? మూఁత మూఁతగానే యున్నదే! విస్తరి యంతయుఁ దడిగానున్నది. బ్రద్ద లూడిపోయినవి. మీ కుమారుఁడు వచ్చెనా?" అనెను. సావిత్రమ్మగారు "నేను చూడలే"దనెను.

అరుం—నేతిగిన్నెయు, మజ్జిగతప్పెలయు నెచటనున్న వచట లేవు. వారువచ్చి యన్నముపెట్టుకొని తినిరికాఁబోలు! అయ్యో! నన్ను లేపరాదా? తాము పెట్టుకొనితినుట యెందులకు? నే నిచ్చట దేని కున్నది? సావిత్రమ్మ—వానిని సాదించుచున్నావు. వాఁడు

వచ్చినాఁడో లేదో! అరుంధతి 'ఇంకను ననుమానమేనా'అని దీపము తీసికొనిపోయి గదిలోఁ జూచినది. ధర్మారావు పకాలున నవ్వెను. అరుం—నేను మడి. నన్ను ముట్టుకొనకుఁడు. ధర్మారావు తాఁకనే తాఁకెను. అరుం—అంత దొంగతన మెందులకు? మీ యిష్టము వచ్చినంత ప్రొద్దుపోయి రండు! ఆఁకలి యుందఱకు నొకటియే. మీఁకులేని యాఁకలి నాకా? ధర్మారావు కౌఁగిలింతలో నరుంధతి నలిగిపోయెను. అరుంధతి—అన్నిటి కొక్కటే మందు. ఏ మున్నది? ఎన్నితప్పులైనను దీనితో సమసిపోవును. బనులు చెప్పినఁగదా? ఊరికే నవ్వుటయు—. తిరిగివచ్చిన యరుంధతిని సావిత్రమ్మగారు 'జాడీలో నుండి తీసి కొంచెము నిమ్మకాయ వేయు' మనెను. ఆమె 'నేను మడికాదు' అనెను.

మిగిలిన శిశిరము సర్వథా విజృంభించెను. పగలు రెండు జాములప్పుడు సూర్యాతపము మండిపోవుచుండెను. ప్రాణములు సేలువలు కప్పుకొనుట వాంఛించెను. పూర్వర్తువులయందుఁ దెలుఁగు దేశములో నేసినగుడ్డలుమాత్రమే కట్టుకొనినవారు శిశిరర్తువు రాఁగానే కాశ్మీరపుసేలువలకొఱకు, పంజాబురగ్గులకొఱకు బయలు దేఱిరి. ఈ అయ్యలు వేసఁగినాఁటికి గ్లాస్గోదాఁకా పరుగెత్తరని యేమినమ్మిక? ఒడళ్ళుపగిలి నిత్యతైలసంస్కారమును వాంఛించెను. పెదవులకుఁ బేరునేయి మిక్కిలిప్రియతమమై పోయెను. పొలాలు కొన్ని పనలమీఁద నున్నవి. కొన్ని కుప్పలు వేసిరి. హేమంత ఋతువు తనదారిఁ దా వెనుకఁబట్టినను శిశిరము కొంతమంచును గురియుచునేయుండెను. వరికోసినమ్రోళ్ళ రేలఁగురిసినమంచునిండి నడచుచున్నప్పుడు కాఁపులపాలేళ్ళపాదతాడితములై జానువులవఱకుఁ బాదములు తడిపెను. కడచినయేఁటిధాన్యము నిలువలేని రైతులు కుప్పలుకొట్టుకొన నారంభించిరి. పచ్చినేలమీఁదఁ బాలేళ్ళకు గళ్ళముచేయుట తేలికయై మఱునాఁడే కుప్పపడఁదోసిరి. కుప్పఁ నూర్చి, చుట్టు కడియమువేసి, తూరుపోఁతఁబోసి, ధాన్యము రాశి పోసి యానాఁటికిఁ బొద్దుక్రుంకుటచే మఱునాఁడుగాని కోమటివచ్చి కొల్చుటకు వీలులేదు. గనుక గొంగళులు కప్పుకొని కాఁపులు కడియములలో దూరి పండుకొనిరి. శిశిరము సర్వజంతువులను వృద్ధ

ములుగాఁ జేసెను. ఒడళ్ళు నుడతలు తనూశిరః కంపము నాపాదించెను. జనుము చక్కఁగా మొక్కుమొత్తెను.

ఒకనాఁటి ప్రొద్దున గణాచారి స్నానమాడి కుంకుమబొట్టుపెట్టి, తెల్లనిచీరఁ దాల్చి, జపావసానమున నెండినవేఁపమండ నొకదానిని బుచ్చుకొని బయలుదేఱెను. పరిశుష్కమైన యీ వేపమండ యెందుకో! ధర్మాత్మురా లనుకొన్నట్లు గామేశ్వరము గ్రామములో లేకపోవుట గణాచారికిఁ బ్రియమైన విషయముగానే తోఁచినది. కాని యామె ప్రాణమునకు నొకటి, రెండు, మూఁడు, నాలుఁగు బెడఁదలయ్యెను. ఆమె దారివెంటఁబోవుచుండఁగా రాఘాపతి యెదురుగా వచ్చెను. ఆమె దూరముగాఁ దొలఁగిపోయెను. ఎఱ్ఱనివాఁడు మల్లెపూవు వంటివాఁడు, బరీమళమిళితతైలసంస్కృత కేశబంధమువాఁడు, నిరంతర హంసీ గరుచ్ఛటాసితవర్ణవసనములవాఁడు—తన్నుఁ జూచి యీ పిచ్చిది దూరముగాఁ బోవు నేమి? అధ్యయనములు చేసి, వైశ్వదేవాదులు నెఱపి, యుభయసంధ్యల స్నానములాడి, యగ్నిహోత్రము జేసిన మహానుభావులకును గామక్రోధాదులు మడియలేదు. ఇతరులను నిందించుటయే కాని, సనాతనమతానుయాయులంత ఘోరకల్మషులు సృష్టిలో లేరు. నా రన్నిసార్లు స్నానముచేసి, కట్టుకొన్న మడికన్న పరిశుభ్రములైన వస్త్రములతోఁ దానే యెక్కువ శుచిగా నున్నాఁడు. ఈ పిచ్చిది తనకు దూరముపోవుట యేలనో? అన్నిటికన్న మనస్సు ప్రధానము. మనస్సు నిష్కల్మషముగా నుండినఁ జాలును. తన మనస్సు నిష్కల్మషమా? ఏల కాదు? ఒక్కొకపుడు కామావిష్టమై, యొడలు తెలియక యేమియో చేసియుండుము. ఆమత్తుపోవువఱకే కాని, తరువాత తనమనస్సుకన్న నిర్దుష్టమైనది లేనే లేదు. అసలు కామమే గోమయమువలె సహజముగాఁ బునీతమైనది. దానికి నుపాధిభేదమువలన నుచ్చనీచములు కల్పించరాదు. గణాచారి తనదారిని దాను పోవుచుండెను. కోటముందుగాఁ బోయి పురపాలక సంఘసౌధముముందు నిలుచుండి యెండినవేఁపమంట నచ్చట వదలి, సౌధమువంక నాశ్చర్యదృక్కులతోఁ జూచుచుండెను. చంద్రారెడ్డి లోనుండి వచ్చుచుండెను. ఆమె యతని సమీపమునకు రానిచ్చి వేపమండ కాలితోఁ గదపెను. చంద్రారెడ్డి

చూచెను: "ఏమిటో, యీ ముసలదానికథ యేమియు నర్థమగుట లేదు. పురపాలకసంఘమామీఁదఁ బట్టించిన దేమి? తన నేమి కాదంటిమా, యవు నంటిమా? మాగోల మేము పడుచుండఁగా నీమె కెందులకు? ఈమె నేమైన ననినచో నేమివచ్చునో! వెనుక, పాపము! కాలువాఁచి బాధపడుచుండఁగా నెమ్మదింపించినది. ఈ యధ్యక్షపదవి మిథ్యాగౌరవమాత్రమే కాక, యొరగించున దేమియుఁ గన్పించ లేదు. ప్రజలకు మేలుచేసినట్లు తీర్మానముపైఁ దీర్మానములు. నాకు వానివలన లాభమేమియుఁ గన్పించుట లేదు. ఇంక నాల్గుదినములలో నిర్బంధప్రాథమిక విద్యావిధానము తీర్మానము ప్రవేశపెట్టఁబడును. దీనివలనఁ బ్రయోజనమేమో భగవంతునకుఁ దెలియవలయును. నే నిన్నాళ్ళు లధ్యక్షుఁడుగానుండి యిప్పుడు పురపాలకసంఘములోని బోలుతనము బయటికి వెల్లడించినచో నాకే తప్పు. ఈ గణాచారి యూరిమేలంతయుఁ దనకుఁ బట్టినట్లు దేవులాడు నేమి? ఇంక మఱొకయూరికి నీ యిబ్బంది లేదు. సర్వదేవతలును మమ్ము పట్టుకొని దేవులాడెద రేల? తురకవాఁడు వచ్చి గంగానమ్మనెత్తిని జేయిఁబెట్టఁగాఁ గాఁపువాని పైఁబడి యేడ్చినదఁట. శాఖోపశాఖలుగా దేశమెల్లడ నీ నాగరకత ప్రబలిపోవుచున్నది. నిర్బంధప్రాథమిక విద్యావిధానము చాల శ్రేయమైనది. గవర్నరుగారు మొదలైనవారు మెచ్చుకొనఁదగినది. పురపాలకసంఘము పట్టణమునకుఁ జేయు మేళ్ళలో నిది యొకటి. తప్పకుండ మా పురమునకు మంచిదినములు వచ్చెననియే యనుకొనవచ్చును." ఇంతనఱ కూహావచ్చువఱకుఁ జంద్రారెడ్డి తన యింటిముంగిటికి వచ్చెను. వాకిట నాగన్నసెట్టి కొడుకు వేంకటరత్నము కూర్చుండియుండి రెడ్డి వచ్చుటతోడనే లేచి నమస్కరించెను. రెడ్డి యన్నాఁడు, "ఏమయ్యా! షాహుకారు! ఇదియంతయు మీకును, మాకును బట్టినది."

వేంకట—చిత్తము, చిత్తము. రెడ్డి—ఏదో పనిమీఁదవచ్చినావు? వేంకట—ఏమియు లేదండీ! దేవాలయముముందు పందిళ్ళు వేయించఁదలఁచుకొన్నాము. సప్తాహము మొదలు పెట్టినాము. ఆలయమున కెదురుగా నున్న రామావధానిగారి పెద్దసావడిలో వంటలు. ఇంక భజనలు, నాటకములు, భోజనములు నన్నియు పందిళ్ళలో.

పందిళ్లు కోటగోడ్డువఱకును వచ్చునండి. చంద్రా—ఈ రెండువందల గజములు పందిళ్ళే? వేంకట—అవునండి. నాటకములు, పగటి వేషాలు, హరికథలు, సేవమోళాలు - లక్షలు వచ్చునండి. రెడ్డి—అయినచో స్వామికళ్యాణముకూడఁ గలుపరాదా? వేంకట—దొరగారు కలసి రావలదా అండి. వారికి దేవునిమీఁద సంత శ్రద్ధ లేదనెద రండి. అది యెంతమట్టుకు నిజమో తెలియదు. రెడ్డి—ఎట్లైనను కోమటిబిడ్డవు. అనఁదలఁచుకొన్నమాట యన్నావు. మెత్తగా నొక్కను నొక్కినావు. వేంక—చిత్తము, చిత్తము. రెడ్డి—మీ నాయనయు నిట్లే మాటిమాటికిని 'చిత్తము చిత్త' మనుచుండెడివాఁడట, సరే పందిళ్ళు వేసికొనవచ్చును. అర్జీపెట్టినచో తేపువచ్చు సమావేశమున మంజూరుచేసెదము, అచ్చముగా నేమియు నీయకుండసాగదు. జనసమూహముమీఁదికార్యముగనుక కొంచెము మాత్రమే పన్నియవలయును. దినమునకుఁ బావలాకన్న నెక్కువ యుండదు.

వేంకటరత్నము సెలవుతీసికొనిపోయెను. అతనికిఁ బిల్లలు కలుగుటయుఁ బోవుటయుగా నున్నది. అంతవఱకు ముప్పు రాఁడ పిల్లలు, నిద్దఱు మగపిల్లలు పుట్టి పోయిరి. అతనిభార్య వేఁపచెట్లకుఁ బ్రదక్షిణములు, రావిచెట్లకుఁ బ్రదక్షిణములు చేసెను. ప్రతిదినము నాంజనేయస్వామికిఁ గొబ్బరికాయ కొట్టును. సోదె లడిగినారు. ఒకప్పుడు దయ్యము, ఒకప్పుడు దేవర. మొక్కరాని దేవతలకెల్ల మ్రొక్కిరి. రామేశ్వరముపోయి వచ్చిరి. కలిగినసంతు నిలుచుట లేదు. ఒకవృద్ధబ్రాహ్మణుని జోస్య మడుగఁగా నాయన 'నీకుఁ గొన్ని గ్రహములు చాల' వని చెప్పి తద్గ్రహశాంతులు చేయించి, 'భూతతృప్తి జరుగవలె' నని చెప్పెను. అది యెట్లని వేంకటరత్న మడుగఁగా 'సప్తాహము జరిపినచో భూతతృప్తి జరుగు' ననెను. కోమటులకుఁ బెండ్లివేళ వితరణ మన్నట్లు, అక్కఱవచ్చెనా వైశ్యులు వ్యయముచేసినట్లు మఱొకరు చేయరు. తండ్రి నిలువచేసియుంచిన లక్షలు, తాను పొగాకువర్తకముమీఁద సంపాదించిన లక్షలు నింటిలో మూలుగుచున్నవి. తాను చనిపోయినతరువాతఁ దిను నట్టిదిక్కు కన్పించలేదు. భార్య యతనిని బ్రోత్సహించెను. అతఁడు విరివిమీఁద

సప్తాహము సాగించెను. కూచిపూడివారు వచ్చిరి. పగటివేషాలవారు వచ్చిరి. భజనమేళములు వచ్చెను. హరికథకులు వచ్చిరి. పట్టణమంతయుఁ గలకలలాడిపోయెను. ఏడుదినములు వచ్చినవారి కెల్ల లేదనకుండ సంతర్పణ చేయఁబడును. భోజనములకు బ్రాహ్మణులకు వేఱు, వైశ్యులకు వేఱు, తదితరులకు వేఱు ప్రదేశము లేర్పాటుచేయబడెను. గుండిగ లుడుకుచున్నవి గంగాళములు క్రాఁగుచున్నవి. వండినవి వండఁగా, వార్చినవి వార్చగాఁ, జాపలమీఁదికిఁ దోడినవి తోడగా గూరలు, పప్పులు, పులుసులన్నములువంటపందిరియంతయు గలకలలాడిపోయెను. పందిళ్ళలో భజనలు చేయుచుండిరి. పల్నాటి నుండియు ఒంగోలునుండియు భజనమేళములు వచ్చెను. ఒంగోలు నుండివచ్చినవారిమేళము బహుపురాతనమైనది. రెండునూఱుఁడువందల యేండ్లనుండి తెలుఁగుదేశమున వారికీర్తి నాల్గుదిక్కుల వ్యాపించెను. వారు రామాయణమంతయు భజనకీర్తనలుగా వ్రాసిరి.భజనసంస్థలు నశించకముందు దేశమున వాని కధ్యాత్మరామాయణమున కున్నంత గౌరవ ముండెడిది. ఇప్పు డావంశమువా రందఱును చెదరిపోయిరి. వారికీర్తనలును విస్మరింపఁబడినవి. 'చాఁపచెడినను చదరంత కాదా' యన్నట్లు వాఁవంశములో నింకను భజనఖత్తు తెలిసినవారు పుట్టుచునే యుండిరి. వారి రామాయణకీర్తనలు భావాభిరామములై ధారాశుద్ధి కలిగి, గొప్ప భాషాపాటవమును బ్రకటించును. ఒకనాఁటి మధ్యాహ్నము వారు కీర్తనలుపాడి భజన చేయుచుండిరి. ఒక పాతికయేండ్ల తద్వంశీకుఁడు తరంగములుపాడుచు నృత్యముచేయుచు, వారి రామాయణములోనియొకకీర్తన నందుకొని భజన మొదలుపెట్టెను. హనుమంతుఁడు మండోదరిని జూచి, సీతాదేవి యనుకొని, యీ రామచంద్రప్రభుపుభార్యయే యైనచో నిట్లు సాలంకారయై యేలయుండునని శంకించుకొని 'నక్తంచరాధినాథురాణిగాని యీ మె పెఱరాజీవాక్షి కాదురా' అనుకీర్తన పాడఁజొచ్చెను. వారు నియోగులు. తెలుఁగుభాష ననాదినుండి పోషించినవారు. ఆంధ్రసారస్వత మనేకముఖముల వారిప్రతిభాశక్తులచే విరాజిల్లినది. ఆ కీర్తనలోని లయచేత పందిరి కదలాడిపోయెను. హరప్పనాయఁడు సప్తాహ మారంభించినది మొదలు పందిరిలోననే యుండెను. దేవదాసి సర్వ

కాలములయందును దేవాలయమునందే కాఁపురము చేయుచుండెను. ఆమెకు తాను నేర్చిననృత్య మీఁదవచ్చినవిద్యాతరంగములన్నియుం దేమూలకు వచ్చు ననిపించెను. ఒకరికన్న నొకరు విద్యాధికులు. వెల్లటూరినుండి యాంజనేయులుగారు వచ్చిరి. ఆయన బాలగోపాల తరంగమును మొదలుపెట్టెను. పందిరియంతయు శబ్దముచేత జిగిర్చినట్లయ్యెను.

[మోహనరాగము - ఆటతాళము]

"బాలగోపాల మా ముద్ధర! కృష్ణ పరమకల్యాణగుణాకర!
నీరదనీలకళేబర, కృష్ణ, నిరుపమకౌస్తుభకంధర."

తరంగము భోజనములైనతరువాత రాత్రి పదునొకండు గంటలకు మొదలుపెట్టిరి. తెల్లవారెను. సూర్యోదయ మగుచుండెను. తరంగము కాలేదు. మద్దెలవానికిఁ జేయియాడుట లేదు. వాయులీనము జతకూర్చునతనికి చేయి పడిపోయి నాల్గుగంటలైనది. వెనుక నొకసారి త్యాగరాజమహోత్సవసందర్భమున బందరులో శ్రీహరి నాగభూషణముగారియింట నాంజనేయులుగారు గోపాలకృష్ణతరంగమును బాడెను. నాగభూషణముగారే ఫిడేలు వాయించిరి. చివరకు నాగభూషణముగారనిరి: "ఆయన యీ విద్యలో బ్రహ్మవేత్త. ఎప్పుడే త్రోవ త్రొక్కునో తెలియదు. సర్వథా విషమగతితోడనే ప్రారంభించును. విషమగతులే పోవును ఎచ్చట నే మలుపు తిరుగునో తెలియదు." గొప్పగొప్ప మార్దంగికులు తత్కాలక్షేపమునకు వచ్చి లయపోకడలు తెలిసికొనిపోవుచుందురు. సూర్యోదయమైనది.

"అన్నమయాదిషు పంచసు త్వామంతర మానందవిగ్రహం
ఉన్నతఫల మామనంతి తే జగదుదయాదిషు లక్షితం
తద్ధి త్వమేవాసి తద్ధి త్వమేవాసి తత్సర్వమేతత్త్వమేవాసినూనం"

అంతవఱకు వచ్చెను. దీపములు తెల్లతెలపోయెను. కన్నులు జోతులవలెఁ బెట్టుకొని చూచుచున్నది మువ్వురే- శ్రీ వేణుగోపాల స్వామి వారును, గిరికయు, హరప్పయు.

ఆనాఁడు మధ్యాహ్నము రాత్రి నిద్రలేకపోవుటచేత నెఱు పెక్కిన కనులతో ధర్మారావు వీధివెంటఁ బోవుచుండఁగాఁ జంద్రారెడ్డి కనిపించెను.

ధర్మారావు—రాతిరి మీరు వచ్చితిరా? రెడ్డి—రాలేదండి. చాలబాగుగ నున్నదట. ధర్మా—ఏమి బాగండీ! ఆయన నృసింహోపాసకుడట. అంత బక్క పలుచని మనిసి, ఆ మొదలిలో నంత యోపిక యెచ్చట నున్నదో? ఉపాసనాబలముకానిచో రాతిరిపడ్డ శ్రమకు వారమురోజులు ప్రక్క వేయవలయును. మీరు నిర్బంధ ప్రాథమికవిద్యావిధానము సమలులో పెట్టుదురట గదా! రెడ్డి—అవునండీ! ఎల్లుండియో, ఎప్పుడో సమావేశము జరుగును. ధర్మా—వీరిని నెల కింత యని యిచ్చి యీ గ్రామములో నుంచుడు. రెడ్డి—ప్రాథమికవిద్యకు దీనికి నేమి సంబంధము? ధర్మా—విద్య యనగా నేమని? అక్షరములు నేర్చుటయు, వంకరదస్తూరి వ్రాయించుట యునా? ప్రతివారికిని సంగీతజ్ఞానము, లయజ్ఞానముకూడ సునిశితమై యుండుట-విద్యావిధానములో బ్రధానమైన విషయము. పూర్వము మనదేశములో నిట్టిభజనలు, వీథినాటకములు విరివిగా నుండుటచేత నవియన్నియు సర్వజనులకును యథేచ్ఛముగా జూచుటకు వీలగు చుండుటచేత నందఱకును సంగీతజ్ఞానము, లయజ్ఞానము సహజముగా గలిగెడివి. ఇప్పటినాటకములలో శ్రుతి యుండదు, లయ యుండదు. అన్నియు తప్పుడు శ్రుతులు, పేదతాళములు. హృదయము భావానృత్యముచేత బిగియుట కలుగదు. అట్లు కలుగవలయుననినచో మఱల నీ సంస్థలవద్దకే పోవలయును. మనపూర్వులు చదు వనగా హృదయపరిపాకము కలిగించునది చదు వనుకొనిరిగాని, చదువుట వ్రాయుట చదు వనుకొనలేదు. పూర్వము విద్యయే యున్నది. లేని దిప్పుడు. విద్య మోక్షపర్యవసాయిని.

ఇంతలో నెవరో పురపాలకసభ్యులు రాగా జంద్రారెడ్డి వెడలిపోయెను. ఆ సాయంకాలమున అప్పన్నభొట్ల పేరిశాస్త్రిగారి పురాణకాలక్షేపము జరిగెను. ధర్మారావు పోయి కాలేజీవిద్యార్థులందఱిని రమ్మని యాహ్వానించెను. ఆ మహాపండితులు గోపికాగీతలు పురాణము చెప్పుచుండిరి. ఏమి పురాణము! గోపికాగీతలలో నున్న మర్మములన్నియు నిమిడియున్నవి. తదర్థపరిపోషణకొఱకు శాస్త్రుల వారు పూర్వమీమాంస, యుత్తరమీమాంసలవద్దనుండి త్రవ్వుకొని వచ్చుచుండిరి. వైదికసరస్వతి దివ్యతేజోవిరాజమానయై యాయన

ముఖమండలమున విరాజిల్లుచుండెను. వచ్చిన కాలేజివిద్యార్థులు 'ఇది యొక చాదస్తపుగోల'యని వారిదానిని వారు నిష్క్రమించిరి. మఱునాఁడు పురంజనోపాఖ్యానము పురాణము చెప్పిరి. ఏమి వాఙ్మధురిమ! ఎంత విచిత్రమైనవ్యాఖ్యానవైఖరి! అద్వైతమంతయు నాయన త్రివ్విపోసినట్లుండెను. ఉపనిషత్తులు, పురాణములు, వేదాంగములు వీనియందుఁగల గూఢార్థములన్నియుఁ గుంభించి యనువదించుచుండెను. ధర్మారావనుకొనెను: "ఇంత గొప్పసంస్థ యెందుకుఁ గాకుండఁ జెడిపోయినది. పురాణము కథాకల్పవల్లి. బాలుర కెన్ని గ్రంథములు చెప్పిన బురాణకథలన్నియు వారికిఁ దెలియును? తెలిసినను నింత హృదయంగమముగా నెట్లు తెలియఁగలను? నేత్రేంద్రియముద్వారా కన్న శ్రవణేంద్రియముద్వారా విద్య చెప్పిన మనస్సునకుఁ బట్టును. త్వగ్జిహ్వానేత్రఘ్రాణేంద్రియములకున్నంత భౌమమైన స్థితి శ్రవణేంద్రియమునకు లేదు. శ్రవణేంద్రియము దివ్యభౌమమార్గములకు మధ్యభాగమున నున్నది. అందుకనియే పూర్వవిద్యలన్నియుఁ దదింద్రియములద్వారా బోధింపఁబడినవి. వేదము శ్రుతియైనది. పురాణములు వినినప్పుడు పురాణములు చెప్పువారి శక్తికొలఁది పట్టి కథలుగాఁగాక మనస్సున జరుగుచున్నవిగా భాసించుచున్నవి. లోకజ్ఞుఁడైన పౌరాణికుఁడు పురాణము చెప్పువేళ నేభావ మెట్లు ప్రకటించవలయునో యట్లు ప్రకటించును. అదియు నొక నాట్యవిశేషము. అపరిపక్వమనోభావులగు శ్రోతలకుఁ దచ్ఛ్రవణమువలన తత్తద్భావములందలి యథార్థస్వరూపము గోచరించును. ఇది విద్య నేర్చుకొనుటకు సరియైన మార్గము. ఆ విద్యకు సార్వజనీనత్వము కలదు. ఒకసారి యొక మహాపౌరాణికుఁడు హరప్పనాయని యొద్దకు వచ్చెనఁట. అనేకులైన పండితులును వచ్చిరి— ఒకరు భాష్యాంతనైయాయికులు, ఒకరు బాధాంతతార్కికులు, ఒకరు పూర్వమీమాంసకులు — నిట్లుండిరి. 'అయ్యా! మీ రే శాస్త్రమునందు పండితులు!' లని యా బ్రాహ్మణు నడుగఁగా నాయన 'నేను పౌరాణికుఁడ' నని చెప్పెనఁట. అండఱును విహసించిరి. ఆయన 'నవ్వినఁ గాదు. పురాణము వినవలయు' ననెనఁట. సరే నని నాయఁడు కొలువు చేసెను. భారతము పురాణము చెప్పుట ప్రారంభించకముందుఁ 'గత్తులన్నియుఁ దీసి యొక

గదిలో నుంచి తాళము వేసి, తాళపుఁజెవి నా కీయుఁ' డనెనఁట. అది యే మనఁగా 'నా పురాణము వినవలసినచో నట్లే చేయవలయు' ననెను. ప్రతివిషయము తేలికగాఁ 'బిచ్చిముండాకొడుకులే' యని నిరాకరించుచున్నేఁటివారివలెఁగాక విషయపరిజ్ఞానమునందు శ్రద్ధాళువైన నా యందుసర్వాయుధములు నొకచోట నుంచి, తాళపుఁజెవి యాయన కిచ్చి పురాణము చెప్పుమని యాజ్ఞయిచ్చెను. ఆయన మొదలిడి కొంత దూరముపోవుటకుఁ గురుపాండవులపరస్పరద్వేషాగ్ని సభ్యులలో నంటుకొని, శ్రోతలు రెండుపక్షములుగాఁ జీలి ప్రతివారును గత్తుల కోసము, కటారులకోసము వెదకిరఁట. తాళపుఁజెవి బ్రాహ్మణుని వద్ద నుండుటచేత సరిపోయినది. పౌరాణికు లంత గొప్పవారు. చక్కఁగా హృదయభావములకు వారే పదునుపెట్టఁగలరు హృదయ భావములకుఁ బదును తెచ్చుటకుఁగాక వాని నడవిగా వర్ధిల్లఁ జేయుటకు సానుకూలపడుచున్న విద్యాపద్ధతి వినష్టమైనది పో! వానివెంట నా దేశమును వినష్టమైనది పో.'

దేవదాసికనులలో వత్తులువేసుకొని తరంగములు విన్నది. పురాణములు విన్నది. దివారాత్రము లట్లే కూర్చుండియుండెను. రత్నగిరి భోజనమునకు రమ్మనును. ఆమె కోడలు తెలియదు. ఆలయములోని నైవేద్యమిడిన చక్రపొంగలులు, దధ్యోదనములు, నారికేళఫలశకలములు తినును భోజనమువేళపోయి యాలయములోఁ గూర్చుండును. భోజనములైనవెంటనే మఱలఁ గాలక్షేపములవద్దకు వచ్చును. అరుంధతీరత్నగిరులు దివారాత్రములు దేవదాసితోనే గడుపుచుండిరి. రెన్నాళ్ళయినతరువాత వారే వంటపందిరిలోనుండి పదార్థము తెచ్చి ప్రతిపూఁటయు దేవదాసికిఁ బెట్టుచుండిరి. హరప్ప నాయునికి భోజనము సప్తాహములోనుండియే వెళ్ళుచుండెను. ఆయన యీ యేడు దినములు సప్తాహముభోజనముగాని చేయ నన్నారఁట. ఈయన యొచటనో ప్రాఁతమనిసి; వందయేండ్ల క్రిందటివాఁడు.

ఒకనాఁటిరాత్రి యక్షగానము జరిగెను. ఏయూరో తెలియదు. ఒక జంగమాయన వచ్చి త్రిపురాసురసంహారము యక్షగానము చేసెను. ఆయనతలమీఁది గుండ్రనిపాగ, పాగచుట్టు నక్కిమడతలు, ఆపాదకంఠము జీరాడు పెద్దలుంగీ; లుంగీచివరి కుచ్చెలలు దట్టమై

యతఁడు నృత్యముచేసి గిరగిర తిరుగుచున్నపుడు గుడారమువలె నగుచుండి నొకవిచిత్రశోభ తెచ్చుచుండెను. నడుమునం దొక వస్త్రముబిగించుటచేత నా గుడారము ఏటవాలుగా నగుచుండెను. పై నొకయుత్తరీయము. కాళ్ళకుగజ్జెలు కుడిభుజముమీఁద తంబురా. వ్రేలితో తంత్రులు మీటును. కుడిచేతిబొట్టనవ్రేలినున్న కంచు గిలకలు ప్రయోగించును. అది యొకవిద్య. భావానుగుణమైన రాగము, తదనుగుణమైన లయయు. భావమువెంటఁ గీర్తనఫణితి మారును. రగడలు, కందార్థములు చమత్కారముగానుండెను. శివుఁడు విజృంభించి బాణప్రయోగోపసంహారములు చేయుచున్నప్పు, డసురులు వేలకు వేలుగా మడియునప్పుడు కీర్తనతోఁ గలసి తాళము కిణకిణలాడినది. తద్ధ్వనినుండి శత్రుసంహారము జరుగుచున్నదే యన్న భావ ముప్పతిల్లినది పూర్వము మహాసంస్థలై విద్యావ్యాపకులైన యీపురుషులందఱును నేఁడు దరిద్రులై తిండికిలేక యల్లాడుచుండిరి. ధర్మారావున కొకఁడు తోఁచినది. వీథినాటకములు చూచినను, భజనలు తరంగములు యక్షగానములు చూచినను వారు పాడురాగములు ప్రత్యేకముగా భావము నిమిడించుకొన్న యొకయొయ్యారమైన ధ్వనివిశేషములుగాఁ గనబడెను. నేఁడు దేశములో మోహన, కల్యాణి, శహన మొదలైనరాగములు పాడుచున్నారు. రాగములవియేకాని-ఛాయలు, బాణియు, భిన్నములుగా నున్నవి. ఈకొత్త బాణి మధుర మని తెచ్చిరి. క్రొత్తబాణి మధురమగునో కాదో తెలియదు కాని, ప్రాఁతబాణియందలి భావవిస్పష్టత పోయినది. నేఁటి కందఱును బూర్వపుబాణి ననుసరించిపాడినచో జిగటకాంభోజి యని, వీథినాటకముపంపిణీ యని యాక్షేపించుచున్నారు. గ్రుడ్డియెద్దుచేనిలోఁబడినట్లుగా నున్న యీ నూత్నపద్ధతి సర్వవిద్యలయందు వేరుపుఱువువలెఁ దోఁచినది. జీవితము శిల్పమువంటిది. ప్రయోజనరహితముగా నేదియు నుండదు. శిల్పమున కొక దుర్వ్యాఖ్యానము బయలుదేఱినది - శిల్పముకొఱకే శిల్ప మని. మతములలో నాస్తికమత మెటువంటిదో శిల్పసిద్ధాంతములలో నీ సిద్ధాంత మట్టిది. ఈ జగ త్తిట్లే యున్నది. ఇది యి ట్లుండుటయే పరమార్థమని. అందుచే సంగీతము వినునపుడు 'నాకు మధురముగా నున్నది. కావున నేను

వినుచుంటి' ననుట యవ్యక్తపుమాట. సూక్ష్మముగాఁ జూచినచో దానియం దతఁ డొక భావమును నిరూపించుచున్నాఁడు. సంగీతము, శిల్పము, కవిత్వము—వీనియందు భావ ముట్టిపడవలయును. అదియే రసమునకు హేతువు. మొదట భావ మనఁగా నేమియో తెలియవలయునుగదా!

సప్తాహ మేడుదినములు పూర్తియయ్యెను. పేటప్రజలందఱు నా యేడుదినములును నచ్చటనే భోజనములు చేసిరి. గ్రామములోని వృద్ధులకుఁ బూర్వపురామదండురోజులు జ్ఞాపకము వచ్చినవి.

ఒకనాఁడు ధర్మారావువింటికిఁ గబీరు వచ్చెను. ధర్మారావునకు ముప్పదియేండ్లు దాఁటినవి. కబీరు తనయింటికివచ్చుట యతఁ డెఱుఁగఁడు. కబీరు మునుపటివలె లేఁడు. అతఁడు కొంచెము వృద్ధుఁ డయ్యెను. వేష మాధునిక మయ్యెను. మనసులోమాత్రము ప్రాఁత కబీరే. దేవదాసి దేవాలయములలో నృత్యముసేయుచున్నప్పుడు శ్రుతిపోయుటకు వచ్చినకబీరు పురపాలకసంఘసభ్యుఁ డేమిటి? ధర్మారావు కబీరుని జూచి, రమ్మని లోనికిఁ దీసికొనిపోయి కూర్చుండఁ బెట్టెను. ఏమిపనిమీఁద వచ్చితి వని యడిగెను.

కబీరు—బాబూ! నిర్బంధప్రాథమికవిద్య యఁట. తేపు సంఘసమావేశము జరుగును. దానిస్వరూపము నాకుఁ గొంచెము చెప్పవలయును. నేను తేపు మాట్లాడవలసి వచ్చునేమో! అందుకని వచ్చితిని. ధర్మారావు నవ్వి 'సరే, ఏమి చెప్పుమందువు?' అనెను? కబీరు—ఈవిద్య మన కవసరమా? కూడికలు తీసివేతఁలు, చదువుటయు వ్రాయుటయు నందఱకు వచ్చినందువలనఁ బ్రయోజనమేమి? ధర్మా—వ్రాయుటవచ్చినచో డబ్బప్పు తెచ్చుకొని నోట్లమీఁద దస్కతు చేయవచ్చును. చదువుటవచ్చినచో రైలుస్టేషను వద్ద మాస్టరు టిక్కెట్లు మన మడిగినయూరి కిచ్చునో, యింకొక యూరి కిచ్చునో తెలిసికొనవచ్చును. కబీరు నవ్వెను. ధర్మా—ఈ విద్యావిధానమువలన లాభ మనునది మనకు లేదు. దేశములో వృత్తులుచెడిపోయినవి గనుక నీ విద్యవలన నేమో సంపాదించవచ్చునని లోకమున కాశ కలుగవచ్చును. వృత్తివిద్యలోఁ జదువుకొనకుండనే సంప్రదాయమువలనఁ బ్రతివాఁడును దనయింటిలోననే నేర్చు

కొనును. పదిపదునాతేండ్లవయసు వచ్చువఱకుఁ గులవిద్యయం దారి తేఱును. కులవిద్యయే కూడుపెట్టును. ఇప్పుడు కులవిద్యలు చెడి పోయి, సంపాదించుటకుఁ జదువుకొనవలసివచ్చుచున్నది. ఈ చదువు పూర్తియైనతరువాత నప్పుడు నేర్చుకొనవలయును, వృత్తివిద్య. అందఱును జదువుకొనుట, యందఱును జదువుమీఁదనే సంపాదించుట—ఇది యసంభవము. అందఱు నుద్యోగస్థులే కావలయును. మొదట కులములయందు ద్వేషముపుట్టించుకొని, కులవృత్తులు మాని వేయుటవలన నీ సంకటము ప్రాప్తించినది. సర్వజనులు నొక్కటియే. కులవృత్తి వదలుకొనుట యెందులకు? మనదేశమునఁ గృషికుఁడు విద్యరానివాఁడు. అమెరికా పోయి వ్యవసాయవృత్తి చదివివచ్చిన వాఁడు విద్యవచ్చినవాఁడు. ఇంటిలోనున్న వైద్యము కొంతనేర్చు కొని భిన్నవస్తువుల గుణములు, నాడీపరీక్ష మొదలైనవి బహుశ్రుత మై సహజముగా వైద్యుఁడైనవాఁడు విద్యరానివాఁడు. నాలుఁగేండ్లు చెన్నపట్టణములోనుండి డాక్టరుపరీక్ష చదివినవాఁడు విద్యవచ్చిన వాఁడు. ఈ రీతిగా విద్యవచ్చుటకు రాకపోవుటకు హద్దుగీయఁబడిన దెచ్చటనో తెలియుట లేదు. ఆ గీఁత యింగ్లీషుచదువుమీఁదనేమో యన్నట్లున్నది. కబీరు—అసలు విద్యయనఁగా నేమియో చెప్పుఁడు. ధర్మా—విద్య ప్రధానముగా రెండు విధములు: ఒకటి వృత్తివిద్య, రెండవది జ్ఞానముకొఱకు చదువువిద్య. ఇవి రెండును గలుపరాదు. ఇప్పటి పాఠశాలలో నున్న దోషము వానిని రెంటిని గలుపుటయే. వృత్తివిద్య జీవనాధారమైనది; జ్ఞానముకొఱకైనవిద్య మానిసిహృద యమునకు సంస్కారము తెచ్చుట కేర్పడినది. ఇంక నిర్బంధప్రాథమిక విద్యవలన సంస్కారము కలిగించవలయునేకాని, వృత్తి కలిగించవలయు నని లేదు. అది కలిగించు సంస్కార మెంత యని చూతము. వ్రాయుట, చదువుట సంస్కారమే కాదు. అక్షరమాత్రజ్ఞునకుఁ దనంతటఁ దాఁ జదివి సర్వవిషయములను దెలిసికొనుట యసంభవము. ఈ చదువు ఐహికమునకుఁ గాదు, ఆముష్మికమునకుఁ గాదు. వీథి భాగవతములు, తోలుబొమ్మలు, హరికథలు, యక్షగానములు, జంగముకథలు–నొకటి యేమిటి, సర్వమును విద్యాబోధకొఱకే యేర్పడినవి. దేశమునకు విద్యాబోధ యీ భాగవతాము లాడువారికి

వృత్తివిద్య. సంఘమును రెండుభాగములుగాఁ జేసి, యొకభాగ మింకొకభాగమునకు బోధకము, బోధకమైన భాగమున కది వృత్తి. ఇంతవిచిత్రమైన సంఘసృష్టి యెక్కడ నుండును? వాని నెచ్చటి వచ్చుట మూలచ్ఛేదముచేసి యిప్పుడు నిర్బంధవిద్య యనిన నేమి లాభము? కబీరు—అసలు విద్యాస్వరూపము చెప్పు మనిన చెప్పితిరి కాదు! అసలు విద్య యె ట్లుండవలయును? విద్యకుఁ బరమప్రయోజన మేది? అది కావలయును ధర్మా—విద్యకుఁ బరమప్రయోజన మైనది విస్పష్టమై స్వచ్ఛమైన భావోదయమును గలుగఁజేయుటే. చదువునకుఁ బ్రధానమైనది స్వచ్ఛమైనభావము నెఱుంగుట. అట్టి భావము ఇంద్రియములయొక్క చక్కనిశిక్షచేతఁగాని యుత్పన్నము కాదు. ఇది సంస్కారముపొందుటకుఁ జెప్పఁబడు మన్నవిద్యగాన శ్రవణనేత్రేంద్రియములద్వారా మనస్సును బరిపక్వదశకుఁ దెచ్చుటయే దీనివిషయము. ఇంద్రియములసునిశితమైనజ్ఞానము ప్రథమమున నేర్పడవలయును. ఎట్టిచదువుచెప్పిన నట్టిభావమునకు సన్నిహితవృత్తి కలుగునో యట్టి చదువుచెప్పుట యింద్రియములకు సునిశితత్వము తెచ్చుట. ఇంద్రియములకుఁ జక్కనిశిక్ష కలుగవలయు నన్నచో భావానుగుణమైన సంగీతము, భావాభిరామమైన కవిత్వము నేర్వ వలయును, లేదా తెలిసికొనవలయును. వీథినాటకములు మొదలైన సంస్థ లీ రీతిగా జనులకు విద్యలు చెప్పెను. వారిహృదయములు సంస్కరించెను. పుస్తకములకు, నోటుబుక్కులకు ధనము వ్యయము లేకుండ తేలికగా సంస్కారము కల్పించవచ్చునుగదా! దమ్మిడీఖర్చు లేకుండ నాటకములు చూడవచ్చును, సినిమాలు చూడవచ్చును. ఇప్పుడు ప్రతిదానికిని డబ్బుఖర్చేకదా! అక్షరజ్ఞానముకన్న నిట్టి చదువు ముఖ్యమైనది. నిర్బంధవిధానమని యక్షరములు నేర్పుట కన్న ప్రస్తుతమున్న యధోగతినాటకములు, దౌర్భాగ్యపు సినిమాలు మానివేసి వానిస్థానమున సర్థవంతములైన నాటకములు, సినిమాలను జూపించుమనుము. సామాన్యజనులహృదయములు పరిపాకమునకు వచ్చును. నీవు నిర్బంధవిధాన మని చదువు చెప్పినచోఁ జదువుచెప్పఁచుంటి మని నీ మెహమానునకు వాచకములువ్రాయించిన పుస్తకప్రకటనకర్త బాగుపడుటకుఁగాక దీనివలన నింకొక లాభ

మేమియును లేదు. మీసమావేశ మెప్పుడు? కబీరు—రేపు. ధర్మా—నీకు శ్రమ యెందులకు? ఇది యొక ప్రవాహముగాఁ బోవుచున్నది. దీని నెవరు నడ్డుకొనలేరు. కబీరు—అట్లే కనఁబడుచున్నది నేఁడు నేను వీరిని మఱలఁ బూర్వపువృత్తులన్నియు నిలువఁబెట్టుఁడనఁగాఁ బెట్టుదురా? అది వీరికి సాధ్యమగునా? ధర్మా—ఒక మహాప్రచండ వాయువు వీచుచుండఁగా నొరిగిపోవుచున్న వృక్షమును నిందించి యేమి లాభము?

ఒకనాఁడు సప్తాహముదగ్గఱకు రాధాపతియు, మంగమ్మయు వచ్చిరి. దూరమునుండి ధర్మారావు వారిని జూచెను. వారి వెంట నిద్దఱుపురుషులు నూతను లుండిరి. ఒకఁడు కొంచెము స్త్రీవలె నటించెను. రంగావధాని వాఁడో, రెండవవాఁడో ధర్మారావునకుఁ దెలియలేదు. అప్పుడు వారిని బలుకరించుట యతని కిష్టములేక యూరకుండెను. ధర్మారావు కబీరుతో మాటాడిన మఱునాఁడు రాధాపతి కనిపించి 'మాయింటికిఁ బోదము వత్తురా' యనెను. ధర్మారావు రాధాపతివెంటఁ బోయెను. ఇంటికిఁ జేరినంతనే రాధాపతి 'చెంగల్వరావు! కాళ్ళు కడుగుకొనుటకు కొంచెము నీరు తెచ్చి పెట్టుము' అనెను. అతఁడు నీరుతెచ్చి క్రొత్తమగవానిని జూచి సిగ్గుపడి పైనున్నయుత్తరీయము పయ్యెదవలె సర్దుకొని నీరు వాకిటి లోనుంచి గబగబ లోనికిఁ బోయెను. రాధాపతి ధర్మారావుతో 'ఇతఁడు కొంచెము తృతీయాప్రకృతి లెండి' యనెను. ధర్మారావు 'తృతీయాప్రకృతివలె లేఁడే, ద్వితీయాప్రకృతివలెనే యున్నాఁడు' అనెను. ఇర్వురును లోనికిఁబోయి కూర్చుండిరి. చెంగలారావు తలుపు చాటుననుండి తొంగితొంగి చూచుచుండెను. రాధా—ఏమండోయి! మీమీఁదఁ గన్ను వేసినాఁడు. ధర్మా—నామీఁద నొక్కకన్నే. రాధా—అనఁగా తక్కినవన్నియు నామీఁదవేసినాఁ డనియా! ధర్మా—ఇతని దే యూరు? రాధా—అతనినే యడుగుడు. 'ఏమోయి ఇట్లు రా! నీ కథయంతయు వీరితోఁ జెప్పుము. రా వేమి! వీనికిఁ జెడ్డసిగ్గండి. కాని మీవంటిపెద్దమనుష్యులవద్ద లేదు. "రావోయి చెంగల్వ! నీ రెవ రనుకొన్నావు? ఈయూరికిఁ గ్రొత్తగా డిప్యూటీకలెక్టరుగా వచ్చిరి నెలకు పాతికరూపాయ లిచ్చి వంటకుఁ

బెట్టుకొందురు." చెంగల్రావు—"నేను మంగమ్మగారిని వదలిపెట్టి రాసుగదండీ" యని నాటకములోని నీచస్త్రీపాత్రవలె మొగము పదివంకరలు త్రిప్పుకొనెను. బలవంతముమీఁద వచ్చి, పయ్యెదసర్దుకొని, కట్టుకొన్న పంచె నీలమండలవఱకును ముసుఁగువేసికొని, ముసిముసినవ్వులు నవ్వుచుఁ దనకథ చెప్ప నారంభించెను. "మాది, అసలండీ, గుంటూరుదగ్గఱ కొర్నిపాడు. మాకుఁ బదియెకరములు మాగాని యున్నది. అది మానాయన పాడుచేసినాఁడు." రాధా—అబద్ధములు చెప్పకు. ఆ మాగానిమీఁద పదిపుట్లు నిలని కిప్పుడు వచ్చుచునే యుండెను. వట్టిదౌర్భాగ్యుఁడు. అబద్ధములు చెప్పుటకు నిధి. చెంగల్రావు—నాకుఁ బదియకరములు యాస్తియున్నచో మీరు చెప్పుతోఁ గొట్టుఁడు, పడెదను. నా పాల మేమైన మీరు తీసికొందురా? నే నబద్ధ మేల చెప్పవలయును? తరువాతనండీ; మా నాయనగారు చనిపోయిరి. రాధా—ఓరి నీదుంపతెగ. ఆయన నిక్షేపమువలె బ్రతికియున్నాఁడు. వీని కిదొకరోగ మండి. తండ్రి చనిపోయినాఁడని చెప్పి, రేపుమాసిక మని, యెల్లుండి తద్దిన మని రైళ్ళలో బిచ్చమడుగును. చెంగ—మా నాయన చనిపోలేదండీ? మాయూరు రండి! నేను ఋజు విప్పింతును. వీరిపే రేమి టండీ! రాధా—ధర్మారావుగారు.

చెంగల్రావు సిగ్గుపడి మఱల నాలుగుమెడలు త్రిప్పి కన్నులాడించి 'ధర్మారావు బావగారూ!' అని పిలిచి మఱల సిగ్గుపడెను. రాధాపతి—'సిగ్గెందుకులే, యందఱకు బావ లైనప్పుడు?' అనెను. చెంగ—నేను తిండిలేక మాయూరు వదలివచ్చి రైళ్ళలో నడుగుకొనుచుండఁగా వీరు—రాధాపతిబావగారు, పెద్దబావగారు—చూచి నన్ను బెజవాడలోని వారియనాథశరణాలయమునకుఁ దీసికొనిపోయిరి. అక్కడకు నావంటి యనాథ యింకొకతె వచ్చినది. రాధా—ఛీ, గాడిద! నోరు మూయుము. చెంగ—ఏమండి! మంగమ్మ అనాథ కాదూ! ఆవిడకు మగఁడులేఁడుగదా! ధర్మా—'కొంచె మితనికి తలకాయ యున్నట్లున్నది' రాధా—అది యుండవలసినచోట లేదు. మెడమీఁద నుండవలసినది కబంధునివలె బొట్టలో నున్నది. చెంగ—బావగారూ! మీ రేమియు ననుకొనకుఁడు. పెద్దబావగారు

నాతో వరుసలాడును లెండి. ధర్మా—ఇంతేనా? ఇంకేమైన కథ యున్నదా! చెంగ—ఏ మున్న దండీ! మంగమప్పను జూచినప్పటి నుండియు నా కామెమీఁద చెప్పవద్దూ, ప్రేమ కలిగినది. రాధా—ఆవిడమీఁదఁ బ్రేమ ఏమిటోయి! చెంగ—ప్రేమ యనఁగా మీ రను కొననటువంటిది కాదు. ఆమెకుఁ దలదువ్వవలె నని, జడవేయవలె నని, ఆవిడ తిన్న విస్తరి తీయవలెనని. రాధా—ఇది గొప్పరకపు ప్రేమయే. ప్రేమ యిట్లుండు నని యెవ్వరును వ్రాయలేదు. ధర్మా—ఇది యొకరీతి ప్రేమతత్వము. ఇతనికిఁ గొంత అనుయాయులు దొరికిరేని యిదియు నొకమార్గమే యగును. అప్పుడు దానిని 'చెంగ ప్లాపుస్కూ' లందురు. ఆతని ప్రేమతత్వము గ్రంథరూపమున వ్రాసి నచో నితనియనుయాయులు పర దేశములందుఁ బుట్టుదు రేమో? రాధా—ఇతని కింకను ప్రజ్ఞలున్నవండీ. గాడిదవలెఁ గూయును. నక్కవలె మొఱుగును. అన్నిజంతువులధ్వనులును చేయును. మే మొకనాఁడు నెల్లూరుపురాంతభూమికిఁ బోయి యచట రాత్రిప్రొద్దు పోవువఱకుఁ గూర్చుంటిమి. అప్పు డితఁడు నక్కవలెఁ గూసెను. వెంటనే మాచుట్టుపట్ల పదిపదునొకండునక్కలు కూసి మాచుట్టును మూఁగినవి. వాఁడు హడలిపోయి మమ్ముఁ గౌఁగిలించుకొన నారంభించెను. మేము చుట్టునమూఁగిననక్కలతో నెట్లు పోరాడగలము? అవి మేము గద్దించిన పోలేదు. అదృష్టముకొలఁది చేతిలో విద్యుద్దీప మున్నది. దానిని జూపించువఱకవి పాఱిపోయినవి. వీనితో వచ్చి నందులకుఁ దగిన పరాభవమైనదిరా యని యప్పటినుండి యితనిని షికారు తీసికొనిపోము. ఏదీ, చెంగలావు ఒకకూఁత కూయుము. ధర్మా—ఇప్పు డెందుకు లెండి! రాత్రికి కూయించుకోవచ్చును. ఇతని కేమైనజీత మిత్తురా? చెంగ—నాకు జీతమక్కఱలేదండి! మా బావగా రుండిన నంతియే చాలు. తిండి వారితోఁ గలసి తిందును. గుడ్డ కేమి? మంగప్ప చీరలు కట్టుకొందును, లేదా బావగారి యుత్తరీయములు పైఁట వేసికొందును. రాధా—నాబట్టలుమాత్రము ముట్టకొనకు, మంగప్పచీరలు నీయిష్టమువచ్చినట్లు వాడుకొనవచ్చు గాని ఇంతలో మంగమ్మ వా రున్నచోటికి వచ్చి తా నొకకుర్చీలోఁ

గూర్చుండెను. రాధా—వీరు ధర్మారావుగారని, యీ యూరే వీరిది. మంగ—నేను కొద్దిగాఁ జూచినట్లే యున్నది.

ధర్మారావునకుఁ బ్రాణములోఁ జాలఁగష్ట మయ్యెను 'స్వామీ! వచ్చివచ్చి యిచ్చటికి వచ్చితి నేమని మనసులోఁ జాల బాధపడి, నేఁడు రెండును సుదర్శనములైనవి: ఒకటి తృతీయాప్రకృతి, రెండు రాక్షసప్రకృతి ధర్మారా వేదో పనియున్న దని చెప్పి లేచెను. రాధాపతి 'యంత హఠాత్తుగా లేచితి రే' మనెను. ధర్మారావు 'పని యున్నది. మఱల వచ్చెదను లెండి' యని యదేపోక పోయెను. దారి వెంట "గ్రామమంతయుఁ జాల మారిపోయినది. లోకమే మారిపోయి నది. స్వేచ్ఛాప్రవృత్తి యెక్కువ యైనది. తినుటకుఁ దిండి యుండి నచో న్యాయస్థానమునకు లాగఁబడరాని యేదోషముచేసినను దోషము కాదు. సంఘబహిష్కృతి లేదు. ఎవరియూహ వారిది. సంఘమునకు వ్యతిరేక మని చేయ మాన నవసరము లేదు. వీ రేదో మతస్థాపకులవలె నున్నారు" అనుకొనుచుఁ బోయెను. ఇంటికిఁ బోయినంతనే యరుంధతి చావడిలోఁగూర్చుండి రాటము త్రిప్పు చుండెను.

ధర్మా—ఇన్నాళ్ళనుండి తీయుచుంటివి. ఒకచీరకైనను దీసి కొన్నావా? అరుం—మీకు ధోవతియు, నుత్తరీయమును వచ్చును. మీరుకూడఁదీసినచో బాగుగా నుండును. అత్తయ్యకు బట్టలు లేవు. మీకు గ్రామసంచారముతోడనే సరిపోవునాయెను. ధర్మా—మా నాయనగారినా యనమ్మ పూర్వము దారముతీసెడిదఁట! గాంధిగారి పుణ్యమా యని మఱల నీవు బయలుదేఱితివి. ఆమెపేరు నరుంధతి యేఁనట. మే మెప్పుడును వ్యవహారములు చేసినవారమేకాని, రాట ములు వడికినవారము గాదు. అరుం—నేఁడు చేసినవ్యవహారమేమిటి? ధర్మా—ఏమిటీ! ఎంత వ్యవహారము చేసినానని!! ఇదివఱ కిద్దఱు స్త్రీలను వదలిన పురుషునకును, ఇద్దఱుపురుషులను వదలిన స్త్రీకిని సంబంధము కుదిర్చి వచ్చినాను. రాధాపతి యని యొకయెట్టుని బుట్ట జుట్టాయన మనయింటికి వచ్చెనే- ఆయనయు మంగమ్మయు నిప్పుడు కలిసి సంసారము చేయుచున్నారు. అరుం—ఆయనయేమో పెద్ద చదువుకొన్నవాఁ డని చెప్పితిరే! ధర్మా—చదువుకొన్నవాఁడు

అన్నమాటకుఁ బూర్వమున్న యర్థము వేఱు. నేఁటియర్థము వేఱు. వేదశాస్త్రములు చదివి యందుఁగల ధర్మము లాచరించుచున్నవాఁడని పూర్వమున్న యర్థము. ఇప్పటి యర్థమునకును, దానికిని సంబంధము లేదు. ఒక బి. ఏ. పరీక్ష యిచ్చి, తెలుఁగులలో-మఱి దేనిలో నైనను సంగతి తెలిసినవాఁడని యర్థము. అతఁడు నీతిమంతుఁడని కాని, ధర్మశాస్త్రవేత్త యని కాని యర్థ మిప్పుడు లేదు. అరుం—దయచేసి యీ మహాపురుషుని మనయింటి కింక రానీయవలదు. ధర్మా—ఒకవేళ వత్తు నను నేమో! అరుం—వచ్చినచో వీథియరుగు మీఁదఁ గూర్చుండఁబెట్టి మాటాడి పంపించుఁడు. దేవత లున్న యింటిలోనికిఁ బిశాచములను దీసికొని రాకుఁడు. ధర్మా—ఎవ రా దేవతలు? నీవా? అరుం—నే నని చెప్పలేదు. సుబ్రహ్మణ్యేశ్వర స్వామియైన నున్నాఁడా? ఆ రెండుశిరసులనాగును మీరు మఱచి పోదు రేమో? మఱచియే పోదురు. అటువంటిస్థలమునకుఁ బోయినచో మఱచిపోక యే మగును?—ధర్మారావు మఱల మాటాడలేదు.

కుమారస్వామి మఱల నొకనాఁడు ధర్మారావుకొఱకు వచ్చి 'యయ్యా! నాకు వివాహము తప్పక కావలయును. ఇప్పుడు కాక పోయినచోఁ దరువాత నాకీ పిల్ల నీయ రేమో యని నా కనుమానముగా నున్నది. ఎట్లైన మీ రీ వివాహముచేసి పుణ్యము కట్టుకొనవలయును అనెను ధర్మా—ఇప్పు డంత భయ మేమి వచ్చెను! కుమా—భయ మేమియును లేదు. మీరు నాకు సాహాయ్యముచేయవలయును. ధర్మా—ఏదో మనసులో నున్నది, దాఁచుకొనుచున్నావు. చెప్పినచో వచ్చెదను. కుమా—రెండు నెలలక్రిందట బి.ఎస్.సి. పరీక్షలుయిచ్చిన యొకనాయఁడు వారియింటికి వచ్చెను. ఆయనది నెల్లూరఁట. ఆయనకులగోత్రములంత మంచివి కావు. మేము కాశీలోనున్నప్పు డాయనకూడ నచట చదువుచుండెను. అతని పేరు చక్రవర్తి. అసలుపే రది కాదు లెండి. అతఁడు ఒక యీడిగ దాని నొక యాచార్యులుగా రుంచుకొనఁగాఁ బుట్టినవాఁడు. తండ్రియుఁ దల్లియుఁ జనిపోయిరి. ఆ యాచార్యులు పదివేలరూపాయ లితనికిచ్చి చచ్చెను. అతఁడు చనిపోయినతరువాతనె యితఁడు కాశీకి వెళ్ళినది. వాఁడు చాల జిత్తులమారి. కాశీలోఁ బేదవానివలె నటించి యచ్చట

బహుమానవేతనములు; చందాలమీఁద చదువు సాఁగించినాఁడు. ఇక్కడ నున్నను కాఫీహోటలునకు స్నేహితులతోఁగాని పోఁడు. అందఱివస్తువులును దనవిగానే వాడుకొనును. మొన్న మఱల వచ్చినాఁడు. నాగుడ్డలు బ్రదుకనీయఁడు. అతనికి శ్యామలకును గాశీలో నున్నపుడే పరిచయము కొద్దిగాఁగలిగెను. ఇప్పు డతనికి వారణాసి హిందూవిశ్వవిద్యాలయములో డెబ్బదిరూపాయల యుపకారవేతనముతో ఎమ్. ఎస్. సి. చదువుటకు రమ్మని వార్త వచ్చినది. ముందునాఁటికిఁ బోవును. అతఁడు మంచి 'కాకా' పట్టును లెండి. కొద్దిగా నింగ్లీషులోఁ గవిత్వముకూడ వ్రాయును. అచ్చటఁ బ్రిన్సిపాలుమీఁదఁ బ్రొఫెసర్లమీఁదఁ బద్యములు వ్రాసెను. వారితని కన్న మొనగాఁడు లేఁడనుకొనిరి. ధర్మా—శ్యామలను బెండ్లాడినచో నీ వే మగుదువు? కుమా—మంచిరోజులు వచ్చుననియే కదా యీ ప్రయత్నము. మీరు మధ్య న న్నడిపించకుఁడు. కథ చెప్పనిండు.. వీనిపే రసలు చక్కయ్య. వీఁడు చదువుకొని బాగుపడు నని యెవ రనుకొనిరి? వీఁ డదృష్టజాతకుఁడు. చక్రవర్తియైనాఁడు. వీఁ డిచ్చటికి వచ్చినపుడెల్ల శ్యామలవీనితోడనే మాట్లాడును. ఆమెకు నేనున్నట్లే యనిపించదు. ఇదిగాక మూన్నాళ్ళక్రిందట మాటాడుచు పంకజమ్మగారు "నీవు బి. ఏ. ప్యాసైననే మాపిల్లదాని నిచ్చెదను. లేకపోయినచో నీయ"ననెను ఇదియంతయుఁ జూచినచోఁ జివరకు నాకు వీ రెగఁగొట్టుదురేమో యని భయముగా నున్నది నాపని 'యుభయభ్రష్టత్వము, ఉపరి సన్న్యాసము' నగునేమో? నిగమశర్మ చెప్పినట్లు "ఈ కడజాతినాతి కిహిహీ మహిదేవుఁడు చిక్కెనంచు నక్కరాకకుఁ బోకకుఁ జనపరంపర కెంపగుఁజూడ్కిఁ జూచి యంబూకృత మాచరించుటకు బుద్ధిఁ దలఁకక" కాని, యసలుకే మోసము వచ్చునేమో యని భయపడుచున్నాను. ధర్మా—నీ కీ బలవంతపుబ్రాహ్మణార్థ మెందులకు? కుమా—మఱల మాబంధువులు నన్నురానీయరు. నేను రెంటికిని జెడుదునా? ధర్మా—మఱి న న్నిప్పు డేమి చేయమందువు? కుమా—మీ రనినచోఁ బంకజమ్మగారికిఁ జాలగౌరవము. మీమాట తీసివేయదు. మీ రీ నాఁడు సాయంకాలము రండు! వారియిద్దఱిపికారైనను దప్పును. ధర్మా—అబ్బాయీ! అటువంటి

సంఘములోఁ బ్రవేశించినతరువాత నిట్టియనుమానములు పెట్టుకొన రాదు. వారందఱును న్యాయముగాఁ బ్రవర్తింతు రనియే యనుకొన వలయును. చదువుకొనినవారు, వా రట్లు చేయుదురా? కుమా— మీరు దయచేసి సాయంకాల మటు రండు. ఇంకొక్కటి చెప్ప మఱచితిని. ఇప్పుడు రాధాపతి మంగమ్మలకును, మాయింటికిని జాల స్నేహము కలిసినది. పంకజమ్మగారికి రాధాపతిగారు పెద్దపండితులని, సంఘసంస్కర్త లని యూహ కలిగినది. ధర్మా—మఱి వెనుక నాతో నతనిగూర్చి పరిహాసముగా మాటాడినదే! కుమా—అప్పుడాయనను సరిగా నెఱుఁగదు. ఇప్పు డెఱుఁగును. ఆయనవద్ద హిందీ చదువుకొనునఁట మీరు వానిని జూచితిరా? ధర్మా—చెంగల్రావునా? కుమా—అబ్బా! వాఁ డెంతవాఁ డనుకొనుచున్నారు? పైకి నాడంగిరేకలవానివలెఁ గనిపించునుగాని, లోపలఁ జాలగుండెముండకొడుకు! వాఁడు స్త్రీవలెఁ బ్రవర్తించును. అదియంతయు నభినయము. వాఁ డెందుకో మంగమ్మదగ్గఱఁ దిష్ఠవేసెను. 'ఫలానుమేయాః ప్రారంభాః' అని. అది మన కిప్పుడు తెలియదు. నేను నెమ్మదిగాఁ జాలుతీయుచున్నాను లెండి. మీకుఁ దరువాత చెప్పెదను అని కుమారస్వామి వెడలిపోయెను. ధర్మారావు లోనికిఁ బోయెను.

అరుం—కుమారస్వామి చక్కఁగాఁ జదువుకొన్నవాఁడా యేమి? నిగమశర్మ యనుచున్నాఁడు, 'ఫలానుమేయాః ప్రారంభాః' యనుచున్నాఁడు. ధర్మా—మఱి జాతీయకళాశాలలో సంస్కృతాంధ్రములయందుఁ బంచకావ్యములు చదివినాఁడుకదా! అరుం—అతనికి సంబంధముకాకపోయినచోఁ గులముకలసంబంధ మేదైనఁ దేరాదా? ధర్మా—అతనికి దమ్మిడీ యాస్తి లేదు. ఆర్షేయపౌరుషేయములు చూచి, బుద్ధిచూచి నేఁటిబ్రాహ్మణ్యము పిల్లనిత్తురా? అతనికి గుంటూరులో బంధువు లున్నారు. వా రందఱును ధనవంతులు. ఒకాయన పెద్ద ప్లీడరు. మేనమామ తహసీల్దారు. వీండ్రు తిండిలేక నానాగడ్డియుఁ గఱచుచుండగాఁ జూచెదు దిక్కులేకపోయినది. ఈ కాలపుబ్రాహ్మణులనే చెప్పవలయును. దేశములో బ్రాహ్మణేతరోద్యమమునకు నీ బ్రాహ్మణులదుర్వృత్తియే సగముహేతువు.

ధర్మశాస్త్రములుపోవునది యొకమార్గమున. ఈ బ్రాహ్మణులుపోవు నది మఱియొకమార్గమున. వీరియందు దయాతితిక్షాదులు లేనే లేవు. బైబిలులోఁజెప్పినట్లు వీరు 'మేమను'--అనఁగా ధనాధిదేవత-వానిని బూజింతురు. ఏనో చెప్పదరే శాస్త్రము—'మాయింటికి వచ్చుచు మా కేమి తెచ్చెదవు. మీ యింటికి వచ్చినచో మా కేమి పెట్టుదువు?' అన్నట్లుగా నుండును, వీరి ప్రవర్తన. ఏపూట కా పూఁటకు గడచుట కష్టమై వీరిసంసారము గుంటూరులో బాధపడు చున్నది. మేనమామలు, పినతండ్రులు వీరివంకఁజూడరు. వీరి సప్ర యోజకు లని, యెందుకును గొరగానివా రని నిందించుటలో లోప మేమియు లేదు. వీరియింటిలోఁ బిల్లి సమర్తయాడిన దనుకొనుము. అందఱును బెట్టెలోని వెండిచెంబులును, పట్టుతాపితాలును దీసి భోజనాలకుఁదయారగుదురు. భోజనములో లోప మేదైనఁ జరిగి నచో 'చేతగాని వెధవ. ఈ మాత్రమువాఁడు భోజనమున కెందుకుఁ బిలువవలయునుఁ?' అని యల్లరిచేయుదురు. ఎచ్చటనో తల తాకట్టు బెట్టి యప్పుతెచ్చి, వీ రందఱిని మేపు సనుకొనుము! అప్పుడు వాఁడు కాఁబట్టి యాసంసార మీఁదుచున్నాఁ' డని పొగడెదరు. పెట్టినచో పెండ్లి; పెట్టకున్న శ్రాద్ధము. ఇది యీ బ్రాహ్మణబ్రువుల నడత. ఏఁబదియేండ్లు వచ్చి పెండ్లిచేసికొనువారు. స్త్రీలయందును, దమయం దునుగలదుర్నీతిగోప్యముగా దాఁచుకొనువారు-తమయందుబ్రాహ్మణ గుణము లేదు. 'పరుఁడు వానికొంపలో భోజనము చేసినాఁడు. పంచ ములను ముట్టుకొన్నాఁడు. గూడెమువారితోఁ గలసియున్నాఁడు' అని వారికి వెలి. కొడుకుచేత నింగ్లీషు చదివించని యవధానులు, సోమయాజులును జూపించుము. హైకోర్టులో వకీ లనినచో, తహసీల్దా రనినచో గొప్పమర్యాద. వారందఱును దొరలతోఁగలసి టీ త్రాగు వారే- స్పెన్సరుహోటళ్ళలో కోడిగుడ్లుఅట్లు తినువారే. కుమార స్వామి పోయి పంకజమ్మగారియింట భోజనముచేసినఁ దప్పు వచ్చి నది. ఎందుచేత ననఁగా పంకజమ్మ కధికారము లేదుగనుక. బ్రాహ్మణ జాతియంతయు నశించిపోయినది. అధికారమును, ధనమును నారా ధింతురేకాని, మతధర్మములు నిలువఁద్రొక్కు-కొనవలయుననియాశ యెవరికిని లేదు. ఉత్తమగుణములు లేవు. వీరిని దడవుటకన్న వాగ్దోష

మింకొకఁ డుండఁడు. వేలకువేలు కట్నములు పుచ్చుకొని కాని కొన్నాళ్ళకుఁబెండ్లిచేయరు. ఇంతధనాశామూషితమైనజాతికి నాత్మస్తుతియే ప్రాప్తి. అరుం—అయినచోఁ గురుస్వామి చేయుచున్నపనియే మంచి దనియా మీయభిప్రాయము? ధర్మా—నేనదియనుట లేదు. కుమారస్వామి యేమి చేయును? బ్రతుకుటకు వేఱేమార్గము కనిపించలేదు. బంధువు లెవరును సాయపడలేదు. ఆవిడ డబ్బిచ్చి చదువుచెప్పించుచున్నది. ఏదోయొకవిధముగా వారి సంసారమును నడుపుచున్నది. బ్రదుకుట సాఁగినఁగదా, ధర్మమునుగూర్చి విచారణ? జీవికకే కష్టమైపోయెను. అందుచేఁ గుమారస్వామి చేయుచున్నది యాపద్ధర్మముగా బాగుగనే యున్నది. అరుం—ధర్మశాస్త్రములం దాపద్ధర్మము లిట్లే చెప్పఁబడినవా? ధర్మా—ఆశ్రమధర్మములు నేఁటిబ్రాహ్మణులాచరించుచున్నట్లే చెప్పఁబడినవా? అరుం—ఆఱునెలలుసావాసము చేసినచో వారు వీరగుదురఁట! ధర్మారావు (నవ్వి)—వాదించుటకు వచ్చితివికదే ప్రియురాలా! తోఁక మడచితివేమి? అరుం—నాకెవరైన డబ్బుఖర్చుపెట్టి చదువుచెప్పించిరా, నాకు మీతో వాదించఁగల శక్తి వచ్చుటకు?

ఆనాఁటిసాయంకాలమున ధర్మారావు పంకజమ్మయింటికిఁ బోయెను. పంకజమ్మ, శ్యామల, చక్రవర్తి, రాధాపతి, మంగమ్మ వీరందఱును సభ దీర్చియుండిరి. ధర్మారావుతోఁ జక్రవర్తికిఁ బరిచయము కలిగించిరి. శ్యామల వీణ వాయించుటతో సభ ప్రారంభమయ్యెను. టీ కాఁచి యందఱకు నిచ్చిరి. ధర్మారావు రెండు పూఁటలభోజనముతప్ప మఱియింక నేమియుఁ జేయఁడు. అందుచే నతఁడు టీ త్రాగలేదు. పంకజమ్మ 'మాయింటిలో టీకూడఁ ద్రాగరాదుటండీ'యనెను. ధర్మారావు 'ఎబ్బెబ్బే, నా కది పడదండీ' యనెను. కొంతసేపటికి ధర్మారావు 'శ్యామలాకుమారస్వాముల వివాహ మెప్పు'డని యడిగెను. చక్రవర్తి తలయెత్తి ధర్మారావు వంకఁ జూచెను. ధర్మా—అట్లు చూచుచున్నా రేమి? మీకుఁ దెలియదా యేమి, వారిప్రేమకథ? 'జాతీయకళాశాలలో నేను కొన్నాళ్ళుపాధ్యాయుఁడను. వీ రిద్దఱును నావద్ద చదువుకొనిరి. అప్పుడు ప్రేమలేఖలు వ్రాసికొనిరి. పంకజమ్మగారు కుమారస్వామికి

శ్యామల నిచ్చుట కంగీకరించెను. ఇప్పు డతఁడు వివాహము చేయు మనియుఁ, బంకజమ్మగారు పట్టభద్రురాలైనఁగాని చేయుమనియు వాదోపవాదములుగా నున్నవి. చక్రవర్తి—అసలు వివాహసంస్థయందు నాకు విశ్వాసము లేదండీ! ధర్మా—అయినచోఁ దమతోఁ మాటాడుటకు మాకుఁ దాకత్తు చాలదు. ఎందుచేత విశ్వాసము లేదు? చక్ర—నేను వాదనకు వచ్చువాఁడను గాదు. ధర్మా—వాదన గాదు. మీయభిప్రాయ మేమో తెలిసికొందమని. రాధాపతి—మీకు వాదించవలయు నని యున్నచో నేను వాదించెదను. నాకును వివాహసంస్థయందు విశ్వాసము లేదు. ధర్మా—కుమారస్వామీ, నీకుఁ గలదు కదా! కుమా—నాకును, శ్యామలకు నిద్దఱికిని గలదు. పంకజమ్మగారికిఁగూడఁ గలదు. ధర్మా—అయినచో ఫరవా లేదు. పిల్లకుఁ బిల్లవానికిని విశ్వాసమున్నచోఁ జాలును. లేనివారు చేసికొనరు. ఉన్నవారు చేసికొందురు. నష్ట మేమి? చక్రవర్తికి ధర్మారావు తప్పించుకొని వెక్కిరించినట్లు మాటాడుట కోపహేతు వయ్యెను. అయి యిట్లనెను: 'మీకు విశ్వాస మున్నదా, లేదా? మీ రది చెప్ప రేమి?' ధర్మా—దేనియందు. రాధా—వంకాయకూరయందు. చక్రవర్తి—వివాహసంస్థమీఁద. ధర్మా—నేను వివాహితుఁడను. నా కొకకుమారుఁడుకూడఁ గలఁడు. చక్ర—వివాహము చేసికొన్నంతమాత్రముచేత నా సంస్థమీఁద విశ్వాసముండ నక్కఱ లేదు. ధర్మా—ప్రతివిద్యకును నాల్గుదశలు: అధీతి బోధాచరణప్రచారము లని. అవి నాల్గును గలసినచోటనే విద్యకు సంపూర్ణమైన స్థితి కలదు. నే నొకటి చదువుకొని, నే నది యితరులకుఁ జెప్పి, దాని నాచరించి, యితరులచేతఁ జేయించుటయు నను నవి నాల్గుదశలు. తన కర్థముకానిదాని నాచరించుటయు, నర్థమైన దాని నాచరించకుండుటయు మాశాస్త్రములలో లేదు. చక్ర—మీరు చదివినవిద్య తప్పువిద్య కావచ్చును. మీ కర్థమగుటలో సరిగాఁ గాకపోవచ్చును. ధర్మా—కావచ్చును. కుమా—మీరు మాసంగతి వదలిపెట్టి మీలో మీరు వాదించుకొనుచున్నారు. ధర్మా—చక్రవర్తిగారు వాదించరఁట, అందుచే నేను వారితో వాదించుట లేదు. రాధాపతి—నేను వాదింతు నంటిని కదా! ధర్మా—

సరే, వాదించుఁడు. రాధా—లోకములో స్త్రీపురుషు లందఱును కామేచ్ఛ కలవారు. ఎచ్చటఁజూచినను భర్తయు, భార్యయు నితర స్థలములయందు సంచరించుచునే యున్నారు. వివాహమనునది యాచారముగా జేసికొనున్నారుగాని, 'ఇదిగో వీఁడు ఏకపత్నీ వ్రతుఁడు, ఈమె పతివ్రత' యని చూపించఁగలవారిని జెప్పుఁడు! ధర్మా—వీరిప్రవర్తన బాగుగా నుండలేదని మీరు చూపించుఁడు! రాధా—లక్షోపలక్షలు. మంచివారు నా కెచ్చటను గనుపించలేదు. ధర్మా—మంచివా రనఁగా నేకపత్నీవ్రతులు, పతివ్రతలు ననియే కదా! మీ యర్థము? అట్టివారు మంచివారైనప్పు డట్లుండుట మంచి దనియేకదా! అట్లుండుట మంచి, యిట్లుండుట చెడ్డ - ఇది మీ రన్నమాటయే. వేఱే వాదన యక్కఱ లేదు. చక్ర—పండితు లందఱును జేయునది యిదియే. మాటల యర్థమును విఱిచెదరు. అది వాదన కాదు. ధర్మా—అది వాదన యగునో కాదో తరువాత మీరు వాదించుఁడు లోకములో దాంపత్య మాదర్శప్రాయముగా లేదనుట వాదనకాదు. మనము కొన్ని మామిడిపండ్లు పుచ్చువైనచో చక్కనిమామిడిపండే యుండ దని వాదించుట యెట్లు? లోకమునం దేకపత్నీవ్రతు లుండరాదా? రాధా—లే రని నాయుద్దేశ్యము. ధర్మా—అమాట తప్పు నే నన్నాను. రాధా—మీకుఁ బరస్త్రీ మీఁద బుద్ధియే ప్రసరించదా? ధర్మా—మీరు సరిగా మాటాడ వలయును. 'మనస్సే ప్రసరించదా' యనవలయును. మనస్సు వేఱు; బుద్ధి వేఱు మనస్సు చంచలమైనది; బుద్ధి సిద్ధాంతరూపమైనది. పరస్త్రీసంగమము దోషము కాదనుబుద్ధి నాకు లేదు. మనస్సు ప్రసరించవచ్చును. మనస్సు నిత్యము చంచలమైనది. దానిని బ్రయత్నముచే నియమించవలయును. రాధా—ఎందుకు నియమించవలయును? దాని యిష్టమువచ్చిన ట్లది పోయినచోఁ దప్పేమి? ధర్మా—మనము విద్యకావలయు నని చదువుకొనుచున్నాము. చదువుకొని కొంతనీతిగాఁ బ్రవర్తించుచున్నాము. చదువుకొనకపోయిన నేమి, నీతిగాఁ బ్రవర్తించకపోయిన నేమి అనినచో సమాధాన మేమియును లేదు. చదువుకొనివాఁడు జానపదునివలె నాగరకులయందుఁ జక్కఁగా నెట్లు ప్రవర్తించలేఁడో, యట్లే యనియమితమైన మనస్సు మహావిష

యములయందు నాగరకమై యుండును. ఆధ్యాత్మికమైన గౌరవము కలుగదు. నాగరకత యనఁగా నియమముల కొదిగియుండుట. మనము దగ్గఱ స్నేహితులతో నున్నప్పుడు యథేచ్ఛముగా మాట్లాడుదుము. సభలో నున్నపు డొక్క నియమము నవలంబింతుము. దానిపేరే సభ్యత. వాఙ్నియమ మెట్టిదో, నలుగురిలో మర్యాదాప్రవర్తన మెట్టిదో, వానిననుసరించి సభలోఁ బురుషునకు యోగ్యత యెట్లుకలుగునో యట్లే మనస్సునకు నియమావలంబనముచేత నుత్తమయోగ్యత కలుగును. వాంఛయణఁచినవానికి లఘుత; నియమించినవానికి గురుత. రాధా—నేను మీ సిద్ధాంతముల నొప్పుకొనను. ధర్మా—అయినచో వాదింతు ననక్కఱలేదు. పంక—ఈ వేదాంతవిచారణలతోఁ గాలము దుర్ఘటముగా నడచును. నలువురమును గూడినప్పుడు కాలయాపనయగునట్లు సరదాగా మాటాడుకొనవలయునుగాని, యిట్టి విశేషవిషయములు ప్రసంగించుకొనినచో నందఱకును రుచించవు. ధర్మారావుగారూ! మీరు చక్కఁగా పాడెదరు. ఏదైన కొంచెము పాడుఁడు. చక్ర—ఆయన యిప్పుడు వేఁడిమీఁద నున్నారు. ఆయనను బాడు మనరాదు. శ్యామల—మంగమ్మగారు సంగీతము చెప్పుకొనుచున్నది కాఁబోలు! రాధా—సంగీత మేమి? జే పీపాటికి ప్రవేశపరీక్ష నిచ్చివచ్చును. ఇంగ్లీషు, సంస్కృతము, తెలుఁగు, సంగీతము ఎన్నివిద్యలలో నాఱితేఱును? మంగ—గురువుగారు శిష్యురాలిని బొగడరా?

మంగమ్మ పూర్వపుమంగమ్మ కాదు. ముఖముల్ వేసిన బర్మా చెప్పులు, కనులకుఁ గళ్ళజోడు, జడచోళ్ళేము, కొద్దిగాఁ బ్రక్కపాపట, చేతుల కాలుజతలబంగారుగాజులు, పట్టుచీర, బంగారు పిన్నులు - సర్వమును నాగరకతాచిహ్నములే తోఁచెను. ఆమె మాటాడుచుమాటాడుచు మధ్యమధ్య నింగ్లీషు ప్రయోగించును. తనకు వచ్చు నని యితరు లనుకొనుటకు మాటలమధ్య గ్రాంథిక ప్రయోగములు చేయును. ధర్మారావు కూర్చున్నదిమొదలు లామె వంక నొకసారియైనను జూడలేదు. రామేశ్వరము ద్వారా ధర్మారావునకు మంగమ్మకథయంతయుఁ దెలియును. మంగమ్మ ధర్మారావు విషయమే యెఱుఁగదు. అందుచేత నతనియెదుటఁ గూర్చుండుట

కామె కొంకదు. ఏదో జనసామాన్యమున కందఱకుఁ దెలిసినట్లే తనకథ యాతనికిఁ దెలియు నని యామె యుద్దేశ్యము. రామేశ్వరమునకును, ధర్మారావునకునుగల పూర్వకథ యామె కెట్లు తెలియును? దాని వలన ధర్మారావునకు రామేశ్వర మెంత హేయుఁడో, తా నెంత హేయురాలో యామె యెఱుంగదు.

కుమా—మంగమ్మగారూ! మీరు మఱల సినిమా నడిపెద రఁటగదా! మంగ—ఒకనాటకసమాజమునుగూడ పెట్టవలయు నని యున్నది. శ్యామ—అందులో మీరు వేషములు వేసెదరా? చక్ర—వేసినచోఁ దప్పా? ధర్మా—పాప మూరకే యా పిల్ల యడిగినది. తప్పని యెవ రన్నారు? చక్ర—మీ రింగ్లీషునాటకములు వేసినచో నేనుగూడఁ బాత్రధారణముచేయుటకు నా కభ్యంతరము లేదు. రాధా—వేసినచో నింగ్లీషునాటకములే వేయవలయును. తెలుఁగులో నాటకము లే మున్నవి? అసలు తెలుఁగువాండ్రకు వాఙ్మయమే లేదు. తిక్కన్న యొకఁ డున్నాఁ డని పట్టుకొని యూఁగులాడెదరు! వాఁ డొక వార్తాపత్రిక. ధర్మా—మీరు తెలుఁగులోఁ బండితు లందురే! మీరుకూడ నిట్లనుట బాగుగా లేదు. రాధా—నిజముగా నా యుద్దేశ్యమే యంత. ధర్మా—అయినచో మీరు తెలుఁగులోఁ గవిత్వము వ్రాయుట యెందుకు? ఇంగ్లీషులోనే వ్రాయరాదా? చక్ర—తెలుఁగువారికి భావవైశాల్యము లేదు. ప్రతిదానికిఁ గుదించుకొని గిరిగీసికొని కూర్చుందురు. సంఘములోఁగాని, మతములోఁగాని, సారస్వతమునఁగాని నూత్నమార్గము లవలంబించరు. అట్లైనచో నేదియును నభివృద్ధి పొందదు. ఇంగ్లీషులోఁ జూడుఁడు. ఎలిజీ, సెటైరు, ట్రాజెడీ, కామెడీ, బాలెడ్, ఓడ్సు, సాన్నెట్సు మొదలైన ప్రబంధవిశేషము లెన్నియైనఁ గలవు. మనకో యెంతసేపు చూచుకొనినను బూతుకూఁతలైనప్రబంధము లొక్కటియే. ధర్మా—పొరపాటుపడుచున్నారు. సరిగాఁజూచినచో మనకును లక్షరకముల ప్రబంధము లున్నవి. పురాణములు, ఇతిహాసములు, కావ్యములు- కావ్యములలో నెన్నియో రకములు: మనుచరిత్రవంటి కావ్యములు కొన్ని; కృష్ణకర్ణామృతము వంటివి కొన్నియు. నాటకములు - అవి పదిరకములు: పదములు క్షేత్రయపదములవంటివి, యక్షగానములు, జంగముకథలు, బొబ్బిలి

పాటలు, శతకములు, ఉదాహరణములు, చాటువులు, స్తోత్రములు— ఇవి కలవు. వారికి లేనివి లక్షణగ్రంథము లని శాస్త్రగ్రంథములు కలవు. అవి శాస్త్రమును నిర్దేశించుచుఁ దాముగూడ మహాకావ్యముల వలెఁ బ్రకాశించుచున్నవి: అవి శాస్త్రగ్రంథములు, కావ్యములు కూడను. అట్టి విలక్షణమైన సృష్టి యితరదేశము లందుఁ జూపించుఁడు! చక్ర—సంస్కృతగ్రంథములనుగూడ తెలుఁగులోఁ గలిపి వేయుచున్నారే! ధర్మా—మీరు లాటిన్, గ్రీకు సంప్రదాయ గ్రంథము లింగ్లీషువిగాఁ జెప్పలేదా? తమ రింగ్లీషుగ్రంథములు తెలుఁగు గ్రంథములుగాఁ జేయుటలేదా? తెలుఁగును హూణభాషామయముగాఁ జేయవలయునని మీరు ప్రయత్నించుటలేదా? తెలుఁగనఁగా సంస్కృతమే కాదని కొందఱు వాదించినచో నేమి ప్రయోజనము? చక్రి—మీ వన్నియు బి. సి. నాఁటి యూహలు. ధర్మా—అది మీకొలతబద్దలో దోషము. మీరు కాలమునకు, భావనాశక్తికి బి. సి. లతో, ఏ. డి. లతోఁ గొలచిన తేలము. మీరే బి. సి. యనుట తోడనే మీ మనస్సునందుఁ బాశ్చాత్యలోకాభిప్రాయములు ప్రమాణమైనట్లు తెలియుచున్నది. అనితరసంస్కారస్పృష్టమైన మనస్సుతోఁగదా చర్చించవలయు నందురు. మీమనస్సు పాశ్చాత్య నాగరకతాభిప్రాయమునకు లొంగిపోయినది. అందుచేత మీరు వాదించుటకుఁ బనికిరారు. చక్ర—మీరు చాల దురుసుగా మాటాడుదురు. మనకుఁగలపరిచయము కొద్ది. ఇంతలోనే మీరు మర్యాదోల్లంఘనము చేసెదరు. ధర్మా—అయ్యా! ఒక్కవ్యక్తికి మర్యాదోల్లంఘనముజరిగిన దని మీ రింత కష్టపడుచున్నారే! మీభావముల వలన, మీప్రవర్తనలవలన నొకమహాదివ్యసంఘమునకు నాపత్తు కలుగుచున్నది. మీరు సంఘమర్యాదోల్లంఘనముచేయుట తప్పు లేదుకాని, నేను వ్యక్తిమర్యాదోల్లంఘనముచేసితి నని మీకుఁగోపము. నే నదియును జేయలేదు. ఏల యనఁగా నొకవిషయము మాటాడుచుంటిమి. వాదించునపుడు మీవాదన తప్పనవలసివచ్చును. దానికిఁ గోపము తెచ్చుకొనరాదు. అదియుఁగాక మీ వ్యక్తిమర్యాదాశబ్దము విచిత్రమైన యర్థము గలది. మీరు యథార్థవిషయ మెట్లున్ననుసరే, పైకిఁ జాలవినయముగా నెవనిమనస్సును నొచ్చునట్లు

మాటాడవలయును. ఎవరియుద్దేశ్యములు వారివి, ఎవరియాచరణ వారిది, ఇతరులకు దానితో జోక్యము లేదు' అని యందురు. మీ రితరులజోక్యము కలిగించుకొనకుండ నుందురా! కుమా—ఈ ప్రసంగ మింతటితో మానివేసిన బాగుండును. ధర్మా—నా కేమియు నభ్యంతరము లేదు. ప్రొద్దుపోయినది. ధర్మారావు తనదారిని దానుబోయెను. చక్రి—ఏమండీ! రాధాపతిగారూ! బలేమనిసిని దెచ్చితిరే? ఈయనభావములన్నియుఁ జాదస్తముగా నున్నవి! పంక—వారును బి.ఏ. పరీక్ష యైనారండి. చక్ర—నిజముగానా? ఇట్టివారు కూడ బి. ఏ. పరీక్ష యెట్లగుదురో! రాధా—అట్లనకుఁడు. ఆయన చాల గడుసువాఁడు. వివేకి. మనకు నచ్చలేదు. ఆయన చక్కఁగా వాదించెనా, లేదా? చక్ర—ఆ వాదన లన్నిటిని మనము పరాభూతములను జేయవచ్చును. కుమా—మఱి చేయకపోతిరా? చక్ర—నాకిదియే పని. శ్యామల—మఱి కొంతసేపు వాదించితిరికదా! మంగ—నాకుఁ దోఁచినంతవఱకు ధర్మారావుగారిమాటలే బాగుగానున్నవి. ఆయన మనస్సును నియమింపవలయుననెను. ఆమాట యెంత బాగుగా నున్నది! రాధా—అవు నవును. మీరు మనస్సును బాగుగా నియమించఁగలరు. మంగ—అని నేను చెప్పుట లేదు. రాధా—అది పుస్తకములలోనిమాట. ఈ ధర్మారావుగారు తానుజెప్పినట్లుగా నేకపత్నీవ్రతుఁడా యేమి? మనవద్ద ఢబాయించినాఁడు. మనము మొగము నెదుట కాదందుమా? పంక—అట్లనకుఁడు, నే నాయనను జాలరోజులనుండి యెఱుఁగుదును. ఆయనశీలము మెచ్చఁదగినదే కాని, వేఱు కాదు. రాధా—ఈయన యన్నిసందర్భములలోనను జితేంద్రియుఁడుగా నుండఁగలఁడా? మనసు నెవరు నిగ్రహించఁగలరు? కుమా—అది యాయనయే చెప్పెను. మనస్సు నొకఁడు నిగ్రహించలేకపోవుట యొకటి; ఆ నిగ్రహించలేకపోవుట న్యాయమే యనుకొనుట మఱొకటి.

శిశిరర్తువు ప్రొద్దుక్రుంకకముందే ప్రొద్దుక్రుంకించి భోజనము చేసి పండుకొనకముందే దుప్పటులు కప్పించెను. చీఁకటిపడి కోరడులవెంట మిణుఁగురుపురుగులు తెక్కలార్చుచుండెను. భోజనము చేయుటకుఁ బాదప్రక్షాళనముచేయునప్పటికే నీళ్ళు కాళ్ళ

మీఁద పోసికొనఁ బ్రాణములు పోయినవి. కట్టుకొనుట కొకమడిబట్ట కప్పుకొనుటకు నొకమడిబట్టయుఁ గావలసివచ్చెను. రెండును జల్లగానే యుండెను. బట్టలు కప్పుకొనుటవలన శరీరమునకు వచ్చిన వేఁడి లేదు. శరీరమువేఁడియే బట్టల కెక్కి కప్పుకొన్నంతసేపటికిఁ జల్లని బట్టలు వెచ్చనయ్యెను. ఫాల్గుణబహుళముపవళ్ళు వసంతకాలము వలె నాతపబహుళములైనను నా సంవత్సరము వర్షములు విస్తారముగాఁ గురియుటచేతఁ జలి తగ్గలేదు. చీఁకట్లు మఱింత బలిసి, చేయి కడుగుకొనుటకు దొడ్డిలోనికిఁబోయినను దీపమే కావలసివచ్చెను. అరుంధతియు భోజనము చేసినది. భార్యాభర్తలిద్దఱు నేకశయ్యాగతులైరి. కుఱ్ఱవాఁడు నిదురించుచుండెను. అరుంధతి భర్తను గవుంగిలించుకొనెను. అతఁడు మాటాడలేదు. ఆమె యతనిని ముద్దాడెను. అతఁడు మాటాడలేదు. ఆమె చేతులతో భర్తను దన కభిముఖముగాఁ ద్రిప్పుకొనుటకు లాగెను. అతఁడు కదలలేదు. ఆమెకుఁ గోపమువచ్చి 'ఫలితము ప్రారంభించినది' యనెను. ధర్మా—దేని ఫలితము? అరుం—పోరానియిండ్లకుఁ బోయిన ఫలితము. ధర్మా—ఆ ఫలితము స్వరూప మేమిటి? అరుం—స్వభార్యాతిరస్కృతి. ధర్మా—అవును. నీవు నాయెడలఁ బతివ్రత వని నమ్మక మేమిటి? సర్వజనులును గామమునే వాంఛింతురు. మనస్సు చంచలమైనది. చంచలముగాని మనస్సుగల మానుషజన్మము లేదు. నీవు సదా నన్నే ధ్యానించితి వని యేమి నమ్మకము? అరుం—మనుజులు వేషములలో, ముఖలక్షణములలో, నాచారములలోఁ, దెలివి తేటలలో నెట్లు భిన్నులో మనస్సులలోఁగూడ నట్లే భిన్నులు. ఒకఁడు చెప్పరానిఘోరపాపములు చేయును. ఒకఁడు చేయుదు నని చెప్పును. మఱొకఁడు మనసామాత్రమే యనుకొనును. ఒకఁ డనుకొని, ఛీ కాదని త్రోసివేయును. ఒకఁడు వానినిగుఱించియే యూహించఁడు. తక్కిన యన్నిరకములైన మనస్సులును నున్న వనుట యందఱు నొప్పుకొందురు. పాపము నూహించనేయూహించనివాఁ డుండు నటులే యొప్పుకొనరు. అది నిజముగాఁ బ్రత్యక్షముగాఁ జూపించఁదగినది కాదు. కాని యనుమానముచేతఁ దెలిసికొనవచ్చును. ధర్మా—అనుమానము! తార్కికార్థమునందుఁ బ్రయోగించు

చున్నావే! నీ కింత చదువెట్లు వచ్చినది! అరుం—ఎట్లు వచ్చినదా! ఇన్నాళ్ళును మీరు నా కభిముఖముగా నుండవలసివచ్చినది.

మఱునాఁడు కుమారస్వామి వచ్చెను. ధర్మారావు 'విశేషము లే'మని యడిగెను. కుమా—రాత్రి మీరు వచ్చినతరువాత మిమ్ము వారందఱు నాడిపోసికొనిరి. ధర్మా—ఎవ రెవరు? రాధాపతిగూడనా? కుమా—ఆయన యెక్కువ లేములెండి. ఎక్కువగ మా పుసుకుఁడు. ధర్మా—చక్రవర్తియా? ఏమన్నాఁడు? కుమా—మీరు పట్టిచేదస్తులఁట. ధర్మా—అది వైదికశబ్దమునకుఁ బర్యాయవాచకము. నష్టము లేదు. కుమా—మంగన్న మిమ్ము వెనుకవేసికొని వచ్చినది. ధర్మా—నే నచ్చట లేనుగా! ఎట్లు వెనుకవేసికొన్నది? కుమా—(నవ్వి) నిన్న బలే చమత్కారము చేసినారే. ధర్మా—ఏమి చేసినాను? కుమా—నాకుఁ దెలియలేదండీ! వారు శ్యామలను నా కిత్తు మని నిర్ణయింపఁబడినట్లు చక్రవర్తికిఁ దెలియనీయలేదు. అందఱు వెడలిపోయినతరువాతనొకగమ్మత్తు జరిగినది. చక్రవర్తి నావద్దకు వచ్చి 'ఏమండీ! శ్యామల మీకు వ్రాసిన యుత్తరము లేమైనఁ జూపించెదరా?' యని యడిగెను. నే నప్పుడే యూరకట్టితిని. రెండు మూఁడుత్తరములు చూపించి, మఱి కొన్ని చూపించక దాఁచితిని. చక్రవర్తి వానినికూడఁ జూపించు మనెను. నేను 'వానిలో రహస్యము లున్నవి, చూపించరా' దంటిని. అతఁడు 'ఏమి రహస్యము' లనెను. నేను 'ఏమి రహస్యము లుండునండీ' యని నవ్వితిని. దానితో నే ననుకొన్నంతయు జరిగినది. అతఁడు రాత్రి యంతయు శ్యామలతో మాటాడలేదు. ధర్మా—(నవ్వుచు) శ్యామల యింతవఱకు వాసనచూడనట్టి ప్రసవమేనా? కుమా—మనము పెండ్లియైనప్పటినుండి చూచుకొనవలసినదేకాని, యిటువంటి సంఘములో నిశ్చయము లేదు. మన మరుమానపడితి మనికూడ ననరాదు. నాయందుఁ బ్రేమ కలదు. అది నాకుఁ దెలియును. ధర్మా—చక్రవర్తి యింక నెన్నాళ్ళుండును? కుమా—పండ్లు పులిసినవి. ఊడిపోవుదాఁక నుండునో, యీ లోపుగ నే పోవునో! ధర్మా—నామీఁద నతనికిఁ గోపము నేను వాదించితిననిమాత్రమే కాదు! కుమా—అవునండోయి, అవును. నాకుఁ దెలిసినదండోయి, తెలిసి

నది. ధర్మా—నీవు వట్టి పసివాఁడవు. ఆ కేక లేమిటి? అదియును గాక పంకజమ్మగారికిఁ గూఁతును బ్రాహ్మణున కిచ్చి పెండ్లిచేయవలయు నని యున్నది. అతఁడు బి. ఎస్. సి. ప్యాసైనను నీవు బ్రాహ్మణుఁడవు. కుమా—అవునండీ! వారందఱు జాతునుగదా బ్రాహ్మణు లన్నచో ద్వేషము. మఱల వారు బ్రాహ్మణులవలె నుండవలయు నని యభిలాష! ధర్మా—మతాంతరులైన క్రైస్తవులకు నిది మఱియును. నేను బందరులోఁ జదువుకొన్నప్పు డిద్దఱు క్రైస్తవులకుఁ బోరాటము వచ్చినది. వా రిద్దఱును గాలేజీలో నుపాధ్యాయులే. అందులో నొకని తాత బ్రాహ్మణుఁడు. మఱొకని తండ్రి మాలవాఁడు. ఈ బ్రాహ్మణక్రైస్తవుఁడు మఱొక బ్రాహ్మణోపాధ్యాయునివద్దకుఁ బోయి తమపోట్లాట చెప్పి, "మేము వానితోఁ గలసికూడ భోజనము చేయమండి. వానితండ్రి యచ్చముగా మాలవాఁడు. మాతాత బ్రాహ్మణుఁ డండీ" యనెను. ఆయన "ఈభేదములు లేకుండుటకేకదా మీరు క్రైస్తవులలోఁ గలసినది. ఇప్పుడును భేదము లేదా?' యనెను. దానికా బ్రాహ్మణక్రైస్తవుఁడు మిగులచక్కనిసమాధానము చెప్పెను. అతఁ డన్న దిది: "మేము క్రైస్తవులమైనతరువాత క్రైస్తవులలో నున్న భేదములను హిందువులలోనున్న భేదములచేత హెచ్చవేసినాము. మాలో రోమను కాథలిక్కులు, ప్రొటెస్టెంటులు నట్లుండగా ప్రొటెస్టెంటులలో లూథరెను మిషనువారు, ఇంగ్లీషుమిషనువారు మొదలుగా మనదేశములోననే చాలభేదములు కలవు. భేదములు లేని దెచ్చటనండీ? భేదములు లేకపోయినచో మనుజులు కూడఁ బశువులవలెనే గుంపులుగుంపులుగా బ్రతుకవలయును. మతమని యున్నవెంటనే భేదములు నున్నవి. ఎవనిస్వార్థ మెవఁడు వదలుకొనును? కుమార—నిజమేనండీ! పాప మతఁ డెవరో మనసులో నున్నది బయటికిఁ జెప్పినాఁడు. మఱొకఁడు చెప్పఁడు. ధర్మా—మనసులోనున్నది బయటికిఁ జెప్పకుండ పైకిఁ బెద్దమనిషివలె నటించి, లోపల స్వయంపాకము చేయుట యిప్పటినాగరతకుఁ గిరీటమైన చిహ్నము. కుమా—మీరు నేఁడు మఱల వత్తురా? ధర్మా—ఇప్పుడప్పుడే కాదు. రెండుమూఁడురోజులు పోనిమ్ము. కుమార—నేఁడెందుకు రాఁగూడదు? ధర్మా—నీకుఁ దెలియుదోయి. అట్లుంచుము;

మఱల వచ్చెదనుగదా! ధర్మారావు నాఁటిసాయంకాలమునఁ గోట వీథికి వచ్చెను. నాలుగైదు మోటారులు హాహావిడిగాఁ బోవుచున్నవి. అన్నిటినిండ సామాను, కాసావాండ్రు. వీథియంతయుఁ బెళపెళగా నున్నది. ధర్మారా వెవరినో కారణ మేమని యడిగెను. వారు 'దొరసానిగారు మరల నింగ్లాండు పోవుచున్నది. ఆమె సామానంతయుఁ దీసికొని పోవుచున్నది' యని చెప్పిరి. ధర్మారావు "ఉద్యోగము చేసినచే కాఁబోలు, సామాను లమ్ముకొనిపోవుట" అనుకొనెను. మఱల నతఁడు 'దొరసాని వచ్చి చాలనాళ్ళైనదఁట. ఆమె ముసలితల్లి చనిపోయినదఁట. తండ్రియొక్కఁడు బాధపడుచున్నాఁడు. ఆమె వెళ్ళుచున్నది" అని చెప్పెను. ధర్మారావు 'మఱల నెప్పుడు వచ్చును?' అనెను. సామానుసర్దుచున్న కాసావాఁడు జవాబు చెప్పెను: "నాలుగైదు నెలలలో వచ్చునండీ! ఈ సారివచ్చునప్పుడు తండ్రినిగూడఁ దీసికొనివచ్చునఁట." ధర్మారావు 'దొరగారుకూడ వెళ్ళుచున్నారా?' అని అడిగెను. కాసా—'కొలంబోదాఁక పంపించి వత్తురఁట' అనెను. ధర్మారావు తనదారిని దాను పోయెను. పోవుచుండఁగా దారిలో గోపన్నమాట జ్ఞాపకము వచ్చెను. అతనికి నవ్వు వచ్చెను: 'గోపన్నపోయి యెన్నాళ్ళైనది? నా కిప్పు డీ స్మృతి యేమి? ఆహా! పన్నెండేండ్లైనవో కాలేదో! కృష్ణమనాయఁడు, గోపన్న, రుక్మిణమ్మారావుగారు, రంగాజమ్మగారు—వారందఱును బూర్వయుగపురుషులవలెఁ గనిపించుచున్నారు. నేను దుఃఖభాగినై యేల బ్రదుకవలె? ఈ కాలమున నాకవిత్వము బూడిదలోఁబోసిన పన్నీటివలె నెందుకును బనికిరాకపోవుచున్నది. తిక్కనకు మనుమసిద్ధివలెఁ గృష్ణమనాయఁడే బ్రతికియుండిన నే నెంతవాఁడనై యుందును? నేను పద్యము చదువుటకే ఆయన పొంగిపోవుచుండెడివాఁడు. ఇంతకును నీ దౌర్భాగ్యదశ నా కొక్కనికే పట్టలేదుకదా! ఒక మంచియుద్యోగము సంపాదించుకొందమన్నఁ జూచుదిక్కు లేకుండ నున్నది. శబ్దార్థములు చెప్పువాఁడే యుపాధ్యాయుఁడుగా నుండుటకుఁ దగును. విషయబోధ చేయరాదు. విషయవిమర్శచేయువఱకు బంగారపుగుండని యాడించుచున్న గాలిబుడ్డలోపల వట్టి డొల్ల యని తెలియునుగదా! విషయవిమర్శ చేయరాదు. పోనిమ్ము. మహార్థవంత

మైనదినశించిపోవుటయు, నల్పప్రయోజనములైనవి విజృంభించుటయు నీ నాఁటిసృష్టిపరిణామములోని యొకభాగము. మహాణువులు నిరంతరసమాఘట్టితములై తిరుగుళ్ళు పడుచున్నవి. ఎప్పుడే విచిత్రాకృతిఁ బరిణమించునో ? మహావాయుధూతములై యాకాశమున మొగిళ్ళు తఱుమఁబడి ప్రతినిమేషమునకు నాకృతిలో మార్పునొందుచుండెను. ఒకనిమిషమాత్ర మున్నమార్పు నిమేషజీవితులకు దీర్ఘముగానే కనిపించును. అనంతమైనకాలమున దీర్ఘహ్రస్వత లెక్కడ? శబ్దములయొక్క యర్థనిర్ణయమే విచిత్రముగా జరుగుచున్నది. నేఁడు మఱియుఁ గొన్నిశతాబ్దములయర్థ మిదమిత్థ మని నిర్ణయించరాకున్నది. ఏదియో గాలివలెఁ గొట్టుకొనిపోవును. దానియర్థ మిది యని చెప్పవలసివచ్చినచో దానియందు భావసాంకర్యమేర్పడుచున్నది' అని యనుకొనుచుండఁగా మోటారులు ప్రక్కనుండి దూసికొనిపోయెను. నాల్గుమోటారులును జతుస్సముద్రములకొఱకుఁ బరుగెత్తుచున్నట్లుండెను. కోటకు దక్షిణదిక్కుద్యము మలుపుతిరిగినచోట నొకమామిడి చెట్టుండెడిది. అది కృష్ణమనాయనిదినములలో నిండుగా నాకులువిడిచి, మన్మథునిగొడుగువలెఁ గనఁబడుచుండెడిది. గ్రామము పట్టణమైన తరువాతఁ బనియుఁ బాటును లేని కుఱ్ఱవాండ్రు ప్రబలి దానిని బింద పట్టకమునుపే ప్రతిసంవత్సరమును దులుపసాఁగిరి. అది క్రమముగాఁ జివుళ్ళు, రెమ్మలు, కొమ్మలు సర్వముచేత దరిద్రమై కోటగోడమీఁది కొఱిగియున్న శాఖతప్పఁ దక్కినవన్నియు బోడిగానుండెను. అచ్చటనే బీడీదుకాణ మొకటిపెట్టఁబడెను. మిగిలినకొమ్మ దుకాణముపై నుండెను. కొమ్మయంతయు బోడిగానే యున్నది. చిట్టచివర పది యాకు లున్నవి. ధర్మారావు దానివంకఁ జూచెను. అందులోఁ బరపుష్టకుపితనేత్రమువలె నెఱ్ఱని రెండు చివురుజొంపములు వచ్చెను. ఓహో! వసంతకాలము వచ్చెను. ఎంతబక్కపిక్క వచ్చెను. అంత బక్కచిక్కుటలోఁగూడ పొంగారిన తనవసంతశోభ నదుముకొనలేక పోయినది. ఎచ్చటనో కోకిల కూసెను. అహో వసంతము వచ్చెను.

చీఁకటిపడి ధర్మారా వింటికిఁ బోయెను. పోవుచునే 'వంటయైనదా?' యని యడిగెను. అరుంధతి 'భోజనముచేసి యెచ్చటికైనఁ బోవుదురా?' యనెను.

ధర్మా—ఎచ్చటికిఁ బోదును? వసంతకాలము వచ్చినది. వర్షాకాలము, వసంతకాలము నిల్లువదలిపెట్టిపోవు కాలములు కావు. అరుం—అవును. వర్షర్తువులోఁ గాళ్లు బురదయగును. వసంతర్తువులో దలమాడును. ధర్మా—'అనధిగతరామాయణ ఇవ' యన్నట్లు 'అనధిగతాలంకారశాస్త్రీవ' మాట్లాడుచున్నావు. అరుం—ఇంకఁ బోయి మడిగట్టుకొనవలయును. మీా రీ నాఁ డింత పెందలకడ వత్తురని నా కేమి తెలియును? ధర్మా—వసంతర్తువు మిక్కిలి శోభాకరముగా నున్నది. మామిడిచివుళ్ళు ప్రియాహస్తములవలె ముద్దు వచ్చినవి. రామచంద్రుఁడు సీతాదేవిపెండ్లినాఁటిపసిచేతులనువర్ణించి నాఁడు- 'మూర్తిమా నివ మహోత్సవకరః' అఁట. తల్లిచేయి పాణిగ్రహణసమయమునందలిది. గృహీతకమనీయకంకణమై యుత్సవమంతయు మూర్తితాల్చిన ట్లున్నదఁట. ప్రభువు సిగ్గుపడి సీతాదేవి ముఖమువంకఁ జూడలేదు. చేయియే చూచినాఁడు. ఆయనకుఁ బెండ్లి యంతయుఁ, బెండ్లియొక్క యుత్సాహమంతయు, నావేళ స్వామి యనుభవించినయానందమంతయు మూర్తికట్టి తల్లియొక్క చేయిగాఁ గనుపించినదికాబోలు! అరుం—ఆ మెత్తని సన్నని చిన్నచేతులకు గోరంటాకు పెట్టుకొన్నది కాఁబోలు! చేతికి నీలపుటుంగములు కూడఁ బెట్టుకొన్నదికాఁబోలు! ధర్మా—నీవు నీచేతిని వర్ణించుకొన్నావు కాఁబోలు! అరుం—నాచేయి యట్లుండ దని నాకుఁ దెలియును. నే నేమి యంతఃపురస్త్రీనా? ఇంటిలోఁ బ్రతిదినమును బనిచేసిచేసి నా చేతులు కాయలు కాచియున్నవి.ధర్మా—మెత్తని చేతులు కాయలుకాచుట వేఱు, మోటుచేతులు కాయలుకాచుట వేఱు. అబ్బాయి నిదురపోవుచుండెనా? మొన్న గోరంటాకుపెట్టుకొన్నతరువాత నీచేతులకన్న బాబుగారిచేతులు బాగుగా నున్నవి. అరుం—వాఁ డింటిలోఁ బనిచేయుచుండుట—లేదుకదా! ధర్మా—చుప్పనాతితన మెంతదూరము పోయినది? అరుం—ఇది చుప్పనాతితనమేనా? ధర్మా—పైకి పరిహాసమే. మనము మాటాడుచుండఁగా నోటవచ్చినమాటకు హృదయములో నెచ్చటనో తదనుగుణమైన భావప్రవృత్తి యుండు నని యొక సిద్ధాంతము. మనిసిలో జ్ఞానవుఁ జొర లుండును. జాగ్రదవస్థలో మన మొకటి మాట్లాడుచుందుము.

ఈ మాటలవెనుక నొక మానసికప్రవృత్తి జరుగుచుండును. దాని వెనుక హృదయప్రవృత్తి యుండును. వెనుక నాధ్యాత్మికప్రవృత్తి యుండును. మనకు వాఙ్మనఃప్రవృత్తులు తెలియుచునే యుండును. హృదయప్రవృత్తి యప్పుడప్పుడు తెలియుచుండును ఆత్మప్రవృత్తి యెప్పుడును దెలియదు. ఆత్మలోఁబుట్టినభావము వాగ్రూపముగా బరిణమించువఱకు ననేకములైనమార్పులు పొందును. ఆత్మలోఁ గొడుకునకన్నఁ దనయందే ప్రేమ యెక్కువ. కుమారుఁడు హృదయప్రవృత్తికి వచ్చువఱకును బ్రేమాస్పదుఁ డగుచున్నాఁడు. మనఃప్రవృత్తిచేత వానికి సుఖము వాంఛింతుము. అరుం—నేను పోయి మడి గట్టుకొందునా? వసంతర్తువులో నాఁకలి కాదు కాబోలు! ధర్మా—ఆఁకలిలేనిచో మడి గట్టుకొన నక్కఱలేదు. అరుం—అట్లు వీలులేదు. మడిగట్టుకొనఁ బోవుచున్నాను. మూన్నాళ్లైనతరువాతఁ గుమారస్వామి వచ్చెను. ధర్మా—కథ యెంతమారము వచ్చినది? కుమార—(నవ్వి) మీ రీ నాఁడు వచ్చినచోఁ జక్రవర్తి మీతో మాట్లాడఁడు. ధర్మా—నే నేమి చేసితిని? కుమా—నాకుఁ దెలియదు. ఈ మూన్నాళ్లనుండియు నేనును శ్యామలయు మిమ్ము మెచ్చుకొనుటయు, నతఁ డుడికిలుటయు మేము మిమ్ము గొప్పకవులందుము. అతఁడు 'మీ రితరదేశగ్రంథములు చదువలేదు కనుకఁ దెలుఁగులోఁ బ్రతిచిన్నకవియు మీకు గొప్పగాఁ గనిపించు' ననును. మీరు చెప్పఁగా మేము కొన్నివిన్నాముకదా! ఆమాటలన్నియు మే మతనిముందు వాగితిమి. అతఁడు మఱియు నుడికిలెను. ఏదో యేదో చెప్పెను. చివరకు శ్యామల యన్నది కదా, 'మీకుఁ గోపమెందుకు? వారు రేపో, యెల్లుండియో వత్తురు. వారితో వాదించరాదా' యని! నే నన్నాను: 'ఆయన పట్టి చాదస్తుఁడు. ఆయనతో వాదించునది యేమిటి' యని. చక్రవర్తి నావంకఁ జుఱఁజుఱఁజూచెను. కథ యి ట్లున్నది. మీరు వచ్చినచో నిద్దఱికిఁ బడునేమో! ధర్మా—మా యిద్దఱికిని బడదని యిదివఱకే తెలిసినది. కుమా—నాలుగైనది పోదమా? ధర్మా—ఉన్నది యుండఁగా నిదె యొకటియా? నీవు నన్నుఁ బిలుచుకొని వచ్చితివనుకొనును. నీవు పద. నేను వత్తును. కుమా—మీరిద్దఱు పోట్లాడుకొనెదరు సుండీ! ధర్మా—నాకలనితో

నెంకుకుఁబోట్లాట? నీ కతనితోఁ బోట్లాట లేకుండఁ జేయవలయు నని నా ప్రయత్నము. కుమా—అన్నా! మాష్టరుగారో! ఇటువంటిదెబ్బలు వానికిఁదగిలెనా, వాఁడు చచ్చిపోవును. కుమారస్వామి వెళ్ళిపోయెను. ధర్మారావుభార్యతో 'మధ్యాహ్నపుఁబూఁట కొంచెము ఫలహారమైనను బెట్టవుగదా!' అనెను అరు—నేను ప్రొద్దుపోయినకాని రారా యేమిటి? ధర్మా—ఈనాఁటికవులకు నీమాత్రమైనను ధ్వని తెలియదు. అరు—చెప్పిపోండు. ప్రొద్దుపోయి మసిగట్టుకొందురు. ధర్మా—నిజమే. ప్రొద్దుపోయినకాని రాను. అరుం—ఎచ్చటికిఁ బోవుచున్నారు? ధర్మా—వెళ్ళేవారి నట్లడుగరాదు. అరుం—అక్కడ నేమి పాసి పోవుదు? ధర్మా—కొండమువిరి యూపర వెల్లి యరుమన్నది. అరుం—ఆ భయము లేదు. వలసినచో బల్లిగూడ నగుదు. ఇంకను దక్కువ కూడ నగుదు. ధర్మా—తెలుఁగునైదికులకొంపలోఁ బుట్టినతరువాత గొంచె మసభ్యపుమాట రాకపోదు. నే నేమన్నానని యిప్పుడే కన్నీళ్ళు పెట్టుకొనుచుంటివి. ధర్మా లేదులే. ఇదిగో చూచితివా? నా యుత్తరీయముగూడఁ దడిసినది. పిల్లవాఁడు లోపల నేదో పగులఁ గొట్టుచున్నాఁడు.పో! అరుం—పెందలకడ వత్తురా? ధర్మా—ఇంకను గొంతులో గద్గదిక మిగిలియే యున్నది. అరుంధతి నవ్వెను.. ధర్మారావు నవ్వెను. దూరమున కోకిల కూసెను. ధర్మా—అదిగో వసంత కోకిల. అరుం—నా కొంటరిగాఁ బ్రొద్దుపోదు. దయసేసి చప్పున రావలయును. ధర్మా—'ఎగదీసిన బ్రహ్మహత్య దిగదీసిన గోహత్య.'

మఱల నందఱును గూర్చుండిరి. పంకజమ్మగారు ధర్మారావును 'రం'డనిగౌరవము చేసి కూర్చుండఁబెట్టెను. పంక—ప్రతిరోజును సాయంకాలమున మీరు వత్తురని, చివరకు మీరు రాకపోవుట. కుమా—వారిరాక పిండివంటవంటిది. అది పండుగలనాఁడే కావలయును. ప్రతిరోజును నైనచోఁ దినలేము, అఱిగించు కొనలేము. చక్ర—ధనవంతులయిండ్లలో రోజును బిండివంటలు చేసికొందురు. మంగమ్మ—అది యాచారముగాఁ జేయుదురు కాని, తిని యఱిగించు కొనునది కాదు. రాధా—మీరు లేకున్నచో ముత్తానికి నేదో తక్కువగానే యున్నట్లున్నది. మే మెవ్వరము మాట్లాడినను బై పైని మాట్లాడెదము, కాని మీరవలె హృదయమునుండి మాట్లాడము.

ధర్మా—మైత్రి యట్లనిపించుచున్నది. రాధా—మీ రనినచో నా కంతమైత్రి లేదు. ధర్మా—నేను దురుసుగా మాట్లాడెదను; మీరు పెటుకుగా మాట్లాడెదరు. కుమారస్వామి పకాలున నవ్వెను. చక్రవర్తి యతనివంకఁ దీక్ష్ణముగాఁ జూచెను. కుమా—మీరు దురుసుగా మాట్లాడెదరని యెవరందురండీ! శ్యామల—మీరు నాలుగైదు సార్లు మాయింటికి వచ్చి తప్పించుకొన్నారు నేఁడు కొన్ని మీ పద్యములు చదువక తప్పదు. కుమార—ఆఁ! యేమిపద్యములు లెద్దూ! ఎట్లైనను స్విట్జర్లండులో, బెల్జియములో గొప్పకవు లున్నారు. చక్రి—నిజముగనే యున్నారు, నీ కేమి తెలియును? ప్రతిదానికి నట్లు మాట్లాడెద వేమి? కవిత్వ మనఁగా మన దేశములో నే మున్నది? ఇబ్సెను, బెర్నార్డుషా మొదలైనవారినాటకములవంటి నాటకములు చూపించుము. యూగో, డూమాస్, హార్డీ అటువంటి నవలకర్తలను జూపించుము! వారికీర్తులు జగద్విదితములే. మనము నవీనంతలో గొప్పవారము కాదు కుమార—ఇంక నా కెందుకు? మీ రున్నారు, వా రున్నారు ఎవరు గొప్పవారో నా కేమి తెలియును? మంగమ్మ—వారి యిద్దఱిలోనా?

ధర్మారావునకు మాటలమధ్య మంగమ్మ కలిపించుకొనుట కొంచెము మనస్సునకుఁ గష్టముగా నున్నది. కాని యామె తనపక్షముగా నున్నట్లే యున్నది. అందుచే నతనిహృదయములోని స్వాభిమాన మామెయెడలఁ దనకుఁగల వైమనస్యమును గొంత తగ్గించినది. కాని ధర్మారా వటు చూడఁడు. ఆమె పలికినపలుకునకుఁ బ్రోద్బలముగాని, యంగీకృతిగాని, సమాధానముగాని యీయఁడు.

పంకజమ్మ—మన దేశపుఁగవులు నిజముగా నంతతీసిపోదురా? ధర్మా—నాకు నమ్మకము లేదు. కాని యింగ్లీషుచదివినజగత్తంతయు నట్లే యనుచున్నది. నాయుద్దేశ్యములో మనసారస్వత మనఁగా నొక్క తెలుఁగుసారస్వతముకాదు-సంస్కృతముకూడ మనదే- అట్లు చూచినచో మనసారస్వతము పరదేశములసారస్వతమునకుఁ దీసిపోదు. చక్ర—అట్లయినచో నాంగిలేయులసారస్వతముకు మనదే! ధర్మా—అ ట్లెందు కగును? సారస్వత మనఁగా నెవియో నిర్ణయించినచో సంస్కృతము మనదే యని తెలును. హూణభాషకు మనకు

సంబంధములేదనియుఁ దెలుసు. చక్ర—భాషలన్నియు నొకటియే. ఎచ్చటనైనను సరే, గొప్పభావ మున్నచో స్వీకార్యము. ధర్మ— "భాషలన్నియు నొకటి కావు. ఏభాష కాభాషయే. భాష యనఁగా నేమి? చెంబు, తలుపు, కుక్క, కన్ను—ఇట్టిశబ్దములు దైనందినమైన చర్యకుపయోగపడువస్తువులు మొదలైనవానినే చెప్పును. అది పెద్ద భాష కాదు. సంఘము, మతము, రాజకీయ విషయములు మొదలైన మానవజీవితముయొక్క స్రోతును తెలియఁజేయు మనోభావములు చెప్పినది నిజమైన భాష. కొన్నిశబ్దములు, కొన్ని వాక్యములు విస్పష్టముగా జాతులభిన్నస్వరూపమును గోచరింపఁజేయును. అది జాతియొక్క యాయువుపట్టు. ఒక యుదాహరణ చెప్పెదను—దసరా పండుగకు వీథిబడియుపాధ్యాయుఁడు మహర్నవమిగడలు పట్టించి విద్యార్థుల బంధువులయింటికిఁ దీసికొనిపోయి, యచటఁ గానుక లడిగి తెచ్చుకొందురు. నెల్లూరువద్ద నొకయొజ్జ పది పన్నెండేండ్లయీడుగలపిల్లలను వెంటఁదీసికొనిపోయి, నుజిలఁ బెన్న దాఁటి వచ్చుచుండెనఁట. దక్షిణదేశనదులే తొందరకత్తెలు. పెన్న మఱీ తొందరకత్తె. చూచుచుండఁగనే ప్రవాహమై యుబుకును. అట్లయి యొజ్జయుఁ, బిల్లలును గొంతదగ్గఱకునున్న యొడ్డునకై పరువెత్తిరి. చాలమంది యొడ్డుచేరిరి. ఈదుతక్కువవారు ప్రవాహవేగమునఁబడి పోయిరి. ఒజ్జ దుఃఖితుఁడై 'ఈపిల్లలను దల్లిదండ్రుల వద్దనుండి నేను తెచ్చితిని. వీరికొఱకుఁ దల్లిదండ్రు లడిగిన నే నేమి చెప్పుదును? నేను పోయి వారికి నామొగ మెట్లు చూపింతును' అని దుఃఖించి తానుగూడఁ బ్రవాహమునందు దూఁకి చనిపోయెనఁట— ఈకథ యొకహూణభాషావిశారదుఁడు మఱియొకహూణభాషావిశారదునితోఁ జెప్పఁగా నాయన 'బ్యూటిఫుల్' (Beautiful) అని మూఁడుసార్లనాఁడఁట. మొదటియాయన వ్యాఖ్యానము చేసెను. 'ఎందుకు సుందర' మనినాఁడు? 'సౌందర్యమే యాథార్థ్యము. యాథార్థ్యమే సౌందర్యము' అని కీట్సుకవి చెప్పినాఁడు. ఈ కథ యెందుచేత సుందర మనఁగా నతఁడు ఋజువుగాఁ బ్రవర్తించినందువలన నని వ్యాఖ్యానము. ఈ కథ హూణభాషరానివారికిఁ జెప్పుడు. అతఁ డేమనును? అందముగానున్నదనునా! అనినచో 'చనిపోయినవాఁ డేమప్పు

చుండఁగా నీ కంఠ మేమిటిరా' యని నలుగురు చీవాట్లు పెట్టెదరు. అచ్చమైన తెలుఁగువాఁ డేమనును? 'అయ్యో! పాపము!' అనును. ఎవరిపాపము? చనిపోయిన పిల్లవాండ్రపాపము; ఒజ్జపాపము; తల్లిదండ్రులపాపము. చూచితివిగా! రెండుభాష లోకవిషయము నెట్లు చూచుచున్నవో! ఈ భేద మెచ్చట నున్నది? జన్మమును గుఱించి, సృష్టిని గుఱించి, ప్రపంచసిద్ధాంతములను గుఱించి యీ రెండుజాతులకుఁ గల భిన్నభావములమీఁద నాధారపడియున్నది. ఆ భాషకు, మనభాషకు నిట్టి ప్రధానవిషయములసంబంధము లేదు. కర్మ, పారబ్ధము, పునర్జన్మ, త్రింశత్కోటిదేవతలు, పశుపక్ష్యాదులయందుఁ గ్రిమికీటాదులయందు నాత్మయున్నదను విశ్వాసము-నివియన్నియు నీ సంఘమునకు, నీమతమునకుఁ బునాదులు. వారి కివన్నియు లేవు. వారిఋషులు సృష్టిని సృష్టిహేతువును విచారించినమార్గము వేఱు, నీఋషులు విచారించినమార్గము వేఱు. అందుచేత భాషాస్రోతస్సులు రెండును రెండుభిన్నమార్గములే పట్టెను. ప్రతిశబ్దమునకు వారియర్థము వేఱు, నీయర్థము వేఱు. దేవుఁడు అన్నశబ్దము చూడుఁడు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురును సృష్టిహేతువులు. వారికన్న నున్నతాధికారి కలఁడు. అది బ్రహ్మము. వీరు వైభవములు కలవారు; గుణసహితులు. కూటస్థులు కాదు. ఇదియంతయు మఱింతయు నర్థము దేవుఁ డన్న మాటలో నున్నది. నీవేదాంతమంతయు నాశబ్దమునకొకవ్యాఖ్యానము చేయును. దీనికిఁ బర్యాయపదమైన వారి 'గాడ్' అను శబ్దము తీయుము. వారి యర్థము వేఱు. వానిని మించినవాఁడు లేఁడు. సృష్టి వాఁడే చేయును. లోకమంతయు నతనిలీల. సుఖదుఃఖము లన్నింటికి నతఁడే హేతువు. మన దేవుఁ డట్లు కాదు. మనచేసిన కర్మలననుసరించి సుఖదుఃఖములను బంచిపెట్టువాఁడు. ఇట్లు ప్రధానమైనభాషయందు, నర్థమునందు భేద మున్నది. ఇంక వాఙ్మయ మనఁగా నేమి? మతమును, సంఘమును, నాచారమును మనోహారముగాఁ జెప్పునదియే వాఙ్మయము సంఘమతాచారములు తజ్జాతియొక్క యాంతరజీవితమును దద్భావములును నాచరణకు వచ్చిన స్వరూపము. ఈ సంఘమతాచారములను నీవు కాదనుటకుముం దా మహర్షులసిద్ధాంతములను దర్కరీతిగా నీవు నిరాకరించవలయును.

అసంగతియట్లుంచి యిప్పుడు వాఙ్మయ మనఁగా నేమి? సంఘమతాచారముల మనోహరమైనశబ్దమయప్రకటనము. ఇంతియేకాక శీలపోషణము. ఒకానొకప్రత్యేకవ్యక్తియొక్క ప్రత్యేకమానసికపరిణామము, కావ్యము పాఠకునిహృదయరంజకముగా నుండుటకుఁ గవి చేయు కొన్ని చమత్కారములు నివియు వాఙ్మయమునందు స్థితి కలవియే. ప్రధానమైన వాఙ్మయస్వరూపము సంఘమతాచారములను జెప్పుట. అందుకనియే మిల్టనుకవి వ్రాసిన 'పారడైజు లాస్టు' (Paradise Lost) ఇంగ్లీషుభాషలోనంతశిరోభూషణమైన గ్రంథము. వర్జిల్‌కవి వ్రాసిన ఈనీడ్ గాని, గెయిటీ వ్రాసిన ఫాస్టు గాని మహాగ్రంథము లగుటకుఁ బరలోకములను గూర్చిన వారిసిద్ధాంతములు వానియందుఁ బ్రతిపాదింపఁబడుటయే హేతువు. కర్మసిద్ధాంత మొప్పకొనుము. సంఘ మిట్లేయుండును. కావ్యాత్మయే కాక కావ్యశరీరము కూడ, కావ్యస్వరూపముగూడ నీ జాతిసిద్ధాంతములమీఁద నాధారపడియుండును. మనకుఁ బ్రబంధ మున్న దనఁగాఁ బ్రబంధాదిని బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రవర్ణనలు వ్రాయఁబడియున్న వనఁగాఁ గవి చాతుర్వర్ణ్యమును సంఘముయొక్క పరమోత్కృష్టరూపముగా నెంచినాఁడు గనుక. మనశిల్పముకూడ మనమతాభిప్రాయముల వలెనే యొకదాని కొకటి హేతువులుగాఁ గలవి. భారతారంభమునఁ జూడుఁడు - సర్పయాగము చెప్పఁబడియున్నది. సర్పయాగమేల చెప్పఁబడవలయును? భారతము ప్రధానముగాఁ గర్మసిద్ధాంతమును బ్రతిపాదించుచున్నది. గీతలలో భగవంతుఁడు ప్రతిపాదించినది కర్మసిద్ధాంతమే. నేటికాలపుపండితులుకొందఱు దుర్యోధనునిది తప్పు, ధర్మరాజుది తప్పు యని విచారింతురు. కర్ణుని నన్యాయము చేసెనందురు. అశ్వత్థామ—బ్రాహ్మణుఁడు—సయుక్తి పన్నె నందురు. భారతము వ్రాసినాతనికి నీ గోల తెలియదు. వారువారు చేసిన పురాకృతకర్మ యట్లు ఫలించినది. కర్మపరంపరాపరిణామము భారతములోని ప్రధానవిషయము. సనాతనమతమునకు మొదటిసిద్ధాంతము. దీనినే సర్పయాగముచేతఁ గవి సమర్థించినాఁడు. సర్పయాగము ద్వాపరాంతమున జరిగినది. దీనికి హేతువైన సముద్రమథనము కృతయుగమునందు జరిగెను. ప్రపంచమంతయు నొక్కటియే మహావిష

యము. ఈ ప్రపంచమంతయు నైన మహాణువులన్నియు నొక దానితో నొకటి సంబంధము కలవి. ఖగోళమండలి నానాగ్రహములు భూగోళమునందలి సర్వజంతువులసృష్టిస్థితిలయములకు హేతుభూతము లగుచున్నవి. జ్యోతిష మీ సిద్ధాంతముమీఁదనే యాధారపడి యున్నది. పాశ్చాత్యులదయవలన దానికి శాస్త్రత్వము సిద్ధించినది. సాముద్రికము వారు క్రొత్తగా నేర్చిన విద్య. ఇప్పు డాధునికనాగరకులకు బెన్‌హాము, కీరోలు ఋషికల్పులుకదా! మనిసిజీవితమునకు వానిచేతిలోని గీఁతలకు నంతసంబంధము. ముఖరేఖలను జూచియు, దస్తూరిచూచియు శీలము తెలిసికొనెడివా రున్నారఁట. నీవు పుట్టి జరుపు చర్యలన్నియు నీవు పుట్టకముందే నిర్ణయింపఁబడినవి. నీదస్తూరి, నీనడక, నీచూపు నన్నియు నిన్నే ధ్వనించుచున్న వనఁగా నేమి ఋజువగుచున్నది? ఇదియంతయు నొకమహాస్వరూపము. దీనియం దెల్లెడ నొకమహైక్యమే ప్రకాశించుచున్నది. ఏదో వెనుక నొకఁ డుండి దీని నిట్లుగాఁ జేసినది. ఇం దొకదాని కొకఁడు హేతువు. దీని భిన్నాంగములను విడఁదీయరాదు. బెర్నార్డుషా వ్రాసిన నాటకములు మహానాటకము లని మీ యభిప్రాయము. అసలు మొదట నాటకమునకు రసమా ప్రధానము, భావమా? పాశ్చాత్యలోకము తరసంఘము ప్రతినిమేషపరివర్తనముల చేత గగ్గోలుపడుచున్నది. అనియతభావములు జలపాతమువలె నిలచి ప్రవహించలేక యూర్ధ్వతిర్యగధోమహుస్తాడనములచేత ఘూర్ణిల్లిపోవుచున్నవి. సిద్ధాంత మేదో తెలియదు. ఆదర్శ మేదో తెలియదు. ఒక నిలకడకు రాని—వచ్చుటకు వీలులేకుండ తానే చేసికొనిన – పరిస్థితులనుండి బహుళసమస్యలు పెంచుకొని తన్నసమస్యాపరిష్కారమునకై వైవిధ్యముల వాఙ్మయము వినియోగించుచున్నది. అదియంతయు సారస్వతమేనా! షా వ్రాసినగ్రంథములు రసహేతువులా? ఆయన లోకమునకుఁ జెప్పఁదలఁచిన పరివర్తనవచనములా? గొప్పప్రవక్తయే మహాకవి. మహాకవి గొప్పప్రవక్తగాఁ గూడ నుండవలయు నన్న సిద్ధాంతము కలదు. శంకరాచార్యులు గొప్పప్రవక్త. వారు వ్రాసిన స్తోత్రములు విడిగాఁ దీసినచో కాళిదాసు వ్రాసిన మూఁడునాటకములు, మూఁడుకావ్యములు కలిపినచో వీనికిఁ బదిరె

ట్లుండును. ఆచార్యులవారికవిత్వమున శబ్దార్థాలంకారములు, శయ్యలు, పాకములు, మహాకావ్యగుణములు నమోఘముగాఁ గలవు. శ్రీశంకరులను గాళిదాసుకన్న గొప్పకవి యనలేదు. కాళిదాసు ప్రవక్త కాఁడు. మహాకవి యగుటకు రసమే ప్రధానము. రసము నెవఁడు సమృద్ధిగాఁ బండించునో వాఁడు మహాకవి. భావము చిన్న పడియ వంటిది. రసము సముద్రము వంటిది. పాశ్చాత్యనాటకములన్నియు భావాశ్రయములు. రసాశ్రయములు కావు. అందొక యనుభావమో వ్యభిచారిభావమో యాలంబనముగాఁ జేసికొని కథాసృష్టి యుండును. ఒక్కొకప్పు డేదో యొకమతసిద్ధాంతమును జెప్పుటకు నాటకము వ్రాయఁబడియుండవచ్చును. ఆస్కారువిల్డు వ్రాసిన 'సెలోమె' వంటిది యేదో యొకభావమునే చెప్పును. రచన మహోత్కృష్టముగా నుండవచ్చును. వస్తుధ్వని, పాఠకుని నున్ముఖునిజేయుటకుఁ గథ యొకచోట పట్టుట, యొకచోట నాఁపుట, పాత్రపోషణము, మానసికోద్యోగము ప్రకటించుట, ఒకప్రత్యేకమానసిక పరిణామరహస్యమును నిర్ణయించుట, ప్రసంగచాతుర్యము నివి యన్నియు మహాకవులైనచో నే జాతిలోనైనను జేయుదురు. అసలు ప్రధానవస్తువునందే భేదము. రచనాపద్ధతిచూచి మహాకవులను నిర్ణయింతురా? అచ్చటనిచ్చటనెచ్చటను నున్నారు. తక్కినవిషయము లట్టివి. హరవిలాసము మొదట దుర్వాసఋషి తాను దూర్వాంకురములతోఁ బోషించుచున్న యాశ్రమహరిణమును జిట్టకముతోఁ బెదిరించె నని కోపించి యొకగంధర్వుని శపించెను. వాఁడు వచ్చి పాదములమీఁదఁ బడెను. దుర్వాసుఁడు 'అయ్యో! నాయనా! నేఁడు లేచి యెవనిమొగము చూచితివిరా, నానోటివెంట నట్టిమాట వచ్చినది! తండ్రీ! నీవు పోయి శాపమును దీర్చుకొని రమ్ము. నీవు వచ్చువఱకు నీభార్యను గూఁతువలె నాయింట రక్షించుచుందును' అని పరామర్శించెను. ఈ కోప మేమిటి? ఈ పరామర్శ యేమిటి? ఇది హిందూమతమును, మతమునకు హేతుభూతమైన మహాసిద్ధాంతమును ధ్వనించుచున్నది. ఇది కవిత్వ మగునా, కాదా? మహాకవులు తెలుఁగులో నున్నారా, లేదా? రచనాపాటవము చూచినచో నెందఱ జేసిగలరు. మనము మనచదువుచునే విస్మరించితిమి. ఛందేమున్నదో

చదువము. పోలేఁ డన్నివిమర్శలతోఁ బాశ్చాత్యులగ్రంథములను జదువుదుము. అవి తెలియును. ఇవి తెలియవు. వీనిమీఁద విమర్శనలు వ్రాసి లేవు. నేఁటికాలమున మనదేశమున మహాకవులున్నారా యని ప్రశ్న రావచ్చును. చదివినవా రేరీ? పోషించినవా రేరీ? కవి తనబ్రదుకు తాను బ్రదుకుటయే కష్ట మయ్యెను. ఉద్యోగములకుఁ బరిశోధన కావలయును; తెలుఁగుపుస్తక మొక్కఁ డమ్మదు. ఇది స్థితి.”

అప్పటికి రాత్రి ప్రొద్దుపోయినది. ధర్మారావు అందఱివద్దను సెలవుతీసికొని యింటికిఁ బోయెను. తరువాత నెవ్వరును మాటాడ లేదు. రాత్రియంతయు నిశ్శబ్దముగాఁ గడచెను. నిన్నఁ జలివేసినది. నేఁ డప్పుడే ప్రాణము బయటపరుండుటకు వాంఛించెను. వసంతము వచ్చె నాయెను.

# పదునెనిమిదవ అధ్యాయము

'ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు వచ్చితివి? మాట యనఁగా నిల్పుండవలయును! రెండు నెలలలోనే వచ్చెదనని చెప్పితివి. నా కేమి తెలియును? నిన్నుఁజూచినదే యిప్పు డాయెను. నీవు నిజమే చెప్పెదవనుకొంటిని' అన్న దనసూయ. 'నా దేమియుఁ దప్పులేదు. తప్పంతయు నరుంధతిది. నీ వున్నావు, నీ మఱఁద లున్నది. అదిగో, నా కొడుకు?' అన్నాఁడు ధర్మారావు. రామేశ్వరశాస్త్రిని జంకనెత్తుకొని యరుంధతి ముందునకుఁ బోయినది. దొడ్డిలోనికి వెడలినతరువాత ననసూయారుంధతులు గలసికొనిరి. అరుంధతి— ఈ ప్రయాణ మెన్ని నాళ్ళనుండి యనుకొన్నారు? అనసూయ— నన్ను 'నీ' వనియే యనవలయును. ధర్మారావుభార్య నాకు మఱఁదలు. అరుం— అట్లయినచో నాఁడుబిడ్డను మన్నించవలయునుగదా! అన— అస లాఁడుబిడ్డలను గౌరవించుము. అరుం— వారు మాయింటి కెప్పుడును రానే రారు. కనుక నిన్నే మన్నించవలయును. నిజముగా నమ్మా వదినే, ఎన్నిసారులు బయలుదేఱినా మనుకొంటివి? ఎప్పుడు నేదియో యొక యభ్యంతరమే. మీతమ్ముఁడు గూటిపిచ్చుక. కదలడు. నేను వందసార్లు 'పశుపతిగారియింటికిఁ బోద'మని చెప్పితిని వారికి వేఱే పని లేదుగా! దేవునిపెండ్లి - ఇదియేగోల. అన— ఆ దేవాలయమునకు మీరు ధర్మకర్తలా? అరుం— కాదు. అయినచో నింతయిబ్బందియే లేదు. అన— మఱి యేమిటి? అరుం— దానికి వేఱేకథ యున్నది. ఈ పిల్లవానిపే రేమిటి? అన— ధర్మారావు. మీ యన్నగారు పోరాడి యీ పేరు పెట్టించిరి! నీ భర్తవలె నీయనగూడ పెద్ద కవి కావలయునఁట. నీపేరు కూఁతునకు, మీయాయనపేరు కొడుకునకుఁ బెట్టుకొన్నాము మీయిద్దరను మాయింట వెలయించుకొన్నాము. అరుం— వారిని వెలయించుకొనుట బాగుగనే యున్నది; వారు గొప్పవారుగనుక. నే నేమున్నది, నాపేరు పెట్టుకొనుటకు. అన— అదియు నాయననుబట్టియే వచ్చిన దనుకొనుము. అరుం— మీయరుంధతి మఱి యెచ్చట? అన— మాయరుంధతి కాదు; మీ యరుంధతియే. అరుంధతి పలకయుఁ, బుస్తకములును బుచ్చుకొని

లోనికి వచ్చినది. అన—అది గోనమ్మా మీపిల్ల. అరుంధతి యరుం
ధతిని దగ్గఱకుఁ దీసికొనెను. చిన్నపిల్ల దగ్గఱకుఁబోయెను. అన—
అవునమ్మా, మీకును మీకును గోత్ర మేమిటి' అది సామాన్య
ముగా నెవరివద్దకును బోదు. మూడు నీవద్దకుఁ బిలువగానే వచ్చినది.
అరుం—ఇంక మే మిద్దఱమును గలసి యెంత చేయవలయును?

అరుంధతి చిన్నయరుంధతిని బుజ్జగించుచు 'ఏమమ్మా! మా
యింటికి వచ్చెదవా? తీసికొనిపోయెద' ననెను. చిన్నపిల్ల తలయూఁ
పెను. అన—వచ్చును. దాని కేమి, అది సిద్ధముగానే యున్నది.

అది వసంతకాలము. కోకిలకుహూకుహూనినాదములు పెండ్లి
పిలుపులవలె విననయ్యెను. మావిచివుళ్ళు బుగ్గలపైఁ బొడిచిన నూత్న
వధువుల మధురలజ్జాకాంతి విరజిమ్మెను. ప్రాతఃప్రవికసన్మల్లికాసు
వాసనలు పసియెదలోని ప్రేమభావమువలెఁ దారాడెను. గుమ్మగాఁ
గొమ్మలువంగి యావరించిన మాకందతరుచ్ఛాయాశైత్యముచేత
తగ్గనే కాని మధుమాసపుటెండలకు నియమము లేను అవి తామే
గ్రీష్మతాపము లనుకొనును. కొంచెము ధనవంతుఁడు రాజ్యమునకుఁ
దానే రా జనుకొనఁడా? అది యెవని తప్పు? నాల్గుపిచ్చుకలు చేసిన
తప్పు. మధుమాసపుటెండలు గ్రీష్మాతపములతైక్ష్ణ్యము ప్రదర్శించి
నంతఁ గోపమువచ్చి కొబ్బరిబొండము లెవనీ రిచ్చెను. అన్నదాతలు
వైశాఖపూజలు చేసి, మల్లెపూలు, మంచిగంధము, పానకము, విసన
కఱ్ఱలు విరఁజిమ్మిరి. ప్రపామంటపములవలన మధుమాసపుటెండలకుఁ
దప్పాతిరేకము కలిగెను. కృపారహితుఁడైన మన్మథుఁడు విపాటితా
శోకప్రసూనమును వింటఁ దొడిగెను. మధుకరీఝ్యానిస్వానప్రతిధ్వనిత
రోదోంతరాళుఁడైన పంచబాణునిశౌర్యరేఖ సర్వమానవహృదయాం
తరాళముల విహ్వలతఁ గలిగించెను. మాకందప్రసవకషాయవాసనా
వాసితగగుదభిరాములైన మధుకరికాలోకమును మకరందపానోన్మ
త్తులు మధుకరనాయకులు కించిచ్చుంబితాధరబింబులై వెగటువాస
నలకు విహ్వలించిరి. మంటలు, పొదుగువాసములు, గొంగళులు,
కుండలు పూని కొండకొమ్ములఁబట్టిన యేఱుఁగు తేనెకుట్టులు
దులుపుటకుఁబోయిన శబరీకాంతల చికురబంధమున నున్న మల్లికా
ప్రసూనములఁ దేనిగ్రోలుచున్న తుమ్మెదలు సృష్టిలయము లైకకాలి

కము లని వ్యాఖ్యానము చేసెను. పెద్దయరుంధతి చిన్నయరుంధతికిఁ దలదువ్వి, జడవేసి, పసికిఁ జీలొడిగి పసుపతి పట్టుత్తరీయమును వల్లె వేసి, పోయిరమేటఅనెల్ల తనవెంటనే తీసికొనిపోయెను. పసుపతి ధర్మారావులు భోజనము చేయుచుండిరి. అనసూయయు, నరుంధతి యును గొంచెము దూరముగా నిలుచుండిరి.

పశుపతి—నేఁడు పిల్ల కనుపించలేదే? అన—ఇదిగో దీపపు నీడలో నిలుచున్నది. అరుంధతియు నరుంధతియు నొకటైరి. ఇఁక పునగోఁడు లేదు. ధర్మా—అది మంత్రకర్త. దానితో జట్టుగట్టనీయకుఁడు. మాయూరిలో గిరిక యని యున్నది. నేను తెలియక వీరిద్దఱిని జత కలిపితిని. గిరిక యట్టెయట్టె పెరిఁగిపోయినది. ఇంక మనమాట వినదు. అన—అంత వినకపోయిన నేమి చేయుదును? నీభార్య యెంత చెడిపోయిననో మాపిల్లయు నంతియే చెడిపోవును. ఎక్కువ చెడిపోదు గదా! పశు—ఈయనభార్యయగుట యెక్కువచెడిపోయినది కాక పోయినదా? ధర్మా—పసుపగదా యని యబద్ధములు మాటాడఁ గూడదు. నన్నుఁ బెండ్లాడి యది యేమి చెడిపోయినది? మొగమున్నది యద్దమున్నది—అడుగరాదా? అన—ఏమమ్మా? మాధర్మారావును బెండ్లాడి నీవు చెడిపోయినావా, బాగుపడినావా? ఏమో సిగ్గు పడుచున్నది. మోస్తరు చూచినచో బాగుపడ్డట్లే యున్నది. పశు—నే నొప్పుకొనను. ధర్మా—నీ వొప్పుకొనకపోయినచో నది నా భార్య కాకపోయినదా? అరుం—ఉరుము మురిమి మంగలముమీఁదఁ బడినట్లు, ప్రసంగము నామీఁదికిఁ దిరిగినది. అన—అంతకోప మెందుకమ్మా! నిన్ననలేదు. మా పిల్ల నన్నా రనుకొనుము. అరు—పిల్లమాత్రము పడవలెనని యెచ్చట నున్నది? అదియుఁ బడను. ధర్మా—పడ కేమి? అది పడును. అది ముద్దడబ్బు కాదు. అరుం—ఇక్కడ నెవరును గాదు. అన—నేఁ డీమె ముక్కుమీఁదఁ గోపము పెట్టుకొని వచ్చినది. ధర్మా—పొరుగింటికి వచ్చినప్పు డంతమాత్ర ముండవలదా? అరుం—మీకుఁ బొరుగి ల్లేమో, నాకుఁ గాదు. ధర్మా—ముందువచ్చిన చెవులకన్న వెనుకవచ్చిన కొమ్ములు వాఁడి. పశు—నీవే కొమ్ములు, ఆవిడయే చెవులు. ధర్మా—అట్లయినచో నేను జేపు వెడలిపోయెదను. పశు—పొమ్ము. మాపిల్లలిద్దఱును

మాయింటనే యుండును. ధర్మా—మొత్తానికి మీరుమీరు నొక్కటియే. నేనే బరాయివాఁడను. పశు—పెరుఁగు తోడుకొనెనేమో చూతుము. అన—ఇందాక నరుంధతిచేతఁ దోడువేయించితిని. తోడుకొన్నో, లేదో! అరుంధతిచేయి యెటువంటిదో నేఁడు చూడవలయును. ఇంటికివచ్చిన పట్టాలమీఁద దానికిఁ బ్రేమయున్నచోఁ దోడుకొనును. పశు—చాలు, చాలు. గట్టిగాఁ దోడుకొన్నది. నెమ్మదిగాఁ బోయుము, చిక్కి మీఁదఁ బడుచున్నది. ధర్మా—గట్టిగాఁ దోడుకొన్నచో మాయమ్మాయికి బంధువులమీఁదఁ బ్రీతియున్నదన్నమాటయే. అన—నీకు మఱీ గట్టికుదుప పడినది. నీమీఁద మఱియుఁ బ్రేమ యన్నమాట! అరుం—పసిపిల్లలను బట్టుకొని మీ యిష్టమువచ్చినట్లనుఁడు. అన—పసిపిల్ల యేమమ్మా! ఎనిమిదేండ్లు వచ్చినవి! ధర్మా—ఎనిమిదేండ్లు వచ్చినదో నిం కేమి? 'అష్టవర్షా భవేత్కన్యా' యన్నాఁడు స్మృతికర్త. ఇంకఁ బెండ్లి చేయవలసినదే. పశు—ఈ బాల్యవివాహములు మన దేశములోనుండి పోవలయును. ధర్మా—అన్నట్టుగా నీవు సంఘసంస్కర్తవు కాఁబోలుదు. అన—పైకి, మాటలలో! పశు—నిజముగా; మాటలు కావు. చూచుచుందుము? మాఅమ్మాయికిఁ బదుమూఁడేండ్లుదాఁటినతరువాతఁగాని పెండ్లిచేయను. అన—అంతులో లేదు. దాని యిష్టము వచ్చినవాని కిచ్చి పెండ్లిచేయవలయును. పశు—అట్లే చేసెదను. అన—ఇప్పు డట్లే యనవచ్చును. రేపొకవేళ నది యొకధనహీనుని జూచి పెండ్లిచేసికొందు ననును. ఒక నలుబదియేండ్లవానిని జూచి పెండ్లిచేసికొందు ననును. పశు—నలువదియేండ్లవానిని బెండ్లిచేసికొందు నని యే పిల్లయు ననను. ధర్మా—అట్లనకుము. స్త్రీలు ధనమును భోగమును వాంఛింతురు శకుంతల చూడుము. దుష్యంతుని జేసికొన్నది. దుష్యంతుఁడు మహారాజై, యిద్దఱుముగ్గురు భార్యలు గలిగి, వారివలన సంతానముబడయక దిగులుపడుచున్న వయసులోనివాఁడు. శకుంతల పసిపిల్ల—పదునాఱు, పదునేడేండ్లుండవచ్చును. ఆమె దుష్యంతుని వాంఛించలేదా? పశు—పుస్తకములలో నట్లే యుండును. అన—లోకములోఁగూడ నట్లే యుండును. ధర్మా—నాకుఁ బ్రబలనాక్ష్యము వచ్చినది. అరుం—చేతు లెండిపోవుచున్నవి. లేచి

చేతులుకడుగుకొనుడు. ధర్మా—ఈమాటయే మఱచిపోతిమి. అరుం—ఇంకఁ జేతులు కడుగుకొననక్కఱలేదు. బట్టలకు రాచుకొనవచ్చును. ధర్మా—నేను మాత్రమేనా, మీయన్నగారుకూడనా? పశు—దొడ్డిలోనికిఁ బోవునంత యోపిక యున్నది నాకు. అన—ఆయనకు నున్నది.

అరుంధతియు, అనసూయయు భోజనము చేయుచుండిరి. అనసూయ యత్తగారుగూడ ఫలహారమునకుఁ గూర్చున్నది. వస్తువులన్నియుఁ జేతులదగ్గఱ పెట్టుకొనిరి. చిన్నయరుంధతి యరుంధతి దగ్గఱనే గూర్చుండు నన్నది.

అన—అది యివ్వేళ ప్రొద్దుకుంకునప్పుడు భోజనము చేయలేదు. నీదగ్గఱఁ గూర్చుండు ననుచున్నది. కూర్చుండఁబెట్టుకొనుము. అరుం—ఒక్కపూఁటలోఁ బిల్ల నాదగ్గఱ నింతచనువైన దేమో? అత్త—దాని పినతల్లి యనుకొన్న దేమో? అన—అట్లనుకొనుటకుఁ బసిపాపయా యేమి? ఆవిడ యెవరే, ఆవిడదగ్గఱఁగూర్చుండు ననుచున్నావు? చిన్నఅరుంధతి—అక్కయ్య. అన—ఇది యేమి వరుసయే! అత్తగారిని బట్టుకొని యక్కగా రనుచున్నావు? అరుం—నే నత్తగారి నేమిటి? నాకు దానియీడునకుఁ దగినకొడుకైన నున్నచో నత్తగారి ననుకొందును. అక్కగారే బాగున్నది. నన్ను నీవు అక్కగారే యనుము. చి. అరుం—నే నట్లే యందును. అన—దీనిని నీ వెంట సుబ్బన్నపేటకుఁ దీసికొనిపొమ్ము. చి. అరుం—నేనే వెళ్ళెదను. అత్త—దీని కేదో పట్టినదే! లేచిపోయిన రోజును ముంగివలె మాటాడదు. ఎవరు వచ్చినను వారిదగ్గఱకుఁ బోదు. ఈ నాఁ డిది యేమిటి? ఈమెదగ్గఱకుఁ బోయినది. వారియూరు పోయెద ననుచున్నది. అరుం—పట్టినచో నెవరు పట్టుదురు. నేనే పట్టవలయును.

ఆ రాత్రి పశుపతికాంతు రరుంధతివద్దనే పండుకొన్నది. తల్లి కోపించినది. "మంచముమీఁద ముగ్గురికిని జోటు చాలదు. రామేశ్వరశాస్త్రి యటునిటు పొరలు నని యామె చెప్పుచున్నది. నీవు విడిగా బండుకొ" మ్మనెను. అరుంధతి యేడ్చినది. అత్తగారు "పనిలేదు. వారిని పెద్దమంచముమీఁదఁ బండుకొననిమ్ము" అన్నది. ఒకరాత్రివేళ నరుంధతికి మెలఁకువ వచ్చినది. పసివాఁడటు తిరిగి పండుకొన్నాఁడు. చిన్నయరుంధతి తన్ను గాటముగాఁ గవుఁగిలించు

కొన్నది. అరుంధతి మనసులో ననుకొనెను- "ఈ సంబంధమే విచిత్రముగా నున్నది. నే నన్నచో నీ పసిది యి ట్లున్న దేమో!" ఆమె పసిదానిచేయి తీసి ప్రక్క నుంచఁబోయెను. నిద్రలోఁగూడ నామె తీయనీయలేదు. అరుంధతి మఱల నిదురపోయినది. మఱల మెలఁకువవచ్చి యిరువురిమధ్య కుడివైపున నొదిగి పండుకొనుట కష్టమై పిల్లవానిని జిన్నయరుంధతియున్న వైపునకుఁ గదలించి పరుండఁబెట్టి తా నతనివెనుక నెడమచేతివైపున నాని పండుకొనెను. రామేశ్వరశాస్త్రి చిన్న యరుంధతి తన తల్లియే యనుకొనెను కాఁబోలు! నామెడొక్కలోఁ దూఱి పరుండెను. పెద్దదయిన గవాక్షమునుండి గాలి చక్కఁగా లోనికి వచ్చుచుండెను. అరుంధతికి నిదురపట్టెను. ఆమె యొకకల కనెను—అందు సుబ్రహ్మణ్యేశ్వర స్వామి రెండుతలలతో నామెకుఁ గనుపించెను. ఒకశిరస్సు కనిపించి, కనిపించలేదు. దానివెనుకనే యింకొక శిర స్సుండెను. మూఁడు శిరస్సు లేమో యని చూచెను. కాని శిరస్సులు రెండే. అరుంధతికి మెలఁకువ వచ్చెను. స్వామి తనకార్యమునాఁడు కనిపించెను. ఇంత వఱకు మఱల జాగ్రదవస్థలోఁగాని, స్వప్నావస్థలోఁగాని కనుపించ లేదు. కాని యామెమనస్సులో స్వామి నిత్యమునాడుచునే యుండెను. ఆమె నేఁడు తనకు వచ్చినకలనుగూర్చి విచారించెను. "స్వామికి రెండుశిరస్సులా, మూఁడుశిరస్సులా నకుఁ గనుపించినవి? వెనుక నొక శిరస్సు కనిపించెను. మూఁడేమో యనుకొనుచుండఁగా రెండే యన్నట్లు తోచెను. ఒకానొకప్పుడు స్వప్నములో జరిగెడుసంగతులకు జాగ్రదవస్థలో జరుగుసంగతులకును సంబంధ ముండదు. ఈ స్వప్నము ఫలితార్థ మేదైనఁగలదా? ఇంకొకజాము ప్రొద్దున్నది. ఫల మేదైనకలదేని నది జరుగుటకుఁ గొంతయాలస్య మున్న దన్న మాటయే. మఱి తెల్లవాఱుజామునవచ్చినస్వప్నములు సద్యఃఫలము లని, రాతిరి కాలమున్న ఫలిత మాలస్యముగాఁగలుగునని స్వాప్నికులు చెప్పుదురు. దీనికి ఫలిత మేమై యుండును?" ఇంతలో నామెకు నిదురపట్టెను. తెల్లవాఱ వచ్చుచున్నది. అరుంధతి మేల్కొనెను. చిన్నయరుంధతి నిద్రలో లేచి మఱలఁ దనవీఁ పానుకొని పండు

కొన్నది. క్రిందఁబడునేమో! మఱియు మంచపుపట్టెమీఁద నున్నది. అరుంధతి తాను లేచి యనసూయను లేపెను.

అరుం—అరుంధతి తెల్లవాఱులు నన్నుఁ గౌఁగిలించుకొనియే పండుకొన్నది. అన—ఏమో! దానికి నీ వన్నచో నట్లున్నది. కానిమ్ము మీకును, మాకును నేదియో లేకున్న యెడల నిట్టిసంబంధ మెట్లు కలుగును? నేను ని న్నిదివఱకుఁ జూడలేదు. నీవు నా కాత్మబంధువ వైతివి. ఎనిమిదేండ్లక్రింద ధర్మారావును జూచితిని. మఱల నిన్నఁ జూచితిని. అతనితో మా తమ్మునితో మాట్లాడుచున్నట్లే మాట్లాడుచుంటిని. ఎవరిమీఁద నెవరి కెందుకుఁ బ్రేమ కలుగుచున్నదో యెవరును జెప్పలేరు. అరుం—నిజమే. సృష్టిలోనిరహస్యము తెలియశక్యముగాదు. అన—నీవు చాల చదువుకొన్నావఁట. మా యరుంధతికిఁగూడఁ జదువుచెప్పుము. అరుం—సంప్రదాయము తెలిసికొనుటకన్న నెక్కువ చదువుండదు. సంప్రదాయము చదువే. దానిని మఱచిపోరాదు. వేఱే చదువ నక్కఱలేదు. మనయిండ్లలోఁ బెద్దవారమందఱమును నిత్యము గొప్పసంగతులనుగూర్చియే మాటలాడుకొనుచుంటిమేని పిల్లల కవి వానియంతట నవియే వచ్చును. అందుకనియే మనదేశములో నోములు, వ్రతములు, పండుగలు నిన్నియున్నవి. ఇవియన్నియు నాఁడపిల్లలకు విద్యవచ్చుమార్గములే. ఇంటిలో నా సంప్రదాయము చెడకుండఁ జూచుకొనవలయును.

మఱునాఁడు ప్రొద్దున నరుంధతి బడినుండి వచ్చుచుండెను. పశుపతియు ధర్మారావును గూర్చుండి మాటాడుచుండిరి. ధర్మారా 'విటు రా'యని పిలిచెను. పిల్ల దగ్గఱకు వచ్చెను.

ధర్మా—ఏమి చదువుకొనుచుంటివి? చి.అరుం—రెండవక్లాసు. ధర్మా—"ఆఁడపిల్లలను గ్రైస్తవులబడులలోనికిఁ బంపించరాదు. మనము బాగుగాఁ జెడిపోతిమి. వారినిగూడ నేల చెడఁగొట్టవలయును? దేశమంతయు మనసంప్రదాయములు చెడిపోయినను గృహములోనైన నవి చావకున్నచో నష్టములేదు. ఆఁడపిల్లలను మిషను స్కూళ్ళలోఁ జూచుచున్నాను. మిస్సమ్మలనుజూచి మనపిల్లలందఱును పూర్వపుపద్ధతులనే తిరస్కరించుచున్నారు. మనము బయటికిఁ బోయినపుడు మడి యాచారములు లేకపోయినను నింటకివచ్చినంతనే

సరిగా నుండకపోయినచో మనముసలమ్మలు కట్టులుపుచ్చుకొందురు. సంప్రదాయమునకు వెలగట్టు ముసలమ్మలు లేనిచో హిందువుల గృహము లీపాటికే తెక్కినవానివలె నశించిపోయెడివి. ఇంగ్లీషుచదివి స్త్రీ లుద్యోగము చేయనక్కఱలేదుకదా! కాదు, చేయవలె నందు వేని నీకూంతు నెవనికో ధనవంతుని కిత్తువుగాని పేదవాని కీయవు. నీ కూంతు రుద్యోగము చేయవలసినయవసరము లేదు." పశుపతి—నాకూంతును బీదవానికే యిచ్చెదను. నీవలె నెవండో మంచికవిని జూచి వాని కిచ్చెదను. ధర్మా—సరే! అట్లే! అపుడు నీ కూంతునకు గృహము చక్కగాం బాలించుకొనుట చేతనైనంజాలును. గృహదేవతలు,గృహమునకు సంబంధించినమంచిచెడ్డలు తెలిసికొనియుండినచో నది పెద్దచదువు. ప్రహ్లాదుం డనినాండే 'చదువులలో మర్మమెల్లం జదివితిం దండ్రీ' యని. 'ఆ మర్మము దైవభక్తి'అని ప్రహ్లాదులే చెప్పిరి. మనదేశమునందును మనగృహమునందును మనసంప్రదాయములలో, నాచారములలో నాదైవభక్తి ప్రతిఫలించుచుండెడిది. మనము దేశము నందున్న సంప్రదాయములను, నాచారములను జంపి యా దైవమును నశింపంజేసికొన్నాము. చచ్చిచెడి చేయంగలవిన్నపములై యా దేవుండింకను మనయిల్లు వదలిపెట్టి పోలేదు. వాని నచ్చటంగూడ నుండనీయక యేల తఱిమెదవు? పిల్లను బడికిం బంపించి 'అమ్మ, తల, వల, ఝషము, భేకము'—ఇవి కొన్నాళ్ళును, 'ఆవునకు నాలుగు కాళ్ళు, దానికి రెండుకొమ్ములు, అది పాలిచ్చును'—ఇవి కొన్నాళ్ళును జెప్పి యేల పాడుచేసెదవు? ఆవు పాలిచ్చు నని తెలియనిపిల్ల యెవరు? దానికి నాల్గుకాళ్ళని తెలిసికోలేని జంతు వెవరు? పిల్లల మనస్సులు మెత్తగా నుండును. వారికిం జక్కంగాం గథలుచెప్పి బోధచేయుము. వారిమనస్సునకుం బట్టును. విషయముగ్రహించుటకుం బసిపిల్లలమనస్సు సిద్ధముగా నున్నది. అక్షరములునేర్చుకొని పుస్తకము చూచిచదువుటకుం బిల్లలకన్ను సిద్ధముగాలేదు. నాలుంగైదేండ్లు రాచి చదివించినగాని వారు ధారాళముగాం జదివి పుస్తకము నర్థముచేసికొనలేరు. వ్యగ్రమైన వారిమనస్సు నీ నాలుంగేండ్లును వృథాగా నేల పాడుచేసెదవు? అక్షరములు నేర్చి చదువునాంటికి నీ చదువుచెప్పు కృత్రిమమార్గములచేత మెత్తని వారిమనస్సు

గిడసబాఱి విషయగ్రహణమునం దశక్తమై పోవును. పసిపిల్లలమనస్సు సుకుమారముగా నుండును. సుకుమారములైనవిషయములు బోధించుము. అవి పిల్లలకుఁ దెలియును దెలియును; మనస్సునందలి సౌకుమార్యము వృద్ధియు నగును. మనకు సోకు బలిసి పిల్లలగుఱించి శ్రద్ధ తీసికొనము. నాల్గవక్లాసు, మూడవఫారము ఫెయిలైన, యక్షరజ్ఞానములేని యుపాధ్యాయులకు మనపిల్లల నప్పగింతుము. వారికే రాదు, వీరి కేమి చెప్పుదురు? ఈ రీతిగా మనదేశములోఁ బసివాండ్రకుఁ జెప్పు చదువు పాడైపోయినది. నా చిన్నతనములో మాయూరిలో నిత్యమును బురాణము చెప్పుచుండెడివారు; నాటకము లాడుచుండెడివారు. వీనివలనఁ బౌరాణికకథలన్నియు నాకుఁ జిన్ననాఁడే తెలియును. ఇప్పుడు మనుష్యులు బి. ఏ. ప్యాసగుదురు. వారికిఁ బురాణకథాసందర్భములే తెలియవు. అవి తెలియక తెలుఁగుచదువు రాదు. వారికిఁ గ్రీస్తనఁగాఁ గ్రీస్తే. మనకు విష్ణువనఁగా శ్రియఃపతి, మామమామ, మన్మథునితండ్రి, పద్మాక్షుఁడు మఱి యింకను లక్ష పేళ్లు. వీని యర్థములు పురాణకథావిషయములు తెలిసినచో సులభముగాఁ దెలియును. అందుచేత పిల్లలకీ పాఠపుస్తకములు మానిపించి, త్రిపురాసురసంహార మెట్లు జరిగినది, గజేంద్రమోక్షణ మెట్లు జరిగినది, పరశురాముఁడు రాజుల నిరువదియొక్కసారి వధించెను, రావణాసురుని గర్భమునం దమృతకుంభ మున్నది- యిట్టి కథలన్నియుఁ జెప్పుము. 'అతిపరిచయా దవజ్ఞా' యన్నట్లు మనపురాణకథలలో నున్న హృదయంగమత్వము మనకుఁ దెలియుట లేదు. ఇంగ్లీషుసాహిత్యము చదివినమనకు గ్రీసుదేశపు బూర్వగాథలో నున్న భావరమ్యత తెలియును. 'ప్రాక్రాస్టియనుబెడ్' అని, 'హెర్కులీసువలె బలశాలి' యని యీ విషయములు సర్వథా మనవాక్ప్రపంచమునఁ జేరినవి. మనపురాణకథలుకూడ వానికన్న హృద్యములైనవి. మనము దూరమునుండి చూడవలయును. కొన్ని మనోహరకథలుచూచి యవి 'రొమాంటిక్'గా నున్న వందుము. వసిష్ఠుఁడు పుత్రశోకముచేతఁ దనలోఁ బడి చచ్చుటకు రాఁగా భయమెత్తి శతద్రూనది నూఱుపాయలుగాఁ దేలినదఁట. తన యాశ్రమధేనువును దన కీయ నన్నాఁడని విశ్వామిత్రుఁ డలిగి బలవంతముగా ధేనువును

దెప్పించునపుడు వసిష్ఠుననుమతిపూని, నందినిశరీరరోమములను విదలించెను. ప్రతిరోమకూపమునుండి సహస్రములైన యవనభటు లుప్పతిల్లి విశ్వామిత్రునిసైన్యమును దునుమాడిరి. 'రొమాన్సు' అనఁగాఁ గథాచమత్కారము. వీనియందుకన్నఁ గథాచమత్కృతి యెచ్చట నుండును? ఇవియన్నియు నేవో ప్రాఁతకథలని, వానియం దర్థము లేదని, యవి యేవో స్వప్రయోజనార్థులచేత రచియింపఁబడిన వని యన్యాయములైన యూహలల్లి 'త్రావ లేనిపిల్లి బోర్లగిలఁ ద్రోసికొనె' నన్నట్లు చెడిపోవుచున్నాము. హృదయమునకు సునిశితత్వము రావలయు నన్నచో, మనస్సు చక్కఁగాఁ బరిపక్వదశకు రావలయు నన్నచో నూహాపోహలు వృద్ధిచేయు నా కథలు చదివిననే రావలయును. వాఁ డూహించుటకుఁ దావులేకుండ పట్టిగొడ్డువిషయములు చెప్పినచోఁ బసివానిమనస్సులో నూహ రేఁగదు. శైశవమునుండియు నిది మంచియూ, చెడ్డయూ యను విమర్శనతోడనే ప్రారంభించినవానికి భావనాశక్తి గలుగదు. మనజాతిని జూడుము. నూఱేండ్లనుండి యిట్టివిద్య చదువుకొనుటచేత భావనాశక్తిలేక దరిద్రమైనది ప్రతివాఁడును గృత్రిమతర్కము నవలంబించును గాని, భావనాబలము కలవాఁడు కనిపించుట లేదు. మన భావనాశక్తి నశించుటకే యిట్టివిద్య గఱపఁబడుచున్నది. పిల్లను బాఠశాలనుండి మానిపించుము. నీవు ననసూయయు రాతిరిపూఁట పిల్ల కనేకకథలు చెప్పవచ్చును. నాటకములకుఁ దీసికొనిపోకుమ్ము—ఈ నాటకములకుఁ దీసికొనిపోయినచో నున్నజ్ఞానముగూడఁ జెడిపోవును. మంచినాటకములు లేవు. మొగిలులోనినీరుచూచి చెఱువులోని నీరు పోఁగొట్టుకొన్నాము. మేఘ మేమో పిడుగులు కురియుచున్నది. ఏమి చేయవలయును? ఏమైనను సరియే పిల్లనుమాత్రము పాఠశాలకుఁ బంపించకుము. పంపించినను సరేకాని, యింటివద్ద నామెకు మనదేతలు, మనకథలు, మనసంప్రదాయములు నన్నియుఁ జెప్పుచుండవలయును. ఎవని కిచ్చి వివాహము జేసెదవో వానికిఁ దెలుఁగుభార్య నిమ్ము. ఇంగ్లీషుభార్య నిచ్చినచో వాఁ డేమి చేసికొనును? వాఁడు ఐ. సి. ఎస్. అయినచో ఫరవా లేదు. మన మందఱమును ఐ. సి. ఎస్. లము కాముకదా!

పశు—నీవు చెప్పినది నిజమే. ఈ యాడపిల్లలను బడికిఁ బంపించి పాడుచేయుచున్నాము. ధర్మా—పాడుచేయుట యేమిటి? మాయింటి కెదురుగా నొకపిల్ల యున్నది. ఆమె మూఁడవఫారము చదువుకొనుచున్నదఁట. ఆమెగర్వము భూమియు నాకాశమును బట్టుటలేదు దాని కిప్పుడు బి. ఏ. ప్యాసైన వాఁడు కావలయును. ఒకవేళ నామె బి. ఏ పరీక్షయిచ్చినచో నింగ్లాండుపోయివచ్చిన వాఁడుతప్ప పనికిరాఁడు. ఎంతమందిమి యింగ్లండుపోయివత్తుము! నే నా చదువు తప్పనుట లేదు. ఆ చదువువలన సద్గుణములకన్న దుర్గుణములు వృద్ధియగుచున్నవనుచుంటిని. ఇంగ్లీషు చదివినవానిలోఁ జూడుము. బి. ఏ. పరీక్ష యగును. వానికిఁ బ్రపంచజ్ఞానముకూడ నుండదు. వానియహంకారమునకు మితి యుండదు. జ్ఞానమంతయు నింగ్లీషులో నున్నదని, యది యంతయుఁ దనకు వచ్చె నని. కళాశాలలలో శీలముకూడ విద్యార్థులకు నేర్పెద మందురు. అది వట్టి మిథ్యావాదము. వా రందఱు నవినయమునకుఁ బుట్టినిం డ్లగు చున్నారు. మనోవాక్కాయములయందు వారికి నియమము లేదు. అది యీ చదువులోనే లేదేమో! పశు—పిల్ల యింటిలో నున్నచో నల్లరిచేయు నని బడికిఁ బంపించుచున్నాను. ధర్మా—నేను పంపించ వద్దనుట లేదు. అక్కడఁ జెప్పుచదువు బాగుగా లేదు. నీ వింటివద్ద మంచిచదువు చెప్పించుము. అందులోఁ బిల్ల కిప్పటినుండియు నింగ్లీ షెందుకు? తెలుఁగు చక్కఁగా వచ్చినతరువాత నాభాష చెప్పించుము. ఒకయేఁడాదిలో వ్యవహారమునకుఁ దగినంతభాష వచ్చును. ఆఱునెలలలో హిందీ వచ్చుట లేదా? బుద్ధి వికసించినతరువాత నే భాషయైనను దొందరగానే వచ్చును. మన పెద్దలందఱును జేయు దోషమే యిది. పదిపదునాలేండ్లవఱకును దెలుఁగులు చక్కఁగాఁ జెప్పి యేఁడాదిలో వ్యవహారజ్ఞానము కుదర్చఁగలయింగ్లీషు చెప్పుటకు బదులు మొదటినుండియు నింగ్లీషే చెప్పుచున్నారు. ఈ పట్టభద్రులకు నింగ్లీషు కొంచెము వచ్చును. తెలుఁ గేమియు రాదు. మొదటి నుండియు నింగ్లీషు చదివినందువలన ఫలిత మేమనఁగా వీరందఱు నాంగ్లేయమానసపుత్రులు. మసికట్టుకొను మనుము. పరిశుభ్రముగా నుండవలయునుగాని మడిలో నే మున్న దనును. పరిశుభ్రముగా

నుండుటలోమాత్రమే మున్నది? అసహ్యముగానున్నచో నన్నము సయించదు. ఏల సయించదు? ఏనాదివారు, కొందఱు నీచజాతివారు నసహ్యమైన దేహములతో, గుడ్డలతోఁ దినుటలేదా? నాగరనాగరకులు, బుద్ధిమాలినవారు; నేను నాగరకుఁడను, నాకుఁ బరిశుభ్రముగా నుండవలయు ననును. పరిశుభ్రముగానుండుట నాగరకతయైనచో భోజనము చేయువేళ మడిబట్టమని, దానితో నింకెవరిని దాకనని నియమముగానుండుట మఱియు నాగరకత యేమో! ముఱికియుండుట, లేకపోవుటలోని తారతమ్యము ప్రత్యక్షము. శుభ్రమైన వస్త్రమునకును, మడిబట్టకునుగల తారతమ్యము ప్రత్యక్షము. నీవు దేవుఁడు గాఁడందువేని నది యప్రత్యక్షవిషయము. అప్రత్యక్షమై బుద్ధిమంతులచేత నూహింపఁబడునదియే మతము. అదియే దివ్యము. అది నీ సామాన్యజ్ఞానమును దాఁటియుండును. సద్విషయమును నీ వాచరించవేని నది నీకే నష్టము. సూర్యునిపై దుమ్ముచల్లినఁ గన్నులలోఁ బడును.

పశు—ఒకమాట. నీ వీ యావేశమంతయు నడంచుకొని యీ భావములను గార్యరూపమునఁ బరిణమింపఁజేయుదువేని యది యుత్తమము. జీవితముఁగూడ శిల్పము వంటిది. కావ్యమునందు విషయము ధ్వనించినట్లే జీవితమునందును మనయాదర్శములు ధ్వనించవలయును. ఈ సంగతి నీకును దెలియును. ఇంక నుద్యోగము రానీయకుండ వీలైనంతలో నీభావములను బదిమందికి విద్యారూపమునఁ దెలియఁ జేయుము.

ధర్మా—నే నే కళాశాలలోనైన నుద్యోగినైనచో నట్లు చేయువచ్చును. జాతీయకళాశాలలో సీతాపతి మొదలైనవారికి నాయీ మార్గముననేకదా బోధించితిని! అందుకనియే మూఁడు నాలుఁగేండ్లు చదివిన సీతాపతి బి. ఏ. లు పరీక్షయైనవారికన్న నెక్కువ తెలుఁగు వచ్చినవాఁడైనాఁడు.

పశు—కానిమ్ము. ఎప్పుడును జీఁకటిదినములే కావుకదా! ఒకప్పుడు కాకపోయిన మఱియొకప్పుడైనను నీజ్ఞానము, నీపాండిత్యము, నీవిమర్శనశక్తి లోకమునకుఁ దెలియకపోవునా?

ధర్మా—కళాశాలాధికారులు విదేశీయులు. వారికి భాషాయథార్థస్వరూపము తెలియదు. ఎవఁడాశ్రయించునో ఎవఁడు తనమతము మతాభిప్రాయములకు సన్నిహితబుద్ధియో వాఁడు వారికిఁ బెద్దపండితుఁడు. హైందవులైనవారే యొకప్పుడధికారులుగా నుండవచ్చును. వారును

హూణభాషావిశారదులే కాని, తెలుఁగులలోఁతు తెలియనివారు. ఇందులో నొకరహస్యమున్నది. పాఠముచెప్పుటకన్న వారేది యథార్థప్రవర్తన యనుకొందురో యట్లు నడచుట యెక్కువ ముఖ్యము. ఈ గోల కేమిగాని మేము రేపు వెళ్ళెదము. పశు—రేపా! నేను వెళ్ళుమని చెప్పువఱకు వెళ్ళరాదు. ధర్మా—మాయమ్మ ముసలి దొక్కర్తయు నింటిలో నున్నది ఇపు డామె వంటగూడఁ జేసికొన లేకుండ నున్నది. ఇంటిలో వంట రెండుపూఁటలును నా భార్యయే. పశు—అందుకనియే యరుంధతి యట్లు చిక్కి యున్నది. ఆమె యొడలిలోఁ బ్రాణములే లేవు. ధర్మా—వంట మా నలుగురికే మైనను నిల్లు బోలెడంత యిల్లు! ఆ చాకిరీయంతయుఁ జేయువఱకే దానిపని యగుచున్నది. 'తాఁ దూఱఁ గంత లేదు. మెడ కొకడోలు' లన్నట్లు నే నొకపరిచారికను బెట్టుకొనిన నెలనెలకు దాని కెక్కడ నుండి తెచ్చి యీయను? అరుంధతి కేదో జబ్బుకూడ నున్నది. మందిప్పించుటకు తాకత్తు లేదు. కానీ!'' ఇరువురను భోజనములకు లెమ్మనిరి. మఱునాఁడు అరుంధతిధర్మారావులు ప్రయాణమైరి. అన సూయాపశుపతులు పోనీయలేదు. అరుంధతి యన్నది : 'అరుంధతిని నావెంట బంపించినచో నే నుండెదను. పశు—ఆ పిల్ల మీపిల్లయే నమ్మా! తీసికొనిపొండు! అదిగో! అది చూడు నిన్నుఁబట్టుకొని యెట్లు వ్రేలాడుచున్నదో! ధర్మా—నీకే చీరలు, నగలును దేలేక నేను బాధపడుచున్నాను. అదికూడ నెందుకు? అరుం—నాకుఁ జాల తెచ్చుచున్నారు! ఒకవేళ మీ కంతకష్టమైనచో నా బదులు దానికిఁ దెండు. ధర్మా—అమ్మో! నిన్ను నేను వదలిపెట్టలేను. అన—నీ కీమె యేదియో మందు పెట్టియుండును. ధర్మా— ఆ దశ తొలఁగిపోయినది.

ఆ రోజంతయుఁ గడచిపోయెను. అరుంధతీద్వయమున కెడఁ బాటు లేదు. వారు మఱునాఁడు మఱల బయలుదేఱిరి. పశుపతి యన్నాఁడు: 'మీరు సోమవారమునాఁడు బయలుదేఱినచో బెజవాడ వఱకు నేను వత్తును.' ధర్మా—నీ మాట నమ్మిన దెవరు? నేఁ డేమి వారము? పశు—గురువారము. ధర్మా—శుక్ర, శని, ఆది మూఁడు రోజులే! నే నుండఁగలబ్బా! పశు—ఉండక తప్పదబ్బా! ధర్మా—నీవు తప్పక వచ్చెదవా? అన— నీ వబద్ధము చెప్పెదవుగాని వారు

చెప్పరు. ఎనిమిదేండ్లకు వచ్చితివి. ఎనిమిదిరోజులైన నుండ నను చున్నావు. ధర్మా—ఇన్నియేండ్లకువచ్చితినిగనుకనే మీయరుంధతి నిట్లు చూచితిని. అన—నీ మో స్తరంతయుఁ జూచినచో నీవు మా యరుంధతిని వలఁచిన ట్లున్నది. ధర్మా—అంతదూరము రాలేదు. ఆమెను వలఁచుటతో నా కేమిపని? వలసినచో నామెయే నన్ను వలఁచు నేమో! అన—మాపిల్ల నీ వనుకున్నంత లేఁతగుండెది కాదు. పశు—సరే. ప్రయాణము సోమవార మనియేకదా! అన—అంతే, మఱల వారు ప్రయాణమాఁపుకొనిరి. వసంతకాలము మూన్నాళ్ళక్రిందకన్న మఱియు విజృంభించినది. పశుపతికి మామిడితోఁట యున్నది. సాయంవేళ వాహ్యాళిగా నందఱును దోఁటకుఁ బోయిరి. మిగిలిన దొక్క పశుపతితల్లియే. మామిడితోఁట యెకరముమేఱ నున్నది. తోఁట చిన్నది. కోరడివెంటఁ గొబ్బరిచె ట్లున్నవి. మధ్య, రకమున కొకటి రెండుగా బత్తాయిలు, నారింజలు, నిమ్మలు కలవు. నిమ్మ చెట్లు వడపిందెలు వేసెను. అందుఁ గొన్నిచెట్లు క్రిందఁబడియుండెను.

ధర్మా—తోఁటకు నీరుపెట్టుట లేదా? పశు—ఉన్నాఁడు, మా కొక తేభ్యము. వాఁడు దున్నబోయినదూడ, మేయఁబోయిన నెద్దు వాఁడు సరిగాఁ బనియే చేయఁడు. మావితరువులు జివుళ్ళు వేసి గాలిచేఁ గదలి యతిథులను సమాహ్వానించుచున్న ట్లుండెను. గున్నమామిడులు నేలకుఁ దాఁకుచుండుటచేతఁ జిన్నయరుంధతి యొకచివుఱుజొంపమును ద్రుంచెను. పశు—చివుఱుద్రుంచితి వెందులకే? ధర్మా—దానికి లేఁతవయసుననే యనుభవించుట యిష్టము కాఁబోలు. అరు—లేఁతవయ సేమి? చివురుకొంచెము ముదిరినది. మఱియు లేఁతగా లేదు. చేతికి శోభగానుండవలయు ననినఁ జివురాకుగాక మామిడిమండ పుచ్చుకొనెదరా? మండనుండి ఫలముమాత్రమే వచ్చును. అన—నీకు దెలియని దేదియును లేదు. పశు—ఆఁడబిడ్డ యంతమాత్రమైన ననకపోయిన నెట్లు?" తోఁటయంతయుఁ గ్రొత్తఁగా దున్ని చెట్లకు నీరుపెట్టిరి. ధర్మా—ఇక్కడ నీరు తోడిరే! పశు—నిమ్మచెట్లకు. వానికిఁ దోడ లేదు. దున్నినచాళ్ళలో మట్టితో బోదెలుచేసి నీరుపెట్టిరి. నేల యంతయు వదులుగా నుండుటచేత బోదెగట్టు తడిసి ప్రక్కన

గజముమేఱ తడిసెను. పశుపతికాలు బురదలో దిగఁబడెను. ధర్మా—"అది తప్పు కాదు. ఫరవా లేదు." అనసూయ నవ్వెను. పశు—మీ అబ్బాయినిగూడ దింపి నడిపించుము. వాఁ డెంత లోఁతు దిగఁబడునో తెలియును. ధర్మా—వాఁడు నాల్గుమల్లెపూల యెత్తు. వాఁ డసలు నీటిమీఁదఁగూడ నడచిపోఁగలఁడు. అరుం—అయినను దింపి చూతునా? ధర్మా—(నవ్వి) నిజముగా దింపెదవు సుమా! అరుం—ఇన్నికంతులు కోసితిని, నాకంతియంత నొప్పిలే దన్నాఁ డఁట. అన—ఏ మమ్మా! దింపుదు నంటివి కదా, పిల్ల వానిని. ఏదీ దింపుము. ఆయన యెక్కడఁడే కన్నాఁడా? కోకిల కుహూ యనెను. చిన్నయరుంధతి మఱలఁ గూహూ యనెను. కోకిల మఱలఁ కూహూ యనెను. చిన్నయరుంధతియుఁ గోకిలయు నొకరినొకరు రెట్టించుకొనిరి. అనసూయ—ఎందుకే నీవు దాని నంత రెట్టించెదవు? ధర్మా—రెట్టించుటయే కాదు. అది కూఁత మానివేసినతరువాతఁగూడఁ గూయుచున్నది. అన—అంతేనమ్మా యీ పిల్ల! రేపు మగఁడు నాకు వల దనినను నీవే కావలయు నని వానివెంటఁ బడును. పశు—పతివ్రత లంతియేకదా! అన—శారదా చట్టము వచ్చినతరువాత నింకను పాతివ్రత్య మేమిటి? పశు—మన యిండ్లలో స్త్రీలనందఱిని జదువుచెప్పక పట్టిచాద స్తపుమనుసులుగాఁ దయారుచేయుదుము. ధర్మా—చదువుకొనినవారికన్న చాఁకలి మేలఁట. ఆమె యనినదానిలోనే యెక్కువ యాథార్థ్య మున్న దేమో! పశు—నీవు ధర్మారావు వాయెను.

మధుమాసపుఁ జిఱువెచ్చని యీవిరులు చెట్లసందులనుండి దూఱి మొగములమీఁదఁ జెవులలోఁ దూఱి రొండఁబెట్టెను. అరుంధతి పిల్లవాని నెత్తుకొని నడువలేకపోయినది. ఆమెకుఁ గొంచెముగా వడకొట్టినది. ఆమె కట్టువానిని ధర్మారావుచేతి కిచ్చెను. ఇచ్చుటలో నిరువురిమేనులును తాఁకినవి. ఇరువురియొడళ్ళు పులకిత బ్రహ్మానందపథమున నడచెను. ఇరువురకును మనసులలో నొకరి నొకర మెడఁబాయలే మనిపించెను. ఇంతలోఁ బిల్లవానిని నేను తీసికొనెద నని చిన్నయరుంధతి వారియిద్దఱినడుమకు వచ్చెను. అరుంధతి చిన్నయరుంధతిని నివ్వెరపోయి చూచెను. ధర్మారావు

పసివానిని నామెచేతి కిచ్చెను. అరుంధతి మోటవద్దకుఁ బోయి, తొట్టెవద్ద నున్న నీళ్ళతో మొగము కడుగుకొనెను. ఆమె వెంట ధర్మారావును బోయెను. పశుపత్యనసూయలు ముగ్గురుపిల్లలు తోఁటకు నొకవైపున నుండిరి; అరుంధతీధర్మారావు లొక వైపున నుండిరి.

ధర్మారావు—పడిగొట్టినదా యేమి? అరుం—రోజుకురోజుకు నాయోపిక పోవుచున్నది. నా కేమైన మం దిప్పించుఁడు. నే నింక నెన్నాళ్ళో బ్రదుకను. నావలన మీ కేమైన సుఖమా, బండలా? ధర్మా—చీచీ! అట్లనకుము. నీ వున్నా వన్న నదియే చాలును. ఆ మహాకవి యన్నట్లు 'నిబ్బరముగ రేతిరి నిదరపొయ్యేను-' అరుం—నేను నిజముగాఁ జాలరోజులు బ్రదుకను. ధర్మా—నీవు లేకున్న నేనుమాత్రము బ్రదుకుదునా? అరుం—లోకములో నందఱును బ్రదుకుట లేదా! అయినను నేను మిమ్ము వదలిపోను. ధర్మారా వామెవద్దకుఁ బోఁబోయెను. అరుం—వారు చూచెదరేమో! పదుఁడు పోదము.

వసంతకోకిల మావిచివుళ్ళు గీచికొనిపోయి యూఁపిన కుహూ నిస్వానము మఱలఁ బ్రారంభించెను. మఱలఁబోయి, వారునువీరును గలసికొనినతరువాత ననసూయ యన్నది: "ఇప్పుడు కాదమ్మా! మామిడిపండ్లు కాఁపువేసినతరువాత మీరు రావలయును."

పశు—మాతోఁటలో మంచిజాతులన్నియు నున్నవి. జహాంగీరు, ఇమాందీనులు నున్నవి. ఆ మూల నున్న వంకరచెట్టు జహాంగీరు. దానివైపుననున్న రెండును ఇమాందీనులు. ధర్మా—ఒక రెండు నెలలు పోనిచ్చి మఱల వత్తుముకదా! పశు—అరుంధతినిగూడఁ దీసికొనిరావలయును. అరుం—నీ యింటనే యున్నదికదా యరుంధతి? అన—ఒక్కయరుంధతి పనికిరాదు. మీ రిద్దఱునుగూడి యుండవలయును. అప్పు డిమాందీనులు మిక్కిలి రుచి. ధర్మా—ఇమాందీనులు పండిన సంపెఁగ, చక్రకేళీల వాసనయు మామిడి పండురుచియుఁ గలవి. అన—మామిడిపండు చిన్నయరుంధతి; సంపెఁగతావి పెద్దయామె. ధర్మా—అది చక్రకేళి కూడను. సోమవారము వచ్చినది. అరుంధతీధర్మారావులును, రామేశ్వరశాస్త్రి

యును, పసుపతియు బయలుదేఱిరి. పసుపతి యరుంధతీధర్మారావు లకు నూతనవస్త్రములు పెట్టెను. శాస్త్రికి రెండురూకలు చేతిలోఁ బెట్టెను. వారు వలదనిరి. కాని పుచ్చుకొనక తప్పక వచ్చెను. అరుంధతి యన్నది "వదినె! మాయూరిలో దేవునికల్యాణములు జరుగును. నీ వప్పుడు తప్పక రావలయును. శశిరేఖాకిరీటులుకూడ వత్తురు. నీవు శశిరేఖ నిదివఱకు చూడలేదుగదా! బంగారుతల్లి. చూతువు గాని."

బెజవాడస్టేషనులో దిగిరి. దిగి వంతెన దాఁటుచుండఁగాఁ బన్నెండేండ్ల పిల్లవాని నొకపోలీసువాఁడు పట్టుకొని కొట్టుచుండెను. వాఁడు 'నే నేమి దొంగిలించితినో చూపింపుఁడు. ఊరకే కొట్టుట యేమి న్యాయము?' మనెను. పోలీసు 'వెధవా! నీవు దాఁచినచోటు నాకుఁ దెలియునా? నీయంత యింద్రజాలపుముండకొడుకుండఁడు' అని కొట్టుచుండెను. ధర్మారావు పోయి, 'వానివద్ద నేమియు దొరకనప్పుడు కొట్టుట యెందులకు? వానిని వదలిపెట్టు' మనెను. పోలీసు 'అయ్యా! వీఁడు జనుజంత్రిముండకొడుకండీ! వానిని దయఁదలచరా' దనెను. ధర్మారావు 'పోనిద్దూ పాపము! వాఁడును బ్రదుకవలయును గదా!' యనెను. కుఱ్ఱవాఁడు "అట్లు చెప్పండి బాబూ! నే నెప్పుడును నాకుఁ గావలసినదానికన్న నెక్కువ తీసికోను. ఈపోలీసాయననే యడుగుఁడు. మొన్న నొక పెద్దమనిషి జేబులో డబ్బుసంచి కొట్టి వేసితిని. అందులోఁ బదిరూపాయ లున్నవి. నాకుఁ గావలసిన దొక్కరూపాయయే. ఆనాఁడు మాయింటిలో బియ్యము లేవు. రెండునాళ్ళనుండి నాకు మాయమ్మకుఁ దిండి లేదు. అందుచేత నా రూపాయ తీసికొని తక్కిన తొమ్మిదిరూపాయలు 'మీసంచి క్రింద పడిపోయిన దండీ' యని యాయనకే యిచ్చితిని. ఆయన యొక రూపాయ తక్కువైనదని చూచుకొన్నాఁడు. క్రింద నేమో పడిపోయి యుండవచ్చు ననుకొని కొంతసేపు వెదకి వెళ్ళిపోయెను. "అయ్యా! యీ పోలీసువారు నన్ను ఖైదులోను వేయరు, నన్ను సంపాదించుకోను నీయరు" అని యేడ్వసాఁగెను.

ధర్మా—నిన్ను ఖైదులో వేసినచో మీయమ్మకుఁ దిండి యెట్లు? వాఁడు—అది యేమిచావు చచ్చునో నేను చూడవచ్చి

తినా? ఎదురుగా నున్నంతవఱకే మనబాహ్యత. ధర్మా—ఏమి వేదాంతము! నీ కున్నంతమాత్రము జ్ఞానము తిండికలవారికి లేదోయి నీ పే రేమి? వాఁడు—అసిరి.

ధర్మారావు వానిని వదలించెను. పోలీసువాఁడు వానిని వదలి పెట్టిపోయెను. ధర్మారావు, పశుపత్యాదులు నడచుచుండిరి. కొంత దూరము పోయి బండికట్టించుకొని దానిలో నెక్కిరి. అసిరి వెనుకనే వచ్చుచుండెను. ధర్మారావు బండి యాఁపుమని, 'యెందుకురా మా వెంట వచ్చెద?' వని యడిగెను.

వాఁడు—మీ యిల్లు చూచిపోయెదను బాబూ! ధర్మా—మా యిల్లెందుకురా? ఏమైనచేతిదెబ్బకొట్టవలయుననియా? అసిరి—మీ కంత యనుమానమైనచోఁ దిరిగిపోవుచున్నాను.

ధర్మారావు 'కాదులే, ర' మ్మని బండి యెక్కించుకొనెను. సూర్యపతి యింటికిఁ బోయిరి. సూర్యపతి వారిని గలసికొని మహానందనిమగ్నుఁ డయ్యెను. ధర్మారా వరుంధతితోసహా వచ్చినందుకు సూర్యపతి యానందము పట్టలేకపోయెను అతనిభార్య వచ్చి యరుంధతిని లోనికిఁ దీసికొనిపోయెను. హోటలునుండి యన్నము తెచ్చి యరుంధతికిఁ బెట్టిరి. వారిద్దఱును భోజనము చేసిరి. స్నేహితులు ముగ్వురునుజిత్రవిచిత్రపుఁగబురులతో మధ్యాహ్నముగడిపినతరువాత ధర్మారావు 'పోవుదు' నని ప్రయాణమయ్యెను.

సూర్యపతి—చాలులేవయ్యా! మహా వెళ్ళినావు? ఇప్పుడే వచ్చి యిప్పుడే వెళ్ళెదవా యేమిటి? సాయంకాలము కొండ యెక్కుదము. ధర్మా—దొంగ! కొండ యన్నచో నే నుందునుగదా యని కొండ యనుచున్నాఁడు. సూర్య—మావాండ్రుకూడ కనకదుర్గ గుడికిఁ బోవుద మనుచున్నారు. కలసిపోదము. ఉందువా, ఉండవా? పశు—ఇఁక నెచ్చటికి వెళ్లునులే. ధర్మా—రాఘవరావునకు ఖైదిం కెన్నాళ్ళున్నది? సూర్య—ఇంక రెండుమూఁడు నెలలలో వచ్చునను కొందును. సంవత్సరముపైని కాలేదా వెళ్ళి? ధర్మా—అసిరి కన్నము పెట్టిరా? సూర్య—వాని దీ యూరే. దొంగవెధవ నెచ్చట నుండి తెచ్చితివి? వీఁ డొకనాఁడు నా జేబులో నర్ధరూపాయ కొట్టి వేసినాఁడు. ధర్మా—వీఁ డీ యూరికి ప్రాఁతకాఁపన్నమాట. సూర్య—

వీని కొత్తేండ్లు వచ్చినప్పటినుండియు నిదియే వృత్తి. అప్పుడే రెండు సార్లు రెండాఱునెలలు వెళ్ళివచ్చినాఁడు. పశు—నాలుగున్నర యైనది. కొండకుఁ బోదము రండు. సూర్య—మాగుఱ్ఱపువాఁ డింకను రాలేదు. ధర్మా—వాండ్రు గుఱ్ఱపుబండిమీఁద వత్తురులే. మనము నడవవచ్చును.

వీరుముగ్గురును గవర్నరుపేఁటలో బయలుదేఱి వంతెనవద్దకు నడచిరి. అసిరి వెనుక వచ్చుచుండెను. ధర్మారావాఁగి యసిరిని గలిసికొని 'ఏమిరా, ఏమైనను గావలయునా యేమి? జేబులోనుండి మాత్రము లాగివేయకుము' అనెను.

అసిరి—ఒక్కటే మాట, బాబూ! మీదగ్గఱ నేమియుఁ గాఁజేయను. ధర్మా—తెలియకుండ నెట్లు కాఁజేసెదవురా? అసిరి—మీరు ప్రక్కజేబులో డబ్బు వేసికొనుఁడు. నామాట మఱచిపోయి నడచుచుండుఁడు. నేను లాగివేసెదను, చూడుఁడు! ధర్మా—నా రిద్దఱిలో నా పొడుగాయనగాక, పొట్టి గుమ్మటములా గున్నాఁడు, ఆయన ఖద్దరుచొక్కా, ప్రక్కజేబులో డబ్బుంది. నేను వారితోఁ జెప్పను. ఇంక రా! అసిరి—మీరును నావంక నటు నిటు చూడ రాదు. అట్లు చేసినచో వా రనుమానపడెదరు. ధర్మా—చూడనులే.

ముగ్గురును గలిసి కొండదాఁక పోయిరి. అప్పటికి గుఱ్ఱపు బండిమీఁద సూర్యపతియు నిర్వురుకూఁతుండ్రును, నతనిభార్య ఛాయాదేవియు, నరుంధతియు, నాసుకుమారుఁడును వచ్చిరి. సూర్యపతి "కొబ్బరికాయలు, హారతికర్పూరము, పసుపుకుంకుమలును గొనిపోదము, దుర్గగుడికి" అని డబ్బుదీయుటకుఁ జేబులోఁ జేయి పెట్టెను. పశుపతికూడ జేబులోఁ జేయిపెట్టి డబ్బుసంచి లేక యటు నిటు చూచి గల్లంతుపడుచుండెను. ధర్మా 'ఏమి' టనెను. పశుపతి 'డబ్బుసంచి లేదోయి' యనెను. ధర్మా—నీ వెంత ధనవంతుఁడవైనను నంతయశ్రద్ధ యేమి? ప్రక్కజేబులో వేసికొందురా? అందులో నీ యొడలే నీకుఁ దెలియదాయెను. పశు—అంత తెలియకుండ లేను గాని, యేదో పొఱపాటు వచ్చెను.

అసిరి నెమ్మదిగా వెనుకవెనుకనే వచ్చుచుండెను. సూర్యపతి వానిని జూచి 'యడుగో! దొంగ! కుంకా! యిట్లు రా! డబ్బుసంచి

యేదిరా!' యనెను. ధర్మారావు కన్నీలుపుచున్నను, అసిరి డబ్బు సంచి పశుపతి కిచ్చివేసెను.

పశుపతి — నీ కెంత కావలయునో తీసికొని యీయరా. అసిరి — తీసికొన్నాను, బాబూ! బీడీల కర్ధణా తీసికొన్నాను. ధర్మా — ఇంటిలో బియ్య మున్న వటరా? అసి — నేటి కున్నవి. ధర్మా — మఱి రేపటికో! అసిరి- రే పింకను రాలేదు కదండీ! అది రేపటిమాట. రేపుప్రొద్దున మఱెవరో దొరకరా? (పశుపతిని జూపించి) అయ్యగారే యుండినచో మఱలఁ గాఁజేసెదను. ముప్వు రును విఱుగఁబడి నవ్విరి. పశు — నే నొక రూపాయ యిచ్చెదను. తీసికొనుము. రెన్నాళ్ళవఱకు దొంగతనముచేయ నక్కఱలేదు కదా! అసిరి — దొంగతనముచేయకున్నచో నాకుఁ దోఁచదండీ! ఆ రోజున నాకు సయించదు. మీ రూరకే యిచ్చినచో నది బిచ్చము వంటిది. నేను సంపాదించుకొనియే తిందును. ధర్మా — దొంగ తనము సంపాదనఁటరా? అసిరి — చిత్తము! చిత్తము! పెద్దపెద్ద జీత గాండ్రందఱును జేసెడి దేమిటండీ? నేను న్యాయముగా సంపాదించు చున్నాను; వా రన్యాయముగా సంపాదించుచున్నారు. సూర్య — నీది న్యాయము, వారి దన్యాయమురా? అసిరి — నేను నాకున్న విద్యవలన నెవ్వరికిని దెలియకుండ, నెవరికిని నష్టములేకుండ, నాకుఁ జాలినంత మాత్రమే తీసికొని తృప్తిపడుచున్నాను. వా రందఱును విద్యవలనఁగాక సిఫారసులు లంచాలు పెట్టి, యందఱికిని దెలిసిన యన్యాయవృత్తిచేత బోలెఁడంతమంది పేదవారికిఁ దిండికిలేకుండఁ జేసి సంపాదించుచున్నారు. నేయియన్నమును దిను మహారాజులు - మీరు చెప్పఁడు! ఎవరిది న్యాయము? ధర్మా — వానికిఁ జూచితిరా, యెంతయార్థికశాస్త్రము తెలియునో!

అందఱును గొంతమెల్లెక్కుచుండిరి. అసిరియు నెక్కుచుండెను. ధర్మారా వసిరితోఁ గలసికొనెను.

ధర్మా — మఱి నీ వింత జాగ్రత్తగాఁ జేయుచుండఁగాఁ బోలీసువాండ్రు ని న్నెట్లు పట్టుకొందురు? అసిరి — వెధవ లిప్పుడు నన్ను పట్టుకొనలేరు. చిన్నప్పు డొకటిరెండు తెలివితక్కువగాఁ జేసితిని. అప్పుడు నన్ను ఖైదులో వేసిరి. అప్పటినుండి వారికి

నామీఁదఁ గన్ను. అంతే కాని వారు నన్నుఁ బట్టుకొనియేడ్చిరా! పట్టుకొనినమాత్రము నా కేమి నష్టము? ఇక్కడకన్న నా కక్కడనే బాగుండును. దిగులులేకుండ గవర్నమెంటువారు పోషింతురు. ధర్మా— దొంగతనములో మెలఁకువ లన్నియు దెలియునా, నీకు? అసిరి— నేను జేబుదొంగనుమాత్రమేనండి; నా కీ విద్య సంపూర్ణముగాఁ దెలియును. పెద్దవాండ్రుకూడ నసలు పెద్దదొంగతనములు చేయరండీ! ఎవరో ధనవంతులు, నుద్యోగస్థులే చేయించెదరు. ఒక్కటేమాట వినుడు! పేదవాని కాపుఁట గడచినఁ జాలును. తేపటిసంగతి వాఁడు చూచుకొనఁడు. ఒక్కటి చూడండి. లోకములో నిన్నిదొంగతనములు జరుగుచున్నవి గదా! బాగుపడినదొంగ యెవఁడు? ధనమంతయుఁ జేయించినవాని యింటికిఁ జేరును. కల్లు దుకాణమునకుఁ గావలసినంతమాత్రమే వీఁడు తీసికొనును. రెండేండ్ల కఠినపునరకము వీరికి. ఇది మనదేశములో మాట. లండనులోనటండీ దొంగతనముచేసి ధనవంతు లగుదురఁట. వారు టార్చిలైట్లు, అద్దాలు కోసెడి సాధనములు, తాళములు కరఁగించులైట్లు పుచ్చుకొని దొంగతనముచేయుదురఁట. హస్తలాఘవము వారి కేమి తెలియును? అది మనదేశములోని విద్య. ధర్మా — నీ కీ వర్తమానము లన్నియు నెట్లు తెలియును? అసిరి — మాలోఁ బత్రికలు చదివి వార్తలు చెప్పెడివారు కొందఱున్నారు. ధర్మా—మీ దొక పెద్ద సంస్థరా! అసిరి — అనఁగా? ధర్మా — ఏమియును లేదులే.

దుర్గగుడికి నందఱును ప్రదక్షిణము చేసిరి. అసిరియుఁ దిరిగెను. కొబ్బరికాయలు కొట్టిరి. బలహీనురాలైన యరుంధతి పిల్లవాని నెత్తుకొనలేకపోయెను. ఛాయాదేవి కెడపిల్ల నాలుగేండ్లది. ఆమె యామెను దించి రామేశ్వరశాస్త్రి నెత్తుకొన్నది. సూర్య—ఆమె చాల చిక్కిపోవుచున్నదయ్యా! మునుపు నేను చూచినప్పటి కిప్పటికిఁ జాలభేదమున్నది. పశు — మం దేమైన తప్పక యిప్పించవలయును సుమా! ధర్మా—మీ యిర్వురితో గోలగా నున్నది. నా దగ్గఱ డబ్బెక్కడ నున్నది? ఉండికి పదిరూపాయ లప్పుచేసి వచ్చితిని. తెలియునా?

అందఱును దేవీప్రసాదము తినుచుండిరి. అసిరి కొకరెండు కొబ్బరిచిప్ప లిచ్చిరి. ఎల్లరును బోయి మల్లికార్జునస్వామిని గూడ దర్శించి, మఱీ కొండపైకిఁ బోవు మార్గమువద్దఁ గొంతపైకిఁ బోయి ముప్వురును గూర్చుండిరి. ఆ త్రోవ మొదట ఛాయారుంధతులు, పిల్లలు.

ధర్మా—ఒరేయి! అసిరీ! పెద్దదొంగలను బట్టుకొనినచో దొంగలు 'మేము చేయలేదు. వారు చేయించి'రని యెందుకుఁ జెప్పరు? అసిరి—అది కులవిద్య. తాను చేసితిననిగాని, యితరులు చేసిరనిగాని, చేయించిరనిగాని చెప్పఁగూడదు. ఇది మొదటనే ప్రమాణము చేయ వలయును. ధర్మా—అట్లు చేయించినవారి నెవరినైన నెఱుఁగుదువా, నీవు? అసిరి—బాబోయి, పేర్లు చెప్పఁగూడదండీ! ధర్మా—మన మిచట నలువురమేకదా! అసిరి—ఆరోజు వచ్చినప్పటికి గాలికూడ సాక్ష్యమిచ్చును. ధర్మా—నీకు నీ విద్యలోని రహస్యములన్నియుఁ దెలియునురా! అసిరి—లేకపోయిననే నాతల్లియు, నేనును బ్రదుకు చున్నాము? ధర్మా—ఎవరినో యొక్కరిని జెప్పుము. అసిరి—అయ్యా! చెప్పరాదు సరేకదా; మీరు తీసికొనిపోయి యెచ్చటను వ్రాయనుగూడ రాదు. పశు—ఈయన కవియని నీకుఁగూడ దెలిసి నదియా? ధర్మా—వ్రాసినచోఁ గుండలీకరణము చేసెదను లెమ్ము! 'దానికి నిన్నేమియుఁ జేయరాదు' అని క్రింద షరా వ్రాసెదను! చెప్పుము. అసిరి రహస్యముగా నేదియో చెవులోఁ జెప్పెను. ధర్మా—అహాహా! మతముచెప్పుటలో నిదికూడ భాగము కావలయును. ఈ రీతిగాఁగూడ దోచుకొనవలయును! నీవృత్తిరహస్యములన్నియు నాకుఁ జెప్పుచుంటివికదా! నేనుపోయి పోలీసువారితోఁ జెప్పిన నేమి చేసె దవు? అసిరి—నావద్ద దొంగసొమ్ము చూపించవలయును, పట్టుకొన వలయును. ఇంకొకమార్గము లేదు మా కందఱకును 'లా' తెలుసు నండీ!

అందఱును గొండదిగి యింటికిఁ బోయిరి. అసిరికి బలవంతము చేసి పశుపతి రెండురూక లిచ్చెను వాఁడు నే నూరకే తీసికొన ననఁగా ధర్మారావు 'నీవు మా కీ నాఁ డెంతచదువు చెప్పితివి? దాని బదులు తీసికో' మ్మనెను. అసిరి 'చదు వమ్మి డబ్బు తీసికొనరా

దండీ' యనెను. ధర్మారావు 'నే నటువంటివాఁడనేలే. నా దగ్గఱ పుచ్చుకొన్నచో దోషము లే' దని యిచ్చి పంపించెను. మఱునాఁ డరుంధతీ ధర్మారావులు సుబ్బన్నపేటకుఁ బ్రయాణమైరి.

పశు—జేబులో డబ్బు జాగ్రత్త. ధర్మా—సుబ్బన్నపేటదాఁక రైలుచార్జీ మాత్రమే యున్నది. పశు—కా దెక్కువ యున్న దేమో చూడుము! ధర్మా—నీ వేమైన వేసితివా యేమి? అని చూచుకొనఁగా నైదు పదిరూపాయలనోట్లుండెను. ధర్మా— ఇదా? ఏమిటా బరువుగా నున్న దనుకొనుచుంటిని. ఎందుకీ డబ్బు నా జేబులోఁ బెట్టితివి? పశు—నేను పెట్టలేదు. ధర్మారావు దానిని మఱలఁ బశుపతి కీఁబోయెను. సూర్య—"వద్దులే. జేబులో నుంచవయ్యా! మఱలఁ జూచినచో వైదికుఁడవు. నియోగులవలె బెట్టు పోయెదవు" అని గద్దించెను. ధర్మా—అతనిడబ్బునకు నీ యధికారి మేమిటి? సూర్య—పశుపతిగారు నీ కంతమాత్రి మీయవచ్చునులే. రైలు కదలిపోవుచుండఁగా సూర్యపతి పశుపతులకు మహాపురుషుఁ డొకఁడు తమ్ము వదలిపోవుచుండె ననిపించెను. ధర్మారావునకుఁ దాను పశుపతిడబ్బు తీసికొనినట్లే లేదు. రైలులో మధమధ్య సతీపతులు మాటాడుకొనిరి. అరుం—అరుంధతి వత్తునని యేడ్చినది. తల్లి కోప పడెను. బుద్ధి తెలిసినపిల్ల గనుక నూరకొన్నది. ధర్మా—తీసికొని రాకపోతివా? నీపని కొంత యదియుఁ జేసెడిది. అరుం— బాగుగా నున్నది స్నేహము పేరు చెప్పి ధనవంతులపిల్లచేతనుగూడఁ బని చేయించుకొనవలయును? ధర్మా—వచ్చెడిమగఁడామెను సుఖ పెట్టునని నమ్మక మేమిటి? అరుం—మీ వంటివారే యైనచో నంతే. రైలు మఱికొంతదూరము పోయెను. అరుం—ఒక్కతెయు నత్తయ్య యెట్లుండెనో! ధర్మా—ఎంత యత్తింటి కోడలివే! ఇప్పుడు జ్ఞాపకము వచ్చిన దత్తగారు!

రైలు దిగిరి. కుమారస్వామి యెదురుగా వచ్చెను. ధర్మారావు చేతిలోనుండి పెట్టె తాను తీసికొనెను. ధర్మారావు కొడుకు నెత్తుకొనెను. వాఁడు బుస్సలుకొట్టుచుఁ దండ్రిమీఁది కురికెను.

అరుం—ఇంతసే పెత్తుకొనినదానిని నేను పోయినాను. అరుంధతి బండిలో నెక్కెను. కుమారస్వామిధర్మారావులు కలసి

నడచుచుండిరి. కుమా-—చక్రవర్తి ఉడాయించె నంటోయి. ఆరోజున మీరు వెళ్ళినతరువాత మఱల మిమ్ము గూర్చి పెద్దచర్చ. మీ రంత చెప్పకుండ వెళ్ళితి రేమి? మఱునాఁడు మీయింటికి వచ్చితిని. మీరు లేరు. ప్రతీరోజును, పత్రికైలునకు మీకొఱకు వచ్చుచుంటిని. ధర్మా—నేను వచ్చినతరువాత నే మన్నా రేమి? కుమార—లక్ష యున్నవి. ఒక్కటి ధ్రువము మంగమ్మ మనపక్షము. సావిత్రమ్మ గారు బండియాఁగినంతనే మనుమనికిఁ బేఁడ దృష్టితీసి, కోడలికిఁ గాళ్ళమీఁద నీళ్ళుపోసి, లోనికిఁ దీసికొని పోయెను.

# పందొమ్మిదవ అధ్యాయము

ధర్మారావు తెలుగువైద్యు నొకని బిలిపించి యరుంధతికి మందిప్పించుట ప్రారంభించెను. పదిరోజులైనతరువాత నామెకుఁ గొంచెము నెమ్మదిగా నున్నట్లే తోఁచెను. ధర్మారావు మందు పని చేయుచున్న దని సంతోషించెను. ఊండినుండి వచ్చినతరువాత నరుంధతి మనిసి దిగాలఁబడిపోయెను. ఎందు కట్లుంటి వనఁగా "చిన్నయరుంధతిని వదలిపెట్టి నేనుండలేను. మన మచ్చట నున్నవారమువారపుదినములును బిల్ల నన్ను వదలిపెట్టియే యుండలేదు" అనును. ఈ సంగతి ధర్మారావు పశుపతికి లేఖ వ్రాసెను పశుపతి మఱల జవాబు వ్రాసెను. మీరు వచ్చినతరువాత చిన్నయరుంధతి వారమురోజులన్నమే తినలేదఁట. అననూయ 'వారివెంటఁ బిల్లను బంపించనైనఁ బంపితిమికా' దనుకొన్నది. పదినాళ్ళయినతరువాత నరుంధతి కొంచెము కలఁకదేఱినది. మఱల కొడుకు, భర్త, యత్తగారు నన్న ప్రపంచములోఁ బడినది. ధర్మారావునకు మునుపటికన్న కొంచెము చేతులు కాళ్ళాడుచుండెను. నలుఁబదిరూపాయలు చేతిలో నున్నవి కదా! అవి యైపోవువఱకును ఫరవాలేదు. కోటలోనుండి మోమిూను వచ్చుచుండెను. కుమారస్వామి వచ్చుచుఁ బోవుచుండెను. రమ్మనును. ధర్మారావు మన్నుతిన్నపామువలె నింటినుండి కదలఁడు. రెండువారములైన తరువాత నొకనాఁడు కుమారస్వామి 'మీా రీనాఁడు వచ్చి తీఱవలయు' నని పట్టుపట్టెను. ధర్మారావు వెళ్ళెను. రాధాపతి, మంగమ్మలుకూడ నచటనే యుండిరి.

రాధా—మీారు వచ్చినతరువాతఁ జక్రవర్తిగారు లేకుండుటలో సొగసులేదు. మంగమ్మ నవ్వెను. పంకజమ్మ చిన్నపుచ్చుకొనెను. శ్యామల—ఆయనకు మిమ్ముఁ గొట్టవలె నన్నంతకోపము వచ్చినదఁట! 'ఏమిఁటది? తనకన్న గొప్పవాఁడు లేఁ డన్నట్లు మాటాడును. ఆయన యంతసేపు వాగి వెళ్ళిపోయినంత నే తనవాదమే నిజమైనట్లా? ఆయన చెప్పినవాని కన్నింటికిని బ్రతిసమాధానములు చెప్పవచ్చును' అని చక్రవర్తి—"అని శ్యామల యాఁగెను. కుమారస్వామి

గింజుకొన్నాఁడని పూర్తిచేసెను. పంకజమ్మ—ఆయనను మఱల రమ్మని వ్రాసితిని. రెండు మూన్నాళ్ళలో మఱల వచ్చును. కుమార—ఇంక ధర్మారావుగారీయూరెనుండి లేచిపోవలసినదే. రాధా—మీరా నాఁడు చెప్పినవిషయములు చాలబాగున్నవండీ అయినను మీరు చెప్పినవానికన్నింటికిని బ్రతిసమాధానములు చెప్పవచ్చును. కుమా—మీరు చెప్పిన ప్రతిసమాధానములకు మఱలఁ బ్రతిసమాధానములు చెప్పవచ్చునుగదా! ఇట్లే యనవధిగాఁ బోవును. దీనికి సిద్ధాంత మెచ్చట? రాధా—దానిని సహృదయులు నిర్ణయించవలయును. ధర్మా—ఇతఁడు సహృదయుఁడని నిర్ణయ మెట్లు? ప్రతివాఁడును దనకుఁ దానే సహృదయుఁడు. తా నెఱిఁగియున్నదియే సర్వోత్కృష్టమైనది. రాధా—అట్లు కాదు లెండి. ఇప్పు డింగ్లీషులోఁ బెద్దపెద్దగ్రంథకర్త లున్నారు. వారి నొప్పుకొనవలయునుగదా! కుమా—మన భాషలో నున్న గొప్పగ్రంథకర్తలను నొప్పుకొనవలయును. రాధా—మఱి వారివలె గొప్పవారు మనలో నున్నారా? ధర్మా—రహస్యమంతయు నచ్చటనే యున్నది. మీయభిప్రాయమది. నే నింక నెంతవాదించిన నేమి లాభము? అందుకనియే యిది ప్రమాణ మని నిర్ణయించుకొనకుండ వాదనలోనికే దిగరాదు. నీకుఁ బ్రమాణమైనది వేఱు, నాకుఁ బ్రమాణమైనది వేఱైనచో నిద్దఱిమధ్య సామాన్యమైన భావమే లేదు. అప్పుడు వాదమే లేదు. తల్లియు, సహోదరియుఁ బురుషునకుఁ బవిత్రమూర్తు లన్న సిద్ధాంతమంగీకరించనివానితో స్త్రీ పురుష కామేచ్ఛనుగుఱించి వాదించుట యెట్లు? అతని కందఱు నొక్కటియే. అతనికిఁ దల్లిలోఁగూడ స్త్రీత్వమే గోచరించును, మాతృత్వము గోచరించదు. కుమా—రాధాపతిగారు కొంతవఱకంతే నండి రాధా—అవును. నేనే కాదు; పాశ్చాత్త్యులైన కొందఱు మహాపురుషు లీ సిద్ధాంతమును నిర్ణయించిరి. నాకు వారితర్కము వచ్చినది. ధర్మా—ఎవనిసంస్కారమును బట్టి వానికిఁ గొన్నికొన్ని మనస్కరించును. జంతువులు భిన్నమతములయందుఁ బుట్టుట వానివానిసంస్కారమునుబట్టియే. అది యాదృచ్ఛికమైనచో మతములందు దురభిమానములు ప్రబలవు. క్రైస్తవునకు మహమ్మదీయునకు విగ్రహారాధన పనికిరాదు; హిందువునకుఁ

బ్రతికివచ్చును. వాఁడది యచ్చటఁ బుట్టెనుగనుక; వీఁడిదియిచ్చట బుట్టెనుగనుక. ఇద్దఱును మహాతత్త్వవేత్తలైన ద్రష్టలు కారు. తాను పుట్టినమతము, భావములు తనకు రుచించుచున్నవి. దానినే 'సంస్కార' మందురు. రాధా—మీరు ప్రతివాదనయుఁ గొన్ని హిందూమతములోని శబ్దములతో వాదింతురు? ఆ సంస్కార మన్న శబ్దమును తీసివైచి మాట్లాడుఁడు. ఆ మాటకుఁ గొంతయర్థము నిర్ణీతమై యున్నది. ఆశబ్దము మామీఁదఁ బ్రయోగించెదరు. ధర్మా—నే నిదే చెప్పినది. భిన్నభాష లట్లే యుండును. మీయింగ్లీషునో మాత్రము కొన్నిశబ్దములు నిర్ణీతార్థములు కలవి యితరమతమువారి యెడలఁ బ్రయోగించినచో వారిని దెలివితక్కువవారినిగాఁ గనిపింపఁ జేయునవి లేవా? ఆర్థడాక్సు (Orthodox), పెసిమిస్టు (Pessimist), సూపర్‌స్టిషను (Superstion) —ఈశబ్దములేమిటి? నీకు వ్యతిరేకముగా వాదించువానిని నీవీ శబ్దములుపెట్టి పిలిచి వాఁడు మూర్ఖుఁడన్నట్లు తేల్చెదవా, లేదా? అనుకని యే భాష కా భాష, ఏ సంస్కారమున కా సంస్కారము. శ్యామల — ఎప్పుడు నీ వాదములతోనే కడచిపోవుచున్నది. మీ రెప్పుడు పద్యములు చదువు మన్నను నిట్లే యేదియో మాటాడిపోవుదురు. ఈ వాదనవలన ఫలిత మే మున్నది? రాధాపతివంటివారు నేటితోఁ దమయభిప్రాయములు మార్చుకొనరు. మీరు వారితోఁ గలియరు. ధర్మా — పద్యములు నేను చదువ బోయినచో రాధాపతిగారినే చదువు మనరాదా ? ఆయనయు కవియేకదా! కుమార—మనమందఱము బయటికిఁ బోదము. రాధాపతిగారు పద్యములు చదువుదురు. అందఱును నవ్విరి. రాధాపతి—నా గొంతు బాగుండదు. మీరు శ్రావ్యముగాఁ జదువుదురు. శ్యామల—మీరు తెపు వేషము వేయుదురు కాబోలునే — దానికి సంగీతము లేదా? రాధా—ఏ మున్నది? బంట్రోతు వేషములు. సుబుద్ధి నన్ను వేయు మన్నారు. దానికిఁ బద్యము లున్నవి, నాకు వలదంటిని. ధర్మా — సారంగధరనాటకమా? కుమార — అవునండీ! మంగమ్మగారు చిత్రాంగి, రంగావధానిగారు సారంగధరుఁడు. ఎవరో పెద్దనటకుఁడు — తెలుఁగుదేశమంతయుఁ పేరుమ్రోఁగినాఁడట. ఆయనపే రెఱుఁగనిది నే నొకఁడనే. ఆయన — వచ్చి రాజ

రాజనరేంద్రుఁడు వేయును. వారి పే రేమిటండీ? రాధా—కుమారప్ప. ధర్మా—కుమారప్పగా రని యెచ్చటనో విన్నానే! కుమార — ఆయన వేఱు, ఈయన వేఱు. ఈయన నటకుఁడండీ! ధర్మా — నాటక మెప్పుడు? కుమా—ఇంక నాల్గురోజు లున్నది. పంక — మంగమ్మగారికి సంగీతముకూడ వచ్చునా? కుమార—ఒక్క సంగీత మేమిటి? ఒక్క సంవత్సరములో నగస్త్యుఁడు సముద్రమునువలె విద్య లన్నిటి నీమె పుక్కిలించినది— 'ఏకచుళుకాహాంకారనిశ్శేషశోషిత పాథోధిపయస్కుఁడైన ముని వలె.' రాధా—కుమారస్వామీ! నీవు కుఱ్ఱవాఁడవు. తెలుఁగు చక్కఁగా చదువుకొన్నావుసరే కాని, యెప్పు డెట్లు మాటాడవలయునో నీకుఁ దెలియదు. కుమార—మీకుఁ గోప మెందుకండీ. మంగమ్మగారు బాగుగనే యున్నది. ఆమె కేమియుఁ గోపము రాలేదే! మంగమ్మ— కుమారస్వామి యే మన్నను నాకుఁ గోపమురాదు. లేకపోయిన జేవు నేను చిత్రాంగి యేమిటి? అందులో నీ యూరిలోనా? ధర్మారావు భ్రూయుగము ముడివడెను. అతనికి ముండ్లమీదఁ గూర్చున్న ట్లుండెను.

శ్యామల—రంగావధానిగారు మంచి నటకులా? రాధా— చాల గొప్పవాఁడు. అతనికిఁ జేసు రాలేదుకాని నటకుఁ డన్నచో నతఁడే నటకుఁడు. కుమార — నిజముగా నటకుఁడే యైనచోఁ బే రెందుకు రాదు? ఏదో గుణము లేనిచో నెంత మూఢలోక మైనను మెచ్చుకొనదు. లోక మొక్కొక్కప్పుడు దుర్గుణములు సుగుణము లనుకొనును. కాని లోకము మెచ్చుకొనినయెడల నేదో యొకవిశేష ముండవలయును. రాధా—అతఁడు గొప్ప నటకుఁడే. లోకమునకుఁ దెలియలేదు. ధర్మా—ఇప్పుడు స్త్రీలే స్త్రీపాత్రలు ధరించవలయును కాఁబోలు. కుమా—భరతాచార్యు లింద్రునిసభలో నచ్చరలచేత నాటక మాడించఁగా నచ్చరలే పురుషవేషము వేయుచుండిరఁట. అప్పుడు మేనక పెద్దయుద్యమము లేవఁదీసెను. తమప్రక్క నూర్వశికాని, రంభగాని పురుషవేషము వేసినచోఁ దాను స్త్రీవేషము వేయ నన్నదట. ధర్మా—రావణాసురునిలంక కేమైన వెళ్ళివచ్చెనా యేమి? శ్యామల— లంకలో స్త్రీలు స్త్రీ వేషములు, పురుషులు పురుషవేషములు ధరింతురా? ధర్మా—అక్కడ నంతియే నఁట.

కుమా—అవునండి! అది వాల్మీకి రామాయణములో నున్నది. రాధా—నీవు చదివితివా? కుమార—నేను చదువలేదు. మంగమ్మగారు చదివితి నన్నది. శ్యామల—ఏమండీ, చదివినారా? మంగ—కుమారస్వామి యబద్ధమాడునా? కుమారస్వామి కుఱ్ఱవానివలె నెగిఱి చప్పట్లు చఱచెను. రాధా—కుఱ్ఱవానివలె నాయుల్లరి యేమిటి? కుమార—నేను కుఱ్ఱవాఁడనుగాదా? నాకెన్నేండ్లనుకొనుచున్నారు? ధర్మా—ఒక నలువదియేండ్లుండునా? కుమార—రాధాపతిగారికా? శ్యామల—వారికిఁ బదునెన్మిదేఁడు లండీ! నాకుఁ బదునాల్గు. ధర్మా—మాయిద్దఱినడుమ నంతియేవార. కుమార—వెనుక నొక సారి యేడెనిమిదేండ్ల వార యంటిరే? ధర్మా—మాది పూర్వకాలపుఁ బెండ్లిగనుక వయసులోఁ దారతమ్య మున్నది. మీది మాకన్నఁ గొంచెము పైమెట్టుకదా! వారడి తగ్గినది. కుమార—ఈ లెక్క ప్రకారము మఱి పదేండ్లుపోవునప్పటికి మగఁడు చిన్నవాఁడు, భార్య పెద్దదియు నగును. ధర్మా—అప్పుడు మనదేశ మమెరికావలె నుండును. రాధా—ఆదేశమున మనవలె నట్టిపెండ్లిండ్లు చేసికోరు. ప్రేమ యున్ననే చేసికొందురు. ధర్మా—ప్రేమ యనఁగా నేమిటి? రాధా—ప్రేమ దివ్యమైనది. అదియే భగవంతుఁడు. ధర్మా—సామాన్యసూత్రము లెప్పుడును బాగుగనే యుండును. ప్రత్యేకవిషయములవద్దనే తగాదా! మనుజులందఱు దైవభక్తి కలిగియుండవలయు నన్నమాటలో నందఱ కభిమతమే యున్నది. దైవ మనఁగా నెవరు; భక్తియనఁగా నేమి; యన్నచోట భేదమువచ్చును. ప్రేమ భగవంతుఁడే. ప్రేమ యనఁగా మీ యర్థ మేమి? స్త్రీపురుషుల మధ్యనున్న ప్రేమయా, ఇద్దరు పురుషులమధ్యనున్న ప్రేమయా? ఈ ‘ప్రేమ’ యనుటలో ‘నాత్మవత్సర్వభూతాని’ యన్నంత యర్థ మున్నది. అడ్డదిడ్డముగాఁ బెండ్లాడి, యది ప్రేమ, అది దివ్యము — ఈ మాటల కర్థము లేదు. స్త్రీపురుషుల మధ్యనున్న ప్రేమకూడ దివ్యమే. కుమార — అయినచో మనమందరమును దేవతలమే. రాధా—కుఱ్ఱవాఁడవు, నీకుదెలియ దూరకుండు మనలేదా? కుమార—నేను కుఱ్ఱవాఁడ నేమిటి? వయస్సులోఁ గుఱ్ఱవాఁడ నైన నింకఁ గుఱ్ఱవాఁడేనా? ‘ఉత్తమజ్ఞాన

వృద్ధు నా నుండెనేని, బాలుఁడయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు.' శ్యామల—మన మిప్పు డదికాదుగదా! కుమార—పెండ్లి యైన దాఁక చెడిపోనట్లే. పంక—పెండ్లి, పెండ్లి, పెండ్లి- ఈయన నన్ను నిద్దురపోనిచ్చుట లేదండీ! శ్యామల—చక్రవర్తిగారు వెళ్ళిపోయిన తరువాత నసలు నిద్దుర లేదు. తల్లి కూఁతువంకఁ జుఱచుఱ చూచెను. కుమార—ప్రొద్దుపోయినది. ఇఁక సభ చాలింతమా? రాధా—ఇచ్చటసభ యెవరు చేసిరి? కుమార—మంగమ్మగారు.

తరువాత నెవరిదారిని వారు పోయిరి. వెన్నెలలు వచ్చెను. పంకజమ్మ, రాధాపతిమంగమ్మలును, శ్యామలాకుమారస్వాములును ధర్మారావును సాఁగనంపిరి. అది పూర్వము కోటలో నగరాలు మ్రోయువేళ. నౌబత్తుఖానాలు మ్రోయుచుండెను. ధర్మారా 'వా ధ్వని యెచ్చటి' దనెను.

కుమార—మంగమ్మగారు మఱల సినిమాలు మొదలు పెట్టించెనుగదా! శ్యామల- మీ రాధ్వని యే మనుకొన్నారు? ధర్మా—అదే యనుకొన్నాను.

నాఁటిరాత్రి రామేశ్వరశాస్త్రి పోరుపెట్టి యేడ్చెను. ధర్మారావు 'పిల్లవానికి దృష్టి తగిలిన దేమో!' యనెను. సావిత్రమ్మగారు కచ్చిక యాముదములో ముంచి వెలిఁగించి దృష్టితీసి ద్వారబంధము వద్ద రెండువైపుల నుంచెను. అరుంధతి 'పసిపిల్లలకుఁగాని రెండేండ్ల పిల్లవానికి కచ్చికలు దృష్టితీయుట యేమి' టన్నది. సావిత్రమ్మ—పిల్లవానికి రెండేండ్లా? చోద్యముపోయెదవు! ఏఁడాది వెళ్ళలేదు. ధర్మా—అమ్మా! ఏఁడాది వెళ్ళకపోయినచోఁ బుట్టినరోజు పండుగ యెందుకు చేసినాము? సావి—ఆ రీతిగా పిల్లవాని కేఁడ్లెక్కువున్నవని చెప్పఁగోరాదు.

అరుంధతి యుప్పుతీసి నూతిలో వేసివచ్చెను. పిల్లవాఁడు పోరు మానలేదు. ఎవ్వరికి నేమియుఁ దోఁచినది కాదు. సావిత్రిమ్మగారా దేవునకు మ్రొక్కుకొను, మీ దేవునకు మ్రొక్కుకొను మనెను. అరుంధతి 'పొరానికొంపలకుఁబోయి వత్తురు. పిల్లవాఁడు పోరుపట్టినాఁ' డనెను. ధర్మారావు బయలుదేఱి సుబ్రహ్మణ్యేశ్వరస్వామియాలయము నకుఁ బోయెను. ఆలయముతలుపు లప్పటికి వేయలేదు. ధర్మారావు

ధ్యానించెను: "స్వామీ! నాహృదయము నీయెడలనే వినత మైనది. 'వ్యహ త్యేనం శౌరిః కథమపి సహసేణ శిరసాం' అన్న వాక్యములోనున్న సహ సశిరస్సులతోఁడి శౌరివి నీ వని యెఱుంగు దును. నాయందు నీ కింత దయయేకాని, నేను తినఁదిండి, కట్టగుడ్డ లేనివాఁడను. నావలన నీ కేమి యుపకారము జరుగును? నే నొక మహాసంస్థ కధ్యక్షుఁడనై నఁగాను, కొంతినవాకైన నీ యాజ్ఞ నిర్వర్తించుటకు. కలి ప్రబలినకొలఁది జగత్తునుండి నీవే నిన్నుపసంహరించు కొనుచున్నావు. వేయిపడగలస్వామివి రెండుపడగలవాఁడ వైనావు. నేనును ప్రవాహగామినేకాని యెదురీఁదువాఁడను గాను. ఎదురీఁదియుఁ బ్రవాహవేగముచేఁ బ్రవాహము వెంటనే పోవుచుంటిని. ప్రవాహ మున సముద్రాభిముఖముగా నీఁదువాఁడు, నెదురీఁదువాఁడు నిద్దఱును సముద్రముననే పోవుచున్నారు. కాని వీఁ డెదురుతిరిగియుండుట లోక మునకు విపరీతముగా నుండును. నేను వేళానుగుణముగఁ గొంత యనిష్టమైనది చేసినను నది నేను బుద్ధిపూర్వకముగాఁ జేయుటలేదు. బురదలోఁ గుమ్మరిపుర్వువలెనే యుండుటకుఁ బ్రయత్నించుచున్నాను. నీవు కోపగించితివా, మానివేయుదును. నీ రెండుతలలు పూర్వ ము న్నట్లే యుండునని యేమి నమ్మకము? కొంత మాఱవచ్చును. మాఱు చునే యున్నవి. కార్యమును శంకించి కారణమును నిర్మూలనము చేయుచున్నారు. ప్రమాణములలో నధమాధమ ముత్తమోత్తమ మైనది. నన్ను మన్నించుము. నేను రామేశ్వరశాస్త్రిపుత్రుఁడను మాత్రమే. మఱి యింకొకభారము నాయం దుంచకుము."

ధర్మారావు తిరిగి యింటికి వచ్చెను. పిల్లవాఁడు పోరుమాని, తల్లి బుజము మీఁద నిద్దురపోయెను మఱునాఁడు కుమారస్వామి వచ్చెను. ధర్మారావు 'విశేషము లేమి?' యనెను.

కుమార— నే నీ నాఁడు ప్రొద్దున మంగమ్మగారియింటికిఁ బోయితిని. నేను వాకిట నిలుచుంటిని. లోపల మంగమ్మ రాధాపతు లిద్దఱును వాదించుకొనుచుండిరి. వారి సంభాషణ యిది: "రాధా — నీవు చెడిపోవుచున్నావు. కుమారస్వామితోఁ గలిసి నామీఁదికి దండు వచ్చుచున్నావు. ధర్మారావు చెప్పినది ప్రతిదియు నీకు వేదవాక్య ముగా నున్నది. వాఁ డొకచాదస్తుఁడు. కింద్రు బి. సి. నాఁడు పుట్ట

వలసినవారు. నేడు పుట్టినందుకు సంతోషించవలయును. మంగ — అంత నీ పాయనవద్ద నోరుమూసికొనియుండి నామీఁద చలాయించెద రేమి? 'రాధా— ఆయన పెద్దమహామేధావి!' ఆయనముందు నేను మాటాడలేను. అందుచేత భయపడితిని. మంగ—మీనోటివెంటనిజము చూడుఁడెట్లు వచ్చుచున్నదో! రాధా— నీవు వట్టి యజ్ఞానురాలవు. ●న్న నేను తెచ్చి సంవత్సరము నానావిషయములు బోధించి బాగుచేసి నందులకు నాకు మంచి గురుదక్షిణ యిచ్చుచున్నావు. మంగమ్మ— మీరుకాక మఱొకరైనచో నింత కన్న బాగుండెడి దేమో! అది యట్లుంచి, మి మ్మిప్పు డే మంటిని? కుమారస్వామి కుఱ్ఱవాఁడు. అతఁ డేదో నవ్వుచు ననిన మీ కంతకోప మెందుకు? రాధా— నీకుఁ గుమారస్వామిమీఁదఁ బ్రేమ పుట్టినది. మంగ—అవును, పుట్టినది. నేను రామేశ్వరమును వదలిపెట్టినతరువాత నాకుఁ బ్రేమపుట్టని దెవనిమీఁద? నే నిందు కే పుట్టినది. రాధా—నేను నవ్వుచు నన్నానులే, కోపపడకు. మంగ— ఇప్పుడు బాగుగానున్నది! హెచ్చిన తగ్గు మన్నారు. తగ్గిన హెచ్చు మన్నారు.

వీ రిట్లు మాటాడుకొనుచుండఁగా నే నంతయు విని లోనికిఁ బోయితిని. రాధాపతి మొగము వెలతెలవేసినాఁడు. నే నెఱుఁగనట్లు కొంచెముసేపు కూర్చుండి, మంగమ్మగారితో 'సెలవండీ' యని చెప్పి లేచివచ్చితిని. వచ్చుచు రాధాపతివంక నోరగాఁ జూచితిని. ఆయన నావంకనే చూచుచున్నాఁడు. ధర్మా— చక్రవర్తి వెళ్ళిపోవుట వలనఁ బంకజమ్మగారి కసలు నిద్రపట్టుటలే దన్న దే శ్యామల, అది యేమిటి? కుమార—అదా? అది యొకకథ. మాకు మొన్న తెలిసినది. చక్రవర్తి పంకజమ్మగారికిఁ గొన్నియుత్తరములు వ్రాసెను. అవి యామెపెట్టెలో నున్నవి. తాళపుఁజెవు లెప్పుడు నామెకొంగు ననే యుండును. మొన్న పొలమునకుఁ బోవుచు నవి మఱచిపోయి పోయినది. నేను పెట్టె తెఱచి చూచితిని. అది తప్పే ననుకొండు, ఇంగ్లీషులో నందురే—ఫలితమువలన చేసినకార్యమును సమర్థించుట యని—అలాగు. ఆయుత్తరములోఁ జక్రవర్తి రకరకములుగా వ్రాసినాఁడు. కొన్నిచోట్ల నాయనికిఁ గుఱించి పంకజమ్మగారిని నిందించెను. ఆమె 'నీవు వచ్చి శ్యామలహృదయము నాహరించు' మని

వ్రాసినదఁట. ఆయన 'అట్లే వత్తును. మీరుకూడ సహాయపడినఁ గాని యట్లు చేయుటకు వీలుండ' దని వ్రాసెను. ఆ యుత్తరములతో నిద్దఱు దొంగలును బట్టుపడినారు. నే నవియన్నియు శ్యామలకుఁ జూపించితిని. శ్యామల 'నా కే సంగతియుఁ దెలియదు. ఏదో పెద్ద మనిసి వచ్చినాఁడని సామానుకొనుటకుం దతనితో షికారుపోయి తినిగాని మఱియొకటి కాదు. అతఁ డనిన కొన్నిమాటలు నా కిప్పు డర్థమగుచున్నవి. ఇది యీ దీనివెనుక నున్న రహస్య' మని యన్నది. ఆ రాత్రి తల్లికూఁతుం డ్రిద్దఱును బోట్లాడుకొనిరి. చివర కామె కొంత సే పేడ్చినది; యీమె కొంతసే పేడ్చినది. కావలసినవారితోఁ బోట్లాటలకుఁ జివరియంక మదియేగదా! ప్రొద్దునసే మఱల మాటాడు కొనిరి. ధర్మా—మఱలఁ జక్రవర్తిని రమ్మని వ్రాసితి నన్నదే. కుమార— అది యతనికన్నీళ్ళు తుడుచుటకు. అతనికి రెండువిధ ముల నిచటఁ బరాభవమైనది - ఒకటి యిది; రెండవది మీరు చేసినది. ధర్మా—నే నేమి చేసితిని? కుమార— అది కాదండీ! అతఁ డదివఱకు వా రందఱిముందు సర్వజ్ఞునివలె మాట్లాడెడివాఁడు. ఆనాఁడు మీరు మాటాడుచున్నప్పుడు నోరుమెదల్చలేకపోయెను గదా! అదియొకఁ డతనికి బరాభవ మనిపించినది. ఈసారివచ్చినచో మిమ్ము గెల్చుటకేగాని, మమ్ము గెల్చుటకుఁగాదు. ధర్మా—గెలువ నిమ్ము. ఇందులో నే మున్నది? రే పతఁడు వచ్చినచో నేనే తగ్గి మాట్లాడెదను. నీ కతనిబాధ వదలినతరువాత న న్నతఁ డేమన్నను ఫరవాలేదు. ఇవియన్నియు మానసికములైన గెలుపులు, ఓటములు. వీనివలన నగు నది లేదు, పోవునది లేదు. కొంతధనము పోయినచోఁ, గుదిరిన దన్న సంబంధము చెడినచో-విచారించవలసిన దది. కుమా— మీ దంతయు చమత్కార మండీ! ఒకప్పుడు శత్రువులమీఁదఁబడి చీల్చెదరు. ఒకప్పుడు మీయంతట మీరే లొంగిపోయెదరు. ఆ యుత్తరరామచరిత్రలోని శ్లోక మేదీ మీరు చదువుచుందురే! ధర్మా—'వజ్రా దపి కఠోరాణి మృదూని కుసుమా దపి, లోకోత్తరాణాం చేతాంసి కోహి విజ్ఞాతు మర్హతి.' కుమార—నాకు మీరు కూడ నట్లనిపింతురు. ధర్మా— అదే యన్నాఁడు దుష్యంతుఁడు - 'సర్వః కాంత మాత్మీయం పశ్యతి' యని. తమవా రన్నచో నంద

ఱికి నిష్టమే. కుమార—నే నెన్నఁడు చూచుట లేదు. విష్వాషికముఁగానే చెప్పుచున్నాను. ధర్మా—నాకుఁ జనియున్నది. నీవు వెళ్ళుము. కుమారస్వామి- 'జేవు వత్తు' నని వెడలిపోయెను.

నాఁడు సారంగధరనాటక మనఁగాఁ గుమారస్వామి వచ్చి ధర్మారావున కొకటికెట్టు నిచ్చెను. "మంగమ్మగారు మీ కీ టికెట్టిమ్మన్నదండీ! ఇంక వారమున కొకనాటకముగా వేయుదు రఁట. ఈ నాటకమునకే కా దీ టిక్కెట్టు. అన్ని నాటకములకు సహయోగపడును" అనెను.

ధర్మా— ఈ టికెట్టు జాగ్రత్తగా దాఁచుకొనుట కిది యొక పనియా? కుమార— మీ రన్నినాటకములకును . రావచ్చు నని చెప్పుటయేకాని, మిమ్ము తరువాత టికెట్టడుగువా రెవ్వ రుందురు? ధర్మా—నే నసలు నాటకమునకు వత్తునో, రానో? కుమా— మీరు రాకతప్పదు. ధర్మా—ఏమంత బలవంతము? కుమార—వారి కోసము కాదండీ! నాకోసము. నాకు మీ రేమైనను జెప్పవచ్చును గదా! ధర్మా — ఏమియుఁ దెలియని పదిమంది దౌర్భాగ్యులకుఁ జెప్పుటకన్న నొకబుద్ధిమంతునకుఁ జెప్పుటయే మంచిది. కుమార— (నవ్వుచు) నేను బుద్ధిమంతుఁడనుగదండీ, అందుకనియే రమ్మను చున్నాను. నాఁటిరాత్రి ధర్మారావు బయలుదేఱెను. అరుంధతి— మంగమ్మ మీకు టికెట్టు పంపించెను గాబోలు. ఏదోకథ చెప్పెదరే, యట్లున్నది. మీరు చివర కీ నాటకములకుఁగూడ బయలుదేఱినచోఁ జెప్పవలసిన దే మున్నది? మొన్నరాత్రి పిల్లవాఁడు పోరుపెట్టి నాఁడు. నేఁడు మఱల మీరు బయలుదేఱుచున్నారు. మొన్నటి దొక చిన్న వ్యవహారముగనుక తేలిపోయినది. ఈసారి యేదో నాకే కావలయును. ధర్మా — ఇంగ్లీషువాఁడు చెప్పినట్లుగా నీవు వట్టి సూపర్‌స్టిషన్ అయిపోవుచున్నావే!

అరుంధతి ధర్మారావు మనసులోఁ బలుచబడుట చూచి భయపడెను. "నిరంతరము సముద్రమువలె లోఁతుగానున్న యీ యన ప్రకృతి నేఁ డేలొకో మివులఁ దేలికయైనది?" అని యామె యూహించి యా యర్థ మెఱుఁగలేకపోయెను. భర్తనుగూర్చి చెడు తలంపామెకు రాదు. మఱి దీని కర్థ మేమి? అరుంధతి యట్లే

మానము ద్రవహించి చూచుచుండఁగనే ధర్మారావు వెడలిపోయెను. అతఁడు వెళ్ళునప్పటికి నాటకపు జాపశీయంతయుఁ గిక్కిఱిసియుండెను. ద్వారములవద్ద రకరకముల క్రాపింగులవా రధికారము చేయుచుండిరి. కుమారస్వామి ధర్మారావు లెట్లో త్రోవఁజేసికొని లోనికిఁబోయిరి. కూర్చుంచుటకు స్థలమే లేదు. కుమారస్వామి యొకస్థలము చూచి యిరువురును గూర్చుండిరి. మబ్బువిసినాఁటి సముద్రమువలెఁ జావడి మ్రోఁతపెట్టుచుండెను. కుర్చీలమీఁద సంఖ్యలు వేసి యాప్రకారముగా సామాజికులు కూర్చుండవలయు ననిరి. ఒక కుర్చీపై నొకఁడు కూర్చుండెను. ఆ కుర్చీసంఖ్యగల టికెట్టువాఁడు వచ్చి వానిని లెమ్మనెను. వానికి గేదెకొమ్ముల క్రాపింగును, వెడల్పైన దవుడ యెముకలును, జింతనిప్పులవంటి కన్నులును గలవు. వాఁడు లేవ ననెను. టికెట్టుకొన్నవాఁడు కాలేజి విద్యార్థి. కూర్చున్నవాఁడు 'మఱల మాటాడితివా తన్నులు తిందు' వనెను. విద్యార్థి ద్వారము వద్ద నిలుచున్నవారితోఁ జెప్పెను. వారు కూర్చున్నవానిని జూచి యితనితో 'నింకొకచోటఁ గూర్చుండు' మనిరి. ఆ విద్యార్థి మఱల వానికడకే పోయి వానిని లెమ్మనఁగా వాఁడు కొట్టెను. అది పెద్ద యల్లరియైనది. పోలీసువారువచ్చి సర్ది వేసిరి. కాని చోటిప్పించలేదు. ధర్మారా వా విద్యార్థిని దనవద్దఁ గూర్చుండఁబెట్టుకొనెను.

విద్యార్థి—వాఁ డెవఁడండీ? కుమార—ఎవఁడేమిటి? గవర్న రుజనరలు. పోలీసువారుగూడ వానికి భయపడుట చూడలేదా? విద్యార్థి కేడుపువచ్చుచుండెను. ధర్మా—నీ వే క్లాసు? విద్యార్థి—బి ఏ. మొదటి సంవత్సరము. ధర్మా—మీహాస్టలులో నిం కెవ్వరును రాలేదా? విద్యార్థి—నేను హాస్టలులో నుండుట లేదు. ఊరిలో నున్నాను. అయినను నిప్పుడు కళాశాల లేదుకదా! నేను చదువు కొందమని యీయూరిలో నుంటిని. ధర్మా—నీ పే రేమి? విద్యా—తిరుమలరావు. కుమార—వాఁడు రంగఁ డని పెద్ద రౌడీ యండి. చలపతి వెళ్ళినతరువాత నితఁడే యూరికి పెద్ద. హార్మనీ మ్రోగించుట మొదలుపెట్టిరి. విద్యార్థి తనదెబ్బ మఱచిపోయి తెరవంకఁ జూచు చుండెను.

కుమార—ఈ తెర లెచ్చటనుండి వచ్చెను? బొంబాయి చిత్రకళతో దేశము సగము పాడయ్యెను. ప్రాచ్యచిత్రకళ తత్సంప్రదాయ వేత్తలకే కాని యితరులకుఁ దెలియుట లేదు. ఈ బొంబాయి చిత్రకళయైనను సరిగాఁ దెలియని నాల్గవరకపుఁ జిత్రకారులచేత ఏ తెరలు వ్రాయఁబడినవి. ధర్మా—చూచువారి కట్టి చిత్రములు దుష్టవర్ణ సాంకర్యము వలనఁ గ్రమముగా వారినేత్రములకు మంచి చెడ్డలు తెలిసికొనుశక్తి పోవును. కుమార- ఆబొమ్మ చూచితిరా? దాని ముక్కంత పొడు గేమి? తిరుమల—దొరసానుల కంతే. ధర్మా—దెబ్బ మఱచి పోయి నట్లున్నదే? తిరు—అంతేనండీ! పోలీసువాండ్రని పేరేకాని, వాండ్రు వీండ్రు నొకటియే.

వెనుకనుండి చివరితరఁగతిసామాజికులు చప్పట్లుకొట్టుటయు నీలలు వేయుటయు సాఁగించిరి. సావడియంతయు గందరగోళముగా నుండెను. తెఱ యెత్తిరి. రాజరాజనరేంద్రుఁడు వచ్చెను. ఆయన మహానటుఁడని యిదివఱకే ప్రఖ్యాతిపడియుండుటచేత జనులందఱు నాయనయెడల గౌరవము ప్రకటించుచుఁ జప్పటులు చఱచిరి. ఆయన యింగ్లండులోఁ జక్రివర్తియెదుట మహారాజువలె శరీరోర్ధ్వ భాగము వంచి యూరపియనుసలాము చేసెను.

ధర్మా — మొదటనే రసాభాసమా? తా నొకపాత్రగా రంగముమీఁదికి వచ్చె నాయెను. అప్పుడే తనపాత్ర మఱచిపోయి, తాను కుమారప్ప యైనాఁడు. తిరు— రాజరాజనరేంద్రుని వేషము చూడండీ! ఎంత చక్కఁగాఁ గట్టెనో! కుమార— రాజరాజనరేంద్రుఁడు నక్క యంచునఁజుట్టిన లేఁతగులాబిపంచె కట్టుకొనునా? ధర్మా— ఈ నాటకములోని రాజరాజనరేంద్రుఁడు చాళుక్యనృపతియే యేని- యాయన క్షత్రియుఁడు, కర్మిష్ఠి. రంగుబట్ట నే కట్టడు. కుమార— జరీపని చేసినన ల్లముఖముల్ కోటు తొడుగునా? ధర్మా— వీండ్రు వేషములు వేయు నప్పుడు-పూర్వరాజులబొమ్మలు పెద్దపెద్ద వస్తుప్రదర్శనశాలలలో నుండును- అవి చూచి వానిప్రకారమైనను - వేషములు వేసికొనరు. కుమార — ఈ యూరికోటలో నున్నవంటివికదా హరప్ప, కృష్ణమనాయుల చిత్రములు ? అవియును జూడవచ్చును. ధర్మా— 'ఎవనికిఁ బుట్టిన బిడ్డరా వెక్కివెక్క

యోడ్చిన' దని యీగోడంతయు వారి కేమి పట్టినది? సామాజికులు తెలియని తమకంటికి నేదైననుసరే, యింపుగా నున్నదనియే యను కొందురు. అందుచేత వీరియాటలు సాగుచున్నవి. కుమార — మహామహోదుష్యంతుని వేషమునకే గతిలేదు. వాని వేషము మైసూరు మహారాజాఖత్తు. ఇంక రాజనరేంద్రునకు వచ్చినది!

ముప్వురును నవ్విరి. వీరు ముప్వురును మాటాడుచున్నందుకుఁ బ్రక్కవారికిఁ గోపమువచ్చెను. రాజరాజనరేంద్రుఁడు పద్యము చదివి నప్పుడెల్ల నొక విశారముగాఁ జదువఁజొచ్చెను.

ధర్మా- వాచికము చూడు మెంత బాగుగా నున్నదో! కుమార — నెల్లూరు చదువు చదువుచున్నాఁడు. ధర్మా — అట్లన కుము. ఆవైపునమాత్రము మహానుభావులు లేరా? దొరస్వామిగారిని జూచితివా? ఆయన చనిపోయి యైదాఱేండ్లైనది బెజవాడలో నాయన తానీషా చూచితిని. ఓహో! ఏమి మహానుభావుఁడు? ఆయన తనవద్దకు వేషమువేయుదు నని యెవరైనవచ్చినా, మొదట జుట్టు తీయించెడివాఁడట! తాను ధరించు పాత్రానుగుణముగాఁ జుట్టును, మీసములను, గడ్డమును ధరించవలయును. ఇప్పుడు ప్రతి వాఁడును బుట్టంతజుట్టును పెంచును. ఏ వేషమునకైన నదియే జుట్టు. రాజనరేంద్రున కదే జుట్టు; సారంగధరున కదే జుట్టు. బ్రాహ్మణుఁడైన సుబుద్ధికి నదియే. కుమా—పూర్వనటులకుఁ బ్రస్తుత నటులకు నదే భేదము. పూర్వము నటుఁ డనఁగనే జుట్టు తీయించెడి వాఁడు. ఇప్పుడు నటుఁ డనఁగనే జుట్టు పెంచును. ప్రక్కనున్న యొకాయన—ఏమయ్యా! మీరు మమ్ము నాటకము చూడనీయరా యేమి? కుమార—చూడవయ్యా! చూడు! మామాటలు నీకన్నుల కేమి యడ్డము వచ్చెను? అదుగో సారంగధరుఁడు వచ్చుచున్నాఁడు, చూడుము.

రంగావతారి సారంగధరుఁడై ముఖమల్ లాగు, ముఖమల్ కోటు, లేతగులాబితలగుడ్డ, పైని కలికితురాయితో వచ్చెను. అంద ఱును జప్పటులు గొట్టిరి. అతఁడు వచ్చుచునే పద్య మారంభించెను. సంగీతము పాడిపాడి, పద్యము సగ ముండఁగనే యొకకీర్తన మొదలు

పెట్టెను. కీర్తనయైనంతనే మఱల మిగిలినపద్యము చదివెను. అది యంతయుఁ బావురము లెగురుటను మెచ్చుకొనుట.

ధర్మా—కుమారస్వామీ ! ఆ పాటలోని శబ్దములేమియో, వాని యర్థమేదియో, నీకుఁ దెలిసినదా ? కుమార— ఈ హార్మనీ, తబలావాండ్రు విననిచ్చిరా ? వీరి మ్రోఁతకన్న నెక్కువైనది.

సామాజికులందఱును బద్యమాఁపినంతనే చప్పట్లతో నాకాశము పగులఁగొట్టిరి. వన్సుమోరులు బయలుదేఱెను. సారంగధరుఁడు రంగముమీఁద పరవళ్ళు త్రొక్కుచుండెను. రంగ మొకవైపునుండి మఱియొకవైపునకుఁ బరువులెత్తెను. కుమార—సారంగధరుఁడు మంచి వినయవంతుఁడు సుమండీ ! అతనిమొగములోఁ జూడుఁడు- సిగ్గుతో మొగమంతయు మూసికొనిపోయి, ఫాల మెంత విశాలముగానున్నదో? ధర్మా—రాజుగదా ! మొగము మూసికొనిపోవుట యదృష్టలక్షణము. కొంతసేపటికి చిత్రాంగి వచ్చెను. వచ్చినంతనే సామాజికులైదు నిముసములవఱకు రొదయడఁగించలేదు. ఈలలు కొట్టువారు, చప్పట్లు చఱచువారు, అసభ్యములైన కేకలు వేయువారు—చావడి దద్దరిల్లి పోయెను. చిత్రాంగిమాట వినిపించువఱకు పదినిమిషములు పట్టెను. అదియు ముందున్న వారికి. మంగమ్మ చాలవివేకముతో నభినయించెను. చిత్రాంగి రాజభార్య. సారంగధరుని వలచినది. అంతమాత్రమున కులముచేత పచ్చిభోగముది కాదు. మంగమ్మ యభినయము తదనుగుణముగ నున్నది. కుమార—అందఱికన్న మంగమ్మగారియభినయమే బాగుగా నున్నది. ధర్మా—అవునోయి ! ఈ స్త్రీపాత్రధారులకు సత్యభామ, చిత్రాంగి బోగమువాండ్రవలెఁ గనిపింతురు. సత్యభామ జగన్నేతకుఁ బ్రియురా లేమిటి ? అందులో వివాహము చేసికొన్న భార్య; రాజకుమారిత, ఆమెనుగూడ దుష్టగాగానే ప్రదర్శింతురు.

సారంగధరుఁడు చిత్రాంగిమాట వినలేదు. వారిద్దరు నేమేమి యనుకొనుచుండిరో యొకటే మ్రోఁగుచున్న సామాజికులకు వినిపించలేదు. నటకులందఱును వారివారిభాగములు వారే యాశువుగాఁ జదివిరి. ధర్మవరము కృష్ణమాచార్యులుగారినాటక మని ప్రకటించిరి. కుమారప్పగారు మహాశువుగా వచనములు కొట్టిపోసిరి.ఆయన

యొక్కొక్క యభినయమునకు సామాజికులు దిగ్భ్రాంతులైరి. ధర్మా- ఆ భ్రూవిక్షేపము, గదవయవచాలనము చూచితివా ? మంచి నటకుఁడే. అది సహజమైనగుణము. తక్కినవి చదువుకొని తెచ్చుకొన వలయును. కుమార- ఆయన ఎమ్. ఏ. పరీక్షయైనాఁడండీ. ధర్మా- అందుకనియే మఱియు నధ్వాన్నము. వీరందఱును పాత్రలయొక్క శీలమునకుఁ గ్రొత్తవ్యాఖ్యానముచేయునట్లు నటింతు మందురు. వీరికి రసస్వరూపము తెలియదు. ఈ వ్యాఖ్యానము లెవరికిఁ గావలయు ? అదిగో చూడుము ! సారంగధరుని దాను చంపు మని చెప్పి, యన వసరముగా నేదితోఁ స్వగతము దంచి స్తంభ మభినయించినాఁడు. అతఁడు స్తంభగతుఁడై యుండఁగాఁ జిత్రాంగి యా మాట యన్నది. దానికిఁ దాను సమాధానము చెప్పుచున్నాఁడు. స్తంభగతుఁడైన తన కా వాక్య మెట్లు వినిపించినది ?

ప్రక్కనున్న యాయన 'అయ్యా ! మీగోలతోనే సరిపోవు చున్నది. మేము డబ్బిచ్చినది నాటకము చూచుటకా, మీమాటలు వినుటకా ?' అనెను. కుమార- నాటకము చూచినచో మునుపటి వలెనే యుందువు. మామాటలు వినినచోఁ గొంత బాగుపడ వచ్చును.

ప్రక్కాయన 'తెలివికలవాడవులే. ఇంక నోరుమూయు'మనెను. ధర్మారా 'వెందుకయ్యా తొందరపడెద' వనెను. ప్రక్కాయన 'యిం దాఁకటినుంచి చూచుచుంటిని. మీ రిద్దఱు వాగినవారు వాగినట్లే యున్నారు. పైఁగా పెద్దమనిసివలె సర్ది చెప్పవచ్చెదవు! ఆ కుఱ్ఱవా డిందాక తన్నులు తినెను. నీకుఁ గూడఁ గావలయునా ?' యనెను. కుమారస్వామి ధర్మారావులు వాగ్వృత్తిగాని హస్తవృత్తి యెఱుఁ గరు. తిరుగఁబడినచో ధర్మారావు రెండు కొట్టఁగలడు, రెండు తిన గలఁడు. కాని యట్టిచోట్ల దెబ్బలాడుట యతనికి మర్యాద కాదు. అప్పటికే నలుగురును అతనివంకఁ జూచుచుండిరి. అందుకని ధర్మా రావు మాటాడక యూరకుండెను. కాని యతనికన్నులలో నిప్పులు కురియుచుండెను. ప్రక్కాయన ధర్మారావును గొరచూపులు చూచు చుండెను. ధర్మారావు బయటికిఁబోయి చివరతరఁగతిలో వెదకెను. అచ్చట వెంకటేశ మని యొకఁడు కనిపించెను. వాఁడు గొల్ల. కబీరు

వకు వానికి మిక్కిలి స్నేహము. ధర్మారావు వెంకటేశమును దీసికొని వచ్చి యీ ప్రక్కాయనను జూపించెను. 'ఇతఁడు నన్నుఁ గొట్టునఁట. ఇంటికిఁ బోవువఱకు జాగ్రత్తగాఁ జూచుచుండు' మనెను. తిరుమలరావును గొట్టిన రౌడీ 'ఏమిటిరా, వేంకటేశము!' అని కేకవేసెను. వేంకటేశము 'ఇచ్చట నొకముండ యున్నదిలే. అది కొట్టునఁట!' యనెను. ప్రిక్కాయన వేంకటేశము వంక, దూరమున నున్న రౌడీ వంక మిట్టిమిట్టి చూచెను. వేంకటేశము 'రా! బయటికి రా' యని గద్దించెను. ప్రిక్కాయనకు ముదురపాకమునఁ బడ్డదని తెలిసినది. అంతటితో నతఁ డూరకుండెను. గేదెక్రాపింగురౌడీకి ధర్మారావు వేంకటేశమును తెచ్చెనని తెలిసెను ధర్మారా వాదరించిన కుర్రవానిని దాను కొట్టెను. రౌడీ తాను కూర్చున్నచోటునుండి లేచి, తిరుమలరావును 'నీ స్థలములో నీవు కూర్చుండవయ్యా' యని పిలిచెను. తిరుమలరావు 'దెబ్బ చాలునులే' యనెను. వాఁడు మఱి మాటాడక చావడిలోనుండి వెడలిపోయెను.

నాటకములో హాస్యగాఁ డొకఁ డుండెను. వాఁ డదివఱకే గ్రామఫోనుప్లేట్లు కొన్ని యిచ్చెను. ఆ హాస్యగాఁడు రాజసేవకుని వేషమువేసికొని వచ్చెను. సామాజికులు వానిని వాఁ డిచ్చిన గ్రామఫోనుమాటలు పాడు మని కేకలువేసిరి. రాజరాజనరేంద్రుఁడు మూర్ఛలో నుండెను. చిత్రాంగి యుద్విగ్నస్థితిలో నుండెను. వాఁడు పాటలుపాటక తప్పక వచ్చెను. వాఁడు పాడినంతసేపు రాజనరేంద్రుఁడు మూర్ఛలో నెట్లుండును? ఈమె యుద్విగ్నముఖలక్షణములే యెట్లు నిలుపుకొనును? సామాజికుల కేకలు మఱియు నెక్కువయ్యెను. కుమారప్ప గొప్పనటుఁడు. ఆయన రసభంగమైనయెడ లన్ని సర్దుకొనవచ్చునట! వారు వెంటనే మూర్ఛదేఱి, 'సేవకుఁడా! మా మనస్సు చాలవిషాదపూరితమై యున్నది. నీవు కొంత సంగీతముచేసి మాకు సంతోషము కలిగించుము' అనెను. వాఁడు పాటలు పాడెను. ధర్మారావు దిగ్భాంతుఁడై పోయెను. కుమారస్వామి కుమారప్పను దిట్టుచుండెను. ప్రిక్కాయన కన్నులు ముందుండెనుగాని వెనుకకుఁ జూచుచుండెను. అందుచే గుమారస్వామిమాటలు వినిపించలేదు.

ధర్మారావు రెండుగంటల కింటికిఁ బోయెను. సావిత్రమ్మగారు తలుపుతీసెను. అతఁడు పోయి పాదప్రక్షాళనముచేసికొని చిన్నమంచముపైఁ బరుండెను. పిల్లవానిని బెట్టుకొని యరుంధతి పెద్దమంచము మీఁదఁ బరున్నది. ఆమెకు మెలఁకువ వచ్చి 'ఇంటికిసరిగావచ్చితిరా?' యనెను. ధర్మారావు 'అంతసరిగా రాలేదు' అనెను. అరుం- దారిలో పా మడ్డమువచ్చెనా? ధర్మా- నా కెప్పుడును పా మడ్డము రాదు. నన్ను రక్షించునదే పాము. అరు- ఆయనకుఁ బని కల్పించునదే మీరు.

ధర్మారావు నిదురపోయెను. తెల్లవారవచ్చుచుండెను. అతని కొక కల వచ్చెను. ధర్మారా వొకచోటఁ గూర్చుండెను. ఆ స్థలము సముద్రపుటొడ్డు. సముద్రము హోరు మని మ్రోయుచుండెను. మబ్బు పట్టి చినుకులు పడుచుండెను. గాలి హోరు మని ఫెళఫెళార్భటులతో వీచుచుండెను. ధర్మారా వచటనుండి లేచిపోద మనుకొనెను. కాని లేవలేఁడు. జలము పొంగి యంతంతకుఁ దనమీఁదికి వచ్చుచున్నది. మఱికొంతసేపు కూర్చున్నచో సముద్రము తన్ను ముంచి వేయునేమో! అతని కేమియుఁ దోఁచలేదు. ధర్మారావు మనస్సులో 'రామ రామ' యనుకొనెను. అంతలో అతనికి దాను చూచుచున్న సముద్రముమీఁదినుండి వేయిపడగలతోడ యొకమహాసర్ప మవతరించెను. తన్మహాసర్పసహస్రఫణామండలి ధర్మారావుచుట్టు నభేద్యమైన మణిప్రాకారమును నిర్మించెను. సముద్రము ఫణామండలమును దనతీవ్రతరంగాఘాతములచేఁ దాడించెను. ఆ తాడనములకు సహస్రఫణములు లోనున్నచిన్నిచిన్ని బొమికలన్నియు విఱిగి నిశ్శక్తికము లయ్యెనేమో! మణిప్రాకార మభేద్యముగా నుండెను. అరుంధతి వచ్చి భర్తను లేపి, పోయి పిల్లవానివద్దఁ బండుకొనుఁడనెను. అతనికి మెలఁకువ వచ్చిచూడఁగా దన చుట్టునున్న మణిప్రాకారము భార్యామందస్మితచ్ఛటాపాళిగా గోచరించెను. అదియే యిదియై పరిణమించెను గాఁబోలు!

మఱునాఁడు కుమారస్వామి మంగమ్మయింటికిఁ బోయెను. ప్రొద్దుక్రుంక వచ్చినది. ఇంట నొక్క మంగమ్మయే యుండెను.

కుమా- నటకు లందఱు నేరండీ? మంగ- కోట చూచుటకుఁ బోయిరి. కుమా-మీరు వెళ్ళలే దేమి? మంగ- ఎవ్వరైన నీబోటిబెద్దలు వచ్చెదరు, ఆతిథ్య మీయవలెనని? కుమా- ఆర్షమా, అనార్షమా ? మంగ- నీవు పండితుఁడవు. నా కేమి తెలియును ? కుమా- అదిగా దండీ! ఆర్షమైనచో నావుపెయ్యయేదైన నున్నచోఁ జంపి వండిపెట్టవలయును. మంగ- ఆవుపెయ్య లేదు. చిన్నగేదెపడ్డ యున్నది. అదియైనను వండిపెట్టుటకు రాదు. పెండ్లిచేసికొనుటకైనచో నిచ్చెదను. కుమా- నాకుఁ బెండ్లియే కాలే దాయెను. అయినతరువాత దున్నలు పుట్టినచో మీసంబంధము చేసికొందును. మంగమ్మ - అవు నప్పటికి మనసిద్ధాంతము సరిపోవును. మా గేదెపడ్డ పెద్దది, మీ దున్న చిన్నది! కుమా- ఇప్పుడు రాధాపతిగా రుండవలయును. మంగ- తల కొట్టి మొలవేయునా? కుమా- అయినవాఁ డేదైనను జేయవచ్చును. మంగమ్మ- అల్లరి పిల్లఁడా! నీ విక్కడనుండి వెళ్ళిపో! కుమా- ఈ యాతిథ్య మార్షము కాదు, అనార్షము కాదు. మంగమ్మ-అవునుగాని, ధర్మారావుగారిని గలిసికొంటివా? కుమా- ఇంతవఱకు నిద్దురపోవుటయే సరిపోయినది. ఎందుకు? మంగమ్మ- నాటక మెట్లున్నదో? కుమా- నేను చెప్పుదునా? మంగ- నీవు చెప్పునది నా కక్కఱలేదు. కుమా- ధర్మారావుగారి కెట్లున్నదో చెప్పెదను. మంగ- అది నీ కెట్లు తెలియును? కుమార- రాత్రి మే మిద్దఱము నొకచోటనే కూర్చున్నాము. నాటకమాడినంతసేపు ధర్మారావుగారు నాటకము తన కెట్లున్నదో చెప్పుచునే యున్నారు. మంగ- ఎట్లున్నది?

కుమారస్వామి తనకిష్టములేనివిషయమును జేయి నేలకుఁ జూపించి యిట్లున్న దని చెప్పును. అనఁగా మంటివలె నున్న దని యతనియర్థము. చేయి యిట్లు చూపించుట యందఱికిఁ గోపము. కుమారస్వామి యట్లు చేసినపుడెల్ల మంగమ్మ, పంకజమ్మ, రాధాపతులు మండిపోదురు. మంగమ్మ నాటక మెట్లున్న దనఁగాఁ గుమారస్వామి యిట్లున్న దని చేయి నేలవంకఁ జూపించెను. ఆమె కూర్చున్నది లేచి, కఱ్ఱయొకఁడు పుచ్చుకొని, 'నీ విఁక మాయింటికి రాకు. పో' అని కొట్టఁబోయెను. కుమా "కొట్టవమ్మా! కొట్టు! నేను ధర్మారావుగారియభిప్రాయ మిట్లున్న దని చెప్పినాను. కొట్టు! ఈ దెబ్బ

తీసికొనిపోయి శర్మారావుగారికే యిచ్చెదను." ఆమె కట్టుసాఱవేసి పోయి, మఱలఁ గుర్చీలోఁగూర్చుండి 'నిజముగా హా రక్లే యున్నారా?' యనెను. కుమా- వారు నేలమీఁద నుమియ లేదు. మంగ- ఏమియు బాగుండలేదా? కుమా- మీవేషమే కొంత బాగున్న దన్నారు. మంగమ్మ-పోవోయి! ముఖస్తుతి సేయుచుంటివి! నే నెన్నఁ డును రంగముమీఁదికే యెక్కలేదు. కుమా- నాలుగైదుసార్లు రంగముమీఁద కెక్కుటవలన భయము వదలుటయేకదా, లాభము? అది మీ కిదివఱకే వదలినది. మంగ- నీవు నన్నేమాటపలికిన నా మాటయే యనుచున్నావు. కుమా- అందఱి ననుటకు వీలగునా? మీ రన్నచో నాకుఁ జనవున్నదిగనుక ననుచున్నాను. మంగ- ఇప్పు డీ కబుర్లకేనా, ఏదైన బనియుండివచ్చినావా? కుమా- రాత్రి నాటకమున కేమాత్రము డబ్బు వచ్చినది? మంగ- పన్నెండువందలు వచ్చినవి. కుమా- జనము డబ్బులేదు, లేదని యేడ్చెదరు. ఎచ్చట నాటకము వేసినను వేయికిఁ దక్కువలేదు! ఖర్చులు పోఁగానే పన్నెండు వందలా? మంగ- కాదు; ఖర్చులు నాలుగు వందలైనవి. కుమా- నాల్గువందలు పదిరూపాయలైనవి. మంగ- అది యేమిటి? కుమా- ఇప్పుడు పదిరూపాయలు నా కిచ్చుచున్నారుకదా! మంగ- నే నిచ్చుట లేదు. కుమా- ఇచ్చుటలేదూ? నేను గుంటూరు పోయి రావలయును. మంగ- నాదగ్గఱలేదు, అత్తగారి నడిగి తీసికొనరాదా? కుమా- అత్తగారైనచో నడుగనే యక్కఱలేదు. ఆమెకు నామీఁద నిప్పుడు కంఠమువఱ కున్నది. అప్పుగానే యిండు, మఱలఁ దీర్చెదను. మంగ- ఇదివఱకిచ్చిన పాతికరూపాయలు? కుమా- అన్నియుఁ గలిపి యొకసారియే యిచ్చెదను. అంత యవసరమైనచో నోటు వ్రాయించుకొనుఁడు. మంగమ్మ- నాలుక గీసికొనుటకా? కుమా- ఈ డబ్బంతయు మీదైనట్లు మాటాడెద రేమి? మంగమ్మ- మఱి యెవరిది? కుమా- ఆ చెరసాలలోని కేఁగినాయనది. మంగ- వానిది, నీది. కుమా- ఎవరిదో నా కెందుకు? పదిరూకలిట్లు పారవేయుండి, పోదును. మంగ- రాధాపతిగారిని రానిమ్ము. డబ్బాయనవద్ద నున్నది. కుమా- ఆయన వచ్చినచో నాకు వచ్చినట్లే! అబ్బో! మీరా, డబ్బు నమ్మి యాయనవద్ద నుంచెడిది? ఏడిపించక

తొందరగా నిప్పించవమ్మా. మంగ — తేపుపొద్దునగదా
వెళ్ళునది? కుమా — ఎందుకుఁ జంపెదవు? ఇచ్చినచో నిమ్మ,
లేకపోయినచో నేను పోవుచున్నాను. మంగ— రావయ్యా, అంత
కోప మెందుకు? కుమా— చెంగల్రావుకూడ షికారు వెళ్ళెనా ?
మంగ— రాధాపతిగారు వానిని గోటులో దాసీవాండ్రలోఁ
గలిపి వచ్చెద నన్నాఁడు. వాఁడు భయపడి రానో యని గోల
కెత్తెను. రంగావధాని వట్టిదే యని లాలనఁజేసి తీసికొనిపోయెను.
కుమా— రంగావధానిగా రవ రేమి? ఓహో! అందుకనియా? మంగ—
ఎందుకని? కుమా — ఆయన సారంగధరుఁడు, మీరు చిత్రాంగి,
అందుకని. మంగ— నేను పదిరూపాయ లీయను పో! కుమా— నే
నన్నమాటలోఁ దప్పేమున్నది? సారంగధరునకుఁ జిత్రాంగికి నేమి
సంబంధ మున్నది? మంగ— డబ్బిచ్చెదను. తీసికొనిపో, గోల— అని
తెచ్చియిచ్చెను. కుమా — అయ్యో! ఇంకొకపదిరూపాయ లన్న
నడుగకపోతిని! మంగ— ఆ డబ్బిటు తే. నీకుఁ దిమ్మెక్కగా నున్నది!
ఇక్కడ డబ్బుప్రోగువేసుకొని కూర్చున్నానా యేమి ? కుమా—
మఱలఁబుచ్చుకొనుడబ్బుకోస మింత యల్లరిచేసెద రేమి ? మంగ—
తిమ్మన్నగారు తీరుగాఁగూర్చుండఁబెట్టి బారుగావడ్డింతురన్నట్లు నీ
డబ్బు మఱల నీయఁ బోవుచున్నావు? కుమా— నేను మఱల నీయ
వలయునేమో యనుకొన్నాను లెండి! అక్కఱలేనిచో సరే! మంగ—
ఎంతమంది తినుచున్నారు, నాడబ్బు! కుమా— అట్లయినచో నీ
వెధవడబ్బు నా కక్కఱలేదు, తీసుకొనుడు. మంగ— ఇటు తే.
కుమారస్వామి నవ్వుచు వెడలిపోయెను. కుమారస్వామి యట్లు
పోయెను, నటకులందరు నిట్లు వచ్చిరి. రాధాపతి మంగమ్మను జూచి
'కుమారస్వామి బుజము లెగురవైచుచుఁ బోవుచున్నాఁడే' అనెను.
మంగ— ఇక్కడకు వచ్చుచున్నాఁడా? రాధా— ఇక్కడనుండియే
కదా పోవుచున్నాఁడు? మంగ— అతఁ డిక్కడకు రానే లేదే !
రాధా— అబద్ధా లెందుకు? మం— వచ్చె ననఁగా మీరు చంపుదురా?
రాధా— ఆకాడికి బెదురు యెందుకు? మంగ— ఎవరు బెదరిరి? రంగా
వధాని— ఎవరు బెదరిరి? మంగమ్మ బెదిరినది. అవిగో కన్నులు, కనఁ
బడుట లేదా? కుమారప్ప— ఏరా, అవధాని ! లేడికన్నులవలె

నున్ననా యేమి? మంగ- అవును, ఒక యేఁడాదినుండి యట్లే యున్నవి. రంగా- అదివఱకు? మంగ- కుమారస్వామి యున్నచోఁ జెప్పెడివాఁడు? రంగా- ఆమాట నీవే చెప్పరాదా? మంగ- చెంగల్రావు వచ్చినాఁడా? కుమారప్ప- మేము వెళ్ళినాము. మాకు మఱలఁ గనుపించలేదు. అందఱును మాకు దాసీవాండ్రే కనిపించిరి. వారిలో నితఁడు కలిసిపోయెనుగాఁబోలు! మేము గుర్తుపట్టలేక పోయినాము.

ఇంతలోఁ జెంగల్రా వచ్చుటకి వచ్చెను. అతఁడు వచ్చి కూర్చుండి 'అప్పా! కాళ్ళు పిసుకనా' యని యామెపాదసంవాహనముచేయుచుండెను.

రంగా- ఒక్కొక్కరు దళముచేసికొనివుట్టెదరోయి! దమ్మిడీ ఖర్చులేకుండ మంగమ్మకుఁ జూఁడు, సరిచారకుఁడు దొరకెను! మంగ- బోలెడంతడబ్బు ఖర్చై మీరందఱురు దొఁకిరి. దాని కేమి చెప్పెదవు? కుమారప్ప- ఏడువందలే నసుము. కుమారప్ప నూట పదార్లు పుచ్చుకొనకుండ వేషము వేయఁడుకదా! రంగా- రంగావధానిమాత్రము తక్కువతిన్నాఁడా? మంగ- రెండవ తరగతి రైలు ఖర్చును, కాఫీహోటళ్ళు, సిగరెట్లు, రాతిరి తెచ్చినసీసాలు నివి యన్నియు మీరు పెట్టుకొనినచో నా కేమియు నభ్యంతరము లేదు. రాతిరి యెనిమిదివందలు మిగులలేదు. రంగా- ఎంత మిగిలినదమ్మా? పదిరూపాయిలు మిగిలినవా? మంగ-సరిగా నంతే మిగిలినవి. అవియే కుమారస్వామి కిచ్చినది. రాధా- అతఁ డిచ్చుటకి రానేలే దంటివి కదా! మంగమ్మ- మీరు నా కేమి తాళికట్టితిరా? అంత బాదర బందీ యేల? రంగా- ఏమండీ, రాధాపతిగారూ! మీరు 'ఎనటోలు ఫ్రాన్సు' వ్రాసిన 'రెడ్ లిల్లీ' చదివినారు కాదు! అందులో నా చిత్రకారుఁ డున్నాఁడే, మీ యీర్ష్య యట్లున్నది. రాధా- అతని థెయాస్ (Thais) అను నవల యున్నది. మంగమ్మ చివర కట్లగునట్లున్నది. మంగ- అది యెట్లయినది? రాధా- ఆ థెయాస్ అన్నది స్త్రీ. భోగముది. ఒకసన్యాసి యామెను పట్టణములోనుండి తీసికొని పోయి యొకయాశ్రమములోఁ బ్రవేశపెట్టెను. అచ్చట నామె మహా భక్తురాలైనది. ఈ సన్యాసి చెడిపోయెను. రంగా- ఇందులో మీరు

సన్న్యాసిగాఁ గనబడుటలేదే! కుమా- రాధాపతిగారిలోఁ బూర్వ భాగమేమో కాని, పరభాగ మట్లే కావచ్చును. మంగ- ఆమె పే రేమి? రంగా- థెయాస్, లేకపోయిన థై. వ్రెంచివా రెట్లు చర్చింతురో తెలియదు.

మఱునాఁడు చక్రవర్తి వచ్చెను. కుమారస్వామి గ్రామములో లేఁడు. సాయంవేళ పంకజమ్మగారియింటివద్ద రెండిండ్లవారు సభ చేసిరి. పంకజమ్మ- ధర్మారావుగారు లేరే! చక్ర- దూత లేఁడు కదా! శ్యామల- ఆ దిగు లెందుకు? నేనే పోయి పిలుచుకువత్తును. మంగమ్మ లేచి వాకిటిలోనున్న తనబండివానిని బిలిచి, శ్యామలను బొమ్మని నిర్బంధపెట్టి పంపించెను. చక్రవర్తి వెలతెల పోయెను. పంకజమ్మ తలవాల్చెను. రాధాపతి గోళ్ళుకొఱుకుకొనుచుండెను. రంగావధాని- ధర్మారా వనఁగాఁ బత్రికలో వ్రాయుచుండునాయన యేనా? చాల రసవంతముగా వ్రాయును. మాయూరిలోఁ బండితు లందఱును నాయనను మెచ్చుకొందురు. మంగ - వారే. వారి దీయూరు. వారు బి.ఏ. పరీక్ష యిచ్చినారు. వారు చాలమేధావులు.

తరువాత నొకపదినిమిషము లందఱును నిశ్శబ్దముగా నుండిరి. ధర్మారావును, శ్యామలయు వచ్చిరి. కుమారప్పరంగావధానులకు ధర్మారావునకు శ్యామల పరిచయముచేసెను. రంగా- 'నేను తమ కావ్యములు చాల చదివితిని. మీయశస్సె యెఱుఁగుదునుగాని మి మ్మెఱుఁగను. తమరు మొన్నరాత్రి నాటకమునకు దయచేసితిరా?' ఈ ప్రశ్నతోఁ గుమారప్పమొగమున నొకకళ గోచరించెను. ధర్మా- వచ్చితిని. పంక- ఎట్లున్నది? ధర్మా- నాటకములసంగతి నా కేమి తెలియును? పెద్దపెద్దనటులమీఁద నా విమర్శ యేమి? రాధా- అట్లు కాదు. మీరు దేనినిగురించియైనను జెప్పఁగలరు. మారంగావధాని సారంగధరునికన్న నారదునివేషము బాగుగా నుండును. ధర్మా- నాలుగైన యభినయములలో నాహార్యకము వాచికము మొదట చక్కఁగానుండినచోఁ జూడ ముచ్చటగా నుండును. నా తెలిసినంతవఱకు నాంగికము సర్వనటులుఁడే కపటించలేరు సాత్త్వికము కొంత ప్రకటింతురు. అది వారికి సహజమైన లక్షణము. ఆహార్యకవాచికములు లేనే లేవు. ఈ నటకులందఱికిని దెలియనే తెలియదు. రాధా-

ఒక్క పెద్దమాట యనివేసినారే! ధర్మా- నా కా సంగతి యెక్కువ తెలియ దని మొదటనే చెప్పితినిగదా! రంగా- మాకే తెలియన ట్లున్నది. ధర్మా- నారదునివేషము కట్టుదురా? అది యేమి? శాకుంతలములోఁ గణ్వుఁడు, కణ్వశిష్యు లేమి- మఱియొక ఋషివేష మేమి- మఠములోనిబైరాగులవలె వేషములు వేయుదురు. నారదుఁడు దివ్యర్షి. నఖశిఖాపర్యంతము తెల్లనివాఁడు. శిశుపాలవధలోఁ బ్రథమ సర్గలో నారదు డవతరించును. మాఘుఁ డిరువదిశ్లోకములదాఁక నార దుని వర్ణించినాఁడు మననటకులు చివరకు నారదునకుఁ దెల్లని గడ్డ మైనఁ గట్టరు. ఆ నారదుఁడు సామగానవేత్త. భజనకీర్తనలు పాడు టేమిటి? భజనకీర్తనలైనను గాదు. పార్సీమెట్లు పాడుట యేమిటి? రాధా- మీరు చెప్పినది బాగుగనేయున్నది కాని, శిల్పము రెండు విధములు: ఒకటి యాదర్శకము; రెండవది సర్వజనాకర్షకము. ఇప్పుడు రంగములమీఁద గోచరించునది జనాకర్షకమైన శిల్పము. ధర్మా- అవును. రాయబారమునకుఁ బోవు కృష్ణుఁ డెబ్బదియేండ్ల వాఁడు- రెండు మహారాజవంశములమధ్యగలవ్యవహారము పొసగించు టకుఁ బోవుచున్నవాఁడు- రాజనీతివేత్త- కౌరవసభకుఁ బోవుచు- బృందావనమునాఁటి కృష్ణునివలెఁ బోవును. నెమలిపింఛము పెట్టుకొని నగాని, నీలిరంగుబనియను తొడుగుకొనినఁగాని కృష్ణుఁడు కాఁడా యెను. ఇది జనాకర్షశిల్పమే! రాధా- అవును. కృష్ణుఁ డనఁగా సామాన్యుల కే భావ మున్నదో శిల్పియైననటుఁ డా భావమునే చిత్రించుచున్నాఁడు. ధర్మా- మీరందఱును పురాణభాషావిశార దులుగదా! కుమారప్పగారు షేక్సుపియరునాటకములుగూడ నాడుదు రని విన్నాను. వారొక షైలాకు వేషమో, హామ్లెటువేషమో వేయుదు రనుకొనుఁడు. ఆ పాత్రయొక్క వయస్సు, వానిజాతి దుస్తులు మొదలైనవి చక్కఁగాఁ జదివియున్నారా, లేదా? షైలాకు వేషము యూదునివలె వేయుట లేదా? షైలా కనఁగా వడ్డీవర్తకుఁడు. ఒకకోమటివలె వేషము వేసికొని రమ్మనుఁడు! భారతీయులకుఁ జక్కఁగాఁ దెలియును. రాధా- అవును. ఇంగ్లాండులో నిప్పుడట్లే యాడు చున్నారఁట. షేక్స్పియరునాటకము లాధునికసంప్రదాయముల కను గుణముగా వేషములువేసి యాడుచున్నారఁట. హామ్లెటు డెన్మార్కు

యువరాజువలెఁగాక నేఁటి యొకహూణయువకునివలె వేషమువేసికొని వచ్చుచున్నాఁడఁట. అదియు శిల్పమే. ధర్మా- అట్లయినచోఁ గృష్ణుఁడు బృందావన కృష్ణునివలె వచ్చు టెందులకు? నేఁటి యొక పెద్ద రాజకీయవేత్తయైన రాయబారివలె వేషమువేసికొ మ్మనుఁడు. సప్రూజయకరులవలె వేషమువేసికొను మనుఁడు! రాధా- మీదంతయు విపరీత వాదన. మంగమ్మ-మనకు నచ్చ లేదుగనుక. రంగా-ధర్మారావుగారు చెప్పినది త్రోసివేయుటకు వీలులేదు. ఏమోకాని నారదునివేషము మాత్రము వారు చెప్పినట్లే నే నింక వేసెదను. సామాజికు లనుకొను నట్లు మనము వేషము ధరించు టేమిటి? అది యెట్లు ధరించవలయునో యట్లు ధరించవలయుఁగాని? ధర్మా- నాటక మనునది యొక విద్యాబోధనా సంస్థ. అసభ్యస్తవిద్యులగు సామాన్యులకుఁ బూర్వకాలము నందలిరాజులు, ఋషులు మొదలైనవా రెట్లుండిరో వారికిఁ దెలియఁ జేయవలయును. నలునివేషము తాగినయెర్రనికనులతో, నీచుకు పోయినబొమ్మతోఁ గృత్రిమముగా నొకఁడు వేషమువేయును. అతనిని 'నిర్మలనిజకథానిమిషకల్లోలినీక్షాళితాఖిలజగత్కల్మషుం' డన్నాఁడు. తనకథ యన్న గంగచేత లోకము పాపములను గడిగినవాఁడఁట. నీవేషముచేత నలుఁడంతటివాఁడుగా సామాజికులకు నీవు స్ఫురింపఁజేయవలదా? అపుడు విద్య బోధించిన ట్లగును. నాటకము శిల్పమైనచో దానికిఁ బ్రయోజన మది. అప్పుడే నిజమైనయానందము కలుగును గనుక. రంగా- మీరు చెప్పినట్లు చూచినచో నిప్పటినాటకములు నాటకములే కాదు; నటులు నటులే కాదు. ధర్మా- ఇప్పుడు నే నేమి చెప్పితిని! ఆంగిక సాత్వికము లగాధము లైన విషయములు. ఆలోఁతు మనవారి కస లందుట లేదు. అచ్చటచ్చటమహానుభావులు లేకపోలేదు. వారైనను జక్కఁగాఁ జదువుకొనినఁగాని వారిరచన నిర్దుష్టముగా నుండదు. నే నేదో పనిమీఁద నుండఁగా, శ్యామల 'మీతో మాయమ్మ చాల నవసరముగా మాటాడవలె ననుచున్న' దని తెచ్చెను. నేను నిజమే ననుకొంటిని. క్షమించవలయును సెలవు.

రంగావధాని లేచి నమస్కారము చేసెను. శ్యామల బయటి దాఁక పంపించెను. బండివానితో దిగఁబెట్టిరమ్మని చెప్పెను. శ్యామల కుమారప్పతో ‘‘వారు చెప్పిన దెట్లున్న దండీ’’ అని ప్రశ్న వేసెను. ఆయన రెండునిముసము లూరకుండి ‘‘విమర్శనయంతయు నాటుసరుకు’’ అనెను. చక్రివర్తి నవ్వెను. ఒక్క వేసంగి వెచ్చని యావిరిగాలిమంట లూదిపోసెను.

# ఇరువదియవ అధ్యాయము

ఒక్క సంవత్సరము గడచెను. ఊరిలోనున్న యిండ్లెచ్చటి వచ్చటనే యుండెను. అనంతాకాశమున నున్న సర్వగోళములకును నిరంతరపరిభ్రాంతి పెట్టి యాయాగోళములయందున్న ద్రవ్యముల కేల పెట్టలేదో! వీనికిఁ బుట్టుట, చచ్చుట మాత్రమే కల్పించెను. పెద్ద పెద్ద భవంతులన్నియు స్థిరములైనట్లు కొండతాతిత్తోఁ గట్టిరి. పురపాలకసంఘసౌధనిర్మాణమునకు రెండులక్షలా! దానికి జలనములేదు కాఁబోలు! సూర్యచంద్రులవలె నది స్థిరమైనది కాఁబోలు! దానికానుకొని మార్కెట్టు కట్టించిరి. వేణుగోపాలస్వామి వెనుకకుఁదిరిగి చూచుకొనెనా, తనపూర్వకథ స్మృతికి వచ్చుచున్నది. ప్రథమావతార మేమని యెత్తెనో, 'బహుస్యా' మితి కామనచేత నా బహురూపములు చచ్చి వ్రేలాడుచుండెను. ఆ వాసన బ్రాహ్మణవీధికిఁ దగులుచుండెను. రామచంద్రరాజు కాదని పోగాడెను. అతఁడును గబీరును నిద్దఱే వాదించిరి. వారోడిపోయిరి. కబీరన్నాఁడు: "వేణుగోపాలస్వామికే లేనివాసన బ్రాహ్మణుల కెచ్చటనుండి వచ్చు" నని! రంగారావుగారు మార్కెట్టు కట్టుటకు స్థలమచ్చట నిచ్చిరి. ఈయవల దన్న బ్రాహ్మణుల నింకొకచోట నిమ్మనెను. రాధాపతి యొకటి యన్నాఁడు: "జాతి తగినయాహారములేక శక్తిహీనమైపోవుచున్నది. మత్స్యమాంసములు తినినఁగాని జాతికి శక్తి చేరదు. దొరలను జూడుఁడు! వారు పదునాఱేఁడులు వచ్చువఱకే మంచిదృఢకాయులై యుందురు. కలెక్టరులుగా మనదేశమునకు వత్తురు. మన బ్రాహ్మణులు 'ఓంభూః' అని ముక్కు పట్టుకొనుటతో నశించిపోవుచున్నారు" అని. మఱల సంవత్సరము తిరిగినది.

గణాచారి యొకనాఁడు ప్రాతస్స్నానముచేసి శిరోజములు ముడివైచుకొని మొగమునఁ బెద్దకుంకుమబొట్టుదాల్చి యూరివెంటఁ బయలుదేఱెను. ఆమె వేఁపమండలు పది- యెండిపోయినవి - చేతఁ బుచ్చుకొని బయలుదేఱెను. ఆమె మొగములో ముడుతలుపుట్టి జరాచిహ్నములు కనఁబడుచుండెను. ఆమె వయస్సు నలువది. పూర్వపు

గణాచారు లెవరును జనిపోవువఱకు ముసలివాండ్రైనది లేదు. వారికి శరీరముచేత నజరత్వము, పరంపరచేత నమరత్వము నుండెను. ఇప్పుడు జరాంకురము కలిగెను. ధర్మారావామెను దూరమునుండి చూచెను. శ్రవస్సన్నిధానగత కేశములు పలితములై దూరమునుండి కర్ణాభరణములవలెఁ దోఁచెను. పాపటలోఁ గొన్ని వెండ్రుకలు నరసి శిరస్సునఁ జంద్రరేఖ దాల్చిన ట్లుండెను. ధర్మారావు దగ్గరకు వచ్చెను. చూచెను. నిత్యబ్రహ్మచారిణి, యీమె శిరోజములు పలితము లగుటయే చమత్కారముగా నున్నది. ఆమె ధర్మారావును జూచి 'కష్టము లెట్టివారికైనను శరీరములోని శక్తిని సడలించును' అనెను. 'సామి యింక నీ వాసన పోర్వలేఁదు' అనెను. అని, దీర్ఘదీర్ఘముగ నడుగులు వేయుచుఁ బురపాలక సంఘసౌధాభిముఖియై నడచెను. ఆమె యెన్నఁడును శీఘ్రముగా నడువదు. మఱి యెవ్వరితోను మాటాడదు. వేఁపమండ లూరెల్ల పడెను. మార్కెట్టునందు, సంఘసౌధము ముందు, ఊరికి దక్షిణమున నున్న పేఁటలలో నామె చేతికి వచ్చినట్లెల్ల వదలెను. అదివఱకు గణాచారి బయలుదేఱిన దనఁగా నూరిలో సందడి యయ్యెడిది. బాలు రామె చుట్టును బోగుపడెడివారు. ఇప్పు డామె యొక్క తెఱయే నడచుచుండెను. ఆమె కొకచోటఁ బసిరిక కనిపించెను. ముసు పామును జూచి పాఱిపోవువాఁ డామె వంకఁ జూడకుండ నెమ్మదిగా మలుపుతిరిగి పోయెను. మఱియొకచోట దేవదాసి కనిపించెను. దేవదాసికి నొడలు తెలియుచున్నట్లు లేదు. మోహినీదేవతవలెఁ దనువెల్ల సింగారించుకొని, భూగతదృష్టియై నడచుచున్న పాదములు రాజహంసలకుఁ గులస్వాములన్నట్లు ప్రకాశించఁగా గోచిపోసికట్టిన చీరవలన జంఘలు పరివెన్నులవలె, లేఁత మొక్క జొన్నపొట్టలవలె, గొలవిడువని యరఁటిమొవ్వవలె, విరుగని క్షీరసాగరపుఁ గెరటమువలెఁ, దన్మయత్వరేఖవలె నుండెను. ఆమె వక్షోభాగము పరిపూర్ణతవలె, ననంతత్వమువలె, సర్వదేవతానివాసభూములైన మేరుశృంగద్వయమునవలె, పరిధూత్రకువలయాపీడనామక గజకుంభములవలె, నిర్గుణుఁడు సగుణుఁడైన భగవంతున కిష్టదైవతములవలె భాసించెను. ఆమెకంటియం దపాంగచలనములు లేవు. దృష్టి

నాసామూలమున కొత్తుకొని, భ్రూమధ్యమున ముడివడుచుచుండెను. నడచినంత మేఱ తూలిపోవుచున్నదో యన్నట్లుండెను.

గణాచారి యామె కనఁబడినంతనే చేతనున్న నాలుగైదు వేఁపమండలు వెనుకకు దాఁచుకొనెను. గణాచారి యొకతన్మయత్వము భజించెను. దేవదాసి కదలిపోయెను. గణాచారి యూహించెను. 'వేఁపమండలు కాసాపేఁటలోఁ బడలేదు.' గణాచారి తక్కిన వేఁపమండలు బ్రాహ్మణవీధిలో వదలెను. ఆమెదారి నామె పోయెను. ఆ నాఁడెల్ల నామె భోజనము చేయలేదు.

చంద్రారెడ్డి యా మధ్యాహ్నము గణాచారియింటికిఁ బోయెను. ఆమె యూరాయనవంకఁ జూడలేదు. రెడ్డి 'ఒకవేఁపమండ నా యింటివద్ద విసరరాదా?' యనెను. గణాచారి మొగమున నర్ధనికూలితనేత్రములసందునుండి యొకవిశృతమందహాసము అఱమూసిన తెల్లనికలువలోని కింజల్కపుఁద్రాడువలె వెలికివచ్చెను. రెడ్డి తనదారిని దాఁ బోయెను. అవి వేసఁగి చివరిదినములు

పగలెల్ల నెండలు మండి యెండఁబోసిన వడ్లు పేలాలు వేయించెను. ప్రొద్దుక్రుంకువఱకు నుత్తరపుగాలి విసరెను. అదివిసరినంతసేపు మత్స్యమాంసదుర్వాసనామిళితమైన వెచ్చనిపొగగాలి పేఁటపేఁటయంతయు దుర్వాసనాభరితము జేసెను. కాఫీహోటళ్లు 'మే మున్నా' మనెను. మఱల దక్షిణపుగాలి తిరిగి ఫ్యాక్టరీలలో నెండఁబోసిన యుప్పుడుబియ్యపుదుర్వాయువు తనప్రభుత్వము సాఁగించెను. పురపాలకసంఘమువారిడబ్బాలలో నున్న పులిపిస్తరాకులు గ్రామసూకరములచేతఁ గదలింపఁబడి 'మేము తోడున్నా' మనెను. ఎడమెడములేక కట్టఁబడిన యిండ్లలో నే గాలియు దూఱలేదు. అవి వాయుస్తంభనవిద్య మూర్తీభవించినచోట్లు.

రాతిరి జాముప్రొద్దు పోయెను. ప్రొద్దుక్రుంకువేళ వీచినగాలి స్తంభించెను. రాధాపతి మంగమ్మతో మాటాడుచు 'నచట నేదియో తగులఁబడుచుండె' ననెను. అది బ్రాహ్మణవీధి. జనమందఱును బ్రాహ్మణవీధికిఁ బరువెత్తిరి. సోమన్నగారియిల్లంటుకొన్నదని పలువురు ననిరి. అంటుకొన్నయిల్లు మతాబావలె నిలిచి కాలుచుండెను. పెంకుటిల్లు ఆర్పరానంత వైశ్వానరుండు విజృంభించెను. జనము

మంటలు లేనిచోట నింటిమీఁదకెక్కి కడవలతో నీరు క్రుమ్మరించు చుండిరి. సుబ్బన్న పేఁట నూతులు గ్రామములో రెండుగడియలలోఁతు. తోడినవారు తోడుచుండఁగా జేరఁబోసినవారు చేరఁబోయుచుండఁగా నందిచ్చినవా రందిచ్చుచుండఁగాఁ దడిపినవారు తడుపుచుండిరి. ఏమి తడుపుట! కృపీటయోని చిమచిమలాడి, బుసబుసలాడి, భగభగలాడి, ధగధగలాడుచుండెను. పెండెకట్టునకు వాసమునకు దిగఁగొట్టిన మేకులు పెటేలుమని వాసముపగిలి యశనిపాతమువలె మఱొకచోటికి దూఁకుచుండెను. ఈ మేకులు పోయి యెచటపడునో మఱేకొంప యంటుకొనునో యని జనము ప్రక్కనున్నయిండ్లవారు తమనామానులన్నియు బయటికిఁ బట్టుకొనుచుండిరి. అంటుకొన్నయిండ్ల ప్రక్కనున్నయిండ్లవా రింటికప్పులపైఁద నెక్కి చూరులు తడుపుకొనుచుండిరి. చుట్టుప్రక్కలనున్న పందిళ్లు పాకలు కూలఁద్రోసిరి. అవియు నంటుకొని మండుచుండెను. కా[illegible] యది లేచి యింకొకయింటిమీఁద పడదు. చంద్రారెడ్డి తండ్రి భాగయ్యరెడ్డి. ఆయన చనిపోయి పదియేండ్లయ్యెను. అంతధనవంతుఁడయ్యు నతఁడు గ్రామములో నగ్నిహోత్ర మంటుకొనె ననఁగాఁ దాను పోయి యంటుకొన్నయింటి నడికొప్పున నిలుచుండి సిప్పార్పెడివాఁడు. అంతవాఁ డెక్కఁగా మన కేమని బీదవారెల్లరును సహాయులై యంటుకొన్నని ప్పఱనిముసములో నార్పుచుండిరి. ఇల్లు తగులఁబడినవానికి మఱునాఁడు కృష్ణమనాయఁడు మఱల నిల్లు వేయించుచుండెను. ఇప్పుడు భాగయ్యలేఁడు; ప్రభువులేఁడు. సోమన్న యిల్లు వీతిహోత్రుఁడు నాల్గుమూలల సుడివోలెఁ దిరిగి, త్రవ్వుకొనిపోవుచున్నట్లు రొదవెట్టెను. హుతభుజునకు సోమన్నయిల్లు పురోడాశమన్నట్లుండెను. ఎఱ్ఱనిగుడ్డలు కోణాకృతిగాఁ గత్తిరించి జెండాలు కట్టినట్లు విభావసుఁడు తనప్రభుత్వము చెల్లించెను. పెంకులు, వాసపుబద్దలు ఖణఖణ మని మ్రోఁగుచు, లేచిపోవుచుఁ, దూలిపోవుచు భయంకరము లయ్యెను. సోమన్న యొకమూలవీథిలోఁ గూర్చుండి 'నాధనమంతయు నింటిలోననే యున్నది. వెండి బంగారమైనఁగాదు, కరఁగి ముద్ద యగుననుటకు. అంతయుఁ గాగితములు, నోట్లు. దేవుఁడు నాపొట్టమీఁదఁ గొట్టినాఁడు!' అని యేడ్చు

చుండెను. లయహేతువైన తామసగుణ మధికముగాఁగలవారు కొంద ఱచటనిలుచుండి "ఏఁ డెంతమంది పొట్టలమీఁదఁ గొట్టెను? కసాయి వానివలె తిరుగువడ్డీలు జంటవడ్డీలుఁ రూపాయితో మ్మిదణాల చొప్పున గడించి లోకులసొమ్మంతయుఁ బొట్టపెట్టుకొన్నాఁడు దేవుఁడు చూచియే ముట్టించినాఁ" డనిరి. మఱియొకఁడు "కట్నము లీయ వలయు నని కూఁతుండ్ర సందఱను రెండవపెండ్లిండ్లవాండ్రకే యిచ్చెను" అనెను. అంతలో నగ్నిపర్వతమునుండి భగభగలాడు చున్న యొకసగము ద్రవించినలోహపుముద్ద మహావేగనిర్ఘాతమై యాకసమున దూకినట్లు, మేరుపర్వతశిఖర మొకఁడు లేచి యాకాశ యాన మారంభించినట్లు వారియింటినుండి యొకపెడపెడ లేచి, దేవాలయములమీఁదినుండి దూఁకి యెచటనో పడెను. 'ఎచటపడె నెచట పడె' నని జనము గగ్గోలుపడిరి. ఆ వైపున నిండ్లులేవుకదా యని యూరకుండిరి. సోమన్నయింటిలో నాశుశుక్షణి మహాప్రభువై పెండ్లిచేసికొని బంధువులయిండ్లకుఁ బోనాముపెట్టెలలోఁ బెట్టి భోజనములు పంపించినట్లు మఱియొక పెళ్ళ దక్షిణమునకు విసరెను. అచ్చట రెండిండ్లు ముట్టుకొని వాయవ్యదిశకు భాగము పంచిపెట్టెను. జన మటునిటు త్రొక్కిళ్ళుపడి పరుగెత్తిరి. ఇంతలో దేవాలయపశ్చాద్భాగమున మహాగ్ని రేఁగెను. కొంద ఱటు పరువెత్తి చూచిరి. మార్కెట్టు తగులఁబడిపోవుచుండెను. దూదిబుంగ లంటుకొన్నట్లు, మహావనమధ్యమున శుష్కతరువులు తగులఁబడిపోవు చున్నట్లు, సూర్యోదయ మైనట్లు, గ్లాసోమల్లులమీఁద పండుచెంగావి యద్దినట్లు, దశకంఠహిరణ్యకశిపునరకాసురాదిరాక్షసులు తమపతాక లెత్తినట్లు, రక్తచ్ఛాయాతిరస్కృతసుబ్రహ్మణ్యేశ్వరద్విసహస్రకుపితనేత్రకోణమై యగ్నిజ్వాలలు చెలరేఁగెను. హిరణ్యరేతసుఁడు ద్రవ్యమంతయుఁ దినఁజొచ్చెను. ఎవరియిండ్లు వారు చూచుకొనువఱకే సరిపోయినది. మార్కెట్టుదిక్కు విచారించినదిక్కు లేదు. బ్రాహ్మణ వీధిలో సోమన్నయిల్లు పూర్తిగా నాశనమైనది. మఱి రెండుమూఁడిండ్లు ముట్టుకొన్నను వెంటనే యార్పివేయఁబడెను. ఆగ్నేయ వాయవ్యదిశలయందుఁ బూరికొంప లెక్కువ. కడవలతో నీరు క్రుమ్మరించిరి. అగ్ని యెచ్చటి దచ్చటఁ జల్లారెను. రెండుగంట లగువఱకు

నంతయుఁ జల్లఁబడెను. పేదవారిపాకలు పదిపదునొకండు నష్టమైనను బ్రాణనష్టము జరుగలేదు. మంగమ్మ యిల్లంటుకొనెను. సినిమాజనమంతయు వచ్చి యార్పెను. ధర్మారావు భార్యయుఁ దాను పిల్లవాఁడును దల్లియు బయటికి వచ్చి నిలుచుండిరి. అతనియింటిమీఁద నెక్కి యెవరును నీరు పోయలేదు. సావిత్రిమ్మగారు సామాను బయటికిఁ దెత్తు ననియెను. ముడిగట్టుకొని యామె పచ్చలకుండలుమాత్రమే బయటికిఁ దెచ్చెను. ధర్మారావు తక్కిన యేవస్తువును దేనీయలేదు. అతఁ డన్నాఁడు: 'ధర్మము, అగ్ని, తస్కరుఁడు, రాజు—వీరునలువు రన్నదమ్ములు. ధర్ముఁ డందఱిలోఁ బెద్దవాఁడు, అతని కవమానము చేసినచోఁ దక్కిన మువ్వురకును గోపము వచ్చును. అగ్ని తగులఁబెట్టును తస్కరుఁడు దొంగిలించును. రాజు రాఁబడిపన్నని, యదనపు బన్నని లక్షవిధములుగా ధనము హరించును. మనము ధర్మావమానము చేసినచోఁ గానిమ్ము. పాతికవేలయిల్లే పోయినపుడు వందరెండు వందలు రూకలు సామాను రక్షించునా?'' అని.

ధర్మారావు నిల్లు సోమన్నయింటికి దగ్గఱ. గణాచారియిల్లు ముట్టుకొనెను. ఆర్పిరి. ఉషర్బుధుఁడు తెల్లవాఱువఱకు మార్కెట్టులోను, సోమన్నయింటిలోను మండుచునే యుండెను. కాఫీహోటళ్ళు నాలుగును దగులఁబడినవి. దుష్టాన్నము తిని, యొడళ్ళలో శక్తిలేని యచ్చటివారు నీరు తేలేకపోయిరి. ఇండ్లార్పుకొనలేకపోయిరి. తెల్లవాఱువఱకుఁ బట్టణమంతయుఁ బొగవాసనయేకాని కడచిననాఁటి దుర్వాసనపోయినది. ఫ్యాక్టరీవారు చూచుకొనలేదు. ఉప్పుడువడ్లెండ బోసిన డాబాలమీఁద నిప్పుపడి వడ్లన్నియుఁ గొన్నిచోట్లఁ దగులఁబడి, కొన్నిచోట్ల చిట్టముకట్టిపోయెను. మఱునాఁడుసాయంకాలమున మలయమారుతము చందనాగురుతరుశాఖాసమానీతపరిమళమనోహరమూర్తియై పూలరంగనివలెఁ బేటవీథులలో షికారులు కొట్టెను.

వేసవికాలము పోయి వర్షాకాలము వచ్చెను. పట్టణముచుట్టును మాగాని యగుటచేతఁ బ్రతిసంవత్సరమువలెనే యీయేఁటను దోమలు హెచ్చెను. కురిసిన వానలు కురిసినట్టే గ్రామవీథులవెంట నింకినంత నీ రింకి, తక్కినచోట్ల బురదయై పోయెను. రోడ్లప్రక్క కాలువలు నీరు నిలిచి తుక్కుపడి యసహ్యము లయ్యెను. పట్టణ మూడ్చువారు

ధనవంతులు నధికారులు కల యిండ్లయందు శుభ్రము చేసి, తక్కిన గ్రామమంతయు వారియిష్టమువచ్చినట్లూడ్తురు. రోడ్లన్నియు గుంటలై పైయిసుక కొట్టుకొనిపోయి గుఱ్ఱములకు లాడములు, మనుజులకుఁ బాదరక్షలు నిర్బంధవిధానమైపోయెను. పట్టణములలో నావు, బఱ్ఱె, ఎద్దుకఱవయ్యెను. ఎవనికో యొకనికి గేదెగాని, యావుగాని పాలిచ్చును. నూటికి తొంబదితొమ్మండ్రుగురు పాలు, పెరుఁగులు కొనుటయే. నందీశ్వరులవంటి మహావృషభములుకల సుబ్బన్నపేఁటలో నేఁడు వృషభము లున్నవి చూచి తీఱవలయును. అఱ్ఱుమీఁద పుండులేని యెద్దు లేదు. కడుపులోని యెముకలు లెక్కపెట్టరాని పశువు లేదు. దూడ బ్రతికియున్న యావు లేదు. చెన్నపట్టణపురీవి యెక్క గడ్డిదూడలు బలిసినవి. బ్రదికియున్నదూడను జూచి కూడ గడ్డిదూడ యనుకొనవలసినదే. సీతాదేవిచీర దాఁకపోయినంతనే హనుమంతునితోఁక సరిపోయినట్లు నెత్తురుబొట్టు తగిలినదన్నంతవఱకు గోక్షీరములు పిండఁబడుచుండెను. గ్రామమంతయు వానకాలమున నుసుళ్ళుబలిసి బురదవాసన లెత్తి కిచాళ్లై పోయెను. పేఁటప్రజలకు వానకాలములోఁ జేతి కందుచున్న నీరు ముంచుకొనుట కష్టమై పోయెను. తోడుకొనుట లేకుండ పై నుండి పడు వర్షము బిందెలతోఁ బట్టుకొన్న నెంతబాగుగానుండును! గంగానది పైనుండి ధారగాఁ గురిసిన నెంత బాగుగా నుండును! భూమిలో నుండి నీరు చేఁదుకొనుట యేమిటి? అందఱకును గంగానదిని గ్రిందికి దించుకొనలేకపోయినను నీటికొళాయిలైనఁ బెట్టుకొన్నచో జలము వేసఁగిలోఁ జేదుకొనుబాధ, వర్షావేళ ముంచుకొనుబాధ తప్పిపోవును. కొళాయి క్రింద బిందె పెట్టుము - అది నిండును. కొళాయి క్రిందఁ కూర్చుండుము- దానియంతట నదే స్నానమగును. మనుజులకుఁ గల వీ లెల్లుంచి పట్టణాధిదేవత కొళాయిలులేకపోవుట నలుగురిలోఁ దన గౌరవము తక్కువనుకొన్నది. సాటిపట్టణము లంతర్జలవాహినులవలె నీటిగొట్టములతోఁ దళతళలాడిపోవుచున్నవి. తానేమో పేదరాలి వలె నతిథులకు నీరైన నొసఁగలేకున్నది. పట్టణ మింకొకటి యనుకొన్నది: 'అతిథులు వచ్చి యిండ్లమీఁదఁ బడెదరు. వారికి బజారులలోననే కాళ్ళుగడుగుకొనుటకు; మంచితీర్థమునకు సమకూర్చెదను.'

తరువాత శరత్కాలము వచ్చినది. ఆ రెండు నెలలలో చీఁకటులే రానట్లు అటువదిదినము లొకటియే వెన్నెల యయ్యెను. శరత్పూర్ణిమలు వచ్చెను. వచ్చిన శరత్పూర్ణిమలు విద్యుద్దీపములవలె వెలుఁగ వచ్చునా? గ్రుడ్డివెన్నెలలు కాసినవి. సూది పడినచోఁ గనుపడవలయును. వెలుఁగనఁగా నట్లుండవలయును. విద్యుద్దీపము లున్నచో నట్లుండును. వాని కాంతులు వెన్నెలలను బరిహసించును. చంద్రుఁడే విద్యుద్దీపము. అతనికి 'పవరహౌసు' సూర్యుఁడు. ఆ 'పవరహౌసు' పవళ్ళు పేటలో నుండును. సరే, రాత్రులందుఁగూడ నుండవలయును. చంద్రారెడ్డి కార్తికపూర్ణిమనాఁడు దారివెంటఁ బోవుచుండెను. ఆయనచేతియుంగరము జాఱి దారిలోఁ బడెను. ఆయన వెదకెను. కనుపించలేదు. ఎవరినో దీపము తెమ్మనెను. వారు తెచ్చిరి. కనుపించలేదు. ఒకరు పెట్రొమాక్సులైటు దారివెంటఁ దీసికొనిపోవుచుండిరి. దాని వెలుఁగున వెదకిరి. ఉంగరము కనుపించెను. మూఁగినవారిలో నొకతఁ డన్నాఁడు: "ఎట్లయినను విద్యుద్దీపము విద్యుద్దీపమే" యని. చంద్రారెడ్డి మనసున కా మాట నచ్చెను.

దేవదాసి సర్వాలంకారశోభితయై దేవాలయమునకుఁ బోయెను. ఆమె వెన్నెలలో నచంద్రచంద్రమఃకాంతిపరిదీప్తములైన శ్రీలోకములయందు సంచరించుచున్న లక్ష్మీదేవివలె నుండెను. ఆమె సౌందర్యము పంచభూతములయందు నిండి పరిభోగించుచున్న విష్ణుదేవునకు విద్యుద్దీపములు లే వనిపించ లేదు. చంద్రమఃకాంతిపూరములోఁ దెల్లనిచీరతో నడుచుచున్న యామె పాలకడలికెరటముల మీఁద నూఁగుచున్న క్షీరసాగరకన్యవలె విష్ణువునకుఁ దోఁచెను. ఆముదపు దీపముల వెలుఁగుమాత్రమే యెఱిఁగిన వేణుగోపాలస్వామికి వెన్నెలయు లేదు, చీఁకటియు లేదు. ఆయన ప్రత్యఙ్ముఖుఁడై తనలోఁ దానే చూచుకొనును. గుడియే యాయన, ఆయనయే గుడి. ఆ ఱాతిబొమ్మయు, నా ఱాతిబొమ్మను వలచిన యీ ఱాతిబొమ్మయు వెన్నెలలకు సంతోషింతురు, సంతోషించరు; తృప్తిపడెదరు, తృప్తిపడరు. సుబ్బన్నపేటప్రజమాత్రము వెన్నెలలకు సంతోషించలేదు, తృప్తిపడలేదు.

శిశిరర్తువు వచ్చినది. పురపాలకసంఘసమావేశము జరిగినది. కొళాయిలు, విద్యుద్దీపములు కావలయు నని యొక మిషనరీ తీర్మానము పెట్టెను రామచంద్రరాజు ప్రతిఘటించెను: 'మనయూరిలో నీరు చేతితో నందుకొనవచ్చును. కొళాయిలైనచో రెండు చెఱువులు త్రవ్వించవలయును; ఇంజనులు తెప్పించవలయును. అది బోలెడంత కామాటను. రెండులక్షలు మఱల నూరికిమీఁద వసూలుకావలయును. ఇంతవఱకు సంఘసౌధనిర్మాణమునకైనయప్పు తీఱలేదు. దీనికి, విద్యుద్దీపములకుఁ గలిసి నాల్గులక్ష లగును. ఇంక నేబదియేండ్లవఱకు మన మీయప్పు తీర్చలేము. ఇది న్యాయము కా'దనియెను. ఆ మిషనరీ లేచి 'సుబ్బన్నపేటమీఁద మునుపటికన్న నిప్పు డెక్కువపన్ను వచ్చుచున్నది. గృహము లెక్కువైనవి. పురపాలకసంఘమురాఁబడి పదియేండ్ల పూర్వముకన్న నిప్పుడు నాల్గురెట్లైనది. అందుచేత నీయప్పు బదియేండ్లలోననే తీఱిపోవును' అనెను. అంతటఁ గబీరు లేచి 'ఇదివఱకుఁ బురపాలకసంఘసౌధముమీఁదఁగాని, మార్కెట్టుమీఁదఁగాని మూఁడులక్షలు పెట్టితిమి. దానివడ్డీ యనవసరముగా రాచరికము వారి కిచ్చుచుంటిమి. మూఁడులక్షలు తెచ్చి పాతికయేండ్లలో పది లక్షల నిచ్చుచుంటిమి. అట్లే యప్పుతెచ్చి యీపనులుచేసినచో మనకు వడ్డికూడ నష్టమగుచున్నది. ఈ నాల్గులక్షలు పన్నులద్వారా వసూలుచేయుచుందుము. ఎన్ని యేండ్లలో వసూ లగునో చూతము. అప్పుడే నీటిగొట్టములు, విద్యుద్దీపములు పెట్టుకొనవచ్చును. ఇప్పుడే డబ్బు తెచ్చి యీ పనిచేసితిమా, యప్పుతెచ్చినది నాలుగులక్షలు అప్పుతీర్చునాఁటికిఁ బదిలక్ష లగును. నేను చెప్పినట్లు చేసిన- ప్రజలకు లాభమో, నష్టమో? వారు నాల్గులక్షలే యీయవలయును. అప్పుతెచ్చి చేసినచో వారు పదిలక్ష లీయవలసివచ్చును' అనెను. అతనివాదన అరణ్యరోదనమయ్యెను. మఱొకసభ్యుఁడు లేచి 'ఇంకఁ బదియేండ్లకు వచ్చునో, చచ్చునో- ఇప్పుడు పట్టణమునందుఁ ప్రజలు నూతులలోని నీరుత్రాగుటవలన చలిజ్వరములు వచ్చుచున్నవి. నూతులలో నీరు మురిగిపోవుచున్నది. ఈ నీటివలననే కలరాలు, మశూచికములు ప్రబలుచున్నవి. నీటిగొట్టములద్వారా యైనచో నెప్పు డేవ్యాధియున్న, నా వ్యాధికిఁ బ్రతి

క్రియమైన కొన్ని యౌషధములు నీటిలోఁ గలిపి పంపించవచ్చును. అప్పుడు ప్రజ లారోగ్యవంతులుగ నుందురు' అనెను. కబీరు "ఇప్పుడు నీరు మనపెదవులదాఁక వచ్చువఱకు సూర్యరశ్మి స్పర్శ కలిగియుండును. అప్పు డింజనులవేఁడి, గొట్టములలో చాలసేపుండుట - యీ దోషములవలన నీటిలో నిప్పు డున్న మంచి యప్పు డుండదు మర బియ్యము వచ్చినవా! దీనికిఁదోడు గొట్టములనీరైనచో నగ్నిహోత్రిము తిన్నట్లే; అగ్నిహోత్రము త్రావినట్లే. ఈ మరబియ్యము మొదలుపెట్టిన తరువాత నినుమువంటిమనిసిని నేనే తగరమువంటి మనిసినైనాను" అనెను. అందఱును జప్పట్లుకొట్టి నవ్విరి. ఒక పూణా విద్యార్థియుఁడు 'కబీరు మాటాడుట తార్కికముగా లేదు. సభలో మాట్లాడవలసినట్లుగాఁ గూడ లే' దనెను. వాదోపవాదములు యథేచ్ఛముగా జరిగెను. రామచంద్రరాజు లేచి "రెండు నొక్కసారికాక, ముందు కొళాయిలుపెట్టి, తరువాత నొకపదేండ్లు పోనిచ్చి విద్యుద్దీపములు పెట్టవచ్చు" ననెను. మఱియొకఁడు లేచి "కొళాయిల కేమి? నీటి కిబ్బందిలేదుకదా! చీకటి రాత్రులు గడచుట కష్టముగా నున్నది. అందులో దొంగ లెక్కువైరి. విద్యుద్దీపములే ముందు కావలయు" ననెను. కబీరు 'యీ నీరు త్రాగుటవలన జనములకు వ్యాధులు వచ్చుననిరికదా! వెలుతురు మఱికొన్ని యేండ్లు పోయిన తరువాత చూచుకొనవచ్చును. అందుచేఁ గొళాయిలే ముందుఁ బెట్టుకొనవలయు' ననెను. ఒక నుమనరీ లేచి 'త్రాఁగుచున్న నీరు కాఁచి పుచ్చుకొనవచ్చును. విద్యుద్దీపములే ప్రధానముగాఁ గావలయు' ననెను. కబీరు "అట్లయినచోఁ గొళాయిలయవసరమే లేదు, విద్యుద్దీపములమాట తరువాతఁ జూడవచ్చు" ననెను. చివరకు వోటింగుకుఁ బెట్టిరి. రెండును గావలయుననియు,నాల్గులక్ష లప్పు తెచ్చి పని సాఁగించవలయు ననియుఁ దీర్మానములు గెలిచెను. అందఱును నెవరియిండ్లకు వారు పోయిరి. కబీరు, రామచంద్రరాజు లిద్దరును గలిసివచ్చుచుండిరి.

రామ—కబీరూ! మన మీసభలో నెందుకు? కబీరు—మామ గారూ! మన మిర్వురకుగూడ లేకపోయినచో సంఘసభ కేకగ్రీవత కలుగును. ఊరంతయుఁ బట్టణమైనతరువాత దేవుఁ డొకమూల పడి

యున్నట్లే మానము నున్నా మనిపించుకొనుటకు. బ్రదికియున్నచో క్షయ వ్యాధియుఁ గుదురునేమో! కనుకఁ బ్రాణము లుండుట వాంఛింపఁ దగినది. రామ—నీతత్త్వము బాగుగా నున్నది. కబీరు— చంద్రారెడ్డి గారు మనపక్షమా, వారిపక్షమా? రామ— ఆయన యధ్యక్షపదవి పక్షము. కబీరు—ఒక్కసారి మీరు సంఘాధ్యక్షులు గంకు! ఒక యాట యాడించెదను రామ—ఏమి లాభము? కాలము చాలది. కబీరు—అవునుగాని, యది యెట్లుండునో యొకసారి చూపింతును. ఇంక రెండేండ్లకుఁగాని యెన్నికలు మరల రావు ఇప్పటినుండి మనము ప్రయత్నముచేసి ప్రతివార్డులో మన కనుకూలమైన వారిని నిలుచుండఁబెట్టించి ప్రయత్నము చేయుదము. ఇది రహస్యము. మన కిద్దఱికే తెలియును. మనము పనిచేయుచున్నపుడుగూడ మన యూహ లెవరికిని దెలియరాదు. రామచంద్రరాజు బామునుండి నాసామూలమున కుదించి తెప్పఁ గ్రిందనుండి చీకట్లలోనికిఁ జూచెను. చీఁకట్లు నిశ్చలములై యుండెను.

పని యెచ్చటి దచ్చటఁ బ్రారంభమయ్యెను. అప్పు తేఁబడెను. రాచరికమువారివంతు వా రిచ్చిరి. వలసిన యింజనులు, గొట్టములు, తీఁగెలు, పనిముట్లు— సర్వమును దెప్పించుటకుఁ జంద్రారెడ్డి నానాదేశములకంపెనిలనుండి 'కొటేషన్సు' తెప్పించెను. ఇంగ్లీషుకంపెనీ ధరలకన్న నమెరికాధరలు తక్కువ. వానికన్న జర్మనీధరలు చవుక. మొత్తముమీఁద భేదము లక్షరూపాయలు కనిపించినది. చంద్రారెడ్డి 'ఇంజనులు జర్మనీనుండి తెప్పింత' మనుకొనెను. ఆర్డరులన్నియు వ్రాసి తయారుగా నుంచెను. విద్యుచ్ఛాఖయింజనియరువద్దకు స్కీమంతయుఁ బంపించెను. ఇంజనీయరు స్కీమంతయుఁ దాను తయారు చేసి చంద్రారెడ్డికిఁ బంపించెను. రెడ్డిపంపించినదానికి నింజనీయరు పంపించినదానికి సంబంధము లేదు. ఇంజనీయరుపంపించిన స్కీములో వస్తువులన్నియు నింగ్లండునుండియే తెప్పించుకొనవలయు నని యున్నది. రెడ్డి "యివి ప్రియముకదా, పురపాలక సంఘమునకు నష్ట"మని వ్రాసెను. ఇంజనీయరు "వస్తువులగట్టి చూచుకొనవలయును అదియుఁ గాక, మీరిగ్లాండునుండి వస్తువులు తెప్పించినచో మనరాచరికమువా రింగ్లాండుదేశస్థు లాయెను. వారు మనకుఁ గొంతధనమిచ్చుచుండి

రాయెను. వారి కభిమాన మప్పుడు మనమీఁద నెట్లుండు" నని వ్రాసెను. చంద్రారెడ్డి యాలోచించెను: "అపుడు, రాచరికమువారు మనకుఁ గొంతధన మిచ్చుచున్నపుడు వారిదేశమునుండి తెప్పించుటయే న్యాయ" మని తోఁచెను. ఆ రాచరికమువా రిచ్చుధన మెచ్చటిదో!

చెఱువులు త్రవ్వుటకు స్థలము కావలసివచ్చెను. చంద్రారెడ్డి పట్టణప్రాగ్దిశనున్న తనమెట్ట నమ్మఁజూపెను. ఆ మెట్టవలన రెడ్డికి లాభ మేమియుఁ గన్పించలేదు. అందులోఁ బైనాఁ బాము లెక్కువగాఁ దిరుగుచుండెను. మాగానిపంట కనిపించినట్లు మెట్టపంట కనిపించదు. మన నలువురి పిల్లలలో వారములు చేసికొనుపిల్లవాఁడు నలిగిపోయినట్లు, మాగానికిఁ జూపించుచున్న శ్రద్ధలో మెట్టమీఁది శ్రద్ధ తగ్గిపోవును.ఆయన కది యెట్లైనను వదలినచే చాలుననిపించినది. ఇంకొకప్పుడు ధరవచ్చునో, రాదో! అమ్మఁజూపినకో నంత కదుగుదు, రింత కదుగుదురు. ఏఁబదియెకరము లేఁబదివేలకుఁ బురపాలక సంఘమున కమ్మివేసెను. అచ్చటఁ జెఱువులు త్రవ్వ నారంభించిరి.

పసిరిక యొకనాఁడు తూర్పుపొలములకుఁ బోయెను. వాన కురిసిననాఁడు చెదలు బయలుదేఱినట్లు జన మచ్చట మూఁగియున్నది. అతనికి భయమువేసి యింటికి వచ్చెను. ఇదిగాక తదితర గ్రామస్థుల మెట్టపొలా లొకయేఁబదియెకరములదాఁక నున్నవి. వానిలో చెట్లున్నవి, చేమ లున్నవి; పాము లున్నవి, పక్షు లున్నవి. చెట్లుచాటుచేసికొని పసిరిక తిరుగుచుండెను. పవలెల్ల సంటిలోనుండి రాతురులందే పొలాలమీఁదికి బోవును. అప్పుడచ్చటఁ ద్రవ్వ జన ముండరు. పసిరిక చూచెను. ఈ జనము మొక్కల నెచ్చటికచ్చట త్రవ్వివేయుచున్నది. వేళ్ళతోఁ గుద్దాలించుచున్నది. కనఁబడిన పామునెల్ల చావమోదుచున్నది. రోజున కొకటిరెండుపాములు చని పోవుచున్నవి. పక్షులను గొట్టి వండుకొని తినుచున్నది. పొలముల పిచ్చుకలగుంపులు చెల్లాచెదరైనవి. సర్వనాశనముగా నున్నది. పొలములో నొకవేళ పసిరిక పండుకొనిన పామని తల చితుకమోఁదుదురేమో! మునుపటికన్నఁ దాను కొంచెము బలిసెను. అంత పామను కొనరేమో!

విద్యుద్దీపములకు స్తంభములు వేయఁబడెను. పేటలో వృక్షము ప్రతిపద ముండెను. ప్రతివీథియందు వృక్షములే. వేప చెట్లు, రావి, మఱ్ఱి, దిరిసెన, గంగరావి మొదలైన వృక్షములు ప్రాఁతయూరంత యున్నవి. తీఁగలు వేయు సమయము వచ్చినది. ఒకచెట్టు మూలచ్ఛేద మయ్యెను. ఒకవృక్షమునకుఁ జేతులు తెగెను. ఒకతరువు కత్తిపెట్టి సగమునకుఁ దెగవేయఁబడిన ట్లయ్యెను. ఒక వనస్పతికి గాఢచపేటము తగిలెను. మఱియొకదానికి శిరశ్ఛేదము చేయఁబడెను. నానావృక్షములు తలోధావత్పక్షికంఠారావములచేతఁ గూయిపెట్టెను, మూల్గెను, శరణు వేఁడెను. నిర్దయమైన విధి 'పొండు పొండు, గుండేటి యట్టయకుఁగున గూళ్ళు కట్టుకొనుఁడు. మీ కింత యున్నతస్థితి యెందు' కనెను పక్షులు తెక్కలాడించెను. నోళ్ళు తెఱచెను. నీవుపోయి గ్రుడ్లున్నగూఁటిని కఱ్ఱతోఁ దాఁకుము- తల్లి పక్షి వచ్చి నెత్తిమీఁద ముక్కుతోఁ బొడుచును. కిరాతకుఁడు వచ్చి చెట్టుచెట్టెక్కి ప్రతిపసిపిట్టను తెక్కవిఱిచి బుట్టలో వేసికొమ్మనుము- తల్లిపక్షులు పిండుకట్టి యాకాశమున మండలపరిభ్రమణముచేయుఁ గాని వాని నొక్కపక్షి పొడువఁబోదు. ఆ పక్షులకుఁ దెలియును- దగ్గఱకుఁ బోతిమా, మనమెడలుకూడ విఱుచు నని. స్వాశ్రయము నదలిపోవలసినంత దుర్దశ వచ్చినప్పుడు, పోకయుండుటకు వీలులేనప్పుడు పోయితీఱవలయు నని తెలియని జంతు వే ముండును? చెట్లు సగము కొట్టఁగా మిగిలినసగములు పక్షులను జూచి 'మా చేతఁ గాదు. మేము కలనాళ్ళలో మీ కాశ్రయ మిచ్చితిమి. ఈ దుర్దినములలో మ మ్మేల యాశ్రయించెదరు? మఱొకతృణజలకాష్ఠసమృద్ధిగల దేశమునకుఁ బొం' డని చెప్పెను. మఱికొన్నివృక్షము లనెను: 'మేమనఁగా నున్నచోటినుండి కదలలేము. నిర్దయుఁడు వచ్చి మమ్ము గొడ్డలిపెట్టి తెగవేయును. మేము పాఱిపోఁజాలము. కాదనఁజాలము. చే యడ్డమైనఁ బెట్టుకొనఁజాలము. మీ రేమి? తెక్కలుగల జంతువులు. వీలైనచోటునకుఁ బొం' డనెను. ఎంత చెప్పినను బోని పక్షులను జూచి యొకముసలివృక్ష మన్నది: 'ఇవి యేవో క్రొత్తచెట్లు వచ్చుచున్నవి. వీనికి శాఖలు లేవు, పండ్లు లేవు, ఫలములు లేవు. తాటిచెట్టుకైనఁ బైని మొవ్వ లుండును. వీని కవియు లేవు? ఈవృక్ష

ములు పెరిగినదేశ మేదియో? అచ్చట సూర్యుఁ డుదయించునో, యుదయించఁడో! అవి యింతపెద్దవైనతరువాతఁగూడఁ దెచ్చి పాతవచ్చును గాఁబోలు! మనబదు లా వృక్షములే గ్రామమంతయు వెలసినవి. ఈ వృక్షములకు బోదలే తక్క నితరవృక్షావయవములు లేవు. వానిస్వభావము మనకుఁ దెలియదు. మీరు నామాట విని లేచి పొండు. అవి యొకవేళ శాఖలువేయునేమో! ఆశాఖ లెట్లుండు నో! వానిమీఁద మీరు గూర్చుండినఁ జచ్చిపోదురేమో' అని. జంతువులన్నింటికి నొక్కటియే గుణము. వనమంతయు నఱికి వేయును. సింహము మిగిలిన నాలుగుచెట్లలోనే దాఁగియుండును. పెద్దపెంకుటిల్లు తగులఁబడిపోనిమ్ము. అచ్చటనే మనుష్యుఁడు చిన్న పాక వేసికొనియుండును. నఱికివేయఁబడిన చెట్లన్నియుఁ బోయినను పక్షులు మిగిలిన కొమ్మలను వదలిపోలేకపోయెను.

వేసఁగి వెడలిపోయెను. వర్షాకాలము వచ్చెను ప్రతిసంవత్స రము నల్లనిమేఘమొకఁడు పడమటికనుమలలో, వింధ్యగిరులలో, హిమవత్పర్వతములలో, బ్రహ్మదేశశైలములలో జాగ్రత్తగాఁ దా నే గుట్టకు, నే కొండయంచునకు, నే శిలాకోణమునకు, నే వృషదుపరిభాగమునకుఁ దగులకుండఁ దన్నుఁ దాఁ గాపాడుకొనుచు వచ్చి యన్నిమేఘములును దెలుఁగుదేశముమీఁదఁ గురియుఁ చుండఁగాఁ దాను తనసావాసగాండ్రతోఁ గలసి సుబ్బన్నపేటకు వచ్చి, యచ్చటఁ దనప్రియమిత్రమైన యొక్క మహోన్నగోధశిఖర మునఁ గూర్చుండును. అతనితో సంభాషించును. ఆ మొగిలుపేరు వృషన్నిధి. ఆ చెట్టుపే రాదివటము. ఆ వటము మహాబలశాలి. వచ్చిన మిత్రమును బుజములమీఁద జేతులు వైచి 'యెన్నాళ్ళకు వచ్చితి' వని కదలించి వేయును. వృషన్నిధి యానందబాష్పములు మిత్రునియొడలినిండ వర్షించును. వృషన్నిధి వెనుకటియేఁడు వచ్చి యాదివటమును కౌఁగిలించుకొని కన్నీరుగార్చి 'మిత్రమా! నీవు పుట్టి నాల్గువందలయేఁడులైనది. ఇచ్చట గ్రామము కట్టకమునుపు నీ విచ్చటనే యున్నావు. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి నిన్నుమాత్రము దయగానే చూచెను. నే ననాదినైన మేఘమును. నాల్గువందల యేండ్లనుండి మనమైత్రి యవ్యవహితముగా సాఁగుచున్నది. ముందు

నాఁటికి మఱల మనము కలియుదుమో, కలియమో యన్నది. ఆది వట మప్పుడే భయపడెను: "ఇది యేమిరా ? అమృతమూర్తియైన మిత్రునినోటినుండి యశ్లీలములు వచ్చుచున్న" వని.

ఆ యేఁడు వృషన్నిధి వచ్చినది. మనసులో నేమో దిగులుగానే యున్నది. వింధ్యపర్వతములలో నొకవేఁటకాఁడు తనతుపాకితో నొకలేడిని గొట్టెను. ఆ గుండు వృషన్నిధిగుండ దూసికొని పోయెను. అదివటము వృషన్నిధి తుపాకిదెబ్బ తిని యెఱుఁగఁడు. హిమవంతములో నొక కస్తూరిలేడి దానిని గొమ్ముతో గీసెను. బ్రహ్మదేశముప సముద్రప్రాంతముల నొకపాగయోడ వృషన్నిధిని కంబముతో గీరెను. ఈ యపశకునములన్నియు వృషన్నిధి యోజించుకొనుచునే వచ్చెను. అతఁడు వచ్చి చివరకుఁ జూచెను. ఆదివటము లేదు. అది సుబ్బన్నపేఁట యగునో, కాదో యని చుట్టుపట్లనున్న పది పదునొకండు గ్రామములు వెదకెను. ఎల్లలన్నియును సీయూరికే సరిపోవుచున్నవి. కోట యిచ్చటనే యున్నది. జగదీశ్వరులయాలయము లిచ్చటనే కనఁబడుచున్నవి. అదుగో ధర్మారావు. అదిగో గణాచారి. అదిగో దేవదాసి. అదుగో పసిరిక—నిరుటికన్న లావైనను గుర్తుపట్టవచ్చును. ఇదియే సుబ్బన్నపేఁట. ఆదివట మేది ? ఆదివట మేది ? వృషన్నిధి తానంతయు దుఃఖాక్రోశమయ మయ్యెను. కాని పట్టుకొని యాదరించు స్నేహితుఁడు లేడు. ఒక విద్యుద్దీపికాస్తంభముమీఁద శ్రమ దీర్చుకొనుట కొఱఁగెను. అది యతనికిఁ దన్ను కొఱత వేసిన ట్లుండెను. దైవము రక్షించి యొకఝంఝామారుతము జడమైనవృషన్నిధిని దన్నుకొనుచుఁ బోయెను. వృషన్నిధి పోయి, నీ రక్కఱలేని యొకగుట్టపైభాగమునఁ గూలఁబడెను. ఆదివట మేమైనదో వృషన్నిధియు నదియే యయ్యెను.

మంచినీళ్ళు వచ్చుటయో రాకపోవుటయో. వీథులలోనున్న నూతులన్నియుమాత్రము పూడ్చఁబడినవి. గొట్టాలవెంట నీరువచ్చునప్పటికి సంవత్సరము పట్టినది. తక్కినపట్టణములలో రెండుమూఁడేండ్లకుఁ దక్క పట్టలేదఁట. రాచరికమువారు సుబ్బన్నపేఁటపురపాలకసంఘమును బ్రశంసించిరి. ప్రశంసాపత్రముచూచినవాఁడు సంఘసభ్యులలో నొకనికి మొగ మింత యయ్యెను. ఒకనికి బుజములు

పొందెను. ఒకనికి తా నొకమహాపురుషుఁడ ననిపించెను. ఇంతకును నీటికొళాయిలు బజారున నొకటి పడినవి. వీథిబావు లున్నపుడు బీద జనులు తమకడవలు తాము తెచ్చుకొని చేఁదుకొనిపోయిరి. నాల్గు కడవలతో రోజెల్లఁ గడచినది. తెల్లవాఱువఱకుఁ బ్రతికొళాయి చుట్టును వందవందకడవలు. ముందు వచ్చినవారిది ముందువంతు. కొందఱు కోడికూసినప్పుడే తమకుండ కొళాయిక్రిందఁ బెట్టిపోదురు. కళాశాలావిద్యార్థులు కాఫీహోటళ్ళలోఁ దెల్లవాఱకముందే తినువారు మోటారుకార్లవారు మొగాలుకడిగి కొళాయిలచుట్టును గంగాళి సేయుదురు. బ్రాహ్మణవీథిలోనను, మఱికొన్నిచోట్లను దొడ్లలో నూతులు పూడ్చుకొనలేదు. బావులలోనీరు కాలువనీటివలె తియ్యగా నుండదు. అందుచేతఁ గ్రమముగా నందఱును గొళాయినీటికే యెక్కిరి. ఆ నీటికి ధర పెరిగెను. కొళాయి యింటిలోనికిఁ బెట్టించు కొనినచో దానికిఁ గొంత వ్యయము. తరువాత మీటరు, మీటరు సర్దిపోవువానిచేతిలో నేదైనపెట్టుట, మొఱఁగనివారికిఁ జేతి కెక్కువ తగులుట. ప్రతివారము నేలలో నున్న గొట్టములలో నీరు నిలచి యుండునని యొకొక్కచోట నాలుగైదువందలబిందెలనీరు వీథి వెంట నూరకే వదలిపెట్టెదరు. ఆ నీరు యథేచ్ఛముగా నెవ్వరైన వాడుకొనవచ్చునుగదా! అంత నూరకే పోయినందులకు డబ్బెవరి వద్దను బుచ్చుకొనలేదు. మీటరువలన నీరు చూచిపెట్టుకు బ్రదుకవలసి వచ్చెను. ఇంటిలోనికి కొళాయిలు పెట్టించుకొనిన ధనవంతులపని బాగుగనే యున్నది. పేదవారిబిందెలు వీథిచివర నున్న కొళాయిచుట్టు గంటలతరఁబడి సభలు చేయుచుండెను. సభలోఁ దీర్మానము లగు చుండెను. ఆ తీర్మానములు పై యధికారులచేతులలోఁ బడు చుండెను. ఆ యధికారులు 'మిమ్ము గుఱించియే విచారించు చున్నాము' అని. 'ఇప్పుడు వేఱే ఖర్చున్నది, మఱియొకసారి' యని, 'మీలో మీ కైకమత్య ముండవలయును. పోట్లాడుకున్నచో నె' ట్లని సమాధానములు చెప్పుదురు. కొన్నిమట్టికుండ లెక్కువ జోక్యము కలిగించుకొనకుండ దూరముగనే యుండును. ఎవరి యింటికిఁ బోయినను బూర్వము సుబ్బన్నపేటలో మంచినీరు లే దనుమాట లేదు. ఇప్పు డెవరియింటికైనఁ బోయి మంచితీర్థ మడు

గుడు. "వీథిలోఁ గొళాయియుండఁగా నిచ్చటి కేల వచ్చితివి? ఒక్క కుండ నిండునప్పటికే మా కాయుస్సు నిండుచున్నది. వెళ్ళు, వెళ్లు" అని యుచ్చాటన చేయుదురు.

విద్యుద్దీపములు వచ్చినవి. ఇంజనీయరులు పంపుల కొరకుడు, దీపముల కొరకుడు- నెల కైదువంద లైదువందల జీతగాండ్రు, సాలునకు పన్నెండువేలు, సుబ్బన్నపేట నిమ్మనుచుండిరి. ఇదివఱకు దీపములు వెలిఁగించుచాఁకలివాండ్రు పాతికమంది తీసివేయఁబడిరి. వారికి నెలకు పదిరూపాయల జీతము. పాతిక మందులు రెండువందల యేఁబది. ఇంజనీయరు కీయవలసిన జీతములో సగము సమకూర్చి నట్లయినది. ఆ చాఁకళ్ళు గుడ్డలుతుకుటకుఁగూడఁ బనికిరాకపోయిరి. తక్కువ జాతివారికి పేదవారికి సున్నలుచుట్టి యెక్కువకులము వారికి ధనవంతులకు నుద్యోగము లిచ్చిరి. విద్యుద్దీపములు వెలుఁగుచుండెను. చంద్రారెడ్డి యొకనాఁడు దారివెంటఁ బోవుచుండెను. మఱల నతనియుంగరము జాఱిపడెను. వెదకెను. కనిపించలేదు. దీపము తీసికొనిరమ్మని యెవరినైన నే మని యడుగును. లక్షలుపోసి తెచ్చుకొన్న దీపములు దివిటీలవలె వెలుగుచుండెను. ఉంగరమేమో కనిపించదాయెను. సుబ్బన్నపేఁటలోని దీపములేమో యెఱ్ఱమొగము పడెను. బల్బులలో లోభించి, తక్కువ 'వోల్టులు' గల బల్బులు తెప్పించిరి. అవియేమో యెఱ్ఱగాఁ గాలును. ఉంగరముకోసము మఱల నటునిటు చూచెను. దీపములు వానివెంట నేమి దురభిమానము తెచ్చెనో, యుంగరముకొఱకు వెదకుచున్నట్లు కనఁబడుటగూడ రెడ్డికి తప్పనిపించెను. రెడ్డి తనదారిని దాఁ బోయెను. మఱునాఁ డొకధనవంతుఁడు దారినిబోవుచు నాయుంగరముచూచి తాను దీసికొనిపోయెను. ఆ యుంగరము బీదవాని కొకనికి దొరకరాదా? ప్రతి రోజు ప్రొద్దునను మన్నంతయుఁ బ్రోగుచేసి, చేటలతోఁ జెరగు కొందురు. కన్నంచి ప్రతిగోడపక్కఁ జూచుచుఁ బోవుచుందురు. పాకీవాండ్రకు దొరకరాదా? వారి కేల దొరకును? దొరకఁదగునీతయే యున్నచో వా రక్లేల పుట్టుదురు? విద్యుద్దీపములు వీథులందు ధగధగ లాడినవి. ఇండ్లలో చీఁకట్లు ముసురుకొన్నవి. పురుగులు లక్షలకులక్షలు దీపములచుట్టు ముసరి మనుజులను దారివెంట నడువనీయలేను. నాటక

ములు చూడనీయలేదు. నిశలయందు మనుజుల నన్నము తిననీయ లేదు. ఈపురుగులు దీపములలోనుండి పుట్టినవా? ఇదివఱకుఁ గనిపించ లేదు. ఇప్పుడు దీపముల వెలుఁగున గనిపించుచున్నవి కాఁబోలు! ధనవంతు లిండ్లలోనికి దీపములు పెట్టించుకొనిరి. ఆ దీపముల కెంత రాజఠీవి! నేను పేదవానియిల్లు తొక్కి నన్నవి. ఇంటిదాఁక నెందుకు? వాఁడున్న సందులోనికే పో నన్నది. పేదవానియిల్లు బిక్క మొగము వేసుకొని దీపములవంకఁ జూచినది. దీపములు వానివంక నే చూడ మన్నట్లుస్తంభములు చాటుపెట్టుకొన్నవి. విద్యుద్దీపములు ధగధగ మెఱసినవి. పేదలకడుపులో భగభగమండినది. పేదవారలు తిండిలేక మలమల మాడుచుండిరి. ఊరికిఁ జివరనున్న యొక్క పాడు వడినమఠములోఁ బైని గప్పులేని నానకొకనియిల్లు, గోడల నాను కొని మఱికొందఱి యిండ్లు– యిండ్లనఁగాఁ బొయ్యిలు మాత్రమే. ప్రొయ్యిలనఁగా మూఁడుఱాళ్ళు. ఆఱాళ్ళున్నచోట నిల్లు– ఆయిల్లొ క్కొక్కప్పు డేదైన గోడ కానుకొనియుండును. మఱి యొకప్పుడు నిరాలంబముగ నుండును. పురపాలకసంఘ మనఁగాఁ బురములోనుండి పన్నియఁగలవారిని బాలించుసంఘము. ఆస్తిగలవారిని బాలించుట యనఁగా వారివద్దఁ బన్నులువసూలుచేసి యందులో ననేక దేవతలకు నైవేద్యములు తీసి, తక్కినవారి కిదిగో యని సుఖముకానిది సుఖ మని చెప్పి చూపించుట. పసివానికి రూపాయ యిమ్ము. వాఁడు నా కది వద్దని కానీకొఱ కేడ్చును. వాఁడు కానీకి పదునొకండు రూపా యలు వచ్చు ననుకొనుచు. పసివానిని 'తెలివితక్కువవాఁడా' యనుము. వానికిఁ గోపము వచ్చును. పట్టణ మన్నది: "నేను మీకు సుఖముగా వెలుఁగిచ్చినాను. సుఖముగా నీ రిచ్చినాను." ధనవంతుఁ డన్నాడు: "ఛీ! నీ విచ్చిన దేమిటి? నేను డబ్బు పెట్టి తీసికొన్నాను." చాలినంతధనములేక సుఖభ్రాంతికలవాఁ డన్నాఁడు: "ఇదివఱకు డబ్బు పెట్టి నీరు కొనలేదు." వెలుతురు కావలెనని దిగులులేదు. పవిత్ర మైన నీరును బవిత్రమైనజ్యోతిస్సును వెలయాండ్రకన్నకనాకష్టమైనవి.

ఒక గ్రుడ్డివానిని నొకకుంటివాఁడు కఱ్ఱపుచ్చుకొని తీసుకొని పోవుచుండెను. కుంటి– మనయూరిలో విద్యుద్దీపములు వెలిఁగించిరి. గ్రుడ్డి—అనఁగా సూర్యునియంత వెలుఁగుండునా? కుంటి—రాతిరు

లం దంతకన్న వెలుఁగుండును. గ్రుడ్డి- పగలు? కుంటి- పగలు దీపము లెందుకు? గ్రుడ్డి- న న్నొక దీపమువద్దకు దీసికొని పొమ్ము.

కుంటివాఁడు వానిని దీసికొనిపోయి, నాల్గురోడ్లు గలసిన యొకవిద్యుద్దీపికా స్తంభమువద్ద నిలుచుండఁబెట్టెను. గ్రుడ్డివాఁడు 'వెలుతు రేది' యనెను. కుంటివాఁడు 'గుడ్డిముండకొడుకవు నీ కేమి కనఁబడు' ననెను. వాఁడు "నాకుఁ గనిపించ కేమి? కన్ను లేక పోయినఁ గనుపించ దేమి? ఈ దీపము వలన నాకుఁ గనుపించు దానిలో నెక్కువ తక్కువలు కలుగుట లేదు. ఇది నిజమైన దీపము కాదు పో" యనెను. అచట నందఱు నవ్విరి. గ్రుడ్డివాఁ డనుకొనెను: "పిచ్చివాఁడను నేనా, వీరా?"

విద్యుత్తంతులెకుఁ దగిలి రోజుకు నాలుఁగై దుపక్షులు చచ్చు చుండెను. ఆ ముసలిచెట్టు చెప్పినమాట నిజమే- ఊరిలో వెలుతురు. వెలుతు రింత మలఁగెనా చీఁకట్లు జీవములువదలిన శవములవలె నుండెను.

# ఇరువదియొకటవ అధ్యాయము

గణాచారి యన్నగారిభార్య రంగమ్మకుఁ జిన్నప్పటినుండియు నాఁడుబిడ్డ యింటిలోఁ బనిచేయుచుండఁగాఁ దానుపోయి కొంచెము చిఱుపెత్తనముచేయుట యలవాటు. తనకొడుకుల నిద్దఱిని నాగమ్మకు వదలిపెట్టి, తాను సాయంకాలమున వాహ్యాళి పోవును వాహ్యాళి యనఁగా నైదారేండ్లకుఁ బూర్వము వఱకును వట్టి గ్రామ సంచారమని యర్థము. పదిపన్నెండ్లకుఁ బూర్వము కాఁపుభార్యలందఱును బొలాలకుఁ బోవుట, గడ్డియు జొన్నయుఁ గోసితెచ్చుట చేయుచుండిరి. పైరుగాలితగిలి యెల్లరు నారోగ్యవతులుగా నుండిరి. మెట్టపోయి పల్లమైనతరువాత మాగానిలోఁ గాఁపుభార్య చేసెడిపని యేమియు లేదు. ఊడ్చినను గోసినను గొల్లవాండ్రును, మాలెతలును. ఇంటిలోనికి నీరు మగవాఁడే తెచ్చును. రాటము మూనివేసిరి. కాఁపుభార్యకుఁ బనియేమి మిగిలినది? ఆమె కూడుమాత్ర ముడుకవేసిపెట్టుట మిగిలినది. పాలు తీసినను పేఁడ వేసినను పాలేరువాఁడు చేయుచుండెను. కాఁపుభార్య నిర్వ్యవసాయుగా లయ్యెను. మాగాని వచ్చినప్పటినుండియు రైతుభార్య తాను రైతుభార్య ననుకొనలేదు; దొరసాని ననుకొన్నది. కొన్నాళ్ళు దొరసాని ననుకొనుటతోనే తృప్తిపడినది. తరువాత వేషముచేత దొరసానిగా మారినది. జపాను సిల్కుచీరలు, పట్టురైకలు, చిత్రవర్ణములదుస్తులు, తలనూనెలు, సబ్బుబిళ్ళలు, పిన్నులు, జడచివరపట్టుపీలికలు, కాళ్ళకు నందెలు తుమ్మకాయగొలుసులు పోయి పాంజేబు పట్టాలు, మెడలోఁ బట్టెడనాను కాసులపేరు పోయి గడియారపుగొలుసు, తలమీఁద రాగిడి చంద్రవంకలు పోయి ప్రక్క పాపటలు, అడ్డబాసపోయి యర్ధచంద్రాకారపు మదరాసు ఱాతిముక్కుపుడకలు, చేతులకు మురుగులు గొలుసులు పోయి బంగారపుగాజులు క్రమక్రమపరిణామముపొందెను. మొదటికాఁపు రెండెకరములపొలము గలవాఁడు. ఆ యింట గణాచారి వెలసి, పొదుపు చేసిపెట్టినది. ఆ యింటఁ దా నొక్కతెయే కూఁతురు. పెండ్లి లేదు. ఆ ఖర్చు లేదు. ఎప్పుడు నొక్కఁడే కొడుకు.

ఇంట నైదుగురికన్న నెక్కువ యెప్పుడును లేరు. దైవభక్తి, ధర్మాచరణములతో నదేయదే నెమ్మదిగా వృద్ధిపొంది పాతికయెకరముల దాఁక వచ్చి, రంగయ్య గ్రామములో నొక రకమైన యాసామి యయ్యెను. మాగానియాళ్ళలో నీ దినములలోఁ బాతికయెకరముల యాస్తి యన్నదనఁగా వానికి భూమ్యాకాశములు పట్టవు. రంగయ్య నాఁటికి నతనివంశపూర్వమర్యాద చెడలేదుగాని యతనియింటిలో మార్పులు జరిగినవి. తనకడుపునఁ దొలిచూలు స్త్రీ నిలువలేదు. కుమారు లిద్దఱు కలిగిరి. వ్యవహారము క్రొత్తదారి పట్టెను. మాగాని యాళ్ళలో నెక్కువమంది యువకులవలెనే రంగయ్యాసైతము దురహంకారియు, గర్వియు నయ్యెను. దైవము వారియింటనుండి వెడలి పోవుటకుఁ బదియేండ్లక్రిందనే నిశ్చయించుకొనెను. అతని మనస్సులో నహంకారముగాని, గర్వముగాని తొలఁగించుటకుఁ బ్రయత్నించలేదు. రంగమ్మ నేఁడు పరమాధునికస్త్రీవలె నుండెను. ఆమె కొంతయింగ్లీషుకూడఁ జదివెను. కడచిన యాఱేండ్లలో వారి యింటిలో నొకవిచిత్రపరిస్థితి యేర్పడెను. రంగమ్మముట్టుకొన్న యన్నము గణాచారి తినదు. ఎందుకుఁ దినరా దని రంగమ్మ. గణాచారి సమాధానము చెప్పదు. ఒకదానికిఁ జెప్పునుగనుకనా, దీనికిఁ జెప్పుటకు ? రంగమ్మయింటికి నామెకుఁ బాఠములు చెప్పుటకు హిందూక్రైస్తవ స్త్రీలు వత్తురు. రంగమ్మ వారితోఁ జావడిలోఁ గూర్చుండును. నాగమ్మ దొడ్డిలోఁ బోయి కూర్చుండును. ఆధునిక నాగరికతాచిహ్నములైన వస్తువు లెచ్చటనున్నను నాగమ్మ దూరదూరముగాఁ బోవును. రంగమ్మ కోపగించుకొనును. నాగమ్మ మాటాడదు.

ఒకనాఁడు రంగమ్మకుఁ బాఠముచెప్పుటకువచ్చిన క్రైస్తవ స్త్రీ "తాను వచ్చినంతనే నాగమ్మ దొడ్డిలోనికిఁ బోవు నే" మని యడిగెను. రంగమ్మ 'యామె గణాచారి'యన్నది. క్రైస్తవి నవ్వెను. రంగమ్మయు నవ్వెను. తరువాత గణాచారి నిద్దఱునుగలసి యే మనుకొనిరో కాని. రంగమ్మ రెండవకొడుకు వాకిటనున్న వేఁపచెట్టుపంగలలో కెక్కి క్రిందఁబడెను. వానికిఁ గాలు విఱిగినది. కాలు నెమ్మదించువఱకును రంగమ్మకుఁ జదువు సాఁగలేదు. మఱియొకనాఁడు

క్రైస్తవి నాగమ్మను బిలిచెను. నాగమ్మ కన్నులెఱ్ఱచేసి చూచెను. క్రైస్తవి భయకంపితయై యానాఁడు పోయి జ్వరపడెను. ఆ జ్వరము జ్వరము మశూచికములోనికి దించెను. అప్పటినుండియు నామె రంగమ్మయింటికి రాలేదు. మఱొకక్రైస్తవి వచ్చుచుండెను. ఆ పూర్వపుస్త్రీ యామెతో 'గణాచారితో మాట్లాడకు' మని మంద లించి పంపించెను.

పట్టణములో విద్యుద్దీపములు ప్రకాశించుచుండెను. అవి ప్రకాశించుటకుఁ బట్టుచీరలు, రతనములనగలును గావలసివచ్చెను. అంతదీపములు వట్టిఱాళ్ళమీఁదఁ బ్రకాశించి యేమి ఫలము? వెల ఱాళ్ళమీఁదఁ బ్రకాశించవలయును.

ఒకనాఁడు ప్రొద్దు గ్రుంకినది. వెంటనే చీఁకటిపడినది. ఆ నాఁడు గణాచారి ప్రొద్దుననే లేచి, స్నానముచేసి ప్రతిదినమువలెఁబనిచేయక కూర్చుండెను. రంగమ్మ తానును బ్రొద్దుననే లేచి తలదువ్వుకొని స్నానముచేయకయే క్రొత్తచీరఁదాల్చి గ్రామమువెంటఁ బోయెను. ఆమె గ్రామములో నున్న బాలికాపాఠశాలకుఁ బోవును. అచ్చట నున్న క్రైస్తవోపాధ్యాయులందఱు నామెకు స్నేహితురాండ్రు. అచటినుండి చంద్రారెడ్డియింటికిఁ బోవును. చంద్రారెడ్డి భార్య సీతారామమ్మయు, రంగమ్మయు మిత్రములు. అచటినుండి మఱి కొందఱు స్త్రీలను గలుపుకొని యింటికి వచ్చును. వచ్చువేళకు జామున్నఱ ప్రొద్దెక్కును. అప్పటికి నాగమ్మ వంటచేసి సిద్ధముగా నుంచును. ఈ రోజునను రంగమ్మ ప్రొద్దెక్కియే వచ్చెను. వచ్చు నరికిఁ బొయ్యిలోఁ బిల్లి లేవలేదు. రంగయ్య గ్రామములో లేఁడు. వదినెగారు వచ్చి నాగమ్మను 'వంట యేల చేయలే' దనెను. ఆమె సమాధానము చెప్పదని రంగమ్మకుఁ దెలియును. అయినను నడిగి నది. ఆశ్చర్యముగా నాగమ్మ సమాధానము చెప్పినది: 'ఈనాఁడు నే నుపవాసము.'

రంగ- నేనును బిల్లలో? నాగ- మీరు నుపవాస ముండిననే మంచిది. రంగ- నే నుండలేను. నాగ- పిల్లలకుమాత్ర మన్నము పెట్టకుము. రంగ- వాండ్రు చచ్చిపోవలయు ననియా యేమి నీ యుద్దేశ్యము? నాగ- బ్రదికియుండవలె ననియే. రంగ—ఇఁక వంట

చేయుము. నాగ—నేఁ డిఁకనాడు ద్రవ్యములు ముట్టుకొనను. రంగ—నాకు భోజన మెట్లు? నాగ—ఆఁడుదానవు, వంటచేసికొనవలయును.

రంగమ్మకుఁ గోపమువచ్చి నాగమ్మమీఁద విఱుచుకొనెను. నాగమ్మ మౌనమే యవలంబించెను. చివరకు రంగమ్మ వంటచేసికొని భోజనముచేసెను. బియ్య మెన్ని పోయవలయునో తెలియలేదు. తన కాఁకలిగా నున్నది. అన్న మొకమూల బియ్యము. పచనమైనభాగము తనకే చాలలేదు. పిల్లలకు మిగుల లేదు మఱలఁ బ్రొయ్యిమీఁద బియ్యముపెట్టుటకు నిప్పార్చివేసెను. లోపలఁ గోపము మండు చుండెను రంగమ్మ వంటజేయుట మిషనరీస్త్రీలతో మాట్లాడినంత తేలిక కా దనుకొన్నది. అప్పటికిఁ బ్రొద్దు తిరిగినది. గ్రామాంతరము పోయిన రంగయ్య తిరిగి వచ్చెను. అతఁడు భోజనముచేసియే వచ్చెను. ఇంటికి వచ్చుసరికి గణాచారి రాటము వడకుచుండెను. తన భార్య నెత్తురుత్రావినయాఁడుపులివలె రోఁజుచుండెను. పిల్లలిద్దఱు నాటలమీఁద నాఁకలి మఱచిపోయి వీథిలో నాడుకొనుచుండిరి. అతఁడు వచ్చి భార్యను బరామర్శించెను. గంటసేపటికి సంగతి యంతయుఁ దెలిసెను. అతఁడు గణాచారి నెప్పుడు నేమియు ననఁడు. 'అమ్మా' యనియే పిలుచును. ఆమెవద్దకుఁ బోయి 'అమ్మా! నేఁ డుపవాస మెందు' కనెను. నాగమ్మ తలయెత్తి, కనుఱెప్పలెత్తి, మఱలఁ గనుఱెప్పలు వంచి, తలదించి, రాటము వడకుచుండెను. రంగయ్య సమాధానము రాదని తెలిసికొని యూరకుండెను. అతఁడు గ్రామములోనికిఁ బోయెను. 'ఆఁడుపులి' ప్రొద్దుక్రుంకు వేళకుఁ జల్లని గాలిసాఁగి యడవులవెంట బయలుదేఱెను. తిరిగితిరిగి రెండుమూఁడు జంతువులను జంపి యింటికిఁ జేరెను. రాతిరి ప్రొద్దుపోయినది. మఱల నన్నము వండుకొనవలయును. పిల్లలు వీఁపంటుకొనిన కడుపులతో నిద్రపోవుచుండిరి. వంటచేయుటకు రంగమ్మ పిడకలు తేవలె నని దొడ్డిలోనికిఁ బోయెను. పిడకల గుడిసె దొడ్డిలో నైరృతిభాగమున నున్నది. లాంతరు లున్నను నాగమ్మమీఁది కోపముచేతఁ జీఁకటి లోనే పోయెను. దొడ్డిలో నాగమ్మ పెట్టినపాదులన్నియుఁ బందిళ్ళఁ మీఁదఁ బ్రాఁకి ద్రాక్షతోఁటవలె రమ్యముగా నుండెను. దొడ్డి లోనికిఁ బోయిన రంగమ్మకుఁ బ్రతిపదమున నేదియో ప్రాఁకు

చున్నట్లే భయమయ్యెను. తాను నడచినచో నాధ్వనియుఁ దనవెంట నడచి వచ్చుచుండెను. తా నాఁగినచో నాఁగుచుండెను. తొందరగా నడచుటకు రంగమ్మకుఁ గాళ్లు రాలేదు. మఱల నింటిలోనికిఁ బోయి దీపము తెత్తునా యనుకొనెను. దీపము తెచ్చులోపల పిడుకల గుడిసె వద్దకే పోవచ్చును. దీపము లేకుండ పిడుకల గుడిసెలోఁ జేయిపెట్టుట యెందులకు? పోయి దీపము తెత్తునే యనుకొన్నది. వెనుకకుఁ దిరిగినది. తనవెంటనే మఱల నా కదలిక వచ్చుచుండెను. తొందరగా నింటిలోనికి వచ్చి దీపము తీసికొని బయలుదేఱినది. భర్త యింటికి రాలేదు. పిల్లలు నిదురపోవుచుండిరి. నాగమ్మను బిల్చుట కిష్టము లేదు. తోడులేకుండ దొడ్డిలోనికిఁ బోవుటకు భయము మనిపించినది. 'ఒకర్తుకను బట్టణవీథులవెంటఁ బ్రొద్దుపోవువఱకుఁ దిరిగి వచ్చుచుండుటలేదా, భయ మెందు' కనుకొనెను. సాహసించి దొడ్డిలోనికిఁ జొచ్చెను. తన కెడమవైపున నేదియో పాఁకుచున్నట్లు తోఁచెను. లాంతరు పెద్దదిచేసి చూచెను. ఏమియుఁ గన్పించలేదు. మఱల నాలు గడుగులు వేసెను. ధ్వని యీసారి కుడివైపున వినిపించెను. కుడి వైపుననన్నియుఁ బాదులు. దీపముపెట్టి చూచెను. ఆకుపచ్చని యాకులు, పసుపుపచ్చని పూవులుగాక మఱియొకటి కన్పించలేదు. మఱల నాలుగడుగులు వేసెను. తనకన్న ముందు పా మేదో నడచుచున్నట్లు తోఁచెను. దీపమెత్తి వెలుతురు ముందొకరెండుగజముల దూరమునఁ బడునట్లు చేసెను. మఱల నేమియుఁ గనుపించలేదు. ఆమె వెనుదిరిగి యింటిలోనికిఁ బోద మనుకొన్నది. పొద్దునఁగూడ నన్నము సయించలేదు. అన్నము ననుపాయిలతుకగా నున్నది. ఒక సగము బియ్యమే. ఈ పూఁటనైన వండుకొని తినకున్న బ్రదుకలే ననుకొని మఱల బయలుదేఱెను. పిడుకలగుడిసెవద్దకుఁ బోవువఱకు నేమియు ధ్వనిలేదు. లాంతరెత్తి గూఁడులోఁ జూచి పదిపిడుకలుతీసి పళ్ళికలో వేసికొని, పళ్ళిక బుజమున నుంచుకొని, కుడిచేతితో లాంతరు పుచ్చుకొని బయలుదేఱెను. అమెకన్న ముందేదో నడచుచుండెను. ఆమె యాఁగినది. ముందు నడచుచున్నట్లు ధ్వనిలేదు. 'దొడ్డి యింతపెద్దదొడ్డి యేమిటి? నాగమ్మ చేదస్తముగాఁ బోయిన దొడ్డినిండ నిన్నిపాదు లేమిటి? పాదు లున్నచో పురుగుపుట్ట చేరును.

వెధవది బేడ పాఱవేసినఁ గూరలు కొనవచ్చును. దానికోసము దొడ్డియంతయు మహారణ్యమై పోయినది. అడుగుపెట్టుటకు వీలులేదు. ఆకాకునడుమను బా ముండవచ్చును.' రంగమ్మ మఱి రెండడుగులు వేసెను. సాఁగుచున్నపామును గొంచెము వేగముగా సాఁగెను. రంగమ్మ 'పోనీలే. వెనుక వచ్చు పామునకు భయపడవలయును గాని, తనకన్న ముందుఁబోవుపామునకు భయపడుట యెందుల' కనుకొనెను. రంగమ్మ రెండడుగులు ముందు వేసెను. పాము రెండడుగులు వెనుకకు వేసెను. ఆమె భయపడెను. 'పిడుకలగుడిసె దొడ్డిలో నింతమూల కట్టుకొనుట యేమిటి?' యనుకొనెను. ఎంతమూలఁ గట్టుకొనిన నేమి, ప్రొద్దుండఁగాఁ బిడుకలు తెచ్చుకొన్నచో? పిడుక లెవరు తేవలయును? వంటచేయువారు తేవలయును. తాను వంటచేయుదుకదా! మఱి రేపటినుండి నాగమ్మవంట చేయకపోయినచో వంటవానిని బెట్టుకొనవలయును. అవు నప్పుడు సుఖముగా నుండును. అప్పు డొక యంతర్వాణి యున్నది: 'నాగమ్మమూలమున సంసారము గుంభనగా నున్నది; పచ్చపచ్చగా నున్నది. వంటవాఁడు వచ్చెనా, సంసారము గుల్లయై పోవును.' రంగమ్మ నిలుచుండి యాలోచించుచున్నది. ఇంక రెండు గజములలో నింటిలోనికిఁ బోవును. వెంటవచ్చుచున్న పాము రెండు గజములలోపుగానే యూఁదిపోవునేమో! ఒక్క గంతులో నింటిలోఁ బడవలె ననుకొన్నది. ఇక్కడఁ గాలుతీసి యింటిలోఁ బెట్టవలయును. పా మేమి చేయగలదు? చేతిలో దీప మున్నది. పా మెచ్చట నున్నదోమాత్రము తెలియుటలేదు. అనుకొన్నట్లే యొక్క దూఁకుదూఁకి యింటిలోఁ బడినది. పడినదేకాని, తనయొడలు దనకుఁ దెలియలేదు. అప్పుడే రంగయ్య యింటికి వచ్చెను. గణాచారి 'భార్య యింటిలో విఱుచుకొని పడిపోయినది. పోయి చూచుకో' మ్మనెను. అతఁడు గాబరాపడి లోనికి బోయెను. రంగమ్మనోట నురుసులు గక్కుచుండెను. గణాచారి లోనికి వచ్చెను. రంగయ్య 'అమ్మా! నీ వున్నా వనుకొన్నాను. ఇట్లు చేసితి వే' మనెను. నాగమ్మ 'నే నున్నా ననుకొని పదియేం డ్లయినది. ఉన్నానుగనుకనే యిన్నినా ళ్ళాఁగినది. భయము లేదు. ఏమిటో దొడ్డిలోనికిఁ బోయి చూచి ర' మ్మనెను. రంగయ్య దీపముపుచ్చుకొని దొడ్డిలోనికిఁ బోయెను. గడ

పలోఁ గాలుపెట్టినంతనే దీపపుఁగాంతులు తేజోవిహీనములు కాఁగా, దొడ్డియంతయు వెలుఁగుగా నుండెను. దూరమునుండి రెండువర్తులు కల దీపపుఁబ్రమిదవలె మాణిక్యకాంతులువెలుఁగు రెండుశలతోడి మహాఫణము విప్పి యొకపాము తోఁకపై నిలుచుండెను. రజతదీపస్తంభము. రాజతమైనప్రమిద, రాజతములైన వర్తులు, సువర్ణకాంతి— రంగయ్యకనులు మూఁతవడెను. నాగమ్మ నమస్కరించెను. రంగయ్య పరవశుఁడైపోయెను. కనిపించిన మహాజ్యోతి నేత్రనిమీలనయే చేసెఁగాని, హృదయోన్మీలనము చేయలేదు. అయిదునిముసములకుఁ దన యొడలు తనకుఁ దెలిసిన రంగయ్య భార్యాచికిత్సావిషయము తలపోసెనుగాని, సుబ్రహ్మణస్వామిమీఁద నూహ పోనీయలేదు. గంట సేఁపటికి భార్య లేచికూర్చున్నది. ఆమె మాటాడినది. వారును వీరును వచ్చి చూచిరి. ఆమె భయపడినదిగాని మఱియేమియు లేదనిరి. తెల్లవాఱువఱకు రంగమ్మ రెండుపాదములు నీలావయ్యెను. ఆమె లేవలేకపోయెను. ఇరుగుపొరుగువారు వచ్చి చూచిరి. గణాచారి దొడ్డిలో నేమో పాడుచుఁ గూరలు త్రుంచుచుండెను. అందఱును గణాచారి వద్దకుఁ బోయిరి. ఆమె 'రెండుశిరస్సులనాగు రివ్వురివ్వున వచ్చి, ఇంటికోడలి పురుగూఁ జెంది దొడ్డిలో' అని పాడుచుండెను. నలుగురు నువచ్చి రంగయ్యతోఁ "బురుగూఁడుటయేగాని కఱవలేదు. గణాచారి పాడుచున్న" దనిరి. రంగయ్య పాముమంత్రగాండ్రను బిలువఁ బోయెను పా మడ్డము వచ్చెను. నలుగురును బోవ ద్దనిరి. అతఁడు మానెను. వారము రోజులు క్రమక్రమముగా వాఁపు తగ్గుచు వచ్చెను. గణాచారి యన్నము వండిపెట్టుచుండెను. పా మాదివారమున నూఁదెను. మఱల నాదివారమునాఁడు రంగమ్మ లేచి తిరిగెను. గణాచారి రంగయ్యతో నన్నది: "అబ్బాయీ! సుమారు మూఁడు వందలయేండ్లు నేను నీయింటిలో నున్నాను. ఇంటిలో నా ప్రభుత్వమే సాఁగినది. కాని మఱియొకటి సాగలేదు. ఆ రోజులు వెనుకఁ బడినవి. నాకు వేఱే యూరిబయట నీ కున్న రెండెకరములమెట్టలో నొకపాక వేసిపెట్టుము. నే నం దుండెదను. లేదా, స్వామియాలయమునందే యుండెదను. ఈ యిల్లు నే నింత నిలువరా కున్నది" యనెను. రంగయ్య మాటాడలేదు. గణాచారి యింటిలోనుండి

వెడలిపోయెను. పోయి సుబ్రహ్మణ్యేశ్వరాలయముముందు నిలుచుండి నిలుచుండి పొద్దుక్రుంకువఱకు నాగేశ్వరస్వామిముఖమంటపమునందు శయనించెను. గణాచారి మఱల రంగయ్యయింటికి రాలేదు. మూన్నాళ్ళయినతరువాత మేనల్లుఁడుపోయి నాగమ్మను రమ్మనెను. ఆమె రాలేదు. ప్రాతఃకాలముననే యామె చెరువువద్దకుఁ బోవును; స్నానముచేయును; స్వామియాలయములోఁ గూర్చుండును; రెండు జాములకు మఱలఁ జెఱువుగట్టునకుఁ బోవును; అచ్చట నొక్కఱ గంట యుండును. మఱల నాలయమునకు వచ్చును. తటాకము, దేవాలయము – నీ రెండుసంతానములతో నామె గడుపుచుండెను. మూఁడవసంతానము లేదు. నాల్గునాళ్ళు లామెకుఁ దిండి లేదు. ఎవరు నడుగరు. ఎవరికి శ్రద్ధపట్ట లేదు. ఈ సంగతి ధర్మారావునకుఁ దెలియదు. అతఁ డొకనాఁడు నాగేశ్వరాలయమునకుఁ బోయెను. అచ్చట గణాచారి యస్థిపంజరమువలెఁ గనిపించెను అతఁ డింటికిఁ బోయి యన్నము తెచ్చి తటాకమువద్దకుఁ బోయెను. రెండుజాము లైనది. ఆమె యచట భుజించెను. మఱునాఁడు నాగమ్మపెద్దమేనల్లుని ధర్మారావు పిలిచి, "నీవు ప్రతిదినము మాయింటినుండి యన్నము తీసికొనిపోయి నాగమ్మగారికిఁ బెట్టుము; సరిగా రెండుజాములకు. మఱచిపోకు" మనెను. అతనిపేరు చంద్రయ్య. చంద్రయ్యకు ధర్మారా వనిన 'మఱచిపోకు' మన్నమాట కొరడాపుచ్చుకొని కొట్టినట్లుండెను. రోజులు గడచుచుండెను.

రంగమ్మయింట నొకగొల్లవానిని వంటకుఁ బెట్టెను. వాఁడు ప్రొద్దుననే లేచి మొగమైనను దోముకొనక వంటచేయును. వంటచేసి పెట్టినతరువాత పోయి ముఖప్రక్షాళనముచేసికొనును. పదిగంటలగు వఱకు నలుగురు నన్నమునకు రావలసినదే. లేకపోయినచో వేత్తే పెట్టుకొని తినవలయును. వాఁడును భోజనముచేసి యెచ్చటికో పోవును. రాత్రికి వచ్చును. అప్పుడు మఱల వంటచేసి స్నానముచేయును. వాఁడు వీథివెంట నడచుచుండఁగా వంటవాఁ డనుకొనుటకు వీలు లేదు; పట్టభద్రునివలె నుండును. పెండలకడ భోజనములతో రంగమ్మ మునుపటికన్న నునుపు తేలెను. దేహమునకుఁ గాంతివచ్చెను. మునుపు బక్కగా, నల్లగా, నారోగ్యవతిగా నున్న యామె లావు

పాటి, మెఱుఁగెక్కి, మనారోగ్యవతి యయ్యెను. కాని యద్దములోఁ జూచి మునుపటికన్నఁ దాను సౌందర్యవతి నైతి ననుకొనెను.

సుబ్బన్నఁపేటకుఁ గ్రొత్తడాక్టరు వచ్చెను. అతని భార్య బి. ఏ. పరీక్షయై యదివఱకే దేశమునఁ బ్రఖ్యాతిపొంది యుండెను. ఆమెవచ్చినంతనే పేఁటలోని స్త్రీజనము తమకు శుభోదయదినములు వచ్చినట్లు సంతోషించిరి. ఆమె స్త్రీసంఘ మొకఁ డేర్పాటుచేసెను. రంగమ్మ సంఘమున కధ్యక్షురాలు. సీతారామమ్మ కార్యదర్శి, పంకజమ్మ, శ్యామల, మంగమ్మ, డాక్టరుగారిభార్య, యిందిరా బాయి, యితరోద్యోగస్థులభార్యలు సమాజమునఁ సభ్యురాండ్రు నలువదిమంది యైరి. పట్టణములలోఁ జందాలువసూలుచేయఁబడెను. జమీందారుగారిదర్శనము చేసిరి వారు సమాజమున కొకస్థలము నందు భవనము నేర్పాటుచేయించిరి. సుసానీ చెన్నపురి వచ్చినది. అచ్చటినుండి రంగారావుగారు నాల్గయిదు రోజులలోఁ దీసికొని వచ్చెను. ఆమెకూడ వచ్చెనేని స్త్రీసమాజము సంపూర్ణవికాసము పొందును. సమాజభవనమున బాడ్మింటనుకోర్టు పెట్టిరి. ప్రతినాఁడు సాయంసమయమున విద్యాధికలైన స్త్రీలందఱు నచటఁజేరి బాడ్మింట నాడుదురు. పింగ్‌పాంగ్, కారమ్సు మొదలైన గృహక్రీడావిశేషములుకూడ సమకూర్పఁబడెను. సభికురాండ్రందఱును బ్రతిదినము సమావేశమగుదురు. రంగమ్మ, మంగమ్మ, పంకజమ్మలు పేఁటలో నున్నవారిలో నింగ్లీషు బాగుగా వచ్చినవారు. వారికి మువ్వురకు నగ్రస్థానము తప్పినది కాదు. కొందఱు నూత్నభావలు, పతివిరహిత లుగూడ సమాజములోఁ జేరిరి. వారు చాటుచాటుగ వచ్చుచుందురు. బ్రాహ్మణ స్త్రీలు-ముండితశిరస్కలు వచ్చుటకుఁ గొంకుచుందురు. వారొకరివద్ద నొకరు సెలవు తీసికొందురు. నమస్కారములు చేసికొందురు. సర్వము పురుషులవలె నటించుటకుఁ బ్రయత్నింతురు. మనస్సులలో దొరసానులవలె నుండవలయునని ప్రయత్నము. డాక్టరుగారిభార్య ఘార్యము పెద్దపెద్ద పట్టణములలో నుండి వచ్చెను. అచ్చట బంతియాడునపుడు, బంతితప్పిపోయినపుడు, తగిలినప్పుడు, తాను కొట్టబోఁగా మఱొకరు కొట్టినపుడు చేయవలసిన కొన్నికూఁత లభ్యాసముచేసి వచ్చినది. అవియన్నియుఁ

శ్వేతస్త్రీలు కూయుకూఁతలు. ఆమెనుజూచి తక్కినస్త్రీలుకూడ నవి నేర్చుకొనిరి. అందులో రంగమ్మ ఫామేదా తేలినది.

ఒకనాఁడు సాయంకాల మాటలైనతరువాత సమాజభవనమున స్త్రీలందఱును గూర్చుండిరి. నానాదేశవార్తలనుగుఱించి ప్రసంగము బలిసెను. ఒకామె యన్నది: 'ఇతరదేశస్త్రీలు రక్షకభటులుగఁగూడ బనిసేయుచుండిరఁట మనదేశమున కంతనాగరకత యెన్నఁటికిని రాదు.' మఱొకయామె యన్నది: 'ఇతరదేశములందు స్త్రీలు శాసనసభలలోఁగూడ నున్నారు. స్త్రీలకువలసిన సౌకర్యములు స్త్రీలే యెఱుఁగుదురు. స్త్రీజన ప్రతినిధులు శాసనసభలలో లేకున్న స్త్రీజనమునకు సౌకర్యములు గుదురవు.' మంగమ్మ యన్నది: 'పురుషులకు స్త్రీలు ప్రేమాస్పదురాండ్రు. వీరికిఁగావలసినసౌకర్యములన్నియుఁ బురుషులు చేయరా?' రంగమ్మ- 'గృహమునందలి సౌకర్యములు మాత్రమే పురుషులు సమకూర్తురు. స్త్రీ బయటికిఁబోయి రాజ్యపాలనాదివిషయముల జోక్యము కలిగించుకొనవలెనని పురుషునకుండదు. అందుచేత నతఁడు జోక్యముకలిగించుకొనఁడు.' సీతా 'రామమ్మ- పురుషుఁడు స్త్రీవలనఁ జాలనాళ్ళుగా సుఖపడుచున్నాఁడు. వంట మనము చేయుటయు, నతఁడు తినుటయు. మన మింకఁ జేతులు కాల్చుకొనలేము.' ఇందిరాబాయి—వంట పూర్వము పురుషులే చేసెడివారు. నలపాకము, భీమపాక మందురుగాని దమయంతీపాకము ద్రౌపదీపాక మనరు. పురుషులుచేయువంటవని పురుషు లెప్పుడో మనమీఁదఁ దోసియుందురు. పంకజమ్మ — నాయుద్దేశములో రాజ్య మేలినది, యుద్ధములు చేసినదియు మనమే. క్రమముగాఁ బురుషులు మనయాశక్తియు నపహరించిరి. ఈ సంగతి ప్రమీలకథవలనఁ దెలియుచున్నది. శ్యామల— సత్యభామ యుద్ధము చేయలేదా? ఇందిర— రాజపుత్రస్థానములో నెంతమంది స్త్రీలు లేరు, యుద్ధము చేసినవారు? మఱొకతె- మనము వ్యర్థప్రసంగము చేయుచున్నాము. రంగమ్మ- పురుషులు తమక్లబ్బులలో నింతకన్నను వ్యర్థప్రసంగము చేయుదురు. ఇందిర- ఒకసారి పురమందిరములో నదేయూరిలోననో యొకసభకుఁ బోతిని. ఆ వెనుక క్లబ్బు. సభయైనంత సేపు లోననుండి పందికూఁతలు, కేకలు, చప్పట్లు, సోడాబుడ్ల మోఁతలు. పురుషున

కౌచిత్యము తెలియదు. వినయ మనునది పురుషగుణము కాదు; స్త్రీ గుణము. మంగమ్మ- చెడిపోనంతవఱకు. రంగమ్మ- మన మేమి చెడి పోయినాము? మంగ- చెడిపోయినది వినయము. సీతారామమ్మ- వినయ మేమియుఁ జెడిపోలేదు. మంగమ్మ- పెద్దవిషయములోఁ జెడి పోయినను ఫరవాలేదు. స్వల్పవిషయములలోఁ జెఱుపు రారాదు. స్వల్పవిషయములందు జాతితత్త్వ ముండును. మనరాజ్యము శత్రువులు హరింతురు - కష్టము లేదు. మఱల నెప్పుడో వారిని మనము జయించవచ్చును. కాని మనలోనున్న స్వాంతత్ర్యేచ్ఛ, శౌర్యము నీ గుణములు చచ్చిపోవు నను- జాతి చచ్చిపోయినట్లే.

రంగమ్మ సీతారామమ్మతోఁ బిగ్గరగా నన్నది: 'ఇదీ, దీని కథ యెవరికిఁ దెలియదు? ఊరికే వేదాంతములు చెప్పు నేమి? తాను వినయవతి, మన మవినయవతులము!' ఆమాటలువిన్న నలుగురైదు గురు నవ్విరి. మంగమ్మ వారు నవ్వినది యెఱుఁగును. తన్నుగుఱించి యెవ్వరే మనుకొనుచున్నారో యన్న విషయ మామెకుఁ బట్టలేదు. కార్యదర్శియైన సీతారామమ్మ యెన్నిసారు లడిగినను మంగమ్మ చందా యీయలేదు. ఆమె రంగమ్మతోఁ జెప్పినది. ఒకనాఁడు రంగమ్మ దారివెంటఁబోవుచు మంగమ్మయింటిలోనికిఁ బోయెను. ఆమె గౌర వించెను. ప్రసంగ మారంభించిరి.

రంగమ్మ- భర్త భార్యను గొట్టితిట్టి బాధించినచో నామె యతనిని వదలుకొనవచ్చును. విడాకులు పుచ్చుకొనవచ్చును. దేశ ములోనున్నస్త్రీలందఱును సభలుచేసి యిట్టితీర్మానములు రాచరికము వారికిఁ బంపించినచో శాసనసభవారు చట్టముచేయవచ్చును. మన గ్రామములోని స్త్రీలందఱును సభచేయుట కాలోచించుచున్నాము. మంగమ్మ- స్త్రీలే భర్తమాటవినక యతనికి బాధ గలిగించినచో నేమి చేయవలయును? రంగమ్మ- పురుషుఁ డిట్టి స్త్రీని వదలివేయు చున్నాఁడు. మంగ- యథార్థము చెప్పుదునా? సత్పురుషుఁడైన భర్తను స్త్రీ పరిత్యజించుచున్నది. పతివ్రతయైనభార్యను పురుషుఁడు పరాభవించుచున్నాఁడు. ప్రత్యేకముగా నెవరిది దోషము లేదు. ఎవఁడో దుష్టుఁడు స్త్రీని బాధపెట్టినను లోకమునందు బహుపురు షులు భార్యలను ప్రేమతోనే చూచుచున్నారు. స్త్రీయందుఁ బురు

షున కున్నంత ప్రేమగౌరవములు పురుషునందు స్త్రీకి లేవు. రంగమ్మ— మీరు స్త్రీజనోద్యమమునకు వ్యతిరేకముగా మాటాడెదరు. మంగ— పని పంచుకొనిచేయుట చక్కనిపద్ధతి. 'ఈపని నీవుచేయుము. నే నీ మిగిలినది చేసెదను' అన్నపుడు 'నీ వాపనిచేయుట యేమి? నేనే యాపని చేసెద'ననుటపనిసానుకూలపడకుండుటకుఁ బ్రథమసూత్రము. ఇది నేఁడు మన దేశమునందు పూర్తిగాఁ బట్టుచున్నది. రంగమ్మ— మీరన్నమాట నాకర్థము కాలేదు మంగమ్మ— లోక మిదివరకు జరుగుచున్నమార్గము చాలబాగుగా నున్నది. ఎక్కడనైన దోషము లున్నచో నా దోషములు పరిహరించవలయును కాని, మూలచ్ఛేదము చేయరాదు. రంగమ్మ—మీ రన్నమాటలు చాల అప్రస్తుతముగా నున్నవి. మంగమ్మ—నిజమే. మీరు వ్యతిరేకముగా ననఁగా జెప్పినాను. నేను విధవావివాహములకు, విడాకులచట్టమునకుఁ జివరకు స్త్రీసమాజములకుఁగూడ వ్యతిరేకురాలను. రంగమ్మ— సమాజములోఁగూడ నుండరాదా? మంగమ్మ—మీ కిద్దఱు కుమారులుకదా! అందులో నొకఁడు పసివాఁడు కావచ్చును. సాయంకాలముల సందెకస వూడ్వవలయును. దీపములు వెలిఁగించుట, ప్రక్కలు వేయుట, పిల్లల కన్నముపెట్టి నిదురపుచ్చుట, వంటచేయుట ఇవన్నియు మీరు సమాజభవనమునకు వచ్చినచో నెవరు చేయుదురు? రంగమ్మ—పరిచారకులు. మంగమ్మ—పరిచారకు లనినంతనే యర్థమేమో తెలియునా ? ధనముకల స్త్రీలుమాత్రమే సమాజములో నుండవలయు నన్నమాట. అనఁగా వారికి మాత్రమే సుఖము, సాయంవాహ్యాళి, లోకవార్తాశ్రవణము, నాగరకత. తక్కిన స్త్రీల మాటయేమి? రంగమ్మ— తక్కిన స్త్రీలవిషయము మనమే యోజించుచున్నాము. మంగమ్మ— ఏ మని ? విడాకులచట్టము కావలయు ననియా ? రక్షకభటులము కావలయు ననియా ? వారిని బోయి కనుఁగొని వారికిఁ గావలసినవి చేయుదుము. రంగమ్మ— వా రందఱును విద్యావిహీనలు. వారి కేమి కావలయునో మనకుఁ దెలిసినంత వారికిఁ దెలియదు. మంగమ్మ—మన కేమి కావలయునో పురుషునకుఁ దెలిసినంత మనకును దెలియదు. మన కిప్పు డీ స్వతంత్రత యెందులకు ? రంగమ్మ—విద్యావిహీనులకు, విద్యావంతు

లకు జ్ఞానములో భేద ముండునుగాని, విద్యవచ్చినతరువాత స్త్రీ పురుషులలో నంతభేద ముండదు. మంగమ్మ—చదువు సమానముగా వచ్చినను జ్ఞానము కొందఱి కెక్కువ, కొందఱికిఁ దక్కువ. రంగమ్మ—పురుషులకన్న స్త్రీలకు వివేకము తక్కువనియా మీవాదము? మంగమ్మ—మొన్న బెర్నార్డుషా వ్రాసినాఁడు- 'స్త్రీలకు స్వాతంత్ర్యము వచ్చి వందయేండ్లైనది. ఒక్క రాజకీయవేత్త్రిగాని, యొక్క మతవిషయికపరిజ్ఞాత్రికాని పుట్టలేదు' అని. రంగమ్మ—లక్షలాదిసంవత్సరములు పురుషుఁడు రాజ్యము చేయుచున్నాఁడుగనుక వారిలో నిన్నాళ్ళయనుభవమువలనఁగొప్పవారు పుట్టవచ్చును స్త్రీకూడ స్వాతంత్ర్యమన్నాళ్ళనుభవించినచో వీరియందును గొప్పవారు పుట్టవచ్చును. మంగమ్మ—పుట్టవచ్చును. సరేకాని, స్త్రీలలోఁగూడ గొప్పవారు పుట్టవలయునని వేయేండ్లు, రెండువేలేండ్లు ప్రయత్నముచేసి స్త్రీలలో మహావ్యక్తులను బుట్టించవలయునా?: పుట్టి వారేమి చేయుదురు? గొప్పరాజకీయవేత్తలైనపురుషులు చేసినపనియేనా? కాక లోకమును దలక్రిందులు సేయుదురా? అంతయేయైనచో నది పురుషులు చేయనే చేయుచున్నారు కదా! ఒకమహాకార్యము జరుగుట ప్రధానమా, అది స్త్రీ చేసెనా, పురుషుఁడు చేసెనా యన్న విచారణ ప్రధానమా? స్త్రీలకుస్వాతంత్ర్యమిచ్చి వేయేండ్లు తత్ఫలము నిరీక్షించుచుఁ జూచుచుందుము. ఆ మహాఫలము నట్లుంచి యీ వేయేండ్లలో నెన్నిదుష్ఫలము లుత్పన్నము లగునో? పూర్వ మున్నట్లుండుటవలన గొన్నిసుగుణము లున్నవి. అవియన్నియు నశించిపోవునుగదా! రంగమ్మ— నశించిపోవలయును. నాశమునుండియే సృష్టి పుట్టును. మంగమ్మ—కొన్ని మహాసూత్రములు ప్రత్యల్పవిషయమునకును బట్టవు. మీ రన్న దొక వేదాంతసూత్రము. నాశనము మఱల సృజన కనుగుణమైనదియైనచో మఱల సృజన కలుగును. చూడుఁడు—చెట్టుకొమ్మ విఱుతుము. అది మఱలఁ జివురువేయవచ్చును. చెట్టు తగులఁబెట్టుము. చిగుర్చుట యెట్లు? క్రూరవానికి దుర్బుద్ధి పుట్టును. దానిని నాశనముచేయుదును. అప్పుడు సద్బుద్ధి కలుగును. దుష్టమైనవానిని నాశనము చేసినచో మంచిది పుట్టును. మంచిని నాశనము చేసినచోఁ జెడ్డపుట్టును. పుట్టునది మంచియూ, చెడ్డయూ విచారించుకొ

నవలయును. ఏదోసృష్టి జరుగును,జరుగునని యుబలాటపడిన ఫలితము లేదు. ఆ జరుగఁబోవుసృష్టి నిశ్చయముగా నిప్పటిదానికన్న నుత్తమమైనదైనచోఁ బ్రస్తుతమైనదానిని నాశనముచేయును. మొగిలునీరు నమ్మి చెరువుకట్ట త్రెంచుకొనువారు హైందవులకన్న నిప్పటిలో మఱెవ్వరును నాకుఁ గనిపించలేదు. రంగమ్మ— మీమాటలవలన నాకుఁ జాల విచారము కలుగుచున్నది. స్త్రీ స్వాతంత్ర్యములేకపోవుట వలన జాతిలో సగము వికాసశూన్య మగుచున్నది. మంగమ్మ—ఇది యెవరో యన్నమాట. పానవాజ్ బీగము మొన్న నీమాటయే యన్నదికదా! మొన్న పత్రికలో వచ్చినది. సరేకాని, జాతివికాస మనఁగా నేమి? అది చెప్పుఁడు. ఆ మాటకు మొదట నర్థనిర్ణయమైనచో సగముజాతి వికాసరహితముగనున్న దని నే నొప్పుకొందును. రంగమ్మ మఱల మాటాడలేదు. మంగమ్మ—పరులమాటలు ముక్కునఁ బెట్టుకొని చెప్పుటవలన వచ్చిననష్ట మిది. ఎవరో యొకమా టందురు. ఆ మాటలో నవయవార్థము తెలియదు. ఏదో తెలిసిన ట్లుండి మనము వారివెంటఁ బరువెత్తుదుము. బుద్ధిమంతులు ప్రతిశబ్దార్థమును మొట్టమొదట నిర్ణయించుకొనికాని మాటాడరు. రంగమ్మ—మీచందా యిచ్చెదరా? మంగమ్మ—ఎంత? రంగ—ఆఱునెలలనుండి మీరీయలేదట, పన్నెండురూపాయలు.

మంగమ్మ డబ్బిచ్చి, 'ఇంత చందా యెందుకండీ?' బంతులు, బ్యాటులు, పరదేశపు ఆటసామానులు- వీవలన వ్యయ మెక్కువగుచున్నది. గృహక్రీడ లని పేరు. వానికిఁ గావలసిన వస్తువులకు ధనవ్యయము. వామనగుంటలు, పచ్చీసు గృహక్రీడలు గాకపోయినవా? వాని కింత వ్యయములేదే! పురుషులను జూడుఁడు! టెన్నిసు ఆడెదరు. ఒక్కొక్క బ్యాటు పాతికరూపాయ, లేఁబది రూపాయలు. బంతులకు ఖర్చు, వలకు ఖర్చు, క్రింద కంకరఖర్చు - నెలకు రెండు వందలకుఁ దక్కువ కాదు. రెండువందలతోఁ బదునేను బీదసంసారములు బ్రదుకవచ్చును. మనసమాజమున కిప్పు డగుచున్న వ్యయముతో నెల కైదువందలమంది బ్రదుకవచ్చును. జమీందారుగారు మనకు భవనము కట్టించి యిచ్చిరి. ఊరిబయట నొక పెద్ద సావడి వేయించినచో బిచ్చగాండ్రుండ నుండవచ్చును? మీ రందఱు

నషికాములభార్యలు, ధనవంతులభార్యలు. అందుచేత ధనము మీ కిచ్చెను. కోటముందు బిచ్చము దొరుకుచున్నదో లేదో! 'ఎండిన యూళ్ళకో దేబిరింపఁ డెవ్వఁడు, పండినయూళ్ళకు బ్రసవు లంపకము' అన్నట్లు లేనివాఁడు కలవానికే పెట్టును, కలవాఁడు కలవానికే పెట్టును. నీవు సమృద్ధిగాఁగల సుబ్బన్నపేటలోఁ గోళాయిలు పెట్టిరి. గుంటూరులోఁ బెట్టరాదా? నరసారావుపేటలోఁ బెట్టరాదా? కృష్ణాజిల్లా భూములకు బంగారపుఁగాలువలు త్రవ్వించిరి. మహోపకారము చేసిరి. పల్నాటి తాలూకావారికిఁ గాలువ లేవి? దత్తమండలము వారికి నీటిసదుపాయ మేది? వారు బ్రదుక నక్కఱలేదు కాఁబోలు! లోకమును సముద్ధరించుట యచ్చట నే మైనది? రంగమ్మ—మీకు: జందాయిచ్చుట యిష్టములేనిచోఁ దీసికొనుఁడు. మంగమ్మ—ఏదో నోటిమాటలే కాని నేనుమాత్రము తక్కువ తిన్నానా? తీసికొని పొండు! రంగమ్మ వెడలిపోయెను. తరువాత గొన్నాళ్ళవఱకును మంగమ్మను దక్కిన స్త్రీలందఱు సందేహదృష్టులతోఁ జూడసాఁగిరి. ఒకనాఁటిసాయంవేళ విధవావివాహప్రస్తావన వచ్చెను. "పురుషులందఱు భార్య పోయినంతనే వివాహములు చేసికొనుచుండిరి. స్త్రీల కేల మఱలఁ బెండ్లిండ్లు కారాదు?" అని రంగమ్మ యనెను. మంగమ్మ—పురుషులు చేసికొనుచుండి రందువు. పురుషు లెవరు చేసికొనిరి? రెండవ పెండ్లిండ్లు కాక లక్షమంది యుండిరి. వివాహము లెవరి కగుచున్నవి? ధనవంతుల కగుచున్నవి. తండ్రి కుమార్తె నెవరి కిచ్చుచున్నాఁడు? వాఁడు చచ్చినచోఁ దనకూఁతున కన్నమునకు లోపము లేదని యెవని ననుకొనునో వాని కిచ్చుచున్నాఁడు. బీదవాని కిచ్చుచున్నాఁడా? తండ్రికనుక తిండిమాట విచారించుచున్నాఁడు. కాని స్త్రీ తనంతఁ దానే వివాహ మాడినచో ననురూపవరుని వెదకికొను నని కొంద ఱందురు. అనురూపవరుఁ డనఁగా నానురూప్యము దేనియందు? వయసునందా? కులమునందా? భావములందా? అన్నిటియందు నెచ్చటను లేదుకదా! కుల మక్కఱ లేదుకదా! మనోభావములు తాదృగ్వివాహములు చేసికొనువారికి నిరంతర మనురూపమేకదా! మిగిలినది ధనము, వయస్సు. వయస్సుమాట యట్లుంచి ధనము, అధికారముకూడ ఘటముక్రిందనే లెక్క.

ఒక యఱవ బ్రాహ్మణునికూఁతురు మహమ్మదీయుఁడైన పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరును జేసికొన్న దఁట. అతఁడు నలువది యేండ్ల వాఁడు. ఈమె పదునాలేండ్లది. నలువదియేండ్లవాఁడు పదుమూఁడేండ్ల పిల్లను జేసికొన్నచోఁ గాకిగోల పెట్టెదరు! నాలుగేండ్లే కదా వారడి! ఈ మాత్రము కాలములో స్వర్గమునకు నిచ్చెనలు కట్టుదురు కాఁబోలు!'' ఇందిరాబాయి—అట్లే విధవరాండ్రుకూడ ధనముకలిగియున్నచో మఱలఁ బెండ్లిండ్లు చేసికొనవచ్చునుగదా! ధనము గల పురుషులు చేసికొనుచున్నారుగా! మంగమ్మ—స్త్రీ పునర్వివాహసంఘము లున్నవికదా! పురుషులకు ధన మున్నచో స్త్రీల సౌందర్యమును గలవారిని జూచియే జేసికొనుచున్నారు. మా పినతల్లి కూఁతు రున్నది. పట్టి దరిద్రురాలు. దానికన్న నీగ్రోలు నయము. ఆ సంస్కర్త యెవరో వచ్చి దానిని బునర్వివాహము చేసికొని సముద్ధరించు మనుఁడు! ప్రతివిషయములోను జగత్తు ధనము వెంటఁ బరుగెత్తుచుండఁగా గుణము వెంటఁ బరుగెత్తుమన్న దని ప్రతివాదము లెందుకు? సీతారామమ్మ—అయినచో మీరు శారదాచట్టమునకుఁగూడ వ్యతిరేకమేనా? మంగమ్మ—నా వ్యతిరేక మెంత? నే నెంత? ఇందిర-దానినిగురించి మీ యుద్దేశ మేమి? మంగమ్మ—వాదనలలోఁ గొన్ని యథార్థవిషయములు చెప్పరాదు. అవి యసభ్యముగా నుండును. వానివలన యాథార్థ్యము గోచరించును. మనము వాదించుట యనినతోడనే కొన్ని యాథార్థ్యవిషయములు వదలిపెట్టి వాదించవలసి వచ్చుచున్నది. ఎనిమిది తొమ్మిదేండ్లకే తెలివిగలపిల్లకు భర్తయన్న యూహయే కలుగుచున్నది. స్త్రీ పురుషసంయోగమును గుఱించిన భావములు లీలగా గోచరించుచున్నవి. ఈ సంగతి యొప్పుకొనినచో వాదన తరువాత. ఇందిర—ఒప్పుకొన్నాము. తరువాతఁ జెప్పుఁడు. రంగమ్మ—నే నొప్పుకొనలేను. అప్పటికిఁ బసిపిల్లల కేమియుఁ దెలియదు. సీతారామమ్మ—ఆమెను జెప్పనిండు. శ్యామల—ఆ సంగతి యొప్పుకొనకపోయినచో నామె చెప్పదు. మంగమ్మ—శ్యామలా! నీకెన్నేండ్లు? శ్యామల- ఇప్పుడు పదునేడేండ్లు. మంగ- నీకుఁ బురుషుఁడన్న యూహ యెప్పటినుండి కలదు! శ్యామల సిగ్గుపడినది. మంగ-ఎవ్వరము చెప్పముకాని, మనస్సాక్షి ప్రతివారికిని గలదుకదా!

చాల చిన్నప్పుడే యట్టియూహ కలుగును. ఆ యూహ కలిగినప్పటి నుండి, తదూహ నేకపురుషవిషయముగాఁ జేయుటకు మనపూర్వు 'లష్టవర్షా భవే త్కన్యా' యని వివాహ మప్పుడే చేయుమనిరి. పదుమూఁడేండ్లు వచ్చి రజస్వలయైనఁగాని కార్యము చేయుట లేదు. బాల్య వివాహములోఁ దప్పేమి? ఈ పిల్ల కతఁడు భర్త యనుట తప్పా? లజపతిరాయిగా రొకచోట వ్రాసినారు: 'బాల్యవివాహము లనఁగా నింగ్లండులోనివారు మన మెనిమిదియేండ్లకన్యలకే గర్భాధానములు చేయుదు మని యనుకొందు రట.' వారిదేశములో వివాహము, కార్యము నొకటియేకదా! ఇచట నట్లు కాదు. బాల్య వివాహము దోషమన్న భావ మిచటినుండి పెరిఁగినది. పదుమూఁడేండ్లకుఁ గార్యముచేయుట తప్పైనచోఁ దరువాత పెండ్లిచేయుట తప్పగును. అమెరికాలోఁ గళాశాలలలోఁ జదువు బాలికాబాలకులకథలు జడ్జి లిండ్సే వ్రాసినాఁడుకదా! మనదేశము నట్లే నాగూరుకాఁబోవు చున్నయది. కామము స్త్రీ కేకపురుషైకవిషయముగాఁ జెప్పుటలో భౌతికసుఖముకన్నఁ బారమార్థిక మెక్కువ యున్నది. మనోనియమ మనునది కామధేనువు వంటిది. అది మోక్షమునకు సాధనము. సంఘములోఁగాని, మతములోఁగాని, మఱొకదానిలోఁగాని మీ రెన్నిమార్పులైనఁ దేవచ్చును. ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహము, తద్ద్వారా భక్తియో జ్ఞానమో కలుగుటకు వీలుండెనేని మీరు తెచ్చినమార్పు శిరోగ్రాహ్యము.

660

# ఇరువదిరెండవ అధ్యాయము

సుసానీ యింగ్లండుపోయినతరువాత సింహళముదాఁకనామెను బంపించుటకుఁ బోయిన రంగారావుగారొకలంకిణిని దెచ్చెను. ఆమె పరాసుమనోహారిణి. సుసానీ మనస్సుమాత్రమే హరించెను. ఈమె యసువులు, మనస్సు రెండును హరించెను. ఈమెపేరు 'బియాట్రిస్.' రంగారావు బియాట్రిస్సుతోఁ దన కదివఱకు వివాహమే కాలేదని చెప్పెను. సింహళములోనే వారిద్దఱకు 'సివిలు మ్యారేజి' జరిగెను. కోటకుఁ గ్రొత్తరాణి వచ్చెను. ముక్కుమీఁద వ్రేళ్లు వేసుకొను వారు, గుసగుసలాడువారు, క్రొత్తతగాదా పుట్టెననువారు పరిచారకులు రకరకమైపోయిరి. వచ్చినయాఱునెలలకు బియాట్రీసుకు సుసానీకథ తెలిసెను. ఆమె చెన్నపురిలోఁ బోయి యుందమనును. రంగారావు చెన్నపురి పట్టఁడు. అచ్చటికిఁ బోయినచో సుసానీకథ బియాట్రిసుకు మొదటనే తెలిసెడిది. సుసానీ లండనులో నుండఁగా నామెకు రంగారావు రెండవపెండ్లిసంగతి యెవరో స్నేహితులు వ్రాసిరి. ఆమె మొదట ననుమానించెను. తరువాత న్యాయవాదులను బోయి సలహా యడిగెను. వారు కథయంతయు వినిరి: 'ఇది వఱకే యొకకుమారుఁ డుండెనంటివి. అతఁ డురస్యుఁడు. జ్యేష్ఠుఁడు. రాజ్యము విభాగించరాని దనుచుంటివి. నీకు సంతానము లేదు. సంతానము కలిగినను లాభము లేదు. వారు దేవాలయధర్మకర్త లనుచుంటివి. తిరువాన్కూరులోననో, కొచ్చినులోననో యిట్టి యిబ్బందియే కలిగినది. ఇతరవర్ణస్త్రీకిఁ గలిగిన సంతానమునకుఁ ధర్మకర్తృత్వార్హతయు, రాజ్యార్హతయు లేదని తీర్పు చెప్పిరి. ఇందులో నెక్కువప్రయోజన మున్నట్టు కనిపించదు. తప్పించుకొని వెక్కిరించుమన్నాను. రాఁదగినంత రాఁబట్టుకొని, మనోవృత్తిగాఁ గొంత తీసికొని యింటికిఁ జేరుట మంచిది' యని సలహా చెప్పిరి. బియాట్రిసుకుఁ దనకు మధ్య వ్యాజ్యములు బలిసి కాఁబోవు ఫలితమేమియో నామెకుఁ దెలియదు. హిందూదేశమునకు మఱలవచ్చి రంగారావుమీఁదవ్యాజ్యమువేసి తనమనోవృత్తిధనము తాను దీసి

కొనిపోదునని మఱల హిందూదేశమునకు వచ్చెను. అచ్చటివారు హిందూదేశమునకుఁ బోవుట యెందు కనిరి. సుసానీ యెందుకో వచ్చినది. రంగారావు సుస్సానీకివ్రాసిన యుత్తరములు చమత్కారముగా నున్నవి. సుసానీని వదలినట్లే వ్రాయఁడు. ఆమె ధనము పంపించు మన్నచోఁ బంపించెను. బయలుదేఱివచ్చుచుంటి ననఁగా రమ్మని వ్రాసెను. ఓడకేవు పంపించెను. సుసానీ కర్థము కాలేదు. ఆమె సుబ్బన్నపేఁటకు వచ్చెను.

తెల్లసవతులిద్దఱును ముఖాముఖిఁ గలిసిరి. ఒకతె కింగ్లీషు దాన నని గర్వము. ఒకతెకు ఫ్రెంచిదాన నని గర్వము. భారతీయ స్త్రీ నని గర్వముపడువారు లేకపోయిరి. నాల్గుదినములైనతరువాత రంగారావునకుఁ దెలిసెను: 'ఇర్వురిలో నెవరికో యొకరికి మనోవృత్తి యిచ్చి పంపించవలయు' నని. చివరకు నిద్దఱికి నీయవలయు నేమో యని యనుమానము తగిలెను. తనయెడలఁగల ప్రేమ యిద్దఱిలో నెవరియం దెక్కువ యని విచారించెను. ప్రేమలేనిచో సుసానీ మఱల నింతదూరము రాదు. బియాట్రిసును మనోవృత్తి ఎంతయిచ్చిన వెడలి పోయెదవని యడిగెను. రంగారావు బియాట్రిసుకైనచో మనోవృత్తి తక్కువలోఁ దేలిపోవుననుకొనెను. బియాట్రిసుకొలంబోలోనొకఘరంలోఁ బనికత్తె. ఆమె కచటి నెలకు నూఱురూపాయలుజీత మిత్తురు. ఆమె కొక ప్రియుఁడు కొలంబోలోఁ గలఁడు. అతనిని వదలి రంగారావువెంట వచ్చుట బియాట్రిసు కిష్టములేదు. కాని యాశచేత వచ్చెను. ఈ రెండేండ్లును ప్రియునకు నామెకు నుత్తరములు జరుగుచునేయుండెను. ఆ యుత్తరములు కొన్ని రంగారావునకు దొరకెను. వానిద్వారా యతఁడు చర్య జరుపవచ్చును. కాని యతఁ డేమియుఁ జేయలేదు. మనోవృత్తివిషయమువచ్చినపుడు బియాట్రిసు లొంగి మాటాడవలసి వచ్చెను. కొన్నియుత్తరములు రంగారావుచేతిలోఁ జిక్కినవి. తన్ను రెండవపెండ్లి చేసికొనెను. ఎవరితప్పులు వారి కున్నవి. వ్యవహారము మధ్యమార్గమున పైస లయ్యెను. నెల కైదువందలతోఁ దృప్తిపడి బియాట్రిసు కొలంబో పోయెను. ఆమెకు మఱలఁ బూర్వపుటుద్యోగము దొరకెను. ప్రియాప్రియులు సంతోషించిరి. సుసానీ మఱలఁ గోటకు రాణి యయ్యెను. రంగారావుగారికిఁ గడచినసంవత్సరము

నుండి యొకమహావ్యాధి పుట్టెను. దివారాత్రములు నిదురలేదు. తెల్ల వారులు కంగుకంగున దగ్గుచుండ నూర్చుండును. వైద్యులు వాయు విమానములమీఁద వత్తురు, మందులిత్తురు. తచ్ఛాంతి కలుగును. వైద్యునితోఁబాటు గుణముకూడ నాకాశసంచారముచేయును. శస్త్రచికిత్స యైనచో నెప్పుడో తేలియుండును. దీర్ఘవ్యాధులకు నింగ్లీషుమందులు చేయుపని యేమియు లేదు. ధనవంతులకు తెలుఁగు వైద్యులు పనికిరారు. సవతిపోయినతరువాత సునాసీకిఁ గొంతకోపము తగ్గి మఱల సతీపతులు పొందికగానే యుండిరి. రంగారావు దీర్ఘరోగి యయ్యెను. భర్తయనుటయేతప్ప మఱొకటిలేదు. సునాసీకిఁ బేఁటలో నుండుట యిష్టములేకపోయెను. కొంతధనము తీసికొని, వీరిని వదలి పెట్టి పోవలయునని యామె కూహ కలిగెను. మంచిమీఁద నామె ధనము రాబట్టఁ బ్రయత్నించెను. రోగియైన రంగారావునకుఁ బరి చర్య చక్కఁగాఁ జేయుచుండెను. అతఁడు సంతోషించెను. రుక్మి ణమ్మారావుగారి, సరోజినీదేవిగారి నగకట్టంతయుఁ గ్రమక్రమముగా సునాసీహస్తగత మయ్యెను. జవాహిరీ యామెపాలఁ బడెను. రత్న ములు, వజ్రములు, మాణిక్యములు, మరకతములు సర్వమును సునాసీ సంగ్రహించెను. ప్రతి రెండురోజులకును వేయి, రెండువేల రూపాయల రొక్క మామెచేతికిఁ జిక్కుచుండెను. నాగేశ్వరరావును రంగారావు ధనముకొఱకుఁ బీడించుచు. అతఁడు మొట్టమొదట శిస్తు వసూలుచేసి, తరువాత నప్పులు తెచ్చి, చివరకు గుట్టములు నిండ్లు నమ్మి తెచ్చియిచ్చుచుండెను. కాలము గడచినకొలఁది రంగారావు మంచమునుండి లేచుటయే లేదు. దివాను పాతికలక్షలదాఁక నప్పు చేసెను. అందులో నిరువదిలక్షలు సునాసీచేతికిఁ జిక్కెను. ఇది రత్న ములు, నగలు గాక.

మఱియొకనాఁడు రంగారావునకు వ్యాధి యెక్కువైనట్లే తోఁచెను. ఆతఁడు జీవించఁడనియే యందఱనుకొనిరి. వైద్యులకుఁ బోసినడబ్బుపోయకుండఁబోయుచున్నారు. రానుపోనురైలుఖర్చులే వేలగుచున్నవి. ఆయనకుఁ బరిచర్యసేయుటకుఁ బదిమంది దొర సానులైన యుపచారికలను నియమించిరి. వారందఱు జమీందారు వద్ద ధనము సంపాదించుచునే యుండిరి.

హారప్పకుఁ బందొమ్మిదేండ్లు దాఁటినవి. అతఁడు సన్నగాఁ బాఁచుపామువలె నుండెను. మొగములో రాజశీవి క్రమక్రమాభివృద్ధిహొందుచుండెనేకాని తఱుఁగుపోవుట లేదు. ఆయన తండ్రి నొకసారి చూచుటకుఁ బోయెను. గదియంతయుఁ దెల్లపరిచారికలతో నిండియుండెను. హారప్ప తెల్లనిపట్టుజరీతలగుడ్డతో, మెడలోని రత్నహారముతో, ఖద్దరుచొక్కాతోఁ, జెంగుగుచ్చాఁగట్టిన పొందూరు జరీపేటంచుదోవతితో గదిలోనికి వచ్చినంతనే పరిచారకులందఱును భయగ్రస్తులై దూరదూర మొఱఁగిరి. రంగారావు వ్యాధియారంభించిననాఁటనుండి కుమారునిదెస నాదరాగుఁ డయ్యెను. హారప్ప నాయఁడు వచ్చి తండ్రిపాదములవద్ద సోఫామీఁదఁ గూర్చుండెను. కుమారుఁ 'డెట్లున్న' వని యడిగెను తండ్రిదృష్టిమాత్రముచేతఁ దన ప్రేమయుఁ దనదీనస్థితియుఁ బ్రకటించెను. హారప్ప యఱగంట కూర్చుండి నమస్కారముచేసి వెడలిపోయెను. పోవుచున్న హారప్ప వంక సుసానీ చూచెను. వేయినుంది చక్రవర్తులల్లు నడువలేరు. 'ఓహో! యిదియా భారతదేశప్రభువు లనఁగా! పూర్వ మిట్లుండెడివారు కాఁబోలు!' వెనుకనుండి చూచిన హారప్పభుజస్కంధము కఠినమై, యయఃపీఠమువలె నుండెను. చాలబలహీనుఁడుగా ననుకొన్నారేమి జనులు?

సుసానీ తా నింక స్వదేశమునకుఁ బోయినచో బాగుండు నని యనుకొన్నది. రంగారావుతోఁ జెప్పి పోవుటయా, చెప్పకుండఁ బోవుటయా? అతఁడు మృతినొందకముందే పోవుట నిశ్చయమైనది. తరువాత నైనచోఁ దనకు దమ్మిడీ చిక్కదు. చేతిలో నున్న ప్రతి గవ్వయుఁ దనవద్దనుండి పోవును. ఇప్పుడే పోవలయును. చెప్పిపోవుటయా, చెప్పకపోవుటయా? చెప్పినచో రంగారావు పోనీయఁడేమో! చెప్పకుండఁబోయినచో దొంగతనము కట్టెద రేమో! కానిమ్ము! చెప్పియే పోవలయును.

తరువాత నాలుగునాళ్ళకు రంగారావేకాంతముగా నున్నప్పుడు సుసానీ "నీవు వ్యాధిగ్రస్తుఁడవైతివి. నాతండ్రి యొక్కఁడు. ముసలివాఁడు. అందు కనియే నేను వెళ్ళి రెండేండ్లవఱకును రాలేకపోయితిని నేను మాదేశము పోయెదను. నీకు వ్యాధి నెమ్మదించి

నంతనే వ్రాసినచో వచ్చెదను'' అని చెప్పెను. రంగారావు దీర్ఘ ముగా విచారించి యంగీకృతిచెప్పెను. తరువాత వారములో జులలో సుసానీప్రయాణము నిశ్చయముచేసెను. రంగారా వొకసాయంకాల మున నాగేశ్వరరావును బిలిచి యేకాంతముగా 'సుసానీవద్ద నిఱువది లక్షలున్నవి. కోటలోని జవాహిరీయంతయు నామెవద్దనే యున్నది. ఆమె యింగ్లండుపోవుచున్నది. అంతధనము పోకుండఁ జూడుము, అనెను. నాగేశ్వరరావు 'ప్రయత్నించెద' నని వెడలిపోయెను. మఱు నాఁడు సుసానీ నిద్రించు గదిలోని కొకకాసావానిని రాత్రిపూటఁ దొంగిలించుటకుఁ బంపించెను. సుసానీ మేల్కొనియుండి పిస్తోలు చూపించెను. వాఁడు పాఱిపోయి వచ్చెను. సుసానీప్రయాణము దానివలన నొకరోజు ముందుపడెను. ఱేపు సుసానీపోవుననఁగా నా మధ్యాహ్నము హారప్ప సుసానీగదిలోనికిఁ బోయెను. సుసానీ కూర్చు న్నది. హారప్పను నివ్వెఱపోయి చూచెను. హారప్ప తా నొక సోఫా మీఁదఁ గూర్చుండెను. హారప్ప యనెను- 'నాతండ్రి యిఱువది లక్ష లప్పుచేసి నీ కిచ్చెను. కోటలోని జవాహిరీయంతయు నీ పర మైనది. హిందువులు మీ రనుకొన్నంత ధనవంతులు కారు. మహా రాజు లేమో నాకుఁ దెలియదు. జమీందారులము, మే మింత వ్యయపెట్టలేము. మాతండ్రి రాజ్యమునకు వచ్చినది మొదలు సర్వమును వ్యయమే చేసెను. నేను తక్కిన ధన మడు గను. రత్నములు, మాణిక్యములు నడుగను. మా నాయనమ్మగారివి, మా తల్లిగారివి నగలు నీదగ్గఱ నున్నవి. అవిమాత్రము లండనుకుఁ జేరవు. అవి లక్షరూపాయల విలువుచేయును. పాతిక, ముప్పది లక్షలు పట్టుకొనిపోవు నీవు నా లక్షరూపాయలవెలగలనగలు నా కిచ్చి వేసినచో నష్టములేదు. నేను వానివెల చూచి యడుగుట లేదు. అవి నా కీయవలయును'' అనెను. సుసానీ దీర్ఘముగా యోచించెను. హారప్పమొగము తేజోవంతమై, యొకదృఢనిశ్చయసూచకమై యుం డెను. సుసానీ యీయ దనుకొన్నది. హారప్ప యేమి చేయును? ఏమి చేయగలఁడు? ఆమె మొగములోఁ దిరస్కారభావ ముదయిం చెను. అతఁ డన్నట్లు లక్షరూపాయలలోఁ బోవునది యేమి? అతఁడు తల్లి నగక ట్టడిగినాఁడు. న్యాయముగానే యున్నది. సుసానీమొగ

ములో జాలి కనఁబడెను. లక్షరూపాయ లెందుకు వదలిపెట్టవలయును? ఇంగ్లాండులోఁ దా నొక పెద్దడచెస్ కావచ్చును. ఆమెమొగములో దురాశ గోచరించెను. ఇచ్చివేయుద మనుకొన్నది. ఆమె మొగము చూచి హరప్ప తనకోర్కె ఫలించిన దనుకొనెను. ఆమెమనస్సులో మఱల వెనుకాడినది హరప్ప యామెమొగము చూచి సందేహ పడెను. హరప్ప "నేను మఱల సాయంకాలము వత్తునా? ఈ లోపుఁగా విచారించుకొనవచ్చు" ననెను. సుసానీ బయటికిఁబోయి యిద్దఱుసేవకులను బిలిచెను. వారు వచ్చిరి. రెండు పెద్దపెట్టెలు చూపి, హరప్పతో 'ఇవిగో తీసికొని పొండు' అనెను. ఆయన తన వద్దనున్న నగలజాబితాలు తీసి పెట్టెలు తెఱపించి సరిచూచెను. అన్నియు నున్నవి. జాబితాలో లేని యొకసువర్ణాభరణము పెట్టెలో నుండెను. అతఁ డది తీసి, 'ఇది జాబితాలో లేదు. మీదే?' నని యిచ్చివేసెను. పెట్టెలుపట్టుకొని సేవకులు నడిచిరి. హరప్పపోవుచు, సుసానీవంక నొకచూపు చూచెను. సుసానీ కలవరపడెను: "ఇతఁ డేమి పురుషుఁడు! తనకుఁ గృతజ్ఞతయైనను జూపలేదు, కరస్పర్శ చేయఁడు. శిరస్సు వంచఁడు. నోటితో మర్యాద నాచరించఁడు! తనవంక నొకచూపు చూచెను. అందులోఁ బ్రసన్నత లేదు. వినయము లేదు, దయ లేదు, మెచ్చుదల లేదు. ఏ మున్నదో తెలియలేదు. ఎందుకట్లు చూచెను! మఱొకరైనచోఁ దనయౌదార్యమును మెచ్చుకొనియుందురు. ఇతఁడు తానేమియు విశేషగుణవతి కానట్లునటించెను."

మఱునాఁడు సుసానీ బయలుదేఱినది. పోలీసువారికిఁ గబురంపి తన సామానును, దానును బరిరక్షితముగా మదరాసుచేరుటకు సాయ మడిగినది. నాగేశ్వరరావు మంచి వంచకుఁడు. ఆమెతో మాట్లాడుటకుఁ బోయినట్లు పోయి, గదిలోనున్న కొన్నిపెట్టెలు, దానికి వేసిన తాళములు చక్కఁగాఁ బరీక్షించి చూచెను. పరిచారకులు కొందఱికాశలుపెట్టెను. సుసానీ మదరాసుచేరి ధనమంతయుఁ బెట్టెలరూపముగా సరిచూచుకొని బొంబాయి చేరెను. కొలంబోమార్గ మిదివఱకు రెండుసార్లు పరిచితమైనదే. ఆమె బొంబాయి చూడలేదు. మఱల నిచ్చటికి వచ్చునో రాదో! బొంబాయి కేఁగినది. అచట వారమురోజు లాఁగినది. ధనమంతయు బ్యాంకులోవేసి, యింగ్లండు

చేరినతరువాత నచటఁ దీసికొనవచ్చునని పెట్టెలు తెఱచి చూచెను. సగానికి సగము రాళ్ళుగాఁ గనిపించెను. రత్నము లెన్నో లేవు. ధనము పదిలక్షలే యున్నది. సుసానీ గాబరా పడెను. తక్కిన పెట్టె లేమైనవి ? పెట్టె లిచ్చటనే యున్నవి కదా ! ఇందులో ధన మేమైనది ? హిందూదేశస్థులు గొప్ప గారడీవాండ్రు! సుసానీ యామాట నిజమే యనుకొన్నది. తక్కినడబ్బుమాత్ర మెందుకు మిగిల్చిరి ? అసలు దొంగతన మెట్లు జరిగినది? ఎవరితో ఫిర్యాదుచేయవలయును? ఎవరిమీఁద? అన్నిరీతుల నాలోచించి 'దంపినమ్మకుబొక్కినదే కూలి' యని సరిపెట్టుకొని యోడ యెక్కెను.

కర్ణాకర్ణిగా హరప్ప నాగేశ్వరరావుజరపించినకథ వినెను. ఆయన మనస్సులో నొకసగము జుగుప్స, యొకసగము మెచ్చుఁదలయు నయ్యెను. ఆయన నాగేశ్వరరావుతో మాటాడక రాధాకృష్ణయ్యగారిని బిలిపించి యాయనతోఁ బదిలక్షలు వెంటనే యప్పు తీర్చవలసినదిగా నాగేశ్వరరావుకుఁ జెప్పించెను. దివా నట్లే చేసెను. దివాను హరప్పవ్యగ్రతకు సంతోషించెను. కాని తన కేమి లాభము? అది ధర్మారావునకు లాభ మేమో! కేషబ్జీమతమున కేమి లాభము? శంకరునకు లాభ మేమో! తనప్రార్థనామందిరమున కేమి లాభము? వేణుగోపాలస్వామికి లాభ మేమో! తన కాలేజీ కేమి లాభము? క్రొత్తగా వేదపాఠశాలలు కట్టించినచో వానికి లాభ మేమో! ఏమి లాభము? ప్రాఁతది కలిపి యిరువదిలక్షల యప్పు. సాలునకు వచ్చునది యాఱులక్షలు. పూర్వమైనచో నాలుగులక్షలే.

హరప్ప క్రిమక్రమముగాఁ గోటలో నధికారి కాఁజొచ్చెను. అన్ని పనులలోను దానే జోక్యము కలిగించుకొనుచుండెను. ఒకసారి బయలుదేఱి పదితాణాలకుఁ బోయి తనిఖీచేసి వచ్చెను. తమ కున్న యూళ్లు, రావలసిన శిస్తులు, వసూ లగుచున్న వైనము, గుమాస్తాలు, వారివారిజీతములు— సర్వమును గనుఁగొని వచ్చెను. తాణాలకుఁ బోయి లెక్కలువిచారించిన జమీందా రిదివఱకు లేఁడు. అందఱును హరప్పనాయఁడు మరల జమీందారీని గొంత వృద్ధిచేయు నను కొనిరి. ఎచ్చటనైన లోపము లున్నవని తోఁచెనేని వానిని గుఱించి నాగేశ్వరరావుగారికి జాబువ్రాయుచు, ఆయన మొదట రెండు

మూఁడుసార్లు సమాధాన మీయలేదు. హరప్ప యీ లోపములను వెంటనే మఱియొక యధికారిచేత సరిచేయించెను. చేయించి వారికి జీతములో ముదరా యిప్పించెను. తరువాత జరుగుపని వీరిజీవితము లో విఱుగఁగోయించుట. ఈసంగతి నాగేశ్వరరావు గ్రహించెను. వ్యవహారము మించివచ్చిన దని హరప్పనాయని కనుకూలముగానే వ్యవహరించ నారంభించెను. హరప్ప సర్వాధికార మవలంబించు చున్నాఁ డని రంగారావుతోఁ బోయి నాగేశ్వరరావు చెప్పెను. రంగారావు మౌన మవలంబించెను. తాను మంచములోనుండి లేవ లేఁడు. తెచ్చినభార్య లిద్దఱును జెఱొకదిక్కును బట్టిరి. కుమారుఁడు వ్యవహారముచూచుకొనునేని గావలసిన దే మున్నది? కొన్ని యూళ్ళలో శిస్తులు వసూలుకాలేదని నాగేశ్వరరావు దావాలు వేసెను. చివరకు దావాలకైనఖర్చులు వచ్చినశిస్తులకన్న నెక్కు వైనవి. హరప్ప లెక్కలుచూచి "రైతులవద్దనుండి శిస్తులు న్యాయ ముగా రాఁబట్టవలయునేకాని న్యాయస్థానములకు డబ్బు పోయరాదు. ఎచట డబ్బు తక్కువ ఖర్చగునో, యేది లాభమో మొదటనే చూచి విచారించవలయు" నని నాగేశ్వరరావునకుఁ గాగితము వ్రాసెను. దివానునకుఁ గ్రమముగాఁ దనయధికారము సన్నగిలు చున్నట్లు తెలిసెను. తానే రాజీనామా యిచ్చి వెడలిపోయినచో బాగుగానుండు ననుకొనెను. కాని రంగారావు బ్రదికియున్నాఁ డన్న యాశ ప్రాణములను వదలలేదు. కేసరిపట్టణ మన్న గ్రామములోఁ బోరంబోకలో జమీందారుగారివి రెండుతుమ్మ లుండెను. ప్రక్క రయితు రెండుతుమ్మలను గొట్టుకొనిపోయి తనదొడ్డిలో వేసికొనెను. దివానుగారు రయితుమీఁద చర్య జరిపెను. తుమ్మలు రెండు నమ్మి నచోఁ బదిరూపాయలు వచ్చును. చివరకు లెక్క చూచుకొనుసరి కేఁబదిరూకలు ఖర్చయ్యెను. హరప్పనాయఁడు 'మఱలఁ దమ రిట్లే చేసితిరి. రయితు రెండుతుమ్మలు కొట్టికొనినందున జమీందారునకు నష్ట మేమి? పల్లెటూరిరయితుకు వంటచెఱకు సమకూడినట్లైనది. తక్కిన యేఁబది రూక లెవరికిఁ బోసిరి- వ్యర్థపుఁజదువులు చదివిన న్యాయవాదులకును, న్యాయస్థానమున కేగదా! నాకుఁ దెలియకుండఁ దమ రింక నే వ్యాజ్యమును దయచేసి వేయవల'దని జాబు వ్రాసెను.

నాగేశ్వరరా వనుకొనెను: 'ఈ జాబులో చదువులు వ్యర్థ మనుటఁ గూడ నెందులకో? తాను పెట్టిన కళాశాల యట్టి దని నిందించుటకా?' తన యుద్యోగముతోఁబాటు కళాశాలకూడ మాసిపోవునట్లు తోఁచి నది. హరప్ప యాచోకీతీసి బెజవాడలో నున్న తమ వకీలునకును నాగేశ్వరరావుగారిని మైత్రియో, బంధుత్వమో యున్నట్లు తెలిసి కొనెను. హరప్ప యనుకొనెను: 'నాగేశ్వరరావు నీతిమంతునివలె నటించుచున్నాఁడు. తాను ప్రభుధనము తక్కువ తిన్నది లేదు. నీతియంతయుఁ దన కిష్టములేనివారికి నుద్యోగము లిప్పించకుండుట లోను, సాహాయ్యముచేయుకుండుటలోను గనిపించుచున్నది. ఈయ నకుఁ గేషబ్జీమత మను దొంగకోటు దొరికినది. అది కప్పుకొని దుర్నీతి యను కుష్ఠవ్యాధి పైకిఁ గనిపించకుండఁజేయుచున్నాఁడు.' హరప్పనాయఁడు సర్వాధికారియైనాఁ డని తెలిసి కళాశాలోపన్యాస కులు నాయనితోఁ దమసంగతులు చెప్పుకొన నారంభించిరి. ప్రతి వాఁడును ప్రత్యేకముగా హరప్పతో మాటాడవచ్చును. వారు వచ్చిరి. కళాశాలలోని శిక్షాపద్ధతి చెప్పిరి. విద్యార్థులు నాగేశ్వ రరావుగారికి గూఢచారులుగా నున్నారు. ఉపన్యాసకునిమీఁద వారు పితూరీలు చెప్పుదురు. క్రైస్తవమతమును గాని, కేషబ్జీమతమునుగాని. బ్రహ్మసమాజమునుగాని యేమియు నన రాదు. ప్రార్థనామందిరములో హిందూమతమును వారు నిరసిం తురు. అది యితరమతమును నిరసించినట్లు కాదఁట. వారు నిర సించినదానికి హిందువులు సమాధానములు చెప్పినచో నది యితర మతములను నిరసించుట యఁట. ఉపన్యాసకుఁడు విద్యార్థులతోఁ గలసిమెలసి యుండరాదు. క్లాసులలో నవ్వరాదు. చమత్కార మాడరాదు. వానిలో జీవ ముండరాదు. కళాశాలలోనికి శవములు రావలయును. శవములు పోవలయును. ఆధునికనాగరకతను విమర్శించ రాదు. నేఁటివిద్యాపద్ధతిలోఁ దక్కినసర్వశాఖలయందును సర్వోత్కృ ష్టత యున్నదఁట. ఉన్నదే యనుకొందుము. ఒకఁడే దైనను తనకు నచ్చనిది చెప్పినేని వానియాయువు మూడినట్లేనా? ఈ దేశములో వాక్స్వాతంత్ర్యము సూత్రముమాత్రమున్నది. దేశములో నెట్లు న్నను చివరి కిట్టి సంస్థలలోఁగూడ నది లేదు. భావస్వాతంత్ర్యము,

వాక్స్వాతంత్ర్యము పెద్దయధికారులకుమాత్రమే! తక్కినవారిదెస నది యుత్తుత్తిమాట.

ఒకసంవత్సరము గడచువఱకు హారప్పనాయఁడు పూర్తిగా నధికారియయ్యెను. సర్వవ్యవహారములు నాయనయే చూచు చుండెను. తాను సొంతముగాఁ జూచుకొనుచుండెను. అందుచేత నితరులకు నెదురాడలేదు. కళాశాల తీసివేయవలెనని హారప్ప యూహించెను. ఈట్సను దొరను బిలిచి ముందునాఁటినుండి కళా శాల యుండదనియే చెప్పెను. ఒక్కసారెగా నెట్లు తీసివేయుట యని యీట్సనుదొర యభ్యంతరము చెప్పెను. 'విద్యార్థులందఱికిని ట్రాన్సుఫరుసర్టిఫికెట్లిచ్చి ౦పంచనచ్చును. దోష మేమియు లే' దనెను. 'మిామిషనరీలు కళాశాల కొందురేమో కనుగొను' మనెను. చంద్రారెడ్డిని బిలిపించి 'కళాశాల వదలివేయఁబోవుచున్నాము. మిా పురపాలకసంఘమువా రేమైనఁ దీసికొందురా' యని యడిగెను. కళాశాలసంబంధిసర్వోద్యోగులకును నోటీసు లిచ్చిరి. బ్యాంకులో కళాశాలవి రెండులక్ష లున్నవి. స్థలము, మేడ, కుర్చీలు, బెంచీలు, సైన్సు సామానులు-సర్వమును పదిలక్షలు వెలగట్టి పండ్రెండులక్ష లెవ రిత్తురో వారికిఁ గళాశాలాసర్వస్వము విక్రయించునట్లు వెల్లడి చేసెను. ఈట్సను దొర మిషనరీలతోఁ గళాశాలనుగొను ప్రయత్న ములు చక్కఁజేసికొనుట కున్ముఖుఁడై యుండెను. ఈలోపుగా రాచరికమువారివద్దనుండి గ్రామములోఁ గళాశాల తీసివేయుట యభివృద్ధికి భంగకరమనియు, జమిాందారుగారు విచారించవలసి యుండుననియు సలహావచ్చెను. హారప్ప సమాధానము వ్రాయించెను: 'ఎస్టేటుమిాఁద ఋణము లెక్కువైనవి. ఎస్టేటు ప్రస్తుతములో వ్యయము భరింపఁజాలదు. రాచరికమువారే ధనముచాలక రాజ మహేంద్రవరములోని కళాశాల మూసివేయవలె ననుకొనుచున్నారు కదా! అట్లే మాకును ధనము చాలుట లేదు. ఈ సంగతి చిత్తగించ వలయు' నని. మిషనరీవారు బేరమాడిరి. పది లక్షలైనచోఁ గొందు మనిరి. స్థలము, సౌధము, లైబ్రరీ, సైన్సుయాపరేటస్సు పదిలక్షలు ధరకట్టుట చాల చవుక. లైబ్రరీ రెండులక్షల వెలకలది యున్నది. నాగేశ్వరరావుగారు లైబ్రరీమిాఁదనే ధన మెక్కువపెట్టిరి. సైన్సు

యాపరేటసునకు నీ కళాశాలలోనున్నంతసామగ్రి మఱియొకచోట లేదు. పదిలక్ష లెక్కువ కాదు. తుట్టతుదకు మిషనరీలు పండ్రెండు లక్షలిచ్చి కళాశాల గొనిరి. హరప్ప రెండు లక్షలును ఋణము తీర్చెను. దగ్గఱదగ్గఱ నింకను బదిలక్ష లుండెను.

ఒకనాఁడు హరప్ప తండ్రివద్దకుఁ బోయి 'మీరు తెలుఁగు మందులు పుచ్చుకొనవలయును. నాలుగైదేండ్లు వరుసగాఁ బుచ్చుకొన్నచోఁ దప్పకుండ గుణము కనుపించును' అనెను. రంగారావుగారూరకుండెను. ధర్మారావు రాజశేఖరశాస్త్రి యని యొక గొప్ప యాయుర్వేదవైద్యుని దీసికొనివచ్చెను. హరప్ప, రంగారావు, ధర్మారావు, వైద్యుఁడును గూర్చుండిరి.

రంగారావు— ఏమండీ! మీవద్ద మంచియౌషధము లున్నవా? ఔషధములు మీరు సరిగా వండరఁటకదా! రాజశేఖరశాస్త్రి పాలించుప్రభు వుండెనేని సరిగా వండ కేమి? ధనమునకు వెనుకఁ దీయనిచో సావధానముగా నౌషధములు వండి, వానిగుణమునకు సమాధాన మిచ్చెదను. అయ్యా! ప్రభువులు ధర్మముపాలించినచో లోకమున దోష ముండదు. పూర్వము తమసంస్థానములో జరిగిన కథయే యొకటిచెప్పెదను వినుఁడు. ఒక బ్రాహ్మణుఁడు పేదవాఁడై కట్టెలు కొట్టుకొని జీవించుచుండెనఁట. అతఁడు కట్టెలమోపు నెత్తినఁ బెట్టుకొని నిలుచుండి మూత్రవిసర్జన చేయుచుండెనఁట. హరిహర నాయఁడు దుర్గోపరిభాగమున నిలుచుండి యతనిని జూచి పిలిపించి, 'ఏమయ్యా బ్రాహ్మణుఁడా! తిష్ఠన్మూత్రుఁడ వైతి వేమి? మ్లేచ్ఛులకన్నను గనాకష్ట మైపోతివి' అనె నఁట. బ్రాహ్మణుఁడు 'ప్రభూ! నేను పేదవాఁడను. కట్టెలమోఁపు శిరసునుండి దించుకొన్నచో మఱల నెత్తెడివాఁడు లేఁడు. ప్రభువు నాకు భోజనము పెట్టునేని నే నుత్తమద్విజుఁడ నగుట యెంతసే' పనె నఁట. హరిహరనాయఁడు వానిదారపుత్రులను బోషించుచుండెను. మఱలఁ గొన్నాళ్ళు గడచినతరువాత నొకనాఁడు నాయఁడు సౌధోపరిభాగ మెక్కి చూడఁగాఁ జెఱువుగట్టున నొక బ్రాహ్మణుఁడు తపస్సు చేసికొనుచుండెను. ఆయన కెండ తగులుచుండుటచేత నతఁడంగవస్త్రమును బై కెగురవైచెను. అది నాల్గుచెంగులను

మేకులకుఁ జుట్టినట్లు గాలిలో విస్తరించి యాయనకు నీడపట్టుచుండెను. అది చూచి నాయఁడా బ్రాహ్మణుని దీసికొనిరమ్మని పరిచారకుల నంపెను. వారు తిరిగివచ్చి బ్రాహ్మణుఁడు రా నన్నాఁడనిరి. నాయఁడే నడచి బ్రాహ్మణునివద్దకుఁ బోయెనఁట. ఆయన యా బ్రాహ్మణుఁడే! రాజు—ఏమయ్యా? నీదారపుత్రులను నేను పోషించితిని. నీ వందువలన తపస్సుచేయుచుంటివి. నేను పిలిచిన రాకూడదా? బ్రాహ్మణుఁడు— 'నా చేయుతపస్సులో నాల్గవ భాగము నీ కెట్లును వచ్చుచున్నది. నాపై నీ కింకఁ బ్రభుత్వమే మున్నది?' అనెను. 'రాజు సమాదరించినచో వృద్ధి పొందవివిద్య యే మున్నది? ఇంగ్లీషుడాక్టరులను జూడుఁడు! వారికిఁ దత్త్వము తెలియదు. నాడి తెలియదు. ఏమియుఁ దెలియదు. చిహ్నములనుబట్టి వ్యాధికి మం దిత్తురు. ఔషధము శరీరతత్త్వమునుబట్టి యీయవలయును. వాతపిత్తశ్లేష్మములయం దొకగుణము విజృంభించి శరీరైకదేశమున నొకవ్యాధి జనించును. ఆ వ్యాధికి మూలమైనదానిని నశింపఁజేసినచో నా వ్యాధి నశించును. వ్యాధి మొండిచెట్టువంటిది. వేఱుంచి కొమ్మలు నఱికినచో వట్టిమోడే మఱల చిగుర్చును. అట్టి యింగ్లీషువైద్యమే రాజాశ్రయమున వృద్ధిఁ బొందుచుండఁగా, విష్ణ్వవతారమైన ధన్వంతరికృతవైద్యమును, చరకమహర్షి కృతసూత్రమును బనిచేయవా? పతివ్రతయైనభార్య యితరదేశస్త్రీలయంతమాత్ర ముపచరించదా' యనెను. రాజశేఖరశాస్త్రికి రంగారావు పాశ్చాత్త్యస్త్రీలను వివాహమాడినమాట తెలియదు. ఏదో ధోరణిలో నీ మాట యనెను. రంగారావుగారికిఁ గోపము వచ్చెను. హరప్పనాయఁడు తలవంచెను. ధర్మారావు కొంచెము కలఁతపడెను. హరప్ప 'శాస్త్రిగారూ! తమరు రేపు దయచేయుఁ' డనెను. మువ్వురును లేచి వెళ్ళిరి ధర్మారావుతో హరప్ప శాస్త్రిగా రింక మనవద్దకు రానక్కఱలే' దని చెప్పెను. రాజశేఖరశాస్త్రి వెడలిపోయెను. ఆఱునెలలుగడచినది. వ్యాధి యట్లేయున్నది. హరప్పనాయఁడు రైలులోఁ జెన్నపురిఁ బోవుచుండెను. ఒక వ్యవహారముమీఁదఁ బోవలసివచ్చినది. ఆయన మొదటితరఁగతిలో నొక పఱుపుమీఁదఁ బండుకొని నిదురపోవుచుండెను. ఉత్తరీయము మొగ

మునఁ గప్పుకొని యుండెను, కొంతసేపటికి మెలఁకువ వచ్చినది! ఎవరో యిద్దఱు రెండవవైపునఁ గూర్చుండి మాట్లాడుచుండిరి. హరప్ప యుత్తరీయము ముసుఁగుదీయక వినుచుండెను. మాట లిటు వినవచ్చెను: "అయ్యా మా కేమి? మేము వైద్యులము. మీకు ధన మెట్టిదో మాకు విద్య యట్టిది. మీకు ధనగర్వ మున్నచో మాకు విద్యాగర్వ ముండును. పెద్దాపురపురాజులు, తెలుఁగుదేశమునందలిసంస్థలు మాంధాతృప్రతిమముగాఁ బాలించిన ప్రభువులు. వారు శంబరదీవిమొదలు సముద్రతీరమున రెండు క్రోసులపొడుగునఁ బూర్వము పెద్దవనము వేయించి యోషధులు పెంచెడివారు. చెన్నప్రగడవా రాస్థానవైద్యులు. వారు మహాప్రతిభులు. పెద్దాపురమువారి వియ్యంకులకు జబ్బుచేసినదనఁగా, వీరు తమయాస్థానవైద్యులను బంపించిరఁట. వియ్యంకులును జమీంధారులే. నాఁడు శయ్యమీఁద నుండఁగా; వైద్యుఁడు బంగారపు ముచ్చె తొడిగికొని, యా పాదము జమీందారు శయ్యమీఁదఁబెట్టి నాడిచూచుటకుఁ జేయి యిమ్మనెనఁట. జమీందారు కోపగించి, చేయి వెనుకకు లాఁగికొనెను. వైద్యులు వెడలిపోయిరి. ఆరునెలలైనతరువాత పెద్దాపురమురాజు వియ్యంకుని జూచుటకుఁ బోయెను. వ్యాధి యట్లే యుండెను. 'మావైద్యులు వచ్చినతరువాతఁగూడ వ్యాధి యట్లే యున్న దేల?' నని రాజుగారు ప్రశ్నించిరి. ఆయన 'ముచ్చెలు తెచ్చి సెజ్జమీఁదఁ బెట్టెను. మేము వలదంటి' మనిరి. పెద్దాపురము ప్రభువు 'వారు ధన్వంతరి యపరావతారము. ఆయన సాక్షాద్విష్ణువు. మనము వట్టిమానవులము. అందులకే వ్యాధి యున్నట్లున్న' దనె నఁట. వైద్యులు మఱల వచ్చిరి. మఱల నాయన ముచ్చెకా లట్లే సెజ్జపై నుంచెను. నాడి చూచెను. 'ఆఱునెల లాలస్యమైనదిగనుక వ్యాధి కుదురుట కాఱురోజు లాలస్యమగు' నని యౌషధ మిచ్చెనఁట. ఆఱురోజులలోఁ గుదిరెను. ప్రభువు విద్యల కీయవలసినగౌరవము విద్యల కీయవలయును. తనకు ధనమున్న దని తనగౌరవము తాను పోవుటలేదా?' హరప్ప ముసుఁగు తీసి చూచెను. మాటాడుచున్నది రాజశేఖరశాస్త్రిగారు. హరప్పను జూచి శాస్త్రిగారు 'అయ్యా! తమరా! నాయనగారికి వ్యాధ్య

నెమ్మదించినదా అండీ' అనెను. హరప్ప 'తమరు క్షమించవల
యును. నేను చెన్నపురినుండి మఱల నెల్లుండి వచ్చెదను. అచట
మాసౌధము నమ్మివేయుచున్నాము. తమరు నాల్గురోజులైనతరువాత
మా కొలఁకు దయచేయవలయును' అనెను. శాస్త్రిగారు 'చిత్తము,
చిత్త' మనిరి.

నాల్గురోజులైనతరువాత శాస్త్రిగారు రాలేదు. నాయఁడు
తండ్రితో మాట్లాడి 'శాస్త్రిగారు లోకోక్తిగా నన్నారట
క్షమించుమన్నా'రని చెప్పెను. రంగారావు సరే యనెను. హరప్ప
'కుదిర్చినచో నాయనయే కుదుర్చును. వారి చేతనే మఱలఁ దమరు
మందు పుచ్చుకొనవలయును' అని మనవిచేసెను. రంగారావుగారు
వ్యాధివలన బాధపడలేక మానము వహించిరి. ధర్మారావు
పోయి శాస్త్రిగారిని మఱల తెచ్చెను. శాస్త్రిగారు వైద్యమారం
భించిరి. ఆయన 'యీమందు వాడుచుంటిని. రేపుప్రొద్దుననే
గుణము కనఁబడును' అని చెప్పి మందు వాడెను. ఔషధము చెప్పి
నట్లు జవా బిచ్చెను. హరప్ప 'వ్యాధి యెన్నాళ్ళలోఁ గుదుర్తు'
రని యడిగెను. శాస్త్రిగారు 'వ్యాధి ప్రారంభించి పదునాఱేఁడులు
కావచ్చుచున్నది. మూఁడేండ్ల నుండి ముదిరినది. రెండేండ్లయిన
నౌషధసేవచేసినఁగాని కుదుర'దనిరి. అంగీకృతి వచ్చినది.

నాగేశ్వరరావుగారు రాజీనామా యిచ్చిరి. ప్రతిచిన్నవిష
యములోను నాయఁడు జోక్యముఁ గలిగించుకొనుట కాయన యిష్ట
పడలేదు. హరప్ప ధర్మారావును 'మిమ్ము దివానుగా వేయుదు' నని
పిలిచి చెప్పెను.

ధర్మారావు 'నేను తమకుఁ జిన్నప్పటినుండి దివానునే. మా
పూర్వులందఱు మీపూర్వులకు మంత్రులు. వారు జీతము బత్తెము
లేని కొలువుచేసిరి. నేను జీతముమాత్రమే లేని కొలువుచేయు
చుంటిని. బత్తెము పదిపదునొకండేండ్ల నుండి ముట్టుచున్నది. మీరు
నాకు జీతము దమ్మిడీయిచ్చినను పుచ్చుకొనను' అనెను. హరప్ప
నేత్రములలో మైత్రియో, కృతజ్ఞతయో, యౌదార్యమునకు మెచ్చు
దలయో కొలఁకులందు మినుకుమినుకు మనెను.

హంరప్ప తాను ప్రభువైతి నని తెలిసికొనెను. ఇంక మాతృ కర్మ చేయవచ్చునా? స్వామికిఁ గల్యాణము చేయవచ్చునా? హంర ప్పకు దనయుండు: దనకు నమ్మకము కుదురువఱకు నాషాఢమాసము వచ్చెను. స్వామికల్యాణములు వైశాఖపూర్ణిమకు జరుగును పదినెల లాగినఁగాని కల్యాణమునకు వేళ రాదు కర్మలుకూడ నప్పుడే.

# ఇరువదిమూడవ అధ్యాయము

కుమారస్వామికిఁ బుత్త్రోదయము నుద్యోగము నొక్కసారి యయ్యెను. కాలేజీలో నతఁ డాంధ్రోపన్యాసకుఁ డయ్యెను. నెలకు నూటపాతికరూకలు జీతము. అతఁడు తెలుఁగులో బి. ఏ. పరీక్ష యిచ్చి యేఁడాదియైనది. ఈ యేఁడు ఎమ్. ఏ. పరీక్షకు వెళ్ళును. అతడు సంఘసంస్కారవివాహముచేసికొనుట మిషనరీల కాలేజీలో నది ఎమ్. ఏ. ప్యాసైనంత గుణ మిచ్చెను. కొడుకునకు ధర్మారావని పేరుపెట్టెను. శ్యామల కొడుకును 'మాగురువుగా' రని పిలుచును. కుమారస్వామి యొకనాఁడు ధర్మారావుతోఁ దనకొడుకును జూపి, 'మాష్టరుగారూ, మనవాఁ డేమి సామాన్యుఁ డనుకొన్నారా? చక్రవర్తి యటు, వీఁ డిటు' అనెను. ధర్మారావు—ఇతఁడు దేనికి చక్రవర్తి? కుమార—మావానికిమాత్రము మనోవృత్తి రాకపోవునా చూతము. శ్యామల—చక్రవర్తిమీఁద మీ కింకను గసిపోలేదు. నాలుఁగైదుదినములు నే నాయనతో మాటాడినందుకే యింత వైరము పెంచుకొనవలయునా? ధర్మా—ఇప్పు డాయన యేమి చేయుచున్నాఁడు? కుమార— చెప్పితినిగదా! తండ్రియిచ్చిన మనోవృత్తి తినుచున్నాఁడు శ్యామల— 'చక్రవర్తిటు, వీఁ డటు.' ఏమిటి? కుమార— ఆ చక్రవర్తితో నింక మా అబ్బాయియే వాదించును. మాస్టరుగా రక్కఱలేదు. ధర్మా— ఏఱుదాఁటి తెప్ప తగుల వేయుచున్నావు. ఒకనాఁడు మంగమ్మయుఁ గుమారస్వామియుఁ గూర్చుండిరి. మంగ— నెలకు నూటపాతిక సంపాదించుచున్నా వేమి చేయుచుంటివి? కుమార— ప్రాఁతయప్పులు తీర్చుచుంటిని. మంగ— నాదిమాత్ర మప్పు కాదా? కుమార— కాదని మీ రేకదా చెప్పితిరి. మంగ—నాల్గువంద లెగవేసెదవా? కుమార— తెలివితక్కువ యెవరిది? కాగితము వ్రాయించుకొమ్మనఁగా వ్రాయించుకొన్నారా? నోటున్నచో నిచ్చెడివాఁడనే. ఇప్పుడు నాకుఁ బ్రాణమొప్పుట లేదు. మంగ— ఒప్ప దొప్పదు. కొడుకునకు మెడలో గొలుసు చేయించి పెట్టెదను. ప్రాణ మొప్పునా

కుమార— నిజముగా మీముందు జమీందారు లెందుకండి! ఈ ప్రాతపుమాట యున్న బంధువులే లేరు. మీరు మఱల వెనుకకుఁ దీయరాదు సుఁడీ! ఏదో పద్య మున్నది— "ఆడినమాటను దప్పిన, గాడిదకొడు కంచుఁ దిట్టగా 'నయ్యయ్యో! వీఁడా నా కొక కొడు' కని, గాడిద యేడ్చెంగదన్న ఘనసంపన్నా!" ఆడినమాట తప్పరాదు. మంగ—నీవును, నీకొడుకును వట్టి పిచ్చివాండ్రు. నోటిలో వ్రేలుపెట్టిన కొఱుకనుగూడ లేరు, పాపము! కుమార—మా అబ్బాయికిఁ బండ్లువచ్చిన వని యోర్వలేరా? ఆ నాఁటిసాయంకాలమున చిన్నధర్మారావుమెడలో బంగారపుగొలుసు వెలసినది. కుమారస్వామి— మీరు మా అబ్బాయిని వరించిరా? మాఅబ్బాయి నలుడు, మీరు దమయంతి. అచ్చముగాఁ గాదులెండి— అభినవ నలుఁడు. అభినవదమయంతి. కలికాలములో దమయంతి పతివ్రత కానక్కఱలేదు. మా అబ్బాయి పెద్దవాఁడవువఱకు భార్యాభర్తలకు సుమారుపాతికేండ్లు వారడి. మనసిద్ధాంతమునకు సరియుఁ బోవును. మంగ— నీ విఁక పెద్దమనిసితరహా నేర్చుకొనవలయును. కొక్కిరాయిగా నున్నచో నుద్యోగ ముండదు. కుమార— కేషబ్జీనిష్క్రమణ మైనదిగా! శిక్షాపద్ధతి పూర్వమువలె బిగిసి యుండదు. మంగ— ఇది యంతకన్న నెక్కువ. అది లోపల సడలు, పైకి బిగువు. ఇది లోపల బిగువు, పైకి సడలు. అప్పుడు ధర్మారావు వచ్చెను. కుమారస్వామి కొడుకును దెచ్చి చూపించెను. ధర్మారావు 'నీకొడుకు రోజురోజుకుఁ గ్రొత్త కొడుకా యేమిటి? వచ్చినపుడెల్ల చూపింతువు' అనెను. కుమార— అది కాదండీ! నేను మంగమ్మగారికి నాలుగువందలప్పుపెట్టినాను. అసలీయకపోయినమానెఁగాక, వడ్డీ యిమ్మన్నాను. ఆమె వట్టి దరిద్రురాలు కదండీ! తిండికిలేక చచ్చిపోవుచున్నది. తనవద్ద డబ్బు లేదని యీ గొలుసు- పూర్వ మెప్పుడో చేయించుకొన్నది, క్రొత్తగా మెఱుఁగు పెట్టించి వడ్డీక్రింద నిచ్చినది. అది మీకు చూపించుచున్నాను. మంగ—ఇంక అసలీయలేను. అంతకు దీనితో సరిపెట్టుకొనుము. కుమార వెఁలక గేదెపడ్డ నిత్తునంటివిగదా. మాయబ్బాయికి పెండ్లిచూడుటకు? మఱచిపోయినాను. మాష్టరుగారూ. మా అబ్బా

యికి సంబంధము కుదిరినది. పెండ్లి యెప్పుడు చేయుదము? ధర్మా—ఇది బాల్యవివాహముక్రింద లెక్క. శారదాచట్టముక్రింద వచ్చును. కుమార—శారదాచట్టములోఁ బెండ్లికొడుకు చిన్నవాఁడైనచో నంత పట్టింపులేదు. పెండ్లికూఁతురు పాతికేండ్లదండీ? ఒకవేళఁ దప్పె నను మాకుఁ గొంతవయస్సు ముదరా రావలయునుగదా! యావరేజి కట్టినచో బాల్యవివాహము కాదు. మంగమ్మ—నీ మాత్రముబుద్ధి వారికి లేదు. కుమార—లేక యేమి? మా కిద్దఱకు నన లసలుగా నుండఁగా వడ్డీలు గిట్టుచున్నవి. శ్యామల—మీకు సరే? ఆయన కేమిటి? ఓహో! అదా? కుమార—చక్రవర్తి తలఁపునకు వచ్చి నాఁడు కాఁబోలు! శ్యామల—ఇంక నెన్నాళ్లీ ప్రసాదింపు?

వాకిట నెవరో వచ్చిన ట్లయినది. అందఱు నటు చూచిరి. వచ్చినాయన 'ధర్మారా వున్నాఁడా అంది' యనెను. ధర్మారావు కంఠముగుర్తు పట్టి బయటికిఁ పోయి 'ఎప్పుడు వచ్చితివి? నే నిందు న్నానని యెవరు చెప్పి' రనెను శ్యామలయు. పంకజమ్మయు 'దయ చేయండి! రాఘవరావుగారూ! మీరు చెఱనుండి యెప్పుడు వచ్చితి' రని యడిగిరి. రాఘవరావు—వచ్చి నాల్గునెలలైనది? ధర్మా—మఱల నెప్పుడు వెళ్ళుచున్నావు? రాఘవ—ఇంక వెళ్ళి నచో మఱల రాను. ఇంతవఱకు మూఁడుసారులైనది. నాకు క్షయ పుట్టి బ్రతుకనేమోయని వదలిపెట్టిరి. బయటికి వచ్చినతరువాత క్షయ లేదు, గియ లేదు. నా బదులు నా భార్యకుఁ బ్రాణముమీఁదికి వచ్చినది. ధర్మా—మఱి యిప్పు డెందుకు వచ్చితివి? రాఘవ—నీకోసమే. ఇంటికిఁ బోదమా? ఈ యూరిలో రాజశేఖరశాస్త్రిగా రున్నారఁట. ఆయన నీవు చెప్పినచో వచ్చునఁట. ధర్మా—జబ్బే మిటి? రాఘు—ఏమిటో గోల! చెప్పెదనులే, శ్యామల—చెప్పండి. మాకు నాదుర్దాగా నున్నది. రాఘవ—ఏమియు లేదమ్మా రెండు నెలల గర్భిణి. గర్భస్రావమైనది. నాల్గుదినములు జ్వరమువచ్చినది. మేము వట్టిజ్వర మనుకొన్నాము. అమ్మవారు పోసినది. ధర్మా—బాపట్లలోనా, నరసారావుపేటలోనా? రాఘవ—ఈ నాల్గునెలల నుండియు నేను బెజవాడలో నుంటిని. ధర్మా—తిండి రాఘు—తిండి కెవరున్నారు? తెలియదా? ధర్మా—నాల్గునెలలనుండి యిచ్చట

నుండియు నాకుఁ దెలియఁజేయలే దేమి? రాఘవ—తెలియఁజేసినచో నీవువత్తువా? సరే, పోదము. రాజశేఖరశాస్త్రిగారి నీ నాఁడే తీసికొని పోవలయును.

శాస్త్రిగారు నాఁటిరాత్రి పదిగంటలకు బెజవాడలో రోగిని జూచిరి. చూచి బయటికి వచ్చి ధర్మారావుతో లాభము లే దనెను. అయిన నేదో యౌషధము నడపెను. తెల్లవాఱుజామున నామె యీ లోకమును త్యజించెను. శాస్త్రిగారు తిరుగురైలుమీఁద సుబ్బన్నపేటకుఁ బోయెను. మిఁగిలినది సూర్యపతి, ధర్మారావు, రాఘవరావు మిత్రులు మువ్వురు నొకరిమొగము లొకరు చూచుకోలేక మోకాళ్ళ మీఁద మొగములానుకొని కూర్చుండిరి. నాలుఁగు గంటలైనది. రాఘవరావు 'ఏడ్చుటకుఁగూడ నెవరును లేకపోయిరికదా' యని కుమిలిపోయెను. ధర్మారావు పట్టుకొని యోదార్చెను. సూర్యపతి "తెల్లవాఱువఱకు శవమును మనమే శ్మశానమునకుఁ జేర్చుకొనవలయును. ఈ వ్యాధితోఁ బోయిన దనఁగా నెవ్వరును బట్టుటకు రారు. మొన్న నల్లే మాయింటిప్రక్క నొకయావిడ ప్రసవించి, మశూచికము వచ్చి పోయెను. ఈ బ్రాహ్మణులు కాకిముండ కొడుకులు. వీరికి డబ్బుతప్ప నీతియు, జాతియు లేదు. ఆనాఁడు వారింటిలోఁ జాలయిబ్బంది పడిరి. మనము తెల్లవాఱకముందే యేదో చూడవలె" ననెను. రాఘవరావు 'కర్మసంగతి యేమిటి' యనెను. ధర్మారావు 'ఇట్టి చావులకుఁ గర్మయేమియు లేదు. ఇప్పుడు దహనముకూడ లేదు. వట్టి ఖననమే. బదిపదునేనురోజులుదాఁటినతరువాత గర్మ ప్రారంభించవలయును' అనెను. రాఘవ—మఱి శ్మశానమునకుఁ జేరుట యెట్లు? ధర్మా—ధనమెంతైన నొసఁగి బ్రాహ్మణులను దేవలయును. రాఘవ—ఏదైనను బండిమీఁదఁ దీసికొనిపోరాదా? సూర్య—బండివాండ్రును రారు. అయినను బోయి రావలయును. ధర్మారావు—తాను పోయివత్తు ననెను. అతఁడు పోయి యెంతమంది నడిగినను రాలేదు. చివర కొకసాహెబు మూఁడురూకల కచ్చుకొని యింటిదాఁక వచ్చి, 'మసూచిక మటండీ! నేను రా'నని తిరిగిపోయెను. భళ్ళున తెల్లవాఱెను. ధర్మారావు మఱల గ్రామము వెంటఁ దిరుగఁజొచ్చెను. తిరిగితిరిగి కాళ్ళు బలపములు కట్టెను.

కాని బండి దొరకలేదు. ఇంటికి వచ్చి మిత్రులిద్దఱితోఁ జెప్పెను. చివరకు ధర్మారావు 'మనమిద్దరము తీసికొనిపోదము. ఏమిచేయుదు' మనెను. సూర్యపతి 'నేనుపోయి బండి మాటాడుకొని వత్తును. నాకు గూడ గుదరనిచో నట్లే చేయఁవచ్చు' నని పోయెను. పదిగంటల కొక బండివాఁడు 'బండి యిచ్చెదను. మీరే తోలుకొనవలయు' ననెను. మూఁడురూపాయలకొప్పుకొనెను. సరే నని తెచ్చిరి. ధర్మారావు బండితోలు చుండెను. బండిలో శవముంచిరి. వెనుక రాఘవరావు సూర్యపతులు వచ్చుచుండిరి. ధర్మారావు దుర్వాసనకుఁ గూర్చుండలేకపోయెను. దిగి తోలుదమన్న బండికి ముందు బరువు చాలలేదు. అట్లే ముక్కుద్రోవులు బిగఁబట్టి మసనకు చేరిరి. రాఘవరావునకు శరీరములో బొమికలే మిగిలెను. ఆతనికి నైదు దినములనుండియు నిద్రాహారములు లేవు. మనిసి తూలిపోవు చుండెను. గోయి మాలవాండ్రు త్రవ్వి వెడలిపోయిరి. మఱికొంత త్రవ్వవలసి వచ్చెను. ధర్మారావు త్రవ్వెను. రాఘవరావు ధర్మారావులు శవమును గోతిలోనుంచిరి. ధర్మారావు, సూర్యపతులు పాఱలతో గోయి పూడ్చిరి. బండియుంతయుఁ గృష్ణలో కడిగి, తాము స్నానములు చేసి, తడిగుడ్డలతో నింటికి వచ్చిరి. రాఘవరావు మూర్ఛపడిపోయెను. సూర్య—అతని యొడలిలోఁ బ్రాణమెచ్చట నున్నది? అసలే యంతంత, జై లతనిని దినివేసెను. వారు పెట్టెడియన్నముతినినచో క్షయాది సకలవ్యాధులును వచ్చును. నేను నెఱుఁగుదునుకదా! రెండుసార్లు వెళ్ళువఱకు నాపని యైనది. రాఘవరావును సేదదేర్చి యన్నము తినిపించిరి. అతనుమామగారికి నాన్నగారికిఁ దంతియిచ్చిరి. రాఘవరావుతల్లి యదివఱకే చనిపోయెను. అతని యన్నగాని, యన్నభార్యగాని రాలేదు. రాఘవరావునకు సంతానములేదు. తమపిల్ల యేమో పోయినది. ఇంకఁ బోవుట యెందుకని యత్తమామలురాలేదు. రాఘవరావు తలఁచుకొనితలఁచుకొని నాభివద్దనుండి సెలవేసికొనఁగా ముక్కుద్రోవులవెంట కంఠప్రదేశవిరుద్ధదుఃఖోల్బణమును బ్రకటించెను. మిత్రులతని నాదరించుకొనలేకపోయిరి. నాల్గునాళ్లిట్లు జరిగినది. సూర్యపతి ధర్మారావుతో 'నేను బందరు పోయి రావలయును. నీవు రాఘవుని జూచు

చుండుము' అని చెప్పెను. ధర్మా—బండ రెందుకు? సూర్య—పని యున్నది, పోవలయును.

ధర్మారావు 'సరే. పోయిరా' మ్మనెను! మఱునాడు ధర్మారావు రాఘవరావును వెంటఁదీసికొని, యతఁడద్దెకున్న యింటికిఁ బోయి, యా యిల్లు ఖాళీచేసి, యున్నకొద్దిసామాను సూర్యపతి యింటికిఁ జేర్చెను. ధర్మారావు మిత్రుని గూర్చుండనీయలేదు. గ్రామమువెంటనే త్రిప్పెను. సాయంకాలమున గృష్ణయొడ్డునఁ గూర్చుండఁబెట్టి 'రాఘవా! మనచిన్ననాఁటికి నిప్పటికి భేద మెంతయో చూడుము! ఆ రోజులలో మనబ్రతుకు లిట్లగు నని మన మను కొంటిమా! నలుగురము నాల్గుదారులకి బోతిమి. కిరీటిమట్టుకు కిరీటి నిక్షేపమువంటి డిఫ్యూటీతహసీల్దారుపని-మామగా రిప్పించినది వదలుకొని, స్కూలు మాస్టరు చేయుచుండెను. నా చదువు ఫలిత మునకే రాలేదు. నీ విట్లయితివి. సూర్యపతికిఁ దగినకష్టములు సూర్యపతియు ననుభవించుచున్నాఁడు: మా సుబ్బన్న పేఁటయే కాదు; లోకమంతయు నిట్లేయున్నది. వృథాగా మాయలోఁ బడెదము కాని, మనము కర్తలముకాదు, భోక్తలముకాదు. భోక్తృ భ్రాంతియున్నది. కష్టపరంపరచేతఁ గర్తృభ్రాంతి కొంతవదలినది. ఆమె యెవరు, నీ వెవరు? ఆమెకొఱకు దుఃఖించి తేలేముకదా! మన శక్తికి దాఁటినదానిని గుఱించి విచారించి ఫలితములేదు. అట్లు విచారించినవాఁడే మూఢుఁడు! మనము గ్రుడ్డివారము. యాథార్థ్యము తెలిసికొనలేముకదా! మనకు గ్రుడ్డిపొర యొకటియే. ధన వంతునకు రెండుపొర లున్నవి. మనము సంసారాంధులము మాత్రమే. వాఁడు ధనాంధుఁడు కూడను. మనము విద్యతో నీ పొరను గోసితిమేని మనకు దృష్టిభాసించును. చూడుము! ఇందులో నే మున్నది? నేఁడు నీ భార్య చనిపోయినది. రేపు నా భార్య చని పోవచ్చును. తరువాత నీవు చనిపోవచ్చును; నేనును జనిపోవచ్చును. మాహారప్పనాయఁడు స్వామియవతారము. ఆయన మాత్రము స్థిర మని యున్నవా? అసలు సంపూర్ణావతారము వేణుగోపాల దేవుఁడు ద్వాపరాంతమున నేల చనిపోవలయును? శ్రీరామచంద్రులు గతిం చుట యేమి? అంత మనునది విచిత్రముగా వచ్చును. నీవు పరమ

బుద్ధిమంతుఁడవు; దేశమునకు హిత మనుకొన్నది ప్రతి నెత్తురు బొట్టుతో నాచరించితివి. నీకు బయటకన్న జైలులోననే తగిన స్థలము. మూఁడుసార్లు మూఁడురెండ్లాతేండ్లు జైలులో నుంటివి. ఆమెకును నీకు నేమి సంబంధము? ఆ సంబంధము జైలులో నున్నప్పు డేమైనది? ఇప్పుడు నంతే నమకొనుము. నీ వింక హృదయమును గుమటఁబఱచుకొనవలయును' అనెను. రాఘవరావు 'అవును. నేను దుఃఖమును దీసివేసితిని' అని లేచి నిలుచుండెను. విచిత్రముగా రాఘవరావు పూర్వమువలెనే మాటాడఁజొచ్చెను, నడువ జొచ్చెను. రాత్రిరికి సూర్యపతి తిరిగి వచ్చెను. మఱునాఁడు దయమున రాఘవరావు కనిపించలేదు. తమకన్న ముందే లేచి, యతఁ డెచటికిఁ బోయెనో! సూర్యపతి ధర్మారావులు వెదకిరి. పది గంటలకు పోలీసువారు రాఘవరావును బట్టుకొనిపోవుచుండఁగాఁ జూచిరి. ఏమి టని కనుఁగొనిరి. రాఘవరావు రాజకీయోద్యోగుల నుద్యోగములనుండి మానుఁ డని ప్రబోధించుచు కాగితములు పంచి పెట్టి యొకకాగితము సబ్ కలెక్టరునకుఁ దీసికొనిపోయి యిచ్చెను. అతనిని బట్టుకొనిరి. బందరు తీసికొని పోయి సబ్ జైలులో నుంచిరి. సూర్యపతి, ధర్మారావు లతఁడు సబ్ జైలులో నున్నన్ని దినములును దిండితిప్పలు చూచుచుండిరి.

ఆనాఁటికి నాల్గవదినమున సూర్యపతి, ధర్మారావులు గలిసి సబ్ జెయిలునకుఁ బోయిరి. తాలూకాఫీసునకుఁ జేరువఱకు నిద్దఱిలో నెవ్వరును మాటాడ లేదు. జెయిలులోనికిఁ బోయిరి.

రాఘవరావు నవ్వుచుఁ ద్రుళ్ళుచు నుండెను. పత్రికను నిం కొక రాజకీయనిర్బంధితుఁ డుండెను. అతనితో "అరుగో మా వాండ్రు వచ్చిరి. నాకుఁ బ్రతిపూఁటయు నన్నము తెత్తురు. సబ్ జైలులోనికి మఱచెంబుతో నీళ్ళు, పఱుపు, దీపము తెచ్చిరి. రేపు రాజమహేంద్రవరములో నివియన్నియు నెవరిత్తురు! నేను వద్దనఁగా వినరు. ఇచట నీ కించిత్సుఖ మెందుకు? న న్నందఱును వదలిపెట్టిరి గాని, వీ రిద్దఱుమాత్రము వదలిపెట్టలేకున్నారు. వీరితోఁబాటు మఱొకాయన యున్నాఁడు. ఆయన యిచ్చట లేఁడుగనుక బ్రదికి పోయినాను. నా భార్యగూడ నన్ను వదలిపోయినది. వీ రిద్దఱును

నన్ను వదలునట్లు లేదు. నేనే వీరిని వదలిపోవలయును" అని చెప్పెను. ద్వితీయనిర్బంధితుఁడు 'వా రిద్దఱును మీ కేమి కావలయు' నని యడిగెను. రాఘవరావు "ఏమి కావలయును; ఒకఁడు తల్లి; ఒకఁడు తండ్రి, కనిపించుటలేదా ? ఇద్దఱును బసిమిరంగు గలిగి దబ్బ పండ్లవలె నున్నారు. ఈ రెండవయాయన ఖైదులోనికిఁ బోవుటచేత నాయన మనకు సహోదరుఁడు లెండి ! మేకులు, పురుగులు తిని నల్ల బడినాఁడు. ఆ రెండవయాయన సుబ్బన్నపేఁటలో వేణుగోపాల స్వామిగుడిలో శర్కరపొంగలి దధ్యోదనము దిని మఱియు వన్నె తేలినాఁడు. ఆజానుబాహువు. అతనికన్నులలోఁ జూడుఁడు ! దేవుఁ డున్నాఁడు, కాదూ ! ఆ యిద్దఱును నాకుఁ దల్లియు, తండ్రియు. తల్లి యెవరో, తండ్రి యెవరో మీరే నిశ్చయించుకొనుఁడు ! నేను నిశ్చయించితినా, వారు నన్నుఁ గొట్టవత్తురు" అనెను. అందఱును నవ్విరి.

౧౨౪ ఎ శెక్షనుక్రింద రాఘవరావునకు రెండున్నఱయేండ్లు కఠినశిక్ష వేయఁబడెను.

# ఇరువది నాలుగవ అధ్యాయము

"వాలి సుఖముగా నున్నాఁడా ?" "సుగ్రీవుని ర మ్మనుచు న్నాఁడు." "సుగ్రీవుఁడు నిదురపోవుచున్నాఁడు. తనతారను గాఁజేసిన వాలిమీఁదఁ బగఁ దీర్చుకొనుట యెట్లా యని శ్రీరామచంద్రుని వంటి ప్రత్యగాత్మతో సుషుప్త్యవస్థలోఁ గలిసి విచారించుచు న్నాఁడు." "నా కీ వేదాంతము తెలియుట లేదు." "తత్పూర్వ భాగము తెలిసినదా ?" "కొంతసేపు దమయంతి యందువు. కొంత సేపు తార యందువు. నీ యిష్టమే యిష్టము." "అవతారములు మాఱవా ?" మంగమ్మ—నీ కుద్యోగమైన తరువాత మఱియుఁ బట్టపగ్గములు లేకున్నవి. కుమారస్వామి—ఇదిగో చూడుము. ఆఁడవా రే మన్నను దప్పులేదు. మగవాండ్రు కొంచె మన్నచో వానిమీఁదఁ బడిపోదురు. ఒక్క విషయము చూడుము. రుక్మిణీదేవి తనయిష్టమైన క్రిష్ణమ్మకుఁ గబురంపినది. అది లోకమున కందఱకు లక్ష్మీదేవి విష్ణు మూర్తిని పెండ్లాడిన ట్లున్నది. భీష్మకుఁడు, రుక్మియు నిచ్చెద మన్నా రుగదా యని శిశుపాలుఁ డామెను వాంఛించెను. శిశుపాలుఁడు—జగద్ద్రోహి యైనాఁడు. ఇది తత్వము. స్త్రీవాంఛించినదా బయటికిఁ బొక్కడు. అది శృంగారరసము. ఆమె వాంఛించకపోయినచో రసా భాసము. కావ్యములలో రసాభాసము మాత్రమే; లోకములో ? మంగమ్మ—లోకములో నేమిటి ? కుమార—ఏమి టని యడుగుచు న్నారా ? బడితెపూజ. ఒకొక్కప్పుడు శిరచ్ఛేదనము, కూనీ. స్త్రీ మూలముగా లోక మెంత చెడిపోయిన దనుకొన్నారు ? హత్యలు, కూనీలు జరుగుచున్నవి. మంగమ్మ మఱుమాటలేకుండఁ దిరిగిపోయి నది. కుమారస్వామికిఁ గారణము దెలియలేదు. ఆమె యింటికిఁబోయి నంతనే వాలి కిచకిచలాడెను. చెంగలరావును బిలిచి "వాలికిఁ గాఫీ పోసితివా" యని యడిగెను. చెంగల్రావు "కాఫీ తెచ్చువఱకుఁ జల్లారి పోయెను వాని దొరతనమునకు వాఁడు చల్లారినకాఫీ త్రాగునా ? తాను త్రాఁగ నన్నాఁడు. నేను కా దని బలవంతముగా నోటిదగ్గఱ పెట్టితిని. ఇదిగో న న్నాడలంతయు గీఱి, నెత్తురుకండలు చేసినాఁడు.

పండ్లిగిలించినాఁడు. ఇట్లయినచో నీ కసలు కాఫీయే లేదని నేను మానివేసితిని'' అనెను. మంగమ్మ—''నాయనకాదా! ఆ కాఫీకొంచెము వెచ్చగిలఁబెట్టి యిమ్ము'' అని లోనికిఁబోయెను. పోయిపరుండి దీర్ఘాలోచనము ప్రారంభముచేసెను. ''కుమారస్వామి తన్నా విషయమున నూటిపోటిమాట లనఁడు. కాని యీమాట తన్నువచ్చి యెట్లు తాఁకినది? ఇతనిమాట యేమి? చాలమంది వక్రోక్తులు తన్ను విషమము చేయుచున్నవి. తాను లజ్జాభిమానములు వదలిపెట్టినది. ఏమాటకు, దేనికి రోషము పడరాదు; పడి చేయునది యేమి? తా నన్నిటికిని దెగించెను. లేకపోయినఁ దా నా యూరిలోనే నాటకములలో వేషములుకూడ వేయునా? జీవితములోఁ దప్పనునది యొకసారి చేయుము? చివరదాఁక దానికర్మ మంతే. పాపము, జోస్యులు న న్నెంత ప్రేమించెను? అతఁ డసుందరుఁడు. నేను సౌందర్యవతిని. తనకు నేను దొరికినందుల కతనిసంతోషము భూమి పట్టినది కాదు. రామేశ్వరము నన్ను చేసినయన్యాయమునకుఁ దగిన ప్రతిక్రియయే తాను జరిపెను. తాను జోస్యులకుఁ జేసిన యన్యాయమున కేమి ప్రాప్తియో! ఏమి ప్రాప్తియున్నది? అఱువది దెబ్బది వేల యాస్తితోఁ దాను మహారాణివలె నున్నది. కాసాపేటలో పెద్దమేఁడ. దానిమీఁద నలువదిరూక లద్దె వచ్చుచున్నది. సినిమా ఎంతచెడినను నెలకు వేయి మిగులుచున్నది. నాటక మాడినప్పుడెల్ల మూఁడువందలు, నాల్గువందలు గిట్టుచున్నవి. హోలున కద్దె యని వందరూపాయలు. లైట్లకే పాతిక. రెండువందలపైన నమర్చినకుర్చీలకు వందకు రూపాయన్నఁ గా నదియొక పదేనురూకలు. తనకు నూటపదార్లు. చీట్లపేక యాడినప్పుడు దీపపుఖర్చు, పేకలుకొన్న డబ్బు, ఇంటియద్దె – ఈరీతిగా ధన మెంతయేని వచ్చుచున్నది. తన కేమి? సుఖముకాక! ఎప్పుడో దైవము నల చిదుకఁబొడుచును.''

మంగమ్మ పెట్టెతీసి యందులో జోస్యుల ఛాయాపట మొకఁ డుండగా నది బల్లమీఁదఁ బెట్టెను. దొడ్డిలోనికిఁ బోయి పారిజాతపుబూలుకోసితెచ్చి సన్ననిదండఁ గ్రుచ్చి యా పటమున కలంకరించెను.

సాయంకాలమునఁ గుమారస్వామి వచ్చెను. వచ్చి వాలిని గన్నులతో, నోటితో బెదరించెను. వాలి కట్టివేసిన స్తంభమునుండి లాఁగుకొనుచుఁ, గాళ్ళమీఁద నెగురుచుఁ, బండ్లిగిలించుచుఁ గిచగిచలాడెను. కుమారస్వామి సన్నని గడ్డిపరక యొకఁటి పుచ్చుకొని, రామాయణపతాకాప్రతినాయకుని గొట్టఁబోయెను. వాఁడు సుడులు తిరిగి, గిలగిలలాడి, పాఱిపోయి, కుప్పించి, యెగసి గగ్గోలుపడెను. లోనుండి మంగమ్మ 'యెవరది' యనుచు బయటికి వచ్చెను. వచ్చి కుమారస్వామిని జూచుచునే "రోజురోజుకు మఱీపిల్లవాఁడ వై పోవుచున్నాఁడవు! ఏ తలకుమాసినవాఁడయ్యా నీ కుద్యోగ మిచ్చినది?" యనెను. కుమార—ఊరందఱికి నాయుద్యోగపుసంగతియే పట్టినది. 'దరిద్రుఁడు తలగడిగిన వడగండ్లవాన' యని, రాకరాక నాకొక యుద్యోగము వచ్చినది. దానిని జెడగొట్టుట యెట్లా యని యూరిలోనిచుప్పనాతులందఱును విచారించుచున్నారు. మంగమ్మ- ఉద్యోగములేకపోయిన బ్రదుకలేవా? కుమార— ఇంక బ్రదుకుట యెట్లు? అత్తగారిపని యైపోయినది. అప్పున కాస్తికి సరిపోయినది. మిగిలిన యాస్తి యేమియు లేదు. ఇల్లును, బదియెకరములును గూఁతురుపేర నున్నది. అవి నాకెందుకు? మాబావమఱదిపేర వ్రాసెదను. నాకుఁ దిండి కేది? ఈ యుద్యోగము నిల్చునను నమ్మకము నాకు లేదు. మంగమ్మ- ఎందుచేత? కుమార- ఎందుచేతనా? నేను ధర్మారావుగారివద్దఁ జదువుకొన్న దోషముచేత. మంగమ్మ- నీవుకూడ నుపన్యాసములు దంచుచుంటివా యేమి? కుమార- ఆవుచేనిలో మేసిన దూడ గట్టున మేయునా? సరేకాని, నేఁడు మనోహరులకుఁ గోపమువచ్చిన దేమి? మంగమ్మ- వారికిఁ గాఫీ చల్లారినదట. వారు ప్రత్యక్షముగా నోడదిగి వారమురోజులైనదాయెను వచ్చి! బెడ్‌టీ లేదు. కాఫీ చల్లారిపోయినది. కుమారస్వామి వాలిగొలుసు నూడఁదీసి లోనికిఁ దీసికొనిపోయెను. పిల్లలుకొట్టవచ్చినపుడు పాములవాండ్రకోఁతి పాములవాని వెనుకకువెనుకకుఁబోయినట్లువాలిమంగమ్మచాటునకుఁబోయెను. కుమార- ఈ వెధవకు నేను బాబు నని తెలియదు. నన్నుఁ జూచిన భయపడు నేమి? మంగమ్మ- ఔనౌను. నీవు సవతితండ్రివి కాదూ! కుమార- నేఁటికాలమున సవతితల్లు లెక్కువ. పురాణకాలమున

సవతితండ్రుడు లెక్కువ. వాలి సుగ్రీవులు, కేసరి వాయువులు, యమ వాయ్వింద్రాశ్వినులు - వీరు జంటలు. పూర్వము నాయుద్దేశ్యము దేశమంతయు మలయాళము. ఆస్తి స్త్రీలది. వారు ఎంతమంది భర్తలనైనఁ జేసికొనవచ్చును. మంగమ్మ- మఱి యుద్యోగముపోవుటకు వేమి? పరిశోధనభాగములోనే చేరినావు. నీకు డాక్టరేటు వచ్చును. కుమార- ఈ కాలములో చదువు సంఖ్య లెక్కయె లేదు. ఇప్పుడు మన తెలుఁగు ఎం. ఏ. లంద లుండిరా? రేపు మనను కాఁబోవుపరీక్షలో వారికి బద్యమిచ్చి యర్థముచెప్పుమన్నచోఁ జేత కాదు. ఒకాయన అంతస్థములు, నూష్మములవెనుకఁగూడ నఱ సున్నలు వేసినాఁడు. మఱి యొకాయన ఏకలము లనఁగా వరిపొలా లని యర్థము చెప్పినాఁడు. నిజమైనయర్థము చెప్పినచోఁ దానే యగు నేమో యని. మఱియొకఁడు పిల్ల లర్థమడుగఁగా నది రేపు చెప్పెద ననును. ప్రతిదియుఁ బరిశోధనయే. దేశములో నుపజ్ఞచంపుటకుఁ బరిశోధన లని వెండ్రికలులెక్కపెట్టుట యొకఁడు ప్రారంభమైనది. మంగమ్మ- నీ వన్నమాట నిజమే. తాటిపట్టె కింత యెదురుదేకినచో నుద్యోగములు నిలువవు. పైఁగా నసభ్యపుమాటలుకూడనా? కుమార- వెండ్రుక లసహ్యా మటమ్మా!

కుమారస్వామి సంగీతముతో నీపద్యము చదువనారంభించెను: 'ఈ వెండ్రుకలు పట్టి యీడ్చిన యాచేయి తోలుతగాఁ బోరిలో దుస్ససేను, తను వింతలింతలుతునియలై చెదరి రూపఱియున్నఁ గని యుడుకారుఁగాక, యలుపాల పొనుపమునట్టి చిచ్చే యిది?' ఈ పద్యము.

మంగ—ఈ సంగీతమాఁపి కాఫీ కాచెదవా? కుమార- పాలున్నవా? మంగమ్మ—ఆఁ. కుమార- చెంగల్రావు కాఁచరాదా? మంగమ్మ—వాఁడు రాజబంధువు సుషేణుఁడు. వాలి సుషేణు లిద్దఱు నారగించువారేకాని సేవచేయువారు కాదు, కుమార- 'ఎద్దు వలెఁ గుక్కను బెంచి రెడ్డి తానే మొఱిగె'నని యీఁడుదానవు నీవుండగా నేను కాఁచుట యెందుకు? మంగమ్మ- నేను కుక్కను, నీవు రెడ్డివియునా? కుమార- (నవ్వి) మీ యింటికిఁ బెంపుడుకోఁతి యున్నది. పిల్లులను బెంచుచున్నావు. చెంగల్రావు ఆదివరాహ

మున్నాఁడు. లోకములో దొరసానులందఱును కుక్కలను బెంచు చుండఁగా మీకు లేకపోవుట యేమి? మీరు రైలుఖర్చు లిచ్చినచో బెంగుళూరుపోయి మంచికుక్కను గొని తెచ్చెదను. మన డి. ఎమ్. ఓ. తెచ్చినాఁడు. దానిఖరీదు. ఆఱువందలరూపాయలఁట. మనము పదునాఱువందలు పెట్టి తెత్తము. మంగమ్మ-నీకు డబ్బుమీఁద యాశ యింకను బోలేదు. కుమార-మీరు కంటికిఁగనిపించుచున్నంత సేపు పోదు. డెబ్బదివే లేమి చేసెదరు! నే నీయుద్యోగము మాని వేసెదనుగాని, నా కా మేఁడయుఁ బదివేలును వ్రాసి యీయరాదా? మంగమ్మ- చాలునా? ఇం కొకపదివే లిచ్చెదను, తీసికొనుము! కుమార— రామేశ్వరముగారు బ్రదికివచ్చినచోఁ దీసికొందును. మంగమ్మ- ఏమి? కుమా- వాఁడు నన్ను దయ్యమై పీఁకుకొని తినినచో? మంగమ్మ— వాఁడు వచ్చి నన్నుఁ బీకుకొని తినునుగాని, ని న్నేమియుఁ జేయఁడు. ఇంతలో వాలి మంగమ్మ బుజముమీఁద నెక్కెను. కుమార-కోఁతిమీఁద కోఁతి. మంగమ్మ— అ దేమిటి? కుమార-కన్నడములో మంగ యనఁగా కోఁతి. మంగ— నీవు పదివేలకు, మేఁడకుఁ జెడెదవు. కుమార - ఇరువదివే లంటివి కదమ్మా! మాటలోననే రెండుమాటలా? అయినను నీ కంత కోప మెందుకు? మనస్సు నిజముగా కోఁతివంటిది. ఆదిశంకరు లిట్లే యన్నారు కదా!

"సదా మోహాటవ్యాం చరతి, యువతీనాం కుచగిరౌ
నట త్యాశాశాఖా స్వటతి, ఝడితి స్వైర మభితః
కపాలిన్, భిక్షో! మే హృదయకపి మత్యంతచపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ! భవదధీనం కురు విభో!"

మంగమ్మ కన్నీళ్లు గార్చెను. కుమారస్వామి— 'యేమి, కన్నీరుపెట్టుకొందు?' వనియెను. మంగమ్మ- తలమీఁద కూర్చున్న యీ పాడుకోఁతి కన్నులలో నేదియో దులిపినది. కుమార—సరే, యీ బొమ్మ యెవరి దమ్మా?

మంగమ్మ జవాబుచెప్పకుండుట చేతఁ గుమారస్వామి యామె వంకఁ జూచెను. ఆమె బలవంతముగాఁ గోఁతిని డించి, కుర్చీలోఁ గూర్చున్నది. మొగమునం దొకవిషాదరేఖతోఁచెను. కుమారస్వామి

లోనికిఁబోయి స్టౌ వెలిఁగించి కాఫీ కాఁచెను. కాఁచుచుండఁగా వాలి పోయి ప్రక్కఁ గూర్చుండెను. కుమారస్వామి 'వెధవా! పో! త్రేతాయుగపుముండకొడుకవు. నీకు కాఫీ యెందుకు?' అనెను. వాలి, 'రామాయణములో వాల్మీకి వ్రాయలేదు గాని, పరిశోధన చేసినచో నా విషయమును దెలుసు. లంకలో టీప్లాంటేషన్సు పూర్వ ముండెడివి. లేకపోయిన రాక్షసు లెందుకున్నారు?' అన్నట్లు కిచకిచలాడి, కుమారస్వామి కంటుకొని కూర్చుండెను. చెంగ్లావు వచ్చెను. కుమార- ఏమోయి, మూఁడవ అవతారము! ఈ వాలిని గొంచె మవతలకుఁ దీయుము. ఏడవయవతారమునకు, మూఁడవయవతారమునకు సబంధము కలిపెదము.

వాలి కుమారస్వామిని వదలలేదు. కాఫీ యైనది. మంగమ్మను 'కాఫీయైనది. లోనికిఁ దయచేయుఁ' డని కుమారస్వామి పిలిచెను. ఇరువురును కాఫీ త్రాగుచుండిరి. వాలిభాగము వాలి కిచ్చిరి. వాలి చరచర త్రాగివేసి మంగమ్మకాఫీకై యెగఁబడెను. కుమార- వీఁడన్నింటికి నింతే. సుగ్రీవునిభార్యకై యెగఁబడెను; ఇప్పుడు మీ కాఫీకై యెగఁబడుచున్నాఁడు! మంగమ్మ—తార వాని దైనతరువాత తారకాఫీమీఁదమాత్రము వాని కధికారము లేదా? కుమార— అవును గాని, యాబల్లమీఁద ఫొటోగ్రా ఫెవరిది? మంగమ్మ- నీవు కాఫీ చాల చక్కఁగాఁ గాఁచెదవు. కుమా- నేను కాఫీ కాఁచుటకు, మీరు నాటకము లాడుటకు. మంగ-నేఁడప్పుడే పాఠశాల యైనదా? కుమార- మా ఈట్సునకుబదులు మీరైనను ప్రిన్సిపాలైతిరి కాదు. వాఁ డేదో పాపము! పనియున్నప్పుడే రమ్మనుచున్నాఁడు. అందుకనియే యాఁడువాండ్ర కధికార మీయరా దన్నారు. త్రెయినింగు స్కూలు నధ్యక్షురాలు చూడలేదూ? ఉపాధ్యాయుల ప్రాణములు కొఱికి తినుచున్నది. మంగమ్మ- ఆమె బ్రహ్మచారిణి యఁట కదా! కుమార- 'అస్ఖలిత' శబ్దము వదలితి రేమి? అది యట్టిపెట్టుకొన్నారు కాఁబోలు! మంగమ్మ- ఇంకఁ చాలులే, వెళ్ళు. కుమార— ఆ బొమ్మ యెవరిది? మంగ — జేపు చెప్పెదను. కుమార—జేపు గురువు కర్ణాటకములోనికి వచ్చెనా? మంగ— ఆయన పేరు జోస్యులు. కుమారస్వామి 'ఓహో' యనెను.

శరదృతువు వచ్చి వర్షము మొలిపించినపచ్చగడ్డి కన్నెలకుఁ దలలోఁ బూవులు పెట్టెను. కళాశాలలో వివేకానందస్వామి వ్రాసిన 'పూర్వపాశ్చాత్యము' లన్న గ్రంథము పాఠముచెప్పుచుఁ గుమారస్వామి పాశ్చాత్యనాగరకతాపద్ధతులు- వివేకానందస్వామి గ్రంథము నందుఁ దిరస్కరించినవానిని-విస్తరించి వ్యాఖ్యానముచేయుచుండెను. క్రైస్తవవిద్యార్థులందఱును, దామందఱును దొరల మనుకొందురు. వారికి హిందూ దేశమునం దభిమానముండదు. వారియభిమానములు హూణదేశము - పాశ్చాత్య నాగరకత - వానియందే యుండును. అందుచే వారియందఱికిఁ గోపమువచ్చి వారు క్లాసులోనుండి లేచి పోయిరి. కుమారస్వామి యుపాధ్యాయుఁడుగా వచ్చిన యైదునెలల నుండియుఁ బాశ్చాత్యపద్ధతులను నిత్యమువిమర్శించుటయే యతనిపని. భారతీయమార్గములను సమర్థించుట యతనిపని క్రైస్తవమతము నేమియు ననఁడు. 'ఆ మతమునుగుఱించి మీయభిప్రాయ మే' మని విద్యార్థు లడుగుదురు. అతఁడు 'నాకా సంగతి తెలియ' దనును. కాని యతఁడు క్రైస్తవమతమును నిందించుచుండె నని క్రైస్తవ విద్యార్థులు పోయి ఈట్సుతోఁ జెప్పిరి. కుమారస్వామి 'పాఠము జెప్పుచుండఁగాఁ గ్రైస్తవవిద్యార్థులందఱును గది వదలిపోయి' రని ఈట్సుతోఁ జెప్పెను. అతఁడు విషయమంతయుఁ దెలిసికొని 'వారిమతమునకు వ్యతిరేకముగానున్నప్పుడు వారు లేచిపోవుట యుక్తమే' యనెను. కుమారస్వామి మనసులో ననుకొనెను:'అవును, యుక్తమే. మామతమునకు వ్యతిరేకముగా నున్న మీచదువు చదువుట, మీ కళాశాలలోఁ జేరుట మాకును యుక్తమే. ఔను, వారిదేమి తప్పున్నది? వారు కాలేజీకొసనదే మతవ్యాప్తిచేయుటకు. మేమందఱమును భారతీయులము. మాకు ఉద్యోగములు కావలయుఁ గనుక చదువుకొనుటకు వచ్చితిమి. మాలో హిందువుఁ డెవఁడు? మేము ధరించు దుస్తులన్నియుఁ బాశ్చాత్యములు. మాభావములన్నియుఁ బాశ్చాత్యములు. అందఱము వారివలెనే యైనాము. మాకు దురభిమాన మెందుకు? విశ్వవిద్యాలయము ప్రిన్సిపాలుచెప్పినమాట మీఁద నిర్ణయించును. మేము పొట్ట చేతితోఁబుచ్చుకొని వచ్చినవారము,

సామర్థ్యము లేనపుడు పరాభవములను సహించు శక్తియైన నుండ వలయును."

ఉపన్యాసకులగదిలోఁ గుమారస్వామి కూర్చుండెను. క్రిస్టమస్ సెలవులు వచ్చుచుండెను. పరీక్షలైనవి. సెలవులలోఁ బేపర్లు దిద్దవలయును. ఒకయుపన్యాసకుఁ డన్నాఁడు కదా: 'కళాశాలలోని పరీక్షాపత్రములు దిద్దినందుకుఁగూడ డబ్బిచ్చినచో బాగుండును. విశ్వవిద్యాలయపరీక్షలకే యిత్తురు' అని. కుమార—'దురాశ కంతే మిటి? నవనిధులుతిను వారికి మేరుపర్వతమంతయు మేయవలె ననిపించును. విశ్వవిద్యాలయపరీక్షకులకుమాత్రము ధన మెందుకీయవలయును? విద్యార్థులు నూటికితొంబదియైదుగురు ధనహీనులు. తిండి లేనివారు. నేను విద్యార్థిగా నున్నప్పటికష్టములు నాకుఁ దెలియును. లోకములో దమ్మిడీ దొరుకుట లేదు. దొడ్లమ్మి, గోవులమ్మి, పిత్రియమైన ఆస్తి యమ్ముకొని, పెండ్లముమెడలో నగలమ్మి, వారములు చేసికొని, వారిని వీరిని యాచించి డబ్బు తెచ్చి జీవితములు కట్టుచున్నారు. ఈ చదువులతోఁ బ్రతిసంసారము 'గృహస్థలభాండశుద్ధి రస్తు'గా నున్నది. ఆర్థికదుస్థితి యని యుపాధ్యాయుల జీతములలో విఱుఁగఁగోయు మన్నారు. విద్యార్థులనుండి తక్కువజీతము లేల పుచ్చుకొనరు? రాఁబడి యంతకంతకు వృద్ధిచేసికొనుచు వ్యయమునందుఁ దగ్గించి యేమి చేసెదరు? నలువదిరూపాయలు, ముప్పది రూపాయలు పరీక్షరుసుము తీసికొనుచుండిరి. పత్రికలు దిద్దువారందఱు నెచటనోయొకచోట నుపాధ్యాయులే కదా! వారికి సెలవులలో వారిజీతములు ముట్టుచున్నవి కదా! సెలవులలో వారేమి పని చేయుచున్నారు? పరీక్షాపత్రములు దిద్దినందుకు వారికి డబ్బేల యీయవలె? ఒక్కరూపాయ కాగితములతో జరిగిపోవు పరీక్షకు నలుబది రూకలు రుసుమా? ఛీఫ్ సూపరింటెండెంటుకు బది, తక్కినవారికి నాలుగు, పత్రములు దిద్దినవారికి రెండుమూఁడు దొడ్డిసంభావన. ఆస్తులమ్మి, పెండ్లము నగలు పుస్తెతో నమ్మి యింటిలో గడ్డికరచి వాఁడు తెచ్చినడబ్బు నెలకు రెండుమూఁడువందలజీతములు తెచ్చు ప్రభువు లేల తినవలయును? అస లింతజీతము లెందుకు? నూఱురూకల కన్నజీత మెక్కువ తెచ్చినవాఁడు దేశద్రోహి 'యని చెప్పవచ్చును.

గాంధిగా రదియేకదా చెప్పెను! స్వరాజ్యము వచ్చినతరువాత నైదు వందలు దాఁటి యెవ్వనిజీతము నుండదఁట! మనకు నాల్గువందలు జీతము వచ్చినదికదా యని కాదు, సంతోషము! వచ్చినమార్గ మెట్టి దని!'

తక్కినయుపాధ్యాయులందఱికిఁ గోపము వచ్చెను. సెలవు లిచ్చిరి. సెలవులలోఁ గుమారస్వామి ధర్మారావువద్దకుఁ బోయెను. 'ఏమండి! మాయింటివైపే చూచుట మానివేసితి' రనెను. ధర్మారావు—మీ రుద్యోగస్థులు. మునుపటివలె మీతో మాటాడవచ్చునో, రాదో యని వచ్చుట లేదు. కుమార—కన్నులు చూడండి ? కనుబొమలక్రింద నున్నవా ? ధరా—నెత్తి మీఁద మెలుచుకన్ను లివి కావు; పెద్దపులివేషగాని కున్నట్లు వేషే యుండును. వానిపైని తలపాగయుండును. కనుక మన కవి కనఁబడవు. ఆ కన్నులు నీకు లేనట్లే యున్నవి. కుమార—తలపాగ నంటుకొని యుండునేమో! ఇప్పుడు తలపాగ లేదుగదా ! ధర్మారావు—మీ కాలేజీవిశేషము లేమి ? కుమార—ఏ మున్నవి? ధర్మారావుగారు కళాశాలలలో నాంధ్రోపన్యాసకులుగాఁ బనికిరారు. ధర్మా—అది యేమిటి? నే నచ్చట నుపాధ్యాయుఁడను కానుగదా ! కుమార—ఛాయాపటమే పనికిరానప్పుడు మాతృక యసలు పనికిరాదు. ధర్మా—ఏమైనది? కథ చెప్పుము. కుమార—మనయభిప్రాయము లేమియు నచట పనికిరావు. ఆ కళాశాలలలో వినయ మనఁగా వారి సిద్ధాంతముల కనువర్తించియుండుట. ఇంగ్లీషువారి నేమియు ననరాదు. వారి యాచారములు మంచివి కావనరాదు. ఏమాట కామాటయే. వారి మతమును గుఱించి నే నేమియుఁ బ్రస్తావించలేదు. అయినప్పటికి నన్నుఁజూచిన వారికి ద్వేషముగా నున్నది. సరేకానీ, వారు మాటికి మాటికి 'దేవుఁడొక్కఁడే, మీ కింతమంది దైవము లేమిటి' యనుచుందురు. దాని కేమి చెప్పవలయును ? ధర్మా—దేవుఁ డన్న శబ్దము నిత్యైకవచనము. దేవుఁ డొకఁడే యని యా శబ్దమే చెప్పుచున్నదికదా! దేవుఁ డొక్కఁడే. కుమార—నే నట్లు చెప్పినచో వారర్థముచేసికొనలేదు. అసలు వారికి మీరు చెప్పు శబ్దసిద్ధాంతము తెలియదు. ధర్మా—ఆ సిద్ధాంతము నేను చెప్పలేదు. మనలో నిది

వలెనే యున్నది. అర్థము లేకుండ శబ్దము లేదు. కనుక తత్త్వము
శబ్దార్థము. తదర్థము సరిగా నిర్ణయించినచో దికమక లుండవు.
పురాణభాషలో విస్పష్టమైన యర్థముకలశబ్దములు పరమార్థవిషయ
ములు బోధించునవి లేవు. శబ్దవ్యుత్పత్తికిఁ, బ్రయోగమునందలి
దానియర్థమునకుఁ బొసగదు. కుమార — సరియే. మన కనేకదైవము
లుండిరికదా! ఇంతమంది దైవములకుఁ బొసగుట యెట్లు? వీరిని సమ
సించుట యెట్లు? ధర్మా — నీకీ మాత్రము తెలియదా? కుమార —
మీరు నాకుఁ జెప్పినది తెలుఁగు. ఈ సంగతు లెప్పుడైనఁ జెప్పి
తిరా? ధర్మా — నీ విప్పుడేకదా నన్నడుగుచుంటివి? నీకు సర్వ
వేళల మంగమ్మకొలువుతోనే సరిపోయెను. కుమా — మంగమ్మగారు
పూర్వ మా పాపము చేసినమాట నిజమేమో కాని, యిప్పు
డామె చాల మంచిదండీ! ఆమె ప్రతియేకాదశి యుపవాస ముండును.
మడి కట్టుకొనికాని భోజనముచేయదు. యాచకునకు లేదని
యామెనోట రాదు. ధర్మా — యాచకు లెవ్వరైన వత్తురా యేమి?
కుమార — ఇప్పుడు కుండలులే వచ్చుచుండిరి. ధర్మా — అనఁగా?
కుమార — కుండలి యనగాఁ బా మొక్కటే కాదుగదా! కుండల
ములు ధరించిన బ్రాహ్మణులుకూడను. ఆమె నిత్యము స్నానము
చేసి జపముచేసికొనికాని భోజనము చేయదు ధర్మా — గూడెములోఁ
గ్రతువుచేసిన ట్లున్నది. కుమార — మీరు గాంధిగారి యంత్యై
మోద్యమము నొప్పుకొనరేమి? మీరు చాల పూర్వాచారపరాయ
ణులు. పంచములసంగతి యొప్పుకొనకపోవుట బాగుగా లేదు. ధర్మా —
నే నేమొప్పుకొనలేదు? వాండ్రందఱును గూడెములలో గుడిసెలలో
బ్రదుకుచుండఁగా దేశోద్ధారకులను వారి కిండ్లు కట్టిపెట్ట వద్దంటినా?
వారివీథులు నిండ్లు పరిశుభ్రముగానుండునట్లు చేయవల దంటినా?
వారికి నూతులు బావులు త్రవ్వించిపెట్టనాత యుండెనేని వల
దంటినా? ప్రతిదినము స్నానము, శుభ్రమైన వస్త్రములు తాల్చుట,
కూటి కమర్చి పెట్టుట — ఇవి వారికి వలదనలేదు. మొదట నివి సమ
కూర్చి పెట్టుము. ఎవఁడును దానికి నడ్డుచేయఁడు. దేవాలయ
ములలోనికి వారిని రానిత్తు మందురా? శ్రేయము లేని పనిగదా!
'ఊరిమీద నూరు పడినను గరణముమీఁద గాసుపడదు.' చెడిన

దేవాలయములోని దేవుఁడు చెడుగాక, మన కేమి? కుమార—దేవా
లయములోని దేవుఁ డెందుకు చెడును? ధర్మా—నాది వాదన
కాదందువుగాని యొకమాట యడిగెదను. పరపురుషసంగమము
వలన భార్యను బరిత్యజించుట యెందులకు? ఆమె యేరీతిగా నపవిత్ర
యైనది? దానికి సమాధానము నీ మనసులో, నీ తత్త్వములో
నున్నది. అట్లే యప్రత్యక్షవిషయములనుగూర్చి ప్రశ్నించరాదు.
అవి యథాస్థితికముగ నంగీకరించఁదగినవి. కుమార—దేవాలయ
ములలోని పూజారులు, బ్రాహ్మణులు వీరికున్న యెక్కువగుణము లేమి,
పంచములకున్న తక్కువగుణము లేమి?

ధర్మా—ఆప్రశ్న మనుజులవర్ణమునుగూర్చివచ్చిన ప్రశ్న. వర్ణము
కల్పితమా, సహజమా యని. పశువులం దావులు, బఱ్ఱెలు, మేకలవలె
బ్రాహ్మణులు, తదితరవర్ణములవారు భిన్నమైన వర్ణములవారా?
యను ప్రశ్న. ఈ ప్రశ్న వెనుక నొకయర్థ మున్నది. ఆవు చుఱుకైన
జంతువు, బఱ్ఱె మందమైన జంతువు. మోటారు పోవుచుండఁగా
బఱ్ఱెలగుంపు చూడు. చచ్చినను కదలదు. సూక్ష్మముగా యోజిం
చుము. దాని ప్రకృతిలోని యీమాంద్యము దాని రక్తమం దున్నది.
ద్రవ్యమునుబట్టియే గుణము వచ్చినది; గుణమునుబట్టియే ద్రవ్యము
వచ్చినది. వాని రెంటికి నవినాభావసంబంధ మున్నది. బ్రాహ్మణునిజూచి
నంతనే బ్రాహ్మణుఁడని తెలియుచున్నది. తునివైపు క్షత్రియులను
జూడుము. వెంటనే క్షత్రియుఁడని తెలియును. వారు ధరించు దుస్తుల
వలన, తక్కినలక్షణములవలన గ్రహింతుమందువేని నది కాదు. ఇప్పుడు
సర్వజనులకు నొకటియే దుస్తులై పోయినవి. కాని భేదము కనిపించుట
లేదా? ఆ భేదము కొన్నిచోట్ల లేదు. క్రైస్తవుఁడు క్రైస్తవునివలెఁ
గనిపించుచున్నాఁడు. అది భేదమే. అది వర్ణమే. కా దని యెవ్వఁడు
ననఁడు, తెలిసినవాఁడు. అందఱు నొక్కటి యనుసిద్ధాంతము పశువు
లన్నియు నొక్కటియే యనుసిద్ధాంతమువంటిది. ఆవుపేఁడతో నిల్ల
లుకుకొందుము. గేదెపేఁడ గజికి వేసి కట్టెదవు. గోవుపంచితము గోడ
లకుఁ జల్లుదుము- వృశ్చికాదులు నశించుట ప్రత్యక్షమైనవిషయము.
బఱ్ఱెకీ గౌరవము లేదు. ఈ భేదము ప్రత్యక్షమే. దాని తత్త్వజ్ఞానము
సూక్ష్మదర్శికే తెలియును. అట్లే భిన్నవర్ణములందు భేదములున్నవి.

కుమార- ముఖలక్షణములు, ఉనికితీరు, దుస్తులు, నడకతీరు వీని యందు భేదము లుండవచ్చును. అది ప్రధానవిషయమున భేద మెట్లగును? ధర్మా- ప్రధానవిషయ మనఁగా? కుమార- అందఱమును మనుష్యులమగుటలో! ధర్మా- అందఱమును మనుష్యులము కా మని మే మనలేదు. కుమార—అనకపోయినచో భేదము లేదు. ధర్మా- భేదములు విడిగా చూపించుచుంటిమికదా! కుమార—నే ననునది మీరు సరిగా గ్రహించలేదు. ధర్మా—నీకు ప్రశ్న వేయుట చేతఁగాలేదు. నీ ప్రశ్న యిది: ఆత్మలో భేద మే మున్న దని. కుమార—అవును. ఆత్మలో భేద మే మున్నది? ధర్మా—ఆత్మలో భేదము లేదు. జీవునిలో భేద మున్నది. జలము సర్వసాగరమహానదీనదతటాక కుల్యాపల్వములయం దున్నదంతయు నొక్కటియే. దానియందున్న ద్రవత్వగుణము తజ్జలస్వరూపము సామాన్యలక్షణము. వానియన్నింటికిని భేదము లేల యున్నవి? ఉపాధి నాశ్రయించి యున్నవి. ఉపాధిగత భ్రాంతిచేత జలమే సాగర మగుచున్నది. జలమే చిన్నపడియయు నగుచున్నది. ఉపాధిగత మగుటచేత వానిశక్తులును మాఱుచున్నవి. మహానదిలో- కృష్ణలో- ననేకపట్టణమాలిన్యములు కడుగఁబడుచున్నవి. సాగరమువద్దఁగూడ మాలిన్యశంక లేదు. తటాకమున పై రేవున పశువులు పడినచోఁ గ్రిందిరేవునీరు పానీయము కాదు. చూచితివా? భేదము కల్పించిన దెవరు? జలమే తాను తనయున్న భిన్నప్రదేశముల నాశ్రయించి భేదము తెచ్చుకొన్నది. అట్లే యాత్మయు భిన్నోపాధిగతమై భిన్నత్వము తెచ్చుకొన్నది. తదుపాధిగతగుణదోషసంక్రాంతిచేత జీవుఁడు భిన్నుఁ డగుచున్నాఁడు. కుమార- సరస్తటాకసాగరాదిభేదము దృశ్యమాన మగుచున్నది. మానవులయందలిభేదములు దృశ్యమానమగుటలేదు. ధర్మా-ఎందుకు లేదు? వివేకవంతుఁడు, చదువుకొనినవాఁడు సర్వాధికారముచేయుచున్నాఁడు. అవివేకి, చదువుకొననివాఁడు పాలింపఁబడుచున్నాఁడు. ఆ యధికారిలో నెన్ని భేదములు? ఈ పాలింపఁబడువానియం దెన్ని భేదములు? కుమార- ఇవియన్నియు మనుష్యకల్పితములు. ధర్మా- పొఱపా టచటనే యున్నది. ఉపాధి యాదృచ్ఛికమా? నియతమా? నీవలె వాదించువారు యాదృచ్ఛిక మందురు. నేను నియతమందును

రష్యా చూడుము. సర్వభేదములను నాశనముచేసినది. భేదములు లేవా? మంత్రులు లేరా? సేనానాయకులు లేరా? వైద్యులు లేరా? ఉన్నారు కాని, వారు భేదములుపాటించరని నీ వనవచ్చును. ఎందుకు పాటించరు? తాను మంత్రిత్వ మాచరించుటయందుఁ బాటించఁడా? తన యధికా రేతరవిషయములయందు సర్వదేశీయులయందును సామాన్యభావము; అధికారవిషయమున విశేషభావము. భేద మేమైనది. అట్లే మనుష్యులందఱయందును సామాన్యభావము. భిన్నవర్ణములనారీ భిన్నధర్మములయందు విశేషభావము. నీకు ధనము కనబడినంత ప్రత్యక్షముగా ద్రవ్యము కనిపించదు. దానియందలి భేదములు నీవు సరిగా నూహించక కృతకము లనుకొందువు. అదియు నీదోషము కాదు. నెత్తిమీఁదఁ బెద్దమ్మ కూర్చుండి యట్లనిపించుచున్నది. ఇదివఱకు భేదములున్నవనితీసి క్రొత్తమార్గ మవలంబింతువు. కొంచెము జాగ్రత్తగాఁ జూడుము. మఱల భేదములే యేర్పడుచున్నవి. ఎన్నికల సంగతి విచారించుము. వర్ణములుపోయి పక్షము లేర్పాటైనవి. అతివాదులు, మితవాదులు, స్వతంత్రులు. ఆ భేదముకన్న నీ భేదమే యెక్కువ ప్రాణసంకటము. వేఁడిలో తెలియదు. కాఫీహోటళ్ళతిండి చూడలేదా? దానిసొగసు చల్లారినతరువాత. ఇది భోజ్యముగానైన నున్నది. అది వమనమే కుమార- ఇంతమంది దైవము లుండుట యేలనో చెప్పలేదు. ధర్మా- అది యింకొకసారి. కుమార- దేవుఁడొక్కఁడే నంటిరికదా! ధర్మా- అది నే ననలేదు. మీకై క్రైస్తవోపాధ్యాయు లన్నారుకాబోలు! కుమార-మీరును నొక్కఁడే నంటిరి కదా! ధర్మా- 'దేవుఁడు, దేవుఁ' డని సామాన్యోక్తి. అది విశేషజ్ఞానము కాదు. వా రనుకొన్న దేవుఁ డుండుటకు వీలులేదు. దేవుఁడు పుంలింగము. అనఁగా మూర్తి యుండవలె. మూర్తి యనఁగానే ద్రవ్యము. ద్రవ్యమునకు గుణము. ద్రవ్యగుణాకారములన్నియు నశ్వరములు. ద్రవ్యగుణాకృత్యాత్ముఁడైనచో నా దేవుఁడు నశించిపోవును. కుమార- మఱి దేవుఁ డనఁగా నేమి? ధర్మా- నా కేమి తెలియును? దేవుఁ డన్నవారికిఁ దెలియవలయును. కుమార- అట్లైనచో ద్రవ్యగుణాకారములు మనము చూచుచున్నవి నశించును. పది యాకృతులు నశించును. వానియం దేకాకృతి యొకటి యను

స్యూతమై యున్నది. అది నిత్య మందను. అట్టి నిత్యమైన ద్రవ్య గుణాకారములు గలవాఁడు భగవంతుఁడు. ధర్మా—దీనినే మహా భాష్యమున శబ్దార్థనిర్ణయముచేయుటకుఁ బతంజలులు చెప్పిరి. కూటస్థములు. అవిచాలులైన వస్తువులలో ననుస్యూతమైన ప్రమ శబ్దార్థ మని. విశిష్టాద్వైతుల సిద్ధాంతముకూడఁ గొంతవఱకు నిదియే కాని, ద్రవ్యగుణాకారములు నశించును. ఇవి జన్యములా? జనక మైనపదార్థమొక్కటేయుండవలయును. దేవుఁడొకఁడే యనుచున్నావు కదా! అందుచేఁ బ్రధానమైన దొక్కఁడే వస్తువు. అది ద్రవ్యగుణా దులు కాదు. ద్రవ్యగుణాదుల కంత పరమోచ్ఛ్రాయవైభవము లేదు గనుక. అది ద్రవ్యగుణాదిభిన్నమైన వస్తువై యుండవలయును. దేవుఁడు కాదు. దానినే మనవారు బ్రహ్మ మనిరి. ఈ తత్త్వ మెవరికి? దేవుఁడు, దేవుఁ డని చంకలుకొట్టుకొనువారికి జిజ్ఞాస లేదు. మత ము లేదు. వారు వీని నభినయింతురు.

కుమారస్వామి పొద్దుక్రుంకి యింటికిఁ బోయెను. చిన్న ధర్మారావు రెండేండ్లవాఁడు. తండ్రి యింటికిఁ బోయినంతనే యా నాఁడు తండ్రివద్దకు వచ్చెను. కుమారస్వామి కొడుకును బట్టించు కోఁడు. అది శ్యామలకుఁ గోపము. మీఁది కుఱికిన కుమారుని కుమారస్వామి 'ఓహో! ఈ నాఁ డేదో క్రొత్త యున్నది' యనెను. పిల్లవానిని దీసికొన్నాఁడు కాదు. శ్యామల—అంత యిష్టములేనిది పిల్లలను గనుట యెందులకు? కుమార—నీవు దొంగతనముచేసి నా మీఁదఁ బెట్టుచున్నావే! అనినవ్వెను. శ్యామలయు నవ్వెను. ఆ నవ్వు లోఁ గుమారునిదీసికొనకతప్పినది కాదు. కుమార-నేఁడు మంగమ్మ గారు వచ్చినదా? శ్యామల- మీరు వచ్చిన దెచ్చటనుండి? కుమార- మాస్టరుగారియింటికి వెళ్ళినాను. శ్యామల—ఎప్పుడో దేవుని కల్యాణోత్సవ మఁటగదా! కుమా—ఇంక నైదాఱునెల లున్నది. నీ కెవరు చెప్పిరి? శ్యామల—మంగమ్మగారు చెప్పినది. ఆమె యిం దాఁకటినుండి యిచటనే యున్నది. కుమార—ఆమెకుఁ గల్యాణము మాట యేమి పట్టినది? శ్యామల—ఏమి పట్టినది? కల్యాణమంతయు నామెమీఁదుగానే పోవున ట్లున్నది. కుమార—ఏమిటికథ? శ్యామల— ఆమె యీనాఁటికి స్వామికి నెన్నియో చేయునఁట. పదిపదునొకండు

వేలు వ్యయపెట్టి స్వామికిఁ దన యిష్టమువచ్చినట్లు చేయునఁట. కుమా—జమీందారుగారు ధర్మకర్తయా, యామెయా? వారీమెను చేయనీయరు. శ్యామల—అబ్బాయికి నిద్ర వచ్చుచున్నది. ఇటు తెండు.

మఱునాఁడు కుమారస్వామి మంగమ్మయింటికిఁ బోయెను. వానికిఁ జొక్కా తొడిగిరి. చిన్న దొరటోపి పెట్టిరి. కుమారస్వామి మంగమ్మతో 'అన్నియు బాగుగనే యున్నవి. కాని వానికి నెక్లైకట్టలేదేమి?' అని ప్రక్క నేవో గుడ్డపీలికయుండఁగా దానిని వాని మెడకు బిగించెను. మంగమ్మ 'అది చచ్చిపోవునయ్యా!' అనెను. కుమారస్వామి 'చచ్చిపోయినచో దీనిఫొటోనైన బల్లమీఁద పెట్టుకొనవచ్చును' అనెను. మంగమ్మ—నీవు మాయింటికి రావలదన్న రాకుండ నూరకుండవు. వచ్చినచో నీ నోరూరకుండదు. కుమార—లజ్జాభిమానములువదలినతరువాత నేమియన్నను మనసునకుఁ గష్టముగా నుండదు. మనస్సు లజ్జాభిమానములువదలునది రెండుమార్గములుగా - ఒకటి మనస్సునుబరిపక్వముచేసికొని యోగులగుటవలన; రెండవది మనస్సును మహాకలుషితముచేసుకొని యొకదానిని గుఱించి యూహించినందువలన లాభములేనంతవ్యసనము పెంచుకొనుటవలన. మనస్సును పాపమునందు బహుధా నిమగ్నము చేసినచోఁ జేసి చేసి యెంతదూరము చేయును? అప్పటికి ఛీ యని యొకమొండివైరాగ్య ముదయించును. ఇప్పటి యీ కేషబ్జీమతము మొదలైన మతములవారిసిద్ధాంత మిదియే. ప్రేమయే భగవంతుఁడందురు. సర్వభూతములయందును దయయుండవలయు నందురు. తన యందువలెనే సర్వభూతములయందును దయకలవాఁడేని వానికి స్వార్థమేమున్నది? అన్నిభూతములయందు సమానత కలుగుటయే మోక్షము. అది యింద్రియములను నియమించి చేయుమన్నారు, మనపూర్వులు. ఇంద్రియములకుఁ బ్రవృత్తికల్పించి చేయుమనుచున్నారీ నూతనులు. నియమించుట నిశ్చయమైన మార్గము. బహుధా ప్రవృత్తికలిగించుకొనుట యెచ్చటనో ఫలవంత మగును. మంగమ్మ—ఎచ్చట? కుమార—(చేయి మంగమ్మవైపుకుఁ జూపించి) ఇచ్చట; నీకది యిష్టములేనిచో (వానివైపునకుఁజూపించి) ఇచ్చట.

మంగమ్మ—ఇదివరకే మమ్ముద్దఱి నొకరాశిలోఁ జేర్చితివి. కుమార–ఎవరి నెవరి నొక్కొక్క రాశిలోఁ జేర్చవలయునో నాకన్న వేణుగోపాలశతకము వానికి బాగుగాఁ దెలియును. మంగమ్మ—'ద్విపద కావ్యము, ముదిలంజె, దడ్డికింత'- ఇవి మూఁడు నొకరాశి యన్నాఁడు. కుమార—గౌరన కెంత కోపము వచ్చునకో? మంగమ్మ—పాల్కురికి సోమనాథున కెంత రావలయునో! కుమార—చెన్నమల్లుసీసములు వ్రాసిన యతని ద్విపద? కావ్యము వ్రాసినదోషము పోయినది. మంగ—అవి నాకు వినిపింతు నంటివే? కుమార—నీకు వినిపించుటకు నాకర్మ మేమి కాలినదమ్మా! నిక్షేపముగా మిమనరీ వారు నాకు నూటపాతికరూకలుజీతమిచ్చుట యేమి? నేను నీకొలువు చేయుట యేమి? అందులో ఆఁడకొలువు. వాలి కిచకిచ నవ్వినది. కుమార– ఈ బ్రాధ నవ్వ నెందుకు? తాను నాకన్న నేమి వెలుఁగఁబెట్టినాఁడు? పచ్చికాఫీ త్రాగని వెధవ! మంగమ్మ–నీవు మాటిమాటికి వాలిని దిట్టకు. కుమార– నేఁడు వానిమొగము చూచినచో నా కోడలు మండిపోవుచున్నది. వీనికి నోరటోపి యేమిటి? టోపి పరువంతయు పోయినది. మంగ– ఇంక నీకు సెలవు లెన్నాళ్ళున్నవి? కుమార– పగలు పీడగా నున్నది కాబోలు! మంగ–నీయిష్టము వచ్చినట్లు మాటాడుము. నా కేమి పీడ? కుమా– నీ యింటికి వచ్చినచో నిదేవమ్మా! ఏదో ముచ్చటగా ని న్నొకమాట యనవలె ననిన నీకు ముక్కు బారెఁడు. వాలి నేమైన ననవలె ననిన వీని కసలు ముక్కే లేదు. 'వీని కసలు ముక్కే-లేదు' అని సంగీతముతో ననఁజొచ్చెను. మంగమ్మ– నేను లోనికిఁబోవుచున్నాను. కుమార– నే నంతలోనికి రాలేను ఇరువురును బోయి చావడిలోఁ గూర్చుండిరి. చెంగల్రావు వచ్చెను. చెంగ– కుమారస్వామిగారూ! మీరు చూచితిరా? కుమార– చెంగల్రావూ! నీవు విన్నావా? మంగమ్మ– ఆయన చూచిన దేమిటి? ఈయన విన్న దేమిటి? చెంగ–ఏమిటా? మీయిద్దఱినిగుఱించి పిల్లలు గోడమీఁద వ్రాసినారు. కుమార– మంచిపని చేసినారు. ఇంతకు మంగమ్మగారికి మంచి రోజులు. మంగ– దుర్మార్గులు వేయిరీతుల నందురు. నీవు దుఃఖించవలసినప్పుడు హాస్యమాడెదవు. తాడిచెట్టుక్రింద నిలుచుండి పాలు

త్రాఁగినను కల్లే యందురు. కుమార- నేను తాడిచెట్టుక్రింద నిలుచుండను లేను; పాలుత్రాగను లేను. కల్లనుకొనిన నాకేమి భయము? కల్లు వట్టి కర్మ. కర్త లేదు, క్రియ లేదు, 'వాఁడు కల్లు త్రాగెను'లో వాఁడు త్రాగెను లేదు. వట్టి కల్లున్నది. నాకేమి నష్టము? మంగ- నీచమత్కారము నా మొగమువలె నున్నది. కుమార—దాని కేమి? ఎనుబదివేలు సంపాదించినది. మంగ- వాళ్లు వ్రాసిరనఁగా నీకేమియు మనస్సునకుఁ గష్టముగా లేదా యేమి? చెప్పుము. కుమార—మీయింటి పే రేమిటి? పసుపులేటియా, పసుమర్తియా? ఏదో 'పి' అన్నయక్షర మున్నది! నేను దానికి పిచ్చి యని యర్థము చెప్పెదను. పిచ్చి మంగమ్మగారూ! లోకము నీకు మేలు చేయుచున్నది. పరులనుగూర్చి మిథ్యాపవాదములు పలికినవారు, వారిపాపములు పంచుకొందురు. నీ విదివఱకుఁ జేసినపాపము నేఁ డీ జనమంతయుఁ బంచుకొనుచున్నది. నీకు మంచిరోజులు దగ్గఱకు వచ్చినవి. నీయందు సద్గుణమే తప్ప దుర్గుణము నాకు గోచరించుట లేదు. నీ పాపములు నశించుచున్నవి. ఇంక నైదాఱునెలలలో నీ వేమగుదువో యెవరికిఁ దెలియును? మంగమ్మ- నాయనా! తెలియక పాపముచేయుదు మనుకొనుము. మన మనుభవించనే వలయునా? కుమా—తెలియక పసిపిల్లవాఁడు నిప్పు ముట్టుకొనెను. అది కాలకుండ మానునా? మంగమ్మ- నీ వింత తెలివిగలవాఁడ వెట్లైతివి? కుమార- చంద్రున కంత కాంతి యెట్లు వచ్చినది? మంగ— నీవు వంకరగాఁ దప్పు, సరిగా మాటాడ లేవు. కుమార- ఇంకను దొడ్డిత్రోవనే యున్నారా? మంగ—నేనదికాదు చెప్పునది. నీ యర్థము సరియే. ఏదియో యొకయలంకారములేకుండ మాటాడవని. వంకర యన్న వక్రోక్తి యని. కుమార- ఆ ప్రశంసాపత్రము వ్రాసి నా మొగానఁ బాఱవేయుఁడు. వీ రుద్యోగము తీసివేసినచో మఱొక చోటఁ దెచ్చికొందును. మంగమ్మ— నావంటిదానికి నమస్కారముచేసినచో నన్నుఁ బోలి బ్రదుకు మన్నదట! కుమార—నోరార ననుకోరాదా? నావంటిదాని కని మన్న మెందులకు? మంగమ్మ— చెంగలావ్రపూ! వాలి నెవరో పిల్లలు బెడ్డలతోఁ గొట్టుచున్న ట్లున్నది. వాఁ డూరకే యఱచుచున్నాఁడు. పోయి తీసికొనిరమ్ము. కుమార-

వాలి మీకు దొరకెనా? కొన్నారా? మంగ—ఇదివఱకు చెప్పితిని కాదా! కుమా—మఱచిపోయినాను. మంగ—కా దేదో యెత్తు వేయుచున్నావు. కుమార—ఎత్తు కాదు పల్లమే. మంగ—దీనిని సాహె బెవఁడో యాడించుచు దీని తల్లితోఁ బాటు తెచ్చెనఁట. తల్లికి విద్య వచ్చును. ఇది దాని వెంటవెంటనే తిరుగుచుండెనఁట. చెంగలరావు దీనిని దల్లికిఁ గొంచెము దూరముగాఁ బోనిచ్చి దీని కేదో మందు పెట్టెను. ఆ మందు తిన్న కోఁతులు, మృగములును పెట్టిన వాని వెంట వచ్చునఁట. కొంతసే పైన తరువాత సాహెబు చూచుకొనఁగాఁ బిల్ల కనిపించలేదు. ఇది బెజవాడలో జరిగిన పని. చెంగలరావు దీనిని దెచ్చెను. కుమా—మఱి దీనికిఁ జెంగలరావు నందుకన్న నీయం దెక్కువ ప్రేమయే! మంగ—ఆ మందుమత్తు నాల్గురోజు లుండును. కుమార—చెంగలరావు కోఁతి నెందుకు తెచ్చినట్లు? మంగ—ఊరకయే. కుమార—పాపము దానితల్లి యెంత యేడ్చుచున్నదో! నిర్దయులు తమకు లభించుటయే చూచి కొందురుగాని, యా వస్తువో మనిసియో నష్టమైనందువలన కలవారి కెంతదుఃఖము పుట్టునో యోచించరు. ఇది కనపడకపోవుటవలనఁ దల్లికోఁతి చనిపోయియుండవచ్చును. మంగమ్మ—నీమనస్సు చిత్రమైనది. ఉండియుండి యిట్లు స్వర్గవీథులకుఁ బోవు టేమి? కుమార—నేను చెప్పునది తెలిసినదా? మంగ—నీవు నన్ను నిందించుట లేదు. ఇది చెంగలరావు చేసిన తప్పు. కుమార—కోఁతి చెడిపోయినది. మంగ—ఇద్దఱు మొక్కసారియే బాగుపడెదములే. కుమార—నే నంత యర్థ మనుకొనలేదు. మంగ—నీకును గొంత పుణ్య ముండక పోదు. కుమార—పుణ్య మనకుము; ఫల మనుము. మంగ—అవును. మీ రింకను బాగుపడి బట్టకట్టవలసినవాండ్రు.

సెలవులై పోయి మఱలఁ బాఠశాలలు తెఱచిరి. కుమారస్వామి యొక గ్రంథము పాఠము చెప్పుచుండెను. ఆ పుస్తకమునం దౌచిత్యము లేదు. గుణములు లేవు. శబ్దగతార్థగతవాక్యగతదోషములు సమృద్ధిగా నున్నవి. అతఁడు విసుగుపుట్టి పుస్తక మచట పెట్టి విద్యార్థుల కుపదేశించెను: 'ఎవఁడో యొక గ్రంథము వ్రాయును. వాఁడు పండితుఁడుకూడ నై యుండవచ్చును. మహాకవి యొక్కనికే

యౌచిత్యము తెలియును. ఔచిత్య మెఱుఁగనివాఁడు వ్రాసిన గ్రంథము తగులఁబెట్టవలయును పాఠ్యగ్రంథములు నిర్ణయించువారి నాశ్రయించినచో నెట్టిగ్రంథమైనను పాఠ్యగ్రంథముగా నిర్ణయింపఁబడును. ఆ సభవారు పుస్తకములే చదువరు. ఇది 'ఫలానా శాస్త్రి గారు వ్రాసిరి. ఆయన చాల మంచివాఁడు. ఏదో పది డబ్బులు వచ్చును. వారు సంతోషింతు' రని పుస్తకములు వేయుదురు. ఇది వర్తకముకన్న కనాకష్టమైపోయినది. తప్పు లున్నవనుట తప్పు. అసలిన్ని పుస్తకము లెందుకు? ఆఱుసంవత్సరములు మీ రందఱు స్కూలుఫైనలుదాఁక తెలుఁగు చదివితిరి. తరువాత నాలుగేండ్లు చదువుదురు. ఇప్పటికి ఉత్తునకు సంధి నిత్య మనఁగాఁ దెలియదు. 'జలజాతాయతనేత్ర' యన్నచో నర్థము తెలియదు. మొన్న నీ పెద్దమనిసి లేచి కీచకవధపాఠము చెప్పుచుండఁగాఁ బాండవులు విరాటనగరములో నెందు కున్నారని యడిగెను. పదిపుస్తకములు చదువుఁడని మీ మొగానఁ గొట్టుటయే కాని మీకుఁ జదువు వచ్చుచున్నదా, లేదా యను విచారణ లేదు. ప్రతివాఁడును బరీక్షయగుచున్నాఁడు. క్రొత్తపద్య మిచ్చి యర్థము చెప్పుమనఁగా నెవఁడును జెప్పలేఁడు. పుండరీక మనఁగా వ్యుత్పత్తి యేమిటి? సైరంధ్రికి వ్యుత్పత్తి యేమిటి?—ఇవి ప్రశ్నలు. ఇఁకఁ దెలుఁగుపరీక్షాపత్రములలోఁ బాఠ్యగ్రంథములు మాఱుటతప్ప స్కూలుఫైనలుకు, ఎఫ్. ఏ. కు, బి. ఏ. కుఁ బ్రశ్నలన్నియు నొకటేమోస్తరు. వ్యాకరణవిశేషములు ఎఫ్.ఏ. కు నవియే, ఎమ్. ఏ. కు నవియే. పరీక్షాపత్ర మిచ్చువాఁడు తాను తెలివిగా నీయవలయు నని ప్రయత్నించుటయే కాని యా తరఁగతివిద్యార్థుల కెంతవఱకీయవలె నను విచారణ లేదు. ఇంగ్లీషులో వ్యుత్పత్తులు ఎం. ఎ కడుగుదురు. స్పెషల్ ఇంగ్లీషువారి నడుగుదురేమో! తెలుఁగులో ఫోర్తుఫారము దగ్గరనుండి యడుగుదురు. ఈ తెలుఁగువ్యాకరణము సరిగా వచ్చినవారు మనయుపన్యాసకులలోఁ, బండితులలో నెవరైనఁ గలరా? ఒకరిద్దఱున్నచోఁ బ్రయోజన మేమి? విద్యార్థికిఁ బద్యాన్వయము, బహుశబ్దార్థము, సంప్రదాయము, పురాణకథాసంతానము తెలియుచుండఁ జేసి వానికి వ్యాకరణము, ప్రకృతులు, వికృతులు వ్యుత్పత్తులు చెప్పి ప్రయోజన

మేమి? ఇన్ని దుష్టగ్రంథములు చెప్పుట కన్న నొక్క సద్గ్రంథము చెప్పినచోఁ జాలును. తెలుఁగుసిలబసు ఇంగ్లీషు దానినిబట్టి వ్రాసిరి. అక్కడ పద్యప్రబంధమున్న నిక్కడ పద్యప్రబంధము. అచట నాటకమున్న నిచట నాటకము. అచట నాండిటైల్డు గద్య పుస్తకములున్న నిచట రెండు గద్యపుస్తకములు. అంతియేకాని, యీ భాషాసంప్రదాయ మేమి, యీ భాషాసంప్రదాయ మేమి, ఏభాష యెట్లు చెప్పవలయునని విచారించిన వా రెవరు? ఒక్క పెద్దబాలశిక్ష చిన్నతనములో గట్టిగాఁజెప్పినచోఁ దెలుఁగు రాక పోవుట సగముపోవును. విద్యార్థులకుఁ జదువువచ్చుట యెందులకు? పుస్తకము లమ్మినచో డబ్బువచ్చును. పరీక్షాపత్రము లిచ్చినందు లకు డబ్బు, దిద్దినందులకు డబ్బు వచ్చును. ఇన్నిపుస్తకము లున్న గాని యెక్కువపరీక్షాపత్రము లిచ్చుటకు వీ లుండదు. విశ్వవిద్యాల యములోని యాంధ్రభాషాబోధనను బాగుపడవలయునన్నచో హైస్కూళ్ళలోఁ దెలుఁగుచెప్పుపద్ధతియంతయు మాఱవలయును. ఇన్ని పుస్తకములు తీసివేయవలయును. అందఱు నన్నిరీతులుగాఁ బాఠము చెప్పుదురు. పరీక్షాపత్రమిచ్చినవాఁడు తాను చెప్పినట్లే ప్రశ్న లిచ్చును. అతఁడున్నకళాశాలలోఁ జదివినవారికి లాభము; తక్కినవారికి నష్టము. స్కూలులోఁ జేసినపరీక్షలలో నందఱు నుత్తీ ర్ణులై విశ్వవిద్యాలయపరీక్షలలోఁ దప్పుట కిది యొకహేతువు. ఏది యెట్లున్నను జదువుటకు ఆహ్లాదముకలిగించుగ్రంథములైన నున్నచో నెట్లో యొకట్లు చదువవచ్చును. ఎడ్ల నమ్ముటకు వచ్చు లంబాడీ వాండ్రు జొన్న రొట్టెలు తెచ్చుకొందురు. అవి వా రింటివద్ద బయలు దేఱినప్పుడు చేయించి మూటగట్టుకొని వత్తురు. ఎన్ని దినములై నను సరే, మూటలోనుండి యొకరొట్టె తీయుట, తినుట, నీరు త్రాగుట – ఇది వారి భోజనము. మన యీ పాఠ్యపుస్తకము లా రొట్టెవలె నుండును. వానిని జదువువారము మనమును లంబాడీవారి వలెనే యున్నాము. వా రెడ్ల నమ్మి లాభము తీయుదురు. మనము మనపరీక్షల నమ్మి యుద్యోగములు తెచ్చుకొందుము.'

కుమారస్వామియదృష్ట మతనికిఁ దెలియకుండఁ దెర వెనక నుండిపడ నారంభించెను. అతనియుద్యోగము సంవత్సర

మధ్యమునఁ దీసివేయుటయా, సంవత్సరాంతమున కేనా యని విచారణపుట్టెను. సంవత్సరమధ్యమున నైనచో నతఁడు దావా వేయవచ్చును. అందుచేత సంవత్సరాంతమునకే నిర్ణయింపఁ బడెను. అతనిని దీసివేయుటకు హేతువులు - కల్పింపఁబడెను. అతఁడు చెడ్డపేరు కలిగిన మంగమ్మయింటికి రాకపోకలు జరుపు చున్నాఁడు. దానివలన విద్యార్థులకు సరియైన యాదర్శ ముండదు. అతఁడు విశ్వవిద్యాలయము, విద్యాపద్ధతి సర్వమును దిరస్కరించెను. దానివలన విద్యార్థులకుఁ దాము పొందుచున్న విద్యాపద్ధతియందు ద్వేష ముప్పతిల్లి, వారిపురోవృద్ధికి భంగము కలుగును. అతఁడు క్రైస్తవమతమును నిందించును. క్రైస్తవమతము సర్వమతములలో నుత్తమమైనది. ప్రజాస్వామికాభిప్రాయములు, సర్వజనసామాన్యత మొదలైన యున్నతభావము లా మతములోననే యున్నవి. ఫలితము కుమారస్వామి యున్నతభావములకు వ్యతిరేకి; అభివృద్ధికిఁ బ్రత్యర్థి; మనోవికాసమునకుఁ బరిపంథి.

అతఁడు కళాశాలలోనివిద్యార్థులతోఁ గలిసిమెలిసి యుండును. అట్లున్నచో బాలురయందు విధేయత యుండదు. అతఁడు ప్రసంగించునపుడు కుఱ్ఱవానివలె మాటాడును. బాధ్యత తెలియదు. దానివలన విద్యార్థులశీలమునందుఁ బలుచఁదన మేర్పడును. ఎన్నివిధములఁజూచిన నతనివలనఁ గళాశాలాపురోవృద్ధికి భంగకరముగా నున్నట్లున్నది. ఈట్సను దొరయు, మరికొంద ఉపన్యాసకులును విచారించిరి. పైని విశ్వవిద్యాలయమువా రడుగుదురు. ఈ దోషములు తగినంతవో, కావో! మఱికొన్ని క్రొత్తదోషములు చూపించవలయును. కొన్ని దోషములు కల్పించిరి. కళాశాలలో విద్యార్థినులున్నారు. వారియెదుట కుమారస్వామి యసభ్యముగామాట్లాడె నని యొకటి. అతఁ డితరోపాధ్యాయులను నిందించవలసినదిగా విద్యార్థులను బ్రబోధించినది రెండు. దీని ఋజు వేమిటి? కొందఱు క్రైస్తవ విద్యార్థులచేతఁ గుమారస్వామి యట్లు చేసెనని యుత్తరములు వ్రాయించిరి. 'కుదిరె పతక మిప్పటికి' నన్నట్లైనది. కళాశాలలు మూయకముందు పదిపదేనురోజు లింక నున్నవి. కుమారస్వామి పాఠము చెప్పుచుండెను. గ్రంథములో శివవిష్ణుబ్రహ్మస్తోత్రములు

కలవు. స్తోత్రములన్నియు నొకటిగానే యున్నవి. ఒక విద్యార్థి లేచి 'ఇంతమంది దేవత లేమిటి?' యని ప్రశ్నించెను. కుమారస్వామి 'అబ్బాయీ! ఈ ప్రశ్నకు నేను సమాధానము చెప్పెదను. మీకు నేను విషయము తెలియవలె నని బోధించుచుంటిని. మీకుఁ జక్కని వివేకము కలుగవలయు ననీ నాయుద్దేశము. అది నాకు విషమగు చున్నది. మనిసి బ్రదుకుట కనేకమార్గము లున్నవి. లోకమునఁ జాల మంది పురుషులు తాము దుర్నీతిపరులై, పైకిఁ జాలపెద్దమనుసుల వలె నటింతురు. కొందఱు సృష్టిలోని పరమరహస్యము, దానిలోని విషాదచ్ఛాయలు మనసులో నుంచుకొని, హృదయము వానిచేత దహింపఁబడిపోవుచుండఁగాఁ బైకిఁ జాల ఉత్సాహముగా నుందురు. హృదయము సృష్టిభారమే యెఱుగని కితవులకు బాహిరములైన యల్పవిషయములయందు మిక్కిలి పాటింపు. మీరు వారికి సానుకూల పడుచున్నట్లు తోఁచుచున్నది. నా కేమియు నష్టము లేదు' అనెను. విద్యార్థి— అయ్యా! మే మడిగినదానికిఁ దమరు చెప్పుదానికిని సంబంధము లేదు. కుమార— ఆ సంబంధము పైకిఁ గన్పించుట లేదు. ఆ దుర్మార్గతయంతయు మనలో నున్నది. ఎంతవఱకు యథార్థవిషయమును మన్నించకుండుట, అయథార్థవిషయమును ప్రబలింపఁజేయుట.

కుమారస్వామి పదునేనుదినములు కన్నులుమూసికొని గడపెను. వేసవిసెలవు లారంభించుచుండి రనఁగా నతనికి మూఁడునెలలు ముందుగా మీయుద్యోగము ముందునాఁటి కుండదని జాబునొసఁగిరి. అతఁడు ఈట్సనుదొరను జూచుటకుఁ బోయెను. ఈట్సను కుమారస్వామిని జాల గౌరవించెను. అది మర్యాదాలక్షణము.

కుమార—ముందునాఁటికి నా కుద్యోగము లేదని తమరు పంపించిన కాగిత మందినది. ఈట్సను—చాల విచారముగానున్నది. మాకు ధన లోపముగానున్నది. మిమ్ముఁ దీసివేయక తప్పకవచ్చెను. కుమార—ఒకమనిసిలేకుండ మీకు తెలుఁగు చెప్పించుట జరుగరు. నా కుద్యోగముపోయిన దని కాదు. చిదానందశాస్త్రి యని యొక పండితుఁ డున్నాఁడు. ఆయన తర్క-వ్యాకరణములలోను, సాహిత్యము నందును మహావిద్వాంసుఁడు. కాశీలోఁ బదునాలుగేండ్లుండి చదివి

వచ్చెను. ఆయనను వేసికొందురా? ఈట్సను—ఆయన విద్వాన్ పరీక్షయం దుత్తీర్ణుఁ డయ్యెనా? కుమార—మీ విశ్వవిద్యాలయ మంతయుఁ గలిసి యెంతమంది యుభయభాషాప్రవీణులను దయారు చేసెనో వారందఱును, వారిని బరీక్షించినవారును గలిసినను చిదానందశాస్త్రిగారితో సరిపోరు. ఆయన బులుసు పాపయ్య శాస్త్రిగారు, అచ్చయ్య శాస్త్రిగారల వంటివాఁడు. ఈట్సను—విశ్వవిద్యాలయ పరీక్షపొందినవాఁడుగాని మాకుఁ బనికిరాఁడు. కుమా—అవు నవును, మఱచిపోతిని. మీకళాశాలలలో మీకుఁ దగినవా రుండవలయును. సంస్కృతాంధ్రములు నశించుట యెట్లా యని మీ ప్రయత్నము. దాని కనువైన పండితులనే మీరు తెచ్చెదరు అట్టివారినే మీ విశ్వవిద్యాలయపు కార్ఖానాలోఁ దయారుచేయుచున్నారు. విద్వాను లని పెట్టి మా దేశములోనున్న మహాపండితునందఱిని లేకుండఁ దుడిచి వేసితిరి. దిగ్దంతులవంటి పండితులు దేశమునందు దిక్కుమొక్కులేక యున్నారు. జమీందారు లేమో వ్యర్థులై, వ్యామోహితులై, కామదూషితులై పోవుచున్నారు. వారు పండితులను బోషించరు. ఆ రోజులు పోయినవి. విద్వాన్‌పరీక్షమైనఁగాని యుద్యోగములు దొరకవు. దేశమంద ఱీ కొంకిచదువులే చదువుదురు. ఇంగ్లీషుచదువారంభించినతరువాత నిప్పటికి తెలుఁగు పూర్తిగాఁ జచ్చినది. దేశభాషలు నశించినవి. మఱియొక్క పదియేండ్లలో భాష్యాంతవైయాకరణుఁడుగాని, బాధాంతతార్కికుఁడుగాని, మీమాంసకులుగాని కనిపించినచో చెవి తెగఁగోయించుకొందును. మిల్టను వ్రాసిన 'ఏరియో పెజెటికా' మీరు చదివితిరి గదా! పుస్తకములను, విద్యలను జంపుట ప్రాణహత్యకన్న మహాఘోరమైనది. ఈట్సను—మీరు చాల ఆవేశపరులు. యాథార్థ్యమే చెప్పుచున్నారు. కాని నేను మీరు చెప్పుచున్న శాస్త్రిగారి కుద్యోగ మీయఁజాలను. కుమార—మీ రిచ్చెదరని నేను చెప్పలేదు. మీ రెందుకు నన్నుఁ దీసివేయుచున్నారో నాకుఁ దెలియును. అనేకదోషములు కల యొక పద్ధతిని నిర్ణయించి, యీ దోషము నాపద్ధతిచేత సమర్థింపఁ జూచుచున్నారు. ఈట్సను—ఆ సంగతి నిజమే. కాని యేమి చేయవలయును? దీనిని మార్చుట నాచేతిలో నున్నదా? కుమార—మీ

యధికారులందఱు నిట్లే యనెదరు. మీరు విడివిడిగా నున్నప్పుడు చక్కఁగా నాలోచింతురు. అందఱును గూడినవెంటనే 'గ్రుడ్డియెద్దు చేనిలోఁ బడినట్లు' ప్రాఁతపద్ధతినే యనుసరింతురు. లోకమునందందఱు మనసా యెన్ని దుష్టములైన యూహలైన నూహింతురు. నలుగురును గలిసికొనునపు కచ్ఛశీలురవలె నటింతురు. మన విద్యాపద్ధతి చాలదుర్మార్గముగా నున్నదని పెద్దలందఱికిని దెలియును. అందఱును గృహములయందు సానుభూతి చూపింతురు. సినేటుసభలకుఁ బోయినంతలో మఱల మాయప్రకమ్మెను. ఈట్సను—మీరు వయసుచేతఁ జిన్నవారు. మనసులో నున్న భావములన్నియుఁ జెప్పరాదు. దాని వలన మీపురోవృద్ధికి భంగము కలుగును. కుమార—అయ్యో, అయ్యో! ఈ యాత్మవంచనచేత దేశము ప్రళయాభిముఖమై పోవుచున్నది. నావంటివాఁడు బ్రదికియుండరాదు. తెలిసితెలిసి యింత ఘోరము చేయుటయా? నాకు నీమూఁడునెలల జీత మక్కఱలేదు. మీరు నాకు డబ్బు పంపించినచోఁ దిరుగఁగొట్టెదను. నే నీ పాపపుఁ గూడెట్లు తిందును? మీరు తెలియక చేయుచుండిరేమో యనుకొంటిని. బుద్ధిపూర్వకముగా నింతవంచన పనికిరాదు. మాహిందువులు పైకి నీతులుచెప్పినను లోనఁ బరమనాస్తికులు. మీ రంతకన్న. సెలవు తీసికొందును. క్షమింపవలయును. ఒకానొకఁడు నావంటివాఁడు లోనిమంట దాఁచుకొనలేఁడు. దాఁచుకొన్నచో లోన నది వానిని దగులఁబెట్టును. ఆ మంట బయటికివచ్చి వానిజీవనాధారమును దగులఁబెట్టును. లోపలఁ దగులఁబెట్టి యుత్తమగతులు లేకుండఁ జేయుటకన్న బయట తగులఁబెట్టి తిండికిమాత్రమే లేకుండఁజేయుట యెక్కువ నష్టములోనిది కాదు.

అని కుమారస్వామి వెడలిపోయెను. ఈట్సను 'నిజముగా నట్టి యకల్మషప్రకృతులకు లోకములోఁ దావులేదు. వారు చనిపోవలసినదే. వారు కష్టపడవలసినదే. అధికారమున్నచోట నిట్టియథార్థ ప్రవర్తన యుండెనా, జేపటితో జగత్తు జగత్తు కాదు. కృత్రిమములైన పద్ధతు లున్నఁగదా వ్యవహారము సాఁగుట. కృత్రిమము లేనిచో వ్యవహార మెందుకు?' అనుకొనెను. అప్పటికి రెండుజాములైనది. వేసఁగియెండలు మలమలలాడుచున్నవి. రోడ్డుమీఁద నిసుక

సుడులు సుడులుగాఁ దిరిగి, గాలిచేత లేచి దారిపోవు జనుల మొగము లందు విసరికొట్టెను. బంగాళాలో సుఖముగాఁ గూర్చున్న యీాట్సను త్రోఁచువలె వాయువశమున లేచి నిలుచున్న యీా మంటిసుడిని జూచెను. అది స్తంభము కట్టినది. గాలిపోఁగుచేసిన ట్లున్నది. ఈ మంటి స్తంభము పరివేగపరిఘూర్ణితమై విచిత్రముగా నిలుచుండి తా నున్నయెడ నేత్రదృష్టి కనిపించుట లేదు. ఆ స్తంభము స్తంభముగా వాయువు దూరముగాఁ దీసికొనిపోయెను. ఆ మహాతపతైక్ష్ణ్యమునకు వృక్షములు నీడ లీఁదగినంత సాంద్రత లేకపోయినవి. ఎండ మొగము లందు, గూబలందుఁ, బరిసిక్తాధరములందు నిప్పులుచెఱిగి ఫెడీలుమని కొట్టెను. గూబలు పగిలిపోయెను. పెదవు లెండిపోయెను. మొగములు వివర్ణమయ్యెను. వట్టివేళ్ళతడకలవెనుక కూర్చున్న ప్రాణి - తడ కలు తడిపినవాఁడు తాను గాదు, అయినను - సుఖపడెను. బయట నున్న ప్రాణి - తడిపినది తానే - యెండచేత మా[illegible]. ఎండ దుష్టమైన మనోవిజృంభణమువలె సాఁగెను. లోకబంధుఁడు, జగ త్ప్రభువు - ఇనునినుండి యీా తీక్ష్ణాతప మేమిటి? ప్రభువు దయా రాశియే. ఇది వేసఁగిమాహాత్మ్యము. వేసఁగియుఁ దానుచేసిన మేలు తాను చేయును. పొలము నెఱియలు పడును అప్పుడు మఱల దున్ని నచోఁ బంట సరిగా నుండును. తరుమూలఫలాదులు, నదీజలము సుఖముగా ననుభవించలేని కృతజీవులు పొలములు దున్నుకొననే వలయును. అక్కఱలేని వెన్నియో యప్పు డక్కఱయయియున్నట్లు తోఁచును. సూర్యాతపము చివురాకులపైఁ గంటికెంపులు కదలించి బాలదూర్వలపై నసూయ వెదలఁ గ్రక్కి వాయువీచికలలోఁ గ్రూర మైన ప్రకృతిని నెలార్చెను. శుష్కకుల్యాతటాకప్రదేశములు ప్రాణ మన్నది నిలుపనీయలేదు. కుళీరమండూకాది సర్వజంతువులును భూవివరములందుఁ ద్రవ్వుకొనిపోయిపచ్చి మట్టితో నొకటియై పోయెను. మఱల వర్షాకాలము వచ్చునా? అప్పటికి సుబ్బన్న పేఁట యిట్లే యుండునా? దేవదాసి, గణాచారి, మంగమ్మ, పసిరిక, అరుంధతి - వీరందఱు తేపు వర్షాకాలము చూతురా? ఇందులో కొందఱు చూతురేమో! వారైనను మఱి యెంత సేపు? ఆ ప్రళయా తపములందు దూరమున నొకచిన్నమేఘమువచ్చి, యది పెద్దదై, నల్లనై

నడిమియాకాశమునకు వచ్చి, నాల్గుదినుసులు చినికి మిఱిల దూర ముగాఁబోయి మహోవాయుపరిభూతమై, ముక్కలు ముక్కలై చెల్లా చెదరయ్యెను.

చైత్రపూర్ణిమ వచ్చెను కుమారస్వామి యానాఁడు ధర్మా రావునుజూచుటకుఁబోయెను. ధర్మారావు—ఏమోయి కుమారస్వామి! నేను నీకుఁ దీవ్రవాదము నేర్పలేదు. కొన్నిసిద్ధాంతములుమాత్రము చెప్పితిని. నీ వా సిద్ధాంతములు చెప్పుటలో నగ్నిహోత్రముకూడ జోడించుచుంటివఁట! లోకము యాథార్థ్యమునైనను దీక్ష్ణముగాఁ జెప్పిన నంగీకరించదుసుమా! అందుకనియే రాజువలె శాసించు వేదము కన్న భార్యవలె మెత్తగాఁ జెప్పు కావ్యములను సాహిత్యవేత్తలు నిర్ణయించిరి. విషయమును మెత్తగా బోధించవలెను. నీ వుద్యోగము చేసి బ్రదుకవలసినవాఁడవు. దీనివలన లాభము లేదు ఈట్సనుదొరను దిట్టితివ టేమిటి? కాలేజీలోఁ గొంద ఱుపాధ్యాయులను గొట్టఁబోయి నావఁట! కుమార—(పండ్లు పటపట కొఱికి) ఎవఁడా చెప్పినది? ఈట్సనువద్దకుఁ బోదము రండు! ఆ మాటలు నిజమైనచో నేను గోపాలస్వామిగాలిగోపుర మెక్కి యటనుండి క్రిందఁబడి చచ్చెదను. అబద్ధమైనచో నా చెప్పినవానిని జెప్పుపుచ్చుకొని దవడ వెంటఁ గొట్టెదను. ధర్మా—బాబూ! అంతగాఢశీలత్వము పనికిరాదు. అబద్ధమును, దౌర్జన్యమును గొంతయోర్చుకొనుట నేర్చుకొనవలయును. లోక మదియే చిలవలకు పలవలు పుట్టించును. ఏమి చేయుదుము? నీ విట్లావేశము ప్రకటించెదవేని నిన్నుఁ జివరకు పిచ్చివాఁ డందురు. పరమార్థమైనవిషయము నీలో నెక్కువభాసించుచున్న దని యెవరును గ్రహించరు. నీవు దుర్మార్గుఁడ వని చెప్పకొందురు. లోకములో బ్రదుకవలయునన్నచో నీయుద్యోగము, నీమనస్సు, నీయంతరాత్మ — అది యొకసంస్థ; నీయుద్యోగము, అందఱితో నీవు మెలఁగురీతి, ఎట్టి వారితోనైనను నవ్వుచు మాట్లాడుట — ఇది యొకసంస్థ. రెండు రెండుగా బ్రదుకవలయును. రెంటిని గలిసియున్నవారిజీవితము సుఖమే నిష్కలుషాంతరాత్మయు స్వతంత్రజీవనమును గలవారు యోగులు. వారికి కష్టము లేదు. ఈ లోకమార్గములే పరమోత్తమముగా నున్నవనుకొనువారికి లోకయాత్ర చేయుటలోఁ గష్టము

లేదు. మధ్యేమార్గమున నున్న నీ కిబ్బంది. కుమార— మీరు చెప్పి నది నిజమే. వ్యర్థముగా నుద్రేకము బ్రకటించుటవలన లాభము లేదు. ఇంక మఱల నెచ్చటనైన నుద్యోగము దొరికినచో నట్లే యుండును. ధర్మా—ఇంక దొరుకదు. వా రందరు నొకసమాజము. నీ వింకొకచోట నెచ్చట మఱలఁ బ్రయత్నముచేసినను వీరిప్రశంసా పత్రము తోఁకవలె వెంటనే వచ్చును. ఈ కఠినన్యాయపద్ధతియే మూర్తీభవించిన 'జీన్వాల్జీను.' మహాత్ముఁడైన 'యూగో' మనోంబుజము దీనివలన నెంత బాధపడినదో! భూతదయ, భూతదయ యందురు. దుష్టసూత్రము లవలంబించి జనులజీవనాధారములు పాడు చేయుటంగో భూతదయ యే మైనదో? కుమార—ఈ దిక్కుమాలిన గోల కేమిగాని, స్వామికల్యాణ మెప్పుడు? ధర్మారావు- సరిగా నొక్కనెల యున్నది. కుమార—అప్పుడు మీమనరీలు విగ్రహారాధన కూడ దని యుపన్యాసము లిత్తురఁట. కేషబ్జీమతానుయాయులుకూడ వారిలోఁ గలిసెదరఁట. ధర్మా—రెండును జరుగవచ్చును. కల్యాణ ములు దేవునిగుడిలో జరుగును. ఉపన్యాసములు కాలేజీ హాలులో జరుగును కాఁబోలు! కుమార—ఆ యుపన్యాసములవలన మన మతమునకు నష్టము కాదా! ధర్మా- నీమతమునకా, నామతము నకా? కుమార- మనమతముల కేమి నష్టము? అజ్ఞానులైనవారి మత ములకు. ధర్మా- వారిమతముల కెప్పుడును నష్టమే. హిందువులైనను సరే, మహమ్మదీయులైనను సరే, క్రైస్తవులైనను సరే- లోక ములో దార్ష్ట్య మాచరించుచు దేవుఁడు దేవుఁ డని దొంగవేష ములు వేయువాని కెప్పుడును నాత్మచ్యుతి యున్నది. వానిమతము వానికి దుర్వ్యవసాయము లెక్కవచేయుటకుఁ బనికివచ్చునుగాని, వాని యాధ్యాత్మికప్రవృత్తి వృద్ధినొందుటకుఁ బనికిరాదు. సద్విషయ మని తనకుఁ దెలిసినదాని నెవఁ డాచరించఁడో వాఁడు పాము వంటివాఁడు. పామునకు రెండునాలుకలు; వీనికి రెండుపద్ధతులు. కుమార- నాగేశ్వరరావుగారు విగ్రహారాధనను దిరస్కరించుచు నొకగ్రంథము వ్రాసిరఁట. అది పదివేలప్రతు లచ్చువేయించి కల్యాణములలోఁ బంచిపెట్టెద రఁట. ధర్మా-నీ కా విషయమునందు లగ్నమైన దేమి మనస్సు? తర్క- మెఱుఁగనివారికి విగ్రహారాధన

మంచిది కాదు. పోనిమ్ము. కుమారస్వామి యింటికిఁ బోయెను. శ్యామల- మంగమ్మగారు మీకొఱకు వచ్చినది. కుమార- ఈమె మూలముగానే యుద్యోగము పోయినది. శ్యామల-మనకోటిమూలము గా. కుమార-నీవుకూడ మాస్టరుగారికి భార్యవలెఁ దయారగుము. శ్యామల- మంగమ్మగారియింటికి వెళ్ళిరండు! కుమార-నా కాఁకలి యగుచున్నది. శ్యామల-వంటకాలేదు. కుమార-ఇప్పుడుపదునొకండు గంటలైనది. శ్యామల—వైదికులు పన్నెండైనఁగాని భోజనము చేయరు. కుమార—వైదికు లెవరు? శ్యామల—మీరు కాదా! కుమా—ఎవరు చెప్పిరి? శ్యామల—మంగమ్మగారు. కుమారస్వామి మంగమ్మయింటికిఁ బోయెను. మంగమ్మ- 'ఇకఁ గల్యాణ మిరువది రోజు లున్నది' యనెను కుమార—కాదు నెలనా ళ్ళున్నది. మంగ- ఆపదిరోజులు కల్యాణములు. కుమార—వాలి యే మనుచున్నాఁడు? మంగ—పంగనామములు పెట్టినాఁడు. కుమార—ఎవరికి? మంగ- తనకే పెట్టుకొన్నాఁడు. చెంగల్రావు వాలిని దెచ్చెను. వాని మొగమునఁ బంగనామము లున్నవి. కుమార—వీనికిఁగూడ మత మిప్పించినారా, యేమి? మంగ—నియోగులు వైష్ణవులు కావచ్చును. కుమార—మీపని చాలతిక్కగా నున్నది. నేను నియోగిని. నేను కోఁతినా? మంగ—ధర్మారావుగారిశిష్యత్వ మంగీకరించకముందు నీనియోగిత్వము. ఇప్పుడు వైదికుఁడవే. లేకపోయిన మనస్సులో నున్న ప్రతిదియు నింత బయటికిఁ జెప్పుదువా? కుమార—నిజమే. నాకు ధర్మారావుగారిగాలి కొట్టినది. మంగ—ధర్మారావుగారు నీ యంత వైదికుఁడు కాదు. కుమార—నిజమే. నాకీ సంగతి నాల్గయిదు నెలలనుండి తెలిసినది. ఇదివరకే తెలియవలసినది. శివరావుగారి వ్యవహారములో నాయన యెంతలౌక్యము పోయినాఁడు. మంగ- అ దేమిటి? కుమార—ఆయన మీకు సమకాలికుఁడే. మంగ— అదా! అప్పుడు చూచాయగా విన్నాను. కుమార—శివరావుగారికి జీవితారంభముననే దైవభక్తి; భక్తి కాదు, ఆయనయే శ్రీకృష్ణులైనారు. మీకుఁ జెప్పర. మంగ—నాకుఁదోడు దైవభక్తికూడను. కుమార—కల్యాణములలో విగ్రహారాధన పనికిరాదని యుపన్యాసములు. మంగ—విగ్రహారాధన చేయనివా రెవరు? జాతితోఁ జేసిననే

విగ్రహమా? విగ్రహ మనఁగాఁ జిహ్నము. సిలువ చిహ్నము కాదా? ఫొటోగ్రాపులు, చిత్రములు విగ్రహములు కావా? ప్రతిమలు (Statues) విగ్రహములు కావా? విగ్రహములు వాఁటి జ్ఞానము పోనివారు విగ్రహములను దిరస్కరింతురు. హిందువులు విగ్రహారాధకులు కారు. విగ్రహారాధకులు క్రైస్తవులు, కేథలిక్కుమతానుయాయులు, బ్రహ్మసమాజస్థులు. మన మారాధించునది విగ్రహములను గాదు. దేవాలయములో నున్న దేవునికి మనము ప్రాణప్రతిష్ఠ చేసెదము. విగ్రహము క్రింద బీజాక్షరసంపుటి యున్నది. శబ్దప్రపంచమున, నాకృతిప్రపంచమున, గుణప్రపంచమున సమానమైన శక్తులు తీసి, యా గుణమునకా బీజము, ఆ బీజమునకా యాకారముగా నిర్ణయించి నిర్గుణమైన పరబ్రహ్మమును సగుణముచేసి, సగుణమనుట తోడనే యొకశక్తి, యొకయాకృతియు నుండును గనుక - దానిని మనము నిర్ణయించి, తద్ధ్యానము నారాధించుచున్నాము. మన మారాధించుచున్నది విగ్రహము కాదు. వట్టి ద్రవ్యము నెవఁడారాధించుచున్నాఁడో వాఁడు విగ్రహారాధకుఁడు. ప్రాణరహితమై శక్తిరహితమైన చిహ్నమును ధరించువాఁడు విగ్రహారాధకుఁడు. సృష్టిప్రకారము తెలియవలదా, విగ్రహమేదియగునో యేది కాదో తెలియుటకు? వెండితో సిలువచేసినచో వెండి పృథివి. ఈ భూతములన్నింటికిని బృథివి రసము. నే నుపనిషత్తు నోట ననరాదు. ఇతరమతములజ్ఞాన మంతవఱకే పోయినది. లేకపోయిన వట్టిసిలువ నేల ధరించును? సిలువ యొకభావమునకుఁ జిహ్నమగును. ఆభావమునకు నా చిహ్నమునకు సంబంధములేదు. క్రీస్తును జంపినసిలువ క్రీస్తునకుఁ జిహ్న మెట్లగును ? ఒకభావమునకుఁ జిహ్నము శబ్దము. ఆ శబ్దముయొక్క సారము బీజాక్షరము. తదక్షరానుగుణమైన యాకృతి వేఱుగా నుండును. అది రూపకల్పన. సిలువ రూపకల్పన కాదు. క్రీస్తు సర్వమానవాభయదాతయేని నతఁడభయముద్ర ధరించవలయును. తదనుగుణమైనరూపకల్పన యుండవలయును. పంచభూతములుకానిదానినుండి పంచభూతము లెట్లుత్పన్నమయ్యెనో, యాపంచభూతములు నొకదానిలో నొకటిభావముచేతనెట్లిమిడియున్నవో తెలిసికొనినఁగాని ఈ తత్త్వము తెలియదు.

కుమారస్వామి నోరు తెరచుకొని దిగ్భ్రాంతుఁడై చూచుచుండెను. మంగమ్మ 'యే మట్లు చూచెద?' వనెను. కుమార— ఈ చదు వంతయు మీ రెప్పుడు చదివితిరి? మంగ—అది రహస్యము. నీకోఁ జెప్పెద; నెవరితోను జెప్పకుమీ! చెప్పినమాత్రమేమి? ఒకనెలవాళ్ళలో వచ్చు నష్టము లేదు. కుమార—చెప్పుము, తెలిసికొందును. మంగ—ప్రతిదిన మర్ధరాత్రమున నేను ధర్మారావుగారిశిష్యురాలను. మూఁడవకంటికిఁ దెలియదు. కుమార—వాలి చూచితిరా, యర్ధనిమీలితాక్షుఁడై మీమాటలు శ్రద్ధగా వినుచున్నాఁడు. మొత్తానికిఁ గోఁతిని బాగుచేసితిరి.

గాలిలో పాంచజన్యము సన్నముగా నూఁదినట్లు సన్నని ధ్వని కలిగెను. గాలి చూరువాసములయం దూఁదుచుఁ బోయెను. వాలి దాని ననుసరించుచు సన్నగాఁ గూసెను. మంగమ్మ కోఁతిని దగ్గఱకు లాఁగుకొనెను. కుమారస్వామి బాష్పాకులితనేత్రుఁ డయ్యెను.

# ఇరువదియైదవ అధ్యాయము

గార్డినరన్న మిషనరీదొర పులి లేడికై, పిల్లి యెలుకకై, బల్లి పురుగుకై, తొండ చీమకై పొంచినట్లు పసిరికకై చాలసారులు పొంచియుండెను. ఎంత పొంచినను లేడి చెంగునదూఁకి తనజాతిలోఁ దూఱినట్లు, ఎలుక తప్పించుకొన్నట్లు, పురు వెగిరిపోయినట్లు తప్పించుకొంచునే యుండెను. చీమవలె నిశ్చితముగాఁ దొండ నోటిలోఁ దూఱలేదు. ఒకప్పుడు దొర పసిరికను జేలలోఁ బట్టుకొనవలయు నని ప్రయత్నించెను. అతనిని బదియుమగులలోఁ గలిసికొనెను. ఒక మహాసర్ప మడ్డమువచ్చి గార్డినరుదొరను గఱవఁబోయెను. అతఁడు తుపాకి తేలేను. తగిలినను దగులకున్నను బేల్చెడివాఁడే అందుచే నాగండము పసిరికకుఁ దప్పెను. పసిరికకుఁ దనకై యతఁడు పొంచె నని తెలియదు పసిరిక యీలవేసెను. పాము పడగెత్తి పసిరికయొద్దకుఁ బోయెను. మనిసినిగఱవఁబోవచ్చునా యన్నట్లు పాముపడగపైఁ గొట్టి పసిరిక దండించెను. పాము పసిరిక చేతిలోనుండి దొరవైపునకు దూఁకబోయెను. నోరులేని యా జంతు వంతకన్న నింకొకరీతిఁ జెప్పలేకపోయెను. పసిరికయుఁ ద్రాఁచు నన్యోన్యపరిష్వక్తులై నంత దొర విభ్రాంతుఁడై వెడలిపోయెను. అప్పటినుండియు యతనికిఁ బసిరికమీఁద నున్న వాంఛ వృద్ధి పొందెను.

మఱియొకప్పుడు ఫ్రాన్సుదేశమునుండి యొకదొర వచ్చి ఘంటశాలలో నున్న బౌద్ధస్తూపములు త్రవ్వఁగా వెలువడిన పురానాగరకతాచిహ్నితశిలాఫలకములు మొదలైన వస్తువులు స్థలముకల వారికి నేఁబదులు, వంద లిచ్చి త్రివ్వుకొని పోవుచుండెను. అతఁ డా వస్తువులు ఫ్రాన్సులోని పురాతనవస్తుప్రదర్శనశాలవారి కమ్మి, వంద యిచ్చినచోట పదివేలుగా సంపాదించును. అతఁడు ఘంటశాలాప్రాంతమునకు మూఁడునాలుగుసారులు వచ్చెను. ఒకసారి యా ఫ్రాన్సుదేశస్థుడు జాళ్ళన్నియుఁ బంగీలుకట్టి తీసికొనిపోవుచుండఁగా

నల్లమందువర్తకము దొంగతనముగాఁ జేయుచున్నాఁడనుకొని తెనాలిలోఁ బోలీసువారు పట్టుకొనిరి. చివరకుఁ బెట్టెలు బగులగొట్టఁగా రాళ్ళు బయలుదేఱినవి. ఆ రాళ్ళుగూడ ధనమని క్షుద్రోద్యోగులకుఁ దెలియక వదలిపెట్టిరి. ఆ ఫ్రెంచివాఁడు దేశమంతయు యథేచ్ఛగాఁ దిరిగెను. త్రవ్వినచోట నెల్లఁ ద్రవ్వెను. వలదన్న రాజు కన్పించలేదు. అమరావతినుండి, నాగార్జునకొండనుండి బౌద్ధస్తూపాదులు పెల్లగించుకొని లండను వస్తుప్రదర్శనశాలలో నుంచిరి. దేశీయు 'లవి మదరాసు మ్యూజియములో నుంచరాదా? ఈరీతిగా మా దేశమునకు నష్టము జరుగుచున్న' దని గోలపెట్టిరి. పత్రికలలోఁగూడ వ్రాసిరి. సమాధానము చెప్పకపోవుట, చెప్పినసమాధానము లందికయుఁబొందికయులేక నుండుట యధికారలక్షణము. అదియే ప్రకటింపఁబడెను. ఇంక దేశములోని బౌద్ధచిహ్నములు దీసికొనిపోవుచుండఁగా వలదనఁగలవాఁడు వలదనఁడు. యథేచ్ఛముగానవి రెక్కలు కట్టుకొని యెగిరిపోయెను. గార్డినరు సుబ్బన్నపేట తీసికొనిపోయి పసిరికను జూపించెను. ఫ్రెంచివానికి పసిరికమీఁద మనసు పోలేదు. పురాతనవస్తుప్రదర్శనశాల కితఁడు తగఁడు. కాంగోప్రాంతపు టడవులలోనుంచి, దక్షిణపు టమెరికా యడవులలోనుండి తెచ్చిన యొకవింతజంతువువలెఁ బ్రదర్శించవలయునేకాని చరిత్రాత్మకమైన ప్రాముఖ్య మతనికుండదని ఫ్రెంచివాఁడు చెప్పెను. ఆఫ్రికాయడవులలోనుండి యొకవికృతమైన శాఖామృగమునో, యొక క్రూరసర్పమునో తెచ్చినందువలన నెక్కువలాభ ముండదు. కొంతలాభము లేకపోలేదు. తనపని యది కాదని ఫ్రెంచిదేశస్థుఁడు వెడలిపోయెను. గార్డినరు తనమీఁద లేకుండఁబోవు ననుకొన్న యీ వ్యవహారము మఱలఁ దనమీఁదనే పడి మనసునకు వేధ కలిగించఁ జొచ్చెను.

ఒకసారి పసిరిక మెట్టచేలలోనుండి కొళాయిచెరువుదగ్గరకుఁ బోయి యా చెరువుగట్టుపైఁ గూర్చుండెను. అచ్చట నింజనులవద్దఁ బనిచేయుచున్నవారు పసిరికను బెదరించిరి. అతఁడు వనమంతయు నణుఁకబడి చిన్నితరుకుంజమున దాఁగుకొని స్వేచ్ఛావిహారము కుదించఁబడిన సింహము దుఃఖించినట్లు మిగిలిన నాల్గుమెట్టచేలకై పరువెత్తి యవి తనసంచారమునకుఁ జాలక, తాను దాఁగుకొనుటకు

నాశ్రయమీయక, తాను క్రీడించుటకుఁ బ్రేమ ప్రకటించక తమకుఁ బసిరికకు సంబంధ మైపోయినట్లు పలుచఁబడెను. పసిరిక యీ బెదిరి పోవుట గార్డినరు చూచెను. పూర్వము సర్పము పసిరికయుఁ జెలిమి కాండ్రగుట భయహేతువయ్యెను. నేఁడు పసిరిక బెదిరిపోవుట భయ నివారక మయ్యెను. పాము విషముకలదికదా యని పాములను జంపఁ గలజంతువులన్నియు విషముకలవి కావు. గృధములు, వాయసములు కుపితములై పాముపోవునపుడు పడగమీఁద ముక్కులతోఁ బొడుచును. లేళ్ళు పాములను దిని రోమంథము చేయును. ముంగిసలు సర్పములను విదలించి చంపును. పాములకు భయపడినట్లు గృధ్రవాయస నకులములకు భయపడనక్కఱలేదు. అట్లే పసిరికకును. మఱలఁ బసిరిక కొఱకు గార్డినరు ప్రయత్నము లారంభించెను. ప్రయత్నములు మునుపటికన్నఁ జక్కగా నుండెను.

పదిమంది కూడెములోని క్రైస్తవబాలురతోఁ బసిరికనుబట్టుకొన్నచో వందరూపాయ లిత్తునని గార్డినరు చెప్పెను. వారు 'మేము పసిరికను బట్టుకొనము' అనిరి. గార్డినరు 'మీకుఁ బసిరికతో నేమి పని? నేనుమీకుఁ బోర్డింగుస్కూళ్ళలో నుద్యోగము లిప్పించెద' నని చెప్పెను. వా రుద్యోగము లన్నంతనే యాసపడి 'సరే, పసిరికను బట్టుకొందు' మని చెప్పిరి. పసిరిక పోవుత్రోవలో రెండుచెట్ల కొక త్రాడు బిగించి కట్టియుంచిరి. పసిరిక యీ త్రాడునకుఁ దగిలిపడి పోయినచో నపుడుపోయిమీఁదఁ బడవచ్చునని. గార్డినరు 'త్రాడెందుకు? నలుగురును బోయిపట్టుకొనరాదా' యనెను. వారు సమాధానము చెప్పిరి: 'అబ్బో! పసిరిక లేడివలెఁ బరుగెత్తును. చిరుతపులి వలె దూఁకును. పామువలె ప్రాఁకిపోవును. అతనిని బట్టుకొనరా' దని చెప్పిరి. పసిరిక పోవుచు నా త్రాడునకు దగుల్కొనెను. పసిరిక పడలేదు. చెంగున దూకిఁ దాటిపోయెను. అతను పోయినతరువాత వారు వచ్చి చూచిరి. పొలమెలుకలు పసిరిక తాఁకినచోట నతఁడు రాక ముందే కొరికివేసెను. ఉపాయము చెడిపోయిన దని వారు నలువురును విచారపడిరి..

గార్డినరు పసిరికతలిదండ్రు లెవరో కనుగొని వారి వద్దనుండి పసి కను గొనవలయునని యూహించెను. అది ప్రయత్నవైఫల్యము

హేతువగునేమో యని విచారించెను. రంగమ్మ కుమారుఁడు చంద్రయ్య నొకసారి పిలిచి గార్డిన రడిగెను. 'పసిరికకుఁ దలిదండ్రు లున్నారా?' యని. చంద్రయ్య 'తండ్రి లేఁడు. తల్లియున్నది. ధర్మారావుగారికిఁ బసిరికకు నేదో చుట్టరిక మున్న' దని చెప్పెను. 'ధర్మారావు బ్రాహ్మణుఁడు; పసిరిక శూద్రులపిల్లవాఁడు. సంబంధ మెట్లుండు' నని దొర పరిహసించెను. కాని ధర్మారావుపేరు వచ్చినంతనే కొంత యలజడిపడెను.

చంద్రయ్య మఱునాఁడు మధ్యాహ్నము మేనత్తకు భోజనము తీసికొని పోవుటకై ధర్మారావుగృహమునకుఁ బోయెను. అపుడు ధర్మారావుతో గార్డినరు తన్నడిగినసంగతి చెప్పెను. ధర్మారావు భ్రూయుగముమధ్య దృష్టినుంచి విచారించెను. సంగతి యేమో తెలిసికొనవలయు నని దూరదూరముగా నాల్గయిదు దినములు పసిరిక ననుసరించెను. ఎచటఁ జూచినను పసిరికవంక నొక వాంఛాపూరితమైనదృష్టి ప్రసరించినట్లు కనుపించుచుండెను. ధర్మారావు చంద్రయ్యద్వారా కబు రంపించెను: 'పసిరిక నాతమ్ముఁడు. అతఁడు మా కాయువుపట్టు. అతనిజోలికి మీరు పోయినచో బాగుగా నుండ' దని. ఈ కబురు గార్డినరులోని పాలకజాతిభావమును గదల్చెను. దొర పసిరిక నీసారి తప్పక పట్టుకొనవలయు నని నిశ్చయించెను. ఆ నాఁడు తుపాకి చేఁబూని నలుగురు మాలపిల్లలను వెంటదీసుకొని పసిరికకోసమై పోయెను. పసిరిక యొకచేనుగట్టుమీఁద రెండువైపుల రెండుపాములును, దలమీఁద బుజములమీఁద కూర్చున్న నాల్గు పక్షులునుగాఁ గనుపించెను. పిల్లవాండ్రు బెదరిపోయిరి. పక్షులును బాములును బెదరి పారిపోయెను. దొరయుఁ బసిరికయు మిగిలిరి. పసిరిక లేచి పాఱిపోఁ బ్రయత్నించెను. దొర తుపాకి చూపించెను. పసిరిక తుపాకి నెఱుఁగును. అతఁ డచ్చటనే నిస్తబ్ధుఁడై నిలుచుండెను. అప్పటికిఁ బ్రొద్దుక్రుంకవచ్చినది. ఆ ప్రాంతములలో మనిసియలుకుడు లేదు. ఇంజనులవద్ద పనిచేయువారికిని వీరికిని మధ్యఁ జెఱువుగట్లున్నవి. ఈసంగతి యెవరికిని గనిపించలేదు. మసకమసకైన సంజలోఁ బసిరిక గార్డినరుగృహమునకుఁ జేరెను. అచట నొకగదిలో జాగ్రత్తచేయఁబడెను. ఈ సంగతి గార్డినరుబట్లరుకుఁ గూడఁ దెలియదు.

అతఁడు బట్లరునుగూడ నమ్మఁడు. సితాసితవర్ణముల కంతభేదము. మఱునాఁడు ధర్మారావు పసిరికకోసము వెదకెను. అతఁడు కనిపించ లేదు. పొలాలన్నియు వెదకెను. పాములన్నియు ధర్మారావును జూచి పాటిపోక దూరమునుండి జాలికనులతోఁ జూచెను. పక్షులు ధర్మారావునకుఁ జేయందునంతదూరములో నిలుచుండి కూయ సాఁగెను. అతఁడు మంగయింటికిఁ బోయి పసిరికను గూర్చి యడిగెను. ఆమె భయముప్రకటించునేత్రములతో 'నాయనా! రెన్నాళ్ళయినది, పసిరిక యింటికి వచ్చి. మాగానిబలిసినతరువాత పసిరిక యింటికి రానిరోజు లేదు. నేను వాఁడు వచ్చునులే యని యూరకుంటిని. నీవు పోయి వెదకి తెచ్చిపెట్టవలయు' ననెను ధర్మారావు విచారిం చెను. గార్డినరు పసిరికను దొంగిలించినమాట నిజమే వానియింటికిఁ బోవుట యెట్లు? పసిరికను దెచ్చుట యెట్లు?

ఆనాఁడురాత్రి పదిగంటలకు హరప్పనాయఁడు గార్డినరు వద్దకుఁ బోయెను. అతనితోఁ గొంతసేపు మాటాడి, గార్డినరు కొన్నిపుస్తకములు కావలయు ననఁగా, నాయఁడు గుఱ్ఱపుబండిమీఁద గార్డినరును గోటకుఁ దెచ్చెను. నాయఁడు దారివెంటఁ జూచు చుండెను. ధర్మారావు త్రోవఁ బరిశీలించుచుండెను. రాత్రి పదు నొకండుగంట లయ్యెను. గ్రామమంతయు నిశ్శబ్ద మయ్యెను. ఊరిలోని విద్యుద్దీపములు వెలుఁగుచుండఁగాఁ జంద్రయ్య యొక స్తంభమునుబట్టి కదలించెను. ఆ వరుసదీపములన్నియు నారి పోయెను. ఈ పని సుబ్బన్నపేటలోఁ బిల్లలందఱును జేయు చుందురు. దారిలో నెవరును జూడలేదు. మఱల వట్టి గుఱ్ఱపు బండి గార్డినరింటిదాకఁ బోయి తిరిగివచ్చెను. కాసావాఁడు బట్లరును బిలిచి దొరగారు వచ్చి రని చెప్పెను. బట్లరు 'దొర పోయి పండు కొనునులే' యని తాను నిదురపోయెను.

ధర్మారావు గార్డినరున కెదురుగా వచ్చి 'అయ్యా! పసిరిక వింతజంతువు కాదు. అతఁడు మాపైరుపచ్చ. మీరు మాపంచముల నందఱను మీమతములోఁ గలుపుకొనవచ్చును. మామతము చెడి నను మాకుఁ దిండి చెడరాదుకదా! మేము బ్రదుకనైన వలయుఁ

గదా! పసిరికను వదలిపెట్టు' మనెను. గార్డినరు తెలియనివానివలె నటించి 'పసిరికను నే నే మెఱుఁగుదును?' ననెను.

ధర్మారావు 'నేను మీమీఁదఁ గేసుపెట్టవలసివచ్చును- అన్యాయముగా మనిసి నెత్తుకొనిపోయినట్లు. మీమీఁద ఋజువు చేసెదను. మీరు తెల్లవాఱువఱకు కిచటనే యుండెదరు. మిమ్ము కోటలో బిగించియుంచెదను. ఫిరంగులు వచ్చి కోటకోట పెల్లగించు కొనిపోయిననుసరే పసిరిక మాయధీనముకాకముందు మీ రిచటనుండి పోలేరు' అనెను. గార్డినరు విచ్చలవిడిగా ధర్మారావును దిట్టెను. ధర్మారావు 'మీరు తిట్టవచ్చును. నేను మఱల నేమియు ననను. కాని, పసిరికనుమాత్రము తమ రప్పగించకతప్పదు' అనెను. తెల్ల వార వచ్చెను. గార్డినరు పోవలయు నని చేసిన ప్రయత్నములు నాల్గ యిదు విఫలమయ్యెను. గార్డినరు యోచించెను 'న్యాయము ధర్మా రావుదెసనే యున్నది. న్యాయస్థానమునకుఁ బోయినను దాను గెలుచు నది లేదు.' ధర్మారావుతో నిట్లు చెప్పెను: పసిరికను తెపుపొద్దున వదలిపెట్టెదను. మీరు నన్ను వదలిపెట్టుఁడు. ధర్మారావు- మీరును తెపుప్రొద్దుననే వదలిపెట్టఁబడెదరు. గార్డినరు- నేను పసిరికను వద లను. ధర్మా- మేము మిమ్ము వదలము. గార్డి- నేను పసిరికను బట్టు కొన్నట్టు ఋజువు లేదు. ధర్మా- మేము మిమ్ము బట్టుకొనినట్లును ఋజువులేదు. మీ రిచ్చటికి వచ్చుచుండఁగా నెవరును జూడలేదు. మిమ్మును దింపినట్లు పట్టిబండియు నింటికిఁ బోయివచ్చెను. మీ బట్లరుతో మీరు దిగినట్లుకూడఁ జెప్పివచ్చితిమి. గార్డినరు విచా రించెను. మీరు నన్ను ఖైదుచేయుటకు మీకు హక్కులేదు. పైని ప్రభుత్వ మున్నది. ధర్మా- మేము రాజద్రోహులము కాదు. నేను సహాయనిరాకరణవాదిని కూడ కాదు నాకు జాతిద్వేషముకూడ లేదు. పసిరికను వదలిపెట్టించుఁడు. మీయందుఁగూడ నాకు ద్వేషము లేదు. మిమ్మును వస్తుప్రదర్శనశాల యన్న వ్యామోహము పీడించుచున్నది. మీరు దయఁదలఁచవలయును. పసిరికవలన మీ కేమి ప్రయోజనము? అదిఁ యొకపేదరాలికొడుకు. ఒక్క-కాగితము వ్రాసియిండు. బట్లరునకుఁ జూపించి మాపిల్లవానిని మేము తెచ్చు కొందుము. సూర్యోదయమయ్యెను. గార్డినరు 'నిజమే. ఈ వస్తు

నక్షత్రప్రదర్శనశాలా వ్యామోహము నన్నెందుకుఁ బట్టుకొన్నది? వారంతవిషయముగాఁ బ్రసంగించుచుండిరి. నే నేల పసిరికను వదలరా" దని యూహించి కాగితము వ్రాసియిచ్చెను. అది బట్లరుకు జూపించి పసిరికను దెచ్చుకొనిరి. పసిరికయుఁ జంద్రయ్యయుఁ గోటలోనికి వచ్చిరి. చంద్రయ్య దొరకు సలాము జేసెను. పసిరిక పామువలె గుడుసులు వడెను. గార్డినరు పోవుటకుఁ బ్రయత్నించెను మఱలఁ గానావాం శ్రద్ధగించిరి. దొర 'దోస్రామా' యనెను.

ధర్మారావు 'ద్రోహమే. మీరు చేసినపనికి మిమ్ము చూడుఁడేమి చేసెదమో' అని బెదరించెను దొరకుఁ గోపము తాడిప్రమాణమున వచ్చెను. ఇంతలో గంధము, తాంబూలము, క్రొత్తబట్టలు తెచ్చి హరప్ప గార్డినరుకుఁ గట్టఁబెట్టెను. ధర్మారావు నవ్వెను. గార్డినరు దిగ్భ్రాంతుఁ డై పోయెను.

ధర్మారావు 'మీరు మాపైరుపచ్చ నేల యెత్తుకొనిపోవలయును? మీరుకూడ నిచటనే యుండి మాకాఁపుతోడిపాటు కాపులైపోవలయును మీ రా లాగును, టోపియుఁ దీసివైచి మా ధోవతియు, నుత్తరీయమును ధరించుఁడు' అనెను. గార్డినరు ధరించెను. అందఱును గలిసి గార్డినరింటికిఁ బ్రయాణమైరి. హరప్పనాయఁడు గార్డినరుకు నాల్గువేలరూపాయ లొసఁగెను. గార్డిన 'రిది దేని' కనెను. 'పసిరిక నమ్మినచో మీ కింతకన్న నెక్కువ వచ్చునా? వచ్చినను దయచేసి దీనినిమాత్రమే యంగీకరించుఁడు' అని హరప్పనాయఁడనెను. గార్డినరు ధనము వద్దనెను. ధర్మారావు బలవంతముగా ధనమతని జేబులో నుంచెను. దొర పసిరికకు షేక్‌హాండు నీయఁబోయెను. పసిరిక పసిరికపామువలె వెనుకవెనుకకుఁ బోయి మల్లెపొదలో దూరెను. అందఱును నవ్విరి. దొరను సాఁగనంపిరి. ధర్మారావందఱికన్న వెనుక నుండెను. పసిరిక యతని బట్టుకొని వ్రేలాడెను. ధర్మారావు దొరతో 'మా తప్పులు మన్నించవలయును పసిరిక మా కంఠప్రాణము' అనెను. పసిరిక ధర్మారావును గౌఁగిలించుకొనెను. గార్డినరు 'మీ దేమియు తప్పు లేదు. నాదే తప్పు. మీరే నన్ను క్షమించవలయు' ననెను. ఒకరివద్ద నొకరు సెలవు తీసికొనిరి.

గార్డినరు మహాసంతసమగ్నుఁడై 'యింకను వీరిజాతిలోని శక్తి చావలే' దని సంతోషించెను.

ఒకజాతి సర్వత్ర ఉన్మూలితమైనఁగావచ్చునుగాని శక్తి చావరాదు. శక్తియుడిగిపోయినచోటు చూచినచో నెట్టివానికైనను గరుణరసముప్పతిల్లును. చనిపోయినను మనస్సుసమాధానపఱచుకొనవచ్చును గాని, చచ్చియుఁజావనిస్థితిచూచి సహింపఁజాలము. ఎవరిదారిని వారు పోయిరి. పసిరికయు ధర్మారావును గలిసిపోవుచుండిరి. ఒక గొల్లవాఁడు ముసలియావును నొకదానిని కబేలావాని కమ్మఁబోవుచుండెను. ఆ యావు శక్తి యుడుగకున్నదినములు సమృద్ధిగాఁ బాలిచ్చెను. గొల్లవాఁడు దానితో సుఖపడెను. ఇప్పుడు వృద్ధమైన, శక్తిచచ్చిన యాగోవును గబేలాకుఁ దోలుచుండెను. ఆగోవు తనకుఁ జావువచ్చెనని తెలిసికొనలేక పసిరిక కనిపించినంతనే యతనివద్దకు వచ్చి యతనిజుట్టు నోటితోఁ బట్టుకొనెను. అతడు కిలకిలా నవ్వెను. ఆ వతనియొడలు నాకెను. అతఁ డావుమెడ గౌఁగిలించుకొనెను. ధర్మారావు గొల్లవానితో 'నీ యింటిముందర నే గోవును జావనిమ్ము. చావకముందే కబేలాకుఁ దోలుట యెందు' కనెను. కబేలావాఁడు నాల్గురూపాయల కావు నడిగెను. పసిరిక తా నింటికిఁ బరుగెత్తుకొని పోయి తల్లిని నాల్గురూపాయ లిమ్మనెను. ఆమె యాశ్చర్యపడెను. పసిరికకుముప్పదియేండ్లువచ్చెను. ఒక్కనాఁడైనను దమ్మిడీ యడుగలేదు. ఆమె వెంటనే తెచ్చి కొడుకునకు నాల్గురూకలిచ్చెను. అతఁడు నాల్గురూకలు తెచ్చి గొల్లవాని కిచ్చి యావును దోలుకొనిపోయెను. ఆవు మంగయింటిముందర నిలుచుండి మేయుచుండెను. దానిని గట్టివేయలేదు. మంగ కొకచిన్నియాఁబెయ్య యున్నది. అది యొంటరిగా నడలిపోవుచుండెను. ముసలియావువచ్చినతరువాత రెండును గలిసి చెలిమిగా నుండెను. ఆఁబెయ్యయు, ముసలియావును గడుపు నిండ గడ్డియు జనుపకట్టెయుఁ దినును. తవుడుపోసినకుడితి త్రావును. రెండును బండుకొని నెమరు వేయును. ఒకదానియొడ లొకటినాకును. ఆఁబెయ్య నాల్గురోజులలో నెదమైనది. పోయి యాఁబోతుతోఁ గలిపెడుదిక్కు లేదు, మంగకు. ఒకగొల్లవానిని బ్రతిమాలి 'యాఁబెయ్యను దాఁటించుకొని ర' మ్మనెను. వాఁడు 'మనయూరిలో

నాఁబోతు లేదు. ఉన్నయాఁబోతు చిక్కి సగమయ్యెను. దానికన్న మునిసిపలుబండ్లకుఁ గట్టు నెద్దులు బలముగా నుండును. పైఁగా నా యాఁబోతు ముంగాళ్ళు మీఁదినుండి మోటారు పోయినది. అది యావులను దాఁటలే' దనెను. మంగ 'నిజమే. ఈ గొల్లవాండ్రు దూడను బ్రికుకనీయ రాయెను. ఆఁబోతున కమ్ముపోయువా రెవరు? అమ్ముపోసిన దూడకు మేయనిచ్చువా రెవరు?' అనెను. ఆఁబెయ్యను పసిరిక రంగాపురము తోలుకొనిపోయెను.

పసిరిక యాఁబెయ్యను దోలుకొనిపోవుచుండగా ధర్మారావు కనిపించెను. పసిరిక 'అన్నా' యని కూసి యతనిని బోయి కౌఁగిలించుకొనెను. ధర్మారావు పసిరిక 'నెచ్చటికిఁ బోవుచుంటి' వని యడిగెను. అతఁడు సరిగా సమాధానము చెప్పలేక యాఁబెయ్యవంకఁ జూపించెను. ఆఁబెయ్య వసంతకాలమునఁ జెట్టుచివర పూవువదలుటకుఁ దనలోఁదాను తెలియరానికదలిక పొందినట్లు సన్నిహితస్తు లజ్జాశోభామంథరదృగంచలయులు వెల్లివిరిసెను. ఆమె యొడలు చిక్కనై, స్నిగ్ధమై, తెల్లనై ప్రతిరోమకూపము ప్రాణశక్తిచేతఁ గదలిపోవుచున్నట్లుండెను. పెయ్య నేలమీఁద నిలువలేకపోయెను. ధర్మారావు పసిరిక నింటికిఁ బంపించి తా నాఁబెయ్యను రంగాపురము తోలుకొనిపోయెను. రంగాపురములో నాఁబోతు పెయ్యను జూచినంతనే వెంటఁబడి వచ్చెను. అరువదియేండ్లక్రిందనున్న యాఁబోతులకు దీనికి ధర్మారావునకుఁ దారతమ్యముతోఁచెను. అపుడాఁబోతు నదలించినవారు. లేరుకఱ్ఱతోఁ గొట్టినవారు లేరు. తన చిన్నతనములో నొకయాఁబోతువచ్చి తెఱచియున్న బస్తాలోని ధాన్యము దినుచుండెను. ఎవ్వరు నేమియు నన లేదు. కొన్ని తిని యాఁబోతు వెడలిపోవుచుండెను. తనతండ్రి కడవతో నీళ్ళు తెచ్చి యాఁబోతునకుఁ బెట్టెను. ఆఁబో తక్కఱలే దన్నట్లు తొలఁగిపోయెను. ప్రక్కనున్న యొకఁ కాపు 'బాబుకు దాహమగుటలేదు కాఁబోలు! పోనిం' డనెను. ఆ యాఁబోతు విశాలమైనఫాలభాగము, నేత్రములందు రాజాధిరాజులకు బోలినఠీవి, సుందరమంథరయానము, కైలాసగిరిమీఁద యథేచ్ఛావిహారి, గిర్యుపత్యకల నుత్తాలక్రీడవలనఁ గొమ్ములఁదగులుకొన్న రాజతచ్ఛవిఁబోని కొమ్ముల కాంతితోఁ

ద్రదిలోకాధిపతివలె సంచరించుచుండెను. బీళ్ళన్నియు మాగానులు కాలేదు. వృషభరాజు పొలములమీఁదికే పోలేదు. కాఁపు లావులను సంతలకుఁ దోలుకొనిపోయి మంచిసోవ గల యావులను, దూడలను బరదేశముల కెగుమతి చేయుచుండిరి. వంగవోలువృషభములు పలనాటియెద్దులు స్వస్థానము సంతలఁబడి యితరదేశములకుఁబోయెను. దేశములోఁ గోవగల దూడలేదు; ఆవు లేదు. జమీందారులు బీళ్ళన్నియు మాగానులు చేసికొనుచుండిరి. మాగాని చేయుట కమ్మచుండిరి. మాగానితృష్ణ యెక్కువై పోయెను. పశువు నిల్చుటకుఁ దావులేదు. క్రమముగాఁ బొలాలు యంత్రములతో దున్నుకొందురు. యంత్రములతోఁ గోసికొందురు. పశు వెందుకు? క్షీరములు కావలయునా? ఆస్ట్రేలియానుండి రానేవచ్చుచుండెను గదా! ఇంగ్లీషావులను దిగుమతి చేసికొందురు. అవి మనయావులవలెఁ గాదు. ఒక్కొక్కటి పదిసేర్లిచ్చును. ఆపాలకు వెలకూడ నెక్కువ. ఆఁబోతునుధర్మారావుపరిశీలించిచూచెను. దానిమెడలెల్ల కఱ్ఱదెబ్బలు తేలియుండెను. ధర్మారావునకు దుఃఖమువచ్చెను. 'ఆహా! ఒకనాఁ డీ వృషభరాజు మాదేశమున దైవాధిదైవము. మహాశిల్పు లితని కొమ్ములు, నడకతీరు, పండుకొనిన వైభవము దివారాత్రములు చూచిచూచి నందీశ్వరులను జెక్కుకొనిరి. ఇతఁడు దేవాలయములయందు సమారాధనీయుఁ డయ్యెను. ఇతఁడు వీథులలో నిలుచుండి పిల్లవాండ్రచేత గంగడోలు గోఁకించుకొనెను. ఇతఁడు వీథులలో నిలుచుండఁగా బాలు రితనితో నాడుకొనిరి. ఇతనినడుము క్రిందనుండి దూఱిపోయిరి. ఇతనివర్ణశీలమైన యువయువస్పర్శచేతఁ గిలకిలనవ్వుకొనిరి. అతఁడును వారిని దన్నలేదు, పొడువ లేదు. ఆనాఁడు దేశములో నితఁ డొకయెత్తు; తక్కిన సర్వసృష్టి యొకయెత్తు. నాఁటి సంకులము లైన 'కుందశంఖచంద్రహారనీహారడిండీరపటీరముక్తాహారహీరసంకాశములును, గాఢంబకాలేయకాదంబినీనీలజాలతమాలికా సన్నిభములును, బ్రౌఢబంధూకపల్లవసదృశములు, వికచకాంచన చంపకవిస్ఫుటములు నై నవర్ణము లొప్ప నేత్రాభిరామభంగినలరారు గోకదంబములు' లేవు. అవి సంచరించువనములు లేవు. గోవన్నది నశించిపోయినది. ఆఁబో తన్నది యదృశ్య మైపోయినది.'

'గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు' అన్న దేశములో 'తేభ్యో உశుభమ' స్తన్న దుర్వాక్యము సర్వతః విజృంభించెను. బ్రాహ్మణులను గోవులను దేశము బ్రదుకరాని దయ్యెను. ఇంకను బ్రాహ్మణుఁడే నయము. ఇంటిలోనుండి త్రోసివేయఁగా వాసములైనను బట్టుకొని వేలాడుచున్నాఁడు 'నాది కర్మభూమి. ఈ భూమిలోనుండి కర్మపో' దన్న పండ్లబిగువు వానికి వదలలేదు. గోవు నోరులేని జంతువు. అది సభలు చేయలేదు. 'నాజాతి చచ్చి పోవుచున్నదో' యని మొఱపెట్టలేదు. పాపము నిమ్నజాతులలోనను జేర్చుకొనలేదు. దానికి వోటు లేదు. శాసనసభలకుఁ దన ప్రతినిధుల నేమి పంపించుకొనఁగలదు? వలసపోయిన వారు తాముపోయినచోటిజాతులను గూడఁ గటివేళ్ళతోఁ గుద్దాలించినట్లు తన్నుఁగూడ నెవరో కుద్దాలించిరి. తనపాలమునకు వలసవచ్చిన దెవరు? ఎవరో కనిపించలేదు.

ధర్మారావు ఆఁబోతువంక మఱలఁ జూచెను. ఆ యపరశివాకృతి మొగముమీఁద నెత్తురు కనిపించెను. ఎవఁడో కఱ్ఱపెట్టి కొమ్ములనడుమ మోఁపైనదెబ్బ కొట్టెను. ధర్మారావు మఱల విచారించ నారంభించెను: 'గోరాజా! నీ నెత్తురు కన్నులఁ జూచితిమి. ఆలపొదుఁగులు కోసికొని తాగితిమి. ఆవుల మాంసము సోల్జరులకు వండిపెట్టితిమి. మాజమీందారులును, మేమును బరమనాస్తికులమైపోతిమి. సర్వజంతుసంతానమునందు, వృక్షములందు, శిలలయందుఁ బచ్చిగడ్డియందు ప్రాణ మున్న దన్న మాఋషులసిద్ధాంతములు నేఁడు పరాస్తమైనవి. పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞులు ఋజువుచేసి చూపించినఁగాని మేము నమ్మము. మాయాస్తికభావములు మంగలములోఁ బెట్టి మలమల వేయించఁబడెను. మామతము దేవుఁ డున్నాఁ డని కాదు. ఆ దేవుఁ డుండనిమ్ము, చావ నిమ్ము. సర్వమైనసృష్టియందును బ్రాణము, జీవము, ఆత్మ కలకలలాడుచున్న దని మా పూర్వర్షులు చూచిరి. సర్వవస్తుగతప్రాణమును సమారాధించిరి. అంతకన్న భూతదయ లేదు. మాపూర్వులు గోవధ చేయలేదు. గోవులలోఁ బ్రాణము పరమాత్మరూప సన్నిహిత మైయున్నది. గోక్షీరమునందు ప్రాణము సబిడీకృతమై యున్నది. అంతప్రాణశక్తి మఱియొక దానియందు లేదు. నశించిపోతిమి. గడ్డి కఱచితిమి. మృతుల

మైతిమి.' పొద్దు గ్రుంకెను. చీఁకట్లు చనిపోయినగోకదంబముల ప్రేతాకృతులవలె నాల్గుదెసలకు బారాడెను. ధర్మారావు ఆఁబెయ్య నింటికిఁ దోలుకొనివచ్చెను. పెయ్య పరిలీనాగ్నియైన శమీవృక్షము వలె నెమ్మదిగాఁ దేజోధిదేవతవలె నడచెను. చీఁకట్లు దానినడచినంతమేఱ పరాభూతము లయ్యెను.

# ఇరువదియాఱవ అధ్యాయము

చైత్ర బహుళ ౧౫. ధర్మారావానాఁటి ప్రాతఃకాలమునఁ గోటకుఁబోయి పదిగంటలకింటికివచ్చెను. అప్పటికి వంటకాలేదు ధర్మారావరుంధతిని వెదకెను. ఆమె దొడ్డిలోఁ గాకరపాదు ప్రబరించిన నీడలోఁ బొంగువైచుకొని పరుండెను. చిక్కి సన్నమై యుండెను. బొమికలు బయటఁబడెను. ధర్మారావు 'నేఁడస లోపిక లేనట్లున్న దేమి?' యనెను.

అరుంధతి—నేను క్రమక్రమముగా నీరసించి పోవుచున్నాను. మీరు నాకు మందన్నది యిప్పించుట లేదు. ఆ రాజశేఖరశాస్త్రి గారిని దీసికొనివచ్చి చూపించరాదా? ధర్మా—చూపించినచో నాయనకు ధన మొసఁగవలయును. రాఘవరావుభార్యకొఱకుఁ దీసికొనిపోతి నన్నఁగా నది యితరులవిషయ మని చెప్పవచ్చును. తీసికొనివచ్చి నీకు వైద్యముచేయించి యేమియు నీయకపోతినా. బాగుగా నుండదు. అరుం—జమీందారుగారికి వైద్యముచేయుచుండెనుగదా! వారివద్ద ధనమాయన యెట్లును బుచ్చుకొనుచుండెనే యామెను. అందులో నాయనకు గిట్టదా? ధర్మా— అది యేమి మాట? వ్యాధి యతిశయించుచున్న దని భయముచేత నీవు తికమకగా మాటాడుచున్నావు. అరుం—హారప్పనాయని నడిగి తేవచ్చునుగదా! ధరా—నే నాయనను డబ్బడిగినచో మనమీఁదనున్న గౌరవ మాయన కింత యుండదు. మొన్న పసిరికవిషయములో నంతచేసినాఁడు. నాలుగువేలు నష్టపడెను. నష్టముకన్న నాకొఱ కంత సాహసించినాఁడు. ఇపు డాయనను నేనె మని యడుగుదును? అరు—చంద్రహారము, నిల్లు నివి రెండును మన కుండియు లేనట్లే యున్నవి. గంగిరెద్దుమీఁదిగతవలె నవి వేఁతకు రావు, నీటికిరావు. ధర్మా—సాయంకాలము రాజశేఖరశాస్త్రిగారిని దీసికొనివత్తును. అరుం—వ్యాధి యేమో తెలియుటలేదు. ఊరకే నీరసించిపోవుచుంటిని. ధర్మా—అమ్మను లేచి మడిగట్టుకొమ్మనుము. అరుం—సరే, ఆఁడా? నీరు తోడఁచుంబడినను దిక్కులేదు. అట్లే

నేనే వండెదను. అని లేచి యరుంధతి స్నానముచేయఁబోయెను. ధర్మారావు 'వేన్నీళ్లు పెట్టుకొని స్నానము చేయరాదా? చన్నీళ్ళేందు' కనెను. అరుంధతి 'ఇప్పుడు వేన్నీళ్లెవరు పెట్టుకొందు' రని చన్నీళ్లే పోసికొనెను. ఖద్దరుచీరలు బరువై మోయలేక యరుంధతి స్వదేశీమిల్లులసన్నచీరలు తాల్చుచుండెను. ఆమె స్నానముచేసిన యొడలిమీఁదఁ జీరయుత్తుకొని పరిశుష్కితములై యామెయంగములు బొమికలప్రోవులవలెఁ గన్పించెను. ఆమెయొడలు పలుచనై యామె యంగములబొమికలు ప్రోవులవలెఁ గన్పించెను. చాల విచారపడెను. అతఁడు తానుకూడ స్నానముచేసి యామెకు మడినీళ్లు దోడి పెట్టెను. ఆమె 'మీరు నాకుఁ బనికూడఁ జేసిపెట్టవలయును'అన్నది. అతఁడు మఱలఁ బనిమీఁద గ్రామములోనికిఁబోయెను. తిరిగి యింటికి వచ్చువఱకు పన్నెండుగంట లైనవి. అరుంధతి వట్టి యన్నము మాత్రము వండినది. పెట్టిన పచ్చళ్ళు కలవు. వానితోడనే భోజనముచేయవలయును. చంద్రయ్య గణాచారి కన్నము తీసికొని పోవుటకు వచ్చెను. అరుంధతి యతనిజూచి 'అయ్యో! మఱచిపోయితిని. నా తెలివి యీనాఁ డిట్లున్న దేమి? నాగమ్మకు బియ్యము పోయలే' దనెను. అని లోనికిఁబోయి వండినయన్నములోననే తెచ్చి యావకాయయు, నుసిరికాయపచ్చడియు వేసి పెట్టెను. మగనితో 'నాగమ్మగారిమాట మఱచిపోయి కూర వండలేదు. పాప మావిడ యీ నాఁ డెట్లు తినునో' యనెను. ధర్మారావు 'నీవు మఱల వండుకొనవలయునుగదా! కఱవులో నధికమాసము' అనెను. అరుం—ఏమి చేయుదును? వండుకొందును లెండి. ధర్మా—ఉన్నయన్నము నీవు తినుము. నేను మా పినతండ్రిగారియింటికిఁ బోయి భోజనము చేసెదను. అరుం—నాకుఁ బుట్టిల్లు; మీకుఁ బినతండ్రిగారియిల్లు! చాలు లెండి. ఎట్లోయొకట్లు వండెదను. ధర్మా—నేను కూరలేకుండ భోజనము జేయలేను నిప్పున్నదా. ఆర్పితివా? అరుం—ఉన్నది. ధర్మారావు పోయి దొడ్డిలోనివి కాఁకరకాయలుపది కోసి యతఁడే కూర వండెను. అతఁడే మఱల నరుంధతికిఁ బ్రాంయ్యమీఁద నత్తెసరు పెట్టెను. ఆమె 'మీరు వంటచేయుట యేమి' టని మొత్తుకొన్నది. ధర్మారావు 'నీ వఱవకుము. నీకు శరీరమున కాయాసముకలుగు నన

నే ననుకొనుచుండఁగా నిఱచి యూపిరితిత్తులు పాడుచేసికొను చున్నావు; చాలులే' యనెను. ధర్మారావు భోజనముచేసెను. తరువాత సావిత్రమ్మగారును, నరుంధతియు భోజనముచేసిరి. అప్పటికిఁ బ్రొద్దు తిరిగినది. ధర్మా—ప్రతిదినము నిట్లే భోజన మగువఱకు రెండుజాములు దాఁటుచున్నది. ఇంటి లోని చాకిరితోడను, నీప్రొద్దు దాఁటినభోజనములతోడను నీకు వ్యాధియెక్కువగుచున్నది. వలదనినచో నూరకుండవు కడిగినదే కడిగి దురాచారము వెళ్ళఁబెట్టుచున్నావు. అరుం—లేఁడు జబ్బుచేసిన దని మాలకూడు తినుచుందురా? ధర్మా—వారు మనకన్న చెడిపోలేదు. అరుం—చెడిపోకపోయినచో నీసారి మాలదానినే పెండ్లిచేసికొనుఁడు. ధర్మా—చెంపపైని గొట్టరా! తీరికూర్చుండి దుష్టపుమాటలు మాటాడెదవేమి?

మఱునాఁ డుదయమున రాజశేఖరశాస్త్రిగారు వచ్చిరి. యరుంధతిచేయిచూచి, వ్యాధిలక్షణములన్నియుఁ గనుగొని 'అయ్యా! ఇది రాజయక్ష్మవ్యాధి. దీనికి నాయుర్వేదవైద్యమునఁగూడ సరియైనయౌషధము లేదు. వ్యాధి ముదిరినది. ప్రాథమికస్థితిలో నైనచో నిరాశ యుండెడిది కాదు. ఈమెలో నిది చాల దొంగ వ్యాధిగఁ బరిణమించెను. ఏఁడాదినుండి నా కేల చూపించ లేదు? కానిండు. అయినను మందు నడపెదను. ఆమెకు సంపూర్ణముగా విశ్రాంతి నొసఁగవలయును. ఇక్కడకన్న నేదైనఁబల్లెటూరిలో నుంచినచో క్షేమము. మీయుత్తరాన రంగాపురము కాఁబోలు! తీసికొనిపోయి యక్కడ నుంచరాదా? దగ్గఱ నేకనుక నేను చూచి వచ్చుచుందును' అనెను. ధర్మా—వారికి మాకు రాకపోకలు లేవులెండి! మాయమ్మ పెద్దది ఆమె మంచముమీఁదినుండి లేచుటయే లేదు. పనిసేయకుండుట యనునది సాఁగదు. ఇల్లే యెట్లో గడుపవలయును. తమ యౌషధము నడుపుచుండుఁడు. వీలైనంతమట్టుకు తక్కువపనిచేయునట్లే చూచెదను రాజ—ఇవి రాజులకు రావలసిన వ్యాధులు. పేద సంసారములలో వచ్చినచో నేమిచేసికొనగలము? ధర్మా-రంగారావుగారి కెట్లున్నది? రాజ- ఇంతవఱకు దేహములో నున్న వ్యాధి నిశ్శేషముగాఁ బోయినట్లే. ఇక మఱల నెత్తురు, మాంసము క్రొత్తది పట్ట

వలయును. అది మఱియొకపది నెలలు పట్టవచ్చును. ధర్మా—మా కెపుడు మందు ప్రారంభించెదరు? రాజ— రేపు ప్రొద్దున మంచిది. ధర్మా— న న్నేమి యిమ్మందురు? రాజ—మీరా? ఏమి యిచ్చెదరు? ఇచ్చుచున్నది చాలదా? జమీందారుగారివలన బదినెలలనుండి సంసార మేమో సాగుచున్నది. ఔషధముల కని రెండువేల రూపాయలు తీసికొంటిని. అందులో నెంతలేదన్నను నైదువందలరూపాయలు నాకు మిగులును. జమీందారుగారికి నెమ్మదించినతరువాత నింకఁ గొంతముట్టకపోదు. ఇదియంతయు మీ రిప్పించినదేకదా! ధర్మా—మీరుకనుక నట్లు చెప్పుచున్నారు. రాజ—అది మీతోఁ గనుక.

మఱునాఁడు మందు ప్రారంభించఁబడెను. రాజశేఖరశాస్త్రిగారు 'అమ్మా! తడిబట్ట కట్టుకొనరాదు. బయుపులిందెలు మోయరాదు. అన్నముమాత్రము తప్పదు గనుక వండిపెట్టును. తక్కినపని యేదియుఁ జేయకు' మని చెప్పెను. ఆమె యట్లే చేసెద నన్నది.

వైశాఖ శుద్ధ విదియనాఁడు దేవదాసి యలంకరించుకొని దేవాలయమునకుఁ బోయెను. కల్యాణములు ప్రారంభించుట కింక నాల్గుదినము లున్నవి. ధ్వజారోహణ మేకాదశినాఁడు చేసినను నుత్సవముమాత్రము పంచమినాఁటినుండియే ప్రారంభింతురు. హారప్పనాఁ గుఁడు తల్లికిఁ బితామహికిఁ గర్మలు చేసెను. విదియతోఁ గర్మ లవసానదశకు వచ్చెను. బ్రాహ్మణులు నాలుఁగైదు వేలమంది యైరి. హారప్ప సంభావన విరఁజిమ్మెను. నాగేశ్వరరావు లేఁడు గనుక రంగారావుగా రభ్యంతరపెట్టలేదు. ఇప్పుడు రంగారావుగారికిఁ గొడుకే దైవముగా నుండెను. తాను చేసిన ముప్పదినలువదిలక్షల యప్పు తీర్చెను. వ్యయము తగ్గించెను. జమీందారీ మఱల నిలువలో నుండెను. తనకుఁ దెలియకుండ బోలె డంత చదివెను. రంగారావుగారు తనకు వ్యాధి క్రమక్రమముగా నెమ్మదించుచున్న దని కూడఁ దెలిసికొనెను. రెండేండ్లు పెద్దపెద్దయింగ్లీషు వైద్యులు వచ్చి వ్యాధితత్త్వమే తెలిసికొనలేకపోయిరి. రాజశేఖరశాస్త్రిగారు చక్కఁగా దత్త్వానుగుణముగా నౌషధము నడుపుచుండెను. ఈ వైద్యుఁడు లభించుటకుఁగూడ హారప్పయే కారణము. రంగారావు

గారికి హారప్ప రామచంద్రుఁడు, ధర్మారావు వసిష్ఠుఁడుగాఁ గని పించిరి. హారప్పనాయని ప్రభుత్వము అష్టదిక్కులయం దున్న రేనుఁ గులు తొండములతో మందాకినీజల మాకర్షించి ఘాలచెట్లవలె నిర్గ మించిన నీటిగుబురులవలెఁ గీర్తి చెట్లు కట్టెను. అవి చిలికిన కేళకళులు కాఁగా, మధ్యనున్నకోట యను పూలతోఁట చల్లఁబడెను. బ్రాహ్మ ణులు కర్మలు యథావిధిగా జరిపించిరి. ఆ నాఁడు సాయంవేళ మూఁడుజాముల ప్రొద్దగువఱకు హారప్ప కాశౌచము వదలెను. ఆయన మొగమున గంధమును, పెద్దకుంకుమబొట్టును దాల్చి నిష్కంచుకుఁడు నిశ్శిరస్త్రాణుఁడై పైన నొకపట్టుత్తరీయము కప్పు కొని పాదచారియై వేణుగోపాలస్వామియాలయమునకు నడచెను. ప్రొద్దుక్రుంకెను. ఆలయముఖమంటపమున దేవదాసియు హారప్పయుఁ గలిసికొనిరి. హారప్ప దేవాలయాంతర్భాగము నెన్నఁడును జూడ లేదు. ఆయనకు గాలిగోపురము, ప్రాకారములు, లోనున్న చిన్ని చిన్ని దేవాలయములు, ఆంజనేయస్వామిగుడి, ధ్వజస్తంభము, లోనిసరస్సు, దాని కున్న చలువరాతిమెట్లు, నానాప్రసూనవృక్ష ములు పరిహారిలోని వైకుంఠమువోలె నుండెను. ఇరువదిరెండేండ్లుగా నా ప్రభువుహృదయములో దాఁగియున్న భక్తిభావ మా నాఁ డొక్క సారిగా నుబికివచ్చెను. ఆయనకు దేవాలయములోఁబడి పొరలాడి పులక లలముకొనవలయు నని తోఁచినది. మూఁడుసార్లు ప్రదక్షిణము జేసి చేయుచుఁ బుష్పవృక్షములన్నియుఁ దనశరీరమునకుఁ దాఁకు నట్లు తిరిగెను. సరస్సువద్ద నిలుచుండి యస్తంగతసూర్యబింబారుణ దీధితులు సరోజలమును రక్తచ్ఛవిమంతముగాఁ జేయుటయుఁ, గ్రమ క్రమముగా చీఁకట్లుసాఁగి సరోజలము వృద్ధశ్రవోపలకాంతి తఱుము కొనుటయుఁ జూచెను. ఈస్వామియాలయము తనదై తన కిన్నా ళ్ళుగాఁ జేరరాకపోవుటకుఁ దాఁ జేసిన పూర్వపాపమేదియో యని యూహించెను. ఆయనకు దేవాలయములోఁ దిరుగుచున్నంత సేపును భాగవతముచదువుచున్నట్లుండెను. భగవంతునిదశావతారములకథ యాయనమనస్సులోనాడుచుండెను. బృందావనము, వేణుగోపాలుఁడు, గోపికలు, గోవర్ధనపర్వతము, బ్రహ్మేంద్రులు, కాళీయాహిమర్ద నము, రుక్మిణీకల్యాణము హారప్పమనోవీథియందుఁ దెరలు తెరలుగా

వచ్చి పోవుచుండెను. అప్పుడు ధర్మారావు వచ్చి ప్రదక్షిణము చేసెను. ఇరువురును ముఖమంటపమునకు వచ్చిరి. అచ్చట ప్రేలాడు గంట మొదట ధర్మారావు, తరువాత హరప్పయు మ్రోగించిరి. బలిపీఠమున్న ముందరియూలయమున గిరిక నిలుచుండెను. ధర్మారావు చూచెను హరప్ప తన్మయానందములో నామెను జూడలేదు. ధర్మారావు హరప్పను ప్రబోధించి గిరికను జూపించెను. ఇరువురు గిరికా సన్నిధానమునకుఁ బోయిరి. గిరికయవస్థ 'యదుపగద్దునకు మాధవాదు చింతనసుధామాధుర్యమున మేను మఱచువాని' యన్న పద్యమున కుదాహరణముగా నుండెను. ఆమెకుఁ దనయొడలు తనకుఁ దెలియుట లేదు. ఆమె మనసులో నేదియో యనుకొనుచుండెను. హరప్ప ధర్మారావును జూచి, యామె 'యేమనుకొనుచున్నది' యని ప్రశ్న చేసెను. ధర్మారావు మనకుఁ దెలియదనెను. దేవదాసి బిగ్గఱగా ననుచుండెను.

'సఖి హే కేశిమథన ముదారం, రమయ మయాసహ
మదన మనోరథ భావితయా సవికారం
నిభృతనికుంజగృహం గతయా నిశి రహసి నిలీయ వసంతం
చకితవిలోకిత సకలదిశారతి రభసభరేణ హసంతం.
మయాసహ సహకారం.
సఖి హే కేశిమథన ముదారం రమయ.'
'కిసలయశయననివేశితయా చిర మురసి మమైవ శయానం
కృతపరిరంభణచుంబనయా పరిరభ్య కృతాధరపానం
రతిసుఖసమయరసాలసయా దరముకుళితనయనసరోజం
నిస్సహ నిపతితతనులతయా మధుసూదన ముదితమనోజం.'

అని పాడుచుండెను. ఆలయములో నొకమూల గూండ్లుకట్టిన రెండు తుమ్మెదలు బొంయి మని శ్రుతివేయుచుండెను. గిరిక మధ్య మధ్యఁ జేతు లాడించుచుండఁగా గలగలలాడి తాళము సరిగాఁబడు చుండెను. విరహాసంత ప్తయై తన్మయస్థితిలో నుండి భావ్యాశలు త్రవ్వుకొనుచున్న యామెను జూచి ధర్మారావు 'నేఁడు విదియ కదా' యనుకొనెను. అర్చకుఁడు విష్ణుపాదములు ముప్పురకు నిచ్చెను

హారప్పధర్మారావులనెఱుఁగనితన్మయత విష్ణుపాదను లిచ్చువేళకు గిరిక కేమైనదో యామె పలవంచినది. చేయిపట్టి తులసిదళ మందు కొన్నది. మువ్వురును మ ఖమంటపమునకు వచ్చి మొదట దేవదాసి, తరువాత ధర్మారావు హారప్పలుగా మజల గంట ప్రమోగించిరి. దేవ దాసి విశ్రమించుటకుఁ గూర్చున్నతరువాత హారప్పధర్మారావులను జూచెను. హారప్పను జూచి యామె లేచి నిలుచుండెను. హారప్ప మనసులో నమస్కార మాచరించెను. మువ్వురును గూర్చుండిరి. హారప్ప దేవదాసిని 'తల్లీ! కల్యాణ మెప్పు' డనెను. దేవదాసి 'యెప్పుడైన నేమి? నాకు దినములు గడచుటయేకదా!' యనెను.

ధర్మా—పంచమినాఁ డుత్సవములు ప్రారంభింపఁబడును. దేవ దాసి—స్వామిదర్శనము చేసితిరా? హారప్ప—చేసినాము. దేవ— స్వామి యెట్లున్నాఁడు? ధర్మా—కల్యాణమున కభిముఖుఁడై యున్నాఁడు. దేవ—కల్యాణమునకుఁదగిన సంభారములు సమ కూర్పఁబడినవా? హారప్ప—నాసమకూర్చుట సగమేకదా! ధర్మా— తక్కినసగము సమకూర్పఁబడియేయున్నది. దేవ—ఆ సగము మా యన్న సమకూర్చినాఁడు ధర్మా—మా చెల్లెలు సమకూర్చినది. హారప్ప—మీ యిద్దఱును గలిసి సమకూర్చితిరి. పందిళ్లెప్పుడు వేయించెదరు? దేవ—సప్తాహమునకు వేసినంత పదిళ్లు వేయించవల యును. ప్రాకారములోపలఁ బందిళ్ళ వద్దు. స్వామిసుందరవీథి యంతయు బందిళ్లు హారప్ప—చిత్తము. ధర్మా—తేపే ప్రారంభించ వలయును. దేవ—నే నీమూనాళ్ళు దేవాలయములోనికి రాను. హారప్ప—ఎందుచేత? దేవ—నా కీ స్వామితో నేమిపని యున్నది? ఉత్సవములు పదిరోజులు మాత్రము వచ్చెదను. ధర్మా—ఈస్వామి మీస్వామి కాదా! దేవ—కాక యేమి? నా స్వామి నాయందే యున్నాఁడు.

అని దేవదాసి బిగ్గఱగా చదువ నారంభించెను:

'వేదా నుద్ధరతే జగ న్నివహతే భూగోళ ముద్బిభ్రతే
దైత్యాన్ దారయితే బలిం ఛలయతే క్షత్రక్షయం కుర్వతే
పౌలస్త్యం జయతే హలం కలయతే కారుణ్య మాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతికృతే కృష్ణాయ తుభ్యం నమః'

దేవదాసి మఱల తన్మయత్వస్థితిని బొందును.

'ప్రథమసమాగమలజ్జితయా పటుచాటుశతై రనుకూలం
మృదుమధురస్మితభాషితయా శిథిలీకృతజఘనదుకూలం
సఖి హే! కేశిమథన ముదారం, రమయ మయా సహ.'

హరప్పయు ధర్మారావును లేచి నిలుచుండి స్వామికి నమస్కారముచేసి గృహాభిముఖులైరి. ఒకరాత్రివేళ కబీరు వచ్చి దేవదాసి నింటికిఁ దీసికొనిపోయెను. దారివెంట దేవదాసి యొడలెఱుఁగదు.

రామేశ్వరశాస్త్రి యాఱేండ్లవాఁడు. ఎప్పుడు నింటిలో నుండఁడు. కొంపకొంపకు సంచారము చేయుచుండును. వలదన్నచో నూరకుండఁడు. వ్యాధిగ్రస్తురాలైన తల్లియు నతఁ డింటివద్దనున్నచోఁ బ్రాణములు వేధించు నని యతనియిష్టము వచ్చినట్లు తిరుగనిచ్చును. శాస్త్రి కాఁపుపిల్లలతో రెడ్డికుఱ్ఱవాండ్రతోఁ గలిసి గోడీబిళ్ళ లాడును. దేవాలయములోనికిఁ బోయి పులిజూదము, దాడి మొదలైన యాట లాడును. కంచెలవెంటఁబోయి తిరుగును. అతనియిష్టము వచ్చినపు డింటికివచ్చును. తల్లి రెండువాయిలంచి యన్నము పెట్టును. అన్నము తినిన దాలస్యముగ మఱల నూరేఁగఁబోవును. అతఁడు తదియనాఁడు కోటలోనికిఁ బోయెను. ధర్మారావుగారికుమారుఁడని ఎవరు నడ్డగించలేదు. అతఁడు సరాసరిపోయి రంగారావుగారిమంచ మున్నయెడఁ గూర్చుండెను. మేడమెట్లు తానే ఎక్కెను. అతఁడదివఱకె రెండుసార్లు కోటకుఁబోయి త్రోవలు, దొడ్లు చూచియే యుండెను. రంగారావుగారు నిద్రించుస్థలము రెండుజాములగుటచేతఁ బరిచారికలు విసర్జించి చనిరి. అందుచే శాస్త్రి నడ్డగించువారు లేకపోయిరి. రంగారావు శాస్త్రి నెఱుఁగఁడు. శాస్త్రి పోయి యచటఁ గూర్చుండెను. రంగారావుగారు నిద్రించుచుండిరి. ఆయన కొకస్వప్నము వచ్చెను: సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వేయితలలతో మొదట గోచరించెను. క్రమముగా నొక్కొక్కఁడే శిరసులన్నియు మాయమై రెండుశిరసులే నిలిచియుండెను. అందులో నొకఁడు పరిచ్ఛిన్నమయ్యెను. ఒక తల

తోడి స్వామి వ్యాధిగ్రస్తునివోలి తూలిపోయెను. తాను రెండవతల యతికించవలయు నని యొకకాగితపుముక్క- మడచి శిరస్సువద్ద తగిలించెను దానిని స్వామి కొఱికివేసెను. ఆ ముక్క- రెండై క్రింద పడెను. రంగారావుమనస్సులో 'వేయితలలస్వామి కొక్క-తల మిగిలి నది. ఇదియంతయు నేను చేసినతప్పు. నాతప్పు దిద్దుకొనుట యెట్లు' యనుకొనెను. అంతలో నొకధ్వని వినఁబడెను. 'తప్పు దిద్దుకొను కొనుటకు వీలులేదు. కాని యాతప్పువెంటనే నీకుఁ బాపము సంక్ర మించినది. ఆ పాపము నివృ-రించుటకు వీ లున్నది' యని వినఁ బడెను. రంగారావు సుషుప్త్యవస్థలోనే యిట్లు భావించెను: 'నేను కేవలబ్రీముతానుయాయిని. నా కీ సర్పములు మొదలైనవానియందు దేవతాబుద్ధి లేదు' అని. ధ్వని యన్నది: 'నాగేశ్వరరావు నీవు చేసి కొన్నపాపమునకు ఫలము. అతఁడు నిన్ను మతభ్రష్టుని జేసి రాజ్య మును గలుషితము చేసెను. నీవు పరమతస్థుఁడవు కావు ఇన్నాళ్లును నిన్ను వదలిలేసిగాని మఱల నీకొఱకు వచ్చితిని.' రంగారావు 'పాపనిష్కృతి యేరీతి ఎఱుగుదు'నని యడిగెను. అంతలో రంగా రావునకు భయముకలిగి కనులు తెఱచెను. ఎదురుగా రామేశ్వర శాస్త్రి కనిపించెను. ఆయనకు స్వప్నభ్రాంతి పోలేదు. కుఱ్ఱవానిని జూచి 'నీవు సర్పాకృతివదలి బాలునివోలె నేలకనిపించుచున్నావు?' అనెను. శాస్త్రి—నా పేరు రామేశ్వరశాస్త్రి. రంగా—మీా రనినచో నాకుఁ బడదు. నేను తప్పుచేసితిని. మీాకుమారుఁడు ధర్మారావు గారు మహాత్ముఁడు. నేను మిమ్ముఁ బరిత్యజించితినిగాని, మూహారప్ప నాయఁడు మీాకుమారుని బరిత్యజించలేదు. మీారు బాలురై నా కేల కనిపించుచున్నారు?

రామేశ్వరశాస్త్రి జమీాందారువేయుప్రశ్న లర్థముచేసికొన లేకపోయెను. అతఁడు తా నచ్చటికి వచ్చినందులకు నాయన కోపించక తనతో మాటాడుచుండుటకు నాశ్చర్యపడెను. అతఁడు సమా ధానము చెప్పలేదు. రంగారావుగా రొత్తిగిలెను. మెత్తనిపఱపులు మూఁడునాల్గువేసి యాపైని ప్రభువు పరున్నను నాయనబొమికలు గుచ్చుకొనుచుండెను. ఆబాధలో నాయనకుఁ దా నున్నది స్వప్న స్థితికా దని తెలిసెను. మెలఁకువ వచ్చి నాల్గుదిక్కు-లఁ జూచెను.

జాగ్రదవస్థగాని, స్వప్నావస్థ కాదు. ఆయన పిల్లవానివంకఁ జూచి యితఁ డెవ రిచ్చటికేలవచ్చెననుకొనెను. జాగ్రదవస్థ వెంటనే జమీాందారీదర్జాయు వచ్చెను. రంగారావు నుఱలఁ గుఱ్ఱవానిని బలుకరించలేదు. రంగారా వి ట్లాలోచించుకొన నారంభించెను: 'నాకుఁ జను త్కారమైన స్వప్నము వచ్చినదే! పాపనిష్కృతి యెట్లు కలుగును? ఎట్లు కలుగునో తెలియదు. ఈ స్వప్నమునందు సుబ్రహ్మణ్యేశ్వరుఁడు గోచరించి నన్నుఁ దాను వదలిపెట్ట లేదని చెప్పెను. నాగేశ్వరరావు నాయాస్తి నేమి పాడుచేసెను? అది నేనే చేసితిని. అతఁడు నన్ను మతభ్రష్టుని జేసె ననెను నా కతనియుత మిష్టమై నేనే స్వీకరించితిని. అతఁడు నాపాపమున కాకార మనెను. ఈ కుఱ్ఱవాఁ డెవరు? నాపాపమునకు నిష్కృతి యేమియుఁ జెప్పలేదేమి? ఈ కుఱ్ఱవాఁడు బీరువాతలుపులు బ్రద్దలుకొట్టునేమో? పాపనిష్కృతి యెట్లు? ఇది చమత్కారము. నే నారోగ్యవంతుఁడనుగా నున్నన్నినాళ్లు నాకు భగవంతునిమీాఁద బుద్ధిపోలేదు. ఇప్పు డారోగ్యము విచ్ఛిన్నమై, మనస్సు భగవంతునిమీాఁదికి దిరుగుచున్నది. ఇంగ్లీషులో వెనుక నొకకథ చదివితిని. "ఒక పరమనాస్తికుఁ డున్నాఁడు. వాఁడు దేవుఁడు లేఁడన్న లేఁ డని హిరణ్యకశిపునికన్న నెక్కువ వాదించెను. వాఁ డొకనాఁడు గుఱ్ఱముమీాఁద షికారుపోయి యొక కొండమీాఁద దారితప్పి యొకచిన్నఅాతిగోడమీాఁదఁ బోవుచుండెను. ఆ గోడ కొకవైపున మహాఅగాధము. రెండవవైపున నీలసర్పవత్పరిసర్పమాణమహాసాగరతరంగములు. ఎటుచూచినను కన్నులు తిరుగుచున్నవి. గుఱ్ఱముమాత్రము మిాపులజాగ్రత్తగా నడచుచుండెను. 'ఆహా! ఈ యగాధములోఁ బడిన నే మగుదును? వేగముచేత నేలకుఁ జేరకముందే శరీరము గుండ్రడనియుండ యవునేమో! సముద్రములోఁ బడిన నే మగుదును? జలజంతువులు నా నీడనే వచ్చుచున్నట్లున్నవి. అవి నన్నుఁ గనీతీరఁ గొఱికి యాహారముగ భక్షించును. పడినచో గుఱ్ఱమును, నేనును బడుదుము కదా! గుఱ్ఱ మెట్లును నాపైనే పడును. ఈకినుమం దాఁటుట యెట్లు? క్షేమముగా నిడ దాటినచో భగవంతుని' అంచనుకొని వచ్చి యా మహానాస్తికుఁడు తనకు భగవంతుడన్న భావము కలిగినందుల కాశ్చర్యపడి 'ఆహా! భగవంతుఁడున్నాఁడు

ఉన్నాఁ డన్నమాట కష్టములలో నున్నవారికిఁగాని తెలియదు. ధనమదాంధులకు ధనము, తత్సంపాదనామార్గములు గాక మఱియొకటి తెలియదు. దరిద్రుఁడు, దుఃఖి, కష్టజీవి, వ్యాధిగ్రస్తుఁడు - భగవంతుఁడు వీరికున్నాఁడు" అనుకొనెను. నిజముగా స్వామి నాయందుఁ బ్రసన్నుఁడుగనుకనే నా కింతదీర్ఘవ్యాధి తెచ్చెను. అవును. కష్టములు లేనప్పుడు దైవమునందలియూహ యేల కలుగును? కేవలజ్ఞ మతమంతయు సుఖములలో నున్నవారికొఱకే చెప్పఁబడినది. వారు తెల్లని చొక్కాలు విలాసముకలజీవితము ప్రకటించును. అది యేదో ప్రార్థన లందునుగాని, దానివలన నిజముగా హృదయములు చలించుచున్నట్లు లేదు. మత మెప్పుడును వ్యక్తివిషయము; సంఘవిషయము కాదు. దుర్జనులు సంఘవిషయ మని భ్రమింపఁజేసి స్వలాభపరాయణు లగుచున్నారు." రామేశ్వరశాస్త్రి యింతసేపు కూర్చుండెను. ఊరకే జమీందారునివంకఁ జూచుచుండెను. రంగారావు మఱల నతనిని 'నీ పేరేమి' యని యడిగెను. అతఁడు 'రామేశ్వరశాస్త్రి యని చెప్పలేదా' యనెను. రంగా—ఈ యి ల్లెవరిది? రామే—మా జమీందారుగారిది. రంగా—మీజమీందా రెవరు? రామే—హనప్పనాయుఁడుగారు. రంగా—నీ వెవరికుమారుఁడవు? రామే—ధర్మారావుగారి కుమారుఁడను. రంగా—నే నెవరిని? శాస్త్రి—మీ రెవరో నాకుఁ దెలియదు. పండుకొని యున్నా రేమి? పాము కఱచినదా ?

నాల్గునాళ్ళక్రింద నొక కాఁపునకు పాము కఱచి యతఁడు మంచముమీఁదఁ బడియుండఁగా రామేశ్వరశాస్త్రి చూచెను అతని యా ప్రశ్నకు రంగారావుగారు చకితుఁ డయ్యెను. రంగా—నీ విచ్చటి కెందుకు వచ్చితివి? రామే—మాజమీందారుగారికోట చూచి పోవుటకు వచ్చితిని. రామేశ్వరశాస్త్రి రంగారావుగా రెవరో తెలియకపోవుటయు, నతఁడు వ్యాధిగ్రస్తుఁడై యుండుటయుఁ, దనతో మాటాడుచుండుటయు నీమూఁడును హేతువులుగా నిర్భయుఁడై రంగారావుగారితో మాటాడుచుండెను. రంగా— నీ వేమి చదువుకొనుచున్నావు? రామే— నేను చదువుకొనుట లేదు. రంగా—ఏమి చేయుచున్నావు? రామే—సీమచింతకాయలు కొట్టుకొనుచుంటిని.

అందులోని పప్పు చాలబాగుగా నుండును. కనుపుగో బసరు పెరుగు నని చెప్పుదురుగాని వానిరుచి మఱి వేనికిని లేదు. రంగా—నీతో బాలురు చదువుకొనుట లేదా? రామే—చదువా? ఎవ్వరు నిప్పుడు చదువుకొనుట లేదు. అందఱును సీమచింతకాయలే కొట్టుకొను చుండిరి. దానిపప్పు చాలరుచి పసరు పెరుగునందురు కాని నాకు నమ్మకము లేదు. అంతపసరుపెరిగినచో నాల్గునాళ్ళు జ్వరము వచ్చును.

# ఇరువదియేడవ అధ్యాయము

కల్యాణోత్సవమునకు రమ్మని శశిరేఖాకిరీటులకు, అనసూయా పశుపతులకు, ఛాయాసూర్యపతులకును ధర్మారావు ఆహ్వానములు పంపించెను. నాలుగైదేండ్లనుండి వారు వచ్చెదము వచ్చెదమన్నారు. కిరీటి తన పెండ్లినాఁడు మ్రొక్కుకొన్నాఁడు; 'ప్రతియేఁట వచ్చి మ్రొక్కు తీర్చెద' మని. ఇంతవఱకును రాలేదు. చిన్నయరుంధతికిఁ బన్నెండేండ్లు వచ్చినవి. ఆమె యీ నాలుగేండ్లనుండి పెద్దయరుంధతి ప్రస్తావనచేయనిదినము లేదు. సూర్యపతి స్నేహితులందఱును మఱల నొకసారి కలిసికొనవచ్చునని వచ్చుటకు నిశ్చయించెను. ధర్మారావు బావమఱందులును అక్కగారలును బిల్లలతో వచ్చిరి. పంచమినాఁటికి నిల్లంతయుఁ గలకల లాడుచుండెను. అరుంధతి యుత్సాహములో వ్యాధిగ్రస్తురాలుకానట్లే కనిపించెను. నల్లనిచీరకట్టి, మూఁకుపచ్చరైక తొడిగి, కనులనిండఁ గొలుకులదాఁక సన్నని కాటుకరేఖ తీర్చిదిద్ది, మొగమునఁ బెద్దదియు జిన్నదియుఁ గాని కుంకుమబొట్టు తాల్చి పెదవులపై మందహాసము తాండవించఁగా నాఁడుబిడ్డలను స్నేహితురాండ్రను నెదురుకొని మర్యాద చేసెను. ఆమె యందఱకు నారోగ్యవతిగానే కనిపించెను. ఆ యుత్సాహములో నామెశరీరకార్శ్యము తెలియలేదు. అనసూయాపశుపతులు పంచమినాఁడు ప్రొద్దున వచ్చిరి. చిన్నధర్మారావును చిన్నయరుంధతియుఁ దలిదండ్రులవెనుక నడచివచ్చిరి. చిన్నయరుంధతి శరీరము మీఁదికి గొంచెముదూరమున నున్న మన్మథుని వెలుఁగు పడుచుండెను. ఆమె తనూలత కోరకిత మగుచుండెను. ఆమె కన్నులలోఁ గంటితుదలలో నవ్వుకాదన్నవక్రిత గోచరించుచుండెను. ఆమె నడచుచుండఁగాఁ బాదవిన్యాసము లఘువు గురువుగాక మధ్యస్థముగా నుండెను మనిసి బొద్దుమనిసి. పుష్టిగలిగిన శరీరము, పరిపోషణచేత కల్యాణమును దలుసుకొన్నది. దీర్ఘములైన శిరోజములు వేణీబంధమునమర్చి జడకుప్పెలు వేసిరి. బరికిణీకుచ్చెలలు

పాదాంగుష్ఠములమీఁదఁ జివురున్నృత్యమాడుచుండెను. ఒల్లె పయ్యె దగాఁ దిరిగి వీఁపుపైఁ జీరాడినకొంగుచివర జరీకాంతులు జడ కుప్పెలబంగారుకాంతు లీనిన ప్రవాహమువలె నుండెను. ఆమె మొగమునఁ జెంపలకొలఁగినవేత్రములనుండి వెలువడిన యపాంగ రేఖలు కొసలు తేరిన యింద్రనీలరత్నములతుదలఁ తొడిగిన కాంతి వెల్లువలవలె నుండెను. ఆమె పెద్ద యరుంధతిని జూచినంతనే తటాలునఁబోయి యామెను గాఁగిలించుకొనెను. ఆమె వచ్చినవేగ మున కరుంధతి తాళలేక ప్రక్కనున్న బల్లపైఁ జదికిలఁ బడెను. అనసూయ యన్నది: 'నీ వామెను నిలువనిచ్చునట్లు లేదే' యని. పెద్దయరుంధతి 'పసిపిల్ల' దాని కేమి తెలియును! ఎన్నాళ్లై నది నేను దానిని, అది నన్ను గాఁగిలించుకొని' యనెను. పశుపతి 'ప్రతిదినము నీస్మరణయే. దానికి సుబ్బన్నపేటలో వచ్చి యెప్పుడు వ్రాలుదుమా యని యున్నది. వచ్చి వ్రాలినది' అనెను.

ఆ మధ్యాహ్నము హైమవతీసూర్యనారాయణలు వచ్చిరి. వారు వచ్చి చాల యేండ్లైయినది. రంగాజమ్మగారు చనిపోయినప్పుడు వచ్చినరాక మఱల నీ నాఁడు. అరుంధతి కాపురమునకు వచ్చుట- రామేశ్వరశాస్త్రి కలుగుట-యీసంగతులు వారికి వార్తగాఁ దెలియు టయేకాని కనులారఁ జూచినది లేదు. వారువచ్చినంతనే రామేశ్వర శాస్త్రి యొడలునిండ దుమ్ముతోఁ జింపిరితలతోఁ జిరిగిన లాగు చొక్కాలతో వాకిటఁ గూర్చుండియుండెను. వా రతనిని జూచి యెవరిపిల్లవాఁడో యనుకొని 'యబ్బాయీ! ధర్మారావుగా రింటిలో నున్నారా?' యని యడిగిరి. ఆతఁడు వా రెవరో నాకుఁ దెలియదు. వారి దీ యిల్లే యైనచో నింటిలోనికిఁబోయి కనుఁగొనుఁ' డనెను. వారు లోనికిఁ బోయిరి. అరుంధతిధర్మారావులిద్దరు చాలదినము లకు వచ్చినవారిని గాఁగిలించుకొని, మర్యాదచేసి పరస్పర మానంద ముచు వెలిబుచ్చుకొనిరి. హైమవతి 'యేమే, యరుంధతీ! పిల్లవాఁ డెచ్చట? నాకన్నులు కాలిపోను! నేను వాని నింతవఱకుఁ జూచుకో నైన లేకపోయితిని. ఏమోయమ్మా, వచ్చుచుఁబోవుచున్నఁగదా, బంధుత్వము! మీరు మామీఁద 'శీతకన్నే' వేసిరి. తమ్ముఁడని, మఱదలని వచ్చుటయుఁజూచుటయే లేకపోయెను. పిల్లవాఁడెచ్చటికిఁ

పోయినాఁ' డని యడిగెను. ధర్మారా 'వరుగుమీఁదఁ గూర్చున్నాఁడే యింతవఱకు! మఱల నెచ్చటకైనఁ బోయెనేమో! వాఁడు వట్టి యాగమ్మకాకి. కాలిలోఁ బురు గెప్పుడును దొలుచుచునే యుండును' అనెను? హైమవతి 'యరుగుమీఁద లేఁడే' యనెను. ధర్మారావు—నీవు వాని నెఱుఁగ వామెను. అరుగుమీఁద లేఁడని నికెట్లు తెలియును? సూర్యనారాయణ—ఆ అరుగుమీఁదఁ గూర్చున్న వాఁడు వాఁడే కాఁబోలును! 'ధర్మారావు నింటిలో నున్నాఁడా' యని యడుగఁగాఁ 'ధర్మారా వెవరో నే నెఱుఁగ' నన్నాఁడు. వట్టి గడుగ్గాయివలె నున్నాఁడు. అరుంధతి– అయినచో వాఁడే వాని పద్ధతులన్నియు నంతియే. వానికిఁ దండ్రిమాటకూడ లెక్క లేదు. హైమ—అట్లయినచోఁ బిల్లవాని నడుపాజ్ఞలలోఁ బెట్టుకొనరా?

అనసూయాపశుపతులకుఁ జుట్టములకుఁ బరిచయము కలిగెను. సూర్యనారాయణగారు పశుపతి ధనవంతుఁ డని తెలిసికొని యాయనను జాల గౌరవించెను. సూర్యనారాయణగారిలోఁ బూర్వమునకన్న కొంతమార్పు గలిగెను. ఆయన కేఁబదియేండ్లు దాఁటినవి. మనిసి స్థూలకాయుఁడై వృద్ధునివాలకము పడెను. అరుంధతి 'శ్రీలక్ష్మి రాలే దేమి' యని యడిగెను. 'శ్రీలక్ష్మి' హైమవతి పెద్దకూఁతురు. ఆమె కిద్దరు పిల్లలు. 'ఆమెను భర్త పంపించ' లేదని హైమవతి చెప్పెను. తక్కిన యిద్దరు కూఁతుండ్రును, తరువాతఁ గలిగిన యిద్దరును నలువురు పిల్లలు వచ్చిరి. రామేశ్వరశాస్త్రి యింటిలోనికి వచ్చెను. అరుంధతి 'ఇదుగో మేనల్లుఁ' డని చూపించెను. హైమవతి యిట్లు రా నాయనా! నీ వెంత యల్లరివాఁడవురా! ధర్మారావునే యెఱుఁగ నన్నావు. మీ యమ్మ వడిగలతనమంతయు నీవద్దనే యున్నది. ఏమే యరుంధతీ! పిల్లవానిని దండ్రి యెవరోకూడ నెఱుఁగకుండఁ గన్నావే' యనెను. సూర్యనారాయణ 'అది వానికోవలోని జబ్బ తప్ప వానికోస మేమియు లే' దనెను.

పొద్దుక్రుంకువేళకు శశిరేఖాకిరీటులు ఛాయాసూర్యపతులు విచ్చేసిరి. శశిరేఖ కిద్దఱు పిల్లలు. ఒకఁడు కుమారుఁడు, రెండవది యాఁడపిల్ల. కుమారునకై దేండ్లు, ఆఁడుపిల్లకు రెండేండ్లు. వీరు కాక

వారికి నలుగురుపిల్లలు పుట్టిపోయిరి. కిరీటి ధర్మారావునుజూచుచునే యొకరినొకరు కవుంగిలించుకొనిరి. సూర్యపతి ధర్మారావును వెనుకకులాగి 'చాలులే! ఎవరైనఁజూచిన నన్నదమ్ములనుకొనరు. భార్యాభర్తలనుకొందు' రనెను. ధర్మారావు 'వాగకు! ఎన్నియేండ్లు వచ్చిన నేమి? నీకుఁ జిన్నప్పటివాసన పోలే' దనెను. అరుంధతీ ఛాయాశశిరేఖలు ముగ్గురుస్నేహితులవంకను నివ్వెఱవోయి చూచుచుండిరి. ధర్మారావు కన్నీళ్ళుపెట్టుకొని 'రాఘవుఁడు లేఁడుకదా' యనెను. తక్కిన యిద్దరును లేతమొగములు వేసిరి. పశుపతివచ్చి, వచ్చిన స్నేహితులను జూచి ముసిముసినవ్వులు నవ్వెను. సూర్యపతి 'ఏమండీ! ఉండినుండి సుబ్బన్నపేటకు వాయువిమానములు వేసిరా' యనెను. పశుపతి 'కాదు, రైలుమీఁదనే వచ్చితి' ననెను. సూర్య—రైలు బెజవాడమీఁదుగానే వచ్చుచున్నదా, యిప్పుడు? కిరీటి—మీఁదుగా వచ్చుట లేదు. ఊరినడుమనుండి వచ్చుచున్నది. ఆ రైలు దిగి యీరైలెక్కుటకు నీ యాజ్ఞ యెందుకు? నీ యింటికిఁగూడ రైలు వేయించకపోతివా? ఆ రైలుమీఁద మీ యింటికి వచ్చెడివాఁడు. ధర్మా—నీ వే రైలుమీద వెళ్ళితివి? సూర్య—మీ రెల్లైనను బ్రాహ్మణులకదా! మే మిద్దఱమును బ్రాహ్మణేతరులము. పశు- నేనును బ్రాహ్మణేతరుఁడనే. ధర్మారా వొక్కఁడే బ్రాహ్మణుఁడు. ధర్మా—కిరీటికూడ బ్రాహ్మణుఁడే. సూర్య—ఏమో! ఈ యూరు తెచ్చితివి. మాపిల్లలతో నే నెచ్చటికిఁ బయటికిఁబోను. ఈ పదిరోజులైనతరువాత జాగ్రత్తగా మమ్ము బెజవాడ చేర్చుము. కిరీటి—మీ పిల్లల నిచ్చుట కెవ్వరును గొలుకుకొనితినగు. ఒకవేళఁ దిన్నచో పశుపతిపిల్లలను దినవచ్చును. ధర్మా—ఏమి? బండి పశుపతిమీఁదకిఁ బరుగెత్తుచున్నది? కిరీటి—నీభార్య యరుంధతి; ఆయనకూఁతు రరుంధతి? నీవు ధర్మారావువు; అతని కొడుకు ధర్మారావు.

అంతలో నచ్చటికిఁ గుమారస్వామి వచ్చెను. కుమారస్వామిని జూచి నలువురు నానందపడిరి.

కిరీటి—ఉద్యోగమునకు సున్నచుట్టితివంటగదా! కుమార—మీరు తహసీల్దారీ చేసినట్లు. ధర్మా—కుమారస్వామికి కొడుకోయీ! వాఁడింకొక ధర్మారావు. కుమా—నేను మాస్టరుగారిద్వారా చెడిపోయినాను. నాకొడుకైనను బాగుపడఁగలందులకు వాని కా పేరు పెట్టినాను పశు—ఇదేమిటి? స్వవచోవిఘాతముగా నున్నది? సూర్య—ఉద్యోగము పోయిన దెందుకు? కుమార—ఉద్యోగము పోయినదందుకు కాదండీ! నేను శ్యామలను బెండ్లి చేసికొన్నవాఁడను. చక్కఁగా నియోగులలోఁ బుట్టినవాఁడను. వైదికబ్రాహ్మణునివలె నున్నందుకు.

నాంచారమ్మయు రాజేశ్వరుఁడును వచ్చిరి. నాంచారమ్మ మనిసి వట్టి పిచ్చిది. కాని పొదుపరి. భర్త సంపాదనపరుఁడు కాడు. ఆయన కొద్దిగా సంగీతము చెప్పకొనెను. ఆయన యేలూరిలో ధనవంతులయింటిబాలికలకు సంగీతముచెప్పి నెలకు యిరువది, యిరువదిరెండు సంపాదించును. నలువురు పిల్లలు. ఈ సంసార మీదలేక నాంచారమ్మ చాలకష్టపడుచుండెను. సుబ్బన్నపేటకు వచ్చుటకుఁ గూడ వారిఁద్ద డబ్బులేకపోయెను. అయినను బావమఱఁది సర్వస్వాతంత్రుడు గనుక, తనచేతఁ జిన్న సభ చేయించి, తృణమో పణమో యిప్పించునని రాజేశ్వరుఁడు వచ్చెను. ఆయన గొంతుకయు హృద్యముగా నుండదు. నాంచారమ్మ మెడలో మంగళసూత్రము, నల్లపూసలు మినహాయించి యేమియు లేవు. రామేశ్వరశాస్త్రి తనకూఁతు నతని కిచ్చునప్పుడు వారికి యాస్తి యీవలె నని యూహించెను. కలిగినయూహ కొన్నాళ్ళు జరుపక కాలయాపన చేసెను. అంతలో శాస్త్రిగారిఁనియే మైపోయి రెండవయల్లునకేమియు నీలేకపోయెను. రాజేశ్వరునితండ్రి సాంగాధ్యాయనపరుఁడు. సోమయాజి. పేరుప్రతిష్ఠలు పడినవాఁడు. కుమారుఁడు తండ్రియంతగాకపోయినను నందులో సగమైనఁగాఁడా యని రాజేశ్వరునకుఁ గూఁతు నిచ్చెను. ఆ సతీపతులిద్దఱును వచ్చి యెటుచూచినను ధనవంతులై నజఁధుఫ్వుఁతో నిండిన యా యింటిలోఁ దాము పేదవారమని యూహించుటచేతఁ గ్రొత్తవారివలె, దెలతెలపోయిరి. ధర్మారావు

పోయి బావగారిని గాఁగిలించుకొని తెచ్చెను. రాజేశ్వరుని మొగము వికసించెను. కడసారి శిశువును దనచంకకుఁ దీసికొని, నాంచారమ్మ నింటిలోనికిఁ దీసికొనిపోయెను. అరుంధతి చిన్నవదినగారిని, నామె భర్తను నెక్కువగౌరవము చేసెను. వారు పేదవారైన ననుకొందురని యట్లు చేసినదానికి సూర్యనారాయణగా రప్పుడే మొగము ముడుచుకొనెను. కాని పదిమందితోఁ గలకలలాడు నింటిలోఁ బరాయిపెద్దమనుసు లున్నచోటఁ దనకోపము ప్రకటించరా దని దిగమ్రింగి మౌనముమాత్రమే ప్రకటించెను. రాజేశ్వరునికూఁతురు మూఁడేండ్లపిల్ల. సుశీల బక్కపలుచనిదై యేఁడాదిపిల్లవలె నుండెను. ధర్మారావు దాని నెత్తుకొనెను. ధర్మారావుకొడుకు సుశీలను జూచిన నతని కేలనో ముద్దయినది. తండ్రిచంకలోనుండి సుశీలను దీసికొని తా నెత్తుకొనెను. ఇంతమంది యొక్కసారిగా వచ్చిన బంధువులలో మిత్రులలో బంధువులెవరో స్నేహితు లెవరో యెవరెట్టిబంధువులో రామేశ్వరశాస్త్రికిఁ దెలియలేదు. సుశీలకుఁ దల్లిదండ్రులగుటచేత నాంచారమ్మయు, రాజేశ్వరుఁడును నందఱికన్న దగ్గఱబంధువు లనుకొనెను. తరువాత దగ్గఱబంధువు సూర్యపతి. అతఁడు వచ్చినప్పటినుండియు రామేశ్వరశాస్త్రివంకఁ జూచి చమత్కారముగా నవ్వెను. అతనితో నింతవఱకు మాటాడలేదు. ఆ నవ్వుతో సూర్యపతి దగ్గఱబంధు వయ్యెను.

ప్రొద్దు క్రుంకినది. స్త్రీలందఱును వెనుక దొడ్డిలో నుండిరి. పురుషులందఱును బంచమినాఁటి పలుచనివెన్నెలలకు లుబ్ధులై, వేసఁగియుక్కలకుఁ దాళలేక వాకిటఁ జాఁపలమీఁదఁ జేరిరి. అందఱును గూర్చుండి పరిహాసోక్తులు, ఆనందవచస్సులు నాడుచుండిరి. సన్నని చిక్కిపోయిన నల్లని మనిసి, పొట్టివాఁడు, మేనిలో నూపిరి లేదన్నట్లున్నవాఁడు వారివద్ద కొకఁడు వచ్చెను. అతని తల యంతయుఁ జింపిరిజుట్టు– ఖద్దరు కావలయు– ముతుకది మలినమైనది– ధరించెను. గుండీలులేని చొక్కా – కుడిబుజముమీఁదికి జాఱిపోవుచున్నది – తొడిగెను. ఒక యుత్తరీయము పైని వేసెను. మనిసి భిక్షుకునివలె నుండెను. ధర్మారావుచూచి 'ఎవరు వా' రనెను. ఆ వ్యక్తి

మాటాడలేదు. కిరీటి లేచి చూచెను. లేతవెన్నెలలో, నతఁ డెవరో తెలియలేదు. కిరీటికి సుబ్బన్నపేటలోని జను లెట్లు తెలియుదురు? అందఱును లేచి చూచిరి.

సూర్యపతిధర్మారావులుచూడలేదు. చివరకు ధర్మారావు లేచి మొగములో మొగ ముంచి చూచెను. ఎచ్చటనో చూచినట్లున్నది. ఎవరో సరిగా గుర్తు తెలియలేదు. సూర్యపతిని పిలిచి 'యితఁ డెవరో చూడు' మనెను. సూర్యపతియు నిదానించి చూచెను. 'ఎవరు మీరు' రని యడిగెను. ధర్మారావు 'మీ దే యూరు' రనెను. ఆ మనిసి 'మాది నరసారావుపేట' యన్నంతలో 'రాఘవరావు, రాఘవరా'వని యిర్వురును కౌఁగిలించుకొనిరి. కిరీటి వచ్చి మొగములో మొగ ముంచి చూచెను. 'ఇట్లు మాఱిపోతి వేమి? ఎచ్చట నుండి వచ్చితివి? రెండున్నఱయేండ్లదాఁక శిక్ష వేసిరి? అప్పుడే యైనదా? ని న్నెప్పుడు విడుదలచేసిరి? బెజవాడపోయి వచ్చితివా?' అని యొకలక్ష ప్రశ్నలు ముగ్గురును గుప్పించిరి. రాఘవరావు 'నా కోపికగాలేదు. మొట్టమొదటఁగూర్చుండనిం' డనెను. ప్రత్యేకముగా నొక చాపపఱచి దానిపై రాఘవరావును గూర్చుండఁబెట్టి, ముగ్గురును జుట్టును జేరిరి. ధర్మారావుపోయి 'వేన్నీళ్లున్నవా'యని యడిగెను. 'ఉన్న'వని చెప్పిరి. వెంటనే రాఘవరావుచేత స్నానముచేయించి యుదికినబట్టలు కట్టబెచ్చి వంట వెందఁకడ కాని మ్మని నలువురు నతనిచుట్టు మూఁగిరి. రాజకీయ నిర్బంధితులను గొందఱిని రాచరికమువారు వదలి వేసిరఁట. అదియుఁగాక రాఘవ రావు చెఱసాలలో మరణించునేమో యన్న భయముపుట్టి వైద్యుని సలహామీఁద నతనిని విడుదలచేసిరి. అతఁ డస్థిపంజర మైనాఁడు. మాటిమాటికిని ఖంగుమని దగ్గుచున్నాఁడు. ప్రయత్నముమీఁద గాని నిలువలేఁడు. ప్రాణములు కన్నులలో నున్నవి. పదియడుగులు నడచినచోఁ బదినిముసములు కూర్చుండవలయును. సూర్యపతి 'జైలులోనుండి వచ్చుటకు నీకు డబ్బెక్కడిది?' యనెను.

రాఘవ—నేను బెజవాడకుఁ బోవలయు నని చెప్పితిని. వారు నాకు ప్యాసిచ్చిరి. బెజవాడలో నీవు లేవు. మీ మామగారి నడిగి

తిని! ఆయన నీవు సుబ్బన్నపేట పోతి వని చెప్పెను. నా దగ్గఱ డబ్బులేదని చెప్పితిని. మీ బావమఱఁది యెచ్చటనో బదులు తెచ్చిన ట్లున్నది, రైలుచార్జి యిచ్చెను. రైలునుండి యిచ్చటికి నాలుగడుగులు నడచుచు, నాల్గునిముసములు కూర్చుండుచువచ్చితిని. మీరందఱును గనిపించితిరి. నాకు మి మ్మందఱను జూచుటకన్నఁ గావలసిన దేమి? నాకుఁ గావలసినవారందఱు నిచ్చటనే యుంటిరి కదా! కిరీటిసూర్యపతిధర్మారావులకుఁ గన్నులలో నీరు గిఱ్ఱున తిరిగెను. రాఘవరావు "మొత్తానికి వెఱ్ఱివాండ్రే. కన్నీళ్లెందుకు?" అనెను. సూర్యపతి రాఘవరావుచేతిలోఁ జేయివైచి పట్టుకొనెను. ధర్మారావు తల నిమురుచుండెను. కిరీటి తనచేయి యతనితొడ మీఁద వేసెను. పశుపతి నలువురివంకను జూచుచుండెను. ధర్మా— జేపటినుంచి యుత్సవములు మొదలు. కూచిపూఁడివారు వచ్చిరి. రాఘవ—వారు మునుపటివలెఁ గాదఁట. మన నాటకఖత్తులలోనికి దిగిరఁట. కిరీటి—అని జైలులోఁ జెప్పుకొన్నారా? రాఘవ— కాదోయి, తెలివికలవాఁడా! జైలులోనికిఁ బోకముందే చెప్పు కొన్నారు.

రాఘవరావు మాటాడుట వారి మువ్వురకును బసిపిల్లవాఁడు మాట్లాడినట్లుండెను. 'కాదోయి తెలివికలవాఁడా!' యన్నమాటలో వారినలుగురికును బందరులో నిరువదియేండ్లక్రింద నల్లరిచేసినసౌఖ్య ములు స్మృతికివచ్చెను. ఆ సౌఖ్యమంతయుఁ బచ్చకప్పురమువలెఁ గరఁగిపోయెను. సుఖములు, దుఃఖములు, కష్టములు, పెండ్లిండ్లు, బిడ్డలు, చెఱసాలలు, ఋణములు, జీవికకై పెనగులాటలు, హృదయా దర్శములు ఫలించనందు కెడందలుపొందిన యాతనలు, నాల్గుదెసల దరికొన్న యగ్నులు, పంచాగ్నిమధ్యమున వేయించఁబడుటలు, చివరకు మృగతృష్ణికలవంటి జీవితములు – ఎన్నిమార్పులు జరిగెను? ఆనాఁడనుకొన్నదానికి నీ నాఁ డున్నదానికి సంబంధమే లేదు. ఆ పర్వ తాగ్రమారోహించినచోఁ జందురుఁడు చేతికిఁ దగులుననుకొనిరి. దేవత లా చంద్రునిలోని యమృతమాస్వాదింతురు. మనముకూడ దానిని బిండి యమృతముచూఱఁగొందు మనుకొనిరి. పర్వతారోహణము

ప్రారంభించిరి. ఒకఁడు కాలుజాఱి క్రిందఁబడెను. ఒకఁడుకొంతదూరము పోయి, పైకిఁ బోలేక క్రిందికి రాలేక యచ్చటనే నిలఁబడెను. ఒకఁడు కొంతదూర మెక్కి, యెక్కిన దూరములో సగముజాఱి, యచ్చట నొక చిన్న మొక్కను బట్టుకొని వ్రేలాడుచుండెను. మఱొకండు కొంతదూర మెక్కి, క్రిందికిఁ జూచి కన్నులుతిరిగి భయముచేత నచ్చటనే కనులుమూసికొని కూర్చుండెను. చంద్రుఁడేమో వానిదారిని వాఁడు నిరంతరాకాశప్రయాణములను జేయుచుండెను. దేవతలేమో తదంగస్థామృతము గ్రోలుచుండిరి. వీ రి ట్లున్నారు.

అరుంధతి మడికట్టుకొని వంటచేసెను. నాంచారమ్మయు, ననసూయయు నామెకు సాయము చేసిరి అరుంధతి యందఱు వచ్చిరన్న యుత్సాహమేకాని కూర్చుండలేకపోయెను. అనసూయ 'యేమమ్మా! యట్లుంటివి' యనెను. అరుంధతి తనవ్యాధియు, దాని సంగతియుఁ జెప్పెను. అనసూయ ధర్మారావును బిలిచి 'నాయనా! ఇది బాగుగా లేదు. ఈమెచేత వంట చేయించరాదు. మఱి యేమందు'వనెను. ధర్మారావు 'రేపు ప్రొద్దున బ్రాహ్మణుని దెచ్చెదను. ఇది వఱకే మాటాడి యట్టిపెట్టితిని—మీరు నేఁడు వత్తురో రేపువత్తురో యని. మీరు వచ్చినతరువాత నతనిని బిలువవచ్చు నని యూరకుంటిని. ఈ పూఁట రమ్మన్నచో వచ్చెడివాఁడే. ఈ సందడిలో మఱచిపోతిని' యని యామెకుఁ జెప్పెను. [illegible] వెల్లడించెను. అరుంధతి 'వ్యాధియైన మాత్రము బంధులు వచ్చినప్పుడు పనిచేయకుండ మానునా? బ్రాహ్మణుఁడు వచ్చినమాత్రమున నాకుఁదప్పున దేమున్నది? అతని కదియందీయవలదా, యిదియందీయవలదా? మీరింతమంది యింటికివచ్చిన నన్నూరకే కూర్చుండు మందువా' యనెను. ధర్మారావు 'కాదు, కాదు. పనిచేసి ప్రాణముమీఁదికిఁ దెచ్చుకొమ్మందును' అనెను. నాంచారమ్మ 'ఎందుకురా నాయనా! అశ్లీలవాక్యములు? పుట్టెడు జబ్బుతో నది యున్నది. ఈ పదిరోజులు గడచినతరువాత జాగ్రత్తగా మందిప్పించుకొని సుఖపడుము. ఈ పదిరోజులు మేము దానిని జేయనిత్తుమా?' అనెను. అనసూయ యరుంధతిని బనిచేయనీయలేదు. ఇంటిలో సర్వము తెలిసిన దామె; తక్కినవారందఱు నేది కావలసిన నామెనే యడుగవలయును. ఎంత కాదన్నను నరుం

ధతికిఁ బని తప్పలేదు. ఏదో చిన్న చిన్న పనులు చేయుచునే యుండెను. మగవాండ్రందఱు భోజనము చేసిన తరువాత స్త్రీలందఱును భోజనము చేయునప్పటికి రాతిరి రెండుజాము లయ్యెను. పిల్లలందఱిని నప్పుడు లేవఁదీసి తిండి పెట్టిరి. కొందఱు నిదురపోవుచునే తినిరి. అనసూయ 'యింక నీ పదిదినము లింతే. పగటిభోజనము లగువఱకు రెండుజాములు దాఁటును; రాతిరి భోజనములకు రెండుజాములగు' ననెను. అరుంధతి 'యట్లు కాదు. రాత్రులందు మనము పెందలకడనే తినవలయును. నాటకములు, నృత్యము, హరికథలు సాఁగును. మనము పోయి చూడవలదా?' యనెను. ధర్మారావు 'ఈ కల్యాణము నీకోసము వచ్చిన ట్లున్నది. నీ వీ యవేళభోజనములతో, రాత్రులెల్ల మేలుకని యుండుటలతో నే మయ్యెదవో తెలియకున్నది' యనెను. అరుంధతి 'రంగాపురముపోయి నా పెట్టె తీసుకొని రారాదా? పెద్దత్తగారు పెట్టినచీర మఱలఁ గట్టుకొననే లేదు. కళ్యాణములలోఁ గట్టుకొందు' ననెను. 'రాజ్యలక్ష్మమ్మగారిని బోయి చూచుటయు, నా పెట్టె తెచ్చుటయు నేను బ్రదికియుండఁగా జరుగవు కాబోలు!' ధర్మా—అనసూయా! దీని నిటువంటిమాట లనకుండఁ జేసిపోఁగలవా? ఇట్లన్నప్పుడెల్లఁ జెంపలు వాయించవలె ననిపించును. అసలే యోపికలే దెందుకులే యని యూరకుందును. అరుం—అందులో దయ యెందుకు? ధర్మా—నీ తెలివికి సంతసించితిమిగాని యింక నూరకుండుము. అందఱును నవ్విరి. అరుంధతి నవ్వి 'కాదమ్మా! మా పెద్దత్తగారున్నది. వారు రాజులు. మామామగారికథ యెఱుఁగుదువుగా? ఆవిడ నా కార్యమునకు నా కొక నల్లనిజరీచీర పెట్టినది. ఆ చీర యెంత బాగుగా నున్నదనుకొన్నావు! బంగారుతామరపూవులు మొలచిన యమునానదివలె నున్నది. ఉదయించుచున్న కృష్ణపకాదశీచంద్రునిబంగారపువన్నె తూర్పునఁ బ్రకాశించఁగాఁ జీఁకటులొత్తిగిలని యాకాశమువలె నున్నది' అనెను. ధర్మారావు మనసులో నరుంధతి కున్మాదము కలుగుచుండె ననుకొనెను. అతఁ డనెను: 'పచ్చని తామరపూవుపుప్పొడి తెక్కలనంటుకొని బంగారపుతుమ్మెద వచ్చి వ్రాలిన నల్లయుమ్మెత్తపువ్వులవలె నున్నది.' అనసూయయు నాంచారమ్మయు హైమవతియుఁ బకపక నవ్విరి. హైమ—నీవు కవివై

నందులకుఁ బెండ్లమును జక్కఁగాఁ దయారుచేసితివి! ధర్మా—అది నేను చేయలేదమ్మా! పలనాటినుండి దానితల్లి తెచ్చిన తెలివితేటలు దానిలో నిట్లు పరిణమించుచున్నవి. అరుం—ఆ చీర నాపుట్టినింట నున్నది. వారికి మాకును మాటలు లేవుకదా! 'ఆ చీర పోయి తీసికొని రండు. ఒక్కసారి కట్టుకొనవలె నని యున్నది' అని సంవత్సరాలతరబడి నాపోరు. వారికో నామాటలుమాటలవలెనే కనిపించవు. ధర్మా—ఈ చీరతో వచ్చినది! ఈ పదిరోజు లా సంగతి మఱచిపొమ్మా. తరువాత చెప్పెదను.

అప్పటికిఁ జంద్రా స్తమయమై యొకగడియ యయ్యెను. అంధకారము రంగాజమ్మగారిచ్చినచీరవలె నాకాశమున వ్యాపించెను. అదిగో చీర యని ధర్మారావన్నట్లు, ఇదిగో కట్టుకొన్నానని యరుంధతి యన్నట్లు ధర్మారావు భార్యను దొడ్డిలోనికిఁబోయి యచట నున్న కాఁగును దీసికొని రమ్మనెను. ఆమె దొడ్డిలోనికిఁ బోయెను. అనసూయ లాంతరు చూపించెను. చీర కనిపించనట్లు వెలుఁగులు చీకట్లను దఱిమెను. అందఱకును బ్రక్కలు చాలలేదు. ఉన్నంతవఱకు మంచములు, పఱుపులు వేసికొనిరి. తక్కినవారు చాపల మీఁదనే పరుండిరి. రాఘవరావు గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచుండెను. కిరీటి యతనిపైఁ జేయివైచి 'సుఖముగా నిద్రపోయి రాఘవరావెన్నాళ్ళయినదో' అనెను. ధర్మారావు—కల్యాణోత్సవము లైన తరువాత నితనికిఁగూడ మందిప్పించవలయును. సూర్య—నేను బెజవాడ తీసికొని పోదును. కిరీటి-ఉత్సవములు కానిండు. ఏదియో యొకఁడు చేయవచ్చును. క్రమక్రమముగా నందఱును నిద్రించిరి. మఱునాఁడుపొద్దుననే రాఘవరావు తనకు సగమువ్యాధినిమ్మదించినదనుకొనెను. అందఱును దేవాలయము పోయి చూచి వత్తమనిరి.

ధర్మారావు 'ఉత్సవము లష్టమినాఁటినుండి సరిగా మొదలుపెట్టఁబడును. నేఁడు, రేపు కూచిపూఁడివారినాటకములుమాత్ర ముండును. తోలుబొమ్మలవాండ్రు, పగటివేషాలవాండ్రు, గారడీవాండ్రు, పొట్టేళ్ళ నాడించు రాజులు— వీరందఱు నష్టమినాఁడే వత్తు' రనెను. రాఘవరావు 'గొఱ్ఱెపొట్లేళ్ళ నాడించురాజు లిప్పుడెచ్చట దొరికిరి?' అనెను. ధర్మారావు—'కపిలేశ్వరపురములో

నున్నారఁట. వారు వారివృత్తి మానివేసిరి. అయినను వందరూపాయ లిత్తు మని కబురంపించితిమి. వారిలో నొకరాజుగారు గుడివాడలో నుండి కత్తిసాము, కఱ్ఱసామును నేర్పుచుండెనఁట. ఆ రాజుగారు వత్తురు. గునుపూఁడి జంగముల కొఱకు మనుష్యులను బంపించితిమి. వారెవ్వరు నిప్పుడు యక్షగానములే పాడుటలేదఁట. ఒక ముసలి జంగ మున్నాఁడు. ఆయన బొబ్బిలికథ చెప్పుచో నిప్పులు కురియు నన్నారు. పాపము! చాల వృద్ధుఁడై పోయెను. ఆయనయు వత్తు నని చెప్పెను. బందరులో జంగము బసవయ్య యున్నాఁడు. అతఁడు మాలజంగము. మరాటీకథయు, బొబ్బిలికథయు నతఁడు చెప్పవలయును. అతనిని గూడ రమ్మన్నాము' అనెను.

రాఘవ—బసవయ్యను నే నెఱుఁగనా యేమి? కిరీటి—మన మందఱము నెఱుఁగుదుము. శిల్పి యనఁగా శిల్పి యతఁడు. ఏ రసమునకుఁ దగిన ట్లారసమును బోషించును. పెద్దమనుసులు కథ వినుచున్నచో నసభ్యములే రానీయఁడు. అతనికథ చాల దినములైనది విని. అతనినిగుఱించి కృష్ణాపత్త్రికలోఁగూడ వ్రాయఁబడెను. విద్యార్థులసంఘసమావేశములం దతనిచేత బొబ్బిలికథ చెప్పించిరి. ధర్మా—ఇంకఁ జాలమంది వత్తురు. అన్నిటికన్న వారాంగనానృత్య మున్నది. సూర్యపతి—దేశ మెల్లడ వారాంగనలను గులస్త్రీలనుగాఁ జేసి యీ వర్ణము నశింపఁజేయవలె ననుచుండఁగా నిచ్చట వారాంగనానృత్య మేమిటి? ధర్మా—వా రందఱు దేవదాసీలు. వారాంగన లని యూరకే పిలుచుచుంటిమి. దేవునిమాన్యములు వారు తినుచుండిరి. దేవునకు భోగము నడుపుచుండిరి. కిరీటి—మన గిరిక నృత్యము చేయునా? ధర్మా—అది యామె యిష్టము.

ధర్మారావుకన్నులలో నీరు నిలచెను 'ఈ కల్యాణము లామె కొఱకే నిర్ణయించినాము. ఆమె పన్నెండేండ్లనుండి కల్యాణములు కల్యాణము లని కలవరించుచున్నది. ఆమె కొఱకే యీ కల్యాణము. మా దొరగారు చాల ఆశపడుచుండిరి, కల్యాణోత్సవములు దేవదాసివలన మహోత్కృష్టదశకు వచ్చునని. మా గిరిక స్వామికిఁ గడుంగడుఁ బ్రియురాలు. పూర్వకాలపుభారతదేశమున నున్న దేవదాసీత్వభావమంతయు నామెలో నున్నది. ఆమె తనజాతి నుద్ధరించునో,

యాజాతి కిదివఱకే వచ్చిన యప్రతిష్ఠనే ప్రతిపాదించునో! గిరిక రసాకృతి. ఆమె మాయాశయములకు వచ్చినమూర్తి. మా ప్రాణము లన్నియు నామెయందుఁ బెట్టుకొనియున్నాము. ఆమె మహావిద్వాంసు రాలు. ఆ విద్వత్త లోకమునకుఁ దెలియునో, తెలియదో! శక్తిచచ్చి పోయినజాతికి మహాజీవవంతమైన యొకసంస్థ వెగ టనిపించును. ఉప్పు పులుసు కారములు తిని కలుషితమైన జిహ్వకు స్వచ్ఛమైన మధురపదార్థములు మొగము మొత్తును. నాలుకకా రుచి తెలిసికొను శక్తి పోయినది. శక్తి మనకు చచ్చినదని తెలిసికొనక, మనదోషము మధురపదార్థములం దారోపించి, వాని సేవగించుట యలవాటైనది.

కిరీటి—శశిరేఖ గిరికకోసము నిన్ననే పోయి చూచి వచ్చినదఁట. ధర్మా—ఒంటరిగానే వెళ్ళెనా? కిరీటి—ఎవ్వరికిని జెప్పకుండ వెళ్ళెను. రాఘవ—రాతిరి మాయందఱితోఁబాటు నీవును బండుకొంటివిగదా! నీకు శశిరేఖ యెప్పుడు కనిపించినది. ఈవార్త యెప్పుడు చెప్పినది? పశు—దొంగ దొరికినాఁడు! అందఱును నవ్విరి. ధర్మా—అబ్బాయి. మా యింటిలో నిట్టిపనులు చేయకు. కిరీటి ముసిముసి నవ్వులు నవ్వెను. రాఘవ—ఇంకను జిలిపిపనులేనా? పోక్తాతనము నేర్చుకొనవలయును. సూర్య—గిరిక యెట్లున్నది? ధర్మా—శశిరేఖను బిలిచి యడుగరాదా? కిరీటి—ఏదీ పిలువుమనుము. నేను ఛాయాదేవిని బిలిచి యడుగలేనా? రాఘవ—నేను పిలిచి యడిగినచో నేమి చేసెదవు? పశు—దేవాలయమునకుఁ బోదమా, వలదా? ధర్మా—సాయంకాలమునఁ బోదము.

అనసూయ ధర్మారావును బిలిచెను. 'నాయనా! బ్రాహ్మణుఁడు వచ్చినాఁడు. నీ వొక్కసారి వచ్చి పురమాయించి పోవలయును. బలేభార్యను సంపాదించినావు! ఆమె యెక్కడ నిలుచును? మేముంద ఱమును వచ్చితిమని యామెకోడలు పొంగిపోవుచున్నది. కూర్చుండుమన్నచోఁ గూర్చుండదు. గాలిమీఁద నెగిరిపోవుచున్నది. దానికిఁ దోడు మాయరుంధతి! ఇద్దఱును నొకరినొకరు కౌఁగిలించుకొనుట, ఏమో చెప్పుకొనుట, యేమో నవ్వుట; 'ఆమె కోడలిలో శక్తిలేదే' అని చెప్పినను, మాయరుంధతి యూరకుండుట లేదు. నీ వే యరుంధతిని దిద్దుకొందువో నీ యిష్ట' మనెను.

# ఇరువది యెనిమిదవ అధ్యాయము

కల్యాణోత్సవము లన్నభావము కదలించగలిగినచోట్ల పేటను మూలముట్టుగాఁ గదలించెను. పూర్వపుపేటవారు తమ యిండ్లలో వివాహము లగునట్లే భావించిరి. ఇండ్లకు సున్నములు కొట్టిరి. జేవురులు పెట్టిరి. గడపలకుఁ బచ్చని తోరణాలు కట్టిరి. స్వామి యూరేగుచుఁ బదినాళ్లు తమవాకిలి ముందుగా వచ్చును. ప్రభువు తన దేశము మఱచిపోయినాఁడు. తనగ్రామము మఱచిపోయి నాఁడు. చివరకుఁ దనభక్తులను, భక్తురాండ్రనుగూడ మఱచిపోయి నాఁడు. వదలిపెట్టిన బంజరుభూములను మఱచి దున్ని సాగుచేసి కొన్నట్లు స్వామి మఱల సుబ్బన్నపేటమీఁదఁ దన ప్రభుత్వము సాఁగించఁబోవుచున్నాఁడు.

క్రొత్తగ్రామమంతయు సామాన్యముగా నుత్సాహపడెను. వారు కృష్ణమనాయనియూరిలోనివారా, వారికి స్వామియుత్సవము లనఁగా నేమో తెలియుటకు? శ్రీవేణుగోపాలస్వామివారియాలయ మునంటుకొని నాగేశ్వరస్వామివారియాలయ మున్నది. గోపాలున కీశ్వరుఁడు తూరుపు. ఈశ్వరుని యాలయ ముత్తర దిఙ్ముఖముగా నున్నది. రెండాలయములప్రహరీగోడలమధ్య రథము పోఁదగినంత సందు. తనకల్యాణము దగ్గఱకువచ్చుచున్న దని వేణుగోపాలస్వామి పడినంతయుత్సాహము నాగేశ్వరస్వామి పడినట్లు లేదు. తనకుమాత్రము కల్యాణము జరుగుటలేదా! తన కంతయీర్ష్య యెందులకు? దేవదాసిని గోపాలుఁడు దక్కించుకొన్నాఁ డని. ఈ పులితోలు, ఈ బూదిపూఁతలు, ఈ పాఁపనగలు, ఈ పునుకపేరులు, చల్లనియాశ్రమ మొకఁడుదక్క- మఱి యేమియులేని యీబికారికి, శృంగారరసము కూడనా!, శివుఁడు తనలోఁ దా నవ్వుకొనెను. నాగేశ్వరలింగవామ పార్శ్వమున నభయముద్ర ధరించి, వామహస్తమునఁ గమలము దాల్చి, యెడమకాలు మడిచి, కుడిపాదము పీఠముక్రిందుగా వ్రేలాడ వైచి, సర్వజగదధినేత్రీచిహ్నమైన కిరీటముదాల్చి కూర్చున్నపార్వతీ దేవి నేత్రాపాంగములయందు మన్మథులు సహస్ర ముదయించిరి.

'అమ్మధురావలోకనము లద్భుతమయ్యెడు, తల్లిలోచనాం
తమ్ములు సాఁగినంతన శతప్రమితుల్ మధురేక్షుచాపఖం
డమ్ములవారు, రత్నమకుటమ్ములవారు జగద్విలోభనా
స్యమ్ములవారునుం బ్రభవమందెద రంబుదనీలరోచిషుల్.'

పరమేశ్వరుఁడు యోగీశ్వరధ్యేయుఁడు. తనలోఁదాను పొరలు పొరలుగానై కుదించుకొనెను. తల్లి జగ మావరించుకొనెను. తన కెందుకన్నాఁ డాయన. నాకుఁగాక మఱెవ్వరికన్న దామె ఈశ్వరుఁడు హృదయగుహాకుహరాంతరాళ నిద్రాగతపరిలీయమానసర్పమూర్తియై జుట్టను చుట్టుకొని పండుకొన్న ట్లుండెను పార్వతీదేవి శక్తిస్వరూపయై సర్వనాడులయందును విజృంభించెను. పంచభూతములయందు నిండెను. పంచేంద్రియములయందుఁ దాండవించెను. భూతగుణములు తానే యయ్యెను. నూతనశక్తి రోదోంతరాళమున దిగ్దిగంతములఁ గింకిణి కిణకిణనినదమునఁ దాండవించెను.

రత్నగిరియింటికి బంధువులు వచ్చిరి. గుంటూరు, బందరు, చెన్నపట్టణము మొదలైన పట్టణములనుండి బంధువులు విచ్చేసిరి. వారిలో నధికసంఖ్యాకులు పురుషులు. కొద్దిమంది స్త్రీలు. ఇంటిలో నొకగది గిరికుఁ బ్రత్యేకముగా నున్నది. ఆ గదియుం దొకచిన్నగది. పెద్దగదిలో శ్రీకృష్ణవిగ్రహము. దానికిఁ బూజాపురస్కారములు, పూవులు, అగరువత్తులు, హారతికర్పూరము, కుంకుమ, గంధము, కస్తూరి-పూజాద్రవ్యములన్నియు సమకూర్పఁబడి యున్నవి ఇచట నొక కృష్ణాజినము కలదు. గోడలవెంట దశావతారములు, శ్రీకృష్ణలీలలు, శ్రీ శంకరులపటము లమర్పఁబడియున్నవి. గదియంతయు నలికి ముగ్గులు పెట్టఁబడి యుండెను రెండుపట్టుచీరలు దణ్ణెమున వ్రేలాడుచుండెను. ముందు చిన్నగదిలో నామె నగ, చీరలు కల పెట్టెలును, తక్కిన సామాను నుంచెను. ఆమె గదులలోని కామెకుఁ బ్రత్యేకముగా రాకపోకలకు వీలుండెను. ఇంటికి వచ్చిన బంధువులలో నందఱును గళావంతులసంఘసభ్యులు. వా రదినఱకే చాలసారులు వచ్చి రత్నగిరిని దేవదాసికిఁ బెండ్లిచేయుమని నిర్బంధించిరి. రత్నగిరి తన కిష్టములేదని నిరాకరించెను. అసలుకథ వారి కేమియుఁ దెలియదు. వా రందరును వచ్చి గళ్యాణోత్సవములకు వారాంగనా

నృత్యములు లేకుండఁ జేయువలయునని ప్రయత్నము. రత్నగిరియిల్లు వారిదీర్ఘోపన్యాసములచేతను వారిరాకపోకలచేతను సందడిగానుండెను. గిరిక యేకాంతమున కేమియు భంగము లేదు. మహాసముద్రమధ్యమునఁ దత్కల్లోలతరంగమహానిస్స్వనముచేత నసంచలితమైన యోగదృష్టికల లక్ష్మీదేవివలె నామె కృష్ణాజినముపైఁ గూర్చుండియుండెను. ప్రక్కనింటిలో బంధువులు చర్చలు ప్రతిచర్చలు జరుపుచుండిరి.

ఒకఁడు—'మనజాతి హీనమైపోయినది తక్కినజాతులు తల లెత్తుకొని మహాగౌరవమును బొందుచుండఁగా మనము బానిస తొత్తులమై యుట్లుండుట చాల శోచనీయము. మనమును వివాహములాడి మన సంఘమును సముద్ధరించుకొనలేకున్న నితరదేశీయుల హేళనకుఁ బాత్రమగుదుము. మిస్ మేయో యను నొక అమెరికన్ స్త్రీ మనసంఘమునుగుఱించి యీదేశమునకుఁ గళంకముగా నున్నదని వ్రాసినది. మనము నశించిపోవుచున్నాము.' మఱి యొకఁడు—'పడుపువృత్తి మంచిదని యెవఁడనును? కొందఱు మనజాతి యుండవలయుననియు, దీనిచేత లోకోపకారము జరుగుచున్నదనియు వాదించుచున్నారు. ఆ వాదనలన్నియు చాటుగానే కాని బహిరంగముగాఁ జేయుట లేదు. బహిరంగముగాఁ జేసినచో నలుగురును చీచీయందురని తెలియును.' ఇంకొకఁడు- 'కొందఱు పెద్దలు బహిరంగముగా సానివృత్తిని దిరస్కరించి బాగుగా సానుల యిండ్లకుఁబోయి సుఖపడుచున్నారు. ఇది యన్నిఁటికన్న నీచము.' వేఱొకఁడు—ఎట్లైనను దేవదాసిచేత నృత్యము మానిపించవలయును. మనకులమువారు నైతికముగాఁ జెడిపోవుటకు నృత్యము ప్రధానహేతువైనది. సభలోఁ బోయి కన్నులు, చేతులు త్రిప్పినస్త్రీ యెవరికి లోకువగా కుండును?' మొదటివాఁడు- 'శిల్పమన్న దృష్టితోఁ జూచినచో నిబ్బంది లేదు. కవీశ్వరుఁడు సభలోఁ దన పద్యము నెట్లు చదువునో భోగపుఁబడుచుకూడ సభలో నేత్రాభినయ మట్లే చేయును. కాని చూచెడివారిలో భేద మున్నది. ఆ చూచెడివారి నప్పు డెవరు సంస్కరించఁగలుగుదురు? కాన వృత్తి మానివేయుటయే మంచిది.' రెండవ—'కార్యమునందు దోషముప్పతిల్లినచోఁ గారణ మేదియో సరిగా లేదని యర్థము. అందు

చేత నృత్యము మానివేయుటయే మంచిది.' మఱొకడు—సభాజనుల యందలి దుష్టభావములకు నృత్యము కారణము కాదు; విద్యాహీనత కారణము. వారు విద్యావంతు లగునట్లుచేసి నృత్యము చేయవల యును.' ఇంకొకఁడు—'నిజమే! పూర్వము రాజు లున్నప్పుడు వారి సభలో నందఱును భరతశాస్త్రవేత్త లుండెడివారు. అప్పు డీ విద్య ప్రకాశించినది. దానియందు దోషములేకపోయినది. ఇప్పుడు గసజ్ఞత వచ్చిపోయినదికనుక విద్యను మానుకొననే వలయును.'

వచ్చినబంధువు లిట్లు వాదించుచు మూఁడుపూఁటలును భోజనములు చేయుచుండిరి. రత్నగిరి వారికి విందులుచేయుచుండెను. వచ్చి మూఁడుపూఁటలైనది. మాంసాహారము లేదని వారిలోవారు గుసగుసలాడిరి. రత్నగిరి యది విని 'మాయింట నది మానివేసి యిరు వదియేం డ్లైనది. మాయింటిలో లక్ష్మీదేవి యవతరించుట యేమి— మేము మానివేయుట యేమి - ఒక్కసారియే జరిగెను' అనెను. వారికి సీసాలు కావలసి వచ్చెను. రత్నగిరి యదియుఁ దనయింట జరుగరానిదే యని చెప్పెను. 'మీరు దుర్వృత్తి మానివేయు మను చుంటిరిగదా! మాంసఖాదనము, కాదంబరీపానము దుర్వృత్తిలోఁ జేరవా?' యన్నది. వారు 'నిజమే, నిజమే' యని తమలోఁ దాము సణుగుకొనిరి. దానిదీనివారడి పొగాకులో ముంచిరి. పొగాకు కాల్చి నదే కాల్చి రావణాసురునిలంకవలెఁ జేసిరి. రత్నగిరి తనయింటికి రెండవవైపునయున్న ఖాళీస్థలములలో వీరందఱకును ధూమపానమున కేర్పాటుచేసెను. దేవదాసియున్నవైపున కీపొగ లేశమైనను బోదు.

కూచిపూఁడినుండి రత్నగిరియొకనటుని రమ్మని కబురుచేసెను. అతఁడు నృత్యవేళ దేవదాసికి సమీపమున నుండవలసినవాఁడు. అతనిపేరు భోగప్పశాస్త్రి. ఆయనయందు శాస్త్రమునఁ జెప్పఁబడిన లక్షణములన్నియు నున్నవి. రూపవంతుఁడు, మధురభాషి, విద్వాం సుఁడు, వాగ్మి, కులవంతుఁడు, భరతశాస్త్రనిపుణుఁడు, చక్కని శారీరము కలవాఁడు. తాళమునందుఁ గల్పన చేయఁగలవాఁడు. మృదంగము, మంచి తాళములు క్రొత్తవి తెప్పించెను. శ్రుతిపోయు టకుఁ గబీరే యుండెను. తిత్తి దొరక లేదు. తమ కున్నది ప్రాఁతదై పోయెను. కొందఱు హార్మనె పెట్టించు మనిరి. రత్నగిరి యన్నది:

'హార్మనీశ్రుతి నాటకములు వేయువారికి, మనకుఁ బనికిరాదు. స్పష్టముగా నుచ్చరించలేనివారికి, సంగీతజ్ఞానము సరిగా లేనివారికి, భావములేని రచనలకు నందలిదోషములు క్రమ్మివేయుటకు హార్మనీశ్రుతి గాని రసోత్పాదకపటువులకు నది పనికిరాదు. అది దోషములను మ్రింగఁగలదు గాని, గుణములను లీనము చేసికొనలేదు.' వెరుకపాటకుఁ దా నున్నది. వచ్చినబంధువులలో నేరైనస్త్రీలు పనికివచ్చెదరేమో యని వారిచేతఁ బాడించెను. వారసలు హంగునకే పనికిరాకుండ నుండిరి. అపాత్రలక్షణలైనవారి నామె మనస్సులో నిరాకరించెను. గజ్జెలు వెండివి చేయించెను. తాను కమసాలివద్దఁ గూర్చుండి ప్రతి గజ్జెయు మంచిస్వరముకలదిగా నేరెను. మంచిస్వర మీయనిచో దానిని జెరిపించివేసెను. ఆ గజ్జెలు సన్నవిగా నందమైన యాకారము కలవిగాఁ జేయించి కొన్ని కొన్ని నక్షత్రముల యాకారములుగా మెలిపించినది. ఒకటి రెండువందలు గ్రుచ్చినది. ఒకటి నంద గ్రుచ్చినది. నల్లనిదారముతో గజ్జెలు గుంఫించెను. శాస్త్రవేత్రియైన రత్నగిరి పిల్లనఁగ్రోవియు, వీణయుఁ గూడ సంతరింప నెంచెను. తాను వెరుకపాట మానివేసి వీణ వాయించినను, పిల్లనఁగ్రోవి యూఁదను వాఁడు దొరకలేదు. ఆమె నంద్యాలలోఁ దమకులస్త్రీయొకతె పిల్లనఁగ్రోవి వాయించఁగల దని తెలిసి యామెకు నూటపదార్లు లిత్తు నని పిలిపించెను. ఆమె యష్టమికోస మెదురుచూచుచుండెను ఇంటిలో వీణ రత్నగిరి యభ్యాసము చేసి వదలిపోఁగా, తెల్లవారుకనే నది వరూథినీవీణవలె ప్రాతస్సంధ్యానిలములకు వాతాహతాలోలతంత్రియైనది. గజ్జెలు గలగలలాడి శ్రీకృష్ణదేవుఁ డందఱును నిదురపోవుచుండగాఁ బారాడిన ట్లింటిలో ధ్వనిచేయ మొదలుపెట్టెను. ఆ వెండి గజ్జెలు ముట్టుకొన్నమాత్రాన కిణికిణి యనును. వీణ ఝుఙ్ యనును. భగవత్సేవాభిముఖముగాఁ జనుమన్న యీ సాధనములకు నిదుర పట్టలేదు. అవి సృష్టిలోనున్న శబ్దసారమంతయుఁ దమయందే లీనమైనట్లు, మేము భగవంతుని శబ్దింతు మన్నట్లు నిలువలేకపోయెను. తాళములు క్రొత్తవి, కంచువి, రెంటిని గలిపి ముడివేసిరి. ఒకదాని నొకటి మాటిమాటికిఁదగిలి గణగణలాడును. నరహస్తస్పర్శ తమకు గిట్టదన్నట్లు వానిపైని జేయివేసినంతనే యూరకుండును. మద్దెలకు

బోనము పెట్టలేదు. అదియు క్షుధాతురనువలెఁ గనిపించెను. కాశీ గయా ప్రయాగాయోధ్యాది మహాపుణ్య క్షేత్రములకు జతలుజతలుగాఁ గూడిపోవు తీర్థయాత్రాపరులవలె నీ నృత్యసాధనములన్నియుఁ గలిసి గోవిందలు కొట్టుకొనుచు నెచ్చటికో పోవుచున్నవి. వాని యుత్సాహమునురత్నగిరి పట్టలేకపోయెను. గిరిక కూర్చుండిధ్యానము చేయును. స్వామిలీలావైభవము మనసులో ననుకొనును. ఆమె మనస్సులో నొక క్షేత్రయపదము, ఒకతరంగము, ఒకకర్ణామృతము, ఒకయష్టపది క్రొక్కారుమొగిలులో సౌదామనివలె మెఱయును. ఆమె యెడమపాదము చేతనాసహితమగును. కాలుగలగల త్రొక్కును. ఆమెపోయి వెండిగజ్జియలు చూచుకొనును. అవి చేతఁదాల్చినంత కిలకిల నవ్వును. ఆమె యప్పుడే తమ్ము ధరించుటకు నచ్చె నని తలంచును. కాని యష్టని రాలేదు. దేవదాసి కాలికి గజ్జెలు ధరించెను. అవి నృత్యార్థము ధరించిన యభినయసాధనమువలెఁ గాక పాదాలంకారమువలెనే కనిపించి, స్వామియందుఁ బ్రత్యక్షవినియోగమునకై యుపక్రమించిన ట్లుండెను. గజ్జె లూడఁదీసి దాఁచి, తాను పోయి మఱలఁ గృష్ణాజినముపైఁ గూర్చుండెను.

రత్నగిరి నంద్యాలనుండి వచ్చినపిల్లచేత గిరికకువచ్చినకీర్తనలన్నియు వాయింపించెను. ఆమెకుఁ గొన్నితరంగములు రావు అష్టపదులైనను దేలికఁగాఁ జెప్పవచ్చును గాని, తరంగములు సాధ్యమైనవి కావు. 'దేవదాసి తరంగములెత్తినపుడు నీ వూరకే శ్రుతి పోయుము. నేను వీణవాయించెద' ననెను. ఇంటిలో వేణునిస్వానము వినిపించును - చీఁకట్లు బృందావన మనుకొని, యమునానద వోలెఁ దొంగిచూచును. ఇంటిలో వీణ మ్రోఁగును - సామగానములు రాబోలునని, సర్వదేవతలును వచ్చి తొంగిచూతురు. తాళములు, గజ్జెలు నినదించును - భరతముని భూలోకమునఁ బాఠశాల పెట్టెను గాఁబోలు నని, యచ్చరలు వారియింటిమీఁదుగాఁ బోదురు. అందరు వత్తురు. శ్రీగోపాలదేవుఁడుమాత్రము రాలేదు. ఆయన పెండ్లికొడుకై సిగ్గుపోవుచు నాలయములోననే యున్నాఁడు. ఈ మ్రోఁతలకు మధ్యమధ్యఁ గళావతులసంఘసభ్యులు తమవాదోపవాద

ములతో వచ్చిన యమునానదీసర్వదేవతాప్సరోగణమును భ్రాంతి చెడఁగొట్టి బంపింతురు.

కల్యాణోత్సవవార్తలు కుమారస్వామియింటికిఁ బూవులగుత్తులవలెఁ బోయినవి. కుమారస్వామి చెఱువునకుఁ బోయి ప్రతిదిన ముదయమున నెఱ్ఱకలువపూలు పది తుంచి తెచ్చును. పదియు గుమ్మమున వ్రేలాడఁగట్టును. పూలు శ్యామలకుఁ జూపించి తైతక్కలాడును. 'నీలనలినాభ మపి తన్వి తవ లోచనం, ధారయతి కోకనద రూపం, కుసుమశరబాణభావేన యది రంజయసి కృష్ణ మిద మేతదనురూపం, ప్రియే! చారుశీలే! ప్రియే చారుశీలే! ముంచ మయి మాన మనిదానమ్' అని పాడును. ధర్మారావును జంక కెత్తుకొని 'నాయనా! పూవు లెట్లున్నవిరా! వేణుగోపాలస్వామి బాఱుబొందులవలెనున్నవా, పార్వతీదేవి కుంకుమబొట్టుతోఁగలిసిపోయినఫాలనేత్రమువలెనున్నవా యెట్లున్నవి? చెప్పఁ జెప్పు' మని వానిబుగ్గ కొఱకును. వాఁడు కెవ్వున కేకపెట్టును. వానిని గ్రిందఁ గూర్చుండఁబెట్టును. వాఁ డేడ్చుచుండఁగా శ్యామలకుమారస్వాము లిద్దరు చెఱియొకవైపున నిలుచుండి యూరకే నవ్విపోవుదురు. వారి దొడ్డిలో మల్లెపందిరి యున్నది. అది బ్రొద్దుగ్రుంకువఱకు నాల్గు మూఁడువేల పూవులు పూయుచుండెను. కుమారస్వామి దానివద్దకుఁ బోయి 'యీ మల్లెమొక్క వట్టిదే బె. అష్టమిరాకముందే యన్నిపూవులు పాడుచేసికొనుచున్నది. ఆనాఁటికిఁ గన్నుమూసికొని కూర్చుందునేమో! దొంగకాన! అట్లయినచో నా చేతిలో దెబ్బలు తినినదే!' వారియింటిలో వెన్నదొంగ యైన గోపాలునిపట మున్నది. శ్యామల యా పటమును దీసి పుస్తకముల బల్లమీఁద నుంచెను. ఆ పటములో నున్న చిన్నబాలుఁడు రెండు వేలమల్లెపూవుదండలు మోయలేక క్రిందఁ బడిపోయెను. అతఁడు పడిపోవుట– భార్యభర్తలు లేవఁదీయుట– చిన్న ధర్మారావుస్వామిని ముద్దుపెట్టుకొనుట – రాత్రి ప్రొద్దుపోవువఱకు నిదియే పనియైనది. యశోదమ్మచేతిలోఁగూడ ప్రభు వింత నలఁగలేదు.

కల్యాణోత్సవవృత్తాంతము మంగమ్మయింటికిఁ బ్రాఁకెను. మంగమ్మ ప్రతి ప్రాతఃకాలము స్నానముచేసి, పంచగవ్యము త్రావి, తడిపి యెండవేసిన పట్టుచీరయుఁ బట్టురైకయు ధరించి,

చేతులకు రెండుజతలగాజులుమాత్రి ముంచుకొని, తక్కిన యాభరణములు పరిత్యజించి, యొకచిన్న తువాలు పరచి దానిపైఁ గూర్చుండును. 'రామరామరామ' యని జపము చేయుచుండెను. ధర్మారావుతో నామె తన కొకమహామంత్ర ముపదేశింపుచున్నది. అతఁడు 'బీజాక్షరవిరహిత మైనదియే నీ వుపాసించవలయును' అని వాల్మీకికిఁ జెప్పినట్లు రామనామమే చెప్పెను. ఆమె దానినే భద్రముగా జపించుచుండెను. ఆమె 'స్వామియాలయములోనికి నేను పోఁ దగుదునా? నాజీవితమంతయుఁ గలుషిత మైపోయినది. ఒకానొక పాపపుగడియలో నా జీవకుంభమున హాలహలము దూఁకినది. దీనిని కంఠమునఁదాల్చు ప్రభువు లేకుండెను. శ్రీ వేణుగోపాలస్వామి దావాగ్ని మ్రింగినట్లు నాకలుషమును మ్రింగునా? ముకుందతుంద ప్రఘూణమున నిదివఱకే దావాగ్ని దూఱెను. మఱల నా యీ దావాగ్ని స్వామి తీసికొనఁడేమో! నిద్రాహారములు నాకు మానినవి. నాఘోరకలుషమున కాత్మహత్య చేసికొనదగినది. ఎట్టి పాపులు నాత్మహత్యచేసికో రా దని ధర్మారావుగారు చెప్పుచున్నారు. అందఱును దలాయొకకానుకయు స్వామికిఁ దీసికొనిపోవుచున్నారు. నే నేమి తీసికొనిపోవుదును' అనుకొనెను. ఆమెకంఠమునందు గాద్గద్య మదయించెను. కనుగొలుకుల బాష్పములు నిల్చెను. 'నే నేమి తీసికొనిపోదును? నా ప్రాణములే తీసికొనిపోదునా?' వాలివచ్చి యొకచిన్నగుడ్డ క్రిందపరచుకొని మంగమ్మవలె బాసీపట్టువేసికొని కూర్చుండెను. ఆమెవలెనే రెండుచేతులను దగ్గఱకు పెట్టి నమస్కారము చేయుచుండెను. మంగమ్మ వాలిని జూచెను. 'ఏమయ్యా ప్రభూ ! స్వామిదగ్గఱకు నిన్నుఁ దీసికొనిపోదునా ? అత్యంతచపలుఁడవైన నిన్ను నాహృదయకపిని దీసికొనిపోయి స్వామిపాదము లసన్నిధానమున నుంచెదను. ఓయీ! దుష్టకపీ! నీ చాంచల్యమచ్చటఁగూడఁ బ్రదరించెద వేమి? స్వామిపాదములు కెంజివురాకులు, వానిని గొఱుకకుమా! స్వామి పాదనఖములు వికసత్కుసుములు, వానిని గిల్లకుమా! ప్రభువు కాలిగజ్జెలు పిందె లనుకొని లాగఁబోకుమా! స్వామి సంతానవృక్షము, ఆ ప్రభవృమీఁద నధిరోహించి శాఖ లూఁగించకుమా ! నీవు శాఖామృగమవు. స్వామి సంపూర్ణ

మూర్తి. నీవు తెలిసికొనలేవు. అన్ని శాఖ లెక్కిపోయి యందుకొన లేవు' అనెను. కుమారస్వామి వచ్చెను. అతఁడు 'ఏమమ్మా! ఎదురుగాఁ గూర్చుండఁబెట్టుకొని కోఁతిని ధ్యానించుచుంటివా?' యనెను. మంగమ్మ తెలతెలఁబోయెను.

కుమార- నేను చెప్పినంతయుఁ జేయుచుంటివి. మంగ- కల్యాణము దగ్గఱకు వచ్చినది. వందకొబ్బరికాయలు తెప్పించితిని. నీకుఁ గావలసినవి నీవు పట్టుకపొమ్మా. కుమార—స్వామి ప్రతిదిన మూరేఁగునా? మంగ- ఈ పదినాళ్ళు ప్రతిదిన మూరేఁగును. కుమార- విద్యుద్దీపముల వెలుతురులో స్వామి తళతళలాడిపోవును. మంగ—అట్లు కాదు. ఇంజనులు రెండును చెడిపోయినవఁట. వానిని బాగు చేయుటకుఁ జెన్నపురినుండి మనిసి రావలయునఁట. అతఁడు వచ్చినచో దీపములు వెలుఁగును. రానిచో వెలుఁగవు. కుమార- స్వామికిఁ దెలియును. తనకాగడాల వైభవ మెచటికిఁ బోవునో యని యీపనిచేసినాఁడు. మంగ—పగలుకూడ కాగడాలు వేయించుకొనుస్వామి కది భోగమేకాని యిచ్ఛకాదు, అవసరము కాదు. కుమార- కల్యాణమునకు నీవు క్రొత్తచీరలు కొంటివా? మంగ- నీవు నన్ను కొంతసేపు నీవనియు, మఱికొంతసేపు మీరనియు నందువేమి? కుమా- మంగమ్మగాఁ గనిపించినపుడు నీ వందును. వాలిగాఁ గనిపించునప్పుడు మీ రందును. మంగ- నాకుఁ జీర లెందుకు? కుమార- ఇంక ధోవతులు కట్టుకొనెదరా? మంగ- మఱికొన్నాళ్ళు పోవలయును. కుమా—అప్పుడు మీసములుకూడ వచ్చునా? మంగ- జుట్టుకూడఁ బోవును. కుమార-అయినచో రెండుమూఁడుమంచిసవరములు వచ్చును. మంగ- మఱి చీరలమాట యడిగితి వెందులకు? కుమార- కల్యాణముకదా! కట్టుకొందువేమో యని. మంగమ్మ- స్వామి మసవీథికి వచ్చునా? కుమా- పూర్వము స్వామి వచ్చినపుడు మసవీథి లేదు. ఇప్పుడు మసవీథి వచ్చినది. ఆయన వచ్చునో, రాఁడో! మంగ- స్వామి కాసావాండ్రవీథికిఁ బోవునఁటగదా! కుమా- అచ్చటి నాయనకుఁ బ్రియురాం డ్రున్నారు. ఔనులే! ఇచ్చటమాత్ర మేల యుండరాదు? ఒక్కర్తే లేడమయినచోఁ బ్రియురాం డ్రిచ్చటను నుందురు. మంగ- స్వామికొఱకై గంధము, కస్తూరి, జవ్వాది,

నెమలిపింఛములు, క్రొత్త వస్త్రములు నన్నియుఁ దెచ్చితిని. కుమార- వస్త్రములు ఖద్దరువా, విదేశములవా! మంగ- ఖద్దరువే. కుమార- స్వామికి ఖద్దరు పనికి రాదు. ఆయన గ్లాస్కో మల్లులుగాని కట్టఁడు. అంతరసికుఁడు ఖద్దరుకట్టునంటమ్మా! నికారసుగా మాల గూడెములో నేసిన యిరువదియంకెల ముతకగుడ్డలుకట్టిన కృష్ణునకు నీవు ఖద్దరుగుడ్డలు దెచ్చుట న్యాయముగానే యున్నది. గ్లాస్కో వెలుగ నతఁడే మెఱుఁగునా? మొన్న దేవాలయములోనికిఁ బోయి చూచినాను. ఆయనరెండుహస్తములు వేణు వూదుచున్నవి. రెండవ కుడిచేతిలో నర్ధచంద్రహస్తము పట్టెను. చేతిలోఁ గీతలు చూచితిని. సముద్రయాన రేఖ లేదు. ఆయనకు గ్లాస్కో లెట్లు వచ్చును. మంగ- నీవు దేవదాసి నెఱుఁగుదువా? కుమార-ఎఱుఁగుదును. మంగ-శ్యామల చీరలుకావలయు నన్నదా? కుమా-అన్నది. రెండు చీరలు కొంటిని. మంగ—ఎందుకు కొన్నావు? నావద్ద నున్నవే! నే నిచ్చెడిదానను. కుమార—నీవు నా కెక్కడ నిత్తువులే. ఇదియంతయు దోఁచి యా దొంగ కీయ వలయు నని యున్నది! మంగ—ఎవ రా దొంగ? కుమార—ఆ చీఁకటిలో దాఁగుకొన్నవాఁడు, గర్భగుడిచీకఁటిలో. గాలి లేచి మంగమ్మవద్దకుఁ బోఁబోయెను. మంగ—'దానిని బట్టుకొనుము. నేను మడికట్టుకొన్నాను.' కుమార—(పట్టుకొని) మడిగట్టుకొని కుక్కలను బిల్లులనుగూడఁ దాఁకుచున్నారు. కుక్కకేమి, కోఁతికేమి, పిల్లికేమి? అవియన్నియు మహాపవిత్రములైన జంతువులు. దొరలకుఁ గుక్కయుఁ బిల్లియు లేనిచో నిముసము సాఁగదు. కోఁతి మన దేవుఁడుకదా! కోఁతిని ముట్టుకొనరా దందు వేమి? మంగ— కోఁతి నీకు దేవుఁడేమో! నాకుఁ గాదు. కుమార— ఆంజనేయుల వారు దేవుఁడు కాదఁటమ్మా! మంగ—ఆంజనేయుఁడు దేవుఁడైనచో కోఁతి దేవుఁ డెట్లగును? అతఁడు కోఁతి గనుకనా! ఇంగ్లీషుచదువుచున్నందుకా తెలివితేటలు వచ్చినవి? ఇప్పు డింగ్లండు మంత్రి యెవరు? కుమార— మాక్డొనాల్డు. మంగ—మాక్డొనాల్డు తెల్లవాఁడు. అందుకని తక్కిన తెల్లవారందఱు మాక్డొనాల్డులా? అధికారము విద్యకొలఁది, సామర్థ్యముకొలఁది. అందుకని మంత్రి. అక్కడఁ దెల్లదనము కాదు ప్రధానము. అస్ఖలితబ్రహ్మచారి,

పరమయోగీశ్వరుఁడు, శ్రీరామభక్తుఁడు. నవవ్యాకరణవేత్త, యాంజనేయుఁడు భగవంతుఁడైనాఁడని ప్రతికోఁతియుఁ గాదు. కుమా—నీ కోఁతిమాట చెప్పుదునా? మంగ—ఊఁ. కుమార—నీ కింతతర్కము బలసినతరువాత దేవుఁడు ప్రసన్నుఁడు కాఁడు. మంగ—అదియు నింగ్లీషుచదివినవా రనవలసినదే. భక్తికి లక్షణములలో ప్రహ్లాదుఁడు ఆత్మలో నెఱుకగూడ నొకటిగాఁ జెప్పినాఁడు. అజ్ఞానముచేత మూఢత్వము వచ్చును. అది భక్తి కాదు. జ్ఞానములేని భక్తి యజ్ఞానవిషయములందుఁగూడఁ బ్రసరించును. కుమార—ఎవరిగోల వారిది. నాకెందుకు? నే నింటికిఁ బోవుచున్నాను. స్వామికిమాత్రము నేను పూవుమాత్రమే యిచ్చెదను. నీవు కోఁతి నిచ్చుకొందువో, కొబ్బరికాయ నిచ్చుకొందువో! మంగ—నీవు పూవులు, కొబ్బరికాయ లిమ్ము! నేను కోఁతిని, కొబ్బరికాయ లిచ్చెదను. కుమార—కోఁతి చేయి కొబ్బరికాయలో నిఱికించుమాత్ర మీయకుము!

అని నడచిపోవు కుమారస్వామివంక మంగమ్మ తెప్పవాల్చక నిదానించి చూచుచుండెను. అతఁడు దృక్పథముమేర దాఁటిపోయిన తరువాత నామె యొక్క దీర్ఘనిశ్వాసమును విడిచెను. ఆమె తరువాత కోఁతిని దగ్గఱకు రానీయలేదు. అది రానీయలేదని కిచకిచలాడెను. దాని కామెదగ్గఱఁ జన వెక్కువ. చెంగల్రావు కోఁతిని బట్టుకొనెను.

స్వామిదేవాలయముముందు పెద్దపెద్ద పందిళ్లు వేయఁబడెను. ఏనుగంబారి పందిళ్ళలో నడువవచ్చును. ప్రక్కలన్నియు మూయఁబడెను. ఖద్దరుతానులతో చాందినీ లమర్పఁబడెను. పైని చాందినీకి నీఁతగొలలు, మామిడిపూఁతలు వ్రేలాడఁగట్టఁబడెను. అరఁటిచెట్లు కొట్టుకొనివచ్చి స్తంభముల కమర్చిరి. గొలలతోఁ బూవులతోనున్న యా యరఁటిచెట్లు, వాలిపోకుండ స్తంభముల నాధారము చేసికొనెను. లేఁత తాటిఁగొలలు కొట్టుకొనివచ్చి స్తంభముల కంటఁ గట్టిరి. ఈతమట్టలు తెచ్చి స్వస్తికాకృతిగా మూయఁబడిన పందిరి ప్రక్కలయందు వేసిన గుడ్డమీఁద నతికించిరి. మామిడితోరణములు కట్టిరి. పచ్చిపూవు, పచ్చనియాకు, పండినపండు, పచ్చికాయతోడనే పందిరి విరాజిల్లెను. కాని కాగితపుముక్కలు లేవు. మేళములు వచ్చెను. సన్నాయి పాటగాండ్రు ప్రశస్తులైనవారు వచ్చిరి. మంగలి

రంగనాయకులు కొంకుకు పొన్నుసామిపిళ్ళవద్ద సన్నాయినేర్చుకొని తరువాత హరినాగభూషణముగారివద్ద సేవచేయుచుండెను. హరప్పనాయఁడుగారు స్వామి యుత్సవములు చేయుచుండె నవఁగా నతఁడు పరుగెత్తుకొని వచ్చెను. వైణికులు, వేణుగానవిశారదులు, గాయకులు, కవులు వంకలతరబడి వచ్చిరి. అంత శోభలోఁ గనిపించని దొకటి బ్యాండుమేళము. కోటలోఁగొందఱు బ్యాండుమేళముకావలయుననిరి. ధర్మారావు నవ్వెను. ఏలనవ్వెదు రనగాఁ 'నాంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు బ్యాండుమేళమునుగుఱించి ఒక చమత్కారపు మాటయన్నారు. 'ప్రకృతిలోనున్న ధ్వనులన్నియు నొక్కచోటఁబుట్టి నచో నెంతగోలగా నుండునో బ్యాండుమేళ మంతగోలగా నుండునఁట. కంఠస్వరము సువ్యక్తమైనధ్వని. దానిని మింగివేయుధ్వనికల జంత్రము సంగీతయోగ్యమైనదికాదు. వీణ.పిల్లనగ్రోవి, వాయులీనముఇవిమూఁడు నుదప్ప నింకొకయఱచెడిజంత్రము సంగీతమున కుపయుక్తము కాదు. ఒకటి మొఱుఁగును. ఒకటి యోండ్రపెట్టును. ఒకటి ఘుర్ఘురించును. ఏమి టాజంత్రము' లనెను. హరప్పనాయఁడు కోటలోఁ బందిళ్ళు వేయించెను. రాజబంధువు లనేకులు వచ్చిరి. మాతృ పితామహీ కర్మలకుఁ బెద్దపందిళ్లుమాత్రమే వేయించెను. వానికిఁ జాందినీలు కట్టించి యలంకారాలములుచేయించి, దేవాలయముముందు చేయించి నంత శోభ కోటలోఁ జేయించెను. రంగారావుగారు కోటలో నేనుఁ గన్నది లేకుండఁజేసెను. ఉన్న ముసలియేనుఁగు మేతకేగాని కూతకుఁ గాదు.హరప్పయాచారములన్నియు బయటికిఁద్రవ్వెను.కల్యాణారంభ మున జమిందారులు పట్టణమువెలుపలికిఁబోయి, యటనుండి యేనుఁ గులమీఁద గుఱ్ఱములమీఁద స్వామిదేవాలయమువద్దకుఁ దరలివత్తురు. దేవాలయమునం దమ్మవారి తరఫు అర్చకులు, మంత్రులు నుందురు. తరలివచ్చినవారు చెఱువుగట్టుపై మకాముచేయుదురు. అర్చకులు, మంత్రులు పానకముకావడులు తీసికొనిపోయి వారిని గౌర వించి తెత్తురు. హరప్ప రెండేనుఁగులను బదిగుఱ్ఱములను దెప్పించెను. వానికిఁ బాతికవే లయ్యెను. బంగారపు జీనులు, హౌదాలు లెక్కలేనన్ని జవాహిరీగదిలో నుండెను. అన్నియు దులిపించి బాగుపఱచెను. 'కాగడాతప్ప ఇంకొక వెలుఁగు కనిపించరా

దని శాసించెను. దైవము రక్షించి విద్యుద్దీపపు టింజనులు చెడిపోయి నవి. ఇలాయికట్టెలుకూడ వలదనెను. వానికిఁ బిమ్మట కిరసనాయిలు లోఁదకుపవలయును. అమెరికాసామగ్రితో మనస్వామికిఁ బ్రీతి యెందు కనెను. మనకుఁ జేరనైనది మన మిచ్చి భగవంతుని దృప్తిపఱచు కొనవలయునుగాని, బర దేశవస్తువులతో నెంతతృప్తిపరచఁగలమనెను. విద్యుద్దీపములవెలుఁగునకు రాత్రిపూటజరుగునుత్సవపుశోభ లేదు. అవ్యక్తమైన స్వరము మధురమైన, ట్లవ్యక్తమైన భావము సుమనో రంజకమైన ట్లవిస్పష్టములైన వెలుఁగులలో శోభ యెక్కువ యున్నది. పూర్తిగాఁ గనఁబడినచో జ్ఞానము; కనఁబడి కనఁబడనిది మాయ. మాయలోనే యున్నది సౌందర్యము.

రాజబంధువులందరును గర్మలకు వచ్చినవారు పోయి మరల వచ్చిరి. లేని దొక్కఁడే-రామేశ్వరముగారు. మేళములో బ్యాండు, బంధువులలో రామేశ్వరమును లేరు. ఆనాఁడు షష్ఠి. మధ్యాహ్నము రెండుజాములైనది. సర్వజనులును రాత్రికి నాడు నాటకము జూచు టకుఁబవలు నిద్రపోవుచుండిరి. కాలేజి మూయఁబడెను. విద్యార్థులు కాని, యుపన్యాసకులుగాని లేరు. కుతర్కము లేని జ్ఞానమువలె పట్టణ మంతయు భాసించెను.

రామేశ్వరశాస్త్రి యొడలంతయు బూదిపూసికొని, యొకమట్ట లాగుతొడిగి గ్రామసంచారము చేయుచుండెను. అతఁడు కోటలోనికి వచ్చెను. రాజబంధువు లతనిని జూచిరి. ఎవరో యని యూరకుండిరి. అతఁడు మేడ మెట్లెక్కుచుండెను. ఒక కాసావాఁడు చూచి 'ఎక్క డకు' అనెను. 'ఇక్కడకే' యని శాస్త్రి పైకెక్కి పోవుచుండెను. వాఁ డేపోతొందరపనిమీఁద నుండెను. శాస్త్రి ధర్మారావుగారి కుమారుఁడు.

అతఁడు పోయి రంగారావుగారి కెదురుగాఁ గూర్చుండెను. జమీందారు నిద్రపోవుటలేదు. శాస్త్రివచ్చుట చూచెను. ఇక్కడికే యన్న యతనిమాటఁగూడ వినెను. రంగారావునకు సర్వమును బది నెలలనుండి క్రొత్త బదుకు బ్రదుకుచున్నట్లుండెను. మఱియును నిరు వదిరోజులనుండి యంతయును క్రొత్తగానే యుండెను. తన తండ్రి నాఁటి సీఁతలన్నియును స్మృతికిఁ దగులుచుండెను. హంపన్న తండ్రి

షవిని వేయకుండ పూచికపుల్లంతపని చేయఁడు. రంగారావునకన్నియుఁ దానే చేయుచున్నట్లుండెను. విద్యుద్దీపములు లేనినాఁడు తన పట్టాభిషేకమునకే విద్యుద్దీపములు తెప్పించెనే! హరప్ప తెప్పించిన యాముదమునకుఁ దానిలో నిరువదియవవంతు కాలేదు. తానైనచో నీ యుత్సవమునకు మోటారులెన్ని తెప్పించెడివాఁడో! హరప్ప యేనుఁగులు, గుఱ్ఱాలు తెచ్చెను. హరప్ప ప్రతిదియుఁ జెప్పును. తండ్రి యూకొట్టును. ఏనుఁగులు తెత్తునన్ననాఁడు తండ్రి మోటారులు చాలవా యనెను. హరప్ప 'మోటారు లమ్మివేసితిని. బాబయ్యగారూ! ప్రాణము లున్న జంతువులు మనకు హృదయాహ్లాదకారులైనంత యింజను లేమి సంతోషము కలిగించును? ఏనుఁగులును, గుఱ్ఱములును తీవిగల జంతువులు. ఇంగితము తెలిసిన జంతువులు. ప్రేమ చూపించు జంతువులు. 'సత్వానా మపి లక్ష్యతే వికృత మపి చిత్తం భ్రమక్రోధయోః' అన్నట్లు వానిభయభక్తులతోడి వికారమచ్చిత్తము మనకుఁ దెలిసికొనదగును. అయినను భగవంతునియొద్దకు నిర్జీవములను గొనిపోవుట యెందులకు?" కనెను. భగవంతుఁడు జీవులకు మోక్షప్రదాత. నిర్జీవు లాయనముందఱ నెందుకు? హరప్పయన్న మాటలు, హరప్పచేసినచేతలు మనస్సునకుఁ బటమువోలె గట్టియున్న రంగారావుగారు వచ్చినశాస్త్రిని గనులతోమాత్రమే చూచెను. అతఁ డన్నమాట చెవులతోమాత్రమే వినెను. వచ్చికూర్చున్నతరువాత నొకటిరెండునిముసములు రంగారావుగారు శాస్త్రితో మాటాడలేదు. శాస్త్రి భాషీపెట్టువేసుకొని మోచేతులు దొడలమీఁద నాన్చి, యఱచేతులలోఁ గపోలముపట్టుకొని వంగి కూర్చుండి ముందునకు వెనుకకు నూగుచుఁ గనులెత్తి జమీందారుగారిని జూచుచు 'నేను మఱల వచ్చితి' ననెను. రంగారావతనివంకఁ జూచి 'అవును వచ్చితి' వని, మఱలఁ దనయూహాలే తా ననుసరించుచుండెను. శాస్త్రి భాషీపెట్టతీసి మరగాలు వేసి కూర్చుండి చెప్పనారంభించెను: "ఈ నాఁడు పట్టణమంతయు సోమరిపోతువలె నున్నది. నానవాసగాం డ్రెందఱును నిద్రపోవుచున్నారు. రాత్రికి నాటకము చూడవలయు నఁట." రంగారావు చివరిమాట వినెను. 'ఏమి నాటక' మనెను. మఱలఁ దనయూహాలోఁ దానే. శాస్త్రి మొదలు

పెట్టెను–'నాకు నోరు తిరుగదు. శశిరేఖాపరిణయ మఁట. కథ యేమిటని మాయింటికి వచ్చిన చుట్టము నడిగితిని. ఆయన నామాట వినిపించుకొనలేదు. ఈచుట్టములమూలముగా నింటిలో గోలగా నున్నది. ఆడుకొనుటకు వీలులేదు. సుశీలమాత్రము బాగుగా నున్నది. ఆమెదుపిల్ల యెప్పుడును నిదురపోవును. సుశీలపండ్లు కొబ్బరిపూలవలె నున్నవి. అది నవ్వినప్పుడు కుక్కపిల్ల కోపమువచ్చి యేడ్చినపుడు నోరిగిలించిన ట్లుండును.' రంగారావు చివరిమాటలు వినెను. ఇగిలించుట యన్నమాట విని 'నీవు కోఁతి నెప్పుడైనఁ జూచితివా?' యనెను. అని, రంగారావు హరప్ప తనతో నాల్గునాళ్ళ కిందట నొకసారి యన్నమాట జ్ఞాపకము తెచ్చుకొనెను. తిరుపతియందువలె వానరములఁ దెచ్చి దేవాలయములలో వదలిపెట్టెద నన్నాఁడు. రంగారావు దాని నూహించుచుండెను. శాస్త్రి తనసొద మొదలు పెట్టెను: 'కోఁతులన్నియు నిదురపోవుచున్నవి. రాత్రికి నాటకము చూడవలయునఁట. ఈ యూరి దక్షిణపుదిక్కునఁ గ్రొత్తపేటలో నొకకోఁతి యున్నది. దానికిఁ బంగనామములు పెట్టిరి. కోటు తొడిగిరి. దొరటోపి పెట్టిరి. నేను దానిని గడ్డతోఁ గొట్టితిని. అది పండ్లిగిలించెను. నాసంగతి దానికిఁ దెలియదు. టోపియు గీపియు నెగురఁగొట్టెడివాఁడనే. ఇంటిలోనుండి యెవరైన వచ్చి కోపపడుదురేమో యని యూరకుంటిని. అది సీమచింతకాయలు కోసికొనుటకు రావలయును, అప్పుడు చెప్పెదను దానిపని.' రంగారావుగారు చివరిమాట మఱల వినెను. కాకుమాత్రజ్ఞాతప్రసంగవిషయుఁడై 'ఏమిచేయుదు' వనెను. శాస్త్రి 'ఏమి చేయుదునా? గూబ లెక్క వేసెదను. తొడపాశము పెట్టెదను. బుగ్గలు నలిపెదను. పచ్చిమిరపకాయలు కొఱికించెదను. ఈ పనులన్నియు నిదురపోవుకోఁతులన్నింటికిని జేసితిని కాదూ! అదియే దీనికిని వ్రాసినది' యనెను. రంగారావుగారు 'ఎవరికి?' అనెను.

శాస్త్రి– ఎవరికి? ఎవరి కేమిటి? ఇందాఁకటినుండి చెప్పుచున్న కథయంతయు నెవరికి? రంగా– వానికా? శాస్త్రి– వారికే. ఆకోఁతికి. రంగా– నీకు నోడలు పొగరెక్కినదా? నేను కోఁతి ననుచున్నా నేమిటి? శాస్త్రి– మీరు కాదండీ! దక్షిణదిక్కున నొకకోఁతి యున్నది;

దానికి. ఆ కోఁతికి రెండుచెవులు. మాయింటిప్రక్కనున్నాఁ డొకఁడు- 'ఆవుకు నాల్గుకాళ్ళుఁట' వాఁడు ప్రతిదినము పాఠము చదువును. నేను వానిని దీసికొనిపోయి, వాఁడును నేను నావుకాళ్లు లెక్కపెట్టితిమి. మా కెంతసేపటికిని లెక్క మూఁడుకాళ్ళు వచ్చును; ఐదుకాళ్లు వచ్చును. పుస్తకములోఁ దప్పు వ్రాసినాఁడు. కోఁతికి చెవులు నాలుగు. బొమ్మలో రెండే. రంగా- నీవు టోపీపెట్టుకొన్నకోఁతిని జూచితివి. టోపీకి రెండుచెవులు కుట్టిరి కాఁబోలు! శాస్త్రి- అవి చెవులేగా! రంగా- అవి టోపీవి. శాస్త్రి- టోపీ కోఁతినెత్తిపై నున్నదిగా? రంగా- నీ విచ్చటి కెందుకు వచ్చితివి?

శాస్త్రి నాల్గువైపులఁ జూచెను. గుడ్లు మిటకరించెను. గుటకలు మ్రింగెను. చేతులు నలుపుకొనెను: 'మీ రెవరండీ?'

రంగారావుగారికి నవ్వు వచ్చెను. ఆయనకుఁ బూర్వముకన్న నారోగ్యముగా నుండెను. మూఁడేండ్లు మంచముమీఁద నుండుట చేతఁ బూర్వపుఠీవియంతయుఁ బోయెను. హృదయములో నొకవిధమైన సౌకుమార్య మేర్పడెను. ఎదురుగా నున్నవాఁడు ధర్మారావు కొడుకని తెలియును. ధర్మారావన్నచో రంగారావుగారి కిప్పుడు మూర్తీభవద్ధర్మము. అందుచే శాస్త్రి నేమియు ననలేదు. నవ్వి, 'నీవు హరప్పనాయనింగారి నెఱుఁగుదువా?' యనెను. శాస్త్రి 'యెఱుఁగుదు' ననెను. రంగారావుగారు 'నే నాయనకుఁ దండ్రి' ననెను. శాస్త్రి కిలకిలనవ్వి 'అబద్ధ మబద్ధము. మాదొరగారికిఁ దండ్రి లేఁడు. తల్లి లేదు. ఆయనతండ్రి గోపాలస్వామి. నే నెఱుఁగనా? నిజముగా మీ రెవరో చెప్పరూ?' యనెను. రంగారావుగారు నవ్వెను. 'అదిగో నవ్వుచున్నారు. మీ రబద్ధము చెప్పినారని మీకే తెలిసినదే! మీ రెవరో నిజముచెప్పండి' యనెను.

రంగా- నవ్వుచు 'మాది యీదేశము కాదు' అనెను. శాస్త్రి 'అవును, అట్లు చెప్పండి. లేకపోయినచో మీ రెప్పుడు నేల పండుకొందురు? నే నెఱిఁగినంతమట్టుకు మీవలె నెప్పుడును బండుకొను వారిని నేను జూడలేదు. నన్నుఁ జూడుఁడు- మైఁ కూద్ తా హూఁ' అనెను. రంగా- నీకుఁ దురకము వచ్చునా? శాస్త్రి- మా సమాజములో నొకతురకకోఁతి యున్నది. అది కూద్‌తా, సోతా అనును. ఆ

వెధవదగ్గఱ పిక్కతిని, యీ మాటలు రెండును. రంగా—నీవు తెగ వాగెదవు. శాస్త్రి— ఎప్పుడును బండుకొనుటకన్న నిది నయమే! అదిగో బాకా లూదుచున్నారు. దేవుడు బయలుదేఱుచున్నాడు కాంబోలు! సుశీలను దీసికొనివచ్చి చూపించవలయును. రాత్రికి నాటకము. మీరు రారుగా! అసలు మీ రెవరో చెప్పలేదుసుమండీ!

రంగారావుగారికిఁ గొంచెము విసుగుపుట్టెను. 'ఇక చాలులే. ఈ నాటికి బొమ్మ' అనెను. శాస్త్రి 'తినఁగాఁ దినఁగా గారెలైన చేఁదు' అని వెళ్ళిపోవుచుండెను. రంగారావు వానివంకఁ జూచుచు 'పిట్టకొంచెము, కూఁత ఘన'మనెను. శాస్త్రి వెనుకకుఁదిరిగి, 'కొన్ని పిట్టలు పెద్దవి, కూఁతయే కూయలేవు' అని నవ్వి 'మీ రెవ్వరో చెప్పరుకాదూ!' అని తర్జని యాడించి నవ్వి పరుగెత్తెను. బయట నగారాలు కల్యాణనాంది ప్రమోఁగించెను.

# ఇరువదితొమ్మిదవ అధ్యాయము

అప్పటినాఁడు ప్రొద్దుక్రుంకినంతనే వెన్నెలలు సితమత్స్యపుచ్ఛ
రోచులు వెల్లిగ్రక్కెను. అపహరింపఁబడిన వేదములకాంతులు మరల
బ్రహ్మదత్తము లైనవేళ వికాసించునట్లు తన ధర్మములు నాల్గు
మూలల వెదఁజల్లినట్లు తద్గతపరస్వతీసితశరీరలావణ్యచ్ఛవి పూరము
దిగంతము లందుకొన్నట్లు సరస్వతీశిరః ప్రదేశలాంఛనీకృతచంద్రమః
ఖండవినిర్గతకాంతిపూరము వెల్లివిరిసినట్లు వెన్నెలలు వర్షాసౌదా
మనీతపిశంగచ్ఛవిసుందరములై కొన్ని యెడల, శరత్కాలపుష్ప
ప్రతీకాశసితాసితచ్ఛటాఘటాపటాజాలంబులు విరిసి యొక్కొక్క-
చోట, హిమానీబిందుసదృశముక్తాహారహీరకాంతిపూరాభిరామంబులై
యొక్కచోట, శిశిరవేళాపరిశుష్కతమహాశైలాంతర్గతనిర్ఝరిణీస్వచ్ఛ
జలబిందుసంతానరోచిః ప్రసన్నమ్ములై యొక్కచోట, వసంతసమయ
సాయంవికసిత మల్లికాప్రసూనమృదుపత్రశోభాసుందరములై యొక
చోట, గ్రీష్మవేళాప్రవికసత్కదళీప్రసూనపత్రాంచలసువర్ణమ్ములై
యొక్కచోట ఆ ఋతువులశోభ గలిసి సర్వర్తుమూర్తులు సార్వకాలి
కము లన్నట్లు చకచ్చకితద్యుతిచ్ఛటామంథరము లయ్యెను. మత్స్య
పుచ్ఛచ్ఛవీసుందరములు, ఆదికూర్మపృష్ఠభాగపరిలిప్తామృతబిందు
సందోహకాంతిమతంబులు, ఆదివరాహదంష్ట్రాసితచ్ఛటాపరిరమ్య
ములు, నృసింహవికటాట్టహాసభాసమానములు, వామనమూర్తి
యజ్ఞోపవీతపరిస్వచ్ఛప్రభాపరిపోషకములు, భార్గవాజ్ఞాతకార్తవీర్యా
ర్జునకంఠరక్తపరశుధారాసితచ్ఛటానతాంకమ్ములు, శ్రీరామచంద్ర
యశోవిరాజమానమ్ములు, రేవతీప్రాణనాథపీతవాలానూత్నడిండీర
ప్రత్నసౌభాగ్యమేదురమ్ములు, సర్వరాక్షసవిమోహహేతుగర్భిత
పరిహాస ప్రతారణ విదగ్ధవాక్ప్రసితచ్ఛటలు, చతుష్పాద విజృంభిత
కలిపురుషకంఠనిర్దళనబీభత్సరసావతారకల్కిరోహిత శ్వేతాశ్వపాద
విన్యాసపరిణయితాస్కందితధారిత కరేచిత వల్గిత ప్లుతప్రతిమానములు
బృందావీథి వెల్లివిరిసినట్లు, వెన్నెలలు శ్రీ వేణు గో పా ల స్వా మి
వారియాలయాంతర్భాగమునఁ గుండెల్లు ప్రాకినట్లు, తెలినాగుఁ

బాములు మలకలై నడచినట్లు, షోడశసహస్రగోపికాసితాపాంగచ్ఛటలు చిటచిట గదలినట్లు వేగుమక్కతో లేచి కవ్వమునంజిలికినపాలు, వెన్న పెరుఁగులు కవ్వమునకుఁ దాకకుండ దొంగలించిన కుమారకృష్ణుని హాస్తస్వస్తముఖము నందలి తెల్లనికాంతులు నవ్వులతోఁ గలిసిపోయి చకిచ్చకితములైనట్లు విరిసెను, ప్రకాశించెను, కాంతులు మలఁచికొనెను, పరిహాసములు కట్టెను, చల్లనయ్యెను, హృదయబాధానివారకము లయ్యెను. పన్నెండేండ్లు దాఁటి పరువెత్తివచ్చిన భగవంతుని ప్రసాదమువలె నాలుఁగుదెసలఁ బారాడెను. ఆలయప్రాకారాంతర్భాగమునఁ బందిళ్లు వేయఁబడెను. ముఖమంటపమునుముందు ధ్వజస్తంభముదాఁక నొకపెద్దశిలావితర్దిక యున్నది. దానికి పైని కప్పు లేదు. ఆ శిలావితర్దిక వందగజముల వెడల్పు, నాల్గువందలగజముల పొడుగు. సాయంకాలమున రజకులచే నా వితర్దికయంతయుఁ దడుపఁబడి చల్లన జేయఁబడెను. స్వామి కెదురుగా ధ్వజస్తంభము నంటినృత్యరంగము జేయుటకు రత్నకంబళము లమర్పఁబడియుండెను. దానికి దక్షిణపార్శ్వమున సభానాయకుఁడు, మంత్రి, కవులు, గాయకులు, విద్వాంసులు నాసీనులగుట కాసనము లమర్పఁబడియుండెను. ఆసనములన్నియు రత్నకంబళములు, పఱుపులు, ఒరగుబిళ్ళలు. రంగవామభాగమునఁ జాపలు వేసియుంచిరి. తదితరోద్యోగస్థులు, తక్కినవారెల్లరు నచట నాసీను లగుదురు. రాత్రి జాముప్రొద్దుపోయినది. గజ్జియలు కిణకిణలాడెను. తాళములు గణగణలాడెను. అప్పుడే బోనమంటించినమద్దెల బొంయిబొంయి మనెను. ఆలయమునకుఁ బ్రాగ్దిశ నున్న యశ్వత్థవృక్షాగ్రమున రెండుపైడి గంటలు కిలకిలఁగూసెను. దేవదాసి సర్వాలంకారభూషితయై రంగమున నిలుచున్నది. వితర్దికయంతయు సభాజనులచేత నిండియున్నది. హరప్పసభానాయకుఁడు. ధర్మారావు మంత్రి. తక్కినవారందరు సభవారు. సభయంతయు సుమనోరంజకమై యుండెను. సభానాయకుఁడైన హరప్ప మంత్రియైన ధర్మారావు శాస్త్రనిర్దిష్టనాయకమంత్రిలక్షణములచేత దీపితులై యింద్రబృహస్పతులవలె నుండిరి. శ్రీమంతుఁడు, ధీమంతుఁడు, వివేకి, వి[illegible]రణి, గానవిద్యారహస్యవేత్త, సర్వజ్ఞుఁడు, కీర్తిశాలి, హావభావాభిజ్ఞుఁడు, ఆ[illegible]శీలుఁడు, దయాళుఁడు హరప్ప.

స్థిరభాషి, గుణవరుఁడు, భావజ్ఞుఁడు, గుణదోషభేదనిపుణుఁడు, శృంగారలీలావిదుఁడు, నయకోవిదుఁడు, సహృదయుఁడు, పండితుఁడు ధర్మారావు. దేవదాసి నిలుచుండెను. ఆమె మత్స్యకుటుంబినివలె గోచరించెను. ఆమె కెట్టయెదురుగా ముఖమండపమునందు స్వామికి మత్స్యావతార మలంకారము చేసిరి. గుండ్రగాఁ గట్టువేసి దానినిండ నీరముపోసిరి. మధ్యభాగమునందు మత్స్యాకృతిగ నొకయట్ట పెట్టి, తన్మత్స్యగర్భమునందు స్వామివిగ్రహము నుంచిరి. మత్స్యగర్భము నుండి స్వామి యావిర్భవించుచున్నట్లుండెను. మత్స్యము సోమకాసురుని జీల్చుచుండెను. నాల్గు మొగములతో బ్రహ్మ ప్రక్కనిలుచుండి, యాయన తెచ్చియిచ్చిన వేదములే స్తోత్రరూపమున మఱల నప్పగించుచుండెను. దానికి వెనుకగా గర్భగుడిలో బంగారు మైనుఱుపుతోడి వేణుగోపాలుఁడు తన ప్రథమావతారస్మృతిచేతనువలె నర్ధనిమీలితాక్షుఁడై గోచరించుచుండెను. దేవదాసికన్నులు నాలుగచేపలవలె దీర్ఘములై కంటితుదలు మూఁడుగీఁతలుగీయఁబడిననామము చేత మత్స్యాకృతి విడంబించెను. ఆమె శిరోగ్రభాగమునఁ గోణము వలెఁ దేలిన యర్ధచంద్రాకృతిగాఁ గిరీటమువంటి బంగారపు రేకుపాపట ముందర నమర్చి వెనుకకు బిగించికట్టెను. రెండుచెక్కిళ్ళపైఁ గాంతులు తఱుముకొను తెల్లఱాళ్ళు పొదిగినబంగరుచెంపసరాలు ధరించెను. మూఁడు తెల్లని యేనుగుదంతములసలాకలు గడ్డముక్రింద నమర్చెను. దీని చేత నామెముఖమే మత్స్యాకృతిగానుండెను. కన్నులుమత్స్యములు వక్షస్సునందు చీరయొకరకముగా మడచి చేఁపముట్టెవలె నమర్చెను. ఆమెయొడలనంతట గందమలంది డాగురేకు లద్దెను. దానిచే నామె శరీరమంతయు చేపపొలుసులవలె మెట్లుమెట్లుగా గనిపించెను. ఆమె చేతులు మాటిమాటికిని ద్విశూలహస్తము ప్రకటించుచుండెను. ఆమె నఖశిఖపర్యంతము మత్స్యస్త్రీవలె గోచరించెను. కాగడాలు దూరదూరముగాఁ బట్టఁబడెను. వానికాంతులు ప్రసరించినంతమేఱ ప్రతిమూర్తిని నవ్యక్తముగాఁ గనిపింపఁజేయుచు సౌందర్యము నినుమడించుచుండెను. భోగప్పశాస్త్రి దేవదాసికి దక్షిణభాగమున, మార్దంగికుఁడు వామభాగమున, నామెవెనుక వీణతో రత్నగిరి, నటునివెనుకఁ దాళము వేయువాఁడు, నంద్యాల పిల్లనగ్రోవియూఁదు

పచుచు, రత్నగిరి పార్శ్వమున, వారివెనుక ముగ్గురుపాటకత్తెలు, పాట కత్తెలతో వరుసగా శుద్ధిఃబూని కబీరు నిలుచుండిరి.

హరప్ప యనుజ్ఞయిచ్చెను. దేవదాసి భగవంతునకు నమస్కారము చేసెను. నమస్కరించిన దేవదాసిని స్వామి చూచుకొనెను. ఆమెయందు భగవంతున కనురాగమే కలిగెను. ఆమెసౌందర్యము నిరుపమానమై రంభాద్యప్సరఃకాంతలశిరస్తాడనపటువై యుండెను. క్షీరపాథోరాశివీచికానిగన్నిగల్లావణ్యరేఖ యామె శరీరమునందు మిసిమిచిందుచుండెను. ముప్పదియేండ్లనడివయస్సులో నామె మన్మథునిపట్టపుగుఱ్ఱమువలె సన్ననినడుము, ఆకాశము పట్టరానివక్షోజములు - మూర్తిభవించినవయస్సువలె నుండెను. కన్నులుకదల్చినఁ, జూచిన, నిలుచుండినఁ, జేయికదల్చినఁ ప్రౌఢత్వమే గోచరించుచుండెను. అర్ధనిమీలితనేత్రములయందుఁ దన్మనోగతసౌకుమార్యము, ఠీవి, రసజ్ఞత గోచరించుచుండెను. విశాలములైననేత్రములు తన్మహాభక్తి తెలుపుచుండెను. శరీరము లఘువై, యే యవయవమునకుఁ దగిన భూషణ మా యవయవమున నమర్పఁబడి, నాతిస్థూల, నాతికృశ, నాత్యుచ్చ, నాతివామన సర్వరసాధిదేవతలవలెఁ ప్రకాశించెను. ఆమె సమశిరస్కయు, సమదృష్టియు నై పతాకహస్త మవలంభించి

జయజయ స్వామిన్ జయజయ
జయజయ జితవైరిదుర్గ ప్రచండ
జయజయ గజముఖ జయ వక్రతుండ ॥జయజయ॥

ఈ తరంగము పాడెను. సరస్వతీప్రార్థనము, సర్వదేవతానమస్కారము, ఆచార్యపరంపరాసమ్మాననము జరిపి సభానమస్కారము చేసెను. సత్యాచారములు కలదియు, గుణోజ్జ్వలమైనదియు, సద్ధర్మకీర్తిమంతమైనదియు, వేదవిదులు, వేదాంతవేద్యులు, రాజపూజితులు, వీణావాదననిపుణులు, వీరావతారులు, రాజకుమారులు ప్రకాశించుచున్న యా మహాసభకు నమస్కరించెను. తోడనే దేవదాసి మహాభిసారికానృత్య మారంభించెను. భగవంతునియందుఁ దాను నిత్యాభిసారికయైనట్లు పాదవిన్యాసముచేత స్ఫురింపఁజేసెను.

అదిగో మేఘమని పతాకహస్తము పట్టినంతనే భోగపృశాస్త్రి యిట్లు పాడెను:

'గర్జంతి శైలశిఖరేషు విలంబి బింబా
మేఘా యియుక్తవనితాహృదయానుకారాః
ఏషాం రవేణ సహసోత్పతితైః ర్మయూరైః
ఖం వీజ్యతే మణిమయై రివ తాలవృంతైః.'

వెంటనే దేవదాసి 'బావా! చక్కఁగాఁ జెప్పితివి. ఈ రాత్రి మిక్కిలి కష్టతరముగా నున్నది. ఎడములేనివక్షోజభారముకలిగిన నాతోఁ గలసియే భగవంతుఁడు క్రీడించుచున్నాఁడు. కాని నే నభిసారిక నైనంతనే,సపత్నివలె నీనిశ మేఘగర్జనలచేత నన్ను వారించుచు నామార్గ మడ్డుచున్నది' అనెను. నటుఁడు 'ఎంత చుప్పనాతితనము పడినను నీ హృదయములోనున్నస్వామిని నిశ యేమి హరించఁ గలదు? నీవు కృష్ణాస్వామికి నచ్చిన భార్యవు. నీకు భయ మేలే'దనెను. మఱల 'ఓసి దొంగపిల్లా! చక్కఁగాఁ బండు వెన్నెలలుగాయుచుండఁగా మేఘములు గర్జించుచున్న వందు వేమి?' యనెను. వెంటనే రత్నగిరి 'ప్రభూ! నాయిక వర్షాభిసారిక నభినయించినది. ఇదిగో మఱల నిప్పుడు జ్యోత్స్నాభిసారిక నభినయించును. ప్రభువులు తొందరపడుచున్నా' రనెను. అంతలో గలగలలాడి తాళములు, గజ్జెలు వెన్నెలను ధ్వనించెను. దేవదాసి లాంగూలహస్తము నాశ్రయించి, "స్వామీ! చకోరములు వెన్నెల లారగించుచున్నవి. చందనాలంకృతమైన మచ్ఛరీరమును మన్మథుఁడు మల్లెపూవులతోఁగాని తాఁకరాదు కాఁబోలు" ననెను. వెన్నెలలు పలపల విరిసెను. భోగపృశాస్త్రి "చెలీ! భయము లేదమ్మా! దూతియైన వెన్నెల వెంటనే వచ్చుచున్నది. రాత్రి సహచారిణియైనది. పైడిగంటలుకూసి బయలు దేఱువేళ మంచి దనుచున్నవి. భర్తృసకాశమునుండి తన్నర్మసఖుఁడైన శుక్లపక్షము నీకై యెదురువచ్చినాఁడు. ఇనమింక బయలుదేఱవలయును" అనెను. 'నీవింక లజ్జపడరాదు. ప్రియుఁడు తొందరపడుచున్నాఁడుకాఁబోలు." దేవదాసి చీర సర్దుకొని లజ్జతో నెమ్మదిగా నడుగులు వేయసాగె. తలవంచుకొని సిగ్గభినయించెను. ఆమె సోల పద్మహస్తమును జేసి యొకయడుగు వేసెను. నటుఁడు 'ఏమమ్మా!

వెన్నెలకు విరిసిన తామరపూవు చూపెదవు? ఇంతముద్దరాలవు పతి వద్దకుఁ బోయి యేమిచేసెద' వనెను. దేవదాసి లజ్జామంథరదృగంతములతోఁ గనుఱెప్పలక్రిందుగా మత్స్యావతారమువంకఁ జూచెను. ఆమెయొడలంతయుఁ జెమటబోసెను. శరీరము స్తంభించెను. నేత్రములయందు మాంద్యము తోఁచెను. కర్తరీముఖమునఁ గడకన్ను జోడించి తనభావమంతయు స్వామికిఁ జూఱయిచ్చెను. మఱల నామె యిట్లనెను: "నేను దారిలోఁ బాములకైన భయపడను, స్వామిస్పర్శ తగిలి ప్రకంపించిపోదునేమో! మేఘధ్వానములచేత భయపడను, స్వామి మాటాడినచో భయపడెదనేమో!" అని కీర్తనపాడెను. నటుఁడు 'బేలా! భయము లేదు. దారిలోఁ బడుచున్నావు. బయలు దేఱఁబోవునప్పటిముగ్ధవు దారిలో మధ్య నైతివికదా! స్వామిదగ్గఱకుఁ బోవునప్పటికి ప్రగల్భ వగుదువు. నీ కెందుకు? పద! నేనున్నానుగదా! నీకు స్వామితోడి సంగమము చేయించెదను. లేకపోయిన నీకుఁ జెలి నని చెప్పుకొందునా' అని. 'అదుగో స్వామి! నీకై యెదురుచూచుచున్నాఁడు' అనెను. గిరిక లజ్జావనతముఖయై—

తోడి — ఆది

ప్రమొక్కెర చలమేల మువ్వగోపాల
అక్కఱతో నీ కౌఁగిట నలముకోర యీవేళ ॥ప్రమొక్కె॥
మారుఁ డేసె పూవుదూపు మనవా యింతైనరావు
కోరియున్నాను నీప్రాపు కోపమైతే యెంతసేపు ॥ప్రమొక్కె॥

ఈ కీర్తన పాడెను. నటుఁడు 'స్వామీ! నీ వేమో యామె యెంత చెప్పుచున్నను వినుటలేదు. ఈమె నేను చెప్పినట్లుగా నీవద్దకు వచ్చినంతనే ప్రౌఢాభిసారిక యైనది. ఆమె వెన్నెల యను క్షీరసాగరమున నీకై యీఁదుకవచ్చిన చేఁపవలెనుచు. ఈఁది యీఁది యామె శరీర మలసిపోయినది. నీ వామెను మఱియు నలయించెద వేమో సుమా! చెలిని నేను చెప్పవలసినది గనుక చెప్పితిని. నీకుమాత్ర మామెయందుఁ బ్రేమలేదా? ఆమె నోదార్చు కొనలేవా?' యనెను.

తోడి — ఆది

సరసిజాక్షి! నీ జన్మము సఫలమాయెను
పరమాత్ముఁడైన వేణుగోపాలునిహస్తము సోకినంతనే ॥సర॥

అని నటుఁడనఁగా 'నాజన్మము సఫలమాయె'నని దేవదాసి పాడెను. సభాసదులందఱును దిగ్భ్రాంతులై పోయిరి. వెన్నెలలు నెమ్మదిగా గిరికిరీటభాగమునుండి జాఱెను. చంద్రుఁడు దేవాలయము వెనుకకుఁ బోయెను. ఆలయమునీడ సభాసదులపైఁ బడెను. కాగడాల వెలుతురు తొల్లిటికన్న విజృంభించెను. వీణాధ్వని, వేణుస్వానము, మృదంగనినాదము; తాళముల మ్రోఁత; మధురమైన భోగప్పశాస్త్రికంఠముతో సమరసించిన గిరికామధురధ్వనితరంగములు తరంగములుఁగా నొత్తిగిలిపోవుచున్న వెన్నెలలను దఱిమెను. కాగడాలు కదలిపోయెను. హరప్పదృష్టియందు నిశ్చలత్వము, ధర్మారావు దేహమునందు నిశ్చైతన్యము, సభికులందు నిస్తబ్ధత యొక్కసారిగా గోచరించెను. అది మత్స్యమూర్తి నీటిలో త్రవ్వుకొనిపోవునప్పటి ధ్వనివలె మృదంగతాళవేణువీణాదుల ధ్వనియంతయుఁ గలసి యొక్క మహాశ్రుతియందు లగ్నమైన యాలయ ముఖమంటపమున బోరుకొలిపెను.

'ఏషాం భూతానాం పృథివీ రసః పృథివ్యా ఆపో రసః, అపామోషధయోరస, ఓషధీనాం పురుషో రసః, పురుషస్య వా గ్రసః, వాచ ఋగ్రస, ఋచ స్సామరసః, సామ్న ఉద్గీథో రసః' అన్న వేదవాక్కు తన్మహానిభృతప్రచలన్మధుర ధ్వానమున నుప్పతిల్లి, యుద్గీథమువలె నా మహాస్వరము వేదక్రతువు సమాచరింపఁబడినట్లు, అగ్నిష్టోమము పూర్తియైనట్లు బ్రహ్మాదిసర్వదేవతలు వచ్చి వొంగిలింపఁబడిన వేదములు మఱలఁ దెచ్చిన మత్స్యమూర్తికి నమస్కరించిరి. అర్చకుఁడు శఠగోపముదెచ్చి సభాసదులకందఱకు నొసఁగెను, వారందఱును జేతులెత్తి నమస్కరించిరి. దేవదాసిని రత్నగిరివచ్చిపట్టుకొనెను. ఆమె తన్మయత్వస్థితిలో నుండెను. గిరికరత్నగిరి మత్స్యావతారాలంకారమువద్దకుఁ బోఁబరి. శశిరేఖానసూయారుంధతీరథంతరులు చుట్టును మూఁగిరి. గిరికకు స్మృతి రాలేదు. మొగమున ఒన్నెరుచల్లిరి. స్వామిచామరముతో వీచిరి. ఆమె నీళ్ళలోదిగిమత్స్యమూర్తి నంటుకొన్నది. అప్పటికిఁచక్కఁగా స్మృతి వచ్చెను. భోగప్పశాస్త్రికిఁ జూచినదంతయు విస్మయజనకముగా నుండెను. ఆయన దేవదాసివంటి నర్తకిని జూడలేదు. రత్నగిరిమేళమువంటి మేళమును

జూడలేదు. వారిలో సప్తశ్రుతి యన్నది లేదు. భావదారిద్ర్యము లేదు. శాస్త్రానభిజ్ఞత లేదు. ; ఆయన గ్రామమున కీ నాఁడే వచ్చెను. ఎకాయెకిగా దేవళమునకే వచ్చెను. గిరికా సౌందర్యమును జూచి ముగ్ధుఁడయ్యెను. నాట్యముచేసినంతసేపు, వట్టి నర్తకి యనుకొనెను. అప్పుడే యతని కనుమానము కలిగినది. గిరిక నృత్యముచేసినంతసేపును స్వామి వంకనే బద్ధదృష్టిగాని సభవైపునకే చూడలేదు. నృత్యాచరమదశయందుఁ గ్రమక్రమముగా నామె వాలిపోవ నారంభించెను. మంగళాచరణము గిరిక చేయనే లేదు. తా నొక్కఁడే చేసెను. అప్పటికే గిరిక రత్నగిరిచేతులలో నున్నది. తరువాత గడియవఱకామెకు స్మృతియే లేదు. బ్రాహ్మణస్త్రీలు, క్షత్రియస్త్రీలు, కులముగల పడుచులందఱు గిరికచుట్టును జేరి సమాశ్వసించుట భోగప్పకు నింగుల నాశ్చర్యమయ్యెను. సభికు లెవరిదారిని వారు పోయిరి. హరప్ప ధర్మారావులు గిరికవద్దకు వచ్చిరి. ఛాయాశశిరేఖాదు లొత్తిగిలిరి. హరప్ప దేవదాసివంకఁజూచి 'సముద్రము లీఁదినఁచేపకుఁ దోఁడిచేపయైన గిరికకు నమస్కార' మనెను. ఆమె భగవంతుని వంకనే చూచుచు శిరఃకంపముచేసెను. ప్రభువు వచ్చి యిట్లనుట భోగప్పశాస్త్రికి దేహములోఁ బ్రాణములు లేచిపోయెను. ధర్మారావు గిరిక గడ్డముక్రింద నున్న మూఁడుదంతపుసలాకలు నూడలాగెను. ఆమె తలెత్తి చూచెను. ధర్మారావు దక్షిణవామహస్తములచేత నర్ధచంద్రహస్తములుచేసికోర్లించి, వామహస్తమువైదక్షిణహస్తముంచి కూర్మహస్తాకృతి రెండుబొట్టనవ్రేళ్ళు నల్లలాడించెను. గిరిక 'అన్న తఱుముచున్నాఁ'డనుకొనెను. భోగప్ప ధర్మారావుచేతికూర్మాకృతిని జూచి, తద్విన్యాసనైపుణి చూచి, యతఁడు సభామంత్రి యగుట లౌకికాధికారముచేతఁగాదు. విద్యాధికారముచేతనే యనుకొనెను.

అస్తంగతుఁడైన చంద్రుని వెనుకఁబడి చీఁకటులు బిలబిల బయలుదేఱెను. రాత్రి మూఁడుజాములగువఱకు దేవాలయము నిర్మానుష్య మయ్యెను. హరప్ప యింటికిఁ బోయెను. సర్వజగత్తును గాఢనిద్రాపరీవృత మయ్యెను. హరప్పయొక్కఁడు మేల్కొనియుండెను. ఆయనకు నిద్రపట్ట లేదు. దేవదాసి యింటికిఁబోయి వేషమూడఁదీసి స్నానముచేసి కృష్ణదేవునివిగ్రహమునెదుట కూర్చుండి బద్ధపద్మాస

నయ్యె మఱల మంత్రపునశ్చరణ మారంభించెను. వారి వారి బంధువు
లందఱును నిద్రించిరి. ఒకఁడు నృత్యము నేఁటివలె భక్తిరసపోష
కముగా నుండవలె ననెను. మఱొకఁడు సంపూర్ణవిద్యాస్వరూప
ముగా నున్నది; ఇట్లున్నచో నెవఁడు సేవగించుకొను ననెను. మఱొ
కఁడు విద్యను సముద్ధరించవలయునుగాని, కులమును సముద్ధరించుట
యేమి టనెను. అందఱును నిద్రపోయిరి. హరప్ప కనులు మూసు
కొనెను. ఆయన మనస్సునెదుట దేవదాసి మత్స్యాకృతి యాడు
చుండెను. చెవులలో వీణావేణుమృదంగస్వనములు వినిపించుచుండెను.
నృత్యముచేయువేళ నృత్తవేగమునకు దేవదాసిచీరకుచ్చులు దేహ
మునుండి దూరముగాఁ బోయెను. అవి మత్స్యపుచ్ఛములవలెఁ గని
ఫించెను. ఆమెపట్టిన మత్స్యహస్తమునందు ముమ్మూర్తులఁ బ్రథ
మావతారమే గోచరించెను. దేవదాసి కూర్చుండి ధ్యానముచేయుచు
మత్స్యావతారమును దూరముచేసి యన్నగారి యాజ్ఞానుసారముగ
కూర్మావతారమును ధ్యానముసేయ నారంభించెను. ఆమెకుమత్స్యావ
తారైక్యము పోలేదు. తనగదియంతయు జలమయ మైనట్లు, అచ్చటి
కృష్ణవిగ్రహము మత్స్యాకృతిగా నున్నట్లు, అద్దములో నృత్యమునకుఁ
బోవుచుఁ దన్నుదాఁ జూచుకొన్న నీడవోని తనమూర్తి తన్ను వదల
కున్నట్లు తనకు భాసించుచుండెను. కొంతసేపు కూర్చుండి కుడ్యమున
వ్రేలాడుచున్న కూర్మావతారపటమును దెచ్చి యెదుట నుంచుకొని
దీపకాంతిలోఁ జూచుకొనుచు దన్నుఁదా గూర్మముగా భావించు
కొనుచు నెదురుగానున్న శ్రీకృష్ణదేవుని నాల్గుచేతులును నాల్గు
కూర్మపాదములుగా గావించి, భావించి స్వామిని గూర్మ
ముగాఁ జూచును. మఱల నింతలో నామనస్సు చలించిపోయి ప్రథ
మావతారమే పొడఁగట్టును. ఒకదినముదినమెల్ల గాఢాభ్యస్తమైన
తద్రూపభావన వదలిపోలేదు. కూర్మమువచ్చును. మఱల పాదములు,
తలయు లోనికి ముడుచుకొనును. పట్టి డిప్ప కనఁబడును. మఱల
జలములో నీఁదుచున్నట్లు తోఁచును. మందరపర్వతమును మోయు
చున్నట్లుండును. దేవతలు, రాక్షసులు వాసుకిని గవ్వపుత్రాడుగాఁ
జుట్టి త్రిప్పుచుండిరి, సముద్రమంతయుఁ బరిక్షుభితమగుచుండెను.
పునఃపునర్మందరగిరి మూలకోణపరివేగఘాతక్షీరసంతానము వియత్ప

థమున లేచి సూర్యకాంతులలో నింద్రాపచములు నిర్మించెను. పరిత్రస్యజ్జలజంతువులు పరువులెత్తి పాతాళమునకుఁ బోవుచుండెను. దేవతలు హాహాకారములు చేసిరి. శంఖచక్రలాంఛితుఁడు. హారకేయూరభూషితుఁడు, కూర్మరాజు పృష్ఠకర్పరముచేఁ గ్రుంకిపోవుచున్న మందరపర్వతమును బైకెత్తెను. జలముచిలుకు చుండెను. వేయి మహాజలపాతములైనట్లు తీవ్రధ్వని పరిఘూర్ణితజలప్రవాహములు దేవదాసిచెవులు చిల్లులుపడిపోయెను. ఆమె కను లూర్ధ్వతిర్యగధోముఖాస్తాడితను లయ్యెను. క్షీరసాగరతరంగదర్శనముచేత, నా బీభత్సదృశ్యముచేతఁ దిరిగిపోయెను. ఆమెలోఁగూర్మాకృతి నిలచియుండెను. హారప్ప కనులుమూసికొని మహాసముద్రదర్శనము చేయుచుండెను. సోమకాసురుని వెంటఁబడి నాసాగ్రమున నందకము వంటి చేఁపముల్లు పెంచుకొన్న యాదిమత్స్యమూర్తి జలము దూసికొని పోవుచుండెను. అతని వెంటనే మత్స్యాకృతితో దేవదాసి పరుగెత్తుచుండెను. మూర్తికట్టిన భరతశాస్త్రము, పులకితసర్వశరీర, నేత్రము లన్న రెండుచేఁపలు మొగమునందుఁ బెట్టుకొన్న పెద్దచేఁప సర్వాభరణభూషిత, బంగారుపనిచేసిన తెల్లనికోకకట్టిన సుందరి జలములో నా మత్స్యమువెంట దూఁకుచుండెను. హోరుమన్నధ్వని హారప్పచెవులకు విజృంభించుచుండెను. ఆ చేఁపవెంట రత్నగిరి వీణావాదనముచేయుచుఁ బోవుచుండెను. నర్మసఖుఁడైన భోగప్ప యను నయోక్తులు పల్కుచుండెను. ఇంతకుముం దెందఱో సభికు లుండిరి. ఇప్పుడు తా నొక్కఁడేనా? తననమస్కారమునకు గిరిక శిరఃకంపము చేసెను. అది నీరుకొట్టుకొనునప్పుడు చేఁప తలాడించిన ట్లుండెను. తననమస్కారము సువేళార్పితమేనా? ప్రాంతర్మందానిలయములు మల్లెపొదరింటిలో దూఁకి మర్మరధ్వని చేసెను. గిరికచేలాంచలములు చలించిన ట్లున్న యాధ్వని హారప్పవిన్న పూర్వధ్వనులకన్న భిన్నమై యుండెను. హారప్ప యిదివఱకు విన్న ధ్వను లాంతరము, ఇది బాహిరము.

అందఱును నిదురపోయిరి. అరుంధతికి నిదురపట్టలేదు. వ్యాధిగ్రస్తమైన యామె దేహము నిద్రాముఖము కాలేదు. ఉడికిపోయిన యామెప్రకృతి చల్లదనము తెచ్చుకొనలేదు. కదలిపోయిన యామె

భావనాబలము కట్టుకంబమునకుఁ జేరలేదు. ఆమెమనస్సులో దేవాలయము, దేవదాసి, మత్స్యావతారము మూఁడే యున్నవి. ఆమె యూహించెను. తానొక్కర్తయ నిద్దురపోలే దనుకొనెను. భర్త వాకిటఁ బండుకొన్నాఁడు. పోయి యతనిని లేపినది. తక్కినపురుషు లందఱును భర్తకటునిటు పండుకొనిరి. ఈమెపోయి చీఁకటిలో ధర్మారావును గుర్తుపట్టిలేపెను. ధర్మారావు 'ఇదియేమిటి? ఎవరైనఁజూచినచో నే మనుకొందు' రనెను. అరుంధతి 'ఏ మనుకొందురు? నే నొంటరిగాఁ బండుకొనలేను. మత్స్యకృతియైనగిరిక పతినెడఁబాసి యుండలేకున్నది. నేను నుండలేను.' ధర్మారావుపోయి గదిలోఁబండుకొనెను. అరుంధతి యాతని నిఖిలాంగములయందు పరిష్వంగించుకొనెను. ధర్మారావు 'నీ కున్మాదము ప్రాప్తించెనా?' యనెను. అరుంధతి 'కాదు, కాదు. నాగుండెలోఁతులలోనుండి ప్రాణములు త్రవ్వి మీపాదసన్నిధానమున నైవేద్యము చేసెదను. మీనుండి భిన్నమైన దృష్టి నాకు వలదు. నేను మిమ్ముౖవదలి నిముసముండలేను. మనమిద్దఱము మత్స్యకృతులమై మహాసముద్రమునఁ బడిపోదుమా' యనెను. ధర్మారా వామెకపోలములుస్పృశించి తనశరీరస్పర్శచే నామెశరీరమునకు, మనస్సునకు, హృదయమునకు శాంతముతెచ్చి యామెను నిద్రపుచ్చెను. మఱలఁ దాను స్నేహితులమధ్య పండుకొనుటకుఁ బోవుచుండెను. ఆతనికి నిద్రించుచున్న యొక స్త్రీపాదము తగిలెను. అయ్యో! పరస్త్రీస్పర్శ కలిగెనని యతఁడువిచారపడెను. ఆమె'ఎవరు వా' రన్నది. కంఠధ్వని చిన్నయరుంధతిది. ధర్మారావు 'కాలు తగిలినది. నిద్రపో!' అని చెప్పి పోయి పరుండెను. కోళ్లు కూసెను. సూర్యోదయమయ్యెను. ప్రొద్దెక్కెను. పగటివేషాలవారు వచ్చిరి. నిద్రామత్తులు సరిగాఁ జూడలేదు. పగలు రెండుజాము లయ్యెను. ఎండలు భగభగ మండించెను. ఆలయమునుముందు నగారామ్రోఁతలు, నౌబత్తుఖానాలు వినిపించెను. అందఱును వేళతప్పి భోజనముచేసిరి. పండుకొని నిద్రించిరి. లేచువఱకుఁ బ్రొద్దువాటారినది. రంగనాయకులుకొడుకు సన్నాయి వాయించుచుండెను. అతఁడు చక్రవాకము పాడెను, అది సాయంవేళామృదుమందమారుతతరంగములపై నటనము చేసెను. కీర్తన లేకుండఁగనే యది భావమును గుర్తుస్మరించెను. ప్రొద్దు

క్రుంకెను. జరఠారుణసూర్యబింబము మద్దెలకుఁ బెట్టినప్రాఁతబోనమువలె విరిసిపోయెను. ఆదిమత్స్యము ముక్కుకొననున్న కత్తికైన సోమకాసురుని నెత్తురు సముద్రజలముచేతఁ బరిక్షాళితమైనట్లు సంధ్యారాగము సమసిపోయెను. వెన్నెలలు నిర్మథితక్షీరసాగరతరంగములవలెఁ, ప్రాదుర్భూతామృతకుంభనిర్గమదమృతడిండీరకాంతిచ్ఛటాస్ఫురత్స్ఫురకములవలె, మంథానిరజ్జుకృతవాసుకిముఖనిష్ఠ్యూతఫేనమువలె, మథ్యమానమందరగిర్యుభయపార్శ్వసంస్థితదేవదానవమహాట్టహాసదీధితివలె, పరిజ్వలత్క్షీరపాథోధివినిర్గమచ్చంద్రబింబసుధారోచిః పూరదగద్గితదశదిశాసంతానమేదురితప్రసన్నకాంతులవలెఁ, గామధేనుకల్పవృక్షచింతామణీ ప్రముఖనానాదివ్యసృష్టిపరికల్పితస్వర్గవికాసమువలె, నన్యోన్యజల్పితశ్రేణీకారవాక్యసూచిమందహాసపరిహాసప్రస్ఫురద్దంత కాంతిచ్ఛటాభిరామాప్సరోనివహపరిధానచేలాంచలములవలె వెల్లివిరిసెను. రాత్రి ప్రథమయామము దాఁటెను. పశ్చిమదిశ కొఱఁగియున్న చంద్రబింబము విరహోత్కంఠితాకపోలమువలెఁ దెల్లతెలవోయెను. విరహోత్కంఠితకపోలమును జేతిలో నమర్చుకొని మొగమువాల్చి కూర్చున్నట్లు పశ్చిమదిశాకాంత దేవాలయమునందు గగనముదాఁక నెదిగియున్న యశ్వత్థవృక్షశాఖాంచలముల నంటుకొనియుండిన జాబిల్లిచేతఁ బ్రకాశించెను. సభాసదులందఱు నాసీనులైరి. నాయకుఁడు, మంత్రియు నిశ్చలదృక్కులతోఁ జూచుచుండిరి. కూర్మకుటుంబిని వచ్చెను. కంఠమునుండి సీలమండలవఱకు నెర్రనిచీర కప్పుకొని పాదములు, చేతులు, మొగముమాత్రమే కనుపించుచుండఁగాఁ బరివర్తితగ్రీవాభేదముతోఁ గూర్మహస్తములతో నామె రంగమున కవతరించెను. వచ్చుచునే—

"కథితసమయేపి హరి రహహ న యయౌ వనమ్
మమ విఫల మిద మమలరూప మపి యౌవనమ్
యామి హే! క మిహ శరణమ్?
సఖీజనవచనవంచితాహమ్.

అని విప్రలబ్ధనాయికానిరూపణము సాఁగించెను. తాళము, రాగము విషాదచ్ఛాయలు ప్రకటించెను. నటుఁడు "ఆలీ, యేల దుఃఖించెదవు? స్వామి యేల రాలేదో మొదట విచారించుము.

ఆయనయుఁ బాదములతో నడచి రావలయునుగదా! ఆయన నీవలెఁ జేలికగా నున్నాఁడా? ఎంతబరువు మోయుచున్నాఁడో! వదలిపెట్టి వచ్చుట యేమైన తేలికఁబనియా? రక్కసిముండకొడుకులు పట్టుకొన్నారు కాఁబోలును" అని యోదార్చెను. దేవదాసి "సరియా! సామియేల రాలేదందువు? ఇచ్చటికి వత్తునని నాతో వేయిమాటలు చెప్పినాఁడు. నన్ను నమ్మించినాఁడు. నే నిచ్చటికి వచ్చితిని. ఎందుకు రాలేదో? మొన్న నే నేమంటిని? అప్పటికోప మప్పుడే తీరిన దనుకొంటిని.

తోడి - త్రిపుట

ఏ మంటి నమ్మా! నాసామి నే మంటి నమ్మా!
కోమలాంగిరో! మువ్వగోపాలసామి నే నే మంటి?"

అని యామె యభినయించెను. నటుఁడు "ఔనమ్మా! నేను బలవంతముచేసి బతిమాలి యొట్టుపెట్టుకొని నిన్ను క్షీరసాగరములో బాలు చెట్లుకట్టిన యీ నికుంజములోనికిఁ దీసికొని వచ్చితిని. నీవు వెలతెలఁబోయి నాల్గుదిక్కులఁ జూచుచున్నావు. ఆయన నీమీఁద ముగ్ధ వని యలిగినాఁడేమో!" అనెను. దేవదాసి "చెల్లీ! ఆయనకోసము నామువ్గాత్రము వదలిపెట్టెదను. ఆ ప్రభువును దెచ్చెదవా? నాకు నచ్చినదానవుగనుక నీతో నింతయైన మాటాడుచుంటిని. లేనిచో నామాట బయటికి రాదు" అనెను. నటుఁడు "నే నాయనను వెదకి వచ్చెద నుండుము. మందరపర్వతముమోసి గూనుచేత నడువలేకున్నాఁడేమో చూచివచ్చెదను. నీ వింతలోఁ బ్రాణములు కంగారుపెట్టుకొనకుము!" అని వెదకుట నభినయించుచుండెను. దేవదాసి 'శివా! మహాదేవ! నీవు నాపతిని నన్ను సమకూర్చి పుణ్యము కట్టుకొనుము.

త్రియీవేద్యం హృద్యం త్రిపురహర మాద్యం త్రినయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరం
మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం
చిదాలంబం సాంబం శివ మతివిడంబం హృది భజే."

అని ప్రార్థించెను. నటుఁడు తిరిగివచ్చి 'ఏమమ్మా! స్వామి నీ కెచ్చటనైన గనిపించెనా' యనెను. గిరిక 'వెదుకఁబోయినది

నీవుక దే! నా కెట్లు కనిపించును? నీకుఁ గనిపించవలయు' ననెను. నటుఁడు 'అదిగో చివురాకు. స్వామి దాని వెనుక నుండియుండు' ననెను. గిరిక శుకతుండహస్తముతో 'ఇది బ్రహ్మాస్త్రము. నాపైని బ్రయోగించి రెవరో! నే నిం కెట్లు బ్రదుకుదును' అనెను. ముష్టిహస్తము [illegible]తో 'నింక స్వామి రాఁ' డనెను. శిఖహస్తముతో 'మన్మథుఁ డింత వేధించుచున్నాఁ డేమి' యనెను.

'మదనుగమనాయ నిశి గహన మపి శీలితం
తేన మమ హృదయ మిద మసమశరకీలితం'

అని మఱలనృత్యము చేసెను. రత్నగిరివీణాధ్వని ప్రయాణించి ప్రయాణించి రసాభిముఖముగా వేణునిస్వనముతోఁ గలిసి మాళవరాగమున లీనమయ్యెను. గిరిక యేదిచూచినను నసహ్యించుకొనఁజొచ్చెను. సంతాపము వృద్ధిపొందెను. ఆమె శివలింగహస్తమునుబూని 'నాగేశ్వరుఁడు నాయందు, బ్రసన్నుఁడు కాలే' దనెను. నాగబంధహస్తముతో 'నీపొదరింటిలో స్వామి యెచ్చట' ననెను. నటుఁడు 'స్వామి యిం దెచ్చటనైన దాఁగియుండెనందువా? ఆయన సంకేతస్థానమునకు రానే లే' దనెను. గిరిక—

'యామి హే క మిహ శరణం సఖీజనవచనవంచితాహం.'

అనెను. మఱల గజ్జెలు, తాళము, వీణావేణువులు కిణకిణకిణలాడెను. నటుఁడు 'సఖి! నీవు సఖీజనవంచితవు కావు. నాయందు దోషము లేదు. అతఁడే రాలేదు వచ్చెద నని యిందాఁక నమ్మా, నాతోఁ జెప్పినాఁడు' అనెను. గిరిక 'అట్లు చెప్పియే రాలే దా ప్రభువు?''

మమ మరణ మేవ వర మతివితథకేతనా
కి మితి విషహామి విరహానల మచేతనా ॥యామి॥

అని సంతాపబడెను. ఆమె సంతాపమును జూచి ధర్మారావు మనస్సులోఁ గష్టపడెను. సామాజికులందఱును రసనిమగ్నులై యుండిరి. ధర్మారావు మాత్రము దేవదాసినే చూచుచుండెను. ఆమె నిద్రామత్తములైన నేత్రములతో నావులించెను. ఒడలు విఱుచుకొనెను. హేమంతమున గాఢహిమపాతముచేఁ గొట్టఁబడిన మాలతీలతవలెఁ గంపించిపోయెను. ఏ దిక్కును జూడక కూర్చుండెను.

నటుఁ డనెను. 'ఏమమ్మా! అంతదుఃఖితురాల వైతివి! భర్త్రాగమన కారణములు విచారించుచుంటివా? నీవు పాపము, విప్రలబ్ధోత్కంఠల మధ్య నూఁగుచుంటివి. నీ కేదియుఁ బాలుపోవుట లేదు.'

(అసావేరి—త్రిపుట)

ఎందుకు పగచేసెనో, కమలజుఁ డీఁకనైన లెస్స వ్రాయఁడో
అందుకందుకు యీ చెలు లమరికతో నున్నారు
చందమామ యీ రేయి చల్ల నుండఁడే దైవమా! ॥ఎందుకు॥
పగవారితోఁ జేరెనో సామి మనసు
బాళిలేన ట్లాయెనో,
చిగురుఁబోఁడిరో వినవె చిన్ననాఁటి నాపైని
తగుమేలెల్ల నేఁడు దిగఁజేసెనో దైవమా! ॥ఎందుకు॥

గిరిక 'చెల్లీ! క్షీరసాగరబిందుచ్ఛటా! అన్నా! క్షీరసాగర తరంగా! బంధూ! పయోమాధుర్యమా! తల్లీ! క్షీరసాగరపు వెలుఁగా! దయచూడుఁడు. మేఘునివలె నల్లనైనవాఁడు, శంఖచక్రగదాపద్మములు నాల్గుచేతులఁ దాల్చినవాఁడు, మనిసి నాతినూలుఁడు, నాతి కృశుఁడు, నాత్యుచ్చుఁడు, నాతివామనుఁడు, సరిగా నాయీడు వాఁడు, నాకన్న నొకవ్రేలెఁ డెత్తుండునేమో! అతఁ డిచ్చటికి వచ్చి పోలేదుకదా! వచ్చి మీతో నేమైన చెప్పి వెళ్ళెనా?' అని యేడువ నారంభించెను. నటకావతంసుఁడైన భోగప్ప నిలిచి చూచెను. అది నిజమైన యేడుపుగా నున్నదిగాని యభినయముగా లేదు. ఆయన హృదయమునందుఁ జకితుఁడై,'తల్లీ! లెమ్ము లెమ్ము. స్వామిని నేను తెచ్చెదను.నీవు నేను వచ్చువఱ కుండవమ్మా! ఆ తెఱవెనుకనున్నాఁడేమో, పోయి చూచి వచ్చెదను' అనెను. గిరిక 'యీ ప్రబ్బలిచెట్లు నన్నుఁ జాల బాధించుచున్నవి. పాలసముద్రపుటడుగునఁ బ్రబ్బలి చె ట్లేమిటి? అనెను.

అహ మిహహి నివసామి ననిగణితవేతసా
స్మరతి మధుసూదనో మా మపి న చేతసా ॥యామి॥

భోగప్ప ధర్మారావుపద్దకుఁ బోయి, 'బాబూ! భక్తురాలింక నిలువలేదు, తెర దీయించు మందురా?' యనెను. ధర్మారావు 'చంద్రుఁ డీనాఁడు రెండఘడియ లాలస్యముగా వచ్చును. ఇంక

నొక్క గడియలోఁగాని చంద్రుఁడు దేవాలయమువెనుకకుఁ బోఁడు. ఆగడియయు నడువవలయుఁగదా! జాగ్రత్తసుఁడీ' యనెను. నటుఁడు పోయి'గిరికా'యని పిలిచెను, గిరికాయుసి యూకొను ధర్మారావుతప్ప మఱియెవ్వరును బిలువరు.ఆమె యలవాటుచేతఁ దలయెత్తిచూచెను. ధర్మారావుసంతోషించెను.ఆమె' ఓలీ! ఈయెండ యెచ్చటిది?అనెను. నటుఁడు సూచీహస్తముతో నడుగో సూర్య్య' డనెను. 'ఆహా! అతఁ డేమి బాధించుచున్నాఁడు!' అనెను. గిరిక 'సూర్య్యుఁడైనచో— బ్రాహ్మణు లర్ఘ్యము లిచ్చుట లేదు. వీఁడు చంద్రుఁడే.'

'రాజీవాక్షుల నేఁచు పాతకివి చంద్రా! రాజవా నీవు? నీ
రాజత్వంబున చక్రముల్ మఱియెనో? రాజిల్లి సత్సంతతుల్
తేజం బందెనొ?డిందెనో యహిభయోద్రేకంబు? తాఁ జెల్లరే
రాజై పుట్టుట రశ్మిసూత్రఫలమే రా జౌట దోషార్థమే?'

యని చదివెను. ఆ నటుఁడు 'ప్రియసఖీ! ఈ మాత్రము చీవాట్లు వానికి జాలును. నీ వింక దుఃఖమును మాని వినోదపడ వలయును' అనెను. గిరిక దీర్ఘనిశ్వాసము వదలెను. ఆలోచించుచున్న ట్లుండెను. కన్నీరు జార్చెను.

ఆహిరి—రూపక

నీకే దయరావలెఁగాక లేక దిక్కెవ్వరూ!
పాకశాసనవినుత మా వేణుగోపాలరాయ
నీ మనసు కరఁగి— ॥నీకే॥

నటుఁడు- అవునమ్మా! అది మంచితోవ. స్వామి సర్వాంత ర్యామి కనుక నీ క్షీరసాగరతరంగములలోఁగూడ నాయన లేక పోలేదు. ఆయన వినకుండను బోఁడు. గిరిక- ఓలీ! నే నె విరహవేదన భరించఁజాలకున్నాను. నిన్ననిమాత్ర మేమి లాభము?

కుసుమసుకుమారతను మతనుశరలీలయా
కటకాముఖ హస్తముతో—
నగపి హృది హంతి మా మతివిషమశీలయా ॥యామి॥

అని గిరిక మూర్ఛపడిపోయెను. భోగప్పశాస్త్రి—
హరిచరణ శరణ జయదేవకవిభారతీ
వసతు హృది యువతి రివ కోమలకలావతీ ॥యామి॥

అని గానము చేసెను. రత్నగిరిచేయి వీణానినాదమే మైపో యెను. తెరతీసిరి. స్వామియలంకారము ప్రత్యక్షమయ్యెను. భోగప్ప గారు గిరిక మొగముపైఁ బన్నీరు చల్లిరి. అతులో స్వామి నీకై కని పించినాఁడు, లె' మ్మనెను. ఆమె లేచి చూచెను. ముఖమంటపమునఁ జుట్టుఁ గట్టినగుండ్రనిసరసులో నేఁడు క్షీరము నించిరి. ఆ నదుమ నిజ ముగాఁ బెద్ద తాఁబేలును వదలిరి. స్వామిని గట్టుమీఁదఁ గూర్చుండఁ బెట్టిరి. ఆ సరస్సు మధ్య నాల్గు చిన్ని స్తంభములపై నొకపర్వతము పూవులతో, నారలతోఁ గట్టి, దానికిఁ ద్రాడు పోసి, యటునిటు బాల కులు పట్టుకొని నిలుచుండిరి. దానిసమీపమున ఛాయాశశిరేఖాయం ధతీరథంతరులు నిలుచుండిరి ఆలయధేనువు ప్రక్కను బారిజాతవృక్ష మునాటిరి. దేవదాసి నేత్రపర్వముగాఁ జూచెను. నటుఁ డారం భించెను:

క్షితి రతివిపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణిధరణకిణచక్రగరిష్ఠే
కేశవ! ధృతకచ్ఛపరూప జయ జగదీశ హరే!

గిరిక : 'నాన్యం వృణే పతి మశేషగురో రనంతాత్
త్వత్త స్సమ స్తగుణధామభి రాత్మతుల్యాత్
క్షేమం కదైవ గురుదేవ శిఖామణే! త్వాం
యాచే త్వదంఘ్రికమలే ప్రణతాస్మి నిత్యం.

సావేరి - ఆట

కాంక్షే తవ ప్రసాదం, గోపాలబాల! కేవల మేవాహం
అమితభాగ్యదాతార మతుల భూరివిస్తారం
కమనీయకరుణాకరం గోపాలబాల! ॥ కాంక్షే॥
త్వత్ప్రసాదం పరం కాంక్షే కృష్ణ! నాన్యంతు కామయే,
మనసా వచసా నూనం మత్పాణిగ్రహణం కురు. ॥ కాంక్షే॥

అని రుక్మిణీదేవివిన్నపము తానే చేసెను. చంద్రుఁ డ స్తంగ తుఁ డయ్యెను. ఎఱ్ఱనిచీరతోడి దేవదాసి తానుకూఁడ వెలుతురువలెఁ గానిపించెను. రంగమంతయు నలంకారము వద్దకుఁ బోయెను. అచ్చర లైన యరుంధత్యాదులు పారిజాత్యాదిలక్ష్మీదేవిగాని దేవదాసిని బరి సేవించిరి. ధర్మారావు పరిచారకులు సమూహమునకు వచ్చిరి. సముద్రము

నుండి పుట్టిన కామధేన్వప్సరప్రభృతులు దూరముగా నేఁగిరి. హరప్ప 'స్వామితోడి కూర్మమవై మందరపర్వతము మోసిన తాఁబేటిపడుచు నకు నీకు నమస్కార' మనెను. ధర్మారావు గిరిక చిబుకముపై చేయి వైచెను. అలంకారమువద్ద మోఁకరించియున్న యామె తలయెత్తి చూచెను. ధర్మారావు వరాహహస్తము పట్టెను. తర్జనీమధ్యమానామికలు మూఁడును గలిపి, బొట్టనవ్రేలి మొదటఁ జేర్చి కనిష్ఠికాంగుళి వదలి రెండు చేతులను గలిపి, బొట్టనవ్రేళ్ళను, కనిష్ఠికలను దగ్గఱగా నుంచి ప్రోథము, దంతము, కర్ణములతోడి వరాహముఖము వలె బహుకాలాభ్యస్తనిద్యవలెఁ బ్రదర్శింపఁబడిన ధర్మారావుహస్తమువంకనే భోగప్ప చూచెను. 'అహో! మహామంత్రి'' యనుకొనెను. ''ఎదురుగా స్వామి, సర్వగుణాలంకారశోభితుఁడు హరప్ప, ఇచ్చట ధర్మారావు, నృత్యము సర్వహావభావశోభితము, రసాంభోధి సాంగోపాంగమైన వేదమువలె భాసించుచున్నది'' యనుకొనెను.

దేవదాసి యింటికిఁబోయి స్నానముచేసి; పాలకడలినుండి బయటికివచ్చి, సముద్రకథావిస్మృతిఘటించుకొని, మఱల వరాహరూపమును ధ్యానించుచుండెను. శంఖచక్రగదాపద్మధారియుఁ గిరీటభూషితుఁడు, వనమాలాసుందరవక్షస్థలుఁడునైన వరాహమూర్తి యేకదంతాగ్రమున భూదేవిని లేవనెత్తుచున్నట్లు, సముద్ధరించుచున్నట్లు తద్దివ్యస్వరూపధ్యానమగ్నయై యుండెను. హరప్ప కూర్మావతారకథాసరిన్మజ్జనము కావించుచుండెను. ధర్మారావు రహస్యముగా నరుంధతితోఁ గలసికొని యామె నోదార్చుచుండెను. 'ఓసి యచ్చరా! దేవాలయములో నున్నంతసేపు బాగుగనేయుంటివి కదే! అందఱును నిద్రపోవువఱకును హృదయము బిగువుపట్టుకొంటివి కదే! ఇప్పు డింత యుద్వేగపడెద వేల? నాల్గు దివసుల క్రింద వఱకును లేచి కూర్చుండలేనిదాని కింతయోపిక యెచ్చటనుండి వచ్చినది? ఈ నిద్రావిహీనరాత్రిసమయములు, ఈ యుద్వేగములు ఈనిరాహారదివాపనయనములు నీయారోగ్యమునకు భంగకరములుగా నున్నవి. చెప్పిన వినవుగాని నీయొడలిలోఁ బ్రాణములుమాత్రమే యున్నవి' యనెను. అరుంధతి 'చాలుచాలు, ప్రాణేశ్వరుసముఁబ్రాణములుమాత్రము చాలవా'యని యామె కంఠముపూని వ్రేలాడెను.

ధర్మా—అతేండ్లకొడుకుగలపడుచున కింత యుద్వేగము పనికి రాదు. అరుం—నే నీనాఁడే క్షీరసాగరోద్భూతనైన యచ్చరను. నూత్న యౌవనను. ఊర్వశి పురూరవశ్చక్రవర్తినివలె నిన్ను వరించ వచ్చితిని ధర్మా—అచ్చర దేవతావారస్త్రీ. అరుం-నాకు సామ్యము దివ్యత్వసౌందర్యస్వచ్ఛప్రీతులయందు మాత్రమే. తన్నిషిద్ధవృత్తియందుఁగాదు. ధర్మా—ఇఁక నేను పోయి పండుకొందును. నీవు నిద్రపొమ్ము. అరు—నాకు నిద్రపట్టదు. తెల్లవాఱవచ్చుచున్నది. మీరు నాయొద్దనుండినఁగాని నాప్రాణములు నిల్చునట్లు లేవు. ధర్మా— నీవు రేపు నృత్యమునకు రావద్దు. అరుం— అంతకన్న బ్రదికియుండవద్దనుఁడు. ధర్మా—నీతో నన్నివిధములఁ జావుగా నున్నది. సరే కాని పిల్లవాఁడు నాల్గు నాళ్ళనుండి యెచ్చటను గని పించుట లేదేమి? అరుం—నాకును గనిపించుట లేదు.

ఇద్దఱును బోయి పండుకొన్నజనములో మధ్య రామేశ్వర శాస్త్రికోసము వెదకిరి. అతఁ డెచ్చటను గనిపించలేదు. ధర్మారావు తొందరపడెను. అరుంధతి 'వాని కేమి భయము? ఆలయములోనే పండుకొనెనో, కోటకుఁ బోయి పండుకొనెనో, యెచ్చటనో యొక చోట నుండును' అనెను. దీపముపెట్టి వెదకుటలోఁ జిన్నయరుంధతి లేచెను. ఆమె వారివెంటనే తిరిగెను. అరుంధతి యామెను బోయి పండుకొమ్మన్నది. 'నీవు మేల్కొనియుండఁగా నేను నిద్రపోదునా?' యనెను. అరుంధతి 'పోకేమి? నేను లేకుండ నీవు లేవా?' యనెను. ఆమె నేను లే దన్నది. ధర్మారావు 'మీనాన్నఁ జూచినచోఁ గోపించును. నీవుపోయి పండుకొ'మ్మనెను. ఆమె 'పండుకొనినను నిద్రపట్టదు' అని పోయి పండుకొనెను.

అందఱు నిండ్లకుఁబోయినతరువాత నృత్యముచేసినచోటఁ జాకలులు వచ్చి పఱపులు, తివాచీలు, చాపలు తీసివేసిరి. అచ్చట భోగప్పశాస్త్రి పై యుత్తరీయము పఱచుకొని పండుకొనెను. భోగప్పశాస్త్రికి నిదరపట్టలేదు. "మొత్తానికి మంచియూరు వచ్చితిని. చచ్చిపోయిన దనుకొన్న శాస్త్ర మిచ్చట బ్రదికియున్నది. పోయినాఁ డనుకొన్న రా జిచ్చట బ్రదికియున్నాఁడు. అయిపోయిన దనుకొన్న శోభ యిచట కనులు మిఱుమిట్లుగొలుపుచున్నది. భరత

ముని యిచ్చట చరితార్థుఁడైనాఁడు. ఒకరోజు వృథా పోయినది. రెండవరోజు తెలిసీ తెలియకుండఁ బోయినది. ఇంకఁ బోనిత్తునా? పోనీయను. ఇంక నాలురోజు లున్నవి. ప్రతిరోజు నెడద కత్తుకొందును. ఇదివఱకు నాచదివిన శాస్త్రమంతయు దుర్వినియోగము పొందినది. ఇంక నీ యాలురోజులును సద్వినియోగము చేసెదను. ఆలురోజు లాలుమెట్లు కట్టెదను. తరువాత నింకెన్ని మెట్లు కట్టవలయునో? నాపురాకృతభాగధేయము! "యామి హే! క మిహ శరణమ్" అని యూహించుకొనుచుండెను. అతనిప్రక్క నెవరో పరుండి బిగ్గరగా 'యామి హే క మిహ శరణమ్' అన్నారు. భోగప్పశాస్త్రి యులికిపడి యటునిటు జూచెను. చీకఁటిలో నెవరును గనిపించలేదు. లేచి వెదకెను. ఆ యరుగుచివర నొకఁడు పరుండెను. వాఁడు గాఢ నిద్రాశీలునివలె గోచరించెను. భోగప్ప 'యెవ రా పండుకొన్నది' యని యదలించెను. సమాధానము లేదు. మఱియు దగ్గరకుఁ బోయి మొగమున మొగ ముంచి చూచెను. ఎవరో పిల్లవాఁడుగాఁ గనిపించెను. ముట్టుకొని కదలింతునా యనుకొనెను. ఎవరైన శూద్రుఁడేమో ముట్టుకొనుట యెందు కనుకొనెను. భోగప్ప మఱలఁ బోయి పండుకొనెను. 'యామి హే! క మిహ శరణమ్' మఱల వినిపించెను. వీఁడు తన్ను వెక్కిరించుచుండెనా? తా నా మాట బిగ్గరగా ననుకొనలేదే! అట్లఁ డది మఱల ననుచుండెను. ఆ ధ్వని కలవరింతగా నున్నదికాని జాగ్రదవస్థలో నన్నట్లు లేదు. బ్రాహ్మణోచ్చారణ కాని తదితరోచ్చారణ కాదు. భోగప్పకు మనసు నిలువలేదు. పోయి యాకుర్రవానిని గదలించెను. నిద్ర లేపెను. కుర్రవాఁడు చాల సేపటికి నిద్రలేచి 'యేమి' అనెను.

భోగప్ప—'యామి హే! క మిహ శరణ' మేమిటి! కుర—యామి హే! క మిహ శరణ మేమిటి? భోగ—నీవు కలువరించుచున్నావు. కుర్రవాఁడు "ఎవరయ్యా నీవు? చక్కనికల పాడుచేసినావు, పోపో" యని వాఁడు నిద్రకుఁ బడెను. భోగ—ఎవరు నీవు? కుర—నేనా? నేనా?

కుర్రవాఁడు నిద్రపోవుచుండెను. భోగప్ప లాభములేదని పోయి పరుండెను. భోగప్ప యేదోయేదో యూహించుకొనుచుం

డెను. కుఱ్ఱవాఁడు మధ్యమధ్య మఱలఁ గలవరించుచుండెను. ఒకసారి 'పాలసముద్ర'మనును. ఒకసారి 'పొదరిల్లేమిటి' యనును. 'పాల సముద్రములోఁ బొదరిల్లేమిటి' యనును. 'ఇక్కడ కృష్ణుఁడు లేఁడు' అనును. భోగప్ప యనుకొనెను : "అహా! ఏమి నృత్యము! ఏమి సంగీతము! 'శిశు ర్వేత్తి. పశు ర్వేత్తి, వేత్తిగానరసం ఫణీ' అన్నాఁడు. శిశువునకు నీ సంగీతము హృదయాహ్లాదకర మయ్యె నని సాక్ష్యమ● వచ్చినది. ఈ కుఱ్ఱవాఁ డెవరో? ఎంతో భావనాబలము కలవాఁడు! శిశువులలో నింత భావనాబలము కలిగించుటలో నీ శిల్పమే సమర్థమైనది. ఈ శిల్ప మందు కనియే సృష్టిచేయఁబడినది. ఇది పెద్దవాండ్రకు మోక్షదాయకము. పసివాండ్రకు విద్యాదాయకము." బ్రాహ్మణునకు నిదురపట్టినది. మెలఁకువ వచ్చువఱకు బాగుగాఁదెల్లవాఱినది. సూర్యోదయమైనది. తనతోడనే బాలుఁడును లేచెను. భోగప్పశాస్త్రి 'నీ వెవరు నాయనా'యనెను. కుఱ్ఱవాఁడు భోగప్పను జూడకయే 'నీ వెవరు నాయనా'యనెను. అని తిరిగిభోగప్పనుజూచెను. చూచి'మీరా' యనెను. భోగ- న న్నెఱుఁగుదువా? కుఱ్ఱ- నిన్న మీరు హాస్యము చెప్పితిరికాదూ! భోగ- అవును జెప్పితిని. కుఱ్ఱ- అందుకనియే యెఱుఁగుదును. భోగ- నీ వెవరు నాయనా యంటివే. కుఱ్ఱ- మీ రనుకొనలేదు. భోగ- ఎవ రనుకొన్నావు? కుఱ్ఱ- ఎవఁడో కోఁతి యనుకొన్నాను. భోగప్ప కాశీదేండ్లయా కుఱ్ఱవానిమాటలు చూచి నవ్వు వచ్చెను. భోగప్ప యనెను. "నీవుమాత్రము కోఁతివి కాదా!" కుఱ్ఱ- (నవ్వుచు) కోఁతినే, కోఁతినే. భోగప్ప- నీవు కోఁతివి కాదు. బంగారపుఁదండ్రివి. కుఱ్ఱ- అయినచో నీ నాఁడు సాయంకాలము నీ దగ్గఱగాఁ గూర్చుండనిత్తువా? భోగ- నిన్న నెచ్చటఁగూర్చున్నావు? కుఱ్ఱ-మా నాయన గోపపడునని యా చివర కూర్చున్నాను. ఆయన కోపించినచో నీవు 'కాదా కుఱ్ఱవానిని నా దగ్గఱనే కూర్చుండఁ బెట్టుకొందు' ననవలయును. భోగ- మీ నాయనపే రేమి? కుఱ్ఱవాఁ డాలోచించుచుండెను. భోగప్ప 'యేమి టాలోచించుచుంటివి' అనెను. కుఱ్ఱవాఁ 'డేమియు లే' దని లేచి పోయెను. భోగప్పకు మఱీ యబ్బురమయ్యెను. అతఁ డనుకొనెను: ఇది యేదో యీయూరు మంచివేళ వచ్చినాము. ప్రవరాఖ్యునివలె

'మిన్నులుపడ్డచోటఁ బడలేదు' అని, పోయి, స్నానముచేసి వచ్చి, దేవాలయములోఁ గూర్చుండి, గాయత్రిచేసిచేసి రెండుగంటలవఱకుఁ జేసెను. వేవేపందిళ్ళలోఁ బ్రభువు బ్రాహ్మణసంతర్పణ చేయించుచుండెను. అచ్చటికిఁ బోయి భోజనము చేసెద నని భోగయ్య చెప్పఁగా-రత్నగిరి యాయనభోజనముమాట విచారించ లేదు. ఆయన రెండైనది, మూఁడైనది, నాలుఁగైనది భోజనమునకుఁ బోలేదు. అట్లే జపముచేయుచుఁ గూర్చుండెను. అర్చకుఁడు వచ్చి 'యయ్యా! భోజనమునకుఁ బోరా' యనెను. ఆయన 'తొందర యేమి' యనెను. అట్లే కూర్చుండెను. ప్రొద్దుక్రుంకువేళకు మఱల నా కుఱ్ఱవాఁడు వచ్చెను. భోగప్పశాస్త్రి దేవాలయసరస్తీరమున సంధ్యావందనము చేయుచుండెను. కుఱ్ఱవాఁడు దూరముగ నిలుచుండెను. వాని మొలకు గోచిమాత్ర ముండెను. ఎప్పుడును జికిరిబికిరి తలయే. భోగప్ప యతని జూచి, సంధ్యావందనము ముగించి వచ్చి 'యిప్పు డప్పుడే వచ్చితి వే' మనెను. కుఱ్ఱవాఁడు 'నే నెప్పుడు నిచ్చటనేయుండెదను' అనెను.

భోగ- పగలెల్ల లే వేమి? కుఱ్ఱ- మాకుఁ బగ లా దేవుఁడు; రాత్రి యీ దేవుఁడు. భోగ- ఆ దేవుఁ డనఁగా నాగేశ్వరస్వామి వారా? కుఱ్ఱ- కాదు, కాదు. బిళ్ళంగోడీవారు. భోగ- వారిని నీవు బాగుగా నెఱుఁగుదువా? కుఱ్ఱ- ఎఱుఁగుదువా? వారి వెంటనే యాకాశముమీఁద పోదును. ఒకటి, రెండు, మూఁడు, నాలుగు, పది. భోగ- నాలుగు తరువాత పదియా! ఐదు. కుఱ్ఱ- అయినచో నావద్ద నైదుకోఁతు లున్నవి. నే నొకటి- ఏఁడుకోతులు. భోగ- ఆటే. కుఱ్ఱ- ఎన్నో అన్ని, లెక్క లేదు, కోఁతులు. వానిని నేను రోజును నాడించెదను. మేము లంకాదహనము చేసెదము. సముద్రాలు దాఁటెదము. పండ్లు తినెదము.

కుఱ్ఱవాఁ డాలోచించెను. పడలిపోయెను. భోగయ్య యీ కుఱ్ఱవాఁడు తండ్రిపేరు చెప్పఁ డేమి యని యనుకొనెను. వెళ్ళినాఁ డనుకొన్న కుఱ్ఱవాఁడు తిరిగివచ్చి "మఱచిపోఁగూడ" దని తర్జని చూపించి కన్నులు పెద్దవిచేసి మఱల వెళ్ళిపోయెను. అతనియర్థము భోగప్పకుఁ దెలిసెను: "ఇతడు నావద్ద గూర్చుండును. అతని నెవరు

వల దన్నను 'కాదా కట్టువాఁడు నావద్దనే కూర్చుండవలయు' నని నే ననవలయును" అని భోగప్ప యనుకొనెను. భోగప్పశాస్త్రికిఁ బ్రొద్దుటినుండి లేనియాఁకలి యొక్కసారి చెలరేఁగెను. సంతర్పణ సేయుచోటికిఁ బోయెను. అచ్చట భోజనములకుఁ బ్రయత్నములు జరుగుచుండెను. ప్రొద్దుటినుండి భోజనముచేయక తా నిప్పుడు భుజించినచో శరీరము స్వాధీనము కాదు. కంఠము లేవదు. బజారునకుఁ బోయి యరఁటిపండ్లు కొని తినవలయు ననుకొనెను. చేతిలో డబ్బు లేదు. పోయి రత్నగిరిని నడుగవలయునా? ఉపవాస ముండి రత్నగిరి యింటికిఁ బోవునా! దేవదాసి యున్నచోటికిఁ బోరాదా? కాదని దేవాలయమునలోనికిఁ బోయెను. అర్చఁ డాయనను జూచి 'యేమండీ శాస్త్రిగారూ! భోజనమే చేయున ట్లున్నదే' యని మూఁగిన నాల్గ రఁటిపండ్లును, రెండు నారింజకాయల నిచ్చెను. భోగప్ప వానిని విష్ణుప్రసాదమేకదా యని యారగించి సరస్సులోనికిఁ బోయి పది పుడిసిళ్ళు నీరు త్రాగెను. అతని సర్వాంగములయందును శక్తి నెక్కెను. శరీరము లఘువుగా నుండెను. మనసులో నుత్సాహము ద్విగుణమయ్యెను.

దశమినాఁటివెన్నెలలు వచ్చెను. ప్రతిదినమును జూచుచున్న మనిసి చిక్కెనో, బలిసెనో తెలియదుగాని కొన్నాళ్లైనతరువాతఁ జూచుచోఁ దెలియును. దశమితో వెన్నెలలు బలిసినట్లు తెలిసెను. అష్టమినాఁటికే శుక్లపక్షవికాసము పూర్తిగా వచ్చును. మఱి రెండు కళలు పెంచుకొన్న చంద్రుఁడు దశమినాఁటికి జం:దకళవలెఁగాక చంద్రునివలెనే ప్రకాశించెను. ఈ చంద్రుఁ డుద్దీపన విభాగముగ స్వాధీనపతికలు శృంగారరసమునంతయుఁ జూఱగొందురు. ఇతఁడు కిరీటము సగము మొగముమీఁది కావరించఁగా మిగిలియున్న పద్మినీ జాతిస్త్రీముఖమండలమువలెఁ బ్రకాశించెను. చకోరములకు విందుపెట్టి యాకాశమన్న భూమియన్న రెండొడ్డులకు మోసిప్రవహించుశరన్నది వోలె, వెన్నెలకాలువయొడ్డునఁ బూచిన తామరపూవువలె, వెన్నెల యన్నతామ్రపర్ణీనదియొడ్డునకుఁ ద్రోసిన జాతిముత్యమువలె, నొడ్డునఁ బూచిన తెల్లకలువవలె నొదిఁగి యొదిఁగి మాధ్వములు నించుకొనిన యింతవెన్నెల తననుండి నిర్గమించినదా? తాను ప్రాదేశమాత్రుఁడు.

జ్యోత్స్న రోదోంతరాళమంతయు నిండినది. కారణాల్పత కార్యాధిక్యత విశేషజ్ఞు లొప్పుకొనరు. మఱి యింత వెన్నెల యెచ్చటనుండి వచ్చినది? ఇది యెచ్చటిదో విజ్ఞానము లోక మావరించినది గాని వెన్నెలగా లేదు. ఈవిజ్ఞాన మెచటినుండి వచ్చినది? శ్రీవేణుగోపాల దేవునినుండి సముద్భవించినదో! ఆ ప్రభువు సముదితానందమయ హృదయకుహరమునుండి వెలికి వెల్లువయై ప్రవహించినదో! ఆయన క్రొంబెదవిచిటిలి మందహాసము వినిర్గమించి యది బహుగుణమై దిగ్దిగంతములదాఁక త్రవ్వుకొన్నదో! ఈ వెన్నెలమాత్రము చందమామనుండి రాలేదు. ఒకవేళ నతనినుండియే వచ్చిన దందును. ఇతఁడు స్వామికాలిగోటి కున్నంత ప్రకాశమునుకూడ లేనివాఁడు. ఇతఁడు స్వామిపాదకాంతిలో నొకపాదమునుండి పుట్టినవాఁడు. ఇంతవెన్నెల స్వామినుండియేపుట్టెను. ఒకవేళ నీ వెన్నెలలోని తెల్లఁదనముమాత్ర మితని దేమో? తద్గతప్రసన్నతాగుణము, తద్గతవిచిత్రవిజ్ఞానస్ఫురణ-జడజుఁ డితనినుండి యెట్లు పుట్టెను? ఈ వెన్నెల నితనిని జూచినచోఁ బెద్దసాలీనిగూఁడును, నడుమనున్న సాలీఁడును జ్ఞాపకము వత్తురు. ఇంత పట మేల యల్లినాఁడు? ఇరుల పుర్వులఁబట్టి యిందు మడియుటకుఁ గాబోలు! ఈ దారములలోఁ జిక్కినచీఁకటిపుర్వులమీఁద చంద్రుఁడు వచ్చి వాలి, వానిని నాశనముచేయ నక్కఱలేదు. దారములలోఁజిక్కి వానియంత టవియే హరించిపోవుచున్నవి. మహాటవులలో దయ్యపుసాలీఁ డుండునఁట. అది ప్రేనిన మ్రోకువంటి దారములలో సింహశార్దూలాది మృగములే పడి మడియునఁట. ఈ చంద్రుఁ డటువంటివాఁడు. పిండి యారఁబోసినట్లు దేవాలయమంతయు దెల్లనయ్యెను. పఱచిన పఱపులు వెన్నెలలోఁ బఱచినట్లే కనిపించలేదు. తోఁపు రంగద్ది మైకాపూవులు దిద్దిన ఖద్దరుగుడ్డలతోఁ గుట్టిన యొరుగుబిళ్ళలవలనఁగాక నచ్చట పఱపులు వేసి రనియే తెలియదు. దేవాలయమంతటను జూచుచుండగనే రెండువందల కాగడాలం వెలసినవి. తెల్లని వెన్నెలకు నెఱ్ఱనికాగడాలవెలుతురుకును యుద్ధమయ్యెను. పలపపోయినవారే యెఱ్ఱవారు. తాత్కాలికజయము వారికే యైనది. ఏనుఁగుమీఁదినుండి దిగి ప్రభువు వచ్చి యాసనమలంకరించెను. సర్వజనులును గ్రిక్కిరిసిపోయిరి. రంగమంతయు సర్వ

పాత్రలతోను సంభృతమయ్యెను. ముఖమండలమున స్వామికి వరాహావతారాలంకారము చేయఁబడియుండెను. నిర్దళితమైన హిరణ్యాక్ష కళేబరస్రవద్రక్తధారవలె వసంతము పోయఁబడి యుండెను. స్వామి యుత్సవవిగ్రహమును రాతి పొడిగించి తదగ్రభాగమున భూమ్యాకృతిగా నొక గోళము నిలువఁ బెట్టఁబడెను. ఆగోళమంతయుఁ బచ్చిమట్టితోఁ జేయఁబడి దానినిండ నెడములేకుండ తీఁగెలు, నాకులు, పూలు, పండ్లు, గ్రుచ్చఁబడియుండెను. తక్కిన ముఖమంటపమంతయు నల్లనిగుడ్డలు పఱచి, వానిమీఁదఁ దెల్లనిపూలు కుట్టబడియుండెను. అది యనంతమైన నీలాకాశము. పూలన్నియు నక్షత్రములు. అనంత గోళములు. ఆ మహాకాశమ్మున మధ్యభాగమున నాదివరాహమూర్తి నిలుచుండి యణగిపోవుచున్న భూమిని దన దంష్ట్రాగ్రభాగమునఁ బైకి నెత్తెను. ఆకాశమున నక్షత్రములైన ముఖమంటపమున మనిసి నిలుచుటకువీలులేక ముఖమంటపాంతిమ భాగముల నిలుచుండి కాగడా లెత్తిపట్టిరి. స్వామి యున్న యెడకుఁ జక్కగాఁ గాంతులు రాక, విగ్రహ మున్న భాగమున వెలుగులు కొంచెము తక్కువగా నుండెను. ఈ యనంతమహాకాశమున గోళములిచ్చు వెలుఁగుగాక వేఱే వెలుఁగే మున్న దన్న ట్లుండెను. ఆదివరాహమూర్తినిజూచినంత నే నటుఁడు—

'వసతి దశనశిఖరే ధరణీ తవ లగ్నా
శశిని కళంకకళేవ నిమగ్నా
కేశవధృతసూకరరూప జగదీశ హరే!'

అని పాడెను. మంగళాచరణ మదియే. నాట్యారంభ మదియే. నటుని యుపజ్ఞకు రత్నగిరి యబ్బురపడెను. గిరిక పాదము వెండిగజ్జియలతోఁ గిణకిణలాడెను. మంగళాచరణ మైనంత నే యామె—

ఆట – జంపె

జయజయ రమానాథ జయజయ ధరానాథ
జయజయ వరాహపురి శ్రీ వేంకటేశ జయజయ
నిగమగోచర నిత్య నిర్మలానందఘన
విగళితమహామోహ విమల విజ్ఞాన
ఖగయానసంచార ఖండితాసురనికర
సకలగుణ సంపన్న సత్య పరిపూర్ణ ॥జయజయ॥

ఈ తరంగ మెత్తుకొని నాటరాగముతో వినుచున్న ప్రీతి హృదయమును నాత్మానవధిగా స్మృశించెను. జంపెతాళము చకచక లాడెను. ఆమె స్వాధీనపతికయై తరువాత వనవిహారాదులు, పరస్పర లిప్తగంధాగుర్వాదులు,నర్మభాషణములు, క్రీడావిలాసములు, ద్యూత రచనలు, పణాదానవేళాపరస్పరాకృష్టచేలాంచలములు, జంకించు టలు, బెదరించుటలు, బతిమాలుటలు, పరస్పర గాఢాలింగనములు, కచగ్రహణములు, పాదానతులు, భ్రూవిలాసచాలనములు శృంగార రసమంతయు నొలకించిపోసెను. స్వామికిఁ గోపమువచ్చి పెడమోము తిరిగి పండుకొనెను. ఆమె బతిమాలినది, కసరినది, ఉత్తరీయము కొంగు పట్టి లాగినది. స్వామి కది కోపము కాదు, కోపాభినయము. మఱలఁ దాను కోపము నభినయించినది. స్వామి బతిమాలెను. గడ్డము పుచ్చుకొన్నమిషచేతవలెఁ జెక్కిలి నొక్కెను. హారములు సర్దుచున్నమిషతో వక్షోమండల మంటెను. నీవు నాయంత యెత్తున నుంటివా యని ప్రక్కన నిలుచుండి శరీరమును శరీరముతోఁ దాఁకి పులకలు భజించెను. నాచేతికన్న నీచేయియే పొడుగువలె నున్నదే యని చేతులు మెలివేసెను. జడలోఁ బూవులు పెట్టెద నని తీవ్ర ముగాఁ గచాకర్షణము చేసెను. ఆమెకుఁ గోపము వచ్చినది:'అబ్బా! మోటుతనము! అసలు పురుషులే మోటు. అందులో నీ యవతా రము చెప్పవలయునా!' అని యీరస మాడెను. ఎట్టివారికైన నున్నమాట యన్న నులు కెక్కువగదా! స్వామికిఁ దనవరాహాకృతిఁ దడవినంతనే కోపమువచ్చినది. మఱల నటు తిరిగి పండుకొనెను. దేవదాసి పాడెను:

కన్నడ – త్రిపుట

ఇటువంటి నావల పేమి కాఁబోయె నమ్మా!
చిటుకునున్నఁ గోపముచేయు మువ్వగోపాలునిపై ॥ఇటు॥
వచ్చినప్పుడు నేనే వద్దికి పొయ్యేది కాని
ఇచ్చటికి రారమ్మనే దెన్నఁడైనను. లేదుగా!
నిచ్చనిచ్చలు లాలించి నే నలను కొనేదేగాని
గ్రుచ్చి వాఁడు కౌఁగిలించుకొనే దెన్నఁడు లేదుగా ॥ఇటు॥

స్వామి తిరిగి 'యోసీ! యబద్ధము లెందు కాడెదవు? నేను చేయుపనులన్నియు నీవు చేయునట్లు చెప్పుచుంటివి' అని బుగ్గమీఁదఁ బొడిచెను. దేవదాసి పరివర్తితగ్రీవయై, చతురభ్రూవిలాసయై శృంగార దృష్టిభేదయై మృగశీర్షహస్తముతోఁ జెక్కిలి జూపించెను. భోగప్ప శాస్త్రి మనసులో మహానందమగ్నుఁడయ్యెను.

యతో హస్త స్తతో దృష్టి ర్యతో దృష్టి స్తతో మనః
యతో మన స్తతో భావో యతో భావ స్తతో రసః.

అన్న శాస్త్రార్థమునకు నుదాహరణముగానున్న యామె సర్వాభినయమునకు నచ్చెరువడెను. ఆమెయభినయ మొక్కొక్కరి కొక్కొక్కరీతిగా నుండెను. హరప్పనాయనికి సర్వమది లక్ష్మీనారాయణుల సంభోగశృంగారమువలె నుండెను ధర్మారావునకు దేవదాసిసాధనలలోఁ జాల నున్నతమైన సోపానముమీఁద నున్న ట్లనిపించెను. భోగప్పశాస్త్రికిఁ గొంతసేపభినయ మనిపించును, కొంతసేపు భక్త్యావేశ మనిపించెను. అతని ప్రక్కఁ గూర్చున్న గుజ్జువానికి సర్వము నదియొక స్వర్గ మనిపించుచుండెను. ఇది యేమో యెన్నఁడును జూచినది కాదు. వెన్నెలలు, కాగడాల వెలుతురు, సర్వాభరణభూషితయైన దేవదాసి, వీణ, మద్దెల, తాళములు, విచిత్రములైన పరిహాసోక్తులు, అనునయములు, వీనితోడి భోగప్పశాస్త్రి, తండ్రి యేమనునో యన్న భయము, కుజ్జువానిహృదయము సర్వభావసమ్మిళితమై యుండెను. తక్కిన సభాసదులందఱును జూచుచుండిరి. కొందఱి కర్థము కాలేదు. కొందఱికి గిరికాశరీరలాఘవమే తెలిసినది. అత్యున్నత ప్రకృతులకు నొకరిద్దఱకు సంభోగశృంగారమునకును, మహానందమునకును భేదము లేనట్లు తోఁచినది. వెన్నెలలు దేవదాసి కిరీటముపైఁ, గనుఱెప్పలపై, ముక్కుపుడకలపైఁ, గపోలములపై జెవిదుద్దులపై, నామెనల్లనిరవికపై, బంగారుపూలపై, నామెచేతి గాజులపై, వ్రేళ్ళయుంగరములోని ఱాళ్ళపై, నొడ్డాణముపైఁ, బచ్చని చీరజరీయంచుపై, నొడ్డాణపు గజ్జలపై, నొడ్డాణమునం దున్న యద్దములపైఁ, గాలివెండిగజ్జెలపైఁ, గాలిమట్టెలపైఁ, బిల్లాండ్లపై, నామెకొప్పులోఁ జెఱివినమల్లెపూలపైఁ దళతళలాడెను. తగిలి చిటిలిపోయెను. నదీప్రవాహము గిరికోణాఘాతమునఁ బగిలి, లేచి, బిందు

వులుగాఁ జెదరిపోయినట్లు చెదరిపోయెను. తగిలి యొక్కొక్కచోటను గాంతిలో రెట్టింపై పదిరెట్లై ప్రవికసత్సితకల్హారరజఃపాళీపరిరమ్యము లయ్యెను. గిరిక నృత్యముచేసినప్పుడు వెన్నెల లామెయొడలిపైఁబడి గోటితో నీరు విదలించినట్లు పై కెగిరిపోయెను. ఆమె యభినయము చేయుచున్నప్పుడు తనవయవభూషలపైఁబడి కాంతులిచ్చి పుచ్చుకొనెను. ఆమె గ్రీవాభంగము చేసినప్పుడు చెక్కిళ్ళపైఁ బారాడెను. ఆమె దృష్టిభేదము చూపించినప్పుడు కంటిచూపులలోఁ గలిసిపోయెను. చేలాంచలమువిదలించినప్పుడు నావతెరచాపలో గాలిపోసికొనినట్లు పోసికొనెను. ఆమె పాదవిన్యాససమయమునఁ దత్పాదరజోలోభమునవలె గాలియంచులఁ బారాడెను. పండినగేదంగిపూవుపొట్టలోని క్రొత్తరేక తెల్లదనములకుఁ దోడివిద్యార్థులైన యామెచెక్కిళులమీఁద వెన్నెలలు పడి కందపుఁబూతలలోఁగలిసినడాగురేకుపొడులు మెఱపించి యామె మొగమున సహస్రచంద్రోదయములు కల్పించెను. సభ్యులసమ్మోహదృక్పాతముచేత వాయువీచికలు నిస్తబ్ధము లయ్యెను. మృదంగ తాళ వేణు వీణానిస్వనము, గిరికా మధురకంఠస్వరము, గజ్జియల సవ్వడి, కంకణముల యులివు నొకదానితో నొకఁడు లీనమై సర్వమును వరాహావతారాభిముఖముగా నడచెను. గోపాలస్వామి యా వెనుకనుండిబంగారపుమైముఱుఁగువాఁడు, కప్పుమేనుకప్పుకొన్నవాఁడు తనయవతారము తాను చూచుకొనుచుండెను. అన్నియవతారముల ననుసరించి వచ్చుచున్న గిరికాముఖమండలమును జూచెను. ఆమె దృష్టియందుఁ బృథుత్వమే గోచరించెను. స్వామికన్నులచ్చటినుండి వదలి యామెవక్షోమండలమును గాంచెను అచ్చటను బృథుత్వమే గోచరించెను దిగి జఘనభాగమునకు వచ్చెను. అచ్చటను బృథుత్వమే గోచరించెను. ఆకు పచ్చనిచీర సస్యశ్యామలత్వము, ఘనవక్షోజములు గిరిసహితత్వము, తదగ్రస్థనీలకంచుకము మేఘత్వము, దానిపైని బఁగారుపూలు సౌదామనీత్వము, తచ్ఛరీరలావణ్యము నదీత్వము, రాజజఘనభాగము పులినత్వము, పాదములు కూర్మములు, కన్నులు మత్స్యములు-లేళ్ళు, నాసిక సంపంగి, శ్రవణములు శిరీషములు, చెక్కిళ్ళు గేదంగులు, బాహువులు హస్తములు - తామరతూడులు తామరపూలు, శిరోజములు శైవాలము, ఊరువులు

కదళులు, జంఘలు వరివెన్నులు—గిరిక పృథివీసంపూర్ణస్వరూపము వలె గోచరించెను. తనవరాహావతారమునకు, నామె భూదేవిమహావతారమునకు, నామె స్వాధీనపతికాత్వమునకుఁ, దన యనుకూల నాయకత్వమునకు, భక్తజనహృదయాహ్లాదమునకు గుడిలోనున్న స్వామి గుడిలోనుండియే గుమ్మటిలిపోయెను.

చంద్రుఁడు దేవాలయమువెనుకకుఁ బోయెను. గిరిక రత్యావసానవేళామహానందసూచకముగా గానముచేసెను.

కురు యదునందన చందనశిశిరతరేణ కరేణ పయోధరే
మృగమదపత్రక మత్ర మనోభవమంగళకలశసహోదరే
సరసఘనే జఘనే మమ శంబరదారణవారణకందరే
మణిరశనావసనాభరణాని శుభాశయ! వాసయ సుందరే ॥కు॥

అర్చకుఁడు కుంభహారతి తెచ్చి సభాసదులకుఁ జూపించెను. అందఱును జోహారులు చేసిరి. మద్దెలమీఁద తకధిం తకధిం మ్మని చివరిమ్రోత మ్రోఁగెను. గజ్జెలు చివరసారి కిణకిణ మనెను. వీణతంత్రి చివరసారి తుమ్మెదమ్రోఁత మ్రోఁగెను. రంగమంతయు నలంకారపర్యంతము నడిచెను. హరప్పయు, ధర్మారావునుసమీపమునకుఁ బోయిరి. హరప్ప 'వరాహమూర్తితో భూదేవతవైన నీకు నమస్కార' మనెను. ధర్మారావు స్వామియలంకారమువద్ద మోకరించియున్న గిరికనుబిలిచి యెడమచేత సింహముఖహస్తమును, కుడిచేత పతాకహస్తమును బట్టెను. భోగప్పశాస్త్రి యప్రయత్నముగా:

అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్నికీలలం
దెడరుల నెల్ల మాకు నుతికెక్కఁగ దిక్కగుఁగాక శ్రీనృసిం
హుఁడు సురశత్రుయూథపవధోగ్రుఁడు విస్ఫురితాట్టహాసవ
క్త్రుఁడు ఘనదంష్ట్రపావకవిధూతదిగంతరుఁ డప్రమేయుఁడై !

యని శ్రీరాగమున మధురకంఠనినాదముచేత వాయువీచికలు తరంగితములు చేసెను. అప్పుడే దలసూపుచున్న చీఁకటులు సంగీతనినాదములు తమలోఁ దాము హరించుకొనినవి. ఏనుగుమీఁద బంగారు హౌదా నెక్కి రెండువందల కాగడాలతో ప్రభువు దుర్గాభిముఖుఁడై పోయెను. హరప్పనాయఁడు వరాహావతారకథానిమగ్నమనస్కుఁడై యుండెను. భోగప్పశాస్త్రి నిరాహారుఁడై మఱలఁగట్టువానితో వేఁగు

చుండెను దేవదాసి స్నానముచేసి పద్మాసనాసీనయై మఱల ధ్యాన మగ్నురా లయ్యెను. అరుంధతీధర్మారావులు కాలయాపన చేయు చుండిరి. చిన్నయరుంధతికి నిద్రపట్టలేదు. కడచినరాత్రి యామె యరుంధతీధర్మారావులసంచారము చూచి వారియందే బద్ధమనస్క యై మేల్కొని యుండెను. వా రిరువురు కలియుచోటు చూచి వారు తనకుఁ గనిపించులాగున బందుకొనెను. అందఱును నిద్రపోవుచుండిరి. గదిలో ధర్మారావు కూర్చుండెను. ప్రక్క నరుంధతి యతనికంఠమున జేతులు పైనవైచి కూర్చుండెను. చిన్నయరుంధతికిఁ దా నట్లు కూర్చుండవలె ననిపించెను. ధర్మారావు 'నీవు నేఁడు కొంచెము శాంతముగా నున్నావు. కారణ మేమి?' యనెను. అరుంధతి ధర్మారావును గౌఁగిలించుకొని యతనియొడిలోఁ బందుకొనెను. "మన యిద్దరకు నభేదముగా నుండవలయును. మీతో విడిగానున్నచో నే నీ వియోగబాధ నోర్వలేను. ఇర్వురమును గలిసిపోయినచో నేను మీ రను భేదములేని దానిలో నానంద మేమి యున్నది? దీపము వెంట నీడవలె సుఖమువెంట దుఃఖ మున్నది. రెంటిని జతచేసి యను భవించవలయును" అనెను. చిన్న యరుంధతి వచ్చి యరుంధతి ప్రక్కను గూర్చుండెను. వా రిరువురు నొకచిన్నమహాతన్మయత్వ స్థితిలోఁ గనులు మూసికొనియుండిరి. చిన్నయరుంధతి వచ్చినసంగతి వారికిఁ దెలియదు

అరుం - నేను చాలదినము లింక బ్రదుకను. నాయందు జీవించు లక్షణములు నాకుఁ గనిపించుట లేదు. ఇంత యుద్వేగముకల మనస్సు నే నెట్లు పట్టుకొందును? ఇది నామాట వినుటలేదు. ధర్మా- నీవు పోయినచో నా కరుంధతి యేది? చిన్న యరుంధతి నవ్వెను. వా రిర్వురును గన్ను తెఱచి చూచిరి. అరుంధతి చిన్నపడుచునుజూచి 'నీ విచ్చటి కేల వచ్చితి' వని యామెను గౌఁగిలించుకొని, 'ఈమెను జూచినచో నాకు మిక్కిలి ప్రేమగా నుండును. ఎందుచేతనో తెలి యదు. నాయందువలె మీ రీమెయందుగూడఁ బ్రేమ చూపించవల యును' అని యామెను తమయిద్దఱిమధ్యఁ గూర్చుండఁబెట్టుకొనెను.

ధర్మా- నీవు నాకు నర్ధశరీరమవు. నీవలె నీమె నెట్లు చూడఁ

గలనో తెలియలేదు. అరుం- నేనుపోయినతరువాత మీ రీమెను వివాహముచేసుకొనవలయును.

చిన్నయరుంధతి తలయెత్తి కొంతసే పరుంధతివంకఁ, గొంత సేపు ధర్మారావువంకఁ జూచెను. ధర్మారావు 'ఇంటికి వచ్చిన స్నేహితులపిల్లనుగుఱించి యీయమెయందు దుర్భావములు కలిగించుట మహాదోషము. అరుంధతి! నీవుపోయి పరుండు' మనెను.

అరు- నీవు పోయి పరుండవద్దు. మీ కీమె బ్రహ్మచేత వ్రాయఁబడిన భార్య. ఆమెను మీ రెట్లు కా దందురు? ధర్మా-ఒక వేళ నైనను నీమె కన్య. ధర్మశాస్త్రకర్తలు 'న కన్యాం' అని తత్స్వర్శననిషేధము చేసిరి. అరుంధతి-అచ్చటఁ గన్య యనఁగా ననిర్దిష్టస్త్రీ. ఇతఁడు భర్త యని నిర్ణయింపఁబడని బాలిక యని యర్థము. ధర్మా- నీవు స్మృతివ్యాఖ్యాత్రి వగుచున్నావు. మన మీ కూర్చుండుట యెవ రైనఁ జూచినచోఁ బాగుగా నుండదు. అరుంధతిని బంపివేయుము. అరుంధతి- చెల్లెలా! నీ వెవరిని బెండ్లియాడెదవు?

చిన అరుంధతి 'ఈయననే' యని ధర్మారావును నడుమునందుఁ గౌఁగిలించుకొనెను. అతఁడు వదలించుకొని వెడలిపోయెను. అరుంధతులిద్దఱును నవ్వుకొని యాపందిరిమంచముమీఁదఁ బరుండి నిద్రించిరి. అంతలోఁ దెల్లవారినది. కాకులు కూసెను. ప్రాతస్సంధ్యారుణిత సూర్యబింబము సహస్రశకలములై ప్రతిశకలము నొకబింబమై పండిన మఱ్ఱికాయలవలె న్యగ్రోధవృక్షమునఁ బ్రకాశించెను. తెల్లని యెండలు నాల్గుదిక్కుల వ్యాపించెను. ప్రొద్దెక్కెను. పగటివేషాల వారు ధరించినవేషములచేఁ, బలికినమాటలచే జనులను సమ్మోహితులఁ జేయుచుఁ దిరుగుచుండిరి. ఆ నాఁ డేకాదశి. భోగప్పశాస్త్రి మఱల స్నానముచేసి, యాలయములోఁ గూర్చుండి గాయత్రి జపించుచుండెను. ప్రొద్దు గ్రుంకినది. ఆ నాఁడు బ్రాహ్మణసంతర్పణ లేదు. మఱునాఁ డుదయమున ద్వాదశిపారణయే కాని యానాఁ డందఱు నుపవాసములే. సాయంకాలమున రెండు దేవాలయముల యందును ధ్వజారోహణములు చేయఁబడెను. పారాణితో ధ్వజపటముపై నందీశ్వరునిబొమ్మ వ్రాయఁబడి బంగరుతొడుగులచేత మిలమిలలాడు ధ్వజస్తంభముగంటలు గజ్జె లున్నయెడకుఁ బట మూరో

హింపఁజేయఁబడెను. ఆంజనేయస్వామివిగ్రహముతో ధ్వజపటము వేణుగోపాలస్వామియాలయములో నారోహించెను. వెన్నెలలు విజృంభించెను ఏకాదశీజ్యోత్స్నాతరంగములు వెల్లివిరిసి సర్వవస్తువులను బవితముగాఁ గనిపింపఁజేసెను. కోటలోనుండి హరప్పగారు కొన్నియేనుగులలోఁ బెద్దదానిమీఁద నంబారి కట్టించి, దానికి శత్రుఘ్నుఁడను పేరుపెట్టి, తా నధిరోహించి, రెండవయేనుగుమీఁదఁ బల్ల నమర్పించి, దానిపై రాధాకృష్ణయ్య సర్వారాయలను గూర్చుండ నియమించి, ముసలియేనుఁగు నూరకే వెంటనే రప్పించుచుఁ బదిగుఱ్ఱముల మీఁద రాజబంధువులు, పెద్దకాసాలును గదలిరాఁగా బెజవాడపోవు రోడ్డువెంటఁ బట్టణ బహిఃప్రదేశమునకుఁ బోయెను. ధర్మారావును, తక్కినయుద్యోగస్థులును, పెద్దరయితులు చెఱువుగట్టునఁబోయి చాపలు పఱపించి, పానకపుఁగావళ్ళతో సిద్ధముగా నుండిరి. రాత్రి జాముపొద్దుపోయినది. వెన్నెలలు నాల్గుదిక్కులయందుఁ బోసికొని దిక్కటాహములు క్షీరకుంభములవలె భాసించెను. నాల్గుదెసలఁ గోసిన వరిచేలై యెండిన దుబ్బులై నెఱియలుపడ్డ నేలయై వెన్నెల తనకాంతి ప్రదర్శించుటకు నిలుచుటకు బచ్చనియాకు, కదలించుట కొక మొగిలిఱేకు, ప్రజ్వలింపఁ జేయుట కొక సన్నని తెల్లనిపూవు, తళతళలాడించుటకుఁ బచ్చనితావు లేకుండఁబోయెను. పనిలేనిసోమరిపోతు నిర్ణీతముకాని వృథాసంచారముచేసినట్లు వెన్నెల యూరకే యటు నిటు తిరిగెను. ఏఁబదికాగడాలతో హరప్పనాయఁడు నేనుఁగులు, గుఱ్ఱములు కదలి నడచెను. తిరిగి రాఁదగినస్థలము చేరిరి. అచ్చటఁ గొంత సేపు విశ్రమించిరి. హరప్ప, రాధాకృష్ణయ్య, సర్వారాయలు గజావరోహణము చేసి, యొకచోట నాసీనులైరి.

హరప్ప– ఈ వెన్నెల లెట్లున్నవి? రాధా– ఎట్లున్న వేమిటి? హరప్ప– ఏనుగుదంతములవలె నున్నవి. సర్వా– ఏనుగుదంతములు గోసి మెఱుఁగుపెట్టినఁగాని యింత తెల్లగా నుండవు. రాధా– ఏనుగు చనిపోయినతరువాతఁగదా దంతములు తీసి సానఁబట్టుట! హరప్ప– ఏనుగు మహాజంతువు. అంత జంతువు చనిపోయినను విషాదకరముగానే యుండును. ఒకమహాకవి, ఒకమహారాజు, ఒకమహావృక్షము, ఒక మహాజంతువు చనిపోవుట మంచిశకునము కాదు. లోకమున

కేదో దుర్దశయున్నఁగాని యట్టిది జరుగదు. సామాన్యముగా లోకోక్తి యున్నది. పెద్దవారు పోయినయెడ నన్నియుఁ గష్టములే నని. సర్వా - పూర్వము నా చిన్నతనములో మనకోటలోఁ బెద్ద యేనుఁ గుండెడిది. అది పట్టపు టేనుఁగు. దానిపే రేదో యుండ వలయును. మఱచిపోయితిని. రాధా—దానిపేరు లక్ష్మణస్వామి.
హర—అవునవును. రంగన్న యొకసారి నా కీ సంగతి చెప్పెను.
రాధా—ఆ యేనుఁగు నీ ప్రాంతములందే పాతిపెట్టిరి.

దూరముగా నొక యేనుఁగు తిరుగుచున్నట్లయ్యెను. హరప్ప వెనుదిరిగి చూచెను. తమ యేనుఁగులు రెండును వెనుకభాగమున నిలిచియే యున్నవి. హరప్ప కల్లోలపడెను. రాధాకృష్ణయ్య 'యేల యట్లు కదలిపోవుచున్నా' రనెను. హరప్ప వారిద్దఱికి నేనుఁగు కనిపించలేదని తెలిసికొని 'ఏమియు లేదు' అనెను. లక్ష్మణస్వామి దూరమునఁ దిరుగుచుండెను. స్వామి సుందరముగాఁ దొండమును గదలించుచు, మందముగాఁ బాదవిన్యాసముచేయుచుఁ, దోఁక యాడించుచుఁ, జెవులు కదలించుచుఁ గొంతదూరము పరువెత్తుచు, కొంతదూరము నడచుచు, మఱికొంతసేపు నిలుచుండును.

రాధాకృష్ణయ్య 'మనము కదలిపోవువేళ యైనది' అనెను. మువ్వురు నేనుఁగుల నెక్కిరి. సరదార్లు గుఱ్ఱము లధిరోహించిరి. బయలుదేఱి బోవుచుండిరి. ముందఱ రెండేన్గులు, వానివెనుక ముసలియేనుఁగు, ఆవెనుక నైదు జంటలుగా గుఱ్ఱములు. మావటీంద్రు గజముల నదలించిరి. అవి నడువలేదు. అవి బెదరి యటునిటు పరుగెత్త నారంభించెను. హరప్ప చూచెను. లక్ష్మణస్వామి యడ్డముగా వచ్చెను. ఆయన కేమియుఁ దోచలేదు. ఆ సంగతి రాధాకృష్ణయ్య ప్రభృతులతోఁ జెప్పవలయునా, వలదా? లక్ష్మణస్వామి తొలఁగి పోయెను. శత్రుఘ్నుని యాధోరణుఁడు మఱల దారిలోనికిఁ దెచ్చెను. శత్రుఘ్నుఁడు పదియడుగులు వేసెను. హరప్ప చూచెను. లక్ష్మణస్వామి తొండమెత్తుకొని, మహాభయంకరుఁడై శత్రుఘ్నునిమీఁదికి దూఁకఁ బోవుచుండెను. శత్రుఘ్నుఁడు బెదరిపోయి మఱల వెనుకకుఁ దిరిగి పలాయన మారంభించెను. ఎక్కిన యేనుఁగులు, గుఱ్ఱములు గూడ బెదరి చెల్లాచెదరయ్యెను. మావటీఁడు బలవంతముమీఁద

ఏనుఁగు నంకెకుఁ దెచ్చి మఱల దారిపట్టించెను. హారప్ప దృష్టిసారించి చూచెను. రెండు మెఱపులతోడి మహామేఘమువోలె, రెండు తెల్లని పూలు విచ్చిన సంపెఁగపొదవోలె దూరమున లక్ష్మణస్వామి తలయుఁ దొండమును నాడించుకొనుచు నెమ్మదిగా వచ్చుచుండెను. మఱల నేన్గులు బెదరిపోయెను. నాయఁ డేనుఁగుల నాఁపించి యొక సేవకుని బిలిచి "యోరీ ! ధర్మారావుగారిని నేను పిలుచుచుంటి నని తీసికొని ర" మ్మని చెప్పెను. జమీందారు వెంట నున్నవారందఱును దిగ్భ్రాంతులైరి. ఎవ్వరికిని దీని హేతువు తెలియలేదు. అఱగంటలో ధర్మారావు వచ్చెను. హారప్పనాయనితోఁ బాటు ధర్మారావు శత్రుఘ్నుని నధిరోహించెను. మఱల నేనుఁగులు గుఱ్ఱములు వరుసలుతీర్చి నిల్వఁబడియుండెను. హారప్ప ధర్మారావుతో "నదిగో, చూచితిరా" యనెను. ఎట్టయెదురుగా లక్ష్మణస్వామి వచ్చుచున్నది. ధర్మారావు దాని యవి స్పష్టమైన యాకారమును జూచి సంగతి గ్రహించెను. వెంటనే యేనుఁగుల నన్నిటినాఁపి, పరిచారకు నొకనిని కోటలోనికిఁ బంపించి, యేనుఁగు కంఖాణము తెమ్మని చెప్పెను. కొంతజలము కూడఁ దెప్పించెను. శత్రుఘ్నుని దక్షిణగుంపు నుండి విడివఱచి లక్ష్మణస్వామిని బూర్వము పాతియుంచిన స్థలమువద్దకుఁ దీసికొని పోయెను. అచట నిర్వురు నేనుగునుండి దిగి యాస్థలమున శుభ్రము చేసి, నీళ్ళుచల్లి, యేనుఁగుమేఁత యచ్చట హారప్పచేత నుంపించెను. 'శత్రుఘ్నునిపేరు మార్చి లక్ష్మణస్వామి యని పిలుతు'మని హారప్ప శపథముచేసెను. ఇరువురు మఱల నూత్నలక్ష్మణస్వామి నధిరోహించి వచ్చి యందఱితోఁ గలిసికొనిరి. అందరును నెమ్మదిగాఁ గదలిపోవు చుండిరి. లక్ష్మణస్వామి దూరముగా వారిప్రక్కనే వచ్చుచున్నట్లు తోఁచెను. గుండేటివంతెనవఱకును వచ్చుచునే యుండెను. వంతెన దాఁటి వీరు గ్రామములోఁ బడిరి. లక్ష్మణస్వామి వెనుదిరిగిపోయెను. దూరముగాఁ బోయి హారప్ప, ధర్మారావు లేమిచేసిరో యెవరికిని తెలియదు. రాధాకృష్ణయ్యయు, సర్వారాయఁడును దమయందుఁ బూర్వము రంగారావుగారి కెట్టి నమ్మక ముండెడిదో, యట్టినమ్మకము నేఁడు ధర్మారావునందు హారప్పకున్నదని కొంచెము మాత్సర్య పడిరి. అప్పుడే యందరును గోటదాఁక వచ్చిరి. అచ్చట ధర్మారావు

దిగి ముందఱ చెఱువుగట్టునకుఁ బోయెను. రాజబంధువులు చెఱువు
గట్టునకుఁ జేరి. గంధతాంబూలములు పానకపువిందెలు నిచ్చి
“యయ్యా! మీ స్వామిగారికి మా సత్యభామాదేవిగారి నిచ్చి
వివాహము చేసెదము. మీ రంగీకరించవలయు” ననిరి. ప్రభువు
వైపున భోగప్పశాస్త్రిగారు వచ్చి “అయ్యా! వట్టిపిల్ల మా కక్కఱ
లేదు. మాస్వామివారి కేమి? భార్యలు లేకనా? రుక్మిణి, జాంబవతి,
మిత్రవింద, కాళింది మొదలగు భార్య లున్నారు. పదునారువేల
గోపిక లున్నారు. మాస్వామి పిల్లలకు మొగమువాయ లేదు. మీ
రేమైనఁ దగిన కట్నమిచ్చినచోఁ జేసికొందుము!' అనిరి. ధర్మా
రావువైపున రాఘవరావు ‘మాపిల్ల కులముతక్కువపిల్ల కాదు.
రుక్మిణి యున్నదనఁగాఁ, దల్లిదండ్రుల నెదిరించి వచ్చినది. కులము
గల రాచకూఁతురు మా సత్యభామ. ఇంతమంది భార్య లున్న
మీస్వామికిఁ బిల్లలమీఁదఁ బిల్ల నెవ రిచ్చెదరు? మేము మంచివాం
డ్రముగనుక నిచ్చుచున్నా' మనెను. భోగప్ప ‘యీ మాత్రమున
కేనా మ మ్మింతదూరము పిలిపించితిరి? మా కీ శకున మక్కఱనే
యయినది. దారిలో నేనుఁగు లడ్డము తిరిగినవి. ‘ఏమిటో? యను
కొన్నాను. సరేలే పదండయ్యా పదండు. కట్నములేని యీ పిల్ల
యెవరికిఁ గావలయు' ననెను. రాఘవరావు ‘అట్లనెద వేమయ్యా!
మేము సాలంకృతకన్యాదానము చేసెదము. గుఱ్ఱములు, నేన్గులు,
లొట్టిపిట్టలు, చాకలులు, కవులు, గాయకులు బోలెడంత సిబ్బంది
యిచ్చెదము. ఊరకే త్రెంచుకుని పోదు మందురేమి? మీకుజాబులు
వ్రాసి పిలిపించుకొన్నంతసేపు పట్టలేదే' యనెను.

భోగప్ప- మీరు చెప్పినవన్నియు నెవరిపిల్లను జేసికొన్నను
మాకు వచ్చును. విశేష మేదో చెప్పినఁగాని మేము చేసికొనము.
రాఘవ- విశేషము మాపిల్లయే. భోగప్ప- మే మాఁడపిల్లల ముక్కు
మొగ మెఱుఁగనివారము కాము. మాటిమాటికి ‘మాపిల్ల మాపిల్ల'
యనెదరు. ఆమె యేమి బంగారుబొమ్మయా! వరహాలకుప్పయా!
రతనాలరాశియా! మాకు వట్టిపిల్ల యైనచో నక్కఱ లేదు. ప్రభు
వులు! లెండు పోదము. ఏదో సాటిరాచవారు, నడవళ్ళలో లోపము
చేయుదురా యని మొదటనే ఖరాఖండిగా మాట్లాడుకొననందుకు

ఫలితము దక్కినది' అనఁ, ప్రభువులు నల్వురును లేచిరి. రాఘవరా వద్దము పోయి 'అయ్యా! కోపించకుఁడు! మాస్వామివారు కోపించి పోయి సింహమునుజంపినజాంబవంతునివద్దనుండి మాకుఁ దెచ్చి యిచ్చిన శమంతకమణి యున్నది. అది రోజునకునూఱుపుట్లుబంగారు గురియును. దానిమీఁద మాస్వామివారిదివరకే కన్నువేసిరి. దానిని మాపిల్లతోఁ గలిపి యిచ్చెద' మనెరు. భోగప్పయ్య హారప్పగారి వద్దకుఁ బోయి, 'ప్రభువులు! మనమంత్రము పాఱినది. అయినను వెంటనే యొప్పుకొనరాదు. కొంచెముబెట్టుచేసి యొప్పుకొందు' మని, రాఘవరావువద్దకు వచ్చి 'యయ్యా! శమంతకమణి మాస్వామివారు తెచ్చియిచ్చినదే. ఆయనకు దానిమీఁద కోర్కెలేదుగనుక యిచ్చిరి. సరే మీరంత ప్రాధేయపడుచున్నారు గనుక నొప్పుకొనెదము. అంతకన్న స్పృహణీయమైనవస్తువు మీరు మఱొకఁడేదైన నొసఁగి నచో స్వామివారియంగీకారము వచ్చును. శమంతకమణికిఁగూడ నొప్పుకొన్నాము లెండి' యనెను. రాఘవరావు ధర్మారావుతో 'చూచితివా, పెండ్లికొడుకువారి బిగువులు! శమంతకమణిమీఁద నసలుచూపు. దానితోఁబాటు మఱింకేదైనను గాఁజేయవలె నని. ఈ సంబంధము మనకు లేకపోయిన నేమి! ఇందులో సగము పెట్టినచో మఱియే గొప్ప రాచకొడుకైన వచ్చు' ననెను. ధర్మారావు 'అట్లు కాదు. ఇంతదూరమువచ్చినతరువాత సంబంధము చెఱుపుకోఁ గూడదు. వచ్చినసంబంధము తిరిగిపోయె ననఁగా పిల్ల కా వంకర యున్నది, యీ వంకర యున్న దందురు. తరువాత మంచిసంబంధము వచ్చుటయుఁ గష్టమే'అని భోగప్పదగ్గఱకుఁ బోయి'అయ్యా! శమంతకమణికన్న గొప్పవెలగల వస్తు వున్నది. దానినిగూడ నిచ్చెదము' అనెను.

భోగ-దానిపే రేమిటి? ధర్మా- మీ రెఱిఁగియున్నదే. వెల లేని వస్తువు.

అని చెవిలో నేదియో చెప్పెను. భోగప్ప పోయి హారప్ప నాయనిచెవిలో బిగ్గరగా 'అయ్యా! చిన్నప్పటినుంచి స్వామివారు చూచిచూచి మురిసిపోవుచున్న దేవదాసినిగూడ నిచ్చెదరఁట! ఇంక మన మొప్పుకొనవచ్చును. అయినను బోయి స్వామివారితోఁగూడ

మనవిచేసి వత్తు'నని యాలయములోనికిఁ బోయి స్వామివారియెదుటఁ జెప్పెను. అర్చకుఁ 'డవశ్యము చేసికొనవలసినదే' యనెను. స్వామి లజ్జచేత శిరమువాల్చుకొన్నట్లు కనిపించెను. తిరిగి వచ్చి 'స్వామి యంగీకరించె' ననెను. 'పెండ్లివారికిఁ గోటలో విడిది యేర్పఱచితి' మని రాఘవరావు చెప్పెను. తరువాత నందఱును విడిదివారు విడిదికిఁ, బెండ్లివారు పెండ్లియింటికిని విచ్చేసిరి.

అప్పటికి రాత్రి రెండుజాములు దాఁటినది. వెన్నెలలు ప్రహ్లాదుని రక్షించిన నృసింహమూర్తియుగ్రత శాంతింపఁజేయుటకు స్తోత్రములుచేసిన బ్రహ్మాదులిచ్చిన హారతికప్పురపు నీ రాజనమువలెఁ బవిత్రము, కాంతిమంతము నయ్యెను. ఏకాదశి యని సర్వ దేవతలును దేవాలయాగ్రభాగమున వాయువీథులలో వచ్చి నిలిచిరి. సభలో వాసకసజ్జికానాట్యము గణగణలాడెను. దేవదాసి హారగుంఫనము నభినయించుచుండెను. కొద్దిగాఁ జమురుపోసి దీపము వెలిగించుచుండెను. చెలికత్తె లెఱిఁగిపోదురేమో యని లజ్జాముగ్ధానయై ముగ్ధానాయికవలె సజ్జీకరణమంతయు వారికిఁ దెలియరాకుండఁ జేయుచుండెను. నటుఁ డనెను. 'సకియా! నీ వింత ముద్దరాల వేమి? స్వామి వచ్చునని నీమనసులో నెచ్చటనో కదలిక గలిగినది. అది మాకుఁ దెలియకుండ దాఁచుచున్నావు. ప్రియుఁడు వచ్చినతరువాతఁ గాని దీపములో చమురెక్కువ పోయవా' అనెను. ముగ్ధాభినయము గంటసేపుపట్టెను. తరువాత నామె మధ్యాభినయ మారంభించెను. కటకాముఖహస్తముతోఁ బూవులుగ్రుచ్చుట నారంభించి "ఓసిచెలియా! నీవు చాల తెలివికలదానవు..ఎదుటవారి భావములు తెలియకుండనే తెలిసినట్లు మాటాడెదవు. నే నీ పూవులు చూచితివా? ఎంత చమత్కారముగాఁ గ్రుచ్చుచున్నానో ? అవునుగాని, నీవు శ్రీకృష్ణస్వామి నెఱుఁగుదువా ? ఆయన యీనాఁడు వత్తు ననియేఁ గదా !" అనెనుగాని, నటుఁడు "అవునమ్మా! దేవకార్యముమీఁద నున్న స్వామి యిప్పుడు వచ్చు నని మన మేమి చెప్పఁగలము ? నీ వేమో సర్వము సజ్జీకరించుకొని కూర్చున్నావు. చిత్రపటములను జూచు మిషతో మాటిమాటికి ద్వారబంధమువంకఁ జూచెదవు. నా కీ నగ బాగున్నదా, యీ నగ బాగున్నదా యని క్రొత్తక్రొత్త నగలు ధరించు

చున్నావు. ఆయన ప్రహ్లాదుని రక్షించుటకు వెళ్ళినారు. ఇంతవఱకు రాలేదు'' అనెను. తరువాతఁ బ్రౌఢావాసకసజ్జాభినయము ప్రారంభమయ్యెను. ఆమె సర్వాలంకారములును ధరించెను. కటకాముఖముతోనద్దమునెదుట నిలుచుండి, తనసౌందర్యము తానుచూచుకొనెను. నటుఁడు 'నీ వింతసొగసు చేసికొనుచున్నావు. స్వామి వచ్చునో, రాఁడో' యనెను. ఆమె శిఖరహస్తముతో 'నేమి' యని యడిగెను. నటుఁడు "దేవకార్యముమీఁదఁ బోయినయీయన యప్పుడే వచ్చునని నే నెట్లనఁగలను ? నీ వైనను గొంత తొందరతగ్గించుకొని యాయనకోస మెదురుచూచిన బాగుగానుండునుగాని యింత తొందరపడినచో నేమి లాభము ?" అని, 'సరే కాని, నీ కాయన నేఁడు వత్తునని చెప్పిపోయెనా' యనెను. గిరిక "చెప్పెనమ్మా! నిన్నసాయంకాలమే చెప్పెను'' అనెను. రత్నగిరి "నిన్న జాబుకూడ వ్రాసెను గదండీ" యనెను. దేవదాసి సందంశహస్తముతో "చెలీ ! నేఁడు స్వామియేరాఁడేని నా ప్రాణములు బలి యిచ్చెద" ననెను. నటుఁడు "అట్లనకుము, అట్లనకుమునీ వట్టిదాన వైనచో స్వామి యేల రాఁడు ? నేను పోయిచూచివత్తును. ఈలోపుగా నీవు తమలపాకులు, వక్కలు, నత్తరుతోడి దీపము సర్వము సిద్ధముచేసి యుంచుము. ఏలరాఁడు ? అదుగోఆవచ్చుచున్నది యెవరు ? ఆ నడకతీరు, ఆ తలవిసరుట, ఆయనవలెనే యున్నదే! ఆ పై యుత్తరీయపు కొంగు జీరాడుట, ఆయనకుఁగాక మఱి యెవ్వరి కున్నది ?" అనెను.

నాదనామక్రియ - చాపు

పాహి పాహి జగన్మోహన కృష్ణ, పరమానంద, శ్రీకృష్ణ
దేవకీవసుదేవనందన, కృష్ణ దివ్యసుందర శ్రీకృష్ణ
నందయశోదానంద కృష్ణ ఇందువదన శ్రీకృష్ణ

గిరిక లేచి నిలుచుండి నమస్కారము చేయుచు "నదుగో స్వామివచ్చినాఁడు."

నాదనామక్రియ - ఆది

శంఖీ సచక్రీ గదీ పద్మీ శార్ఙ్గీ కిరీటకుండలీ
శ్రీవత్సకౌస్తుభీ దివ్యపీతాంబరో విరాజతే.

కేదారగౌళ

వచ్చినస్వామికిఁ బూవులు తెచ్చి పూజసేయవే చెలీ!
మచ్చెకంటి! యాకుమడుపులందిచ్చిసరసమాదరమ్మనవే॥వచ్చిన॥

అని నృత్యముచేసెను. అంతలోఁ దెర తొలఁగింపఁబడఁగా శ్రీనృసింహావతారాలంకారము కనిపించెను. రెండువైపుల రెండు దూలములు పైభాగమున వెడల్పుగాఁ గ్రిందిభాగమున దగ్గరగా నమర్చఁబడియుండెను. తన్మధ్యమున సింహాసనముమీఁద స్వామివిగ్రహము పెద్దసింహపుఁదలకాయతో నమర్చఁబడియుండెను. ఆయన తొడలమీఁద నర్చకుని తమ్ముని పరుండఁబెట్టిరి. అతనిహృదయము స్వామిగోళ్ళతోఁ జీల్చుచున్నట్లుండెను. ప్రక్క నొక కుఱ్ఱవానిని ప్రహ్లాదునిగా నిలుచుండఁబెట్టిరి. అతఁడు నీరాజనముపూని నిలుచుండెను.

సావేరి - త్రిపుట

కరుణయావలోకయ మాం శ్రీనృసింహ
ఘోరాసురసంహారశోభనాద్రి శ్రీనృసింహ ॥కరుణ॥
పరిపూర్ణ దయారస పాథోధినృంహణ
ప్రహ్లాదచంద్రోదయ శ్రీ నృసింహ
నిరసితతామసనిర్విశేషమానస
గురుతరవీరశ్రీ గూఢసుగుణాలయ ॥కరుణ॥

అంతలోఁ దెల్లవాఱవచ్చెను. దేవదాసి స్వామివద్దనుండి వామనావతార హస్తము, పరశురామావతార హస్తమును బూని,

ఛలయసి విక్రమణే బలి మద్భుతవామన
పదనఖనీరజనితజనపావన
కేశవ! ధృతవామనరూప! జయ జగదీశ హరే!
క్షత్రియరుధిరమయే జగ దపగతి పాపం
కేశవ! ధృతభృగుపతిరూప! జయ జగదీశ హరే!

అని నృత్యముచేసెను. తెల్లవారెను. కాకులు కూయుచుండెను. ధర్మారావు కుడిచేతఁ గపిత్థహస్తమును, నెడమచేత శిఖరహస్తమును గ్రిందుమీఁదులుగాఁ జేసి రామావతారహస్తమును బ్రదర్శించెను. బ్రాహ్మణు లందఱును స్నానమునకుఁ బోయిరి.

ఏనుఁగంబారీ నెక్కి ప్రభువు కోటలోనికిఁ బోయెను. స్త్రీ లందఱును గృహములకుఁ బోయి పనులు చూచుకొనుచుండిరి. దేవదాసి గృహాభిముఖయై నడచెను. ఆమె నేత్రములయందు నిద్రలేమిచే బడలికయు, శరీరమునందు నలిగిపోవుటయుఁ గనిపించెను. ఆమెపాదములు నడచినంత సేపును నృత్యము చేయుచున్నట్లే యుండెను, ఆమె వెంటనే మేళమంతయు నడచుచుండెను. ఆనడక—

మోహన - ఝంప

మగువ తన కేళికామందిరము వెడలెఁ
వగకాఁడ మాకించివరద! తెల్ల వారె ననుచు ॥మగువ॥
విడజాఱు గొజ్జంగివిరిదండజడతోను
నిడచిక్కుపడి పెనగు కంటసరితోను
నిడుదకన్నులఁ దేరు నిదురమబ్బులతోను
తొడరి పదయుగమునఁ దడఁబడెడునడతోను ॥మగువ॥

అన్నట్లుండెను. ఆమె స్నానముచేసి, మఱల జపమునకుఁ గూర్చుండెను. ఆమె భోజనముచేసి యైదుదినము లైనది. నిదురించి యైదుదినము లైనది. తల్లి ద్వాదశిపారణ చేయుచున్నది. ఆమె మాటాడ లేదు. బ్రాహ్మణులందఱును జపాదికములు నిర్వర్తించుకొనిరి. అందఱును ద్వాదశిపారణ చేసిరి. ధర్మారావు సంతర్పణలో నుండి బ్రాహ్మణోచ్ఛిష్టమును దీసికొని దేవదాసి కిచ్చెను. ఆమె భోజనముచేసి, దేవాలయమునకు వచ్చెను. ఆలయముముందు వేసిన పెద్దపద్దిళ్ళలో భజనలు జరుగుచుండెను. సర్వమును వైకుంఠము వలె నుండెను. పర్వత నారదులు సామగానముచేయుచున్నట్లు సామవేదులయినకొందఱు సామవేదము చెప్పుచుండిరి. యజుశ్శాఖీయులు యజుర్వేదమును బఠించుచు మహాక్రతువు లాచరించుపద్ధతులన్నియు నుపన్యసించుచుండిరి. క్రతుసమయముల నేకర్మ మెట్లాచరించవలయునో, తద్వ్యతిరేకాచరణమునకుఁ బ్రాయశ్చిత్తము లెట్టివో, విద్వాంసుల కవిద్వాంసులకు ఫలతారతమ్యము లెట్టివో- యుపనిషదర్థములు విస్తరించుచుండిరి. బయట గారడీవాండ్రు, దొమ్మరివాండ్రాడుచుండిరి. జనులందఱును జూచుచుండిరి. పగలు రెండుజాములగువఱకు సర్వజనులును దేవాలయములో, దేవాలయముందే యుండిరి.

కొన్ని భజనమేళములు నాగేశ్వరస్వామివారియాలయములో జరుగుచుండెను. గణాచారి యొత్తిడికిఁ దాళలేకపోయి చెలువుగట్టున నిలుచుండెను. చంద్రయ్య యన్నము తెచ్చెను. గణాచారి తినుచుండెను.

కోటలో నొక్క పురుగైనను లేదు! ఒంటరిగా రంగారావుగారు పండుకొని బయట జరుగుచున్న వైభవమునకుఁ దనకు సంబంధములేనట్టు తా నొంటరితనమును వెళ్ళబుచ్చుచుండెను. రామేశ్వరశాస్త్రి ద్వాదశిపారణ బ్రాహ్మణ సంతర్పణలోఁ జేసెను. అతఁడింటికిఁబోయి యైదురోజులైనది. ఇంటిలో సందడివలన నెవరు వచ్చిరో, యెవరు రాలేదో యజపజ లేకుండెను. అరుంధతి ధర్మారావులు కుమారుని నృత్యమువద్దఁ జూతురు. మఱల గనిపించరు. కిరీటికో, సూర్యపతికో, పశుపతికో యెచ్చటికో కనిపించుచు. వారు మాకుఁ గనఁబడెనని చెప్పుదురు. ఈ మాటలేకాని యతఁడింటికి వచ్చినది లేదు. ఆ నాఁడు మధ్యాహ్నము సర్వజనులును భజనలయందు, నుత్సవములయందు నిమగ్నులై యుండఁగా రామేశ్వరశాస్త్రి కేగాలితిరిగెనో కోటలోనికిఁ బోయెను. పోయి రంగారావుగారి కెదురుగాఁ గూర్చుండెను. ఆయన శాస్త్రిని జూచెను. 'ఎచ్చటనుండి వచ్చుచున్నావు? దేవాలయమునుండియేనా?' యనెను.

శాస్త్రి—నేఁడు రామావతారము; మీరు వచ్చెదరా! రంగా—నాయనా! నేను లేచి కూర్చుండలేనుగదా! శాస్త్రి—మీరు దేవదాసి నెఱుఁగుదురా! కాదు, కాదు. ఆమె పేరు గిరిక. ఆమె నెఱుఁగుదురా? ఆమెను గిరిక.,.. దేవదాసి యనరాదఁట. నేనొకరోజున నట్లనఁగా మా యమ్మ నన్నుఁ గోపపడినది. 'బిడ్డకోసి పేరుపెట్టినావా' యన్నది. మఱి యే మనవలయునో తెలియలేదు. మీ రామె నెఱుఁగుదురా! రంగా—కల్యాణములు బాగుగా జరుగుచున్నవా? శాస్త్రి పకకకాలున నవ్వెను. రంగా—నవ్వెద వెందులకు? శాస్త్రి—సూర్యుఁడు వేడిగా నున్నాఁడా! రాజుగారికేనుఁగు లున్నవా? రాజుగారు గనుకనే యేనుఁగులు వచ్చినవి. రంగా—నీవు పిచ్చినాఁడ వైపోవుచున్నావు. శాస్త్రి—ఇప్పుడు మఱీను. సరేకాని, రాత్రికి రామావతారము. రాములవారు రావణాసురుని జంపినాఁడఁటకదా! నాకు రాములవారికథ సరిగాఁ జెప్పినవా

రెవ్వరును లేరు. ఎవరి నడిగినను 'చదువుకొమ్ము. తెలియు' నందురు. చదువుకొనుట యెందులకు? తెలియుటకు. చెప్పినచోఁ దెలియదా? చివరకు నాకు మాహాస్సనలే చెప్పినాఁడు. రంగా—హాస్సనలీ యెవరు? శాస్త్రి — తురక వెధవ. కూద్ తాహుఁ' అని చెప్పినాఁడే, వాఁడు. రంగా—వానికి రామకథ తెలియునా? శాస్త్రి — తెలియునా యేమిటి? వాడు కబీరు, నేను రామదాసు. కొళాయి చెఱువులదగ్గర ప్రొద్దున నాటక మాడినాము! రామదాసు నాటకము. రాములవారు పెద్దభక్తుఁడు. రంగా-రాములవారు భక్తుఁడేమిటి? శాస్త్రి- దేవుఁడుమాత్రము భక్తుఁడు కాఁగూడదా? రాములవారికి శివునియందు చాలభక్తి. రంగా-నీకుఁ జాల తెలియునే! శాస్త్రి- హాస్యగాఁ డున్నాఁడే, ఆయనయు నట్లే యన్నాఁడు. నాకు వచ్చినచదువంతయు హాస్సనలీ చెప్పినాఁడు. రంగా-హాస్సనలీ కెన్ని యేండ్లు? శాస్త్రి-పన్నెండు పదునూఁడేండ్లుండును. తురకవాండ్రు మొద్దులులా గుందురు. వాఁడు వట్టి బలహీనుఁడు. నేను వాని చెవు లెక్కవేయుదును. వాని బోడిబుఱ్ఱమీఁద మొట్టికాయలు మొట్టుదును. నే నెంతచెప్పిన వాఁ డంతే. రంగా-నీ కబురులు నా కీ నాఁడు బాగుగా లేవు. శాస్త్రి-రాత్రి నా కొక కల వచ్చినది. రాత్రి నేను నిద్రపోలేదుగా! అది మొన్నరాత్రి. రంగా-కల యే మని? శాస్త్రి-నేను పాలకుండ నఁట. నా పాలన్నియుఁ గూర్మావతారమునకుఁ బోసినపాలసముద్రములోఁ నొలికి పోయినవఁట నేను పడిపోయి పడిపోయి సముద్రములోఁ బడి పోయినాను. న న్నాహాస్యగాఁడు నిద్రలేపినాఁడు. రంగా-అందు కనియే నీవు తీయగా లేవు. శాస్త్రి-నే నందు కనియే మఱీ తియ్యగా నున్నాను.

అని మేడ దిగిపోయెను. అతఁ డెకాయెకి గణాచారివద్దకుఁ బోయెను. గణాచారి యన్నముతినుట పూర్తియైనది. గట్టుమీఁదఁ బెద్దకానుగుచె ట్టున్నది. అమె దానిక్రిందఁ గూర్చుండెను. శాస్త్రి పోయి రేవులో దిగి స్నానముచేసి చొక్కాతోఁ దలయు, నొడలు సగముతుడుచుకొని చొక్కా చేతనైనట్లు పిండి యెండవేసి తడిగోచితో గణాచారివద్దకుఁ బోయి కూర్చుండెను. శాస్త్రి-నీవు గుడివదలి

పెట్టి వచ్చినా వేమి? ఆమె మాటాడలేదు. శాస్త్రి-చంద్రయ్యా నీ కేమగును? ఆమె మాటాడలేదు. చౌక్కా గాలికిఁ గొట్టుకొని పోయెను. అతఁడు పోయి దానిని దెచ్చి మడిల నెండవేసి "నీవు దేవదాసినృత్యము చూచుటకు రా వేమి? ఆమెనృత్య మెంత బాగుగానున్న దనుకొన్నావు! ఈనాఁడు రామావతారము. రాములవారి భార్య సీతాదేవి సీతాదేవిని రావణాసురుఁ డెత్తుక పోయినాఁడు. అప్పుడు నే నుండవలసినది" అనెను.

గణాచారి-ఏమి చేసియుండెడివాఁడవు? శాస్త్రి- నా తడి చౌక్కా వానిమొగమున వేసి, వెనుక బిగించిపట్టుకొని, నెత్తి మీఁద మొట్టెడివాఁడను. హస్సనలీ బుఱ్ఱకాయవలెఁ గండెలు కట్టెడిది! గణా-వానివద్దఁ బెద్దకత్తి యున్నది. దానితో నింద్రుని, దేవతల నందఱను వాఁడు చావగొట్టెను. ఆకత్తి నీమీఁద విసరెడువాఁడు కదా! శాస్త్రి-చౌక్కా మొగమున వేసినవానికిఁ గన్నులు కనఁబడునా యేమిటి? గణా-వాఁ డసలు చౌక్కా వేయనిచ్చునా యేమిటి? శాస్త్రి- మహామహా హస్సనలీకే వేయుదును. వెధవ రావణాసురుఁడు. లెక్కా? గణా-నీకుఁ బిచ్చియెక్కినదా యేమి? శాస్త్రి- ఆయనయు నిట్లే యన్నాఁడు. గణా- ఆయన యెవరు? శాస్త్రి- కోటలోఁ బండుకొనియుండును. (పకపక నవ్వి) ఆయనఁట, జమీందారుగారితండ్రి యఁట! నే నెవరి తండ్రిని? గణా-నీ వచ్చటి కేల పోయితివి? శాస్త్రి-కోట మాదేకదా! గణా-ఛీ! ఊరకో! ఇంక నక్కడకుఁ బోకుము! శాస్త్రి-వెళ్ళఁగూడదా? ఆయన మంచి వాఁడే!

ఇంతలో నలువురుపిల్లలు వచ్చిరి. వారును, శాస్త్రియుఁ గలిసి యుద్ధముగాఁ బరువెత్తఁ జొచ్చిరి. కాలు తీసినచోటఁ గాలుపెట్టుచు గంతులువేయుచుఁ బరుగెత్తిరి. ప్రొద్దు వాటారినది. శాస్త్రి పోయి దేవాలయములోఁ గూర్చుండెను. అర్చకు లలంకారముజేయునపుడు వా రెవరిని రానీయరు. కోవెలతలుపు వేసెదరు. ఎంతమందినైన రానీయకుండవచ్చును గాని, శాస్త్రిని రానీయకుండుటకు వీలులేదు. సముద్రము నీలిరంగు గుడ్డలతో నల లలలుగా నిర్మించి, తత్తీరమున రామచంద్రుఁడు ధను స్సెక్కుపెట్టుచున్నట్లు చేసిరి.

శాస్త్రి-రాములవారు సముద్రముమీఁద బాణము వేసెనా? అర్చకుఁడు- నీ వెట్లు వచ్చితివి? 3 వ అర్చ-ఒడలంతయుఁ దడిసి యున్న దేమి? 1 వ అర్చ- చెఱువు వెనుకనుండి దిగి యీఁది వచ్చినాఁడు కాఁబోలు! 2 వ అర్చ-అ గోడ యెట్లెక్కినావు? దాని పైనుండి చెఱువులో నెట్లు దూఁకినావు? నీవు బ్రతికెను పిల్లవాఁడవు కావు రామే-అచ్చట గోడ మెట్టు తక్కువగదా! నెమ్మదిగా దిగినాను. కాని కాలుజారి చెఱువులోఁ బడితిని. 1 వ అర్చ-నీ కీఁత చేతనగునా? శాస్త్రి-హాస్సనలీ నేర్పినాఁడు, 2వ అర్చ-స్వామి గుడిలో తురకవానిపై రెందుకు? శాస్త్రి-తురకవాఁడా? కబీరు తురకవాఁడు కాదా! మస్తాను తురకవాఁడు కాదా! తురకవాండ్రలో నే రామభక్తు లెక్కువమంది యున్నారు. 3 వ అర్చ- ఈ కుర్రవాఁ డేమి పిడుగయ్యా!

ముఖమంటపమంతయు రామాయణకథలోని యనేకఘట్టము లలంకారముగాఁ జేయఁబడెను. అహల్యాశాపవిమోచనము, జానకి పెండ్లి, పాదుకా పట్టాభిషేకము, మాయలేడి, జటాయువధ, సముద్ర బంధనము, రామపట్టాభిషేకము. నడుమ శ్రీరామచంద్ర పట్టాభిషేకాలంకారము చేయఁబడియుండెను. ఆలయములో నాగ్నేయదిశ యందుఁ బెద్దగదిలో నీ యలంకారములకుఁ గావలసిన సామానులు, వాహనములు నుంచఁబడును. ఇవి యన్నియు హరప్పనాయఁడు, హరిహరనాయఁడు, కృష్ణమనాయని కాలములలోఁ జేయించినవి. పదిపదునాలుగేండ్లనుండి వాని నాఁదుకలేక కొన్ని చిమ్మెటలు కొట్టియుఁ గొన్ని బూజుపట్టియుఁ జెడిపోయెను. అర్చకులు వానినట్లే యదుకులుపెట్టి యలంకారములు సవరించుచుండిరి.

1 వ అర్చ- సాహెబులు మనదేవతలను బూజించరుకదా! శాస్త్రి- ఏల పూజించరు? 1వ అర్చ- వారికి విగ్రహము లన్నచోఁ గోపము. శాస్త్రి- ఇన్ని యలంకారములు లేకున్నచో నాకీ కథ లన్నియుఁ దెలిసెడివి కావు. నాకే కాదు. మాబోఁడిపిల్లలందఱకును దెలిసెడివి కావు. ఈ యూరిలో సెకండుఫారము, థర్డుఫారము చదివెడిపిల్లలందఱికన్న నా కెక్కువ తెలియును. వారు దేవాలయముల వైపునకే రారు. బాడ్మింటను కోర్టులు, వారును. వారికన్న నాకే

యెక్కువ చదువు వచ్చును. 2 వ అర్చ- నీకు వారికన్న నేమిటి, మాకన్న నెక్కువ వచ్చును. శాస్త్రి- మీకన్న నాకెక్కువ రాదు. మీ రెప్పుడు దేవునివద్ద నుందురు. ఆయన మీ కన్నియుఁ జెప్పును. నాకుఁ జెప్పిపోవునేమో యని మీరు నన్ను రానీయరు. మీవలె నే నెప్పుడును స్వామివద్దనుంటినా; ఆయనను వేధించి యన్నియుఁ దెలిసికొననా!

ప్రొద్దుక్రుంకినవెంటనే నృత్య మారంభింపఁబడెను. వెన్నెలలు చల్లనై ప్రసన్నములై చనుదెంచెను. పంచభూతములు శాంతములయ్యెను. దేవదాసి ముఖమున భగవంతుఁ డామెయెదలో నివసించి స్థాయికివచ్చినట్లు ప్రశాంతరేఖ యొక్కఁడు తోఁచెను. ఆమెతనూలత లావణ్యముచేత నిగనిగలాడెను. నృత్యారంభమందు శ్రీరామచంద్రుని మేఁడపైనుండి జానకీదేవి చూచినట్లు ప్రథమదర్శన రతిభేదము నభినయించెను. 'సఖీ! యింత యుచ్చస్థాన - నుండియు నా యొడలెల్ల స్వేదము కలుగుచున్నది. ఈ స్థల మింత నిర్వాయువుగా నున్న దేమి?' యనెను. నటుఁడు ప్రియసఖీ! నీయొడలఁ జెమ్మటయే కాదు; నీ కంఠమునందు స్వరభంగము కనిపించుచున్నది. శరీరమున వేపథువుగూడఁ దోఁచుచున్నది. మనము మేఁడమీఁదికి వచ్చినవేళ మంచిది కాదు. క్రిందకుఁ బోదమా' యనెను. గిరిక 'నీవేదియో మనసులోఁ బెట్టుకొని యనుచున్నావు' అనెను. నటుఁడు 'నే నే మంటిని? నీమనసులో నేదో యున్నట్లున్నది. నీమనోభావము నాకుఁ దెలియలేదు. చెప్పు' మనెను. గిరిక 'క్రిందకుఁబోదములే పద' యనెను. నటుఁడు 'క్రిందకుఁ బోవుట యెందుకు? ఇందే యుంద' మనెను, గిరిక 'కాదు, పోద' మనఁగా, నటుఁడు 'దాచెదవేమి? చెప్పుము. క్రింద రామచంద్రుఁ డున్నాఁడనియా, పోద మనుచుంటివి? పై నింతగాలి యుండఁగాఁ నీకుఁ జెమటపోయుట యేమి? నీ కంఠమున గాద్గద్యము తోఁచుట యేమి? ఇప్పుడైన దెలిసినదా?' యనెను. గిరిక 'నీవు దుర్వాక్యములు పలుకకుము. తండ్రి నన్ను శివధనుర్భంగముచేసినవారికే యిచ్చెద ననుచున్నాఁడు. నామనస్సు శివధనుర్భంగకారి కానివానిమీఁదికిఁ బోదు' అనెను. ఇంతలో ధనస్సు విఱిగిన మహాధ్వని వినవచ్చెను. గిరిక 'ఆ ధ్వని యేమిటి'

యనెను. నటుఁడు 'అతఁడే కాఁబోలు! రామచంద్రుఁడు ధనుర్భంగ మును జేసెను. నీవు లక్ష్మీదేవివై యుండుపు' అనెను. గిరిక కపిత్థ హస్తముతో 'నేను లక్ష్మీదేవినా' యనెను. నటుఁడు 'అవునమ్మా, కాకపోయినచో నీమనస్సు సరిగా రామచంద్రునిమీఁదనే యేల లగ్నమగును?' అనెను. గిరిక శిఖరహస్తముతో 'చెలీ! అది ధనుస్సేనా!' యనెను. ఇంతలో వివాహసంభారములు వచ్చెను. వివాహ సమయమున గిరిక లజ్జాపిహితసర్వాంగయై మనోహరాకృతి వెల్లడించెను. వివాహమైనట్లే నృత్యతాళగానములు శుభధ్వనిని గ్రుమ్మరించెను. సీతారామచంద్రసంభోగవేళ దేవదాసి తన్మయాకృతిఁ దాల్చెను. ఆమె నఖశిఖాపర్యంతము సుమనోహరాకృతి యయ్యెను. వెన్నెలమెదిపి చేసిన విగ్రహమన్నట్టుఁ వనతశిరోభేదము ప్రకటించుచు సిగ్గులబరణియయ్యెను. ఆమె కనుఁగొనలయందు వెన్నెలలు మెలివడి సర్వప్రకృతి తనలోని విభేదము మానినట్లు వెన్నెలలకుఁ దామర పూవులకుఁ జెలిమి యయ్యెను. గిరిక మొగమున నేదో యమృతరేఖ తాండవించి చూపఱకు హృదయములయందుఁ జెప్పరాని యొకానొక భక్తిభావ ముదయించెను. సభయంతయు నిర్వీచియైన క్షీరసాగరమువలెఁ, దన్మధ్యస్థతరంగాగ్రడోలాసంస్థితపద్మాదేవివలె గిరికయుఁ బ్రకాశించిరి. రాతిరి రెండుజాము లయ్యెను. ఆనాటినృత్యము విచిత్రమై, యింద్రియాతీతమై, యతీతమనోవికారమై, శాంతమై, మహాసమైక్యభావ మొకఁడు స్ఫురింపఁజేసెను. వికారరహితమైనమనస్సు పరమాత్మయందు లీనమైనట్లు, పరమోచ్చమైన ప్రకృతితత్వము నిశ్చలమై, నిశ్శ్రేయసహేతువైనట్లు ఆనాఁటినృత్యము సర్వజనులకు నాధ్యాత్మికదృష్టియే కల్పించెను. మద్దెల మ్రోయించినట్లు లేదు. తాళములు వాయించినట్లు లేవు. వీణానినాదము కదలినట్లు లేదు. శ్రవణేంద్రియము నేత్రేంద్రియముతో లీనమై చూచిన రూపమునకు విన్నశబ్దమునకు భిన్నత్వములేక, యవిరెండును మనస్సుద్వారా యాత్మకుఁదగిలిన వన్న విభేదజ్ఞానములేక సనాతనుని యనంతక్షీరసాగరమధ్యవీచీశేషతల్పనిద్రితనారాయణడింభమూర్తిసమానోచ్ఛ్వాస నిశ్శ్వాసములవలె సభయంతయు నొక్కశ్వాసమీఁద నాడెను. గిరిక కొడలు తెలియలేదు. భోగప్ప తన్నుఁ దా నెఱుఁగఁడు. రత్నగిరి

వ్రేళ్లు వీణమీఁద వానియంతట నవియే తిరుగుచుండెను. ఒక మలయ మారుతతరంగము వచ్చినపుడు పుష్పోద్యానమునందలి చివుళ్ళు పూవు లప్రయత్నముగాఁ గనిపించరాకుండఁ గలదన్న ట్లుండి నెమ్మదిగాఁ జలించుచునే యున్నట్లు, నిద్రాసమయమున సర్వేంద్రియములు ప్రశాంతములై యాత్మయొకఁడే భాసించునపుడు శరీరగత వాయువు నిర్వికారసంచారము చేయుచున్నట్లు, క్రతుహోమమున నింధనపరిజ్వాలదగ్ని యందు నిభృతమై తేజస్సులీనమై యున్నట్లు సభయందంతయుఁ దాళము, రాగము, నృత్యము, తజ్జనిత భావము నా సర్వభేదములు నంతరించి శ్రీరామచంద్రమూర్తి వికృతిరహితమైన యా జీవలోకమున నేకాకృతి భాసించినట్లు కనిపించెను. వెలుఁగుచున్న కాగడాలు నిశ్చలములై యూర్ధ్వజ్వాలామాలికలచేత నచంచలమనఃప్రవృత్తులై యోగుల వలె భాసించెను. శబ్దమంతయు నాకాశమున లీనమైన సృష్టి యుపసంహరించుకొనుచున్నట్లు కనిపించెను. సర్వనేత్రములును గిరికా మూర్తియందు బద్ధమై, సర్వజీవలోకముచేతను బరిసేవ్యమానమైన వైకుంఠ దేవుని వైభవమువలె గిరికయుఁ, జుట్టుననున్న సభయు భాసించెను. అర్చకులకుఁ, గాగడాలుపట్టిన చాకలులకు, ధ్వజస్తంభాగ్రమున వ్రేలాడు పటమునకుఁగూడ నైశ్చల్యము భాసించెను. పరమ చాంచల్యముచేత నిత్యవికారముచేత విసిగిపోయిన ప్రకృతి యొక్కసారి విశ్రాంతి గైకొన్నట్లు, పృథివ్యప్తేజోవాయ్వాకాశములు హఠాత్తుగాఁ దమశక్తులను గుంచించుకొని నిస్తబ్దములైనట్లు సర్వము నెచ్చటదచ్చట నిలిచిపోయెను. గిరిక నృత్యమే చేయుచున్నది. తాళ మాడుచునే యున్నది. హావభావములు కలుగుచునే యున్నవి. వీని యన్నింటిని మించి యీ మహారససిద్ధి యెట్లు కలిగెనో? కావ్యముల యందుఁ, దదితరసంఘటనములయందుఁ, దదితర నాయికానాయకు లందు పొందినది రసభ్రాంతి కాని యథార్థమైన రసస్వరూపము కాదని యీయొక్క నిముసమున ఋజువయ్యెను. సభయంతయు గిరికామయమై పోయెను. ప్రతివాని హృదయములోను దాను గిరికయే యనిపించినది; తాను జానకీదేవియే యనిపించినది. ప్రతిపురుషుఁడును, ప్రతిస్త్రీయు శ్రీరామచంద్రుని వివాహమాడినట్లే యనుకొనిరి. ఓహో! యీ తన్మయత్వమున కంత మెప్పుడు? నేటితో సృష్టి యాఁగిపోవునా

యేమి? ఈ మహానృత్యమున కవసానము లేదా యేమి? అల్పమైన శరీరము, అసమర్థములైన యింద్రియములు, శక్తిచాలని మనస్సు, వికారసహితమైన సృష్టి యీ మహానందమును బట్టుకొనలేకపోయినది. ఆ మహానందతరంగము పెరిగి పెరిగి, యాకాశముదాఁక [illegible]ఁగి, యాపైనుండి గిరికయొక్కసారి విఱుచుకొనిపడెను. భోగప్పకు వెంటనే ప్రాణములు తెలిసెను. 'అయ్యో! గిరిక, గిరిక' యనెను. సభయందఱకు నొక్కసారిగా మహాశైలాగ్రభాగమునుండి క్రిందికిఁ బడినట్లయ్యెను. అల్పప్రకృతులకు రసతన్మయత్వమాత్రముచేత నాత్మస్పర్శకలిగినవారికి వెంటనే తన్మహాభావమునుండి మనస్సువద్దకు నింద్రియములవద్దకు రా వీలయ్యెను. ఉన్నతప్రకృతుల కంత వీలు కాలేదు. భోగప్పశాస్త్రిమనస్సు రాగతాళములయందు నిత్యవ్యగ్రముగనుక రాగతాళచ్యుతికలిగినంతనే సామాన్యప్రకృతి నందుకొనెను. తక్కినసభ కంతకు నొకానొకపురాజన్మసంస్కారలేశము చేతఁ గలిగిన యామహారసానుభూతి తత్సంస్కారఫలానుభూతివేళ గడచిపోయినంతనే వెంటనే యింద్రియదృష్టి గోచరించెను. నిత్యయోగియైన ధర్మారావునకు రసాత్మనుండి యింద్రియములకు, నింద్రియములనుండి రసాత్మకును యాతాయాతక్రియ బహుసులభమగుటచేత నా మహాపురుషునకు వ్యత్యస్త మేమియుఁ గలుగలేదు. గిరికాదేవి మూర్ఛాగతయై ఇదియే యవసానదశయా యన్నట్లుండెను. అందఱును హృదయములయం దావేశమును బొందిరి. ఆమె చుట్టును మూఁగిరి. రత్నగిరిమొగమున వైవర్ణ్య ముదయించెను. సభయంతయు నాకులిత మయ్యెను. లేచి కలగుండఁ బడుచున్న సభాజనులను గూర్చుండ నియమించి, ధర్మారావు గిరికవద్దకుఁ బోయి యామెను స్పృశించెను. ఆపె కొంచెము కదలెను. ధర్మారావు 'తల్లీ!' యనెను. ఆమె కనులెత్తి చూచెను. 'ఇంకమూన్నాళ్ళునృత్యమున్న' దనెను. ఆమె లేచి నిలుచుండెను. ఆయన రెండు మృగశీర్ష హస్తములుచేసి భుజశిరస్సులసమీపమున నెదురెదురుగాఁ బట్టెను. శ్రీకృష్ణావతార హస్తము గోచరించినంతనే, గిరిక లేచి నిలుచుండి—

ముఖారి—ఆది

కృష్ణం కలయ సఖి సుందరం; బాల

కృష్ణం గతవిషయతృష్ణం జగత్ప్రభ
విష్ణుం సురారిగణజిష్ణుం సదా బాల ॥కృష్ణం॥
నృత్యం త మిహ ముహు రత్యంత మపరిమిత
భృత్యానుకూల మఖిలసత్యం సదా బాల ॥కృష్ణం॥

అని నృత్యము చేసెను. స్తంభించిపోయిన తాళము, మృదంగము, వీణ, వేణువు సర్వమును పులకితములై మోట్లాయితను పొందెను. శబ్దప్రపంచము మరల నుజ్జీవితమైనట్లు గణగణలాడెను. ధర్మారావు దక్షిణహస్తము నెత్తినంతనే కుంభహారతి పట్టఁబడెను. వెంటనే స్వామి యూరేగింపునకు బయలుదేఱెను. స్వామి వచ్చి వాకిట నిలిచియుండెను. నాగేశ్వరస్వామివారు వచ్చుట యాలస్యమయ్యెను. ఇరువురును స్థితిలయములవలె బయలుదేఱిరి. రంగనాయకులుకోడుకు కృష్ణమ్మ సన్నాయి చెఱిగిపోయుచుండెను. త్యాగరాయప్రభువుచేసిన సృష్టియంతయు మరల పునస్సృష్టి యగుచుండెను. అతఁడు స్వరము నడుపు పద్ధతి, రాగకల్పనచేయు నుపజ్ఞ, గ్రామము, తానము, గమకములు సర్వమును మహోన్నతదశయం దుండెను. స్వామి కోట ముందఱకుఁ బోయెను. కృష్ణమ్మ కావడిచిందులు పాడెను. హరప్పనాయనిహృదయ మల్లల్లనఁ దేలిపోయెను. స్వామి యటనుండి పట్టణము వెంటఁబోయెను. హరప్ప దిగఁబడెను. ఆలయమునుండి కోటవఱకును శ్రోతృజనసమూహముతో వచ్చిన హరప్పకోటముం దాఁగిపోయి లోనికి నడచిపోయెను. ఇద్దరుకాగడావాండ్రు చెఱియొకవైపున నడచిరి. చూచినజనమునకు హరప్ప హరిశ్చంద్రుఁడో, పురూరవసుఁడో, నలుఁడో యన్నట్లుండెను. వృద్ధపరిచారకులకు హరిహరనాయుఁడో, హరప్పనాయఁడో, కృష్ణమనాయఁడో యన్నట్లుండెను. హరప్ప తనగదిలోనికిఁ బోయి తలగుడ్డయు, నంగీయును దీసి, తన శయనముమీఁదఁ బండుకొనెను. ఒకపరిచారకుఁడు వచ్చి పాదసంవాహనము చేయుచుండెను. నాయఁడు వానిని బంపించి, నీటిలోఁ దాఁచేటివలె మనసులోఁ ద్రవ్వుకొనెను. "ఓహో! ఇది యేమి నృత్యము. ఇది యేమి స్వామి? ఇతఁ డేమి ధర్మారావు! నేను కల్యాణము లన్న వట్టియుత్సవములనుకొంటిని. ఓహో! ఇవి యుత్సవములు కావు. ఇది యేదో సృష్టివ్యాఖ్యానము. రసస్వరూపనిర్ణయము.

వేదార్థబోధనము. ఇది నాజన్మసఫలముకొఱకు వచ్చిన ట్లున్నది. ధర్మారావుగారికి భరతశాస్త్ర మింత యెట్లు వచ్చెనో? ఆయన శ్రుతిస్మృతిపురాణేతిహాసకావ్యార్థనిధివలె నున్నాఁడు. ఇట్టి మహా పండితుని మాతండ్రి పరిత్యజించి, కృతకమతస్థు నొకనిని జేరఁదీసి మతము, సంఘము, రాజ్యము, దైవము, పట్టణము సర్వము నధోగతికిఁ దెచ్చెను. ఈ యధోగతిలో నే నుండియేమి, యుండక యేమి? నే నీ కాలమునకుఁ దగినవాఁడను గాను. నే నేమి కావలసియున్నది? వివాహ మాడుదునా? నాకుఁ గూఁతు నిత్తునని వచ్చిన జమీందారు లేఁడు. నా కిరువదియేండ్లు దాఁటినవి. పెండ్లి యాడుదునా లేదా? నాకు వివాహ మెందులకు? సీతాదేవి శ్రీరామచంద్రునియం దంతమహాప్రేమ కలది యెట్లయ్యెనో? రామచంద్రుఁ డెట్లును శివధనుర్భంగము చేయును. ఎవఁడు శివధనుస్సు విఱుచునో యట్టివానిని జూచియే సీతాదేవి ప్రేమించుట యేమిటి? బ్రహ్మ వారిద్దఱును బరస్పరము ప్రేమించునట్లు, భవిష్యద్విషయము లన్నియు వారి కతుకునట్లు నిర్మించినాఁడు కాఁబోలు! ఈ జగత్తు చాల విచిత్రముగా నున్నది. ఏది చూచినను గార్యకారణపరంపరగా నున్నది. నేఁడు నే నిట్లుంటి ననఁగా, మాతల్లి చనిపోవుట కారణము. మా తండ్రి నిరాదరణచేయుట కారణము. నాతండ్రి నన్ను చిన్ననాఁటినుండి ప్రేమగాఁ జూచి, తక్కిన జమీందారులు తమపిల్లవాండ్రనువలెనే పెంచినచో నేనును వారివలెనే యయ్యెడివాఁడను అప్పుడు నేనుగూడ ధర్మారావుగారిని దిరస్కరించి యుందును. నేను కేమజ్జిమతానుయాయినై యుందును. నా తల్లికిఁ గర్మలు లేవు. స్వామికి కల్యాణములు లేవు. దేవదాసి నిత్యబ్రహ్మచారిణియై, యోగ్యమైన వినియోగము లేని తనబ్రదుకుతో నేమి చేసెడిదో! దేవదాసి యెట్లును జనిపోవును. నా పట్టణమంతయుఁ బూర్వమే శిథిలమైనది. అనవసరముగా గణాచారి బట్టుకు వ్రేలాడుచున్నది. పసిరిక పని యైనట్టే. నేనును బ్రదుకవలసినవాఁడను గాను. ధర్మారావుగారి కేమి? వికల్పరహితుఁడైన యాయన యెట్టి సందర్భములనైన నట్లే యుండును. నీటిబొట్టు తామరాకున కంటనట్టు లాయన వేనికి నంటుట లేదు. భార్య యంత వ్యాధిగ్రస్తు

రాలై యుండఁగా నాయన దేవదాసిమోక్షమార్గమునం దెక్కువ యాసక్తిగా నున్నాఁడు. ఆ యరుంధతీదేవి మొగమునఁ గొట్టవచ్చుచున్న పాతివ్రత్యరేఖతప్ప మఱియొకఁడు నాకుఁ గన్పించుట లేదు. ఆమె జీరాడుచీరవలన మనిసివలెఁ గన్పించుచున్నది. ఆమె యేమగునో? ఆహా! నిర్లిప్తుఁడైనవానికి నవనిధులు దగ్గఱనున్నను లేనియట్లే. 'యథా పూతం మహోనిధి రసి పవిత్రస్య మహసః' అని యరుంధతివలన వసిష్ఠమహర్షియైనను దాను బవిత్రుఁడ ననుకొన్నాఁడఁట. ఈ యరుంధతీదేవివలన నీవసిష్ఠుఁ డట్లనుకొన్నట్లు లేదు. నాకు మోక్షము వచ్చునా? దేవదాసికిఁగనుక నంతటి తన్మయత్వమబ్బినది. నేనుగూడ నీ సంవిధానమునుచేఁ దరించిన నెంతబాగుగా నుండును? నాకుఁ దల్లి లేదు, తండ్రి యుండియు లేనట్లే. ఎట్టిరాజ్యమేలుటకు నేను వాంఛించుచుంటినో యట్టిరాజ్యమే లేదు. దానికనుగుణమైన పరిస్థితులు లేవు. దేవదాసితోఁబాటు, పవిత్రురాలైన యరుంధతితోఁ బాటు నేనుకూడ నశించిపోయిననే బాగుగా నుండును.' ఆ మఱులిప్తలో నాయనపంచేద్రియజ్ఞానము సుషుప్త్యవస్థలో నంతరించెను. బయటఁ దెల్లవారుచుండెను. తూర్పున నుదయించఁబోవు సూర్యుని కాంతి యెగఁదట్టెను. కొండచఱియ నెక్కలేని సప్తాశ్వముల కాలిగిట్టలు నునుపైన కొండచఱియలపై జాఱుచుండఁగా వడిగల యనూరునికశాఘాతమునఁ దాళలేక మెగురుచు నురుసులు గ్రక్కఁగా నా నురువుకాంతి తూర్పునం దలికినట్లై యుషఃకాంతి ప్రజ్వరిల్లెను. వేణుగోపాలస్వామి యూరేఁగియేఁగి తన క్రొత్తరాజ్యమంతయుఁ జూచుకొని తెల్లవారుచుండఁగా దేవళము వద్దకుఁ జేరెను. సర్వజనులును స్నానము చేసిరి. తమతమకార్యములందు నిమగ్నులైరి.

త్రియోదశి వచ్చెను. మఱల వివిధోత్సవములు జరిగెను. ఆటలు, పాటలు, మేళములు, భజనలు, పగటివేషములు, గారడీలు, సంగీతసభలు పవలెల్ల నుత్సవములతోడ నే సరిపోయెను. మనుష్యులెల్ల నెవరి కనుగుణమైనచోట వారుండిరి. భజన వచ్చినవారు భజనలతో, సన్నాయి వచ్చినవారు సన్నాయితో, నీరీతి నెవరి కేది వచ్చిన వారు దానియందు నిమగ్నులైరి. భజనలు నాగేశ్వరస్వామివారియాలయ

ములో జరిగెను. తక్కినవన్నియు వేణుగోపాలస్వామియాలయము ముందటి పందిరిలో. అందఱును సందడిలోననే యుండిరి. ఇర్వురు మాత్రమే తమకును లోకమునకును సంబంధములేనట్లుండిరి. ఒకర్తుక దేవదాసి- ఆమె బాలగోపాలమంత్రమే జపించుచుండెను. రెండవ వాఁడు భోగప్పశాస్త్రి- ఆయన గాయత్రియే చేయుచుండెను. గాయత్రీమహామంత్రము ననుష్ఠానమే చేయవలయునుగాని, యది బ్రహ్మాస్త్రము. ఆచరించువారు లేరు. ఆ మహామంత్రముయొక్క శక్తిని గుర్తెఱుఁగువారు లేరు. బ్రాహ్మణునితో మంత్రమును నశించెను.

ప్రొద్దు గ్రుంకెను. సుదర్శనమహాచక్రముయొక్క వేయియంచులను బరిభ్రమించినట్లు వెన్నెలలు నాల్గుమూలల గిరగిర తిరిగి వచ్చెను. నందకమహాసిధగధగలాడినట్లు ఆలయధ్వజస్తంభము ధగధగలాడెను. శ్రీకృష్ణదేవుని గరుడధ్వజమువలె ధ్వజపట్టము వాయువిధూతమై తపతపకొట్టుకొనెను. శ్రీనాగేశ్వరస్వామిశిరసికోటీరమణి జాబిల్లి తనవెల్గుచేత నాల్గుదిక్కులు కబళించెను. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి చెదరిపోయినవేయితలలును గూడివచ్చినట్లు చంద్రికలు సర్వజగన్మనోహరత నాపాదించెను. ఆ మహోత్సవములో సుబ్రహ్మణ్యేశ్వరుఁడు తనకు వేయితల లున్నట్లే భావించెను. నాగేశ్వరస్వామి తాను కైలాసగిరిశిఖరాగ్రభాగమున నివసించుచున్నట్లే యనుకొనెను. శ్రీ వేణుగోపాలదేవుఁడు తాను మఱల దశావతారము లెత్తినట్లే భావించెను. జాముప్రొద్దుపోయినంతనే గిరిక రాధికావేషమును దాల్చి యీర్ష్యాకషాయితయై, ఖండితయై—

భైరవి - ఆది

యాహి మాధవ, యాహి కేశవ, మా వద కైతవవాదం
తా మనుసర సరసీరుహలోచనయా తవ హరతి విషాదం॥యాహి॥
రజనిజనితగురుజాగరరాగకషాయవిలాసనిమేషం
వహతి నయన మనురాగమివ స్ఫుటముదితరసాభినివేశం॥యాహి॥

అని ఖండితానాయికాభినయ మారంభించెను.

ఉరమున నున్న కుంకుమ ముజ్జ్వలరోషకషాయవీక్షణ
స్ఫురదరుణాంశుపుంజ మసి బొంకెదు కన్గవకెంపుభాగ్యబం

ధురసహజారుణత్వ మని నూల్కొననాఁడెద వెట్లు దాఁచెదీ
పరిమళవాసనాలహరి పర్వెడు మేన వ్రజాంగనాప్రియా !

అని శ్రీకృష్ణదేవుని మాటాడెను. ఆమె యంతలో మఱల ముగ్ధయై చింతాపరాధీనచిత్తయై మాటాడక యూరకుండెను. నటుఁడు 'ఏమమ్మా! మాటాడ వేమి? నీ దీర్ఘనిశ్శ్వాసములచేత నీహృదయములోని సంతాప మనుమీయమాన మగుచునే యున్నది. ఈ స్వామి చూడు! నిర్దయుఁడై సువ్యక్తపరస్త్రీసంయోగచిహ్నితశరీరుఁడై యెదురుగా వచ్చి నిలుచున్నాఁడు. నీ కడుగవలయు ననియే యున్నది. కాని యడుగ లేవు. నీ వింత ముద్దరాలవు గనుకనే స్వామి కింత యాగడమైపోయిన' దనెను. ఆమె 'ప్రాణమిత్రమా! యెదురుగావచ్చి స్వామి నీ వన్నట్లు నిలువను లేదు, నే నడుగవలయు నని తలఁచను లేదు. నీవు కొంచెము చన్నీళ్ళు తెచ్చిపెట్టినచో మొగము కడుగుకొందును. నా కన్నులీ ప్రాతర్వాయుతరంగానీ[illegible]క్ష్మరేణువుల చేతఁ గలుషితములైనవి. ఒకరి ననియే మనవలయును? మనభాగధేయమును నిందించుకొనవలయు' ననెను. అని సర్పశీర్షహస్తముతో నీ రని చూపించి ముఖక్షాళనమును జేసికొనెను. నటుఁడు 'అవునమ్మా! ముగ్ధవై యెంత ప్రయోజనమో, ధృష్టుఁడైన నాయకుని యందు మధ్యవయస్య వంతియే ప్రయోజనము. ప్రగల్భవై గట్టిగా నిందించినఁగాని యీయన లొంగఁ' డనెను. గిరిక——

బహి రివ మలినతరం తన కృష్ణ మనోపి భవిష్యతి నూనం
కథ బథ వంచయసేజనమనుగత మసమశరజ్వరదూనం ॥యాహి॥
భ్రమతి భవానబలాకబళాయ వనేషు కి మత్ర విచిత్రం
ప్రథయతిపూతనకైతవవధూవధ నిర్దయ బాలచరిత్రం ॥యాహి॥

అని అభినయించెను. నటుఁడు 'తల్లీ! నీ వంతకోపపడకుము! నీ వింత కోపించితి వని స్వామి నేఁడు తనగుణము మానుకొనునా? ఎవరిగుణము వారిది. స్వామి నాదరించు' మనెను. గిరిక 'కాదమ్మా, చెలీ! ఈయన యెల్లప్పుడు నింతియే. మనము మెత్తనడిచినచో లాభము లే' దనెను. నటుఁడు 'అట్లైనచో నీ కొకయుపాయము చెప్పెదను. నీవు స్వామిని లోనికి రానిచ్చి యతని నవమానించి పంపుము. అప్పు డతనికిఁ దనదోషము తెలియఁగల' దనెను.

'మొదట నిన్ను స్వామి వచ్చి బతిమాలునట్లు చేసెదను. అప్పుడు నీవు నీయిష్టమువచ్చినట్లు జేయవచ్చు' ననెను. అంత స్వామి వచ్చి యామెను బతిమాలుట కారంభించెను.

ప్రియే! చారుశీలే! ప్రియే ముంచ మయి మాన మనిదానం
సత్య మేవాసి యది సుదతి మయి కోపినీ
దేహి ఖరనఖరశరఘాతం
ఘటయ భుజబంధనం, జనయ రదఖండనం
యేన వా భవతి సుఖజాతం ॥ప్రియే॥
సపది మదనానలో దహతి మమ మానసం
దేహి ముఖకమలమధుపానం ॥ప్రియే॥

అని స్వామి ప్రార్థించెను. గిరిక కలుక తీఱలేదు. ఆమె 'ఓయీ స్వామీ! నీ కిచ్చవచ్చినచెలి యెవరో యామెతోఁ బోయి సుఖించవచ్చును. మ మ్మేల తలఁచెదవు? పొ' మ్మనెను. స్వామి బతిమాలుట యెంతకును మానలేదు.

త్వమసి మమ భూషణం త్వమసి మమ జీవనం
త్వమసి మమ భవజలధిరత్నం
భవతు భవ తీహ మయి సతత మనురోధినీ
తత్ర మమ హృదయ మతియత్నం.

చివఱకుఁ గొంతసేపటికి దేవదాసి కలుక తీఱెను. గోపాల స్వామియు, రాధికయుఁ గలిసి మెలసియుండిరి. నటుఁడు 'ఏమమ్మా, గిరికా! నీకు స్వామిసంయోగము కలిగిన దని యొడలు పైఁ దెలి యుట లేదు. ఇతనిని నీ వవమానించినఁగాని యితని దోషమునకుఁ దగిన శాస్తి జరుగదు. నీవు స్వామిదొరకెఁగదా యని తన్మయత్వ ములో నుంటివేని యతఁడు మాటిమాటికిని దిరస్కరించును. కనుక నీ వతని నవమానించవలయు' ననెను. గిరిక 'యట్లు కాదే చెలీ! స్వామి రాకరాక మనయింటికి వచ్చెను. వచ్చిన స్వామిని చెదరఁ గొట్టుకొనరాదు. ఆయనయు నేనును గలిసియుండఁగా మీరు చూడ లేకపోవుచున్నారు. మీరు తక్కువవారా?

సావేరి - త్రిపుట

కొంచెగత్తెలా మీరో చెలియరో! కొంచెగత్తెలా!
కొంచె త్తెలా నాగుణము తెలియక నన్నుడి
కించవాఁడు తాము కేరి కేరి నవ్వేరు ॥కొంచె॥

అని నిరాకరించెను. కాని మఱల స్వామి గోత్రస్ఖలనదోష మాచరించఁగా గిరికకుఁగోపమువచ్చి స్వామిని నిందించెను. స్వామికిఁ గోపమువచ్చి వెడలిపోయెను. తరువాత నామె భ్రాంతి పొందెను. సంతాపపడెను. సమ్మోహ మందెను. దీర్ఘనిశ్వాసమును వదలెను. నటుఁడు చూచి 'ఏమమ్మా యిట్లయితివి? పతిని మొదట నేల నిరా కరించవలయును? మఱల నిప్పు డేల యిట్లు చింతపడవలయును?' అనెను గిరిక—

తోడి - త్రిపుట

ఏ మంటి నమ్మా నాసామి నే నే మంటి నమ్మా
కోమలాంగిరో మువ్వగోపాలసామి నే
వామాక్షి! నాసరివారు నవ్వే రని
వేమాఱుమాటాడ వెఱచి నే నుండఁగ
నామన సింతైన నాథుఁడు తెలియక
ఆ మందయానతో నాచుకొన్నాఁ డకె ॥ఏమంటి॥

అని యభినయించెను. నటుఁడు 'ఏమమ్మా! నీ వేమియు ననలేదా? అనకుండనే వెళ్ళిపోయెనా? నీ వేమో యూరకే నీ తాపము నీలోననే యడఁచుకొనుచుంటివి. నీ వెప్పుడును ప్రథమ మున ముద్దరాలవు; మేము నిబోధింవికాని మధ్యవు కావు; చివర కెప్పుడో ప్రగల్భ వయ్యెదవు. అప్పటికిఁ గథ యడ్డముగాఁ దిరుగు చున్నది' అనెను. గిరిక యిట్లన్నది: 'ఓ నేత్రమా! నీ వేల మెట్ట నైతివి? ఓ చిగురుకేలా! నీ వేల స్వామిని నేను తిరస్కరించునపుడు కోపమున కనుగుణముగా నభినయించితివి? ఓనాలుకా! నీ వాయనతో నేల జగడమాడితివి? ఆ వేళాపరిపాక మిట్టిది. కనులారఁ జూచుకొని, చేతులారఁ గౌఁగిలించుకొని, నోరార ముద్దుపెట్టుకొన్న యాస్వామిని మీ రిళ్లల చేసితిరో తెలియలేదు.' నటునివంకఁ జూచి యభిన యించెను.

సారంగ — చాపు

అలుక దీఱెనా, నేఁడైన మీయలుక దీఱెనా?
పలుకులాడికొంటిరా మువ్వగో
పాలుఁడు నీవు ముద్దులగుమ్మ ॥అలుక॥
చక్కఁజమ్మ మీయిద్దఱిమనసు చల్లనాయెనా?
నిక్క మానతీయవే నేఁడు మీ నెంజిలి తీఱెనా
మక్కువతో నేఁడైన మీకు మంచిదిన మాయెనా?
అక్కడిక్కడ విభుఁడు నీ వరుసురని యుంటిరె చెలియ!
॥అలుక॥

నటుఁడు 'చెలీ! నేను నీ ప్రియసఖిని; నీవు నన్నుఁ బరస్త్రీ ననుకొనుచున్నావు. నేను కాదుసుమా! నేను నీతోఁ జెప్పుచుంటిని గదా! నీ స్వామి మంచివాఁడు కాదని. నీవు వాఁడే జగన్నాథుఁడని యబ్బిపోతి' వనెను. గిరిక 'చెలీ! స్వామిమీఁద చాడీలు నాతోఁ జెప్పకుము. నే నాయన ననరానిమాట లని యతనిమనస్సు చాల నలయించితిని.'

సైంధవి — ఆది

నా కోపమే న న్నింత చేసె నమ్మా
రాకేందుముఖి! నా వద్దిరమణు లతనిపై చాడిపలుకఁగ
॥నాకోప॥

నేనే పోయి పిలువవలెనో నెలఁత నంపుదునో
పూని వాని చెలులతోనే పొసగఁ దెలుపుదునో
వానిమనసు నామనసు తెలిసినవనిత నీవే తెలిపేవో
ఈ నేరములు కాచి యిప్పు డింటికి రమ్మనవే ॥నాకోప॥

అని తన్నుఁ దాను నిందించుకొనుచు, గిరిక దుఃఖించుచుండఁగా నటుఁడు 'చెలీ, నిన్ను వదలి యతఁ డెచ్చటనో, యేయంద కత్తె యింటనో యున్నాఁడు. అతనికై యిప్పుడు నీవు దిగులుపడి యేమి లాభము? అట్టిమగఁ డుండి యేమి లాభము ఊడి యేమి నష్ట మనెను. అన్నంతనే గిరిక యొక్కసారి మూర్ఛపోయి, లేచి, దుఃఖముచేతఁ గదలిపోయియెంతమా టన్నావు, ఎంతమా టన్నావు?

సావేరి — త్రిపుట

లేమరో మా మువ్వగోపాలుఁ డెందైన లెస్సయుండితె చాలునే
వేమారు మాటే వింతగవా బావిలో నీరు వెల్లువ పొయ్యేనటవే
యెంతటిదిటవే ॥లేమ॥
నా పుణ్యము చక్కనౌనాఁటిదెన్నంతెల్ల నన్ను చేపట్టలేదా
యీపట్ల విడవాడె వెన్నెల చీకటి యెవరికైన లేదా?
వానితో వాదా ॥లేమ॥

అని తల్లడిల్లిపోయెను. ధర్మాత్ర వసుకొనెను. 'నటుఁడు గిరికను మఱియు నొంటయు మన్నాఁడు. ఓహో! భోగప్ప! మా గిరిక యదృష్టముకొలఁది దొరకినావు.'

భోగప్ప రాత్రి రెండుజాములు దాఁటె నని గుర్తించెను. స్వామి మరల నూరేఁగఁబోవుటకు బయలుదేఱువేళ యైనది. భోగప్ప 'చెలీ! నీవు దుఃఖించకుము. స్వామిని దీసికొనివచ్చి యీ పొదరింటిలో దాఁచినాను. నీవు పోయి స్వామిని గలిసికొను' మనెను. తెర యడ్డముతీయఁగాఁ బొదరింటిలో స్వామి కూర్చున్న ట్లలంకారము జేయఁబడియుండెను. వేణువు చేతఁబూని స్వామి యా పొదరింటిలో నక్కియుండెను. భోగప్ప—

మంజుతర కుంజతల కేళిసదనే
ఇహ విలసరతిరభసహసితవదనే
ప్రవిశ రాధే మాధవసమీప మిహ ॥ప్రవిశ॥
నవభవదశోకదళశయనహారే
ఇహ విలస కుచకలశతరళహారే ॥ప్రవిశ॥
వితతబహువల్లి నవపల్లవఘనే
ఇహ విలస పీనకుచకుంభజఘనే ॥ప్రవిశ॥

కుంభహారతి యెత్తఁబడెను. భోగప్పశాస్త్రి నృత్యముచేసెను.

విహితపద్మావతీసుఖసమాజే
భణతి జయదేవకవిరాజరాజే ॥ప్రవిశ॥

చంద్రుఁడు గగనగిరినితంబముపైఁ గాలుమోపెను. శ్రీ వేణుగోపాలస్వామి గిరివోనిగజవాహనముపైఁ గాలు మోపెను. స్వామి యూరేఁగఁబోయెను. సర్వజనులును వారివెంట నూరేఁగబోయిరి.

అరుంధతీధర్మారావులు కలిసి రామేశ్వరశాస్త్రిని వెదకిరి. అతఁడు కనిపించలేదు. ఇర్వురును గలిసి యింటిముఖ మైరి. జనమందఱును స్వామివెంటఁ బోయిరి. వా రింటికిఁ బోవుత్రోవ నిర్జనమైనది. వెన్నెలలు చక్కఁగాఁగాయుచుండెను. ధర్మారావుభార్య నానుకొనినడుచుచుండెను. ఆమెతనబరువంతయుఁబతిబుజముపై మోపి నడచుచుండెను. అతఁడుతనచేయి యామెనడుమునఁ బెనవైచి యామె నెత్తుకొనియే నడుచుచుండెను. ఆమెపాదములు మధ్యమధ్య నేలకుమాత్రము తగులుచుండెను. అరుంధతి వ్యాధిగ్రస్త యని యిర్వురి యంతరాత్మలలో నున్నది. ధర్మారావు పిల్లవాఁడు కనుపించలే దేమి? వాఁడు వట్టి పలుగాకి పుట్టినాఁడు' అనెను. అరుం—తండ్రికిఁదగిన కొడుకే! ధర్మా—నేను పలుగాకినా? అరుం—ఆమాట నే ననలేదు. ధర్మా—ఆమాటమాత్రము నీ వనలేదు అరుం—నడుమువద్ద నాకు బాధగా నున్నది. మీరు వదలిపెట్టుఁడు. నెమ్మదిగా నడచి వచ్చెదను.

ధర్మారా వట్టు కాదని యామెను రెండుచేతులలో నెత్తుకొని నడచెను. తరువాతఁ బదియడుగులలో నిల్లు వచ్చెను. ఇంతలో వెనుకకుఁ దిరిగి చూడఁగాఁ జిన్నయరుంధతి వారివెనుక వచ్చుచుండెను. ఆమె పకాలున నవ్వెను. అరుంధతి సిగ్గుపడి 'యెందుకే నవ్వెద' వనెను. చిన్నయరుంధతి 'నిన్నాయన చేతులలో నెత్తుకొనుట చూచితి' ననెను. అరుంధతి 'నిన్ను నెత్తుకొనును లే. దిగులు పడకుము. దగ్గరకు వచ్చిన' దనెను. చిన్నపిల్ల మధురలజ్జాభినయము చేసెను. వెన్నెల లరుంధతి దువ్వుకొన్నశిరోజములపైని దళతళలాడి, యచటనుండి జలపాతమువలె జాఱి చిన్నయరుంధతి తలమీఁదఁ బడి, నురుసులు గ్రక్కిన ట్లయ్యెను. ధర్మారా వా వెన్నెల సొగసు కనులతోఁ ద్రావెను. వారుమువ్వురు నింటిలోనికిఁ బోయిరి. చిన్నయరుంధతిని వాకిటఁ బరుండు మనిరి. ఆమె తనకు భయ మని వారినడుమఁ బరుండెను. అతఁడు లేచి వాకిటిలోనికిఁ బోయెను. అరుంధతి యామెను 'నీవు... బాగుగాలేదు' అనెను. చిన్నయరుంధతి బిక్కమొగము వేసెను. అరుంధతి యామెను సముదాయించెను. అరుంధతి యిట్లన్నది: 'నీవు పెద్దదానవు కాదు; పిన్నదానవు

కాదు. ఏదో శాస్త్రము చెప్పినట్లు—నేయి యని తాగుటకు లేదు, నూనె యని తలకుఁబోసికొనుటకు లేదని'

చిన్న అరుం—నే నేమి చేసితిని? అరుం—ఈడు వచ్చినపిల్లవు... చిన్న అరుం—నీవు మిన మిద్దఅము నొకటి యంటివికదా! ఒకటి కాదా చెప్పుము. అరుం—ఒక్కటియే నమ్మా! ఒక్కటియే. నీవు బోయి మీాయమ్మవద్దఁ బరుండుము' అనెను.

సూర్యోదయ మయ్యెను. చతుర్దశి వచ్చెను. స్వామి బలి హరణము తిరిగెను. నానావాద్యమహానినాదముచేత భూనభోంత రాళములు ఘోరు మనెను పగలు రెండుజాములైై సర్వజనులు భోజ నము చేసిరి. కొందఱు విశ్రమించిరి. కొందఱు నిద్రించిరి. మఱికొంద ఱు భజన లారంభించిరి. పగటియుత్సవములన్నియు నాగేశ్వరస్వామి యాలయాములోననే జరుగుచుండెను. గణాచారి భజనలు వినుచు దేవాలయమునం దాసీన యయ్యెను. ప్రొద్దు వాటారెను. సాయం కాలమున సంగీతసభలు జరిగెను. షుఱలఁ బ్రొద్దుక్రుంకెను. మఱల వెన్నెలలు వచ్చెను. వెన్నెలలు తమాలవృక్షపల్లవములపైఁ దళతళ లాడి బాలగోపాలదేవుని శరీరముపైఁ బ్రసరించినట్లుండెను. మాకంద పల్లవాంతములఁ బ్రాఁకాడి స్వామి నేత్రాపాంగములయందుఁ బ్రసరించిన ట్లుండెను. పున్నాగపుష్పములయందు గుత్తులుకొని జగ న్నాథుని గొల్లచెవిజంపుచుట్టును ముసరిన ట్లుండెను. కురంటకపల్లవ ములంటి రక్తచ్ఛాయ లలముకొని నందనూనునినఖములంబలె సుమ నోహరము లయ్యెను. జంబూతరుమృదుకిసలయములతోఁ గలిసి మెలసి దేవదేవుని శిరఃకలితమయూరీపింఛపుసిగ్గులు తేరెను. బిల్వప త్రములపై నటునిటుకదలి భాగీరథీజనకపాదాంభోజుని పూజాభిలాష వలె వినమ్రములయ్యెను. శమీావృక్షబాలశాఖాగ్రముల నుయ్యెల లూఁగి సూర్యాగ్నినేత్రునిదృష్టివలెఁ దేజోనిధానము లయ్యెను. కద ళీపరిపక్వఫలస్పృష్టములై స్వామికి నైవేద్యవాంఛామూర్తిభావము వలె గోచరించెను. సపఁగిపండిన పూఁజేకులలోఁ దూఱి యాణిముత్తె మమర్చిన బాలగోపాలదేవునినాసాపుటములవలె భక్తజనమన ఆహ్లా దిను లయ్యెను. మలయమారుతపరిస్పందసమానవారికేళకుసుమములతోఁ గలిసి బృందానాథునియెడలఁబూసిన గందపుపేడులు రాలుచున్నట్లు

కనిపించెను. ఆరగ్వధతరుపల్లవములందుఁ గ్రొత్తజిగు లెక్కించి పీతాంబరచ్ఛాయలు వెలార్చెను. పగిలిన ప్రత్తికాయలు వెన్నెలలోఁ బాంచజన్యములవలె భాసించెను. పగిలిన యుమ్మెత్తకాయలు సుదర్శనచక్రములవలె, బండిన గేదంగిరేకు నందకాసివలె, నవిసెపూవులు కౌమోదకులవలె వెన్నెలలోఁ దళతళలాడెను. బృందావనములోని దేవాలయోద్యానమంతయు భగవంతునిస్వరూపమై భవాయుధశోభాపరిపూర్ణ మయ్యెను. ఆలయమునందలి సరస్సు లేఁతతరంగములపై వెన్నెలల నోలలాడించి క్షీరసాగరానుకారి యయ్యెను. పదిదిక్కులును బుక్కిలించినవెన్నెలలు శిశిరవిప్రుఁ డభిరామములైన కేళకుళులు తిరిగినట్లు, ప్రావృడంభోధరములు నిరంతరసౌదామనీదీప్తిమల్లోకముఁ గురిసినట్లు శైత్యము, జ్యోతిస్సు రెండును యుగపదుజ్జృంభితములుగాఁ జేసెను. దేవదాసి పరిమలినవస్త్రయై నిరాభరణసుందరియై మూర్తికట్టినవిషాదమువలెఁ బ్రోషితభర్తృకాకృతి రంగమున కవతరించి——

మోహన - ఆది

పరదేశమునఁ జేసిన పను లెందు చెప్ప రాకురే
తరుణులార! యిదెక్కడిజోలి తాళఁగద రెమీాపుణ్యమయ్యేని॥పర॥

అని సంతాపవ్యాకులత్వము నభినయించెను. నటుఁడు 'మిత్రమా! స్వామి నిన్ను వదలి మధురాపురమున నున్నాఁడు. నీవు ప్రోషితభర్తృకవై యిచట దుఃఖపడుచున్నావు. ఇది కలహాంతరితావస్థయో, ఖండితావస్థయో? విప్రలంభావస్థయే యైనచో నేను నీకు సాయముచేసియుందును. ఎక్కడి బృందావనము, ఎక్కడి మధురాపురము? నేను వెళ్ళున దెట్లు? తోడితెచ్చున దెట్లు? నీ యవస్థలు నీవు పడవలసినదే కాఁస' యని యూరకుండెను. గిరిక-

ఘంటారాగము - ఝంప

ఈ మేను జీవునకు నెంత ప్రియ మాయెనే
భామ మామువ్వగోపాలుకౌఁగిటలేని ॥ఈ మేను॥
పడఁతి నే నొకచోట ప్రాణేశుఁ డొకచోట
కడలేని విరహాగ్ని కాఁగియున్నది చాల
పుడమిలో వేఱె జన్మము లేదె సుదతి ॥ఈ మేను॥

కంతుకేళి మువ్వగోపాలుఁ గలిసియున్నది తలఁచి
వింత దోఁచి నామనసు వేవిధము లాయెన్
ఇంతతో విభుసేమ మీవఱకు వినవైతి
ఎంతవ్రాఁత వ్రాసియున్నదో యింతకుఁ దాళియున్నది॥ ఈమేను॥

అని మెత్తుకొనుటలోనే మూర్ఛవద్ద నందుకొనెను. నటుఁడు 'ఓహో! యిట్లు కా' దని, "యేమమ్మా! అప్పుడే చివరిదాఁకపోతివి. స్వామియైనను దన ప్రేమనేత్రములచే నిన్నుఁ జూచుచునే యున్నాఁడు. నీ వింత దుఃఖపడనక్కఱలేదు. చూడు మసలు స్వామి యందు నీఁకుగల యభిలాష యెట్టిదో తెలియఁజేయుకయే 'నేను చని పోయెదను, చనిపోయెద' ననినచో లాభము లేదు. స్వామియందు నీకుఁగల యభిలాష యెట్టిదో చెప్పు" మనెను. గిరిక దుఃఖభారము చేత సఖితో మాట్లాడ లేదు. తామరాకులును, శైవాలమును దెచ్చి శయ్య యమర్చెను. మాటాడఁబోయి గాద్గదిక వహించెను. కంటి వెంట నీరైనను లేదు. ఎద లోఁతుచూపుతో నట్లే నిలిచియున్నది. నటుఁడు సంతోషించెను. సంతోషించి "నీ వింత ముద్దరాలవై యున్నావు. నీ యభిలాషయు విచిత్రముగాఁ దెలియుచున్నది. స్వామి సంతోషించినాఁ" డనెను. అపుడు నాయిక యన్నది:

వాస స్తదేవ వపుషో వలయం తదేవ
హ స్తస్య సైవ జఘనస్యచ రత్నకాంచీ
వాచాలభృంగసుభగే సుతభా సమ స్త
మద్యాధికం భవతి మే సఖి! కిం నిదానమ్.

నటుఁడు ఔనమ్మా! నీవు చాలఁ జిక్కిపోతివి. స్వామి కంస వధార్థము మధురానగరమునకుఁ బోయి, యీ బృందావనము మాటయే మఱచిపోయినాఁడు. తొలినాఁడు నీతోఁ జేసిన బాసతే విస్మరించినాఁడు. 'పృథివి నధిపులు నూతనప్రియులుగారె!' యనెను. దేవదాసి చింతావివశత్వము పొంది, 'సఖి! ఆ నందనందనుఁడు మఱలఁ దిరిగివచ్చు నందువా? ఇన్నాళ్ళకు వత్తు నని జాబైనను వ్రాయలేదుకదా! ఎంతదూరాన నుండునో? ఆయన నెవరు పోయి తోడితెత్తురు? నే నేమి కావలయును?' అని, 'స్వామి యెట్టివాఁ డనుకొనుచున్నావు?'

యదుకుల కాంభోజ - ఆది

ఎంత చక్కనివాఁడే! నాసామి వాఁ డెంత చక్కనివాఁడే!
ఇంతి మువ్వగోపాలుఁడు సంతతము నామదికి
సంతోషము చేసెనే ॥ఎంత॥

పాదలు కెందామర పెం పొదవు పదములవాఁడే
కొదమసింగపునడుముకొమ రమరువాఁడే
మదకరికరముల మఱపు చేతులవాఁడే
సుదతి మువ్వగోపాలుఁ డెంత సొగసుకలవాఁడే ॥ఎంత॥

అని నృత్యాభినయము చేసెను. నటుఁడు 'అవునవును, నే నెఱుఁగనా, నీ భర్తను? నల్లని యింద్రనీలములవంటి దేహచ్ఛాయ వాఁడు.'

చిఱుతప్రాయమువాఁడే చెలువొందు విదియచం
దురు కేరు నొసలచే మెఱయువాఁడే
చెఱకువిల్తునికన్నదొరవలె నున్నాఁడే
మెఱుఁగుజామునచాయ మే నమరువాఁడే
ఎంతచక్కనివాఁడే! నీ సామి వాఁ డెంతచక్కనివాఁడే! ॥ఎంత॥

అని పాడెను. గిరిక 'యాయన వట్టిసౌందర్యవంతుఁడే కాదు. ఆయన గుణములు లోకాద్భుతము లైనవికదా! ఆ ప్రభువు పసి నాఁడే పూతనాప్రాణములు హరించెను. తృణావర్తుని జంపెను. శకటాసురుని బరిమార్చెను. కాళీయాహిని మర్దించె'ననెను. నటుఁడు 'అవు నవును. ఆయన కాళీయాహిని మర్దించినాఁ డని యపుడు దేశమంతయుఁ జెప్పుకొన్నారు. ఎట్లు మర్దించె నేమి!' యనెను. దేవదాసి 'నీ వీ సంగతియే యెఱుఁగవా?' అనెను. నటుఁడు 'నే నెఱుఁగ' ననెను. దేవదాసి యిట్లనెను: 'స్వామి కాలియుని మడుగువద్దఁ బెరిఁగియుండి, పూర్వజన్మభాగ్యంబునఁదనచరణసంస్పర్శ భాగ్యంబునకు యోగ్యంబైన యొకకదంబభూజంబు నెక్కి,

కటిచేలంబు బిగించి పింఛమునఁ జక్కం గొప్పుబంధించి దో
స్తటసంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబుఁ గీలించి త
త్కుటశాఖాగ్రముమీఁదనుండియు టికెక్కె గోపాలసింహంబుది
క్తటముల్ మ్రోయ ప్రహదంబులొగుభగుభధ్వానం బన్యాసంబుగన్.

అని కాంభోజిరాగముతోఁ జెప్పెను. నటుఁడు 'గాళియాహి చాలదుష్టుడఁటకదా! స్వామి దుమికినచో నూరకుండెనా?' యనెను. గిరిక 'ఊరకుండెనా? ఆ దుర్మార్గుఁడు రెల్లుపూవువలె మెత్తనైన స్వామి మేనునకుఁ జుట్టలు చుట్టినాఁడు. స్వామియొడల గాటులు వేసినాఁడు' అనెను. నటుఁడు, 'అమ్మయ్యో! అమ్మయ్యో! స్వామి మఱి బ్రదికినాఁడా' యనెను. గిరిక నవ్వి 'చెలీ! నీకుఁ బరమేశ్వరుని వైభవమే దెలియనట్లున్నది. ఆయన యెవ రనుకొన్నావు? సకల జగత్ప్రాణరక్షావిచక్షణుఁడైన పరమేశ్వరుఁడేకదా! శ్రీకృష్ణస్వామివలె నవతరించెను. అప్పుడు మే మందఱము నీవలెనే దిగులుపడితిమి' యనెను. నటుఁడు 'మే మందఱము ననఁగా నెవ రెవ రేమి?' అనెను.

గిరిక—గోపికలము. నటుఁడు—'అట్లా! నీవు గోపికవా? అందుకనియే కుడిపైఁట వేసితివి. అందుకనియే యసంస్కృతమైన కేశపాశముతో నుంటివి. రత్న—స్వామీ! అసంస్కృతమైన కేశపాశము ప్రోషితభర్తృక యగుటచేతఁగాని గోపిక యగుటచేతఁగాదు.

ప్రోషితభర్తృక యన్న పేరువిన్నంతనే దేవదాసి కనులనుండి బాష్పములు స్రవింపఁగా 'నయ్యా! పతివిరహితదుఃఖితనైన నే నీ దృశావస్థలో నున్నాను ఏమి చేయుదును?' అని యుస్సు రనెను; దీర్ఘ నిశ్వాసము విడిచెను.

అంత నటుఁడు గిరికా! నీ వదృష్టవంతురాలవు.

జపదానవ్రతహోమసంయమతస్వాధ్యాయముఖ్యంబులన్
నిపుణు ల్గోరియు నే విభున్ మనములన్ నిల్పంగలే రట్టి స
ద్విపులాకారునిపై, మహామహిముపై, విశ్వేశుపై నీ కజ
స్రపటుధ్యానము లిట్లు నిల్చెనె భవచ్చారిత్రముల్ చిత్రముల్.

నన్ను కృష్ణుఁడు నీకడకుఁ బంపించెను. ఆయన నీతో నీ వచనములు చెప్పు మనెను.

'భవతీనాం వియోగో మే నహి సర్వాత్మనా క్వచిత్
యథా భూతాని భూతేషు ఖం వా య్వగ్ని ర్జలం మహీ
తథాహం చ మనః ప్రాణబుద్ధీంద్రియగుణాశ్రయ

నాకు మీావియోగము లేదు. భూతములయందు పంచభూతము లెట్లున్నవో నేను మనఃప్రాణబుద్ధీంద్రియగుణముల నట్లాశ్రయించి

యుంటిని. ఆత్మ మాయానుభావముచేత భూతేంద్రియగుణాత్మతకలిగి యాత్మయందాత్మచేతనన్ను నేనుసృజించుచున్నాను. చంపుచున్నాను. పాలించుచున్నాను. ఆత్మజ్ఞానమయుఁడను, సిద్ధుఁడను, వ్యతిరిక్తుఁడను, అగుణాన్వయుఁడను అనునివి సుషుప్తిస్వప్నజాగ్రదవస్థలచేత మాయా వృత్తులచేతఁ దెలియఁబడుచున్నవి. ఇది స్వాప్రిజ్ఞకాదు; ఎవఁడింద్రియ ములను ధ్యానించుచున్నాఁడో వాఁ డింద్రియములను నియమించి, స్వప్నమునుండి మేల్కని, స్వప్నము కల్లయనుకొనినట్లు వాఁడు నింద్రి యజ్ఞానమును గల్ల యనుకొనును. ఇది సాంఖ్యయోగము. ఇది ప్రభువు నీకుఁ జెప్పు మనెను' అనెను. అంత గిరిక యిట్లు గానాభినయ ములు చేసెను.

భైరవి — ఆట

పర మిహ పశ్యతి పూరుషం స్వీకృతమాయికమానుషం
నిజపరభేదరహితదృశ మక్షర మీక్షణకృతభువనం విభుం
ఉపనిషదేకసమధిగత మద్వయబోధసుఖైకరసం ప్రభుం ॥పర॥

ఎదురుగా నున్న సత్యభామాద్వితీయుఁడైన ప్రభువు సంతో షించెను. మఱల గిరిక సహజమైన భక్తి ప్రపత్తియే కలిగి 'యోయి శ్రేయోదూతా! ఇమ్ముల నున్నవాఁడెవారి? ఇచట కెప్పుడు వచ్చెను? మాయమిమ్మలిక మెపుడు తీర్చును? ప్రియుఁడిచ్చటికి వచ్చెద నన్న మధురాపురస్త్రీ లడ్డమురారా? హాతవిధి మాకెంత చేసె' ననెను. ఇంతలో కుంభహారతి పట్టఁబడెను. సురటరాగముతోఁ దదనుగుణతాళమృదంగధ్వనులతో మంగళ మాచరింపఁబడెను. స్వామి గరుడవాహనారూఢుఁడై యాలయబహిఃప్రదేశమునకు వచ్చి శ్రీ నాగేశ్వరస్వామివారికొఱ కెదురుచూచెను. ఆయనయుఁ బెండ్లి కొడుకయ్యుఁ దోడుపెండ్లికొడుకువలెఁ గృష్ణదేవునితోఁ బరిహాసము లాడెను. ఇరువురు భక్తులను బ్రసాదించుచు నూరేఁగిరి. మఱునాఁడు పార్థసారథియలంకార మని చెప్పిరి.

మంగమ్మ యష్టమినాఁటినుండియు నుత్సవములకు వచ్చుచునే యుండెను. ఎవరైనఁ జూచి తన్నెమైన నందు రేమో యని చాటు మాటుగా నక్క నిలుచుండును. ప్రతిదినము నామెకల్యాణమునకు బయలుదేఱును. వాలి తన్నుఁ దీసికొనిపోవుట లేదని తాఁడుగుం

జును, పండ్లిగిలించును, కఱవవచ్చును, కిచకిచలాడును, త్రాఁడు మెడ కురివడునట్లు లాగుకొనును. ఎన్నిచేసినను మంగమ్మ వాలిని వదలలేదు. తా నొక్కతియే వచ్చి సభావాటుభాగమున వితర్దికక్రింద సామాన్యస్త్రీలందఱును నిలుచున్నచోట వారివెనుకగా నిలుచుండి వైభవమంతయుఁ గనులారఁ జూచుచుండెను. నృత్యాభినయవేళ గిరిక మూర్ఛపోయినచోఁ దాను కలవరపడును. ఆమె సంతాపించినచోఁ దాను దిగులుపడును. ఆమె స్వామిసంయోగముచేత నానందపడినచోఁ దాను విషాదపడును. 'నా బ్రదుకంతయు వ్యర్థమైనది. నేను శ్వపృష్ఠపురోడాశమ నైతిని' నా బ్రదుకు హాలాహల మొలికెను. మహాపురుషుఁడైన ధర్మారావు తాలూకాబోర్డున కధ్యక్షుఁడు కారాదా? ఉద్యోగములకును, సచ్ఛీలమునకును సంబంధము లేదు కాఁబోలు! నేను విద్యావిహీనులైనవారియింట నేల పుట్టవలె? నాకు బాల్యమునుండి జ్ఞానమన్నది యేల కలుగకపోవలె? దైవము నానొసట నిట్లు వ్రాసియుండఁగా నన్యేల జరుగు' ననుకొనును. కుమారస్వామి కొడుకుతో భార్యతో వచ్చి భార్యను స్త్రీలవద్ద వదలి తాను పురుషులలోఁ గూర్చుండును. అతనికి గిరికయందు మహాభక్తియు, నంతకన్న మహాభక్తి భోగప్పశాస్త్రియందును గలిగెను ఆతనికన్నులు గిరికహస్తముపై, హస్తము ననుసరించు దృష్టిపైఁ, దద్భావముపైనే యుండును. నాట్య మారంభించువఱకు హారప్పవంకనే చూచుచుండును. నాట్యావసానమున ధర్మారావునే చూచుచుండును. చివఱకు శ్యామలతోఁ గలిసి మంగమ్మనుగూడఁ గలుపుకొని యింటికిఁ బోవును. ఒకనాఁ డొక్కొక్క రీతి వారిలో వారు ప్రసంగింతురు. ఒకనాఁడు—

కుమార- ఏమండీ! మంగమ్మగారూ! మీ కోఁతిని దీసికొని వచ్చినారా? మంగమ్మ- ఇఁక గోఁతిమాట తేకుము. దానికి నేను, నా కదియు లేదు. కుమార- రోజును దేవాలయమునకు వట్టి చేతులతో వత్తు రేమి? మఱచిపోయినాను. వట్టి చేతు లేమి? చేతులకు బంగారపుగాజు లున్నవికదా! మంగమ్మ మాటాడలేదు. కుమార- శ్యామలా! ఈ వెన్నెలలు చాల బాగుగా నున్నవిగదా! శ్యామ- ఆ మాట యింటి కేగినతరువాత ననినచో బాగుగా నుండును.

కుమార-ఇచటమాత్రమువరాదేమి? అని యామెనుబోయి కౌఁగిలించుకొనెను. మంగమ్మ-కోఁతిపిల్లఁడా! ఇంకఁ జాలించుము. దారివెంట నందఱును నవ్వెదరు కుమార - అనునవ్వుదు. ఎవనిభార్యను వాఁడు కౌఁగిలించుకొన్నచో నవ్వరా? మఱొకనిభార్యను కౌఁగిలించుకొనుచో లోకముమెచ్చును. ఆ లోకము మెచ్చుదల నే నెఱుఁగను. తరువాతఁ బదియడుగులునడిచిరి. కుమారస్వామి మంగమ్మవద్దకుఁ బోయి 'నేఁడు గిరికానృత్యము నా ప్రాణములలోఁతుదాఁక ప్రవేశించినది. కులమెందుకు?' అనెను. మంగమ్మ-బాబూ! నీ వేమాట యన్నను నాకే దగులుచున్నది. కుమార-రామరామ! నే నేమాట యన్నను దానికి రెండు అర్థములు వచ్చుచున్నవి. దానికి నే నేమిచేయుదును! శనియుచ్చంగతుఁడై నాకు వ్యాఖ్యానమునం దున్నాఁడు. ఇదిగో చూడుము. కాదుకా దనుటకు బదులు రామరామ యంటిని. నిన్ను రెండుసార్లు పిలచినట్లైనది. విజయవిలాసమువాని శ్లేష క్రిందికి దిగినది. శ్యామల- వెన్నెల చాల బాగుగా నున్నది. కుమార- ఇంతమందిలో నీవువచ్చి నన్ను కవుగిలించుకొందువా యేమి? శ్యామల- మీ కా భయ మక్కఱలేదు. కుమార-ఎందు కక్కఱలేదు. నే నొక్కఁడనే కదా యున్నాను. చక్రవర్తి లేఁడుకదా!

శ్యామల 'ఇంక మీతో మాట్లాడఁగూడ' దని దూరముగాఁ బోయెను. కుమారస్వామి మంగమ్మవద్దకుఁ బోయి 'ఏమమ్మాయి! నేను నీకు మాటపడా ర్లిచ్చెదను. నీవు మాకు భోగప్పశాస్త్రివి కావలె' ననెను. మంగమ్మ— 'నీవు నోటితోఁ దెచ్చుకొన్నావు. నన్ను రాధాపతి యన్న నెంత బాగుగా నుండునో, యామెను జక్రవర్తి యన్న నంత బాగుగా నుండును' అనెను.

కుమార- ఆమెను కుమారస్వామి యన్న నెంత బాగుండునో యంత బాగుండుటకు నిన్నేవ రనవలయును?

మంగమ్మ మాటాడలేదు. మఱి కొంతదూరము నడిచిరి. ఇల్లు సమీపమునకు వచ్చెను. రోడ్డు దిగి తమయిండ్లకుఁ బశ్చిమముఖులై పోవుచుండిరి. వెన్నెల వారందఱి మొగములమీఁదను బడుచుండెను. కుమారస్వామి మంగమ్మమొగమువంకఁ జూచెను. ఆమెకన్నులవెంట నీరు కారుచుండెను. శ్యామలకుఁ జూపించెను.

శ్యామల యామెవద్దకుఁ బోయి 'ఏమండీ మంగమ్మగారు! వారి మాటలకేనా కన్నీరు కార్చుచున్నారు? ఎప్పుడు నున్నవేకదా' యనెను. మంగమ్మ- అందుకు కాదమ్మా! నా బ్రదుకిట్లైన దేమి? కుమార- బ్రదుకున కేమి? దుఃఖించుటకు, విచారించుటకుఁ, బశ్చాత్తాప మందుటకుఁ దగినంతబ్రదుకుఁ బ్రదికితివి. శ్యామల- అవి యేమి మాటలు? కుమార— మన కేమి? యింటికి పద, సుఖముగాఁ గౌఁగిలించుకొని పండుకొందము. మన కిదియే మోక్షము. వారిపండుకోనికి వచ్చిరి. జన మెవ్వరును లేరు. కుమారస్వామి శ్యామలను నవ్వించెను. అధోముఖియై నడుచుచున్న మంగమ్మ తలయెత్తనైన లేదు.' కుమార- ఇది మా యిల్లు. అది మాయిల్లు.

మంగమ్మ తలయెత్తిచూచి యింటిలోనికిఁ బోయెను. వాలి కెవ్వన కేకపెట్టెను. ఆ కేక మెలికలు తిరిగిపోవుచు మహావ్యాధి గ్రస్తుఁడు వేసిన ట్లుండెను. పదియడుగులు వేసిన కుమారస్వామి తిరిగి వచ్చెను. 'ఏమి టిది' యనెను. మంగమ్మ 'మనస్సు పడుచున్న బాధ' యనెను. కుమారస్వామి తిరిగి వచ్చెను.

మఱియొకనాఁడు నృత్యమునుండి మువ్వురును గలిసి వచ్చుచుండిరి. ఆనాఁడు రామావతారనృత్యము. కుమార- నేను నడిచి యింటికి వచ్చుచుంటిని, చూడుము. ఈ వ్యర్థశరీర మచట వదల నైన వదలితిని కాదు. ఆమాట యనుచుండఁగనే కుమారస్వామి కంఠనేత్రములయందు గాద్గద్యబాష్పములు బిలబిలలాడెను.

మంగ-నాయనా! నీవే యట్లనుకొనినచో నే నే మనుకొనవలయును? నేను పోయి నృత్యావసానమున గిరికపాదము లంటి నమస్కరించవలయు ననుకొంటిని. ఆ పవిత్రురాలిని నే నేల తాఁకవలయునని యట్లు చేయలేదు. కుమా—ఆ తల్లిని ధర్మారావుగా రన్నారని నీవును,నీ వన్నావని నేనును గిరికయనుట బాగుగాలేదు. చంద్రగుప్తుని వృషలుఁ డనుటకుఁ జాణక్యుఁడే తగినట్లు దేవదాసిని గిరిక యనుటకు గురువే తగును.మంగమ్మగారూ! రామచంద్రుఁడు ధనుస్సు విఱిచినాఁడా? కథయంతటితోడనే యాఁగిపోయిన దేమి? అది యేమి నృత్యము? రామాయణకథ యంతటితోడనే యాఁగిపోయిన దేమి?

కుమారస్వామి యచ్చట నాఁగి యేడువ నారంభించెను. మంగమ్మ—'నాయనా! దుఃఖముతోఁగూడఁ జెప్పవచ్చినది ప్రియంగకు' మనెను.

కుమా—"ఏమియును లేదు. మహాభక్తురాలైన గిరిక సీతారాముల సంయోగమున కొక మహావ్యాఖ్యానము చేసినది. ప్రభువు శివధనుర్భంగము చేసినవేళనే సీతారాముల యాత్మలైక్యము నొందినవి. తరువాత వానికి వియోగము లేదు. సాత్త్వికాదిభావోదయములు లేవు. రస మచ్చట నీయనూనస్వామిత్వము కాదు. అది యనుభావ విభావాదులచేతఁ గలిగినది కాదు. వారి యుద్ధప్రేమయందు రస స్వరూపము నిత్యమై, యవికారమై, కూటస్థమై యున్నది. తరువాత వచ్చిన వియోగమువలన వారిప్రేమభావ మేమియుఁ జెడలేదు. వారి రసాత్మత కొంచెపడ లేదు. నిత్యమైన, నిర్మలమైన సీతారాముల ప్రేమతత్త్వ మిది. అది తరంగములులేని కడలి. జలబిందువు లేర్పరించరాని మహాంభస్స్వరూపము. అణువులుగాఁ జీలిపోని మహాభూత ప్రకృతి. గిరిక యీ వ్యాఖ్యానము చేసెను. ఆ తల్లి కిదిగో మన నలువురిపక్షమున నమస్కారము చేయుచున్నాను." పడిపోవునేమో యని శ్యామలయు, మంగమ్మయుఁ గుమారస్వామిని బట్టుకొనిరి. గృహాభిముఖులై పోయిరి. వెన్నెలలు శ్రీరామచంద్రపాదనీరజపరాగ రేణువులవలెఁ బొడిపొడిగా నయ్యెను. మఱి యింకొకనాఁడు—

కుమారస్వామి— మంగమ్మగారూ! నీతో నేదో మాట చెప్పుద మనుకొన్నాను. మఱచిపోయినాను. శ్యామల-అబ్బాయిని ముద్దు పెట్టుకొనుఁడు, జ్ఞాపకము వచ్చునేమో! కుమార-అందులోఁ గొంతభాగము నీకుఁగూడఁ దక్కు ననియా? శ్యామల- ఇంకొక మాట మనకుఁ జేతనైనఁగదా! కుమార—నీవు నవనాగరకస్త్రీవలె మాటాడ వేమి? శ్యామల-దీనికిఁ గారణము, మీరే మంగమ్మ—చెప్పవచ్చినమాట యేమి? కుమార—ఆమాట యేదో జ్ఞాపకము రాలేదుగాని యాకోఁతి ప్రాణము తీయుచున్నారే. అది పదిరోజులయి నది నీరుదాగివి, తిండితిని. అది చివరకుఁ జచ్చిపోవున ట్లున్నది. ఆ పాపము కట్టుకొనెదరా యేమి? మంగ— అన్నిపాపములలో నిది యొక్కఁడు. కుమార—అన్ని యనఁగా నెన్ని యున్న వేమి?

మంగ—నా ప్రకార మొక్కటి. నీప్రకారము లేనేలేవు. ధర్మారావు గారి ప్రకారము పది దాటినవి. కుమా—నాప్రకారము పన్నెండు కోట్లు. మంగ—ఇంతకును జెప్పవచ్చినమాట యేమిటి? కుమార—నేఁడు దేవదాసి ప్రోషితభర్తృక నభియించినదికదా! ప్రోషితభర్తృక యనఁగా నేమి? మంగ—భర్త పరదేశమునం దుండఁగా విరహావస్థలో నున్న నాయిక ప్రోషితభర్తృక. కుమా—పెద్దపండితురాలవే! ఆ కాలేజివాండ్రు నాయుద్యోగము నీ కిత్తురేమో యడిగి రమ్ము. మంగ—హిందూమతము నాకును దల కెక్కినది. కుమార—నిన్ను మీయింటికి వెళ్ళితి వని యొకకారణము కల్పించరుకదా! నే నన్నచో మీయింటికి వచ్చుటయు నొకకారణమయ్యెను. మంగ—భర్త పరలోకమున కేఁగినచో నామెకూడఁ బ్రోషితభర్తృకయేనా? కుమార—ఆమె కులముచెడకపోయినచో వెండ్రికలులేనివిధవ. శ్యామల—మీనోటికి సుద్ది బద్ది లేదు. కుమార—ప[illegible]లు నీవలె మాటాడరు. మంగ—కాదయ్యా! నేను వేదము వేంకటరాయశాస్త్రి గారు వ్రాసిన యుత్తరరామచరిత్రపీఠిక చూచితిని. ఆ స్థితిగూడ విప్రలంభశృంగారముక్రిందనే యాయన చెప్పెను. కుమార—అది సీతాదేవి పక్షము, మంగమాంబాపక్షము కాదు మంగ—నేను చనిపోయిన తరువాత నీ వీ మాటలన్నియు నెవరి నందువు? కుమార—మీ ఫొటోగ్రాఫు తీయించి రోజు నొక గంట దాని ముం దీ మాట లేకరువుపెట్టెదను. శనిపట్టిన నేడేండ్లు; నేను పట్టినచోఁ బదునాలుగేండ్లు. మంగ—తేపు ప్రొద్దున దేవదాసిని బోయి చూచి వత్తమా? కుమార—ఆమె జపములో నుండును. మంగ—ఊరికే పోయి చూచివత్తము. కుమా—నాకుఁ దీరికలేదు. తేపు నేను ప్రొద్దుననే బయలుదేఱి యిరువదిమైళ్ళు నడిచి రావలయును. దేవాలయమువద్దనుండి తూర్పుగా గుండేటి వఱకుఁ బోయి యా గుండేటివెంటనే రైలురోడ్డువఱకు వచ్చి యచటనుండి మాగానికాలువవెంటఁ బోయి రంగాపురమువెనుక నచట నెచటనో గుండేఱు తగులును. మఱల నచ్చటినుండి బయలుదేఱినచోటికి వచ్చి మఱల దేవాలయమువద్దకు వత్తును. లెక్కవేసినాను. పదిక్రోసు లగును. శ్యామల—ఇట్లు తిరుగుట యెందుకు?

కుమార—తేపు మన మూహించరాని దేదో కలుగఁబోవుచున్నది. ఆ యాపత్తురాకమునుపు భూప్రదక్షిణము చేసివచ్చెదను. మంగమ్మ—నేనుకూడ వచ్చెదను. కుమార—పిల్లికి రొయ్యలమొలతాడని నేను నడచినట్లే. అందులో మఱికొంత తారుఖర్చు. మనమిద్దఱము తిరిగివచ్చినచో లోకము మఱింత చెప్పుకొనునుగదా! మంగమ్మ—నేను తప్పకవచ్చెదను. కుమార—నే నీ రాత్రి కుంటిగా నడచుట యభ్యాసము చేసికొందును. మంగమ్మ—నేను తొందరగా నడచుట యభ్యాసము చేసికొందును.

తెల్లవాఱినది. అనసూయారుంధతీఛాయాశశిరేఖారథంతరులు ప్రొద్దెక్క గిరికను జూచుటకుఁ బోయిరి. గిరిక స్నానముచేసి తెల్లని చీర ధరించి నూనెచేత నెండనిశిరోజములు కుదుళ్ళలోనికి బయ్యెద కొంగుపోనిచ్చి తుడుచుకొనుచుండెను. అరుం—ఏమమ్మా! మఱఁదలా! నీ వేమో జపనిమగ్నవై యుందు వనుకొంటిమి. గిరిక—ఈ తల యెండలేదు. పదిరోజులనుండి యొకటియే స్నానములు. సాంబ్రాణిపొగచే నెండిన నెండుటయేకాని సరిగా గాలి కెండనిచ్చినది లేదు. జలుబుచేయు నేమో యని తుడుచుకొనచుంటిని. శశిరేఖ నేను తుడుతునా? గిరిక-రెడ్డియో రాజో యన్నారు. నీవు రాణివాసపు స్త్రీవి. కలెక్టరుల కూఁతురవు. బోగముదానితల తుడిచెదవా? శశి - ఏమి యేమి? నీవు బోగముదానవా! నన్నుఁ గఃఖించి నీ కిదియా యభిప్రాయము. నీవు న న్నరుంధతివలెఁ జూచుచున్నా వనుకొన్నాను. గిరిక—నన్ను నేనే నవ్వులాడుకొన్నానమ్మా! మీ రందఱే మనుకొన్నను స్వామి నన్ను బోగముదాని ననుకొనఁడా? రథం—ఆయనకు నీకుఁబోయినంత మతిపోలేదు. అన - అవును. నీమెకు మతిపోయినది. గిరిక—మనయిద్దఱకును వరుస కాదు. రథ—ఆమె నీ పక్షమే మాటాడెను. నీయందు మనస్సు నశించినదని చెప్పుచున్నది. ఛాయ—తల్లీ! కులగర్వము నన్ను నిన్నుఁ దల్లీ యని పిలుచుట కెంతసేపు పట్టించినది. నేను నీ కేదైన కానుక యీఁ దలచుకొన్నాను. ఏమి యి మ్మందువు? గిరిక— న న్నడిగి యిత్తురా? నేను నీ సద్గుణములన్నియు నిమ్మందును. నీ పురాకృతపుణ్యమంతయు నిమ్మందును. మీ రిచ్చెదరా? ఛాయ—తప్పక యిచ్చెదను. కాని

సాయంకాలమున మజల నేడు నృత్యము చేయువేళ దానిని నీవు ధరించవలయును. నీ మనస్సునం దుంచుకొనవలయును. గిరిక కనుల నీళ్ళు తెచ్చుకొని, యొక గడియసేపు నిమీలితనేత్రియై యుండెను. అందఱును నిశ్శబ్దముగా నుండిరి. నంద్యాలనుండి వచ్చిన వారాంగన పిల్లనగ్రోవిమీఁద వాయించుచుండెను.

'అయి మురళి! ముకుందస్మేరవక్త్రారవింద
శ్వసనమధురసజ్ఞే! త్వాం ప్రణమ్యాద్య యాచే
అధరమణిసమీపం ప్రాప్తవత్యాం భవత్యాం
కథయ రహసి కర్ణే మద్దశాం నందసూనోః.'

అరుంధతి 'మఱఁదలా! నాసంగతి యేమి చెప్పితివి?' యనెను. గిరిక యరుంధతిని కౌఁగిలించుకొని 'వదినే! నీవు నావెంటనే వచ్చుచుంటివి. నీ ధన్యత నా కెచ్చటనుండి వచ్చును? నేను బహు ప్రయాసపడి సాధించుచున్నది నీకుఁ బూర్వజన్మసంస్కారముచేత సహజముగా లభించినది. కులమింటఁ బుట్టినావు. ఏకాగ్రిత సాధించుటకుఁ గులస్త్రీలందఱకును బతి యేర్పడనే యేర్పడియున్నాఁడు. మీయందు ధర్మకామములు కలిసియున్నవి. మాయందు విడివిడిగా నున్నవి. మేము వీనిని జంటకలుపుకొనువఱకును మాసాధన క్లిష్టతరమై పోవుచున్నది. మీకు సులభముగా నున్నది. అందులోఁ బుణ్యవతివి కనుకనే సర్వవేదసారవేత్త, సర్వశాస్త్రసారపారంగతుఁడు నగు నా మహాపురుషుని జెట్టబట్టితివి. ఇంటిలోఁ బనులుచేయుచునే పరిహాసములాడుచునే నీవుమహార్థములన్నియు నెఱింగితివి! నేను నిన్నెఱింగికొనక పోలేదు. అన్నభార్యను నిన్నెఱుంగకపోదునా? మన యిర్వురకును ముప్పదియవయేఁడు జరుగుచున్నది. నీమధ్య నామధ్య మూఁడునెలలు వారడి' యనెను.

అరుం—ఈమూఁడునెలలు నే నింతేనా? గిరిక—నీవు నాకన్న భాగ్యశాలినివి! నీకు మూఁడునెలలు మూఁడువారములుగా గడచి పోవును. నా కెనిమిదిరోజులు ఎనిమిదియుగములుగాఁ గడచినవి. శశిరేఖ—కృష్ణప్రియా! మే మింక సెలవు తీసికొందుము! మే మందఱము నిన్నే ధ్యానించున్నాము.

నంద్యాలవారాంగన మజల వాయించుచున్నది:

'అపి జనుషి పరస్మిన్నాత్తపుణ్యో భవేయం
తటభువి యమునాయా స్తాదృశో వంశనాళః
అనుభవతి య ఏష శ్రీమదాభీరసూనో
రధరమణిసమీపన్యాసధన్యా మవస్థామ్.'

వారందఱును నిష్క్రమించిరి. హరప్పయు, ధర్మారావును వాకిట నిలుచుండిరి. గిరిక చూచెను. నవ్వుచు నెదురుగాఁ బోయెను.

హరప్ప- (జనాంతికముగా ధర్మారావుతో) ఈమె యిట్లున్న దేమి?

ధర్మా - ఆమెతపస్సు ఫలించినది. రాత్రి యొకానొకదివ్య తేజస్సు కనిపించి 'నీతపస్సు పూర్తియైనది' యని చెప్పెను. ఆమె యందుచేతఁ దపము మానివేసెను. గిరిక వారివద్దకువచ్చి హరప్పకు నమస్కారము చేసెను. రత్నగిరి వచ్చి 'ప్రభువులు మాగృహము పావనము చేసి' రనెను. హరప్ప 'రత్నగిరీ! అది యేమి మాట' యనెను. రత్నగిరి 'బాబయ్యగారూ! ఇది లౌకికము' అనెను. హరప్ప 'నేనును, మా ధర్మారావుగారును వైదికులము' అనెను. ధర్మా- ప్రభూ! మీరుమాత్రమే వైదికులు. నేనును లౌకికుఁడనే. రత్న- దయచేయుఁడు! హర- గిరిక నొకసారి చూచిపోవుటకే వచ్చితిమి. మఱలఁ దిరిగి పోవుచున్నాము. ధర్మా- నిన్నేమని పిలువవలయును? రత్న- నన్నా! అవ్వా యని పిలువుఁడు. ధర్మా - అవ్వా! నీ కొకమాట చెప్పవలెను. ఆమాట నీవు చనిపోవువఱకు మఱచిపోరాదు. రత్న- మఱచిపోను. ధర్మా- నా మాట గిరిక మఱువదు. రత్న- నేను గిరికతల్లినేగదా! నేనును మఱచిపోను. మీనాయనగారితరువాత నాయనగారి యంతవాఁడవు, నీ వాజ్ఞాపించవలసినవాఁడవు. నేను చేయవలసినదానను.

నంద్యాల నారాంగన వేణు వచ్చుటనుంచి నోటితోఁ బాడుచున్నది.

"మచ్చికఁ వీరి కెల్ల బహుమాత్రము చోద్యము దేహి పుట్టుచున్
జచ్చుచునుండఁ జూచెదరు చావనకొల్లక డాఁగవచ్చునే!
చచ్చినవారి కేడ్చెదరు చావక మానెడువారిభంగిఁ దా
నెచ్చటఁ బుట్టె నచ్చటికి నేఁగుట నైజము ప్రాణికోటికిన్."

ధర్మా- అది విన్నావా? రత్న- వినుచునే యున్నాను.

హరప్ప ధర్మారావులు తిరిగిపోయిరి. దారిలో హరప్ప ధర్మారావును జూచి ,ఎచ్చటం బుట్టి నచ్చటికి నేఁగుట నైజము ప్రాణికోటికి ననఁగా నేమి?' అనెను. ధర్మా- పంచాగ్నివిద్య యని యొకవిద్య యున్నది. అందులో నైదగ్నులు. ఈ లోకము, పర్జన్యుఁడు, పృథివి, పురుషుఁడు, స్త్రీ యను నైదగ్నులు. వాని హోమప్రక్రియ వేఱే యున్నది. కర్మనుయమైన యీ లోకమునుండి పర్జన్యలోకము చేరును. పర్జన్యుఁడు వర్షించి పృథివిలోఁ జేరును. దానిని పురుషుఁడు భుజించును. పురుషునివలన స్త్రీయందు గర్భోత్పత్తి గలుగును. ఇది వరుస. 'స జాతో యావదాయుషం జీవతి, తం ప్రేతం దిష్టమితోఽగ్నయ ఏవ హరంతి, యత ఏవేతో యత స్సంభూతో భవతి; ఈ రీతిగాఁ బుట్టినవాఁడెన్నాళ్ళాయుర్దాయముండునో, మాటిమాటికి ఘటీయంత్రమువలె ననఁగా ఏతాములోని కుండవలెఁ బోవుటకు వచ్చుటకుఁ గర్మముచేయుచుఁ గర్మమువలన నెంతయాయువు గలిగెనో యంతవఱకు జీవించుచున్నాఁడు. ఆక్షీణించినయాయువుకలవాఁడు చనిపోఁగా నితనికై నిర్దేశింపఁబడిన పరలోకమునకుఁ బ్రాక్చి బ్రదికియుండి వైదికకర్మ చేసినచో, జ్ఞానియైనచో, వాఁడు చనిపోయినచో వాని నగ్నినిఁబ్రాక్చి హరించుచున్నారు. పుత్రాదులుకాని, కర్మచేయువారుగాని ఏ యగ్నినుండి యిచ్చటికి వచ్చెనో (శ్రద్ధాద్యాహుతులవలన వచ్చును) యే యైదగ్నులనుండి పుట్టెనో యాయగ్నికొఱకే యితనిని హరించుచున్నారు. అనఁగా, వానికర్మచేత నేయోని నిర్ణయింపఁబడెనో యా యోనినే, యా యగ్నినే యాపాదించుచున్నా రని యర్థము. అనఁగా స్వస్వకర్మానురూపమైన యోనియందే జీవుఁ డుత్పన్నమగుచున్నాఁ డని యర్థము!" హరప్ప - ఇదియా యర్థము? నా కిన్నాళ్ళనుండియుఁ దెలియలేదు. ధర్మా - మీరు కోటకుఁ బొండు. నేను పోయి కుమారస్వామిని గలిసికొనవలయును. హరప్ప - ఆయన కుద్యోగము పోయినదఁటగదా! ధర్మా - అది యిప్పుడు పోలేదు. వందయేండ్ల క్రింద పోయినది. ఇరువురును నెవరిదారిని వారు పోయిరి.

పశుపతి, కిరీటి, రాఘవరావు, సూర్యపతి, రామచంద్ర రాజులు గిరికను జూచుటకుఁ బోయిరి. ఆమె మసికట్టుకొని కూర్చుండెను. వీరైదుగురు పోయిరి. రామ- ఏమమ్మా గిరికా! మీ వదినెగారు వచ్చి చూచిపోయినదా? గిరిక- అన్నా! నన్ను నాబంధువు లందఱును వచ్చి చూచిపోవుచున్నారు. 'స్నేహానుబంధో బంధూనాం మునే రపిచ దుస్త్యజ' అన్నట్లు బంధుస్నేహము గొప్పదికదా! రామ- ఊరకే చూచిపోవుటకు వచ్చుచున్నాము. గిరిక- స్త్రీలందఱును వచ్చి చూచిపోయిరి వదినె లిద్దఱునుగూడ వచ్చిరి.

పశుపతిప్రభృతులు గిరికకు నమస్కారము చేసిరి. ఆమె వారికి సాష్టాంగపడెను వారందఱును వెడలిపోయిరి. హైమవతి సూర్యనారాయణలు, రాజేశ్వరుఁడు నాంచారమ్మయు వచ్చిరి. అక్కగార లిద్దఱును బోయి గిరికను సమాదరించిరి.

హైమవతి—మాతండ్రికడుపున నీవంటిబిడ్డ నీవుగాక యింకొకరు కలుగలేదు. నాంచారమ్మ—ఏకగర్భజాతులైనను వారివారి పురాకృతకర్మ ననుసరించి మాఱుచునే యుందురు. ఇద్దఱును జెల్లెలిని గౌఁగిలించుకొనిరి. బావగార లిద్దరును వాకిటలో నిలుచుండియే యామెవంకఁ జూచిరి. వారును నిష్క్రమించిరి.

భోగప్పయ్య సాయంకాలము నాలుగుగంట లగువఱకు లక్షగాయత్రి పూర్తిచేసెను. ఎనిమిదిదినములు నతఁడు చేసినతపస్సువలన వాయువీచికలలో నూత్నశక్తియొకఁ డావిర్భవించెను. ఆయనతపస్సు ప్రారంభించి యిది యాఱవదినము. దినమునకుఁ బదునేడువేలుగా నైదుదినములు చేసెను. ఈ నాఁడు పదునేనువేలు చేసెను. ఆయన జపము పూర్తిచేసి దేవాలయమునుబయటికి వచ్చెను. కుమారస్వామియు మంగమ్మయు భూప్రదక్షిణమును బూర్తిచేసిరి. ముందు భోగప్పయు, వెనుక వారునుగా దేవదాసియింటికిఁ బోయిరి. భోగప్ప యింతవఱకు రత్నగిరియింటికిరాలేదు. రత్నగిరియాయననుజూచి'యయ్యవారు!దయ సేయుఁ' డనెను. భోగప్ప మడిగట్టుకొని జలపాత్ర చేతఁబుచ్చుకొని వచ్చెను. ఆయన కూర్చుండి యాచమించి తనజపఫలము దేవదాసికి ధారాదత్తముచేసెను. కుమారస్వామి, మంగమ్మలు స్వామీ! మే

మిర్వురమును శక్తికొలఁది భూప్రదక్షిణము చేసివచ్చితిమి. ఆ ఫలము కూడ నామెకు సమర్పించిపెట్టుఁ' డనిరి. ఆయన యట్లే చేసెను.

పొద్దుక్రుంకినంతనే పున్నమనాఁటివెన్నెలలు వచ్చెను. దూరపు నీలి కొండలోఁ గూర్చున్నచంద్రుఁడు తనచల్లనికిరణము లన్న కన్నులతో లోకమునంతయుఁ జూచుచుండెను. అతఁడు లోక మంతయు వెన్నెలచేతఁ బండిన వరిచేనువలెఁ దోఁచఁగా, సున్నము రాచిన దృష్టిపిడతవలె పైని వ్రేలాడుచుండెను. దేవతలచేతఁ బ్రత్యంగము లాగుకొని తినబడుచున్న యతఁడు మఱలఁ జీయఁబట్టినాఁడు. జాము పొద్దుపోయినది. అతఁ డాకాశమున రెండుబార లెక్కినాఁడు. ఒండువిఱిగిన శరన్నదివలె నతనివెన్నెల లుదయదరుణకాంతులు సంపూర్ణముగా విఱుచుకొనెను. వెన్నెలలు పౌఢకాంతలజంకెనచూపుల వరుసలువోలె, నమృతపుఁగాలువలోని నురుసులకుఁ బ్రతిస్పర్ధులు వోలెఁ, జకచ్చకత్కాంతిమంతము లయ్యెను. నాల్గుదిక్కులు కలకలలాడెను.

పెద్దపందిరిలోఁ గల్యాణమంటపము లున్నవి. పందిరులు వాని కాన్చినారు. రెండు మంటపములకుఁ గొద్దిమెడనుమాత్రమేయున్నది. దక్షిణమంటపమునఁ బార్వతీనాగేశ్వరస్వాములును, వామమంటపమున సత్యభామావేణుగోపాలస్వాములును సేవించి యున్నారు. ఊరేఁగింపైనది. వచ్చి స్వాములు మంటపములయందు సేవించిరి. ఇంక వారికి వివాహములు సేయవలెను. నాగేశ్వరస్వామివారిమంటపమున కెదురుగా భజనలు చేయుచుండిరి. వేణుగోపాలస్వామివారిమంటపమున కెదురుగా సన్నాయి పాడుచుండిరి.

రాత్రి రెండుజాములైనది. పందిరిలోఁ గాగడాల వెలుతురే కాని వెన్నెల లేదు. ఒక్కసారిగా శబ్దమంతయు నాఁగిపోయెను. మృదంగవీణావేణునిస్వనము లొక్కసారిగాఁ జోరుకొనెను. దేవదాసి కంఠస్వరముతో గజ్జెలును, గంకణములును, మృదంగతాళనిస్వనములును నొక్కసారి కలిసి విజృంభించెను.

శంకరాభరణము – అది

మృగయత రాధామాధవం ముహు రిహ నిగమవనే ధవం

అనుపద మఖిలఫలప్రదశాఖిషు మృగిత మదృష్ట మనంతం
క్వచి దపి గూఢతయా నిజధామని కృతసుకృతై రనుభూతం ॥మృగ॥

దేవదాసిమూర్తి చూచినవారందఱకు నొక దేవతామూర్తివలె గోచరించెను. ఆ నాఁ డామెసౌందర్యము గతించినదినములకన్న వేయిరెట్లెక్కువగా నుండెను. ఆమె కట్టినచీర రాచపడుచువలె వెనుకకు బిగించెను. పయ్యెద వెనుకనుండి తీసి నడుమునకుఁ గట్టివేసెను. పదిదినములు నిద్రాహారము లెఱుఁగని యామెయొడలు నిజముగాఁ గృశించియు తఱుముకొనివచ్చుచున్న లావణ్యముచేతఁ గృశించినట్లే యుండెను. ఆమెశిరోజములు మెత్తగా దువ్వఁబడి వెనుక వాలుజడ వేయఁబడియుండెను. ఆజడ పిరుదులుదాఁటి యూరు ప్రదేశమువఱకు వ్రేలాడుచున్నది. మొగమున నిలువుబొట్టు, కన్నులకుఁ గాటుక, బుగ్గను జుక్క, చెక్కిళ్ళ గందపుఁబూఁత, కంఠము నందుఁ జేతులయందుఁ గాశ్మీరార్ద్రావలేపము, తాల్చిన నల్లనిచీర బిగించుటచేతఁ దచ్ఛరీరసౌందర్యమంతయుఁ బైకి నుబికివచ్చుచుండెను. గులాబివన్నెబంగరుపూల రవికె బిగించి, వక్షోజభాగము మఱింత యున్నతముగాఁ గనిపించుచుండెను. తద్వక్షస్థలకాఠిన్యముచే నున్నతత్వముచే నామెనడు మున్నసన్నముకన్న నెక్కువసన్నమైనట్లు కనిపించెను. ఊరువులు, జంఘలు, బాహువులు సువ్యక్తసౌందర్యరాసులవలెఁ గనిపించెను. పాదములయందుఁ గడియములు, నూపురములు గాక వెండిగజ్జెలు నలంకార మనుర్చెను. కాళ్ళకుఁ బెట్టిన పారాణి యెఱ్ఱని యా పాదతలములపై సంధ్యాకాలమునందలి మందారపుష్పములవలెఁ గాంతిచ్ఛటాధిక్యముచేతనే యధికాల్ప వర్ణభేదముల తారతమ్యములో నున్న సొగసును బట్టిచూపించెను. ఆమె చిన్నపాదము - సుకుమారమైనపాదము - నెత్తురుచారలు కనిపించుచున్నపాదమునందలి పారాణి యోధస్త్రీల పాదలాక్షా సౌందర్యమంతయుఁ జూరఁగొనెను. ఆమె యడుగువేసినంత మేఱ యెఱ్ఱతామరలు మొలుచుచుండెను. జంఘ తగిలినంతమేఱ నాకాశమున వరివెన్నులు సృజింపఁబడుచుండెను. రంగస్థలమంతయుఁ దదూరుసంచారముచేత కదళీవనభ్రాంతి కల్పించుచుండెను. ఆమె నడుమును వక్షోజభాగములు రెండును నల్పత్వమృదుత్వములను

మాటిమాటికి సృష్టించుచుండెను. సుందరీతిరశ్చీనపరివర్తితపత్రికం పితగ్రీవాభేదములచేత నానావిధములైన శంఖములుద్భూతము లగుచుండెను. దృష్టిసాఁగినంతమేఱ నీరజాతములు, మల్లెలు, మొల్లలు, గేదంగిపూలు, పునఃపునఃప్రభూతము లగుచుండెను. ఆమెజడ కాలసర్పములను, నీలమేఘపరిపత్తులను, గదలించినకత్తు లను సృష్టించుచుండెను.

యదఖిలదూరతరేపి యదంతిక మాత్మతయా వియదాదిం
అనుగత మధిగత మపార మనన్యమనోభి రనాదిం ॥మృగయత॥

ఆమెకంఠస్వరము వెదుళ్ళలోఁదూఱి రొదచేసిన సన్నని వాయువువలె నొకసారి, రాజహంసప్రియురాలివెంటఁ బరువెత్తి చట్టుప ల్పచరించినకూజితమువోలె నొకసారి, మేఘాచ్ఛాదితాంబర మును వీక్షించి మహానందమగ్నమైన మయూరి కెవ్వున నెత్తినకేక వోలె నొకసారి, వసంతవేళామాకందపల్లవములు గీరుకొనిపోయిన గొంతుకెత్తి కుహూయన్న కోకిలాపంచమస్వరమువోలె నొకసారి, బిలబిల మెట్లుమెట్లైన బంగారపు టిసుకపాఱలమీఁదఁ బ్రవహించిన సెలయేటినీటి మర్మరస్వరమువలె నొకసారి, వీణానాదముతోఁగలిసి యేర్పరించరాక మఱియొకసారి, సృష్టిలోనున్న నానాసుమధురధ్వ నులను బర్యాయముగాఁ బ్రదర్శించెను. ఆమె నల్లనివాఁడు, తామర పూవులవంటినేత్రములవాఁడు, దయారసమును జిలికెడివాఁడు, శిర స్సుపై నెమ్మిపింఛముకలవాఁడు, ఎప్పుడును నవ్వుచున్న మొగముకల వాఁడు ఓమల్లియలారా! మీపొదలచాటున డాఁగలేదుగదా! మన్మ థుని గన్నవాఁడు, లక్ష్మీదేవివక్షస్థలమున నలరువాఁడు, కమ్మని పిల్లనఁగ్రోవియులిపువాఁడు, అనంగ లుంగ నారంగ వృక్షములార! మీవద్దకు రాలేదుకదా!

అదె నందనందనుం డంతర్హితుండయ్యెఁ
పాటలీతరులార! పట్టరమ్మ
హేలావతులఁ గృష్ణ యేలపాసితివని
మైలేయలతలార! యడుగరమ్మ
మానినీమదముతో మారాక యెడఁగించి
మాధవీలతలార ! మనుపరమ్మ

వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడుకదా!

చూతమంజరులార చూడరమ్మ

జాతిసతులఁ బాయ నీతియే హరి కని జాతులార! దిశలఁ జూఁటరమ్మ

కదళులార! పోయికదలించి శిఖిపింఛజూటుఁ దెచ్చి కరుణఁజూపరమ్మ!

● స్వామీ! నీ వేమో నాకంటికిఁ గనిపించకుండఁబోయితివి. నీ మీఁదఁ బ్రాణములు పెట్టుకొని నేను వచ్చితిని. న న్నేమి చేసె దవు? నీజన్మచేత వ్రేపల్లె మిక్కిలి వృద్ధిపొందినది. ఇందు శ్రీ సమృద్ధిగానున్నది. నీవు మమ్మ విషజలమువలన, వ్యాళరాక్షసులవలన, వర్షమారుతములవలన, సర్వభయములవలన నిదివఱకు రక్షించినావు. ఇప్పుడు వధ యేల జేసెదవు? నేను నిన్నే యాశ్రయించినాను. శ్రీకరగ్రహము, కామదమైన నీకరసరోరుహము కాంతుఁడా! నా శిరస్సున నుంచుము. నీవు యశోద కొడుకువా? సమస్తజంతుచేతోవిదితాత్మవు - మధురమైన మాటచేత, వల్గువాక్యముచేత, నీ యధర సుధారసము న న్నాస్వాదించనిమ్ము.

చలసి యద్వ్రిజా చ్చారయన్ పశూన్ వలినసుందరభి నాథ తే పదమ్

శిలతృణాంకురై స్సీద తీతి నః కలిలతాం మనః కాంతి గచ్ఛతి.

గోవులవెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారల పాపసంఘముల్

ద్రోవఁగఁజాలి శ్రీఁదనరి దుష్టభుజంగఫణాలతాగ్రసం

భావితమైన నీచరణపద్మము చన్నులమీఁద మోపి త

ద్భావజఘుమ్పభల్లభవబాధ హరింపు, వరింపు మాధవా!

ప్రభూ! నీవు నిత్యము పగలు గోవులవెంటఁ బోయెదవు. రాత్రులందు మాకు నిద్రవచ్చుచున్నది. నీసౌందర్యము కనులారఁ జూచుట యెన్నఁడో తెలియ లేదు' అని,

కాంభోజి - ఆది

మాధవం దర్శయ, హే మందార! మాధవం దర్శయ

మాధవ మిహ రాధికారాధిత మథ సాధకజనఫలసాధక మధునా ॥మాధవం॥

దేవదాసి నృత్య మడవికో శ్ళఱచినట్లు, మహారణ్యమునందలి తరుశాఖ లొంటొంటిని రాచుకొని మెఱసినట్లు, జలతరంగిణి నిన

దించినట్లు లాస్యతాండవములచేత విజృంభించెను. అచ్చట స్వామికిఁ గల్యాణము జరుగుచుండెను. వైఖానసులు మంత్రములు చదువుచుండిరి. నడునడుమ వివాహశుభవాద్యములు మ్రోఁగుచుండెను. జనమందఱు నిశ్చలదృష్టులై చూచుచుండిరి. వేలకొలఁది జనమున్నయీయెడ నిర్జనమైనప్రదేశమువలె నుండెను.

గిరిక 'స్వామీ! నీకై ముప్పదియేండ్లనుండి తప మాచరించుచుంటిని. నేఁడు దర్శనమిత్తు నని చెప్పితివి. స్వప్నమందుఁ జిత్రమందు దేవాలయమునందే కాని నీ జ్యోతిర్మయాకారమును, నీ సచ్చిదానందస్వరూపమును నేను నిమీలితదృష్టినై చూచుకొన్నది లేదు. నీవు నా ప్రాణాలకు యుచ్చులు వేసితివేమో తెలియదు. ప్రాణములు నాకు లెక్కలేదు. ఇవి నీ పదసన్నిధానమున నా చిన్ననాఁడే యుంచఁబడినవి. దర్శన మిచ్చెదవో, యీయవో యీనాఁడే తెలియవలెను.

రేరే మందార సంతాన కల్పక పారిజాత చందన
రేరే చంపక నాగ పున్నాగ శ్రీపూగ పనస నారికేళ
రసాల ॥మాధ॥

ఓహో! వృక్షములార! మీనడుమ నెచ్చటనో స్వామిని దాఁచుకొని నన్నేల యలయించెదరు? ఇవిగో యిచ్చట స్వామి పాదచిహ్నములు శంఖచక్రగదాపద్మచిహ్నితములై కానవచ్చుచునే యుండెను. ఈ బృందాభూమి యెంతనోఁచుకొన్నదో, వేదశిఖరములకుఁగూడఁ గఱవైన యీ చిహ్నము లిట్లు మాళిఁదాల్చుటకు! తల్లీ! భూదేవి! నీ వమ్మా యదృష్టవంతురాలవు!

కిటివై కౌఁగిటఁ జేర్చెను వటుఁడై వర్ధిల్లి కొలిచె వడి కృష్ణుండై
యిటుఁ బదచిహ్నము లిడె క్రిందటిజామున నేమి నోఁచితమ్మ
ధరిత్రీ!'

అని తన్మయత్వముపొంది గిరిక తాను శ్రీకృష్ణలీల లాచరించ నారంభించెను. 'అదిగో, అదిగో దావాగ్ని బృందావనమంతయు మ్రింగివేయుచున్నది.' అని నోరుతెరచి మరాళహస్తముతో నాపోశనము చేసెను. 'ఇదిగో, తృణావర్తుఁ డన్న రాక్షసుఁడు నన్నెత్తుకొని పోవుచుండెను. నేను వానివెంటనే పోయెద' నని కొంతదూరము పరు

వెత్తి మఱల దిరిగి వచ్చెను. 'నేను శ్రీకృష్ణుడను. నాగర్భమున లోకమంతయు నిమిడియున్నది. ఇదిగో తల్లికి జూపించుచున్నా' నని నోరు తెఱచెను. 'దుష్టుడైన యింద్రుడు పుష్కలావర్తకములను వదలిపెట్టెను. ఓ గో గోపీజన గోపాలకులారా! రండు రండు! ఈ పర్వతముక్రింద నిలుచుండుడు—

బాలుం డీతడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపగా
జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపగాబోల దీ
శైలాంభోనిధి జంతుసంయుతధరాచక్రంబు పైబడ్డ నా
కే లల్లాడదు బంధులార! నిలుడీ క్రిందన్ ప్రమోదంబునన్.'

అని చిటికెనవ్రేలు పైకి పట్టుకొని వ్యత్యస్తపాదారవిందయై నిలుచుండెను 'నేను వేణువు వాయించుచున్నాను. ఓహో! గోపికలారా! మీ రందఱు రండు! మీకు బరమమైన తత్త్వ ముపదేశించెదను. కూర్చుండుడు! మీ రింతయర్ధరాత్రివేళ నేల వచ్చితిరి? మీరువచ్చినజాడ తెలియక మీ తల్లులు, తండ్రులు, మీభర్తలు, బంధులు మీకై వెదకుచున్నారేమో! పొండు, పొండు! అడవి యంతయు సింహశార్దూలములు తిరుగుచున్నవి. మీరు నాని కాహారముకాకుండ బొండు! జారకాంతలు సంసారము ను లెక్కసేయరు. మీభర్త లెఱిగినచో బ్రాణముల మీదికి వచ్చును. రాజునకు దెలిసిన దడించును. మతాచార్యులు బహిష్కరింతురు. ప్రతినిమేష భయకార్యమైన జారుని పొం దేమి సుఖము? మీరు నన్ను వదలి పోరా! ఏ మనుచున్నారు?

'నీపాదకమలంబు నెమ్మి డగ్గఱగాని, తరలిపోవంగ బాదములు రావు
నీకరాబ్జంబులు నెఱి నంటితివిగాని, తక్కనపనికి హస్తములు రావు
మామనంబులెల్ల మసరి దొంగిలితివి, ఏమిసేయువార మింక గృష్ణ!

నీమెత్తని మాటయన్న వానగురియదేని యీ మన్మథాగ్ని చల్లారదు. నీముఖచంద్రచంద్రికలు ప్రసరించవేని యీ కామాంధకార మణగదు. కృష్ణా! రక్షింపుము! రక్షింపుము!' అని యింతలో మూర్ఛపోయి మఱల లేచి, 'ఏడీ కృష్ణుడు? ఇంతకుముందేకదా, కనిపించెను? మఱల గనిపించడే!

సరసకదంబక పలాశ కురువకవట సమూహ
విలస నశోకకపిత్థకదళీవన లలిత దేవదారు
బృంద పిముసుంద ॥మూఘనం దర్శయ॥'

అనిపిచ్చి యెత్తినట్లునిమీలిత నేత్రంలతో దిరుగ నారంభించెను.

కల్యాణములు జరుగుచుండెను. పఠింపఁబడుచున్న మంత్ర ధ్వని తప్ప మఱే సవ్వడియుః బందిరిలో వినిపించలేదు. వేణుగోపాల స్వామిదృష్టి తాను పెండ్లియాడుచున్న సత్యభామయం దున్నదో, నృత్యముచేయుచున్న దేవదాసియం దున్నదో తెలియలేదు. కాగడాలు నిశ్చలములై పోయెను. సర్వప్రాణులును వెలుఁగుచున్న దీపములవలె హృదయమందు వ్యగ్రులై యుండిరి. గాలి స్తంభించి పోయెను. స్వామిని ధరింపఁజేసిప మధుపర్కములు రక్తవర్ణములై భాసించెను. కట్టించినవి తెల్లనిబట్టలు, ఎట్లుపడుట యేటికో తెలియలేదు. స్వామినిగ్రహమంతయు నెఱ్ఱనై పోయెను. ఆనమయమందున్న యనురాగమే దేహసర్వాణుపులయందు వ్యాపించి భగవంతుఁడు నఖశిఖా పర్యంతము సర్వాణువులయందు రాగమూర్తి యయ్యెనా యన్నట్లుండెను.

గిరిక మఱల నారంభించెను 'ఇచ్చట స్వామి నిక్క పువ్వులఁ గోసెను అవిగోబాటన వేళ్ళపై నిలుమన్న గుర్తులు కనిపించుచున్నవి. ఇచ్చట స్వామి రెండుపాదములు దగ్గఱపెట్టి నిలుచుండెను. ఎవ్వరో స్వామి నింత భయముతో నిలఁబెట్టనవారు ?

ఈ చరణంబులే యిందునిభానన
సనకాదిముని యోగసరణి నొప్పు
ఈ పాదతలములే మొలనాగ ! శ్రుతివధూ
సీమంతవీధులఁజెరున్న మిగులు
ఈ పదాబ్జంబులే యిభకులోత్తమయాన
పాలేటిరాచూలి పట్టుకొమ్మ
లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ
ముక్తికాంతామనో మోహనమ్ము
లీ యడుగులరజమె యింతి బ్రహ్మేశాది
దివిజవరులు మౌళిదెసలఁ దాల్తురు

ఈ పాదములు లక్ష్మీదేవి స్తనాగ్రభాగములందుఁ దగిలి నొప్పివెట్టినది కాఁబోలు! యోగీశ్వరులు తమ మహాజిజ్ఞాసాపథముల నీ పాదములను భిన్నభిన్నములుచేసి విచారించి యిక్కట్టులు పెట్టిరి కాఁబోలును! ఈ పాదములే నిమ్నోన్నతములైన బృందావనసంచారముచేత మిక్కిలి కష్టపడెను కాఁబోలు! ఈ పాదచిహ్నములకుఁ దచ్ఛ్రమయంతయుఁ బోవునట్లు నా ప్రాణములతోఁ దుడిచెదను. నా పయ్యెదకొంగుతో నద్దెదను' అని గిరిక యా పాదచిహ్నములపై వంగి, సానుక్రోశముగా నుపలాలించి, యా చిహ్నములు ముద్దుకొని కన్నులకద్దుకొని వానిని కౌఁగిలించుకొనెను. "అయ్యో! స్వామితోఁబాటుగా నీ చరణచిహ్నములును మాయమైనవే! ఆహా! యేమి చేయుదును?

బృందే బృందావనచర మహర్నిశి నందనందన మతులం
కుందలవంగలతే కుటిలాలక మిందుసుందరానన మతులం

॥మాధవం దర్శయ॥

ఈ వృక్షములకు నామీఁద దయవచ్చుచున్నట్లు లేదు. నేను గొంతెత్తి యాక్రోశించెదనే కాని నాపలుకు స్వామిచెవులఁబడినట్లు లేదు. ఛీ, నే నింక బ్రదికి యేమి లాభము?" అని చీరకొంగుదీసి కంఠమున కురిబోసికొని బిగించుకొనుచుండెను. భోగప్పశాస్త్రి రత్నగిరివద్దకుఁ బోయి "ఏమమ్మా! వీణ నేను వాయించెద నిటు తెమ్ము! ఇంక గిరికకు నీవు సఖివి. ఆమెను నేను తాఁకి మఱి యెట్లు వారింతురు? ఆమెపవిత్రదేహమును నేను స్పృశించరాదు. నీవు పో" మ్మనెను భోగప్పశాస్త్రి వీణె వాయించుచుండెను. రత్నగిరి పోయి 'తల్లీ! స్వామి కనిపింతు నని చెప్పినాఁడుకదా! చెప్పినవాఁ డట్లుచేయఁడా? నీ కీ తొందర యేల" యని మెడయురి సడలించెను.

మొదటినుండియు సర్వజనులకు దేవదాసి నృత్యము నృత్యముగా లేదు. అది యథార్థస్వరూపమే యనిపించుచుండెను.

కల్యాణము పూర్తియయ్యెను. స్వామి కా నాఁడు పార్థసారథియలంకారము చేసిరి. కల్యాణమైనతరువాత స్వామిని దెచ్చి రథమునొగపైఁ గూర్చుండఁబెట్టిరి. మఱల దేవదాసి—

"మాధవం దర్శయ, హే మందార! మాధవం దర్శయ!
పున్నాగ! కానవే పున్నాగవందితుఁ
దిలకంబ! కానవే తిలకనిటలు
ఘనసార! కానవే ఘనసారశోభితు
బంధూక! కానవే బంధుమిత్రు
మన్మథ! కానవే మన్మథాకారుని
వంశంబ! కానవే వంశధరుని
చందన! కానవే చందనశీతలుఁ
గుందంబ! కానవే కుందరదను
ఇంద్రభూజము! కానవే యింద్రవిభవుఁ
గువలవృక్షము! కానవే కువలయేశుఁ
బ్రియకపాదప! కానవే ప్రియవిహారు,
మాధవం దర్శయ రే మందార! మాధవం దర్శయ"

అప్పుడు జనులలో నొకకదలిక పుట్టెను. అందఱును దేవదాసినుండి వేఱొకవంకకుఁ జూచిరి. పంగనామములు పెట్టుకొన్న యొకకోఁతిపిల్ల జనము మధ్యమునఁబడి పరువెత్తుచు వచ్చెను. అది కఱచు నేమో యని జనము భయభ్రాంతులై కదలిపోయిరి. జనమందఱును లేచి నిలుచుండిరి, ఆసందడిలోఁగూడ

'మాధవం దర్శయ రే మందార మాధవం దర్శయ'

అన్న మధురకంఠనినాదము వినిపించుచునే యుండెను. సరాసరి యా వానరముపోయి పార్థసారథి యలంకారముచేసిన రథోపరిభాగమునకెక్కి కూర్చుండెను. కోఁతి యలంకారము పాడుచేయు నేమో యని యర్చకులు భయపడిరి. 'ఈ కోఁతి యెవరి దెవరి' దనిరి. ఆ నోట నానోట మంగమ్మపే, రాకంట నాకంట మంగమ్మ రూపమును నందఱకు వినఁబడెను; కనఁబడెను.

"రేరే మందార సంతానకల్పక పారిజాత చందన
రేరే చంపక నాగపున్నాగ శ్రీపూగపనసనారికేళ రసాల,
మాధవందర్శియ

నాస్వామి శంఖచక్రగదాపద్మమండితచతుష్కరుఁడు. పీతాంబరుఁడు. వనమాలి. తామరసాక్షుఁడు. నిడుదలైన కేలుగవవాఁడు.

నవ్వినచో శరజ్జ్యోత్స్నవలె నవ్వువాఁడు. మాటాడినచో నమృత బిందువులవలె మాటాడువాఁడు. నడచినచో సృష్టివలె నడచువాఁడు. లక్ష్మీదేవి, భూదేవి, చింతామణి వక్షమునందు కలవాఁడు. వెడదకన్నులవాఁడు, వేయినామములవాఁడు, వ్రేఁతలవలపించు నవ్వువాఁడు. చిప్పకూఁకటివాఁడు, చిన్నినవ్వులవాఁడు, చెఱివినమంచి పించయుమువాఁడు, పులుఁగుతత్తడివాఁడు, పొడవులతుదవాఁడు, పొక్కిన వెలిదమ్మిపువ్వువాఁడు, మిసుకటూఁపులవాఁడు, మిసిమి మేఁతలవాఁడు, మెఱుఁగుచామన చాయ మేనివాఁడు, దిస్సమొల వాఁడు, పసిఁగానఁ దిప్పువాఁడు, మురళికలవాఁడు, మువ్వంకమురువు వాఁడు, మురువుమెడలోన పులిగోరు మెఱయువాఁడు, కన్నుఁగొన లందు భక్తులఁగాచువాఁడు.

మీకుఁ గనిపించలేదా! ఆయనగుర్తులన్నియు మీకుఁ జెప్పితిని. ఓహో! మాతులుంగ లవంగ చూత కేతకీ భల్లాత కామ్రాతకీ సరళ పనస బదరీ వకుళవంజుళ వట కుటజ కుంద కురవక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సిందువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీమధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలక క్రముక కపిత్థ కాంచన కందమూల శిరీష శింశు పాశోక పలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మల్లికామతల్లికలారా!

మృగయుత రాధామాధవం ముహు రిహ నిగమవసేధవం
చలతి జగతి యదచంచల మాతత ముపవిసహిత జగదండం
పరిభవతి భవతి పినద్ధ మిదం నిజ మాయిక మేక మఖండం॥
మాధవం దర్శయ హే మందార మాధవం దర్శయ
ఫుల్లకుసుమమల్లి కే జాజి మాలతివల్లీ వనజాలతి కే
కల్లోలశ్రీకమల కేతకీకుముదకల్హారాదికుసుమచయపంక్తి లలితే॥

నాస్వామిత్రిలోకమోహనుఁడు. అతని పాదములు వేద వీధుల నుపనిషత్కాంతలు క్రతుపురోడాశధూమప్రభృతిమహాపవిత్ర వస్తువులచే సమ్మార్జనము చేయుచుందురు. ఆయన నిర్గుణుఁడు సర్వ భూతాంతరాత్మ. దయాపాంగ ప్రవర్ధిత భక్తజనసందోహుఁడు. ఆ స్వామిని నో మందారవృక్షమా! చూపింపుము! ఓ చంపకమా!

దర్శింపఁజేయుము! ఓ బృందావనమా! నీకు నమస్కారముచేయు చున్నాను. ఆయనను నీలోనే దాఁచుకొన్నావు. లేకపోయిన నీయం దాయనపాదచిహ్నము లేల దాఁచుకొన్నావు? ఎచ్చటనో నీవే యా యనను దాచియుందువు. చూపించవా?

జనములో నొక పెద్దముత్తైదువ వినిపించెను: 'కోతినిఁ దేవుని మీఁదికి వదలితి వే' మని మంగమ్మ నెవరో అనిరి. ఆమె 'నేను కోఁతిని త్రాళ్లుపెట్టి కట్టితిని అది త్రెంపుకొని క్రమక్రమముగాఁ గొట్టికి వేసినదికాబోలును. నేను త్రాటితో గట్టితినికదా యని యశ్రద్ధ వహించితిని. అది త్రెంచికొని. వచ్చినది' యనెను. కుమారస్వామి 'నేను పోయి కోఁతిని దెత్తు' ననెను. ఎవరో సమూహములో నొక రన్నారు: 'పార్థ సారథికమైన రథము మీఁదఁ పతాక వానరమేకదా!

పడగనున్న హనుమ భయవిహ్వలుఁడు గాఁడు
అరదమునకు సూతుఁ డచ్యుతుండు.'

అందఱును సంతోషించిరి. ఈధ్వనిలో 'మాధవం దర్శయ హే మందార' యన్న యఖండధ్వని వినిపించుచునే యుండెను.

'శుకకోకిల శారికబృంద, శకుంత శోభనహంసకుల
ప్రకటాకాశానిలానల జలధరణిసకలదేవగణ సరసగుణగణ!
మాధవం దర్శయ హే మందార మాధవం దర్శయ.'

గిరిక యీ మహాతన్మయత్వములో మూర్ఛపడిపోయెను. రత్న గిరి శిశిరోపచారములు చేసెను. గిరికకు స్మృతి రాలేదు. ధర్మా రావు వెంటనే 'కుంభహారతి వెలిఁగించు' డనెను. కుంభహారతి వెలిఁ గించిరి. భోగప్పశాస్త్రి పాడెను—

'సకలనిగమగూఢ మఖిల లోకధార మచ్యుత మఖిలగురుం
సరసగోపీగణ పరిగీతమను శివనారాయణ తీర్థఫణిత ముదారం
మాధవం దర్శయ హే మందార! మాధవం దర్శయ.'

గిరిక లేచి నిలుచుండెను. మహాఖండహారతిలో హారకుండల కేయూర కిరీట భూషితుఁడు, శంఖచక్రగదాపద్మహస్తుఁడు, వనమాలి, సూర్యచంద్రమో నేత్రుఁడు, హిరణ్యశ్మశ్రుఁడు, హిరణ్యయశ రీరుఁడు నై మహాపురుషదర్శన మామెకుఁ గలిగెను. ఆమెకనుగొనల నుండి బాష్పధారలు స్రవించెను. ఆమె నమస్కారముచేయుచు

నిలువఁబడెను. ఆమె క్రిందఁబడిపోవునేమో యని రత్నగిరి పట్టుకొని యుండెను. ఆ మహామూర్తి యామె నేత్రమండలమంతయు నిండెను క్రమముగా నేత్రేంద్రియముస్వగుణమునుబరిత్యజించెను. ఆమె నేత్రములుసూర్యచంద్రమోవికారములయ్యెను ఆమూర్తియామెలోఁ ప్రవేశించెను. ఆమెయొడలంతయు హిరణ్మయమయమై పోయెను. క్రమక్రమముగాఁ బంచేంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము సర్వము నిండి నా మూర్తినిండిపోయెను. ఆమెలోనున్న ప్రాణములం దామూర్తిబలిసెను. ఆమెసర్వప్రకృతితన్మూర్తిమయ యయ్యెను. రత్నగిరి చేతిలో నున్న యామె నఖశిఖపర్యంతము చల్లనైనట్లు తోఁచెను. రత్నగిరికి దుఃఖము పొంగివచ్చెను. నంద్యాల వారాంగన 'మచ్చిక వీరికెల్ల బహుమాత్రము చోద్య' మని చదువుచుండెను. భోగప్పశాస్త్రి 'మాధవం దర్శయ హేమందార' యని పాడుచుండెను. పంచభూతములు నిశ్చలములై భయభ్రాంతము లయ్యెను. మహాఖండహారతి తనకాంతిలో జపాకుసుమములు, నిత్యమల్లికలు, రక్తనీరజములకాంతిలోఁ దనుఁదాఁ బూజించుకొనెను. ఒక్కసారి గుప్పునమండి కాగడాలన్నియు నాఱిపోయెను. కుంభహారతి మధ్య నుండెను. ఒకప్రక్క వేణుగోపాలస్వామి పార్థసారథి విగ్రహము, మఱియొకప్రక్క దేవదాసి- ఆ వెలుఁగుచేత నటు భగవంతుఁడును నిటు దేవదాసియుఁ బ్రకాశించిరి. ఒక్కసారి పందిరియంతయు నంధకారమయమయ్యెను. ఎవ్వరికిని నేత్రములు కన్పించుటలేదు.

'హేమందార మాధవం దర్శయ,
రేరే మందార సంతాన కల్పక పారిజాత చందన
రేరే చంపక నాగపున్నాగ శ్రీ పూగ పనస నారికేళరసాల!
మాధవం దర్శయ' యనియే మ్రోగుచుండెను.

853

# ముప్పదియవ అధ్యాయము

వైశాఖ బహుళామావాస్యనాడు ఎనుబదియేండ్ల వృద్ధుడొకఁడు సుబ్బన్నఁపేఁట స్టేషనులోఁ రైలుదిగి పిచ్చివానివలె నాల్గు దిక్కులు బెదరిన కన్నులతోఁ జూచుచు నడచుచుండెను. అతఁడు దిగ్భ్రాంతుఁడై ప్రక్కనున్న యెవరినో చూచి అయ్యా! ఇది నిజముగా సుబ్బన్నపేఁటయేనా?' యనెను. ఆ యడుగఁబడినవాఁడు గుఱ్ఱపుబాడితోఁలు సాహెబు, వాఁడొక చిన్న సాహెబుల తిట్టు తిట్టి 'కాదోయి! నీకు ఝూటామాటా చెప్పుచున్నా' ననెను. వృద్ధుఁడుత్తర హిందూస్థానీయునివలె నుండెను. తలమీఁద నొక గుడ్డటోపీ చెవులు మూసికొని యుండెను: కాషాయవర్ణముగల శాటికొంగులు వెనుకనుండి చంకల క్రిందుగాఁ దీసి, ముందునుంచి మెడ వెనుకలాగి ముడివేయఁబడెను. ముఖమున గంధముతో వెడల్పైన నిలువుబొట్టు గలదు. అతఁడు రోడ్డువెంట నడచివచ్చెను. కోట దక్షిణపు గోడ వద్దకు వచ్చువఱకు నతనికి స్మృతివచ్చినది. అవు నిది కోటయే యనుకొనెను. దక్షిణద్వారమునఁ గోటలోఁ బ్రవేశించెను. అచ్చట నొకపరిచారకుఁడు చూచి, 'యెవరు నీవు' దొంగవలె నున్నావే! పోపో' యని తఱిమెను. అతఁడు చేయునదిలేక వెనుకకుమఱలి కోట ముందుభాగమునకు బయలుదేఱెను. అతని కుడివైపున నంతయు నపరిచితముగా నుండెను. ఎడమవైపున నంతయు సుపరిచితముగా నుండెను. దారిపొడుగున పెద్దపెద్ద స్తంభములు, రోడ్లు, చిత్రవిచిత్రములైన దుకాణములు వానికంటికిఁ గ్రొత్తగానుండెను. ఆగ్నేయదిశకు వచ్చినంతనే యచటనున్న పెద్దమామిడిచెట్టు శుష్కించిపోయి, కోటగోడమీఁద కొఱగిన యొక్క కొమ్మతో నదియు వైదికుని శీలమువలె చివర నెక్కడో నాలుగాకులుమాత్రము మిగిలియుండెను. అతని కచట మఱల ననుమానము తగిలెను. 'ఇది సుబ్బన్నపేఁట కాదేమో!' ఉత్తరాభిముఖుఁడై నడచెను. దేవాలయములు కనిపించెను. సుబ్బన్నపేఁట యని ధ్రువపడెను. దాఁటిపోయెను. కోట గుమ్మమువద్దకుఁ బోయి యచట నిలుచుండి నాల్గుదిక్కులు బరకా

యించి చూచెను. లోనికి వెళ్ళుదమని యున్నది. మఱి యెవరైన
'హో హో'మ్మందు రేమో యని భయమును వేసినది. అయినను గాని
మ్మని యతఁడు బయలుదేఱెను. లోనఁ గొంతదూరము పోయెను.
ఎవరును వలదనలేదు. హరప్పనాయని గదివద్దకుఁ బోయెను.
నాయఁడు గదిలోఁ గూర్చుండి చదువుకొనుచుండెను. ఈ ముసలి
వానికి దగ్గువచ్చెను. హరప్ప తలయెత్తి చూచెను. వీ డెవడో
బైరాగి. అతఁడు కోటలోని కేల వచ్చెనో తెలియక బయటికి
వచ్చెను. వచ్చి 'ఎవరు నీ' వనెను. ముసలివాఁడు 'నే నొక బైరా
గిని బాబూ! మీ రెవ' రనెను. నాయనికిఁ గొంచెముకోపము.
గొంచెము నవ్వును వచ్చెను. ఇంతలోఁ బరిచారకుఁడెవడోవచ్చి
యతని నదలించెను. వాఁడు 'బాబూ! కోటనాల్గువైపులఁ జూచిపోవు
టకు వచ్చినాను. ఇరువదియేండ్ల యయినది నేను కోటజూచుకొని'
యనెను. పరిచారకుఁడు నవ్వెను. చీచీపొమ్మని తఱిమివేసెను.
ఎవఁడో పిచ్చివాఁ డనుకొనిరి. అతఁ డచటనుండి దేవాలయముల
వద్దకుఁ బోయి గోడలు, తలుపులు సర్వము భద్రముగా నున్నట్లు
చూచుకొనెను. సుబ్రహ్మణ్యేశ్వరస్వామియాలయములోనికిఁబోయెను.
అచట గణాచారి కూరుచుండెను. అతఁడు గణాచారివంకఁజూచెను.
గణాచారి యతనిని నిదానించిచూచి కొంతసేపటికి గుర్తుపట్టి
'యోహో! నీవా! ఇన్నాళ్లెచ్చట నున్నా?' వనెను. అతఁడు
'ఇదిగో! ఈ వేషముతోఁ బొట్ట పోసికొనుచున్నా' ననెను. గణా
చారి 'దేవదాసి నెఱుఁగుదువా? నీనాఁటి కామె చిన్నపిల్ల' అనెను.
ముసలివాఁడు 'నాకు తెలియదే' యనెను. గణాచారి 'రత్నగిరి
కూఁతురయ్యా! రత్నగిరి నెఱుఁగవా? రామేశ్వరశాస్త్రిగారు...'
అనెను. ముసలివాఁడవునవు' ననెను. గణాచారి— ఆమెకూఁతురు
దేవదాసి. ఆమెచనిపోయి నేఁటికి పదునేనుదినములు. ఇవ్వాళ
దినము. ముసలివాఁ డెందుకుఁ జనిపోయె' ననెను. గణాచారి— ఆమె
మనదృష్టికిఁజనిపోయెను. ఆమె శ్రీవేణుగోపాలస్వామివారియందు లీన
మైనది. మహాభక్తురాలు. పదినాళ్ళు నృత్యము చేసిచేసి చివరిదిన
మున విద్యున్మయాకృతియైన భగవంతునిదర్శనము కలిగి పరమపదిం
చినది. ముసలివాఁడు 'ఆహా' యని కనులుమూసి బాష్పము లొలి

కించెను. గణాచారి—ధర్మారా వచటనే యున్నాఁడు,” ముసలివాఁడు బిరబిర నడచిపోయెను. ధర్మారావు నింటికిఁ జని వాకిట నిలుచుండెను. రామేశ్వరశాస్త్రిబియ్యము తెచ్చి పెట్టఁబోయెను. ముసలివాఁడు ‘నీపే రేమి బాబూ!’ యనెను. కుఱ్ఱవాఁడు ‘నాపేరు నీ కెందుకు ? బిచ్చగాడవు బిచ్చముపుచ్చుకొనిపొమ్ము. నాపేరు మొన్న కల్యాణో[redacted]త్సవములు జరుగువఱకు నొకటి. ఇప్పు డింకొకటి” అనెను. ముసలివాఁడు—మీనారాయనగారి పే రేమిటి ? కుఱ్ఱడూ అమ్మగారికి జబ్బుగానున్నది. నీవు బిచ్చము పుచ్చుకొని పొమ్ము. ముసలి—ఏమి జబ్బు ? శాస్త్రి—ఏమి జబ్బా! ఏమి జబ్బున్నది? గిరికను పట్టినజబ్బే. ముసలి—గిరిక యెవరు ? శాస్త్రి—బియ్యము నరుగుమీఁదఁ బోసి ‘తీసికొనివఁదీసికొనుము. లేకపోయిన నీబదులు కాకులు తినును లే’ అనెను. ముసలివాఁడు—నీవు ధర్మారావుగారి కుమారుఁడవా ? ఆయన చిన్నప్పు డచ్చముగా నీ వలెనే యుండెడివాఁడు. నీపే రేమి బాబూ ! కుఱ్ఱ-ఇప్పటి పేరు గోపన్న.

ముసలివాఁడు తరతరలాడెను. అచటినుండి నెమ్మదిగాఁ గదలి రత్నగిరి యింటికిఁ బోయెను. రత్నగిరియు, ధర్మారావును ముసలివానిని నిదానించి చూచి గుర్తించిరి. ధర్మారావువచ్చి “గోపన్నా! ఇన్నాళు లెచ్చట నుంటివి ? ఏ దేశము పోయితివి ? నేను వచ్చియడుగఁగా నీకుఁ బిచ్చియెక్కిన దన్నారు. అది నిజమేనా?” అనెను. గోపన్న— బాబూ ! పిచ్చి యెక్కలేదు. కృష్ణమనాయఁడు నా ప్రభువు చనిపోయినతరువాత నేను బిక్కుబిక్కుమనుచున్న కోటలో నేల యుండవలయునని వెళ్ళిపోయితిని. నీవు వచ్చువఱకు నుండిపోదమనుకొన్నాను. కాని నీవు మఱల నన్ను నాదారిబోనీయవేమోయని లేచిపోయితిని. ధర్మా—గోపన్నా ! నీ వెప్పటివాఁడవు. తరువాత నెన్నికథలు జరిగినవి ? అన్నిటికన్న గొప్పవింత—దేవదాసి చనిపోయినది. ఆమె నీ వెఱుఁగవు. ఎఱుఁగకపోవుటచేతఁ బైని పదునేను దినముల యాయుర్దాయము నీ కిప్పటికిఁ బెరిఁగినది. రంగాజమ్మగారు రుక్మిణమ్మరావు, సరోజినీదేవిగారు చనిపోయిరి. రంగారావుగా రిద్దరు దొరసానులను బెండ్లియాడెను. ఆయన మూఁడేండ్లనుండి దీర్ఘ వ్యాధిగ్రస్తుఁడై ఉన్నాఁడు. రంగారావుగారికుమారుని నెఱుగుదువుకదా,

హారప్పనాయఁడని! ఆయనకుఁ దాత పేరు పెట్టినారు. ఆయన యిప్పుడు ప్రభువు. ఊరంతయు మాఱిపోయినది. దారి వెంటఁ జూచి తివికదా! గోపన్న—చూచితిని. చూచితిని. బోదకాళ్ళు వేసినట్లు కంతులు మొలచినట్లు ఉన్నవి. బక్క-పలుచనితనము, దృఢత్వము ఎచ్చటను లేదు. ధర్మా—ఇప్పటి వ్యాధుల కాయుర్వేదౌషధములు పనికిరావు. గోపన్న—నే నుత్తర దేశమున నీ యిరువది యేండ్లుంటిని నా కొక నెలనాళ్ళకింద్రదట సుబ్బన్నపేటగాలి తిరిగినది. ఎవరిని జూచెదనో, యెవరిని జూడనో యనుకొంచు వచ్చితిని బాబూ! మీరు కనిపించినారు. నాకుఁ గృష్ణమనాయఁడే కనిపించిన ట్లున్నది. గోపన్న మాటాడినంతసేపు దగ్గుచునే యున్నాఁడు. ధర్మారావు—ఏమిటి దగ్గుచున్నావు? గోప—గుండెనంజు. ఈ వ్యాధితో మనుజు లెప్పుడో తెలియకుండఁబోవుదురట. బాబూ? జ్ఞాపక మున్నదా? చిన్నప్పుడు పురాణము చదివెడివాఁడవు. మీరును, నేనును, దొరగారును, చిన్నబాబయ్యగారెప్పుడును గోపపడుచుండెడువాఁడు. నన్ను 'గానాగాడిదకొడకా!' యని తిట్టెడివాఁడు. నేను కోటలోనికిఁ బోఁగా వారు నే నెవరినో యనుకొని నన్నుఁ దఱిమివేసిరి. కోట నాల్గుమూలలు చూచి చావవలయు నని యున్నది. అన్నిటికన్న—బాబూ! నేను నేఁడు చనిపోయెదనో ఱేపు చనిపోయెదనో, మీ నోటివెంట 'నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు, అన్న పద్యము మఱల విని చనిపోవలయునని యున్నది. ఆ పద్యము చదివినంతనే దొరగారెప్పుడు నొకమాట యనెడి వారు. అది జ్ఞాపక మున్నదా? ధర్మా—ఉన్నది. 'మన దేవాలయములోని స్వామి సరిగా నీ పద్యములో వర్ణింపఁబడినట్లే యుండును గదా!' యనుచుండెడువాఁడు. గోపన్న—బాబూ! ఈ యిరువది యేఁడులు మీరు చదువుచున్న యీ పద్యము నా చెవిలో గింగురు మనుచునే యున్నది. ఆ పద్యము మఱల నెప్పుడు చదివి వినిపించెదరు? తమ రిప్పుడు పెద్దలైనారు. ఇంటికిఁ బోయి అయ్యగారిని జూచి వచ్చినాను. చిన్నప్పుడు మీరు నట్లే యుండెడివారు. ధర్మా—గోపన్నా! పద్యము సాయంకాలము చదివెదను. నే నిచ్చట నింకఁ గొంతసే పుండవలయును. భోజనమునకు మాయింటికి రావలయునుసుమా గోపన్న—

బాబూ! ఆవరిసారి కోటలోఁ దిని చనిపోవలయు నని యున్నది. ధర్మా—నీ యిష్టము. నేను వచ్చి నిన్నుఁ గోటలోనికిఁ దీసికొని పోదును. గోపన్న—నేను మఱల నింకొకసారి పోయెదను. అప్పుడు గూడఁ గానిచో మీ రట్లే దీసికొనిపోదురుగాని.

అని గోపన్న సుజలఁ గోట కభిముఖుఁడై పోయి మఱి హారప్ప ఎదుగుగా నిలుచుండెను. హారప్ప తలయెత్తి చూచి 'వీఁ డెవఁడు ? కోటలోనికి మాటిమాటి కేటికి వచ్చుచుండె' నని యూహించి యతనిని లోనికి రమ్మని పిలచి 'నీ కేమి కావలయు ?' ననెను. గోపన్న 'నే నీపూఁట కోటలో భోజనము చేయవలయు' ననెను. హారప్ప సరే యని రంగన్నను బిలచి 'యితని కీ పూఁట నిచట భోజనము పెట్టించు'మనెను. రంగన్నకుఁ జాయగా గోపన్న మొఱుక కలదు. అతని నెచ్చటనో చూచిన ట్లుండెను. గోపన్న "బాబూ! నా పేరు గోపన్న. నే నీ కోటలోని కాసావాఁడను. మాదొర కృష్ణమనాయఁడుగారు. వారు చనిపోయినంతనే నేను దేశాంతరము పోయితిని. తమరిని నే నెత్తుకొని పెంచితిని. నే నిప్పు ఖృత్తరహింహూస్థానమున నుండి వచ్చితిని. నా కీ దగ్గుతోఁ జావువచ్చు నని గోసాయీలు చెప్పిరి ఆ చా వెప్పుడు వచ్చునో తెలియలేదు చనిపోకముందు నా ప్రభువును, నాకోటను నొకసారి చూచిపోద మని వచ్చితి" ననెను. రంగన్నకు గుర్తు వచ్చెను. 'నిజమే ప్రభూ! నా కప్పటికిఁ బదునేనేండ్లు. కాని సరిగా గుర్తు పట్టలేక పోయినాను' అనెను. హారప్ప 'అట్లయినచోఁ బోయి కోట నాల్గువైపుల చూచి రమ్ము. నీ వీ యూరిలో నున్నన్ని దినము లిచ్చటనే యుండు' మనెను. గోపన్న—బాబుగారూ! చిన్నబాబయ్య గారిని జూడవలె నని యున్నది. హారప్ప—అనఁగా నెవరు? గోపన్న—తమ నాయనగారు. హారప్ప—వారు మేఁడమీఁద మధ్యచావడిలోఁ బండుకొనియుందురు. పోయి చూడవచ్చును.

గోపన్న మేఁడనెక్కి రంగారావుగారు పండుకొనియున్న చోటునకుఁ బోయెను. పోయి యాయనతోఁ దనసంగతిఁ జెప్పెను. రంగారావుగారు గుర్తుపట్టి "అవునురా! గోపన్న! మీ రెప్పుడును బురాణము చదువుచుండెడివారు. ధర్మారావు చదువుటయు,

నీవును బాబయ్యగారు వినుటయు, ధర్మారావుగారు 'నల్లనివాఁ'డని పద్యము చదివెడివారు. నా కప్పుడు మిమ్ముఁ జూచినచోఁ గోపముగా నుండెడిది. ఇప్పు డా ధర్మారావుగా రెంతవాఁ డయినాఁడు! ఆయన మహావేత్త యఁట. హరప్పనాయఁడుగారి కాయన యెంత చెప్పిన నంత. ఆయనకొడుకు న్నాఁడు; ఆతేండ్లకుట్టివాఁడు—తండ్రికన్న గొప్ప వాఁడగునని కొనుచున్నాను. నీ వుత్తరదేశమున నేమి చేసితివి? ఇంక నీవిచటనే యుండిపొమ్ము. నాకు నీవు సేవచేయుదువుగాని. ఇచట నందఱును హరప్పగారిని జమీందారుగాఁ జూతురు. నేను పట్టి రైతు నైనాను. సరే లే. ఆ రోజులన్నియుఁ బోయినవి. నేను మంచము లో మూఁడేండ్లనుండి పడియుంటిని. వ్యాధి ముదుపటికన్న నయము. మఱి మూఁడు నెలలలోఁ జాలతగ్గు నని వైద్యుఁడు చెప్పుచున్నాఁడు" అని ధోరణిగా మాట్లాడెను. గోపన్న రంగారావుగారిలో దీర్ఘవ్యాధి వలన వచ్చిన మార్పు చక్కగా గుర్తించి బాబయ్యగారూ! కాల మొకరీతిగాఁ గడవదు. నేను వదలిన సుబ్బన్నపేఁటకు, మఱలివచ్చి చూచిన పేఁటకు నెంత భేదమున్నది! మనుష్యులు నట్లే మాఱి రనెను.

ఆ నాఁడు ప్రొద్దుక్రుంకువేళ ధర్మారావును, హరప్పయు, గోపన్నయుఁ దూర్పుదిక్కున నున్న మెట్టచేలకుఁ బోయిరి. అచట హరప్ప మెత్తనిగడ్డిమీఁద నొకచోటఁ గూర్చుండెను. ఆయనకు దూరముగా ధర్మారావును, వారిద్దఱకుఁ గొంతదూరములో గోప న్నయుఁ గూర్చుండిరి. సూర్యాస్తమయము కాఁబోవుచున్నది. గోపన్న 'అయ్యగారూ! తమ రా పద్యమును మఱల నొక్కసారి వినిపించుఁ' డనెను. ధర్మారావు 'నల్లనివాఁడు పద్మనయనంబుల వాఁడు కృపారసంబు పైఁజల్లెడువాఁడు' అని కంఠమెత్తి కల్యాణి రాగముమీఁదఁబాడెను. దూరమునఁ బక్షులతోఁ బాములతో నాడు కొనుచున్న పసిరిక యాధ్వని విని యచ్చటికి వచ్చి క్రొత్తవాని జూచి పాఱిపోఁబోఁగా ధర్మారా వతనిని రమ్మని తనదగ్గఱఁ గూర్చుం డఁబెట్టుకొనెను. గోపన్న యతనిని జూచి 'అయ్యా! పసిరికయున్నాఁ డుగదా!' యనెను. ధర్మారావు పద్యమును బూర్తిచేసెను. హరప్ప 'ఈ పద్యములోని వర్ణన యచ్చముగా శ్రీ వేణుగోపాలస్వామివారిని

వర్ణించినట్లే యున్నదికాదా' యనెను. గోపన్న 'యవు నవు'ననెను. ముగ్గురు నొకరివంక నొకరు చూచుకొనిరి. ముగ్గురు నవ్వుకొనిరి. ధర్మారావునకు గోపన్నకును నాపాలము కోటవలెను, హరప్పనాయఁకు కృష్ణమనాయనివలెను గనిపించిరి. కడచిపోయినకాలము తిరిగి వచ్చిన ట్లుండెను. గోపన్నకు దగ్గుతెర వచ్చెను.

అందఱును గలసి యాలయములోనికిఁ బోయిరి. మొదట సుబ్రహ్మణ్యస్వామిని, దరువాత నాగేశ్వరస్వామిని, దరువాత వేణు గోపాలస్వామిని దర్శించిరి. దేవాలయములో ధర్మారావు 'మందం మందం మధురనినదైర్వేణు మాపూరయంతం' అని కంఠమెత్తి గానముచేసెను. అతనికిఁ దనచిన్ననాఁడు కనులకుఁ గట్టిన ట్లుండెను. గోపన్నకు, ధర్మారావునకుఁ దమయొడళ్ళు తమకుఁ దెలియలేదు. రాత్రికి గోపన్న భోజనము చేయలేదు. మఱునాఁడు తెల్లవాఱిన తరువాతఁ గోటలో గోపన్న చనిపోయినట్లు తెలిసెను. హరప్ప యతనికి దహనసంస్కారములు చేయించెను. 'ఎవని కెచ్చటఁ జావు వ్రాసి యున్నదో తెలియదు. అతఁడు నేనెక్కడను జావను; సుబ్బన్న పేటలోఁగాని జావ నన్నట్లు చూడుఁడు- వచ్చి మఱల నిచటఁగాని చావలేదు. కృష్ణమనాయనిబదులు హరప్పనాయని జూచి మఱీచచ్చినాఁడు. ఒక్కొక్క యనుబంధము తెగించరానిది' అని నలుగురు నాల్గువిధాల ననుకొనిరి.

ధర్మారావుమాత్రము గోపన్న సంస్కారము జరిగినంతసేపు మనసులో 'నల్లనివాఁడు' పద్యము చదువుకొనుచునే యుండెను. ధర్మారా వచటనుండి యింటికిఁ బోయెను. రామేశ్వరశాస్త్రి తల్లి మంచమువద్దఁ గూర్చుండెను. అప్పటికి రెండుజాములైనది. ధర్మారావు కుమారునితో 'నాయనా! మీ యమ్మకు రెండవసారి మందిచ్చితివా' యనెను. శాస్త్రి 'యిచ్చితిని. అమ్మ నిన్నటికన్న నేఁడు మఱియు లేవలేకున్నది' యనెను. ధర్మారావు 'మఱి నిన్నటికి నేఁటి కెంతివారయున్నది?' యనెను.

నాంచారమ్మయు రాజేశ్వరుఁడును సుబ్బన్నపేటలోనే నిలిచిపోయిరి. కల్యాణములైనమఱునాఁటినుండి యరుంధతి లేవలేక పోయెను. అందుచే వారిరువురు నిచటనే నిలచిపోయిరి. రథంతరి

ప్రొద్దున, సాయంకాలమున రెండుపూటలును వచ్చును; తోడికోడ లిని జూచును. ఇరువురును గలసి దేవదాసినిగుఱించియే యూహించు కొనుచుందురు. అరుంధతిని వైద్యుఁడు మాటాడవ ద్దన్నాఁడు ఆమె యెప్పుడును మాటాడును. ధర్మారావు 'నిన్ను వైద్యుఁడు కదలవద్దన్నాఁడు; విశ్రాంతి తీసికొమ్మన్నాఁడు. నీవు కదలితివి. శ్రాంతి తీసికొంటివి. కల్యాణము పదిదినములు నిద్ర యున్నది యెఱుఁగవు. చివర కిట్లయితివి. ఇప్పుడు వల దన్నకొలఁది మాటాడు చుంటివి. ఇదివఱకు దేహములోని నెత్తురు, మాంసము పాడుచేసి కొంటివా? ఇప్పు డూపిరితిత్తులు పాడుచేసికొనుము, అనెను. ఆమె 'మీరుకూడ నన్ను బాధించుఁడు. మీరువచ్చి యోదార్పుమాటలు మాటాడుటకు బదులు నన్ను సాదించుఁడు. నేను బ్రదికినట్లే' యని కన్నీరు పెట్టుకొనును. ధర్మారావు పోయి దగ్గఱఁగూర్చుండి కన్నీరు తుడిచి యోదార్చినఁగాని యామెయుద్వేగ ముపశమిల్లదు. ఈ లోపుగా నామెగుండెలోని పది నెత్తురుబొట్లుడికిపోవును. ధర్మా రావు భోజనముచేసెను. చేయుచు 'పిల్లవానికి మధ్యాహ్నము భోజ నము పెట్టితివా' యనెను. నాంచారమ్మ 'నేను రమ్మన్నచో వాఁడు రాఁడు. నాల్గునాళ్ళనుండి మధ్యాహ్నము భోజనము మానివేసెను. ఎప్పుడును దల్లివద్దఁ గూర్చుండుట, యామెకు వేళకు మందిచ్చుట— ఇదియే వాఁడు చేయుచున్నపని' అనెను. తండ్రి పిలిచి, కుమారు నకుఁ దనతోఁబాటు భోజనము పెట్టెను. అతఁడు భోజనముచేయుచు 'ప్రొద్దున రాజేశ్వరశాస్త్రిగారు వచ్చినారు. అమ్మస్థితి యంత కంతకు చెడిపోవుచున్న దనియే యన్నారు' అనెను.

ధర్మారావు 'అట్లన్నచోఁగాని మీయమ్మ మాటాడకుండ దని యన్నారు. నిన్నటికన్న నెమ్మదిగా నున్నది. నేను చూడ లేదా?' యనెను.

సాయంవేళఁ గుమారస్వామి వచ్చెను. 'మాస్టరుగారూ! నే నెచ్చటనో యొకచోట నుద్యోగము చేయకున్నచో సాఁగునట్లులేదు. ఇప్పుడు మాసంసారము వేఱే పెట్టితిమికదా! ఏరోజున కారోజు గడ్డు గానే జరుగుచున్నది' అనెను.

ధర్మారావు—మఱి వారు సెలవులలో జీతమిత్తు మనఁగా వల దంటి వాఁడెను. వారే మున్నది? ఎక్కడి కక్కడికే నయము. వారు మానివేసిరి. రెండు నెలలైనతరువాత రావలసిన యిబ్బంది యిప్పుడే యింటికిఁ బిలిచితివి. మంగమ్మ యేమైన నిచ్చునేమో కను గొనకపోతివా? కుమార- మఱి యింతవఱకు నాల్గువ్రేళ్ళు నోటి లోనికిఁ బోవుచున్నవనఁగా నెట్లు పోవుచున్నవి? ఆమె యింతవఱకు నా కిచ్చిన సొమ్మునకు లెక్కయుఁ, బద్దును లేదు. 'పోలీ పోలీ, నీభోగ మెన్నాళ్లే యనఁగా మాయత్త మాలపల్లివెళ్ళి వచ్చువఱకు' నన్నట్లు తొమ్మిదినెలలు వందవంద తెచ్చితిని. ఇప్పుడు మఱల గొడ్డెత్తు పడ్డది. ధర్మా- నీ వీ యుపన్యాసకవృత్తి నవలంబించ లేవు. కొంచెము స్వాతంత్ర్యభావ మన్నవాని నీ సంస్థలు చేరనీయవు. ఎచ్చటనైనఁ బత్రికలలోఁ జేరరాదా? ఈ యూరిలో వామనరావు పత్రికాలయములో నుద్యోగ మిచ్చునేమో చూచి రమ్ము. అతఁడు దేశమునందుఁ బేరుమోసినవాఁడుకదా! చాలవిద్యావంతుఁ డని చెప్పుదురు. చాల గొప్పభావములు కలవాఁడఁట. ఆయనవద్దకుఁ బోయి యడుగుము. కుమార- మీరు చెప్పినచో నిచ్చును. ధర్మా- నేను చెప్పినచో నిచ్చునా? నే నెవరను? హరప్పగారికి మంత్రినా? పిచ్చివాఁడా! వారికి సిఫార్సులుచేయుటకు మనము పనికిరాము. కుమార- ఆయన వామనమూర్తి. నే నచ్చటికి వెళ్ళిన తరువాత 'ఇంతింతై వటుఁ డింతయై మఱియు తా నింతై నభోవీథిపై' నంత యగునేమో! ధర్మా- నీకు జిన్నజమీందారీ యుండవలసినది. ఆ దేవునకు బుద్ధిలేకపోయెను. కుమార- అప్పుడు లేదు సరే, యిప్పు డైనను దెచ్చుకొనరాదా? ధర్మా - నీ మొగముగాని, నేఁడు మంచిది- పాడ్యమి, బుధవారము. నేఁడు శతభిష, నీకు మిత్రతార. వామనరావుగారివద్దకుఁ బోయి రమ్ము. వచ్చి యేమన్నాఁడో చెప్పి పొమ్ము. కుమారస్వామి వెడలిపోయెను. ధర్మారా వరుంధతివద్దకుఁ బోయెను. అరుంధతి - మీ రెప్పుడు నటునిటు తిరిగెదరుగాని, నావద్దఁ గొంచెము సేపైనఁ గూర్చుండరాదా?

ధర్మారా వామెవద్దఁ గూర్చుండెను. అరుంధతి 'నే డెందు చేతనో కాళ్ళు తీసికొనిపోవుచున్నవి' యనెను. ధర్మారా వామెపాద

సంవాహనము చేసెను. అరుంధతి 'చాలు లెండు. నా కిది యొక పాపమా?' యనెను. ధర్మారావు 'పాప మేమిటి? మా అక్కగారున్నదిగనుక సరిపోయినది. లేకపోయినచో వంటకూడ నేనే చేసి పెట్టవలయునుగదా!' అనెను. అరుంధతి కన్నీరుపెట్టుకొనెను. ధర్మారావు 'నీ వింత యలుపగుండెదానవు గనుకనే వ్యాధి తగ్గుటలేదు. వ్యాధియే యెక్కువవేడి. నీమనస్సులో నీహృదయములో నున్న యింత వేడికి దానికి సరిపోయినది' అనెను. రామేశ్వరశాస్త్రి బయటికిఁ బోయెను.

అరుం—పిల్లవాఁడు బెంగపెట్టుకొనుచున్నాఁడు. రోజును సాయంకాలములందు మాత్రమే చూచుకొనుటకుఁ బోవును. తక్కిన యెల్లవేళల నన్నే యంటిపెట్టుకొని కూర్చుండును. నేను మఱొకలాగైనచో వానిబ్రదు కేమగును? ధర్మా—మఱొకలాగున కావు. రాజశేఖరశాస్త్రిగారు చెప్పినట్లు చేయుము. నన్నుఁ బ్రక్కను గూర్చుండు మనిన దిందు కనియా? అరుం—సరే, మాట్లాడను లెండి. తరువాత నైదునిమిషములు గడచెను. అరు—రంగాపురము పోవుటయుఁ బెట్టెతెచ్చుటయు నింక లేదుగాఁబోలు! ధర్మా—మాటాడక యూరకుండుట నీకు చేతనగునా? నీకు జిన్నప్పుడు వస పోసి రాయెను. అరుం— అవును, మఱి. అప్పటికి ఆసుపత్రులు లేవు. ధర్మా- వాగక నోరుమూసికొనుము. అరుం—మీ రెదురుగాఁ గూర్చుండి మాటాడవద్దనఁగా మాటాడకుండుట యెట్లు? ధర్మా—నేను నిన్ను మాట్లాడు మన్నానా? అరుం—మీ రనలేదు. నా ప్రాణ మూరకుండ లేకున్నది.

ధర్మారావు పోయి యామెచిక్కినచెక్కిళ్ళమీఁదఁ జేయివైచి నిమిరి 'ఇనట్లట్ల పోయివచ్చెదను. నీవు కన్నులుమూసికొని పరుండుము! పొద్దుక్రుంకినంతనే నాయనవచ్చి మందిచ్చు'నని వెడలి పోయెను. పోవుచున్నభర్తవెనుకనే యరుంధతిచూపు ప్రసరించెను. అతఁడు వెనుకనుండి యెంత సుందరముగా నున్నాఁడు! ప్రొద్దుక్రుంకిన తరువాతఁ గుమారస్వామి వచ్చెను. ధర్మారావు 'కాయా, పండా?' యనెను.

కుమార—పండేకాని యెక్కువగుణములేను. ధర్మా—నీ వింత వాక్ఛమత్కృతి కలవాఁడవు. సుకరుకు మందవాక్కు నగు లోకమునకు నీ వర్థము కావు. ప్రత్యగ్రమైన బుద్ధివైభవమువలన నీ వాక్కు చమత్కృతమని యని ఎవరు తెలిసికొనఁగలుగుదురు ? నీ హృదయములోని మంచితన మెవరికిని దెలియదు. స్నిగ్ధముగాని హృదయముకల లోకము నీవాక్ఛమత్కృతి పరమసుకుమారమైన మనస్సూచి యని తెలియక యది దుష్టత్వ మనుకొనును. ఏదియైన నర్థ మగుట కష్టగదా! కుమార—అందుకనియే కాళిదాసాదులు తిక్కనాదులైనమహాకవులకుఁ దత్ప్రతిమానులైన మీయందు దిక్కులే కున్నది. కాళిదాసు కవితకు - దుర్వ్యాఖ్యావిషమూర్ఛితకు - మల్లినాథుఁడు సంజీవిపోసెను. తిక్కనాదులకవిత దేశమున దుర్వ్యాఖ్యావిషమూర్ఛిత మైపోయినది. దానికి మీరు సంజీవి పోయవలయును. ధర్మా—అసలుకథ యేమో చెప్పుము! కుమార-కట్టె,కొట్టె, తెచ్చె-మూఁడుమాటలలోనె నైపోయినది. నేను పోయి 'అయ్యా! మీ పత్రికాలయములో నా కుద్యోగ మిత్తురా?' యని యడిగితిని. వామనరావుగారు 'మీ రిదివఱకు నూటపాతిక తెచ్చితిరి. మేము మీ కేమి యీయఁగల' మనిరి. నేను 'మీయిష్టమువచ్చినంత యిం' డంటిని. ఆయన నమలి నమలి 'నలువదిరూకలిత్తు' ననెను. నేను వెంటనే యొప్పుకొంటిని. ఆయన 'ముప్పదియైన దని యైన నన్నాము కా' దనుకొన్నాఁడేమో ! ధర్మా—రేపటినుంచి రమ్మన్నాఁడా ? కుమా—ఆ. ధర్మా-రేపు మంచిదే. కృష్ణపాడ్యమి, శుక్ల విదియలు మంచివి. నీకుఁబరమమిత్రతార. రేపుప్రొద్దుననే పోయిప్రవేశించుము. అదృష్టవంతుఁడవోయి. చిట్టికిశ్యామల దొరికినది; చిట్టికుద్యోగము దొరికినది ! కుమార—చిట్టి ధర్మారావుదొరకలేదా ? ధర్మా—అవును. దొరకినాఁడు నాపేరు పాడుచేసినావు. కుమార— మీ అబ్బాయికన్న మా అబ్బాయియే నయమండోయి. మీ అబ్బాయి కన్నులుపెట్టుకొని యీ పదిదినములు గిరికవంక నదేపనిగాఁ జూచినాఁడు. మా అబ్బాయి చక్కఁగా నారోగ్యముకొఱకు నాబుజము మీఁద నిద్రపోయినాఁడు! వట్టిమూర్ఖుఁడు. నృత్య మెట్లున్నదిరా యని యడుగఁగా 'నాన్న, అత్త' అన్నాఁడు. మాటలు సరిగా

రానిదే. ధర్మా—ఏమి మురిసిపోవుచున్నావు? కుమార—కాకిపిల్ల కాకికి ముద్దు. సీతాపతికిఁ గొడుకఁట. వాఁడు కల్యాణములకు రా లేదేమి? ధర్మా—నేను వానిమాటయే మఱచిపోయినాను. కుమార—వానికిఁ జక్కఁగా సంస్కృతము చెప్పినారుకదా! నాకుఁ గల్యాణములు చూపించినారు. అరుంధతిగారి కెట్లున్నది? ధర్మా—వట్లున్నది! గిరిక మూఁడునెల లన్నదఁట. ఒక నెలలో సగము గడచినది. కుమార—తరువాత నెమ్మదించునా? ధర్మా—నెమ్మదించును! ఓయీ! ప్రాణము లెప్పుడైనను పోయెడివే! బ్రదికి యున్నన్నివాళ్ళు మనయుదరిపాటు భూమ్యాకాశములు పట్టుట లేదు. ఒక్కసంగతి చూచితివా? మనుజుఁడు సన్మార్గమునందు బ్రవర్తించుటకు భగవంతుఁడు జ్ఞాపక ముండనక్కఱ లేదు. తనకుఁ జా వున్నదని తెలిసికొన్నచోఁ జాలును. 'వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయంతీ' యన్నాఁడు, పాపము, భర్తృహరి. కుమార—నా కెప్పుడు నచ్చుట ననుమానము. ఆఁడుపులి మీఁదఁబడి చంపక భయపెట్టుట యేమిటి? ధర్మా—అదియా! పులి రెండురకములు! ఒకటి మనిసిమాంసము రుచి యెఱిఁగినది; రెండవది మృగములనుమాత్రమే వేసికొనిపోవునది ఒకసారి మనిసిమాంసమెఱిఁగినతరువాత పులి దారి కడ్డమే రాదు. మఱియొకజంతువును దినదు. మనుజులు నడచు దారిప్రక్క నేపొద మాటునో పొంచియుండి మనిసిని ముందుపోనిచ్చి వెనుకనుండి మీఁదికిదూఁకి చంపి తినును. మనిసిమాంసము తినియెఱుగనిపులికి మనిసి యన్నచో భయము. అడవిలో మనము దారివెంటఁ బోవుచున్నప్పుడు పులి దారిలోఁ గూర్చుండుట తటస్థించెనా, యది తప్పుకొని పోదు. మనుజుఁడుకూడ నట్లే నిలఁబడవలయును. అది నోరు తెఱచి గాండ్రించుచు దోఁకచుట్టుమని లేపి నేలపై గొట్టుచు ముందునకు వెనుకకు దూఁకుచు మనుష్యుని జిత్రవిచిత్రముగా బెదరించును. మనిసి పిఱికిపడి పాఱిపోవుట, భయపడి కేకలువేయుట మొదలైనవి చేసెనా, మీఁదఁబడి పీకివేయును. ధైర్యముచేత నిలువఁ ద్రొక్కుకొని తానుగూడ బెదరించి యఱచి దానిని గగ్గోలుపెట్టెనా' కొంతవేళ కదియే పోవును. 'వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయంతీ,' అను మాటలో నెంత యనుభవ మున్నదో చూడుము. కుమార—

అనుభవములేకుండ వ్రాయఁదగినది ప్రణయకవిత్వ మొకటియే. ధర్మా—ప్రొద్దు పోయినది. రేపుప్రొద్దునఁ బోయి యుద్యోగములోఁ బ్రవేశింతువుకదా! కుమార—ఎందుకుఁ బ్రవేశించను? తెలిసివచ్చినదికదా! ధర్మా—అనుటయేకాని నమ్మకము లేదు. కుమార—రేపటికి భయము లేదు. ఈ యుద్యోగముకూడ నట్లే యగునేమో చెప్పలేనుగాని, ప్రస్తుతములో వచ్చినయొద్దడి లేదు.

కుమారస్వామి పత్రికాలయములోఁ జేరినతరువాత నెలదినములు గడచెను. వామనరావు చాల విద్యాధికుఁడని దేశమునఁ బేరు. కుమారస్వామి కదియంతయు మిథ్యాకీర్తిగాఁ దోఁచెను. బయట సామాన్యజను లెట్టి స్వలాభపరాయణులై యుండిరో, యీ యుపదేష్టలైన పత్రికాధిపకులు నట్లే కనిపించిరి. వామనరావుగారి పత్రికపేరు 'త్రిలోకి.' త్రిలోకి సర్వవర్తమానములు చెప్పును. ఒకనాఁడు వామనరావుగారు 'లోక మనఁగాఁ జూపు త్రిలోకి యనఁగా మూఁడుదృష్టులు కలది. శివాకృతి యన్నమాట. ఒకకంటియందు హాలాహల మున్నదన్నమాట' యనెను. కుమారస్వామి 'లేక యేమి! మన కిష్టములేనివానిని మనము పట్టుకొని వాఁ డెంతవాఁడైనను మహారాక్షసునుగాఁ గనిపింపఁజేయుదుము!' అనెను. వామన—అవును. అది ధర్మము. శివుఁడుమాత్రము త్రిపురాసురుల నెందుకు దహించెను? వారు కంచుకోటలు కట్టిరి. వా రెంత నాగరకులో! శివుఁ డార్యుఁడు. వారు ద్రావిడులు. ఆర్యులు ద్రావిడులను జంపి వారి నాగరకతను భస్మము చేసిరి. రావణాసురుఁడు, హిరణ్యకశిపుఁడు మొదలైనవా రందఱును దస్యులు. వారిని రామాదులైన యార్యులు తమ అభిప్రాయములకు వ్యతిరేకముగా నున్నా రనియేకదా వధించినది! కుమార-నే నట్లు చదువుకొనలేదు. వామన-అన్నట్లుగా మీకు ధర్మారావుగారుకదా గురువు! మీ రెట్లు చదువుకొన్నారు! కుమార—'గతానుగతికో లోకః న లోకః పారమార్థికః' మీ రందఱును గలిసి యొకసిద్ధాంతము లేవఁదీసిరి. నేను కాదని యేమి ప్రయోజనము? వామన-మీ రే మనెదరో చెప్పరాదా? కుమార-రాక్షసులు చాలమంది బ్రాహ్మణులు, వారు నిత్యాగ్నిహోత్రులు. ఆంజనేయుఁడు లంకలోఁ దిరుగుచుండెల్లవాఁడు వేళ రాక్షసులు వేద

ములు పఠించుచుండఁగా విన్నాఁడఁట. వారు ద్రావిడు లగుట యెట్లు పొసఁగునో తెలియలేదు. వామన—రాక్షసులు బ్రాహ్మణులా? నే నెప్పుడును వినలేదు. కుమార—అవును. లోకమందఱు నిట్లే విమర్శింతురు. మఱియొకనాఁడు కుమారస్వామి పత్రికాలయములోఁ గూర్చుండియుండఁగా వామనరావుగారును, వారివెంట మఱియిద్దరు పురాణవిద్యార్థులును వచ్చిరి. వామనరావు బక్కపలుచనివాఁడు. జీడిగింజరంగు. పొడుగైన క్రాపింగు. ఉత్తరీయము ధరించఁడు. అయన వచ్చి కుర్చీలోఁ గూర్చుండెను.

కుమారస్వామి—వచ్చిన వ్యాసము లన్నియు నధ్వాన్నముగా నున్నవి. ఒక్కనికిని భాష రాదు. ఒక్కఁడును సరిగా నూహించ లేఁడు. దేశములోఁ బ్రావాహికముగానున్న యభిప్రాయములను వాని యిష్టమువచ్చినట్లు సమకూర్చి చేఁపలబుట్టలల్లినట్లు వ్యాసములున్నవి. ఇవి యేమని ప్రకటించవలయును? వామన—మీరు ప్రతిదానికిని వ్యతిరేకమే చెప్పెదరు. లోకములోనున్న యభిప్రాయములు కాదనుటకు మన మెవ్వరము? 'రాజానుమతో ధర్మః' అన్నాఁడు. ఇప్పుడు 'లోకానుమతో ధర్మః' అనవలయును. కుమార—అట్లయినచోఁ బత్రికయంతయు వట్టిబూతులబుంగ యగును. వామన—మీకు నేను చెప్పునది తెలియలేదు. లోకమును మించిన ధర్మము లేదు. మీ వేదములు, మీ శాస్త్రములు తీసి యట్టె పెట్టుఁడు. ప్రజాశక్తి వృద్ధియగుచున్నది. మేము మడికట్టుకొంటి మని చుట్టును గోడలుగట్టుకొని కూర్చుండురోజు లైపోయినవి. ఆ దుర్గములన్నియు గొడ్డళ్ళతో ఛేదించుదినములు వచ్చినవి. భాష, సంఘము, మతము - కొంత మంది ప్రత్యేకవ్యక్తులు చేరి మేము వీరికి నధికారులమని చెప్పుటకు వీలులేదు. లోకమున కిష్టమైన మతమే యుండవలయును. సంఘము నట్లే మాఱిపోవును. భాషలోఁగూడ మీ సమాసములు గిమాసములు పనికిరావు. లోకమున కంతకు సుగ్రాహ్య మగునట్లుండవలయును. మన మిచ్చట నెందుకుఁ గూర్చుంటిమి? ప్రజాభిప్రాయమును లోకమునకుఁ దెలియఁజేయుటకే కాని, మనయభిప్రాయములు ప్రజలనెత్తిపై రుద్దుటకుఁ గాదు. ప్రజాస్వామికము వృద్ధి పొందుచున్నది. ఇది యొక మహారథము. ఈ రథము ప్రళయవేగ

ముతోఁ బరువెత్తుచున్నది. దానిక్రిందఁ బడి యెవరైనఁ జత్తురా, చావనిండు. మాకు దయలేదు.

వామనరావు వెంటనున్న యిర్వురును వామనరావువద్ద సెలవు తీసికొని వెడలిపోయిరి. అందులో నొకఁడు "చూచితివా, వామనరావుగా రెంత మహానుభావుఁడో? ఎంత గొప్పవక్త, ఎటువంటి భావములు కలవాఁడు" అనెను. రెండవవాఁడు, 'లేకపోయినచో నింతప్రతిష్ఠ యూరకే వచ్చునా?' అనెను.

ఆనాఁటి సాయంకాలమున కుమారస్వామి వామనరావువద్దకుఁ బోయి 'అయ్యా! మీసంఘము, మతములమాట యట్లుంచుఁడు. ఈభాష చూడుఁడు. గోడ అని వ్రాయుటకు గేడ యని వ్రాయును. కౌముదిలో లేని రూపములన్నియు నితఁడు కల్పించెను. ఏమి గతి' యనెను. వామనరావు 'కొట్టివేసి తప్పులన్నియు దిద్దుఁ' డనెను. కుమార- ప్రజాభిప్రాయమున కెదురు నడువు మందురా? వామన- అది ప్రొద్దుటియుపన్యాసము. సామాన్యప్రజ కేమి తెలియును? వా రెప్పుడును మనము చెప్పినట్లు నడువవలసినదే. మనము ప్రజాభిప్రాయప్రకారము నడచుచున్నట్లు చూపించవలయును. లేకపోయినచో మనబండి నడువదు.

కుమారస్వామి 'ప్రొద్దుటి యుపన్యాసతత్త్వ మిదియా' యనుకొనెను. అనుకొని 'ప్రొద్దుటి యుద్దఱును మీరు చెప్పినదంతయు నిజమే యనుకొన్నారు కాబోలును' అనెను. వామన- అనుకొనవలయును. అనుకొనుటకే యట్లు చెప్పినది. రాత్రి కుమారస్వామిని మంగమ్మ తనయింటికి రమ్మని కబురంపించెను. కుమారస్వామి వెళ్లెను. అచ్చట రాధాపతియు, రంగావధానియు వచ్చియుండిరి. ఒకయిరువదియేండ్ల కుఱ్ఱవాఁడు - పరమాధునికుఁడు నడుమఁ గూర్చుండియుండెను. మంగమ్మ - వచ్చితివా? ఆ కుఱ్ఱవాఁడున్నాఁడే, ఆయన ప్రేతములతో మాట్లాడును అనెను. కుమార- ప్రేతములతో మాట్లాడుట యేమిటి? ప్రేతములు మాట్లాడవే! మంగమ్మ - ఆ కుఱ్ఱవానిపేరు మురారి. కుమార- ఏదీ మాట్లాడుమనుఁడు, చూతము. రాధాపతి- ఈయన చిన్నధర్మారావుగాఁ దయారయినాఁడే! కుమా- ఆయన మాయింటిలో నున్నాఁడు.

మంగమ్మ నవ్వి "కుమారస్వామికొడుకునకు ధర్మారావుగారి పేరు పెట్టినాఁడు" అనెను. కుమార- మీ యనాథశరణాలయ మెట్లున్నది? రంగావధాని - అనాథ లందఱును బోయిరి. ఇప్పు డొక్క యనాథయే మిగిలియున్నది. ఆ యనాథ రాధాపతి. కుమార- ప్రేతముతో మాట్లాడు మనుఁడు. రాధా- దానికిఁ జాలతదంగ మున్నది. ఒక ముక్కాలిపీఁట యున్నది. దానిమీఁద వ్రేళ్ళు పెట్టుకొని యొకరు కూర్చుండియుందురు. మనము ప్రశ్న వేసినచో కాగితముమీఁద నా ప్రశ్నకుఁ బ్రేతము వచ్చి సమాధానము వ్రాయును. కుమార- మనకుఁ గనిపించకుండ వచ్చి వ్రాసిపోవునా? మురారి- ఈ బల్ల మీఁద నాచేతు లుండును. ఆ చేతులు వ్రాయును. కుమార- ఆ చేతు లప్పుడు మీవి కావు కాఁబోలు! ముక్కాలిపీఁటఁ దీసికొని రండు. అలాంతరు దానిమీఁదనుండి తీయుఁడు. మురారి - ఆ పీఁట కాదండీ! దానికొఱకు వేఱె పీఁట యున్నది. కుమార- అది మీరు చేయించితిరా? మురారి- పైనుండి వచ్చినది? దానిఖరీదు తొమ్మిది రూపాయలు. కుమార- ఈ విద్య యీ ముక్కాలిపీఁట లమ్మువాఁడేనా, లోకమునందు వ్యాపింపఁజేసినది? రాధా - మీ యుద్దేశ్య మిదియంతయు నబద్ధ మనియా? కుమార- అది కాదండీ! ఇది వర్తక సరళి. మన దేశములోఁ బచ్చిగడ్డి యెక్కువగా దొరకు ననుకొండు. మన క్రింద నొకయితర దేశ మున్నది. అప్పుడు మన మేమి చేయుదుము? పచ్చిగడ్డిలో విటమిన్ 'జడ్' లేకపోయిన 'వై' యేదో యున్నదని చెప్పి వారిదేశమునకీ గడ్డి యెగుమతిచేయుదుము. మనదేశపుఁ బెద్దవైద్యులు దానిలోఁ బ్రాణాధారబీజము లున్నవని ప్రశంసాపత్రములు వ్రాయుదురుగాదా! ఒక పెద్ద యాహారతత్త్వవేత్త పరిశోధనచేసి యందులో నది యున్నదని కనిపెట్టును. ఈ గడ్డి సీసాలలో కెక్కించి పంపింతుము. ఇది వర్తకపుసరళి. రాధా- చెప్పితినికదా! కుమార- అవునండీ. నేను మి మ్మొఱుఁగనా? మురారి- మీరు చెప్పినదానికి దీనికి నేమి సంబంధము? కుమార- ఆ సంబంధము తేలికగాఁ దెలియునది కాదు. మురారి- నేనీనాఁ డుత్సాహముగా లేను. ఈరాత్రి యది చేయను. మంగమ్మ- ఇంతవఱకుఁ జేయుదు

నంటివిగదా! రంగా- మురారీ! భయములేదోయి. ఆయన నవ్వుచు నట్లు మాట్లాడునుగాని చాలమంచివాడు.

మురారి బల్ల తెచ్చి దానిముందుఁ గూర్చుండెను.

మురారి - ఎవరిని బిలువుమందురు? రాధా- బాలగంగాధర తిలకుగారిని బిలువుము. కుమార- ఆయనను కాదుగాని, మాంధాత చక్రవర్తిని బిలువుమనుము. మురారి—మీ కంతయు వెక్కిరింతగా నున్నదే! కుమార- వెక్కిరింత యేమిటి? మాంధాత చచ్చిపోయినాడండీ! మీరు చచ్చిపోయినవారిని బిలుతురుకదా! మురారి- చచ్చిపోయి చాల దినములైనచో వారు రారు. రాధా— ఈ యూరిలో నీమధ్య నొక భోగముది చనిపోయినదఁట. అది చాల భక్తురాలఁటే. దానిని బిలువుము. కుమారస్వామి మంగమ్మవంకఁ జూచెను.

మంగమ్మ—భోగముది యనాథశరణాలయము పెట్టినవారి కన్నఁ జెడిపోలేదు. మిమ్ము నేను నెఱుఁగుదును. మీ శరణాలయమునకువచ్చు స్త్రీల నెఱుఁగుదును. మీరందఱును మనుష్యులు కారని చెప్పవచ్చును. మీ కాశ్రయముగా ఇంగ్లీషుచదువున్నదిగనుక బ్రదికిపోవుచున్నారు. నోటికి వచ్చిన ట్లెల్ల మాటాడరాదు. ఆమె భోగముది కాదు. ఆమె నొకవెధవ పిలువనక్కఱలేదు. రంగావ— అది యేమిటమ్మా! అంత కోపము వచ్చినది? మంగమ్మ— కోపమా, మఱియుఁ గోపమా? రాధా—నే నే మన్నాను! ఆమెను బిలువుమన్నాను. మంగమ్మ—సరే, పిలువు మనుము. మురారి - ఎందుకులెండు, మీ కంత కోపము వచ్చినచో! మంగమ్మ— ఎందుకనుగాదు, పిలువుము. నే నొకప్రశ్న వేసెదను. దానికి సమాధానము వ్రాయించుము. సరియైన సమాధానము వచ్చినదా, మీ రందఱును మహానుభావు లని యొప్పుకొందును. లేదా......? రంగా— లేకపోయినచో నేమిటి? చెం-పేఁడనీళ్ళు మురారి- దేవదాసిని బిలిచెను. 'ఆమె వచ్చినది. ప్రశ్న వేయు' మనెను.

కుమార—తల్లీ! సర్వశీర్షహస్త మేమిటో వ్రాయుము. మురారి పిచ్చిగీతలు గీసెను. మంగమ్మ—ఏమిటిది నీ తెలకాయ! నీకుఁ దెలిసినప్రశ్నవేసినచో నదో బడబడ వ్రాసెదవు. సర్వశీర్ష

హస్తమను పేరైనను నీ వెన్నడును వినియుండలేదు. ఏమి వ్రాసెదవు? రాధా—శాస్త్రవిషయ మడుగఁగూడదు. కుమార—సరియే, తల్లీ! గిరికా! అనాథశరణాలయములో నెంతమందియున్నారో చెప్పుము.

తరువాత రాధాపతియుఁ గుమారస్వామియుఁ బోట్లాడుకొనిరి. కుమారస్వామి 'రాధాపతీ! మీరు పెద్దవారు కదాయని మాటలు మిగులకుఁడు. నీకువచ్చినచదు వెంత? నీ వెంత? నేనుకవిత్వమువ్రాయుట లేదనియా? నీవు కవి వని నాదగ్గఱ నిక్కకుము. తెలుఁగు దేశము గొడ్డువోయినది గనుక నీ వొక కవి వైనావు. నేను మరియాదగా మాటాడుచుండఁగా నీవు హద్దుమీఱి మాటాడుట యెందుకు? నీ వీక్షుద్రవిద్య తెచ్చితివి. అది వట్టి బూరుగుకాయ యని నేనుచూపితిని. దానికి నీకుఁ గోప మెందుకు? వా రేదో ధనము సంపాదించుటకు ముక్కాలిపీఁటలని పెట్టిరి. ఈపీట యర్ధరూపాయి యిచ్చి యిచ్చుట చేయించవచ్చును. దీనికిఁ దొమ్మిదిరూపాయలు ఖరీదు. అసలు తల మనకు లేదుగా! ఉన్నదంతయు జుట్టే. కారము మొదలైన గృహ క్రీడలవంటివే యివియును పావలావస్తువు పదిరూపాయలకుఁ బైనుండి తెప్పించుకొనవలయును. ఏమైన నన్నచో 'నీ కొయ్య యిచ్చుట దొరకదు. మనవాండ్రు చేసినచో నీసాపు (Finish) రాదు.' అది సమాధానము' అనెను.

అందఱు సర్దిరి. రంగావధాని రాధాపతితో 'మాటలు మిగులుట యెందు' కనెను. కొంతసేపటికి వానవెలిసెను.

మఱునాఁడు కుమారస్వామి పత్రికాలయమునకుఁబోయెను. వామనరావు పెట్టుబడిదారుల సంఘములు, పెట్టుబడినిగుఱించి పెద్ద సంపాదకీయము వ్రాసెను. 'లోకమంతయు 'క్యాపిటలిజము' మీఁద నడచిపోవుచున్నది. దరిద్రులను బిండి ధనవంతులు ధనవంతు లగుచున్నారు. లోకమునఁ బేదవారిసంఖ్యయెక్కువైపోవుచున్నది. ఒక మహాప్రళయము రాఁబోవుచున్నది. తూరుపునఁ దోఁకచుక్క పొడిచినది. లిసిడాసులో నిట్లను చెప్పినట్లు మూఁడుతలలగొడ్డలివచ్చి పైని బడఁబోవుచున్నది. అదియే త్రిశూలము. సత్త్వరజస్తమోగుణముల వికారము. ఈ త్రిసంఖ్యను జూచి లోకము గడగడలాడవలయును.

ధనవంతులయొక్కయుఁ, బెట్టుబడిదారులయొక్కయు మంచిరోజులై పోయినవి. ఓ ధనవంతులారా! మీ రింక నెన్నిదినములు పేదవారల కడుపులపైఁ గొట్టెదరు? వారియిండ్లలో దరిద్రదేవత తాండవించుచున్నది. మీరు సుఖముగా సోఫాలపైఁ బండుకొని ఎలెక్ట్రిక్ విసనకఱ్ఱలతో వచ్చిన మలయమారుతములతోఁ గులుకుచున్నారు. ఇప్పుడైనను గన్నులు తెఱువుఁడు. నేత్రములు విప్పి చూడుఁడు! అక్షులను విస్ఫారఁజేయుఁడు. త్రిగుణాత్మకమైన శక్తి ప్రపంచమున విజృంభించుచున్నది. దానినే హిందువులు బ్రహ్మవిష్ణుమహేశ్వరులన్నారు. క్రైస్తవులు హోలీ ఘోస్టు దేవుఁడు క్రీస్తన్నారు. చూచితిరా గొల్లపల్లిలో వడ్రంగియింటిలో ప్రభు వుదయించినాఁడు. ఎక్కడెక్కడనో యున్న ఫేరసీలతనిని జూచుటకు వచ్చిరి. కన్నులు తెఱువుఁడు, తెఱువుఁడు' అని వ్రాసెను. కుమారస్వామి దానిని జూచి 'యిది యేమో ఘోరముగా నున్నదే' యనుకొనెను. అతఁడు వామనరావుగారివద్దకుఁబోయి 'అయ్యా! ఇందులో నొకదాని కొకఁడు సంబంధము లేకుండ నున్నది. అచ్చువేయించుమందురా' యనెను. వామనరావు మొగము ముడుచుకొని 'యేమి సంబంధము లేదు?' అని ప్రశ్నించెను.

కుమార—మొదట భావములమాట యిట్లుంచి యిది చూడుఁడు. మలయమారుతము మలయపర్వతముమీఁదినుండి వచ్చును గాని యెలెక్ట్రిక్ విసనకఱ్ఱలనుండి రాదు. కొన్ని శబ్దములలోని తప్పులు దిద్దితిని. 'దరిద్రదేవత' యనరాదు. దారిద్ర్యదేవత యనవలయును. వామన—మఱి భావములలో నేమి తప్పులు? కుమార—మూఁడు తలల గొడ్డలి యేమిటి? బ్రహ్మ విష్ణు మహేశ్వరు లేమిటి? మఱల ట్రినిటీ యేమిటి? ఆధునికపరిశోధన పిచ్చితలలు వేయుచున్నది. ట్రినిటీకిని సత్వరజస్తమోగుణములకును సంబంధము లేదు. ట్రినిటీ సత్వరజస్తమోగుణాశ్రయము కాదు. ఇట్లు వ్రాయుటవలన దేశమునందు భావసాంకర్య మేర్పడును. వామన—ట్రినిటీలో సత్వరజస్తమోగుణము లేల లేవు? కుమార—ఈ సిద్ధాంతము క్రైస్తవమతాచార్యు లొప్పుకొందురా? వామన—వా రొప్పుకొనకపోయినచో నా యర్థము లేదని యెట్లు? కుమార— సత్వరజస్తమోగుణముల

వలన సృష్టిస్థితి లయములు జరుగుచున్నవి. అందుకని యీ గుణము తేర్పడినవి. ట్రినిటీవలన నట్లు జరుగుచున్నదా? వారి కా ప్రత్యేక విభాగజ్ఞానమే లేదు. వారికిఁ దద్గుణజ్ఞానమే యున్నచో వారి సంఘమును, వారిమతమును సరిగా మన సంఘమతములవలెనే యుండెడివి. భిన్న మతసంఘములయందలి భేదములు వాని ప్రధానసూత్రములయందలి భేదములచేతఁ గలిగినవి కాని వెంపలిచెట్టు మొలచినట్లు మొలవలేదు.

వామన—పరవాలేదు. అచ్చు వేయించుఁడు.

అది యచ్చుపడినది. మఱునాఁడు కుమారస్వామి వీథిలోఁ జనుచుండగా నౌకరు కనిపించి, "నిన్నటి మీపత్రికలోని సంపాదకీయ మెంత బాగుగా నున్నది? వామనరావుగారు పెద్ద పండితుఁడు! ఏమి యలంకారములు! ఏమి సర్వమతసామరస్యము! పండితులు, పండితు లందురు! ఆయన యేమి స్టయిలు (Style) వ్రాయును. అటువంటి శయ్య వ్రాసిన పండితుని జూపించుము" అనెను.

కుమా 'అవును. చాల పండితులు. మెచ్చుకొనువాఁడు లేని పాండిత్య మేమి రాణించును? మీవంటి పెద్ద లున్నారు గనుకనే యాయన మేధావిత్వము రాణించుచున్నది" యనెను. అతఁ 'డందు కనియే మీపత్రిక కింతమంది చందాదారు లున్నారు. వామనరావు గారు వేదవేదాంగములు, సర్వమతములు, శిల్పము, భరతము, సర్వవిద్యలసారము తెలిసినవాఁడు' అనెను.

కుమార- "అవును. పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు ధర్మశాస్త్రములును, రాయఁడుశాస్త్రులుగారు వ్యాకరణశాస్త్ర మును, వడలి లక్ష్మీనారాయణ శాస్త్రిగారు వేదార్థమును, కూచిపూఁడి వెంపటి వేంకటనారాయణగారు భరతమును వామనరావుగారివద్దనే నేర్చుకొని రఁట. బలుసు పాపయ్యా శాస్త్రిగారు చచ్చిపోయిరిగనుక వామనరావుగారివద్ద శుశ్రూషా యోగ్యత తప్పినది." అతఁడు-"ఏదో వెక్కిరించుచున్నట్లు న్నారే!" కుమార- "శ్రీరామరామ" అని వెడలిపోయెను. పత్రికాలయములో నక్షరములు కూర్చువాఁ డొక్కఁ డుండెను. వాఁడు కడచినయాతేండ్ల నుండియు నచటఁ బనిచేయుచుండెను. వానికి మొదట రెండురూపా యల జీత మిచ్చిరి. ఇప్పు డాఱురూపాయల జీతము. వాఁడు ముద్ర

కాలయములోని యన్నిపనులు చేయఁగలఁడు. తనకు నెనిమిదిరూకలు చేయు మని పదిరోజులనుండి వామనరావుగారి నడుగుచుండెను. కుమారస్వామి నాశ్రయించుచుండెను. కుమారస్వామి వామనరావుగారితోఁ జెప్పెను: 'అయ్యా! వాఁడు పేదవాఁడు. వాఁడును, వాని ముసలితల్లియు నాలుగురూకలమీఁద బ్రదుకవలయును.' వామన— అవునండీ! మనిసికి నెలకు మూఁడురూకలకన్న నెక్కువ యెందుకు? వాండ్రంతలో బ్రదుకఁగలరు. ఎక్కువ యిచ్చినచో వారు దుర్వ్యయము చేయుదురు. మనము వారికిఁ జెడ్డయలవాటులు నేర్పినవార మగుదుము. కుమార—ఒక వేళ దుర్వ్యయముచేయుదు రనుకొనుఁడు! వాఁడు 'త్రీ డాగర్సు' కొనఁడుగదా! పరదేశములనుండి వందలు వేలుపెట్టి, పనికిరాని విలాసము కొఱకైన వస్తువులు కొనలేఁడు కదా!

వామనరావు తూష్ణీంభావము వహించెను. వామనరావు తమ్ముఁ డున్నాఁడు. అతఁడు ఇంగ్లాండుపోయి రెండుమూఁడు పరీక్షలు తప్పి వచ్చెను. అచట నిరువదివేలు సర్వాంగుమెయిల్సుకు దానధర్మములు చేసివచ్చెను. ఆయన "త్రీకాగర్సు" కాని త్రాగఁడు. ఆయనకు కాఫీహాడియు నింగ్లండునుండియే రావలయును. వామనరావు మొగము నల్లపడెను.

కుమార- అయ్యా! వానికి రెండురూపాయలు దయచేయించవలయును. నిన్ననేకదా పెట్టుబడిదారులమీఁదఁ బెద్దసంపాదకీయము వ్రాసితిమి. మన పత్రికాలయముకూడ పెట్టుబడిక్రిందనే వచ్చుచున్నది. మీకు సాలునకుఁ బన్నెండువేల రూపాయలు మిగులుచున్నవి. నెలకు వేయిరూపాయలు. కలెక్టరుగారి జీతముకదా! వామనరావు మాటాడలేదు. వానికి జీత మెక్కువ యీయనులేదు.

ఒకనాఁడు కుమారస్వామి సాయంకాలము షికారుగాఁ గాలేజీకిఁ బోయెను. కాలేజీ లప్పుడే క్రొత్తగాఁ దెఱచిరి. ఇదివఱకుఁ గుమారస్వామితోఁ బనిచేసిన మహోపాధ్యాయుఁ డొకఁడు, తెలుఁగు ఎం. ఏ. పేరు రామచంద్రరావు- ఆయన యింగ్లండునకుఁ బోవుచుండెను. కుమారస్వామి "యెందు" కని యడిగెను.

రామచంద్రరావు - డాక్టరుపరీక్ష చదువుటకుం బోవుచున్నాను. కుమార- ఎందులో డాక్టరు? రాము- తెలుఁగుపరిశోధన శాఖలో. కుమార- తెలుఁగుపరిశోధన కింగ్లాండు పోవుచున్నారా? టిబెట్టు పోరాదా? ఈ మాటతో రామచంద్రరావునకుఁ గోపము వచ్చి 'ఏమయ్యా! అట్లు మాట్లాడెదవు? నీ తలతిక్క యింకను వదలలేదే' యనెను. కుమార- తలతిక్క వదలినది. తోఁకతిక్క పట్టుకొన్నది. మీరు పోయి పదివేలింగ్లండులో ఖర్చుపెట్టి రండు. ఓడవర్తకులకుఁ గే విందు. ఆ దేశపుప్రజలకుఁ బదివేలు జదివించి రండు. ఇచ్చటికి వచ్చి నెలకైదువందలో యాఱువందలో రోజులు బాగుండినచోఁ బదివందలో- తిండిలేని హిందూదేశప్రజలడబ్బు జీతముపుచ్చుకొనుఁడు. ఎలుక యెంతసేపటికిని తనవైపునకే త్రవ్వుకొను నన్నట్లున్నది. పూర్వము మనదేశీయులు వ్యక్తిగతవేదాంతమునే వృద్ధిచేసిరి; జాతీయత, సర్వసమత్వము మొదలైన విశాలభావములు పంపాదించలేదనిరి. మీరు చూడుడు: ఎంతసేపటికి వ్యక్తిసంపద్వృద్ధికోసము చూచుచున్నారు; జాతిసంపన్నాశనముకొఱకే చూచుచున్నారు.

చుట్టుపట్లనున్నవారందఱును కుమారస్వామిని విపరీతపుమనిసి యనిరి. ఆయనమాత్ర "మతఁడు చెప్పునది ప్రత్యక్షరము నిజము. కాల మట్లున్నది" యనెను. ఒకనాఁడు వామనరావుగారు శారదా బిల్లునుగుఱించి దీర్ఘముగా వ్రాసిరి. ప్రాఁత హిందూమతాచారము లన్నింటిని దూషించిరి. బ్రాహ్మణులను యథేచ్ఛముగా నిందించిరి. కుమారస్వామి 'ఏమండీ! దోషములన్నియు బ్రాహ్మణులే చేసిరా? ఇంక నెవరును జేయలేదా?' యనెను. వామనరావు 'అది యొక పాలసీ. అనఁగా లౌక్యపుకెత్తు. ఈ కాలములో నీవు బాగుపడవలయుననినచో బ్రాహ్మణులను దిట్టవలయును. అప్పుడు నీపత్రిక నందఱును గొందురు" అనెను. ఆ వ్రాసినదానికి నొకపూర్వాచారపరాయణుఁడు సమాధానము వ్రాసి పంపించెను. వామనరావుగారి వాదమంతయు ఖండించెను. వామనరావా వ్యాసము వణఁగఁ ద్రొక్కెను. కుమారస్వామి 'యిది న్యాయము కాదండీ! ఆయనది

ప్రకటించి మీరు మఱల దానిని ఖండించుఁ డనెను. వామనరావు దానిని బుట్టదాఖలుచేసి ముసిముసినవ్వులు నవ్వెను.

కుమారస్వామి - అతఁడీ సమాధాన మింకొక పత్రికలోఁ బ్రకటించును వామన - అట్లు వీలులేదు. నాపత్రికలో నే నితర పత్రికలకు వ్యతిరేకమైనది వ్రాయుట లేదుకదా! పత్రికాధిపతు లొకరిమీఁద నొకరు వ్రాయరు. కుమార- బాగుగా నున్నది! మీరందఱును గలిసి గూడుపుఠాణియా? మీకు నచ్చినభావమే తప్ప మఱియొకటిసృష్టిలో నుండరా దన్నమాట. మీకు విరోధి యైనవానిని బత్రికలనిండఁ దిట్టిపోయుదురు. ఇష్టమైనవానిని బనికి మాలినవాఁడైనను నాకాశమున కెత్తివేయుదురు. ఒక మహాకవి మిమ్మాశ్రయించఁడు. అతని యూరును, పేరును లోక మెఱుఁగరాదు. ఒక క్షుద్రుఁడు మీ వెంటఁబడి తిరుగును. వానికన్న గొప్పవాఁడు లేఁ డని సంపాదకీయములో వ్రాయుదురు. మీరందఱు నిట్టివారై యుండఁగా నింగ్లండులోని డైహార్డుపత్రికలన్నియు రాజకీయవిషయములలో నొక్కరీతిగానే వ్రాయు నని మీకు గోల యెందుకు? పత్రికలుకూడ రాజకీయములో నొకభాగ మాయెను. ఇంగ్లండులో నది సెకండ్ స్టేట్. ఇక్కడ నది వీలైనంత స్టేట్. సత్యమునకు స్థానములేదు. మీరు తెలుఁగుకవిని బైకి రానీయరు. ఇంగ్లీషులో నెవఁడో యొకఁడు గీకును. వానిని బట్టుకొని తెలుఁగు రబీంద్రనాథ్, ఆంధ్ర హరీంద్రనాథ్ అందురు. మీపత్రికాధిపతు లందఱును జక్కగాఁ జదువుకొనరు. చదువుకొన్నవారు పనికిరారు. నాకుఁ దెలిసినంతవఱకు మీ కే విషయమును సరిగాఁ దెలియదు. అఱవవారి కూటువలె పుచ్చుకాకరకాయ ముక్కలు, తోఁటకూర కాడఁలు, ఎండిపోయిన బీఱకాయలు- మీ సరుకిది. వామన- జైలులోని దేవతాపులుసువలె నుండునందురా? కుమార- అందులో, మేకులు, ఱాలుగూడ నుండునుగదా! వామన- మాలోను నున్నవి. కుమార- మీకు వేయేండ్లాయుర్దాయము! వామన- ఎందుకు? కుమార- అప్పటికిఁగాని మీరు చేయుచున్న లోకపుమరమ్మతు పూర్తి కాదు. వామన- అంతదూర మక్కఱలేదు. ఇంక నొక్క యిరువది యేండ్లలో దేశమంతయు మాయుద్దేశ్యము ప్రకారమే

యుండును. ఆనాఁటి మధ్యాహ్నము కుమారస్వామి యేదియో వ్రాయుచుండఁగా నొకపురుషుఁడు మూఁడుజేబులనిండ కాగితపు కట్టలు గ్రుక్కుకొని, లోనికి వచ్చి, వామనరావుగారికి నమస్కారముచేసి కుమారస్వామివద్దఁ గూర్చుండెను. కుమారస్వామి యిది నతి కతనిని కొద్దిగా నెఱుఁగును? "ఏదో పనిమీఁద వచ్చినా" రనెను.

పురుషుఁడు— నేను భీమాకంపెనీకి ఏజంటును. తమరిని మా కంపెనీలో రెండువేలకు భీమా వేయవలయు నని యడుగుటకు వచ్చినాను. కుమార—నేను చేయను. పురు— ఎందుచేత? భీమా యెటువంటి దనుకొన్నారు? మనము ముసలివాండ్ర మైనచో లాభించును. సంపాదించునప్పుడు నిల్వచేయనిచో నెప్పుడు చేయుదుము? కుమార— భీమా మంచిదే! కాని మీపద్ధతులు బాగుగా లేవు. వైద్యపరీక్షకుఁడు, కార్యదర్శి మొదలైనపేర్లు పెట్టుకొని మీరందఱును వేలకు వేలు తినుచున్నారు. కష్టపడి ఎం. ఏ. ప్యాసైనచో వందరూపాయ లీయరు. ఖిప్పుఫారము తప్పి మీయేజెంట్లు నెలకు నాలుగైదువందలు సంపాదించుచున్నారు. ఏడ్జీలు, కమిషనులు, ఘోరములైన జీతములు వీనితో ప్రిమియము లెక్కువైపోయి, లోకమునకు లాభముకన్న నష్టమే యెక్కువగుచున్నది. పురు— మఱి యందఱును బ్రదుకవలదా? కుమార — చచ్చిపొమ్మనలేదు. తిండికిఁ జాలినంత తీసికొనుఁడు. మోటారుకార్లకు భోగములకు పేదవారిచేత భీమాచేయించి వారిధన మేల మీరు భోగించవలయును? నేను చేయను. వ్రాసికొనుచున్నాను. దయచేసి వెళ్లుఁడు."

పురుషుఁడు వామనరావువంకఁ జూచెను. వామనరావు నవ్వి 'లాభములే' దని పెదవి విఱచెను. పురుషుఁడు 'సెలవు తీసికొందు' నని లేచెను. కుమారస్వామి తలయెత్తిచూచెను. పురుషుఁడు 'మీరు మాకన్న మొండి' యనెను. కుమారస్వామి నవ్వెను. ఆ నవ్వుతో ఏజెంటుకు మఱల నాశాంకురములు లేగి "అయ్యా! మా కంపెనీ గుక్కెదో యనుటలేదండి. బొంబాయిలో నెన్నికంపెనీలు లేవు? వందఁడరు సక్లే" యనెను.

కుమార—ఇదికూడ వాదనలో భాగమేనా యేమి? కవిత్వములోఁ దప్పులు వ్రాసి ప్రయోగములు చూపించిన ట్లున్నది. ఆ ప్రయోగములైన నెవరివి? ఎడ్ల రామదాసువి, వీరబ్రహ్మకవివి!

జ్యేష్ఠబహుళామావాస్య వచ్చెను. కుమారస్వామికి ఎడమకన్నదరెను. అతఁడు వామనరావుగారితో 'అయ్యా! ఎడమకన్నదరుచున్నది' అనెను.

వామన—వేఁడిచేసినదేమో! కుమార—అది చేయనక్కఱలేదు. ఒడలిలోపల మాటలలోన నున్నదియే యది. వామన—అది జీవశక్తి లక్షణము. మీయందు వ్యతిరేకప్రవృత్తి యున్నది. అది యొకరకమైన సాధన. కుమార—పొట్ట చేతితోఁ బుచ్చుకొని క్షుద్బాధతోఁ గామక్రోధములు మేళవించి బ్రదుకుచున్న బ్రదు కొక సాధన. వేదము లట్లన లేదు. వామన—వేదములకు మనవారికి సరిగా నర్థము తెలియలేదు. పాశ్చాత్యులు పరిశోధనలుచేసి కొన్నికొన్ని మనవారికిఁ దెలియని శబ్దార్థములు చక్కఁగా నిర్ణయించిరి.

ఆ మాటలోనే పురపాలకసంఘసేవకుఁడు వృత్తిపన్నడుగుటకు వచ్చెను.

కుమార—ఎవరు మీరు! సేవకుఁడు—అయ్యా! తమరు వృత్తిపన్ను రూపాయబేడ యీయవలయును. కుమార— నే నుద్యోగము లేక తిరిగినన్నాళ్ళు నన్నుఁ బోషించినవాఁ డెవఁడును లేఁడు. నేను సంపాదించుకొనుచుండఁగా మీకు వృత్తిప న్నెందుకు? వామన—అది యేమి టండీ? అర్థికశాస్త్రము మూలముట్టుగాఁ ద్రవ్వివేయుచున్నారే! స్టువార్టుమిల్లు పుస్తకము చదువలేదా? మీ కసలు ప్రధానసూత్రములే తెలియలేదు. కుమార—తెలియనిది నాకు గాదు. నావద్ద వృత్తిపన్ను పుచ్చుకొనుట మీ కెంతవిధియో, వృత్తి లేనివారికి వృత్తిచూపించుట యంతవిధి. మీయార్థికశాస్త్రములో నిది యుండదు. వచ్చుచున్నచోటినుండి రానీయుటయేకాని లేని చోటఁ జిలికించరు. సర్వజగత్కల్యాణ మని వ్రాయుడు దిదియేనా? ధనవంతు లుండఁటికిని గల్యాణము జగత్కల్యాణము. నేను చెల్లియను. వామన—మీ జీతమునుండి కోర్టుద్వారా తీసికొనఁబడును. కుమార—నే నుద్యోగమే మానివేసెదను. వామనరావు నవ్వెను. కుమార—

ఇందున్న దోషము చూపించుట కనుచున్నానుగాని, నిజముగా మానను. ఈ పద్ధతిలో నున్న కృతకత్వ మిది. తిండిలేనివానికిఁ దిండి చూపించుఁడు. ఉన్నవానివద్ద వడివేసి లాగుచున్నాఁడు. వామన—నిజమే! మీ యంత తీక్ష్ణముగా నెవ రాలోచింతురు? మఱల నొకవారములో రమ్మని పురపాలకీయుని బంపించిరి. వామన- అతఁడు వచ్చి మనప్రసంగము చెఱపెను. కుమార - మీరు చెప్పిన దేమిటి? వేదార్థము పాశ్చాత్యులే బాగుగా నెఱుఁగుదు రనియా? అంత బాగుగాఁ దెలిసినచో మనమతములోఁ గలియ లే దేమి? వామన - అది వే ఱిది వేఱు. కుమార - మెతుకులు వేఱు, మజ్జిగ వేఱు వలెనా? వామన - వారు పరిశోధనచేసిరి. పూర్వులకన్న విషయము పరిశీలించుటకుఁ బాశ్చాత్యుల కెక్కువ మార్గము లున్నవి. కుమార - ఫైలాలజీ నేనును జదివినాను. అది యంతయు నొక కృతకసృష్టి. అనవసరమైన కల్పన. మనచదువులు మనకు వారే చెప్పిన ట్లుండుటకుఁ బన్నిన పన్నుగడ. ఆనందమునకు గాని విద్య దేనికి? ఈ ఫైలాలజీవలన వేదములకుఁ గ్రొత్తయర్థ ములు రావు. ప్రత్యక్షముగాఁ గనబడుచున్నది జీతములో నెక్కువ డబ్బులు గిట్టుచుండుట. వామన - విద్యారణ్యులకు వేదము కొన్ని చోట్ల నర్థము కాలేదు. ఇప్పు డున్నంత పరిశోధన యప్పుడు జరుగ లేదు కనుక నాయనకుఁ దెలియలేదు.

కుమారస్వామి సమాధానము చెప్పక యేదో వ్రాసికొను చుండెను. అయిదు నిముసములైన తరువాత నొకయుత్తరము తీసి కొనివచ్చి వామనరావుగారిచేతి కిచ్చెను. తనదారిని దాను పోయెను. ఆ యుత్తర మిది : "మహారాజశ్రీ వామనరావుపంతులుగారికి, విధే యుఁడు కుమారస్వామి నమస్కారములు - అయ్యా! మీరు చాల సత్పురుషులు. పత్రికాధిపతులలో మీవంటి విజయ వంతు లుండరు. దానికి మీరు నాతో నీ నెలనాళ్లును మిత్రులతో వలెఁ బ్రసంగించుటయే సాక్ష్య మిచ్చుచున్నది. నేను చాలసార్లు ప్రసంగములో మీకుఁ గష్టము కూడఁ గలిగించియుంటిని. అది నాకుఁ దెలియును. మీరు దానినిగూడ నోర్చియుండిరి.

'నే నొక విపరీతప్రకృతిని. నాకు నీలోకమార్గమునకు లగించు నట్లు లేదు. నాకీ నాఁటి ప్రతివిషయము పేదవాని ప్రాణమునకు విరోధముగా, సత్యమునకు విరోధముగాఁ గనపడుచున్నది. ఇది నా మనసులో నున్న దోషమే మో తెలియదు. నేను నుఖింగొన్నా ఖ్యాహించవలయును.

'ఈ నెలనాళ్ళ నాకనేకములగు క్రొత్తవిషయములు తెలిసినవి. ప్రతికావిషయములందు సమగ్రదృష్టి కలిగినది. 'దూరస్థ పర్వతాకారం సమీపస్యచ బర్బర' అన్నట్లున్నది. తమరన్నచో నిదివఱకు నాకు మహాభిప్రాయ ముండెడిది. తమశీలమును, మంచితనమును నేను కన్నుల కద్దుకొనుచున్నాను. కాని పత్రిక యందున తోడనే మీభావములు పొందెడు వైపరీత్యమునకు నాకుఁ గష్టము తోఁచినది. నేను కులహీనురాలిని పెండ్లి చేసికొన్నాను. ఆ సంగతి నాకుఁ దెలియును. అది నాకర్మములో వ్రాసియున్నది. కాని యే మహాత్ముని పుణ్యసంపర్కమునవో నామనస్సు సనాతనమార్గము నభిలషించుచున్నది. పూర్వపద్ధతులందుఁ గొన్నిదోషములు కనిపించుచున్నవి. ఆధునికపద్ధతులయందు దానికన్న నెక్కువదోషములు కనిపించుచున్నవి. ఇది దోషబహుళముగా నున్నది.

'ఏది యెట్లున్నను మనవేదార్థము శ్రీ విద్యారణ్యులకన్న నెవనికో యెక్కువ తెలియునఁట నేనువిని సహించలేకపోయితిని. అట్టి మాటలుకూడ వినవలసినస్థితి యీ దేశమునకు వచ్చినదికదా యని మాత్రమే దిగులు. అట్లు చదువుట విద్యలో నొకభాగమైనది. ఎవఁడు తప్పించుకొనఁగలఁడు? చదువఁగా చదువఁగాఁ బ్రతిదియు మనస్సునకిష్టముగానే కనిపించును. అదియే విదురుఁ డనెను—

'పాపంబులు కర్జము లవి, యేపునఁ జేయంగ నవియు నింపగుధర్మ
వ్యాపారంబు లకార్యము, లై పరిణతిఁబొందెడేని నట్టుల చెల్లున్.

'ఇది ధృతరాష్ట్రునకు విదురుఁడుపదేశించిన నీతి. పాపములు, అసత్యములు — మాటిమాటికి వీనితోనే సంపర్కముకలిగినచో నవి మనస్సునకిష్టముగానే యుండును. పరిచితము లయ్యును నాకుమాత్ర మేలకో యిష్టము కావు. వేదార్థము భారతదేశమునఁబుట్టినవానికిఁ దెలియవలయును. సంప్రదాయమైనయర్థము పరుల కెట్లు తెలియును?

ఉపజ్ఞ వేఱు, సంప్రదాయము వేఱు. ఒకపండితుఁడు స్వోపజ్ఞచేతఁ బాతంజలి యోగసూత్రమునకు, వేదాంతశాస్త్రమునకు, మహాభాష్యమునకుఁ బ్రతిదినము శిష్యులకుఁ బాఠములు చెప్పుచుండెడివాఁడఁట. పాఠ మారంభించఁగనే యొకమహాసర్పము వచ్చి పడగవిప్పి వినుచుండెడిదఁట. ఆయన ప్రారంభించుచుఁ బ్రతిరోజున 'నిరర్థకశ్చేత్ దశ–' అర్థములేనిచోఁ గాటువేయును అని ప్రతిజ్ఞచేసి పాఠము చెప్పుచుండెనఁట. ఒకనాఁ డాయన 'అసంప్రదాయ శ్చేత్ దశ' యన్నాఁడఁట. పాము కాటు వేసినది. ఆయన చనిపోయెను. ఇప్పటికిని వేదాంతపాఠము చదువుకొనుచున్నప్పుడు పండితులు వస్త్రముతోఁ బాదములదాఁకఁ గప్పుకొని చదువుదురు. సంప్రదాయమైన, ఒక మహానాగరకతకు మూలసూత్రములైన భావము లెంత ప్రధానమైనవో సంప్రదాయముకూడ నంత ప్రధానమైనది. ఈ నాఁటి మనసంస్థలు చూడుఁడు! లోపల నంతయు బోలు. అన్నియు నింగ్లండులోని సంస్థల కనుకరణములు. ఈ సంస్థలనుండి యింగ్లీషు వారిసంప్రదాయము తీసివేయుఁడు! వాని యథార్థ స్వరూపము గోచరించును. మీరు సనాతనమతసంప్రదాయములను ఛేదింప నెంచుచున్నారు. ఇన్ని కంతులు కోసితినిగాని నా కంతియంత నొప్పిలే దన్నాఁడఁట. మీ యల్పసంస్థలసంప్రదాయయమున వ్యతిరేకముగా నడచిచో, మీరు మనిసిజీవితముజీవితము నాశనముచేయుచున్నారే! ఒక మహాసంప్రదాయమును మహార్థవంతమైనదానిని లోకక్షేమంకరమైనదానిని మీరు చంపుటకెట్లు ప్రయత్నించుచున్నారు? ఇదివఱకే చాలవఱకుఁ జంపిరి.

'ఇది నారాజీనామాగా నంగీకరించుఁడు. మీ రధికారియు నేను సేవకుఁడుగా లేము. అది మీ యుదారతయే. ఆ యుదారతకు వేయి నమస్కారములు.

'నేను కొన్నాళ్లు లుద్యోగముచేయక యింటివద్దనుండి యీ మార్గములకు ననుగుణముగ్గా నామనస్సు తిరుగుటకు సాధనచేసికొనెదను. చేతనైనచో సరే, మఱియొకచోటికైనఁబోయి బ్రదికెదను. చేతగానిచో నంతకన్నను సరే, పరమశివుఁ డుండనే యుండెను, పాపములతోఁ బాటు ప్రాణములగూడఁ దుడుచుకొనిపోవును.

'ప్రభు స్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే!
ప్రముఖ్యోఽహం తేషా మపి కిముత బంధుత్వ మనయోః
త్వయైవ క్షంతవ్యా శ్శివ మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నా త్కర్తవ్యం మదవన మియం బంధుసరణిః.

'అని నిత్యము శివుని నే ధ్యానించుకొందును. నా యీ పెద్దయుత్తరముతో మీ కాలము చాల వ్యయము చేసితి నేమో! క్షమించవలయును. భవద్విధేయుఁడు, కుమారస్వామి.'

వామనరావు పుత్తరము రెండుమూఁడుసార్లు చదివెను. ఇట్లనుకొనెను: 'ఆయన చాలమంచివాఁడు. కాని ప్రవాహమున కెదురీఁదుచున్నాఁడు. కాలము ప్రవాహము వంటిది; ఎదురీఁదినవానిని సముద్రమునకే తీసుకొనిపోవును. ఆ యీఁదుచున్నవాఁ డెట్టివాఁ డని విచారించను. ఆయన యీ నెలనాళ్ళిచట నుండుటవలన నాకుఁ గొంతమేలు జరుగకపోలేదు. దీని కేమి ప్రత్యుపకృతిఁ జేయుదును?' ఈ సద్భావన మొకనిముస ముండెను.

# ముప్పదియొకటవ అధ్యాయము

ఆషాఢ శుద్ధషష్ఠి. రాత్రి జాముపొద్దు పోయిన తరువాత చీకట్లు వచ్చెను. కుమారస్వామి మంగమ్మలు ధర్మారావు గారి యింటి నుండి కలిసిపోవుచుండిరి.

కుమార—రెండు రోజులనుండి మీ రింటిలో నుండుటలేదట! ఎచ్చటికిఁ బోయితిరి? మంగ—రేపు పొద్దునఁ జెప్పెదను. కుమారస్వామి నిలుచుండి "మీరు చెప్పకపోయినచో నే నిచ్చటనుండి కదలను. ఈరాత్రి నిద్దుర పట్టవలదా!" అనెను. మంగమ్మ—నీకే నయముకదా! కుమార—ఆఁ, నయమే. శ్యామల వట్టి బండనిద్దుర పోవును. మంగమ్మ—ఇఁక రా, పోదము. కుమార—మీ రెచ్చటకు వెళ్ళితిరో చెప్పనిదే! మంగమ్మ—నీవు రాకపోయినచో నేను వెళ్ళుచున్నాను. కుమార—దారిలో నెవ్వరైన కూనీచేసి యా చేతిగాజులు లాగుకొనెదరు. మంగమ్మ—తక్కిన యాస్తి యున్నదికదా! కుమార—ఎవరికి? రాధాపతికా? మంగ—అతఁ డెవరు నాయాస్తి తినుటకు? కుమార—ఏయాస్తి యెవరు తిందురేమి? మంగ—రేపు పొద్దునఁ జెప్పెదను. కుమార—విల్లు వ్రాయించితి వేమి? అందు కనియా నిన్నమొన్న నింటలేనిది? ఎవరికి వ్రాయించితివి? నీయాస్తి నా కేమియు నక్కఱలేదు. కాని వాలినిమాత్రము నా కిచ్చిపొమ్ము. మంగ-నీ మనస్సులో వాలి, సుగ్రీవుఁడు ... కుమార—అంగదుఁడు, సుషేణుఁడు, నలుడు, జాంబవంతుఁడు ... మంగమ్మ నవ్వెను. కుమార—ఆస్తి యెవరికి వ్రాసితి వేమి? మంగ—రేపుప్రొద్దునఁ జెప్పెదను. కుమార—నాకసలు చెప్పనేయక్కఱలేదు. నీ వెవరికి వ్రాసికొన్నచో నా కేమి? దేవదాసి యుత్సవములుచేయుట కేమైన వ్రాసితివా? కబీరు సమాధిగట్టి యామెను బూజించుచున్నాఁడు. ఆమె నృత్యమెఱిఁగిన ప్రతిజీవియు నచ్చటికిఁ బోవుచున్నది. ప్రతి వైశాఖపూర్ణిమనాఁడు పెద్దయుత్సవమును జేయుటకు నీయాస్తి యామెపేర వ్రాసి చసిపొమ్ము. మోక్షము వచ్చును.

మంగమ్మ నిలుచుండి కుమారస్వామివంక నిదానించి చూచెను. కుమార—చీకటిలో నేను కనిపించుచున్నానుకాదూ! నేను చాల నందగాడను. వెన్నెలవలె ధగధగలాడిపోవుచున్నాను కాదూ! మంగ-వెన్నెలవెండిది. నీవుబంగారమవు. కుమార-కొడుకు నన్నట్లను చున్నావు. నేను నీకుకొడుకుగానుండుటకొప్పుకోను. మాయమ్మం డఁగా నీవెందుకు? మంగ-మఱి, నే నేమికావలయును, నీకు? కుమార-మంగమ్మవే కావలయును. మఱి యిం కేదియైనను నా కిష్టములేదు. మంగమ్మయు, వాలియుఁ బ్రత్యేకముగాఁ గనిపించవలయును. మంగ-నేను చనిపోకముందు ని న్నొకసారి ముద్దుపెట్టుకొని చనిపోవలయునని యున్నది. కుమార— నీవు చనిపోయినతరువాతఁగూడ నాముద్దు వెంటనే రావలయును గాబోలు! దానిపేరే కోతి యందురు. మంగ-నీ యిష్టము. వారు యింటికిఁ జేరిరి. సప్తమినాఁడుప్రొద్దున మంగమ్మ కుమారస్వామియింటికిఁ బోయెను.

శ్యామల—ఆ నెలవాళ్ళ యుద్యోగము నలువదిరూపాయలు తెచ్చినది. ఈ యాఱు రోజులలోననే దానిని వాడివేసితిరి. నిన్న మట్టుకు నిన్న పిల్లవానికిఁ బాతికరూపాయలు పెట్టి మూఁడుచక్రముల సైకిలు కొన్నారు. ఇంక నింటిలో దమ్మిడీలేదు. నేను వలదని నెత్తిన నోరుపెట్టుకొని మొఱ్ఱఁగితిని. నామాట విననఁగా! కుమార - నేను స్త్రీస్వాతంత్ర్య మొప్పుకొనను. మంగ—బయటి కొప్పుకొనన్న వారు లోపలఁ గుక్కినపేలు. శ్యామల-కొంద ఱింటిలో దెబ్బలుతిని ఘీంకారములు కొట్టెదరు. కుమార—మన డిప్యూటీ కలెక్టరుగారి వలెనా? శ్యామల—అంతదూరము పో నేల! మంగ—కుమార స్వామిని నీవే తన్నుచుంటివా యేమి? కుమార—మొన్న తన్నిన దమ్మా! ఇదిగో నొప్పి బుగ్గ నింకను పోలేదు. మంగ—బుగ్గ మీఁదఁ దన్నెదరా? కుమార—ఏమే శ్యామలా తన్నెదరా, కొఱికెదరా? శ్యామల—సరసము బాగుగా నున్నది. క్రొత్తవారు లేదు, ప్రాఁతవారు లేదు! మంగ—నేను కొద్దిరోజులలో నీయూరు వదలిపోవుచున్నాను. శ్యామల—ఎచ్చటికి? కాశికా? కుమార - కాదు, గయకు. మంగ—నే నీ ప్రొద్దున నెందుకు వచ్చితిని? కుమార—మాయింటిలో దమ్మిడీ లేదు. ఇవ్వేళనుండి కాఫీగూడఁ

గాచుకొనము. మఱి యెందుకు వచ్చితివో? మంగ—రాత్రిమాట జ్ఞాపకములేదా? కుమార—నా బుగ్గ యిదివఱకే నొప్పి పెట్టుచున్నది. నన్ను ముద్దుపెట్టుకొనినాదుంప తెంచకుఁడు. మంగ-అదికాదయ్యా! మొన్న నటుమొన్న నెచ్చటికిఁబోతివని యడిగితివిగదా! కుమా-అది [illegible]గినది రాత్రి. ఇప్పుడునీవు నాకుఁజెప్పనక్కఱలేదు. నేనువిననక్కఱలేదు. మంగ - నీకన్న దౌర్భాగ్యుఁడవు నీవే. కుమార - నే నేమి దౌర్భాగ్యుఁడను? ఒకసారి నూటపాతికరూపాయల యుద్యోగము పోయినది. ఇం కొకసారి నలువదిరూపాయలయుద్యోగము పోయినది. మంగ - ఇంక నుద్యోగమే కుదురదు. కుమార - నీ యాశీర్వచన బలము! శ్యామల - నిజముగా నాశీర్వచనమే. ఉంచుకోలేని యుద్యోగమును రమ్మని యాశీర్వదించి యేమి ఫలితము? కుమార - నీవు బి. ఏ. వఱకు చదివితివికదా! అది పూర్తిచేసి యెచ్చటనైన నుద్యోగము చేయరాదా? శ్యామల - నా చదువు మానిపించితిరి గదా! కుమార - అవునబ్బా! నా కనుమానము! మంగ - వట్టి యాగమ్మకాకిపిల్లవాఁడవై పోవుచున్నా వేమి? శ్యామల - మీ కాయన యేది యన్నను ముద్దే. అందు కనియే యాయన సగము చెడిపోవుట. కుమార - సగము చెడిపోయినది శివుఁడు. మంగ - అట్లు మాటాడుచున్నవానిని జూచినచో ముద్దుగా నుండదా? కుమార- నే నన్నచో నీకు ము ద్దేమిటమ్మా! నన్ను వట్టిపసిపిల్లవానిని జేసివేయుచున్నావు. నీకన్న నేనే పెద్దవాఁడను. నీ కెన్నేండ్లు చెప్పుము. మంగ- ముందు నేను చెప్పినచో నాకన్న నొకటియెక్కువ వేసికొనుటకా? కుమార- నీ వింతకు నెందుకు వచ్చితివో చెప్పుము. శ్యామల - ఆవిడ చెప్పనక్కఱలేదు, మీరు విననక్కఱలేదు. మంగ- నేను చనిపోయినతరువాత మీ రిద్దఱును నన్ను జ్ఞాపక ముంచుకొందురా? కుమార- మునుపు బోలెఁడన్ని దుమ్ములుండెడివి! కావలసినంత వంటచెఱకు. అప్పుడైనను జచ్చిపోకపోతివి. ఇప్పుడు చచ్చిపోయెదను, చచ్చిపోయెద నన్నచో నెట్లు? ఆఁగుము. కట్టెలయడితికిఁ బోయి యడిగివచ్చెదను. శ్యామల - చూచుచు నూరకుండిన మేయుచుఁబోయె నన్నట్లు బాగుగా నున్నది. కుమార- మధ్య నీ కెందుకు? మంగ - నామూలముగా మీ రిద్దఱును గొట్టుకొనకుఁడు. కుమార-

నాయింటిలో నది నా కెప్పుడును కొట్టుకొనదు. ద్వారబంధములు మాత్రమే కొట్టుకొనును. మంగ - అవు నది ప్రాంతయిల్లు. ద్వారబంధములన్నియు నెత్తు లేవు. మీ రేదైన మేడలో నుండరాదా? కుమార - క్రింగ మెతుకులేదు. మీసాలకు సంపెంగనూనె యట! సరే కాని, శ్యామలా! నీవు పోయి వంటచేయుము. పదిగంటలైనది ఆబిడ కేమి? చిన్నప్పటినుండియుఁ బన్నెండుదాఁటినతరువాత తినుటయే యలవాటు. శ్యామల-నేను చేయను. మీరు పోయిచేయుఁడు. మంగ - అతని కాఁకలి యగుచున్నదేమో? శ్యామల - ఉద్యోగములేనివారి కాఁకలి యెక్కువ. కుమా - నేను వంటచేయుట యేమి? నిన్ను చదువు మానిపించిన దెందు కనుకొన్నావు? ఇదిగో ఇటువంటి మాటలు రాకుండుటకే. మంగమ్మగారూ! మీరు వెళ్ళినఁగాని యిది మడిగట్టుకొనదు. మంగ-అది కాదయ్యా! నీవు సంపాదించినఁగాని కట్టుకొనదఁట. కుమార - నే నెక్కడ సంపాదించను? అందుకనియే 'గడ నుడుగు మగని జూచిన నడపీనుఁగు వచ్చెననుచు నగుదురు సుమతీ' అన్నాఁడు. నే నెచ్చటనుండి సంపాదించనమ్మా? మొత్తానికి నవనాగరకపుఁబెండ్లమును జేసికొనరాదు. కులభ్రష్టురాలి నసలు చేసికొనరాదు. శ్యామల - ఆ యూరి కీ యూ రెంతయో యీ యూరి కాయూరు నంత. కుమార - చూచుచు నూరకుందువే మమ్మా! బలే మంగమ్మవు! నిన్నాధారముచేసికొని చూడు మెట్లనుచున్నదో? మంగ - అవునయ్యా! నీవు సంపాదించవలయును. సంపాదించకున్నచో నామె యీనాఁడు మడియే కట్టుకొనదు. కుమార - మడీ? అది మీ యింటిలోనిమాట. మేము తించుదించుఁ గంచము ముట్టుకొని నెత్తికి రాచుకొనుటయే. మంగ- నా కదియంతయుఁ దెలియదు. నీవు సంపాదించవలయును. ఆమె యన్నము వండవలయును. కుమార - నీవు డబ్బుగలదానవే కదా! శ్యామలకు డబ్బే కదా కావలసినది. నీవు దానికి మగఁడుగా నుండుము! నీ వెచ్చటికో పోయెద ననుచున్నావే, అచ్చటికి నేను పోయివచ్చెదను. మన మిద్దఱమును మొదట బ్రాహ్మణులలోననే యున్నాముకదా! తరువాత నీ వొకమోస్తరుగాఁ జెడినావు, నే నొకమోస్తరుగాఁ జెడి

నాను'' అని కుమారస్వామి చొక్కాయు, నుత్తరీయము వేసికొని బయలుదేఱెను.

శ్యామల - వంట నిముసములోఁ జేసెదను. ఎచ్చటి కాపోవు నది? కుమార - సంపాదించుకొని వచ్చెదను. మంగ - ఎంతో దూరము పోనక్కఱలేదు. కుమార- ఏదో యున్నది కథ. నా కేమైన మఱియొక రెండువంద లప్పుపెట్టెదవా యేమిటి?

కుమారస్వామివచ్చి మఱలఁ గూర్చుండి "అప్పెందుకుఁగాని నీ వెట్లును లేచిపోవుచున్నావు. నీ వున్న కొంపయు, పదివేలును నా పేర వ్రాసిపోరాదా?" అనెను. మంగమ్మ - నే నున్న యింటిలో నీకుఁ దల తగులును. ఆమేడ యిచ్చెదను, తీసికొమ్ము.

కుమారస్వామి పెదవివిఱచి 'మేడమైనచోఁ బదివేలు చాలవు. ఇరువదివేలైన నున్నచో గ్రుడ్డిలోమెల్లగా సంసారము చేయవచ్చును' అనెను. మంగమ్మ 'సరే తీసికొనుము!' అని పయ్యెదలో తా నింతవఱకుఁ గనఁబడకుండ దాచియుంచిన రిజిష్టరుచేసిన విల్లు కుమారస్వామిచేతిలోఁ బెట్టెను. అతఁ డది మొదటినుండి చివరదాఁకఁ జదువుకొనెను. మేఁడయు, ముప్పదివేలును గుమారస్వామికి వ్రాయఁబడి యుండెను. పాతికవేలు దేవదాసి యుత్సవములకు వ్రాయఁబడెను. పాతికవేలు శ్రీవేణుగోపాలస్వామికి వ్రాయఁబడెను. తా నున్న చిన్నయిల్లును, సినిమాయును దాను బ్రదికి యున్నంతవఱకుఁ దనది. తనయనంతరము సినిమాహాలు పడఁగొట్టి ధర్మారావుగారు దానియందు వేదపాఠశాల పెట్టవలయును; తానున్న యిల్లు చెంగలావ్రునకుఁ దక్కవలయును. ఈ మరణశాసనము కుమారస్వామి చదువుకొనెను. కూర్చుండి పదినిముసము లాలోచించెను. కూర్చుండికూర్చుండి చివరకు 'నీవు నన్ను నీ సేవకునిగాఁ జేసికొన్నావా?' యనెను. మంగమ్మ 'నాయనా! సేవకునిగాఁ జేసికొనలేదు. నాజన్మకుఁ బిండతిలోదకములు లేవు. నీవు నీయిష్టము వచ్చినట్లు నీవు జీవించుచున్ననిన్నినాళ్ళు నా కది గడపును. పుష్కరములలో, మహాలయపక్షములలోఁ, బితృదినములలో నూంకే బెజవాడపోయి యచ్చటమాత్రము నీకుఁదోఁచినట్లుగా నిన్ని నీళ్ళు వదలుము. ఇంకేమియు నక్కఱలేదు' అనెను. ముగ్గురును నిర్వాక్కులై

నిశ్చలులై యట్లే కూర్చుండిరి. కోటలోఁ బదునొకండుగంటలు కొట్టిరి. ఎవ రేమి మాటాడవలయునో, యెవరు ముందు లేవవలయునో యెవరికిని దెలియలేదు. కుమారస్వామి మొగములో నున్న తీక్ష్ణతయు, హృదయములోనున్న భారమును గ్రమక్రమముగాఁ దొలఁగించుకొని యొక్కసారి పకాలున నవ్వి, లేచి నిలుచుండి ‘ఓ శ్యామలా! ఇదిగో సంపాదించుకు వచ్చితిని. పోయి వంట చేయు’ మనెను. మువ్వురును గిలకిల నవ్విరి. చిన్నధర్మారావు వారిమువ్వురి మధ్యకును వచ్చి కిలకిల నవ్వెను. ఒక్కగాలి వీచి దేవాలయములో ధ్వజస్తంభము గంటలు గణగణ లాడెను దేవదాసికిఁగట్టించిన సమాధిమీదఁ బాలపిట్టలు, పైఁడిగంటలు, పావురాలు, చిలుకలు, గోరువంకలు కూర్చుండి కిచకిచ కూసెను.

మంగమ్మ రెండుజాముల కింటికిఁ బోయెను. చెంగల్రావు పెట్టెలన్నియు సర్దుచుండెను. మంగమ్మకుఁ గోపము వచ్చినది. ‘ఎందుకురా నా పెట్టెలన్నియు సర్దెద’ వనెను. వాఁడు తరతరలాడి ‘రంగావధానిగా రుత్తరము వ్రాసినారు, ఇదిగో’ యని యిచ్చెను. మంగమ్మ జాబు చదువుకొనుటలోఁ జెంగల్రావుతప్పు మఱచిపోయినది. ఆ యుత్తరము దుఃఖవిషయములతోఁ బ్రారంభించఁబడెను. మంగమ్మ మొదటివాక్యమునూత్రము చదివినది. అంతలో నామె కొకయూహ వచ్చెను. ‘ఇతఁడు నా పెట్టెలు సర్దిన నేమి? నాకుఁ గోప మేల వచ్చినది? ఛీ,ఛీ, నాలోనియాశ చచ్చినది కాదు, అని చెంగల్రావువంకఁ జూచి ‘యా పెట్టెలన్నియు నీవు సర్దవచ్చును. చూడవచ్చును. తప్పు లేదు’ అని తాను పోయి ముందుచావడిలోఁ గుర్చీపైఁ గూర్చుండి యుత్తరము చదువ నారంభించెను.

“చెన్నపట్టణము, జ్యేష్ఠ శు. ౯.

శ్రీమతి మంగమ్మగారికి, రంగావధాని నమస్కారములు.

మీ కొక విషాదవార్త వ్రాయుచున్నాను. అంతకుముందు మిమ్ము గుఱించి నాకుఁగల గౌరవమును, దానికి హేతువులును నప్రస్తుతమైనను వ్రాయుచున్నందుకు క్షమించవలయును. ఈయుత్తరము చెంగల్రావుచేతిలోఁ బడకుండ మీచేతిలోనే పడునని యాశించుచున్నాను. నాకు రెండుమూఁడేండ్లక్రిందనే మిమ్ముఁ

గూర్చిన కొన్ని సంగతులు తెలిసినవి. ఆఱేండ్లక్రిందట మీరు శరణాలయములోనికి వచ్చినప్పుడు రాధాపతి నడపిన దౌర్మార్గ్యమంతయు నతఁడే నాతోఁ జెప్పెను. తరువాత కుమారప్పగారు రంగముమీఁద మిమ్ముఁ గృత్రిమబుద్ధితోఁ దాఁకుటయు, మీరు వానిని నివారించు నేను ప్రత్యక్షముగఁ జూచిన విషయమే. ఆ తరువాత మే మచటనున్న వారముదినములును కుమారప్పయు, రాధాపతియు మిమ్ముఁబెట్టిన నిర్బంధనము నే నెఱుఁగుదును. చివరకు వారిని మీనుండి తొలఁగించుటకు నేనే కొంచెము సాధనభూతుఁడనైనానని కూడ మీకుఁ దెలియును! నే నింటికివచ్చినతరువాత వా రిద్దఱి నప్పుడే చీవాట్లుపెట్టితిని. మీరు తరువాత నాటకములే మానివేసితిరి. అప్పటినుంచి యింతవఱకు మీకుఁ దెలియకుండఁ గొన్ని విశేషములు జరిగినవి. వానివలన మీ కేమియు నష్టములేదుగనుక మీకు వ్రాయనక్కఱలేదు. కాని యొక్కమాట వ్రాయుచున్నాను. రాధాపతి మొన్నఁటివఱకు - మొన్నటివఱ కనియే యేల వ్రాయుచున్నా ననఁగా మొన్న నతఁడు చనిపోయెను గనుక- మిమ్ము సాధించుటకుఁ బ్రయత్నములే చేయుచుండెను. రేపటియుత్తరము కుమారస్వామిగారిపేర వ్రాయుచున్నాను. మీరు దానిని దీసికొని చూడవలసినది. అది చెంగల్రావుకు దక్కకుండునట్లు చేయుచున్నాను. ఆ రాధాపతికి దూరపుఁజుట్ట మొకయామె యున్నది. ఆమె పేరు కస్తూరి. ఆమెభర్త పెండ్లియైన పదియవనాఁడే చనిపోయెను. తరువాత రెండేండ్ల కామె రజస్వల య్యెను. ఆ యూరి కొక నాటకసమాజము పోగా నందులో నాయకునిపాత్రధరించువానితో నామె లేచిపోయెను. అది జరిగి యిప్పటికిఁ బన్నెండేం డ్లయినది. రెండు మూఁడేండ్లక్రింద రాధాపతి యామెవద్దకుఁ బోయి 'యేమమ్మా! నీ విట్లుండుట మర్యాదగాలేదు. వచ్చి మాశరణాలయములో నుండుము. శరణాలయములో నిప్పు డెవ్వరును లేరు. నా కింత గంజి కాఁచిపోయుదువుగాని' యని యామెచుట్టును రెండుమూడు నెలలు తిరిగెను. ఆయుంచుకొన్నవానికి నామెకుఁ బోట్లాటవచ్చి యామె యితనితో వచ్చెను. వచ్చినతరువాత వారిద్దఱునుగలిసి సంసారమే యారంభించిరి. అది లోకమందఱికిని దెలియును. ఉన్నది యుండఁగా నుయ్యూరుమీఁద

మేడూరు వచ్చిపడెనని వారిమీఁద నొకసిద్ధాంతము వచ్చిపడెను. ఆ సిద్ధాంతముప్రకారము శరీరముతోఁ బ్రేమించుటవేఱు మనసుతోఁ బ్రేమించుట వేఱు. ఈమధ్య యూరపుఖండములో నాధ్యాత్మికప్రేమ (Psychic love) అను నొకమార్గము బయలుదేఱినది. ఇంగ్లండులో నొక స్త్రీ యుండును, జర్మనీలో నొకపురుషుఁ డుండును. వా[illegible] ఱును భార్యాభర్తలవలె నుత్తరములు వ్రాసికొనుచుందురు. వారొకరిమొగ మొకరు చూచుకొని యుండరు. అది నిజమైన ప్రేమ యట. ఈ సిద్ధాంతము శరణాలయములోని కెక్కెను. ఒకనాఁడు కస్తూరీరాధాపతులు మాట్లాడుకొనుచుండఁగా రాధాపతి యామెను 'నీవు నన్నుఁ బ్రేమించుచుంటివా ?' యని యడిగెను. ఆమె లేదనెను. రాధాపతి 'నీవు నన్నుఁ బ్రేమించవలయు' ననెను. ఆమె నా మనస్సు నీమీఁద లేదు. రాధా—మన మిద్దఱమునుగలిసి యొకచోట నుంటిమి. లాభనష్టములు, కష్టసుఖములు మన మొకరివి యొకరము పంచుకొనుచుంటిమికదా ! నీవు నన్నుఁ బ్రేమించవలయును. కస్తూరి—నేను ప్రేమించుట లేదు. నామనస్సు నీ మీఁదికి వచ్చుట లేదు. రాధా—నిన్నుఁ గొట్టితిట్టిన యా నటునిమీఁద నేయుండెనా ? కస్తూరి—అది నీ కెందుకు ? మఱలఁ గొన్నాళ్ళకు వారి వాదన చెలరేఁగెను. రాధా—నీవు నన్నుఁ బ్రేమించుకున్న మానెఁగాక ! ప్రేమించుచున్నాననియైనఁ జెప్పుము. కస్తూరి—నే నట్లు చెప్పను. అబద్ధమాడి, పాపము నే నేల కట్టుకొందును ? రాధా—ఒక్కయబద్ధమాడుటయేనా పాపము ? కస్తూరి—నీ ప్రకారము పాపము పుణ్యములు లేవుకదా ! అవియన్నియు మనుష్యులు నిర్మించినవేకదా ! పాపపుణ్యముల కిక్కడనే యవసానము. ధనవంతుఁడై యధికారముకల వానిని పాతకము లేమి చేయుచున్న వని ప్రశ్న చేసితిని. నే నబద్ధమాడుటయైనను బాప మనుకొనుచున్నాను. నీ వదియును లేదుకదా! రాధా—కస్తూరీ ! నీ కబద్ధమాడుటవలన దోషమువచ్చినచో నది నేను కట్టుకొందును. నీ వొక్కసారి నన్నుఁ బ్రేమించుచుంటి నని చెప్పుము. చెప్పకపోయినచో నేను బ్రదుకలేను. కస్తూరి—నీవు బ్రదుకకపోయినచో నీవే చచ్చిపోదువు. నాకు రెండు నాల్కలు లేవు.

ఈ ప్రసంగము జరిగిననాఁటినుండి రాధాపతిమనసులో నెప్పుడును దుఃఖపడుచుండెను. నెల్లూరికి నా కీ సంగతియంతయు నుత్తరము వ్రాసెను. వ్రాసి, 'అవధానీ! కస్తూరిని నీవు నన్నుఁ బ్రేమించునట్లు చేయలేకపోయినచో నేను బ్రదుకుట దుర్భరము. నే నామెను [illegible]ంటఁబెట్టుకొని వచ్చుచున్నాను. నీవు రైలువద్దఁగలిసికొమ్ము. చెన్నపురి పోయి పదిదినము లుందుము' అని వ్రాసెను. మేము మదరాసు వచ్చి వారముదినములైనది. నేను మాబావగారియింటిలో నుంటిని. వారిద్దఱును మాడరన్ హిందూహోటలులో బసచేసిరి. నేను మైలాపూరునుండి ప్రతిరోజును వారివద్దకుఁబోదును. రాత్రికిఁదిరిగి యింటికి వత్తును. హోటలువాఁడు తెచ్చిపెట్టిన యన్నము కస్తూరియు, రాధాపతియుఁ గూర్చుండి వడ్డించుకొని భోజనముచేయుదురు. అతనికిఁ గస్తూరి తమలపాకులు యీనెలుతీసి యిచ్చును. ఇద్దఱును గాఁగిలించుకొందురు. ముద్దు లిడుకొందురు. అది నాయెదుటనే. ఒకసారి ఇద్దఱు నుండఁగా 'స్త్రీపురుషులు ముద్దుపెట్టుకొనుట యే' మని నే ననఁగా, రాధాపతి 'మనదేశములో వట్టియనాగరకులు. ప్రేమ యన్నది వారు వీ రున్నా రని యాఁగదు. దొరలు చూడుము — అందఱ సమక్షములోననే ముద్దిడుకొందు' రని సమాధానము చెప్పెను. మేము ముప్పురమును గలిసి సాయంకాలమున విహారము పోదుము. కస్తూరి రాధాపతి బుజముపై జేయివైచును. ఇద్దఱును గలిసి నడతురు. రాధాపతి యామెనడుము పుచ్చుకొని 'నీ నడుము సన్నని నడుము! ఎంత చక్కఁగా నున్నది' యనును. ఉబ్బినఱొమ్మని, పొట్లాలవంటిచేతులనిచమత్కారముగా నామెసౌందర్యమును మెచ్చుకొనును. ఆమెయు మఱల నవ్వును. ఇంటికిఁ బోదుము. ఆమెను రాధాపతి 'నన్నుఁ బ్రేమించుచుంటివా'యని యడుగును. ఆమె లేదనును. ఇతఁడు దుఃఖనిమగ్నుఁడై కూర్చుండును. నేను మైలాపూరు పోదును. ఇట్లుండఁగా నటుమొన్న సాయంకాలము మేము ముప్పురమును తిరువల్లికేణి సముద్రమున జనసమర్దములేనిచోటఁ బోయి కూర్చుంటిమి. అతఁడు కస్తూరి తన తొడపైఁ బరుండఁగాఁ, జెక్కిళ్ళు తనచేతుల మధ్య నమర్చి 'Darling! డార్లింగ్ ! నీవు నన్నుఁ బ్రేమించుచుంటివికాదూ!' అనెను. ఆమె యట్లే పరుండి, కదలక

మొదలక, ముఖలక్షణమునందును మార్పులేక నేను ప్రేమించుట లేదని చెప్పెను. అతఁ డాపట్టున బిగ్గరగా నేడ్చుట యారంభించెను. వారు వీరు చూచిపోవుదు రని నే నతని నోదార్చి 'యూరకే యొకసారి యనరాద టమ్మా' యని కస్తూరిని బతిమాలితిని. కా ప్రేళ్ళఁబడితిని. ఆమె 'ససేమిరా' యన్నది. మఱల మేము కొంతకాల యాపనజరుగుటకుఁ సినిమాకుఁ బోతిమి. సినిమావదలునప్పటికిరాత్రి పన్నెండుగంటలైనది. మేము ముగ్వురమును భోజనము చేయలేదు. సినిమా చాల హాస్యముగా నున్నది. అందుచేత రాధాపతి కొంతయు త్సాహములోఁ బడినాఁడు. మఱల హోటలుకుఁ బోతిమి. దీపము వెలిగించి కూర్చుంటిమి. రాధాపతి మఱలఁ గస్తూరి నడిగెను. ఆమె యట్లే సమాధానము చెప్పెను. అతఁడు రెండుగదు లద్దెకు దీసికొనెను. మే మున్న గదిలోనుండి రెండవ గదిలోనికిఁ బోయి లోపల తలుపువేసికొనెను. నేను 'విచారముగా నున్నాఁడుకదా, ఏకాంతము కోరుచున్నాఁ' డని యూరకుంటిని. అతఁడు తరువాత నొక గంటవఱ కేదియో వ్రాయుచుండెను. మా కీ లోపుగా నిదుర పట్టినది. ఇద్దరమును గాఢముగా నిద్రించుచున్నాము. ఇద్దరిలో నెవరికిని మెలఁకువ రాలేదు. తెల్లవాఱిలేచి చూచితిమి. గదితలుపు కొట్టితిమి. పలుకలేదు. హోటలు యజమానులు, వా రందఱు వచ్చిరి. తలుపు బద్దలుకొట్టి చూచితిమి. రాధాపతి చచ్చిపడియున్నాఁడు. వెంటనే హోటలుయజమాని పోలీసువారికిఁ దెలియఁజేసెను. వారు వచ్చిరి. చూచిరి. అతఁడు బల్లమీఁద నాలుగుత్తరములు వ్రాసిపెట్టెను. ఒకటి పోలీసువారికి: తాను పొటాసుసైనైడ్డు తిని చచ్చిపోతిననియుఁ, దనమృతికిఁ దానే హేతువుగాని మఱొకరు కాదనియు నందు వ్రాసియుండెను. నా కొక చిన్న యుత్తరము: అందులో నేమియు లేదు. 'మిత్రమా! సెలవు, పరలోకమందు నాకు నమ్మకము లేదు. మనమతములోని వెఱ్ఱిమొఱ్ఱిసిద్ధాంతములన్నియు నాకు నచ్చలేదు. అవియన్నియు మృషాజల్పితములు. నరకము, వైకుంఠము, కైలాసము- ఇవి వెఱ్ఱివాండ్రవ్రాఁతలు. మనమతము కన్న క్రైస్తవమతము కొంతబాగుగా నున్నదిగాని. వారును మఱల నెప్పుడో క్రీస్తు వచ్చుననియు, నప్పుడు పాఁతిపెట్టబడినవారందరును

లేతురనియు నొకపిచ్చిసిద్ధాంతమును గల్పించిరి. ఈ లోకమున నెంత యనుభవమో యంతియే యనుభవము. మన మిద్దర మిన్నాళ్ళు స్నేహముగా నుంటిమి. నాకు దానితోనే తృప్తి. ఇది నాకు వ్రాసిన యు[illegible]ము. ఇంకొకటి కుమారప్పకు వ్రాసెను. నాల్గవది కస్తూరికి- అది పెదిపుట లుండెను. దానినిండ నతని మనోవేదనమంతయు వర్ణిం చెను. పోలీసువారు మా నాలుగుత్తరములును జూచిరి. మావి మా కిచ్చివేసిరి. అతనిశవము నిన్న జెనరలుహాస్పిటలులో పోస్టుమార్టెమ్ చేసిరి. నే నా నెత్తురుముక్కలు తీసికొనిపోయి, పాతికరూపాయలు వ్యయపడి, స్నేహితుండుకదా యని తగులబెట్టించుటమాత్రము చేసితిని. నిన్నసాయంకాలము నేనును, గస్తూరియు మాబావగారియింటిలోం గూర్చుండి యామెకు వ్రాసినయుత్తరము చదివితిమి. రాధాపతి వట్టి మూర్ఖుండే. అయినను నాయుత్తరము చదివినచో గుండె తఱుగు కొనిపోయినది. నేను కస్తూరిని జూచి 'పాపము! జీవుం డెంత బాధ పడినాండో' యన్నాను. ఆమె 'వట్టి మిల్క్‌సాప్'(Milkshap)అని పకపకా నవ్వెను. ఏమి చెప్పుదును? తేపు జాబు వ్రాసెదను. కుమారస్వామివద్దకుం బోయి చూడవలసినది,

ఇట్లు, రంగావధాని.''

మంగమ్మ యుత్తరమును జదివి చెంగల్రావువంకం జూచెను. అతం డామెయుత్తరము చదువుచున్నంతసేపు తలుపువెనుకనే నిలిచి యుండెను.

మంగ— నీ వుత్తరమంతయు జదివినావా? చెంగ—చదివి నాను. మంగ—నిన్ను గుఱించి రంగావధానిగారి కనుమాన మెందు లకు? చెంగ—ఆయన నన్నుం దనయింటిలో నుండు మన్నాండు. నే నుండ నన్నాను. అప్పటినుండియు నామీంద నాయనకుం గోపము. మంగ—ఇది నాతో నెన్నండును జెప్పలే దేమి? చెంగ—అవసర మేమియు లేదుగనుకం జెప్పలేదు.

వాలి వచ్చి మంగమ్మకాళ్ళకుం జుట్టుకొనెను. మంగమ్మ చెంగల్రావుతో 'దీనిని నావద్దకు రానీయవద్దని చెప్పలేదా?'అనెను. చెంగ—ఆ కోంతి నీవద్దకువచ్చి రెండునెలల పదునేను దినము లైనది. నీవద్దకు రావలయు ననియే యేడ్చుచున్నది. వాలీ! నెత్తిమీంద

కెక్కరా, నెత్తిమీఁది కెక్కు. మంగ— గాడిదవలె మాట్లాడకుము. దానిని దీసికొనిపోయి కట్టివేయుము. మంగ—అది కట్టివేసినచో నుండునా యేమి? నీ కోసమే వచ్చును. మంగ—నాకోసము రాదు. నీవు దానిని గట్టివేసి పెట్టెలన్నియు సర్దుకొనుము. అన్ని పెట్టెలు చూచుకొనుము. నీ కేమి కావలయునో యది తీసికొనుము. పోవుచున్నాను. చెంగ—భోజనము చేయవా? మంగ— ఇచ్చటఁ జేయను. చెంగ—కుమారస్వామిగారియింటిలోఁ జేయుదువా? మంగ— నే నెచ్చటఁజేసిన నీ కేమి? ఆమె యొక పెట్టెతీసి కొన్ని కాగితములు తీసికొని వెడలిపోయెను. కబీరునింటికిఁ బోయెను. కబీరును, రత్నగిరియుఁ గూర్చుండి యేమో మాటాడుకొనుచున్నారు. మంగమ్మ వెళ్ళఁగానే వా రామెను జూచి రమ్మనిరి. మంగమ్మకు వారికి నదివఱకుఁ బరిచయము లేదు.

మంగ— మీ రేదో మాట్లాడుకొనుచున్న ట్లున్నారు. నేను రావచ్చునా? రత్నగిరి— ఏ మున్నవి? ఏమియును లేదు. మాతల్లి చనిపోయినదికదా యని యేడ్చుచున్నాము. మంగ— సంతోషించ వలసినదాని కేడ్చుచున్నారా?

కబీరునకు మంగమ్మ యనినచోఁ బడదు. అతఁ డామెను జూచినచో దారి తొలఁగిపోవును. ఈ నాఁ డామె వచ్చినవెంటనే లేచిపోఁబోయెను. కాని యామె యన్న యీమాటకు మఱల మన సేలనో యాఁగిపోయెను.

మంగమ్మ— దేవదాసి మీయదృష్టముకొలఁది మీయింటఁ బుట్టినది. ఆమె చనిపోయిన దని దుఃఖమేకాని, బ్రదికియుండి యేమి చేయును? కొందఱు మహాకార్యములుచేయుటకు వచ్చినవా రా కార్యమైపోయినంతనే వారిదారిని వారు వెళ్ళుదురు. తరువాత వా రుండవలసినయవసరము లేదు. ఏ మహాకార్యముచేయుటకును బుట్టని వారు వందలయేండ్లు బ్రదికి ప్రయోజనము లేదు. ప్రయోజనముకల వా రదమైనంతనే చనిపోయినచో నష్టము లేదు.

రత్న— తల్లీ! దానిబదులు నేను చనిపోరాదా? మంగ— ఇంగ్లీషులో నొక లోకోక్తి యున్నది: భగవంతుఁ డెవరిని ప్రేమించునో వారు చిన్నప్పుడే చనిపోదురఁట. రత్న— మా యమ్మకు సమాధి

కట్టినాము. పోయి యీసమాధి చూచుకొనివచ్చుటయేకాని, మాతల్లిరూపు మాసిపోయినది. నాప్రాణమునకు మాదేవదాసి శ్రీ స్వామివారియందు భక్తురా లగుట యొకయెత్తు. ధర్మారావుగారు దాని త ప్రేమించుట యొకయెత్తుగా నుండెడిది. మంగమ్మ— అవునమ్మా! బ్రదుకనిబిడ్డ కారేడు. లోకసామాన్యపుబిడ్డయైనచో నెన్నాళ్లైనను బ్రదుకును. ఈ పాపపుఁగలి యంతపుణ్యమూర్తిని భరించనక్కఱలేదా? రత్న— మాయమ్మకుఁ బ్రతియేఁట నేదియో యుత్సవముచేయవలె నని యున్నది. నాకుఁ బదియెకరములపొల మున్నది. ఈ పడిపోయిన ధరలలోనైనను సాలునకు రెండువందల రూపాయలు వచ్చును. అందులోననే కొంత మిగిల్చి యుత్సవములు చేయవలయును. మంగమ్మ— రెండువందలలో మిగుల్చునదియేమిటి, ఉత్సవములుచేయునది యేమిటి? రత్న— ఉపవాసములైనఁ బండు కొని యుత్సవములు చేయవలయును. నాయింట నారిపోని రత్న దీపము పెట్టుకొంటి ననుకొన్నాను. అదియు నారిపోయెను. మంగ— (చెవులు మూసికొని) హరిహరి! ఆరిపోయినదా? సహస్రదీధితివలెఁ బ్రకాశించుచున్నది.

ఇంతసేపు కబీరు మాటాడలేదు. మంగమ్మమాటలు చూచి యతని కామెయందున్న వైమనస్యములో సగము తీఱెను. అతఁ డను కొనెను: 'ఈమె సినిమా నడుపుచున్నది. దుర్మార్గురాలు. మాగిరి కనుగూర్చి యి ట్లనుకొను నేమి? ఇవియన్నియు దొంగవేషములా?' కబీరు మంగమ్మతో నిట్లనెను: 'ఉత్సవములుచేయుటకు ధనము కావలయునుగదా! ఎచటినుండి వచ్చును?' మంగమ్మ— ఆమె దేవ తావతార మైనప్పుడు రానే వచ్చును. ఎచ్చటనుండి వచ్చునో యెవరు చెప్పఁగలరు?

కబీరు మనసులో ననుకొనెను: 'ఈమె యించుమించుగా లక్షాధికారిణి. రామేశ్వరముగారిడబ్బంతయు నీమెకే దక్కెను. తరువాత సినిమామీఁదఁ జాల సంపాదించెను. ఈమెమోస్తరు చూచినచో నుత్సవముల కడిగినచోఁ గొంత డబ్బిచ్చున ట్లున్నది. మా కీమెపాపపుడ బ్బెందుకు?' మంగ— రత్నగిరీ! నేను చాల పాపాత్మురాలను. నాపాపముపోవుటకుఁ గొన్నిసత్కార్యములు చేయ

వలయు నని యుద్దేశ్యము. పాపము మనిసి నాశ్రయించియుండును గాని ధనము నాశ్రయించి యుండదు. అన్యాయార్జితమైనధనమే పాపపుధనము. అది పాపముధన మనుట యన్యాయముగా నార్జించిన వానివిషయమున మాత్రమే. అది న్యాయముగా నింకొకనిహస్తగత మైనచో నది పాపపుధనము కాదు. కబీరు మనసులోఁ [illegible]ము గగ్గోలుపడెను. నే ననుకొన్న ట్లీమె కేమి తెలిసిన దనుకొనెను.

మంగమ్మ తాను తెచ్చిన మరణశాసనపుఁ బ్రతిని దీసి కబీరున కిచ్చెను. అతఁడు దానిని తీసికొని పైనుండి క్రిందికిఁ జదువుకొని యాశ్చర్యనిమగ్నుఁ డయ్యెను. 'పాతిక వేలు. ఒకటియా? రెండా? దానిపైనివచ్చు వడ్డీతోఁ బ్రతియేఁట దివ్యముగా నుత్సవములు చేయవచ్చును. కాని యాధనము పుచ్చుకొనవచ్చునా, రాదా యన్న జంజాటము పోలేదు. మంగమ్మ గ్రహించినది. ఇ ట్లన్నది: 'కుమారస్వామి ధర్మారావుగారికి నచ్చిన శిష్యుఁడు. ఆయన స్వీకరించినాఁడు. శ్రీవేణుగోపాలస్వామివారే నాధనము పనికిరా దనలేదు. నృత్యము చేసినన్నిదినములు దేవదాసియందే లీనమై యున్నాను. నాడబ్బు స్వీకరించుట తప్పైనచో నాయానాఁటి తన్మయత్వమును దప్పే'. రత్న- త ప్పే మున్నది? మీడబ్బు మంచిదికా దని యెవ రనిరి? ఇప్పుడు విల్లువ్రాసి రిజిష్టరు చేసినతరువాత దేవదాసిదే యైనది. అవును, కాదని చెప్పఁదగినది దేవదాసి. అది లేదు. మే మే మనుటకును సమర్థులము కాదు. మంగ- దేవదాసి యేమో యొప్పుకొననే యొప్పుకొన్నది. అందు కనియే నాకీ బుద్ధి పుట్టించినది. కబీరు తనకుఁదెలియకుండఁగనే'చిత్తము, చిత్త' మనెను. మంగమ్మ వెడలిపోయెను. ఫోనులో మరణశాసనము ప్రతి మారప్పనాయని కొకటి పంపించెను. ప్రొద్దుక్రుంకినతరువాత మంగమ్మ కుమారస్వామియింటికిఁ బోయెను. స్వామి మొగము చూచి 'ప్రొద్దుటినుండి భోజనము చేసినట్లు లేదే' యనెను. మంగ- ఈనాఁడు నా కాఁకలి యగుట లేదు. కుమారస్వామి బజారునకుఁ బోయి కొన్నిఫలములు తెచ్చెను. అవి యామెముందు పెట్టెను. మంగమ్మ- నా కీ నాఁడు క్రొత్తఁగా గౌరవము చేయుచున్నావేమి? కుమార—ఆశ యనునది చాల చెడ్డది. దానిని జయించిన

వారు లేరు. నీ వొకవిధముగా దానిని జయించితివి. లక్షరూపా యలయాస్తి తృణప్రాయముగా వదలిపెట్టిన నిన్ను మనుష్యురాల ననుకొనననా, దేవతామూర్తి ననుకొనననా? మంగ- నేను తృణప్రాయముగా వదలలేదు. నా యాస్తి నావద్దనే యున్నచో దాని [illegible]క్క లక్షయే. ఇప్పుడు చూచితివా? ఇప్పు డది లక్షలు కాదు. కోట్లు కాదు. ఎంతయో చెప్పలేము. కుమార-ప్రొద్దుటినుండి భోజనము లేదుగనుక నీవీ పండ్లారగించుము. మంగ-నా కక్కఱలేదు. కుమార-నే నిచ్చినపండ్లు నీ కక్కఱ లేనిచో నీ విచ్చినడబ్బు నా కక్కఱలేదు. మంగమ్మ—అయినచోఁ బండ్లు తినెదనులే. కొంచెము మజ్జిగకూడ దాహ మీయవలయును.

శ్యామల పోయి పలుచనిమజ్జిగలో నిమ్మకాయపిండి యుప్పు వేసి తెచ్చెను. మంగమ్మ ఫలము లారగించి దాహము త్రావెను.

కుమా—ప్రొద్దుటినుండి భోజనము లేకుండ నెందు కున్నావు? చెంగల్రాయ వన్నముపండ లేదా? మంగ—నావద్ద నతనిప్రశంస తేకుము. భీష్ములవారు శిఖండి మొగము చూడనన్నా రఁట. నాబ్రదుకంతయు వీని మొగము చూచుటతోడనే సరిపోయినది. అంతలో మంగమ్మకు నిద్ర తఱుముకొని వచ్చెను. ఆమె యచ్చటనే పరుండి నిద్ర పోయెను. పన్నిండకనుం దామె కొంతధ్యానము చేసెను. ఆమె నిద్రపోయినది.

శ్యామల- మంగమ్మగా రే మగును? కుమార- నీకా? నాకా? శ్యామల—మన యిద్దరికి నే మగునో తేలిపోయినది. నా కత్తగారును, మీకుఁ దల్లియు. ఆవిడ కావిడ యే మగును? కుమార—ఇ దేమి భాష? ఒకరి కొక రే మగుదురో వరుస లున్నవి కాని, యెవరికి వా రే మగుదురో వరుసలేదు. ఇది భాషలో లోపమేసుమా! పొఱపాటు, పొఱపాటు. ఎవరికి వా రే మగుదురో చెప్పుదునా? తమకుఁ దామవుదురు. శ్యామల— నేనుగనుక బ్రదుకుచున్నానుగాని, మఱియొక్కతె యైనచో... కుమార—ఏ మగునందువు? నాయుద్యోగమువలె నగునందువా? ఉద్యోగాలు పోయిన నేమి? కలిసివచ్చునప్పటికి నలువదివేలు గిరుక్కునఁ దిరిగి వచ్చినవి. శ్యామల- భార్యలవిషయములో నంత తేలికగా నమ్మోడిది కాదు. కుమార- నేను నిన్నుఁ బెండ్లిచేసి

కొనకముందు. నీవు పట్టి... శ్యామల- అవునండి, ముద్దు. కుమార- ముద్దువైనచో నే నెందుకు చేసికొందును? ఇంతలో ధర్మారావు లేచి యేడ్చుచుండును. కుమార- ఈ కుఱ్ఱకుంకకు మన శాస్త్రి వచ్చినమాట తెలియలేదు.

వీ రిట్లు మాటాడుకొనుచుండఁగా మంగమ్మకు మెలఁకువ వచ్చెను. ఆమె కన్నులు మూసికొనియే పండుకొని యుండెను. కుమారస్వామి యీ చివరమాట యామెకు వినిపించెను. శ్యామల- ఆస్త్రీవచ్చినదని మియమ్మ నీ నాఁడు పట్టరాకుండ నున్నది. కుమార—పట్టరాకుండ నున్నచో నీవు పట్టరాకుము. మంగమ్మ గారు నిదురపోవుచున్నది. వాని నేడిపించకుము. ఆమెఁకు మెలఁకువ వచ్చునేమో? ప్రొద్దుటినుండి తిండిలేదు.మనకొంపలోఁ దినదాయెను. శ్యామల—తిన్నచో నేను చేసి పెట్టనన్నానా ? కుమార—నీ వన లేదు. మీయమ్మ యన్నది. శ్యామల – మీవొక్కొక్కమాట మాట్లాడినచో నది పదితరాలవెనుకకుఁ బోయి తగులును. కుమార - ఈ మాటలకు మెచ్చియేకాదూ ?

మంగమ్మ మనసులోఁ దాను వారిసంసారములోనికిఁ దెచ్చిన యానందమును హృదయముతో నప్పళించెను. విత్తినచేను వానలు యదనుకు రాఁగాఁ జూచినకాఁపువలె నామనసులో సంతోషపడెను. ఆమె మఱునాఁటి యుత్తరమునుగూర్చి భావించుచుండెను. 'ఆ యుత్తర మీపాటికి మెయిలులోఁ బడినది. రైలుమీఁదఁ బరు గెత్తుకొని వచ్చుచున్నది. అందులో నేమి యుండును ? ఆ రహస్య మేమిటి ? రంగావధాని యెంతమంచివాఁడు! అందఱు నొక్కటియే సంఘమువారైనను వారివారిప్రకృతులు భేదించును. ఎవరిసంస్కారము వారిది. అందఱును లంకలోనే పుట్టగాఁ ద్రిజట కా ప్రత్యేకత యెందులకు? త్రిజటకుఁ జిత్రచిత్రములైనస్వప్నములు వచ్చినవి.సీతాదేవి మఱలఁ బతిపుతోఁ గలిసికొనినతరువాత త్రిజటమాట మఱచిపోయినదికాబోలు! మఱచిపోయిన నేమి? సత్కార్యమున కది సత్కార్య మగుటయే ఫలము' అనుకొనుచుండెను. కుమారస్వామి కుఱ్ఱవాఁ డింకను నిద్దురపోలేదా' యనెను.

శ్యామల - మీ రేమో వానికిఁ దెలియలేదని. వానికిని దెలిసినది. ఆ పాలుత్రాగు వైఖరి చూడుఁడు! ఏమి చిట్టులు, ఏమి బుస్సులు? బాబూ! కొంచె మణఁగియుండుము! ఎంతవారికైనను వినయము మంచిది కుమార - నా కీనాఁడు మఱలఁ బెండ్లియైనట్లు సంతోషించుచున్నాను. శ్యామల- ఎందుచేత? కుమార— నాయదృష్టము సరిగానుండి వేళకు వచ్చి యీ పిచ్చితల్లి కాగితము చేతి కిచ్చినదిగనుక సరిపోయినది. లేనిచో నాకుఁ గూడ నీ నాఁడు ఫలహారమే.

మంగమ్మ యీ మాటగూడ విన్నది. అంతలో నిదురపోయినది. ఆ రాత్రియంతయుఁ జీఁకట్లలో వెన్నెలలు ప్రకాశించెను. వర్షాకాలమున వసంతర్తువు వచ్చెను. శ్యామలా కుమారస్వాముల పరిష్వంగములలోఁ జుంబనములలోఁ జూపులలో మాటలలో మంగమ్మయే సాక్షాత్కరించుచుండెను. నిద్ర యానందమునకు విఘాతమైనది. యోగానందము మహోత్కృష్టమైనది. జాగ్రదవస్థలోని యానందము దాని ప్రతిబింబమువంటిది. నిద్రావేళ యెటువంటిది? లోనఁ బరమాత్మ ప్రకాశించుచుండును. ఎందులకైన ప్రకాశము? నిర్జనమైన యింటిలో దీపము పెట్టినట్లు, యమునానది పోయి తెల్లనిభాగీరథిలోఁ బడినట్లు, రాత్రి పోయిపోయి తెల్లనిపట్ట పగటిలోఁ గలసెను. ప్రొద్దుటిపూఁటయెండలు కొండలోనుండి హఠాత్తుగా బయటికుఱికిన జలప్రవాహమువలె బిలబిల చనుదెంచెను. మంగమ్మ నిద్ర లేచెను. ఆమెకుఁ బ్రాణము సొమ్మసిల్లినది. ఆమె లేచువఱకు నామె ధరించుటకుఁ జీరయుఁ స్నానము చేయుటకుఁ గావలసిన పరికరములును దీసికొని రాఁబడెను. ఆమె స్నానము చేసినది. కుమారస్వామి మఱల ఫలహారములు సమర్పించెను. మంగమ్మ తిని, 'నాయనా! నీవలన నా జన్మలో నెన్నఁడు ననుభవించని భోగము లనుభవించుచున్నా' ననెను.

కుమార— నేనును మఱల నదియే మాట యనుచుంటిని. ఇచ్చిన వాయనము; పుచ్చుకొన్న వాయనము. మంగ- నీ కింత తెనుఁగెచ్చటినుండి వచ్చినది? కుమార- ఇంగ్లండు పోయి చదువుకొని వచ్చినాను. శ్యామల- తెలుఁగక్కడనా యేమి చెప్పెదరు?

కుమార- ఇంగ్లీషు మఱి యిక్కడ కాదా చెప్పుచున్నారు? మన హెడ్మాస్టరులు, మన ప్రిన్సిపాలులు నింగ్లీషులో యోధాను యోధులు, అతిరథులు, మహారథులు. మంగమ్మ- ఈ పాటికి రైలు వచ్చియుండునా? కుమార- ఎందుకు? మంగ- నీ పేర నా కొక యుత్తరము వచ్చును. అన్నట్లుగా మఱచిపోతిని. రాధాప... ని ప్రోయినాఁడఁట. కుమార- రాధాపతియా? ఏమి? మంగ- అది నాల్గు పేజీల యుత్తరము. కుమార- ఏదైన వ్యాధివచ్చెనా? మంగ-వ్యాధి కాదు, ఆధి. కుమార- అది జన్మతో నున్న దేకదా! మంగ- ఆయ నకుఁ జావుతోఁగూడ నున్నది. ఆ యుత్తరము పోస్టాఫీసుకుఁ బోయి తీసికొని రావలయును. చెంగల్రావు మనకన్న ముందుపోయి దానిని దీసికొనివచ్చునేమో? కుమార- చచ్చినాఁడులే. ఇన్నాళ్ళకు నే ననుకొన్నది నిజమైనది. మంగ- ఏమి టది? కుమార- చెంగల్రావు ప్రభు వని. వాఁ డేదో తుమ్మెమీఁదనే నీదగ్గఱ నున్నాఁ డని. మంగ- మఱి నాతో నెప్పుడును జెప్పకపోతివేమి? కుమార—నీతోఁ జెప్పుట యెందుకు? నామీఁద నున్న కొంచెము మంచి యభిప్రాయమును బాడుచేసికొనుటకా? వృథాగా నలువదివేలు పాడుచేసికొనుటకా? అప్పుడు చెప్పినచో నీ వొప్పుకొనెడిదానవా? మంగ—నిజమే. కుమారస్వామి పోయి పదిగంటలకు నుత్తరము దెచ్చెను. దారిలో నతఁడే తెఱచి దానిని జదివెను. మంగమ్మ 'తెఱచి చూచితివా' యనెను. కుమార—తద్దినములు పెట్టువాని కంతమాత్ర మధికారము లేదా? మంగ—లేక యేమి? ఉన్నది. ఉత్తర మిట్లున్నది:

"చెన్నపురి, జ్యేష్ఠ శు ౨

నమస్కారములు,

నేను కాగితములన్నియుఁ దిరుగవేయుచుండఁగాఁ జెంగల రావువ్రాసిన కొన్ని యుత్తరములు కనిపించెను. కొన్ని రాధాపతికిఁ గొన్ని కుమారప్పకు. ఉత్తరములు చాల సాంకేతికముగ నున్నవి. వా రిద్దఱు నేమో మీ యాస్తి యంతయుఁ జెంగల్రావుపేర వ్రాయించుకొమ్మని చెప్పినట్లున్నది. మీరట్లు చేయనిచో మిమ్ముఁ జంపుటకుఁగూడఁ బ్రయత్నములు జరిగిన ట్లున్నవి. ఆ యుత్తరము లలో నక్కడక్కడిమాటలనుబట్టి నే ని ట్లూహించినాను. ఆధార

మేమియు సరిగా లేదు. కాని యొకమాట: ఇచ్చట రాధాపతి చని
పోయిన రాత్రియే మి మ్మిచ్చట ఖూనీచేయవలెనని ప్రయత్నము
జరిగినట్లు తోఁచుచున్నది. నా యుత్తరములు మీకుఁ జేరినవో,
లేదో తెలియలేదు. మీరు బ్రతికియున్నారో, లేదో తెలియదు. ఈ
[illegible]ర మందినవెంటనే సమాధానము వ్రాయించవలెను. మీ
రింకను బ్రదికియున్నచోఁ జెంగల్రావువిషయములో శ్రద్ధగా నుండ
వలయును. ఇట్లు రంగావధాని.

తా॥ క॥ కుమారస్వామిగారికి! నాకు సంగతు లేమియుఁ దెలి
యుటలేదు. ఈ యుత్తరము చూచుకొని యవసరమైనచో మీరు
నాకు దయచేసి సమాధానము వ్రాయించవలయును. 'రం'

కుమార—వాని నిప్పుడే పోయి యింటిలోనుండి వెడలగొట్టి
వత్తునా? మంగ—రంగావధానిగారు వ్రాయుట తనకు సరియైన
యాధారములు లే వని వ్రాయుచున్నాఁడు. ఆయన మనిసి
యెక్కువ భయస్థుఁడు. చెంగల్రావు వట్టివాఁడు కాదేమో? అయినను
రెండుమూఁడు రోజులు చూడవలయునుగదా! కుమార- మీ రింటికి
పదండి. నేను కొంచెముసేపుండి వచ్చెదను. వానిచేతియన్నము
మాత్రము తినవలదు? అందులో నేమైనఁ గలుపునేమో? మంగ—
నాకు ఫలములు తెచ్చిపెట్టువారు కుదురఁగా నన్నము తినుటకు
నాకర్మ మేమి కాలినది? కుమార— ఈ సంతోషము బాగుగా
నున్నది. ఇంటికి పదండి.

మంగమ్మ బయలుదేఱి వెళ్ళెను. చెంగల్రావు వీధితలుపువేసి
లోపల నేమో చేయుచుండెను. ఆమె తలుపుతట్టెను. అతఁడు చాల
నాలస్యముచేసి వచ్చి తలుపుతీసెను.

మంగ—ఏమిటి చేయుచున్నావు? చెంగ—నీ వూరిలో లే
వనుకొన్నాను. మంగ—సరే, ఈ లోకములో లే ననుకొన్నావు
కాదు నే నెచ్చటికిఁ బోదును? నీవేమి చేయుచున్నావు? చెంగ-
పెట్టె తీసి మరణశాసనము చదువుచున్నాను. అందులో నీతదనంత
రము నా కీ యిల్లు వ్రాసితివే? మంగ—అవును, వ్రాసినాను
చెంగ—నా కీ యిల్లెందుకు? నీవు లేకపోయినచో నే నీ యూరిలో
నుందునా? మంగ—ఇల్లమ్ముకొని డబ్బుతీసికొని పొమ్ము. చెంగ-

నీవు కనిపించువఱకు బిచ్చమెత్తితినిగాని స్థిరముగా నెచటను నుండ లేదు. నాకు ధన మెందుకు? మంగ—మఱి యేమి కావలయును? చెంగ—ఏమియు నక్కఱలేదు. ఇంతకూడును, గుడ్డయుఁ గావల యును. మంగ—రాధాపతి చచిపోయినమాట చూచితివా? చెంగ - చూచినాను. అట్లు చనిపోయినాఁడేమి? ఆయన నా ఁ జాల రహస్యములు మాటాడెడు వాఁడు. ఆరహస్యములన్నియు నేమైనవి? చాలా మంచిది. అది పెద్దరహస్యము. మం — మాట్లాడుచున్నది చెంగల్రావేనా? చెం - నేనే. నాకును గొంచెము చదువువచ్చును. మంగ - చదు వేమిటి? కవిత్వముకూడ వచ్చును. చెంగ - భోజ నము చేయవా? మంగ — చేయను. ద్వాదశివఱ కుపవాస ముండె దను. చెంగ - ఐదుదినములే! పండ్లుగాని యేమైనఁ దినరాదా? మంగ—అవి కుమారస్వామిగారి యింటిలోఁ దినుచుంటిని, చెంగ - అన్నట్లుగా ఆయనయేకదా పెద్దమాటాడారు! ఆ మాటలోఁ గుమార స్వామి వచ్చి 'నే నేమి పెద్దమాటాడారును? నాకు పట్టిధనమేకదా, యిచ్చినది? నీకుఁ బ్రాణములే యిచ్చుచున్నది' యనెను. చెంగ - నామీఁద నంత ప్రేమయున్నచో నొక చిన్న కొంపయూ యిచ్చునది! కుమార—ఎక్కువయాస్తి యిచ్చినచో నేమి చేసెదవు? పెండ్లమా? బిడ్డలా? చెంగ—ధనమునకుఁ బెండ్లము, బిడ్డ లక్కఱలేదు. కుమార- నిజము చెప్పితివి. మంగమ్మగారూ! మాయింటికిఁ బోదము. చెంగ- ఏమి మంగప్పా! ఇంక నీ విక్కడకు రానేరావా? మంగ — రాత్రికి వచ్చి యిచ్చటనే పండుకొందును. చెంగ - వారింటిలోను, వారింటి లోను బండుకొనుట యెందులకు, నీ యిల్లు వదలిపెట్టుకొని? మంగ - నిజమే!

ఆనాఁటిరాత్రి కుమారస్వామియింటిలో ఫలములు తిని, మంగమ్మవచ్చి తనయింటిలోఁ బండుకొనెను. కుమారస్వామి తాను రాత్రి పన్నెండు గంటలవేళ బయలుదేఱి మంగమ్మ పండుకొని నిద్రపోవుగదికిటికీలోనుండి లోనికి చూచుచుండెను. ఆ కిటికీ చిన్న వసారాలోని కున్నది. ఆ వసారాలో నున్నమనిసి కనిపించఁడు. కుమారస్వామి చూచుచుండెను. కొంత ప్రొద్దువేళకు మంగమ్మ యిటునిటు కదలెను. గడియారము గంటలుకొట్టెను. చెంగల్రావుకొంత

సేపటికి మంగమ్మ నిద్రపోవుగదిలోనికి వచ్చి యిటు నటుచూచి మరచెంబులోని నీరు త్రావి మరలఁబోయి సావడిలోఁ బండుకొనెను. చూడలేక కుమారస్వామి కన్నులు బొత్తలు పడిపోయెను. అతని [illegible] కదుములు కట్టెను. రెండు, మూఁడు. నాల్గు గంటలైనది. కోళ్లు కూసెను. కుమారస్వామి తా నింకఁ బోవచ్చు ననుకొనెను. పోయి పరుండెను. శ్యామల - ఎక్కడికిఁ బోయి వచ్చితిరి? కుమార- నీ వడుగవలసినంత చోటికిఁ గాదు.

కుమారస్వామి పవల్లెల్ల నిద్రపోయెను. నవమి వచ్చినది. మంగమ్మ వచ్చి యతనియింటనే ఫలములు భుజించినది. పవల్లెల్ల నిచ్చటనే యున్నది. మరలఁ బ్రొద్దు క్రుంకినది. పొద్దు పోయినది. మంగమ్మ తనయింటఁ బండుకొన్నది. కుమారస్వామి వచ్చి గవాక్షమునుండి చూచుచుండెను. రాత్రి యథాప్రకారముగ గడచెను. ఒకరాత్రివేళ చెంగలావు వచ్చి మంచితీర్థము త్రాగెను. అతఁ డామెవంక నొకసారి చూచి మరలఁ బోయి పండుకొనెను. గంటలు గడిచినవి. కోళ్ళు కూసినవి. కుమారస్వామి యింటికిఁబోయి నిద్రపోయెను.

చెంగల్రావు గవాక్షముబయటనున్న వసారాలోఁ బోయి చూచెను. అచ్చట మనుష్యుల యడుగులు కనిపించెను.

దశమిరాత్రి మరలయథాప్రకారముగాఁ గడచెను. ఈ నాఁడు చెంగల్రావు మంచితీర్థము త్రాగుటకుఁగూడ రాలేదు. తెల్లవారి వచ్చినది. కుమారస్వామి పోయి పండుకొనెను. పవల్లెల్ల ధర్మారావు వద్దకుఁబోయి యేదియో మాట్లాడుచు నిద్రపోలేదు. ఏకాదశి ప్రొద్దుక్రుంకెను. కుమారస్వామి భోజనముచేసి మంగమ్మయింటికిఁ బోద మనుకొనుచుఁ గడచిన మూఁడు రాత్రుల బడలికచేత, నిర్విశేషములైన యా మూఁడురాత్రులయందలి ప్రశ్రయముచేత నిద్ర పోయెను. ఆ నాఁడు సాయంకాలము చెంగల్రావు షికారుపోయెను. పట్టణము నాల్గువైపుల దిరిగివచ్చెను. అతఁడు కుమారస్వామియింటి ముందుగాఁ బోయెను. వేణుగోపాలస్వామియాలయమువద్దకుఁబోయెను. దేవదాసి సమాధివద్దకుఁబోయెను. తిరిగియింటికివచ్చెను. తిండితినెను. కొంచెము ప్రొద్దుపోయినది. వెన్నెలలు పిలపిల చనుదెంచెను. భక్తులను

మీఁదనెక్కించుకొనిరమ్మని శ్రీమన్నారాయణుఁడుపంపిన గరుత్మంతుఁడు తెక్కలుచాచినట్లు తెల్లని వెన్నెలలు ప్రకాశించెను. బయటికి వచ్చినఁగదా గరుత్మంతునితెక్కలమీఁదనెక్కుట. ఇంటిలోఁజీకటిలో నిద్రించువారి నెట్లు తీసికొనిపోవుదు? మంగమ్మకు నిద్రపట్టలేదు. ఆమె యూహించుచుండెను: "తేపు ప్రొద్దుటివఱకు నేను బ్రదికియు... ఎందుకు బ్రదికియుండను? ఏమో! మృత్యు వనునది ప్రతినిము సమునందు నెదురుచూచుచుండును. నేను బ్రదికి యేమి లాభము? చనిపోయినచో నెంత బాగుగా నుండును? ఆ స్త్రియంతయు నందఱకును బంచిపెట్టితిని. నేను బ్రదికియుండుట కుమారస్వామి కిబ్బంది. అతఁడు నాకై యన్నిపరిచర్యలును జేయును. ఈ నాల్గునాళ్ళనుండియు నన్నుఁ గాలు క్రిందఁబెట్టనిచ్చినాఁడు కాదు. నేను చనిపోవలయును. ప్రాణాయామము పట్టి నిలువఁబెట్టినచోఁ గొంతసేపటికిఁ బ్రాణములు పోవచ్చును. యోగులు ఉచ్ఛ్వాసనిశ్వాసములు నిలిపి ప్రాణము వృద్ధిచేసికొందురు. తక్కినవారు నిలిపి ప్రాణములు తీసికొందురు." కనులుమూసి యిట్లు ధ్యానించుచున్న మంగమ్మకుత్తుకమీఁద నెవ్వరో నొక్కిపట్టి యామె యెదుఱొమ్ముమీఁదఁ గూర్చుండిరి. ఈ హఠాత్సంభవమున కామె మనస్సు చలించిపోయి, వెంటనే కాళులు చేతు లాడక, కన్నులుగూడఁ దెఱవలేకపోయెను. ఆమెగుండెలో నొక కత్తి దిగఁబడెను. నోటివెంట బిగ్గరగాఁ గేకరాకుండ కంఠము బిగియఁబట్టఁబడెను.

పురాకృతకర్మలేశముచేత నామెమనస్సు తాదృగవస్థయందుఁ గూడ నామె యధీనములోనికి వచ్చెను. అమె కనులు తెఱచెను. చెంగల్రావు ఱొమ్ముపైఁ గూర్చుండి గొంతు నొక్కిపట్టెను. ఆమె చేతితో నతనిని లెమ్మని సంజ్ఞ చేసెను. అతఁడు గొంతు నొక్కుట మానివేసెను.

మంగమ్మ—ఎందుకురా చంపెదవు? చెంగ—ఈ యాస్తి యంతయుఁ గాకులకు, గ్రద్దలకు నేల వేసితివి? నేను నిన్నినాళ్ళాశ్రయించియుంటిని. నాకీ వెధవకొంప యొక్కటియునా? మంగ—నే నాస్తి యిచ్చినచో నేమి చేసెదవు? చెంగ—నీ విన్నాళ్ళేమి చేసితివి? మంగమ్మకు మాటాడుశక్తి కొంచెముగాఁ దగ్గినది. బాధ

కూడ హెచ్చయ్యెను. మంగ—నా యాస్తియంతయు నందఱకు నిది వఱకే యిచ్చివేసితిని. ఇప్పుడు నన్నుఁ జంపినచో నీ కేమివచ్చును?

మంగమ్మ మాటాడుచు మధ్యమధ్య నేదో పెదవులుకదలించు కొనుచుండెను. చెంగ— నిన్నుఁ జంపెద నని రాధాపతికి నేను వా[illegible]చ్చితిని. మంగ—ఆయనకు నేను చేసిన ద్రోహ మేమిటి? నీకుఁ జేసిన ద్రోహ మేమిటి? చెంగ— ఆయన చదువుకొన్నవాఁడు. నీవు చెడిపోయినదానవు. ఆయన రమ్మన్నచో నీ వేల వెళ్ళలేదు? ఆయన నీమీఁదఁ గసి పట్టినాఁడు. మంగమ్మ వికారముగా నవ్వెను. చెంగ—నాకును నీమీఁదఁ గోరికగా నుండెను. నే నడుగుటకు నాకు భయమైనది. నీవు నన్ను స్వయంగ్రాహము చేసితివి కాదు. అందుకుఁ గూడ నిన్ను జంపుచున్నాను. మంగమ్మ మఱియొకవికృతహాసము చేసినది. ఆమె కన్ను లఱమూఁతలు పడెను. పెదవులు మాటిమాటికిని గదలించుచుండెను. చెంగ—నీకును కుమారస్వామికిని సంబంధ మని రాధాపతి నాతోఁ జెప్పెను. అతఁడు మీయిద్దఱిని గనులార చూచె నఁట. నీ వతని కంతయాస్తియిచ్చుటతో నది ఋజువైనది. నీవు బ్రదికినన్నినాళ్ళును పాపమే చేసితివి. నిన్నుఁ జంపవలయు నని నాకు మొదటినుండియు నున్నది. నిన్నుఁ జంపవలె నని నాకు సరదా పుట్టి నది. ఆ సరదా తీరుట కాఱేండ్లు పట్టినది,

మంగమ్మ మఱియొకవికృతహాసము చేసినది. ఆ హాసములో వికృతత్వము పోయి ప్రేతత్వము పట్టెను.

చెంగ - నేను పిచ్చివాఁడి ననుకొన్నారు. నే నాఁడంగిరేకల దనము సగ మభినయింతును. ఇంతపనికిఁ బ్రయోజన మేమిటి యని నీ వడుగవచ్చును. రాధాపతి కసిదీరుట ప్రయోజనము. మంగమ్మ నేత్రములు విప్పారెను. 'అదిగో దేవదాసి! అదుగో వేణుగోపాల స్వామి! వారిర్వురును గలిసి పోవుచున్నారు. నేను పోయి వారి పరి చర్య చేసెదను' అని యామె కనులుమూసికొనెను.

చెంగల్రావు కత్తితో మఱొకపోటు పొడిచెను. మంగమ్మ కత్తిదెబ్బ తాఁకిన చివరిస్మృతిలోఁ బెదవులమీఁద నొకమందహాసము చేసెను. వెనుకనుండివచ్చి తలుపు పగులఁగొట్టి పోలీసుఇన్స్పెక్టరు చెంగల్రావును బడఁగొట్టి వానిగుండెమీఁదఁ గూర్చుండెను. కుమార

స్వామి నిద్రలేచి జాము ప్రొద్దుండుట చూచి పొఱపాటున నిద్రపోతినే యనుకొని స్టేషనుకుఁబోయి యిన్స్పెక్టరును వెంటఁబెట్టుకొనివచ్చెను. అతని కిట్లు జరుగునని తెలియదు. ఏదో మనసునకు భయమై యిన్స్పెక్టరును బిలుచుకొనివచ్చినదానికి ఫలము కలిగెను. కుమారస్వామియు శ్యామలయు మంగమ్మమీఁదఁబడి యేడ్చిరి. నీ [illegible] జన్మము తీర్చుకొనలేమనిరి. ఎప్పుడో పాపము చేసితివి. పాపమునకుఁ బ్రాయశ్చిత్తము లేదు కాఁబోలు! దేని కదియే. పుణ్యము చేసినచోఁ బాపము పోదు. దాని కది యనుభవించవలయును గాఁబోలు ననిరి.

# ముప్పది రెండవ అధ్యాయము

'ఏకాదశినాఁడు చనిపోయినది, ఆమె కేమి? అదృష్టవంతు కాని, 'హత్యచేయఁబడినది.' 'హత్యాస్వరూపము మనకుఁ దెలియలేదుకదా! ఆమె శాంతముగానే చనిపోయియుండవచ్చును.' 'అంత మనోనియమము కల యామె శాంతముగానే చనిపోయి యుండును.'

కుమారస్వామి—అది యేమిటో! ఇప్పుడు తలఁచుకొన్నచో నప్పు డనుకొనినమాటలన్నియు జరిగినకథనే చెప్పుచున్న ట్లున్నవి. ప్రతిమాటయు నామె చనిపోవుననియే చెప్పెను. నేనే తెలిసికొన లేకపోతిని. ఆమెకుఁ జా వంత యథార్థముగా వ్రాయఁబడియున్నది గనుకనే నే నేకాదశినాఁడు పవలెల్ల నిద్రపోలేదు. నిద్రపోయినచో నా శారాత్రి యంత నిద్రరాదు. నేను పోయి గవాక్షముగుండ చూచెడివాఁడనే; ఆమె చచ్చిపోవుటయుఁ దటస్థించెడిది కాదు. ధర్మా - జరిగినదానికి మఱొకరీతిగానైనచో జరిగెడిదికాదని సృష్టి మొదలనుకొని జరుగుట యెప్పుడు జరిగినది? ఒకరీతిగా నిర్ణయింపఁ బడి యుండును. అట్లు సంకల్పము జరిగినది. అన్యథా సంకల్పము దానికి సంబంధించినది కాదు.

ఆనాఁడు ఆషాఢబహుళైకాదశి.. కుమారస్వామి మాసికము పెట్టెను.

ధర్మారావు—సీవైన నున్నావుగనుక పాప మా జీవి కిన్ని నీళ్ళు వదలుచున్నావు! కుమార—దయాధర్మభిక్షముగాఁ జేయుట లేదు కదా! ఆమె సొమ్ము తినుచున్నాను, చేయుచున్నాను. ధర్మా- కొడుకులుగూడ సొమ్ము తినియే చేయుదురు. కుమార—తండ్రి యాస్తి లేకుండఁ జేసినచో? ధర్మా—ఆస్తి లేకుండఁ జేయును గాని తనువులేకుండఁ జేయఁడు కదా! దానివెంటనే పేరుప్రతిష్ఠలు, మర్యాదయుఁ, బలుకుబడియు వచ్చును. తండ్రి కొడుకునకుఁ దన కున్న ధనముగాని దారిద్ర్యముగాని సంఘములోఁ దనకుఁగల మర్యాద పలుకుబడి సర్వము నిచ్చును. ఇవియన్నియు మన ముప

యోగించుకొందురు. కొందఱుమాత్రము తండ్రియొక్క యివి యన్నియుఁ గావలయు నఁటగాని, యతనికులనుమాత్రము వల దనుచున్నారు. లోకము దీనినే సంస్కార మందురు. ఇదియంతయుఁ బూర్వజన్మకృతకర్మానుసారము. కర్మ యొప్పుకొనినచో యు నొప్పుకొన వలయును. నీ వాకరీతిగా మంగమ్మకుఁ . పుత్రులుమాత్ర మూరకే చేయుచుండిరా?

బహుళ చతుర్దశినాఁ డరుంధతికి నెక్కువ చేసెను. ఆనాఁడు మంచములోనుండి యసలు లేవలేకపోయెను. అదివఱకు మందు పుచ్చుకొనుటకు లేచి కూర్చుండెడిది. దొడ్డిలోనికిఁ దీసికొనివెళ్ళుటకు వీలయ్యెడిది. ఆనాఁడు లేవలేకపోయెను; జ్వర మెక్కువ వచ్చెను. దగ్గెక్కు వయ్యెను. రాజశేఖరశాస్త్రిగారు వచ్చి చూచెను! 'వర్షాకాలము వచ్చినది. ఊరుచుట్టును మాగాని యగుట చేత దోమ లెక్కువ యైనవి. వెంటనే జలుబు చేయువచ్చును. ఉన్నది యుండఁగా నేదైన క్రొత్తవ్యాధి వెంటఁబడకుండఁ జూచుకొనవలయును. ఊపిరితిత్తులు జాగ్రత్తగా రక్షించుకొనవలయు' నని చెప్పెను.

ధర్మారావు - అవునండీ! నేను మాటాడవలదన్నచో నది యూరకుండదు. నే నేమి చేయవలయును? రాజశేఖరశాస్త్రి—ఈ వ్యాధియంతయుఁ జేతులారఁ జేసికొన్నదే. దేవుని కల్యాణమహోత్సవములే మొదలు. ధర్మా—ఆ పదిరోజులు నిద్ర పోలేదు. అన్నము తినలేదు. ఇంటినిండ బంధువు లుండి రాయెను. కా దనుటకును వీలులేకపోయినది. రాజశేఖ—శరీర మున్నఁగదా, ధర్మమాచరించుట! సర్వథా శరీరమే రక్షించుకొనవలయును. శరీరము పోయినతరువాత నే మున్నదండీ! అరుం—ఇంటినిండ బంధువు లుండి రాయెను. నాకు జబ్బుగా నున్నదని వంకపెట్టుకొని నేను కూర్చుండనా? ధర్మా—నిజముగా జబ్బుగా నున్న దాయెను. వంక యేమున్నది? కొందఱుఁ జక్కఁగాఁ దమదేహరక్షఁ దాము చేసికొనుట చేతనగును. నీ వేమో సర్వకాలసర్వావస్థలయందును బని చేయలసినదే నాయెను. ఇప్పు డిట్లు మునిఁగినది. దీని కేమి చేయ

వలయును? అరుం—ఏమి చేయవలయును? ఆయుర్దాయమున్నచో బ్రదికెదను. లేనిచో సరే! యెంతమంది లేరు.

రాజశేఖరశాస్త్రిగారు 'జాగ్రత్తగా నుండవలయు' నని చెప్పి పో[illegible] ఏదో తైలమిచ్చి మాటిమాటికి గుండెమీఁద రాయు [illegible]ఁడు ప్రొద్దుక్రుంకినది. రాత్రి పదిగంటలకు జ్వరము తగ్గినది. అ[illegible]ంధతియొడ లంతయుఁ జెమటపోసెను. ఆమె ధర్మారావును బిలిచి 'జ్వరము జాఱినది. పైనున్న సేలువ దీసివేయుఁ' డనెను. అతఁడు సేలువ తీసివేసి చెమ్మటయంతయుఁ దుడిచెను.

అరుం—నేను మీకుఁ బరిచర్యచేయవలసినది పోయి మీరు నాకుజేయుటకాడికి వచ్చినది. ధర్మా—ఈ ధర్మము పరస్పరమైనది కాని, పురుషుని యం దధికత కలదికాదు. నేను రాజునైనచో నీవు నాకు రాణివి.

అమావాస్య వచ్చెను. అరుంధతి ప్రొద్దుననే మేల్కొని రామేశ్వరశాస్త్రిని జూచి "నాయనా! మీ నాన్న నిట్లు రమ్మను" అనెను. ధర్మారావు వచ్చెను. అరు—నేను మొగము కడుగుకొనవలయునా? ధర్మా—అక్కఱలేదు. నీళ్లు పుక్కిలించి యుమియుము. ఏమి తినుచున్నావుగనక మొగము కడుగుకొనవలయును? అరుం—నాకు నోరసహ్యముగా నున్నది. ధర్మా—అక్కయ్యపళ్ళెముపట్టును. దానిలోఁ గడుగుకొనవచ్చును. అరుం—చివరకు నాస్థితి యిట్లు వచ్చిన దేమి? ధర్మా—నీవును నేనును జేసికొన్న కర్మ. అరుం—మీ కేమి! మహారాజులు! ధర్మా—అనఁగా? అరుం—నేను పోయినచో మఱొకర్తుకను జేసికొందురు. ధర్మా—నేనా? నీతోఁ జనిపోకపోయినచో నట్లే చేసికొందును. అరుం—ఏమియుఁ జనిపోరు. చనిపోవుట మనవశములో నున్నదా? ధర్మా—ఎందుకుఁ గన్నీళ్ళు పెట్టుకొనెదవు? నయ మగునులే. రాజశేఖరశాస్త్రిగారు మహావైద్యుఁడు. రంగారావుగారికిఁ జూడు మెంతవ్యాధి నెమ్మదింపఁజేసెనో! రంగారావుగా రిప్పుడు లేచి యింటిలోఁ దిరుగుచున్నారఁట! అరుం—నావ్యాధి నెమ్మదించునది కాదని నాకుఁ దెలియును. నాకు మఱదలు చెప్పనే చెప్పినది. ధర్మా—ఎవరు? గిరికయా? ఏమని చెప్పినది? అరుం—తనకు నాకు మూఁడునెలలు వారడియఁట!

ధర్మా — వయసులో! అరుం — ఆమె యామాట యనలేదు.
ధర్మా - మంచములోఁ బండుకొని వెఱ్ఱిమొఱ్ఱిమాట లనకుము.

తన ప్రక్కలోఁ గూర్చున్న భర్తమీఁదఁ జేయివైచి యరుంధతి 'మీకు నామీఁద నింకను నాశ యున్నది. మీరు, వృథాశ లేల పెంచుకొందురు? మిమ్ము మొదట నొల్లనిదియు నే[illegible] వదలిపెట్టిపోవుచున్నదియు నేనే. మీరు నాయందు మొ[illegible]ండి చివరిదాఁక నొక్కటే రీతిగా నున్నారు' అనెను. ధర్మా—నీప్రేమ యున్నాళ్ళు నేను చూఁడఁగొన్నాను. నేను నీవలన బ్రహ్మానందము పొందినాను. నేను నిన్ను వదలి యుండలేను.

అని యతఁడరుంధతిగొమ్ముపై నాని దుఃఖించెను. అరుంధతి—తనచిక్కిపోయిన రెండుచేతు లాతనిచెక్కిళ్లపై నుంచి యెందు కేడ్చెదరు? నేను బ్రదుకననివైద్యుఁడు చెప్పినాఁడా? యనెను. నాకుభయము లే దనుకొందును. వెనుక నెవరో జ్యోతిష్కుఁడు మీకింకను సంతానప్రాప్తి యున్న దని చెప్పలేదా? అనెను. ధర్మా - అవును. కాని యూరకే దుఃఖము వచ్చినది, నీవు చనిపోవు. అరుం - నేను చనిపోను. మిమ్ము వదలిపెట్టి చనిపోలేను. చనిపోయినచో నే నెట్లుండగలను? నే నుండలేను. ధర్మా—నీ వుండలేవు, నే నుండలేను. అందుచేతఁ జనిపో వనియే నాయంతరాత్మ చెప్పుచున్నది.

అరుంధతి తేజస్సులేని నవ్వొకఁడు నవ్వి భర్తచేతిలోఁ దన చేయి వైచెను.

శ్రావణశుద్ధ పాడ్యమి వచ్చినది. మేఘములు దట్టమై నాల్గుదెసలు గ్రమ్మెను. ఈదురుగాలి వీచెను. పట్టణములో మిగిలిన చెట్లు గాలి కావేశమెక్కినట్లు తెగనూఁగిపోయెను. వర్షములు దిక్కులు మార్చి మార్చి జల్లులుగాఁ బడెను. అరుంధతిని గదిలోఁ బరుండబెట్టి శైత్యము సగులకుండ సేలువలుకప్పి పండుకొనఁబెట్టిరి. ధర్మారావు చలివేయుచున్నదా యని యడిగెను.

అరుం - మీ రెప్పుడును వాకిటిలోననే వారితో వీరితో మాటాడుచుఁ గూరుచుందురు. ఎప్పుడో నూటికొకసారివచ్చి నన్నుఁ బరామర్శించిపోదురు. ధర్మా - నీకుఁ జలివేయుటలేదుకదా! అరుం— నేను చెప్పను పొండి. ధర్మారావు ప్రక్కను గూర్చుండి, యామె

చెక్కిళ్ళపైఁ జేయివైచి 'యింత కోప మెందుకు? ఎప్పుడు నిచటఁ గూర్చున్నచో నాకుఁ దోఁచదు' అనెను.

అరుం-సరిగా నున్నప్పుడుమాత్రము మీ రింటిలో నున్నారా? ఎప్పుడు నూరుపట్టుకొనియే వ్రేలాడితిరి. ఎప్పుడును మీ రని నేను [illegible]యేకాని మీరు, మీ స్నేహితులే కలిసి తిరుగుచుండిరి. ధర్మా[illegible]అయినచో నీమీఁద నాకుఁ బ్రేమ లే దందువా?

ఆప్రశ్న వేసినపుడు ధర్మారావుగొంతుకయు, ముఖలక్షణములును ప్రార్థనాదీనములై యుండెను. అరుంధతి "లే దనలేదు. మీరు సదా - ఎల్లప్పుడు నావద్ద నుండవలయును" అనెను. 'అట్లే యుందు' నని ధర్మారావు తనచేయి యామె యెదురొమ్మునపై వైచెను. ఒకనాఁడు పరిపుష్టమై తనమనోరథ మాకారముపొందెనా యన్నట్లున్న యావక్షము నేఁడు శుష్కమై, వ్యాధిదేవత కాస్థానపీఠమువలె నుండెను. ధర్మారావు చిక్కి బొమికలుమాత్రమేయున్న యా యెదురొమ్మునందే హస్తస్పర్శచేత నొక యానందరేఖావిశేష మనుభవించెను. ఆ యానందములో దుఃఖమునుగూడ నున్నది. అరుంధతి 'నా వద్దఁ బండుకొనుఁ' డనెను. అతఁడు పండుకొని యామెపైఁ జేయి వైచెను. ఆమె 'చేయి నాకు బరువుగా నున్నది, తీసివేయుఁ' డనెను.

ధర్మా-ఈవ్యాధి నాకు రారాదా? నీ కేల వచ్చినది? అరుంధతి చేతితో నతనినోరు మూసినది! అతఁ డామెచేతిపైఁ దనచేయి వైచి యామె హస్తము యొక్క రెండువైపుల నొకసారిగా ననుభవించెను.

అరు - మీ కేమో అంతవాంఛ యున్నది. నే నేమో మీనుంచి రోజరోజునకు దూరము పోవుచున్నాను. ధర్మా - నీ వటువంటి మాట లనకుము. నాగుండె చెఱువై పోవుచున్నది. వారు సబాష్పనేత్రులై యొకరినొకరు నిశ్చలముగా నెత్తినతెప్ప వాల్చకుండఁ జూచుకొన్నారు. బయట గాలి హోరున వీచుచున్నది. కిటికీ తలుపులు బిద్దెగుచున్నవి. ఇదియునాఁ డరుంధతి 'నన్నింకెవరికైన వైద్యునకుఁ జూపించరాదా' యనెను. ధర్మారావు 'శాస్త్రిగారికన్న ఘనవైద్యుఁడు లేఁడు. డాక్టరులకు ధనము పోయవలయును' అనెను.

అరుం - ఈ చంద్రహారము నేను చనిపోయినతరువాత నేమి చేసెదరు? రుక్మిణమ్మారావుగారు దీని నా కిచ్చినది. దీని నమ్మి నాకు వైద్యము చేయించుఁడు. ధర్మా - రాజశేఖరశాస్త్రిగారికిఁ గోపము వచ్చునేమో! ఈ వైద్యుల కీ పట్టింపు లెక్కువ [illegible] డాక్టర్లకు మఱియును. అరుంధతి - ఆయనతోఁ జెప్పి యూ[illegible] కొనిననే చేయవచ్చును. నాంచారమ్మ- చెప్పియే చేయ[illegible]ను. అయినను దెలుఁగువైద్యులతో నంత బాధ లేదు. మాయూరిలో నీలాగే, ఒకాయనకుఁ బట్టరానంతకోపము వచ్చినది. మన కేమో యాదుర్దా యెక్కువ. ప్రాణముతో గురించిన వ్యవహారములలో వీరికిఁ బట్టింపు లెందులకో తెలియదు.

నాఁటిసాయంకాలము రాజశేఖరశాస్త్రిగారితో ధర్మారా వీ సంగతి ముచ్చటించెను. శాస్త్రిగారు 'బాబూ! చూపించుఁడు. నేను వలదందునా? ఎవరి 'హస్తవాసి' యెటువంటిదో! నేనుకూడ వచ్చి చూచిపోవుచునే యుందు' ననియెను. ధర్మారావు చంద్రహారమును దీసికొనిపోయి యమ్మెను. ఐదువందలహారమున కాఱువందలు వచ్చెను. ఇంటికి వచ్చి భార్యకుఁ జూపించెను.

అరుం - పదునాఱేఁడులు పెట్టుకొనినతరువాతఁగూడ నింత ధనము వచ్చెనే? ఎన్నినవసరసులు తూఁగినది? ధర్మా - ముప్పది రెండునవరసులు తూఁగినది. నవరసు ధర యెక్కువైనదిగనుక నింత ధనము వచ్చినది. అరుం - ఇది మొదలు. ధర్మా - దేనికి? అరుం- నాకు సంబంధించినది నశించిపోవుట కారంభించినది. ధర్మా- ఇందు కనియేనా నన్నమ్ముకొని రమ్మని వేధించితివి? అరుం - పెద్ద డాక్టరును దీసికొని రావలసినది. ధర్మా- ఆయన వచ్చునో, రాఁడో! అరుం - డబ్బున్నది గదా! ధర్మా - వాండ్రిముందర యిది యెంత డబ్బు? వారు వేలకువేలు మ్రింగుదురు. జీతము వేయియో రెండు వేలో యుండును. ప్రతి నెలయు దానికి మూఁడురెట్లు కనులఁ జూడ వలయును. అరుం - ఇది మన యవసరము. ధర్మా - వారికిని నది యవసరమే. మహానైవేద్యము జీతము. ఇవి యన్నియు నవసరనైవేద్యములు. అరుం - నేను చచ్చిపోయినతరువాతగూడ మీ రింత యుత్సాహముగానే మాటాడెదరా? ధర్మారావు 'ఇది యుత్సాహ

ము కాదు. నీ విట్లుండగా నా కేమి యుత్సాహము? అనెను. నాఁటి సాయంకాలమున ధర్మారావు డాక్టరుకొఱకుఁ బోయెను. అరుంధతి క్రొత్తవైద్యుఁడు వచ్చి నన్ను యుత్సాహముచేతఁ గొంచెము బిగ్గరగా మాటాడుటయు, లేనిశక్తి నభినయించుటయుఁ జేసెను.

మఱునాఁడు మధ్యాహ్నము పెద్దడాక్టరు వచ్చెను. చూచెను. ఊపిరితిత్తులు పరిశీలించెను. చివరకు "లాభములేదండీ. ఒక 'లంగ్' చెడిపోయినది. దానిని బూర్తిగాఁ దీసివేసినచో రెండవదాని కపాయము రాకపోవచ్చును" అనెను. ధర్మారావు 'సరే' యనెను. ఆయన వారమురోజులకు మందిచ్చి 'యీవ్యాధులకు నౌషధముకన్న మంచిగాలియు, వేళానియమము నుండవలయును. ఇచ్చటకన్న నేదైన బల్లెటూరిలోఁ బెట్టరాదా?' యనెను. ధర్మారావు మాటాడలేదు. వైద్యుఁడు సాయంకాలమున వెడలిపోయెను. రెండువందలరూపాయలు తీసికొనిపోయెను. రాజశేఖరశాస్త్రిగారు వచ్చిరి. అరుంధతి 'అయ్యా! వారిమందును మీమందును గలిపి పుచ్చుకొమ్మందురా?' అనెను. రాజ - పుచ్చుకొనవచ్చును. కాని వారికిఁ గోపమువచ్చునేమో? ధర్మా - వారికిఁ జెప్పుముకదా! రాజ - మీకుఁ గుదురుట మాకుఁ గావలసినది. ఏ మందైన నేమి?

ఆనాఁడు సాయంకాలమున ధర్మారావు జ్యోతిష్కు నొకనిని బిలిచి యరుంధతి జాతకము చూపించెను. ఆయన కుజ రాహు శని కేతువులు జబ్బుగా నున్నారనియు, వారికి జపములు చేయించినచో బాగుగా నుండుననియుఁ జెప్పెను. ధర్మా - సూర్యనమస్కారములు కూడఁ జేయించుమందురా? ఆయన 'ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్తన్నారు. అది మంచి'దనెను. ధర్మారావు గ్రహజపములు చేయుటకును, సూర్యనమస్కారములుకూడఁ జేయుటకును బ్రాహ్మణులను నియమించెను. వారు పంచమినాఁడు వచ్చి మొదలుపెట్టుదు మనిరి.

కుమారస్వామి రాజశేఖరశాస్త్రిగారియింటికిఁబోయి. 'ఏమండీ, ధర్మారావుగారిభార్యకు నెమ్మదించునా?' యనెను. శాస్త్రిగారు 'నాయనా! యేమియు లాభము లేదు. ఆ పిచ్చి బ్రాహ్మణుఁడు మాత్ర మాశలు పెంచుకొన్నాఁడు. వృథాగా ధనవ్యయము చేసికొనుచున్నాఁడు. అవునులే, ఆయన కున్న యుద్వేగము మన కెందు

కుండును? అట్లు ఖర్చుపెట్టినచోఁగాని యాయనకు మనశ్శాంతి కుదురదు. అయినను ప్రాణములున్నంతవఱకు మందులు వాడుచునే యుండవలయును. ఏ నిముస మెట్టిదో మన కేమి తెలియు' ననెను. కుమార—అయినచో లాభము లేదందురా? శాస్త్రి—ట చెప్పుటకు మన మెవ్వరము? కాని లక్షణములనుబట్టి నట్లే చెప్పవలయును. కుమార—ఆయన యంత యాపద గిన వాఁడు కాదండీ! అంతటి మహాపురుషున కీ దురవస్థ యేమిటి? శాస్త్రి—నాయనా! ధర్మారావుగారు సత్పురుషుఁడే, ఉదారుఁడే! శ్రీరామచంద్రునికన్న ఎక్కువవాఁడా?

తదియనాఁడు రాజశేఖరశాస్త్రిగారి మందు పుచ్చుకొనలేను. చవితినాఁటి కరుంధతి కా వెనుకటిదినమున నున్న యోపికకూడ లేకపోయెను.

ధర్మా—శాస్త్రిగారి మందే మంచిది. ఆ యౌషధము లోకవైపున వ్యాధిని నిర్మూలించుచు మఱియొకవైపున దేహమునకుఁ బుష్టి కలిగించుచు. ఈమందు లట్లు కాదు. దేని కదియే. ఇదియంతయు వర్తకపురీతి. శిల్పమువలెఁ గాదు. అరుం—మీరు నాజబ్బుమాట విచారించక శిల్పములని, వర్తకములని చెప్పెఁదు. నేను చచ్చిపోవుచున్నాను. మీ కిది యేమియుఁ బట్టలేదు" అని యేడ్వ నారంభించెను. నాంచారమ్మ "అది యేమిటే పిచ్చిదానా? వాఁడు పడుచున్న మనోవేదన నీవుమాత్రము చూచుటలేదా? వాఁడు పంచప్రాణములు నీమీఁదనే పెట్టుకొనియున్నాఁ' డనెను. ధర్మారావు 'దాని కేమియుఁ దోఁచక యట్లనుచున్నది. అననీయవే. నే నేమి యీవ్యాధి జేతితోఁ దీసివేయలేనుగదా! ఏమిచేయుమందువు? నీతోఁబాటు నన్నుఁగూడ రమ్మన్నచో సిద్ధముగ నున్నాను' అనెను. అరుంధతి దుఃఖము మాని 'మందు పుచ్చుకొను వేళయైనది. ఇప్పించుఁ'డనెను. సాయంకాలమున ధర్మారావు దేవాలయములకుఁ బోయెను. రామేశ్వరశాస్త్రి తల్లివద్దఁ గూర్చుండెను. ఆమె కొడుకును దగ్గఱకుఁ దీసికొని, 'తండ్రీ! నీవు వట్టి పిచ్చివాఁడవు. నీకుఁ జదువు సంధ్య లేదు. నాతరువాత నీపని యేమగునో?' యని దుఃఖించెను. శాస్త్రి 'అమ్మా! పెద్ద డాక్టరు వచ్చెనుగదా!

నీ కింక భయము లే' దనెను. అరుం—నాయనా! మీ తండ్రి యెంతసంసారలంపటులో యంతవిరాగులుగూడను? నీ చదు వేమగునో, సంధ్యయేమగునో? తండ్రీ! నే నేమి చేయుదునురా?' నాంచారమ్మ [illegible]చ్చి 'అయ్యో! పిచ్చిదానా? పసివాని నట్లేడిపించుకొం [illegible]నికి గుండె చెరువై పోదా! అవి పిల్లవాని బయటికిఁ బం[illegible]తా నామెవద్దఁ గూర్చుండెను. ఆ రాత్రి ప్రొద్దుపోయి యందఱు నిద్రించుచుండిరి. అరుంధతికి నిద్ర లేదు. ధర్మారా వామెను గన్నులతోఁ గాచుచుండెను. అరుం—నిద్రపోవుచున్నారా? ధర్మా—లేదు. అరుం—ఇట్లు వచ్చి నా మంచముమీఁదఁ గూర్చుండుఁడు. ధర్మారావు పోయి కూర్చుండెను. అరుంధతి కుడిచేయి యతనిమీఁద వైచి 'యిందాఁక నే నన్నమాటకుఁ గోపము వచ్చినదా?' యనెను. ధర్మారావు "చీచీ, కోపము లేదు, గీపము లేదు. అయినను నీ వేమన్నావు? ఆమాటకుఁ గోప మెందుకు రావలయును?' అనెను.

అరుం—మీ రింత మంచివారు గనుకనే మిమ్మందఱు భగవంతుఁడుగా నారాధించుచున్నారు. ధర్మా—నిద్రపో! ఊరకే యాలోచించకుము.

పంచమినాఁడు హైమవతీసూర్యనారాయణులువచ్చిరి. హైమవతి యరుంధతిని గౌఁగిలించుకొని, "అమ్మా, తల్లీ! నీ కెంతవ్యాధి వచ్చినదే! మా నాన్నగా రెంతబ్రదికినను చివరకుఁ గోడుకునకు సెంటుభూమి లేకుండఁ జేసిపోయినాఁడు. అట్లే ప్రయోజకుఁడై మా ధర్మ బ్రదుకుచున్నాఁడు. వాని బ్రదుకు వాఁడు బ్రదుకుచున్నాఁడనుకొనఁగా దైవము వాని కిట్లు చేసె నేమి? కల్యాణములైన వెంటనే నిన్న వదలిపోయితిని. చూడు" అని దుఃఖించ నారంభించెను. నాంచారమ్మ 'ఏమే అక్కయ్మా! అది యిదివరకే పేదగుండె పడినది. నీవు దానిని మఱియు నేడిపించు' మనెను.

ధర్మా—మన యిండ్లవద్ద నున్నచో నింతే. ఆసుపత్రులలో నైనచో వారు రోగిని నుత్సాహముగా నట్టెపెట్టుదురు. అరుం—అది పేరేకాని నలువురుబంధువులు వచ్చుచుఁబోవుచున్ననే రోగికి సుఖముగానుండును. బంధువులను జూచుచుంటె మనస్సు తృప్తి యుండును. ఆసుపత్రిలలోఁబడి మాట్లాడు దిక్కులేక మనలులోనే దిగులుపడి

చావవలయును. ధర్మా—నీవు మాట్లాడుట తగ్గించవు. నే నేమి చేయుదును? అరు - బ్రదికి యుండఁగాఁ గూడ మాటాడనీయరా? ధర్మారావు వాకిటిలోనికిఁ బోయెను. నాంచా - దానికి బక్కకోప మెక్కువైనది. హైమ - అవునే తల్లీ! అంతవ్యాధిలో నది [illegible] నీరీతిగా నైన నున్నది. సూర్య - ఇంటిలో నేమైన జపము[illegible] చున్నారా? అరుం-అవును, గ్రహము లేవో చాలవఁట. అ[illegible]య్యా! వారి పిచ్చికాని జపములు చేయించినచో మాత్రము నేను బ్రదుకుదునా? హైమ - అమ్మాయీ! నీ భర్త యేఁడే? నాంచా - వారు కూడ జపము చేయుచున్నారు. హైమ - ఏ దేవునికైనను దయ రావలయునుగదా! తిరుపతి వేంకటేశ్వరులకు మ్రొక్కుకొన్నారా? నాంచా - మ్రొక్కుకొన్నాము. హైమ—అమ్మ యేది? నాంచా—ఆమె మంచము దక్షిణపువైపువసారాలో నున్నది. ఆమె కూర్చుండ లేదు, లేవ లేదు. నీవు కల్యాణములలోఁ జూచియే పోతివి గా! అరుంధతి మంచానఁబడినప్పటినుండియు నామె కంతకన్న నెక్కువైనది. ఆ వేళకు లేచి నాల్గుమెతుకులు తినును. తరువాత మంచములో నట్లే పడియుండును. హైమ- ఇదియంతయు వానికంఠమునకు వచ్చినది. నా తమ్మునికన్న నదృష్టజాతకుఁడు లేఁ డనుకొన్నాను? ఇప్పు డిట్లు వచ్చినది!

షష్ఠినాఁడు సూర్యనారాయణగారు ప్రొద్దుననే లేచి, యరుంధతికి మొగము కడిగించి, ప్రక్కదులిపి క్రొత్తది వేసి, మందిచ్చి, యామెవద్దఁ గూర్చుండెను. ధర్మారావువచ్చి చూచి "యింక నేమి! ఇంక నే నక్కఱలేదుగదా! ప్రతిదినము 'నావద్దఁ గూర్చుండుఁడు. నావద్దఁ గూర్చుండుఁ' డని చంపునయ్యా! చిన్నబావ భోజనమునకుమాత్రము వచ్చును. తక్కినప్పుడు వారివారియిండ్లలోఁ బండుకొనును. నీవు వచ్చినావు. బ్రదికిపోయినాను" అనెను.

అరు—ఎట్లైనను మనకుఁ బని తప్పనఁ జాలును? ధర్మా—నేను పరిచర్యచేయుట నీ కిష్టములేదుకదే! అరుం—పైకి నే నట్లంటినిగాని మీరు చేయవలయు నని యున్నది' అని నవ్వెను. ఆనవ్వు మొగములోఁ గండలులేక నవ్వుగా నే కనిపించ లేను. సూర్య—ఏమి నవ్వురా! దానియొడలిలో శక్తియే లేదు. నెత్తురు, మాంసము,

కండలు నన్నియు హరించిపోయెను. ధర్మా—ఏమి చేయవలయును? అరుం—నేను బ్రదికియున్నచో నన్నయ్యఋణము తీర్చుకొందును. సూర్య—అమ్మా! నేను నిన్నసాయంకాలము నేఁటిప్రొద్దున [illegible] నీ పని చూచుచుంటిని. నే నింతవఱకుఁ జేసిన దేమియు [illegible] బ్రదికినచో నంతియే చాలును. నా కేమియుఁ జేయ నక్క[illegible]ను. ధర్మా—మూఁడునెలలనుండి నేను చేసినదంతయు జమలోనికి రాలేదు. నీవు నిన్న వచ్చితివో లేదో యిప్పుడే దాని కెంత యభిమానమో చూడుము. ఏలాగైనను మీరును మీరు నొకటి. అరుం—అవును. మీరే పరాయివారు. సాయంకాలమున సూర్యనారాయణ బజారునకుఁ బోయెను. ధర్మారావు లోనికి వచ్చెను. అరుంధతి 'వచ్చి కూర్చుండుఁ' డనెను. ధర్మారావు 'నేను పరాయివాఁడనుగదా!' అని వెళ్ళి కూర్చుండెను. అరుం—నవ్వుచు నన్నమాటకుఁగూడ గోప మెందుకు? ధర్మా—ఇందాఁక నిజముగానే యన్నావు. ఇప్పుడు నవ్వు అనుచున్నావు.

అరుంధతి చిక్కిపోయిన కనులతో, తేజస్సుమాత్రము మిగిలిన కనులతో ధర్మారావువంక నూఁడులు చూచెను. అతఁడు నవ్వి 'నవ్వులకన్నదానికి నాకేకదా కోపము వచ్చునది! మఱి నీకుఁగూడ నేల వచ్చినది?' యనెను

అరుం- నాకీ నాఁడు కొంచెము నెమ్మదిగా నున్న ట్లున్నది. ధర్మా—ఒకరో జట్లుండును, ఒకరో జిట్లుండును. ఇది దొంగవ్యాధి. అరుం- అట్లే యన్నారు. నిన్న వారి విశాలాక్షమ్మ వచ్చెను. ఆమె చెప్పినది. ఈ వ్యాధికి మాటాడుచు మాటాడుచునే పోదురఁట. ధర్మా- ఛీ ఛీ, యూరకుండుము. అరుం- పిల్లవాఁ డెచ్చటి కేగెను? నేను పోయినతరువాత వానిని సరిగాఁ జూతురా? ధర్మా- నన్ను లేచిపొమ్మందువా? అరుం- మీ యుద్దేశము నే నింకను బ్రదుకుదు ననియా? ధర్మా- బ్రదుకదు వనియే కాదు. అరుం- మఱియు నింక నేమని? ధర్మా- మఱిఁ గ్రొత్త పెండ్లికూఁతురవు, నీవు నాకు దక్కుదు వని.

సప్తమినాఁడు వర్షములు విజృంభించెను. గాలిదారులన్నియు పర్జన్యవేగపూర్ణములై తుషారగిర్యగ్రభాగమైన ట్లయ్యెను.

మడిబట్ట లెండలేదు. మండుచున్న ప్రొయ్యిలవద్ద నెండవేసిన తడి పొడిగుడ్డలు కట్టుకొని బ్రాహ్మణులు జపములు చేయుచుండిరి. సాయంకాలమున వాహ్యాళిపోవుటతప్ప సూర్యనారాయణయే యరుంధతికి సర్వవిధముల నుపచారము చేయుచుండెను. ఆమె ...న్నా! నీవు నే నొకకడుపుననైనఁ బుట్టితిమి కాదు. నాకుఁ ... యుండియు లేకయే పోయెను. నీవే నాకుఁ బుట్టిల్లు వైతి...ను



ఆనాఁ డరుంధతి మఱియు లేవలేకపోయెను. సూర్యనారాయణ మందిచ్చెను. ఆమె ప్రతిదినమును బత్తాయికాయలో నాలుగైదు తొనలు తినుచుండెను. ఆ నాఁ డొక్కటియు సయించలేదు. తొన నోటిలో వేసికొనినంతనే డోకువచ్చెను. అంతలో దగ్గు వచ్చెను. దగ్గిదగ్గి యెంతసేపటికిని గళ్ళెపడకయాయాసపడుచుండెను. సూర్యనారాయణ యామె నానుకొని కూర్చుండెను. ధర్మారావు వచ్చి యెదురుగా నిలుచుండెను. కొంతసేపటి కరుంధతి యాయాస మణఁచుకొని మాటలఁ బలుకన్నది. ఆమె మొగమంతయు కందగడ్డ మైపోయెను. ఆమె కన్నులలో నీరు నిలిచెను. సూర్యనారాయణ యామె కన్నీరు తుడిచి, గుండెలమీఁద నెమ్మదిగాఁ జేతితో రాచి ధర్మారావువంకఁ జూచెను. అతఁడు ప్రాణములులేని కట్టెవలె నిలుచుండెను. ఆతనికన్నులవెంట నీరు గారుచుండెను. సూర్యనారాయణ 'యెందుకురా, యిట్లు దిగులుపడెదవు? దగ్గువచ్చినచో గాబరా పడరా?' యనెను. ధర్మారావు 'బావా! అది యింకను బ్రదుకునందువా?' అనెను. అరుంధతి యర్ధనిమీలితాక్షులతో ధర్మారావు వంకఁ జూచి చేతితో దనవద్దఁ గూర్చుండుము అని సంజ్ఞచేసెను. అతఁడు పోయి కూర్చుండి, యూరకే వెక్కి వెక్కి యేడ్వ నారంభించెను. అరుంధతి యతనివంక పట్టి కన్నులతోఁ జూచుచుండెను. ఆమె కేడ్చుటకుఁగూడ నోపిక లేకపోయెను. సూర్యనారాయణ 'ఛీ ఛీ, యూరకుండుము. దానికిప్పుడు వచ్చిన యాపద యేమి? నీవు కూర్చుండి యిట్లు దుఃఖపడినచో దానిమన సెంత క్షోభించును? చాలులే, నీ వేమో ప్రయోజకుఁడ నని యందఱు చెప్పుచున్నారు. ఇంత పిఱికిగుండె వాఁడ వేమి?' అని యూదార్పువంటి చీవాట్లు పెట్టెను. ధర్మారావు కన్నీరు తుడుచుకొని

లేవఁబోయెను. అరుంధతి యతనిచేయి వదలలేదు. సూర్యనారాయణ యేదో పనిమీఁద నింటిలోనికిఁ బోయెను. అరుంధతి రెండుచేతులు తన రెండుచేతులతో బుచ్చుకొని, తన యెదుఱొమ్ముమీఁద నాను[illegible]న్నట్లు లాగెను. ఆతఁడట్లే యానుకొని 'యేమిటి' యనెను. అ[illegible]మియులే' దని యతని రెండుచెంపలు రెండుచేతులతో నిమి[illegible]ధర్మారావు భార్యశరీరము చూచెను. బట్టగప్పినచో మొగము మాత్రముకనిపించి, దివ్యజ్యోతిస్సు లొరలుచున్న యాకన్నులు మాత్రమే బ్రదికియున్న ట్లనిపించుచుండెను.

సూర్యనారాయణ యేదోపనియుండి ప్రొద్దుననే రంగాపురము పోయెను. ధర్మారావు భార్యను లేవఁదీసి కాల్యకృత్యములు, మందిచ్చుట, దులిపి ప్రక్కవేయుట యివి తానే చేయవలసివచ్చెను. మఱలఁ బండుకొనఁబెట్టిన తరువాత నరుంధతి కఱగంటనేపటివఱకుఁ బ్రాణము స్థాయికి రాలేదు. ఆమె మందుపుచ్చుకొని, రెండుబత్తాయి తొనలు, నొక్క యనాసతొనయుఁ దిని 'నేఁడు నాదేహములో బాగుగా నున్నది' యనెను. ధర్మారావు నవ్వెను.

అరుం—ఎందుకు నవ్వెదరు? ధర్మా—మధ్యమధ్య నిట్లనిపించుచుండును. అరుం—వ్యాధి నెమ్మదించుచున్న దందురా, లేదందురా? మఱలఁ బెద్దడాక్టరు రాలేదేమి? ధర్మా—తదియనాఁడు వచ్చెను గదా! మఱల దశమినాఁడు వచ్చును. అరుం—ఇన్ని నెలలు మందిచ్చిన రాజశేఖరశాస్త్రిగారి కేమియు లేదు. డాక్టరు కొక్కదినములో రెండువంద లిచ్చిరి. ధర్మా—అది యొకరియదృష్టము. మహాపండితులైనను వేదశాస్త్రజ్ఞులకు యాచ్ఞయే వృత్తి. అరుం—రంగాపురముపోయి మీరునాపెట్టె దీసికొనిరారా? అందులో రంగాజమ్మగారు పెట్టిన చీర యున్నది. నేను చనిపోకముం దొక్కసారి యాచీరఁ గట్టుకొనవలయును. ధర్మా—ఆలాగే ఱేపు పోయి తీసుకొని వచ్చెదను. అరు—ఱేపు ఱేపుతోఁ బదునాఱేండ్లు గడచినవి. ఇంక నన్నిరోజులుగూడ నున్నవో లేవో! ధర్మారావులేచి పోఁబోయెను. అరుం—ఎచ్చటి బోఁ బోవుచున్నారు? కొంచెము కూర్చుండ రాదా? ధర్మా—కూర్చుండి యేమిచేయు మందువు? అరుం—నేనిట్లున్నానని మీకు లేదు. ఏమి చేయుదురు? ధర్మా-

నీకుఁ జేయవలసిన యుపచారమంతయు జేసితిగదా! అరుం-అవును. పాపము. చేసితిరి. నాగతి యిట్లున్నది. మీచేతఁ జేయించుకొను చుంటిని. బ్రదికి యున్నచో నీ ఋణము తీర్చుకొందును. ధర్మా—ఎట్లు తీర్చుకొందువు, మనుపటికన్న నెక్కువగానా ?

అరుంధతి తనచేయి భర్తతొడమీఁద వేసెను. [illegible] వింతశుష్కించి యుంటివి. అట్టి స్థితిలోఁగూడ నీ చేయి[illegible]తనే నా యొడలు పులకరించుచున్నది. నే నెంత దుష్టుఁడనో చూడుము!' అనెను.

అరుం—మీరా, దుష్టులా? నాకుఁ జెడ్డరోజుగాని మీరు దుష్టులుకారు. ధర్మా—నీ సర్వస్పృష్టియు నా దేహముతోఁ బ్రత్యణువు నందు లీనమై యున్నది. నా పంచేంద్రియములకు విషయములు పంచ భూతములలోని గుణములు కావు; నీయందున్న పంచేంద్రియవ్యావ హారము. అరుం—నేను మీ యిట్టిమాటలు బ్రదికియుండియు నిస్పృ హాయురాలనై వినవలసివచ్చెను. ధర్మా—(కన్నీటితో) "ఇయం గేహే లక్ష్మీరియ మమృతవర్తి ర్నయనయో, రసా వస్యాః స్పర్శో వపుషి బహుళ శ్చందనరసః" అన్నారు శ్రీరామచంద్రులు.

ఆ నాఁ డష్టమి. నవమినాఁడు ధర్మారావు పిచ్చియెక్కిన వానివలెఁ బొలాలవెంటఁ దిరుగఁబోయెను. ఆనాఁడు ఫెళ్లున నెండ గాసెను. ధర్మారావు సంచరించుటకు యోగ్యమైన క్షేత్రములు ప్రాగ్దిక్కునసే యున్నవి గనుక నచటికే పోయెను. కొంతసేపు కొళాయి చెఱువుగట్లవెంటఁ దిరిగెను. అతఁడు మనసులో నూహించు కొనుచుండెను. "అరుంధతికి నెమ్మదించదు. ఈ సంగతి యాతేండ్ల క్రిందనే గణాచారి చెప్పినది. నాకును జూచాయగాఁ దెలిసినది. స్వామి రెండు శిరస్సులలో నొకశిరస్సు మూసిపోయిన ట్లుండెను. గిరికయు మూఁడు నెలలు గడువు పెట్టినదఁట. పూర్ణిమ యింకను నాలురోజు లున్నది. ఆనాఁడే పోవును కాఁబోలు" ననుకొని ధర్మారావొకచోటఁ గూర్చుండి బిగ్గఱగా నేడ్వసాఁగెను. చుట్టు ప్రక్కల జనమెవ్వరును లేరు. అతని దుఃఖము యథేచ్ఛగా సాఁగెను. ఆపాఁగడఁగినంతనే దుఃఖతరంగము మఱల మనస్సాగరములో వెనుకకుఁ బోయెను. అతఁడు కనులు తుడుచుకొని లేచి మెట్ట

చేలలోనికి నడచెను. అచట నొకచోట పసిరిక కనిపించెను. పసిరిక ఇతనిని జూచినంతనే 'అన్నా' యని కూతపెట్టెను. పసిరికచుట్టు నున్న పక్షులు పాఱిపోయెను. పుట్టలలోని యొకటి రెండుపాములు తలలెత్తి చూచి మఱల బుట్టలలోనికి దూఱెను. ధర్మారావు 'నాయనా! మీ ప[illegible]లియెక్కువగా నున్నది' యనెను. పసిరికకు దెలియక కను[illegible]న్నగారివంకకు జూచెను. అతని యాకుపచ్చమొగ మెండిపోయినయాకువలె దెల్లవడెను. వర్షాకాలముల సర్వవృక్షపత్రములును బచ్చబడెను పసిరిక ముఖపత్రముమాత్రమే తెల్లబడెను. అతడు రెండుచేతులతో ధర్మారావును కౌగిలించుకొనెను. ధర్మారావునకు దనతండ్రివచ్చి కౌగిలించుకొన్నట్లున్నది. రెండుజాములైనది. ధర్మారావు తిరిగి యింటికివచ్చుచుండెను! దారిలో రామచంద్రరాజు కన్పించెను. ఆయనతమ్మునివిషాదముఖమండలము చూచి 'ధర్మ! మఱిదల కెట్లున్న'దనెను. ధర్మారావు రాజు మొగమువంకజూచెను. రాజుమొగముధర్మారావుముఖమునకు బ్రతిబింబమువలెనయ్యెను. అత డొక్కసారి తమ్ముని కౌగిలించుకొని ధర్మారావుమొగముతనఱొమ్మున నాన్చుకొనెను? వారికౌగిలింత విడిపోయినతరువాత నన్నగారిమొగముచూచెను. రామచంద్రరాజు కనుగొలకులలో నిండుపగింజలంత బాష్పము లున్నవి. ధర్మారావు 'నాయనగారు సుక్షత్రియునకు నీకు నాదుఃఖముగూడ దెచ్చిపెట్టె' ననెను. రాజు కన్నీరుతుడుచుకొనుచు దనదారిని దా బోయెను. ధర్మారా వింటికివచ్చెను. అరుంధతి పతిని జూచి 'మొగ మది యేమి, అట్లు వాడియున్నది? నావద్దకు రం' డనెను. అతడు వద్దకుబోయి మంచమువద్ద మోకరించి కూర్చుండెను. అరుంధతి చేయెత్తలేకయెత్తి పయ్యెదకొంగుతో పతిమొగము తుడిచెను.

దశమినాడు ప్రొద్దునే పెద్దడాక్టరు వచ్చెను. మఱల జూచెను. మందిచ్చెను. మఱల వారముదినములకు వత్తునని పోయి మోటారులో గూర్చుండెను. అరుంధతి 'యేమనుచు జెప్పడేమి" యనెను. ధర్మారావు మోటారువద్దకు బోయి 'అయ్యా! నెమ్మదించునా?' యనెను. ఆయన మాటలేదు, పలుకు లేదు, తలయూడించెను. మోటారు నడుపువాడు ధర్మారావును బిలిచి 'అయ్యా! ఎకా

యెకి మోటారుమీఁదనే వచ్చినాము. అయ్యగారు మోటారుకు రానుపోనుఖర్చును, మందుఖర్చును వందరూపాయ లడిగి పుచ్చుకొమ్మన్నా' రనెను. ధర్మారావు తెచ్చియిచ్చెను. ధర్మారావేదియో యడుగవలె ననుకొనెను. మోటారు తుఱ్ఱున నెగిరిపో[illegible]ర్మా రావుచేసిన నమస్కారమే డాక్టరుగారికి సరిగా నందలే[illegible] ఱ్ఱాగుచున్న సిగరెట్టుపొగమాత్రము బయటికి వచ్చి [illegible]వు చేసిన నమస్కార మందుకొన్నది. లోనికివచ్చిన పతినిజూచి యరుంధతి 'డాక్టరే మన్నాఁ' డనెను.

ధర్మా - వారు మనతో మాటాడరు. వారి యౌషధము వారిచ్చుచుందురు, పోవుచుందురు. ఇంగ్లీషువైద్యములో వట్టి యౌషధము నపుట యేగాని పరామర్శచేయుట, మాట మఁ బలుకునాఁట, సమాదరించుట, ధైర్యముచెప్పుట మొదలైనవి లేవు. సూర్య— ఎందుకు లేవు? ఆయన యెంతజీతము తెచ్చుచున్నాఁడో యించు మించుగ నంతజీతము తెచ్చుచున్నవారి యిండ్లవద్ద నుండును. ధర్మా - మును పీ శివి జమీందారులవద్ద నుండెడిది. కాని, వారివద్ద నింతనిర్దయ యుండెడిది కాదు. ఇప్పు డీ రెండును గలిసి యున్నతోద్యోగుల నాశ్రయించెను. అరుం - మజిల నే మిచ్చితిరి? ధర్మా - వందరూపాయలు. అరుం - తక్కిన మూఁడు వందలైన నుంచుకొనెను. ధర్మా - ఎందుకు? అరుం - ఎందు కేమిటి? నాలుగైదు రోజులలోఁగా నక్కఱలేదా! సూర్య - నీ కంతకంతకుఁ బిచ్చిమాట లెక్కువగుచున్నవి. తల్లీ! నీ కేమియు ధరవా లేదు. నీవు నిజముగా బ్రదకెదవు. అరుం - మనకు గిరికకన్న నెక్కువ తెలియునా? లోకములోని దుష్టభావము లంటని యచ్ఛమైన యంతరాత్మకలది గిరిక. అఘస్పృష్టముకాని యామెయాత్మకు సర్వమును జక్కఁగాఁ దెలియును. ఆమె మూఁడునెలలు వారడి యన్నది. రేపు పూర్ణిమతో గడువైపోవును. నా ప్రాణమునకుఁ దిథిద్వయము కూడ రాలేదుకదా! అయినచో నింకొకరోజు గిరికకే కలిసినచ్చును. ధర్మారావు కన్నీళ్ళు తుడుచుకొనుచు బయటికి బోయెను.

ఏకాదశినాఁడు ప్రొద్దుననే ధర్మారావు రంగాపురము పోయెను. అతఁ డత్తవారింటికిఁ బోయి పదునే నేండ్లైనది. అతని కచటికిఁ

బోవుట యన్న మన స్సునకవిధముగా నుండెను. వారియింటి కిపుడు తా నే మని పోవలయును? ఏ మని పోవలయు నేమిటి? తనభార్య పెట్టె యచట నున్నది. దానికోస మని పోవుచున్నాఁడు. అతఁడు రంగాపురము పోయి యెకాయెకి రాజ్యలక్ష్మమ్మగారియింటికి వెళ్ళెను. [illegible]మ్మగారిసంసారములో మార్పు లేదు. ఒకటే మార్పు. ఆ[illegible]మునఁ గుంకుమబొట్టుదక్క నఖశిఖాపర్యంతము విభూతి పండువలె నుండెను. తలయంతయు ముగ్గుబుట్టవలె నుండెను. ఒడలిలో నెత్తురులేక పాలిపోయెను. మంచమునం దట్లే పరుండెను. ఆమె భర్తమాత్రము మిక్కిలి ముసలివాఁడై యిప్పుడు చీట్లపేక యాడుట లేదు. ఇద్దఱు నుడుకవేసికొని తిందురు. ఎవరిదారిని వారు మంచములోఁ బడియుందురు. ధర్మారావు ప్రొద్దెక్కిన తరువాత నత్తవారి యింటికిఁ బోయెను. వాకిట గంగన్న సోమయాజులుగారు కూర్చుండి దర్భలతో హోమములకుఁ గావలసిన కూర్చలు కట్టుచుండెను. ఆయన తలయెత్తి యల్లునివంకఁ జూచి మఱలఁ దలవాల్చుకొనెను. ఇంతలో నాగమ్మగారు బయటికి వచ్చినది. అత్తమామలిద్దఱును వృద్ధులైయుండిరి నాగమ్మ యల్లుని జూచి మాటాడకుండ నిలుచుండెను. ధర్మారావు 'దానిపెట్టె యిచ్చట నున్నదఁట! అది తీసికొని రమ్మన్నది. ఆ పెట్టె యిప్పించినచో తీసికొని పోదు' ననెను. నాగమ్మకు సోమయాజికిఁ దమకూఁతునకు మహావ్యాధి పుట్టిన దని తెలియును. వా రెట్లున్నదని యడుగలేదు. నాగమ్మ 'యేనాఁటిపెట్టె ? అది యిప్పుడు లే' దనెను. ధర్మా—పెట్టె యక్కఱలేదు. దానిలో నల్లజరీచీర యొకఁ డున్నది, అది కావలయును. నాగమ్మ—ఆ చీర యిప్పు డెచ్చటనుండి వచ్చును ? లేదనెను. ధర్మారావు 'వెదకినచో దొరకును' అనెను. నాగ—పదునాలేండ్లనాఁటిచీర యిప్పు డెచ్చట దొరకును ? ధర్మా—దొరికితీఱవలయును. మా నాయన నగలకిచ్చిన డబ్బంతయుఁ గాఁజేసితిరి. ఈ చీర కాఁజేయనీయను. అది నా భార్య కట్టుకొనినఁగాని దానికి మనస్తృప్తి లేదు. మీ రిచ్చెదరా, నేను పోయి వెదకి కొందునా? అని ధర్మారావు గదిలోనికిఁ బోఁబోయెను. నాగమ్మ పోయి సవారీపెట్టె తీసెను ధర్మారావు ప్రక్కనే నిలుచుండెను. పెట్టెలోనుండి యిరువది యేండ్లనాఁటి యంగవస్త్రములు,

పాఁతవడిన క్రొత్తచావులు బయలుదేరెను. బెట్టెయడుగునుండి చీర వచ్చెను. ధర్మారావు చీరను గాఁగిలించుకొని, బిగ్గరగా నేడ్చెను. సోమయాజు లచ్చటికి వచ్చి చూచెను. భార్యాభర్తలిద్దరు నతనిని జూచి దిగ్భ్రాంతులైరి. తనకుఁ దెలియకుండఁ ద న్నాదరించి[illegible] శోకతరంగమును ధర్మారా వదుపులోఁ బెట్టి సిగ్గుపడి మా[illegible] బయటికిఁబోయెను. అతఁ డధోముఖుఁడై సుబ్బన్న పే[illegible]వ బట్టెను. చీరను గాఁగిలించుకొనియే యుండెను. అతనిమనస్సులోఁ బదునాలేండ్లనాఁటి కథయంతయుఁ దాండవించెను. 'అపుడు నా యరుంధతికి నామీఁదఁ బ్రేమ లేదు. రాక్షసు లామె మనస్సును నానుండి హరించిరి. రాక్షసప్రయోగములను దేవతలు నిర్ఘాతముచేసి మరల నాయరుంధతిని నా కిచ్చిరి. ఇచ్చిన ప్రథమదేవతామూర్తి రాజ్యలక్ష్మమ్మగారు. రెండవ దేవతామూర్తి రంగాజమ్మగారు. రంగాజమ్మగారి ఋణము నే నెట్లు తీర్చుకొనఁగలను? లోకములో సవతితల్లిప్రేమను దిరస్కరింతురు. ఏమి రంగాజమ్మగారు! మాతండ్రి, రంగాజమ్మగారు, కృష్ణమనాయఁడు, రుక్మిణమ్మారావుగారు, సరోజినీ దేవి వారందఱు దేవతలలోని యొకశాఖ. వారిదారిని వారు పోయిరి. తరువాతఁ బదేండ్లు తెరపి యిచ్చినది. మరల నారంభించినది. ఇంత వఱకు మూఁడైనవి. నాల్గవది సిద్ధముగా నున్నది. ఈ చీరయొక్క స్పర్శ నూత్నవధూస్పర్శవలె నన్నానందింపఁజేయుచున్నది. ఈ ముద్దుపెట్టుకొన్నచోఁ గ్రొత్తపెండ్లికూఁతురైన నాయరుంధతి నా నాఁడు ముద్దుపెట్టుకొన్నట్లే యున్నది. నిన్ను గాటముగాఁ గవుంగి లించుకొనవలయునని యున్నది. అయ్యో! నిర్భాగ్యుఁడను. ఎండి పోయి, బొమికలుమాత్రమే మిగిలియున్న నీశరీరము స్పృశించుటకుఁ గూడ వీలులేక యున్నది. నే నేమి చేయుదును? అని యచ్చటఁ గూర్చుండి యతఁడు కొంతసేపు విలపించెను. అది మాగానిగట్టు. అతఁడు కట్టుకొన్నధోవతియంతయు బురదయయ్యెను. ధర్మారా వింటికి వచ్చెను. అరుంధతి 'యింతసేపు నన్ను వదలి యెచ్చటికిఁ బోతి' రనెను. ధర్మా—నిన్ను వదలి నే నొక్కనిముసమైన నుండను. నీ కాసంగతి తెలియదు. నా హృదయకుహరములో దాఁగియున్న జ్యోతివి నీవు. నా మనోవీథిలో విహరించుచున్న దేవతవు నీవు.

అరుంధతి ధర్మారావువంకఁ జూచెను. ఆ కన్నులలో నున్న తేజస్సతఁడు సత్యము నెఱిఁగియున్నదియే యయ్యెను దానియందలి ప్రత్యగ్రిత మఱల నతనిని గొట్టవచ్చెను. ధర్మా—నే నొకచోటికిఁ బోయితిని. ఎచ్చటి కేఁగితినో రాత్రికిఁ జెప్పెదను. అరుం- చొక్కా లో [illegible] చుకొన్నద యేమిటి? ధర్మా—నిన్నే దాఁచుకొన్నాను. అరు[illegible]నె వినుచున్నది ధర్మా—ఇంక నెవరైనను వినవచ్చును. ఆనాఁడు ప్రొద్దుక్రుంకెను. ఏకాదశికి వెన్నెలలు రంగాజమ్మ, రుక్మిణమ్మ, రావుగార్ల యాత్మలు జ్యోతీరూపములై వారి యింటిచుట్టు పట్ల నావరించినట్లు వచ్చెను. భాగీరథీప్రవాహమున కామేడితము లైన యా జ్యోత్స్నాతరంగములు ధర్మారావుచెప్పులతో నద్దుకొనెను. అతఁడు లోనికిరాఁగా, గవాక్షమునుండి యొక జ్యోత్స్నాతరంగము వచ్చి యరుంధతి మొగముపైఁ బడుచుండెను. ధర్మారావు చీర తెచ్చి యరుంధతికిఁ గట్టెను. పాఁతచీర తీసివేసెను. గదిలో నెవ్వరును లేరు. దీపపు వెలుతురున నరుంధతి చీర గుర్తించెను. ఆమెయొకసారి లేచి కూర్చుండెను. కూర్చుండుశక్తి యెట్లు వచ్చినదో దైవమునకే తెలియదు. ఆమె చేతులు పతిమెడకుఁ దగిలించి కౌఁగిలించుకొని యంతలో నా యాసము వచ్చి యతనిబుజముపై వ్రాలెను.

ధర్మారావు కలాంగనను దాను వాంఛ నదుముకొనలేక నెమ్మదిగానే కౌఁగిలించుకొనెను. ఆమె కది బాధాజనక మయ్యెను. ధర్మారావున కెప్పుడును గోపము రాదు. అప్పు డతనికిఁదనమీఁద దనకే కోపము వచ్చెను. 'ఛీ ఛీ, దౌర్భాగ్యుఁడ' ననుకొని యామెను నెమ్మదిగాఁ జేతులు బుజముపైనుండితీసి మంచముపై జాగ్రత్తగాఁ బరుండఁ బెట్టెను.

అరుం- మనస్సు మనస్సే, శరీరము శరీరమే. ధర్మా- అవును. ఒకనికి మనస్సు పనియే చేయదు. వానిశరీరము బలిసి యుండును. మఱొకనికి శరీరము కృశించియుండును. మనస్సు మహాశక్తిమంతమై యుండును. అరుం- శరీరము కృశించి వాంఛకుఁ దావీయదు. మనస్సు సంపూర్ణారోగ్యము కలనాఁటి కోరికలే కోరును. ధర్మా- నేను విరాగిని గాదు, వాంఛలయందు సమర్థుఁడను గాదు. నాపని 'త్రిశంకు రివాంతరాళే తిష్ఠ' యన్న ట్లున్నది. అరుం- నా

మనస్సు మఱల మనకార్యమునాఁడు పొంగినట్లు పొంగుచున్నది. ధర్మా—రంగాజమ్మగారి యాత్మయు రుక్మిణమ్మారావుగారి దయయు నిన్ను సర్వథా రక్షించును గాక! అరుం——నామనస్సులో నే మూల చూచినను మీరు లెక్కలేనన్ని రూపములు పొంది ప్రకాశించుచున్నారు.

అని యామె కనులుమూసికొని-ఇదిగో! ఇచ్చట [illegible] ప్రేమలేని నన్ను బతిమాలుచున్నారు. ఇచ్చట బెదరించుచున్నారు. ఇచ్చట పోయి కోపించి పండుకొన్నారు మఱలబతిమాలుచున్నారు. ఇచ్చట మనమిద్దఱము కలిసియుంటిమి. ఇచట మీలో నే నైక్యమైపోవుటచేతఁ గాఁబోలు! కోటిమన్మథాకృతులైన మీరు అర్ధనారీశ్వరులవలెఁ బ్రకాశించుచున్నారు. మీరిచట నాకు విద్యాగురువులు. ఇచట నర్మసఖులు. ఇచట నా ప్రాణనాథులు. ఇచట నాసర్వసృష్టికి నధికారులు. ఇచట ననుకూలురై నా యాజ్ఞానువర్తులు. ఇచట మత్పాదరజోలేశచిహ్నితఫాలభాగులు. ఇచట మీ ప్రేమసామ్రాజ్యమున కధిరాజ్ఞినైన నన్నారాధించుచున్న భక్తులు. ఇదిగో నిచట మీరును నేనును నున్నాము. నేను మంచమున మృత్యుదేవతకు సన్నిహితురాలనై యున్నాను. అనార్తవమైన పుష్పమువలె నిత్యవికాసము చెడని మీ రిచట నున్నారు. ఎన్నటికైనఁ బ్రకృతి చెడునుగాని, పురుషుఁడు చెడఁడుకదా! నేను నశించి పోవుచున్నానుగాని మీరు నన్నుమాత్రము మఱచిపోకుఁడు! రాజ్యలక్ష్మమ్మగారు నా ప్రేమవేణిక నల్లినది. ఈచీరయే నా ప్రేమజీవితమున కాదియు నంతమును నైనది. అది ప్రవాహమై బంగరుపంట పండినది. నాకడుపుపంట మీరు వేయికన్నులఁ గాంచవలయును. మీ జీవితములో నే నొక యుపనదిగా వచ్చి కలిసితి నన్నమాట మఱచిపోవలదు. నేఁ డేకాదశి. నా ప్రేమలోని పావిత్ర్యముచూడుఁ డెట్టిదో! ఈనాఁడే నా కీ చీర వచ్చినది. నా ప్రేమ నిష్కల్మషమని మీ రెఱుఁగుదురుకదా! నామనస్సు నిత్యము మీయందే లగ్నమైనది. వెనుక నొకసారి మనస్సు చంచల మన్నారు. చాంచల్యము సంస్కారానురూపము. నా మనస్సు చంచలము కాదు. మీ రెఱుఁగుదురుకదా! అనెను. ధర్మారా 'వెఱుఁగుదు' ననెను.

వారముదినములనుండి కుమారస్వామి రామేశ్వరశాస్త్రిని దనవద్దనే యుంచుకొనుచుండెను. అతఁడు మేడలోఁ బ్రవేశించెను. రెండువందల రూపాయలు పెట్టి మేఁడయంతయు కుర్చీలు, సోఫాలు, మంచములు, పఱపులతోఁ గొంచె మందముగాఁ గనఁబడునట్లుచేసెను. దే[illegible]యాపటములు తెచ్చి కుడ్యముల నలంకరించెను. రామేశ్వర[illegible]భోజనమునకుమాత్ర మింటికిఁ బోవును. అప్పు డొక్కసారి తల్లివద్దకుఁ బోవును. ఆమె 'నాయనా! పోయి యాడుకో' మ్మనును. అతఁడు కుమారస్వామియింటికిఁ బోవును. రామేశ్వరశాస్త్రి చిన్న ధర్మారావును గిల్లి యేడిపించును. శ్యామల వచ్చి యేమి చేసితి వనును. శాస్త్రి 'నే నేమియుఁ జేయలేదు. వాఁడు వట్టి యేడుపుగొట్టువెధవ' యనును. శ్యామలయుఁ గుమారస్వామియు 'నీవు గిల్లి నావు కాఁబోలు' నందురు శాస్త్రి తన చేతిగోళ్ళవంకఁ జూచుకొనును.

కుమార- తమ్ముని నేడ్పించవచ్చునా? శాస్త్రి- వాఁడే యేడ్చును. వాని కది యలవాటు. శ్యామల- అలవాటు కాదు నాయనా! వంశములో నున్న గుణము.

కుమారస్వామి శ్యామల నొక్క చెంపకాయ కొట్టును. ఆమె దెబ్బ తగిలియు నవ్వును. రామేశ్వరశాస్త్రి శ్యామలాకుమారస్వాములు చావడిలో లేకుండఁజూచి కుర్చీ గోడదగ్గఱకు వేసికొని, దానిపై నెక్కి పటములు తీసి యటునిటుజూచి మఱలఁ దగిలించఁ బోవును. అది మఱలఁబడదు. ఒకొక్కక్కటి క్రిందఁబడి పగిలిపోవును. కుమారస్వామి వచ్చి చూచును. 'నీ వల్లరి చేయరాదు. ఆపటములు ముట్టుకొనరా' దనును. శాస్త్రి 'ఆ పటములు ముట్టుకొననున్నచోఁ జూచుకొనుటకు మాత్రమేనా?' అనును. కుమారస్వామి యవు ననును. వారముదినములలో నాల్గుపటములు పగిలిపోయినవి. శ్యామల యన్నది: అందఱిలో శాస్త్రి మంచివాఁడండీ? అక్కఱ లేనివస్తువులు గిట్ట వతనికి.

కుమార- పటము లక్కఱలేదా? శ్యామల- నా కక్కఱ లేదు. కుమార- నీకు రసజ్ఞత లేదు. శ్యామల- రసజ్ఞత లేకపోయి నను రసజ్ఞులైనవారినైన నెఱుఁగుదును. కుమార - ఎంతమందిని?

శ్యామల - ఒక్కఁ డెంతగుంది యగుదురో యంతయుందిని. కుమార—అభినయము. శ్యామ—దేవదాసి నాపన. కుమార—ఆమె పే రెందుకు పాడుచేసెదవు? శ్యామల – పాడుచేయుట యే మున్నది? ఆమెయు, వేణుగోపాలస్వామియు, మనము [illegible]టియే రాశి. కుమార– వెలకట్టినది డబ్బునిగ్గనుండి.

కుమారస్వామియు, రామేశ్వరశాస్త్రియు ధ[illegible]గారి యింటికిఁ బోయిరి.

అరుంధతి - నాయనా! పిల్లవాఁడు సంతోషముగా నుండు చున్నాఁడా? కుమార - ఆడుకొనుచున్నాఁ డండి. ధర్మారావు సెప్పుడు నాడించును. దేశభక్తుల పటము లన్నచో నతని కెప్పుడు నిష్టము. ఎప్పుడును వానితోఁ గాని యాడుకొనఁడు. అరుం–ఏమోలే, నాయనా! వానిని నన్ను మఱచిపోవునట్లుచేయుభారము నీది. ఇంక వానిని శ్యామలయైనను జూడవలయును.

ఆ మఱునాఁడు తిథిద్వయము. త్రయోదశి రెండు గడియలే యున్నది. చతుర్దశి వచ్చినది. ధర్మారా వరుంధతివంకఁ జూచెను. ఆమెస్థితి నేఁడో రేపో యున్నట్లున్నది. కాని మాట్లాడుచునే యుండెను. అతనిమనస్సులోని కీ యూహ వచ్చెను– ఈ వ్యాధి కింతే. మాటా డుచు మాటాడుచునే పోయెదరఁట! ఊరిలోని డాక్టరన్నాఁడు: "ఈ వ్యాధి కింగ్లీషువైద్యములో మందులేదు. అది యింకను గనిపెట్టఁబడ లేదు. దీని కింతే. మనిసి క్రమముగా చనిపోవుచుండఁగాఁ జూచుచు నూరకుండుటయే చేయుపని" అని. రాజశేఖరశాస్త్రిగారు వచ్చి చూచెను. ధర్మారా "వెట్లున్న" దనెను. శాస్త్రిగారు బయటికి వచ్చి "అయ్యా! చెప్పలేము. నేఁడు కావచ్చు, రేపు కావచ్చు. కాదా మఱి యింకఁ బదినా ళ్ళుండవచ్చు. ఎప్పుడో చెప్పలేము" అనెను. ధర్మారా "వసలుమాట స్థిరమేనా?" యనెను. శాస్త్రి తల యూడించెను. ఆ తలయూడించుట యర్థమేమియు నీయలేదు. కాని ధర్మారావునకుఁ దెలిసెను. అతఁడు పోయి విడిగా నొకగదిలోఁ గూర్చుండి దుఃఖించుచుండెను. అరుంధతి కాయేడ్పు వినవచ్చి హైమవతితో "వదినే! మీయాతఁడు ఆ గదిలోఁ గూర్చుండి యేడ్చు చున్నారు. పోయి యిటు తీసుకు"రమ్మనెను. హైమవతి పోయి

తమ్ముని దెచ్చెను. ఆతఁడు కన్నీళ్లుతుడుచుకొని వచ్చెను. అరుంధతి 'యెందు కేడ్చుచున్నా' రనెను. ధర్మారావు 'నే నేడ్చుటలేదే' యనెను. అరుంధతి 'చచ్చిపోయెడివారితోఁ జచ్చిపోమరా ? మీరు కూ[illegible]యినచో పిల్లవానిగతి యేమిటి ?' యనెను. ధర్మారావునకు వ[illegible]ము పొంగి యేడ్వనారంభించెను. అరుంధతికిఁ గన్నీళ్లు వచ్చె[illegible]హైమవతియు దుఃఖించుచుండెను. వాకిటిలోని కెవరో వచ్చిన ట్లయ్యెను. హైమవతి చూచి 'అబ్బాయీ ! చిన్నబాబు గారు వచ్చి' రని తాను లోనికిఁ బోయెను. హరప్పను ధర్మారావు తోడితెచ్చెను. హరప్పను జూచి యరుంధతి సిగ్గుపడను లేదు. దుఃఖపడను లేదు. సంతోషించను లేదు. ప్రాణములు పరలోకజీవితపుఁ గచ్ఛమును జేరినట్లు శూన్యదృక్కులే ప్రసరించెను. హరప్పగాని, ధర్మారావుగాని మాటాడలేదు. ధర్మారావు ప్రభువును గూర్చుండుఁ డనెను. ఆయన యట్లే నిలఁబడియుండెను. ధర్మారా వెదురుగా నిలుచుండెను. ఇద్దఱు సభోముఖులై యుండిరి. అరుంధతికన్నులు హరప్పపై నిలిచినట్లే నిలిచి ధర్మారావు మొగమునందుఁ బోయి నిలుచును. అతని యాపాదమస్తకము పరిశీలించును. మఱల హరప్ప మొగముమీఁదికి వచ్చి వెంటనే ప్రాణనాథునిమూర్తిపైఁ దరలును. ధర్మారావు కన్నులవెంట నీరు కారుచుండెను. అతనిశరీరమంతయు దపించిపోవుచుండును. హరప్ప కనులలో బాష్పములు నిలిచెను. ఇద్దఱును మాటాడకుండ బయటికి మఱల నడచిపోయిరి.

రథంతరి చూచుటకు వచ్చెను. ఆమె వచ్చి నాలుగైదు దినములయినది. అరుంధతి 'అక్కా! వంటమానివేసి యిపుడు వచ్చితి వే' మనెను. ఆమె తల్లీ ! నిన్ను చూచి నాల్గునాళ్లైనది. నా ప్రాణములన్నియు నీ మీఁదనే యున్నవి. నాల్గునాళ్ళనుండి యెవరో బంధువులు వచ్చిరి. వారితో సరిపోయినది. వా రీనాటి ప్రొద్దుననే రైలుకుఁ బోయిరి. బావగారికి భోజనమున కాలస్యమైన నేమిలే యని నిన్నుఁ జూచుటకు వచ్చితి ననెను. రథంతరి 'కోడికోడలు దగ్గఱఁ గూర్చుండి మనము ముగ్గురము. గిరిక దారిని గిరిక పోయినది. నీవు గూడ నిట్లున్నావు. ఇంక నొక్కర్తను బదికి యేమి, బ్రదుకక యేమి ?

మి న్నిద్దఱను వదలిపెట్టి నే నేమని బ్రదుకుదును? మీ రున్నా రని యీ యూరు వచ్చితిని' యనెను.

అరుం - అక్కా! ఎవరి యాయుర్దాయము వారిది. ఎవరి సుఖములు వారివి. కాని మీ వారికి మా వారికి ర[illegible]మైన నున్నది. మన యిద్దఱ సంబంధము వారినిబట్టికదా! [illegible] మనవారు లోకసంసారము మిథ్య యన్నారు. మృతి [illegible]న మైనదో తెలియక, కొందఱు దీని తథ్య మనుచున్నారు. రథం - మనయిద్దఱయనుబంధము మనభర్తలమూలముగానే కాక గిరికమూలముగా మఱియు నెక్కువయైనది. అరుం - అవు నటువంటి భక్తురాలు పోయినతరువాత మన మొకరొప్ప యేమిటి? ప్రొ దెక్కుచున్నది. నీ వింక బొమ్ము.' ఆమె పోవుచు హైమవతిని గలిసికొనెను. హైమవతి 'ఏమమ్మా! వదినే! అరుంధతిని జూచితివా?' అనెను. రథం - చూచితిని. నేఁడు మఱియు నాసిగా నున్నది.

హైమవతి 'నేఁడు పర్వదినము. ఈ గడ్డురోజు గడచినప్పుడు చూచుకొందములే' యనెను. రథంతరి కన్నీళ్ళు తుడుచుకొనుచు గృహాభిముఖి యయ్యెను. సాయంకాలమైనది. అరుంధతి ప్రతిదినమును దనకు బాధగా నున్న దనుచుండెడిది. నాఁ డేమియు ననలేదు. ధర్మారావు సంతోషించెను. అతనికి వ్యాధి తిరుగుమొగము పడినది. ఈనాఁడు పూర్ణిమః దాఁటిపోయినచోఁ దనభార్య బ్రదుకు ననిపించినది. ఒక దైవజ్ఞుఁడుగూడ నట్లే — చెప్పెను శ్రావణపూర్ణిమ దాఁటినచో ఫరవాలేదని. ధర్మారావు 'పూర్ణిమ వచ్చినది. పొద్దుగూడఁ గ్రుంకవచ్చినది. ఈనాఁడు దాని కేమియు బాధకూడ లేదు. బ్రదికి యొడ్డున పడినట్లె' యనుకొనెను. అరుంధతి యీనాఁడు సుఖముగా నున్నదని యిల్లందఱును సంతోషించిరి. అరుంధతియు నాఁడు రెండు బత్తాయికాయలు తినెను. నాల్గు పచ్చిద్రాక్షపండ్లు తినెను. రెం డ్లనాసముక్కలు తినెను. రోజుకన్న నాల్గు గ్రుక్కలు మంచినీళ్ళు త్రాగెను. ధర్మారా వెట్లున్న దనఁగా 'రోజువలె లేదు. నేఁడు బాగుగనే యున్న' దనెను. రాతిరి కందఱు త్రుళ్ళింతలుగా భోజనముచేసిరి. అందఱు నెవరిదారిని వారు పండుకొనిరి. ధర్మారావు భార్యవద్దకుఁ బోయి చెక్కిళ్ళు చేతులు కాళ్ళు

తడిమెను. అరుంధతి నిద్రపోవుచుండెను. అతఁ డామెకుఁ గొంచె
మెడముగా మంచముపైఁ బరుండెను. రాత్రి రెండు జాములైనది.
అరుంధతిమూల్గు వినిపించి, ధర్మారావునకు సగమునిద్ర మెలఁకువ
వచ్చెను; అతనికిఁ దక్కినసగ 'మిట్లొక్కసారి రండు' అన్న యరుం
ధతి కిఁ దెలిసి పూర్తిగా మెలఁకువ వచ్చెను. అతఁ డామె
వద్ద గా నామె 'నాకు దాహమగుచున్నది. మంచితీర్థ మిం'
డనెను. అంతలో నందఱును లేచిరి. 'ప్రాణము శోషపొందెనేమో'
అని రెండుతొనలు తినిపించిరి. ఆమె 'నా కేమియు దోఁచుట లేదు,
అబ్బబ్బా' యని యూరకే యావేగము పొందుచుండెను. ఆమె
'నాకు దాహమగుచున్న' దనెను. మంచితీర్థ మిచ్చిరి 'చాలు' అని
హీనస్వరముతో ననెను. సూర్యనారాయణ 'అయ్యో! ఇంక నేమి
యరుంధతిరా, పోవుచున్న' దనెను. ధర్మారావు నిశ్చేతనుఁడై యామె
వంకఁ జూచుచుండెను. ఆమె యేదియో చెప్పవచ్చి నాల్కమాత్రమే
యాడించెను. కన్నులు మూఁతపడెను. సూర్యనారాయణయు రాజే
శ్వరుఁడునుబట్టి, గడ్డి వేసి, చాప వేసి పరుండబెట్టిరి. నాంచారమ్మశిరసు
వద్ద దీపము పెట్టెను. సూర్యనారాయణ చెవిలో 'నారాయణ, నారా
యణ'యనుచుండెను పావుగంటలో నిల్లంతయు రత్నగిరి, కబీరు,
కుమారస్వామి, శ్యామల, మంగ, రథంతరి, రామచంద్రరాజులతో
నిండిపోయెను. నాంచారమ్మయు, హైమవతియు నొకటే యేడ్చుచుం
డిరి. ధర్మారావునకు దుఃఖము పట్టలేదు. అతఁడు జాము ప్రొద్దున్నం
తవఱకు నిశ్చలుఁడై యుండెను. సూర్యనారాయణయు, రామచంద్ర
రాజు నతనిని జెఱియొకవైపున గూర్చుండి యోదార్చుచుండిరి.
అతఁడు నిశ్చలముగాఁ జూచుటయే తప్ప మాటాడినది లేదు. కొంత
సేపటి కచటినుండి లేచి లోనికిఁ బోయి భార్యశవమువంకఁ జూచెను,
అతఁడు నిలువున శవమువెంటనే మఱియొక శవమువలె విఱుచుకొని
పడెను శవమును గాఁగిలించుకొనెను. చెక్కిళ్ళు ముద్దుపెట్టుకొనెను.
ఎదఱొమ్ముమీఁదఁ బండుకొనెను. 'ఆఱునెలలనుండి లేని సుఖము
నా కీ నాఁడు వచ్చినది. ముట్టుకొన్నచో నీ కెక్కడ బాధకల్గునో
యని యిన్నాళ్ళు దూరకొంటిని ఇప్పుడు నీకు బాధలేదుకదా! ఈ
ఱొమ్ముపై నానుకొని నిద్రించి యెన్నాళ్లైనది! ఈచేతులు నా

మెడకుఁ జుట్టుకొని యెన్నాళ్ళయినది. ఈ కపోలము స్పృశించి యెన్నాళ్ళయినది. ఆహా! నాపంటయంతయు నీనాఁడు పండినది. మీరు చుట్టాలని నన్ను వెనుకకు లాగకుఁడు! నన్నేల నాభార్యచెక్కిలి ముట్టుకొననీయరు? మీరు నన్నడ్డ[illegible] నాప్రియురాలికంఠము కౌఁగిలించుకొననిండు. మీరు [illegible] నన్ను లాగివేయకుఁడు! నా స్త్రీవక్షస్థలమున నన్ను రా[illegible]నిండు. వెనుకకుఁబట్టి నన్ను లాగకుఁడు! ఏడాదినుండి నే నీ సుఖ మనుభవించలేదు. ఇంక ముందేమో యనుభవింతు ననుకొంటిని. ఆయాశామహాసముద్రము లింకిపోయినవి. నన్నీ సుఖ మనుభవించనిండు!' అని యామెపైఁ బడి కౌఁగిలించుకొని మొగముమీఁద మొగమానించును, మూఁడునెలలనుండి సంస్కార మెఱుఁగని యామె దుబ్బుగట్టినతల చేతులతో నిమురుకొనును. ఆమెప్రక్కనే పండుకొనును. ఆమె చీరకొంగుతోఁ గన్నులద్దుకొనును. ఆఁ ఏవి చీర! ఈ చీరయే నా ప్రణయకథకు నాంది; భరతవాక్యమునైనది. ఈ చీర తీసికనిరాకపోయినచో నా భార్యఁ బ్రదికెడిదేమో! నేనే దురాత్ముఁడను, పోయి తెచ్చి చేతులార గట్టితిని. చేతులారఁ జంపుకొంటిని. ఈ గౌరీదేవత కైలాసగిరియందలి శంభునిమీఁదఁ గోపించి గర్భదరిద్రుఁడైన నాయింటికి వచ్చినది. ఈ వ్యాధి కనువైన స్థలమునకే తీసికొనిపోలేక పోయితిని. సూర్యనారాయణ యతనిదుఃఖముయొక్క ప్రథమోద్వేగము తగ్గినదని తెలిసికొని 'నాయనా! యేడ్చి యేడ్చి యేమి లాభము? ఆకట్టెలో నేమున్నది' యనెను. ధర్మారావు 'ఏమయ్యా! అట్లనెదవు? అది కట్టెయా? నా జీవితసర్వస్వము దాని నెత్తురులో, బొమికలలో, మాంసములో నున్నది' యనెను. సూర్యనారాయణ 'నాయనా! నీయంత చదివినవాఁడు లేడు! గిరికకు మోక్ష మిప్పించినది నీవు. కుక్క ముట్టుకొని పోయిన యన్నమువంటి మంగమ్మను శుద్ధిచేసినది నీవు. చచ్చిపోయిన రాజును మాటల పారప్పలో నిలిపినది నీవు. నీవు తెలియనివానివలె వాపోయినచో నేమి లాభము?' అనెను. రామచంద్రరాజు 'ధర్మ! నాయనగారీ దుఃఖము నన్నను భవించుమని పోయినారు. పెద్దవాఁడను, బ్రదికియున్నందుకు నిది నాపాలఁబడినది. నేనున్న

వాఁడను తునిలోనుండక యీ దుఃఖము త్రివ్వుకొనుటకిచ్చటికి వచ్చినాను. నాయనా! యేడువకు' మని యోదార్చెను. ధర్మారావు దుఃఖము పట్టలేకపోయెను. నేలపైఁబడి పొఱలాడుచుండెను. అరుంధతి శవము[illegible]బడి బాదుకొనుచునే యుండెను: ఎవ్వరును నతనిని బట్టు కొ[illegible]రి. రథంతరి యపుడు వచ్చి "నాయనా! నీ వేమో యో[illegible]డ వనుకొన్నాము. ఇంతేనా? దుఃఖము మానెదవా? నన్ను ముట్టుకొని యోదార్చు మందువా?" యనెను. ధర్మారావు రథంతరికి నమస్కారముచేసి దుఃఖము మానెను. తెల్లవాఱినది.

# ముప్పదిమూఁడవ అధ్యాయము

రంగారావుగారు క్రమక్రముముగా నారోగ్యవ ... రి. ఆయన కొన్నాళ్ళు మేఁడమీఁదనే యటునిటు నడచెను. మ ... మేడదిగి కఱ్ఱపుచ్చుకొని కోటలోనే విహరింపఁజొచ్చెను. ... జ నకు నాయన క్రమక్రమముగా నారోగ్యవంతుఁ డయ్యెను. అరుంధతి చనిపోయినతరువాత నాల్గునెలలకు రంగారావుగారు సంపూర్ణముగా నారోగ్యవంతుఁ డయ్యెను. తండ్రియారోగ్యము బాగుపడినకొలఁది కొడుకు సర్వవ్యవహారములు నాయనయే యొప్పఁజెప్పుకొనచుండెను. రంగారావు కొడుకు వ్యవహారము నీవేచూడు మనలేదు. హరప్ప నేను చూచుచున్న వ్యవహారము మఱల నాయన కొప్పఁజెప్పుట యెందు కని యనుకొనలేదు. పుష్యమాసము వచ్చునాఁటికిఁ గోఁత లన్నియు నైపోయినవి. కుప్పలు వేసి నూర్చుచుండిరి. చలివేయుచుం డెను. రంగారావుగారుసంపూర్ణారోగ్యవంతుఁడయ్యెను పుష్యమాసము గడచిపోయి మాఘమాసము వచ్చెను. మల్లెపూవులు పూచి, మాఘ్యము లన్న తమపేరు సార్థకపఱచుకొనెను. విరిసిన ప్రతిమల్లె పూవును హరప్పవలె నుండెను. అవి మఱునాఁటికి వాడుచుండెను. కీర్తివలెఁ దెల్లనైన రేకలుగల మల్లెపూవులు వికసించి దిగంతములను సువాసనాభరితము చేసి, నాల్గుదిక్కుల సంగీతముతో నించిన భ్రమ రికి నాస్వాదనయోగ్యమధు వర్షించి యీ మల్లికాకుసుమము మఱు నాఁటికల్ల వాడిపోయిన దేమి! దానితొడిమయే వాడిపోయినది. వాడిపోయిన తొడిమయందుఁ బట్టు నిలువక పూవు చెట్టునుండి జాఱిపోయినది. వడిపోయియు నీవల్లికాకుసుమము మఱింతవాసనయే వెదలగ్రక్కునుగాని యల్పజాతికుసుమమువలె వాడిపోవుటయు, వాసన లేకపోవుటయు నొక్కసారి కాలేదు. వకుళమాలిక సమ్మర్దసురభి, మల్లికాప్రసూనము ప్రచ్యుతిసురభి.

ధర్మారావును, వరప్పయుఁ బుష్యబహుళ గడిచిన సాయం వాహ్యాళిపోయిరి. ధర్మారావు మొగమున నాఱునెల లైనను విషాద రేఖ ప్రత్యగ్రముగా నుండెను. హరప్ప - మీ రింక నెన్నాళ్ళు

లా పతివ్రతకొఱకు దుఃఖపడెదరు. అందఱును మిమ్ము యోగు లను కొనెదరు. యోగులకింత దుఃఖ మెందులకు? ధర్మా—నేను యోగిని కాను. నలుగురును నావిషయములోఁ బొఱపాటు పడుచున్నారు. నేను ...యందే బద్ధానురాగుఁడను. ఆమె పోయిన తరువాత నా...కము మహాంధ్యమై పోయెను. నా జీవిత మింక వృధా! పసివా...లముగా బ్రతుకుచుంటిని గాని నేను బ్రతుకవలసిన యవసరము లేదు. హారప్ప - ఱేపటినుండి మాఘమాసము కదా! ధర్మా-అవును. మాఘమాసమంతయుఁ దెల్లవాఱకముందు స్నానము చేసి మాఘపురాణము వినుచుఁ గాలముగడపినచోఁ బుణ్యవంతు లగుదురు. హారప్ప - ప్రొద్దుననే లేచి స్నానముచేయుటకు మీ బ్రాహ్మణులు తగుదురు ధర్మా—మీరు మాకన్నఁ దక్కువ కాదు. చేయవలయునన్న విశ్వాస మున్నచో నందఱును జేయవచ్చును. ఇంగ్లీషుచదువు విద్యార్థు లేజాతివారైనను హాస్టలులో నివసించు వారు చక్కఁగాఁ బ్రాతస్స్నానములు చేయుదురు. అది ఆరోగ్య మార్గ మని వారి విశ్వాసము. హారప్ప— ఈ స్నానములు చేసినచో నే దేవునకు ప్రీతి? ధర్మా—సూర్యునకు.

హారప్ప — సూర్యుఁడు నారాయణమూర్తియేకదా! ధర్మ—నారాయణమూర్తియే! హార—మీ మన స్సిక్కడ లేదు. ధర్మా-క్షమించవలయును. మీరు ఱేపటినుండి మాఘస్నానములు చేయుఁడు. హార-రాజ్యభారమంతయు నానుండి వదలినది. ఇంక నేనేమి చేసినను జేయవచ్చును. అని పనులునును నాయనగారే చూచుకొను చుండిరి. కొంచెము విచారించిచూచినచో నే నెందుకు జన్మమెత్తితినో యదియైపోయిన దనిపించుచున్నది! ధర్మారావు మాటాడలేదు. హార-మీరుచాలవిషయము లీరీతిగా ధ్వనింపఁజేయుదురు. మీరు నేనువచ్చిన పని యైపోయిన దనఁగా, సమాధానము చెప్పకపోవుటచేత నైనట్లే యర్థమగుచున్నది. అయినచో నే నింక బ్రదికి యెందులకు? ధర్మా-అయ్యా! ఆయుర్దాయమునకు మనమా యధికారులము? ఎవని పూర్వ జన్మకృతకర్మప్రకారము వారు బ్రదుకుదురు. ఎవరి ప్రారబ్ధ మెట్టిదో! హార — మీకుఁ దెలిసికూడ నా సంగతి చెప్పుట లేదు. ధర్మా—నాకుఁ దెలిసినచో నాభార్యమృతి తెలియదా? నాభవిష్యత్తు నాకుఁ

దెలియదా ? నే నింత విచారించుట యెందులకు ? హార—నేను తేప టినుండి మాఘస్నానములు చేసెదను. ధర్మా—చిత్తము. హార—మీరుగూడఁ జేయవలయును ధర్మా—నా కేమి పని యున్నది ? పదునాఱేండ్లనుండి యవ్యవహితముగా మీసాము ; తినుచు[illegible]యుం టిని. భుక్తికొఱకు వెదకుకొను నవసరము లేకుండ మీ[illegible] భార్య యేమో చనిపోయెను. నే నేది చేసినను చేయవచ్చు[illegible]ట్లే! హార—నే నొక్కఁడను స్నానముచేసి దేవాలయములోనికిఁ బోయి కూర్చుండుట బాగుగా నుండదు. మీరుకూడ నుండినచో నా మనస్సునకు దండిగా నుండును. ధర్మా—అట్లే చేయుదము. హార—పట్టుబట్టలు కట్టుకొని రావలయునుగదా! పురాణము లే దేవాలయములో జెప్పెదరు ? ధర్మా—నాగేశ్వరస్వామి యాలయములో. హార—ఇద్దఱమును గోపాలస్వామివారి గోడమలుపు తిరుగుసందువద్దఁ గలసి కొందము. నేను ముందువచ్చునచో మీ కొఱకు కాఁచెదను. మీరే వచ్చినచో నాకొఱకు కాచవలయును. ధర్మారావు నవ్వెను. హార—నవ్వెద రెందులకు ? ధర్మా—అట్లే. హార—మీ మొగమున నవ్వు చూచి యెన్నాళ్లైనది ? మీరు నవ్వినప్పు డెంతయందముగా నుండు ననుకొందురు. మీ భార్యగారు మిమ్మంత ప్రేమించిన దనఁగా మీ సౌందర్యమే కారణము. ధర్మా—నేను మీకన్న నందగాఁడనా ? ప్రభువులు సహజముగాఁ దేజస్సు కలవారై యుండురు. హార—మాఁటి వార్తికము, మీ దసలుమాత్రము. ధర్మా—కౌముది మఱచి పోలేదే! హార—పోలేదు. ధర్మా—మీరు చదివిన చదువంతయు నింత గట్టిగాఁ జదివినారు. హార—మీ రంత గట్టిగాఁ జెప్పినారు. మీ చదువు చెప్పుట యొకవిచిత్రమైన ఫణితి. బుద్ధిమంతుఁడైన శిష్యునకు మీరే భగవంతులుగాఁ గనిపించెదరు మూర్ఖునకు మీరు మిక్కిలి గర్వులుగాఁ గనిపించెదరు. మీరు విమర్శించి చక్కఁగాఁ జెప్పెదరు. దాని నందుకొనుటకు మనస్సు పరిపక్వమై యుండవలయును. మీరు జన్మతః ఉపాధ్యాయులు. అట్టి మీ రుపాధ్యాయ వృత్తిఁ జేయకుండుట దేశమునకు నష్టము. ధర్మా—ఒక వేళ నేను మీరు చెప్పినంతటి యుత్తమగురువు నేయైనను దానిఫలితము నా కిదివఱకే దక్కినది. ఆ కళాశాలలోనికిఁ బోయినచోఁ గుమారస్వామి

వలె నగుటయే కదా! హర — ఆయనకు వెనుకముందులు లేవు. మీరు చక్కఁగా విచారించి యవసరమైన యంశములనే తీవ్రముగా విమర్శింతురు. మీ వాగ్ధోరణిలో నొకమాధుర్య మున్నది. ధర్మా — ఆత్మీయు [illegible]కును మనోహరులుగానే యుందురు. వారిగుణములు రమ్య[illegible]యుందురు. హర — ఒకరిగుణముల రమ్యతవలననే య[illegible]రి కాత్మీయుఁడైనచో నచ్చట మీ రిల్లు త్రోసివేయు వేయలేరు ధర్మా — మీరు వాదనలోఁగూడ ప్రౌఢమార్గము లందుకొనుచున్నారు. హర — ప్రొద్దుపోయినది. ఇంటికి మరలుదమా?

ధర్మారావున కాపూఁట కొంతమనస్సున కాహ్లాదమైనది. కొంతదూరము వచ్చి యిరువురును విడిపోయిరి. ధర్మారావు వెలుగుచున్న విద్యుద్దీపములవరుస కొంతదాఁటి వెనుకకుఁ జూచెను. వెనుక నాల్గుస్తంభము లున్నవి. ముందుకుఁ జూచెను. మూఁడు స్తంభము లున్నవి. ఇది ధర్మారావుగారి సందు. ధర్మారావు తన యింటిగడపలోఁ గాలుపెట్టెను. ఒక్కసారిగా దీపములన్నియు నాఱిపోయినవి. విద్యుత్ప్రవాహ మాఁగిపోయిన దనుకొనెను. అతఁ డింటిలోనికిఁ బోయెను. రామేశ్వరశాస్త్రి నిద్రపోవుచుండెను. కట్టవానివద్దకుఁబోయి చెక్కిళ్లు నిమిరెను. రాజేశ్వరుఁడును నాంచారమ్మయు ధర్మారావుతోనే యుండిరి. ఆమెపిల్లలందఱును నిద్రించుచుండిరి.

ధర్మా — అక్కయ్యా! నా కొక మడిబట్ట యెండవేయుము. తేపటినుండి స్నానముచేసి దేవాలయములోనికిఁ బోవలయును. నాంచారమ్మ — రామేశ్వరశాస్త్రి కీనాఁడు గండము తప్పినంతపనియైనది. ధర్మా — ఎందుచేత? నాంచా — నూతివద్దకుఁ బోయినాఁడు. ఒక కాలు జారినది నూతిలోఁ బడెడివాఁడే. కాని మీబావ వెంటనే పట్టుకొనెను. ధర్మా — కుమారస్వామి తీసికొనివచ్చి దిగఁబెట్టినాఁడా? నాంచా — అవును. ఇవ్వేళ నీకేదియో యుత్తరము వచ్చినది. ప్రొద్దున చెప్పుట మఱచిపోయితిని.

ధర్మారా వుత్తరము తీసికొని చూచెను. పశుపతి 'నిన్నుఁ జూడవలెనని యున్నది. ఒక్కసారి తప్పక ర' మ్మని యుత్తరము వ్రాసెను. నాంచారమ్మతోఁ జెప్పెను. ఆమె 'నీ విక్కడ నేదియో రీతిగా నుంటివి. ఒకసారి యచ్చటికైనఁ బోయిరమ్ము. మనస్సు కొంత

కుదుటఁబడు' ననెను. ధర్మా - ఈ నెలనాళ్ళును బోవుటకు వీలులేదు. చిన్నబాబు మాఘస్నానములు చేయు నఁట. నన్నుఁగూడ నాయనతో రమ్మనెను. నాంచా- తక్కిన యేజమిాందారులకు నీపిచ్చిలేదు. ఈయన కింత భక్తి యేమిటి? ధర్మా- లేక యే మమ్మా? పూర్వము కృష్ణమనాయఁడుగారు, రుక్మిణమ్మరావు[illegible]ారి భక్తి చూడు. నాంచా- వారిమాట కాదు. ఇప్పటి [illegible]ల మాట! ధర్మా- ఈయన యీ కాలపువాఁడు కాదు. నాంచా-ఈ కాలములోఁ బుట్టినవాఁ డీకాలపువాఁ డెందుకుఁ కాఁడు? ధర్మా— గిరిక యీ కాలములోఁ బుట్టినది! ఈకాలపుదేనా? నాంచా— ఆలాగున నందువా? నిజమే. కొందఱు తమకుఁ గానికాలములయందుఁ బుట్టుదురు. కాని వారు తమపనియైనంతనే తాము పోవుదురు. రామేశ్వరశాస్త్రి నిద్రలోఁ గలవరించుచుండెను. 'అమ్మా! ఎవరికోసము వచ్చితివి?' నాంచా— నాయనా! కుఱ్ఱవాఁడు కలవరించుచున్నాఁడు. కలలోఁ దల్లి కనిపించినది కాఁబోలు! ధర్మారావు పోయి కుఱ్ఱవానిని జిచ్చికొట్టెను. నాంచా—పిల్లవాఁడు రోజురోజునకు చిక్కిపోవుచున్నాఁడు. ఏదైన మందిప్పించుకొనుము. ధర్మా—ఇదివరకు భయపడినానుగాని యింక భయము లేదు. నేఁటిగండముతో వాని చెడ్డరోజులు పోయినవి. ఇంక బ్రదుకును. రామేశ్వరశాస్త్రి మఱలఁ గలవరించెను: 'నీవు మమ్ము వదలిపెట్టి పోయితివికదా! మఱల నెందుకు వచ్చితివి?' ధర్మా- నాయనా! నీకెందుకు? కలవరించకుము. పండుకొనుము అని మఱలఁ జిచ్చికొట్టెను. రామేశ్వరశాస్త్రి నిద్రలేచి మంచితీర్థ మడిగెను. నాంచారమ్మ "నాయనా! ఏమిటి కలవరించుచుంటి" వనెను. శాస్త్రి-అమ్మ వచ్చినది. నీవు మఱల నెందుకు వచ్చితి వని నే నడిగితిని అనెను. నాంచా- ఏమన్నది? ధర్మా- వాఁడు కలవరించుచుండఁగా నీ యా ప్రశ్న యేమిటి? శాస్త్రి మంచితీర్థము త్రాగి మఱలఁ బండుకొనెను. నాంచా— నాయనా! వానికిఁ దల్లిమిాఁది దిగులు పోలేదురా! ధర్మా—అవునమ్మా! కొంచెము బుద్ధి తెలిసినతరువాత నిదేయిబ్బంది. నాంచా- అందుచే వాఁడు మఱీ తెలివికలవాఁడు. ఇంతకును వాని

కర్మ మట్లు వ్రాసినది. ఏనాఁ డే తల్లి కొడుకుల నెడఁబాపెనో యీనాఁ డి ట్లనుభవించుచున్నాఁడు.

ధర్మారావు భోజనముచేసి పరుండెను. కనులు మూసినంతనే యరుంధతి కనిపించెను. ధర్మారావు "నీవు న న్నింకను వదలి [illegible] నేను జాతిగుండెవాఁడను. నీవు వదలిపోయినతరువాతఁ [illegible]దికియే యుంటిని. ఈ నిర్దయస్వాంతుని నీ వేల వదలలే కున్నావు? నీవెంట వత్తు నని యెన్నిసార్లైన నూహించితిని. పసి వానిని వదలి రాలేకున్నాను. నన్నుఁగూడ నీవెంట రమ్మందువా?" అనెను. అరుంధతి మఱలఁ గనిపించలేదు. చీకట్లు సుడులుసుడులుగాఁ బొరలుపొరలుగా గుడుసులు పడి దట్టముగాఁ గ్రమ్ముకొనెను.

హరప్ప ధర్మారావు లిర్వురును బ్రొద్దుననే కలిసి రెండు దేవాలయములకు మధ్యనున్న సందులోనుండి పోవుచుండిరి.

హరప్ప- ప్రొద్దుననే స్నానముచేయుట చాలకష్టము సుమండీ! అందులో నీ నెలలో నీ నాఁడు చాల కష్టమైపోయినది. ధర్మా- జే పింతకష్ట ముండదు. హరప్ప- పదిరోజులలో నసలే కష్ట ముండదు ధర్మా- అవును. పదిరోజు లే మనిసి కష్టపడఁడు. హర- నేను కష్టపడఁగలను. ధర్మా- ఒకఁడు కష్టపడఁగలుగుట కష్ట మనుభవించియుండుట. అందుకనియే మనపూర్వులు ధనవంతులబిడ్డలకుఁ గూడ చదువు కష్టపడునట్లు చేసియే చెప్పిరి. హర- కష్టమున కల వాటుపడుటకుఁగూడఁ బ్రకృతిలోఁ గొంత యానుకూల్య ముండవల యును. ధర్మా- పూర్వరాజుల యిండ్లలోఁ గష్టముపడఁగలిగినవారే పుట్టిరి? ఇప్పుడు కష్టముపడలేనివారే పుట్టుచున్నారు. సందర్భము లనుబట్టి మనిసి తా నొదిగి సంచరించును. మనిసి యొదుగుట యొదుగలేకపోవుటనుబట్టి సందర్భములును వివృతసంవృతము లగు చుండును. సృష్టి చాల చిత్రమైనది. ఒక మహాభావమును యోగి దృష్టిమాత్రముచేతఁ బ్రకటింపఁజేయును. అతనికన్నులలోని జ్యోతిస్సు మిరమిరలాడిపోవును. గాయకుఁ డా భావమునే కంఠధ్వని చేతఁ జెప్పును. కవి దానికొఱకే పెద్దవృత్తము నాశ్రయించును,

గద్యరచయిత విస్తరించి యొక పదివాక్యములు చెప్పినఁగాని తేలదు. హారప్ప- ఆలయములోనికి వచ్చితిమి.

ధర్మారావు నను కొనెను. పురాణము కొంతసేపు విని, పురాణమైన తరువాత నిర్వురును సుబ్రహ్మణ్యస్వామియా లోనికిఁ బోయిరి. అందు గణాచారి కూర్చున్నది. వీరి జూచి నవ్వినది. అర్చకుఁడు వచ్చి విభూతియు, మారేడుదళములు నిచ్చెను.

ధర్మా- ఏమయ్యా! ఆ విఱిగిపోయిన మూఁడవకాలు పదు నాఱేఁడులైనది- బాగుచేయించవా? అర్చకుఁడు—బాగుచేయించి రెండేండ్లయినది యనెను. ధర్మా—నాతో నెవ్వఁడును జెప్పకపోతి వేమి? అర్చ—చిత్తము, చిత్తము. గణాచారి మందహాసముచేసెను. ధర్మారావు పెదవి విఱచెను. హారప్ప యది చూడలేదు. అర్చకు నకుఁ దెలియలేదు. గణాచారి కన్నులలోమాత్రము నల్లని మూపొకఁ డుద్భవిల్లి చిన్ననల్లని మొగిలురేకవలె వెలికిఁ దారాడెను. సాయం కాలము హారప్ప ధర్మారావులు వాహ్యాళి పోయిరి. పోయినచోట మెట్టపొలాలు. అచటఁ గూర్చుండిరి.

హారప్ప- ఈపొలాలుకూడ మాగాని చేయుదురట. ధర్మా- ఎప్పుడు? హార—మఱలఁ గాలువలు వచ్చినంతనే. ధర్మా—దీనికి నీ రెక్కడా? హార- ఎక్కడవఁట. ఈయేడాది చూచి నీరెక్కక పోయినచో గుండేటికి కట్టుకట్టి నీరెక్కించెదరఁట. ధర్మా- అదియే నా యడ్డుకట్ట కట్టుచున్నారు. అయినచో ముందునాఁటికే గుండేటి నీరు వచ్చునన్నమాట. అన్నంతలో ధర్మారావు మొగము విషణ్ణ మయ్యెను. హారప్ప 'మీ రట్లయినా రేమి?' అనెను.

ధర్మా- ఏమియును లేదు. ఒక్కొక్క-జీవికి భగవంతుఁడు కష్టములే వ్రాసిపెట్టును. ఎవఁడు ఱాతిగుండెవాఁడో యెవఁ డనుభ వించగలఁడో వానికిఁ దెలియును. కృతయుగపురుషులశరీరములు బొమికలు మిగులుదాఁక ప్రాణములు నిలుపుకొనెడివఁట. రామా యణభారతయుద్ధములలోని పురుషులశరీరములు చూడుఁడు: బాణము లీవైపునుండి యావైపునకు దూసికొనిపోవును. దేహ మంతయుఁ జిల్లులుపడియుండును. వారికిదెబ్బ యాయువుపట్టునఁ దగి

లినఁగాని ప్రాణములు పోవు. అటువంటి గుండెకాయ లోకానోకని కుండును. వాని కెన్నియైన నాపదలు రావచ్చును. వానిహృదయము నిరంతరదుఃఖములచేత శీర్ణమైపోవును. కాని వాఁడు చావఁడు. నా గు[illegible]వంటిది హర- మీకుఁ బ్రతిమాటకు నరుంధతీదేవి గార[illegible] వత్తురు. నే నేమి చేయుదును? నాకు భగవంతుఁడు పదియు[illegible]ృష్టిమీఁది ప్రభుత్వ మిచ్చినాఁడు కాని, జరామృతులమీఁద నధికార మిచ్చినచో బాగుగా నుండెడిది. ధర్మా- (నవ్వుచు) మీవలన నప్పు డింకొక క్రొత్తమత ముద్భవిల్లెడిది. హర- క్రొత్త మతమే పుట్టించవలయునన్నచో జరామరణములమీఁద నధికార మక్కఱలేదు, కబీ రనుకొనలేదు కాని, దేవదాసిమత మని యొకఁడు పుట్టించవచ్చును. మనస్సులో దానికిఁ దగినంత కృతకత్వ ముండవలయును. మూర్ఖుల కేమి? లక్షమంది యనుయాయులు దొరకుదురు. ధర్మా- పసిరిక యీ నాఁ డిచ్చటికి రాలేదు కాఁబోలు! హర- పసిరిక యింక నెచ్చట తిరుగును? ధర్మారావు మొగమున మఱల విషాదరేఖ యుదయించెను. దూరమున నొక్క పురుషుఁడు - పరమనాగరకునివలె వేసము ధరించినవాఁడు - తుపాకి యొకఁడు పుచ్చుకొని పక్షులను వేఁటాడుచుండెను. హరప్ప- 'ఆ మనిసి యెవ' రనెను.

ధర్మా- చంద్రారెడ్డి కొడుకు, పేరు గోపాలకృష్ణరెడ్డి. హర- అచ్చముగా దొరవలె నున్నాఁడే. ధర్మా- అట్లే యున్నాఁడు.

ఇరువురును గదలి యింటికిఁ బోయిరి. హరప్ప యారాత్రి యెల్ల నొక్కటియే యాలోచన: "నే నెన్నఁడును బరిహాసముగా మాట్లాడను. ఈ నాఁ డేల మాట్లాడితినో? ముక్కాలిపీఁట పదునాఱేండ్లక్రిందట విఱుగుట యేమిటి? రెండేండ్ల క్రిందట దానిని బాగు చేయించుట యేమిటి? నవీనగణాచారికన్నులు నల్లపడుట యేమిటి? ఇందులో నాకథ యేమో యున్నట్లున్నది. వేయిపడగలస్వామి రెండుపడగలనాఁ డయ్యె నని ధర్మారావుగా రనును. నా కంతకన్న నెక్కువ పడగలు కనిపించుచున్నవి. శీర్ణములైనను వేయిశిరసుల నాగు నాకు గోచరించుచునే యున్నాఁడు. మా నాయనగారికి మఱల నారోగ్యము వచ్చినది. నా కేమియుఁ బనిలేకుండ నున్నది. నా

యీడువారు, తోడి జమీందారులు బహువేషములు వేయుచున్నారు. చెన్నపురికిఁ బోవచ్చును, కాదా, బొంబాయికిఁ బోవచ్చును. కాలము గడుపవచ్చును. హరప్పకు మనసులో నవ్వు తోఁచెను యమపురికిఁ బోవచ్చును. కాలము వ్య[illegible]చేయవచ్చును. వ్యయముచేసిననేకదా యమపురికిఁ బోవుట. [illegible]పురి కేల పోదును? మఱి యెచ్చటికిఁ బోదును? స్వ[illegible]ఁ బోదునా? నేను చేసిన మహాకార్యము లేమి యున్నవి? తల్లికిఁ గర్మలు చేసితిని. స్వామికి గల్యాణోత్సవములు చేసితిని. ఇవి నా ధర్మములు గనుక నేను చేసితిని. ఏదో శాస్త్రము చెప్పినట్లు - 'అలి కన్నము పెట్టుట యూరి కుపకారమా' యని- నాతల్లికి నేను కర్మలుచేసికొనుట యేమిటి- నా స్వామికి నే నుత్సవములు చేసికొనుట యేమిటి - నాకు స్వర్గ మెందుకు? ఇట్లే యూహించుచు నూహించుచు రాత్రియంతయుఁ గడపెను. నిదురపోవుద మనుకొనును. కనులు మూసికొని యూహ రానీయకుండ నొక్కనిముసముండును. అతనికిఁ దెలియకుండఁగనే మఱల నూహలు వచ్చును. మఱల గంటసే పూహించికాని 'యయ్యో! మఱల నూహించుచుంటిని. నిద్రపోవలయు' నని ప్రయత్నించెడు. మఱల యథాప్రకారము బజారములో రెండు, మూఁడు, నాల్గు గంటలు కొట్టెను. కోళ్ళుకూసెను. తూర్పు రేకలు తోఁచెను. హరప్ప పోయి స్నానము చేసెను. పోయి వేణుగోపాలస్వామివారియాలయముముందు నిల్చుండెను. ధర్మారా వెంతసేపటికిని రాలేదు. హరప్పగారు నిలుచుండి నిలుచుండి, కాళ్ళు గుదులువట్టి వేణుగోపాలస్వామివారియాలయ గోపురముమెట్లమీఁదఁ గూర్చుండెను. ధర్మారావు వచ్చెను. వచ్చి హరప్పగారిని జూచి యిట్లనుకొనెను: 'ఈయన యేమిప్రభువు! ఈ రీతిగా మెట్లమీఁదఁ గూర్చుండుటకుఁ గొంచెపు టుద్యోగస్థులైనను గౌరవహీనమనుకొందురు. ఈయనమనస్సు నర్థము లేనిరీతి యుఁ, గల్పిత గౌరవమును సమాశ్రయించక సద్విషయములను, విషయములయొక్క యాథార్థ్యమును గ్రహించుచున్నది. ఈయన యీ కాలమునకుఁ దగినవాఁడుకాదు,'' ధర్మారావు దగ్గఱకువచ్చి చూచెను. హరప్ప కన్ను లెఱ్ఱబడి జోతులవలె నుండెను.

ధర్మా - కన్ను లంతయెఱ్ఱగా నున్న వేమి? హర - మీరీ నాఁడు చాల నాలస్యముగ వచ్చితిరి. ధర్మా - కాదు, వేళకే వచ్చితిని. హర - అయినచో నేను చాలపెందలకడ వచ్చితిని కాఁబో[illegible]ర్మా - చాల తొందరగా మేల్కనితి కాఁబోలు! హర [illegible] నిద్దురయే పట్టలేదు. ధర్మా - ఎందుచేత? హర - నిన్న స[illegible]కాలమున మీయందలి విషాదచ్ఛాయలు నామీఁదఁ బ్రసరించినవి. అయినను నాకు బ్రతుకుమీఁద నిచ్ఛలేదు. ధర్మా - అట్లవాచపుమాట లనఁగూడదు? హర - అట్లనగూడదుగాని యట్లు జరుగవచ్చునుగాఁబోలు! ధర్మా - మీరు వివాహము చేసికొనినఁగాని మీ కుత్సాహము గలుగదు. మీకు నే నొకఁడను బట్టితిని. హర - మీ రేమి చేసితిరి? ధర్మా - ఏమి చేసితి నేమిటి? ఏమి చేయలేదు? మీ జీవిత మింతవఱకు హద్దులలోఁ బెట్టితిని. మీ కన్నియు విసవ్రటూహా లెక్కించితిని. తోడి జమీందారుపుత్రులు సర్వసుఖనిలయులై యున్నారు మీ రేమో మాఘస్నానములు చేయుచున్నారు. హర - మాఘుని శైత్యము నా కెక్కుచున్నది. చివరకు నాశరీరమెల్ల నీ శైత్యమే యావరించునేమో! ధర్మా - శ్రీరామచంద్ర! హర - అట్లనెద రేమి? ధర్మా - తమరు స్నానముచేయునపుడు నేను చెప్పినట్లు చేయుచున్నారా? హర- చిత్తము, యథావిధిగాఁ జేయుచున్నాను. సంకల్పము చెప్పుకొనియే చేయుచున్నాను. మీరు చెప్పిన శ్లోకములన్నియుఁ జదువుచుంటిని. మాతల్లికి, నాయనమ్మగారికిఁ, దాతగారికిఁ దర్పణము లిచ్చుచున్నాను. కాని, మీరు నాకుఁ జెప్పిన వన్నియు శ్లోకములేకదా! ధర్మా - అవును.

గుడిలోనికిఁ బోయిరి. పురాణము వినిరి. సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని దర్శించిరి. ఇంటికిఁ బోయిరి. హరప్పకు భోజనము సంగా సయించలేదు. ఆయనకు నిద్రపట్ట లేదు. అసలు పగలు నిద్రించుటయే యలవాటు లేదు. కాని రాత్రి నిద్రలేదుకదా యని పోయి పండుకొనెను. నిద్రాదేవతఁ బవ లాయనయొద్దకు వచ్చుట యలవాటు లేదు. కాన రాలేదు. పొద్దువాటారువేళకు హరప్పగారికిఁ దలకొంచెము నామగా నుండెను. నిమ్మకాయలరసములోఁ బంచదార, కుంకుమపువ్వు గలిపి ప్రతిదినము ను మధ్యాహ్నమునం దతఁడు త్రాగు

చుండును. చల్లనిగుడ్డలోఁ జుట్టబడియుండుటచేత నదితాగి, హరప్ప తృప్తిపడెను. తలనాదు కొంచెము తగ్గెను. పరిచారకుఁడు "బాబుగారు తలనాదుగా నున్నప్పుడు కాఫీ త్రాగుదు" రనెను. ఆయనవద్ద సాహసించి యెవ్వరును మాటాడఁడు. హరప్ప కన్నులెత్తి వానివంకఁ జూచెను. వాని కనుఱెప్పలు క్రిందికిఁ బడెను. సా[illegible]యున మఱల హరప్ప ధర్మారావులు మెట్టచేలపైఁ గూర్చు[illegible]రము నందుఁ బాలకు సరిచేసి గట్లు పోయుచున్నారు.

ధర్మా - అదిగో మాఁగాని యెత్తుకొని వచ్చుచున్నది. హర- సుబ్రహ్మణ్యేశ్వరస్వామి యెవరు? ధర్మా - విష్ణుమూర్తి. హర - మఱి శివాలయములో నున్నాఁ డేమి? ధర్మా - శివునకు నాయనకు స్నేహము. హర - మీరు వారు వలెరా? ధర్మా - మీరు మా యింట వచ్చియుండిరా? హర - ఉండు మందురా? ధర్మా - నా యిల్లు పేదది. మీరు వచ్చినచో భరింపలేను. హర - లక్ష్మీదేవికి భర్తయైన విష్ణువుపోయి శివుని యింటిలోనుండఁగా నాయన నది భరించుట లేదా? ధర్మా - మాలిమిచేత విష్ణు వచట నొదిఁగి యొదిగి యున్నాఁడు. హర - నేనును వినయ మవలంబించఁగలను. ధర్మారావు నవ్వెను. హరప్ప ధర్మారావువంక నిశ్చలముగాఁ జూచెను. హర - నావద్ద నంతవినయము లేదనియా? ధర్మా - ఆ విష్ణువు వాని యిష్టమువచ్చిన పనులు వాఁడు చేయును. ఆయనయందు నమ్మికలేనివారు తప్ప తక్కినవా రాయనను విమర్శించరు. పదునాల్గు లోకముల కాయన ప్రభువు. పదునాల్గులోకములయందు రాక్షసులు మాత్రమే యాయనను కాదందురు. ఆయన వారికి సంహర్త. తక్కినవా రాయనకు భృత్యులు. ఆయనమాట లందుకని సాఁగుచున్నవి. విష్ణువు పరమేశ్వరుఁడు. ఆయనయే శివుఁడు, శివుఁడే యాయనఁ వా రిద్దఱకును భేదము లేదు

రాత్రికి భోజనమక్కఱలేదని హరప్పగారు పండుకొనెను. నిద్ర పట్టలేదు. కొంతసేపటికి బయలుదేఱి కోటలో నాల్గువైపుల ఫలవృక్షాదులన్నియుఁ జూచివచ్చెను. కోటయంతయుఁ దిరిగెను. రాత్రి జాముప్రొద్దు పోయినతరువాత మఱల వచ్చి పండుకొనెను "నేను విష్ణువువలెఁ గావలయును. పదునాల్గు లోకములకు నేనే ప్రభువును

గావలయును. ఈయుప్రభుత్వము నాకక్కఱలేదు. ఇదిప్రభుత్వమను కొనుటయేగాని యిందులో నేమి ప్రభుత్వ మున్నది? మాపని తొత్తు క్రిందఁ బడి తొత్తుగా నున్నది. ప్రభుత్వము మాతాతతోనే పోయి నది." హరప్పనాయని కొకకథ జ్ఞాపకమువచ్చినది. ఆ కథ ధర్మా [illegible]నాఁడు. ఒకసారి ఒక గుమాస్తా కృష్ణమనాయని వారివద్ద వీ[illegible]ంచుచుండెడివాఁడఁట! నాయఁ డాయన నొకసారిపిలిచి 'పంతులూ! నీవు చాలగొప్పవాఁడవు. నా యేనుఁగును నీ కిచ్చితిని. తోలుకొని పొ' మ్మనెనఁట. పంతులు 'ప్రభూ! నా కెందు'కని నీళ్లు నములఁగాఁ, గాదని యేనుఁగును వారియింటికిఁ దోలిపెట్టెను. 'ఏమయ్యోయి! ఏనుఁగు జాగ్రత్త. రెండుమూఁడు నెలలు నీవెక్కి తిరుగుచుండుము. తరువాత మా యేనుఁగును మేము తీసికొందుములే' యన్నాఁడు. మూఁడు నెలలైనతరువాత పంతులను బిలిచి యెట్లున్నావని యడిగెను. పంతులు 'ఎట్లున్నా నని చెప్పుదును? మూఁడు నెలల నుండి నాపెండ్లము బిడ్డలును, నేనును దిండిలేక చనిపోవుచున్నాము. మమ్ముఁగూడ నేనుఁగే తినుచున్న' దనెను. నాయఁడు 'అయ్యో, పాపము! ఆలాగా! నీవుకూడ జమీందారు వనుకొన్నానయ్యా!' అని యేనుఁగును దెప్పించుకొని, దానికైన ఖర్చంతయు గుమస్తా కిచ్చి వేసెనఁట. తరువాత నెన్నఁడును బంతులు నాయని నిందించ లేదు. హరప్ప యీకథ తలఁచుకొని 'నిజమే, ప్రభు వన నట్లే యుండవలయును. వారు నిగ్రహానుగ్రహసమర్థులు. వారి నిగ్రహము కూడ ననుగ్రహమువలె నుండెడిది. నిర్దయుఁడైనరాజు బ్రదికియుండుట కన్న చచ్చుటయే మంచిది. కృత్రిముఁడైనరాజుకన్న సర్పదంష్ట్రా విషము మంచిది. అది నెత్తురులోఁ జేరిననే చంపును; త్రావినచోఁ జంపదు. చనిపోవుచున్నవానిని సముద్ధరించును. క్రూరుఁడైనరాజు త్రావినను జంపును.' తెల్లవాఱెను. హరప్ప ధర్మారావులు కలిసి కొనిరి.

హర—ఇదియు బాగుగనే యున్నది. ధర్మా—ఏదియు?

హర—నాకుఁ దెల్లవాఱులు నిదురయే పట్టుటలేదు. స్నానము చేయుటకు వేళకు మేల్కొనవలయునన్న దిగులు లేదు. ఆనాఁడు హరప్పకు భోజనము మాటల సయించలేదు. తలనా దెక్కువయ్యెను. నిమ్మకాయ

రసముతాగినతరువాతఁ గొంచెము తక్కువయ్యెను. రాత్రికి మరల నిదురపట్టలేదు. నవమినాఁడు మధ్యాహ్నము రెండుగంటలకు హారప్పకుఁ దొమ్మిదిరోజుల కానాఁడు నిద్రపట్టెను. మేఁడపైని రంగారావుగారు నిదురించుచుండిరి. రామేశ్వరశాస్త్రి పోయి రంగారావుగారికెదురుగాఁ గూర్చుండెను. ఆయన కన్నులు తెఱచి చూచినప్పటి కనిపించెను.

శాస్త్రి—నాకుఁ దెలిసినది. రంగా—ఏమిటి? శాస్త్రి-మీరు నిజమే చెప్పితిరి. రంగా—ఏమిటో చెప్పుము శాస్త్రి—హారప్ప నాయఁడుగారికి మీరు తండ్రు లన్నమాట నిజమే! రంగా – ఇది వఱకు నీ వొప్పుకొనలేదుగదా! శాస్త్రి—ఇప్పుడొప్పుకొన్నాను. తరువాత నిర్వురును మాటాడకుండఁ గొంతసేపు కూర్చుండిరి. శాస్త్రి లేచిపోవుచుండెను. రంగా-వెళ్ళిపోవుచున్నా వేమి? శాస్త్రి - మీరు జమీందారులు, మాతో మాట్లాడెదరా? రంగా—ఇదివర కెల్ల కాలేదు, ఇప్పుడైనానా? శాస్త్రి—అఁ. నా కిప్పుడు తెలిసినది. ఏదైనను తెలిసినతరువాతనేకదా! రంగా—మీ యమ్మగారు చని పోయినది కదా!

శాస్త్రికిఁ గనులనిండ నీళ్లు గిఱ్ఱునఁ దిరిగెను. అతఁడు మేఁడ దిగి వెళ్ళిపోయెను. రంగారావుగారు 'అయ్యో! నాకుఁ బ్రపంచ జ్ఞానము లే' దనుకొనెను. ఉస్సు రనెను. దాని కిది మొదటిసారి. హారప్ప రామేశ్వరశాస్త్రితో మాట్లాడఁడు. ధర్మారావు రంగా రావుగారితో మాట్లాడఁడు.

హారప్ప పోవుచున్న రామేశ్వరశాస్త్రిని బిలిచెను. శాస్త్రి మొదట సందేహించి తరువాత హారప్ప బలవంతముగాఁ బిలుచుట చేత వెళ్ళి యాయనవద్దఁ గూర్చుండెను. ఇరువురు నేమియు మాటా లేదు. రెండు నిముసములైనతరువాత శాస్త్రి హారప్పతో 'మీతల్లి గారు బ్రదికియున్నారా, చనిపోయినారా' యనెను. హారప్ప 'చని పోయినా' రనెను. శాస్త్రి 'మా యమ్మయుఁ జనిపోయినది' అని యేడ్చుచుఁబోయెను. అప్పటికి నాల్గుగంటలయ్యెను. రామేశ్వర శాస్త్రి దక్షిణద్వారమునుండి వెడలిపోయెను. ఎదురుగా నేడ్చుచు వచ్చుచున్న శాస్త్రిని గుమారస్వామి యెత్తుకొనెను. దూరమునుండి

శ్యామల వచ్చుచుండెను. కుమారస్వామి 'నాయనా! ఎందు కేడ్చుచున్నా' వనెను. శాస్త్రి 'మా యమ్మ లేదుగా' యనెను. కుమారస్వామి 'యెందుకు లేదు, అదిగో చూడు' మని శ్యామలను జూపించెను. శ్యామల చిన్నధర్మారావును దించి వచ్చి రామేశ్వరశాస్త్రి నె[illegible]ను మీ యమ్మను కదా' యని ముద్దుపెట్టుకొని చక్కిలిగిం[illegible] శాస్త్రి నవ్వెను.

దశమినాఁడు మధ్యాహ్నము శాస్త్రి మజిల రంగారావుగారి వద్దకుఁ బోయెను. రంగారావుగారు మేల్కొనియేయుండిరి. శాస్త్రి పోయి తాను ప్రతిదినము గూర్చుండుచోటనే కూర్చుండఁబోయెను. రంగారావు 'నీ వచ్చట వద్దు, ఇట్లు ర' మ్మనెను. శాస్త్రి 'మీరు జమీందారులు. నేను రా' ననెను. రంగారావుగారు లేచి శాస్త్రి వద్దకుఁబోయి 'నాయనా! జమీందారులుకూడ మనుష్యులే. రా, రా' యని చేయిపట్టుకొనెను. ఇరువురును బోయి రంగారావుగారి మంచముమీఁద గూర్చుండిరి. జమీందారు కుఱ్ఱవానిని మీఁద వేసికొనెను; ముద్దాడెను; బాబూ యనెను; నేను నీకుఁ జదువు చెప్పించెదను, చదువుకొందువా యనెను; నీవు బంగారు తండ్రి వనెను.

సాయంకాలము చీఁకటిపడి శాస్త్రి యింటికి బయలుదేరెను. ఆ వేళకు రంగారావు 'మజిల రేపు వత్తువా!' యనెను. 'రేపు వచ్చి నా మీసములు లాగెదవా?' యనెను. శాస్త్రి 'రేపటి బదులుకూడ నిప్పుడే లాగెద' నని లాగెను. రంగారావు కిలకిలానవ్వి కుఱ్ఱవానిని ముద్దుపెట్టుకొనెను. శాస్త్రి వెడలిపోయెను.

ఆ కిలకిలా నవ్వుట కోట యంతయుఁ బ్రతిధ్వనించెను. తొమ్మిది నాళ్ళు నిద్రాహారములు లేక తెలియరానివ్యాధి యేదోవచ్చి పడిపోయినట్టి హరప్పకు స్మృతి యొకఁడు వచ్చెను: 'తనతండ్రి మజిల బ్రదికినాఁడు, తా నేమో చనిపోవుచున్నాఁడు.' దశమినాఁటి వెన్నెలలు శుక్లపక్ష మానాఁడే మొదలుపెట్టినట్లు మిలమిలలాడెను. ఏకాదశినాఁడు ప్రొద్దున హరప్ప స్నానముచేయలేకపోయెను. నడువలేకపోయెను. పరిచారకు లే మనుటకును లేదు. ధర్మారావు నాయని దూరమునుండి చూచి కన్నులలో నీరు పెట్టుకొనెను.

హారప్ప - ఎందు కేడ్చుచున్నారు? ధర్మా - ఈ చల్లనిగాలి కన్నులలోఁ బోసికొని నీరు గ్రమ్ముచున్నది. హార - నేను మాఘ మాసమంతయు స్నానములు చేయుద మనుకొన్నాను. కాని నే నీనాఁడు స్నానము చేయలేకపోతిని; నడువలేక పోవుచుంటిని. ఱేపటి నుండి స్నానము చేసి రాలేనేమో!

పదిగంటలకు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి యాల[illegible]నికిఁ బోయిరి. గణాచారి 'రాత్రి నా కొక కల వచ్చిన' దనెను. హారప్ప- ఏమి కల? గణా - సుబ్రహ్మణ్యేశ్వరస్వామి దేవాలయములోనుండి వెడలిపోయెను. అందందు రెండుతలలతో గోచరించుచుండెను. వెనుక నా మధ్య స్వామి లేచిపోయినట్లు నా కొకకల వచ్చెను. కాని కల కలచివర స్వామి మఱల వచ్చెను. రాత్రికలలో మఱల రాలేదు. హార-సరే తెలియుచున్నదిగదా! ధర్మా - మీ ర ధైర్యపడరాదు.

అర్చకుఁడు బలిపీఠమునుండి విభూతి తెచ్చుచు క్రిందఁ జప్పుడు చేసెను. హారప్ప - 'యేమి టది'యని మంద్రములో ననెను. అర్చకుఁడు - 'అంటించినకోడు విఱిగిపోయినది, నాచేయితగినది'యనెను. గణాచారి - 'ఇంతటితో నైనదా? ఇంకొక నాల్గునెలలు. మఱి యొకకోడు విఱుగును' అనెను. అర్చకుఁడు - 'పీఁట యెప్పు డొక్క-కోటిపైని నిలుచునా?' అనెను. గణా - స్వామియే దేవాలయము వదలిపెట్టిపోవును. నీ కెందుకా దిగులు?

మఱలఁ దిరిగి హారప్పనాయఁడు కోటకుఁ బోలేకపోయెను. ధర్మారావు తాను నెమ్మదిగాఁ బట్టుకొని తీసికొనిపోయెను. రాజశేఖరశాస్త్రిగారు వచ్చిచేయి చూచిరి. ఆయన చేతిలో వ్యాధి యేమియు లే దనెను. రంగారావుగా 'రింగ్లీషుడాక్టరును బిలుచుకొని వత్తుమా' యనెను. హారప్ప 'నాకు వ్యాధియే లేనప్పుడు వైద్య మెందులకు? నెలకుఁ బదివేలు జీతము తెచ్చినను శాస్త్రిగారి కన్న ఘన వైద్యుఁడు లేఁడే!' యనెను.

ఆ మధ్యాహ్నము రామేశ్వరశాస్త్రి వచ్చెను. హారప్ప గదిలోనికిఁ దొంగిచూచెను. ధర్మారా వచ్చటనే యున్నాఁడు. హారప్ప ధర్మారావు లిద్దఱును గుఱ్ఱివానినీ జూచిరి. శాస్త్రి తండ్రి తన్నుఁ జూడలే దని మేడమీఁదికిఁ బరువెత్తెను. ధర్మారా వతనివెంటఁ

బోయెను. పోయి చూచునప్పటికిఁ గుఱ్ఱవాఁడు రంగారావుగారి బుజముపైఁ గూర్చుండెను. ఆయన ధర్మారావును జూడక కుఱ్ఱవానిని బుజముపైనుండి దించి ముద్దుపెట్టుకొనుచుండెను. ధర్మారావున కాశ్చర్యమయ్యెను. వెనుకకుఁ దిరిగివచ్చెను.

[illegible]ంకాలమునఁ బసిరిక హరప్పగదిదాఁక వచ్చెను. అతఁడు కో[illegible]కెన్నఁడును రాలేదు. అతఁడు హరప్ప గదిలోనికిఁ బాము తలయెత్తి జూచునట్లు తొంగిచూచెను. హరప్ప మందహాసముచేసెను. పసిరిక వెన్నువదలి చెఱకుగడవలెఁ దూఁగాడి చిఱునవ్వు నవ్వెను. హరప్ప లేచివచ్చి పసిరికకొఱకుఁ జూచెను. అతఁడు గాలితరఁగవలె నదివఱకే పాఱిపోయెను.

ప్రొద్దుక్రుంకినంతనే వెన్నెలలు శివజటాటవీనటన్మందాకినీ తరంగధూతడిండీరములు నాగేశ్వరస్వామియాలయమునుండి కొట్టుకొనివచ్చి, కోట యను వొడ్డునందుఁ దెట్టెలు కట్టెను. హరప్ప ధర్మారావు లిరువురును గలిసియే యుండిరి. హరప్ప ధర్మారావు నింటికిఁ బొమ్మనెను. ధర్మారావు 'నేను పో' ననెను. ధర్మారావు రంగారావుగారివద్దకుఁబోయి 'రాతిరి రెండుజాములకు మీరు హరప్పగారి గదివద్దకు రావలయును. నేనంతవఱకునువారికిఁదోడుగానుందును. వారికి నిద్రపట్టుట లేదఁట. తరువాత మీరు తోడుండవలె'ననెను.

హరప్ప కేమియుఁ దోఁచలేదు. 'పోయి మేఁడయంతయుఁ దిరిగివత్తమా' యనెను. హరప్ప తాను బ్రతికినన్ని యేండ్లు తన గదియుఁ, దోటయు నెఱుఁగును గాని, మేఁడ యెన్నఁడు నెక్కలేదు. ఒక్కసారియే యెక్కెను. కోట మేఁడలోని తక్కినభాగము చూడలేదు. ఆరాత్రి ధర్మారావుమీఁదనొఱగి హరప్ప మేఁడ యెక్కెను. పైయంతస్థునకుఁబోయెను. అచ్చటినుండి వెన్నెలలవంకఁ జూచెను. ఏమి వెన్నెలలు! గిరికయాత్మ పొంగి తెల్లనితరఁగలైనట్లు, కృష్ణమనాయనియశస్సముద్రమునకుఁ బోటువేళ వచ్చినట్లు, యశోదాతనయుని బాలకృష్ణుని పాలనురుసు వెలవివెంట నవ్వులతోఁ గలసి వచ్చినట్లు, శ్రీ నాగేశ్వరస్వామివారి తనువైన సర్వజగత్తు భూతిపూఁతలు పులుముకొన్నట్లు, శ్రీసుబ్రహ్మణ్యేశ్వరసహస్రఫణామణిసితచ్ఛవిపూరము తరఁగలుతరఁగలుగా వచ్చినట్లు, ఆకాశమను మల్లెపందిరి

యాకులన్నియు నూడ్చి సర్వత్రః పుష్పించినట్లు వెన్నెలలు పవిత్రములు సుమనోహరములునయ్యెను. హరప్ప కొన్ని వెన్నెలలను బుక్కిలించెను. కొన్నిటిని శిరసాధరించెను. కొన్నిఁటిని గాగిలించుకొనెను. కొన్నింటిని తెప్పలతో నప్పళించెను.

రాత్రి రెండుజాములైనది. రంగారావుగారు [illegible]ది లోనికిఁ బోయి కొడుకు నచటఁగానక, కోటలో నాల్గ[illegible]రిగి వెన్నెలలరమ్యతఁ జూచి సౌధోపరిభాగమున నెవరో యిర్వురు తిరుగుచున్నట్లు కనిపెట్టి, మేఁడ యెక్కి యచ్చటికి వచ్చెను. ముప్వురును సౌధాగ్రభాగమున నా సీనులయిరి. హరప్ప బద్ధపద్మాసనస్థుఁడై ప్రాణాయామము చేయ నారంభించెను. రంగారావు 'ఇది యేమి' టనెను. హరప్ప కొంతసేపైనతరువాతఁ గనులు తెఱచి 'ధర్మారావుగారూ! నేను గిరికను జూచితిని సుండీ!' యనెను.

ధర్మా—ఆమె యెట్లున్నది? హర—ఆమె జ్యోతిర్మూర్తి వెన్నెలయుంతయుఁ బిండుకట్టి యొక స్త్రీమూర్తి దారినచో నెట్లుండునో యట్లున్నది. ఒక్క క్షీరసాగరవీచికవలె నున్నది. ఆమె స్వామి వేణుదండమువలె నున్నది.

ఇరువురును గనులు మూసికొని తాదృఙ్మూర్తిని గిరికను దర్శించిరి. వెన్నెలలు పాములవలె లేఁత గాలివలన బుస్సలు కొట్టెను.

హరప్ప కనులు తెరచి తండ్రితో నిట్లనెను: అయ్యా! ఈ శరీరము మీరు కల్పించితిరి. నేను మాతృకర్మలు సేయుటకు, స్వామి యుత్సవములు సేయుటకు వచ్చితిని. చేతనైనంతవఱకును వేయిపడగలాడించితిని. ఆ యాడించుట యేకదేశమై పోయెను. నాయందున్న దోషము దానికి సంక్రమించినది. నే నిం దుండుటకు రాలేదు. ఇదిగో పోవుచున్నాను. నే నిన్నాళ్ళు కృశించుటకు నేనే కారణము. నా ప్రాణములు నాచేతిలో నున్నవి. నాప్రాణములు బ్రహ్మరంధ్రమునుండి వదలఁబోవుచున్నాను' అని పద్మాసనాసీనుఁ డయ్యెను. తరువాత నఱగంటకుఁ జంద్రాస్తమయము కాఁబోవువేళకు పెటీలు మని ధ్వనివినిపించెను. హరప్ప బ్రహ్మకపాలము ను భేదించుకొని ప్రాణములు నిర్గమించెను. ధర్మారావు ప్రాణాయామమునం దుండెను. చీఁకట్లు వచ్చెను. ధర్మారావు కనులు తెఱచెను.

# ముప్పదినాల్గవ అధ్యాయము

"ఆయన నా కేమి కొడుకు ? నేనే యాయనకుఁ గొడుకును. వ యతఁడు పుట్టి, నే నతనికి పుట్టరాదా ? న్యాయముగా సు అయినను నాచేతిలోఁ బాడుగాఁదగినది యాయన చేతిలో నేల పాడుగుచు ? మఱల నన్నొక హిందూమతస్థుని జేసి పోయినాఁడు. నాగేశ్వరరావు తనమతమునకు నన్నుఁ ద్రిప్పుకొనుటకును, ద్రిప్పుకొన్నందులకును నాచేత లక్షలు ఖర్చుపెట్టించెను. తాను బాగుపడెను. హరప్పనాయఁడు నన్నుఁ దనమతమునకుఁ ద్రిప్పుకొనుటకు నాచేత పైసా వ్యయపెట్టించలేదు. తా నేమో చనిపోయెను. అతఁడు కొడుకువలె నాచేత వ్యయపెట్టించెను; ఇతఁడు తండ్రివలె ఋణములు తీర్చి నాయాస్తి నా కొప్పఁజెప్పెను. అతఁడు ధ్యానము ధ్యాన మని కనులు మూసికొని స్వపరవంచనరూపములైన ధ్యానములు చేసెను; ఇతఁడు పరమయోగియై ప్రాణములు తనగుప్పిటఁ బట్టుకొని, యిదిగో వదలుచుంటి నని వదలెను. ఒక్కటి చీఁకటి; మఱియింకొకటి వెన్నెల. కుత్సితప్రకృతులకుఁ జీఁకటియే యిష్టము. పోనీ ! నా కేఁబదియేండ్లు వచ్చినవి చెట్టంతకొడుకా, యిట్లైనాఁడు. ఇంక నాకు మార్గ మేది ?' కర్మలైనమఱునాఁ డిట్లనుకొనుచున్న రంగరావువద్దకు రామేశ్వర శాస్త్రి వచ్చెను. వచ్చి కాళులకుఁ జట్టవేసికొనెను. రంగారా వతని నెత్తుకొని 'బాబూ ? చదువుకొనెదవా ?' యనెను. శాస్త్రి 'ఊఁ' యనెను.

తరువాత నెలనాళ్ళకు రంగారావు ప్రక్క జమీందారుల నుండి యొక కొడుకును బెంపకము తెచ్చెను. ఆయనపేరు హరప్ప నాయఁ డని పెట్టెను. వచ్చిన చిన్న జమీందారు కెనిమిదేండ్లు. ఆయనకు రామేశ్వరశాస్త్రికిఁ గలిపి కుమారస్వామి చదువు చెప్పుచుండెను. కుమారస్వామికి నెలకు వందరూపాయల జీతము. కుమారస్వామి యొకనాఁడు దారివెంటఁ బోవుచుండఁగా ఈట్సను దొర కనిపించి యతనికి సెల్యూట్ చేసి తనలోఁ దాను నవ్వుకొనెను : 'అహా ! కాసులు గలవాఁడె రాజు గదరా సుమతీ!' అనుకొనెను.

మూఁడునెల లయ్యెను తూర్పు మెట్టయంతయు మాగాని యయ్యెను. మఱి పదియెకరములు మాత్ర మున్నది. అందులో జొన్న వేసిరి. దాని నిండఁ బాము లనుటకు కఱువదిగా నుండెను. జొన్న వేసినవారే కోసికొనుటకు భయపడుచుండిరి. రకరకములపాములు, గోధుమవన్నె త్రాఁచులు నల్ల[illegible], జెఱ్ఱిగొడ్లు, పసిరికపాములు, తాటిపాములు, బిర్నాగులు, [illegible]లి శిఖండులు, మాన్పెలుగుల్పు, కట్లపురుగులు, పొడలపాములు, పలురకముల పెంజెరులు, జాతికలత్రాఁచులు వేయేండ్లు బ్రదికినవి. సుబ్రహ్మణ్యేశ్వరస్వామికన్న ముసలివి మహావల్మీకములో నుండెను. పేఁట పుట్టకముందు ఏఁబది యెకరములే ప్రధానముగా సర్పము లుండు స్థలము. నాగేశ్వరస్వామియాలయ మున్నచోట నొకప్రత్యేకవల్మీక మున్నది. దానియందు స్వామి మొట్టమొదటి కపిలక్షీరములు గ్రోలినది. ఈపదియకరములలో నున్న యగాధము లైన వల్మీకములయందు సర్పము లనేకములు నివసించుచుండెను. అన్నిఁటికిని శిరస్సైన వల్మీక మొకఁ డున్నది. అది రెండు నిలువు లెత్తుండెను. ఆ పుట్ట పైభాగమున నున్న రంధ్రము చిన్నభావి యంత పెద్దది. అది నాల్గయిదు రంధ్రములుగాఁ జీలిపోయి నిలువుగా నెంతలోఁతున్నదో చూచుటకు వీలులేదు. కొందఱు అది పాతాళలోకమువఱకు నుండె నందురు. దానినుండి వాసుకిప్రభృతిమహాభుజంగములు పైకి వచ్చి వైకుంఠైకాదశినాఁడు సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని సేవించిపోవుచుందురని జనులయందుఁ బ్రతీతి. ఆపుట్ట త్రవ్వించివేయుటకుఁ బాలముకాఁ పొకసారి ప్రయత్నించెననియు, నతనికుమారునకుఁ గన్నులుపోవుటచేత నది మాన్పించెననియుఁ జెప్పుదురు. ఆపొలము సరిగా గణాచారి యన్నగారిది. రంగయ్యయాపుట్ట త్రవ్వించుట కెప్పుడును బూనుకొనలేదు. దానిచుట్టును దున్నెదరు. సస్యములు వేసికొందురు. పిల్లలప్పుడప్పు డాపుట్టమీఁదికెక్కి యానూతిలో నుండి తొంగిచూతురు. అదిగో పా మిదిగో పా మని పారిపోయి వారిలోవారే నవ్వుకొందురు. నాగులచవితినాఁడచట ముత్తైదువలు పోయి పాలు పోయుదురు. పసిపిల్లలు టపాకాయలు మోగింతురు. ఆ వల్మీకమున కది యొక వైభవము.

పసిరికకు నాల్గు మొదలుపెట్టినప్పటినుండియు జబ్బుచేసెను. మంగ ముసలిదై తిరుగుచుఁ గొడుకునకు మందిప్పించెద ననును. అతఁడు మందు పేరు చెప్పినంతనే పాములతోఁటలోనికి బరువెత్తు కొనిపో[illegible] అచట నితఁడు పుట్టలోనికి దిగి కూర్చుండును. పాము ల[illegible] యతని కాలిగోళ్ళు కొఱుకును. అతఁడు కాళ్లు పైకిఁ దీసిక[illegible] కన్నములోనుండి యెగిరి, పుట్టమీఁదికి దూకును. పక్షులు వచ్చి యతనిచుట్టును బింబుకట్టి మాడలభ్రమణము చేయును. అతఁడు కుప్పించి యెగయును. అతని శరీరకాంతి గగనభాగమ్మున గప్పుకొని, యాకాశమునందు పచ్చనిచేను మొలచిన ట్లుండును. అతఁ డొకనాఁ డిట్లు క్రీడించి దిక్కిరిడించి పుట్టలోఁ గన్నమునందుఁ బండు కొని నిద్రించెను. మంగకుఁ గొడుకు కనిపించక పోయి ధర్మా రావుతోఁ జెప్పెను. కుమారస్వామి ధర్మారావులిద్దఱును వెదుకఁ బోయిరి. ధర్మా- ఈ పసిరికను నాకన్న వేయికండ్లతోఁ గాచినాఁడు హరప్పగారు. ఆ హరప్పపోయినతరువాత నేను పెద్దన్నగా రన్నట్లు- 'కృష్ణరాయలతో దివి కేఁగలేక బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు.' కుమార- పెద్దన్న యొక్క- కృష్ణరాయలనే యెఱుఁగును; మీరు కృష్ణమరాయని, హరప్పనాయని నిద్దఱ నెఱుఁగుదురు. ఎవ రితోఁ బోదురు? పెద్దన్నగారికి మీకు నేమి సంబంధము? ఆయన పట్టికవి. పెనుగొండలో నొక గొప్పసరదారు. ఆయనక్రిందఁ గొంత సైన్యము, నేనుఁగులు, గుఱ్ఱములు నుండెడివి. ఆయన యొక్క పెద్ద పాళిగాఁడు. పచ్చకప్పురము, కస్తూరి, పునుగు, జవ్వాదుల మేలితావి యెఱిఁగినవాఁడు. తానుగూడ శ్రీకృష్ణరాయలవలె బ్రదికినవాఁడు. అంతఃపురము, దాసీలు, రమణీప్రియదూతికలు, తూఁగుటుయ్యేలలు గల ప్రభువు. కవిత్వము తోఁచకపట్టిన దాయనకు. మీకో! హరప్ప నాయఁ డిచ్చు దిన వెచ్చము, ఆయన కవితకన్న వెలగల కవిత్వము, ఆయన కున్న భోగమునకు బదులు యోగమును గలదు. భోగి భోగితోఁ జచ్చును; యోగి యోగితోఁ జావ నక్కఱలేదు.

అది రాత్రి. ఆషాఢబహుళమి. పైని మేఘములు గర్జించు చున్నవి. లాంతరు పుచ్చుకొని యిద్దరు నడచుచుండిరి.

కుమా- ఎచ్చట నని వెదకుదుము? ధర్మా- మిగిలిన మెట్ట పొలాలలో. కుమార- మఱల నెవ్వఁడైనను బ్రదర్శనవస్తుశాల కోసము తీసికొనిపోలేదుకదా! ధర్మా- పోయి వెదకఁబోవుచున్నాము కదా! ఇద్దఱును మెట్లచేలవద్దకుఁ బోయిరి. జొన్న [illegible] బెరిఁగియున్నది. చేనికి మూఁడువైపులఁ దిరిగిరి. నా[illegible] చెట్లును, బుట్టలును. కుమార- ఇంక నెక్కడ వెదకుదుము[illegible]- నీ విచ్చట నిలుచుందువా? నేను పోయి యీ గట్టువెంటఁగూడ వెదకివచ్చెదను. కుమార- అది వెదుకఁదగినచోటు కాదు. మీరు పిలువుఁడు; అతఁడు మీ కంఠస్వరము విని వచ్చునేమో! ధర్మారావు కేక వేసెను. రెండుమూఁడుసార్లు కేక వేసెను. ప్రతిధ్వని యేమియు లేదు.

ధర్మా- ఈ చేనిమధ్యఁ బెద్దపుట్ట యొకఁ డున్నది. దానివద్ద నున్నాఁడేమో పోయి చూడవలయును. పోవుటకుఁ ద్రోవలేదు కుమార- అతని నేమో పురుగు పుట్ర ముట్టును. అతని కేమి భయము? ధర్మా-నే నుండఁగా నీకుమాత్ర మేమి భయము? కుమార- మీకుమాత్రము భయములేదా? ధర్మా- నేను పసిరిక యన్నగారి నని యీ పాము లన్నింటికిని దెలియును.

వారచట నిలుచుండఁగానే నాలుగైదుపాము లటు నిటు పోయెను. వెనుకనుముందును పార్శ్వములయందును ధ్వని యేదియో యగుచునే యుండెను. కుమారస్వామి ప్రాణములు గుప్పిటిలోఁ బట్టుకొనెను. ధర్మా- పోదమా? కుమార- మీ యిష్టము.

ఇద్దఱును జొన్న యటు నిటు దోసికొనుచు లోనికిఁబోయిరి. అటు నిటు చాలసేపు వెదకినతరువాత పుట్ట కనిపించెను. ఒకటి రెండుసార్లు కుమారస్వామి యేదో మెత్తనిపదార్థముమీఁదఁ గాలు వేసెను. అతఁ డవి పాములే యనుకొనెను. పాములైనచోఁ గఱచియే, యుండును. కఱచినచోఁ జిమచిమలాడదా? మంటయెత్తదా? యేమో యేమి గోలయో! ఇంటికిఁబోయిన తరువాతఁగాని తెలియ దనుకొనెను. పుట్టచుట్టును దిరిగిరి. ఎచ్చటను గనిపించలేదు. ధర్మారావు మఱలఁ గేకలు వేసెను. పుట్టపైనుండి యేదో దిగుచున్నట్లుండెను. ఏదో మహాసర్పము పుట్టలోనుండి తనమీఁదికి వచ్చు

చున్నదని కుమారస్వామి భావించెను. ధర్మారావుకూడ నేదో సర్పమే యనుకొనెను. పసిరిక పుట్టపైనుండి క్రిందివఱకుఁ బాములవలె జాఱి క్రిందికి వచ్చిన తరువాత లేచి నిలుచుండెను. ధర్మారావు లాంతరు నెత్తి చూచెను. పసిరిక "అన్నా" యని కూసి, యతనిని గ[illegible]నెను. చేతులు పుచ్చుకొని వ్రేలాడెను. గంతులు వేస[illegible]ర్మారా 'వింటికిఁ బోదము, రా' యనెను. మువ్వురును బయలుదేఱి వచ్చుచుండిరి. పసిరిక ముందు, కుమారస్వామి తరువాత, ధర్మారావు వెనుకగాఁ జేనంతయు దాఁటిరి. చెట్లుపుట్టలున్నవైపునుండి పోయినచో వారియిండ్లకు దగ్గఱ. లేనిచో చేనికి మూఁడువైపులఁ దిరిగిపోవలయును. పసిరిక దగ్గఱదారి తీసెను. లాంతరు కుమారస్వామిచేతిలో నున్నది. పసిరిక యూరకే నడుచుచుండెను. అతనికి ముండ్లు లేవు. కంపలు లేవు. తీఁగలు లేవు. చిన్న చిన్న పుట్టలు వచ్చినప్పుడు పైనుండి దూఁకుచుండెను. కుమారస్వామికిఁ బ్రతిపదమునను గండమే యనిపించెను. ఒక పుట్టలోనుండి రెండుపాములు వెలికి వచ్చుచుండెను. పసిరిక బుస్సుమని వాని మీఁదనుండి దాఁటిపోయెను. కుమారస్వామిగుండె చెదరిపోయెను. అతఁ డచ్చటనే నిలఁబడెను. పసిరిక కిలకిలా నవ్వెను. కుమారస్వామి నడువకుండుట చూచి పసిరిక యారెండు పాములను పుట్టలోనికిఁ దోలెను. కుమారస్వామి కదలలేదు. ధర్మారావు ముందు తాను వచ్చి కుమారస్వామిని దనచేతులమీఁద నెత్తుకొని పుట్ట యివతల దించెను. అతని భయము చూచి పసిరిక యొకటే నవ్వెను. ఇంటికిఁ బోయిరి. కుమారస్వామికిఁ దెల్లవారులును బాములకలలే. కొడుకారోగ్యముగ నున్నాఁడని మంగ సంతోషించెను. కాని మఱునాఁడే మఱల జబ్బుచేసెను.

చంద్రారెడ్డికొడుకు గోపాలకృష్ణారెడ్డికిఁ బసిరికయన్నచో మిక్కిలియనురాగము. అతఁడు చాలనాళ్లు పసిరికవెంటనే తిరిగెడివాఁడు. ఇద్దఱును నించుమించుగా సమానవయస్కులు. కృష్ణారెడ్డి మొదటలోఁ బసిరికవలెనే పొలాలమీఁదదిరుగుచుండెడివాఁడు. కాని యిప్పు డతఁడు పొలాలమీఁది సంచారము మానివేసి దొరవలె వేసము వేసికొని తిరుగుచుండెను. చంద్రారెడ్డి యతనికిఁ జదువు

చెప్పించవలయునని చాల ప్రయత్నించెను. ఆ ప్రయత్నములేమియు సక్కఁఅకు రాలేదు. అతఁడు చంద్రారెడ్డి కొక్కఁడే కొడుకు. నూతిలోఁబడి చచ్చెద నని తల్లిని బెదరించి డబ్బు తీసికొనిపోవును. తలకాయ బ్రద్దలుకొట్టెద నని తండ్రిని బెదరించి డబ్బు తీసికొని పోవును. తీసికొనిపోయి త్రాగును. మణికట్టు గ[illegible]ు కొనును. అందఱకు నూఱురూపాయల దతనికి రెండువం[illegible]న్న పట్టణమునుండి సుబ్బన్నపేఁటకు, నిచటనుండి యచటికిఁ బ్రయాణములు. రైలుగార్డులు, టికెట్టుకలెక్టర్లు నందఱు గోపాలకృష్ణారెడ్డి నెఱుఁగుదురు. వారందరిది పంట. అతని చేతిగడియారములు వారి చేతులయం దుండును. ఇఁతఁడు పార్కరు, డ్యూఫోల్డు పౌంటెను కలములు కొనును. అవి వారందఱు వాఁడుకొందురు. మంచి యింగ్లీషు సారాలు కలిసి త్రాగుదురు. స్పెన్సరుకంపెనీలోఁ గృష్ణారెడ్డి త్రాగి తందనాలాడును. అతనిమీఁద నేమియున్న నవి యొకరి కందినది వారిది. అతనికి క్రాపింగు చేయించుకొనుటకుఁగూడఁ దెలియదు. స్నేహితులు దీసికొనిపోయి కత్తిరింపింతురు. ఎంత యిత్తురో తెలియదు. అతఁడెప్పుడును రెండవతరగతిలోననే ప్రయాణము. సరిగా టిక్కెట్టుకొన్నచో నెంతయగునో టిక్కెట్టుకొనకుండ దానికి వందరెట్లగుచున్నది. వీనియన్నింటికిని శిరోభూషణమైన జారత్వము చెప్పుటకు వీలులేదు. వారాంగనలు, నటులు, దొరసానులు, రకరకముల మెఱుపులు. పదిరూకలచోట వేయి; తక్కినవన్నియుఁ బంచుకొనుటలు. అతనికి అక్షరముముక్క రాకపోయినను వేసముమట్టుకు పరమునాగరకుని వేసము. వేసము వాని నవనాగరకత యెంత చెప్పినను, మొగముమాత్రము మొగమోటమిలేకుండ నతని యక్షరజ్ఞానశూన్యతనే చెప్పుచుండును. ఇతఁ డొకసారి చెన్ననగరములో మూఁడునెల లుండెను. ఇరువదివేలు వ్యయమయ్యెను.

తరువాతఁ దిరిగివచ్చి పసిరికతో మాటాడెను పసిరిక యతని క్రొత్తవేసమును జూచి చాల మెచ్చుకొనెను. గడియారము వడ్రంగిపిట్ట చెట్టునువలె టిక్కుటిక్కునఁ గొట్టుచున్నది. జేబులోని ఫౌంటెను కలము నల్లగా, నెఱ్ఱగా బంగారపుక్లిప్పుతోఁ బ్రకాశించుచుండెను. పసిరిక 'యిది యేమి' టని యడిగెను. కృష్ణారెడ్డి చెప్పెను. పసిరికకుఁ

తెలియలేదు. ఇర్వురునుగలిసి పొలాలకుఁ బోయిరి. పసిరిక కృష్ణారెడ్డిని జూచి చాల మురిసికొనెను.

కృష్ణారెడ్డి పసిరికవెంటఁ బోవుచు నొకపామును జంపెను; ఒక పక్షిని గాల్చెను. పసిరిక బుస్సు మనెను. పసిరిక యతనిని వదలిపెట్టి పా పాములన్నియు వచ్చి పసిరిక చుట్టునుగూడి కోపగించెను దీసికొని రావ ద్దనెను. 'నీవు చెడిపోవుచున్నావు. వాఁడన్నచో నీ కభిమాన మెక్కువగుచున్నది. వాఁడు పూర్వపురయితు బిడ్డ యనుకొన్నావేమో ! వాఁడు దుష్టుఁడుగా మాఱిపోయినాఁడు సుమా! వానికి యథార్థజ్ఞానము చెడిపోయినది. వాఁడు మిథ్యావిషయములను జూచి భ్రాంతి చెందుచున్నాఁడు. నీవు వానిని గలియవ' ద్దన్నవి. పసిరికమనస్సు గోపాలకృష్ణారెడ్డి యన్నచో ననురాగము పోలేదు. ఈ పొలమంతయు వానిదేకదా ! ఈ పంటయంతయు వానిదేకదా ! నిజముగాఁ జూచినచోఁ దానే వానివాఁడు. కాని పాములకుఁ బక్షులకు నెదురుచెప్పక యప్పటికిమాత్రి మర్లే యూరకుండెను. పిచ్చిపాములు తమలో నొకరిని రెడ్డి చంపుట మఱచిపోయినవి. పిచ్చిపక్షులు తమలో నొకరిని రెడ్డి చంపుట మఱచిపోయినవి. పసిరిక వానిని దెచ్చినాఁ డని మఱచిపోయినవి. పసిరికయు నవియుఁ బూర్వమువలెనే యుండిరి.

ధరలు పడిపోయెను. పుట్టి యెనుబది యిమ్మనది ముప్పదిలోనికి వచ్చెను. శిస్తుపోఁగాఁ బేదరయితునకు బ్రదుకుటకు లేకపోయినది. జనమందఱును ఘోషపెట్టిరి. ఒకనాఁ డొక ముసలిరయితు వీధిలో నిలుచుండెను. ధర్మారావు దారివెంటఁ బోవుచుండెను. ఆ ముసలి ధర్మారావును జూచి 'బాబూ ! రయితులందఱు నీయూరు వదలిపెట్టిపోయిరి. నే నొక్కఁడను వదలిపోలేక యుంటిని. ఉద్యోగులు బలసినచోట రయితు నిలువలేఁడు సుమా' యనెను,

ధర్మా - నిజమే. నీవుగూడ బోకపోతివా ? ముసలి—ధరలన్నియు పడిపోయినవి. ఏది కొనఁబోయినను ధరలు ప్రియమై పోయినవి. ధర్మా—పది యెకరముల పొలము కలవాఁడు కొనవలసిన వస్తువేమిటి ? రయితు మద మెక్కి, ఉన్నపొలమంతయు వరిపండించి ధనాశాగ్రస్తుఁ డైనాఁడు. కాని దీపముల కాముదములు పండించు

కొనవచ్చును. పూర్వము మనస్త్రీలు వండి యాముదము దీసెడివారు. సాయంకాలము దీపము వెలిఁగించి 'సర్వలక్ష్మి, సందెలక్ష్మి, మహాలక్ష్మి, ఇరుగులక్ష్మి, పొరుగులక్ష్మి, మహాలక్ష్మి తల్లీ! మా యింట నుండు'మని కన్నుల కద్దుకొని యాముదముదీపము లైనచో ...వించెడివారు. ఇప్పుడు డీట్సు లాంతరునా, ఎలెక్ట్రిక్కు బల్బు... జ్యోతీరూపమున నారాధించునది? ఆముదముదీపములో ...ను న్నది అనఁగా నది పంచభూతములలో నొకటియైన జ్యోతిస్సుయొక్క స్వరూపము ఇందులో నున్నది ప్రళయాగ్ని. సృష్టిహేతువైన, స్థితిరూపమైన జ్యోతిస్సు కాదు. ధనదేవత. ప్రత్తి పండించుకొని బట్టలు నేసికొనవచ్చును. కందులు, పెసలు, మినుములు, సెనగలు, అన్ని కూరలు. మిరప, వాము, ధనియాలు, మిరియాలు - పొలములోఁ బండించరాని దేది? మనిసికిఁ గావలసినవి రెండే! కట్ట గుడ్డయుఁ, దినఁ గూడును. ఇవి రెండును నేలనుండి తెచ్చుకొనవచ్చును. ఎన్నిరకములైన పంటలు పండించుకొనవచ్చునో యన్నియుఁ బండించుకొనవచ్చును. మన మన్నిఁటిబదులు వరియొక్కటియే పండించుచున్నాము. తక్కినవానికి దరిద్రుల మగుచున్నాము. పొలములోఁ బ్రత్తి పండించి, యింటిలో దారము తీసి, పండినవడ్లు కొలిచి మాదిగవానిచేత నేయించుకొన్నచో దమ్మిడీ ఖర్చులేకుండ వచ్చు బట్టలకు వాఁడు చెప్పిన ధరపెట్టి నీవు పోయి కొనవలయును. ఎకరము పొలములో నీవు మినుము చల్లినచో సాలియానాకు సరిపోవు మినుములు వచ్చును. అవి యెదుటివానివద్దఁ గొనవలయును. రయితైనవాఁ డుప్పుతక్క నేమియుఁ గొన నక్కఱలేదు. ఆ యుప్పు కొనకతప్పక వచ్చినదికనుక, ఆ గీఁత మాత్రము తప్పించుకొనలేఁడు. కాని తెలివి తెచ్చుకొన్నచోఁ దెలుఁగురయితు దరిద్రుఁడ నని యేడువనక్కఱ లేదు. తాతా! రయితుదాఁక పోవుట యెందులకు? పరాశాపరిపీడితముకానిచో నే దేశమును దారిద్ర్య మనుభవించ నక్కఱలేదు. తన దేశవైశాల్యము, అందుఁ బండఁదగిన పంటలు లెక్కచూచుకొని, యచటి జనము తన బ్రదుకంతయు వానితో సర్దుకొనినయెడలఁ బరదేశముమీఁదికి యుద్ధమునకుఁ గాని, బిచ్చమునకుఁగాని పోవుట యెందులకు? ఉత్తరధ్రువమని యున్నది. అచటి జనులకు ఎస్కిమో

లని పేరంట వారచ్చట దొరకు జలజంతువులమీఁద మాత్రమే బ్రదుకుదురు. వారు వచ్చి యితరదేశములపైఁ బడలేదు. సర్వజన మారణమయయంత్రము లేమైనఁ గనిపెట్టినచోఁ బడెడివారేమో తెలి[illegible] వచ్చు రాబడికి, చేసికొను వ్యయమునకుఁ జక్కఁగా సరి పు[illegible]చో వ్యక్తికేమి, దేశమునకేమి, జాతికేమి దారిద్ర్యము లేదు[illegible]శ లేదు. అనవసరముగా వస్తువులధరలు పెంచి, యక్కఱ లేని నాణెములుకల్పించి, వానిధరలలోఁ దేడాలు తెచ్చి యార్థికశాస్త్ర మని నాణెములను గూర్చిన శాస్త్రములని మిథ్యాకల్పన లక్కఱలేదు. దురాశయు, నవివేకమును హేతువుగాఁ బెరిఁగిన యీదుష్టమార్గము లన్నింటికి నాగరికతయని పేరుపెట్టుకొననక్కఱలేదు. తెలుఁగురయితు చచ్చిపోవుచున్నాఁడు. దేవమాతృకలు దేశమున నశించినప్పుడే, సర్వము పరిపై రైనప్పుడే రయితుయొక్క యారోగ్యమును, వాని సంపదయు, వాని మనశ్శాంతియుఁ జచ్చినవి. వాఁడును నితర దేశపు రయితువలెనే 'ధనము, ధన' మని యంగలార్చుచున్నాఁడు. తాతా! కడుపులోని యాఁకలి కొంతసేపటికిఁ దీరునుగాని, మనసులోని ధనతృష్ణ యెట్లు తీరును? అంతములేనిదానివెంటఁబడిపోయినచో నెచ్చటకుఁ బోవును? బుద్ధిమంతుఁడు 'దీని కిది చివర' యని దేనిని గుఱించి తెలిసికొనునో దానినే యనుసరించును. తృష్ణకుఁ జివర యని లేదు. మూర్ఖుఁడు దాని ననుసరించును. మూర్ఖమైనజాతియు, దేశమును దాని ననుసరించును. ఈరీతిగా మనదేశము చచ్చిపోయి నది. ముసలి—తాతా! పసిరికకు నిలుచుటకు స్థానమైన లేదు. మన యూరు నీవు చెప్పినట్లే యైనది. ధర్మా—ఊరే కాదు, దేశమంతయు. ముసలి—ఆ యున్న పదియెకరములుగూడ ముందునాఁటికి మాగాని యైనచోఁ బసిరిక యెచ్చట బ్రదుకును? ధర్మా—పసిరిక యెచ్చట బ్రదుకునని నీకును నాకును బట్టినది. రయితుబిడ్డ యెప్పుడు చెడి పోయెనో పసిరికయు నప్పుడే చెడిపోయెను. రయితుబిడ్డ కృత్రకభావ ములయందు నిమగ్నుఁడై మృషార్థములచేత వ్యామోహితుఁడైన నాఁడే పసిరిక చెడిపోయెను. ముసలి—అదిగో చంద్రారెడ్డికొడుకును జూడుము! మఱల తిరిగి చెన్నపట్టణమునుండి వచ్చినాఁడు. ఇంకను రయితేమిటి? కొందఱు పోయి వేదములు చదువుచున్నారు. కొంద

ఈ రీతిగాఁ దయారైనారు. పంచము లుండి రసఁగా వారును వ్యవసాయముచేయునట్లు లేదు. వారి కేమి? క్రీస్తు భోజనము పెట్టును. మనము మనపూర్వజన్మ కర్మ యని యేడ్చువారము. మనకుఁ బని చేయకుండ కూడు దొరకదు.

అంతలో దూరమునుండి గోపాలకృష్ణారెడ్డియు, న[illegible] బసిరికయుఁ బోవుచుండిరి. ధర్మారావు చూచెను. ముసలి—[illegible]తా! చూచితివా? నీతమ్ముఁడు పసికకు రెడ్డిమీఁది వ్యామోహము. నీవు పిలువుము, వచ్చునేమో? ధర్మా—నమ్మకము లేదు. అయినను బిలచెదను అని పసిరికను బిలచెను. పసిరిక వెనుదిరిగి చూచి, నవ్వి కృష్ణారెడ్డివెంటనే పడిపోయెను.

ముసలి—అందులోనున్న తీపియది. వాఁడెట్టిగాబుట్టినుగానాన్నడు. చేతికి గడియారము, ఊటకలము, క్రాపింగు, కళ్ళజోడు, ట్వీడు కోటు, బూట్సు—వీఁడే యింకొకదొరవలె నున్నాఁడు. అమాయకుఁడైన పసిరికకు నీ బుద్ధికన్న వానివేసమే బాగున్న దనిపించుచున్నది. ధర్మా—తాతా! నేను నీకుఁ దాతను, నీవు నాకుఁ దాతవు. నీవు ముసలివాఁడవు నీ 'వయ్యో! చెడిపోవు చున్న'దనియేడ్చుచుంటివి. నేను యువకులలోఁ దప్ప బుట్టితిని. 'అయ్యో! చెడిపోవుచున్న' దని నేనును నేడ్చుచుంటిని. మన యిద్దఱిమొఱయు వినునట్టి భగవంతుఁడు కనిపించలేదు. పసిరిక నాతమ్ముఁడు. వానిని నే నెట్లు బ్రదికించుకొనవలయునో నాకుఁ దెలియుట లేదు.

గోపాలకృష్ణారెడ్డియుఁ బసిరికయుఁ గలసి మెట్ట పొలమువద్దకుఁ బోయిరి. పక్షులన్నియు నెచ్చటివచ్చట దాఁగుకొనెను. పాములన్నియుఁ బుట్టలలోఁ దూఱెను. ఒక పెద్దపాము పుట్టలోనుండి తలయెత్తి పసిరికను రమ్మని సన్న చేసెను. పసిరిక పోలేదు. రెడ్డి తన గడియారము తీసి పసిరిక చేతికిఁ గట్టెను. కళ్ళజోడు పసిరికకుఁ బెట్టెను. తన ట్వీడ్ కోటు తీసి పసిరికకుఁ దొడిగెను.

పసిరిక గోచిపాతరాయఁడు. ఇవి యన్నియుఁ బెట్టుకొని యతఁడు విచిత్రజంతువువలెఁ గనిపించెను. కోఁతుల నాడించువారు కోఁతుల కిట్లే చొక్కాలు మొదలైనవి తొడిగి యాడింతురు. పసిరిక యిట్లు కనిపించెను. అతని యీ వింత వేషమును జూచుటకుఁ బాము

లన్నియుఁ దలలెత్తెను. పక్షులన్నియు నాకాశమునఁ బరువులెత్తెను. 'మనపసిరిక చెడిపోయినాఁడు. చెడిపోయినాఁ' డని పక్షు లన్నియు 'ఇస్' అని విసుగుకొన్నట్లు బుస్సలుకొట్టినవి.

గోపాలకృష్ణారెడ్డి తెచ్చిన తుపాకితో మఱలఁ గాల్చెను. [illegible]ము పిచ్చుకలు చచ్చెను. కొంగ పడిపోయెను. ఒక పా ము[illegible]ఁ బోవుచున్నది. దానిని తుపాకిమడమతోఁ గొట్టి చంపెను. పసిరిక బస్సుమని తా నడ్డముపోయెను. కృష్ణారెడ్డి పసిరికను విదలించి మఱొకపామును జంపెను. పసిరిక కళ్ళజోడు తీసిపాఱవేసెను. కోటు విప్పివేసెను. చీ చీ, నాకు సంబంధములేదన్నట్లు పసిరిక చేతిగడియా రమును గూడఁ దీసివేయఁబోయెనుగాని యది యతనికి రాలేదు. అందుచేత నది తీయించుకొనుటకు రెడ్డినే యనుసరించవలసివచ్చెను. ఇద్దఱును గ్రామములోనికిఁ బోయిరి. పసిరిక నేడిపించికాని రెడ్డి యతనిచేతికడియారమును దీయలేదు.

ధర్మారావు మఱునాఁడు పోయి మంగతో 'నింక బసిరికను బొలాలకుఁ బోనీయకు' మని చెప్పెను. ఆమె 'వానినిఁ బట్టుకొనుట సాధ్యమా' యనెను. 'పొలాలకుఁ బోయినచో మఱలఁ దిరిగిరాఁ' డని ధర్మారా వనెను. మంగ కా యర్థము తెలియలేదు.

తరువాత నాల్గునాళ్ళకు గోపాలకృష్ణారెడ్డి చెన్ననగరమునకుఁ బోయెను. ఈ నాల్గురోజులు పసిరిక యతనిని వదలియుండలేదు. ఆతఁడు పాములను, బక్షులను జంపిన సంగతి పసిరిక మఱచిపోయెను. రెడ్డి చెన్ననగరమునకుఁ బోయినతరువాత పసిరికకు మఱలఁ బొలాలు జ్ఞాపకమువచ్చెను. తల్లి 'యెచ్చటికిఁ బోవుచున్నా' వనెను. తల్లి యెన్నడు నీ ప్రశ్న వేయలేదు. ఆమెయే యనుకొన్నది: 'అపశకు నముగా నీ ప్రశ్న వేసితి నేమి' టని. పసిరిక పొలాలపై పరువెత్తెను. అతని కొక్కపక్షి కనిపించలేదు; ఒక్కపాము కనిపించలేదు. అతని కేమియుఁ దోఁచినది కాదు. వెదకి వెదకి జొన్నచేను నడుమనున్న పుట్టవద్దకుఁ బోయెను. అచ్చట మూఁడు నాల్గువందల పాములును, మూఁడు నాల్గువందల పక్షులును సమకూడియున్నవి. ఇతనిని జూచి నంతనే పక్షులన్నియుఁ గూడినవి. పాములన్నియుఁ గలిసి బుసకొట్టి నవి. ఆ ధ్వనియంతయుఁగలిసి గ్రామములోనికి వినిపించినది. జనులు

కొళాయిచెఱువులయింజను పొగ వదలిపెట్టిన దనుకొనిరి. పసిరిక వాని మధ్యకుఁ బోయెను. అచటఁ గూర్చుండెను. ఇదివఱ కతని మీఁద పడి ప్రాఁకి యల్లరిచేసి, యతనితో నాడుకొను పాములు, నా పక్షులు నీనాఁ డతనిని ముట్టుకొన్నైన లేవు. అందు[illegible]క వృద్ధసర్పము లేచి పసిరికతో నిట్లనెను: 'నీవు వానివె[illegible] తివి. వానివలె వేషము వేసితివి. వాఁడు రయితుబిడ్డ. ఈ [illegible]యితే మేము నిలుచుండుటకుఁ దావుగూడ లేకునడఁ జేసినాఁడు. వేలకు వేలున్న మాసంఖ్య యీనాఁటికి వందలకైనది. ఆనాఁడు జనమేజయుఁడు సర్పయాగముచేసి మమ్మందఱను నాశముచేయఁ బూనఁగా నా ఆస్తీకుఁడు రక్షించెను. ఇప్పుడు యజ్ఞముకాని యజ్ఞము జరుగుచున్నది. సర్వప్రాణులకు మహామారణము ప్రారంభమైనది. చెట్లు లేనప్పు డీ పక్షు లెచ్చట నిలువవలయును? మెట్టపొలాలు లేనిచో జాతిగల త్రాఁచులను మే మెచ్చట బ్రదుకవలయును? ఒకనాఁ డీ రయితుల నాశ్రయించియే మేము బ్రదికితిమి. ఈనాఁడు దుష్టులమాటలు విని వారే మాకు నిలువనీడ లేకుండఁ జేయుచున్నారు. ఈ రయితుబిడ్డకును మాకును విరోధము. నీ వతనియందు వ్యామోహితుఁడవై మమ్ముఁ జేతులారఁ జంపించితివి. నీకును మాకును నింక సంబంధము లేదు. నీదారిని నీవు పోవచ్చును.''

పసిరిక యిదియంతయుఁ బరిహాస మనుకొనెను. ఆ పాముతలపై దానుబోయి చేతితోఁ గొట్టెను. కాలితో నింకొక పామును గదలించెను. నోటితో నింకొకదానిని ముద్దిడుకొనఁబోయెను. అతఁడు దాఁకకుండ నవి దూరదూరముపోయెను. పక్షులను బట్టుకొనబోయెను. అవియు దూరదూరముగాఁ బోయెను. ఒకటి నచ్చి యతని శిరసున బొడిచెను. అదివఱ కెన్నిసార్లో యవి పొడిచినను బసిరికకు నొప్పి లేదు. ఈనాఁడు నొప్పి యనిపించెను. కొంతసేపటికి వానికి వచ్చిన కోపముమాట నిజమే ననుకొని "ఇంక నేను వానితోఁ గలియను. కలిసియుండ'' మనెను. ముసలిపాము 'ధర్మారా వంతవానితో నీవు కలిసివచ్చినచో మేము దగ్గఱకు రామే! ఆయన సాధువుకన్న సాధువు. ఆయన పరమ యోగీశ్వరుఁడు. అటువంటియప్పుడు చెడిపోయిన వీనితోనా నీవు కలిసివచ్చినది? పైని వాని వేషము వేసికొందువా?

నీ మనస్సు దుష్టనాగరకతాభ్రాంతమై సహజమైనశక్తి నశింపఁజేసి కొన్నది. మేము నిన్ను రానిచ్చినను లాభము లేదు' అనెను. పసిరిక "మీరి ట్లన్నచో లాభములేదు. నే నెప్పటికైన మీవాఁడనుగాని, [illegible]తో నా కేమి సంబంధము? బావా వాసుకి! తమ్ముఁడా [illegible] మామా చక్షుశ్శ్రవ! అల్లుఁడా ద్విజిహ్వుఁడ! ఓయీ కుటిలగ! విష[illegible]ర్తి! భయదజిహ్వా! అనంత! శేషక! మీరందఱు నన్ను వదలెదరా? విహంగములారా! మీరుకూడ వదలుటయేనా? ఆ వక్రిచందువునకు నాకును బట్టరాని స్నేహము. ఈ మృదుపక్షము నన్ను వదలియుండలేదు. మీ రందఱు నాయందింత విముఖులైనచో నేను పోయి గుండేటిలోఁ బడి చచ్చెదను. ఏ మందురు? పొమ్మందురా? చెప్పుఁడు. మా యన్న నడిగెదను: గుండేటికి వఱదలు తెప్పించి పెట్టుమని. గుండేటికి వఱదలువచ్చి చాలదినములైనది. ఈ యేఁడు మఱల వచ్చు ననుకొందును. మీ కిష్టములేనిచోఁజెప్పుఁడు" అని పసిరిక కఱ్ఱదెబ్బతిన్న పామువలె మెలికలు తిరిగిపోయెను. నేలఁ బడి పొరలాడెను. పడగవిప్పిన త్రాఁచువలె తల నిక్కించెను. పాము తోకమీఁద నిల్చినట్లు మోకరించి నిలుచుండెను.

పాములన్నియు నొకఁడొకఁడు చూచుకొన్నవి. పక్షులన్నియు నొకఁడొకఁడు చూచుకొన్నవి. వృద్ధసర్పము. పసిరికవద్దకు వచ్చి 'నాయనా! నీమీఁద మా కేమియుఁ గోపములేదు. ఆ దుష్టునితోఁ దిరుగుటవలన నీ మనస్సు వ్యామోహితమై పోయినది. నీ ప్రకృతి యంతయు మాఱిపోయినది. బహుకాలసంపర్కమువలన నీయందు మాకును, మాయందు నీకును ప్రేమ పోలేదేకాని తత్త్వతః నీవును, మేమును భిన్నులమైతిమి. మనకు మైత్రి మఱలఁ బొసఁగుటయుఁ గష్టమే. మే మిదివఱకు నిన్నుఁ గఱచెడివారము: నీవు మమ్ముఁ గఱచెడివాఁడవు. మనమందఱ మొకటియేకనుక నొకరివిస మొకరి కెక్కలేదు. పూర్వమువలెనే మే మిప్పుడుకూడ నాటలోఁ నిన్నుఁగఱచెద మనుకొనుము. నీకు విసమెక్కి నీవు చనిపోయెదవేమో! కనుక మైత్రి యింతటితోఁ జాలించుట మంచిది. కాని నిన్ను వదలి మేము నుండలేము ఏ మందువు?' అనెను.

పసిరిక సంతోషముచేత ముసలిపాముతోఁ బెనవేసికొనెను; ముసకలాడినట్లాడెను. 'సరే కఱవుము, బ్రదికినచోఁ గలసి యుందము. లేనిచో నష్ట మేమి' యనెను ముసలిపాము 'నేను కఱవను. నీవు నిజముగాఁ జనిపోయినచో నే నోర్వలేను' అనెను. పసిరి[illegible] కఱచెదనా', నీవు కఱచెదవా' యని యొక్కొక్కదా[illegible] మాలెను. కుంభీవసుఁ డని యొకఁడు 'మధ్యవర్తియున్నచోఁ [illegible]ను కఱచెద' ననెను. మధ్యవర్తి యెవరు? ముసలిపాము గణాచారి పేరు చెప్పినది. పసిరికపోయి గణాచారిని బిలుచుకొని వచ్చెను. అన్ని పాములును బక్షులును వానిదారి నవి పోయెను. గణాచారికిఁ బసిరిక యెందుకు బిలుచుకొనివచ్చెనో తెలియలేదు. పాము వచ్చి కఱచెను. పసిరిక గిలగిలలాడి, మెలికలు తిరిగి, నెత్తురు గ్రక్కుకొని చని పోయెను. వెంటనే యాకాశములఁ బక్షులన్నియు పెద్దగా విలి పించెను. పుట్టలోనుండి బుస్సు మని దుఃఖధ్వనులు వినవచ్చెను. గణాచారి పసిరిక నటుచూచి యిటుచూచి చనిపోయినట్లు గ్రహించి దుఃఖావేశముచేత నోడలు తెలియక యిట్లు పాడఁదొడగెను.

'వేయిపడగలపాము విప్పారుకొనివచ్చి
కాటందుకొన్నది కలలోని రాజును.
నాల్గుశిరసుల నాగు నల్లనల్లగవచ్చి
ఊరిపెద్దను నిలవేసింది పొలములో,
రెండు శిరసులనాగు రివ్వురివ్వు మనివచ్చి
ఇంటికోడలిఁ బురుగూఁదింది దొడ్డిలో,
ఒక శిరసునాగన్న యొయ్యారముగవచ్చి
నిజముగా నాతండ్రి! నిన్నుఁ గఱచిందిరా!'

గణాచారి చూచుచుండఁగాఁ బసిరికను గఱచిన పాము కుంభీ వసుఁడు సర్వోరాతిపై నొకదానిమీఁదఁ దలకొట్టుకొని చచ్చెను. ఆ నాఁడు సుబ్బన్నపేట గగనమంతయు, బక్షులును, నేల యంతయుఁ బాములు నయ్యెను. జనము వీలైనన్ని పాములను జంపిరి. అవి యేమో యమావాస్యకు కన్నులు కనపడక కుబుసములు తొడ గిన త్రాఁచులవలె నెత్తికఱ్ఱల కడ్డములుపడి చచ్చెను. కొన్నిపాములు గ్రామము విడిచిపోయెను. పక్షులును లేచిపోయెను. కొన్నిపాములు

గుండెటిలోఁ బడి వచ్చెను. ప్రాణములమీఁద మఱీ యాసగలిగిన జంతువులు, నాగరకులు వచ్చి సర్వ నాశనముచేయుచున్నను మన పూర్వులదేశము వదలిపోలేని నల్లజాతులవలెఁబోయి మఱల నట్టే యా[illegible]లోననే దూఱి యుండెను. ఆ నాఁటిశోఁ బక్షు లానంద మ[illegible]సుకలధ్వనులే మఱచిపోయెను. ఆకాశమున నవి విషాద గీతమ[illegible]పాఁడజొచ్చెను.

శవమును మంగ యింటికిఁ దీసికొనిపోయిరి. ధర్మారావు వచ్చి చూచెను. 'ఇప్పటికి నాతండ్రి యూహలన్నియుఁ జక్కగా భగ్నములైనవి. ఒక్క దేవదాసిమాత్రము రక్షింపఁబడినది. నాతండ్రి యేవేళ సంకల్పించెనో సంకల్పములన్నియు భగ్నములయ్యెను' అనుకొనెను. మంగ కొడుకుపైఁబడి యేడ్చెను: 'నాయనా! నీవుకూడ పాముగఱచి చనిపోయి, మనుష్యుఁడ వనిపించుకొందు వనుకొనలేదు. బ్రతికిసన్నాళ్ళు మనుష్యుని గడుపునఁ గంటి నన్న తృప్తి నాకు లేకబోయినను చావులోనైన నాతృప్తిఁ దెచ్చితివి. నీతండ్రి గర్భశోక మెఱుఁగఁడు. పుట్టినసంతానమంతయు భద్రముగా నున్నది. దేవదాసి స్వర్గవాసిని యగుటచేత నది మే మెవ్వరము విచారించలేదు. నీదుఃఖము నా కేమిగాని, మీయన్నగార లెటుల దుఃఖింతురో తండ్రీ!' యని గొడ్డు అంబా యని యడలిన ట్లడలెను. రామచంద్రరాజు వచ్చెను. వచ్చిచూచి పసిరికమీఁదఁ బడి యేడ్చెను. అన్నదమ్ము లిర్వురును కౌఁగిలించుకొని యేడ్చిరి. రాజనెను: 'నాయనా! నీ దుఃఖముల కంతులేకుండ నున్నది. అటు దేవదాసి, అరుంధతి, హరప్ప, పసిరిక, గోపన్న, మంగమ్మ— యింతమంది దుఃఖములు నీ వెట్లు సహించుచుంటివో నాకుఁ దెలియుడ లేదు.'

ధర్మా— అన్నా! దీనికిఁ బునాదులు పదునాఱేండ్లక్రింద నుండి యున్నవి. కృష్ణమనాయఁడు పోఁగా భరించితిని. మనతండ్రి చనిపోఁగా భరించితిని. కల్యాణగౌరి. నాపెదతల్లి, నీమాతృదేవత రంగాజమ్మగారు పోఁగా భరించితిని. రాణి యన్న పేరునకర్థమైన రుక్మిణమ్మారావుగారిస్మృతి కన్నులారఁ జూచితిని. నేను చూడరాని

దే మున్నది? ఇంకఁ బదునేనుదినములలో సర్వనాశన మగుచున్నది. నేను భరించలేని దే మున్నది?.

గణాచారి పాడుచునే యుండెను:

'ఒకశిరసు నాగన్న ఒయ్యారముగ వచ్చి
నిజముగా నాతండ్రి నిన్నుఁ గఱచిందిరా!—వేం[illegible]ు.'



ఆనాఁటి రాత్రి రెండుజాములయినది. తీతువుపక్షి [illegible]యాకాశమునఁ గూసినది కూసినట్లే యుండెను. ధర్మారావు 'ఆనాఁడు కూసితివి, మఱలఁ గూయవచ్చితివా' యనుకొనెను. గణాచారిపాట వినిపించుచునే యుండెను.

# ముప్పదియైదవ అధ్యాయము

దగించిన కంఠస్వరముతో శక్తియుడిగినట్లు, రెక్కలు తపత సన్నగిల్లఁగా జగమున కక్కఱలేని తన వేళా ప్రబోధ కూజితము నిరుపయుక్తమగుటచేత సిగ్గుపడి సువ్యక్తధ్వనియందుఁ గొఱఁతపడినట్లు, రాజ్యముపోయిన రాజు తలవాంచియు జన్మత ఆరబ్ధమైన ఠీవిమాత్రము చంపుకోలేనట్లు మెడకొంచెముగా నిక్కించి కోళ్ళు కూసెను. ఆ కూఁత యెవరో యొకరిద్దఱికి మాత్రమే కావలసి వచ్చెను. అందులో గణాచారి యొక్కతె. ఆమె లేచి చెఱువునకు బోయి స్నానముచేసెను. అతైలసంస్కృతములైన యామె శిరోజములు తైలసంస్కృతములవలె నిగనిగలాడును. కాని యన్నగారి యిల్లు వదలి కొన్ని యేండ్లు గడచినను నామె తలవెండ్రుకలు మాత్రము జడలు కట్టలేదు. అందఱకు నదియొక చిత్రము. ఆమె స్నానముచేసి, వెండ్రుకల పాయలలోనికిఁ జేయిపోనిచ్చి చీరకొంగుతోఁ దుడుచుకొనెను. ఊరిలో వాడుక 'గణాచారి యొక యెత్తు; ఆమె శిరోజము లొకయెత్తు' అని. ఆ కేశపాశము త్రాచుకుబుసమువోలె మసృణమై, లేఁత నలుపురంగుగల, సగము మెఱసి పైకిఁబోయిన మొగిలువలె జిక్కణమై, బాలతమాలికాతరుపల్లవాభిరామమై, నిత్య పరిపోషణము కలదానివలె సౌందర్యభూమియై యుండెను. ఆ నాఁడు శ్రావణశుద్ధైకాదశి. ఆమె తల వెండ్రుకలు తుడుచుకొనుచుండఁగా నడుమ నొకచోటఁ జిన్న జడకట్టి కనిపించెను. నిన్నలేనిజడ యీనాఁడెచ్చటిదో! ఆమె ప్రాణములు తేలిపోయినట్లయ్యెను. ఆమె 'నేను సుబ్రహ్మణ్యేశ్వరునితోడి సంసారిణిని సన్న్యాసినికివలె నాకు జడ యేల కట్టినది?' అని యనుకొనెను. ఆమె యొడలెల్ల విభూతి రాచుకొని, నొసటఁ గుంకుమము తాల్చి, పొడిచీర గట్టుకొని, తడిచీర పిండి, సుబ్రహ్మణ్యేశ్వరస్వామియాలయమునకు వచ్చి, చీర యొక యరుగుపైనుంచి తా నచ్చటనే కూర్చుండెను. అప్పటికిఁ దెల్లవాఱినది. అర్చకుఁడు వచ్చెను. వచ్చి యాలయము తలుపులు తెఱచెను.

అతఁడు బలిపీఠమువద్దకుఁ బోయి విభూతి తెచ్చి యామె కొసఁగెను. ఆమె దానిని కుంకుమబొట్టుక్రింద ధరించెను. అతఁడు 'ముక్కాలి పీఁట రెండవకోడుగూడఁ గదలుచున్నది' యనెను. గణాచారి నవ్వెను. ఆ నాఁడు నాల్గునాళ్ళనుండి వర్షము కురియుచున్నను, నిర్మేఘమైన ప్రాగ్దిశామండలమున సూర్యబింబ ముదయించెను. గణా మొగమునను న్న కుంకుమపుబొట్టునకుఁ బ్రతిస్పర్ధిగా ప్రాగ్దిశా బాలారుణసూర్యబింబమును దాల్చెను. నల్లనియాకాశమును గణాచారి శిరోజములకుఁ బ్రతిగా ధరించెను. ఉషఃకాంతిని గణాచారి తెల్లని చీరకుఁ బ్రతిగా ధరించెను. నల్లనిపక్షులు బారులుతీర్చి యాకాశమునఁ బరువెత్తి గణాచారితలలోఁ గట్టిన జడవలెఁ గన్పించెను. గణాచారి ప్రాగ్దిశామండలమువంకఁ జూచి నమస్కరించెను. భగవంతుఁడు ప్రసన్నుఁడైనట్లు సూర్యబింబములోని మెఱుపు విఱిచెను. నాల్గుదినములనుండి యామెచీర యెండుట లేదు. ఆలయమండపములోననే యెండ వేసికొనుచుండెను. సూర్యకాంతి వచ్చిన దని ప్రహరీగోడకుఁ దాను కొట్టుకొన్న మేకుల కెండ వేసెను. ఆమెకుఁ జీరలు నాలు గున్నవి. రెండు రామచంద్రరాజు కొనియిచ్చినవి, రెండు ధర్మారావు కొనియిచ్చినవి. ప్రతియాఱునెలలకు నియమమును జేసి రెండు చీరలు కొనియిత్తురు. రెండేండ్లక్రిందరంగయ్య రెండుచీరలు పంపించెను. గణాచారి తిరుగఁగొట్టెను. భోజనము కష్టములో సుఖములో లేమిలో కలిమిలో ధర్మారావు నింటివద్దనుండి రావలయును; ఆమె చేయవలయును. చందయ్య యిప్పు డెదిగినాఁడు. ఒకటి రెండుసార్లు రంగమ్మ చంద్రయ్యను గోప బడినది: 'ఈ యూరిలో నిది యొక పిచ్చిసమాజ మేర్పడినది. ఆ పిచ్చిదానికి ప్రతిరోజు నన్నము తీసికొనిపోవుట నీకుఁ బనియా ?' యనెను. చంద్రయ్య 'యామె పిచ్చి దని తీసికొనిపోవుట లేదు. ఆమె మేనత్త యని తీసికొనిపోవుచున్నా' నని సమాదానము చెప్పెను. ఆనాఁడు ప్రొద్దెక్కెను. నేలయంతయుఁ దడిగానున్నను వాయువీధులుమాత్రము కోష్ణములు గానే యుండెను. తడిసిన ప్రహరీగోడలమీఁదఁ నెండలుపడి వానిలోని చెమ్మలు లాగివేసెను. కానిగోడలింకను దడిగానే యుండెను. నిన్నటిదాఁక బురదలైన స్థలముల యందుఁగూడ నెండ జాముప్రొద్దెక్కినదో లేదో కాలియడుగు లను

ర్చెను. పూజారి పదిగంటలకు నైవేద్యము తెచ్చి స్వామి కారగింపు పెట్టి తనదానిని దాను బోయెను. ఎండలు మఱింత తీక్ష్ణములయ్యెను. ధర్మారావు నింటిలో నిప్పుడు నాంచారమ్మ దిక్కు. ఆమెయు, నామెభర్తయుఁ బిల్లలతో నిచ్చటనే నిలిచిపోయిరి. ధర్మారావును ద[illegible]ప్పగారును మఱల వివాహము చేసికొమ్మని వేధింతురు. నాం[illegible]మ్మ 'నాయనా! నేను నీకు శాశ్వతమా? చివరకు వండి పెట్టుదిక్కుగూడ లేకున్నచో నీ వేమగుదువు? పెండ్లిచేసికొనక తప్ప' దనును. అతఁడు 'నేను మఱల వివాహముచేసికొందునా? పాప మది నేనే భర్తగా సేవించినది. దానియాత్మ కింత ద్రోహముజేయు' నని బదులుచెప్పెను. నాంచారమ్మ 'నేను నిన్ను వదలిపోవుద మన్నను, నీ వెచ్చటనో నాల్గుమెతుకులు తినవచ్చును. ఈ ముసలమ్మకుఁ గూ డెవరు వండిపెట్టుదురు? రామేశ్వరాని కెవరు వండిపెట్టెదరు? గణాచారి కెవరు వండిపెట్టెద' రనును. ధర్మారావు 'గణాచారి యిం కెన్నినాళ్ళులే! అమ్మ యింకెన్నినా' ళ్ళనెను. రెండుజాము లైనది. చంద్రయ్య యన్నము తీసికొనిపోవుటకువచ్చెను నాంచారమ్మ యన్న మిచ్చెను. అతఁడు తీసికొనిపోయి మేనత్తను బిలిచెను. దేవాలయబహిరంగణమున నొకచిన్నిపాక యున్నది. గణాచారి యందులో భోజనము. ఆమె యన్నము తినెను. చంద్రయ్య 'అత్తా! గిన్నె తీసికొనిపోదునా' యనెను. ఆమె 'తండ్రీ! నాకుఁ జాల సేవజేసితివి. నీ కష్టములు గట్టెక్కినవి. నీ శ్రమ తీరు దినములు వచ్చిన' వనెను. చంద్రయ్య 'అత్తా! నా కేమి కష్టము? నీవు దేవతవు. మా యిల్లువదలి వచ్చితివి. నాకది యొక్కటియే కష్ట'మనెను. గణాచారి 'నీకుఁ దోడఁబుట్టినది లేదు. ఉన్నను నావలెనదియు గణాచారి యయ్యెడిదే. ఆ గీత లేదుగనుకనే లేదు. నీకడుపునమాత్ర మాఁడపిల్ల పుట్టును. దానికి నీవు పెండ్లిచేయుము. నే ననుజ్ఞ యిచ్చుచున్నా' ననెను. కుఱ్ఱవాఁడైన చంద్రయ్యకు నవ్వు వచ్చెను. గణాచారి యతనిని జూచి 'నీ విప్పుడు పసివాఁడవుగనుక నవ్వుచున్నావు. నీకుఁ గుమార్తె కలుగునాఁటికి నామాట జ్ఞాపక ముండునులే' యన్నది.

పొద్దు వాటారినది. మఱల మేఘములు క్రమ్మినవి. సాయంకాలమంతయు వర్షములు కురిసెను. మేఘములువచ్చి యాలయధ్వజస్తంభములపై వ్రాలి ధ్వజస్తంభాగ్రఘంటానినాదము గాలిచేఁ గలిగి మువ్వలపట్టెడ గట్టిన మెడతోడి యమమహిషమువలె భాసిల్లెను. గాలిగోపురమునకుఁ జాల క్రిందుగా మేఘములు వంగి పైభా[illegible]ము గనిపించకుండఁ జేసెను. చూచువారలకు గోపురము పడిపో[illegible]ట్లనిపించెను. దేవాలయముపై విమానముగూళ్ళలో పావురాలు నివసించుచుండెను. అవి గొంతులో గుడగుడ లాడి తమ బంధువులైన మొగిళ్లతో రహస్యములాడిన ట్లుండెను. గుడి పావురాలు నల్లనివి. మొగిళ్ళకు వానితోఁ జెలిమి సహజమైన ట్లుండెను నాల్గుదిక్కుల వానకాళ్ళు దిగి పశ్చిమమునఁ గొంచెము తెఱపియిచ్చి తత్సూర్యకాంతి ప్రసారము ప్రాగ్దిశాగగనలంబి మేఘమాలలపైఁ గలిగి యచట నింద్రధనుస్సులు శతసహస్రములు నిండెను. మేఘము లుఱిమెను. ఆ యుఱుములు హరిధనుస్సుల జ్యానినాదము లేమో! కొన్ని ధనుస్సులు గగనమున దక్షిణోత్తరములుగా సంపూర్ణాకృతికలని యయ్యెను. మఱికొన్ని సగములై, కొన్ని ముక్కలై, కొన్నిటిచివరలు కొన్ని మేఘములవెనుకకుఁ బోయి, యాకాశమంతయు నాగవల్లి ముగ్గులుపెట్టిన ట్లుండెను. కొంతసేపటికిఁ బశ్చిమదిక్కును గూడ నావరించిన మొగిళు లస్తమయ మయిన దని తెలియనీయలేదు. చీఁకట్లు క్రమ్ముటయే దానికి గుర్తయ్యెను. మేఘములు ధారాపాతముగా వర్షించెను. ధనవంతులు సుఖముగా దుప్పటులు, మెత్తని కంబళులు కప్పుకొని యుహూహూ యని నిద్రపోయిరి. పేద లటు కొట్టిన నిటుకొట్టిన జల్లులై ప్రక్కలుమురక తడిగుడ్డలతో నుహూహూ యని ముడుచుకొని కూర్చుండిరి.

గణాచారి యెప్పుడును ముఖమంటపమందే పండుకొనును. ఆమె తూర్పుదిక్కున జల్లుకొట్టుటచేతఁ బడమరదిక్కునఁబోయి పండుకొనెను. జల్లచటికిని వచ్చెను. అచ్చటినుండిలేచి, యాలయముతలుపానుకొని పండుకొనెను. ఈనాఁడు నాల్గుచీరలు నెండియున్నవి. ఒకటి కప్పుకొనెను. రెండు ప్రక్కన వేసికొనెను. ఆమె కొంతసేపటికిని నిదురపట్టలేదు. ఎందుకో నిదురపట్టలేదనుకొన్నది. ఏకాదశి

మాట జ్ఞాపకము వచ్చెను. శుక్లపక్షపు వెన్నెలలను మేఘములావరించెను. తెల్లవారుకడ మేఘములు తెఱపిచ్చి యాకాశము నిర్మలమయ్యెను. గణాచారి స్నానముచేసి తలతుడుచుకొనుచుండెను. తలలో రెండుజడలు కనిపించెను. ఆమె నవ్వుకొనెను. ఆనాఁటి సాయంకాల మ[illegible]నుఅల మేఘము లావరించెను. గణాచారి 'పాపమివి నా చీర మ[illegible]రెండనిచ్చుచున్న' ననుకొనెను. మొయిళ్ళాకాశమునఁ జిత్రచిత్రాకృతులు తాల్చెను. ఒకచోట కైలాసగిరి శిఖరమువలె, నొకటి నంజనాచలోపత్యకలవలె, మఱియొకచోట నూఱేండ్లునిండిన భద్రజాతిగజకుంభమువలెఁ, దమాలవృక్షముల గుమ్ములవలెఁ, సుడులుతిరిగిన యమునానదివలె, శ్రీకృష్ణదేవుని దేహచ్ఛాయవలె; గుపిత సుబ్రహ్మణ్యేశ్వరసహస్రముఖనిర్గతమహాగ్నిజ్వాలాగ్రధూమరేఖలవలెఁ బేదవారల బ్రతుకులవలె,దుర్మార్గులయూహలవలె, నశించిపోయిన సత్యధర్మదయాశౌచములవలె, గ్రీష్మర్తు వన్న దీపము వెనుకనున్న నల్లనినీడలవలె మేఘములు విజృంభించెను. అవి యుఱుముచు: ఒకచోట నుడుకుచున్న యన్నము గుడగుడలాడినట్లు, నొకచోట నెమళ్ళు కూసినట్లు, నింద్రునిరథము శాయమేకూడి పటపట మని పేలి నేలబడినట్లు మేఘములు నానావిధములయిన ధ్వనులుచేసెను. ధారణియే రత్నగర్భ కాదు, ఆకాశము రత్నగర్భయే యన్నట్లు మేఘములు పగిలి లోనున్న సౌదామనులు రత్నఖనులవలెఁ బ్రకాశించును. ధారణికి గగనమునకు సామాన్య లక్షణములు సస్యముచేతను మేఘచ్ఛాయలచేతను శ్యామలత్వములందునను, నదులచేతను వర్షధారలచేతను ప్రవాహవత్త్వమునందును, తరుణులచేతను మెఱుపులచేతను గాంతిమత్త్వమునందును గుదిరెను.

ఆదినముగూడఁ గడచెను. వానలు వెలియలేదు. గణాచారి పోయి స్నానముచేసిన మూఁడుజడలతో, రెండు తడిచీరలతో దేవళమునకు వచ్చెను. రామేశ్వరశాస్త్రి వానలోఁ బడి గణాచారివద్దకు వచ్చెను. గణాచారి 'యే మిట్లు వచ్చితి' వనెను.

శాస్త్రి- నీవొక్కర్తె విచ్చటఁ గూర్చుందువుకదా! నీ కెట్లు తోఁచును? గణా- ఎట్లు తోఁచును? నీవే చెప్పుము. శాస్త్రి- మనస్సునదియున్నచోఁ దోఁచదు. గణా- నీకు సరిగా నెనిమిదేండ్లు

లేవు. నీకు మన స్సనునది యున్న దని యెట్లు తెలిసెను? శాస్త్రి- ఎట్లు తెలిసెను? మనస్సు లేకపోయినచోఁ బ్రపంచమంతయు లేదు; గణా- ఓయి విపరీతుఁడా! నీ వింక నింటికిఁ బొమ్ము. శాస్త్రి- నీ కెట్లు తోఁచును? అది చెప్పుము. గణా- ఒకటి చీరయెండ దే[illegible] దిగులు. చంద్రయ్య యన్నము తెచ్చునో, తేఁడో యని [illegible]. ప్రొద్దు క్రుంకునో క్రుంకదో, తెల్లవాఱునో వాఱదో! ఈ చీరలు చిరిగిపోయినచో మఱల మీనాన్నయుఁ, బెదనాన్నయు చీరలిత్తురో యీయరో యని పెద్దదిగులు. ఇంక నెందుకుఁ దోఁచదు? శాస్త్రి- మనస్సునకుఁ దోఁచుటకు దిగు లుండవలయు నన్నమాట! గణా- అవును.

శాస్త్రి వ్రేళ్ళు లెక్కపెట్టుకొనుచు వానలోఁ బడిపోయెను. మేఘములు వానియిష్టము వచ్చినట్లు కురియసాఁగెను. జల మెచ్చటి దచ్చట పడియలుగా, దటాకములుగాఁ గట్టెను. చెఱువులనిండ నీరు నిండెను. ఆవుకాలిగిట్ట, మనిసిమడమ దిగి, చిన్న పల్లమైనయెడల నీళ్ళు నిలిచియుండెను. పశువులు పైనిబడుచున్న చినుకులు కొమ్ములతోఁ జిమ్ముకొనుచుఁ బోయెను. మనుజుల గొడుగులవలన తలలు మాత్రము తడియలేదు కాని, వాని వస్త్రాంగకములు తడిముద్దలయ్యెను. చెట్లయాకులు తడిసి చివళ్ళ నీరునిలిచి, యడ్డబాస పెట్టుకొన్న శబరికన్యానాసికాగ్రములువోలె భాసించెను. లోలకులు వ్రేలాడుచున్న బాలికల శ్రవణపుటములవలె భాసించెను. తాటి మొవ్వలలో, నీఁతమొవ్వలలో జలము కూర్చుండి క్రిందకు దిగక యాకాశమునఁ గట్టిన చెఱువులవలె నుండెను. చెట్లక్రింద వర్షించ దన్న పేరేకాని యచటికన్న బయట నే సుఖముగానుండెను వాన ధార యెంతయో యంతయే మీఁద బడును. అది చక్కఁగా నొడల నంతయుఁ బడును. చెట్లక్రింద శరీరముపై నీటిబిందు వొకచోటఁ బడదు. పడినచోట పెద్దబిందువు పడును. స్పర్శసమానముగా నుండదు. మనస్సునకు నది సమాన మనిపించదు. ప్రొద్దు గ్రుంకి యానాఁడు తెలిపియిచ్చినది. అది యెప్పుడు తెలిపియిచ్చునో, యెప్పుడు మూసికొనివచ్చునో దానికే తెలియవలయును. వాన రాకడ, ప్రాణముపోకడ యెవరికిఁ దెలియ వందురు.

మఱునాఁడు చతుర్దశి. నాల్గుజడలతో గణాచారి యాలయమునకు వచ్చెను. రామేశ్వరశాస్త్రి వచ్చెను.

గణా- తెల్లవాఱకముందే వచ్చితివే! శాస్త్రి- నీ వేమి చే[illegible]ంటివో చూడవలయు నని. గణా- మీనాయన పొమ్మని యెన[illegible]స్త్రి- మా నాన్నకును, నాకును మాటలు లేవు.

గణాచారి నవ్వెను. శాస్త్రి నవ్వి 'నవ్వులు కావు. మా యిద్దఱికిని మాటలు లేవు. మే మొకరి నొకరము పేళ్ళుపెట్టుకొని పిలుచుకొనము' అనెను.

గణా- నీ యంత గడుసు నీవేకాని యింకెవరును లేరు. శాస్త్రి- లేకయేమి? ఉన్నాఁడు. గణా- ఎవరు? శాస్త్రి- ఎవరో యాలోచించుచున్నాను. మీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి నాకన్న గడుసుకదూ! కాకపోయినచో సుబ్బన్నపేట వదలి యెందుకుఁ బోయినాఁడు? గణా- గడుసుకాదుగనుకనే వదలిపోయినాఁడు. గడుసైనచోఁ బట్టి పీడించకపోయినాఁడా! శాస్త్రి- ఎవరిమీఁద వారికంత ప్రేమ! గణా- పొట్టివానికిఁ బుట్టెఁడుబుద్ధు లని. శాస్త్రి- నేను పొట్టివాఁడను గాదు. గణా- నీ కింటివద్ద నేమియుఁ బనిలేదా? ఈనాఁడు మీ యమ్మ యేడూరుకదా! శాస్త్రి- నేను పోవుచున్నాను.

అని లేచి శాస్త్రి వెడలిపోయెను. వాన లేదు. అతఁడు నెమ్మదిగా నడచి పోవుచుండెను. వెనుకనుండి గణాచారి చూచి 'కుఱ్ఱవాని కనవసరముగా దుఃఖము కల్పించితిని. అనవసర మేమిటి? చిన్నప్పుడు రాపిడిపొందిన మనస్సే పెద్దయినతరువాత నివేచనాశక్తి కలిగియుండు' ననుకొనెను.

వర్షములు మఱలఁ గురియ నారంభించెను. తాడిపండ్లు పడి, ముగ్గి యెఱ్ఱనై కాఁపుపిల్లలకు స్పృహణీయత కలిగించెను వానచినుకులు వానిమీఁదఁ బడి. యవి నిగనిగలాడఁ జొచ్చెను. తాటితోఁపులలోఁ బ్రతిచెట్టునకు వంద తేళ్ళు వందమండ్రగబ్బలుగా నుండెను. కాఁపుపిల్లలు వానలో పొలాలవెంటఁ బోయి తేళ్ళను, కుళీరములను నాడించఁజొచ్చిరి. వారి కే తేలు కడుపుతోనున్నదో తెలియును. వాని నొడుపుగాఁబట్టుకొని వెల్లకిఁతలుగా వేసి, పొట్టతలుపులు తెఱ

తురు. వానిపొట్ట డిప్పలుగ నుండును. రెండు తలుపు లమర్చినట్లే యుండును. ఆ తలుపులు తెఱచినచోఁ దేలు చావదు. తలుపులు తెఱచి లోనున్న పిల్లలను జూచి కిలకిలా నవ్వుకొందురు. మఱలఁ దలుపులు మూసి దానిని వదలిపెట్టెదరు. అట్లే కుళీరముల డొక్కలను తెఱవవచ్చును. వానలు హోరు మ…సిన కొలఁది కాఁపుపిల్లలు శిరస్సులయందుఁబై గుడ్డలుగూడలుగా …సికొని, కఱ్ఱలతో బత్తెలను చెఱువుగట్టుమీఁద నిల్చి యాడుకొనఁజొచ్చిరి. చెఱువులో వానచినుకులు పడి పొట్లపూవులు లేచెను. దేశమంతయుఁ బంకసంకలితమయ్యెను. మఱునాఁడు పూర్ణిమ వచ్చెను. గణాచారితల మైదుజడలు కట్టెను. ఆమె నాల్గుచీరలును దడిపి దేవాలయమునకు వచ్చిఁ తడిచీరతోఁ గూర్చుండెను. రామేశ్వరశాస్త్రి వచ్చెను.

శాస్త్రి—అన్నియుఁ దడిచీరలేనా? గణా—అయినచో నేమి? ఈ నాఁడు తల తుడుచుకొన నక్కఱలేదుకదా! శాస్త్రి—ఐదు రోజులలోననే నీతల జడలు కట్టిన దేమి? గణా—ఇదివఱకే కట్ట వలసినది. నేనే కట్టనీయలేదు. శాస్త్రి వెడలి పోయెను. రెండుజాము లయ్యెను. గణాచారి మూనాళ్ళనుండి భోజనముచేయుట లేదు. ధర్మారావుగారియింటిలో మాసికము, ఏడూరు, ఆబ్దికము వచ్చెను. ఈ మూనాళ్ళును బ్రాహ్మణులు లేచునవఱకే ప్రొద్దుక్రుంకెను. పైఁగా కారింటిలో నిది పితృశేషము.

అర్చకుఁడు మంగలిని బిలిచెను. గణాచారి జడలుకత్తిరించెను. తల బోడి యయ్యెను. జడలు స్వామిసన్నిధానమున నుంచెను. ఆమె 'ఇంక నీజడలే స్వామియాలయములో నుండును. నాకును. స్వామికి నింక సంబంధము లేదు. నే నింక దేవాలయములోనికి రాను' అని యామె పోయి పాకలోననే నివసించెను. సాయంకాలమునకు ధర్మా రావువచ్చి చూచెను. గణాచారి పాకలో నిదురించుచుండెను. ఆలయములో ముక్కాలలిఁట రెండవకాలుగూడ విఱిగిపోయినది. అది యొంటికాలిమీఁద నెట్లు నిలుచును? అర్చకునితో ధర్మారా 'వాకాలు తీసివేయు' మని చెప్పెను. ఇంక బలిపీఠ మక్కఱ లేదు. స్వామి వేయిపడగ లెప్పుడు పోయినవో, వాని చిహ్నములుగూడ నెప్పుడునశించినవో యప్పుడే బలిపీఠము నశించినది. అందులో

నిప్పుడు స్వామి లేఁడు. ఆలయముమాత్రము పూర్వదశాచిహ్నముగా నుండెను.

మఱలనానాఁడు వాన కురియలేదు. వేసవికాలమువలె నెండలు కాచెను. నడచుచున్న జనుల తలలు మాఁడెను.

నాఁడు ప్రొద్దుక్రుంకెను రాత్రికి గణాచారి నిదురించుచున్నపాకకు నిప్పంటుకొనెను. గాలి విజృంభించసాఁగెను. జనము వచ్చి గణాగారి పాకలోఁబడి మరణించిన దనిరి. ఆనిప్పు దూరమున కెగసి, పురపాలకసంఘ వారిమార్కెట్టున కంటుకొనెను. ఆవిరెంచుచున్నదమ్ములవలెఁ గాలెను. దూలములు, మేకులు భగ్గుభగ్గునమండు మంటలోనుండి, యవి పెటిలి, యవి లేచి, దూరపుఁ గొంపలమీఁదఁ బడెను. ఊరికి నచ్చటికి సంబంధము లేదు. లేకపోయినను గ్రామమంటుకొన్నది. బ్రాహ్మణవీధి, రెడ్లవీధి, కమ్మవారివీధి, కాఁపుల బజారు, కలాలీలపేఁట, కాసాపేఁట అంటుకొననిస్థలము లేదు, నడివర్షాకాలము. పగలా యెండలు కాయుట, రాతిరి యీ మంటలు మండుట. ఒకప్రక్కను గృహములు కాలుచుండఁగా నార్పిన దిక్కు లేదు. నూతులు బావులన్నియుఁ బూడ్చఁబడెను. ఆర్పుటకు నీరు లేదు. కొళాయి క్రింద బిందె పెట్టినచో నది నిండువఱకు కలగంట యగుచుండెను. ఈలోపుగా రెండిండ్లు కాలిపోవుచుండెను. కాలుచున్న యిండ్లప్రక్కనున్న చెట్ల పచ్చని యాకులు వేఁడిమికి మాఁడిపోయెను గృహములలోనుండి సామానులు బయటికిఁ దెచ్చుకొనుటకే లేకపోయెను కొన్ని యావుదూడలు మంటలో దగులఁబడిపోయెను. లోఁ దాఁచుకొన్న ధనమును దెచ్చుటకు కొందఱు మనుష్యు లిండ్లలోనికిఁ బోయిరి. చుట్టును మహార్చులు క్రమ్ముకొన్నవి. వారు బయటికి రాలేకపోయిరి. ఒకఁ డింటిలో నిదురపోవుచుండెను. తక్కినవారందఱును బయటికి వచ్చిరి. బయటతలుపు గొళ్ళెము పెట్టిరి. అతనికి మెలఁకువ వచ్చి తలుపు తట్టెను. ఆ మహాగ్నులు చేయు మ్రోఁతలో నతనిపిలు పెవ్వరికిని వినిపించలేదు. శివనేత్రాగ్ని దగ్ధుఁడైన మన్మథునివలె నతఁ డట్లే నిలుచుండి పండఁగాలిపోయెను. ఎచ్చటఁ జూచినను విలాపధ్వనులు మున్ను ముట్టెను. ధనము తగులఁబండి పోయినవారు, ధాన్య మగ్నిపాలైనవారు, పసిపిల్లపోయియేడ్చు

వారు, ఆఁమూఁకలు నశించి వలపోవువారు నెచ్చటఁజూచిన నచ్చటనే కనిపించిరి. పట్టణ దక్షిణభాగమంతయు నొక్క మహాశ్మశానమై పోయెను. ఈ సందడిలో గణాచారి చనిపోయినమాట యెవరికిని బట్టలేదు. గణాచారి యన్నగారి యిల్లు తగులఁబడెను. రంగమ్మగారి కొడలంతయుఁ గాలెను. ఆమె యేమి బ్రదుకునో యెవ్వ దెలియదు. గ్రామమంతయుఁ గాలికాలి, తెల్లవాఱుకడ మూఁడు గంటలకు సద్దుఁబడెను.

కొండఱు కుఱ్ఱవాండ్రు పరుగెత్తుకొనివచ్చి గుండేఱు వచ్చుచున్నదనిరి. పన్నెండు, పదుమూఁడేండ్ల క్రింద వచ్చిన గుండేఱు మఱల వచ్చెను. దాని నీరిసుకతోఁ గలిసి, గిరగిర సుడులు తిరుగుచు నేలను ద్రవ్వుచు ప్రథమాక్రాంతి యంతయు బురదనీరుగాఁ బ్రవహించెను. నీటిమీఁదనుండి బొంయిమని ధ్వని వచ్చెను. రెండు తరంగములమధ్య పిండుకట్టిన డిండీరములతోఁ, దఱుముకొని వచ్చిన వేగముచేత నేలపైకిఁబోయిన కెరటము మొదట బుసబుసలాడి, కెరటము పలుచఁబడినతరువాతఁ బుగపుగలాడి, లేతమురుఁపై పోవుచుండెను. వఱదనెంబడి సర్పము లనేకములు కొట్టుకొనివచ్చెను. అవియన్నియు నిండ్లలో దూఱెను. మఱునాఁటికి గుండేఱు తగులబడి పోయినసగమిండ్లమీఁదికిఁ దఱుముకొని వచ్చెను. ప్రొద్దునకన్న సాయంకాలము, సాయంకాలమునకన్నఁ బ్రొద్దునగా గుండేఱు విజృంభించుచుండెను. దానిలోని యెఱ్ఱని యొండునీరు వధింపబడిన మహాపాపుల నెత్తురువలెఁ బ్రవహింపసాఁగెను. తగులఁబడిపోయినయిండ్ల మధ్య నొకానొకపాక యున్నచో దానిని గుండేఱువచ్చి పడఁద్రోసెను. పోయిపోయి జనము లా పల్లములోఁ గట్టుకొన్నా రేమి యిండ్లు! పూర్వము గుండేఱువచ్చినప్పు డవియన్నియుఁ బొలములు. ఆ సస్యమంతయుఁ దిని గుండేటికి కడుపునిండెడిది. ఇప్పు డేమున్నది? తినుటకు మృత్తు. కాని గుండేఱు తన ప్రవాహసౌందర్యమును వదలి పెట్టినది కాదు. లోఁతులేనిచోటుఁగూడ సుళ్ళుతిరుగుట యిండ్లన్నియు నావరించి, నేలయంతయుఁ బారాడి, రాజ్యము తనదే యన్నట్లు విజృంభించెను, నీటిపాములు తలమాత్రము పైకెత్తి యీఁదుచుండెను. మనుజునికన్న తనమీఁదఁ బడినచోఁగాని నీటిపాము

శిరస్సు ముంచదు. జలము వంతెనపైఁబడి పోవుచుండెను. రైలుసంతెన పడిపోయెను. రైలుమార్గము మైలు, మైలున్నఱ గుండేటి కడ్డము రాఁగా నేఱు దానిని విదల్చి తన్నెను. అదియు బొక్కబోర్లగాఁ బడెను. దేనిపైన నైన నాగవచ్చుగాని ప్రవాహవేగమున నెవరు నా[illegible]. గుండేఱు పట్టణమువైపునకు మైలు పొడిచి, పూర్వము గ్రామము[illegible]ంతవఱకు జలమయము చేసెను. పెరిగిన పట్టణమంతయు విఱిగిపోయెను. విద్యుద్దీపార్థములై స్తంభములు కొన్ని పడిపోయెను. కొన్ని కొళాయిలకుఁ గంఠముదాఁక నీరు వచ్చినను, నవి త్రిప్పినచో నోటిలోనుండి నీటిని వదలుచుండెను. ఆకుపచ్చని పెద్దబావురుకప్పలు లోఁతులేనినీటిలోఁ ద్రాఁచిపట్టిన చాకలు లుదుకుబండలవలె బడియుండి విక్రృతస్వరము లారంభించెను. అవి పక్షములు పడి, యెనురు బళ్ళుగా గుంపులుగుంపులుచేరి, మాండూక్యోపనిషత్తులు చదువ నారంభించెను. ఉపనిషత్తు చిన్నదే. గౌడపాదుని కారిక పెద్దదై పోయినది.

మహాగ్నిచేతను, గుండేటివఱదలచేతను క్రొత్తగావచ్చిన పట్టణమంతయు నశించిపోయెను. ఈసారి వఱద పదునేనురోజుల దాఁకఁ దీయలేదు. జనమునకు నిలువనీడలేకపోయెను. కాలేజి నీటిలోఁగలిసిపోయినది. ధర్మారావు గణాచారికి సంస్కారములు జేయించెనును. ఆతఁడొక్కనాఁడు వఱదలు తీసినతరువాత రైలుస్టేషనుకుఁ బోయెను. ప్లాట్‌ఫారముమీఁద సుభాన్ పేట అని వ్రాసియుండెను. ఒక కాలేజీలోని యుపన్యాసకుఁడు దాక్షిణాత్యుఁడు 'సుభాముపేటయా, భానుఁడని యెవరైన నిచట రాజ్యము చేసెనా? ఆ రాజీ యూరు కట్టించి యుండవచ్చు' ననెను. ధర్మారావు 'మీరు చరిత్రోపన్యాసకులా' యనెను. తాత్కాలికముగాఁ బూర్వపుటూరే మిగిలిపోయెను. ఈ గోలలో గణాచారి చనిపోయినదని యెవ్వరు ననుకొనలేదు.

# ముప్పదియాఱవ అధ్యాయము

వినాయకచవితినాఁటికి పఱదలు బాగుగాఁ దీసెను. పదునే నిరువది దినములనుండి సుబ్బన్నపేఁట బెజవాడలమధ్య ... ను నడుచుటలేదు. ధర్మారావు పండుగ కానిచ్చి, పశుపతి ... యూరి పోద మనుకొనెను. చిన్న హారప్పకును, రామేశ్వరశాస్త్రికిని గలిపి, కుమారస్వామి వినాయకునిమీఁదఁ బద్యములు చెప్పెను శాస్త్రి కా పద్యములన్నియుఁ గ్రొత్తగా నుండెను. 'ఓబొజ్జ గణపయ్య నీబంటు నేనయ్య ఉండ్రాళ్ళమీఁదికి దండుపంపు, కమ్మనినెయ్యియు కడుముద్దపప్పయ్య బొట్టనిండా తిని పొలుతునయ్య' అని పాడుచు నూరివెంట గుజ్జుపుఖదను త్రొక్కుచుండెను. రంగారావుగారు గంతులు వేయు శాస్త్రినిజూచి 'నీవు మా అబ్బాయినిగూడ జెడఁగొట్టెదు సుమా' యనెను. శాస్త్రి, 'నే నెంత చెడఁగొట్టినను నతఁడు మీకన్న చెడిపోవునా' యనెను. రంగారావు తెల్లనిమీసములు రెండుచేతులతో దువ్వుకొనుచు పకపకా నవ్వెను. "అయినచో నేను చెడిపోయినా నందువా?' శాస్త్రి- నవ్వుచు నన్నాను. రంగారావు శాస్త్రిని బట్టుకొని బుగ్గనలుపుచు 'నిజముగా నన్నానని చెప్పుము. వదలిపెట్టెద' ననెను. శాస్త్రి "నిజముగానే యన్నా"నని వదలించుకొనెను. రంగారావు హారప్పనుజూచి 'యివ్వేళ పంతులుగారు రాలే దేమి' యనెను. ఆయన 'నేఁడు పండుగగదా! నిన్నను మొన్ననుగూడ రాలే' దనెను.

రంగాపురములో 'వడ్లవానితోఁట' యని యొకఁ డున్నది. అందులో మారేడుచెట్లు, పూలచెట్లు నున్నవి. ఊరిపిల్లలందఱుఁ బూర్వకాలమున వినాయకచవితి కచ్చటికిఁ బోయి పత్రి తెచ్చుకొందురు. హారప్ప రామేశ్వరశాస్త్రులు ప్రొద్దుననే పోయి పత్రి తెచ్చుకొనిరి. రంగారావుగారు చూచెను. హారప్పతో 'నీవెందుకు వెళ్ళితివి? జమీందారులు వెళ్ళరా' దనెను. శాస్త్రి 'జమీందారులపిల్లలు పిల్లలు కారా? జమీందారులు మనుష్యులు కారా' యనెను. రంగారావుగారు 'కా' దనెను. రామేశ్వరశాస్త్రి

హారప్పను తరువాత 'నీవు మనిషివి కావు. మనిషివి కా' దని యేడిపించుచుండెను. ఆనాఁడు శమంతకోపాఖ్యానము చదివి దేవాలయములో నొకపండితుఁడు పురాణము చెప్పెను. పిల్లలిద్దఱును బోయి వినిరి. దానివెంట శ్రీకృష్ణగాథలన్నియు వారికిఁ దెలిసెను. వినాయకు[illegible]ర్వతి, శివుఁడు, చంద్రుఁడు - వీరి కథలన్నియుఁ దెలిసెను.

త[illegible]వాత నాల్గునాళ్ళకు ధర్మారావు పశుపతిగారి యూరు పోయెను. వాకిటఁ బశుపతి కూర్చుండి, ధర్మారావును జూచి మొగము చిట్లించుకొనెను. ధర్మారావునకుఁ గారణము తెలియలేదు. అయినను బలుకరించెను, పశుపతి మనస్సు కొంచెము సర్దుకొని భార్యను బిలిచి, 'ధర్మారావు వచ్చినాఁడు. కాళ్ళు కడుగుకొనుటకు నీరు తె' మ్మనెను. పాదప్రక్షాళనమైనతరువాత నిద్దఱునుగూర్చుండి మాటాడుచుండిరి. పశుపతి చాలముభావముగ మాటాడుచుండెను. ధర్మారావునకుఁ గారణము తెలియలేదు. భోజనమువేళకు నింటిలోనికిఁ బోయిరి. పశుపతి దొడ్డిలో స్నానముచేయుచుండెను. ధర్మారావు చావడిలో నుండెను. అనసూయ వచ్చి 'నాయనా! నీ కెంత యిక్కట్టు వచ్చినది? ఆపదలు సత్పురుషులకే వచ్చు'ననెను. ధర్మారావు 'పశుపతి సరిగా మాటాడుట లేదేమి' యనెను. అనసూయ 'యేదో పిల్లదాని పెండ్లివిషయము' అని చెప్పవచ్చినదేదో చెప్పకుండ మానినట్లయ్యెను. భోజనమైనతరువాత నింటికివచ్చిన స్నేహితునితో నట్లుండుట బాగుండదని పశుపతికొంచెముమనసిచ్చి మాటాడ మొదలుపెట్టెను. వారిప్రసంగము బాల్యవివాహములమీఁదకుఁ బోయెను.

పశు - మనదేశములో బాల్యవివాహములు మిక్కుటమై పోయినవి. దానిమూలమున నాపద లెక్కు వగుచున్నవి. ధర్మా - ఆపదలు నా కేమియుఁ గన్పించుట లేదు. పశు - నీవు బాల్యవివాహములు చేయవచ్చు నందువా? ధర్మా - మా పూర్వులందఱును బాల్యవివాహములు చేసికొన్నారు. మీ పూర్వులందరును జేసికొన్నారు. దేశమున నిన్న మొన్నటివఱకు బాల్యవివాహములే జరిగినవి. దానివలన వచ్చిన నష్ట మేమి? పశు — నలువదియేండ్లవానికిఁ బన్నెండేండ్లపిల్ల నిచ్చినచో వానికి యౌవనము పది పదునేడేండ్లు

గడచినతరువాత నుండదు. అప్పటికీ పిల్ల నడివయస్సులో నుండును. దీనిజీవితము నాశనమగును. ఆ ముసలివాఁడు చనిపోయినచో నిది పసుపుదనములో విధవరా లగును అది సరిగాఁ బ్రవర్తించదు. ధర్మా - పురుషులకు యౌవన మఱువది యేండ్లు వచ్చుదాఁక నుండును. స్త్రీలు నలువదియేండ్లకు ముసలివాం డ్రగుదురు. [illegible]వది యేండ్లవానికిచ్చినచో విధవరా లగునందువు సమానమైన వయస్సుకల దంపతులలో భార్యలుకాని, భర్తలుకాని పోయినవా రెంతమంది? వారి మాట యేమందువు ? మిగిలిన విధవ దుష్ప్రవర్తనచేయునన్నచో నరువదియేండ్ల మగఁడు చచ్చినవిధవచేసి, యిరువదియేండ్ల మగఁడు చచ్చిన విధవ చేయదా ? పరిస్థితులవలన మానవులప్రవర్తన కొంత మాఱు నన్నమాట నిజమేకాని, మంచియో చెడ్డయో వారి ప్రకృతిలోననే సహజముగా నుండును. మగనాలై, జారిణియైనదాని సంగతి యేమి ? అట్టివా రెంతమంది యున్నారు ? విధవరాలు జారిణియైనచో నీ కంత వెగటేమి ? పశు - భ్రూణహత్యలు జరుగుచున్నవి కదా ! ధర్మా - నయము ! వారుగూడ బ్రదికినచో వా రేమగుదురు ? వారికిఁ దిండి యెవరు పెట్టెదరు ? చదు వెవరు చెప్పింతురు ? అనాథశరణాలయములలో వారిని బోషించి, దేశోపకార మను పేరుతో వారిచేతఁ బానిసవృత్తి చేయించుకొను సంఘసంస్కర్తల పాలము పంపుటకా ? 'క్రొత్త యొకవింత, పాత యొకరోఁత' యని యెన్ని దోషము లున్నను సంస్కార మాధునికులకుఁ బ్రియముగా నుండును. పూర్వపద్ధతి వెగటుగాఁ గనిపించును. పశు - విధవలు పెండ్లి యేల చేసికొనరాదు ? భార్య చనిపోయిన పురుషు లేల చేసికొనవచ్చును ? ధర్మా - అది చాల పెద్దవిషయము. స్త్రీ పురుషులసృష్టిలో, సంఘమునందలి వారి స్థితిలో, వారి కామప్రవృత్తిలో భేదమున్నది. ఆభేదము వలన నట్లు జరుగుచున్నది. పశు - ఆభేదములన్నియు నీవు నీమనస్సులోఁ గల్పించుకొన్నవే. ధర్మా - లోకమంతయు నాంతరబాహిరముల సమైక్యచిహ్న మను సిద్ధాంతము నీ వొప్పుకొందువా ? ఒక యాత్మకు వాని ముఖలక్షణములు, శరీరవిన్యాసములకు సంబంధముండును కదా ! పశు - ఉన్నట్లే తోఁచుచున్నది. ధర్మా - భిన్నపురుషులముఖములయందు, శరీరములయందుఁగల భేదమునుబట్టి వారియా

త్మలయందు భేదమున్నదని మనము తెలిసికొనవచ్చును. వారియందతి యాకృతులలోఁ బ్రకృతులలో భేదము లున్నను, వారియందు బురుష లక్షణముసామాన్యము అట్లేపురుషులయందును స్త్రీలయందును మానవ త్వము [illegible] సామాన్యగుణమైనఁ బ్రకృతిలోఁ జాలభేద ముండును. పురుషుఁడు తృప్తిపడుమార్గము వేఱు. స్త్రీ తృప్తిపడు మార్గము వేఱు. పురుషుఁడు గర్భము ధరించఁడు. స్త్రీయే ధరించును. పురుషుఁడు కామమును జంపుకొనలేఁడు; స్త్రీ చంపుకొనఁగలదు. సృష్టికిఁబురుషుఁడు బీజభూతుఁడు. స్త్రీ తనూవిస్తృతివంటిది. లోకమునందున స్త్రీలందఱు సరిగా వయస్సున్నన్నినాళ్ళు గర్భమునుధరించి సంతానము కనినచో నప్పటి మానవసంఖ్యకు జగత్తు చాలదు. నీ యార్థికశాస్త్రములో నుత్పత్తి వ్యయములు (Supply and Demand) అని చెప్పి, ప్రపంచములోని ద్రవ్యములు కావలసినవి యుత్పత్తిచేయునట్లే, యక్కఱలేనివి నశించిపోవుచున్నట్లే - యీ మానవ సృష్టి దీని కతీతమైన యొక మహార్థికశాస్త్రము. అందులోనను బురుషులు స్త్రీలు, జననములు మరణములు, వివాహితులు బ్రహ్మచారులు సర్దుకొనియుండుటలో నొకపద్ధతి యున్నది. ఇప్పటికి దేశములో మగ పిల్లలు దొరకుట లేదు. వేలకువేలు కట్నములిచ్చినఁగాని దొరకరు. తండ్రులు కాళాశాలలవెంటఁబడి తిరుగుచున్నారు. ఈ భర్తృహీన లకుఁగూడ వివాహములు చేయుటకు మొదలు పెట్టుము. పురుషులకుఁ గఱవే ప్రాప్తించును. అవివాహితలకు వివాహములు కావలెయు నని బాలవిధవలను బెండ్లి చేసికొనరా దందువా యని నీ వాక్షేపింతువేమో! లోకధర్మ మదియేకదా! ఇది యొక క్రీడా విశేషము. నీవంతు వచ్చినది. నీవు గుఱితప్పి కొట్టితివి. రెండవవాని వంతుగాని నీ వంతు కాదు. ధర్మ మన్నిచోట్ల నొకటియే. మీ రందఱు వేదశాస్త్రముల నొప్పుకొనరుగనుకఁ, బూర్వర్షులవలె మేము ను శాసింతు మందురు గనుక, నీకీ లౌకికమైనసమాధానము చెప్పితిని. పశు - వైదికమైన సమాధాన మేమిటి? ధర్మా - స్మృతి నిషేధించుచున్నది గనుక. పశు - స్మృతిని నే నొప్పు కొనను. ధర్మా — ఇదిగో లౌకికమైన సమాధానము చెప్పితిని. నీవు వదలించుము. నీ యిష్టము వచ్చినంతసేపు నేనును వాదిం

తును. పశు-నీది మొండివాదన. ధర్మా—నీది మొండివాదన యని నేను ననవచ్చును. పశు - అన్నచో నేమి లాభము? నలుగురు నొప్పుకొనవలయునుగదా! ధర్మా—ఈ నాటికి నీ మాట లొప్పుకొనుటకు నలుగు రున్నారు. నామాటలు నలుగు రొప్పుకొన్న వే- అవియే స్మృతులు. పశు- ఆ స్మృతికర్తలందఱును స్వార్థపరాయణులైన బ్రాహ్మణులు ధర్మా—వారు నిజముగా స్వార్థపరాయణులైనచోఁ బూర్వపులోకము వారి నంత యాదరించదు. వారు స్వార్థపరాయణులని యనుట మొదలుపెట్టి యెన్నినాళ్లైనదో చూడుము. వా రాగ్రంథములు వ్రాసి యెన్నినాళ్లైనదో చూడుము! పశు - ఇతరదేశములలో భర్తృవిహీనలైన స్త్రీలు చక్కఁగా వివాహములు చేసికొనుచున్నారు. నీ ధర్మశాస్త్రము లక్కడ నేల లేవు? ధర్మా- అక్కడ మహర్షులు లేరు గనుక, వారు చక్కగా సృష్టియొక్క శాంతిని, ప్రపంచముయొక్క సుస్థితిని గుఱించి యూహించలేదు గనుక. అచ్చట వివాహితలుగాని స్త్రీ లెంతమంది కలరు? కొందఱికి ప్రథమవివాహమే కాదు. ప్రతికన్నెయు నొకపురుషుని సమాకర్షించవలయును. ఆ సంబంధములు కుదురుటకుఁ బెద్దపెద్ద నాట్యసభలు మొదలైనవి చేసికొందురు. ఆభారము స్త్రీమీఁద పెట్టుటకన్న తండ్రి తనపైనుంచుకొనుట మంచిదికదా! పశు- తండ్రి యాయధికారమును దుర్వినియోగముచేయును. ధర్మా—అది యొక్కొక్కప్పుడు చేయును. ఒక్కొక్కప్పుడు స్త్రీయు దుర్వినియోగమే చేసికొనును. పరదేశకథానకములు చూడుము. ఎంతమంది స్త్రీలు పాఱిబడి తండ్రుల నెదిరించి వివాహములు చేసికొనిరో, వారిని వారిభర్తలెట్లు పరిత్యజించిరో! అధికార మున్నచోటులనెల్ల దుర్వినియోగములు జరుగుచునేయుండును. సర్వము దోషమయమైనప్పుడు బహుదోషమైనదానిని బరిత్యజించి యల్పదోషమైనదానిని బరిగ్రహించి దానియందలి యల్పదోషములను నివారించుటకుఁ బ్రయత్నించవలయును. అది బుద్ధిమంతుల లక్షణము. ఇతరదేశములలో జను లెనుబదితొంబది యేండ్లదాఁక బ్రదుకుచున్నారు. మన దేశములో నిరువది, ముప్పది, నలువది - యెప్పుడు పడిన నప్పుడే చచ్చిపోవుచున్నారు. పూర్వమింత విచ్చలవిడిగాఁ జావలేదు. జను లింత

చిన్నతముననే యేల చనిపోవుచున్నారో విచారించి దానికిఁ బ్రతిక్రియలు చేయుము. బాల విధవలసంఖ్య తక్కువ వగును. ధర్మనాశనముతో నాయుఃక్షీణము జరుగుచున్నది. ధర్మశబ్దార్థము మహావిస్తారమైనది. నేను ధర్మ మనుటచేత జనుల యారోగ్యమునకు మన శ[illegible]ఁ గావలసినపరిస్థితులనుగూడఁ జెప్పుచున్నాను. మరబియ్యము కొళాయి[illegible]ు నివి రెండేచాలును - నీ దేహమును, సర్వథా శ్మశానముగాఁ జేయుటకు. ఎవరో యన్నట్లు తెలుఁగుదేశములోఁ బాతిక యేండ్లు రాకమునుపే జనులకందఱకు తల నరయును. సులోచనములు పెట్టుకొనుచున్నారు ఈ బాల్యజరాహేతు వేమి? దానికి బ్రతిక్రియ యేమి? విద్యార్థికి సంవత్సరమునకు నాల్గు పరీక్షలు. తినుతిండి యిది. శరీరవ్యాయామము లేదు. డ్రిల్లు లన్నది నాటకము. బాడ్మింటనువలనఁ బ్రయోజనము లేదు. ఫుట్ బాలు, టెన్నిసులు ప్రయోజనకారులైనను వానికిఁ జేతనగుట, చేతఁగాక పోవుట యున్నది. ఆడుటకుఁగూడఁ గొలఁదిమందికే వీలు. టెన్నిసునకు ధనవ్యయ మందఱు నోర్వలేరు. అందఱకును జక్కఁగా సమర్చిన శరీరవ్యాయామము లేదు. మనస్సులో నెప్పుడును బరీక్షలనుగూర్చి దిగులు. మిథ్యాశీలమొకటి పరిపోషింపఁబడుచున్నది. శిక్షాపద్ధతి పేర నిర్దయపంచి పెట్టఁబడుచున్నది. ఆయుస్సుతక్కువ, శరీరపుష్టిలేదు. ప్రతి విద్యార్థియుఁ జిన్నప్పటినుండియు నహంకారము, గర్వము, నధికారదూర్తత్వము, స్వార్థపరత్వము నీ గుణములను బెంచుకొన్నాఁడు. వీరే పెద్దయైనతరువాత లోకము. ఈ లోక మిట్లే తయారగుచున్నది. పశు - నీ వొకచోటనుండి యింకొకచోటికిఁ బోదువు. ధర్మ-పోవుటకు వీలుగా నున్నది. బహుదోషము లొకదాని కొకటి హేతువులుగా నున్నవి. తీఁగ కదపినచో డొంక కదలును.

ఆనాఁడు పశుపతియింటికతని మేనమామ వచ్చెను. నాఁటి రాత్రి భోజనములైనతరువాత ధర్మారావు వచ్చి చావడిలోఁ గూర్చుండెను. లోన నేదియో పెద్ద గందరగోళ మగుచుండెను. అది క్రమక్రమముగాబలిసి ధర్మారావునకుఁ గొన్ని కేకలు వినిపించెను.

అనసూయ - ఈపిల్ల యీయననుగానిచేసికొన ననుచున్నది. తండ్రి కోపపడఁగా మొన్న నాలుగైదురోజులు భోజనమే చేయ

లేను. నాకుఁ జావు దీనితో వచ్చినది. పసు- ఇది తల్లి నేర్పిన విద్య గాకపోయినచోఁ బన్నెండేండ్లపిల్ల యీ పుష్టుట యేమి? దాని కేమి తెలియును? మేనమామ- చావడిలో నాయన యున్నాఁడు. ఆయనకు వినిపించు నేమో! పసుపతితల్లి - వినిపించినచో నాయన కేమి? చేను మ్రింగునా?

ధర్మారావున కీ మాట లర్థము కాలేదు. అన్నియు బాగుగనే యున్నవి. చేను మ్రింగుట యేమిటి! ఏమిటో మన కెందుకులే యని యతఁ డూరకుండెను. కొంతసేపటికిఁ బసుపతి బయటికి వచ్చెను. పసుపతితల్లి వచ్చి 'నాయనా! అరుంధతి భోజనము చేయననుచున్నది. ఏమి చేయుదువు?' అనెను.

పసు- చంపి నూతిలోఁ బాఱవేయుము. ధర్మా- పసుపతీ! నీ వెన్నఁడును గోపమెఱిఁగినవాఁడవు కావు. అట్లనుచున్నా వేమి! తల్లి- నాయనా! స్నేహితు లని తెచ్చి నెత్తిన బెట్టుకొంటివి. వారే నెత్తికిఁ దెచ్చిరి.

ఆవిడ యీ మాటలన్నతరవాత ధర్మారావు తనకుఁ దగిలినట్లూహించెను. అతని కేమియుఁ దెలియలేదు. ఊరకుండెను.

మఱునాఁడు పొద్దుననేలేచి ధర్మారావు వారితోటవైపునకుఁ బోయెను. వారితోఁటమాలి నాగభూషణము ధర్మారావును జూచి 'బాబూ! తమ రెప్పుడు వచ్చితి' రని ప్రశ్న వేసెను. 'పెండ్లిచేసికొనుటకు వచ్చితిరా' యనెను. ధర్మారావు 'పెండ్లి యేమి' టనెను. నాగ—అరుంధమ్మగారు తమరినిగాని పెండ్లిచేసికొనదఁట! మా దొరసానిగారి కిష్టముగానే యున్నది. దొరగారి కిష్టముగా లేదు. మీకుఁ బిల్ల నిత్తురేమో, మీరు వచ్చినారేమో యనుకొన్నాను.

ధర్మారావు మొగ మొక్కసారిగా వాడిపోయెను. ఆ వాడిపోవుటలో నొక మెఱుపు మెఱసెను. ఇప్పు డతనికి రాత్రి కేకల యర్థము తెలిసినది. అతఁ డచ్చటనుండి రైలునకుఁ బోదమా యనుకొనెను. మునుపటివలె మోటారుమీఁద తాడేపల్లి గూడెము స్టేషనునకుఁ బోనక్కఱలేదు. ఉండిలో రైలెక్కి బెజవాడ చేరవచ్చును. కాని యతని మనస్సొక్కసారి వారియింటికిఁ బోద మనిపించినది. అదియుఁగాక ప్రొద్దుటిబండి తప్పిపోయినది. మధ్యాహ్నమునకుఁ

గాని వీలులేదు. అతఁ డింటికిఁ బోయి 'పశుపతీ! నేను మధ్యాహ్నపు బండికిఁ బోయెదను. పెందలకడ వంటచేయించు' మనెను. పశు- ఎప్పుడును పెందలకడనే యగును.

భోజనము లగుచున్నప్పుడు పశుపతియు, నతని మేనమామయు, దల్లియు, భార్యయు నందఱు నుండిరి. ధర్మారావు పశుపతి మేనమామతో నిట్లనెను: 'అయ్యా! రాత్రి మీ కేకలతోఁ గొంత యర్థమైనది. ప్రొద్దునఁ దోఁటమాలి నాగభూషణము చెప్పినాఁడు. నేను మీ యమ్మాయిని నా కిమ్మనలేదు. ఆమెను బెండ్లి యాడుట నా కిష్టము లేదు నే నసలు పెండ్లియే చేసికొనను. నా చనిపోయినభార్యకు ద్రోహముచేయుట నా కిష్టము లేదు. ఏదో స్నేహితుఁడుకదా యని చూచిపోవుటకు వచ్చితిని. దైవసాక్షిగాఁ జెప్పుచున్నాను. నే నాపిల్ల నెప్పుడును వ్యామోహపెట్టలేదు. ఆమె కెనిమిదేండ్లప్పుడు వచ్చితిని. అప్పు డామెకు బుద్ధియే తెలియదు. దేవుని కల్యాణోత్సవములకు మాయూరు వచ్చినది. అప్పు డామెను నిజముగా నేను సరిగాఁ జూడనైన లేదు. ఇందు నా దోషమేమియు లేదు. ఈ సంగతి యక్కగారనసూయకును దెలియును. పసిపిల్ల భ్రాంతిపడవచ్చును. వయసుచేతనా, నేను ముసలివాఁడను. నాకు ముప్పదియేడేండ్లు.'

మామ- ముప్పదియేడేండ్లకు ముసలితన మేమిటి లెండి!

ధర్మా - ఆస్తియా నా కేమియును లేదు. మీరు చాల ధనవంతులు. రెండవపెండ్లివాని కీయవలసిన యగత్యము మీకు లేదు. నే నా ధనవంతుఁడను కాదు. అన్నిటికన్న ప్రధానమైనది నే నసలు వివాహమే చేసికొనను. ఈ నింద నా కెందుకు? భోజనముచేసి వెడలిపోవుచున్నాను. మీరు కావలె నన్నచో నా పిల్లతోఁ జెప్పిపోయెదను- 'అమ్మాయీ నా కవసరము లేదు. పిచ్చిదానా! ఈడుజోడైన వానిని జేసికొనవలయునుగాని, నన్నాడి యేమి సుఖపడెద' వని.

ముసలమ్మ 'నాయనా! అట్లే చెప్పిపో' మ్మనెను. భోజనమైన తరువాత ధర్మారా వరుంధతివద్దకుఁబోయి, "ఎందు కమ్మాయీ! నీ కేమైనపిచ్చిపట్టినదా? ఈగోల యేమిటి? నే నసలు పెండ్లియే చేసికోను. తండ్రిమాట కెదిరించుటబుద్ధిమంతులగుపిల్లలుచేయరు. ఎవ్వరైన

నవ్వుకొనిపోదురు. ఇంక నేను మీ యింటికి రాను. నీమూలముగా మా స్నేహముకూడఁ జెడిపోయినది. మంచి తెలివిగలపిల్లవే. పశుపతీ! ఎక్కడైన మంచిసంబంధము కుదిర్చి తెచ్చి చేయుము! ఆడపిల్లల యిష్టమువచ్చినట్లు పెండ్లిండ్లుచేసినచో మనము భాగుపడి[illegible]. మనస్సు పదునేడేండ్లదాఁక వికసించదు. ఈలోపుగా [illegible] మనస్సును మనయిష్టమువచ్చినట్లు త్రిప్పవచ్చును. [illegible]ఎవరినో తెచ్చి పెండ్లిచేయుము. వాఁడైన దేమి? ఇంకొకఁడు కాని దేమి? దొరికిన స్త్రీనే పురుషుఁడు భార్య యనుకొనును. దొరికినపురుషునే స్త్రీ భర్త యనుకొనును. మనమందఱమును వలచి చేసికొంటి మేమి? వలచిచేసికొన్నవారును గనిపించిన స్త్రీలలో నెవ్వతెనో యొక దానిని వలచుటగాని, నా కిటువంటి స్త్రీ కావలెనని కోరిదానికొఱకు వెదకిరా? దానిని దెచ్చిరా? కనిపించినప్పుడు దానిని నేను వలచినా ననుకొని వలచితిని వలచితి ననిరి. పెండ్లియాడినప్పుడు దానిని నేను వలచితి ననుకొన్నచో సరిపోలేదా? లోకమంతయు నట్లే యనుకొనెదరు. చక్కని కుఱ్ఱవానిని గుదిర్చి పెండ్లిచేయుము' అని ధర్మారావు తనదారిని బోయెను. సుబ్బన్నపేట చేరెను. తరువాత నెల గడచెను. ఆశ్వయుజము వచ్చి వర్షములు పూర్తిగా వెనుకపట్టెను. మహార్నవమి పండుగలు ప్రారంభమయ్యెను. రంగారావుగారు నాగేశ్వరస్వామివారి యాలయములో దేవీనవరాత్రములు జరుపుటకుఁ గలశస్థాపన చేయించిరి. ఆయన ధర్మారావును బిలిపించి 'ఏమండీ! నాకును భార్య లేదు. మీకును భార్యలేదు. కలశస్థాపనకుఁ బీఁటలమీఁద నెవరు కూర్చుండవలయు' ననెను.

ధర్మా—పురోహితుని గూర్చుండఁ బెట్టుఁడు. రంగా—కుమారస్వామిగారు పిల్లలచదువు వీథిబడిక్రిందికి దింపిరి. ఆయన పిల్లలచేత మహార్నవమిగడలు పట్టించునఁట! ధర్మారావు నవ్వెను. కుమారస్వామి పిల్లలిద్దఱకును మహార్నవమిపద్యములు చెప్పెను. ధర్మా—మహార్నవమిగడలు కట్టుట నీకు చేతనగునా? కుమా—గడలు కట్టుట యేమిటి? విల్లంబులు కోఁతులు పుచ్చుకొనుట యే కదా! ధర్మా—అది కాదు. గజముపొడుగుచీల్చినవాసపు బ్రద్ద తీసి క్రింద నడుగువదలిపెట్టి రెండడుగులమేఱ నిర్ణయించి, రెండడు

గుల యింకొక చిన్న బద్ద తెచ్చి నిర్ణయించిన మేఱలో నడుమకు రెండును సరిగా సగముసగమగునట్లు కలిపికట్టి, దానిచుట్టు దార మల్లెదరు. అల్లినదారము చచ్చదరముగాఁ బటమునకు ముఖ మేర్పడునట్లు చేయుదురు. ఎఱుపు, నలుపు, బసుపు, ఆకుపచ్చని దారములతో రెండువ్రేళ్ళ వెడల్పున నొక్కొక్కరంగు వచ్చునట్లల్లెదరు. పటముపైని రెండుప్రక్కల మిగిలినకఱ్ఱలకు మఱల నడ్డుపుల్లలు వేసి యిట్లే చిన్నచిన్నపటములల్లెదరు. ఎఱుపు తెలుపు దారములు కలిపి పెనవేసి దానిని బియ్యపుదార మని చిన్నచిన్న కుచ్చులు, చిలుకలు వానికిఁ బ్రేలాడఁదీసి పటముచుట్టు కట్టెదరు. వేఱుగ నొకగజము పొడుగుగల వాసము తెచ్చి, దానికి తాటియాకులతో గుండ్రముగాఁ గొన్నియు గోసఁటువచ్చునట్లు కొన్నియు గిలకలల్లి, గుండ్రపుగిలకలలో ఱాళ్ళుపోసి, యీ వాసమునకుఁ దొడిగి, గిలకలమధ్యనున్న వాసమునకు రంగులగుడ్డ లల్లెదరు. ఆ పటము వాసమునకు బిగింతురు దీనిని 'మహానవమిగడ' యనెదరు. ఈ గడలు పుచ్చుకొని యుపాధ్యాయుఁడు పిల్లల బంధుగులయిండ్లకుఁ దీసికొని పోవును. ఊళ్ళవెంట నడిపించుకొనిపోవును. పదియేండ్ల పిల్లలకు నిదియు నొక విద్యాభ్యాసము. వారికిఁ బదియూళ్ళు చూపించినట్లగును. బెదురు తీరును. మనుష్యప్రకృతి కొంచెముకొంచెముగాఁ దెలియును. ఉత్సాహము కలుగును. నీ విదియంతయుఁ జేసెదవా? బి. ఏ. పరీక్ష యిచ్చితివికదా! నీకు మర్యాదాభంగముకదా!

కుమార—బి. ఏ. పరీక్ష యిచ్చినవాఁడు, నూఱు రూకల జీతము తెచ్చుచున్నవాఁడు, నలువదివేల యాస్తికలవాఁడు చేసినపనియే మర్యాదకల పని! ఎవనో కాఫీహోటలుపెట్టినవానికొడుకున కొక హైకోర్టుజడ్జి తనకూఁతు నిచ్చెనఁట!

మఱునాఁడు ధర్మారావు కుమారస్వాములు కూర్చుండి యొక మహార్ణవమిపట మల్లుటకుఁ బ్రారంభించిరి. అదిపూర్తియగుటకు మూఁడురోజులుపట్టినది. తాటియాకులతో గిలకలల్లుట చేతగాలేదు. రంగాపురములోని యొకవృద్ధబ్రాహ్మణుఁడు పేటలోఁ బనియుండి వచ్చి యాగిలకలు చేసిపెట్టెను. ఆయన 'అయ్యా! యీ పటము లిప్పు డెవ్వరు నల్లుటలేదు. దీనివలనఁ గుఱ్ఱవానికిఁ బసితనమప్పుడే

వాని నేత్రములకు వర్ణసామరస్యము (Colour harmony) తెలియును. ఏ రెండురంగులు దగ్గఱగా నున్నచోఁ గలసియంద మిచ్చునో యవి చూచికొనికదా పట మల్లునది' యనెను.

కుమారస్వామి జమీందారుగారి నడిగెను: అయ్యా! పిల్లవాని దీసికొనిపోయి, బంధుగులయిండ్లకుఁ దిరిగి ర మ్మందురా' యని. రంగా[illegible] రావుగారు విచారించి కుఱ్ఱవానిజనకతండ్రులయింటికిఁ దీసికొని[illegible]మ్మనెను. కుఱ్ఱవాఁడు తల్లిదండ్రులఁజూచినట్లగును, కుమారస్వామికోరికయుఁ దీరును. చిన్నహరప్పనాయనిగారిజనకతండ్రులు నిజామురాష్ట్రములోని యొక జమీందారులు. వారికి రంగారావుగారు జాబు వ్రాసిరి. నిజామురాష్ట్రపు రైలుబండిలో నొక స్టేషనువద్ద దిగి యచటికి మూఁడురోజులు ప్రయాణమైన నా గ్రామమునకుఁ బోవలయును. స్టేషనునుండి యచటికి జమీందారుగారిబండ్లుండును. రామేశ్వరశాస్త్రియు, హరప్పనాయఁడును, కుమారస్వామియు, ఇద్దఱు కాసావాండ్రును, నొక చాకలియు, నిర్వురు పరిచారికలును పది రందఱును స్టేషనువద్ద దిగిరి. అచ్చట నాల్గుబండ్లుండెను. ఒకబండిలో చిన్నహరప్పగారు కూర్చుండిరి. తక్కిన మూఁడుబండ్లలోఁ దక్కినయందఱును గూర్చుండవలయును. హరప్ప రామేశ్వరశాస్త్రిని దనవద్దనే కూర్చుండు మనెను. ఒక బండిలో కుమారస్వామి, యొకదానిలోఁ బరిచారకులు, మఱొకదానిలోఁ బరిచారికలును గూర్చుండిరి. తుపాకులు, కత్తులు వచ్చెను. బండ్లతోలునలువురును వేఁటయందు దసమానులు. ఎదిరించి యెలుగుబంటిని, బులిని జంపగల్గుదురు. కొర్నాసిగండ్లు మొదలైనవి వారికిఁ బిలప్పిలాయమానము. బండ్లు సాఁగెను. కొంతదూరము పోవువఱకు మేఘములుపట్టి వర్షము లారంభించునేమో యని భయపడిరి. 'అయ్యా! ముందు కొండవాఁగులు కలవు. వర్షము కురిసి యా వాఁగులు వచ్చినచో నవి తీయువఱకు మన ప్రయాణము సాఁగ' దని వారు చెప్పిరి. దారిలో పోలార మని యూ రున్నది. ఆరాత్రి యచ్చట మకాము చేసిరి. కుమారస్వామి యడవు లెప్పుడును జూడలేదు. రామేశ్వరశాస్త్రికి మహానందముగా నున్నది. ఇరువైపుల నాకాశమునంటు వృక్షములు, ఘాటిప్రదేశము, వంకరటింకరలైనమార్గము. చూచినంతమేఱ కనులు చల్లగానుండును,

ఆయూరిలోనివారు 'ముందున్న తాళ్ళవాఁగు వచ్చినది. రెన్నాళ్లు గడచినఁగాని పోవుటకువీలులే' దనిరి. ఆరెన్నాళ్ళచ్చట మకాము చేసిరి. అచ్చట జమీందారుగారి పెద్దయిల్లున్నది. దానిలో దిగిరి. బండ్లవాండ్లు కుమారస్వామిని, దొరకొడుకును, రామేశ్వరశాస్త్రిని దీ[illegible] యడవిలోనికిఁ బోయిరి. షికారు చూపింతు మనిరి. ముందఱ వారే ఏ[illegible]యి మృగములెచ్చటెచ్చట నున్నవో యాచోకీ చూచి వత్తు మనిరి. వారు పోయి సాయంకాలమునకు వచ్చి 'బాబుగారూ! ఇచ్చటికి రెండుపరుగులదూరములో నొకకొండగుహ యున్నది. దానిలో నొక యెలుగుబంటి, యచ్చటికి మఱి పరుగు దూరములో నొక చిఱుతపులియు నున్నవి. పులి యెచ్చటను కని పించలేదు. పోదమా' యనిరి. హరప్పనాయఁ డుత్సాహపడెను. కుమారస్వామి కుత్సాహమును, భయమును రెండును గలిగెను. ఇద్దఱు పరిచారకు లిద్దఱు కుఱ్ఱవాండ్ర నెత్తుకొనిరి. వారిర్వురును గుమారస్వామియు, షికారీలును బయలుదేఱిరి. సంజవేళ, మసుగుమసుగుగా నున్నది. తుప్పర పడుచున్నది. షికారీలు 'పులి బయలుదేఱుట కిది సరియైన వేళ. పులి యడవిలో లేదు. అయినను గానిం' డని పోవుచుండిరి. కుమారస్వామి చీఁకటిలో వారితో నడువలేకపోయెను. కాసావాండ్రును సుబ్బన్నపేటవారే. వారికిని నడవి క్రొత్తయే. వారును ప్రాణములు చిక్కబట్టుకొని నడచు చుండిరి. వేఁటకాండ్రు తక్కినవారిని మాటాడవ ద్దనిరి. వారి యడుగులచప్పుడుతప్ప మఱియొకటి లేదు. కుమారస్వామియుఁ, బరి చారకులును బదిచోట్లఁ బడిరి. కాని కుఱ్ఱవాండ్రనుమాత్రము జాగ్రత్తగాఁ దీసికొనిపోవుచుండిరి. ఎలుఁగుబంటి యున్నచోటికిఁ దీసి కొనిపోయిరి. షికారీలలో రామన్న యనువాఁడు మంచిసాహసుఁడు, ధైర్యశాలి. వాఁడుపోయి తొంగిచూచెను. లోపల నొక యాఁడ యెలుగుబంటియు, రెండు పిల్లలు నున్నవి. వాఁడు వచ్చి చెప్పెను. కుమారస్వామి 'తల్లిని జంపినచో పిల్లలు రెండు నే మగును? చంపవ' ద్దనెను. వారు వినలేదు. నలువురును బోయి, భల్లూకిని రెచ్చ గొట్టిరి. అది లేచి మీఁదికి దూఁకెను. రామన్న తుపాకి చివర దానినోటికిఁ దూర్చెను. హరప్పనాయని బిలిచి, 'అయ్యగారూ!

మీరు దీనిని కాల్చవలయు' నని చెప్పెను. హరప్ప యుత్సాహపడుచు గుఱ్ఱమును లాగెను. ఎలుగుబంటికపాలము భిన్నమై రామన్న తుపాకిని వెనుకకుఁ ద్రోయుటచేత నది విఱుచుకొని క్రిందఁబడెను. రామేశ్వరశాస్త్రికి హరప్పకుఁ మిగుల నుత్సాహముగా [illegible]డెను. కుమారస్వామి కొడలు వణికిపోవుచుండెను. పిల్ల లేమి [illegible]వలయు నని యతని ప్రశ్న. రామన్న 'మనము వెళ్లునప్పుడు తీసి[illegible]ని పోద' మనెను.

కుమార- ఇప్పు డింక మనము తిరిగి యింటికిఁ బోదమా?
రామన్న- ఇంకను జిఱుతపులి యున్నది.

కుమారస్వామికిఁ బై ప్రాణములు పైని బోయెను. అతఁడు వల దనెను. కాసావాండ్రు వల దనిరి. కుట్టిరాజును, కుట్టిదివానును బోద మనిరి. కుమారస్వామికిఁగూడ మనసులో చిఱుతవేఁట చూడవలయుననియే యున్నది. కాని వాంఛకన్న భయ మెక్కువగా నుండెను. బోదము, వలదులమధ్య వారు నడచిరి. చిరుతగుహవద్దకుఁ బోయి యొకఁడు లోనఁదొంగిచూచెను. లోపల చిరుత లేదు. రామన్న 'షికారుపోయిన' దనెను. ఇంతలో దూరమున ధ్వని వినబడఁగా నందఱు నొక్కచిన్న ఱాతిగుట్ట వెనుక దాఁగియుండిరి. చిఱుతతోఁక జళ్లున విసరుచు, పది పదునొకండుగజములు దూఁకుచు నోరావలించి, నాల్క యడుగుపొడుగునఁ జాచుచు, నడచుచు వచ్చుచుండెను. రామన్న 'దేనినో వేసినది. పులి మత్తుగా నున్నది. ఇంకఁ బోయి గుహలోఁ బండుకొను' ననెను. ఇంకొకఁడు 'తెల్లవారలు తిరుగవలసినదే. పోయి పండుకొన దేమో! నలువురము నాల్గువైపుల నుండి క్రమ్ముకొని వచ్చి పొడత' మనెను. తక్కిన వారాఱాతిగుట్ట చాటుననే దాఁగియుండవలయును. వీరు నలుగురును బయలుదేఱిరి. రామన్న తుపాకి కాల్చెను. పులికి సరిగా నడిడొక్కబోఁ దగిలి, యది పొగవెంటనే దూకవచ్చెను. అది దూకినంతనే నలువురును దానిపైఁబడి కత్తులతోఁ గ్రుమ్మి చంపిరి. హరప్ప నాయనిచేత నొక కత్తిపోటుపొడిపించిరి. కుమారస్వామికి వారిశౌర్య మాశ్చర్యమనిపించినది. ఇంకఁ బోవుదమా యనఁగాఁ జిరుతపులిని బాతిపెట్టి బోవుద మని వారు నలువురును గోయిదీసి దాని నందులోఁ బూడ్చిపెట్టిరి.

కుమార - దాని నచ్చుట వదలిపోరాదా? రామన్న - అడవిలో నే మృగమును జంపరాదు. పటేలు చూచినచో నవాబుగారికిఁ దెలియఁజేయును. వారిమీఁద కేసుపెట్టెదరు.

తిరిగిపోవుచు నెలుగుబంటిపిల్లలను దీసికొనిపోయిరి. రెన్నాళ్లైన తరువాత మఱలఁ బ్రయాణముసాఁగెను. ఒకనాఁ డడవిలో కుమారస్వామియు, మఱి యిర్వురును గలసి నడచుచుండిరి. రామేశ్వరశాస్త్రి తానుగూడ దిగి నడచుచుండెను. దారియంతయు నెచ్చటఁజూచినను పులులయడుగులే. ఒక కోయపల్లె దగ్గఱగాఁ బోవుచుండిరి. ఒక ముసలికోయవాఁడు రామన్నను జూచి 'ఓయ్యోయి రామన్న ! మందెట్టిన పులివున్నాది. అది గంగిర్లెత్తి తిరుగుతున్నాది. బద్దరం' అన్నాడు. మందుపెట్టిన పులి యనఁగా నందఱకు భయము. పులి సామాన్యముగా నొకచోట నిలువక యడవివెంటఁ దిరుగుచు నొకచోట నొకపసువును, మఱియొకచోట నింకొక పసువును, నిట్లు కొట్టుకొని తినుచుండును. ఒక్కొకప్పుడే కోయపల్లెవద్దనో మకాము చేసి యాయూరిపసువులనే వరుసపెట్టి తినుచుండును. అప్పుడు కోయవాండ్రు దానికి మందు పెట్టెదరు. పులి పసువును వేసి, నెత్తురుపీల్చి లేచిపోవును. గొడ్డును తీసికొనిపోవుటకు మఱునాఁడు వచ్చును. కోయవాండ్రు మందు నాపశుకళేబరములో దాఁచుదురు. పులి వచ్చి తినును. దాని కప్పుడు పిచ్చియెత్తి రెండుమూఁడుదినము లడవివెంటఁ దిరిగి తిరిగి చనిపోవును. ఈలోఁగా దానికి మనిసి యనిలేదు, మానని లేదు. ప్రతిదానిమీఁద దూఁకును. అందుచే నెవ్వరును బిచ్చియెక్కిన పులి యున్నచోటికిఁ బోరు. ఇదివఱకే రెండు దినము లాలస్యమైనది. మఱి రెండునాళ్లచ్చట నాఁగవలయు నని బండ్లు తోలుకొని పోయిరి. తక్కినవారి యందఱి ప్రాణములును బిక్కుబిక్కుమనుచుండెను. నలువురు బండివాండ్రును దిగి నడచుచుండిరి. వేయికన్నులతో జూచుచుండిరి. పరుగుదూరముపోయినతరువాత నచ్చట నొకవాఁగున్నది. బండ్లాఁపి రామన్న తాను ముందు వాఁగుచూచుటకుఁ బోయెను. వాఁగులోనుండి పులి మేఘగర్జన వినవచ్చెను. దానీవాండ్రకుఁ గాసాలకు వారిశరీరములలోఁ బ్రాణములు లేవు. కుమారస్వామి రామేశ్వరశాస్త్రి నానుకొని కూర్చుండెను. రామన్న వచ్చి

'పులి వాఁగులో నున్నది. ఎట్లనెను. తక్కినవారు 'పోయి చిఱుతను వలెఁ గ్రుమ్మి చంపుద' మనిరి. రామన్న 'యది సాధ్యము కాదు. బెదరించుటకుఁ బులి సరియైనస్థితిలో లేదు. మనిసిమీఁద దూఁకునో గొడ్డుమీఁద దూఁకునో' యని కళవళపడెను. గంటసేపు చప్పుడు లేకుండ బండ్లనాఁపిరి. రామన్న మఱలఁ బోయి వాగులోఁ జూచెను. పులిలేదు. పోయి నాల్గుమూలల వెదకెను. అది యడవులఁబట్టి పోయినది. ఇప్పటికదృష్టంతులమని బండ్లుతోలుకొనిపోయిరి. మఱునాఁడు రెండు జాముల వేళకు నడవిలో నొకచోటినుండి పోవలసివచ్చెను. అది మైలు పొడుగుదూరము. దారియంతయు కొండవాగు. రెండువైపుల రెండు కొండలు అటు నిటు మహోత్తాలములైన వృక్షములు. ఈ వాఁగు తక్క మఱియొకదారి లేదు. వాఁగులోఁబోవుచుండఁగా వాఁగువచ్చెనా- బండ్లన్నియుఁ దేలిపోవును; కొట్టుకొనిపోవును. రామన్న పరకాయించి వాఁగుపుట్టినకొండలవంకఁ జూచి యచ్చట మేఘముయొక్క చిహ్నములేదని తెలిసికొని బండ్లు తోలించెను. "ఈ వాఁగునిండ పులు లెప్పుడు వచ్చి విశ్రమించును. పులి చాల సుకుమారమైన జంతువు అది మహారావలె సుఖమే వాంఛించును. అది యెప్పుడును జల్లని యీ వృక్షచ్ఛాయలయందు, చల్లని యీ వాఁగు నిసుకతిన్నెలయందే నిద్రించును. వర్షాకాల మగుటచేత సరిపోయినది, కాని వేసవికాలమైనచో నీదారివెంట నడచుటకే కష్టమైపోవును" అని వారు చెప్పిరి. మఱునాఁటికి నిర్దిష్టస్థానము చేరిరి. చిన్నహరప్పనాయని తల్లిదండ్రులు పిల్లవానిని జూచి సంతోషించిరి. దారిలోని వేఁట విని నాయఁడుచేసిన వేఁటకు నానందించిరి. జమీందారులు కుమారస్వామికి నూటపదార్లిచ్చిరి. రామేశ్వరశాస్త్రికిఁ గానుక లిచ్చిరి. అందఱు నచటఁ బదిదినము లుండి తిరిగి వచ్చిరి.

అంతలో దీపావళిపండుగ దగ్గఱకు వచ్చెను. రామేశ్వరశాస్త్రి వట్టి విపరీతుఁడు. అతని కెవరు నేమియుఁ జెప్పకుండనే యన్నియుఁ దెలియును. అతఁడు గులకచన్నులు దెచ్చి కాల్చి, చింతబెరడు తెచ్చి మాడ్చి, రెండును గలిపి పొడికొట్టి, గుడ్డలలో గుండ్రముగాఁ బొడుగుగాఁ బొట్లములు చుట్టి, వానికిఁ బేడ రాచి మొండ బెట్టెను.

ధర్మారావు కుమారుని యీ ప్రయత్నములు చూచి 'నాయనా! నీ కిది యెవరు చెప్పిరి' యని యడిగెను. శాస్త్రి కిప్పుడు తండ్రి యన్నచో మునుపటికన్న నెక్కువ చనవు. ఆ పసివాఁడు తల్లిమాట మఱచిపోయెను. శ్యామలా కుమారస్వాముల యాదృతి, కో[illegible] స్వేచ్ఛయుఁ, దండ్రిచూపునను రాగముతోఁ దల్లియొక్క స్మృతికిఁ బ్రస్తుతపు తనవ్యావృత్తికి నొక తెర యడ్డమయ్యెను.

శాస్త్రి - మునుపు మీ రిట్లే చేసెడివారఁటకదా! ధర్మా - నీ కెవరు చెప్పిరి? శాస్త్రి - కబీరు. ధర్మా - ఈ పూలపొట్లములు నాలు గెందుకు? శాస్త్రి - రెండు నాకు; రెండు హరప్పకు. ధర్మా- తండ్రీ! హరప్పగా రనవలయును; శాస్త్రి - అతఁడు నే నేమనినను నూరకుండును. ధర్మా - జమీందారుగారికిఁ గోపమువచ్చును. శాస్త్రి - రాదు. ధర్మా - ఛీ! నీ మొగము, కోపము వచ్చును. అది సరేకాని, పూలపొట్లములు నీవు త్రిప్పవచ్చునుగాని, జమీందారుగారికుమారుఁడు త్రిప్పరాదు. జమీందారుగారు చూచినచో వా రేమందురో? శాస్త్రి - హరప్పగారు తనకుఁగూడఁ గావలయు నన్నాఁడు. కోటలో నెవరును జూడకుండఁ ద్రిప్పెద నన్నాఁడు.

దీపావళినాఁడు సాయంవేళ శాస్త్రి లేఁతతాటిమట్టలు తెచ్చి వానినిజివర నాల్గుగాఁజీల్చిపొట్లములందులోఁబెట్టి నాల్గుమిగిలియున్న చివళ్ళు కలిపి త్రాటితో బిగించి పేఁడరానిపొట్లమువైపు పైకి నుంచి దానిలో నిప్పువేసి రాజఁబెట్టెను. తాటియాకులతో గుమ్మటముచేసి యుమ్మెత్తకాయలు తెచ్చి రెండుసగములుగాఁ గోసి యందులోని గింజలు తీసివేసి నానితో మేనత్తచేత దీపములు పెట్టించెను.

నాంచారమ్మ పిల్లలును, శాస్త్రియుఁ గలసి టపాసులు గాల్చుకొనిరి. రాజేశ్వరుఁడుగారు 'నాయనా! అప్పుడే టపాకాయలు కాల్చుకొన్నచో నవియయిపోవా? రాత్రిపడిన తరువాతఁగాని కాల్చరా' దని వారిని వారించెను.

ప్రొద్దుక్రుంకినంతనే హరప్ప వచ్చెను. కాసారంగన్న హరప్పను వెంటఁబెట్టుకొని ధర్మారావునింటికిఁ దీసికొని వచ్చెను వారందఱును గలసి పూలపొట్లములు త్రిప్పిరి. ఆరవ్వ లొడలిపైఁబడి

హరప్ప కొండలు కాలెను. ఎంతకాలుటకు? కొంచెము. శాస్త్రినవ్వెను
హరప్పకు శాస్త్రిచేత నవ్వించుకొనుట యలవాటే? అతఁడును
నవ్వెను.

తరువాత జుంజుముకట్టలు వెలిగించుకొని పెద్దబజారులోనికిఁ
బోయి యచటఁ బెద్ద నెగడిచేసిరి. అచ్చటనే తోటాలను [illegible]ద్దీ
లను గాల్చిరి.

సుబ్బన్నపేటలో ననాదినుండియు దీపావళిపండుగ మహో
త్సవముగా జరుగును. ప్రతిపండుగకు మూనాన్నాళ్ళురాత్రులందుఁ దోటాల
లడాయి జరుగును. పూర్వము జమీందారుగారే రెండుకక్షులుగాఁ
జేసి కాల్పించెడివారు! రంగారావుగారు వచ్చినతరువాత నిది పోయి
కబీరుకక్ష యొకటియు, సంసారులకక్ష యొకటియు నేర్పడి ప్రతిపండు
గయు సాఁగుచుండెను. ఇందులోఁ దోటా లెవరి కన్న నెవ రెక్కువ
కాల్చిరో వారిదే గెలుపు. రెండుపక్షములవారు రెండువైపుల నిలు
చుండి యొకరిమీఁద నొకరు తోటాలు విసురుకొందురు. అందులో
నపాయమున్నది. ఒడళ్ళు కాలిపోవును. నేర్పుకలవారు శత్రు
వులు విసరినవానిని మఱల దీసికొని విసురుదురు, సేరులు, టంకాలు,
ధరణాలు యథేచ్ఛముగా మండుచు రంగమంతయు యుద్ధభూమి
వలె నుండును. పూర్వ మింగ్లీషువారిసైన్యములు బాలురుతీర్చి
యభేద్యముగా నిలుచుండి తెలుగుసైన్యములను బాఱఁదోలు
చుండఁగా వారిసైన్యములను దేశీయులు చెల్లాచెదరు చేయలేక
పోయి యీ తోటాలను గనిపెట్టి యవి వారిమీఁదఁ బ్రయోగించు
చుండిరఁట. ఈ తోటాలు బుసబుసలాడి గిరికీలుకొట్టి నిప్పు లుమి
యుచు నెవరిమీఁదబడునో తెలియరాక ఘోరలీల జరుపుచుండఁగా
శత్రుసైన్యములు వీనియందు నిలువలేక పోయెడివఁట. ఈ తోఁటాల
పుట్టుక యిది. వానితోఁ జెలగాట మన్నచో శౌర్యవంతమన్న
మాట. ఆ మహాగ్నిమధ్యమున జనులు నిర్భయులై సంచరించుచు
నొక కక్షవారి నొకకక్షవారు తఱుముచుఁ దోటాలతోఁ గొట్టుకొంచు
వీరవిహారము సలుపుదురు. సేరుతోటానుండి సరిగా నర్ధగజము
పొడుగున నగ్నిజ్వాలలు వచ్చును. నాల్గుగజములదాఁక నిప్పు
రవ్వలు పడుచుండును.

పండుగయయిన మూఁడవనాఁడొడ్డళులు కాలినవారు నలుబదియేఁబదిమంది యెప్పుడును నుందురు. ప్రతియేఁడు నీరీతిగా జరుగుచున్నను భయ మెవ్వరికిని లేదు. ఈయుద్ధములు చూచుటకు జనులు గుమిగూడి పోవుచుందురు. స్త్రీలు బాలురుకూడఁ బోదురు. ఒ[illegible]వుడు వారికి నపాయములు సంభవించుచుండును. కాని యెవ్వా[illegible] లెక్కసేయరు. సత్యభామవంటి స్త్రీ యుద్ధముచేసిన జాతి. వీరికి భయ మేమిటి? అదియుఁగాక భయమున్నది దూరమున నున్నంతసేపు; సంగతి తెలియునంతసేపు. ఈ రీతిగా మృతికి వెఱవని వారు వీరవిహారము సలిపెడువారు. స్త్రీలు, శిశువులుకూడఁబోయి యది దర్శించెడివారు. యుద్ధము చేయలేరనినచో, వారు వీరజాతి కాదనినచో నెవరు నమ్మెదరు? కాని యా జాతియే తాను వీరజాతి కా దనుకొనును– 'దూడూ! బసవన్నా! పాలు త్రావెదవా, ప్రత్తివిత్తులు తిందువా' యనిన దేనికైనను తలయూఁపినట్లు.

రామేశ్వరశాస్త్రి వట్టి యఘాయిత్యపు పిల్లవాఁడు. మూఁడవ నాఁడు లడాయి జరుగుచుండఁగా నొకధరణ మెవరో విసరినది క్రిందఁబడి కాలుచున్నది. శాస్త్రి తానుపోయి దానిని పట్టుకొనవచ్చు నని పోయెను. ఇతఁడు దగ్గఱకు వెళ్ళునప్పటికి తోటా కాలుట చివరకు వచ్చి బుస్సుమని కొంచెను వెనుకకుఁ బోయి గిఱ్ఱునఁ దిరిగెను. శాస్త్రియొడలంతయుఁ గాలెను. ఈసంగతి ధర్మారావునకుఁ దెలిసి యతఁడు వచ్చి చాల తొందరపడెను. కుమారస్వామియు, శ్యామలయు వచ్చిరి. పిల్లవాని నాస్పత్రికిఁ దీసికొనిపోయిరి. ఎక్కువ యపాయమేమియును లేదు. అతనికి నాస్పత్రిలోఁ గట్టుకట్టిరి.

వైద్యశాలలో సామాన్యభాగములో శాస్త్రి నుంచుట కసహ్యముగా నుండి ప్రత్యేకపుగది యొకటి తీసికొనిరి. మూఁడనాఁడు ధర్మారావును, కుమారస్వామియు, నాంచారమ్మయు, శ్యామలయు నతనివద్ద నిలుచుండిరి. ఆనాఁడతనికి బాధ తక్కువగా నుండెను. శాస్త్రి నవ్వుచు మాటాడుచుండెను. కుమారస్వామి 'నీ కీ సారి బుద్ధి వచ్చినదా? ఇంక నెపుడును గుండాతనపుపనులు చేయకుము' అనెను. శాస్త్రి 'ఇది యొక బాధయా నాకు? తోటా యేమిటి, ఫిరంగిదెబ్బ తినవలయునుగాని' యనెను. అందఱును నవ్విరి. శ్యామల

'నాయనా! నీవు చెడినఁ జెడితివిగాని మా ధర్మారావున కివి నేర్పకు' అనెను.

శాస్త్రి—వాఁ డక్కడికిఁ బుద్ధిమంతుఁ డైనట్లు! ధర్మా—నీవు ఫిరంగి కెదు రెప్పుడు వెళ్ళెదవు? శాస్త్రి—యుద్ధములు [illegible] నపుడు. ధర్మా—ఏ యుద్ధములు? కుమా—మన ము[illegible]మ్మలు పోట్లాడుకొందురే- ఆ యుద్ధములు, కాదా మునిసిపలుకౌన్సిలులోఁ గొట్టుకొనుచుందురే-ఆ యుద్ధములు, అందులో ఫిరంగులు లేవు వట్టి రంగులు. ధర్మారావు పరిహాసముగా మంగహాసము చేయఁబోయి యూరకుండెను. శాస్త్రి యాలోచనానిమగ్నుఁ డయ్యెను. 'అవును, ఫిరంగు లేవి' యనుకొనెను.

మార్గశిరము చివరకు వచ్చుసరికి రామేశ్వరశాస్త్రి నలఁత వదలి మఱలఁ జక్కఁగా నాడుకొనుటయుఁ, జదువుకొనుటయుఁ జేయుచుండెను. రంగారావుగారు పిల్లలకు నింగ్లీషుగూడఁ జెప్పవలయునని కుమారస్వామితోఁ జెప్పెను. అతఁడు 'చిత్త' మని ఊరకుండెను.

ధర్మారావు హరప్పనాయఁడు చనిపోయినప్పటినుండియుఁ గోటలోనికిఁ దఱచు పోఁడు. దివానుమాత్రము ధర్మారావే. ప్రతి గ్రామమునుండియు శిస్తులు వేళకు తానాదారులు, సముద్దారులు వసూలుచేసి పంపింతురు. అవసరము వచ్చినచో ధర్మారావు పోయి వచ్చుచుండును. రంగారావుగారుకూడ నన్ని వ్యవహారములు స్వయముగాఁ జూచుకొనుచుండెను. హరప్పనాయఁ డీ సంగతి తండ్రికి నేర్పి పోయెను. రంగారావు ధర్మారావుల ప్రసంగము చిత్రముగానుండును. మాటాడినంతసేపు నొకరివంక నొకరు చూచుకొనరు. అక్కడ నెవరో యదృశ్యుఁ డయిన పురుషుఁ డొకఁ డుండును. ఇద్దఱును వానితో మాట్లాడుదురు. వ్యవహార మేదయిన నున్నచో రంగారావుగారు ధర్మారావుతో 'ఆ వ్యవహార మేమయినది' అనును. పేరుపెట్టి పిలువఁడు; 'ఏమండి' యనఁడు! ధర్మారావు సమాధాన మున్నచో జెప్పును; లేనిచోఁ జెప్పఁడు. చెప్పకపోయినచో దానివిషయ మింకను తేలలే దని యర్థము.

కోటలో నప్పుడప్పుడు ధర్మారావున కిష్టములేని పనులు జరుగుచుండెనా, ధర్మారావు వానిని వారించును. జమీందారు

వచ్చి యది యేల జరుగుటలేదని యడుగును. పరిచారకులు ధర్మారావుగారు వలదన్నారని చెప్పుదురు. రంగారావుగారు మాటాడఁడు.

కుమారస్వామి పాఠము చెప్పుచుండఁగా రంగారావుగా రొకనాఁడు [illegible]అఁ గూర్చుండిరి. అతఁ డింగ్లీషుమాటలు నేర్పుచుండెను. అపు[illegible]రా వచటికి వచ్చెను. అతని కింగ్లీషుమాటలు వినిపించెను. 'కుమారస్వామీ! ఏమి టది' యని యతఁ డడిగెను. కుమారస్వామి 'అయ్యా! ఇంగ్లీషు చెప్పుచున్నా' ననెను. ధర్మారావు 'పిల్లలకుఁ బసితనములో నింగ్లీషు చెప్పరాదు. వారికి లోకజ్ఞానము కలుగుట, బుద్ధి వికసించుట మాతృభాషలోనే జరుగవలయును. పిల్లవాండ్ర మనస్సు, పరభాషయే చిన్నప్పటినుండి చెప్పినచో, పరభాషాసంప్రదాయములకే యలవాటుపడును. మనకు వారిభాష మాత్రమే రావలయునుగాని, మనభాష రా నక్కఱలేదు. ఇట్లయినచో మనభాష రాదు పిల్లల కింగ్లీ షిప్పుడప్పుడే చెప్పవ' ద్దనెను.

కుమారస్వామి మాటాడలేదు. రంగారావుగారును మాటాడలేదు. ధర్మారావు వెడలిపోవుచుండెను. రంగారావుగారివంకఁ జూచుట తటస్థించెను. ఆయన శరీరచాలనములో నతనిమనస్సులోని సందేహము గోచరించెను. ధర్మారావు 'కుమారస్వామీ! మనభాషలో మనకు స్వాతంత్ర్యము చిక్కినతరువాత పరభాష చదువుటకుఁ జాల రోజులు పట్టదు. చూడుము, మనవాండ్రందఱు నిపుడు హిందీ రెండేండ్లలోఁ జదువుచున్నారు. రెండేండ్లలో హిందీభాషలోఁ బెద్ద పండితు లగుచున్నారు. ఒకభాష గట్టిగా వచ్చినతరువాత రెండవ భాష సులభముగా వచ్చును. ఆ మొదట రావలసినభాష యింగ్లీషా, తెలుఁగా? తెలుఁగువారి కింగ్లీషుకన్నఁ దెలుఁగే తేలికగా వచ్చును. తెలుఁగు చక్కఁగావచ్చి తరవాత నింగ్లీషు రెండేండ్లలోఁ గావలసినంత వచ్చును. ఇప్పు డింగ్లీషు చదివిన నష్టము లేదు. ఇప్పటికే తెలుఁగు సంప్రదాయము పిల్లవాని నెత్తురులో జీర్ణించియుండును గనుక రెండేండ్లలో నేర్వదగిన యీ పరభాష పసినాఁటినుండి చెప్పి బాలుని బుద్ధివికాసము పాడుచేయుచున్నాము. పిల్లవాండ్రు శరీరమునందుఁ గాని, బుద్ధియందుఁ గాని వృద్ధిపొందుటలేదు. నిమీఁద రు

లకు చదువు జ్ఞానముకొఱకుఁగాని యుద్యోగములకొఱకుఁ గాదు గదా' అనెను.

ఆ మఱునాఁటినుండి కుమారస్వామి యింగ్లీషు చెప్పుట మాని వేసెను. రంగారావుగారు మరల వచ్చి కుమారస్వామి నేమియు నడుగలేదు. పిల్లల చదువునుగూర్చి విచారించనులేదు. పిల్లలు 'బారయీఁత'గాఁ జదువుచుండిరి. పుష్యమాసము చివర వచ్చి సంవత్సరముతోఁబాటు దోసకాయలును బండెను. పచ్చిమిరపపండ్లు దేవమాతృకాసస్యలక్ష్మీదేవికిఁ బగటికాగడాలు పట్టెను. నశించిపోయిన దేవమాతృకలరాజ్యాధికారము ఏతాదృగధికారచిహ్నములతో మాత్రమే సంతోషించవలసివచ్చెను. అస లధికార మదేవమాతృకలది. పండినపు డొరిగిపోవునదియుఁ బూవుకాని ఫలముకాని లేనిదియు, మనిసిని నిలువనీయనిదియుఁ, బంకసంకలిత మైనదియు నైన మాగాని తనయధికారము సాగించుచుండెను. మెట్టపైకు మొగము వంకఁ జూచినవారులేరు. దానిని కుద్దాలించి వేసిరి.

సంక్రాంతి ముగ్గులతో బజారులు, కంకరబాటలు లేనివి భక్తిచ్ఛేదముచేత విరచితమైన యేనుఁగుమొగమునఁదలి సంపదలకు సాదృశ్యము తెచ్చుకొనెను. ధర్మారావు కాంచని సంక్రాంతికి భర్తతోఁగూడఁ దనయింటికిఁ బండుగకుఁ దీసికొనివచ్చెను. కాంచి యిపుడు పెద్దపిల్ల యయి భర్తతోఁ గాఁపురము చేయుచుండెను. ఆమె కొక కుమారుఁడు. ధర్మారావు పండుగకు బంధువు లందఱను బిలిచెను. హైమావతీ సూర్యనారాయణులు వచ్చిరి. రామచంద్రరాజు రథంతరి రామేశ్వరశాస్త్రిరాజు తరువాత వారికిఁ గలిగిన యిద్దఱాఁడపిల్లలు నందఱును పండుగకు ధర్మారావు నింటికి వచ్చిరి. కిరీటి శశిరేఖలు వచ్చిరి. శ్యామలాకుమారస్వాములు వచ్చిరి. వారి యందఱిపిల్లలును వచ్చిరి. ఇంటనున్న బాలికాబాలకు లందఱును గలసి యొక 'సమువాకార' మాడఁదగినంత సజ్జచేరినది. కిరీటి ఖర్చులో ఖర్చు రామేశ్వరశాస్త్రి పెండ్లికూడ నిపుడేచేసినచోఁ దేవిపోవునుగదా! కుమా - మనకు నష్టము కదండీ! అపుడు మన మింకొకసారి రావచ్చును. ఈ లోపుగా నతని యుపనయనము లేదా? కిరీటి - ఏమోయి శాస్త్రీ పెండ్లి చేసికొందువా? శాస్త్రి సిగ్గుపడెను. అతఁడు నవ సరఁజాము

తెచ్చి వానిని ప్రదర్శించుచుండెను. కిరీటి పోయివానిని బరిశీలించెను. మూఁడేండ్లనుండి గ్రామములో నాడిన సినిమా నాటకములు సర్వము నందున్నవి. ఆటవస్తువులు రకరకములున్నవి. గోలీలు గోడీబిళ్ళలు టాయిసినిమాలు రంగుకాగితములు రకరకాల వస్తువులు కలవు. కిరీటి వానిని పరిశీలించినంతసేపు శాస్త్రి వాని నతఁడు దొంగిలించుననియే యభిప్రాయపడెను.

కిరీటి - నా కెందుకోయి యివియన్నియు? నే నెందుకు కాఁజేసెదను? శాస్త్రి - మీరు దొంగలు. కిరీటి - మీ రనఁగా నెవ రెవరు? నేనును మీ నాన్నయునా? కుమా - వారి నాన్న దొరయే. మీరును నేనును దొంగలము. ధర్మా - అవునోయి. మీ రిద్దఱును దొంగలు. అతఁడు శశిరేఖను, నీవు శ్యామలను దొంగిలించితిరి. వారిద్దఱికొఱకు మీరు వేసిన యెత్తులేనా? దానికి నాకుఁ బ్రాప్తిలేక యది పోయినది. కాని మా యరుంధతిని నేను దొరవలెఁ బెండ్లి యాడితిని. కిరీ - ఏమో నీ వేమి దొంగతనములు చేసితివో మా కేమి తెలియును? ఇదివరకుఁ జేయులే దనుకో! ఇంకఁ జేయవని నమ్మక మేమున్నది? కాలము చెడ్డది. అది యెప్పు డేమి చేయించునో తెలియదు. 'పగయు కలదయేని పామున్న యింటిలో నున్న యట్ల కాదె' యన్నట్లే యుండవలయును. కాలమునమ్మి యెవఁడు నేమఱి యుండరాదు.

ధర్మారావు మొగములో నొక విషాదరేఖ తాండవించెను. దానినిఁజూచి కుమారస్వామి కిరీటు లిద్దఱును నొచ్చుకొనిరి.

కాచియు, రామచంద్రరావు కూతుండ్రును బొమ్మలు పెట్టుకొనిరి. గోడసంచులు గోడలకుఁ గొట్టిరి. బొమ్మలమధ్య నారింజ పండ్లు, దోసపండ్లు నలంకారములుగా నుంచిరి. పిల్లలందఱును వాని నెత్తుకొనిపోయి తినుచుండిరి. కాచికిఁ గోపమువచ్చి పిల్లలను గొట్టుచుండును. ఆ చిఱుదెబ్బలకు వారు నవ్వుదు రేకాని యేడ్వరు.

సాతాని జియ్యరొకఁడు మిక్కిలి ముసలివాఁడు. ప్రతిదినము ప్రొద్దున వచ్చును. అతనికిఁ జిత్రవిచిత్రములైన కీర్తనలు వచ్చును. ఈపిల్లలందఱును వానికీర్తనలు పట్టుకొని యవి పాడ మొదలుపెట్టిరి. ఆ జియ్యరుగొంతు మధ్యమస్వరములో నుచ్ఛస్థాయికి బోయి

యచ్చట మాధుర్యమును జూడవచ్చును. అతఁడు పాడుచుండఁగా వాయువీచికలు వాని సంగీతమున కొత్తిగిలుచుండును. కుమారస్వామికొడుకునకు గ్రామఫోనుపాటలన్నియు వచ్చును. 'కోరి భజింతును గోవిందున్ మది' 'నమస్తే మాప్రాణనాథ', 'ఆటలాడుకోరా గోపాల' 'భలే మంచిచవుకబేరము' ఈపాట లతఁడు పాడుచుండును. రామేశ్వరశాస్త్రి యతఁడు వానిని బాడినపుడెల్ల యతని గొట్టుచుండును. ఆతఁ డేడ్చును. చిన్న ధర్మారావునకు నాల్గవయేఁడు వచ్చినది. అతఁడు వచ్చీరానిమాటలతో నివి పాడుట, శాస్త్రి కొట్టుట. శ్యామల 'ఎందుకుఁ గొట్టితి' ననును.

శాస్త్రి– నాయిష్టము. శ్యామల– నీవుమాత్రము నీ యిష్టము వచ్చినపాటలు పాడవా? శాస్త్రి– నేను పాడుపాటలు నా యిష్టము వచ్చినవి కావు. మాయత్తగారు పాడినపాటలు పాడుదును. 'యామి హే కమిహ శరణమ్, సఖిజనవచనవంచితాహ' ఇది పిచ్చిపాటయా! శ్యామ– ఓసి! ధర్మా! నీవుకూడ బాబాయి పాడుపాటలే పాడుము. గిరికమ్మగారు పాడిన పాటలకు, నిజమే, వీనికిని చాల భేద మున్నది. శాస్త్రి– ఈ పాటలు పాడి వీఁడు పాడయిపోవుచున్నాఁడు. చెడిపోయిన తరువాత మఱల బాగుపడుటకు మార్గము లున్నవా!

కుమారస్వామి యింతసేపును మాటాడ కూరకుండును. అపుడు పెద్దనవ్వు నవ్వి 'ఆపాటలుపాడినచో నెందుకుఁ జెడిపోవును' అని ప్రశ్న వేయును. శాస్త్రి సమాధానము చెప్పలేక తలవంచుకొని చదువుకొనుట యారంభించును.

కుమా– శ్యామలా! శాస్త్రి భగవంతుఁడు రక్షించి బ్రతికి బట్టకట్టవలయునుగాని మఱల ధర్మారావుగారియంతవాఁ డగును. కీర్తన యనఁగా మంచి భావ ముండవలయును. తద్భావానుగుణమయిన శబ్దములు రాగము నుండవలయును. ఈబజారు కీర్తనలయందు భావము లేదు, శబ్దము లేదు. భావానుగుణమైన రాగము లేదు. ఈ కీర్తనలుపాడినకొలఁది వినినకొలఁది శ్రోతలమనస్సులు దుష్టసంగీతమున కలవాటుపడి చెడ్డసంస్కారమునే పొందును; నాయనా! శాస్త్రి 'ధర్మ' యీసారి యీ కీర్తనలు పాడెనా చావఁ జిదుకఁగొట్టుము. శ్యామ– అయినచో నింట సీస్లేట్లు దాఁచి యవి పాడించినచో నెట్లు!

వానిని దీసికొనిపోయి యమ్మివేయును. శాస్త్రి- అమ్మినచో నిం కొకరు పాడింపుకొందురు. వానిపిల్లలుమాత్రము పాడయిపోరా! అవి తగులబెట్టవలయును. కుమా- బ్రద్దలు కొట్టరాదా? బ్రద్దలుకొట్టినచో వా[illegible]ండి పుట్టినధ్వనికూడ నీ కిష్టములేదు కాంబోలు! శాస్త్రి- త[illegible]చో నవి బుసబుసలాడును; చూచుటకుఁ జక్కఁగా నుండును. శ్యాము- అస లిటువంటిపిల్లలు పుట్టఁగూడదు. కుమా- మనము వలదనినను నిట్టి వారెక్కడనో యొకచోట నూటికి గోటి కొకఁడు పుట్టుచునే యుండును. ఇది మనసంప్రదాయములలోని యుత్కృష్టత. దానిని నీ వెంతయైనఁ బెల్లగించివేయుము. అది మఱలఁ జివుర్చుచునే యుండును. అల్పశక్తిమంతమైన సృష్టి చని పోయినట్లు శక్తిమంతమైన సృష్టి చనిపోదు. శక్తిమంతమైన సృష్టి జననధురాపరిణతి కలది. సృష్టికిని దానికిని జాలదూరము లేదు. అందుచే నది వాడదు. పూర్తిగా నశించలేదు. ఎంతప్రయత్నము నచట నిష్ఫలము.

సంక్రాంతిపండుగ యగువఱకు బాలకులకందఱకు ననేకములైన చక్కని కీర్తనలు వచ్చినవి. వానియందు భావము తొణికిసలాడు చుండెను. ఆ భావము పసివాండ్ర యెదలకుఁ జక్కఁగా నదికి వారి కొకగొప్పసంస్కారము కలిగెను. బొమ్మలు పెట్టినరీతి చూచి వారి కన్నులకు వర్ణసామరస్యము పరిచితమయ్యెను. సంగీతము చక్కని దలవాటయ్యెను. ఆ ముసలి జియ్యరు చనిపోయినచో నీ సంస్కార మే మగునో?

ధర్మారావు బంధువు లందఱికి నూత్నవస్త్రములు పెట్టి పంపించెను. కిరీటిని పంపించుచు 'సూర్యపతిని రమ్మని వ్రాసితిని. అతఁడు రాలేదు. రాఘవరావు మఱల జైలులోననే యున్నాఁ డాయెను' అనెను.

కిరీ- అతని బ్రదుకంతయుఁ జెఱసాలయే యయిపోయెను. ధర్మా- మన బ్రదుకు మాత్రముఁ జెఱసాల కాదా? అతనిబ్రతుకుఁ జెఱసాలలోఁ జెఱసాల. నాటకములో నంత కర్నాటకము. కిరీ- మఱల నేమయినఁ బ్రయత్నము చేయరాదా. ధర్మా- వదిన నెఱుఁ గుదువు కదా! ఆమెయెడల నవజ్ఞచేయుటయేగాక మఱల నట్టి

ప్రయత్నమువలన సుఖమా శోభయా? నది కెన్నిసార్లు నీరెక్కినను సాగనీకాని, జీవితమున కొక్కసారి యెక్కుటయే శోభ. కిరీ- నదికి నీరు సహజముగా మఱల మఱల నెక్కును. చెఱువునకుఁ బ్రాఁతనీరు పోఁగా మనమే క్రొత్తనీరు పెట్టుదుము. ధర్మా- నీవేరా యీ మాటలు మాటాడవలసిది! కిరీ- అన్నా! నాకును నీకును జా[illegible]భేద మున్నది. మనుష్యుల ప్రకృతులలో భేదము లుండును. శ్రీరామ చంద్రుని ప్రకృతి వేఱు; కృష్ణభగవానుని ప్రకృతి వేఱు. రామ చంద్రుఁడు పురుషోత్తముఁడు. ఆయనకు నాత్మయందే కాక శరీర మునందును నేకత్వసిద్ధి యున్నది. కృష్ణదేవుఁడు ఆత్మలో నేకత్వసిద్ధి కలవాఁడు. శరీరమునందలి బహుభార్యత్వ మాయనకు లెక్కలేదు. దాని నాయన పరిగణించఁడు. ధర్మా- పోలికలుమాత్రము గొప్పగా నేయున్నవి. కిరీ - అన్నా ! పశుపతిని బంధుగకుఁ బిలువ లేదేమి? ధర్మా- అతఁడు మనకన్న ధనవంతుఁడు. మన మతనిని బిలిచి పెట్టనక్కఱ లేదు. అతఁడే మనకుఁ బెట్టవలయును. కిరీ - అందుకుఁగాదు. అతని కూఁతురు... ధర్మా—నాయనా! ఆసంగతి మనము తలపెట్టనే రాదు. కిరీ—ఎందుచేత ? ఆమె నిన్నుఁ బ్రేమించుచున్నదఁటకదా ! ధర్మా- ప్రేమించుట యేమిటి ? ముక్కుపచ్చలారని యీ పిల్ల కేమి తెలియును ? అంత చిన్నవయసులోఁ బ్రేమ తెలియదు. కిరీ—చిన్న వయస్సెప్పుడు ? ఆమె కిప్పుడు పదుమూఁడేండ్లు లేవా ? మా శశి నన్ను ప్రేమించుట మొదలుపెట్టిన దా యీడుననే. ధర్మా—నే నసలు పెండ్లి చేసికొననుగదా ! ఇంక విచారణ యెందుకు ? ఆ ప్రస్తావన మానివేయుము. ఎప్పుడైన నుత్తరములు వ్రాయు చుండుము.

సంవత్సరాది పండుగ వచ్చెను. వేఁపచెట్లు తిలతండుల న్యాయమున భాసించెను. కోకిలలు మావిగున్నలలో దాగి కుహూ కుహూ యని కూయసాఁగెను. క్రొత్త వేఁపపూఁత, క్రొత్తమావిపూఁత-వీనిపైఁ జెరలాడి తుమ్మెదలు ఝుమ్మని రొదచేయుచు నలమెల్ల సంచరించెను. లేఁతమామిడి ముక్కలతోఁ గలిపిన వేపపూఁత పంచదారయుఁ జింత పండుపులుసుతో మిశ్రితమై సంవత్సరమునకుఁబలె జిహ్వకును గ్రొత్త

రుచి తెచ్చెను. నూత్నవస్త్రశోభితులైన జనులు పునర్జన్మ మెత్తి
నట్లు ప్రకాశించిరి.

ఆనాఁడు ధర్మారావునకొక యుత్తరము వచ్చెను. అది పశు
పతి వ్రాసెను: "నీవు వెంటనే యొకసారి రావలయును. చాలనవసరము.
తే[illegible]నచో మన నిర్ణయమును విచారించవలసివచ్చును. ఉత్త
రము చ[illegible]చిననాఁడే రావలయును' అని యున్నది. అతని కీ యుత్తర
మర్థము కాలేదు. అనేకవిధములఁగా నూహించెను. ఏ యూహయు
నిలువలేదు. వెడలుటయూ, వెడల కుండుటయా? ఇద్దరును విచారించ
వలసివచ్చుట యేమిటి? అయినను రెండు మూఁడు నాళ్ళలో పోవచ్చు
నని యూరకుండెను. కుమారస్వామి యుత్తరముచూచి 'కాదు. పోవ
లయును. అరుంధతికి జబ్బుగా నున్నదేమో? లేనిచో నా
వాక్యమున కర్థము లేదు' అని తలఁచెను. ధర్మారావు 'కుమార
స్వామీ! ఆ పిల్లకును నాకును సంబంధము లేదు. నేను మఱల
వివాహము చేసికోను నీ కీ వృథా వ్యామోహ మెందుకు' అని తన
దారిని దాఁ బోయెను.

నాఁటిసాయంకాలమున ధర్మారావు దేవాలయమునకుఁ
బోయెను. నాగేశ్వరస్వామియాలయమున కేఁగి స్వామిని ధ్యానించు
చుండెను. 'ప్రభూ! మనస్సు వక్రమైనది. శరీరము దుఃఖభూయిష్ట
మైనది. ఈరెండును గలసి మనిసి నెంతయైనను జేయును. తీయరాని
దారులు తీయించును. నీదయవలన ధనాదులు లేవన్న దిగులుపోయి
నది. ఏదో కాలము గడచుచున్నది. కాని యీప్రేమయుఁ గామ
మును నన్నుఁ బరిత్యజించి పోవునట్లు లేవు. మనోనియమమున కెంత
యధికార ముండవలయును? వ్రాసిపెట్టినదానిని కాదనుట కాదుకాని
నన్ను నీయధీనునిగా స్వీకరింపుము. పాలముంతువో, నీటముంతువో!'
మఱునాఁడురాత్రి శాస్త్రిదీపమువద్దఁగూర్చుండిచదువుకొనుచుండెను.
దీపమువద్దఁ గూర్చుండి చదువుట కతఁడది మొదలు. నాంచారమ్మ
'ధర్మీ! నీకొడుకు చదువుకొనుచున్నాఁడురా! లోకములో నేదో వింత
జరుగబోవుచున్నది' యనెను. శాస్త్రి—ఏమి వింత జరుగును? ధర్మా
రావు 'జరుగవలసిన వన్నియు నిదివఱకే జరిగెను.' అని కుమారుని
వద్దకుఁ బోయి 'నాయనా! ఏమి విశేషములు? ఎన్నఁడును లేనిది

యీనాఁడు చదువుచుంటి వెందులకు' అని యడిగెను. శాస్త్రి సిగ్గుపడి యూరకుండెను. తండ్రి బుజ్జగించి మఱల నడిగెను. శాస్త్రి—రాత్రి మాయమ్మ కలలోఁ గనిపించి 'నాయనా! ప్రతిదినము రాత్రులందుఁ జదువుకొనవలయును. అల్లరిచిల్లరిగాఁ దిరుగకుము' అ[illegible]ది.

ధర్మారావు కనులలో నీరు నిలచెను. కుఱ్ఱవాఁడు చ[illegible]వు నని యతఁడు మొగ మటు త్రిప్పుకొనెను. నాంచారమ్మ 'నా[illegible]యనా! రాత్రి యమ్మ కనుబడినదా? ఇంక నేమైనఁ జెప్పినదా?' యనెను. శాస్త్రి—ఇంకను జెప్పినది. తాను మఱల బ్రతికివచ్చునఁట. నాంచారమ్మ 'అయ్యో! నాయనా! ఇంక నేమి బ్రతికివచ్చుట? నీ కా గీఁత తొలఁగిపోయి చాలరోజు లయినది'. యని కన్నీరు పెట్టుకొనెను. శాస్త్రి—నాన్న మఱలఁ బెండ్లిచేసికొనినచో నమ్మ బ్రదికివచ్చినట్లే కదా! నాంచా—సవతితల్లి యొకతల్లి కాదు. జీలకఱ్ఱ కఱ్ఱ కాదు. అయినను నాన్న పెండ్లి చేసికొనునట్లు లేదు అంతభాగ్యము కూడనా? నే నెన్నిసార్లో చెప్పితిని. 'నాయనా! మే మింక శాశ్వతమా? మాయూరు మేము వెళ్ళెదము. పిల్లవానికి మెతుకులు వండిపెట్టువారలు లేరురా' యని యెన్ని చెప్పినను వినుట లేదు. 'రెండవ పెండ్లి చేసికొన' ననెను. శివునివంటివాఁడు రెండవ పెండ్లి యాడెను. దక్షునికూఁతురు సతీదేవి దక్షయజ్ఞమున దగ్ధురాలు కాఁగా హిమవంతుని కూఁతును పార్వతీదేవిని పెండ్లాడెను. ధర్మా-ఆరోజు లేవో కడచిపోయెను. మఱలఁ బెండ్లి చేసుకొనుట సుఖహేతువు కాదు. ముసలివారికిఁ బెండ్లియెందుకు? రాజే— నీవు ముసలివాఁడవు రా? ముప్పదియాఱేండ్లకే ముసలివాఁడ వైనావా, యేమి? ధర్మా— ఇంకను రెండేండ్లు తక్కువ చెప్పు. రాజే — సరే. ముప్పది యెనిమిది, ముసలివాఁడవా? ధర్మా— నే నింకఁ బదునేనేండ్లలో ముసలి నగుదును. ఇపుడు పదుమూఁడేండ్లపిల్లను జేసికొన్నచో దాని నడివయస్సువేళకు నాకు వార్ధక్యము వచ్చును. అపుడు చూడుము. రాజే— ఆ పిల్లకుఁ దనయీడువాఁడే దొరుకును. వాని కాయుర్దాయము చాలక యతఁడపుడు చనిపోవును. అపుడు నామెకు నడివయస్సే. దాని కేమి సమాధానము చెప్పెదవు? ధర్మా— ఆమె యపుడు మఱల వివాహమాడును. రాజే— ఛీ ఛీ!— సరే. దానికే

యొప్పుకొందుము. అట్లయినచో నీమెయు వివాహ మాడవచ్చును. ధర్మా- స్త్రీ మఱల వివాహమాడుటకు మనవా రొప్పుకొనరుగదా! రాజే- పడుచువాని భార్య విధవయైనచో నొప్పుకొని, ముసలివాని భార్య నచో నొప్పుకొనరా? ధర్మా- పడుచువాడు చనిపోవుట చాల ష్టు. అది యీకాలమున నింతవిపరీతముగా నున్నది కాని పూర్వము మనదేశములో నింతలేదు. రాజే- అఱువదియేండ్లకే ముసలివాం డగుటయు నీ కాలముననే మనదేశమున నున్నది కాని, పూర్వము లేదు. పూర్వ మెనుబది యేండ్లకుం దక్కువ బ్రతికిన వాండు లేనే లేడు. కాలవైపరీత్యము! ధర్మా- ప్రేమ సమానవయస్సు కలవారిమధ్యనే యుండును. పాతికయేండ్లు వ్యత్యాసముగల మామధ్య ప్రేమ యుండదు. నాంచా - విధవావివాహము చేసికొన్నచో బాగుగా నుండుననికదా! మొన్న నాయన యెవరో చెప్పినాండు. రాజే- అది నీవు చేసుకొందువుగానిలే. వాని కెందుకు? చేసికొన్న వారిని జూచుచునేయున్నాముకదా! పైగా నెవరితోడను జెప్పుకొనుటకుంగూడ వీలులేదు. దొంగకుం దేలుకుట్టినట్లు. నాంచా- నేను నవ్వుచు నన్నానుగాని బ్రేమ సమానవయస్సుగలవారి మధ్యనే యుండుననుట యబద్ధము. మీబావ నాకన్నం బదియేండ్లు పెద్దవారు. రాజే- నామీంద నీకుం బ్రేమయున్నంగదా యీ పాటువ. నాంచా—ప్రేమ లేక మి మ్మేమి చేయుచున్నాను? తిట్టిపోయుచున్నానా? ధర్మా - తిట్టినచో నది ప్రేమక్రిందనే లెక్కగదమ్మా? రాజే—ఒక్క తిట్టుటయే గాదు. కొట్టుటకూడ నంతియే. అక్కగారికి బోధించుము. నీవు చెప్ప నక్కఱలేదు. నాంచా—ఈమాటల కేమిగాని పశుపతి రమ్మని వ్రాసెనుగదా! పోయి రారాదా? ధర్మా- నీ కదియొక యాశ.

మఱునాండు పశుపతి తంతివార్తయిచ్చెను: 'వెంటనే బయలు దేఱుము. అరుంధతి చాల జబ్బుగా నున్నది.'

ధర్మా—అరుంధతి జబ్బుగానున్నచో నేను పోయి యేమి చేయవలయును? నాంచా—ఏమి జబ్బో! పోయి చూచివచ్చినచోం దప్పేమున్నది? స్నేహితుండవు కనుక రమ్మన్నాం డేమో!

ధర్మారావు వెళ్ళలేదు. మఱునాఁ డతఁడు కుమారస్వామి యింటికిఁ బోయెను. రామేశ్వరశాస్త్రి క్రొత్తగా నా నాఁ డింకొక క్రొత్తపటము పగులఁగొట్టెను. కుమారస్వామి 'మఱికొంచెము సాఁగితివి. సాఁగికూడ పటము లందుకొన లేవు. అందుకోలేనివాఁడ వూరకయుండవు వాని జోలి నీ కెందుకు?' అనెను. ...డు మొగము ముడుచుకొని కూర్చుండెను. ధర్మారావుపోయి ...యనా! అట్లు కూర్చుంటి వేమి' యనెను. కుమారస్వామి వచ్చి 'మాష్టరు గారూ, మీ అబ్బాయి మాయింటిలోని పటముల కై పుట్టినాఁడు. నేఁ డింకొకటి బ్రద్దలుకొట్టెను. ఒకచోటఁ గూర్చుండఁడు' అనెను. శ్యామల—మగపిల్లవాఁడు కూర్చుండునా? 'మగవాఁడు తిరుగక చెడెను, ఆఁడుది తిరిగి చెడ్డది' యన్నట్లు. కుమా—సామ్మా, నీది కాదుకదా! ధర్మా- శ్యామలది కాకపోయిన నీదా? కుమా—మంగమ్మగారు తనయాస్తి నాకొసఁగినది కాని దీని కీయలేదు. ధర్మా—ఆపట మిట్లు తీసికొని రమ్ము; చూతము.

కుమారస్వామి తెచ్చెను. అది హంససందేశము. దమయంతి నలమహారాజునకు మఱల హంసను బంపుచుండెను. దమయంతి మోఁచేయి యొకబల్లమీఁద నాన్చి నిలుచుండెను. దానిపై హంస యున్నది. ఆహంస చెప్పినకథను వినుచున్నదో, ఆ హంసతో మఱల తాను సందేశము చెప్పుచున్నదో?

ధర్మా—ఈపటమేకదా? ఇదియైనచో బ్రద్దలుకొట్టవచ్చును. ఇటువంటి పటములు కొని నిన్నెవరు గోడలకుఁ గొట్టుమన్నారు? శ్యామల- నిజమేనండి రామేశ్వరశాస్త్రిగారికిఁ జెడ్డది యేదో మంచిది యేదో తెలియును. ఆతఁడు చెడ్డవస్తువు లేరియే పాడుచేయును. కుమా- మీరు ఆసరా దొరికినారుకదా! ఇఁక మఱియు వదలుదు. దానిని జెప్పనిండు. ఇది యెందుకు జెడ్డది? శ్యామ- చెడ్డవారుకొన్నారుకనుక! ధర్మా- అందుకుఁ గాదు. శిల్పమునందును, కవిత్వమునందును వస్తుస్వరూపముగా యథాప్రాప్తముగాఁ జిత్రించరాదు. లోకమునందలి వస్తువు బహుదోషభూయిష్టముగానుండును. దానినుండి దోషమును దీసివేసి వానియుత్కృష్టస్వరూపమునే గ్రహించవలయును. దోషమునుబరిహరించుట రెండువిధములు: ఒకటిలోకమునందలియత్కృ

ష్టస్వరూపమునసే గ్రహించుట. రెండవది:కొన్ని సమయములు, సంప్రదాయములను సృష్టించి తదనుగుణముగా శిల్పమును జిత్రించుట. మొదటిదానికన్న రెండవది యుత్కృష్టమైనది. పాశ్చాత్యుల శిల్పము మొదటిమార్గము ననుసరించును. 'మైకల్ ఏంజెలో' (Michaelangelo) తన యొక్క గొప్ప చిత్రమును వ్రాయుటకు లోకమంతయుం దిరిగి యనేకమయిన రూపవతులను జూచి, వారి శరీరాద్యవయవములను జదివి వారియందలి సౌందర్య మంతయు గ్రహించి తాను వ్రాయఁదలచుకొన్న చిత్రమునందు సంగ్రహించె నని చెప్పుదురు. పాశ్చాత్యశిల్పులందఱు నిదే మాదిరి. వారి చిత్రములన్నింటికి మాతృక లుండును. భారతదేశశిల్ప మిట్లు కాదు. నేత్రము తామరపూవువలె నున్నదని నియమముచేసికొని యొక దేవతామూర్తిని జిత్రించినచో వాని నేత్రమును దామరపూవువలెనే చిత్రించును. అట్లే తక్కినదంతయును. ఇట్లు చిత్రించుటచేత భారతదేశ శిల్పిశిల్పము చక్షుర్విషయముకన్న నెక్కువ మనోవిషయ మగుచున్నది. పాశ్చాత్యశిల్పమునందు మనము చూచు బొమ్మ గొప్ప సౌందర్యము కలిగియుండును. అది మన నేత్రానందకరము. మన మనుభవించు నానందము నేత్రగతమనోవిషయము. భారతశిల్పమునందలి చిత్రము పూర్తిగా మనోవిషయము. దానిని గ్రహించుటయందు నేత్రము సాధనముమాత్రమే. ఈ రెండు శిల్పముల భేదమునం దిది యొక విశిష్టవిషయము. తక్కినభేదములు చాలఁ గలవు. ఎన్ని చూచినను భారతశిల్పముయొక్క యుత్కృష్టత యవివాదాంశము. రవివర్మ శిల్పము పాశ్చాత్యమార్గము నాశ్రయించును. అందులోఁ గూడఁ జాలతక్కువ రకముది. దమయంతి రాచకూఁతురు. ఆమెను నలునివంటి సుందరుఁడు పెండ్లి యాడెను. నలుఁ డామెను వలచెను. అందుచే నామెకూడ మహాసౌందర్యవతియై యుండును. అంతియేకాక యామె మహాపతివ్రత. ఆమెమూర్తిని శిల్పి ధ్యానించి యొక విశిష్టమైన సృష్టిచేయవలయును. కాని సిల్పమునందీపాశ్చాత్యామార్గానుయాయులు పాశ్చాత్యులవలె బహుసుందరాంగులనైనఁ బరిశీలించక వారికి లభించిన యొకస్త్రీని మాతృక (Mcdel) గాఁ దీసికొని దానిబొమ్మగీసి దానినే చంద్రమతి, దానినే దమయంతిగాఁ

ప్రదర్శింతురు. ఇట్టిచిత్రములు వ్యాప్తిపొందుటచేత లోకమున జనులకు మార్గప్రదాయములును, బాహ్యసహోపపన్న స్త్రీయు యథార్థ తత్త్వముయొక్క జ్ఞానము లేక చెడిపోవుచున్నారు. పైఁగా వీని యందు సౌందర్యజ్ఞానమును గలుగుట లేదు. మనస్సును స్పృశిం చుటలేదుకదా నేత్రముయొక్క నైశిత్యమునుకూడఁ దా[illegible]దు. అందుచేత నీ రవివర్మయు నతని యనుయాయులును శిల్ప[illegible] మనకుఁ బరిగ్రాహ్యము కాదు. ఇప్పటి యీ గ్రామఫోనుప్లేట్లసంగీతమువలెనే యిట్టిబొమ్మలును మనదేశమునందలి జ్ఞానమునకు వేరుపురుగు లగు చున్నవి.

చవితినాఁడు మఱలఁ దంతివార్త వచ్చెను. 'అరుంధతి బ్రతుకు నట్లు లేదు. ఒకసారి నిన్నుఁ జూడవలెననుచున్నది. రమ్ము' ఈ తంతి వచ్చినపుడు ధర్మారావు ఇంటివద్ద లేఁడు. నాంచారమ్మగారు ఎవరి చేతనో చదివించి దానితత్త్వమంతయు గ్రహించినది. ధర్మారావు ఇంటికి రాగానే యది చూపించి 'నేఁడైనఁ దప్పక వెళ్ళెదవా? ఇప్పుడైన సంగతి తెలిసినదా? ఆ పిల్ల నిన్నే ప్రేమించినదికాబోలు! ఇట్టిసంగతి నే నెఱుఁగను. ఏదో కథయుం దిట్లే యున్నది. పోయి యా యమ్మాయి నొకసారి చూచి రమ్ము. దానివలన నీ యేకపత్నీ వ్రతమున కేమి భంగము వాటిల్లును? నీ వింత జాతిగుండెవాఁడ వేమిరా! ఎంత జాలిగుండెవాఁడ వనుకొన్నాను!' అని సాధించెను. ధర్మారావు విని 'యివ్వేళ చవితి. మంచిది కాదు. రేపు పంచమి. రేపు పోయెదను' అని మొదటికే పోయెను. రాజేశ్వరుఁడుగారు 'వానికిని బోయి చూడవలయు ననియే యున్నది, కాని యా భార్య జ్ఞాపకము వచ్చుచున్నది. నిజమే, అది భూలోకదేవత. దానినిమఱచి పోవుట యెట్లు?' అనెను.

రాత్రి యెనిమిది గడియల పొద్దుపోయి చంద్రుడు వెన్నెలలే కాసెను. ఆవెన్నెలలో నే మున్నదో కాని యది ధర్మారావునకుఁజల్లన యనిపించెను. ఏఁడాదిపైన నేఁడు నెలలు కడచినవి. ఇంతవఱకు అతనికి వెన్నెలలు సుఖదాయకము కాలేదు. ఈనాఁటి వానిచల్లదన మతని కాశ్చర్యము కలిగించెను. తనయాశ్రమములోఁ దిరుగుచున్న హిమ వంతునికూఁతునందు బద్ధమనస్కుఁడై శివుఁడు హేతువును వెదకి ప్రత్యా

లీఢపాదుఁడైన మన్మథుని నొకచూపులఁ జూచి వానిని భస్మీకరించెను. ధర్మారావు తనకు వెన్నెలలు చల్లఁగానుండుటకు హేతువును వెదకి చిన్న యరుంధతిని గనుఁగొనెను. తనమనస్సు చిన్న యరుంధతిమీఁదలగ్న మగుటకీ వెన్నెలలు హేతువులైనచో నతఁడు నీవెన్నెలలనుదగులఁబెట్టి యుండినాఁడేమో? శివునకుఁ గారణము ప్రేయోవిషయము కాదు, ధర్మారావునకుఁ గారణము ప్రేయోవిషయము. శివుఁడు తనమనస్సు పార్వతియందులగ్నమగుటకు మన్మథుఁడు కారణమనిగ్రహించి వానిని భస్మీకరించెనుగాని తనమనస్సునందు మన్మథుఁడుజన్మించుటకుఁ బార్వతి హేతువని తలఁచి యామె నేమియుఁ జేయలేదు. ఎట్లయినను స్త్రీమూర్తి పవిత్రమైనదియుఁ, బరీక్షింపవలసినదియు. ధర్మారావందుచేతఁ దన మనస్సున నిలిచిన యరుంధతివంకఁ జేలవోయి చూచెను. తానే యామెకు లొంగిపోయినట్లు తలఁచెను. "వివేక భ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః" అన్నట్లు మనస్సు లొంగిన దన్నసంగతి తెలిసికొన్న మఱునిముసముననే యా లొంగిపోవుట లోని మిక్కిలితనమును దెలిసెను. అతఁడు చూచుచుండఁగనే సుబ్రహ్మణ్యేశ్వరస్వామి రెండుతలలతో వచ్చి యతనియెదుట సాక్షాత్కరించెను. ధర్మారావు లేచినిలుచుండి నమస్కారముచేసి ప్రదక్షిణముచేసి మఱల సాష్టాంగవినతుఁడయ్యెను. "ప్రభూ! నశించి పోయిన నీ మూర్తి మఱల నాకు గోచరించుచున్నది. నేను మూలతః నాశమైతి ననుకొంటిని. ఇందులో నా కేదియో కొంత మిగుల్చుచున్నావు. భవదాజ్ఞావర్తిని నీబంటును నీవు శాసించుకొనవచ్చును.'

పంచమినాఁటిసాయంకాలమున ధర్మారావుచూచిన యరుంధతి పాలిపోయి నెత్తురులేక శల్యములుమాత్రము మిగిలి యేకువలె మంచమున కత్తుకొని యున్నది. ఆమెకన్నులుమాత్రము జ్యోతిస్సులవలె నుండెను. కాని గుంటలుపడియుండెను. చెక్కిళ్ళు లోనికిఁ దోసికొని పోయెను. ఒక్కసుగుణము. నెమరుకణతలు లోనికిఁ దోసికొనిపోలేదు. అందఱును దానినిజూచి యాశలు వదలుకొనలేదు.

పశుపతి యేమియు మాట్లాడలేదు. అనసూయ ధర్మారావు వంకనే చూచుచుండెను. అనసూయతల్లి ధర్మారావును జూచి

'నాయనా! నీవు ప్రతిరోజును వత్తువనియే యనుకొనుచున్నాము. ఈ పిల్ల నీ భార్య. దీనిని నీవు కాకపోయినచో నెవరు బ్రతికించఁగలరు? వైద్యు లెవరును దీనివ్యాధి గుర్తించలేకపోయినారు. నీవు వచ్చి నావు; మా భాగ్యత వదలినది' అనెను.

అన—ఉత్తరము వేసి మొదటిదినము లైనది. ఇంత[illegible]ను రాలే దేమి? పశు—తంతు లిచ్చితిని. అందలేదా? ధర్మా—ఎందు కందలేదు. మీపిల్లకు జబ్బుగానున్నచో నేను వచ్చి యేమి చేయుదును. ఊరకే చూచుటయేకదా యని రాలేదు. అన—నాయనా! ఇది జబ్బు కాదని మాయనుమానము. అనుమాన మేమిటి? ఇది వ్యాధి కాదు ఆఱునెలలక్రింద నొక సంబంధము కుదిర్చినాము. అరుంధతి నిన్నుఁదక్క మఱొకనిని జేసికొన నన్నది. అదే మొదలు వ్యాధి మొదలుపెట్టుటకు. లగ్నము పెట్టుకొనుటకు వారు వచ్చిరి. ఈమె ఆనాఁడు డోకుకొన్నది. జ్వరము ముంచుకొని వచ్చినది. ఎట్లయినను దప్పదుకదా యని లగ్నము మాఘమాసమునాఁటికిఁ బెట్టినారు. ఇది ఆజబ్బుజబ్బు అట్లే వృద్ధిపొంది లగ్నమునాఁటికి మంచములోనుండి లేవలేనిస్థితిలోనికి వచ్చినది. ఆ సంబంధమువారు వచ్చి చూచిరి. ఆనాఁడు మంచములోఁ బరుండి యిది యావచ్చిన మామగారితో 'నేను చచ్చియైన పోయెదనుగాని, మీ యబ్బాయిని బెండ్లియాడను. నాభర్త ధర్మారావుగారు. ఆయన వచ్చి నన్ను వివాహము చేసికొనునా, చేసికొనును చేసికొనఁడు! సరే! మీ కీ దురాశ యెందుకు?' అన్నది. ఆయన యీవర్తమాన మదివఱకే విన్నవాఁడు కావున దీనిమాటలతో మనసు విఱిగి లేచిపోయెను. అది మొదలు రోజురోజుకు నిది శుష్కించి పోయిపోయి యీనాఁటి కిట్లయినది. క్రమక్రమముగా మీబావగారుకూడ దానియిష్టము వచ్చినట్లే చేయుట కంగీకరించినారు. నాయనా! ఇంక నీవు వచ్చితివి. చూచితివికదా యెట్లున్నదో? అది యింక బ్రతుకునని నమ్మకము లేదు. నీ యదృష్టమువలన నేమైన బ్రదుకునేమో తెలియదు. నాతల్లిని నీవు బ్రతికించుకొనఁగలవేని బ్రతికించుకొనుము అని యామె వలవల నేడ్చెను.

ప్రొద్దుక్రుంకు నగఁగా బశుపతి ధర్మారావులు తోఁటకుఁ
జనిరి. ఇద్దఱును మాటాడకుండ నడచిరి. తోఁటలో నొకచోట
నాసీను లయిరి. కొంతసేపటికిఁ బశుపతి ధర్మారావుచేతులు పూసి
'ధర్మా! నన్ను క్షమించవలయును' అనెను. పశుపతికనుల వెంట
జలజల నీరు స్రవించెను. ధర్మారావు పెద్దనిట్టూర్పు విడిచెను. పశు-
నేను నీయెడలఁ జాల ద్రోహము చేసితిని. నీ సద్గుణము లన్నియు
నే నెఱిఁగికూడ నిట్లు చేసినందులకు నాకుఁ జాల చింతగా నున్నది.
మీయిద్దఱిమధ్య నున్న వయసు తారతమ్యముమాత్రమే చూచితిని
గాని, తక్కిన మహావిషయములు చూడ లేకపోతిని. అధునాతన
ప్రపంచ భావములచేత మోసగించఁబడినాను. ప్రేమకు వయో
భేదము ప్రధానమైనది కాదు. ధనము, సద్గుణములు, సౌందర్యము,
కులము, విద్య, వయస్సు మొదలయిన వెన్నియో దానికి హేతు
వులు. అందులో నొకటియైన వయస్సునకు నవసరమైన ప్రాధాన్య
మిచ్చి నేను లోకముతోపాటు వంచింపఁ బడినాను. ఇది నాయొక్క
నిదే తప్పు కాదు. మన చెలిమినైనఁ దలఁచక నేను మిక్కిలి స్వార్థ
పరుఁడనైతిని. ఇంతకు నదృష్టవంతుఁడను కనుక సరిపోయినది.
లేనిచో నారి సంబంధమే చేసినచో నీపిల్ల యేమయి యుండును?
దాని జీవిత మంతయు దుఃఖభూయిష్ఠ మైయుండును. ఇప్పుడు
మాత్ర మేమయినది? అప్పుడయినచో నెట్లోయొకట్లు బ్రతికియైన
నుండెడిది. ఇప్పు డాయాశయు నంతరించినది. ఇది యింక బ్రదుకునా?
నిన్నుఁ బెండ్లియాడునా? నేను, నన్ను నేను ద్రోహముచేసికొంటిని;
నిన్ను ద్రోహము చేసితిని; కూఁతుఁ జంపుకొంటిని; చేతులారఁ జేసి
కొన్న యీ మహాఘమునుండి న న్నెవరు రక్షింతురు? అయ్యో!'
అని పశుపతి కనులపైఁ జేతు లుంచుకొని యూరక దుఃఖించ నారం
భించెను. ధర్మారావు 'ఆమె కేమియు భయములేదు. మఱలఁ
జక్కఁగా నారోగ్యవతి యగును. దుఃఖపడకుము' అనెను. పశుపతి
ధర్మారావు నెఱుఁగును. అతఁ డా మాట యనినంతనే పశుపతి
కన్నులలో నాశాంకూరములు తోఁచెను? 'ఏమి! నిజముగా బ్రదు
కునా? బ్రదుకునా? నిజమే చెప్పుచుంటివికదా? నీవాక్క మోఘ
ముగా జరుగును. నిజము చెప్పుము, నిజము చెప్పుము. న న్నొదా

ర్చుటకుఁ గాదుకదా యిట్లనుట!' అని మఱలఁ బ్రశ్న వేసెను. ధర్మారావు 'కాదు. నిజమే చెప్పితిని' అనెను. మావికొమ్మలలోని కోకిల కుహూ యనెను. అందఱు నరుంధతి బ్రదుక దనుకొనుచుండిరి. ఆమె మందు పుచ్చుకొనదు. బలవంతముమీఁద నిచ్చుచుండిరి. ధర్మారావు పశుపతులు తోఁటకుఁ బోయినపుడు తల్లి యరుంధతిని మందు పుచ్చుకొమ్మనెను. ఆమె నేను పుచ్చుకోననెను. ముత్తవతల్లి 'ఏమే నీ కోరినయాయన వచ్చెనుగదా! ఇంకఁ బుచ్చుకొమ్మ' అనెను. అరుంధతి పుచ్చుకోలేదు. అందఱిని నచటినుండి పంపించి తల్లి కుమార్తెను బుజ్జగించి 'తల్లీ! మందు పుచ్చుకో అమ్మా! లేకపోయినచో నీ మనసులో నున్నదేమో చెప్పుము' అని బతిమాలి యడిగెను. తల్లి బతిమాలఁగా జిన్నయరుంధతి 'ఆయన వచ్చినాఁడు సరే! నన్ను బెండ్లియాడుట కొప్పుకొనునో యొప్పుకొనఁడో' అనెను. అనసూయ 'నే నొప్పించెదనుగదా' యనెను. మఱల మందీయఁబోయెను. ఆమె మఱల నిరాకరించెను. ఇంక లాభము లేదనుకొని యనసూయపోయి యరుంధతియనుమానము తనపినతల్లితోఁ జెప్పెను. ఆమె వచ్చి మనుమరాలితో 'ఏమోనమ్మా! నిన్నుఁ బెండ్లియాడుటకు నొప్పుకొనఁడేమో? చేఁదు మ్రింగు మనుచుంటి మాయెను. నలువదియేండ్ల పసివాఁడు. లక్షాధికారి. ఏ మూల నుండి చూచినను సంబంధములమీఁద సంబంధములు వచ్చుచున్నవి. వేయిన్నూటపదాఱు లిత్తుమనుచున్నారు. నిన్నిచ్చి మీనాయన పెండ్లి చేయుదు ననఁగా నొప్పుకొనకపోవచ్చును' అని యాక్షేపముగా మాట్లాడెను. అరుంధతి యేడ్వ నారంభించెను.

అనసూయ తనపినతల్లిని బదితిట్టి కూఁతుతో 'అమ్మా! అమ్మమ్మ నవ్వుచు నన్నది. నివు ప్రతిదానికి నిట్లయినచో నెట్లు' అని సముదాయించుకొనెను.

అనసూయ పినతల్లిపేరు సుబ్బమ్మగారు. ఆమె రాత్రి భోజనము చేయునపుడు ధర్మారావుతో 'నాయనా! నీ వూరకే చూచి పోవుటకుమాత్రమే వచ్చితివా? మా పిల్లను బెండ్లియాడుటకు వచ్చితివా?' యనెను. ధర్మారావు మాటాడలేదు. ఆమె మఱల 'నాయనా! నీవు పెండ్లిచేసికొందు నని చెప్పినగాని, పిల్ల మందుత్రాగు

సట్లు లేను. దాని కది దిగులుగా నున్నది' యనెను. ధర్మారావు మా
టాడలేదు. భోజనము లయినవి.

చావడిలోఁ గూర్చుండి పశుపతి ధర్మారావులు తాంబూ
లము [illegible]వేసికొనుచుండిరి. అనసూయ వచ్చి 'నాయనా! మే మెవ్వ
రమ[illegible]ప్పినను మందు పుచ్చుకొనుట లేదు. నీవు వచ్చి చెప్పుము.
ఏమయిన[illegible]నను నేమో? మందు కడుపులోనికిఁ బోయినచో బ్రతుకు
నేమో యని మాయాశ' యనెను. పశుపతి పోయి రమ్మనెను. ధర్మా
రా వందఱి నటనుండి వెడలిపొమ్మని తాను పోయి యరుంధతికి మం
దిచ్చెను. ఆమె నిరాకరించెను. అతని కేమి చేయుటకును తోఁచలేదు.
ఎవరికిని దోచలేదు.

ఆ రాత్రి వేసఁగి యగుటచేత నందఱును వాకిట మంచములు
వేసికొని నిద్రించుచుంటిరి. రాత్రి రెండు జాములు దాఁటెను. ఒక్కొ
క్కప్పుడు చీఁకటులలోఁగూడ సౌందర్యము కనిపించును. సౌందర్య
మనునది మనోవికారము. మనస్సు శతధా మాయావృతము. మనః
ప్రపంచమున మాయ యెట్టిదో యీ దృశ్యమానప్రపంచమున నంధ
కార మట్టిది. అజ్ఞానకల్పితవస్తువులందు మనస్సునకు భ్రాంతి
యెక్కువ. అట్లే నేత్రములకును దృశ్యాదృశ్యవస్తువులయందు సౌంద
ర్యభావ మెక్కువ. సువ్యక్తమైనది ధర్మము. అది యింద్రియాతీత
మైన బుద్ధివిషయము. అవ్యక్తమైనది సౌందర్యము, మాధుర్యము
మొదలయినవి. ఇవి యింద్రియవిషయములు. మనోవిషయము-
'అవ్యక్తమధురధ్వని' 'కలస్వనము' మొదలయిన ప్రయోగముల
కిదియే స్థితిస్థానము. అధర్మబుద్ధికి, ననాత్మదర్శికి, నవ్యక్తవస్తుతత్త్వ
నకు నజ్ఞానవిషయము, దుఃఖము, చీఁకటి మొదలయినవి హృదయాభి
రామములుగ నుండును. సత్పదార్థము ధర్మము నవి నిత్యములా,
కల్పితములా? కల్పితము లని యథేచ్ఛావాదులవాదన. రసపర్యవసా
యులయిన సర్వవస్తువులకునుబలెనే దుఃఖాంధకారాదులకును భారత
శిల్పమున స్థానము కలదు. కాని భావమాత్రములయిన వానియందు
భారతవర్ష కావ్యప్రపంచమున స్థితి లేదు. పాశ్చాత్యులలోఁ గొం
దఱు దుఃఖము నాశ్రయించి కవితామార్గమునఁ జనిన
వారు కలరు. షేక్స్పియరు తన నాటకములయందు ప్రపంచక

మంతయు దుఃఖపర్యవసాయియనియే చూపినుగాని తద్గతాత్మనిత్యత్వ మును జూడలేదు. ఈ తత్త్వదర్శిత లేదుకనకనే పాశ్చాత్త్యులశిల్ప మందు విషాదాంతనాటకముల కంత ప్రాముఖ్య మబ్బినది. వారి సుఖాంతనాటకములు హాస్యరసప్రాముఖ్యములైనవి. ఇంద్రియాను భవమందు సౌఖ్యము పర్యవసానము. హృదయాత్మ[illegible]ముల యందు నానందము పర్యవసానము. అందుచేత లో[illegible]నుభవము నందు సౌఖ్యానందములు పర్యవసానములు. ఇది తెలిసినవాఁడు తత్త్వ దర్శి. ఇది దేనియందు నిక్షేపింపఁబడినదో ఆశిల్ప ముత్కృష్టము. ఆ దూరము వోవుటకు మధ్యేమార్గముననున్న సర్వవస్తువులును సాధనములుగాఁ బరిగ్రాహ్యములు. చీఁకటులుకూడ దదుపకరణములు గావున సౌఖ్యదాయకములు. ధర్మారావు వచ్చిన చీఁకటులను గుఱించి యిట్లూహించుకొనుచు నిదురపట్టక మేల్కొనియేయుండెను. గాలి యప్పుడే నెమ్మదిగాఁ జల్లన దిరుగుచుండెను. ఆ చిఱుచలికిఁ బైనున్న ఖద్దరుత్తరీయము మాత్రకమైనది. అతఁడు కనులు మూసి కొనియుండెను. చిఱుచలి కింత బెదరుట యేలయని కావలయు స్పర్శా ధిదేవత యతనిని మెల్లఁగాఁ దాఁకినది. అతని యొడలు పులకరించి నది. ఈ స్పర్శ యెక్కడిది ? ఇది యెన్నాళ్ళకిందటి స్పర్శ? ఇది యెట్లు పునరుజ్జీవితమైనది ? ఓహో ! ఇది యేమి యనుభవము ?

"వినిశ్చేతుం శక్యో న సుఖమితివా దుఃఖమితి వా
విబోధో నిద్రావా కిము విషవిసర్పః కిము మదః
తవ స్పర్శేస్పర్శే మమ హి పరిమూఢేంద్రియగణో
వికార శ్చైతన్యం భ్రమయతి సమున్మీలయతి చ."

ఈ రీతిగా నొకనాఁ డనుకొన్నదియు, ఇప్పుడు

"ఆలిమ్పన్నమృతమయై రివ ప్రలేపై
రంతర్వా బహిరపివా శరీరధాతూన్
సంస్పర్శ పునరపి జీవయ న్నకస్మా
దానందా దపరవిధం తనోతి యోహమ్."

ఈ రీతిగా నున్నదియు, నొక యనుభవము పొందిన ధర్మా రావు శ్రీ రామచంద్రునకుఁ గలిగిన నిరాశ తనకుఁ గలుగక యుండఁగా నా స్పర్శహేతువైన కరమును గట్టిగాఁ బట్టుకొనెను.

అమాంసలమై పరిశుష్కమై యస్థిమాత్రపరిశేషమైన యాచేయి గ్రహించుటకుఁగూడ నమరనిదై యతఁడు కన్నులుఁదెఱచిచూచెను. చీఁకటిలో సన్ననిది, తూలిపోవుచున్నది, తనవద్ద నిలుచున్నది, చిన్న యరుంధతి గుర్తుపట్టఁబడెను. ఇంద్రియములు భిన్నములయ్యును దదనుభూతిజ్ఞానమునందు భిన్నత్వ ముండదు. ఇప్పు డిది యేమి? నేత్రత్వగింద్రియములకీ రెంటి జ్ఞానమును రెండువిధములుగా నున్నది. నేత్రేంద్రియము చిన్నయరుంధతిని జెప్పుచున్నది. త్వగింద్రియము పూర్వపుఁ బదునాల్గు బదునేనేండ్ల యొకవిచిత్రానుభూతిని దెలుపుచున్నది. ఆ యనుభూతికి నాయనుభూతిహేతువునకు నవినాభావ సంబంధము ధర్మారావు మనస్సులో నవ్యవహితముగా నున్నది. దానికి దీనికి నేమి సంబంధము? కన్ను కాదన్నది మన సౌ ననుచున్నది.

నిమేషమాత్రకాలికమైన యీ యంతశ్చాలనము కుదించి ధర్మారావు మాటాడఁబోయెను. అరుంధతి వలదని వారించి యతనిని లెమ్మని సన్నచేసెను. ఇద్దరును గొంచెము రహస్యస్థలమునకుఁ బోయి మాటాడ నారంభించిరి. అరుంధతిని ధర్మారావు తనచేతులలోఁ బసిపిల్లనువలెఁ బూనియుండెను. ఎందు కింతరాత్రివేళ వచ్చితివి? లేవలేనిదాన నెట్లు లేచితివి? దారిలోఁ దూలిపడిపోయెదవనియైన లేదా? నీమూలమున నా కొకయప్రతిష్ఠ వచ్చినది. లోకము న న్నేమనుకొందురు? మందులమారివాఁ డనుకొందురు. పసిపిల్లవు. నలువదియేండ్ల నన్నుఁగాని వరించరాదా? అందులో నే నేమైన ధనవంతుఁడనా, సౌందర్య వంతుడనా? ఇప్పు డీ వచ్చుట యెందుకు? న న్నీ చాటుచోటికి నేల తెచ్చితివి? ఏమి చెప్పవలయునో చెప్పుము. నాచేతులు నీకుఁ గ్రుచ్చుకొనుట లేదుకదా!

అరుం—గ్రుచ్చుకొనుట లేదు. ధర్మా—ఎందు కింతరాత్రివేళ వచ్చి నన్ను లేపినది? అరుం—చనిపోయిన మీ భార్య మీకు జ్ఞాపకము లేదా?

ధర్మారావు కన్నులవెంట జలజల నీరు కారెను. అతని కన్నీరు చిన్నయరుంధతి చెక్కిళ్ళపైఁ బడి తడిసెను.

అరుం—ఆమె చనిపోయినప్పు డెట్లున్నది? ధర్మా-అవును, సరిగా నిట్లే యున్నది. నీయొడల నెంతమాంసము, కండ లున్నవో దానియొడలను నంతియే యున్నవి. అరుం - నే నెవరను? ధర్మా-నీ వెవరు?

అతని చేతులలో నున్న యరుంధతి తనతల నతని యెదు ఱొమ్ముపై నాన్చెను. అతనికిఁ దెలియకుండ నామె పరిపక్వక పోలము చుంబించఁబడెను. ఆతని కతనిమీఁద జుగుప్స గలిగెను. మొగ మున భావకషణవిశ్రామహాసము గోచరించెను. అన్ని భావము లవి స్పష్టముగానే గోచరించెను. విస్పష్టముగాఁ దెలిసిన దొక్కఁడే. అది యామె మొగమునందలియుచ్ఛ్వాసనిశ్వాసములలోని జ్వరము వాసన. అతఁ డామె జ్వరవాసనాకటువై నవదన మాఘ్రాణించెను. ధర్మా రావుహృదయములో నొక విచిత్రమైన పరిస్పందనము కలిగెను. ఆ యరుంధతియే యీ యరుంధతియా!!!

మఱునాఁడు, మూఁడవనాఁడు, నాల్గవనాఁడు గడచెను. చిన్న యరుంధతికి నానాఁటి కారోగ్యము రోజునకుఁ బదిరోజులైనట్లు వృద్ధిపొందుచుండెను. శుక్లపక్ష చతుర్దశి వచ్చినది. ప్రతిరోజును ధర్మారావు పోదునని, అందుఱు వలదని. అతఁడు మఱలఁ దిరిగివత్తు నని, వారు ఱేపు వెళ్ళుదువుగాని యెల్లుండి వెళ్ళుదువుగాని యను చుండఁగనే చతుర్దశి వచ్చినది. పదునాల్గుకళలు నిండిన ద్విజరాజు వేదమూర్తివలె భాసించెను. చంద్రబింబము క్షీరసాగరప్రధానా వర్తము, చంద్రికిరణవ్యాజసుధాసర్వతరంగజనన హేతువు, ఆకాశ మధ్యగతదివ్యసింహాసనాధ్యాసి, కువలయమిత్రుఁడు ధర్మము కల్పి తము కాదు, నిత్యమని ప్రబలసాక్ష్యమిచ్చెను. సర్వశాస్త్రములు నాది హేతువు గాదు, తద్వికారవస్తువులనుగూర్చియే యుపన్యసించును. ఈ యా పదార్థములయం దీ ధర్మ మున్న దని యుపన్యసించును గాని, యా ధర్మ మేల యున్నదో శాస్త్రము చెప్పలేదు. ఆకాశము నం దా నైల్య మేల కనిపించుచున్నది? వాయువో, జ్యోతిస్సో యేదో యొకానొకతరంగసమితి ప్రసరించుటవలన నా నీలవర్ణ మేర్పడు చున్నది. దానిని శాస్త్రజ్ఞులైన సి. వి. రామన్‌గారు కనిపెట్టిరి. దానికే 'రామన్‌గారిసిద్ధాంత' మని పేరు వచ్చినది. ఆ రీతిగా

వట్టితరంగప్రసారమువలన నా నీలవర్ణ మేల యేర్పడవలయునన్న ప్రశ్న కామహానుభావుఁ డేమిచెప్పును? అట్టి తరంగప్రసరణమా నైల్యమునకు హేతువనునది ధర్మము. ఆ శాస్త్రజ్ఞుఁ డా ధర్మమును జూచెను. ఆయ[illegible]ాడకముం దా ధర్మమున్నది. ఆధర్మము నిత్యమైనది. తన్నిత్యత్వ[illegible]న ముండుట కాస్తిక్య మనిపేరు. చంద్రుఁడు, నక్షత్రములు, నాకాశము నీ సర్వము తద్ధర్మోపన్యాసమునే చేయుచున్నవి. తద్ధర్మనిత్యత్వమునే ఘోషించుచున్నవి. చంద్రుఁ డా రాత్రి యా ధర్మమునే చెప్పెను. మఱియు నింకొకఁడు చెప్పును. ఆధర్మము శాస్త్రజ్ఞులు చెప్పిననేకాని యితరులు విశ్వసించరఁట! ఆ శాస్త్రజ్ఞులనైనను నందఱు శాస్త్రజ్ఞు లని యొప్పుకొనవలయునఁట. పదార్థవిజ్ఞానశాస్త్రవిషయోపన్యాసము లొప్పుకొందురఁట. ఆధ్యాత్మికవిజ్ఞానశాస్త్రవిషయములందు సందేహమేనఁట! భౌతికమునకు నాధ్యాత్మికమునకు నడుమనున్న మహాసముద్ర మెవఁ డుల్లంఘించఁగలఁడు? అందఱును సముద్రతీరమందు నిలిచిరి. ఎవఁడు నా సముద్రోల్లంఘనము చేయఁజాలక పోయెను. ఆంజనేయుఁడు తాను చేయుదు ననెను. దక్కినవారు విశ్వసించిరి గాన సరిపోయినది — 'కాదు. నీవు లంకకుఁ బోలేదు. సముద్రమున్నీఁదఁ గొంచెమునే పెగిరి వచ్చితివి పో' యని దక్కినవా రన్నచో నతని బ్రదు కేమి కావలసినది? ఇది ధర్మమని చెప్పినచో విశ్వసించవలయును. అయినచోఁ బ్రతిదియు విశ్వసించవలయునా? అట్లయినచోఁ బ్రతిదియు ననుభవములోనికిఁ దెచ్చుకొనవలయునా? ఐన్‌స్టైన్, రామన్, బోసు మొదలయినవారు చెప్పినమాటలు మనము విశ్వసించుచున్నాము. అవి మన యనుభవములో లేవు. అవి మన యనుభవములోనికి వచ్చుట కీ యొక్కఁడే జన్మమయినచో మనము వ్యర్థులమే యయినాము. ఒకఁడు తర్కముచేఁ జూచిన దొకఁడు విశ్వాసముచేతఁ జూచును. చంద్రుఁ డాకాశమున సత్పదార్థమువలె స్వీతస్వచ్ఛరోచులు వెలిగ్రక్కును. ధర్మమువలె సర్వానిందాతిరస్కారము ప్రకటించెను. అతని పరిహాసము తెల్లనై నేలయొద్దనుం దొఱసికొని నురుసుతెట్టెలు కట్టెను.

జాము ప్రొద్దు పోయినది. భోజనములు చేసి యందఱును గూర్చుండిరి. అరుంధతికిఁ జక్కగా నారోగ్యము వచ్చినది కాని నెత్తురు పూర్తిగాఁ బట్టలేదు. జ్వరము వచ్చుట మాని వేసినది దగ్గు పూర్తిగాఁ బోయినది. వైద్యుఁడు నేత్రములును, నాడియుఁ బరీక్షించి దోష మేమియు లేదు. ఇంక బలము పట్టుటయే యున్నది' యనెను. ఆమె మంచమును వదలలేదు. కాని యింటిలోఁ గొంచె మడుగులు వేయించి భోజనమునకుఁ బక్షమిటింటిలోనికిఁ దీసికొనిపోయి మఱలఁ దెచ్చి పండు కొనఁబెట్టుదురు. ఆమెకు నన్నము పెట్టి మంచములోఁ బరుండఁబెట్టిరి. చుట్టును పశుపతి, ధర్మారావు, అనసూయ, పశుపతితల్లి, అనసూయ పినతల్లియు నందఱును గూర్చుండిరి. అరుంధతి తల్లితో 'అమ్మా! నా కింకెన్నాళ్ళలో నెమ్మదించును?' అనెను. అన. పినతల్లి - ఆ సంగతి యమ్మనడిగినచో నేమి తెలియును నే? ఆయన నడుగుము. అన- అది నీ యెత్తిపొడుపులతోనే యోర్చుకొనలేకుండ నున్నదే. పినతల్లి- నాయనా, ధర్మారావు! నీవు చెప్పు. నాయనా! మా పిల్లకు జబ్బెం కెన్నాళ్ళకు నయమగును? అన-ఏమిటే అల్లరి? పినతల్లి-అతఁ డిచ్చటఁ గూర్చున్నాఁడనియా? అన- అది కాదే! నిజము చెప్పుచున్నాను. విను. పెండ్లికి లగ్నము కుదిర్చినగాని దానికిఁ బూర్తిగా నయము కాదు. ఆ లగ్న మెపుడు పెట్టెదరో నిర్ణయించుకొనుఁడు. పశు - ఇపుడు పెండ్లి చేసినచో శారదాబిల్లు కేసు పెట్టుదురేమో? అన - అంతగా నైనచో జరిమానా యిచ్చివేయుదుము. ఇందుకని కులము చెడుదుమా? ధర్మా - ఈ శారదాబిల్లు కేసులు పెట్టువారందఱును దేశ సేవకులు. మన దేశపు డబ్బు పరదేశమునకుఁ బోవుచున్నదని గాంధి యుద్యమములోఁ జేరినవారు. ఈ జరిమానాలతో నట్లు ధనము పోవుట లేదు కాఁబోలు! దేశమంతయు నైక్యము లేక పాడయిపోవు చున్నదని ఘోషించువారు. ఇట్టి వ్యాజ్యములమూలమున దేశము నందలి ప్రజలలో నైక్యము ప్రబలుచున్నది కాఁబోలు! అల్ప ప్రయోజనార్థులయి యధికవిషయములందుఁ జెడిపోవుట యిదే. బాబుకు పెండ్లి యయినదన్న సంతోషమే కాని తనకు సవతితల్లి వచ్చుచున్న దన్నమాట తెలియదు. అన - నాయనా! ఈ సంఘ సంస్కర్తల దుర్వేషములు వారికిఁ దగును. మా యూరిలో నొక రు

న్నారు. వారు సంఘసంస్కర్తలు. వారిపిల్ల యొక పేదవానిని ప్రేమిం
చినది. వారొక యుద్యోగస్థుని దెచ్చి యాపిల్లకుఁ బెండ్లిచేసిరి.
ఆమె యేమి చేయును? పిల్ల పెద్దదైనతరువాతఁ జేసినచో నా పిల్ల
యిష్ట[illegible]రము చేయవలయును. అప్పుడైనను సంబంధము కుదుర్చు
నది వీ[illegible]! ఆమాత్రమునకుఁ బిల్ల పెద్దదగుట యెందులకు? అది
యొకరిని గోరినతరువాత నింకొకని కిచ్చి పెండ్లిచేయుటకుఁ గాఁబోలు!
చిన్నప్పుడు చేసిననే మంచిది. ఆ పిల్ల మనసప్పటి కెవ్వనిమీఁదను
ప్రసరించదు. ఎవరి కిచ్చి పెండ్లిచేయుదురో వాఁడే భర్తయన్న
యభిప్రాయము ప్రబలఁగలదు. ప్రేమ యనఁగా నేమిటి? సౌందర్యము,
వయస్సు, ధనము, పదవి మొదలయినవానినిఁ జూచి యాశపడుటయే
కదా! ఇవి యున్నవని పెండ్లియాడినతరువాత నవి నశించవచ్చును.
డబ్బున్నవారని సంబంధములు చేసిన తరువాత నెంతమంది దివా
లాలు తీయలేదు? ఉద్యోగములు పోలేదు? మశూచికము వచ్చి
సౌందర్యము పోవచ్చును. మనసులు కలసిన వని చేసికొనిన తరు
వాత భార్యాభర్తలకుఁ బడక యెన్ని దాంపత్యములు చెడరాదు?

ధర్మా—చెడరాదు కాదు; చెడలేదు? పాశ్చాత్యదేశముల
నిండ నివియే పరువ అమెరికా యీ విద్యలో నందెవేసిన చెయ్యి
రోజునకు వంద విడాకులు. ఉదాహరణముచూచికూడ మనదేశస్థులు
బాగుపడలేకున్నారు. ఎవరో చెప్పినట్లుగాఁ బాశ్చాత్యులు కొన్ని
మార్గములు పూర్వమువల బించిరి, వారు వానినిదుష్టము లని పరిహ
సించుచున్నారు. వారు చెడ్డవని వదలిన వానిని మనము పరిగ్రహించు
చున్నాము. పసు - భావము లచ్చటినుండి యిచ్చటికిఁ బ్రయాణము
చేయుటకుఁ గాలము పట్టునుగదా! మన కందుచేత నాలస్యమగుచు
న్నది. వెలుతురు శబ్దమువలెనే భావమునుఁ బ్రయాణముచేయుటకుఁ
గొంతకాలము పట్టుచున్నది ధర్మా—ఇంగ్లీషుభాష కూడ నట్లే.
శాంగెలు, మెకాలేలు వ్రాసినభాష యింగ్లండులోఁ జచ్చి చాల యేం
డ్లయినది. షా, వోడ్‌హౌస్, వెల్సు మొదలయినవారి ఇంగ్లీషు
నేఁటి యింగ్లండులో వ్యాప్తిలోనున్నది. మనస్కూళ్ళలో షేక్స్పి
యరు, కార్లయిలులే యింకను రాజ్యము చేయుచున్నారు. మనదేశ
ములో నిపుడు మనము నేర్పుచున్న యింగ్లీషు నేఁడు పోయి యిం

గ్లండులో మాటాడితివా వారందఱును వింతమృగమును జూచినట్లు చూతురు. వారి యాచారములమాట చెప్పవలయునా ? మన దేశము వారికిఁ గ్రమముగా బుద్ధిపోవుచున్నది. అన - అసలు ప్రేమ యనఁగా భార్యాభర్తలు కలసి కొన్నాళ్ళు సంసారముచేసినతరువాతగాని కలుగదు. ఆ ప్రేమకు వయస్సౌందర్య ధనాదికములతోఁ బనిలే[illegible] పరిచయాధిక్యమువలన, మనస్సు నలవాటువలనను వచ్చు[illegible]. ఒక విషయమునం దభిమానము పరిచయమువలననే కలుగును. ప్రేమ యనునది మనోవిషయము. మనస్సున కలవాటు నాభిస్థానము. ఈ సిద్ధాంతము నాధారము చేసికొని మన పూర్వులు వివాహకాలము నిర్ణయించిరి. తాత్కాలిక మనఃప్రవృత్తి నాధారముచేసికొని, యన్య విషయాశ్రయబుద్ధి నాధారము చేసికొని యిప్పటి వివాహసూత్రములు నిర్ణయించుచున్నారు. పశు—నాభార్య యింత చదివిన తరువాత నింక సంసార మేమిటి! ధర్మా—ఎవరు మాటాడునది ? పశుపతియేనా ! సంఘసంస్కర్త పశుపతి. అన - అబ్బాయి! ఏదయినను తనదాఁక వచ్చినఁగాని తెలియదు. పశు - ఏమైనను బాల్యవివాహములు పనికి రావు. ధర్మా—ఎందుచేత? పశు—బాల్యవివాహముల వలననే బాలవితంతులసంఖ్య ఎక్కువ యగుచున్నది. అన—బాలవితంతువులసంగతి విచారించకపోయినచో బాల్యమృతులను గూర్చి విచారించరాదా ? ఇంతమంది చిన్నవయసులో నెందుకుఁ జనిపోవుచున్నారో విచారించి, దాని కేదయినఁ బ్రతిక్రియ చేయరాదా ? ధర్మా—చచ్చినవారిసంగతి మా కెందుకు ? వారిసంగతి మ్యునిసిపల్ వారికి. మాది మ్యారేజి బీరో. మాకు మిగిలినది పెండ్లిండ్లు, ప్రేమ. ఇంక దేనినిగుఱించి మాటాడుమందువు ? కొన్ని సంగతులు మాటాడినచో రాచరికమువా రూరకుండరు. విద్యావిషయము మాకుఁ దెలియదు. వేదాంతము మొదలయిన వగమ్యములు. పదార్థవిజ్ఞానశాస్త్రాదు లగాధములు. మిగిలినవి పెండ్లి, ప్రేమ, మాపరిశోధన, శాస్త్రచర్చ, ప్రయోజకత్వము వీనిమీఁద. మాపక్షము గెలుచు ననుటకు మా సంఖ్య యెక్కువ. మావాదన నిజము కనుకనే గెలుచుచున్నది. అన—అందుకుఁ గాదు. మీకు దంభ మెక్కువగనుక గెలుచుచున్నది. యాథార్థ్య మతీతజ్ఞానవిషయముగాని యెక్కువమంది

చెప్పునది కాదు. గొఱ్ఱెలు మంద యుండును. ఏనుఁగులు రెండో, మూఁడో. గౌరవ మేనుఁగులకే. ఏనుఁగు గొప్ప యేమని నచో నేమని చెప్పఁగలము? అది మనసునకే తెలియును. ధర్మా—ధర్మములు కూడ నట్టిదే. అదియు మనసునకే తెలియును. పశు—మ[illegible]ఁగుల కిచ్చినంత గౌరవము పాశ్చాత్యు లీయరు. ధర్మా—మన ధర్మశాస్త్రముల గతియు నంతే. పశు—ఆ శాస్త్రములఁ గూర్చి మనదేశీయులకే చాలమందికి నమ్మకము లేదు. అవి వ్రాసిన వారును మనవంటివారే. ధర్మా—మన దేశీయులకే నమ్మకము లే దనఁగా, మనదేశీయు లనఁగా మనదేశమందుఁ బుట్టినవా రని యర్థము. మనదేశ మనఁగా నాల్గుహద్దులుకల ప్రదేశ మని కాదర్థము: ఇచ్చటి మతము, సంఘము, ఆచారములు సర్వము నని యర్థము. ఈ భూఖండమునందుఁ బుట్టినంతలో నొరిగినదిలేదు. మన మతసంఘాచారములయందుఁ బుట్టవలయును. వాఁడు మన దేశస్థుఁడు. ఇంక నవి వ్రాసినారు మనవంటివారే నంటివే - ఆమాట చాల తప్పు. మనవంటివారు కాదు. ఒక్కటి చూడు! రాజును నా వంటివాఁడే యని వీధిలో నిలుచుండి యనుము. ఏ మగును! ఉరికి జేనెఁడు బెత్తెడులో నుందువు. ధర్మశాస్త్రకర్తలు మనవంటివారే. వా రురి తీయించరుకదా! వారు మనవలె మనస్సును యథేచ్ఛముగా మాత్రము ప్రవర్తింపనీయలేదు. తక్కిన సంగతు లట్లుంచి, వా రొక్కటి విశ్వసించిరి. మనస్సును నియమించిన తరువాత మనశ్శక్తి వృద్ధిపొంది దాని కెక్కువ విషయములు తెలియు నని వారి విశ్వాసము. సంకల్పవికల్పాత్మకశక్తి మనస్సులక్షణము. వాదనాశక్తి దాని వలననే కలుగును. అది యందఱకు నుండును. చదువుకొన్న కొలఁదియు నాశక్తి వృద్ధిపొందవచ్చును. విద్య సంకల్పవికల్పములందు బహుళత్వము తెచ్చును గాని, మనస్సునకు నిశ్చయబుద్ధిని గలిగించు శక్తి నీయదు. దానికి మనోనియమన మవసరము. శరీరావయవచాలనమునందలి శక్తి యందఱకు నుండును. ఎక్కువ యాహారపుష్టి మొదలయినవి (మనస్సునకు విద్యవంటివి) కలిగినచో శరీరమునకు సౌకుమార్యము మొదలయినవి కలుగును. దేహమునందలి శక్తి వృద్ధి పొందవలయునన్నచో నియమము పాటించవలయును. మితా

హారము, వ్యాయామము, అవ్యసనిత - యీ నియమములు పాటించినచో శరీరమందు శక్తి వృద్ధిపొందినట్లే నియమముచేత మనస్సునకును శక్తి వృద్ధిపొందును. అపుడు తెలియుసంగతులు వేఱు. మనకా నియమము లేదు. ఆ శక్తి లేదు ఆ శక్తి వృద్ధిచేసికొని మహాద్రష్టలైనవారి వాక్యములు మనము వృద్ధిపొందిన సంకల్ప వికల్ప శక్తితో విమర్శించుచున్నాము. అన. పినతల్లి—సరేకాని లగ్నము నిర్ణయించుట యెపుడు? పశు—రేపు. వైశాఖములోఁ జేయవలయును. పిల్ల నింక నుంచరాదు. అన—ఈ జబ్బు లేకపోయినచోఁ బిల్ల యీ పాటికే వ్యక్తురాలు కావలసినది.

అప్పటికి రాత్రి రెండుజాము లయినది. చంద్రుఁడు గగన భాగమున నడిమింటఁ బ్రకాశించి ధర్మశాస్త్రకర్తవలె భారతవర్షమున కగ్రస్థాన మలంకరించెను. విరహిణీ స్త్రీలును, జారులును, జోరులును వానియగ్రస్థాన మొప్పుకొనలేరు. లగ్నము వైశాఖ శుద్ధ దశమి. ధర్మారావు సుబ్బన్నపేట వెళ్ళి తిరిగి చైత్రబహుళ దశమి నాఁటికి వచ్చెను. అరుంధతి కారోగ్యములో నేదో లోపముగా నుండెను. భీమవరమునుండి డాక్టరు వచ్చి స్వచ్ఛమైన గాలిపీల్చినఁ గాని సరిగా నారోగ్యము కలుగ దని చెప్పెను. ప్రతిదినము సాయంవేళ తోఁటకుఁ దీసికొనిపోవలయునని పశుపతి తలఁచెను. ధర్మారావు దగ్గఱలేని పదిరోజులు నరుంధతి కారోగ్యము వృద్ధి పొందలేదు. అందఱకుఁ దెలిసినది: ఇది మెడతాళి యని. ధర్మారా వరుంధతివంక నందఱు నుండఁగాఁ జూచుటకే సిగ్గుపడును. అరుంధతి యతనివంకఁ దప్ప నింకెవ్వరివంకను జూడనే చూడదు. అనసూయ పినతల్లి యామెతో సరాగములాడును. అనసూయ 'తల్లీ! ఎప్పుడు నతనివంకనే చూచెద వే' మనును. అరుంధతి తనదృష్టి త్రిప్పుకొని మఱల నతనినే చూడ నారంభించును.

ఒకనాఁడు సాయంకాలమున నరుంధతీ ధర్మారావులు తోఁట షికారుపోయిరి. అరుంధతి కొంచెము నడువఁగలదు. వేసఁగిగాలి యీ చెవినుండి యా చెవికిఁ గొట్టుచున్నది. ప్రొద్దు వాటారినది. తోఁటలో నిద్దరును గూర్చుండిరి. ధర్మారావు 'పెండ్లి నాఁటికై

నను నీ వారోగ్యవంతురాలవయ్యెదవా? పూర్తిగా నీ కారోగ్యము రానిచో నిన్ను నేను బెండ్లాడను' అనెను.

అరుంధతి చుఱచుఱఁజూచెను. ధర్మారావున కాచూపు వెచ్చ [illegible]గూచిన ట్లున్నది. మాకందతరుబాలకషాయరసాలకిసాలఖాది పికము మధుమాససర్వస్వము త్రావిన ట్లున్న యెఱ్ఱనికన్నులతో రతికూజితము చేసెను.

ధర్మా— కోకిలకు నీవు మునుపు మాఱు కూసెడిదానవు. ఇప్పుడు కూయ వేమి? అరుంధతి ధర్మారావువంక నిశ్చలదృక్కులతోఁ జూచెను.

ధర్మా—అప్పుడు నీవును గోకిలవలె మధుమాసచిహ్నమవు. ఇపుడు నీలోనుండి మధుమాసము వెలికిఁద్రోసి దానివలన నానంద మనుభవించవలయు ననుకొనుచున్నదానవు. అరుం—ఏమిటో క్రొత్తగా మాటాడుచున్న ట్లున్నది. ధర్మా—మన మిద్దఱము నేకాంతముగా నుంటిమికదా యని. అరుం—నే నెవరను? ధర్మా - నీ వెవరవు?

అరుంధతి తలయెత్తి యతనివంకఁ జూచెను. చూచుచున్న యామెకన్నులలో నతనికిఁ బరిచితమై యతనియాత్మను స్వర్గవీధి నడిపించిన యొకజ్యోతిస్సు తోఁచెను. ఆమె 'నేను మఱల నిట్లు వచ్చితిని. నన్ను గుర్తుపట్టలేరా?' యనెను. ధర్మారా విట్లను కొనెను: 'ఆదివ్యజ్యోతి వచ్చి యీ పసిమేనిలో నొదిగెను. ఈ శరీరములోఁ బరిచయాల్పతచేత సరిగా నొదుగలేక యున్నది.' అరుంధతికి తనభర్తకుఁ దెలిసెనని తెలిసెను.

అరు — ఇప్పటికిఁ దెలిసినదా? ధర్మా — ఇది యేమి పని? అరుం—నేను నిన్ను వదలి యుండలేను. ఈ దేశములోఁ బతివ్రత చావదు. స్వామి రెండవ పడగ యిచ్చట నశించదు. కారణాంతరములచేత మఱుఁగుపడవచ్చును. నే నెవ్వరను? పతివ్రతను. అల్ప కారణమువలన భయము లేదు. నేను నీవలెనే సనాతనిని. ధర్మారావు ఆహా యనుకొనెను.

# ముప్పదియేడవ అధ్యాయము

శ్రావణశుద్ధ పూర్ణిమ. ఆనాఁడు చిన్న అరుంధతి కార్యము. మధ్యాహ్నపుఁబీఁటలమీఁద నరుంధతి లజ్జాపరిశకలితమందహాస యయ్యెను. ఆ మందహాస మంతలోఁ జిద్రుపలు చిద్రుపలై విరిసిపోయెను.

వేసఁగి చక్కఁగా వెనుకఁబడినది. ఒక చిన్న మామిడియంటు రెండవయేఁట నాలస్యముగాఁ బూఁతకొగ్గి పూఁతనిలుపుకొనలేక సిగ్గుపడినది. ప్రజననహేతువైన మాతృశక్తి కన్యాత్వ మాతృత్వ సంధివేళ లజ్జాపరిశకలితమందహాసము రాలుపూఁతవలెఁ జిద్రుపలు చిద్రుపలగుట యేటికో?

ఆనంద ప్రథమరూపము లజ్జకాఁబోలు! లజ్జ తిరస్కృతికాని తిరస్కృతి, అంగీకారము కాని అంగీకారము, భయముగాని భయము, సుఖముకాని సుఖము.

క్షీరసాగరమథనోద్భూతయై జగన్నాథునకుఁ బెండ్లికూఁతురు కాఁబోవుచున్న యాదిశక్తికి లజ్జాదేవి తోడిపెండ్లికూఁతురు.

ఆనాఁడు ప్రొద్దుక్రుంకినది. చీఁకట్లు వచ్చినట్లే వచ్చి యింతలో నొత్తిగిల్లినవి. అద్దకము వేయువారు మొదటఁ దీసికొను వేళఁ జించి కుప్పగా వేసినట్టివి అంతరించిన డక్కా మస్లినుతానులు సహస్రములుగాఁ బెరిగినట్లు కొంచెము ప్రొద్దుపోవువఱకుఁ దెల్లపడిన కృష్ణవిదియనాఁటి జ్యోత్స్నాతరఁగ లుబుకుకొని వచ్చెను. సన్నని తెల్లని వలిపపుచీరకట్టుకొని మొగలిపూవులు జడలో వెన్నెలలకు లేనితావులు సమకూర్చుచుండఁగా శ్వేతద్వీపమునుండివచ్చినయచ్చర వలె నరుంధతి దొడ్డిలో నావెన్నెలలోఁ జంద్రికాధిదేవతవోలెఁ దిరుగుచుండెను. ధర్మారావు పనియేదో కలిగి యటకుఁ బోవుట

తటస్థించి యామెవంకఁ జూచెను. అతనికిఁ దల తిరిగిపోయెను! తన కొఱకే నింపఁబడిన దా నవ్య హేమ మధుకలశము. ఎప్పటిదో యిరువది యేండ్ల నాఁటి ఒకదివ్యానుభవ మతని మనసులోనికి వచ్చెను.

ఆ రాత్రి పాటలు గీటలయిన తరువాత నతఁడు గదిలో మంచముమీఁద భార్యాప్రతీక్ష చేయుచుఁ బండుకొనెను. అతని మనస్సు సహస్రథా పరువులెత్తెను. సర్వథాచ్యుతమైన మొగిలు కొండకొమ్మునుండి జాటిజాటి ఝురిణీరూపమునఁ గాలు నిలువఁ ద్రొక్కుకొనలేకుండ నూరకే ప్రవహించుటయే ప్రవహించినట్లు ధర్మారావుమనస్సు స్రవించిపోయెను.

ఆహా! ఏమికాలము, ఏమిమార్పు! ఎన్నెన్ని ప్రాఁతవి నశించిపోయినవి? ఎన్నెన్ని క్రొత్తవి తలచూపినవి? లోకమంతయు నూత్నత్వము శక్తియనుకొనుచున్నది. నూత్నత్వము నూత్నత్వమేకాని శక్తి యెట్లగును? గాడిదపిల్లకూడ కోమలముగానే యుండును. ఆహా! ఎంత నశించిపోయినది? నశించిపోయినదానిని జూచినచోఁ గడుపు తఱుగుకొనిపోవుచున్నది. ఈ నశించినదంతయు వ్యర్థమై తేజోరహితమైన దైనచో దుఃఖములేదు. నాజాతి యింత దైవోపహతమైన దేలకో? ఈ జాతిచేసిన పాపమున కంతులేదు కాఁబోలు! కృష్ణమనాయని యంత ప్రభువు గతించినాఁడు - తనసంపద కులటలకు, విటులకు, సభ్యేతరవాదచుంచువులకు, స్తనభారానమితలైన యోషితలకుఁ బంచని ప్రభువు - అప్రభువే పోయినాఁడు. అతనితో ధర్మార్థకామమోక్షహేతువులయిన విద్యలే నశించినవి. స్వామి వేయిపడగలు నశించినవి.

రుక్మిణమ్మారావుగారు పోయినది. రాణి యన్న శబ్ద మింక నాజాతిలో నేల నిలిచియున్నది? పరదేశసంప్రదాయములకు ముగ్ధరాలయి నీచసుఖాభిలాషిణియై దైవమన్నభావ మెఱుఁగనిదైన రాణి కాని యారాణి నశించియేపోయినది: ఆమె చిహ్నమైన సరోజినిదేవియును నిల్వరాదుకాఁబోలు!

కేశవరావుగారు గతించిరి. గ్రుడ్డిలో మెల్లగానైన పూర్వ విద్యాసంస్థలు బ్రదికింత మనుకొన్న యీయనకుఁగూడ నిచ్చట స్థానములేదు కాబోలు! ఆయన సంపాదించినది యీయనభావము కూడ నెఱుఁగని ప్రభువు లన్యాయముగా ననుభవించుచున్నారు. గోపన్న చనిపోయినాఁడు: భక్తిప్రపత్తులు, సేవ, భూతదయ, ఉప కారబుద్ధి మూర్తీభవించిన మనుజుఁడే పోయినాఁడు. స్వాతంత్ర్య మెఱుఁగఁడు? కుతర్కమెఱుఁగఁడు. స్వార్థమెఱుఁగఁడు. వాఁడేల బ్రది కియుండును? అతని కిచ్చట నే మున్నది?

మా తల్లి దేవదాసి చనిపోయినది. భగవద్భావమంతయు సర్వ నాశనమయినది. దానితో భరతశాస్త్రము, కల్యాణోత్సవములుకూడ నశించినవి. దేవుఁడే చనిపోయినాఁడు.

పసిరిక పోయినాఁడు. పాపము పసిరిక నిలుచుటకుఁ దావులేక పోయినది. ఒత్తుకొని వచ్చు నదేవమాతృకలముం దాతఁడు నిలువ లేకపోయెను. ఏమి విచిత్రపు చావు చచ్చెను!

గణాచారికూడ గతించినది. ఏతల్లి స్వర్గమర్త్యములకు లంకె గానున్నదో, ఆ గడియ యూడిపోయినది. గొలుసుతో లాగి నేలకు బిగించి కట్టివేయఁబడిన స్వర్గ మీ గొలుసు తెగిపోయినంతనే పోయి పోయి కనరాకుండఁ బోయినది. కనరానిదానిని లోకము లేదని వాదించుటలోఁ దప్పేమున్నది? గణాచారితో స్వామి పరారియయి నాఁడు.

ఆహా! ఇంక నేమి మిగిలినది?
ఇంక నేమి మిగిలినది!
ఇంక నేమి మిగిలినది!

చిన్నయరుంధతి ద్వారమువద్ద నిలుచుండెను. ధర్మారావు చూచెను. ఆ నిలుచుండుటకూడఁ దనవంకకు నడచుచున్నట్లే యుం డెను. ధర్మారాయని హృదయములో సముద్రమథనవేళ క్షీరసా గరగర్భగతతరంగమునుండి చంద్రుఁ డావిర్భవించినట్లు ఒకమహా నందరేఖ పొడచూపెను.

అతఁ డామెవంకనే చూచుచుండెను. ఆమె తలయెత్తి యతనిని జూచెను. వ్యాకరణదోష మెఱుఁగని యా కన్నులలోని భాస యేమో పండితుఁడైన ధర్మారావునకు నపండితురాలైన యరుంధతికిఁ జక్కఁగా నర్థమై పతిచేతులు చాఁచి నెమ్మదిగ నెదురునడచుటయు [illegible]ర్య వేగముగా నా కౌఁగిటఁ జేరుటయు జరిగెను. ఆ గాఢ పరిష్వంగ[illegible]ండి గుక్క త్రిప్పుకొనుట కరుంధతికి రెండునిముసములు పట్టెను. ఆ రెండునిముసములును రెండేండ్లవలె నుండెను. అరుంధతి యతనికన్నులలోఁ గన్ను లుంచి ‘నేను మిగిలితిని.’ అనెను.

ధర్మారావు—అవును. నీవు మిగిలితివి. ఇది నా జాతిశక్తి. నా యదృష్టము. నీవు మిగిలితివి.

—...—

లీలా ప్రెస్, విజయవాడ.

